# రా జ పో ష కు లు.

నాయని వెంకట రంగారావు బహద్దరుగారు, మునగాల
రాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద బహద్దరుగారు బి ఏ చల్లపల్లి
బులుసు బుచ్చి సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురం
మాతే గంగరాజుగారు, జమీందారు, విస్సన్నపేట
మాతే నారాయణరావుగారు, జమీందారు, ఏలూరు
జయంతిపురం జమీందారుగారు

## పో ష కు లు

శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, మద్రాసు
,, గద్దె రంగయ్య నాయుడుగారు, మద్రాసు
,, పొణకా పట్టాభి రామిరెడ్డిగారు, నెల్లూరు
,, నడింపల్లి నరసింహారావుగారు, గుంటూరు
,, గోవిందరాజుల వెంకట కృష్ణారావుగారు, గుంటూరు
,, పి. మూర్తి ఆంజనేయులుగారు, తెనాలి
,, అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ
,, శెట్టింబి హనుమంతరావు పంతులుగారు, బందరు.
,, కోన శీతారామారావుగారు, నెల్లూరు.
,, డాక్టరు కోశా అహోబలరావుగారు, బందరు.
,, ముట్నూరి కృష్ణారావుగారు, బందరు.
,, పురాణం సూరిశాస్త్రిగారు, బందరు.
,, శీలం జగన్నాధరావు నాయుడుగారు, బందరు.
,, కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు, బందరు.
,, తాడేపల్లి శ్రీరాములుగారు, బందరు.
,, వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు, కొవ్వూరు.
,, హనుమకూర రామస్వామిగారు, పెద్దాపురం.
,, గుడిపాటి సూర్యనారాయణగారు, కోరుకొల్లు.
,, బాబు ఏ. కె. రాయిగారు, బందరు.
చిట్టా సుందరరామయ్యగారు, బందరు.
గోశెట్టి రామారావు నాయుడుగారు, వీరంకి.
ఎల్లరిగె శివాజీరావుగారు, బందరు.
పాతూరి పట్టాభిరామయ్యగారు, బందరు.
చాదుమల్ల వెంకటరంగయ్యగారు, జగ్గయ్యపేట.
కొండ సుబ్బరాజుగారు, గుండుగొలను.
సర్వా వెంకటసూర్యనారాయణగారు, బందరు.

# విషయసూచిక

# ఆంధ్రభారతి.

సంపుటము ౧ } అక్షయనామ సం॥ శ్రావణ శుద్ధద్వాదశి 20 ఆగష్టు 1926 { సంచిక ౫

## ఎప్పుడు !

[ సహదేవ సూర్యప్రకాశరావుగారు. ]

తీయదనాలకోవ ! భవదీయ మనోజ్ఞతమాలపల్లవ
శ్రీయుత వీక్షణాంచల వశీకృత నిత్యసుఖైకజీవినో
నాయెడ ప్రేమరాగ మసృణంబగు సౌహృదమొప్ప నిత్యముం
బాయక ఛాయవై యెపుడు వర్తిలి నన్ను గృతార్థుఁజేతువో !॥ 1
మలయ సమీరణోచ్చలిత మంజు లతాంతము వోలె తావకో
జ్జ్వలతనువల్లి యుఁ వణఁకువారగ మోమరవంచి హ్రీదృగం
చలమున నే ననుం గెలిచి సాంత్వనమిత్రములైన నీ కరాం
గుళులను నాకరంబెపుడు గొందువో ! ఆసలు మోసులెత్తఁగ ॥ 2
నును సిగ్గుల్ దళుకొత్త మోముపయి, నన్యూనార్ద్రకాంతుల్ మనం,
బున రేకెత్త శరీరమెల్ల పులకింపుల్ వార స్వేదాంబువుల్
నును జెక్కిళ్ళపయిఁ నిగారపుపసందుల్ దొందరల్ వెట్టగా
నను కౌఁగిట బిగించి యెప్పుడు మహానందంబు నొందింతువో !॥ 3
మృదుల విశాల ఫాలతలిమీఁదను గాలికి గుత్తిగుత్తులై
చెదరిన నీలిముంగురుల చే సరిజేయుచు నీకరంబు నా
హృదయమునందు హత్తుకొని యెప్పుడు భ్రూనవ నాట్యసందల్
పొదవిన నీదు చిన్నగవుమోమును ముద్దులపూజ సేతువో !॥ 4
ఈ వసంతదినాంత వేళావసాన
సమయముల, గొంత మీనదీ సైకతముల
కరము కరమున గీలించి యిరువురమును
పక్షులట్టుల, గీతాల పాడుకొనుచు
ప్రేమమూర్తులమై విహరించుటెపుడొ !॥ 5

# రాలిన నీలి పూలు.

చిన్నకథ.

[ యస్. జి. ఆచార్యగారు. ]

నా మిత్రుఁడీ ప్రపంచమును వీడి నాలుగుమాసములైనను యింకను ప్రజలు నిజముఁ దెలియక యనేకవిధములగు కథల జెప్పుకొనుచున్నారు. పత్రికలయందు [illegible] విపరీతములగు యూహలనూహించి వ్రాయుచున్నారు. వీటినన్నిం [illegible] చూచుచున్న నా కింకులూరకుండుట మేలుగాదని, నేటికినిజ [illegible] దమును బెట్టబూనుకొంటిని. ఇందువలన మనలవీడిన నామి [illegible] లరావుయొక్కయు నాతనికి బలాత్కారముగ గట్టబడిన లలిత యొక్క [illegible] వేధించి ప్రేమింపబడిన కమలయొక్కయు ఆత్మలకు శాంతిగలుగునను నమ్మకముతోడనే నిజమునెరిగిన నేనీక్రింది విషయమును మీకెరిగించుచున్నాను.

ప్రథమమున నాతని దినచర్యా పుస్తకమందాతడు వ్రాసికొనిన కొన్నింటిని ముందుగ నిట నుదహరింతును. వాటివలననే, నిజము మీకు తెలియగలదు.

3-8-1923 మన మొకటితలచిన దైవమొకటితలచును. నేననుకొనిన నాటి [illegible]న్నింటికిని విరుద్ధముగ సంచరించవలయునేమోయని తోచుచున్నది.

21-8-23 లలితను తప్పక పెండ్లియాడవలయుననుచున్నారు. మేనరికము నువిడువరాదట. చిన్ననాటనే నగనుంచి మాయమ్మ మాటయిచ్చినదట. ఆవల మరణించిన తల్లిమాటను త్రోసివేయరాదు. నాయనగారు చాల పట్టుదలతోనున్నారు.

4-9-23 ఇప్పటికే యపవాదులెక్కువ యగుచున్నవట. నా పెండ్లి యింక మూడునెలలలో నగునట్లు తోచుచున్నది. తండ్రిమాటకెదురాడలేను. కమలను ప్రేమించినమీద, నేను లలితను ప్రేమింపజాలను. ఆమెకు నాపై ప్రేమయున్నదియు లేనిదియు నాభగవంతునకే యెరుక. ఇంతకు నొకయువతి జీవితమును శిథిలముగావింప నున్నాను. ఈపాపమునకు నేనొడిగట్టుకొనవలసియున్నది. నేను మహాపాతకుడను.

15-9-23 ఒకరిజీవితమును దుఃఖపూరితముజేసి నాజీవితము నిష్ప్రయోజనముగ నొనరింప నిశ్చయించుకొంటిని. ఏదియెట్లున్నను నేనుమాత్రము తండ్రిమాట జవదాటలేను. విధియెట్లున్న నట్లు జరుగక మానదు.

ప్రస్తుతమున కింతటితో నాపుదును. తరువాత యవసరమున్నచో నింకను కొన్నింటి నిట నుదహరింతును.

శ్యామలరావు మేనమామ సుందరరావుగారు చాలమర్యాదగల సంపన్నులు. మేనయల్లుడన వారికెంతయో ప్రేమ. సుందరరావుగారి యేకపుత్రికయగు లలితయు చక్కదనముల కుప్పయని చెప్పక తప్పదు. ఇదివర కెందరో పెద్దలువచ్చి తమ పుత్రులకు లలిత నియ్యవలసినదని కోరియుండిరి. కాని సుందరరావుగారు మేనరికము నాసించి యెవరికిగాని మాటయిచ్చియుండ లేదు

'నీకు లలితను పెండ్లియాడుట కిష్టములేదని మీ నాయనగారికి నెరిగింతు'నని యెన్నిమారులనినను శ్యామలుడు 'వలదు. నేనిదివరకే యెన్నియోవిధముల ప్రయత్నించితిని. వారు చాల పట్టుదలతోనున్నారు' అని యాటంకపరచెను. చేయునది లేక నేనును యూరకొంటిని.

లలితా శ్యామలుల వివాహ మతివైభవముగ జరుపబడెను. సంగీత సభలు, పెద్ద పెద్ద విందులు ఊరేగింపులు జరిగినవి. ఐదు దినములు కన్నుల పండువుగ నున్నది. బంధువులు మిత్రులు చాల యానందించిరి. కాని శ్యామలుని మోమున నొక్క చిరునగవునైనను గాంచనైతిని. ఆతని దుస్థితినిగన్న నాహృదయము పగిలినట్లయ్యెను. హా! యిష్టములేని పెండ్లివలన నెంతటి కష్టము.

పెండ్లియై పదునైదు దినములైనది. ఇరువుర మొంటరిగ హాలులో కూర్చొంటిమి. మునుపటివలె రాజకీయ విషయములను చర్చించుటగాని యొకరితో నొకరు మంచిచెడ్డ నూహించుకొనుచు వ్యాసముల వ్రాయుటగాని లేదు. ఒకరినొకరు పలుకరించుకొనకుండ కాలము గడుపుచుంటిమి. కొంతవరకట్లులేయుండి నాతడొక్కమారు కనుల మూసికొనియెను. నా హృదయము బ్రద్దలైనట్లాయెను. కాని నేను పలుకరింపలేదు. తరువాత ఆతని కనుకొలకులనుండి అశ్రువులు వ్రాల నారంభించినవి.

నే నింక చూచుచు నూరకుండ లేక పోయితిని. లేచి శ్యామలుని కడకేగి రెండు హస్తములును బట్టుకొని 'నీదుఃఖముల నాకడదాచెదవా' అని బ్రతిమాల నారంభించితిని. ఆతని దుఃఖము మరింత యెక్కువాయెను. ఆతడొక బాలునిరీతి హీనస్వరమున నేడువదొడగెను.

ఇంతలో తపాలావాడొక యుత్తరమును దెచ్చి నాకొసగెను. దానిపై శ్యామలరావుయొక్క విలాసమున్నది.

శ్యామలరావున కాయుత్తరమును నిప్పించితిని.

ఆతఁడాయుత్తరమును జదివెను. రెండుపర్యాయములు దానిని చదివి భీతావహుఁడై నావైపుఁజూచుచు "కమలకు జబ్బుచేసినదా కమలకు జబ్బుచేసినదా ?" అని యడిగెను.

ఆయుత్తరమాతని హస్తములనుండి తీసికొంటిని. ఉత్తర మేయూరినుండి వచ్చినదియు నేఁట నుదహరింపనుగాని యందు వ్రాయఁబడిన లెక్కఁగానున్న మూఁడు వాక్యములను మీ యెదుట బెట్టెదను. ఈ కమల యెవ్వరో తెలిసికొనఁగోరి సూత్రము దయయుంచి ప్రశ్నింపకుఁడు. ఇట్లు యూరుపేరును దాచినందులకు మాత్రము నన్ను క్షమింపుఁడు. ఏలనన నా మిత్రుని వాక్యముల నేను జవదాటలేను."

గ్రామము— తే.ది—

శ్యామలరావుగారి పదములకు నమస్కారములు. చిన్నదాననైనను భగవంతుఁడు మీ యిరువురకును శుభములొనఁగూర్చుఁగాక యని దైవమును ప్రార్థించుచున్నాను. పదేహేను దినములనుండి మంచముపై బడియున్న నే నింక రెండు మూఁడు దినములకన్న యెక్కుడు కాలము జీవింపను; ఒకసారి చూడవలయునని యున్నది కనుక నాయందు దయయుంచి యొక్కమారు రాఁగోరెదను.

ఇట్లు అభాగ్యురాలగు మీ కమల

ఈ యుత్తరమును గాంచి ఒక్క నిముషములో నా కంతయును బోధపడినది. కమల శ్యామలరావును మనసారవరించినది. శ్యామలుఁడుకూడ నామెను ప్రేమించెను. అట్టియామె శ్యామలుఁడింకొక యువతిని పెండ్లియాడెనను విషయము విని బెంగగొని మంచము పట్టినది. కమలా శ్యామలుల కొకరియెడ నొకరికెంతటి ప్రేముండెడిదో చదువరుల కెఱింగించుట కిట నొక చిన్న యంశమును జెప్పెదను. ఒక యుత్తరమును శ్యామలునకు వ్రాయుచు నొకనాటి రేయి తనకువచ్చిన కలను కమల యీ విధమున వ్రాయుచున్నది.

"మీరు మాయింటి యెదుటనే యున్న మేడమీఁద గదియందు నివసించుచున్నారట. అది రాత్రి సమయము. మీరు పరుండియుండిరేగాని యేదియో యాలోచించుచుండిరట. మీ ప్రక్క నెవ్వరో భోజనము చేసినట్లు, అరటి యాకులును పాత్రలును కలవు. మా సుదర్శనుఁడుగారు మీ గది కెదురుగనున్న మా డాబాయందు కూర్చుండుటవలన నేను వెంటనే రాలేకపోతిని. ఆయన వెళ్ళినమీఁద మీ యెదుట రెండు మూఁడు మారులు తిరిగితిని. మీరు నన్నుఁ జూడలేదు. నేను మీ మనస్సును కనుగొని మీకడకు వచ్చితిని. తరువాత యేదియో యాపదయున్నదని విని యిరువురమును యొకరి నొకరు విడువరాదని యనుకొని యెక్కడకో బయలు

చేరితిమట—ఇది నాకల. మన జీవితమున యిట్టిదిజరుగునే మోయని తోచుచున్నది. ఐనను యిరువురమొకచోనున్న మనకు సంభవించు కష్టములన్నియు కష్టములుగ నుండునా ?"—ఇందు యెంతటి ప్రేమయున్నదియో ప్రేమయనట్టిదో ప్రేమించిన వారికి విశదము కాగలదు.

శ్యామలరావు వాగలేదు. గోడపై నున్న గడియారము మాతము చూచెను. లేచి నన్ను రమ్మని పిలచెను. దుస్తులనేనియు మార్చకుండ యిల్లువిడచితిమి.

మేమును రైలుస్టేషనునకు బోవునరికి రైలుబయలు వేసెను. టిక్కట్టుకొనుట కేనియు వ్యవధిలేకపోయెను. ఇరువురము బండిలో బసితిమి.

పదకొండు గంటల రైలుబండి ప్రయాణమును పదకొండు యుగములవలె మాకు దోచినది. ఈ ప్రయాణ కాలమంతయును ఒకరితో నొకరము మాటలాడు కొనలేదు.

మేము మాగమ్యస్థానము చేరుసరి కుదయము యెనిమిది గంటలయినది. అదియేలనోగాని నాహృదయమంతయు కలవరము జనించినది. అట్టి సమయమున నామిత్రుడు శ్యామలరావుయొక్క మనస్సెంతటి కలతనొందియుండునో నేను వ్రాయజాలను. ఆ విషయమై తలంచుకొనిన నాహృదయము మేలనోజలదరిల్లు చున్నది. మూడు ఫర్లాంగుల మేర మేము నడచిపోయితిమి. ఎదురుగ కొంతమంది శిరముల వంచి కిక్కురుమనకుండ వచ్చుచుండిరి. నాతల తిరిగినట్లైనది.

శ్యామలరావు కదలక మెదలక ప్రతిమవలె నిలచెను. ఆతడు రెప్పవేయుట లేదు. శరీరమంతయు ముచ్చెమటలు గ్రమ్మివైచెను.

సహజముగ నే నధైర్యుడను. ఆసమయమున లేనిధైర్యమును తెచ్చుకొన వలసివచ్చెను. శ్యామలునికడకేగి యాతనిని ధైర్యముగనుండవలసినదని యెన్నియో విధముల బోధించితిని.

కాని శ్యామలుడు మాత్రమొక యడుగువేయలేదు. అచ్చటనే నిలచెను.

ఆనిశ్శబ్ద ప్రజాసమూహము మాకు సమీపమునకు వచ్చెను. అది కలయా యని సందేహము కలిగినది. శ్యామలుడు "అదుగో—నాకమల! ఆ—ఆ! ఏమిది!" అని నాకరమును గట్టిగాబట్టుకొని నేలవ్రాలెను. నేను కనులు తెరచిచూచితిని. ఆనిశ్శబ్దజనమధ్యముగనున్నది కమలయొక్క మృతకళేబరము.

3

మరల యూరునకు తిరిగివచ్చి వారము దినములైనది. ఒకనాటిసాయంకాల మున పేరుగాని నిలయముగాని లేని యుత్తరమొకటి వచ్చిచేరినది. అందు "మీరు



# రెండు నక్షత్రాలు.

[ విశ్వనాథ సత్యనారాయణగారు ]

వ్రేగగు హైమ సౌధమణి వీధికఁ బుట్టెను రాచబిడ్డ క
ల్పాగము వోలె నేల విరియంబడి బంగరు ముద్ద లేదెసన్
త్యాగము వొందె వారసతు లాడిరి మంగళతూర్యరావముల్
మ్రోగెను లోకపుంజనులు బోరన సన్నుతి వెట్టి రెంతయున్.

ఒక్క చిఱుపేద గుడిసెలో నుద్భ
విల్లినాడు కవికూన, పదియువనాడు, మంత్ర
సాని చెప్పిన దన్నము చాలదంచు
మంత్రమో పణ్గెనాడో బ్రాహ్మణుఁడు వచ్చి.

ఆ రాచబిడ్డ కళ్యాణ పల్యాణ సజ్జిత పంచకళ్యాణిఁ జెలువు గులికె
ఈ కవికూన పేరాకటమూఁకి కన్నులలోనఁ బ్రాణముల్ నిలుపుకొనియె
ఆ రాచకూన, మార్గాయాసఖిన్న, తన్మజములు వంగి పదశ్రమములు వాపె
ఈ కవిబిడ్డ దుర్భైక్షజన్మని దీక్షకిరణుండు శుచి నడికించి వైచె.

రాజు నిరంత భోగమధురంబగు జీవితమై, గతించెడున్
రోజునఁ దూర్యముల్ పరలమ్రోసెను, శ్రీ కలకంఠకంఠ గీ
తి జగతీ ఘులంఘుల గలి ప్రమదంబొలసెన్ మనోజ్ఞ వ
స్త్రా జమునాద నీరద భరంబయి మ్రోగెఁ ద్రయీనినాదముల్.

నాటి సంజవేళ నభమున ధగధగా
యిత విలాసదీప్తి జతనుపఱచి
సౌనయిడిన మణివిధాన దీపిల్లు తా
రక యొకండు నేల రాలిపడియె.

కవికి క్షుధాగ్ని పీడితము కాయము త్రెళ్లెను; కాష్ఠవహ్నిలో
శవ మిడునంతలో నపరసాగరమందున గర్మసాక్షి క్రుం
కపడె, నొకింతలోన మెఱుగుల్ దెసలందున గ్రుమ్మకొంచు నూ
త్నవిలసనంబు చిమ్ము నొక తారక మింటికి నెక్కెంబడిన్.

# శ్రావణము

[ఇంద్రగంటి వాగేశ్వరశర్మగారు.]

చేటతో నిప్పులు చెరగిన యటుల
వేడిగాడ్పులనెల్ల వెడలంగఁజేసి
అనలోత్థ భూజాల నడుగంటమాడ్చి,
శ్యామల సస్యాలఁ జక్కాడఁజేసి
సుమసంతతులనెల్ల శోషింపజేసి
కళ్యాణగీతిలో గలసి దేలేటి
వివిధ విహంగాల విడివడిమింట
వేడి నిట్టూర్పుల వెడలఁ జేయించి
ప్రకృతితో కయ్యంబుఁబచరించుచుండు
వేసవి వెన్నిచ్చి, వేవేగనిపుడు
సమయసంగరములో చనియె, భీతిల్లి ॥

బంతిపూల పసపు భాగ్యంబుతోడ
సిలిగోరింటల నిగనిగల్వెలయ
చక్కనౌ చేమంతి సంతతుల్మెఱయ
విరిజాజి సుమములు విరియ బాఱంగ
నిత్తెమల్లెల సౌరు నిలయమ్మై యుండ
విద్యుత్ప్రభాలత వెంటనుండంగ
నీలమై, నిబిడాంధనిలయమై, మోద
భరితమై సస్యాల భాగ్యదాయియగు
చల్లని మేఘుండు సరసనుండంగ
శ్రావణమే తెంచె; శ్రమయంతవాసె,
ప్రకృతియంతయువింతభాగ్యాన తుఱసె.

బ్రహ్మతేజము ఫాలభాగాన మెఱయ
ఆర్యతేజము కండ్ల నట్టిట్టులాడ,
విజ్ఞానధనమగు వేదసూత్రాల
స్వరము దప్పనిరీతి వల్లించుకొనుచు
శ్రావణ పూర్ణిమా సమయమ్మునందు
ఆశ్రయించెడువారి కందఱకిచ్చి
కానుకల్ గ్రహియించు కౌతుకమునను
సన్నమై, స్నిగ్ధమై చాలపవిత్రమౌ
బ్రహ్మసూత్రమ్ముల వడుకుచునుండె
వేదవిహితముగా వేదవిప్రుండు
ముగ్గులు దీర్చిన ముంగిలిలోన॥

ఇనుమారు ముమ్మారు ఏపారదున్ని
ఎఱ్ఱనౌచిక్కటి యేలేటినీట
పొలమంతనిండించి కలుపేమిలేని
వరిమళ్ళలో దమ్ము బాగుగాఁజేసి,
ఊడుపునూడ్చేటి యువిదలకొఱకు
వేచియుండెడు కాపువిధముఁగాంచితివ
కాయకష్టంబుల కడుశ్రమయంత
దేహసౌష్టవములోఁ దేజరిలంగ,
నిలువెల్ల కనులుగాఁ దిలకించుచుండె
బాగుగా నెదిగిన వరియాకుదరిని॥

ఓయి కృషీవలా! ఓ ధర్మజీవి!
పెనుమొయిల్ విడఁబాఱ వెలుగొందిన
శారద పూర్ణిమా చంద్రునివోలె;
ఆవరించినమంచు అఖిలమ్ముపోవ
కలకల విడబాఱు కమలంబు కరణి;
వర్షంబు కురియఁగా వరిమళ్ళునిండ
ఏలేటి జలమెల్ల పొలమంతఁబాఱ

# జీవయాత్ర

కారచ్చి కృష్ణమూర్తిగారు.

ఒకనౌక, బహుస్వల్పము, ప్రాంతసంచారము, పారావారము అపారము, అగాధము, వినిర్మలమును. నా తాత్కాలికమందే పద్విచలక్వాపి సమేతము, భయంకరమును.

నౌక బయలుదేఱినది. ప్రయాణము జీవితావధికము, ఐచ్ఛికమును. పర్యాటకులకు విదూర ప్రయాణమే సర్వ్వలనిష్టము. మన వారికిని సాధ్యమైనంత వఱకా యుద్దేశ్యమే. గమ్యస్థాన మహాహితము ననిర్దిష్టమును. పోవుచున్నది నౌక. నౌకను దృష్టికిని బ్రిథమస్థానము దూరమయినది. కొంతవరకుఁ బ్రయాణ మనుకూలముగనే యున్నది. ఘోరవిపత్తు రానున్నదని పాపమేరును నెఱుఁగరు, తాత్కాలిక స్వల్పానంద నిమగ్నులైన వృద్ధులైనను నెఱుఁగుదురో యెఱుఁగరో తరణియనుకూల పవనపరిస్పందితమగు స్వల్పతరంగమాలికాడోలికల నల్లనల్లన నూఁగుచు నేఁగుచున్నది. కొంతదవ్వేగినది.

ప్రళయకాల ఘోరగభీర ఘుమఘుమారావసంకలిత కాదంబినీకాండము నభాకాశమును నిమేషమాత్రములో విసీల మొనరించినది. తద్వ్యంతస్థితవ్యక్తులలోఁ గలగుండువడినది. కల్పాంత నిస్తుల స్తనితములు భయంకరములు క్షణప్రభలను క్షణము మిఱుమిట్లు గొల్పుచున్నవి. బాలబాలికలము వృద్ధులము హృదయావస్థ యీదృశమనుని ర్ణాయకులుండరు. దారుణదైవదుర్విపాకము. వజ్రనిష్పేషము వలన బాలికామణి యొూర్తునివశయైనది. "కుసుమసుకుమారంహిభవతి" యని నాఁడు కవిరాజు. పాపమొక స్త్రీ కన్నీరుమున్నీరగునట్లు రోదనము సేయుచున్నది. అందఱయు హాహారవములు మిళితములై యొక్కసారిగా మిన్నుముట్టినవి. సముద్రమధ్యమున వారి హాహారవములు అడవిగాసిన వెన్నెలలు. కనుకనే నిష్ఫలములు. కల్పాంతవాతము ప్రపంచమునంతయు నెటకో కొట్టివేయుచున్నది. ప్రాపంచిక పరిస్థితులొక్కసారిగాఁ దలక్రిందైనవి. ఆవాతముతో బాటు సముద్ర మహారాజును నించుకయుత్తేజితుఁడైనాడు. కావుననే కల్లోలము లాకసము నంటుచున్నవి. ప్రాచీనమై సంస్కార విహీనమై హేయమైన యాదరిద్రనౌకయు సముద్రమునితో పాటు త్తేజితమై యాఘనమైన కరుళ్ళ వెంబడి యొక్కపరి మిన్ను ముట్టుచున్నది. వేఱొకతఱి నీటిలోయలో నొరగుచున్నది. అంతటి యుత్సాహమా చిన్ని నావ

కెలకో మేరను జెప్పజాలరు. పాపమా నౌకను హతభాగ్యులైన యా దుఃఖజనుల యవస్థయణుమాత్రమైనను దెలియదుగాబోలును. అచేతనమున కీపాటిపరిజ్ఞానమునా.

ఆజనుల దుఃఖముతో బాటుకవులు విషాదముతోపోల్చుతమస్సులును ప్రాపంచిక జనవిషాదమంతయుఁ గట్టకట్టుకొనివచ్చినవోయన నెల్లెడలఁ గ్రమ్మినవి. గ్రుడ్డు వొడుచుకొన్నను నేవస్తువును గన్పించుటలేదు. విషాదమయమునమేయమునగు తమస్సొకటితక్క, నౌకాంతర్నివిష్టవరాకులు సైతము పరస్పరము కాన్పించుటలేదు. హస్తస్పర్శవలనఁ దెలియవచ్చునుగాని వారికాపాటియుక్తియుఁదోఁచక తామొకరమే మిగిలితిమని ప్రతివ్యక్తియుఁ దనలోననుకొని యొక్కపెట్టున హృదయవిదళనమగునట్లు ఏడ్చుచుండెనుగాని యారోదనధ్వని యాకాదంబినీస్తనితమున గాఢముగ మిళితమై వేర్పఱుప శక్యముగాకుండెను. దైవవశమువలన నౌకలోనికి నీరావంతయుఁ బ్రవేశింపలేదు. అసంభవమును ననుభవమునునైనను వారియదృష్టవిశేషము.

వాయుదేవుఁడించుక ప్రశాంతించినాఁడు. చీఁకట్లును నించుకయుపశమించినవి. అస్పష్టముగ వ్యక్తులు గాన్పించుచున్నవి, కాని మేఘమాలయంతర్హితకాలేదు. అప్పటిలో నగునట్లును లేదు. ఓడలోని జనులు తమకిఁక బ్రతుకునాస లేదనుకొనినారు. బ్రతుకి మీఁదియాసవదలినారు. నౌకప్రవాహమును వెంబడించి వెనుదిరిగిచూడక యశరవేగమున నప్రయత్నముగఁ బరువెత్తుచున్నది. ఆపుటకు బ్రహ్మకైనను వీలులేదు.

ఎట్టయెదుట శిలోచ్చయ ద్వయము. వానిమధ్యసన్నఁగాఁ ద్రోవయున్నది. జాగ్రతగ నడిపిన నావలు భద్రముగనే పోఁగలవుగాని యదియేమృగ్యము. మనయభాగ్యులాదృశ్యమును జూచిరి. భయంకరమని యొక్కసారిగాఁ గేకలుపెట్టిరి. కాని లాభమేమి. ఎప్పుడో పోతవనుకొనిన ప్రాణములు నిమేషావధికివచ్చినవి. జీవితాశనశించినను మఱలనశించినది. వారలప్రాణములు రక్షించువారేరును గానరారు. ఆనిర్మక్షిక ప్రదేశమున ఆభయంకరరంగమున ఆజంఝావాతసమయమున ఎవరికచట పనియుండును. ఎవరు రక్షింతురు, ఎట్లురక్షింతురు, దుర్లభము అసంభవమును.

యువకుఁడు దృఢకాయుడు సుందరుఁడు. ప్రవాహమున కెదురుగ నీఁదుచు వచ్చుచున్నాఁడు. ఎందుకీదుచున్నాడు? మనయభాగుల దీనాలాపముల వినియా? ఎవరుచెప్పిరి. అసంభవము, మఱియేలకో యెక్కుడు శ్రమంపడుచు నీఁదుచు వచ్చుచున్నాఁడు, ఆయాసముప్పతిల్లినది. అట్లే ప్రవాహమున కెదురుగ నీఁదుచున్నాఁడు, మనయభాగ్యులు నౌకపర్వతమును డీకొను సమయమువచ్చినది. తృటికాలము. ఒక్కతృటికాలములో కొందఱుమనుజుల జీవితములు నశింపనున్నవి. సమ

యము నిరీక్షించినాఁడు. యువకుఁడు సరిగాఁ బర్వతసౌకాద్వంద్వ యుద్ధసమయము ననే సమీపించి తక్షణము నౌకనొకతన్ను తన్నినాఁడు, నౌకయుద్ధముమాని పర్వతము పక్కగాఁబోయినది, యువకుఁడు మునిఁగినాఁడు.

కొంతసేపటివఱకు యువకుఁడు ప్రపంచమునకుఁ గాన్పింపలేదు. నౌకకొట్టు కొనిపోవుచున్నది. అందలి వ్యక్తులు బాహ్యజ్ఞానశూన్యములైనవి. కాదంబ నియు నుపశమించినది. క్షణములో మనకు స్వల్పపరిచితుఁడగు యువకుఁడు ఓడ దగ్గఱకుఁబోయినాఁడు. దానిని చేతితోఁబట్టియుఁదన్నియు నశేషశ్రమములు పడుచు నొకమరుప్రదేశమునకుఁజేర్చినాడు, దైవవశమునదది యొక యంతరపమైనది.

యువకుఁడు భారతమాతకు సత్పుత్రుఁడు, మాతృమందిరమున కలంకార భూతుఁడు, పుణ్యవంతుఁడు, కరుణామయుఁడును.



# దీన బాంధవా.

[ బుగ్గా కృష్ణమూర్తిగారు ]

ఉ॥ శ్రీకర పుణ్యమూర్తి సర ♦ సీరుహలోచన మౌనివంద్య య।
స్తోక యశఃప్రపూర్ణ పరి ♦ శోభిత దివ్యకళా ప్రవీణ ము।
ల్లోకము లేలుశ్రీభక్తజన ♦ లోలుడ వీవని నమ్మి సర్వదా।
నీకె నమస్కరింతు మది ♦ నిక్కము కావవె దీనబాంధవా॥

ఉ॥ నీగుణలోపముల్ వొగడ ♦ నేర్పరు లెవ్వరు లోకముల్ మహా।
భాగ త్వదీయ కుక్షినిడి ♦ భక్తజనావన దీక్షనాగతా।
నాగత వేదివై ధర మ ♦ హాధర బుద్ధిని నేలువాడ వీ।
వే గద మాకు దిక్కు మరి ♦ కెవ్వరి జేరుదు? దీన..... 2

ఉ॥ ఏ మహనీయమూర్తి మది ♦ నించుక గోల్చిన లేమిబాపునో।
యేమహనీయశక్తునకు నెల్ల ♦ యజాండము లొంగిపోవునో।
యే మహనీయమూర్తి కృప ♦ నెల్ల యఘంబులు రూపుమాయునో।
నా మహనీయు డీవె యను ♦ చాత్మదలంచెద దీన..... 3

ఉ॥ మిత్రులు శత్రులంచనుచు ♦ మేదిని భేదములెంచకుండ సా।
భ్రాతృలు లోకులంచు సుత ♦ భావము జూపెదవో పవిత్ర చా।
రిత్ర శుభాంగ సద్గుణ గ ♦ రిష్ఠ దయానిధివంచు నీకృపా।
పాత్రుడనంటి బ్రోవ బహు ♦ భంగుల వేడుచు దీన.... 4

# భక్తబృందావనము

[చల్లపల్లి అప్పారావుగారు]

శ్రీనాథామర భాస్కరాది కవిభాసీ! సన్నుత గ్రామణీ!
యో నానార్థ పదప్రదా! యతి గణవ్యూహాంచిత ప్రార్థితా!
జ్ఞానాబ్ధీ! సుమనస్సుపూజిత! శృతి శ్రావ్యాక్షరామోదితా!
నే నిన్నెంచగ నెంతవాడనయ తండ్రీ భక్తబృందావనా ॥

మ॥ ఇదియే ప్రథమంపుచేతగద నీవే తోడునీపై కృపన్
మది నెల్లప్పుడు యుక్తభాషణ వచోమాధుర్యమున్ జిల్కి జీ
వదుడౌ నీప్రభ జాట రమ్యముగ నావంతే నపార్థంబుగా
నుదయంబొందక నీయకయ్య వరదా యో భక్తభృందావనా ॥

శా॥ దోషంబుల్ గనుపింపనీక నపవాదుల్ పైకిరాకుండ దు
ర్భాషల్ జొప్పడకుండ భారమని సంభావింప కీర్వాత సం
తోషానం బరిపూర్తిసేయ బహుశక్త్యుక్తుల్ విజృంభింప నన్
బోషింపంగదె భావసిద్ధిర! స్వయంభూ! భక్తబృందావనా ॥

శా॥ పారావారము జేరి కారెమును నిల్వంబెట్టి నట్లుంచు కే
ధారాశుద్ధియులేక నేదో ప పద్యాల్ నేర్చి తావన్మహా
చారిత్రాఖిల లోకపావన సుధా సారగ్రహంబీయెడన్
దీరంజూచుట కెంతవెఱ్ఱినో కృపాబ్ధీ భక్త బృందావనా ॥

మ॥ జనముల్ మెచ్చిన మెచ్చకున్న మదమే సత్యంబుగా జెప్పుచుం
టిని నీకున్ హితమైన చాలునిది తండ్రీ లోకులెట్లేవిధం
బున నెన్నో నుడువంగ వారికి హితంబుల్ సెప్పగాశక్యమే
మనసారన్ గయిసేతు దీని గయికొమ్మా భక్త బృందావనా ॥

శా॥ ఏనాడేమిజరుంగునో వసుధ నేయేమస్థితుల్ వచ్చునో
యేనాడైన నెఱుంగలేముగద యేదెట్లుండునో తావది
చ్ఛానీకంబులు బుద్బుదంబులక్రియన్ యామోద్భవాంతంబు ల
ద్దానింజేసి భజింపనిష్టె వినరాదా భక్తబృందావనా ॥

మ॥ ధర నేదైనభవత్కళామయము నీదైతోచు సర్వంబు నీ
పరమానన్నియుగాని మానవుడు దర్పప్రాభవోన్మత్తుడై
తిరమంచెంచు సుఖాలు నే ననుమదోద్రేకంబునం బోలి యో
పరమేశా! కననీవె సర్వమునుగావా భక్తబృందావనా ॥

# అవతారమూర్తులు, వారి సేవాప్రశంస.

వి. ఎన్. శర్మగారు

లోకమున స్థాపింపబడుచుండు మతముల కన్నింటికిని నొక మూలపురుషులుందురు. వారినే మన భారత వాఙ్మయమున జగద్గురువులనియు, అవతారమూర్తులనియు మన ప్రాచీనులు పేర్కొని యున్నారు. ఈ మహనీయుల కార్యక్రమమును నిర్విఘ్నముగా నెరవేర్చుచు, వారి యుద్యమమును ఆచంద్రార్కము విజయవంతముగా నిర్వహించుటకుగాను, కొందరు సేవాపరతంత్రులుండెదరు. వీరిని ప్రతిమతమువారును, తమ తమ సాంప్రదాయముల ననుసరించి, పలునామముల పేర్కొను చున్నారు. హిందువులు యిట్టి మహనీయులను మహర్షులందరు. బౌద్ధులు బౌద్ధభిక్షువులందురు. క్రైస్తవులు, ప్రవక్తలని, శిష్యులని, భక్తులని పేర్కొందురు. మహమ్మదీయులు అట్టివారిని మహమ్మదువారి సహచరులని పిలచెదరు. పారసీకులు జరతుష్ట్రప్రభువువారి శిష్యులని పిలచుచుందురు. ఈ మహనీయులు అవతారమూర్తి, ప్రపంచమున నవతరించి, లోకకల్యాణమునకు నూతన సందేశ మిచ్చి వెడలిన తదనంతరము, వారి యాదేశానుసారముగ, నూతన సందేశమును లోకమున వ్యాపింప జేయుటకుగాను, నూతన మతములను నెలకొల్పుచు, వానిని నిర్విఘ్నముగా కొనసాగించుటకు తమ తపోశక్తినంతయు సర్వకాలములయందును వినియోగించుచుందురు. వీరు గ్రంథస్థముచేయు విషయ ములనే మనవారు అతిపవిత్రములని భావించుచు, వాని ననుసరించుచు తమ జీవితమున త్యాగము జూపుచు లోకసేవకులగుచు పుణ్యమూర్తు లగుచున్నారు.

మన ప్రపంచమునకు యుగ యుగములందును నూతన ధర్మములను బోధించు అవతారమూర్తులను, వారి శిష్యవర్గమును, మనము దర్శించి ముక్తులము కావచ్చును. కొందరు తలంచినటుల యిది అసాధ్యమైన కార్యముకాదు. అన్నిమతములు మనమీ మహామూర్తులను గాంచవచ్చునని యుద్ఘోషించుచున్నవి. అందువలననే, మన హిందూపూజా విధానమును కొంచెము విమర్శ దృష్టితో పరికించినయెడల, మనము ఆచరించు, మహాకార్యములకు ప్రత్యక్షముగా తోడ్పడుటకు మనము వారి నేరీతిని నాహ్వానించుచుండునదియు వారు ఏయే రీతిని మన మాచరించు కార్యములలో పాల్గొనుచు, వానిని నిర్విఘ్నముగా నెరవేర్చుటకు తోడ్పడుచుండునదియు మనము గాంచగలము. బౌద్ధులు తమ అనుదిన కార్యములలో యీ మహనీయుల సహాయమును బొందుటకుగాను, వారిసంఘ నాయకులను శరణుజొచ్చెదరు. క్రైస్తవులు సయితము, తాము అనుదినము చేయు కార్యములకు అన్నిరీతుల తోడ్పడ, తమ మతకర్తలను, ప్రార్థించుచుందురు. మహమ్మదీయులు సైతము వీరిపద్ధతినే అనుసరించుచుందురు.

ప్రతి మతమునందును, గుప్తభాగముండును. దీనిని అందరు గాంచనేరరు. దీనికి మనకు కొంతవరకు దివ్యశక్తి యుండవలెను. ఈ శక్తిని జిజ్ఞాసువులందరు సంపాదించుకొనుచు, పావను లగుచుండిరి. ఈ భాగముననే సతతము, అవతారమూర్తులు, వారి శిష్యకోటి ప్రత్యక్షమగుచు ప్రజలు చేయు పూజలకు, సేవలకు తోడ్పడుచు, తమ తేజోవిలాసముచే ప్రపంచమును పవిత్రవంతము చేయుచుండిరి. ఈ కాలమున ప్రజాకోటిలో భౌతికవాంఛలు హెచ్చగుచు, స్వలాభాపేక్ష హెచ్చగు చున్నది. ప్రాచీనకాలమున మనవారు ప్రత్యక్షముగా చూచిన విషయము లనేకములు మనవారికి గగనకుసుమము లగుచున్నవి. జిజ్ఞాసత్వముపై యుత్సాహము అడుగంటుచున్నది. తాము ప్రత్యక్షముగా భౌతిక నేత్రములతో గాంచని విషయములు బూటకములని, అట్టివానిని యెవరును నమ్మ కూడదనియు చాటుచున్నారు. అందువలన మన ప్రజలు తమ మతములను పేరునకు అనుసరించు

చున్నారు. కాని, వాని ధర్మముల నేమాత్రము కార్యాచరణములలో బెట్టక, పాషండులగు చున్నారు. తమ మతసందేశమునకే నొక్కొక్కసారి వ్యతిరేకభావమును జూపుచున్నారు. అందు వలన మనవారిలో అసమానత్వము నానాటికి మెండగుచున్నది. అధర్మము, అన్యాయము హెచ్చగు చున్నది.

ప్రపంచ మీకాలమున ఇట్టి సంక్షోభపరిస్థితులలో నున్నను, అనాదిగ వర్ధిల్లుచుండు గుప్త భాగము నేటికిని సంపూర్ణసౌష్టవములతో తులతూగుచున్నది. నేటికిని మనవారు - భౌతిక వాంఛలను విడనాటి లోక సేవాతత్పరులగుచున్నవారు - ఈ మహాలోకమును గాంచుచున్నారు. భౌతిక ప్రపంచము వట్టిమాయ అని వాదించు మహావిషయములను కనులారగాంచి ముక్తులగుచున్నారు. అనేకవేల సంవత్సరములనుండియు తమ తమ వాఙ్మయములలో ప్రశంసింపబడుచు, జీవన్ముక్తులై, చిరంజీవులైయున్న లోకోత్తర పురుషులను నేటికిని గాంచుచున్నారు. ఈ మహనీయులు నేటికిని, ఏ యే రీతిని యుత్సాహముతో తమకు అనాదరముతో, విరోధభావముతో, ఆతిథ్యమిచ్చుచున్న ఈ లోకమునకు ఏ యేరీతిని సేవచేయుచు, లోకమాతను సద్ధర్మమార్గమున నడుపుచున్నదియు, మనము చూడవచ్చును.

నేడు ప్రకృతిశాస్త్రమున సైతము గొప్ప విప్లవము జరుగుచున్నది. ఇంతవరకును శాస్త్రజ్ఞులు భౌతిక నేత్రములతో గాంచిన విషయములే నిజములనియు శాస్త్రబద్ధములనియు శాసించుచుండిరి. కాని కాలము మారుచున్నది. మన భౌతికలోకమునకు మించిన లోకము లనేకములు గలవనియు, మనయందు నిమగ్నమైయున్న దివ్యశక్తిచే వానిని జూడవచ్చుననియు నేటి పాశ్చాత్యశాస్త్ర పండిత లోకము అంగీకరించినది. అంతటితో తృప్తిపడలేదు. ఆలోకముల, ఆదివ్యవిషయముల గాంచు టకు ప్రయత్నములు సలుపుచున్నది. ఈ కాలమున సర్. ఆలివరులాడ్జి, సర్. కానండైలు మొదలగు పండితవర్గము వ్రాసిన శాస్త్రగ్రంథములలో యీ విషయములను మనము గాంచవచ్చును.

ఈ శాస్త్రపద్ధతి ననుసరించి మన ప్రాచీనమత సిద్ధాంతములను పరీక్షించినయెడల, అనాదిగ సుప్రసిద్ధమైయున్న అత్యద్భుత విషయములను ఎన్నిటినో మనము తెలిసికొనవచ్చును.

## II

మనలోకము నుద్ధరించుటకు, ముందునుడివినటుల నొక్కమహనీయ వర్గముగలదను విషయము అన్నిమతములవారు నొప్పుకొనుచున్నారు. ఈమహనీయవర్గమే, నేటికిని మన ప్రపంచమును సద్ధర్మమార్గమున నడపుచున్నది. ఈమహావర్గమునగల పుణ్యమూర్తులే, పుణ్యమూర్తులు. అందరును దీక్షా సిద్ధులే. వీరిని మనవారు ముక్తులని మన గ్రంథములలో పేర్కొని యున్నారు. వీరును మనవంటి మనుష్యులే. తమ జీవితమునంతయు లోక కల్యాణమునకు సమర్పించి, త్యాగమూర్తులై మోక్షసిద్ధిని బొందిన మహనీయులు. వీరికి జరామరణములు లేవు. దైవత్వమును బొందిన పుణ్యమూర్తులు. ఈ మహనీయులలో కడపటి వర్గమువారు నేటికిని లోకకల్యాణమునకై భౌతిక దేహములలో నేటి కిని, యీ ప్రపంచమున మనతోపాటు నివసించుచు, మన కన్నిరీతుల తోడ్పడుచున్నారు. వీరినే మనవారు మహర్షులని, మహాత్ములని, క్రైస్తవులు సాధుపుంగవులని పేర్కొనుచున్నారు. వీరికి పైనున్న మహామూర్తులను చోహానులందురు. వీరు యితర లోకములనుండి మన లోకమునకువచ్చి మనల నుద్ధరించుటకు సతతము అత్యుత్సాహముతో సేవ చేయుచున్నారు. ప్రపంచ సృష్టి, స్థితి, లయములన్నియు వీరిపై యాధారపడి యున్నవి. ప్రపంచ పాలనమును నిర్విఘ్నముగా నడపుటకు వీరికెందరో మహనీయులు తోడ్పడుచుందురు. ప్రతి జీవాత్మయొక్క పురోభివృద్ధిని గాంచుచు, అన్నియు తమతమ సంపూర్ణ వికాసములను వ్యక్తీకరించుటకు వీరు వానిని అన్నిరీతుల అవకాశముల నిచ్చుచు తోడ్పడుచుందురు. వీరికిపయిన యింకను కొందఱు మహనీయులు గలరు. వీరిలో నొక్క

రిని దివ్యజ్ఞానసమాజ నాయకులు, మహాచోహానులని పేర్కొందురు. చోహానులనగా సేనాతి ప్రులు. ఈ మహాచోహానులు, ప్రపంచోద్ధారణమునకు తోడ్పడుచుండు మహనీయులగు చోహానుల కార్యవిధానమును నిర్ణయించుచు వానిని సక్రమముగా నిర్వహించుటకు తోడ్పడుచుందురు. వీరు ఒక మహాసేనకు సేనానాయకులవంటివారు రెండవవారు మనువు, వీరు ప్రపంచపాలనకు బాధ్యులు. మూడవవారు బోధిసత్వులు. వీరు ప్రపంచ బోధకులు అన్నిమతములకును మూలకర్తలు. మన గ్రంధము లన్నిటికిని వీరినిగురించి యెక్కువగా ప్రస్తావించబడియున్నది. ఇతరమత గ్రంధములలో సైతము యీమహనీయులు పలునామములతో పేర్కొనబడి యున్నారు.

## III

ప్రపంచమున మానవుని పరిణామమును గురించి కొంచెము శ్రద్ధతో మనము పరికించి చూచినయెడల ఏడుజాతులను మనము గాంచవచ్చును. ఈలోకమున మానవనిర్మాణము సంపూర్ణ వికాసవంతముగా నిర్మింపబడుటకు యీజాతులే ఆధారభూతములు. దీనిని శాస్త్రజ్ఞులు అందరును అంగీకరించియున్నారు. అన్నిమతములు సయితము వీని నామోదించియున్నవి. ప్రతిజాతికిని యొక నిర్మాతగలడు. వీరినే మనగ్రంధములు "మనువులు" అని పేర్కొనియున్నవి. మానవ పరిణామమున యీ సిద్ధాంతము ననుసరించి యేడుగురు మనువులుగలరు. మనజాతి మానవ పరిణామమున అయిదవ జాతి. ఈ జాతినిర్మాతలను వైవస్వత మనువులని పిలిచెదరు. వీరి ప్రశంస మనజాతి చరిత్రమును సూచించు గ్రంధకోశము లన్నిటిలోను గలదు. నాలవ మనువు చీనా, జపాను, బర్మా, సయాం మొదలగు ప్రజాజాతికి పాలకులు. ఆజాతి వైభవము నేడు గతించినను. వారి సంఖ్యను నేటి అయిదవజాతియగు ఆర్యవర్గముతో చూచిన, యింకను యెంతయో విస్తారముగ గాంచవచ్చును. వారిని నేటికిని యీ మహనీయులు రక్షించుచు, వారికి అన్నిరీతుల తోడ్పడుచున్నారు.

మనము అవిద్యవలన అవివేకమువలన, అజ్ఞానమువలన తెలివితక్కువవారమై, అనవసరములగు కలతలను పెంచుకొనుచున్నాము. సోదర జాతులమీద దాడివెడలువారిని నాశనము చేయుటకు ప్రయత్నించుచున్నాము. మానవ పురోభివృద్ధికిగాను ప్రతి జీవుడును యీమార్గములను దాటి పోవుచుండవలయును. దీని మూలకముగనే మనము అనుభవమును సంపాదించికొనుచుందుము. మనవారు నుడివినటుల యిదియొక గొప్ప కర్మ. దీనిని మనము అనుభవించి తీరవలయును. మహనీయుల లోక కల్యాణమునకుగాను వారు చేయుచుండు సేవావ్రతమున యిట్టి అసురకృత్యము లనేకములు అడ్డము వచ్చుచుండును. అసురత్వమున సయితము దైవత్వముగలదు, మంచిగలదు. దీనిని గాంచువారే పుణ్యమూర్తులు. ఈ మహనీయులు మన అసురత్వమునుండియే దైవత్వమును నిర్మించుచు, దానిని మనకొరకే వినియోగించుచున్నారు. ఈ కార్యవిధానమును నడపుచున్న మనువులే మహా పుణ్యమూర్తులు. అందువలననే మన గ్రంధములు వారికి సర్వదా గౌరవస్థానములనిచ్చి, పూజించుచున్నవి.

ప్రపంచబోధకులు, జగద్గురువులునగు బోధిసత్వులు మనవులవలె ఒక జాతి నిర్మాణమునకే బాధ్యులుకారు. జాతులు ప్రపంచమున నున్నంతవరకు మనువులుందురు. కాని వీరు ప్రపంచములోని అన్నిమతములను పోషించుచు, వానిని చిరస్థాయిగ వర్ధిల్ల చేయుచుందురు. ఒక్కొక్క జాతిలో సయితము భౌతిక పరిస్థితుల ననుసరించి అనేకవర్గము లుండును. వారివారి పరిస్థితుల ననుసరించి, ప్రాచీన ధర్మములను నూతన కళలతో వారలకు బోధించుచు, నూతనమతములను నిర్మించుచు అన్నిటిని విజయవంతము లగునటుల చూచుచుందురు. "మానవులు నన్ను గాంచుటకు అనేకమార్గముల వచ్చుచుందురు. అన్ని మార్గములు నావే. మానవుడు నన్నుగాంచుటకు యేమార్గమున వచ్చినను ఆమార్గ ద్వారముననే ఆతనిని ఆహ్వానింతును." అని బోధిసత్వుడు యెల్లకాలములలో యెల్లప్రజలకు వచించుచున్నారు.

ఈ మహానీయులు తమ అధికార బాధ్యతలను పూర్తిచేసిన తదనంతరము తమ స్థానములకు అర్హతను బడయుటకు శక్తి బాధ్యతలను సేవాధర్మమున విజయవంతులై వారికి తమ అధికారముల నిచ్చి యితర లోకములలో సేవ చేయుటకు వెడలుచుందురు. ఇంతకు ముందు యీ బోధిసత్వాధికారమును బడసిన బుద్ధ భగవానుడు ఈ ప్రపంచమున వారికిగల అభిమానముచే యిప్పటికిని ప్రతి వైశాఖ పౌర్ణమినాడు యీ లోకమునకు వచ్చుచు, తమ శిష్యకోటికి దర్శనమొసంగుచు, వారి నాశీర్వదించుచుందురు. ఇప్పటి బోధిసత్వులు మైత్రేయులవారు. వీరిని మన గ్రంథములన్నియు వేయినోళ్ళ ప్రశంసించుచున్నవి. బుద్ధత్వమునుపొంది యిప్పటికిని లోకమునకు సేవ చేయుచున్న వారు యింకను ముగ్గురు కలరు. వీరినే మన భారతగ్రంథములు "కుమారుల"ని పేర్కొనుచున్నవి. బౌద్ధులు వీరినే "ప్రత్యేక బుద్ధులు" అని పూజింతురు. ఈకాలపు మతములలో వీరిని పేర్కొని యున్నారుకాని, వారి పేరులను మాత్రము ప్రస్తావించియుండలేదు.

వీరికిపైని అధికారులై ప్రపంచములోని అన్ని జీవవర్గములకును రాజాధిరాజులైయున్న మహానీయులు గలరు. వీరిని మన మతగ్రంథములు సనత్కుమారులని పేర్కొనుచున్నవి. వీరిని సతతము ప్రశంసించుచున్నను యీ కాలపు మనవారు వీరిచరిత్రమునే మరచియున్నారు. అంతయు కాలమహిమ. ప్రపంచోద్ధారణమునకు సేవ చేయుచున్న మహానీయులనుగురించి మన గ్రంథములలో వివరించినటుల మరి యే గ్రంథములలోను యింత స్పష్టముగా లేదు. భారతభూమికి అనాదినుండి, ప్రపంచమును ధర్మమార్గమున నడుపుచుండుట పెట్టినది పేరు. ఇంతవరకును భారతభూమి, భగవానుడు తనకు ప్రసాదించిన అవకాశములను అత్యుత్తమ పద్ధతులతో వినియోగించి కీర్తికాంతయైనది. అందువలననే, నేడు భారతజాతి తన మతధర్మములను నిరసించుచుండినను, వెర్రి ఆచారములకు లోనైనను, ఇంతకాలము లోకకల్యాణమునకు సేవచేసిన మహానీయులు భారతభూమినే నివసించుచు తపమాచరించుచున్నారు. మహానీయుల తపోసంపత్తిచే, మనవారు పెడత్రోవలకు దీసికొనిపోవ ప్రయత్నించుచున్నను, భారతాంబ తన సనాతన స్థానమును నిలుపుకొనుచున్నది. ఈ ప్రళయకాలమున తల్లిని సేవించు పుత్రులే పుత్రులు. అట్టివారే తల్లి గౌరవప్రేమలకు పాత్రులై చిరంజీవులు కాగలరు.

శ్రీకృష్ణమూర్తి, భగవద్గీతలో నుడివినప్రకారము, ప్రతియుగమునను, దుష్కృతమును వినాశముచేసి, సాధుపుంగవుల వ్రతములను పండించుటకును, ధర్మములను సంస్థాపించుటకును, మహానీయులనేకులు అవతరించుచుందురు. ఇట్టి పరిస్థితులు ప్రాచీన కాలమున అనేకసార్లు సంభవించినవి. అవతారమూర్తులనేకులు అవతరించి భూమాత భారమును తప్పించిరి. అట్టి సందిగ్ధకాలము నేడును సంభవించినది. ఇప్పుడనేకమంది మహానీయులు, మహానీయవర్గమును వచ్చి ఈలోకమున మన మధ్య సంచారముచేయుచు, ప్రాచీనధర్మముల నుద్ధరింపజేయుటకు ప్రజలలో నుద్బోధనల నలుపుచున్నారు. వితండవాదము ననుసరించి వారి మనస్సులను రంజింపజేయుటకు బ్రహ్మసైతము ఏమియు చేయలేదుగదా! సహజసిద్ధమగు అనుగత్వము మనలో నేడు నిబిడీకృతమైయున్నది. మన శ్రేయస్సునకు సేవచేయువారిని నానాయిడుముల బెట్టుచున్నాము. మహామూర్తుల సేవాతంత్రమున నేడు పాల్గొనిన మానవుల జన్మమే జన్మము. "ఆయన రాకకు ఎవరు వేచియుండగలరు? ఆయన ఆగమనసమయమున, ఆయనతో నెవరు నిలచియుండగలరు?" అని యొక మహానీయుడు నుడివినటుల, అవతారమూర్తులు నేడు మనకు చేయుచుండు సేవలో పాల్గొనిన మహానీయులే మహానీయులు.

# * కలిమిలేములు.

[వి. గోపాలకృష్ణగారు.]



కష్ట పరంపరలోఁబడి త్రోవ తెలియక దన్నుకొను మానవునకు భార్యయే యాపద్బంధువు. తన భుక్తికి సైతము భర్త సంపాదనమీదనే యాధారపడు భార్య యిట్టి మహిమా సంపన్నయాయని సందేహింప బనిలేదు. సుకుమారమయిన లతా సముదాయ మొక మహావృక్షపు నీడనుండి దాని కొమ్మలకు ప్రాకి తన ప్రాణము నిల్పుకొనుచున్నది. ఈదశలో నా వృక్షమే దీనికి ప్రాణాధారము. కాని యీలతలే చిందర వందరయైన తరుశాఖలను విచ్ఛిన్నము కానీక గట్టిగ కట్టియుంచి వృక్షము యొక్క భవిష్యదభివృద్ధికి కారణభూతమగుచున్నది. ఇట్లే భార్యయు నాకస్మిక ముగ వచ్చు కష్టములవలన భర్త హృదయమును విచ్ఛిన్నము గానీక తనజీవితేశుని జీవితమును సుఖదాయకముగ జేయుచున్నది. అట్టి భార్యయే లేనియెడల భర్త కింకేమి శరణ్యము ? భార్యా సమేతున కెన్నికష్టములు వచ్చినప్పటికిని కష్టము లుగ కానరావు. తనకెన్ని చిక్కులున్నప్పటికిని తినుటకు తిండిలేనప్పటికిని తుదకు తనకీ ప్రపంచమంతయు నరకతుల్యముగ గన్పట్టుచున్నప్పటికిని తన యింటియందు మాత్రమొక ఆనందదాయకమగు ప్రేమాప్రపంచమును చూడగల్గుచున్నాడు. భార్య మృదుమధురవాక్కులు భర్త నానందాబ్ధి నోలలాడించును. మందస్మిత వదనయైన తన సహధర్మచారిణిని చూచిన వెంటనే ఆతడానందాతిరేకముచే తన్ను తానే మరచును.

కాని యవివాహితుని స్థితి దుఃఖజనకమయినది. నివసించుటకు యజమాని లేని గృహమువలె నాతని హృదయము పాడుపడి పోవుచున్నది. ఆతనికీ ప్రపంచమున సౌఖ్య మిచ్చునది లేదు. సౌఖ్య దూరమయిన యా జీవితము వృథయేగదా !

ఈ సందర్భమున నామిత్రుని యనుభవ మొకదానిని చెల్పెదను.

నాస్నేహితుని పేరు రామనాథము. ఈతడు మంచి భాగ్యవంతుడు. ఈతని భార్యపేరు మంజరి. సుగుణఘని. అనురాగవతియును. ఆమె గృహనిర్వాహక నిపుణత నిరుపమానము. కనుకనె ఆ గృహము స్వర్గతుల్యముగ నుండెడిది. అన్యోన్యప్రేమచే కడుసుఖవంతులుగనున్న, వారికింకేమి కొదవ !

* ఇర్విన్‌గారు వ్రాసిన " భార్య " కనుకరణము.

కాని కాలమొక్కరీతిగా నడువదుగదా! రామనాథమునకు సముద్రవ్యాపారమునం దపార నష్టము సంభవించెను. లక్షాధికారి అతివైభవ జీవితము కడు దైన్యముగ మారిపోవుచున్నది. లక్షల రూపాయలతో వ్యవహారము జరపు రామనాథమునకు యింటిఖర్చులకే ధనము లేనంతటి దుస్థితి సంభవించెను. కష్టమనునదే యెరుగని నామిత్రుని సంసారనావ కడు భయంకరమగు దారిద్ర్యపు తుపాను నెదుర్కొనవలసియుండెను. భగవంతు లీల లనంతములు గదా!

ఈ వార్త మంజరికి తెల్పుటకు రామనాథమునకు ధైర్యము చాలకుండెను. మంజరి - తన పూర్వపు ఐశ్వర్యపు జీవితము - రామన్న దారిద్ర్యాంధకారము తలపునకు వచ్చిన నాతని కెక్కడలేని దుఃఖమువచ్చుచుండెను. దానిని లోపలనే దాచి యుంచుటకు చాల శ్రమపడుచుండెను. ఆదుఃఖదావానల మాతని హృదయమును దహించి వేయుచుండెను. మంజరి తన సూక్ష్మదృష్టితో భర్తచర్యను గమనించుచుండెను. ఆమె తన హృదయేశుని సంతోషపెట్టవలెనని వివిధ ప్రయత్నముల జేయుచుండెను. కాని రామనాథమున కాశ్రవణానందముగ నుండెడి పలుకులిప్పుడు వినినకొలది దుఃఖము ద్విగుణీకృతమగుచుండెను. ఆతని మనస్సు పరిపరి విధముల బోవుచుండెను. ఇట్లే యాతడు తన పరితాపమును ప్రాణేశ్వరి కెరుక పరచకయే కాలము గడుపుచుండెను.

ఒక దినమున రామనాథము నావద్దకువచ్చి తన స్థితినంతయు జెప్పి చింతాక్రాంతుడాయెను. "ఈ విషయము నీఅర్ధాంగి కెరిగించితివా" యని నేప్రశ్నింప మరింత దుఃఖముతో నిట్లు చెప్పదొడగెను. "ఏమి! నాభార్యకా, యీవార్త జెప్పుట? సర్వసుఖముల ననుభవించు నామనోహరి కీ విషయము జెప్పి సంతాపస్వాంతగాజేయుటకు నేనిచ్ఛగింపను. నాటనుండి నన్నానందాబ్ధి నోలలాడించు నాహృదయరాణికి నేజేయు ప్రత్యుపకారమా యిది? నాయజాగ్రత్తచే నే తెచ్చుకొన్న యీ ఫలమును నేనే యనుభవింపవలెను కాని నాముద్దుల మంజరి యేల బొందవలెను?" అంతనేనిట్లంటిని. "మిత్రమా! రామా! నీవు పొరపడుచున్నావు. దుఃఖాతిరేకముచే నీకర్తవ్యము నీకు గోచరించుటలేదు. ఇట్టి కష్టదశలో నీవు సహాయము కోరకెదురుచూడవలసిన ప్రదేశమేదియో గమనించుటలేదు. నీమనోవ్యథా జాడ్యము కడుభయంకరమయినది. దీనికి సామాన్యౌషధములు నిష్ప్రయోజనములు. మంజరీ వాక్యామృత రసమమోఘముగ బనిచేయగలదు." అంత నాతడిట్లు చింతింపదొడగెను. "మంజరీ భర్త బిచ్చగాడనియా, ఆమెకు జెప్పుట. స్వర్గలోక విహారమొనర్చుచున్న నామనోహరి నాయవివేకఫలితముగ అతఃపాతాళమునకు పడిపోవుటయా! అయ్యో నేభరింపజాలను."

అట్లాతడు తన దుఃఖప్రవాహమును వెలిబుచ్చిన తరువాత నేనిట్లు సమ్మతిచెప్పి తిని. " రామా, జాగ్రత్తగ నాలోచించుము. ఈవిషయము నాయెంతకాలమని యెన్ని రోజులు దాచగలవు? ఇప్పటి నీస్థితిగతుల ననుసరించిన సంసారపద్ధతుల మార్చుటవ సరము గదా! దీనికి భయపడ నవసరములేదు. సుఖము బాహ్యాడంబరములలో లేదని యెరుంగుము. ఇంక నీపైడాభులనుత్యజించుటకేల జంకెదవు? మంజరితో సుఖించుటకు మేడ లనవసరము, ఆమె యైశ్వర్యమునకన్న దారిద్ర్యమునే యెక్కువ సంతోష ముతోస్వీకరించగలదు. నిన్ను నీకొరకే ప్రేమించుచున్నదనియు నీపై ఆడంబరములకు కాదనియు నీకు ప్రత్యక్షముగ జూపుట కామెకిది యొక మంచి యవకాశము. మంజరి యీ అపూర్వావకాశమును బోగొట్టుకొనునంతటి మూఢురాలు కాదు. పతివ్రతా పవిత్రగుణములు ఐశ్వర్యము ప్రకాశించు సమయమున తమ వెలుతురును వెదజల్లవు. దారిద్ర్యాంధకారమునగాని వాని ప్రకాశమున కవకాశముండదు."

తన దుఃఖభారమును దీర్చుటకు భార్యయేసరియైనదని నామిత్రుడు గ్రహించి నట్లు నాకు గన్పట్టెను. అప్పటికే కాలాతీతమగుటచే, నేనాతని బంపివైచితిని. నే నాతనితో నట్లుపన్యసించినప్పటికిని, నాకొకవంక నధైర్యము లేకపోలేదు. ఏమో, యెటులుండునోయని నామనసు వేదనపడుచునేయుండెను. సౌఖ్యజీవనము నొదలి కష్టము ప్రేమాప్రతిబంధకమును కల్పించునేమో యని భయపడితిని. కాని నా సందేహము నన్ను చాలకాలము బాధించకముందు, మరునాడుదయముననే మిత్రుని గలసికొంటిని.

" ఏమివిశేషములు?" అని నేను ప్రశ్నించితిని.

అంత నాతడిట్లుచెప్పెను. " మంజరి కడుసంతసముతో దారిద్ర్యమును స్వీక రించినది. నా అసౌఖ్యమునుగూర్చి యామె చాల మనోవ్యథనొందుచున్నది. ఈ వార్త యామె మనోవ్యధను పారదోలినది. ఆమె నన్నాలింగినమొనర్చి " ఇది యేనా, మనోవ్యథకు కారణము" అని చుల్కనగ మాట్లాడినది. కాని ఆమెకు అనుభవములేదు. దారిద్ర్యనరకము లామెకు తెలియవు. దారిద్ర్యమునుగూర్చి యామె గ్రంథములలో మాత్రము చదివియున్నది. కాని స్వయముగ ననుభవించి యెరుగదు. కష్టములే – గుణపరిశీలనకు తగు పరీక్షలు."

తరువాత నే నిట్లంటిని " నీభార్యకీ వార్త దెల్పుట చాలకష్టమని భయ పడితివి. ఎట్లైననేమి, ఆపనిని చేయగల్గితివి. కొంతభారముతీరినది. నీ నూతన దారిద్ర్యపు విషయము ప్రపంచమున కెంత త్వరలో దెలిసిన నంతమంచిది. నేడో, రేపో,బీదవాడివిగ గన్పడుట నిశ్చయముగదా? ఐన నీతాత్కాలికాడంబరమువలన నేమి ప్రయోజన ముండగలదు? దారిద్ర్యమునకు జంకకుము. ధైర్యముబూనుము."

అంత నాతడు తన యింటికి వెడలిపోయెను.

నాసలహా చాల యుపకరించినది, రామనాథము నిరాడంబరజీవియైనాడు. తన రమ్యహర్మ్యము నమ్మివైచి ఒకతోటలో పూరిగుడిసె వైచికొని మంజరీ సమేతుడై కాపురము జేయుచుండెను.

ఒకనాడాతడు తన యారామగృహంబునకు నన్నాహ్వానించెను. ఆగర్భ శ్రీమంతుడై యుండెడి నామిత్రుని జీవితమునందలి యద్భుతపరివర్తనమును కన్నులార గాంచ నుత్సాహపడుచున్న నాకీయాహ్వానము సంతోషజనకముగ నుండెను. సాయంత్రము మేమిద్దర మానూతన నివాసమునకు బయలుదేరితిమి. కొంచెము సేపటికి ఆతనియింటిని సమీపించితిమి.

అదినాకు చాల సౌందర్యవంతముగ గన్పడెను. దాని చుట్టునున్న వివిధవృక్షములు నిర్మలవాయువును కొల్లగ నిచ్చుచుండెను. అన్నిరకముల పుష్పజాతులు బహు సౌందర్యముగ నమర్చబడియుండెను. ఆపుష్పసౌరభము చాల యింపుగ నుండి సమ్మోదదాయకముగ నుండెను. ఇన్ని సౌకర్యములతో నానందమందిరమగు నామందిరము మంజరీగృహ నిర్వాహకసామర్థ్యమును వేనోళ్ళ జాటుచుండెను. మేము వెళ్ళునప్పటికి మంజరి తనవీణతో విరివిగను, స్వేచ్ఛగను, హాయిగను పాడుచుండెను. వికసించిన మోముతో నామిత్రు డిట్లనెను. "అదిగో! వింటివా, ముద్దులమంజరి మనోహరగానము. సమస్తభూషణముల నమ్మి వ్యాపారనష్టమును దీర్చినప్పటికిని, ఆ వీణను మాత్రమమ్మనైతిని. అది నాజీవితాధారము. ఆవీణాగాన స్వరము నన్నానందాబ్ధి నోలలాడించును. నాకష్టదశలో, మంజరీ కోకిల స్వరమే నాకు శరణ్యము."

ఇంతలో, మాయడుగుల చప్పుడు విని, మంజరి మమ్మాహ్వానింప వచ్చెను. సగౌరవముగ సన్మానించి మమ్మాసీనులజేసెను. ఆమె వేషమిపుడు మారిపోయినది. వివిధాలంకార భూషితయైయుండెడి, మంజరి వానిని త్యజించి పుష్పాలంకృతయై యుండెను. వెలగల చీరలు లేనప్పటికిని, ఆమె సహజ సౌందర్యము ద్విగుణీకృతమై యుండెను.

వివిధ విషయములగూర్చి మాట్లాడిన పిదప నేనును నామిత్రుడును పండ్లను తృప్తిగ భుజించితిమి.

ఇప్పుడు రామనాథము మరల భాగ్యవంతుడై యున్నాడు. కాని నాకు కనబడినపుడెల్ల, "ఆవనసౌఖ్యముతో నేదియు యీడురా" దని చెప్పుచుండును.

నిజముగ మంజరి స్త్రీ లోకమున కాదర్శపాత్రియగదా?



# అన్నపూర్ణ అవ్యక్తత.

(పద్మరంజితుడు.)

“ఏమండోయి యిటుచూడండి నాకొకకోరిక యున్నది.”

“ఏమిటది?” అని అపుడే కచేరినుంచి యింటికివచ్చిన కామేశ్వర్రావు అనెను.

“మీకుకోపమైతే చెప్పను.” అన్నది అన్నపూర్ణ.

“చెప్పమంటే, కోపమంటూ వేమిటి?” అన్నాడు కామేశ్వర్రావు.

“పోనీ, మావాళ్ళు తెలిసో తెలియకో మిమ్ములను తృణీకరించుచు వచ్చినను, నేనుమాత్రము వారిస్వభావమును సహించలేక, అయినను తలిదండ్రుల నేమియు ననలేరక, యెపుడు మీపాలబడుదునాయని యువ్విళ్లూరుచు, నేటి కట్టిభాగ్యము కలిగినది. నాకు నగలెందుకు నాడాలెందుకు, మీకుదయయుంటే చాలును అనుకున్నాను గాని యెపుడైనా యేమైనా కోరానా?”

“అబ్బా, యేమిటో చెప్పక యీ యుపోద్ఘాత మేమిటి?”

“నాకోరిక చెల్లిస్తానంటే చెపుతాను.”

కామేశ్వర్రావు ప్రత్యుత్తరమీయలేదు.

“పోనీ, మీకుసందేహమైతే, యెందుకు బాధించాలి?”

“సరే, అల్లేచెల్లిస్తాను ఏమిటోచెప్పు.”

“ఇవ్వాళ చింతామణినాటకమట.”

“అవును నీవు చింతామణినాటకము ఆడదలచినావా?”

“మీహాస్యముల కేమిలెద్దుకు! ఇవ్వాళ వెంకటేశ్వర్రావు చింతామణి వేస్తాడట. భోగంవాళ్లకందరికి బుద్ధివచ్చేటట్లు, సిగ్గుమాలి తప్పుడుదారుల త్రొక్కు సంసారస్త్రీల నోళ్ళలో గడ్డిపెట్టేటట్లు నాటకం ఒప్పిస్తాడుట.”

“అయితే, యింతేగదా. ఆలాగేపోదాము”

అనేటప్పటికి అన్నపూర్ణ ముఖము గంపెడంతైనది. త్వరత్వరగ వంట పూర్తిచేస్తే, రెండుమెతుకులు తిని నాటకమునకు బోయి మంచిస్థలము నాక్రమించ వచ్చునని అన్నపూర్ణ వంటచేయుట ప్రారంభించెను. చివరకు భీమపాకము చేసినది. రోజుకంటె ఆధరువులు రుచికరములుగనున్నవి. సగము భోజనమైనపిమ్మట గంట

కొట్టెన చప్పుడయ్యెను. "అదిగో నాటకము హాలులో మొదటిగంట కొట్టుచున్నారు." అని అన్నపూర్ణయనెను. "అబ్బే అది ప్రక్క యింటిలోని వెంకయ్యగారి పెద్దగంట. యిప్పుడే ఎనిమిదిగంటలు కొట్టారు" అని కామేశ్వరారావు పలికెను. నాటకపు హడావిడిలో అన్నపూర్ణ అన్నము సరిగనైనా తినలేదు.

2

ఏలాగైతేనేమి ఆరాత్రి అన్నపూర్ణ కామేశ్వరరావులు చింతామణి నాటకమును చూచివచ్చిరి.

కొంతకాలమైనది. ఒకనాడు కామేశ్వరారావు కాకినాడ వెళ్లి స్వగ్రామమగు యేలూరు చేరుకొనెను. గ్రామాంతరమున కేగివచ్చిన భర్తకు సపర్యల చేయుచు నాతనికై అన్నపూర్ణ యుపాహారమును తయారుచేయుచుండెను. ఇంతలో కామేశ్వరారావు తనగదిలో నిటునటు తిరుగాడుచు నీమూల నామూల పరిశోధించుచుండెను. గదిలో నొకమూల మేజాపైని ఆరోజుననే పోస్టులో వచ్చిన శారదసంచిక గలదు. దానిని తిరగవేయ నారంభించెను. తిరగవేయుటలో నేదియో కాగితము క్రిందబడెను. దానినిగైకొని యామూలాగ్రముగ నిట్లు చదువదొడంగెను.

ప్రియవల్లభునికి,

మీకై రాత్రింబవళ్ళు కలవరించుచున్న యీ దీనురాలి నొకపర్యాయము వచ్చి సంతోషపెట్టుడు.

ఇట్లు ప్రాణసఖి
అన్నపూర్ణ.

"ఇది యేమైయుండును? — ఏమి యెడమకన్నదరుచున్నది — ఛీ. అనుమానమా. నన్నత్యంత సౌఖ్యవార్నిధిలో నోలలార్చు అన్నపూర్ణపైననా అనుమానము. ఛీ, యెంతపొరబడుచుంటిని. గ్రామమును విడచి నెలదినములైనను స్వగృహముచేరని నాకే యీ జాబువ్రాసియుండెనేమో. కాలముగడచిన నంతయు తెలియగలదు." అని కామేశ్వరారావనుకొనుచు నాయుత్తరమును మాత్రము తీసికొని యాశారదను బల్లపైనుంచి యేమియు నెఱుగనివానివలె సంచరించుచుండెను

అన్నపూర్ణ ముఖమునందలి కళ కొంచెముమారినది. తాను వ్రాసినజాబు యేమైయుండునోయని సంశయింప మొదలిడినది. తనభర్తకు తెలిసిన నిదివరకే తనకు గృహవిముక్తి నందెడిదనియు; బహుశా దాసి తనయాజ్ఞప్రకారము ఆజాబు నెవరికొరకుద్దేశింపబడినదో వారి కందజేసి యుండవచ్చుననియు అన్నపూర్ణ యనుకొనెను. దాసిరాగనే విచారింప తనకావిషయమై తెలియుదని సమాధానము

వచ్చెను. కామేశ్వరరావు యేమియు నెఱుగనివానివలె సంచరించుచున్నాడు. అన్నపూర్ణ తోక కాలిన పిల్లివలె తిరుగుచున్నది.

3

కామేశ్వరరావు బి. యె. ప్యాసయి నెలకు 75 రూపాయల దెచ్చుకొనుచు కలెక్టరాఫీసులో గుమాస్తాగా నున్నాడు. అన్నపూర్ణ ధనవంతుల యాడపడుచు. ఇంటివద్ద సంస్కృతము కావ్యములు ప్రబంధములు పురాణములు కొంతవరకభ్యసించినది. సినిమాలు నాటకములు చూచి వాటిని మననముచేసికొనినది. విద్యావంతురాలగు తనభార్య కోర్కెల ననుమానముతో వీక్షింపక, తన్నత్యంతప్రేమతో జూచుచున్న భార్యయెడ నెట్టివిధమైన కినుకయులేక కామేశ్వరరావు కాలముగడుపుచుండెను. తానుజూచిన జాబు జ్ఞప్తికివచ్చుచుండెనేకాని, వెంటనే మనస్సును పదిలపరచుకొని సమాధానపరచుచుండెను. దినములు గడచినవి. మాసములు గడచినవి. కామేశ్వరరావుకు మనశ్శాంతిలేదు. తనమనోవీధిని నిర్మించుకొన్న ప్రణయ సౌధమున నివసింపలేకున్నాడు. అన్నపూర్ణపై కామేశ్వరరావుకు నిండుప్రేమ గలదు. అన్నపూర్ణయొక్క సౌందర్యమునుగాంచి ముగ్ధుడైనాడు. తన ప్రేయసియొక్క మృదుమధుర వాక్కులలో నెట్టికష్టములనైనను మఱవదలచినాడు. కామేశ్వరరావుపై అన్నపూర్ణకు ప్రేమ లేకపోలేదు. స్త్రీలకుండు చిత్తచాంచల్యత ధనికుల యింట పుట్టి పెరిగిన స్త్రీలకుండు చపలత్వము అన్నపూర్ణయందు మూర్తీభవించినవి. భర్తను సంతోషపెట్టుచునే యుండును. భర్తను దైవస్వరూపముగ నెంచి యాతని సమక్షమునను సంచరించుచుండును. పగలు చాలవరకు విశ్రాంతిగ నేకాంతవాసము గడుపు స్త్రీలకు ఆవిశ్రాంతి సమయమును నవలాపఠనమునందు గడుపు స్త్రీలకు మనసాకింత చలించుననుటలో నాశ్చర్యములేదు.

4

కామేశ్వరరావు తన సహధర్మచారిణి నిజహృదయమును పరీక్షింప నిశ్చయించుకొనినాడు. నాడు సోమవారమగుటచే కచేరికి బోయెదనని చెప్పి వెడలెనుగాని, తిరిగి యెవరికిని దెలియకుండునట్లు దొడ్డిలో నొకమూల చెట్లసందున దాగుకొనియుండెను. ఇంతచిత్తచాపల్యముగల అన్నపూర్ణ వట్టి అమాయకురాలు. ప్రపంచమునందలి పైపై మెరుగులకే మోసపోఁడి యువతి. దొడ్డిలో నొక మంచముపై పరుండి యేమేమియో నాలోచించుకొనుచు, మధ్య మధ్య దొడ్డితలుపువంక నెవరిరాకనో యపేక్షించుచున్నటుల చూచుచుండెను. కొంతతడవైన

పిమ్మట దీర్ఘాలోచన చేయుచు కనులుమూసికొనెను. పది నిముషము లయినది. అన్నపూర్ణ కనుల తెరచినది. తన మంచముపై నొకవ్యక్తికూర్చుండుటను చూచి సంభ్రమముతో లేచి పైటసవరించుకొనుచు నిలబడెను. ఆవ్యక్తి చింతామణివేష బిరుదాంకితుడగు మన వేంకటేశ్వరావే. పొదలో చిక్కిన పావురమువలె మన కామేశ్వరావు మూలనుండి వీరిచెయిదములను చూచుచుండెను.

వేంక:- సఖీ, ఎన్నాళ్ళకు నిన్నుగాంచు యవకాశము చిక్కినది !

అన్న:- భగవంతుని కిన్నాళ్ళకు నామీద దయగలిగినది. అనుచు రివ్వున లోనికి బోయి వెండి పళ్ళెములో ననేకవిధములయిన ఫలహారముల దెచ్చి వేంకటేశ్వర్రావు ముందుంచెను. ఇరువురు నేకపళ్ళెమున పదార్థముల నారగించుచు సరస సల్లాపము లాడుకొనుచుండిరి.

కామేశ్వర్రావు హృదయము తత్తరపడసాగెను. ఒక్కగంతునపోయి వేంకటేశ్వరావును చీల్చి వ్రక్కలు చేయదలంచెను. అంతలో తొట్రుపాటు పనికిరాదని తోచెను. తన పత్నిని గృహమునుండి బారదోలసంకించెను. కాని వారిచేష్టలనింకను బరికింప నంతరాత్మ ప్రేరేపించినది.

వేంక:- అగ్నిసాక్షిగ గట్టుకొనిన భర్తనేమిచేతివి ?

అన్న:- ప్రేమకు గట్టుబాట్లులేవే !

వేంక:- నిజముగ నన్నంత ప్రేమింతువా ?

అన్న:- అందుల కీశ్వరుడేసాక్షి.

వేంక:- ఏమీ యమృతపు పలుకులు! అని ముద్దుపెట్టుకొనబోయెను.

ఇంతలో వీరి చెయిదములను దూరమునుండి చూచుచున్న కామేశ్వరావు రోషభీషణ వాక్యములతో "ఓరీ దురాత్మా, ఆవస్తువు నీయదికాదు, నాదిరా. ప్రాణము కాచుకొనుము" అని యగ్రుడై పరుగెత్తుకొని వచ్చుచుండెను. వేంకటేశ్వరావా సంజవేళగోడదూకి కాలికి బుద్ధిచెప్పెను. కలతచెందిన అన్నపూర్ణ నేల పడి మూర్ఛిల్లెను. కామేశ్వరావు తన దురవస్తను నిందించుకొనుచు, భాగ్యవంతురాలగు పిల్లను పెండ్లిచేసికొనిన ఫలితమునకు తన్నుదాను దూరుచు నేమియుతోచక నేలపడియెను. ఇంతలో తెలివితెచ్చుకొనిన అన్నపూర్ణ భర్త పాదములపైబడి "నన్ను క్షమింపుడు. లేనియెడల నిదుగో నాప్రాణములను తీసికొనెదను" అని యెలుగెత్తి యరచి వెక్కి వెక్కి యేడువసాగెను. చింతనిప్పులు వెలుగ్రక్కుచున్న కామేశ్వరావు నయనము లంతలో మారి నేత్రములనుండి యశ్రుబిందువులురాల "సరే క్షమించితిని" యని హీనస్వరమున పలికెను. అనాటినుండి సంసారముపై

నంతగా ప్రేమలేదు. తన ఆశాలత నశించినదని, తన ప్రణయకుసుమము వాడినదని తన జీవితము వృథయైనదని యనుకొనియెను.

5

భాగ్యవంతుల పిల్ల కష్టపడజాలదని కామేశ్వరావు వంటమనిషిని కుదర్చెను. కాని యా వంటిమనిషి వారమురోజులు సెలవుగైకొని స్వగ్రామమునకు బోయినది. ఆరోజుననే కామేశ్వరావు అత్తగారు కూతురును చూచుటకు వచ్చెను. వంట గదిలో చెమటలు గ్రక్కుచున్న అన్నపూర్ణనుగాంచి, భార్యకావలెనంటే పిల్ల నిచ్చాము. కాని వంటచేయుటకు పిల్లనీయలేదనియు పొయ్యిదగ్గర కూర్చుండుట వలన తన కుమార్తెయారోగ్యము చెడుచున్నదనియు నేమేమో అల్లునిపై నిందా రోపణలుచేయుచు నింటిమీద పెంకులులేచునట్లు యరచుచుండెను. ఆరుగంటల సేపు కచేరిలో కొట్టుకొని కొట్టుకొని కామేశ్వరావింటికేతెంచి అత్తగారి క్రోధానలమునుగాంచి తలపంకించి యూరకొనెను. రోజును యెదురువచ్చి ఆహ్వాన మొసంగెడి అన్నపూర్ణ నాడు తల్లి యొడిలో కూర్చున్నది. కామేశ్వరావు దుస్తు లను తీసివేసి విసనకర్రతో విసరుకొనుచు నొకమూలకూర్చుండెను. జఠరాగ్ని రగుల్కొని వేదించుచున్నది. తినుటకేమైన సిద్ధముగనుంచెడి అన్నపూర్ణ నాడు నోట్లో బెల్లము కొట్టినట్లు యూరక మొద్దువలెకూర్చున్నది. తల్లిని చూచుసరికి పిల్లలోందెడు మంకుతనముకు మేరలేదు. అన్నపూర్ణ యిట్లుసంచరించునని కామేశ్వ రావొకనాడును యనుకొనలేదు. భోజనమువేళకు అత్తగారు వడ్డించ నాలుగు మెతుకులు తిన బయటకు వెడలెను. రాత్రియైనది. గదిలో కామేశ్వరావొకడు దగ్గుచు, ఆవలించుచు, తుమ్ముచు పరుండెను. ప్రతిరాత్రి తనను మృదుమధుర వాక్కుల నోలలార్చెడి తన ప్రియురాలు, "తనయొద్దనే పరుండవలెనని" అత్త గారు శాసించెను. తెల్లవారినది. తన కుమార్తెకు వంట్లోబాగుండలేదనియు, కొన్ని దినములుంచుకొని పంపెదననియు అల్లుని యడిగినది. ఎన్నడును నిరాకరింపని కామేశ్వరావానాడు స్పష్టముగ వంపనని ఆఫీసుకుపోయెను. సాయంకాలమింటికి వచ్చుసరికి, యింటియెదుట బండినిలచెను. ఇంటికెవరు వచ్చిరాయని కామేశ్వరావు యోచించుకొనుచు లోనికిబోయెను. ఇంతలో నన్నపూర్ణవచ్చి "ఏమండోయి మా అమ్మ బలవంతపెట్టుచున్నది. కొద్ది దినములలో తిరిగివచ్చెదను. ఈ మాటు అడ్డుచెప్పవలదు. నన్ను పంపనంటే అమ్మకు కష్టముగ ఉంటుంది. నాన్నకు కోపము వస్తుంది. ఇంతకుమాఅమ్మ పిచ్చది." కామేశ్వరావు ప్రత్యుత్తరమీయక పూర్వమే అన్నపూర్ణ తటాలున బండియెక్కి వెళ్ళిపోయెను. కామేశ్వరావు తెల్లపోయి

చూచుచుండెను. "స్త్రీని, కుక్కను, గొరడాతో నెంతకొట్టిననంత మంచిదని ఎన్నడు ననుకొనని కామేశ్వరావిపా నా డనుకొనెను.

6

ఒకనాడు కామేశ్వరావు న్యూస్ పేపరు చదువుకొనుచుండగా పోస్టు జవా నొక జాబును చేతనుంచి, చేయిజాపెను. కామేశ్వరావాతని చేతిలో నొక రూపా యను వేసెను. పోస్టుజవాను వేయిరెట్లుగ సంతసించుచు వెడలిపోయెను. కామేశ్వ రావు జాబు నామూలాగ్రముగ చదివి నిర్విణ్ణుడయ్యెను. ఆ జాబు నందలి సారాంశము లివ్వి.

ప్రియోత్తమా,

అక్కడనుంచి వచ్చినతరువాత ఏమీ తోచటంలేదు. మన మిద్దరము సుఖ ముగ గడిపిన పదిహేనురోజులు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. మీరు తప్పకుండ వేసవిలో నిచటకు రావలెను. మన మిరువురము ఏయూరైన వెళ్ళి సుఖముగనుండుటకు వీలులేదా. ఏలాగైన వీలుచేసికొని తప్పక రావలెను. తరువాత సంగతుల నాలోచింప వచ్చును.

ఇట్లు ప్రియసఖి,
అన్నపూర్ణ.

శ్రీ వేంకటేశ్వరావుగారికి
రవానా యేలూరు.

తిరిగి అన్నపూర్ణ తననిట్లు మోసగించునని కలనైన ననుకొననందున, వెంటనే కాగితమును కలమును పుచ్చుకొని "విశ్వాసము లేక, అవిధేయతతో సంచరించు నన్నపూర్ణను భరింపలేను. కావున పంపకుడు" అని మామగారిపేర జాబువ్రాసి పోస్టులోవేసెను. మామగారు అల్లుని జాబుచదువుకొని చేయునదిలేక విచారగ్రస్తు డయ్యెను.

7

కొన్ని సంవత్సరములు గడచినవి. మానవుడు కాలమునకు దాసుడుగాక తప్పదు. విధాతృనిర్ణయమును అన్నపూర్ణ కామేశ్వరావులు భరించుచుండిరి. ఏళ్ళుగడచినవి. ప్రపంచమున పుట్టుచునే యున్నారు. చచ్చుచునేయున్నారు. అనేక మార్పులు గలిగినవి. ప్రపంచము మారుమారగుచున్నది. కాని అన్నపూర్ణ కామేశ్వ రావు లెవరికివారే కాంతవాసము చేయుచు కాలము గడుపుచున్నారు. ఒకనాడు అన్నపూర్ణ యేకాంతముగ నిట్లాలోచించుకొనుచుండెను. "తెలివిమాలిన నన్ను

యేనాడు నానాథుడు పరిత్యజించెనో ఆనాడే జీవితసౌఖ్యము ముగిసినది. ఒకవైపున నా వదెనగారు నన్నుచూచి సహించలేక అన్నగారితో కొండెములు చెప్పుటయు, ఆమె చేతులలో కీలుబొమ్మయైన నాసోదరుడామెను వెనుకవైచుకొని వచ్చుటయు సహించుట దుర్భరమగుచున్నది. నావదెనగారు నన్ననరాని మాట లనుచున్నది, నేనేమో తనపై నధికారము చలాయించ ప్రయత్నించుచున్నట్లూహించి "ఇంత లాడీ, మగనిచే వదలిపెట్టబడిన నీ వా నామీద అధికారము చేయునది" అని తిట్టినది. మగడు తిట్టిన మాధవకరపువాడు తిట్టినట్లున్నది. చెడి సోదరుని పంచలో పడియుండుటకంటె ఉరితీసికొని మరణించుట మేలు. ఈరాత్రియే యెచటకైనను బోయి ముష్టియెత్తుకొని జీవనముచేయుదును. అని అనుకొని యారాత్రియే వెడలి పోయెను. కొందరు అన్నపూర్ణ చనిపోయినదనియు, కొందరు వేరొకనిని తీసికొని యెచటికో పోయినదనియు యనుకొనుచుండిరి. నిజము దైవమునకే యెరుక.

8

కృష్ణపుష్కరములత్యంత కోలాహలముతో జరుగుచున్నవి. పుష్కర దినములు మహాపర్వాడి దినములు పండ్రెండు సంవత్సరముల కొక పర్యాయము. ఈ తీర్థసమయమున పితరులకు పిండప్రదానము. అపుడపుడా యారాష్ట్రముల వారొకరితోకూడి అన్యోన్యకష్ట సుఖముల చర్చించుకొనుటకిదియే తగినసమయము. వర్ణ వివక్షతలేక, బీదలు, ధనికులు, పిన్నలు, పెద్దలు, ధార్మికులు, ధర్మనిర్వాహణాదక్షులు భగవద్భక్తులే తెంచిరి. సాంఘికజీవనమునందు స్వల్పమాత్రపు భేదము లుండినను భగవదారాధనయం దొకరికొకరికి లేశమాత్రమయిన భేదము లేదు గనుకనే అన్ని తరగతులవారును చేరిరి.

పుష్కరమనుటతోడనే కలరాభయము. ఒకమూల కలరా, ఒకవైపున పిల్లలు తప్పిపోవుట, మరియొకవైపున ప్రయాణపుసదుపాయములు లేకపోవుట. పైగా ఎక్కడచూచినా యెర్రపాగాలే పోలీసువాండ్రే. అటు మద్రాసు మొదలు ఇటుగంజాం నుంచికూడా వచ్చారు. పోలీసువా ళ్ళున్నంతమంది యాత్రికులుకూడ లేరేమో యని యనిపించినది. ఇందరనుమించినంతమంది ముష్టివాండ్రు. పోలీసువారు లాంతరుస్తంభములవలె నిలచుందురు కాని తప్పినపిల్లలను సంరక్షించుటలేదు తెలియని వారికి దారిచూపుటలేదు. దొంగలను పట్టియిచ్చుటలేదు. కాఫీహోటల్లు మాత్రము చాల వెలసినవి. మీసంగొరిగితే పావలా గడ్డంగొరిగితే రెండణాలు. ఇవి మంగలి రేట్లు.

శివానందయోగి యొకపర్ణశాలలో నివాసము చేయుచుండెను. వచ్చిన

వేలకొలదియాత్రికులు శివానందయోగి దర్శనము చేసికొని యాతని దీవనలబడసి శెలవుపుచ్చుకొని పోవుచుండిరి. మనయోగికి షుమారు డెబ్బదిసంవత్సరములు. ఆతనికి పరిచర్యచేయుచు షుమా రరువదియేండ్ల స్త్రీయొకర్తు యుండెను. ఆమె విధవయు కాదు, పునిస్త్రీ లక్షణములు కన్పట్టుటలేదు.

ఒకనాడు ఆకాశమున కారుమబ్బులు క్రమ్ముకొనియున్నవి. జగత్ప్రళయమును సూచించు కుంభవర్షము గురియుచున్నది. మన శివానందస్వామి కాకస్మికముగ జబ్బుచేసి మరణవేదన నొందుచున్నాడు. అట్టి భీభత్ససమయమున సయితమాతని వదనమున నిర్మలానందము పొడసూపుచున్నది. సపర్యచేయుచున్న స్త్రీ "యోగివర్యా యెపుడో నిజమునంతయు చెప్పెదునని కాలయాపనము చేయుచుంటిరి. ఇపుడైన నాయందనుగ్రహించి నన్ను కృతార్థురాలను చేయ వేడెద"ననెను.

యోగి:— ఓ వనితా ఒకవ్వడు నీవుచూపిన యవ్యక్తతకు తగిన పశ్చాత్తాపమును చూపితివి. తప్పక నీభర్త నిన్ను మన్నించగలడు.

స్త్రీ:- తప్పక మన్నించునా? దర్శనభాగ్యము లభించనప్పటికిని నన్ను మన్నించిన చాలును.

యోగి:- దర్శనమేల కలుగకూడదు?

స్త్రీ:- ఈ నిర్భాగ్యురాలికంత యదృష్టముకూడనా.

ఇంతలో యోగి కాయాసము హెచ్చుచుండెను. బ్రతుకు నాసకన్పించుటలేదు. కొనయూపిరితోనున్న శివానందుడు కన్నీరుగార్చుచు " నాకు కాలము ముగిసినది. పోవుచున్నాను. ఓవనితా, నిన్నుక్షమించితిని. నీవునన్ను పోల్చుకొననప్పటికిని నేను నిన్నెరిగియేయున్నాను. సంసారమను కూపమునందు బడక, భగవత్సేవయందు కాలము గడిపిన యీశివానందుడే యా కా...మే...శ్వ...రా...వు" అని ప్రాణముల బాసెను. అంతట 'నా స్త్రీయు "...హా...నాథా..." అనుచు నాశవముపైబడియెను. బ్రతికియున్నంతకాల మెడబాటు చెందినను, ఆయువసాన సమయముననైనను మన అన్నపూర్ణ కామేశ్వరావు లేక శయ్యపై నసువులు బాసిరి. ఈశ్వరుని లీల లనంతములు.








### శ్రద్ధ.

“ నేచేసేపని అంటే మీకు శ్రద్ధలేనేలేదు. ”

“ లేకేమి. రాత్రికూర యేలాగున చేశావాయని రాత్రి తెల్లవార్లు ఆలోచిస్తూనే యున్నాను ”

### శాకుంతల.

స్కూళ్ళఇన్స్పెక్టరు :— ఒరే శాకుంతలనాటకము యెవరువ్రాసారురా.

బాలుడు:— నేను వ్రాయలేదండి.

సాయంకాలము షికారువెళ్లుచు ఇన్స్పెక్టరీయుదంతమును అనుచరులకు చెప్పెను. అందులో నొకడు ఆశ్చర్యముతో “ ఓరీశుంఠా, ఇంతవరకు వీడేవ్రాసాడనుకుంటున్నాను ” అన్నాడు. అందరు ఫక్కుననవ్వారు.

### దొంగతనము.

ఒకన్యాయవాది ఆవేశముతో అస్సెస్సర్లను చూచి తనక్లయింటుఅగు దొంగపక్షమున నిట్లు వాదింపదొడంగెను. “ మహాశయులారా. ఆకలిబాధచే నాక్లయింటు యీచిన్నమొత్తము తీసికొన్నాడు, తనకు తనపిల్లలకు తిండిగుడ్డ సంపాదించుటకు మాత్రమే యీ పనిచేశాడు. ఇంకా కావలెనంటె ఒక నిదర్శనము చూడండి. ఈ చిన్నమొత్తము తీసిన జేబులోనే ఒక పాకెట్ బుక్కు ఉన్నది. ఆపాకెట్ బుక్కులో అయిదువందల రూపాయల నోట్లున్నవి. అవితీసికొనేలేదు. ”

ఖైదీయేడ్చుచుండెను

జడ్జి :— ఎందుకుయేడ్చుచున్నావు.

దొంగ :— ఆపాకెట్టుబుక్కులోనోట్లు చూడలేదే అని విచారిస్తున్నాను.

### టైము.

“ టైము ఎంతయింది? ”

“ పన్నెండు. ”

“ ఛ. అంతకంటె ఎక్కువైందనుకున్నాను. ”

“ అంతకంటె యెక్కువకాదండీ యెప్పుడూను. పన్నెండయినతరవాత ఒంటిగంట ప్రారంభమవుతుందండి. ”

### మోటారు.

“ నామోటారు కదలుటకు రెండే ఆటంకములున్నవి. ”

“ ఏమిటవి ”

“ ఎత్తోస్తేగాని కదలదు. కదిలితే పదిగజములైనాపోదు. ”

తరచు.

జడ్జి :— నీవు తరచుగ విచారణకు వచ్చుచున్నావు. బుద్ధివచ్చేటట్లు శిక్షించాలి.

దొంగ :— అంత ఆగ్రహించకండిస్వామి. పద్దెనిమిది మాసాలకు యీ పూటనే బయటకు విడుదలైనాను.

పరీక్షలు.

పరీక్షలు రేపనగా ఒక ప్రొఫెసరుగారు విద్యార్థులకిట్లుచెప్పిరి.

"బహుశా పరీక్షపేపర్లు అచ్చుఅవుతుంటవి. మీకేమైన అనుమానములుంటెఅడగండి".

ఒక విద్యార్థి :— అచ్చువేసేదెవరండి ?

ఎన్నిపర్యాయములు.

యజమానురాలు :— ఏదైన గ్లాసు పగులకొడితే వెంటనేవచ్చి నాతోచెప్పు ?

సేవకురాలు :— అలాగే. కాని రోజుకెన్నిపర్యాయములు పరుగెత్తుకొనిరాగలను ?

వేలంపాట.

ఒకవేలంపాట పాడువాడు ఒక బెత్తమును "పదణాలు ఒకటోసారి, రెండోసారి, మూ" అనెను. కొంతతడవైనపిమ్మట "పన్నెండణాలు, ఒకటోసారి రెండోసారి, మూ..." అనెను. చూచుచున్నవారిలో నొకడు "అయ్యా, మీఅంతట మీరు పాట హెచ్చుచేయుచున్నారే" అనెను. పాటపాడువాడు "అయ్యా నేనేమిచేస్తాను. ఇద్దరుపాటదారులు కమీషనుయిస్తాము ఏలాగైన బెత్తం మాపేరకొట్టివేయించమన్నారు. ఇద్దరిలో నెవరిపేరకొట్టివేయించనలెనో తెలియకున్నది. అందువలన పాట నాఅంతటనేనే పెంచుచున్నాను" అని బదులుచెప్పెను.

తమాషా.

ఒక కాలువవడ్డున ఒక కుఱ్ఱవాడు యేడ్చుచుండెను. ఆదారిని పోవుచున్న పోలీసువాడొకడు "బాలునివంకచూచి "యెందుకేడ్చుచున్నావ" నెను. నీళ్లలోనున్న టోపీని చూపించి యేడ్చుచు "మాఅన్న......" అనెను. అంతట పోలీసువాడు ధైర్యముతో నీళ్లలోయీది టోపీనిమాత్రమే తెచ్చి "టోపీమాత్రమే దొరికినది. మీఅన్న కనబడలేదు. పడేముందు యెక్కడనిలచున్నాడు" అనిఅడిగెను.

బాలుడు :— మాఅన్న నీటిలో పడలేదు. అదుగో అక్కడున్నాడు. నాఅన్న నాటోపి నీళ్లలో పడవేశాడని చెప్పపోవుచుండగనే నీళ్లలోదిగి టోపీతెచ్చావు. నేనేమిచేయను.

సిగరెట్లు.

"ఏరకంసిగరెట్లుకాలుస్తావు ?"

"నీదగ్గర యేరకంవుంటే ఆరకం."

ఆట.

ఉషా :— ఒరే. ఆబొమ్మచూడు. ఎంతచక్కగవ్రాశారో. ఆబొమ్మచూస్తే, నిజముగ అట్లే ఉందాఅనిపిస్తూంది.

బాలుడు :— అవునండీ ! అవునండీ !! నిజముగ యుద్ధభూమిలాగే ఉన్నది.

ఉషా :— ఓరి నీదుంపతెగ, అదియుద్ధభూమి కాదురా. పండ్లగంప.

## దొంగలు.

"రాత్రి మాయింట్లో దొంగలుపడ్డారు. 52 వస్తువులు పోయినవి."

"అయ్యో, 53 వస్తువులే."

"చిత్తము 52 చీట్లపేక ముక్కలూను, ఒక ఓటజాలుతీసే(సూ)ట్కేసూ."

## వ్యవధి.

జడ్జి :— ఏమిచెప్పుకుంటావిప్పుడు.

దొంగ :— మీరు వ్యవధియిస్తే చాలాచెప్పుకుంటాను.

జడ్జి :— నిజము, చాలవ్యవధియిస్తున్నాను తీసికో. ఆరు నెలలు.

## పరిచయము.

జడ్జి :— నీముఖము నాకెచటనో పరిచయముగనున్నదే.

ఖైదీ :— చిత్తము మనము చిన్నతనములో సమానముగా పెరిగాము.

జడ్జి :— ఛ.

ఖైదీ :— కాదండీ. నిజమే. మీకు 53 యేండ్లు నాకుగూడనంతే.

## తపాలాఫీసు.

వెంకమ్మ :— పోస్టాఫీసువాళ్లకి బుద్ధిపోతోందమ్మా.

పుల్లమ్మ — ఏం.

వెంకమ్మ :— మాఆయన రంగంవెళ్లి అడ్రెస్ వ్రాసారు. ఆఅడ్రెస్ మీద పోస్టాఫీసువాళ్లు ముద్రవేశారు.

## వాగుడు.

"ఎంతదూరము వెళ్లుచున్నారు."

"బెజవాడవరకేనండీ"

"నేనో దివాలకంపెనీకి యేజంటుని. 46 యేండ్ల వయస్సు నాకు పెండ్లయింది. నాపేరు వెంకయ్య. నాకు పందొమ్మిదేండ్ల కొడుకున్నాడు. బందరులో వ్యాపారముచేయుచున్నాడు. నాకో మేనకోడలున్నది. చక్కగాఉంటుంది. దానిపేరు వెంకమ్మ. ఇంకామీకేమైన కావాలా?"

"అయితే, మీరుపుట్టినపుడు మీనోట్లో యేమిపోసారు?"

## ప్రమోషను.

సేవకుడు :— అయ్యా, పెండ్లిచేసికుంటాను. జీతం ప్రమోషను చేయాలి.

యజమాని :— ఆలాగేచేసెదను.

కొంతకాలమైనపిమ్మట యజమాని యిట్లడిగెను. " ప్రమోషను యిస్తే పెండ్లిచేసుకుంటానన్నావు. చేసికున్నావా?"

"లేదు."

"ఎందుచేత"

"ఆలాచెప్పకపోతే ప్రమోషను యివ్వరని నాకుతెలుసు."

# యశోవిహారము.

[ నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి శాస్త్రిగారు. ]

మ॥ 'కలలోవార్త' యిదాలకించి కవితా ◆ కల్పద్రుమం బెక్కు కో।
వెలలంగీర్తి వనాంతరామల సరః ◆ పీయూష సంతన్యమా।
నల సత్పల్లవవల్లరీనిచయ సం ◆ చారంబునం జేరఁగాఁ।
గలకంఠంబున దక్షిణాస్య! యనురా ◆ గంబొప్పఁ బాడింపుమీ॥ 1

మ॥ కనుమూయ న్వినుహోధినుండి తొలిరా ◆ గంబెత్తి వల్మీకనం।
దన విఖ్యాతపికంబు రామకథనా ◆ నందంబు నూరింపఁ జి।
వ్వన వాగ్రిత న్మనవ్యాసకోకిలము న ◆ వ్యోత్సాహమేపారఁ బ్రా।
క్తన గాథామృత సారసంకలిత వే ◆ దాంతార్థముం బాడుచున్॥ 2

మ॥ కకుబంతస్ఫురితి గమ్యగానమది కాఁ ◆ గానందునా కల్పశా।
ఖిక పైన న్యవనప్రియాళిదయ సం ◆ గీతంబు లీనంబు దృ।
శ్యకలాస్థాపక భిన్నరూప కవిరా ◆ జద్భాస సౌమిల్లకా।
దికము ల్బ్నాతనవక్కిఁ జూపుదనుక, న్దేజంబున న్శోభిలన్॥

మ॥ చనుదెంచె న్మిత్రులిట్లుగొల్పు నిజతే ◆ జస్సార మేపార డి।
గ్గ నభోమండల మండనంబో యనుభం ◆ గి న్మేఘు సందేశముం।
గొనుచు న్మించు శకుంతలాస్య మృదుసూ ◆ క్తు ల్కాళిదాసాభ్రిగం।
బు నుతింపంగ సదాళికానిరుపమం ◆ బు లోనోపమానంబులున్

చ॥ ఘాఁబోరి సత్క్రియాకలస ◆ భోజసమాఖ్యము రాజకీర మ।
బ్బురముగ వచ్చె దండిభవ ◆ భూతిముఖ్యాసుగ కోకిలాళియు।
పరమ కలార్ధ గౌరవస ◆ భారవి భారవి మాఘహర్ష స।
త్పర భృతలోకగణ్యములు ◆ పాడఁదొడంగె ననేకమన్యముల్॥

క॥ ఆవనము ధరాతలమునఁ। బావనము సుపర్వవాక్య ◆ భాసురగంగా।
జీవనములు ప్రవహించెడి। తావన మురళీ నినాద ◆ తన్మయతఁదగన్॥

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వలల ◆ సత్తగ తారకహారపంక్తులం।
జారుతరంబుగా సలరె ◆ శ్రావ్యతమాదిమ మిశ్రగాన శృం।
గార సభావనాంతర వి ◆ కస్వర సుస్వర భాస్వర ప్రియో।
దార పటీర సౌరభ సు ◆ ధారసధారల భారతంబిలన్

చ॥ కలకలలాడు తుంబికని ◆ కాయువుం గూజితము ల్కొలంపల ।
స్ఖలసిల నల్లిబిల్లిగ న ◆ పేనగపేన పదప్రసూన పం ।
క్తులం దులదేనెసోనలుగం ◆ గూర్పంగ దిక్కనం దిక్కనాఖ్యం గుం ।
డలముల కెంపుకంటి పత్రిక ◆ టుస్ఫుట రాగ నటత్ప్రికాతతన్ ॥ 8
చ॥ వినవిన నింపు పెంపెసంగ ◆ ఏపులసొంపు దలిర్పం జేయు నెం ।
జ్జిన చిగురాకు దిండియుం ది ◆ రంబుగ జేరెను నన్నపార్య స ।
జ్జను జనులాదరంబు మెయి ◆ సాకుకు ప్రుల్గుల మేటినాంగ సొ ।
మన చరితంబు భాస్కర స ◆ మాహ్వయుముం దులతూగం సాంగిరన్ ॥ 9
ఉ॥ వేలముంజొచ్చె మోక్షపద ◆ పీలమకాటవి కాంతకంద కా ।
ద్దాలము జీర్ణచేలము సు ◆ ధాలలితాచ్యుత పాదలోల వా ।
చాలము సాధుశీలము వి ◆ శాలము దావహపద్యజాలము ।
త్తాల ముకుందబాలక క ◆ థాలసితాఢ్య రసాలవాలమై ॥ 10
ఉ॥ బమ్మెరపోవ రత్నవిభ ◆ వమ్ములతోం జతురంతయాన మా ।
ర్గమ్మున భర్మపాత్రిల సు ◆ ఖమ్ముగ మెక్కెడి పక్కితేండు టం ।
కమ్ములం దీర్థమాడ దిగం ◆ గమ్మనితాపిని జిమ్మి కీవి నా ।
డెమ్మగు నైషధంబుం గొని ◆ డిండిమభట్టు మహాట్టహాసమై॥
ఉ॥ ఆయెడ నేగుదెంచెం ద్రిద ◆ శాలయ నాయక సన్నిభంబు వ ।
జ్రాయుధపాణి రత్నకవ ◆ చద్యుతి మీఱి నిభాధిరూఢ భ ।
ద్రాయితమూర్తి కృష్ణకవి ◆ రాజశిరోమణి గేయ విష్ణుచి ।
త్తీయముతోం బితామహ కృ ◆ తి న్సుకృతింగొని పెద్దనాఖ్యముఙ్॥ 12
మ॥ అలుక ల్మాన్పెడి ముద్దుపల్కులను వ్యం ◆ గ్యంబైన మర్యాదతోం ।
బలుక న్నేర్చిన పారిజాతకృతియు ◆ న్బాషామనీషా ధృతి ।
న్వాలయ నాగ్రిషువపాండవీయమును బృ ◆ థ్విన్గూర్చ సూరన్న న్నే ।
షల దిట్టానలబట్టు దిట్టుకవి కృ ◆ ష్ణాఖ్యాక మే తేరంగఙ్॥ 13
ఉ॥ గౌరన శంకరుల్సుకృతి ◆ కారు లుదారులు సత్యబోధకుల్ ।
చేరిరి చేమకూరకవి ◆ శేఖరముఖ్యులు తిమ్మనాఖ్యము ।
న్పేరుల కేమి యప్పకవి ◆ పేర్కొనినారలు కానివారలుం ।
గాఱును బట్టి మాఱుచు వి ◆ కారులుమాత్రముకాని వీరలై॥ 14
క॥ అచ్చోటుచేరం దీఱు । వియచ్చర వరపాళిం గేళి ◆ యుసమానందం ।
బిచ్చుచు మచ్చికం దెచ్చుచు । విచ్చలవిడి గాకయుండ ◆ వీక్షింపంగాఙ్॥ 15

క॥ వేసమ్మునదోషాకర। దాసింగొని కామరూప ♦ ధారిణివై సో।
త్సాహసమ్ముగఁ గాకవులకు। నాసేతు హిమాచలంబు ♦ నయఁ జరించున్॥ 16
మ॥ వికచాబ్జేక్షణ యంతరిక్ష గమనో ♦ ద్వేగైక విఖ్యాత పు।
ష్పకపీఠంబునఁ గాంతవై గివిక యం ♦ స్సంకల్పుల న్లాఁగఁగాఁ।
సుకవుల్లాసిలఁ గాళులొ త్తిపడఁగ ♦ న్గోదావరీప్రాంత నూ।
త్నకవిశ్రేష్ఠులఁ జేర్చికొఁ జని మరు ♦ న్మార్గంబునం దొప్పఁగన్॥ 17
క॥ కొండంతకవినిగద వే। కొండంచును ముందుపోయి ♦ కొండాడ న్గొ।
క్కొండ గ్రంథనమియునొ। క్కొండంత నిలుండనుటయు ♦ గుండెలవియఁగన్॥ 18
ఉ॥ స్వైరవిహారధీరవు వి ♦ చారణసేయవె క్రొత్తక్రొత్తబం।
గారము నిండియున్నగలు ♦ గాఁ గొని తియ్యనిపానకంబు నా।
హారముగాఁగఁ దెచ్చితి న ♦ యారె యొయారపు టంచయాన నాఁ।
గారహినంద దయ్యెనని ♦ కానఁగఁబోయెను బిల్వనాయకున్॥ 19
ఉ॥ లింగము రాలఁగొట్టికొని ♦ లింగమనంచొక మంగమాంబి కా।
లింగన సంగమాడల చె ♦ లింగని సంఘము సంస్కరించు నో।
లింగని నన్వరించుఁ కవి ♦ లింగని జూచు మీదేయటంచు నా।
లింగనినట్లు వోముదు స ♦ లింగని సంగ మొసంగ కుండిసన్॥ 20
ఉ॥ రావుబహద్దర న్విరుద ♦ రాజము నానది యర్థహీన మం।
చేవనుజూప సంపుటము ♦ లీయఁ దొడంగిన నొక్కటొక్క టే।
లావిడకుండినం దుదకుఁ ♦ దప్పకవచ్చెను బ్రొక్కివి ద్యశ।
శ్శ్రీవిభవాభివర్ణనము ♦ చేసిన కబ్బమునంది చేర్చికొన్॥ 21
చ॥ దివిజ కవీంద్రు గుండియలు ♦ దిగ్గురన న్విజయాభిలాషనై।
నవకవితావధాన రచ ♦ నస్థిర బుద్ధి విశారదుండు ధా।
త్రివిడిచి వచ్చెనా న్దిరు ప ♦ తి న్సుగతిం గని యాదరించి పాం।
డవ విజయంబు నందికొని ♦ డాయఁగ రాఁ గనె స్వాగతం బిడన్॥ 22
శా॥ శ్రీకృష్ణాగమ పంచమంబు పురుష ♦ శ్రేష్ఠ ప్రబంధాంధ్ర వా।
ల్మీకీయ శ్రవణప్రియాదికృతి పా ♦ ళి న్భక్తచింతామణిం।
జేకొంచు న్ప్రియమారవించు నవ కా ♦ శీ వేణుగానంబు నా।
లోకింపంగఁ గ్రమక్రమంబుగఁ గనె ♦ న్లోకంబు చీకాకుగాన్॥ 23
చ॥ నవలలు నాటకా ల్ప్రహస ♦ నంబులు తుంటరి హాస్యపుస్తకా।
లవి యివి గొంచువచ్చెడి ; మ ♦ హాకవు ' లామడదూరమందు భా।

వ విరచనంబుల న్వేడఁగ ♦ పాటల రాగడుఁగాఁగఁబాడ గా |
మ్య విముఖమై చనె న్నిజ వి ♦ హారవనాంతరసీమఁ జేరఁగన్ ॥ 24

చ॥ ధరణిని డించిపోవ నల ♦ దాసి విజృంభణ మేమిచెప్పఁ గా |
ప్పరముగఁ గొప్పరమ్ముల ని ♦ వాసమునప్పుడు దేశదేశము |
త్తిరుగఁగఁ జొచ్చె నాశుగతి ♦ దేజెలుగాంచి సెబాసునాఁగ వా |
గురులగు పండితోత్తముల ♦ కుం దలనొప్పగ గొప్పచెప్పికోన్ ॥ 25

చ॥ అరిగెను బాదము ల్దడిఁగ ♦ నాకృతియొంపటి పొందికెల్ల స |
త్వర గమనంబడంగెఁ బటు ♦ తం జెడె సంధులువీడెఁ బ్రాగలం |
కరణముఁబాడిపోయెఁ జను ♦ కట్టుబిగూల్పడెఁ జీరెసారె, వే |
సరి యలమోడ్పు చూడ్కులను ♦ శారద మోమున నావహింపగన్ ॥ 26

ఉ॥ సంకరనాయక ప్రజవ ♦ శంకరమై కర మైచ్ఛికంబుగా |
జంకును గొంకు లేకెసఁగు ♦ సాహితిఁ బశ్చిమబుద్ధి దోఁపఁగా |
వంకరటింకరా గతులఁ ♦ బాడఁగఁ దోడఁ జరింపసాగెఁ దా |
నెంకికిఁ దోడఁబుట్టువని ♦ యెంచఁగ నాంధ్రవిహార సీమలన్ ॥ 27

ఉ॥ సారవచోవిచారులు వి ♦ శాల యశశ్శరదిందు చంద్రికా |
సారులు నన్నయాది కవి ♦ చంద్రము లతీంద్రియు లస్తమింప ని |
స్సారవచః ప్రచారుల య ♦ శస్సితదూపులు పిక్కటిల్ల దు |
స్సారులు క్రమ్మఁజీఁకటులు ♦ చుక్కలు వెల్గిన నక్కడక్కడన్ ॥ 28

ఉ॥ కాలము కేగతి న్జరుగఁ ♦ గాఁదగదాటను మార్పు లేర్పడు |
న్జాలున నేగు చక్రమిల ♦ సాగిన చోటికె చేరుచుండు నా |
లీలఁ గ్రమక్రమంబుగను ♦ లేచుచు డిగ్గుచు భాషలన్నిటం |
గ్రాలుచునుండ సత్కవులు ♦ రాజిలుచుండ్రి యశోవిహారులై ॥ 29

మ॥ కలము న్గాంచినదాది గాఁగఁ గవితా ♦ కన్యానుభోగార్థులై |
కలముంబట్టి త్రిలింగభూమిని యశః ♦ కాయమ్ముఁ ల్దాల్పఁగా |
కలమున్నింపఁగఁ జాలివారలను ద ♦ త్కాంతావనప్రాంతమా |
కలము న్మేయ విశృంఖలంబుగను డా ♦ యంబోవ సేవించెదన్ ॥ 30



# కవితావిజృంభణము

శర్వా వెంకటసూర్యనారాయణగారు బి.ఎ.,బి.యల్.

## సమరోద్యోగప్రకరణము.

ఊరుకుంటే పోయెరా ఉయ్యాల్యారుతగాదా అన్నట్లు దీనికింత గందరగోళం లేకపోయేదే. దేశంలోఉన్న పండితులంతా అభిమానించారు. పెద్దపెద్దవారంతా కవిత్వానికి కుక్కమూతిపిందెలు పుట్టాయి. ఇంక మనం ఊరుకుంటే లాభంలేదు అని యుద్ధానికి బయలుదేరారు. అన్నమాట చెల్లించుకోవాలి. కవిత్వాన్ని ఉద్ధరించాలి. పాతకవిత్వాలు అణగగొట్టేశెయ్యాలి అని రెండోపక్షంవారు ఉత్తరకుమారప్రజ్ఞలు పలికారు.

పంచాగ్నులు ప్రజ్వరిల్లి భగ్గున మండాయి. పూర్వం సీతామ్మవారిపాతివ్రత్యంనిరూపించాము ఇప్పుడు ఎంకీమహాసాధ్వియొక్క పాతివ్రత్యం నిరూపిస్తామని ప్రగల్భాలు పలికినాయి. పట్టిపట్టి చప్పనికబుర్లు చెప్పం శాస్త్రప్రమాణాలు చూపిస్తామన్నాయి. పూర్వపక్షసిద్ధాంతాలు దేశమంతా మారుమోగిపోయినాయి. ఉభయపక్షాలవారు వారివారిబలాలు సన్నాహంచేశారు. ఎందుకయ్యా యీసన్నాహంఅంటే ఎవరుచెపుతారు ఎవరిమనస్సుకు వారికే తెలుస్తుంది వాస్తవం. విచారిస్తే వడ్లగింజలోనిదే బియ్యపుగింజ.

రామరావణసంగ్రామం అయిపోయింది భారతమహాయుద్ధం గడచిపోయింది దేవదానవసంగరం సమాప్తిచెందింది, ప్రాక్తనాధునాతన కవితామహాసమరం తటస్థించింది. పురాణాలు రాద్దామా నాటకాలు రాద్దామా ప్రబంధాలు రాద్దామా నవలలు రాద్దామా అని నోళ్ళుతెఱచుకుని ఉవ్విళ్ళూరుచున్నారు కవులు, పండితులు. అంతా వెనుక మనవిజేసినట్టుగా పత్రికలన్ని రెండవపక్షంవారికి సహాయం చేస్తామని వాగ్దానం చేయటంచేత మొదటిపక్షంవారి ఆక్షేపణలు సమాధానాలు ప్రచురించమని బెదరించేశినాయి. ఈ అన్యాయం ఎక్కడైనా ఉందా? గుంట్రాయిదాస్తే పెళ్ళి ఆగిపోతుందా? పత్రికలు బెదరించినమాత్రాన పండితులు మౌనం వహిస్తారా? యుద్ధాలు ఆగిపోతాయా? యీపత్రికలకు మాతామహులు పితామహులుబయలుదేరుతాయి.

## గాలిదుమారప్రకరణము.

సంగతిసమాచారాలు యీలావుండేసరికి బసవరాజువారింటిదగ్గిరనుంచి బ్రహ్మాండంగా గాలిదుమారం బయలుదేరింది. ముండో ముత్తయిదో దీనితో తేలుతుందిఅనుకున్నారు అందరు. పంచాగ్నులు యిదివరకే ప్రజ్వరిల్లినాయిగదా యీ అగ్నికి యీగాలి తోడైతే కొంప లంటుకుపోతాయి అనుకున్నారు. పాపం అనుకున్నంత అపకారం చేయలేకపోయింది గాలిదుమారం. ఎందుచేత? చేయదలచుకోలేదుగనుక, పాము చావకుండా బడితె విరగకుండా సమాధానం చెప్పాలనిచూచింది.

అంతకంటే? ఏంచేస్తుంది విడవమంటే పాముకుకోపం కరవమంటే కప్పకుకోపం అన్నట్లయింది నిర్ణ నవులుతూ గోడమీద పిల్లివాటంగా సమాధానంచెప్పటం ఎందుకయ్యాఅంటే ఆవేశంపుట్టినప్పుడు ఎవడికిశక్యం ఊరుకోటానికి? Much might be said on both sides అనేవృత్తాంతం జ్ఞాపకం వస్తుంది. అదిచదివేసరికి పంచాగ్నుల కనుకున్నంత ప్రోత్సాహం ఇవ్వలేదు. మహామహోపాధ్యాయుల వారిని మన్నించలేదు. నడుమ పానకంలో పుడకల్లాగ బయలుదేరిన సరసులను శాఘించలేదు, భావకవిత్వాల కృతికర్తల గీర్తించలేదు. పూర్వాచారపరాయణులైన వైదికకవుల వైభవాన్ని చాటించలేదు గాలిదుమారం

పురాణమిత్యేవనసాధుసర్వం నచాపికావ్యం నవమిత్యవద్యం అనేకాళిదాసుకవి శ్లోకార్థాన్ని గ్రహించి వ్యాఖ్యానాలు చేయటం ప్రారంభించిరి. వృత్తార్థాన్ని విడదీసిపెట్టేసింది. అందులో వుండేగుణాలు అందులో వున్నాయి ఇందులోవుండేగుణాలు యిందులో వున్నాయి అని అంతా ఆవాలముద్దచేసి పెట్టింది. అందులోనేవుంది చిదంబరరహస్యంయావత్తు. నాయికానాయికులు సంకరులా వృత్తములాఅని కొంతచర్చచేసింది. సంకరులనీ తేల్చలేదు వృత్తములనీ తేల్చలేదు. వున్నది వుండగా నాయికలిద్దరున్నారని లోకానికి తేటబుచ్చింది. అభినవరామలింగడివేషం వేసుకుని నాజూకులేదయా నండూరిసుబ్బయా అని హెచ్చరించింది. ఇంకొకవేషం. పాటల్లో సంగీతం వున్నదంది. పాటలు పాడేవాళ్ళల్లో సంగీతం వుంటుందో పాటల్లో సంగీతంవుంటుందో ఆలోచించండి. నిజంగా పాటల్లోనే సంగీతం వున్నదనుకుందాము. సంగీతమురానివాళ్ళను చదవమంటే కర్ణకఠోరంగాపాడతారు. నిమ్నజాతి సోదర సోదరీమణులు పాడేపాటలు విడిచిపెట్టి పెద్దపెద్ద విద్యార్థికులు వ్రాసేపాట లెందుకుగ్రహించాలి అనే ముఖ్యాంశాన్ని నిర్ణయించలేదు గాలిదుమారం. కొద్దిపాటి వానజల్లుకూడా వెంటబెట్టుకువచ్చింది గాలిదుమారం. దానిచేత అగ్నిహోత్రాలు కొంచెం చల్లారినట్టు కనపడ్డాయి. కానీ మళ్ళీ పడమటిగాలే శేటప్పటికి నిప్పురగులుకొంది.

పాపం పాటలగ్రంధకర్త కీపూర్వపక్షసిద్ధాంతాలు తెలియనే తెలియవు. అమాయకుడూ ధర్మరాజూ ఆయన; ఈ గాలిదుమారమంతా మధ్యవాళ్లు తెచ్చిపెట్టిందే.

# సరస్వతీ!

ఆవంత్స వెంకటరంగారావుగారు

ఉ॥ వీణను జేతఁబూని యలివేణిరో! చాలరసావహంబుగా
గానము సేసి యెల్లరను గమ్రసుఖాంబుధిలోనఁ దేల్పగా
బూనితి వెంతభాగ్యమొ ప్రమోదముతో భవదీయ నిర్మలా
నూన కృపారసంబది యనూహ్య మవంధ్య మపార మారయగా

# స్త్రీ శక్తి

అనటపల్లి హనుమంతరావుగారు

వ్యక్తి:- ఎట్టులనా? వినుము.

మ॥ తలిరుంబోఁడి మనోహరాంగముల సౌందర్యంబు వీక్షించుచున్
నలినాస్త్రానల దగ్ధుఁడై తనయు జ్ఞానంబెల్లఁ బోనాడి లో
కులు నవ్వంగ స్వకార్యదీక్షయును గాకుం జేయు ధీరోద్ధతున్
బలుకం జెల్లదె పాపియంచు? గపటవ్యాపార పారంగతా॥

వీర:- ఏమి! పురుషులను గాంచి మోహించి నీవిటకువచ్చితివా, స్త్రీలనుగాంచి మోహించి నేను వచ్చితినా?

వ్యక్తి:- అట్లయిన నీధర్మ సందేహ మీచిత్రపటము దీర్పగలదని తలంచెద (అని మదాలస పటమును జూపును) ఈపట మెవరిది?

వీర:- (ఆశ్చర్యమున దనలో) ఈపె యెప్పుడీపటమును సంగ్రహించెను? ఆహా! ఎంత తెలివి తక్కువ పనిఁ జేసినతిని. నిద్రలోనుండగా నీపె యీ పటమును దొంగిలించి యుండును. నేనొంటరిపాటున నుంటినిగదా యని పల్కిన మాటలన్నియు నీపె వినలేదుగదా? (ప్రకాశముగా కోపము నభినయించుచు) ఛీ! దుర్మార్గురాలా! భర్తను మోసగించి నడిరేయియన్యుని శయనాగారమునకు నిర్భయముగా వచ్చుటయేగాక దొంగవలె వారి వస్తువులను గూడ తస్కరించుచుంటివా? మొదలక నీ వాపటము నక్కడ పెటి మరలి పొమ్ము లేదేని నీభర్తకెఱింగించి శిక్షింపజేసెదను.

వ్యక్తి:— నన్ను శిక్షించుట పట్టిది. కాని నీకపటవర్తక వేషమును నీకుత్సితాగమము నాతని కెఱిగించితినేని నిన్ను మాత్రము ప్రాణములతోఁ బోనీయఁడు.

వీర:— (తెల్లపోయి తనలో) అయ్యో! నారహస్యమంతయు గ్రహించినదే? ఇంక నీపెనుబోనిచ్చిన నాప్రాణములు దక్కవు (అని చొక్కానుండి కత్తినిఁ దీయగా)

వ్యక్తి:— ఓహో! స్త్రీ సౌందర్యమే పరమదేవతాస్వరూపముగా నెంచు మహాశూరులు తమ చేతులార స్త్రీవధగావింతురా? నిజముగా నీకంతటి ధైర్యమున్నచో నిదిగో నాశరీరమర్పించుచున్నాను చంపుము. (అని మేలిముసుఁగుదీసి సమీపించును.)

వీర :— (విభ్రాంతుఁడై) ఏమీ! ఈపె మంజరియా! లోకములో మదాలసయే యత్యంతసౌందర్యశాలి యనుకొంటిని గాని యీపె సౌందర్యమును దానికి దీసిపోవునట్లులేదు. ఈ సౌందర్యరాశిని నాచేతులార నెట్లు నాశనమొనర్ప గలను. (కత్తినిజారఁవిడచి ప్రకాశముగా) తరుణీమణీ! నిజముగా నీవెవరో తెలియఁజేయుము.

వ్యక్తి:- నేనెవరైన నీ కెందులకుగాని నీవు వచ్చిన కార్యమెద్దియో తెల్పుము?

వీర:- వర్తకమునకై వచ్చితిని.

వ్యక్తి:- అనృతము లాడుచున్నావు. నిజముదాపక జెప్పుము.

వీర;- నారీమణీ! నీనిజవృత్తాంత మెఱుకచేసినమీఁద నాసంగతిఁ దెల్పెదను.

వ్యక్తి:- నే నీ సత్రాధికారిణిని, పేరుమంజరి.

వీర:- నేను వర్తకుఁడనని తొలుతనే చెప్పితినిగదా?

వ్యక్తి;- ఓయీ! నీకపటవాక్యములు చాలించి నిజము దెల్పుము. నీకార్యమెద్దియో నెఱుంగుదును. నీవు పాదుషాయొక్క సేనానివగు వీరబలుఁడవుగదా! (అని ఫర్మానాను జూపును)

వీర:- (తెల్లబోయి తనలో) అయ్యో! నే నెంత మూఢుఁడను. పర్వతేశ్వరుని బంధించి పట్టుకొని రావలసినదని పాదుషా నాకొసంగిన ఫర్మానాను సైతము మైమఱచి పాఱవేసితిని. అది యీపె యెట్టులనో సంగ్రహించెను. (ప్రకాశముగా)

తే॥ మానినీమణి! నేఁడు మైమఱచి యిట్టి
వెడగు కార్యంబు గావించి వెఱ్ఱినైతి
సొత్తుతో బట్టువడునట్టి చోరుఁడెట్టు
లనృత మాడియుఁ దప్పించుకొనఁ గలండు॥

వ్యక్తి:- అట్లైన నీవును వీరుఁడవా! నీ కులమేమో?

వీర:- నేనును రాజపుత్ర వీరుఁడనే.

వ్యక్తి:- నమ్మజాల! రాజపుత్రులలో నింతటి దేశద్రోహులను నిదివఱకెన్నఁడును జూడలేదు.

వీర:- ఇందు దేశద్రోహ మేమున్నది. నాస్వామికార్యమును నేను నెఱవేర్చుటకై వచ్చితిని.

వ్యక్తి:- ఓహో! దేశద్రోహమేగాక పౌరుషవిహీనతయుఁగూడ గాన్పించుచున్నది.

వీర:- (తనలో) ఓహో! యీముసలివాని మనోవ్యథ నాకర్థమైనది.

సీ॥ శల్యావశిష్టుడై శక్తిలేని తనకు
నవయవ్వనాఢ్యయే నాతి యుంట
రమ్య హర్మ్యాంతఃపురముల నుండక యాపె
స్వేచ్ఛావిహారంబు సేయుచుంట
తన మనోరమణి సౌందర్యంబు పరులు ని
శ్చేష్టితులరయి వీక్షించుచుంట
అసుపుపెట్టిన నాపె యాగ్రహించు నటంచు
మెల్లగా గుక్కిళ్ళు మ్రింగుచుంట॥
సాగర తరంగముల భాతి సంచలించు
నాత్మ కల్లోలములనెట్లొ యడచు కొనుచు
సతత మనుమాన మను పిశాచము మథింప
నిశ్చలప్రేమ భార్యపై నిలుప కుండె॥

నిజమే! అనుమానమున్నచోట ప్రేమకుతా వెక్కడ, శాంతికియునికియెక్కడ.

కం॥ అనుమానమె పెనుభూతం
బనుమానమె సౌఖ్యతతుల నంతమొనర్చున్
అనుమాన రోగమంటిన
మనుజుఁడు బ్రతికియును బొందు మరణావస్థ॥

ముసలి:- ఛీ! ఛీ! ఇదియంతయు నటన. దీని నటనకు మోసపోవుచున్నాను— నాయదృష్టముచే నిట్టి యసదృశరూపలావణ్యవతి నాకు భార్యగా దొరికెనని సంతసించితిని గాని "నాకాయదృష్టమే యనర్థకారిణిగాఁ బరిణమించి నిరంతరము చింతా సముద్రమున ముంచుచున్నది. కాన దీనికంతకును గారకురాలగు దానిని నిర్మూల మొనర్పవలెను.

వీర :— (నవ్వుచు ప్రకాశముగా) అనుటయేగాని సాధారణముగా నట్లుచేయువాఁడెవ్వఁడును లేడు. బలపరాక్రమయుతులగు రాజులుగాని పాపించిక సుఖముల రోసిన మహర్షులుగాని యీ సాహసకార్యమును జేయఁజాలనప్పు డిక నీవా?

ముసలి :— నాకికక లోకములో గావలసిన దేమున్నది. కడపటిదినములందైన సుఖముగానుండక యీ మనోవ్యాకులతయేల? గావున దీనికిఁ దగిన ప్రతిక్రియఁ జేసితీరవలెను.

వీర :— (తనలో) మంజరిచరిత్రయే విచిత్రముగా నున్నదనుకొనుచుంటి నితనిచరిత్రియు నంతవిచిత్రముగనే యున్నది. (ప్రకాశము) అయ్యా! మీరు చెప్పినది బాగుగనే యున్నది కాని యాప్రతీకార మెట్లు నెఱవేర్తురు.

ముసలి :— నెఱవేర్చుటకు మార్గమే లేదా? (గద్గదస్వరమున) మంజరియొక్క— రక్త— పాతముచే!

వీర :— ఏమీ! నీభార్యను చంపదలంచితివా?

ముసలి :— (నిస్పృహతో) అవును. దైవవిధికి నేనేమి చేయగలను. కాని మచ్చలములైన యీచేతులను స్త్రీరక్తముచే నెఱుపుచేయఁజాలను. నాకే యంతటి శక్తియున్నచో నీకార్య మిప్పటికెన్నఁడో జరిగియుండెడిది. అదిగో నీసమీపమునను న్న యాకరవాలముచే నాకార్యమును నీవే నెఱవేర్పుము. వయస్సు మీరినవాఁడనగుటచే నేమి, యామెపైఁగల మోహమింకను సాంతముగ చావకుండుటచే నేమి, కంపించుచున్న నాహస్తములతో గరవాలమును బట్టజాలను. ఒకవేళ నెట్టులనో పట్టుకొనినను, జగన్మోహనకరమగు నాసౌందర్యరాశి హృదయములోని కీఖడ్గమును గ్రుచ్చజాలను. గావున నాకానాయు మొసంగి పుణ్యముంగట్టుకొమ్ము.

వీర :— శివశివా!

చం॥ చినతనమాది యీవఱకు స్త్రీవధజేసి యెఱుంగనట్టి న
న్ననిపిన లాభమేమి? కఠినాత్ములకే తగు నిట్టికృత్యముల్
జననుతచారుగాత్రి నవసారసకుట్మలి పుట్టుమొగ్గతో
దునుమ దలంప నాసుదతి దోస మదేమిటొ గల్గెఁ జెప్పుమా॥

ముసలి :— ఆమె చేసినదోసమా! దైవమునకెఱుక— చెప్పుమనెదవా! నామనస్సునకు వ్యాకులత గలిగించుటయే!

వీర :— ఒకవేళ నాలోపము నీమనస్సునందే యున్నదేమో?

ముసలి :— ఇదివరకులేని లోప మిప్పుడేల కలుగవలెను.

వీర :— అయ్యా! మీరు చాలపొరబడుచున్నారు. ఆసుదతీమణి తమయెడ గృతఘ్నురాలెంతమాత్రము కాదని నేను చెప్పఁగలను.

ముసలి :— ఇంతదనుక నేనును నిట్లే తలంచితినిగాని యిప్పుడిప్పు డామెయందు దోషచిహ్నములు బొడగట్టుచున్నవి. ఈ దోషకుసుమము మొగ్గగానుండగనే తునిమివేసిన సరిగాని లేకున్న తద్దుర్గంధ మెల్లెడల వ్యాపించి భరింప శక్యముగాకుండును.

వీర :— అయ్యో ! మీకింతటిసంశయమునకు గారణమేమి ?

ముసలి :— నిజముచెప్పవలెనెదవా ? వినుము.

తే॥ వనజముఖి మంజరీమణి వలనఁ గలుగు
సౌఖ్య జాలంబులన్ గను శాంతితోడ
నెగడు సంసారమున చిచ్చు రగులు గొల్పె
బర్వతేశ ప్రచండ దవానలుండు॥

వీర :— ఏమి మీనృపుండగు పర్వతేశ్వరుఁడా ?

ముసలి :— పర్వతేశ్వరుఁ డీపె పేరిమ నపేక్షించుటయే నాసంశయమునకుఁ గారణము.

వీర :— నీవదెట్లు నిర్ధారణఁ జేయగలవు.

ముసలి :— దానికి కావలసినన్ని యాధారములున్నవి.

వీర :— అట్లేని, దీనికంతకును కారకుండగు పర్వతేశ్వర హతకుని వధింపవలెగాని లోకువగానున్నదని స్త్రీవధగావింతువా ?

ముసలి :— ఆహో ! పర్వతేశ్వరుఁడెక్కడ, నేనెక్కడ ? ఆతని వధింపుటెక్కడ? మేక వ్యాఘ్రముఁ జంప బ్రయత్నించిన నెంతకొనసాగునో నాప్రయత్నమును నంతగనే ఫలించును.

వీర :— నిజమే, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన మొనర్చుచు ప్రజల మాన ప్రాణధనముల కాపాడవలసిన రాజే యిట్టిదుండగమున కొడిగట్టిన నిఁక ప్రజలగతి యేమి? గావున నాతఁడవశ్యము శిక్షార్హుఁడు. నీవునాకు తగు సాయమునిచ్చినచో, వాని నవలీల బంధించి పాదుషాముందు పెట్టెదను.

ముసలి :— ఎందులకు నీకీపిచ్చి? రాజాధిరాజులుసైతము వానిజయింపలేక నల్లాడుచుండగా యేదో వర్తకమునకు వచ్చిన నీవును, కాటికి కాళ్ళుచాచుకొని కూర్చున్న నేనును. వానిని జయింపగలమా?

వీర :— ఓయీ పిచ్చివాఁడా ! నన్నువనిగాఁ దలంచితివి. నేను వర్తకుఁడనుగాను. పాదుషాయొక్క సేనానిని. పర్వతేశ్వరుని వానిసోదరిని బంధించి తీసికొని రావలసినదిగా నాజ్ఞ బొందివచ్చితిని. నామాటయందు నీకు నమ్మకము లేకున్న పాదుషా నాకిడిన యధికారపత్రము నీభార్యయొద్ద నున్నది, చూడుము. ప్రస్తుతము మనయిరువురిలక్ష్యము పర్వతేశ్వరుని నాశనమే గాన నీవుకూడ దోడ్పడినచో నీకార్యమవలీల గావింపగలను.

ముసలి ;— (తెల్లపోయి) ఏమీ ! మీరు పాదుషాయొక్క సేనానాయకులా.

అట్లైన మీవంటివారికి సాధ్యమగును కాని నాబోటివాఁడేమి చేయఁగలఁడు. నేఁ జేయఁగల సాయమేదేని యున్న తప్పక చేసెదను.

వీర ;— వాఁడు మాఱువేసమున నిటకు వచ్చినప్పుడు నాకు తెలియఁజేసి పట్టిచ్చుటయే!

ముసలి ;— ఇదియేగదా! అవశ్యముచేసెదను. నిజముగ దొంగ సహాయమున్నచో వానిని వానిమార్గమునందే బంధించు మార్గముఁగూడ తెలియఁజేసెదను.

వీర ;— నాసైనికులు మాఱు వేసములదాల్చి యీపురమునం దంతటనున్నారు. నా యాజ్ఞకై వారు ప్రతిక్షణము నిరీక్షించుచున్నారు. కావున నీయుపాయ మెద్దియో తెల్పిన నాసైనికుల నెల్ల తగుసన్నాహముననుండ నియమించి వచ్చెదను.

ముసలి — అట్లయినచో నింకమనకు భయములేదు. వినుము నాభార్య మహాలసకుంబిణిమాచేటి. అందువలన నాభార్య తఱచుగా నటకుబోవుటకుగాని యీాపె యిచ్చ్యోటకు వచ్చుటకుగాని వీలుగనుండుటకై యొక రహస్యమార్గమున్నది. నేనారహస్యమార్గ మెఱుఁగుదును. కావున రేపటిరాత్రి మీారా రహస్యమార్గమున లోనికిఁబోయిగాఢనిద్రలోనున్నవారల సునాయాసముగ బంధింపవచ్చును.

వీర;- నీయుపాయము చాల బాగుగనేయున్నది. కాని నాకొక గొప్ప సందేహము గలదు. నారహస్యాగమనమును నేనెవరైనదియు నీభార్య గ్రహించినది. నా యొనర్పఁబూనిన కార్యము నీ భార్య కిష్టము లేనట్లు తోచుచున్నది. ఆపెచే మనకుట్ర యంతయు వెల్లడియగునేమోయని భయమగు చున్నది.

ముసలి;- సందేహములేదు. దాని నమ్మఁజనదు.

వీర;- నీవు సమ్మతించితివేని దాని కొక యుపాయము జెప్పెదను వినుము. ఆపె యుండేదేని నెపము గల్పించి మన కార్యము నెఱవేర్చుకొని వచ్చువఱకు నొక గది యందాపెను బంధించి తదుపరి విడిచిపుచ్చెదము.

ముసలి;- మంచిది. నీయుపాయము బాగుగనే యున్నది. ఇఁక నెంతయో పొద్దు లేదుగాన నీప్రయత్నమున నీవుండుము. (నిష్క్రమించును.)

వీర;- ధనముచే నీ ముసలివానిని లోబరచుకొన నెంచితినిగాని యంతకన్న సులభ మార్గముననే నావలలో జిక్కినాడు. ఇంక మన కార్యమనుకూలమైనట్టు లనే భావింపవచ్చును. నేనునుబోయి కాలకృత్యముల దీర్చుకొని నాప్రయత్నమునకు తగిన సన్నాహము గావించుకొనెద. (నిష్క్రమించును.)

# కోకిల.

చెరుకూరి సూర్యనారాయణమూర్తిగారు

1. ఆహా వసంత వేళలగదా నినుగన్నఫలమ్ము రోదసీ
కుహరమునందు నల్లదలకోయను శ్రావ్యనినాదమాధురీ
లహరిని నింపి సర్వగుహలన్ గిరులన్ వనులన్ వనప్రియా
విహరణసల్పవచ్చి పృథివింగల వింతల బాడుచుందువో
మహిత వసంతలక్ష్మి గనుమా యిదుగోయని చైత్రుబిల్చెదో॥

2. భూధరతుంగ శృంగముల బొంతవసించుచు యక్షగీతికా
మాధురి సంగ్రహించి యిటుమాధవు రూప సముల్ల సద్వనీ
వీధులబాడుచున్ హృదయవీధుల మానవకోటికిన్ సుధాం
బోధితరంగముల్ విడచి మోదము గూర్చుచు నుంటె కోయిలా ॥

3. చాలదినమ్ములయ్యె మదిచల్లగ నిన్గనియన్ పికంబ మా
పూలవనమ్ము చెంత పొలుపొందెడు ఆయెలమావిగున్నపై
వ్రాలియు లేజివుళ్ళ కడుపార భుజించి రవద్విపంచికా
లీలను మించురీతి సవరించి గళమ్ము కరమ్ము పాడియున్॥

4. పూచెను కల్వ కాచెనల పున్నమ వెన్నెల ముజ్జగమ్ములన్
వీచుచునుండె వాతములు స్వేచ్ఛగ శీకరసేవితమ్ములై
యూచెముదమ్మునన్ ప్రకృతియుర్వి నితాంతప్రశాంతడోలికన్
వాచవినిచ్చి పోగడె భవన్మృదుగాన సుధన్ పికీమణీ॥

# చెల్లెలా

(బాలకవి కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు)

మిక్కుటమ్ముగ నవ్వంబోకు
మీదనే కండ్లుంపంబోకు
అత్తమామల దూఱంబోకు
పొద్దుపాటకు చెల్లెలా !
పతియనుజ్ఞల దాటకమ్మ
భర్తతోం దగనుండుమమ్మ
కపటవర్తన వీడుమమ్మ
కలుషమెంచకు చెల్లెలా !
పెద్దలందున భక్తిగలిగి
పిల్లలందునం గరుణగలిగి
పుడమిపై ప్రఖ్యాతిగలిగి
నడచుకొనుమీ చెల్లెలా !
ధర్మమే జయమంచు చెప్పెడి
తత్త్వవాక్యము నాలకింపుము
మల్లికార్జును గూతుకటాక్షము
తెల్లమైనది చెల్లెలా !

# భావపల్లవము

(నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు)

మొయిలు తురుగున జంద్రుడూ నూతవడగ
జగమునంతట మసగలు జాలువార
నలసటల్ దోచె నాయాస మధికమాయె
నినునిరీక్షింప శక్తితే సేరనింక
నిశ్చల సమాధినున్నట్టి నిష్ఠులట్లు
నిలచియుండిన యీచెట్లనీడలందు
రూపుచూపక చూపించి ప్రేమయుంచుదు
వట్టిదాగుడు మూతల నాడనేల ?
ఏను మైమరచిన వేళ నెపుడొవచ్చి,
వెనుకనుండి నాకన్నుమూసి సేరసముగ
తెలియదంటిని వేడుకపలుకనెంచి,
పలుకులోననె యేడకు బోతివో ?
ప్రొద్దుపోయిన దాటులు పొందలేక
కాలము నిరీక్షించె నోపిక చలము [illegible]
వేగగాలాల నిన్నునే జీవితేశ
వెలయుమా ముందు కన్నుల విందుగాగ॥




౫

## ఇంటరుమీడియేటు విద్యార్థి శిరచ్ఛేదనము.

మా మఱఁదలు పెండ్లికి నే నెంత విముఖతతో బోయితినో యది నాకంత హృదయానంద కరమైనదిగా పొడగట్టుచున్నది. ఆనాటి యూరేగింపు మహోత్సవము ప్రశంసనీయమైనది. దానిని గూర్చి మున్ముందు ప్రకటించెదను. మా పెద్ద మఱఁదలు దినచర్య వ్రాసికొనెడి దైనికవృత్త పుస్తకము (Diary) మా పెండ్లిలో నాకంటఁబడినది. నేను దానిని మెల్లగా సంగ్రహించినాఁడను. అదియొక వింతలగని యని నేను వేఱచెప్పనక్కరలేదు. దానినుండి కొన్ని కొన్ని దినచర్యలను నా నాఁట వెలిబుచ్చుచుండెద.

నేను పెండ్లికివెళ్ళి వచ్చుసరికి మా లీలాతాండవకృష్ణుఁడొక వింతను జూచితినని చెప్పి దాని నంతను బూసగ్రుచ్చిన విధమున నాతోఁజెప్పినాఁడు. అది వాని శస్త్రవిద్యానైపుణ్యమును బ్రకటించుచున్నది.

మా వీఁట వెంగలివిత్తు వీరరాఘవాచార్యులుగారున్నారు. వారికి తిరువెంగళాచార్యుఁడను సుతుఁడు గలఁడు. ఆ బాలుఁడెటులనో స్కూలుఫయినలు పరీక్షయందు త్తీర్ణుఁడాయెను. తండ్రి శ్రమపడి యెట్లో వానిని ఇంటరుమీడియేట్ తరగతిలోఁ బ్రవేశపెట్టినాఁడు. బాలుఁడు కడు బుద్ధిశాలి. వాని కీగుణములున్నవని చెప్పుట దుస్తరము. వాఁడు సర్వాసి, సర్వగ్రాహి సర్వవ్యాపి. వీఁడిట్టివాఁడగుటచే వీనికిఁజదువుకొను దినములలో పుస్తకములను గేలిఁబూనుటకేని కాలముదొరకెడిది కాదు. ఇతఁడు పరీక్షలకు ముందు కొంచెము దుండగముచేసి హఠాన్మరణము నొందెను. అప్పుడు మా వీటి చెంతనున్న చిన్న యాసుపత్రిలో వాని యంగములను ఖండించి తీవ్రపరీక్షఁజేసిరి. ఆ యాసుపత్రి డాక్టరుగారికి మా తాండవకృష్ణునికిని జాలమైత్రిగలదు. ఇంతియకాక వారెన్నఁడు శస్త్రములుచేసినను మా తమ్ముని జతపరచుకొనియే యా కార్యములను నిర్వర్తించుచుందురు. వాఁడు వారాతని యంగముల నన్నిటిని బరీక్షించిరి. మా తమ్ముని ప్రోద్బలముచేత వానియుత్తమాంగమును గూడఁ బరీక్షింప దొరఁకొనిరి.

1. వారా వెంగళాచార్యుని నెత్తిమీఁద చర్మమును సడలింప సమకట్టి వాడియగు కత్తితో దలమీఁద నొక పొడుగుపాటి నాటును జేసిరి. రెండు వైపులకు చర్మమును వెడలింపఁ జూచిరి కాని యది యెంత ప్రయత్నించినను నట్లు రాలేదు. ఆ చర్మముయొక్క బిరుసుతనమును జూచి యాతఁడు తలబిరుసు మనిషియని సిద్ధాంతీకరించినాఁడు. అంత వాని తలపెంకును కంపముతో గోసి దానిని గూడ కష్టము మీఁద నూడదీసి లోపలి మెదడును బరీక్షించిరి.

2. మెదడునైఖరిచూడ నాతఁడ గొప్పమేధావియని వ్యక్తపడుచున్నట్లు డాక్టరుగారు పలికిరట, కాని మావాడది జూచి దానిని మిక్కిలి జాగ్రత్తతో పరీక్షింప మొదలిడెను. మావాఁడు మెదడుముడుత నొకదానిని పైకిలాగఁగా దానినుండి శబ్దమొండు బయలుదేరినదట. దాని యర్థము డాక్టరుగారికి తెలియలేదు. కాని మావాఁడు జాగ్రత్తగా విని దానినిట్లు వివరించినాఁడు. "నేను పోయి మెసవని కాఫీహోటేలు నెల్లూరింగనంతవఱకు కానరాదు. నేను డబ్బునెగఁబట్టుటచే నేడ్వని హోటేలువాఁడు లేడు. నన్ను డబ్బునడుగుటకు ప్రతివాఁడునుగూడ భయపడును. నన్ను డబ్బడిగిన హోటేలు వాని దుకాణములో సరుకులన్నియు క్షణమాత్రాన మాయమై మాకొట్లోనే యుండెడివి. ఇవియన్నియు మమ్ము నిరోధింపదలఁచిన రాజోద్యోగుల బొజ్జలలో ప్రవేశించేవి. మాకెట్టి చింతలు భయములుకూడ లేనే లేవు."

3. దాని నంటియున్న రెండవ ముడతను పైకిదీసి పరీక్షింప నందుండి యొక వింతరవము బయలు వెడలినది. దాని యర్థమిదియట. "కాఫీహోటేలులో కడపార మెసవికొట్టులోనికి బోయి పేకాట కుపక్రమించితే నా యాట యవిచ్ఛిన్నముగా పది మొదలు నాలుగువఱకు సాగిపోయేది. ఒక్కొకనాఁడు రాత్రి యేడు గంటలు మొదలుకొని తెల్లవారకట్ల మూడు గంటలదాకా పేక భోగమే. ఊరిలో డప్పుమీఁద దెబ్బపడేసరికి నాకు సరదాయుప్పొంగెడిది. రాత్రి ఎనిమిదిన్నఱ యగునప్పటికి నాటకశాలకో, సినీమాహాలునకో, సర్కసు డేరాకో, పోవువాండ్రము. మమ్ము టిక్కట్టడిగిన పాపమున బోయినవారెవ్వరు లేరు. అడిగిరిపో మా గాంగును చేతినిండా పనిగలిగి యా యాఁటి రసాభాసాలంకారమునకు లక్ష్యమైపోయెడిది."

4. మఱియొక ముడుతను పరీక్షింపగా దానినుండి పాఠశాల గల్లంతులు బయలుదేరినవి. "మాకు పాఠశాలకు బోఁవుటకును, తిరిగి యింటికివచ్చుటకును కాలనియమము లేదు. మమ్ము సకాలంబున నేల రాలేదని యడుగుట కొజ్జలకు భయము. అడిగినచో రాత్రికి వాని మరణవార్త వినబడుట, నా మరునాడు స్కూలునకు సెలవు వచ్చుట ధ్రువమే. పంతులవాళ్ళప్పుడు నేమియు ననువారు గారు కాని క్రొత్తగా వచ్చినవాళ్లు పెంకెతనముచేస్తే దవడశుద్ధిచేసి ఋజుమార్గానికి గొని వచ్చేవాళ్ళము. కాకుంటే పిటీషనులతో పరోక్షంగొట్టి వాని కుద్యోగనయము పద్ధతి నాచరించే వాళ్ళము."

5. అంత దాని చెంతముడత తీసేసరికి దానిలోనుండి కంఠధ్వని బయలుదేరినది. "మేము యూనివర్సిటీ పరీక్షకు పోవుదుమనుట యెంతయు నిశ్చయము. పరీక్ష యనేసరికి మాకు పుస్తకములతో పరీక్షయే యని యర్థము. వెఱ్ఱిబాలులవలె తెల్లవాళ్లు చదివిచస్తే సాంగత్యమేమిటి. పుస్తకములతో పరీక్షయైతే మాత్రమేమి లాభము. ఎక్కడేమి యున్నదో తెలియదు. ఇంతలో మా యేజంట్లు వ్రాసిన పేపర్లు తెచ్చి యందిస్తే నందరితోపాటు కట్టలలోనికి శుభ్రముగా ప్రవేశపెట్టువారము. ఇదే హాయి. మాలో బుద్ధివంతుఁడొకఁ డుద్యోగానికి బోయి మూడు గంటలలో రాజీనామా దాఖలుచేసినాఁడు. వానికి ముద్దికుడురు ఎక్కడిది. నాఁడట్లు కుర్చీని వ్రాయగలఁడు. గంటకు డజను ఏనుఁగు మార్కు సిగరెట్లను నూదినగాని వానికి యేమితోచదు. ఈ మా రాజయోగపు బ్రతుకు స్కూలులోను, కాఫీహోటేలులోను, భార్యతోడి సంసారముచేయుటలోను సాగి వచ్చుటలేదని యీ మా గాంగులోనివాఁడు చెప్పుచున్నాఁడు."

6. మెదడులోని యొక పెద్దముడతను కత్తిరింపఁగా నందుండి యొక కొన్ని సంబంధము లేని మాటలు మాత్రమే వినపడుచువచ్చినవి. "డైనమిక్సు, ఈక్విలిబ్రియము; స్టాటిక్సు, ఫ్లోటింగు బోడీస్; హీటు; వరిపోర్షన్; లైటు, న్యూటన్సులాస్ ఆఫ్ మోషన్; ఎలక్ట్రిసిటీ, మైనోమియల్

థీరము; జామిట్రీ పేరడైజ్ లాస్టు; మెకాలే, నావెలు స్కాట్స్ డ్రామా; ఆర్నాల్డు గాలాహాడ్; వీరేశలింగము సంస్కృత నాటకకథలు.”

7. మఱియొక మూలలోనుండి బయలుదేఱిన ధ్వని యీదిగువరీతి స్వాగత వాక్యములను బ్రకటించుచున్నవి. “మా నాన్నపోరువల్ల చదువుకాని యిది నాకిష్టములేదు. చదువుకుంటా మంటే మనస్సు దానిమీఁదనుండదు. మా అమ్మ నేనేమో యుద్ధరస్తానని పెళ్ళికి పెద్దమొత్తులకు పోతోంది. ఇంటరుమీడియేట్ గోడిని పెండ్లిచేస్తే బాగా ఉండును. మాచర్యలగాలి సోకిందంటే పిల్లనీయవచ్చిన వారు గప్పుచిప్పైపోతారు. ఇప్పటికే చాలావయస్సు ముదిరింది. పెళ్లైతే మామగారిని జడిపించి డబ్బులాగవచ్చును. నాన్నగారి పాకము డబ్బుపట్లనారికేళపాకమే. డబ్బు చేజిక్కుట లేదు. వేసలీనుబుఖ్లకి, సెక్కులైబులకి. ఐస్క్రీమలకి, సోపులకి, మంగలి ఖర్చులకి కష్టముగా నున్నది. వరుసగా పుస్తకములనమ్మి వీనిని కొనుచుంటిని. ఇకమీద యెట్లుండునో తెలియుట లేదు. సమ్మతిరిగి, పశ్చాత్తాప పర్వములోపడి పరితాపాత్యాసము జేసినాము.”

8. అంతటనుండి వరుసగానొక్కొక్కమూలనే శోధించినాము. కాని యవి యేవియుగూడ శబ్దములు చేయకయేయున్నవి. అవి యన్నియు రాబోవుకాలపు చర్యలకై ప్రత్యేకింపబడినవని మా తమ్ముఁ డన్నాఁడు.

అప్పటికప్పుడే మధ్యాహ్నము రెండు గంటలగుటచే నాశవదహనమునకు నాజ్ఞనొసంగి యింటికి తిరిగివచ్చిరట. నాఁడు వారు భోజనముచేసేసరికి మూఁడైనదని మా తమ్ముఁడన్నాఁడు.

# నిరుపేదలు—భాగ్యవంతులు.

—◆ రవీంద్రుని “గీతాంజలి”లోని పద్యముల కనువాదము ◆—

[ బి. టి. కృష్ణమాచార్యులుగారు. ]

తల్లి! దగదగ మెఱయుచు దళుకుమంచు
బట్టుజల్తారు బొదివినఁ బాగలాది
విలువగలిగిన వస్త్రాళి వెలయువారి
కాట బాలురఁగూడియు నాటలాడ
నిర్మలానంద వార్ధిజలోర్మికలను
నీదులాడెడు భాగ్యంబు నెట్లుగలుఁగు?
మాత! మానవలోక సంజాతపతిత
పావనంబైనట్టి యనంతుపాదధూళి
నిన్ను నంటకుండఁగఁజేసి నిమ్నజనుల
సమితియను మహోత్సవ సంబరమున
నీవుగూడనుఁ జేరియు నిత్యసుఖము
పాలుగొనకుండ నాటంకపఱచుచుండ
దీనితో వెగ్గలేలాగు దెలియలేవె?
మదినిఁ దలఁపరు నవివేకమత్తులగుచు
విశ్వరూపుఁడు నావేదవేద్యుఁడట్టి
పేదసాదల శిరముల బాదమూని
దయను వారిఁ బ్రేమించు సదయులకెల్ల
దేశత్యాగుల రూపులఁ దేజరిల్లు ||

# స్వయంవరము.

( సింగళి నాగేంద్రరావుగారు. )

మల్లపరాజుగారు నవనాగరికులు. మంచి విద్యావంతుడు.

ఆయన కుమార్తె కమలకు పదునారు వత్సరములు. ఆంధ్రభాషలో మంచి పరిచయమున్నది. చక్కని కవిత్వము చెప్పగలదు. ఇంగ్లీషు కొద్దిగా వచ్చును.

కమల తల్లి పార్వతమ్మగారికి కమల వివాహమునుగూర్చి పిచ్చిపట్టినది. భర్త యింటివద్ద నున్నంతసేపు కమలకు తగిన వరునిగూర్చిన విచారణయే. పార్వతమ్మకు కావలసిన యల్లుడు ఇంగ్లీషు విద్యలో యం. ఏ. ప్యాసయి ఉండాలి. అయిదారు లక్షలయినా ఆస్తివుండాలి. ఇక మల్లపరాజుగారి యుద్దేశము, నాల్గైదు భాషలువచ్చి ఇంగ్లీషులో బి. ఏ. మట్టుకైనా పట్టాగొని, ఇంగ్లీషులోను తెలుగులోను చక్కగా వ్యాసములు వ్రాయగలిగి, ఉపన్యాసము లివ్వగలిగి, అసహాయోద్యమములో నాయకస్థానమును వహించుచున్న జాతీయవాది తనఅల్లుడు కావలెనని యున్నది. ఎట్లామంటె, పార్వతమ్మగారికి అసహాయోద్యమమంటే భయం. అల్లుడు జెయిలుకు పోవాలసి వుంటుంది. భర్తకు తెలియకుండా తానే సంబంధాలు విచారించడము మొదలుపెట్టినది. దేశిరాజువారిసంబంధము వచ్చినది. విశ్వనాథము యం. ఏ. బి, యల్. అయిదులక్షల ఆస్తివున్నది. 36 వత్సరముల వయస్సు, ప్రథమ కళత్రము పోయినది. కమలతో స్థిరపడితే రెండవ వివాహమన్నమాట. సమయము చూచి భర్తతో చెప్పవలెనని పార్వతమ్మ చూచుచున్నది.

ఇక మల్లపరాజుగారొక సంబంధము విచారించారు. రాజేశ్వరావుగారు బి. ఏ. ప్యాసయినాడు. తండ్రికొక్కడే కుమారుడు. ముప్పైవేల రూపాయల ఆస్తివున్నది. కాని తండ్రియిష్టమునకు వ్యతిరేకముగ జాతీయోద్యమములో ప్రవేశించుటచేత ఆయన ఒకదమ్మిడియైనను కుమారున కిచ్చుటలేదు. రాజేశ్వరావునకు ముప్పదివత్సరముల వయస్సు.. ఇంకను వివాహేచ్ఛయే యతనికిలేదు. ఉద్రేక కవిత్వము ధారాళముగ చెప్పగలడు. ఉద్యమ ప్రచారములో బొబ్బిలిపాటలవంటి దేశభక్తికీర్తన లనేకము వ్రాసి ప్రచారముచేసి పేరుగొన్నాడు. ఆరుమాసములు జెయిలుకు వెళ్ళివచ్చాడు.

ఒకనాడు సాయంతనమున మల్లపరాజుగారు రాజేశ్వరావుని వెంటనిడుకొని గృహమునకు వచ్చెను. అప్పుడు కమల చెట్లకు నీరుపోయుచున్నది. ఇంకొక వేదికపై మల్లపరాజుగారును రాజేశ్వరావును గూర్చొనిరి. కమల లోనికిబోయి రెండు వెండి

గిన్నెలతో కాఫీతెచ్చి వారిముందు బెట్టి ప్రక్కగ నొక క్రోటనువద్ద నిలుచున్నది. కాఫీ పుచ్చుకొనిన తరువాత మల్లపరాజుగారు ఏదైన నొక్క గీతమును బాడుమని రాజేశ్వరావును బలవంతపెట్టెను. రాజేశ్వరావు గీతమును ప్రారంభించెను. కంఠ మంత బాగుండదు. కాని భావోచితముగ నభినయించుచు పాడుచున్నాడు. ఇంతలో కమల యన్నయగు సుదర్శనరావును, మల్లపరాజుగారి పత్రికా కార్యాలయములో ముఖ్యసంపాదకుడుగ పనిచేయుచున్న మాధవరావును వచ్చి సమీపమునందలి యొక వేదికపై కూర్చొనిరి.

రాజేశ్వరావు మధ్యలో గీతమునాపి "క్షమించవలెను గొంతుక నొప్పిగ నున్నది. మరొకప్పుడు పాడెదను" అని మల్లపరాజుగారివంక జూచెను. అటుపై చర్చ జాతీయోద్యమముపై ప్రసంగించినది. అత్యంత జాతీయవాదినని గర్వించుచున్న రాజేశ్వరావుకును మాధవరావుకును తీవ్రమైన చర్చజరిగినది. ఒక్కసారి పైకి విజృంభించి వెంటనే వెనుకకు రమ్మనుటవలన ప్రజలకు నిరుత్సాహము కలుగు ననియు జాతీయోద్యమమునకు గావలసిన బ్రహ్మచారుల సైన్యమును సేకరించుట చాలకష్టమనియు రాజేశ్వరరావు వాదన. అట్టి సైనికుల నన్వేషించుట లేక సృష్టించుట నాయకుల ధర్మమనియు, ప్రజ లజ్ఞానులనియు, కావున్న నాయకులే అవసరమే లేదనియు, వాదించి మాధవరావొక్క త్రుటిలో రాజేశ్వరరావును నిరుత్తరునిగ జేసి వైచెను. చాలకాల మైనందున నెవరింట్లకు వారు వెడలిపోయిరి. రాజేశ్వరావును వాదనలో నోడించి యవమానించిన మాధవరావును మల్లపరాజుగారు నిష్ఠురోక్తులాడిరి.

కమల యింతవరకు వారివద్ద నచ్చటనే నిలిచియున్నది. ఆమెమోమెఱ్రవడి యున్నది. అధరములు కంపించుచున్నవి. తనను రాజేశ్వరావుకిచ్చుటకు తండ్రి సంకల్పించుట కమలకెఱుక. తను నాతని అభిమానించినది. కాని నేడా రాజేశ్వర రావునకు మాధవరావువలన నవమానముజరిగినది. అందుకుగూడ నామెకు విచారములేదు. కాని రాజేశ్వరావా సందర్భములో ధీరుడుగా కనుబడలేదు. మల్లప రాజుగారి చేత నిష్ఠురముపడియు మాధవరావు ధీరుడుగా రంగనిష్క్రమణ మొనర్చినట్లు కమలకు స్థిరపడినది. కాని మాధవరావెవరో కమలకు పూర్తిగా తెలియదు. అన్నగారివద్దకువచ్చి కూర్చొనినది. అప్రయత్నముగ నామెనోటినుండి "ఈ మాధవరావుగారెవరు?" అని వాక్యమొకటి వెలువడినది.

సుద:— మాధవరావు చాల విచిత్రపురుషుడు. నాన్నగారికి వానివిషయము పూర్తిగా తెలియదు. తెలిసియున్న నేడిట్లగౌరవించియుండరు. ఈయుగములో ఈ క్షుద్రసంఘములో నిట్టి పవిత్రవ్యక్తి మెలగుట నాకాశ్చర్య

ముగా నున్నది.

కమల ;— అబ్బా ! తెలిసినవిషయము చెప్పరాదూ.

సుద ;— ఇంతవరకెవరికి వానిచరిత్ర చెప్పలేదు. నీవు సావధానముగ వినెదవా చెప్పెదను.

కమల ;— వింటాను చెప్పు.

మాధ ;— ఇందులో ఆతిశయోక్తులేమీ ఉండవు. మాధవరావుకు ధనమేమియులేదు. వానితల్లి ఒక సత్కుటుంబములో వంటచేసి పెట్టుచు పిల్లవానికి చదువుచెప్పించుకొనెడిది. ఈ మాధవరావు అందుచే చిన్నప్పటినుంచి ఉచితముగ విద్యలభించునని యొక జాతీయవిద్యాలయములో ఉత్తమతరగతివరకు విద్యార్జనమొనర్చెను. సంస్కృతము, ఆంధ్రము, ఇంగ్లీషు, వీనిలో మంచిపాండిత్యము సంపాదించినాడు. తెలుగున మంచి కవిత్వము చెప్పగలడు. అతని 16 వ యేటనే యొకనాటకమును వ్రాసినాడు. 18 వ యేట కలకత్తాకేగి అచ్చట యొక ఫరములో ఉద్యోగము సంపాదించుకొని మూడువత్సరములు కాలముగడపినాడు. ఈ మూడువత్సరములలో నతడు, హిందీ, బెంగాలీ, పాలీ, ఫ్రెంచి, జర్మను, భాషలను బాగుగ నేర్చుకొనినాడు. తరువాత ఈ ఉద్యోగకాలమునందే సి. ఆర్. దాసు, చక్రవర్తి, యస్. సి. సేన్. సచ్చిదానందసన్యాసి, మొదలగు వారితో గలసి వంగదేశమున, రైల్వే, ట్రాం, బొగ్గుగనుల యందు కార్మికసంఘములను స్థాపించి వానికి కార్యదర్శిగ పనిచేసినాడు. తానుద్యోగముచేయుచు మాసమునకు 200 రూప్యములు వేతనముగొనెడివాడు. ఆధనమునంతయు బీదకుటుంబముల సహాయార్థము వెచ్చించెడివాడు. తరువాత కాశీయందు ఆరుమాసములుండి కాశీపండితులవద్ద ఉపనిషత్తులను పఠించి, హిమవత్పర్వతములలో మూడుమాసములు సంచారమొనర్చి, తరువాత గాంధీగారి సబర్మతీఆశ్రమమున నొక ఆరుమాసములుండి, వారి శుశ్రూషచేసి గుజరాతీభాష నభ్యసించి, తరువాత గాంధీగారు జెయిలునకేగినతోడనే అచ్చటనుంచి బయలుదేరి ఒక వత్సరకాలము దేశమునంతట పర్యటనముసల్పి గొప్ప విద్యావంతుల దర్శించి నాయకులతోటి పరిచయమును కల్పించుకొని స్వస్థలమగుటచేత తిరిగి తనయూరు చేరుకొనాడు. అతడు వచ్చి ఒక వత్సరమగును. మననాన్నగారతని ప్రతిభను పరీక్షించి, గాంధీమహాత్ముడు శ్యామసుందరచక్రవర్తి, లజపతిరాయి మొదలగువారతనికిచ్చిన యోగ్యతాపత్రములనుచూచియు150-0-0

జీతముమీద మనపత్రికాకార్యాలయమున ముఖ్యసంపాదకునిగా నియమించిరి. అతడు బ్రహ్మచారి. అతనివయస్సిప్పుడు 29 వత్సరములు. అతని కొకతల్లిమాత్రమున్నది. వానికిక్రింద మాసమునకు 25-0-0 మాత్రము ఖర్చగును. మనమిచ్చు వేతనముగాక వానికింకను ప్రకటించు గ్రంథముల వలనగాని, ఇతరవృత్తులవలనగాని మరియొక 400-0-0 లు రాబడి కలదు. ఈ ధనమునంతయు నతడు బీదలకొరకై వెచ్చించును. సుమారొక ముప్పదికుటుంబము లాతనిసహాయముమీదనీయూరిలోజీవించుచున్నవి. ప్రాచ్యచిత్రకళను నేర్చుకొనుటకు నేను మొన్న జపాను వెళ్ళివచ్చుటకు నాన్నగారికిష్టములేక ధనము నీయననినప్పుడు 3000-0-0 లతనే నాకిచ్చి జపానుపంపినది. నీవువ్రాసిన “ ఆంధ్రరమణి ” నాటకమును వంగభాషలో తర్జుమాచేసి ప్రకటించినది మాధవరావే.

కమల;- నన్ను వేడించి నీపేర దానిని ప్రకటించుట కనుమతి తీసుకొన్నదిందులకా, నాకీసంగతి ముందు చెప్పలేదేమి ?

సుద;- మాధవరావు తనపేరు ప్రకటించుకొనుట కిష్టపడడు. స్వంతగ్రంథములనే పేరుతో ప్రకటించుకొనడు.

కమల;- మఱి, ఆయన యింకను పెండ్లిచేసికొనలేదేమి ?

సుద;- చాల మంచిసంబంధములు వచ్చినవి. కాని తానొక గృహస్థయిన తనఖర్చు అతిశయించుననియు తానితరులకు మిక్కిలి సహాయకారి కాజాలడనియు వివాహము చేసుకొనకున్నాడు.

కమల;- అట్లాగా? భార్యకూడ సంపాదించుకొనేదైతే ?

సుద;- ఏమో మఱి ?

ఇంతలో పార్వతమ్మ కమలను భోజనమునకు రమ్మని పిలచినది. కమలా సుదర్శనులు లోనికిబోయిరి.

పార్వతమ్మ కమలను విశ్వనాథమున కిచ్చి వివాహముచేయుట మంచిదని భర్తతో ప్రసంగించినది. మల్లపరాజుగారు భార్యమాటంటే చాల మొగమోటపడతాడు. కాదనలేడు. కమల రాజేశ్వరావుని తప్పక వరించునని మల్లపరాజునకు నిశ్చయము. కావున ఒకయుక్తిపన్నినాడు.

విశ్వనాథమునుగురించి తాను ప్రసంగించినపుడు కమల ప్రసన్నవదనముతోనుండెను. అందుచేత కమల యాతనినే వరించునని పార్వతమ్మగారు గట్టి

నమ్మకముతో నుండెను.

రాజేశ్వరావుగారి విషయమై కమల అభిమానముతో నున్నటుల మల్లప రాజుగారికి నిదర్శనముగనుండెను. రాజేశ్వరరావునే కమల వరించునని మల్లపరాజు గారు దృఢనిశ్చయులై యుండిరి.

కమల ఎవరిని వరించునో చూడవలెనని సుదర్శనరావు గోళ్లుకొరుకుకొను చున్నాడు.

ఆనాడు కమలా స్వయంవరము. మల్లపరాజుగారి గృహాంగణమున పెద్దపందిరి వేయబడినది. అందు వివాహమంటప మమర్పబడియున్నది. ఆపందిరి జనసముదాయ ముచే కిటకిటలాడుచుండెను. స్వయంవర మంటపమునకు సమీపముగ నుచితాసన ములమీద రాజేశ్వరావును, విశ్వనాథమును కూర్చొనియుండిరి. గతచరిత్రమును బట్టి ఎవరికివారు కమల తననె వరించుననుకొనుటలో నాశ్చర్యములేదు. ఇంకను నిజముగ కమలాకరము నర్థించివచ్చిన యువకులు ధనికులు విద్యావంతులు కొందర రాసమీపాసనములమీదనే కూర్చొనిరి. పెన్సిలుతరఫుని మాధవరావుకూడవచ్చి యా మంటపసమీపముననే మఱియొకవైపున ముందు బల్లవైచుకొని కొన్ని కాగిత ములను పెట్టుకొని కూర్చొనియుండెను.

శుభముహూర్తము సమీపించినది. కమల, పార్వతమ్మ, మల్లపరాజు గారు మంగళవస్త్రములధరించి వేదికపైకివచ్చిరి. మంగళధ్వనులు ప్రారంభమై నవి. ఆమంగళవాద్యములతో మేళవించి మల్లపరాజుగారు కమలాగుణములను సదస్యులకు విన్నవించి ఆమెస్వయంవరమనిచాటిరి. కుమార్తెను ఆశీర్వదించి" తల్లీ! నీకుతగిన వరుని నీవు వరించుకొనుము " అని పలికెను.

సదస్యులెల్ల యూద్గ్రీవులై కమలా ముఖారవిందమును ఆతురదృష్టుల నిరీక్షించు చుండిరి. కమల యొకమారా సభ నలుదిశల పరిశీలించినది. అంతలో అవనతవదనయై మందగమనమున మాధవునిసమీపించి యా హారమతనిమెడలో వైచినది.

సుద;- కమలా! కృతార్థుడను. మాధవరావును వరించి నీవిజ్ఞానమును నీవు గౌర వించుకొన్నావు.

కమల;- ఆజ్ఞానరత్నమును ఖనినుండితీసి నాకు బహుమతియొసగినావు.

సుద;- కమల మాధవునిగాక యెవరిని వివాహమాడగలదు! కాని మాధవునొక గృహస్థునిచేసినావు. నీవతని వరించి యుండకున్న యీ జన్మమున నతడు వివాహమాడి యుండెడు.

# సుధాకరామాత్యుడు

నిడుమోలు కనకసుందరంగారు బి. ఎ. (ఆనర్సు)

## తొమ్మిదవ ప్రకరణము.

### ఏకాంతపుటాలోచన

రఘునాథుడు గతదినమున భైరవియింట గ్రహింపగల్గిన నూతనాంశములను మాదన్న మంత్రి కెరింగింపవలెనని, వాని నన్నిటిని సవిస్తారముగ, ప్రశ్నోత్తరరూపమున వ్రాసెను. ఆతని విచారణాఫలితముగ సుధాకరు డాత్మహత్య గావించుకొనెననియే యాతనికి దోచెను. కాని, మాదన్న వ్యతిరేకాభిప్రాయమునకు బలవత్తరములగు కారణము లుండియుండవలెనని, యాతని నమ్మకము. అందువలన స్వకీయాభిప్రాయములను ద్రోసిపుచ్చి, మాదన్నగారి కనుకూలములగు నాలోచనలయందే ఆతడు కాలము గడుపుచుండెను. అనుమానాస్పదమగు వకుళ నడవడికయు పతంజలి పునరాగమనమును, రఘునాథునకు జాల ప్రాముఖ్యములైన యంశములుగ దోచెను.

ఆతని యాలోచనలన్నియు లేఖినీముఖమున నిట్లు ప్రదర్శింపవచ్చును.

"సుధాకరు డాత్మహత్య కావించుకొననిచో, నాతని మరణమునకు నిక రెండే మార్గాంతరములు కలవు. మొదటిది ఉన్మాదావేశము. రెండవది హంతకుల వలన బలవన్మరణము. ఈ రెండవసమస్యయే శరణ్యమైనయెడల, నేనాహంతకుల వెంటబడి, పట్టుకొనవలెను. ధనవ్యయమునకు నేను వెనుకముందు లాలోచింపకూడదు. —అయినను, హంతకు లెవ్వరు లేనిది నేను సృష్టింతునా? త్రాడును బొంగరమునులేని యీయాట సాగించుటెట్లు?"

"ఈ విషయమున నేమిచిక్కులును లేనట్లగపడినను, చాలచిత్రముగ నున్నది. నేను మొదటినుండి యీమాట యనుకొనుచునేయుంటిని. వకుళ చెప్పెడి యాస్వప్నమును చూడుడు. స్మశానమునందామె నడవడిని పరిశీలింపుడు. రాజశేఖరు డామెను చూచుచు నూరకుండెనట, వింతగాదా. ఆసమయమునకే రాజశేఖరుడు వచ్చుటకూడా వింతయే. వకుళ ఆత్మహత్య కాదని ప్రమాణము చేయుచున్నది. మాదన్నమంత్రి యది విశ్వసించుటలేదు; మొదట సురేంద్రుడైనను నమ్మలేదు — యిపుడున్మాద మనుచున్నాడు. ఈ విషయమంతయు మరల నొకసారి పర్యాలోచన మొనర్చిన బాగుండునట్లు తోచెడిని!"

రఘునాథుడు తన గృహమునందు కూర్చుండియుండెను. పెట్టిలోనుండి

యొక చిన్నపుస్తకమునుదీసి, దానిలో జ్ఞాపకార్థము వ్రాసుకొనియుండిన యంశములను చదివికొనుచు, నీవిధమున తలపోయ నారంభించెను.

"సుధాకరామాత్యుఁడు, న్యాయవిచారణాధికారి ఆదివారమునాడు ఉదయమున సపరివారముగ చంద్రనగరి కరుదెంచెను. పూర్వపరిచయముగల రాజశేఖరుని యింటనే బసచేసెను. యథాప్రకారము ఉత్సాహపూరితుఁడైయే యుండెను. ఆమధ్యాహ్నము పరమానందుని పుత్రికల సందర్శింపనేగెను. వారిలో నొకరిపై మరులుగొని యుండెనేమోయని భైరవి యపోహపడుచున్నది. గతపర్యాయ మాతడీయూరు వచ్చినపుడే భైరవి కీయపోహకలిగినది. సాయంసమయమున కాతడు బసలోనికి చేరుకొనియెను. మేడమెట్లనెక్కఁబోవునపుడు భైరవిపల్కరించినది. చాల అలసియుంటినని చెప్పెను. తలనొప్పి బాధించుచుండెననియెను. పెందలకడనే దీపము వెలిగింపవలెనని సేవకురాలి కాజ్ఞాపించెను. చాల తీవ్రముగ పనిచేయుచున్నట్లు దాసికి తోచినది వెంటనే ప్రఫుల్లచంద్రుఁడు ప్రత్యక్షమయ్యెను. ఆమరునా డత్యవసరమగు నొక పత్రమును ప్రఫుల్లచంద్రుఁడు గోల్కొండనుండి తెచ్చియుండెను. మూఁడునాల్గుగడియ లచ్చటనేయుండెను. మరునాఁడు ప్రాతఃకాలముననే తిరిగివత్తునని చెప్పిపోవుచుండెను. సోమశేఖరుఁడా మాటలు వినియుండెను. ప్రఫుల్లచంద్రుని బయటకు సాగనంపెను. సుమారు నాల్గుగడియల ప్రొద్దుపోయి యుండవచ్చును. సుధాకరుఁడు జీవములతో నెవ్వరికంటికి నగపడలేదు. మరునాఁడుదయమున విగతజీవుఁడై కుర్చీయందు పడియుండెను. కుడిచేయి కత్తిపిడిని వదలి రొమ్ముపైకి జారియున్నది. కత్తి హృదయమున గాఢముగ నాటుకొని యున్నది. వకుళయే ముందుచూచెను. ఒక స్వప్నమువలన భయోత్పాతము కల్గినదని యొక పిచ్చికథ చెప్పినది. ఆతఁడు గదిలో చచ్చిపడియుండినట్లు కలగని, ఆతఁడు చావలేదని చూచుట కాగదిలోనికి పోయినదట. ఆకలలో యెట్లగపడినాఁడో అటులే ప్రత్యక్షముగ చచ్చిపడియుండెనట. సేవకుఁడు వైద్యునికొరకు పరుగెత్తుకొని పోయెను. ధన్వంతరి వచ్చెను. సోమశేఖరుఁడు సురేంద్ర ప్రఫుల్లచంద్రులకు తెలుపగా వారు వచ్చిరి. గతరాత్రి యైదారుగడియల ప్రొద్దుపోవకపూర్వమే మరణించి యుండవచ్చునని భిషగ్వరుని అభిప్రాయము. నాల్గుగడియలకంటె నెక్కువ కాలము ఆగదిలోని దీపము వెలిగియుండదని భైరవి తెలుపుచున్నది. కానున్న నైదుగడియలకు మించిన కాలమది వెలిగెనని యామె యొప్పుకొనుటలేదు. ఈవిషయములందు స్త్రీలయొక్క అంచనా ప్రమాణమే. అందును, భైరవి పొరబడు నదికాదు.

"ఈ సమస్యయొక్క విషమదశ సమీపించుచున్నది. సుమారు నాల్గుగడియల ప్రొద్దుపోయిన సమయమున, ప్రఫుల్లచంద్రుడు వెడలిపోవునపుడు— అతనియొక్కయు సోమశేఖరునియొక్కయు సాక్ష్యమువలన— సుధాకరుడు జీవించియేయుండెను. భిషగ్వరుని సాక్ష్యమువలనను, దీపమందలి చమురుయొక్క కొలతవలనను, ఆతడు ఆరుగడియల ప్రొద్దుపోవునప్పటికే మరణించియుండవలెను. ఆతడు, తన్నుతానే పొడుచుకొనకున్న నీనడుమనే హంతకులెవ్వరో యాతని జంపియుండవలెను.

"సుధాకరుడు తన్నుతానే పొడుచుకొనినయెనా? అవునని నేనందును. అవునని ప్రజలెల్లరు నందురు. వకుళయు, మాదన్నమంత్రియు లేదందురు. మేమందరమును పొరబడియున్న యెడల— వీరిద్దరివాదమే నిజమైనయెడల— నిది హత్యయే. బహునేర్పరితనముతో జరుపబడిన ఘోరహత్యయే."

సుధాకరునిచే వ్రాయబడిన యంత్యలేఖను రఘునాథుడు మాదన్నమంత్రి వద్దనుండి తెచ్చియుండెను. ఇప్పుడాత డాకాగితమును దీసి, సూక్ష్మదృష్టితో దానిని పరిశీలింప నారంభించెను.

"తెలివిగలవారమనుకొనినయెడి పెద్దలకు దూరాలోచన లేదు. ఈ యుత్తరమును చూచి దుఃఖము భరింపజాలకుండుటవలన, దీనిని తగులబెట్ట యత్నించిరట! సురేంద్రుడట! ప్రఫుల్లచంద్రుడుకూడానట! మాదన్నమంత్రి దీనినట్లు చేయనీయలేదు. ఇది చాలయుపయోగకారి కాగలదని నానమ్మకము."

ఆతడుత్తరమునంతయు బాగుగ పరిశీలించి చూచెను. అందలి యంత్యపంక్తిని గడుశ్రద్ధతో చదివెను.

"ఈ రెండుదస్తూరీలు నొకరిచేతివే యైనయెడల నన్నుగూడ పొడిచివేయుడు!

"ఆ అక్షరముల తలకట్లు మొదలగునవియు, వానిపొందికయు నెట్టిసామ్యమును లేకయున్నవి. ఆత్మహత్యగావించుకొనబోవుటకు ముందిట్టి మార్పువ్రాతవ్రాయుట కాతని కెట్టియవుసరముకలిగియుండును? ఈ యంత్యపంక్తికిని, పైపంక్తులకును హస్తిమశకాంతరముకలదు. పైపంక్తులన్నియు, సుధాకరుని స్వహస్తలిఖితములైన అక్కరముల పొందిక చెప్పకచెప్పుచున్నది. కాని యీ యంత్యాక్షరము లాతడు వ్రాసినవని నేను నమ్మజాలను."

ఈవిధి నిర్ధారితమైన నూతనాంశము రఘునాథుని మేను పులకాంకితముగ నొనర్చెను.

"కానిమ్ము. ఈరీతి నాలోచించిన నేమి తేలునో చూతము. మేమందర
మును పొరబడితిమనుకొందము. సుధాకరుడు తనచేతితో తానేపొడుచుకొనలేడు;
ఎవరో లోనప్రవేశించి, ఆతనిఁ బొడిచి చంపిరి.

"చంపినదెవరు? మగవాడా, ఆడుదియా? ఆయింటిలోనుండెడివారెవరైన
నాపనిచేసిరా? అదియెట్లుజరిగినది? ఏకారణమువలన జరిగినది? ప్రసంగవశమున
బల్లపై నెదుటనుంచబడిన కృపాణమును బట్టుకొని, తలవనితలంపుగా పొడిచెనా? -
కాకున్న వారిద్దరు తగవులాడుకొని, ఆహంతకుడు క్రోధముచే పొడిచివేసెనా? -
హంతకుడు రహస్యముగ నింటిలోప్రవేశించి, యాకస్మికముగ మీదికురికి, బుద్ధి
పూర్వకముగ పొడిచిచంపెనా? - రఘునాథా! యిచట కొంచమాగుము! - మొద
టిది- తలవనితలంపుగా పొడిచెనందురా? అబద్ధము; గౌరవనీయుడగు నెవడైన
నట్లుచేసినయెడల, వైద్యునివద్దకు పరుగెత్తుకొని చికిత్సచేయింపక విడువడు. కావున
యీయూహ సత్యదూరము. ఇక రెండవది— తగవులాటలో క్రోధమువలన చేయ
బడెనందురా? ఏమో, కావచ్చును. మూడవది— బుద్ధిపూర్వకముగా హత్య
కావింపబడెనందురా? ఇదియే, ఉత్తమమగు నూహగానుండెడిదేకాని, యాకృపా
ణము సుధాకరునిదై యున్నది. ఈరెండుయూహలకు వీలిచ్చినను, విచిత్రముగనే
యున్నది. ఏలనన, యీతుదిదానికి, పైనజెప్పబడిన కారణమును, దాసిపైదాని
కాహంతకుడతిరహస్యముగ లోనబ్రవేశింపగల చాకచక్యమును మనకు వింతకలుగ
జేయుచున్నవి. ఆదాసియే వీధిగుమ్మమువద్ద కనిపెట్టుకొనియుండినయెడల నింతటి
విపత్తు సంభవించెడిదేకాదు.

"నాల్గుగడియల ప్రొద్దుపోయినపిదప, - ఆరుగడియలు గడువకపూర్వము.
ఈనడుమనే యేమిజరిగినను. అంతకు వెనుకముందుల జూడనవుసరములేదు. సోమ
శేఖరుడును, వకుళయు తప్ప నింకెవ్వరు నింటిలోనికేగలేదని సేవకురాలగులలిత చెప్పు
చున్నది. సోమశేఖరు డింటిలోనుండలేదు. పాత్రమును తీసికొని, నాల్గుగడియల
ప్రొద్దుపోయినపుడు, ప్రఫుల్లచంద్రుని వెంటనే, యిలువిడిచిపోయెను. అప్పటికి
సుధాకరుడు సజీవుడైయుండెను. అటుపిమ్మట వకుళయే యాగృహప్రవేశమొనర్చి
యుండెను. ఆమె తనగదియందు పండుకొని నిద్రించెనని చెప్పుచున్నది."

రఘునాథుని యాలోచనము తటాలున స్తంభించిపోయెను. ఆతడు విస్ఫా
రిత నయనములతో,- దృగ్గోచరమగు వస్తువయొక్క అంతరార్థమును గ్రహింపవలె
ననెడి కుతూహలముతో- నొక్కించుకసేపు నిదానించిచూచెను.

"జాముప్రొద్దయినను పోవకపూర్వము నిద్రయా? అందున నొడలెరుగనినిద్ర

యా? మీదుమిక్కిలి, ఆమె వికృతస్వప్నము! - కాదు. కాదు. ఆమె స్వప్నము కల్గెననెడి వికృతవాదము! ఆగదిలో బ్రవేశించి, యాతనిజూచుటకై యామె కల్పించినకధకాదుగద! ఆతడాత్మహత్య గావించుకొనలేదని యామెయొక్క తీవ్రి వాదము! అప్పటినుంచియు, నామెయొక్క విచిత్రమగు చిత్తవృత్తి! సుధాకరుని ప్రేతస్వరూప మామెను వెంబడించుచున్నదని, యామెచెప్పుచుండునని రాజశేఖరు డీయుదయముననే నాకు తెలిపియుండెను. అమెనే యేల వెంబడించుచున్నది? అనగా, వెంబడించుచున్నదని ఆమె యేల యపోహపడుచున్నది? ఇదియంతయు వికృతముగ నున్నది. మిగులవికృతము!

“ఇక నాపతంజలి! ఆతడు ప్రచ్ఛన్నవేషధారియై యున్నాడనుట నిస్సందేహము! ఒక శనివారమునాడు వాడీయూరిలో ప్రవేశించెనట. అప్పుడే అపరచితురాలగు నొక స్త్రీని - వకుళను - కలుసుకొని, యొక వారముదినములు బస చేయుటకు వసతిగల గృహ మిప్పింపుమని కోరెనట. ఆమె నిలచియుండిన గృహమే యామెదని వాడనుకొనెనేమోయని యామె చెప్పుచున్నది; అట్లయిన కావచ్చును. వాని నెవరో తరుముకొని వచ్చుచుండనోవు. కావుననే, ధర్మసత్రమునందు బహిరంగముగ నుండుటకు భయపడెను. తొమ్మిది దినములాయింట విడిసియుండెను. ఒక్కమారైనను బయటికేగలేదు. శిరోభారమనెడి మిషయొకటి కల్పించి, యిలువిడచిపోవుటయె మానుకొనెను. ఇదియొక మిషయే!— ఆదివారమునాడు నాలుగు గడియల ప్రొద్దుండగ, భైరవియొద్ద శెలవుగైకొని, గోల్కొండకు పయనమయిపోయెను. మరల నింటిలోని కేల వచ్చెను?”

ఈ ప్రశ్నమునకు సమాధానము గుదుర్చుట సులభసాధ్యము కాకుండెను. కావుననే రఘునాధాచార్యు డద్దానిగూర్చి చాలకాల మాలోచింపవలసి వచ్చెను.

“ఆగవాక్షములగుండ వాడు లోపల ప్రవేశించుటకు వీలులేదు. ఆద్వారముగుండ పోవలెనేగాని యింకేమార్గమునులేదు. వాడు లోనికి పోవునప్పుడును, బయటకు వచ్చునప్పుడు నాత డెవరికంటనో యొకరికంట బడవలసినదే. కాని అట్లెవరికిని కనపడలేదు. అయినను సుధాకరునికి హానిచేయవలెననెడి దురుద్దేశముతో నాతడు లోని కేగెనని తలచుటకు కారణములులేవు. ఆతడు గోల్కొండ కాసాయంత్రము బయలుదేరవలెనని బుద్ధిపూర్వకముగనే చెప్పియుండెననియు, నిశ్చయముగ నారాత్రియే వేరొక దిక్కునకు బోయియుండెననియు నూహింపవలసి వచ్చుచున్నది. , ఇందలి సత్యాసత్యముల నిప్పుడే నిర్ధారణ చేసికొనవలయును”

రఘునాధుడు దిగ్గునలేచి, యుత్తరీయమును ధరించి, నగరమున దక్షిణభాగ

మునను్న శకటశాలకేగెను. అచట బండ్లన్నియు, నెక్కుడకుబోవలయునన్నను సంసిద్ధముగనుండును. అచట ప్రయాణీకులతో బేరములాడి, బండ్లనుకట్టించెడి సేవకవర్గమున రామస్వామి కడు నేర్పరి. మనరఘునాథాచార్యుడాతని బాగుగ నెరుగును. రఘునాథుడు మొట్టమొదట లోకాభిరామాయణమును కొంతవరకు రామస్వామితో ముచ్చటించి నిమ్మట,-

"రామస్వామీ, మరచితిని. నామిత్రుడొకడు గత ఆదివారమునాడు సాయంకాల మీయూరునుండి ప్రయాణమైపోయెను. ఆతడేసమయమున వెళ్ళినది నేను బాగుగ నెరుగను. నీకాతడిచట నగపడెనేమో రా రుగను ?—— మంచిపొడగరి ధృఢకాయుడు, నల్లని తలవెంట్రుకలు, పెద్దగడ్డము —— ముప్పదియేండ్లవాడు."

రామస్వామి యాకసమువంక విస్మితుడై చూచెను. "అటువంటిపురుషుని చూచినట్లు నాకు జ్ఞాపకములేదు." అని యాతడనియెను.

రఘు:- వానిచేతిలో నొకనీలవర్ణపు సంచియున్నది. రెండుగడియల ప్రొద్దువేళ నిచటికి వచ్చియుండవచ్చును. కాకున్న బాగుగ చీకటిపడినపిదప నాల్గైదు గడియలకు వచ్చెనో, బహుశా రాత్రియే వచ్చియుండవచ్చును.

రామ:- ఆయన యుత్తరమునకు డిల్లీమార్గమున బోవుచుండెనా ? లేక గోల్కొండకు పోవుచుండెనా ?

రఘు:- ఏమో చెప్పజాలను నీవే జ్ఞాపకమునకు తెచ్చుకొనుము.

రామ:- ఆదివారమా ! ఆదివారమా ! రాజశేఖరుని యింటిలో నాకస్మికమరణము సంభవించిననాడుకదా. కాని, రోజులన్నియు నొకేరీతిగానుండును. ఏనాడేది జరిగినదో జ్ఞాపకముంచుకొనుట చాలకష్టము.

రఘు:- అప్పటికెన్మిది దినములకు బూర్వమే శనివారమునాడు నీవిచ్చటనే యుంటివా ?

రామ:- అవును, నేనిచ్చటనే యుంటిని.

రఘు:- ఆనాడే నేజెప్పినపురుషుడొక బండినెక్కి యీ యూరు చేరినాడు. ఈదొడ్డియందే, బండిలోనుండి దిగియుండవచ్చును. ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినదా ?

రామ:- అవునండి అవును. మీరు చెప్పినవాడే. వానిముఖ మదివరకే చూచితినని నేనప్పుడనుకొంటిని. కాని అది నాయూహాపోహము కావచ్చుననుకొంటిని. నేనాతనిని సరిగా చూచుటకు వీలుపడలేదు. వాడితర ప్రయాణికులతో కలసి, యీ దొడ్డిని వెంటనే విడిచిపోయెను. ఆతని నీలవర్ణపుసంచి నాకిప్పుడు జ్ఞప్తికివచ్చినది.

రఘు:- మంచిది. వానిసంగతియే నాకిపుడు కావలసినది. గత ఆదివారమునాడాతని జూచితివా ?

రామ:- వాడీయూరు వచ్చినపిదప మరల నాకంటబడలేదు. కొంచెముసేపాగుడు. నీలిసంచియా. అవును, అది నీలిసంచియే — అది ఆదివారము సాయంకాలమే. ఒకనిమిషమాగుడు నేను రంగని దీసికొనివత్తును.

రఘునాథాచార్యునకీ వాక్యముల యర్థము తెలియలేదు. రామస్వామి రివ్వున పరుగెత్తుకొనిపోయెను. కొంచెముసేపటి కాతడు పదునైదేండ్లబాలునొక్కని వెంటనిడుకొని మరలివచ్చెను.

రామ:- రంగా నీవు మొన్న బండికట్టితివే, వానివిషయ మీయనకు జెప్పుము.

రంగ:- ఆదివారమునాడు సాయంత్రమొకడు నాగపురమునకు బండికట్టుమని యడిగెను. బాడుగ యొక వరహా నిత్తుననెను. నేనింటికిపోయి, యెద్దునకు దాణా తెత్తునని చెప్పితిని. ఆతడు ప్రొద్దుగ్రుంకినపిదప వెన్నెలలోబయలు దేరవచ్చుననియు, నన్ను సిద్ధముగ నుండుమనియు, చెప్పిపోయెను. ఆరాత్రి నైదారు గడియల ప్రొద్దుబోయినపిదప మేమిచ్చటనుండి బయలుదేరిపోయితిమి.

రఘు:- ఆయనవెంట నేమైన సామానులున్నవా ?

రంగ:- వేరు సామానులేవియులేవు. ఒక నీలవర్ణపు సంచిమాత్రము ఆయనవెంట నుండెను. దానిని తలక్రిందబెట్టుకొని బండిలోనిద్రపోయెను.

రఘు:- ఆముసలివాని తలవెంట్రుకలన్నియు నెరసినవికావా ?

"నెరసిన వెంట్రుకలా! కాదుకాదు కారునలుపు, గడ్డముకూడ నలుపే. వాడు ముసలివాడు గాదు. పడుచువాడే" అని సమాధానముజెప్పెను.

రఘునాథుడు తీవ్రముగ నాలోచించుచు నింటి కేగెను. పతంజలి యాదివారమునాడు ప్రొద్దుగ్రుంకినవెనుకగాని యాయిల్లువిడచి పోలేదని గంగారాముడు తెలిపినపుడాతనికి పతంజలిపై జాల ననుమానము కలిగెను. కాని, యాతనివిషయమాలోచించినకొలదిని, ఆపరిస్థితులను విచారించినకొలదిని పతంజలిపై నేరమారోపించుటకు ప్రబలకారణములు లేవని యాతనికి బోధకట్టుచుండెను.

"పతంజలి ప్రజలకంటబడుటకు వెరచుచుండెననెడి నాయూహ వాస్తవమే. ఆతడు నిశ్చయముగా గోల్కొండ కేగదలచియుండలేదు. నాగపురమునకు బోవలెననియే యుద్దేశించుకొని, వేరొకయూరుపోవుచున్నట్లు చెప్పియున్నాడు.

"సుధాకరామాత్యుని బొడిచిచంపవలెననెడి దురుద్దేశ్యముతోనే పతంజలి గృహస్థవృత్తిని వారముదినములాయింట సంచరించుచుండెనను వాదము విశ్వసనీయ

ముగలేదు. ఆతడీయూరువచ్చినపిదప మంగళవారమునాడుగాని, సుధాకరుని పయాణవిషయమును, రాజశేఖరునియింట బసచేయువిషయమును నిర్ధారితములు కాలేదు. పతంజలి స్వవిషయములందే చిక్కులబడియున్నాడు. కావుననే యీ యూర గూఢముగ సంచరించుచున్నాడుగాని, సుధాకరామాత్యుని మరణముతో నాతని కేట్టిసంబంధమేని యున్నదనుకొనుట పొరబాటు."

రఘునాధాచార్యుడు చాల పట్టుదలగలవాడు. ఆతడేధోరణి నాలోచించుకొనునో, ఆధోరణి యెన్నిటికిని విడువడు. పతంజలి నిర్దోషియని సమర్థించుట కాతడు పూనుకొనియెనుగాన, చర్య యనుమానాస్పదముగ నున్నదని యాతని నొప్పించుట సాధారణపురుషులకు సాధ్యముకాదు.

"నాకీ యూహనచ్చదు. ఆపెచర్య నెంత సాదరభావముతో విమర్శించినను యీ హత్యారహస్య మాపెకు గొంతవరకు తెలిసియేయుండవలెనని తోచుచున్నది. ఆపె యెరిగియున్నదంతయు చెప్పుటకు సాహసించుటలేదు. రఘునాధా! యీ రీతిగ నాలోచించుకొనుము. ఇచ్చటనొక యువతికలదు. బుద్ధిమంతురాలు. దూరాలోచనగలది. పాపమన్న వెరచునది. అసత్యమాడుట యెట్టిదో యెరుగనిది. ఈ హత్య జరుగునప్పటివరకు నాపె యిటులనే యుండెను. కాని యిప్పుడో? ఆదివారమునాటిరాత్రి యింటికిపోయి, తనగదిలో నిదురించెను. సుధాకరుడు మరణించియున్నట్లొక దుస్స్వప్నముగనెను. మరునాటియుదయమున ఇంటిలోనున్న వారందరికంటె ముమ్మందే మేల్కాంచి, చచ్చిపడియున్న సుధాకరు నెల్లరకు జూపుచున్నది. పంచాయితీసభవారి యెదుట సాక్ష్యమిచ్చునపుడు తత్తరపాటుజూపినది. ఆరాత్రి స్మశానమునకుబోయి, సుధాకరు డాత్మహత్య కావించుకొనలేదని పల్లెజల కుపన్యసించుచున్నది. ఆపెకీవిషయ మెట్లు తెలియును? భైరవి యాపెకంటె వేయిమడుంగులు దూరాలోచనకలది. అపె కేట్టిఅనుమానమును లేనప్పు డీపెకేందులకు? అంతటితోపోవక, సుధాకరుని ప్రేతస్వరూప మాపెను వెన్నాడుచుండెనని యప్పగారియొద్ద నొప్పుకొనినదట!

"నేనీమాటనమ్మను. దయ్యములు మనుష్యుల వెంటబడినప్పుడు, ఆమరణించినవానికిని, ఆమానవులకు నేదియో సంబంధ ముండితీరవలెను. నేనీదినమున వారితో మాటాడుచున్నపు డాపెముఖము వెలవెలబారినది. చేతిలోనున్న కుట్టుపని సాగలేదు నాయెదుట నుండుటకు కష్టముకలిగిగాబోలు కొంతసేపటికి లేచిపోయినది. నాల్గైదుగడియల ప్రొద్దుపోయినపిమ్మటనుండియు నాపె యింటిలోనే యుండెను. అందుచేత నింటిలో నేమికలవరముజరిగినను ఆపెకు తెలిసియుండకపోదు!

ఆపె పరుండగనే నిద్రాదేవత యావహించెనా!

"ఆపెయే కారకురాలని నేననను. ఆవిషయమిక కొంతవిచారణ జరిగినగాని, నిర్ధారణకాజాలదు. పంచాయితీసభ్యులు పొరబడినారనికూడ నేనుగట్టిగా చెప్ప జాలను. కాని సుధాకరుడు మరణించినసమయమున నాపె యింటిలోనేయున్నది. ఆపె యేమియునెరుగనని చెప్పునేగాని, యది విశ్వసనీయముగలేదు. పతంజలి తత్పూర్వమే యాగృహమును విడిచిపోయియుండెననియే నానమ్మకము. ఏదియెట్లున్నను, మనము తరచుగ పొరబడుచుందుము. బాహ్యచిహ్నములనుబట్టి కార్య సాధన మొనర్పబూనుట ప్రమాదకరము. ఇంకను కొంతవరకు పరిశీలన చేయి వలసియున్నది. ఈ యువతిపై నొక కన్నుంచియే మెలగవలసియున్నది. ఇంతిలో ఆపతంజలి యెవ్వడో పట్టవలెను."

రఘునాధాచార్యు డీవిధముగ తర్కించుకొనుచు, పతంజలిని పట్టుకొనుటకు పనిబూనెను. కాని, యందులకొక్క యభ్యంతరముమాత్రము కలదని, యాతనికి వెనువెంటనే దోచినది. ఆపతంజలి రూపురేఖలెట్టివో, వాడెచ్చటనుండి వచ్చెనో, యెచటికిబోయెనో, మనయాచార్యున కొక్కింతయు దెలియదు.

---

# ఆశాభంగము

[ పండితారాధ్యుల నాగభూషణముగారు. ]

గీ|| చిమ్మచీకటు లెల్లెడఁ గ్రమ్మికొనియెఁ
గాలిమబ్బులు వినువీధిఁగడలుకొనియె
సందడులు రాజవీథుల సన్నగిల్లెఁ
దారకాగణ మెచటనో దాగియుండె
శంకజారాతి దర్శనాభావమయ్యె
స్తబ్ధమై ప్రకృతియెల్ల నిద్రాణమయ్యె
వీధి గడియార మొకగంట వినిచెనప్డె
యింతదనుకను రాఁడాయెఁ గాంతుఁడేమొ
గంటయైనను నేవచ్చి కానఁబడఁడు
వచ్చునో రాఁడొ నేఁ డావత్తునంచు
బాసలొనరించెఁ గద యింత మోసమాసె ?
ఏలరాకుండు ? రాకున్న నేమిసేయు
దింత సేపని వేతు నేకాంతసీమ
నెవ్వరే నన్ను గనుగొన్న నేమి యగును ?
జోతలెవరేని బట్టినఁ దారియేది ?
ప్రాఁగుఁబోతులు పైఁబడఁ దలఁగుటెట్లు ?
అత్తమామల, మఱదుల, నాడుబిడ్డఁ
గన్నుగప్పి యిట్లు గాఢాంధకారమునను
విటలిఖితలేఖ వీక్షించి వెల్వడుచు
ముందు వెనుకలఁ జూడక మురిసిపోయి
కీడు మేలుల నొంత తర్కింపకుండఁ
గ్రూరమార శరాసారఘూర్ణితాత్మ
నగుచు నక్కట యేకాకినగుచు వచ్చి
మోహనాంగుని గానక మోసపోతి
నేమి సేయుదు ? దిక్కెది ? యేది తెరవు ?
చాలతడవాయె వచ్చి యీచాయకదిగో
జలదమాలిక తొలఁగెడి కలువ రేడు
చిన్ని వెన్నెల నవ్వుచే ఖిన్నయైన
నన్ను నెగతాళి సేయుచు నున్నవాడు
నిలువరాదింక నిచ్చట నిముసమేని
దొరులకంట బడకుండఁ ద్వరిత గతిని
నిరులు విరియక మున్నె నే నేగవలయు ||

# వివిధవిషయములు.

ఇంగ్లాండులో 1924 సంవత్సరపు యెన్నికలక్రింద పౌ 921,165 లు ఖర్చుపెట్టబడెను. అనగా, పౌను 15 రూపాయల వంతున లెక్కకట్టేయెడల 13817, 475 రూపాయలు ఖర్చయినవి. ఎ. డఫ్ కూపర్ అను నాయన రు 2865 లు ఖర్చుపెట్టెను. ఇదియే ఖర్చుపెట్టబడిన మొత్తములలోకెల్ల పెద్ద మొత్తము. బాల్డ్విన్ గారు 10020 రూపాయలును, లాయిడ్ జార్జిగారు 10020 రూపాయలును ఖర్చుపెట్టిరి. చర్చిల్ గారికి రు 16170 లును, సర్ విలియం జాయిన్సన్ హిక్సుగారికి రు 16740 లును ఖర్చయ్యెను.

* * *

మీరు గుఱ్ఱుపట్టెదరా? పట్టేయెడల, గుఱ్ఱునేల యాపరాదు? దాని నాపుట సులభము. నోరు తెరచుకొని పడుకొనుటవలన గుఱ్ఱువచ్చును. ముక్కుతో నూపిరి పీల్చక నోటితో పీల్చుచున్నందుల కిది ఫలితము. గొంతుకలో నొక తెరవంటిది యుండును. లోపలికి పీల్చబడిన గాలి దానికి తగిలి శబ్దము కలుగును. అదియే గుఱ్ఱు. మనుష్యునియొక్క వయస్సునుబట్టికూడ గుఱ్ఱు కలుగుచుండును. యువకులు ముదుసలులు గుఱ్ఱుపట్టరు. వెల్లగిత్తులుగా పండుకొనుటవలనకూడ నిది తటస్థించును. ఇట్లు పడుకొనుటలో గడ్డము అనుట కాధారములేక క్రిందపడుటయు, అందువలన నోరు తెరచుకొనుట, నోటిలోనుండి ఊపిరిలోనికి పోవుట జరుగుచున్నది. గడ్డము జారిపోకుండ కట్టుకున్నయెడల గుఱ్ఱుతగ్గునట.

* * *

కష్టపడి వ్యాపారముచేయు వాడు దేహారోగ్యము కలిగి చాల కాలము జీవించవలెనంటే, రోజు కథమము 8 మొదలు 10 గంటల నిద్ర ననుభవించవలెనట.

* * *

ఈస్టరులో యార్కుషైరునందు గడుసు భార్యలచే పీడింపబడు భర్తల సంఘమున్నది. దీనికి వ్యతిరేకము పనిచేయు గడుసు భార్యల సంఘము యార్కుషైరులోనే సాల్టైర్ అను గ్రామములో నున్నది. భార్యల సంఘములో సభ్యులుగ జేరదలచిన స్త్రీ మొదట భర్తను సరియైన యదుపు నందుంచుట నేర్చుకొని భర్త యింటిపనులు చక్కబెట్టివానిగ తయారుచేసి, ఉదయమున పక్కనుండి లేచి వచ్చుసరికి తనకు కాఫీ యెదురు తెచ్చునట్లును మేడదిగుసరికి భోజనము తయారుచేయునట్లును భర్తకు శిక్షణనొసంగవలెను. సభ్యురాలుగా చేరదలచిన నాటికి స్త్రీ వివాహమాడి అయిదేండ్లయినను కావలయును. తన గడుసుతనముచే భర్తను పీడించగల యనుభవము 5 సంవత్సరములైనను గడవనిదే పూర్తికాదు. ఇంతేకాక అయిదేండ్లగుసరికి, భర్త తాననుకొనినంత ఘనమైనవాడుకాదని భార్య తెలుసుకొనగలదు. సభ్యురాలుగ చేరు నాటికి ముగ్గురు పిల్లలైనను పుట్టియుండవలెనను నియమము చేయనున్నారట. ఏలనన ముగ్గురు పిల్లలు పుట్టుసరికి సౌందర్యమును గోల్పోయి ఉడుకులు మోతుతనము క్రోధముల నలవరచుకొనునట. నిజముగ సభ్యత్వయోగ్యతను బడసిన స్త్రీ దినమునకు

మూడు పర్యాయములు, ఒక్కొక్క పర్యాయము 15 నిముషములవంతున, భర్తను ముద్దుపెట్టుకొనుట నేర్పు కొని యుండునట.

* * *

మనము యేదస్తారిలో వ్రాస్తామో, ఆదస్తూరిలోనే పెళ్ళిగ్రాములు పంపవానికి చేయు ప్రయత్నములు ఫ్రాన్సులో జేయబడుచున్నవట.

♦ ♦ ♦

మనుష్యులకు మంగలిషాపులులేక సెలూనులు యేవిధముగ బయలు దేరుచున్నవో, ఆ విధముగనే లండనులో కుక్కలకు మంగళ్ళషాపులు బయలుదేరుచున్నవట. ఆ షాపులలో కత్తెరలకు బదులు బల్లలును, మనిషి సబ్బులకు బదులు కుక్కసబ్బులును, పొగరుగ్రోతు కుక్కలను లోబరచుకొనుటకు బిస్కట్లును ఉండునట.

* * *

కొన్ని పాఠశాలలలో ముక్కులతోకూడ డ్రిల్లుచేయిస్తారట. ప్రతి ఉదయము, భోజనము చేయుటకు ముందు, ముక్కును పరిశుభ్రముచేసి ముక్కులోనుండి నోటికి పోవు ద్వారమును శుభ్రముగ నుంచినయెడల చిన్నచిన్న పురుగులను జంపు ద్రవపదార్థమొకటి స్వేచ్ఛగాతిరుగుట కాస్పదముండునట. అందువలన బాలురకు చాల రోగములు రాకుండునని ఒక స్త్రీ వైద్యురాలు తెల్పినది.

* * *

నేపుల్సు నగరమునందు, $5\frac{1}{2}$ సంవత్సరముల క్రిందట చనిపోయిన ఎన్రికోకారూజ్ అనువాని శవము ఒక గ్లాసుపెట్టిలో భద్రపర్చబడినది. ఆశవమునకేమి వ్రాసి శుద్రపరచిరో కాని, నేటికిని యాశవము నిద్రపోవుచున్నటులే యుండునట.

* * *

దక్షిణ ఆస్ట్రేలియా రసాయనశాస్త్ర డైరక్టరుగారు గడ్డిలోనుండి ఆల్కహోలును తయారు చేయవచ్చుననియు, ఒకటన్ను గడ్డిలోనుండి 50 గాలన్లు ఆల్కహోలు లభించుననియు స్పష్టపరచిరి. ఈ దేశములో పెట్రోలుకు బదులు ఆల్కహోలు నుపయోగించు నిమిత్తము, చాల గడ్డిని వినియోగించు చున్నారు.

* * *

ఈజిప్టులోనున్న శిలావిగ్రహములు సైజులోగాని బరువులోగాని అగ్రస్థానము నాక్రమించి యున్నవి. నైలునదీప్రాంతమున చాలపెద్ద మైదానముండుటవలన, సమీపముననున్న కొండరాళ్ళను ఉపయోగించి పెద్దపెద్ద శిలావిగ్రహములను నిర్మింప ఈజిప్టుదేశస్థులు సంసిద్ధులైరి. రోడ్సుపట్టణములో నికలోస్‌గారి ప్రతిమననుసరించి పెద్ద శిలావిగ్రహము నిర్మింపబడినది. ఈ శిలావిగ్రహము 126 అడుగులు యెత్తును చేతివ్రేలు మన సాధారణ మనుష్యునికంటె యెక్కువ పొడవునుయుండెను. చార్లెస్‌అఫ్‌లిండస్ అను నాయన యీవిగ్రహమును తయారుచేసెను. విగ్రహము 56 సంవత్సరముల పాటు బాగుగనేయుండెను. ఒక్కభూకంపమువచ్చి ఈవిగ్రహమును పాడుచేసినది.

* ♦ *

మొంగదోమలు మనుష్యులను కుట్టవట :—

♦ ♦ ♦ ♦

పసిఫిక్కు మహాసముద్రములోని ద్వీపవాసులు పగలు చాలవరకు నీటిలోనే కాలము గడుపుచుండుటచేత నతిశుభ్రముగానుందురు. పిల్లలు నడచుటకు ప్రారంభించిన కొలది కాలములోనే

యీదుట నేర్చుకొందురు, గ్రామము సమీపములోనే ఒకకొలను త్రవ్వించి అందులో యీత నేర్చుకొందురు. శరీరమునకు కొబ్బరినూనెరాచుకొని నారింజ చెట్టుయొక్క బెరడుతో రుద్దుకొనిన నురుగు వచ్చును. శరీరమును తుడుచుకొనుటకు సూర్యుడు గాలి తప్ప వేరు తువాళ్లు వీరికిలేవు.

♦ * *

కోకో మొక్క ఉష్ణప్రదేశములలో చాల భాగములందు పెరుగుచున్నది. ప్రపంచమునందంతటను కోకో వుపయోగము హెచ్చినది. ఈ మొక్కలు వంటరిగ నెచ్చటను పెరుగవు. ఉష్ణప్రదేశములలో నివి చాలబాగుగ పెరిగినను సూర్యరశ్మి వీటికితగులరాదు. కనుకనే కోకో మొక్కలు పెరుగు స్థలములలో యితర అడవి వృక్షములను పెంచుచుందురు. కోకో చెట్టు రేగిచెట్టంత యెత్తుపెరుగును.

* ♦ *

కీటక జాతులలో చీమలు అతితెలివైనవి. తేనెటీగలు అతితెలివితక్కువవి.

♦ ♦ ♦

1831 లో ఫ్రాన్సుదేశస్థుడగు యూజెనీసూబెరాన్ గారును, జర్మనీదేశస్థుడగు బారన్ లీబిక్కుగారును మొట్టమొదట క్లోరోఫారమును కనిపెట్టిరి. 1848లో దీనిని మొట్టమొదట పర్యాయముపయోగించిరి.

♦ ♦ ♦

కొన్ని మాసములక్రితము జార్జివాషింగుటను విశ్వవిద్యాలయమునకు జెందిన 8 గురు విద్యార్థులు క్రొత్తపరిశోధనలు గావించిరి. నిద్రమానవునికి అవుసరమా అనవసరమా అని చర్చించి పరిశోధనకు గడంగిరి. పర్యవసానము యిదమిద్ధమని తేల్చనప్పటికిని. నిద్రయనునది వంశపారంపర్య వచ్చుచున్న సోమరిపోతులక్షణమని తేల్చిరి. నిద్రవిస్తారముగా పోవుటవలన శరీరముయొక్క మాంద్యత హెచ్చును. నిద్రలేనిజాతిని తయారు చేయవచ్చునను సిద్ధాంతమును డాక్టరు హోలింగువర్తుగారు వ్యాపింపచేయుచున్నారు. రెండు మాసముల కొకపర్యాయము అయిదు నిముషముల వంతున నిద్రతగ్గించినయెడల షుమారు 20 సంవత్సరములు జరుగునప్పటికి నిద్రయను యలవాటు తొలగిపోగలదని పాప్యులరు సైన్సుఅను పత్రికలో నొకరువ్రాసియున్నారు.

♦ ♦ ♦

11 ఘనఅడుగులనీరు గడ్డకట్టినయెడల 12 ఘనఅడుగుల మంచుగడ్డ తయారగును

♦ ♦ ♦

సామాన్యమనుష్యునికి యూపిరితిత్తులలో ఒకటింబాతిక గాలను గాలియుండును

♦ ♦ ♦

గబ్బిలములు, పాములు తిండిలేక యితరజంతువు లన్నిటికంటె యెక్కువకాలము బ్రతుకగలవు.

♦ ♦ ♦

అమెరికాలో నుత్సవమునుగాని సభలనుగాని భగ్నము చేయవలెనన్న తోడ్పడు సంఘమొకటి గలదు. అయిదువందలు మొదలు మూడువేల డాలరులవరకు రుసుములను తీసికొని యుత్సవములనుగాని సభలనుగాని యా సంఘ సభ్యులు భగ్నము చేయగలరు. ఒకనాటకములో నల్లరిజేసి నిలిపివేయుటకు వీరుతీసుకొను రుసుము 25 డాలరులు, వివాహములను భగ్నము చేయుటకు రంగము ఒకటింటికి 300 డాలరులు చార్జిచేయబడును.

యౌవనములోనున్న స్త్రీ యింకను తక్కువ వయస్సుగల దానివలె నగపడనటించును. ఆమె పెద్దదైనప్పుడు జరిగినయేండ్లను జ్ఞప్తికిదెచ్చుకొని, గర్వించుచుండును, ఇరువైయేండ్లున్నప్పుడు సంతోషముగను, 40 యేండ్లున్నప్పుడు లజ్జాకరముగను, 60 యేండ్లున్నప్పుడు విచారగ్రస్తముగను, ఎనుబది యేండ్లున్నప్పుడు గర్వితముగను స్త్రీ సంచరించును. యౌవనముకంటె స్త్రీకి యెక్కువ విలువయినది మరియొకటిలేదు.

♦ ♦ ♦

గౌరవనీయులగు విఠలబాయిపటేలుగారు (సామ్రాజ్య శాసన సభాధిపతులు) తమకు వచ్చు నెల జీతము రు 4000 లలో రు 2000 లు రాజకీయ సంబధములేని అస్పృశ్యతానివారణ, ఖాదీ ప్రచారము మున్నగు కార్యములకై ఖర్చుపెట్టు నిమిత్తము మహాత్మ గాంధిగారికిచ్చుచున్నారట. బొంబాయి జాతీయ మ్యునిసిపల్ పత్రమువారు పటేలుగారికిచ్చిన రు 3000 లు పైకార్యములక్రింద ఖర్చుపెట్టు నిమిత్తము గాంధిగారి వశము చేయబడెనట.

♦ ♦ ♦

ఒక్క బొంబాయి నగరమందే 885 వ్యభిచార గృహములున్నవి. ఇందు 5164 మంది వ్యభిచారిణులున్నారు. రహస్యముగ నీ నీచవృత్తి నవలంభించుచున్నవారు 30000 ల కెక్కుడుగ నుందురని రిపోర్టులవలన తెలియుచున్నది. దీనిని నమ్ముట కనుమానించునెడ అధమము 15000 మందియైనను నుందురని నిర్ణయించుకొనవచ్చును.

♦ ♦ ♦

## కడపలుకులు.

(కాళీపతి.)

కాంచనేజాలితి దురతిక్రమమటంచు
నిచటనుండి వీడ్కొనునప్పుడే వచించు
నంత్యవాక్యమ్ముగునుగాక !– నమలకాంతి
సాగరమునం బ్రఫుల్ల మానసరసిజమున
దాంగు నాసవమూనుతం ధన్యుడంగద
కడపలుకు లియ్యవియే యగునాకు.
ఆటలాడితి నేనీ యనంతరూప
సంకలితమిట్టి నాటకశాలయందు
నిచటనే రూపరహితు దర్శించినాడ !
కాయ మవయవములును బులకాంకితములు
నయ్యె స్పృశియింప నలవిగానట్టి వాని
స్పర్శనంబున; నాకవసానమిట నె
వచ్చునేనియు నింక రావచ్చుగాక !
కడపలుకు లియ్యవియె యగుగాక నాకు

# విమర్శనలు

స్వవిషయము:—

మాపత్రిక ప్రతిమాసము 20 వ తారీఖున వెలువడుచున్నది. మాకు ప్రోత్సాహమొసంగుచున్న పోషకులకు చందాదారులకు లేఖకులకు అనేకవందనములు. ఈసందర్భములో నొకవిషయము నుదహరించవలసియున్నది. ఆధునిక కవిత్వమును నిరసించి, ప్రాచీనకవిత్వమునకుమాత్రము ప్రాధాన్యత నిచ్చుచున్నామని కొందరను చున్నారు. కొందరు ప్రస్తుతకవులు వ్రాయు ఆధునిక కవిత్వములోని భావముల పఠించి యానందింపకపోము. కాని సారవిహీనమై యతిప్రాసలులేక వ్రాయు కవిత్వమును సమర్థించుట దుస్తరము. ఇంతేకాదు, మేముప్రకటించు పద్యముల లో గూడ నసందర్భపువర్ణనలు గలవు. వాటిని పాఠకులు మచ్చునకై చదివి గ్రహించగలరు. అయినను విలేఖరులు వ్రాయు వ్యాసములకును పద్యములకును విమర్శనలకును మేముత్తరవాదులముకాము. "వినదగు నెవ్వరుచెప్పిన" అన్నారు గనుక అందరికిని సమానప్రోత్సాహము నొసంగ యత్నించుచున్నారము.

ఆంధ్ర విశ్వవిద్యాలయము:—

ఆంధ్రవిశ్వవిద్యాలయపు యెన్నికలు మాకు నిరుత్సాహమును కలుగజేసిన వని చెప్పకతప్పదు. ఎన్నుకొనబడినవారిలో ముప్పాతికభాగము ప్రొఫెసర్లు. కళా శాలల ప్రిన్సుపాల్సు అందరు ఉద్యోగరీత్యాసభ్యులు. ప్రజానాయకులనుండి యెన్నుకొనబడినవారు స్వల్పము. కనుక యీ ప్రొఫెసరల్లో నెంతమంది స్వలాభ మును విడచి, వైస్‌ఛాన్సెల్లర్ మున్నగు అధికారుల ప్రాపకమునకై వెనుగులాడక స్వతంత్రులుగ నిలుతురో చూడవలసియున్నది.

హిందూదేశపురైతు :—

హిందుదేశమునం దనేకమంది వ్యవసాయమే వృత్తిగాగలిగి జీవనముచేయు చున్నారు. పూర్వము మహారాష్ట్రుల కాలమునందును మొగలాయి సామ్రాజ్య

మునందును రయితులు రాజులయొక్క యౌదార్యమునకు పాత్రులై పండినపంటలో ఖర్చులుపోను మిగిలినదానిలో కొంతభాగము రాజుకిచ్చి, శేషించినదానిని తామే యనుభవించుచుండిరి. ఇంతేగాక నాగళ్ళను, విత్తనములను, యెరువును మరి ఇతర వ్యవసాయ పరికరములను కొనుటకు పెట్టుబడిలేకున్న యెడల రాజే స్వయముగా ద్రవ్యమును పెట్టుబడిపెట్టి ఫలసాయమునుండి వసూలు చేసుకొనెడివాడు. ఇపుడా పద్ధతులన్నియు మాయమైనవి. ఇపుడు రయితుపండినను పండకున్నను యెకరమునకు కొంతవిధిగా చెల్లించుచు ప్రభుత్వమునకు బానిసయగుచున్నాడు. ధనికులు వ్యవసాయమునెడల నిర్లక్ష్యముజూపుటయు, తత్ఫలితముగ నితరపరిశ్రమలుగూడ నశించుటయు సంభవించుచున్నది. రైతు తనభూమిని తన పశువులను అమ్మి కృశించుచు జాతీయసౌభాగ్య నాశనమునకు కారణభూతుడగుచున్నాడు. ప్రోత్సాహము చాలనందున ధైర్యములేక నల్లల్లాడుచున్నాడు. రైతు కృంగుటతో గ్రామ జీవనము నందలి కట్టుబాట్లు క్షీణించుచున్నవి. ప్రభుత్వమన్ననో రైతులు చెల్లించవలసిన శిస్తులను నానాటికి హెచ్చుజేయుచు రైతులస్థితినిదుర్భరముజేయుచున్నారు. ఎలిఫింస్టన్‌గారు నుడివినట్లు "ఎన్నిలోపము లున్నప్పటికిని, మహారాష్ట్రులకాలమునందే యభివృద్ధిని బడయుచు, ప్రస్తుతమున బ్రిటిషు ప్రభుత్వమునందుగల కొన్ని లోపములు ఆకాలమునందు లేక, సుఖజీవనము చేయుచున్నారు." "డక్కను పీఠభూమి బ్రిటిషు ప్రభుత్వమునకు స్వాధీనమైన సమయములో, దేశమభివృద్ధినొందుచుండెడిది. దేశమునందు శోచనీయమగు దారిద్ర్యమునకుగల కారణము దుర్భరమగు భూమిపన్నే" అని వింగేటుగారు వ్రాసియున్నారు. ప్రస్తుత రెవిన్యూ పద్ధతికి యిదమిద్ధమగు త్రోవలేదు. ప్రజలు ప్రభుత్వమువారి సదుద్దేశములందు సంపూర్ణవిశ్వాసముంచి నప్పటికిని, ప్రభుత్వమువారు వానిని తృణీకరించి స్వలాభము కొరకు పన్నుల నిర్ణయించుట జరుగుచున్నది. అనగా యేడాదిలో కొంతకాలము ప్రభుత్వమునకును మరికొంతకాలము మిల్లు యజమానులకును, రైతు బానిసయగుచున్నాడు. శిస్తునిర్ణయములను రెవిన్యూ అధికారులు చేయుచుందురు. వీరు కావించిన నిర్ణయముపై సివిలుకోర్టులో అప్పీలు చేసుకొనుటకు వీలులేదు. ఏరెవిన్యూ ఉద్యోగస్తులు శిస్తుల నిర్ణయించెదరో ఆయుద్యోగస్తుల యెదుటనే అప్పీలు చేసుకొను దుస్థితి సంభవించినప్పుడు రయితు విముక్తినొందుట కల్ల. ఇందుకు అనేక సవరణలు చేయవలసిన బాధ్యత ప్రభుత్వముపై నున్నది. మొదటిదిగాను సేద్యముచేయు భూమికి రైతే సంపూర్ణహక్కులు కలిగి యుండవలెను. రైతు లియ్యవలసిన పన్నులను తగ్గించవలెను. శిస్తునిర్ణయముపై సివిలుకోర్టులో అప్పీలు

చేసుకొనుటకు అధికారముండవలెను. సర్వేశాఖవారు నిర్ణయించినవిధముగగాక పండినపంటనుబట్టి శిస్తులు వసూలుచేయవలయును. ప్రభుత్వమువారు సైనికశాఖ యొక్కయు, సివిలుసర్వీసు యుద్యోగీయుల యొక్కయు ఖర్చులనుతగ్గించి తనమూలమున రైతుయొక్క శిస్తుభారమును తగ్గించవలెను.

ఒక సందేహము:—

ఒక సత్రమునకుగాని, ఒక దేవాలయమునకుగాని, లేక ఒకపాఠశాలకుగాని సంబంధించిన డబ్బు సదరు సంస్థయొక్క నిర్వాహకుడు దుర్వినియోగముచేసిన కారణముచే, ప్రాసిక్యూషను చేయబడె ననుకొనుడు. సదరు నిర్వాహకుడు మొదట డబ్బుకట్టక, విచారణ కొంత జరిగినపిమ్మట శిక్షపడుననే భయముతో డబ్బుకట్టె ననుకొనుడు. ఆసందర్భములో నాతనిపై నేరారోపణను రద్దుచేయుట కేశాసనమైనా అంగీకరించునేమో తెలుప న్యాయవాద మిత్రులను కోరుచున్నాము. లేక ఒకపార్టీకి చెందినవాడను యుద్దేశ్యముతోగాని, ఆతనిసంసారము నిలచునను యుద్దేశ్యముతోగాని, ఉద్యోగస్థుల శిఫారసులతోగాని అట్టి ప్రాసిక్యూషనును రద్దుచేయవచ్చునేమో బుద్ధిమంతులు దెల్పెదరుగాక.

స్వీకారము:-

నవశక్తి, పశ్చిమాంధ్ర పత్రికలను కృతజ్ఞతతో నందికొంటిమి. ఈరెండు పత్రికలు చాలకాలము వర్ధిల్లుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నారము.

శ్రీయుత అచ్యుతిని వేంకటాచలపతిరావుగారు రచించిన "వేదభూమి" యను గ్రంథమును వందనపూర్వకముగ నందికొంటిమి. ఈ గ్రంథమును గూర్చిన విమర్శనను సవిస్తారముగ మరియొకపర్యాయము వ్రాయుదుము.

ఆంధ్రసోదరులకుమనవి:-

ఉద్రేకముతగ్గినది. కనుక ఆంధ్రులీపర్యాయమైనను శ్రీ యస్. ఎస్. శ్రీనివాస అయ్యంగారి గౌహతికాంగ్రెస్ అధ్యక్షులుగా నెన్నుకొని, అరవలంటె ఆంధ్రులకు సరిపడదనే నిందారోపణను తొలగించుకొని, శాశ్వతమైన ఆంధ్రఅరవసమ్మేళనమునకు దోడ్పడుదురుగాకయని కోరుచున్నాము

REG NO. M- 2154 SUB- AMOUNT Rs. 3

# కృష్ణా ఖద్దర్ సంఘము

# లిమిటెడ్

## మచిలీపట్టణము

**మూలధనము—రు 30,000 లు.**

**వా 1 కి రు 5 ల చొ॥న 6,000 వాటాలుగా**

విభజించడమైనది.

**ఉద్యమము మీ సహకారమును**

వాంఛించుచున్నది.

గృహపరిశ్రమలను నెలకొల్పుటకును, ప్రోత్సహించుటకును

ఈ సంఘము స్థాపించబడి,

**వ్యాపారము ప్రారంభించడమైనది**

అవుసరమైన ప్రదేశములందు బ్రాంచి డిపోలు వీలువెంబడి

ఏర్పాటుచేయబడును.

**ఆంధ్రదేశములో ఏజంట్లు కావలెను.**

దిట్టకవి వీరరాఘవయ్య,

మేనేజింగు డైరక్టరు.

# శ్రీ ఆంధ్ర సర్వస్వము

మాసపత్రిక

సంపాదకుఁడు

పడీది వేంకటరావు

రాజమహేంద్రవరము

సంపుటము ౧ సంచిక ౧

# విషయసూచిక

# మాతృభాషా సందేశము

[త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు]

సీ. అవనీజనంబుల కన్యోన్యహృద్భావ
సువగతంబుగఁ జేయునట్టిచతుర
తనుఁ గొల్చువారి కింపును నందుభవ్యప
దావాప్తి సమకూర్చునట్టివరద
సంసారగహనసంచరణఖిన్నము లైన
జనచిత్తములకు విశ్రామభూమి
విబుధజిహ్వాసింహపీఠికాసీన యై
లోక మేలెడుసర్వలోకరాజ్ఞి

తే. యఖిలలోకకుటుంబిని యైనవాణి
గీతసాహిత్యరసమయక్షీరములను
దేలఁగుచుండెడుతనచన్నుదోయిఁ గుడిపి
తనదుబిడ్డల నాంధ్రులఁ దనుపుఁ గాత

క. సోదరులలోనఁ బొడము వి
వాదముఁ గని తల్లి యాంధ్రవాగ్దేవివిషా
దాదరకోపకృపాకలి
తాదేశంబిడియె నిటు నిజాత్మభవులకున్.

ఆ. మన్ననమునఁ దనదు మహితాశయము దోఁపఁ
జేసి మీకుఁ దెలియఁ జెప్పు మనియె
నంబ నుడులు గాఁదె యాదేశమును మీకు
విన్నవింతు వినుఁడి యన్నలార.

ఉ. పుత్రకులార నాదు పెనుపున్
మదిఁ గోరెడు మీర లింగితిన్
మైత్రిఁ దొలంగి యొండొరులు
మాటికి వ్యర్థవివాదమగ్ను లై
ధాత్రిని బైపయుం బెనుపు
దార్చెను నాసరివారిలో మహా
పత్రిప నాకుఁ గూర్చు టిది
పాడియె మేమును వానమున్నె మా

క. వాదములఁ బ్రతివాదులు నవ్వఁ
గాదని క్రీడింతుకాని కర్తవ్యాంశం
బేది యొ యెఱుంగరై తిరి
గాదిలిసుతులార బుద్ధి గలవో లేవో.

తే. గ్రాంథికము మేలు గ్రామ్యంబు కంటె ననుచు
గ్రాంథికముకంటెఁ గడుమేలు గ్రామ్యమనుచు
నుభయవాదులు వాదించుచొండొరులను
దిట్టికొంటయ కాక నన్ దిట్టుచుంద్రు.

క. గ్రామ్యగ్రాంథికవాదము
భూమ్యాకాశములనిండిపోయె నవుర ని
స్సామ్యగతిఁ దిట్టుకొంటయె
సమ్యక్ఫలమయ్యె నీసు సను నేమీకున్.

క. మీ కిక వాదము వలవదు
నాకలరూపెఱుఁగఁ జెప్పి నాకుఁ గడుహితం
బౌ కార్యము వివరించెద
మీకున్ నాహితము గడు సమీ
హితము గదా

ఆ. గ్రామ్యవాదులకును గ్రాంథికవాదుల
కగ్రగణ్యులైన యాత్మజులకు
వేఱువేఱ చక్క వివరింతు లోక స
మ్మతము బుధమతము మదభిమతము హితము

(సశేషము)

# ఆంధ్రసాహిత్య పరిషత్తు—చతుర్దశ సమావేశము

ఆంధ్రసాహిత్య పరిషత్సభ ఈసంవత్సరము కాకినాడయందు ఫిబ్రవరి ౬—7 తేదీలలో జరిగినది. ఆహ్వానసంఘాధ్యక్షులు ది॥ బ॥ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు. అధ్యక్షులు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు. కవిగా రధ్యక్షపదవి నలంకరించుట కర్హులా? ఇది సాహిత్యసభ కదా!

సాహిత్యపరిషత్తు పదునాలుగు సంవత్సరము లరణ్యావాసము చేసినది. ఇక అజ్ఞాతవాస మెంతకాలము చేయునో? ఇంతకాలమును పరిషత్తు నెలకొల్పఁబడినను దొరతనమువారు దీని యునికినయిన గుర్తించినటులఁగాన్పించదు. గమనించినచో విద్యార్థులకు పఠనీయగ్రంథములు నిర్ణయించు సందర్భమున నయిన దీనిఅనుమతి బడయకుందురా? అమాత్రమయిన లేకున్న మన పరిషత్తుయొక్క ప్రయోజన మేమి? ఆంధ్ర విశ్వవిద్యాలయము కూడ వచ్చినదే? పట్టుమని పది శాస్త్రగ్రంథము లాంధ్రమున లేవే? అట్టి గ్రంథములు వ్రాయించు భారము మన పరిషత్తుదికాదా?

పరిషత్తువారి నిరంకుశాధికార మెంతమాత్రము బాగులేదు. వారి కింతకన్న విశాలహృదయమును ఉన్నతభావములును చూపినఁగాని పరిషత్తు గతి యెన్నటికినింతియ. రామయ్యపంతులుగారు పరిషత్తును నెలకొల్పి రను మాట వాస్తవము. దాని కొఱకు 40 వేల రూపాయలు నిలువచేసియే యుండవచ్చును. ఆగౌరవము చాలును. అంతటితో తృప్తినంది పంతులుగారు విశ్రాంతి తీసికొనుట యుక్తము. లేకున్న తమ పరిషత్పత్రిక యింకను కొంత కాలము గుంటపువ్వులు పూయుచుండు ననుట నిక్కము. పరిషత్తొకరి సొమ్ముగాదను సంగతి పంతులుగారెఱుగనిదికాదు. ఎల్లకాలము పరిషత్తిట్లే యుండునసుటకు వీలు పడదు. పరిషత్తును తమ వెంట తీసికొని పోవుటకే స్థాపించిరా పంతులుగారు? పరిణయము గావించిరికూడను. అత్తవారింటికి వచ్చు ప్రాయము వచ్చినది. పుట్టినింటిపరిస్థితులకును మెట్టినింటి పరిస్థితులకును ఎంతయేని వ్యత్యాస ముండును. దేశము వేఱు. కాలము మారినది. పరిస్థితులు మారినవి.

ఈ సంవత్సరము సభ చివరకు గరిటిభాగవతముక్రింద పరిణమించినది. పరిషత్తువారు చేసిన తీర్మానములలో ముఖ్యముగ గమనించవలసినవి రెండుకలవు.

అందు మొదటిది పరిషత్కార్యస్థానమును కాకినాడకు మార్చుటకు తీర్మానింపఁబడుట. ఈతీర్మానము కాగితముమీదనుండవలసినదే. ఏలందురేని, ప్రతిసంవత్సరము ఏదో ఒక పురమునకు కార్యస్థానము మార్చుటకు తీర్మానించుటయు, మరుసటి

సంవత్సర మా తీర్మానమును రద్దుచేసి యింకొక పురమునకు మార్చుటకు తీర్మానించుటయు నాచారమై యున్నది. తుద కెచ్చటకును మార్చుటలేదు. కావున పరిషత్కార్యస్థానము కాకినాడకువచ్చినపిమ్మట గాని యీతీర్మానములులోనికి వచ్చెననుటకు వీలుండదు.

రెండవది నిరూడుతణుకుసభలో వ్యవహారికభాష కనుకూలముగ నుపపాదించిన తీర్మానమును రద్దుచేసి, వ్యవహారికభాషకు పరిషత్తునందు తావొసంగకుండుటకై 1914 సంవత్సరమున కాకినాడయందు జరిగిన పరిషత్సభలో గ్రాంథికభాష కనుకూలముగ నుపపాదించిన తీర్మానమును తిరిగి ఉపపాదించిరి.

ఈ రోజులలో తీర్మానము లడ్డగలవా యని ఒక సందేహము. సానికొంపకైన అడ్డుకలదు గాని సారస్వతభవనమున కడ్డు కాన్పింపదు. నేడు ఆంగ్లవాఙ్మయ సంపర్కఫలము పూర్తిగనున్న దనవలసియున్నది. ఇప్పుడు ఆంధ్రవాఙ్మయతరంగముల నానాకశ్మలము కొట్టుకొని వచ్చుచున్నది. ఇది వరద సమయము కొంతకాలము పోయినఁ గాని బురదపిరిగి తేటనీరు కాన్పించదు. నేడావరద నాపుటకుఁగాని ఆపాబురద నడుగునకు త్రోసివేయుటకుఁ గాని తీర్మానము లనవసరములు. ప్రకృతియందీ మార్పు సహజము.

ఎన్నివిధములచేతి నాలోచించినను భాషయందీ మార్పు తప్పదు. అది ప్రకృతిజన్యము. ఇవి పూర్వపురోజులు కావు. తెలుఁగనిన నలుగురకును అభిమానమెక్కువైనది. అన్యభాషాపదములు కుప్పలు కుప్పలుగ వచ్చి మన భాషయందు కలిసినవి. కలియుచున్నవి. కలియఁగలవు. ఛాందసవృత్తి పూనినలాభము లేదు. ఆంధ్రభాష నేడు ప్రజాపోషణమునం దున్నది. కవి నేఁకాలమునను పోషకుని అభిరుచి కనుకూలముగ వ్రాయవలెను. వ్రాయును. నేడు ప్రబంధములు కావలసినవారేరి? భాష కొఱపివేయబడినది ఛాందసులు పరితపించుటయు సహజము పరితపించిన లాభమును గాన్పింపదు. ఇది గద్యయుగము. (pge of prose) అనేకోద్గ్రంథము లితరభాషలనుండి తర్జుమా చేయించవలసియున్నది. శాస్త్రగ్రంథములు వ్రాయించవలసియున్నది. భాషకన్న భావమనిన అభిమానమెక్కువయైనది. ఇదే సంధిసమయము. ఒక్కొక్కకవి కొక్కొక్క వ్యాకరణము బయలుదేరిన గాని మన వాఙ్మయము సంపూర్ణవికాసము నొందదనువారు కూడ బయలుదేరిరి. కావున కండ్లప్పగించి చూచుటయే కాని మనము చేయునదేదియు నులేదు. వ్యావహారికభాషావాదులు పెచ్చుపెరిగి వారియిచ్చవచ్చినటుల వ్రాయుచున్నారు. వారివ్రాతలు పత్రికలన్నియు నామోదించుచున్నవి. ఆమోదింపకవీలులేదు.

గిడుగు వేంకటరామమూర్తిపంతులు పరిషత్తునుండి చీలిపోవుటచే గ్రాంథిక వాదులు బ్రతికితి మని తలపవచ్చునుగాక. రామమూర్తిపంతులు ఉన్నప్పటి గౌరవము లేకున్నచో పరిషత్తుకు రాదని పరిషత్సభ్యు లెఱుంగునది. ఆతడు పరిషత్తును విడిచిన పరిషత్తునకు కుడిచెయ్యి పోయినదన్నమాట వాస్తవము. ఆయనకన్న నీ గ్రాంథిక వాదులేరును ఎక్కువ పరిశ్రమ చేసిన సాహిత్యపరులు గారని నొక్కి వక్కాణింపనగును. ఆతడొక వాదమునకు మొనగాడయినంతమాత్రాన పరిషత్తునుండి చీలిపోనిచ్చుట ధర్మమా? గౌరవసభ్యుడుగ నుండదగినవాని చందాసొమ్ము చెల్లించ లేదను నెపమున వోటింగువవరు నియ్యక పరిషత్తునుండి చీలిపోనిచ్చుటకన్న అవివేకము వేరొండుండునా? తాము రూల్సుప్రకారము చేసిరా యనినను ఆదే రూల్సుక్రింద నెక్కువసంవత్సరములు చందా చెల్లించని రంగారావుగారు వోటింగు అధికారమే లేనంతట కార్యదర్శిగనుండి తమనివేదికను చదువుట కెట్లర్హులో బోధపడకున్నది. అటుపైని రామయ్యపంతులుగారి చిత్తమందురు కాబోలు నేమొ.

ఇఁక నిఘంటువుసంగతి చూతము. ఏసంవత్సరమున కాసంవత్సరము మొదటి సంపుటము ముద్రింతుమనుటయే కాని బయటకువచ్చుటమాత్రము లేదు. మహారాజావారిసొమ్ము ఖర్చగుట లేదనుటగాదు. కాని ప్రస్తుత మీనిఘంటు వవసరమా? కాదా? వీరు వ్రాయించు నిఘంటు వెంత వఱకు సరియైనది. అను విషయములు చర్చించవలసి యున్నది. ఇట్టికార్యములకు పూనుకొనుట కన్యు లసమర్థు లనుమాట నిక్కము. ఇప్పుడున్న నిఘంటువులలో తలమానికము శబ్దరత్నాకరము. సీతారామాచార్యులుగారు అప్పటికి దొరకిన గ్రంథములయొక్క తాళపత్రప్రతులలోని పాఠాంతరములను పూర్తిగ గమనించి వ్రాసియున్నారు. అది పూర్తిచేసి కొద్ది సంవత్సరములే యైనది. వేఱొక పెద్ద నిఘంటువు వ్రాయించు టవసరమే; కాని సమయమింకను రాలేదు. అనేకోద్గ్రంథములు దొరకవలసి యున్నది. దొరకిన వానిలో కవిపేరు తెలియనివి కొన్నియు గ్రంథముపేరు తెలియనివి కొన్నియు పొత్తములు గలవు. దొరకినను అచ్చుకాని గ్రంథము లెన్నిలేవు. ఈగ్రంథము లన్నిటను మనమెన్నడును కని వినని నూతన పదము లెన్నియేని కలవు. ఇంకను కొంత వాఙ్మయపరిశోధనము తీవ్రముగ జరిపిన మీఁదటగాని సరియైన ఆంధ్రనిఘంటువు వ్రాయుటకు వీలుండదు. ఆంధ్రులలో పరిశోధన మిప్పుడే మొలకెత్తుచున్నది. సరియైన పరిశోధకులు బయలుదేరి తీవ్రముగ పరిశోధనము సలిపినచో నిఘంటువు వ్రాయుటకు సమయ మొకశతాబ్దమునకు రాఁగలదు. ఈయిరువదియవ శతాబ్దమున

పూర్ణయ్య ప్రధాని నిస్సంశయము గ నసాధారణప్రజ్ఞా దురంధరుడు. అతని బోలిన మంత్రిశిఖామణి పదునెనిమిదవ శతాబ్దమున మరియొకడు జన్మించియుండ లేడు. పదునెనిమిదవశతాబ్దపుకడపటిభాగమున రాజ్యస్థాపనాకాంక్షతో విశ్వప్రయత్నములు గావించుచుండిన యాంగ్లేయులకు, ఆటంకములను గల్పించినవి దక్షిణహిందూస్థానమున మైసూరు సుల్తానులతోటి యుద్ధములే యని చరిత్రకారుల యభిప్రాయము. మెఱుపువేగముతో, సైన్యములను నడిపించుచు, నాంగ్లేయుల కెంతెంతనరాని, యిక్కట్లు గల్గించుచు, యుద్ధములందు ఓడించుచు, తుదకు వారికీ దేశమున నిలువనీడయు, లేకుండ బోవునంతటి భీతి గల్గించిన హైదరల్లీ, టిప్పూసుల్తానులకు పూర్ణయ్య వంటి మంత్రిచూడామణి, రాజనీతివేత్త, వర్తనీతిజ్ఞుడుండుట బట్టియే మహమ్మదీయ ప్రభువులు ప్రయత్నములు జయప్రదములగుచుండెనని బ్రిటిషు చరిత్రకారులు పలుమారు లొప్పుకొని మెచ్చుకొనియుండిరి. ఆసుల్తానుల యెడతెగని సమరసన్నాహములకు వలయు, ధనసైన్యములు ప్రోవుజేసి యుంచుటకు విశ్వాసపూరితమైన పూర్ణయ్యగారి ప్రతిభావిశేషము, పరిపాలనాదక్షతయు ప్రాణబీజములయ్యెను. అంతటి సమర్థతతో స్వామిభక్తిని ప్రకటించి కీర్తికెక్కిన యీ పూర్ణయ్యయే టిప్పూసుల్తాను మరణానంతరము ఆంగ్లేయులకు మహారాష్ట్రులతోడి యుద్ధములందు బ్రిటి యున్న మైసూరురాజ్యము చేత ధన సైన్య సన్నాహములు జేసి పంపుచు విజయముం గూర్చి వారి కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. అతని ప్రజ్ఞావిశేషములకు పరిపాలనాదక్షతంలకు, శక్తిసామర్థ్యములను పలుమారు ప్రత్యక్షముగ గాంచుచు నచ్చెరువందిన వెల్లింగుటన్, వెల్లస్లీప్రభృతులు మైసూరున కిట్టి మంత్రిశిరోమణి యుండుట బట్టియే మొదట నారాజ్యము దుర్భిక్షగ్రస్తమై దుర్దశయమై యుండెననియు, నామహమ్మదీయ వంశనిర్మూల మయినతరువాత వరల నతి సూక్ష్మకాలములో, కష్టకాలము గడచి సుఖమును, శాంతిని, యైశ్వర్యమును బడయగల్గెననియు పెక్కునారులు శ్లాఘించి యుండిరి.

పూర్ణయ్య అసాధారణప్రజ్ఞా దురంధరుడనుట కెల్లవిధముల దగినవాడు. మొదట మునల్మానురాజవంశమునకు భృత్యుడై, హిందూరాజవంశమునకును, ఆంగ్లేయులకును, తేరిచూడగరాని శత్రువై రాజ్యాంగము నడపెను. ఆహిందూరాజవంశమునసే పునస్థాపితము చేసినవెనుక విశ్వాసపాత్రుడై, తనకు ప్రబల శత్రువులయియుండిన బ్రిటిషువారి కత్యంతహితుడై రాజ్యపాలనము పదునొకండేట్ల నిష్కళ్మషముగ నెల్లరునోహోయనగ బాలించి ప్రఖ్యాతివడసెను. కళంకమునకు తావిచ్చిన లేని జీవితమును, పూర్ణయ్య కళం

కరహితముగా నెనర్చుటకు ప్రయత్నించి సిద్ధిగాంచెను. నిజస్వామి యగు బాలరాజునకు ద్రోహము వాటిల్లకుండ, నెల్లవేళల వంకుశము వలె యున్న బ్రిటిషు ప్రభువుల కాగ్రహము జనింపకుండ, తన యాత్మగౌరవము, స్వాతంత్ర్యాభిలాష, రాజభక్తి విశ్వాసములు చెక్కు చెదరకుండ ధరణీ చక్రము త్రిప్పెను. అతని పరిపాలనము ఆంగ్లేయులకు వెఱపును, ఆశ్చర్యమును కలుగజేసెను. మహమ్మదీయుల పాలనమున తెఱపిలేని యుద్ధములచే, నెంతయు, చిక్కి జివికియున్న మైసూరు హిందూరాజ్యరమ, మరల, మన పూర్ణయ్య బాహుచ్ఛాయల జీవకళతో, శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమాన యగుచువచ్చెను.

మైసూరు రాజ్యము జయింపబడిన తరువాత నాంగ్లేయులు, హిందూరాజును సింహాసనస్థుని జేయువేళ మంత్రి పూర్ణయ్యగారినే, రాజ్యభారము వహించి, చెల్లాచెదరై యున్న దేశమును, కష్టముల పాలయియున్న ప్రజలను, గాపాడ నియోగించిరి. ఆ దివాను పదవియందు పూర్ణయ్య జూపిన దక్షత, ప్రజ్ఞయు నద్భుతములు. ఎవరినిగాంచినను పూర్ణయ్య మాత్రము వారియెడల విశ్వాసమును, రాజభక్తిని గొరతలేక వెల్లడించుచు వచ్చెను. హిందూ రాజ్యమును సంరక్షించుచు ఆశోపహతులయిన మహమ్మదీయ ప్రజాసంఘమును ఓదార్చి మరపించుటకు దగిన దక్షుడు పూర్ణయ్యయే యనిపించెను. దివానుగా నియమింపబడిన తరువాత పూర్ణయ్య క్రొత్తస్వామిని గొలువవలసివచ్చెను. తనకును, పూర్వపు నిజస్వామియగు టిప్పూసుల్తానునకును పరమశత్రువులయిన ఆంగ్లేయులకు హితుడు కావలసివచ్చెను. వారి యాజ్ఞానుసారము, వారి యంగీకారమును బడయుచు హిందూరాజ్యమును బరిపాలన చేయవలసివచ్చెను. అట్లయ్యును అనమాన ప్రజ్ఞాధురంధరుడగు పూర్ణయ్య, జారిన దేశగౌరవమును చక్కదిద్ది, దుస్థితియందు మునిగియున్న హిందూసంఘమును పునరుద్ధరించి ప్రజలకు శాంతియు, సుఖము నొసంగి, పరిపాలనముపట్ల గౌరవమును, భక్తిని విశ్వాసమును జనింపజేసెను.

పూర్ణయ్య ౧౮౦౦ మొదలుకొని ౧౮౧౧ వఱకు పదనొకండు సంవత్సరములు దివానుపనిచేసి రాజ్యమును చక్కపఱచెను. అతని పరిపాలనా విధానమును, అతని ప్రయత్నములను, పద్ధతులను వర్ణించుటకు యీపుటలు చాలవు. కావున సూక్ష్మముగ సూచింప ప్రయత్నించెదము. ఆంగ్లేయులు కృష్ణరాజవొడయరు సింహాసనముపై నభిషేకించుటకు పూర్వము పూర్ణయ్య దేశమును శాంతిపఱుపవలసివచ్చెను. దుర్మార్గులయిన జమీందారులను, దుర్గాధిపతులను, పాలెగార్లను వంచించి శిక్షించుటలో పూర్ణయ్యకు జనరల్ హారిసును మున్నగువారు విశేషసహాయమును చేసియుం

౯౯. తమంతటతామె వైరమును త్యజించి శరణుజొచ్చిన ద్రోహులను పూర్ణయ్య మన్నించి, గౌరవించి, వారివారి దుర్గములను, పాళెములను ఇచ్చివేసెను. ద్రోహ మొనర్చిన పాళెగార్లకు సహాయభూతులయి, తిరుగుబాటు గావించిన, చిట్టలదుర్గము, శ్రీరంగపట్టణములందుంచబడిన బ్రిటిషు సైన్యదళములను హతమార్చి శాంతి నెలకొల్పి, బ్రిటిషుప్రభువుల కృతజ్ఞతను బడసెను.

తాను దివాను అయినపిదప, బ్రిటిషురాజ్యహస్తము సంరక్షించుచుండ, తన రాజ్యమునకు మునుపటివలె పెద్దసైన్యమనవసరమని తగ్గించెను. రాజ్యమందుగల ప్రతి గ్రామములందు పూర్వపు పరిపాలనాపద్ధతిని చక్కబఱచి, పటేలు, కరణము, మొదలుగా గల యుద్యోగస్తుల నెప్పటియట్ల యేర్పాటు గావించెను. గ్రామపంచాయితీల నేర్పఱిచెను. గ్రామములందు పూర్వపు పద్ధతి ననుసరించి, వంతు కావలివాండ్రను నియమించి యే యకార్యములును జరుగకుండ కట్టడలు జేసెను. న్యాయస్థానములయందును, పన్నులీయు యుద్యోగస్తులందును గౌరవభక్తివిశ్వాసములు కుదురునట్లు చేసెను. సంఘికవిషయమునకు జెందిన తగవులను తీర్పుచేయుటకై మహమ్మదీయుల కొరకు ప్రతి నగరమునందు కాజీల నియమించెను. హిందువులకు మహమ్మదీయులకు కలతలు పుట్టిన, వాటిని తగవు చెప్పుటకు అమిల్దారులను నియోగించెను. అమిల్దారునకు కార్యమునందు పంచాయితీదారులు సహాయులుగనుండ జేసెను. ఈ పంచాయితీదారులలో నిరుతెగలవారికి నిచ్చెరియొక యంశ్యరుడును, ప్రతివాదిగావచ్చిన వారికి యిష్టమువచ్చినవారొకరును వుప్పన నుండునట్లు జేసెను. అన్యాయము జరిగినదని విలపించు అర్థికి అదాలతు అప్పీలుకోర్టుగా[illegible] సంవత్సరమున నేర్పాటుచేసెను. అంతవఱకును న్యాయముగ తానే యావిషయములను అప్పీలు విచారణ చేయుచుండెడివాడు. అదాలతుకోర్టునందు ఒక మహమ్మదీయుని, ఒక హిందువుని, న్యాయాధిపతులనుగా నియమించెను. పూర్ణయ్యగారి పరిపాలనమున నరహత్య చేసినవారికి గూడ ఉరిశిక్ష లేదనియు, నతడంత దయాళుడనియు యశము సంపాదించుకొనెను.

దివానుపూర్ణయ్య మహమ్మదీయ ప్రభుత్వమునకు బూర్వముండిన పన్నులిచ్చు దీయు విధానము మరల నేర్పఱిచెను. అందువలన ప్రజలు సుఖించిరి పన్ను లిచ్చుకొనలేక తమ క్షేత్రములనువిడి దేశాంతరగతులయినవారు మరల స్వగ్రామముల చేరుకొనిరి. అమిల్దారుల కృత్యములు, పన్నులువసూలు, న్యాయవిచక్షణ మునుపటివలె గాక మంచికట్టుబాట్లు జరుగ నారంభించెను. దివాను ఎప్పుడు ఏవేళను వచ్చి, తనిఖచేసి తప్పులు బట్టి, యుద్యోగము

నుండి తీసివేయుదురో యని యధికారముల చిన్న యుద్యోగముల వారి కందరికిని భీతి గొలుపుచుండెను, తరుచు సర్క్యూటు వెళ్ళు చుండెను. అట్టి సమయములందు విన్నపము లను వినుచు, స్వయముగా పరిష్కరించి తీర్పు చేయు వాడట. ప్రజలకు దివాను సాక్షా త్కరించిన భగవంతుడని తోపించెను. దానితో నాతని పరిపాలనమందు పై నందరికి గౌరవము, విశ్వాసము కుదిరెను. వ్యవసా యపు పెట్టుబడులనిమిత్తము ప్రభుత్వము వారి బొక్కసమునుండి బదుళ్ళుయిచ్చు పద్ధ తిఏర్పఱచి రైతుల కనేక సదుపాయములు చేసెను.

మైసూరురాష్ట్రమును, నూటయిరు వది తాలూకాలక్రిందవిభజించి, ఒక్కొక్క తాలూకానొక్కొక్క అమిల్దారునిక్రింద నుంచెను. కొన్నితాలూకాలపైన సుబేదా రు నుంచెను. పన్నులువసూలునందు సుబే దారుక్రింద షరాబు (Treasurer) ఒక డు సిరస్తాదారు ఒకడును సహాయముచేయు టకై నియమింపబడిరి. ఖజానాకొట్టును మూయునపుడును, తీయునపుడును, సుబే దారు, శిరస్తాదారు, షరాబులు ముగ్గురు ను ఉండవలెను. బొక్కసమందు ధనము తక్కువవచ్చినపుడు, ముగ్గురును, జవాబు దారులై యుండవలయును. పూర్ణయ్యగారి దివాన్గిరి మొదటిసంవత్సరము నుండియు, రాజ్యాదాయము క్రమక్రమముగ వృద్ధిచేయు లకు ప్రయత్నములు జరుపబడెను. అతని పరిపాలనమున మొదటిసంవత్సరమున ఆదా యము 5975000 రూపాయలు, అతడు దివానుపదవి వదలిపించను పుచ్చుకొను నాటికి 8675000 లకు పెరిగెను. అతని ప్రజ్ఞ, ఒక మూలనుండి బ్రిటిషు సైన్యము లకు మహారాష్ట్రులతోడి యుద్ధములందు కావలసిన సహాయము నంతయు జేయుచుం డినను, రాజ్యముయొక్క, ఆదాయమును, ప్రజల కేవిధముగా కూడ బాధకరముగా కుండ వృద్ధిజేసియుండుటలో గలదనియొప్పు కొనవలయును.

పూర్ణయ్యగారుచేసిన ధర్మకార్య ములకు మితిమేరలు లేవు. పాడుచేయబడిన హిందూదేవాలయములను ప్రతిష్ఠ చేయిం చుటకును శిథిలమగుచున్న వాటిని బాగు చేయుటకు నాతడు విశేషధనమును వెచ్చిం చెను. ప్రతిచోటను ధర్మసత్రములను కట్టిం చెను. పాంథులకును, యాత్రికులకును నేటివఱకు "పూర్ణయ్యగారిధర్మసత్రములు" ఆశ్రయ మొసగుచున్నవి. కీర్తికాయుడైన పూర్ణయ్య నేటివఱకు మైసూరుప్రజలచే కృతజ్ఞతతో పుష్పములచే బూజింపబడు చున్నాడు. వ్యవసాయ సౌకర్యములకై అతడనేక కాల్వలను తటాకములను త్ర వ్వించెను. పాడయిపోయినవాటిని బాగు చేయించెను. ప్రయాణసౌకర్యములు గలు గజేయుటకు రాజబాటలను వేయించి వల

యువోల్లు పెద్దవంతెనలనైతము కట్టించెను. రైల్వేలులేని ఆరోజులలో పూర్ణయ్యగారు ఏటికై 56,000 వరహాలను వెచ్చించెనట! సర్ ఆర్థర్ వెల్లస్లీ, పూర్ణయ్యగారి పరిపాలనమును జూచి సర్ జాన్ క్లోజు దొరకిట్లు వ్రాసియుండెను. పూర్ణయ్యగారి పరిపాలనము, ఆయన బొక్కసము ఎప్పుడు ధనమెంతకావలసిన నంతయు, సేనబలము, ప్రజలకొత్తిడియు లేకుండ నమకూర్చు అసాధారణప్రజ్ఞయు, నేనెప్పుడు యీప్రాంతపు హిందూదేశములో వినియుండలేదు. పూర్ణయ్యగారి ప్రతిభ నాకు ఆశ్చర్యమును కలిగించుచున్నది. ఆతనిబోలిన వారునాకెవరును దేశీయులలో గనపడలేదు"

పూర్ణయ్యగారి జీవితము నిక నొక ముఖ్యవిషయమును గూర్చిన రెండు మాటలతో ముగింతును. ఆయనకు తన దివానుపదవి నలంకరించిననాటనుండియు నిద్దరు ప్రభువుల గొల్చుట యయ్యెను. బ్రిటిషువారి ధాటి కాగుచు తన హిందూ రాజును గొలుచుటయో, తన ప్రభువును నిరసించి ఆంగ్లేయులకు భృత్యుడగుటయో గావలసివచ్చెను. కాని పూర్ణయ్యగారు ఆత్మగౌరవమును ఇచ్చుటను పాడుచేసికొనలేదు. గొలిచినన్నాళ్లు, తురకసుల్తానుల నెట్లుగొలిచెనో, అట్టి రాజభక్తివిశ్వాసములతోడనే, కృష్ణరాజ ఒడయరును మైసూరును గొలిచెను. ఆంగ్లేయప్రభుత్వోద్యోగులీయని పరిపాలనావిధానము నందు అనుక్షణముసు జోక్యము కలుగజేసికొనుచుండుట చాల కష్టముగా నుండెను. అయినను వారిపద్ధతులకు భంగము కలుగకుండ వారలమనసునకు నొప్పికలుగకుండ తన స్వాతంత్ర్యమును గాపాడుకొనుచునే పరిపాలన చేసెను. తనవశమునకు నప్పగింపబడిన కృష్ణరాజకుమారుని విద్యాబుద్ధుల చెప్పించి పెద్దవానినిజేసి తనప్రజలను కన్నతండ్రివోలె కాపాడి వారలకు శాంతియు, సౌఖ్యమును, ఐశ్వర్యమును చేకూర్చి కీర్తికెక్కెను. రాజును పూర్ణయ్యను తాను సింహాసన మెక్కినవేళ కృతజ్ఞతాసూచకముగ యలందూరు తాలూకాను జాగీరుగా నిచ్చి సత్కరించెను. బ్రతికి యున్నంతకాలము, కొలువులోనున్నప్పటి జీతము నిచ్చుట కేర్పాటు చేసెను.

ఒకసమయమున ఆంగ్లేయప్రతినిధి రెసిడెంటు ప్రతివిషయమునందును దివానునడిగి తెలిసికొనదగిన విషయములను రహస్యముగా, నాతని క్రింది యుద్యోగుల నడుగుచు, వారితో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచుండెను అది పూర్ణయ్యకు దెలిసిన వెంటనే యుగ్రుడై వెల్లస్లీప్రభువున కా విషయమునుగూర్చి వ్రాసెను. ఎల్లవేళల నాంగ్లేయప్రతినిధితో సహాయ సానుభూతులతో పరిపాలనముచేయుట కిష్టమున్నప్పటికిని యాతడు తఱుచు జోక్యము కలుగజేసినపుడెల్లను తెగపెట్టుచునే యుం

డెను. ఇదియంతయు గాంచిన వెల్లస్లీ ప్రభువు రెసిడెంటును, చీవాట్లు పెట్టుచు నొక యుత్తరమును వ్రాసి యిక ముం దెప్పుడును దివానుతో స్పర్థదెచ్చుకొనకుండ ప్రవర్తింపవలయుననియు నేవిషయమును గూర్చి యే విశేషములు గావలసివచ్చినను యదియంతయు దివానునుండియే రాబట్టు కొనవలయుననియు శాసించెను. అప్పటి నుండియు పూర్ణయ్య పేరుచెప్పిన బ్రిటిషు రెసిడెంట్లకు గుండె బెదరుచుండెను.

తానార్జించుకున్న యశమును ధనమును పూర్ణయ్యగారు చాలకాల మనుభవింపలేకపోయెను. వార్ధక్యమాతని జిరకాలము జీవింపనీయదయ్యెను. ఒకప్పు డాయనను ఎవరో హైదరు, టిప్పుసుల్తానులను గొల్చిన హృదయముతో నెట్లు హిందూరాజునకు సేవకుడవైతివని యడుగగా నాయన యించుకయు చలింపక వెల్లస్లీ ప్రభువుచే తిరిగి స్థాపింపబడిన హిందూరాజ్యమును సంరక్షించి ప్రజలకు సౌఖ్యమును జేకూర్చి ఆమహనీయునికి కృతజ్ఞతయును వెల్లడించుకొనుటకని ప్రత్యుత్తర మిచ్చియుండెను.

## వర్షఋతు వర్ణన

[అప్పిళ్ళై చక్రవర్తుల వెంకటరంగస్వామిగారు]

సీ. నీలకంఠోద్ధృత ♦ నిబిడపింఛచ్ఛదా భాతి
యే సిగపూవు ♦ పసలుదోప
లలితవిద్యుల్లతా ♦ లావణ్యతనుదీప్తి
యాకాశరంగ మం ♦ దావరింప
ఝిక ఝికజృంభిత ♦ భేకసంరావంబు
ఘనతాళగరిమతో ♦ గలయుచర్వ
బహుపుష్పితానేక ♦ పారిజాతపరాగ
గంధజంబాలంపు ♦ గరిమదోప

గీ. దళితకేతకీ సుమరమ ♦ దర్పమూని
కరమునందు లీలాసుమ ♦ గరిమదోప
వరలు మౌక్తికాహారంబె ♦ వానగాగ
వర్షఋతుకాంత నటియైన ♦ పటిమజూపు.

నన్నయ ఆంధ్రమహాభారతసౌధ నిర్మాణము పూర్తికాకమునుపె కీర్తిశేషుడయ్యెను. తరువాత 2 నూరుల సంవత్సరములకు తిక్కన సోమయాజి నన్నయ ఉద్యమమును పూర్తిచేసెను. సోమయాజి ఆంధ్రకవులందఱిలో నగ్రగణ్యుఁడు.

తిక్కన భారతములోని 15 పర్వములను తెనిగించెను. ఉత్తరరామాయణమును నిర్వచనముగా ఆంధ్రమున వ్రాసెను. ఉత్తరరామాయణ కాలమునాటికి తిక్కన యజ్ఞము చేసియుండలేదు. మొదట వ్రాసిన గ్రంథమగుటచే కవనము భారతకవిత్వమంత బింకముగా లేదఁట ప్రథమప్రయత్నమగుటచే అంత బాగుగ నుండకపోయినను రసవంతముగనే యుండును.

తిక్కన భారతాంధ్రీకరణము విషయమై చాల కథలున్నవి. కవి నిద్రలో హరిహరనాథుని దర్శించినట్లును దేవదేవుండు తిక్కనచే రచియింపబడు భారతమును తన కంకిత మీయుమని యడుగుటకు సాక్షాత్కరించినట్లును కవియే చెప్పియున్నాఁడు. కథలను కల్పించుటలోను పద్యంతములు వ్రాయుటలోను తిక్కయజ్వప్రథము డందురు. కాని నన్నిచోడుఁడుకూడ కలఁడు. నన్నయవలె నరాంకితము చేయక తిక్కన తనభారతమును హరిహరనాథున కంకితమొనర్చెను.

కూర్చుట నూత్నరత్నమునకుం
గనకంబునకుం దగుఁ జనా
భ్యర్చితమైన భారత మహార్థ
కృపా పరతంత్రమై
చెప్పిన దేవదేవునకు బ్రీతిగ
నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగి జెప్పి వరణీయుఁడ
నయ్యెద భక్తకోటికిన్

తిక్కన భారతాంధ్రీకరణము "ఆంధ్రావళి మోదముం బొరయు నట్లుగ" చేసెను. కృతి యిచ్చి ధనము నపేక్షించలేదు. భక్తకోటికి వరణీయుడగుటయు ఆంధ్రుల మెప్పువడయుటయు నితనికి ముఖ్యము. తాను రచింపబూనిన మొదటి పర్వము

"హృదయాహ్లాది చతుర్థమూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వము" ఉద్యోగపర్వము మొదలగునవి కూడ దీనికి తక్కువరావు—

తిక్కన కవిత్వమును వర్ణించుట కష్టము. తెనుగుపదములను వాడుటయందు ఉభయకవిమిత్రునకు ప్రేమ హెచ్చు. సంస్కృతము కూడ ఉపయోగించును. తిక్కన కవనమున అర్థగాంభీర్యము ఎక్కువ. చిన్నపద్యములో నాలుగైదు వాక్యముల నిముడ్చును. ఒక్కొక వాక్యములోని యర్థము విశేషముగా నుండును.

ఉఱిఁబోసి యేమిడలఁతో యరి
త్వమునవినుము ప్రబలుఁడైన యాతనితో
వెరపున సంధి యొనర్చియు
గరంబునమ్మమియనీతిగాఁగొండ్రు బుధుల్

తెనుగుభాష వివిధములుగనున్నది. విశాఖపట్టణమండలములోని తెనుగుపదము గోదావరిజిల్లాలో అదే అర్థములో నుప యోగింప బడలేదు. దత్తమండలములలో మఱియొకవిధముగా నుండును. ఉత్తరసర్కారులలో తత్సమ తద్భవములు హెచ్చుగా నున్నవి. దత్తమండలము గుంటూరు నెల్లూరుజిల్లాలలోని తెలుగున దేశ్యపదములు ఎక్కువ. నేనచ్చట నున్నపుడు భాషాభేదమును గ్రహించితిని. తిక్కనాదులు వాడిన పదములు లోకోక్తులు ఆభాగములవారు వాడుదురు. ఆంధ్రపదములను విశేషముగా వాడుదురు. వారిభాషయు నిర్దుష్టము. నన్నియ కావేరీతీరపు ఒకయూరునకు తత్పరిసరదేశమునకు అధిపతి. ద్రవిడభాషల నన్నిటిని చక్కగా పఠించెను గీర్వాణభాషాపాండిత్యము సమగ్రముగాకలదు. కన్నడభాషాసాంప్రదాయములును కొంతవఱకు ననుసరించెను. ద్రవిడభాషాపదములను ప్రయోగించెను. తెనుగును ద్రవిడభాషలలో నొకటియగుటచే నన్నియ కాలమున వాడుకలోనుండ వచ్చును. ప్రతిభాషయు ఒక్కొక మండలములో ఒక్కొకవిధముగా నుండును. మన కలవాటు లేక పోవుటచేత నన్నిచోడుని పదములు వింతగా కాన్పించును.

నన్నిచోడుడు కవిరాజశిఖామణి కుమారసంభవమును కలావిలాసమును రచియించెను. తెంకణాదిత్యుని కుమారసంభవము కాళిదాసుని కావ్యమునకు సరియైనది కాదనియు కాశ్మీరదేశపు కవికృతమగు కుమారసంభవమునకు తెనుగు తర్జుమా అని యున్నది.

నన్నిచోడుడు మహాకవి యని విమర్శకులు కొనియాడిరి. "ఈకవిరాజశిఖామణి కావ్యములోని వర్ణనము లత్యద్భుతములై నూతనములై యున్నవి" "ఈతడు నాచన సోమనాథాది మహాకవులతోఁ దులఁదూఁగఁదగినవాఁడు గాని సాధారణుఁడు గాఁడు" "నన్నిచోడుని భావములయం దత్యంత మనోజ్ఞత్వమును వానిని గూర్చు నాచ్ఛికముల యత్యంత సౌభాగ్యమును నిరతిశయములు. అర్థము సొంపేమనతిక్కనసామ్మ్నగదానన్నిచోడునియందో తిక్కన యర్థము సొంపులకు సొంపులున్నవి. తిక్కన పదపరికములకెల్ల మఱింత సంపన్నములుగానున్నవి నన్నెచోడునిపదపరికరమునకు గల సౌష్ఠవపుష్టిని, కవితకు గల పాకప్రౌఢిని జూడగాఁ దిక్కనవి యంత మెఱుగుగా దోఁపవు. మఱి నన్నిచోడుడు తిక్కనకుఁ బూర్వుడే యైనయెడల తిక్కన యాంధ్రకవితా సామ్రాజ్యమునం దధ్యాసనమునకం టెనెక్కువ నన్నెచోడునకే యియ్యవలెను" అని విమర్శకులు స్పష్టముగా వ్రాసియుండిరి.

తెంకణాదిత్యుని శైలి కథాసందర్భమును బట్టి మాఱుచుండును. అన్నిపట్లను ఔచిత్యము ననుసరించియుండును. తపో

మహిమ శంకరు వర్ణింప బోవు పార్వతిని
చూచి

తండ్రి—

దారయొకింగి కోరవలదే, స్మర
హారునకు నీకు హస్తిమశకాంతర మా
పరమునకు నీకుఁ బర్వత పరమాణ్వంత
రము దలంప బత్తి యెట్టులగున్

తల్లి—

పూవోపూవో యని చేటువినినసంగందు
సనివటిల్లెదునామై! జీవంబునిలుచు నేనినుఁబో
విడిచినహైమాగ్రమర్గముల బాల్పడఁగాన్
ఆలవుబాలవు గదు గౌమరాలవు గోమలివి
ముద్దరాలవు దలఁపం! జాలవు బేలవుగాకివి
కాలమొతపమున కఠార కాంతారములన్.

యుద్ధఘట్టమందు—

హరఫాలాంబకజాతకోపశిఖ ధూ
మానీకసంభూతభీ! కర శూలాసివిలగ్నహ
సుమహాత్మ్యం కాలి హుంకారని ష్ఠురదం
ష్ట్రాగ్ర విభాసి తాన్య నిలయా టోపోగ్ర
పూర్వామశే! స్వరరక్తానవపానమత్తయి
దితచాప్యముండి వైశేశ్వరా!

అష్టమాశ్వాసమున శృంగారము వర్ణించునప్పుడు సన్నియ చక్కగా వ్రాసెను. ఆరవ ఏడవ ఆశ్వాసములలో శివవర్ణనల లోను శివాశివుల సంవాదములోను ఆధ్యాత్మికవిషయములు చక్కగా వ్రాయబడినవి. వెంకటాదిత్యుడచ్చటచ్చట శ్లేష ఉపయోగించును.

గోపతికారుణ్యంబున గోపతిసారూ
ప్యవృత్తి గొని సురతవిభో! గోపతిపైఁ
జాలుపమరిన గోపతి సెకానుఁగాంచె గోప
తివైరి.

(సశేషము)

# జాబులు వ్రాయు వక్కణలు

[జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు]

అప్పుపత్రము వ్రాసే లక్షణము

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౮౭ అగు నేటి చాంద్రమానేన దుర్ముఖినామ సంవత్సర మార్గశిర శు ౧ లు, ౧ వేశపంతులవారికి, మూషకు వ్రాయించియిచ్చిన పత్రక్రమమెట్లున్నను. నేను నా యవసరనిమిత్తమై అప్పుపుచ్చుకొన్నది రొఖ్ఖం ౧౦౮౦ యివేలక్షరాలా పదివరహాలు. యిందుకు వొడ్డీ నెల ౧కి ౧౦౮౦ కి వడ్డీ ౧|౦ లెఖను వొచ్చిన వొడ్డీ మొదలున్ను తీర్చగలవాడను. యిటనినా రాజీన వ్రాయించియిచ్చిన పత్రం! యిందుకు సాక్షులు—హరిహరాదులు-వీరిసమ్మతిన నారాయణప్ప వ్రాలు-

దానపత్రానకు వ్రాసే శ్లోకాలు

ఏకైకాభగినీలోకా సర్వేషామేవ భూభుజాం। నభోజ్యాన కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥ స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తాచసోదరీ। పరదత్తా చమాతాచ। విప్రదత్తా వసుంధరా॥ స్వదత్తం పరదత్తంవా యోహరేత్తువసుంధరా। షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాంజాయతే క్రిమిః॥ ౪॥

శ్రీగురుభాస్కరాచార్య నీలమేఘ
స్వాములవారికి వ్రాయు వక్కణము

శ్రీ మద్యజన యాజనాధ్యయనాధ్యాపక దాన ప్రతిగ్రహషట్కర్మనిరతులయిన వైశ్యకులదేశిక సార్వభౌములయిన శ్రీగురుభాస్కరాచార్య నీలమేఘస్వాముల అయ్యగారికి, మీఅత్యంత ప్రియశిష్యులయిన మునిమడుగు స్థళవరస్థళస్థితాశేష నూటయిబ్బండ్రు నగిరంవారున్ను, అనేక సాష్టాంగదండప్రణామంబులు చేసి చాయంగలవిన్నపములు--యీమర్యాదను, యీ ఫాల్గుణ శు ౨ లు మీ ఆశీర్వచనంవల్లను కన్యకాదేవి వరలబ్ధించాశను వాసవాంబ శ్రీజనార్దనదేవర కటాక్షంవల్లను మేమున్ను శుభం మీసకలసామ్రాజ్య వైభవ విభవములకున్ను మాకానతివ్వగలబుధికి అప్పటప్పటికి ఆశీర్వచనపత్రిక వ్రాయించి పంపిస్తూ రావలెను. తర్వాతను.

సభకువ్రాసే జాబులక్షణమ్

శ్రీ మద్యజన యాజనాధ్యయనాధ్యాపక దాన ప్రతిగ్రహషట్కర్మ నిరతులయిన నిష్ఠాకనిష్ఠీకృత వసిష్ఠ ప్రముఖ మునివర శ్రేష్ఠులయిన తరంగిణీతుంగ తరంగాయమాన వాగ్వైఖరీ ముఖరీకృత దిక్కాంతా స్తూయమానకీర్తి సంపన్నులయిన, అధీతిబోధాచరణ ప్రచారణ చతుర్దశీ కృతచతుర్దశ విద్యావల్లభులయిన, తర్కకర్కశవచోవ్రజసంతాడితాశేష పక్షధరధరాధరులయిన, అద్వైత మకరంద తుందిలేందిందిరాయమాన మానసులయిన, సర్వతంత్ర స్వతంత్రులయిన, మాదృగ్బాల సుహృజ్జనసంరక్షణ బద్ధకంకణులయిన శ్రీమహామేరు సమానధీరులయిన శేమల్లకోటస్థితాశేషవిద్వజ్జనములకున్ను, మునిమడుగు స్థితాశేషవిద్వజ్జనములున్ను అనేక నమస్కారాలు చేసి చాయంగల విజ్ఞాపన—

# తటాకము

[అప్పళ్ళచక్రవర్తుల వెంకటరంగనాథస్వామిగారు]

చ॥ భుజయుగళీ మృణాళములు ♦ పొంకముగా చలియించు బాలికల్
సజలతుషారసీధువుల ♦ జయ్యన మిత్రుని దప్పితీర్చు. సా
మజకులకాంతలట్లు తన ♦ మధ్యను కేళియొనర్చుచుండగా
సుజల విలాసధన్యయదె ♦ చూడఁ దటాకము వింతగొల్పెడున్॥

# క్రొత్తతెనుఁగు—ప్రాఁత తెనుఁగు

[ఒక భాషాభిమాని]

(గతసంచి కనుబంధము)

ఇఁకను, క్రొత్తతెనుఁగును గూర్చి క్రొత్తతెనుఁగువారి యభిప్రాయములు గంపలో మూసి పెట్టిన కప్పలవలె నున్నవి. ఒకరికంటె నొకరు పెంకెతనమునందు సమర్థులై యుండుటయు హూణవిద్యయందుఁ బండితులు గాను గొందఱు మాత్రము తెనుఁగుసాంప్రదాయము నెఱిఁగినవారు నౌట వీరిలోఁ గొందఱకు మాత్రమే కొన్ని యూహ లున్నవి. తక్కిన వారు వీరికి మద్దత్తుగాండ్రగుచు నూరూర భాగవతములు సలుపుచున్నారు. వీరు మాకు భాషా పాండిత్యములతోఁ బనిలేదనియు మాకుఁ దోఁచిన దెల్ల వ్రాయుచుందుమనియు మాది చిలుకపలుకైనను గాకిపలుకైనను చిన్న పలుకయినను బెద్దపలుకయినను మీరది సోదరభావముతో గ్రహించి గ్రంథస్థము గావింప వలయు ననియు వాదించుచున్నారు. కనుక వీరందఱివాదములకు నుత్తర మొసఁగుట ప్రాజ్ఞులకు లక్షణము గాదు. కాని వీరిలో బుద్ధిమంతులును, తెనుఁగు భాషయందు పరిశ్రమఁ జేసినవారును, క్రొత్త తెనుఁగు విషయమయి సరియైన యభిప్రాయములు గలవారును గొందఱున్నారు. వారికే మనము సమాధానము జెప్పవలయును. వారి వాదమును మనవాదములను నిష్పక్షపాతముగాను దురభిమాన రహితముగాఁ బరిశీలించి యేదో యొక నిర్ధారణకు రావచ్చును. అట్టివారిలో నగ్రగణ్యులైన మ. సెట్టి లక్ష్మీనరసింహముగారు మున్నే క్రొత్తతెనుఁగనఁగా నేమియో యెల్లరకుఁ గరతలామలకముగాఁ దెలిపినారు. వారు దెల్పినదేమన—"మన తెనుఁగు భాషలోఁ గాలక్రమమునఁ గొన్నిమార్పులు గలిగినవి. ఆమార్పులు మనలో నుత్తములును బండితులు నని పేరొందినవారు గూడ తమ తమ గృహముల యందును, సభలయందును నిరాక్షేపముగా, నిశ్శంకతో మాట్లాడు మాటలయందు నుపయోగించుచున్నారు. అట్టి పండితులే సభాంతరాళముల యందు నిరాఘాటముగా నుపయోగించు ప్రయోగములను మన మేల గ్రంథముల యందు వాడకూడదు? అట్టి ప్రయోగములు గ్రంథస్థము గావించిన నాంధ్రభాష కెట్టి సౌలభ్యము వాటిల్లునో చూడుఁడు. అంతియె కాక పాఠశాలల యందనేక సంగతులు నేర్చుకొన నున్న

చిన్నబాలురకు సులభమైన మామూలు మాటలతో వ్రాయుట కనుజ్ఞ నొసఁగి వారిపై, కృపారసం బొకింత చిలికి వారి కష్టము నేలతగ్గింపగూడదు. పిచ్చుకపైఁ చంద్రాయుధము వేయునట్లే నెసరు కందు కూనలపై నా మీ దీర్ఘసమాసములును, మీ వ్యాకరణములును బ్రయోగించెదరు. మీ రు వ్యాకరణయుక్తముగానే వ్రాయవచ్చు ను. వ్యాకరణముల భాషకు తరువాతఁ బుట్టి భాషయొక్క స్వరూపమును దెలుపు ను గాని వ్యాకరణముల ననుసరించి భాష మారుచుండట లేదు. మీ వ్యాకరణముల లో నే భాషయందు మారిన రూపములను గ్రహించి వానికి సూత్రములు జేసి వ్యాక రణశాస్త్రమును వృద్ధిపొందింపుడు. ఎన్నఁ డో వేయిసంవత్సరముల క్రిందనున్న భాషా స్వరూపమును దెలుపు నన్న యభట్టీయము ను బట్టిపెట్టి దానిప్రకార మిప్పటిభాష మార్చుకొనవలె ననుట కేవల మసమంజ సము. మీరు వేయి సంవత్సరముల క్రింద టి వారివలె నిప్పుడున్నారా? వేషభా షలుగదా మనుష్యులకుఁ గావలసినవి. మీ వేషమును మార్చుకొన్నపుడు భా ష యేల మారగూడదు. ఆర్యులార! ఈ సంగతు లన్నియు మీ దివ్యచిత్తము లకు దెచ్చి పండితులు గ్రంథములయం దెట్లు వ్రాసుకొన్నను సరియే కాని, బాలు రకుమాత్రముపాఠశాలలయందైనఁ గొన్ని నవీ నరూపములను యథేచ్ఛముగాఁ బ్రయో గింపుట కనుజ్ఞనిడుఁడు?" అనివారుప్రయో గింపఁదలంచుకొన్న కొన్ని క్రొత్తతెనుఁగు రూపముల నుదహరించి, వానికి పూర్వకవి ప్రయోగములను గూడఁ దృష్టాంతముగాఁ జూపినారు. ఇదియే క్రొత్తతెలుఁగునకు సరియైన యర్థము. ఈ వాదమంతయు సహేతుకముగానే యున్నది. "గీ. జుట్టు మారెనుబొట్టునుగట్టుమారె। భాషమారుట యిట్టి బాధలకట" అని యొకరు వ్రాసిన రీతిని మార్పుకొరకిట్టి యల్లరులు పడు చున్నారు.

ఈ యిరువురివాదములను జూడ నొకరికొకరి కంతగా భేదమున్నట్లు గాన రాదు. ఉభయులును, సంస్కృతసమా సములును, క్లిష్టార్థములును మొదలయిన వానిని తెనుఁగు వ్రాఁతలయందుఁ బ్రయో గించుట కసమ్మతమునే చూపుచున్నారు. తెనుఁగుశైలి సులభముగా నెల్లరకు బోధ పడునట్లు రచింపవలయుననియే వీరిరువురి యుద్దేశమయి యున్నది. అట్లు వ్రాయ లేనియెడల వ్రాయలేనివాని కర్మము గాని వారు వ్రాయఁగలుగుట వ్రాయలేకపోవు ట యనునది వీరివాదమున కెంతమాత్రము సంబంధించినది కాదు. ఇఁకను వీరికి భేద ముగానున్న యంశ మొక్కటియే. భాషా శబ్దములు గొన్నిమాఱి నూతన ప్రత్య

యములను బొందియున్నవి. అట్టి నూతన ప్రత్యయములతోఁ గూడిన పదములను గ్రంథములయందుఁ గాని, ప్రాంతలయందుఁ గాని వాడుట కనుజ్ఞయియ్యుఁడని గ్రాంథిక తెలుఁగువారు పేయివిధములఁ బ్రార్థించుచున్నారు. వీరు ప్రార్థించినకొలఁది ప్రాంత తెలుఁగువారు మఱింత కొత్తక్రియలను చుండి మే మనుజ్ఞ నీయమని గట్టిగా చెవులు మూసికొనుచున్నారు. అనుజ్ఞ నీయక పోవుటకు వీరి కేమియధికారముగలదో తెలియరాకున్నది. అయిన నిం దెవరిదితప్పు. అధికారములేని వారియం దధికారము నారోపించి మీరు మాయం దధికారము చెలగింపుఁడనిన నట్లు సేయక మానువా రెవరు?

అయ్యాలారా! వింటిరిక దా యుభయపక్షముల వారికున్న భేదము. ఇది బహుస్వల్పముగానున్నది. వీరు ప్రయోగించెదమన్నవి పదియో పదునైదో వాడుకలోనున్న రూపములు. ఈపదునైదు రూపములను వారుకోరినట్లనుజ్ఞ నిచ్చిన వారికానందమగును. వాదము ముగిసినను ముగియవచ్చును. కాని యింతమాత్రము స్వేచ్ఛ నొసఁగిన బాలురకుఁ గాని, భాషకుఁగాని యెంత మేలుకలుగునో మన మాలోచింపవలసియున్నది. దీనికి మునుముందుగా నిట్టి స్వేచ్ఛ నూతనముగా బాలుర కిచ్చుటకుఁ దగినంత యవసరమేమియైనా కల్పింపవలసియున్నది. ఈ యవసరమునకుఁ గ్రాంథిక తెలుఁగువారు చెప్పు కారణము లేవియన, బాలురు పాఠశాలల్లో ననేక సంగతులను నేర్చుకొనవలసియున్నది; అన్నింటియందును గష్టమెక్కువగానున్నది. ఆకష్టమునకుఁ దోడుగా మన తెలుఁగు గూడ కష్టముచేసి పూర్వులు రచించిన వ్యాకరణము ననుసరించియే వ్రాయవలయు నని బాలురను బాధించుట యన్యాయమనియు నిదివఱకిట్టి కష్టము మన తెలుఁగువిద్యార్థుల కుండబట్టియే వారు బి. ఏ. ప్యాసయినప్పటికిని పరిశుద్ధముగా మాటాడుటకుఁ గాని వ్రాయుటకుఁ గాని యసమర్థులై సభల యందు గుటకలు మ్రింగవలసివచ్చుచున్న దనియు నిట్టి కష్టము భాషనుండి తొలఁగించిన వీరందఱు భాషను సులభముగ నేర్చి పండితులగుదు రనియు నిట్టి దేశోపకార కరమయిన విషయమును గూర్చి యింత చర్చించి ప్రాంత తెలుఁగు హా రల్లరిచేయుట యుక్తము గాదనియు నుడువుచున్నారు. ఎహా వ్వా! వీరిమాటలు తుంటిగొట్టినపండ్లు రాలెనని చెప్పినట్లున్నవి. మన మన్యభాషను నేర్చుకొనుచున్నాము గనుక ముందు మన స్వంతభాష నడుగంటింపవలయునఁట! అట్లు చేసినఁ గాని యాయన్యభాష మనకు సులభముగ నబ్బదఁట.

ఔను. మన పొరుగువారిల్లు బాగుగఁ గట్టించి మన కద్దెకిచ్చెదరని మునుపు మన కున్న స్వంతయిల్లు తగులబెట్టుకొనవలసినదే? మన భాషకంటె వేయిరెట్లు కష్టముగా నున్న యన్యభాషలున్నను నన్యభాషలో నాంధ్రము లన్నియు మనకుఁ గరతలామలకముగా నలవడుచుండఁ మన భాష కష్టముగా నుండుట వలన మనకు సరిగా రాకున్నదట. అందువలననే మనవారింగిలీషులో బి. ఏ. పరీక్ష ప్యాసయ్యి తెనుఁగు శుద్ధముగా వ్రాయలేకున్నారఁట. సిగ్గుచేతను, పవిత్రమయిన వంశములలోని దౌటచేతను, గుణవంతురాలగుటచేతను భర్త తన్నుఁ బిలచినతోడనే మీఁదపడి విలాసములు చూపదని పుస్తెగట్టిన భార్యను విడనాడి, బహుప్రయత్నముచేత ధన ప్రయత్నముచేత ధనమానప్రాణహానులకైన నోర్చుకొని పడసిన జారస్త్రీల పొందుగని సుఖించెదమన్న వారికిఁ దగవు చెప్పుట కెవరు సాహసింతురు? సాహేబుగారూ! ఏల చిక్కిపోవుచున్నారనిన నాతఁ డొసంగిన ప్రత్యుత్తరము మీకెల్లరకుఁ దెలిసినదియేకదా! బుద్ధిమంతులార! బాగుగ నాలోచించిన నిది కాదు సబబు. మనము మిక్కిలి కఠినమయిన విషయము లనేకములు పాఠశాలలలో నేర్చుకొనుచుంటిమని, మనకన్నింటి కంటె నెక్కువ ప్రధానమయినది యగు మనమాతృభాషను బాగుచేసికొని దానిక్రింద వినియోగ పఱుప వలసిన కాలమును మాత్రి కొన్ని విషయములలో వినియోగించెదమని చెప్పుట గొప్పతప్పు. తక్కినవిషయముల లోనే కొంతభాగము తగ్గించుకొని, మన మాతృభాష బాగుగ ముందు నేర్చుకొని, తరువాతఁ దక్కినవిషయముల నవకాశ మున్నంతవఱకు నేర్చిన బాగుండును పుట్టిననాఁటనుండియుఁ దల్లి స్తన్యమును విడనాడి పరస్త్రీ పాలు నేత్రాగుచున్న నాబిడ్డఁ డెట్టి దృఢవంతుఁడుగా నుండునో మీరే యాలోచించుకొనుఁడు. రెండవది మన వారిలో ననేకులు మాతృభాషయందు చక్కఁగా వ్రాయలేకపోవుటకును, మాట్లాడనేరక యుండుటకును మన భాషయొక్క కఠినతయే కారణమఁట! అక్కటా! యింతకంటె మాతృద్రోహము వేఱెయుండునా? పాఠశాలలయందు మాతృభాషమన కెట్టి శ్రద్ధతో నేర్పబడుచున్నదియో మెల్లరకు ప్రత్యక్షమేకదా! ఉపాధ్యాయులందఱిలో తక్కువజీతగాఁ డెవఁడనిన తెనుఁగు ఉపాధ్యాయుఁడు. అన్నిపాఠములలోను బాలురచేత మిక్కిలి యనాదరణచేయఁబడునదేది యనఁ దెనుఁగు పాఠము. అన్నిపరీక్షలలోను మిక్కిలి సులువుగా ప్యాసగుటకు వీలున్న పరీక్ష యేది

వో భాషాభిమానులారా! మన బాలుర చక్కఁగా తెనుఁగుభాషలో మాటాడి వ్రాయవలయునన్నఁ బ్రాఁత తెనుఁగును ద్రోసి రాజుచేసి క్రొత్త తెనుఁగునకుఁ బట్టాభిషేకము సేయుటఁగాదు. ప్రాఁత తెనుఁగునే మఱింత శ్రద్ధతో, సవతితల్లిని చూచినట్లు కాక కన్నతల్లిపై యభిమానము వహించి బాలురకు నేర్పిన క్రొత్తతెనుఁగుయొక్క యావశ్యకతయే లేకయుండును.

ఒకవేళ క్రొత్త తెనుఁగువారు కోరినట్లు పాఠశాలలయందు బాలురు క్రొత్త తెనుఁగున వ్రాయున ట్లంగీకరించిన దానివలన నెట్టి యిక్కట్టులు వచ్చుచున్నవో చూడుఁడు. ఈ క్రొత్త తెనుఁగు వారి యభిప్రాయములు వారితో ప్రతిపక్షము బూని వాదించుచున్న పండితులకే బోధపడకుండ నున్నప్పుడు దీనిసంగతి యేమియో యెఱుఁగని బాలురు క్రొత్తతెనుఁగువారి యుద్దేశములనుబూర్ణముగాగ్రహించి వారు చేసిన నిబంధనలకు లోబడియే వ్రాయుచున్నారనుటయెట్టి విశ్వసనీయమైన మాటయో తెలియరాకున్నది. క్రొత్తతెనుఁ గనఁగా బాలుర యభిప్రాయము తాము తమ యిండ్లలోను తోడిబాలురతోడను మాట్లాడువిధముననే వ్రాయవచ్చు నని కాని మ॥ సెట్టి లక్ష్మీనరసింహముగారు సెలవిచ్చినట్లు పదియో పదిహేనో క్రొత్త తెనుఁగువారుచూపిన రూపములను మాత్రమే ప్రయోగించుచు తక్కినదంతయు నాంధ్రవ్యాకరణము ననుసరించియే వ్రాయవలయునని యెంతమాత్రమును గాదు, అందువలననేకదా బాలురు క్రొత్త తెనుఁగుయొక్క పరిమితిని దెలియక తాము స్కూలుఫైనలు పరీక్షలో వ్రాసిన వ్యాసములయందుఁ గొంత గ్రామ్యమైన తెనుఁగును, గొంత హిందూస్థానియును, గొంత యింగిలీషునుఁ గలిపి నానాదుర్భాషలను ప్రయోగించి యాంధ్రభాష ననర్థకము సేయుచున్నారు. స్కూలుఫైనలు పరీక్షకొఱకు సంవత్సరమంతయు జీతమును చెల్లించి, సకలప్రయాసలకు నోర్చి పరీక్ష ప్యాసు కావలెనన్న కుతూహలముతో రేయి యనక పగలనక సర్వదా తన పుస్తకములనే చదువుకొనుచున్న బాలుఁడు తన తెనుఁగు వ్యాసమునందు సావిత్రితో యముఁడు, "మేడమ్" అనియు "ఈ మాందర్ ఛోకీలన్ని నాదగ్గిర పనికిరావుసుమ్మా" అనియు వ్రాయుటకు సాహసించుట తనకెట్లు వ్రాయుటయో తెలియక చేసిన పనియో బుద్ధిపూర్వకముగా పెంకెతనముకొఱకు పరీక్ష ఫేలు కాఁగోరి చేసినపనియో మీరే యూహించుకొనుఁడు. ఇట్టి దుర్భాషలను బాలురు వేలు, లక్షలును వ్రాయుచున్నారు. వీరికేమయిన భాషావిషయికజ్ఞానమున్ననట్లు చేయుదురా?

(సశేషము)

మీదిక్కి దౌడాయించినాడు. యింతలో రాజుగారికి రెండో ఫిరంగి రెండుతోపులు కుప్పకూలి దూసిపోయింది. దగ్గరవున్న సర్దార్లు నఖపడ్డారు నఖకాలికి గుంటుపట్టుకున్నారు. తతిమ్మా రాజులు అంతా పడ్డారు. శిబ్బందీవారు అందరూ పడ్డారు. పాలురాజు మాత్రం తన తొ॥ పదహారు గుర్రాల తోటి శత్రువులమీదిక్కి దవుడాయించేసర్కి ఫిరంగులదగ్గిర పనియేసుకున్రాలు హాతము లేని వంటి గుర్రంతోటి ఫిరంగులు దాటి యిసుకై వోక్కండిని హతపర్చి అక్కడికి కత్తి మొరవపోతే అప్పుడు చేతి కత్తితీసుకుని వింత వింతలుగా నర్కులాడుతూ చిత్ర కౌశలంజూపి యుద్ధంచేస్తూ ఉండగా యింతలో రాజుగారి తొ॥ అసనబేగు పటాలంవచ్చి బహుమానంచేసి ఫిరంగులమీద చెయివేసి ఆక్రమించినారు. యింతలో పాలురాజు తిరిగి మహారాజులుంగారిని చూడడాన్కు ఆయన సామీప్యానకు వెళ్ళేసర్కి ఆ మహారాజులుంగార్కి యెదురు రొమ్మునిండా యిరవై ముప్పయి గుళ్ళుపట్టుకొని రంగ, రంగ అని స్మరణచేస్తూ ప్రాణ వాయువులు వదలుతూ ఉండేవరకు మహాప్రభో మీ వంటి మహారాజుకు యీలాగంటి గతులు సంభవించెగదా అని చాలా దుఃఖించి తిరుగా యెదుటి లష్కరుమీదికి పోయి నర్కులాడుతూ వుండేవర్కి ఈ పరాక్రమం యావత్తూ కర్నలుఫిషీగ్లాను చూచి నేను బహుదరువారి లడాయిన్ని చూచినాను గాని యితనివంటి శౌర్యవంతం కలిగిన శిఫాయీని చూడ లేదని స్తోత్రంచేసి యితన్ని యేవిధంచాతనయినా పట్టుకోమ్మని సెలవు యిచ్చితే యేవిధంచాతను పట్టు బడకపోతే యీవీరుడు యేమార్గానను దిక్కేవాడు కాడు. యెదటిబలం హతమయ్యేపరియంతరం యీ తీరున యుద్ధం చెయ్యగలవాడు. మనం సంశయించి నివాలు లష్కరును యావత్తు చంపివేస్తాడు. అని విచారించి కాల్చివెయ్యమని వడిగయిచ్చేసరికి దూరంగా నిల్చి అగాదుచేసి కాల్చివేశినారు.

యీపాలురాజుకు అదివరకు ముప్పైసంవత్సరములు యింకా వివాహంలేదు. యితని పరాక్రమం యావత్తు కుంఫిణీతాలూక్కు మనుష్యులేమి అసనబేగుకు ముందానతాలూక్కు మనుష్యులేమి చూచి బహు ఆశ్చర్యపడ్డారు. వాళ్లునిముషాలకు ముం పుగా రాజుగారు సెలవుయిచ్చినట్టు గనుక అయితే యీపాలురాజు తన పదహారుగుర్రాలతోటి కుంఫిణీ లష్కరు యావత్తు సరిపుచ్చును. క్షాత్రవంతాలకు యింతవాడు లేడు. యీలాగంటె బైరైవసగదాయిని యుద్ధరంగమందు పడ్డేటరువారికను ఆసన్బేగు కమాం దాను తనశిబ్బందితో పాదటివారిమీద యనిరేంచి అఘోరముగా యుద్ధంచేశి తనతాలూకు పటాలంలో ముప్పైమంది బ్రతికి తతిమ్మావారు హతమయినారు. అక్కడికి ముందు వుండు యావత్తు సరిపోయినది గనుక అంతట అసనిబేగు రాజుగారును హతమయిరి. తతిమ్మా సర్దార్లున్నూ సిబ్బందీవారున్ను యిటువలె యిక్కడ యెవరిని అధారంచేసుక్కొని యుద్ధం చెయ్యవలసియున్నది గనుక నా॥ ప్రభువైనా వున్నాడుగనుక నా॥ శిఫాయిగిరి చూమ నా॥ తెహెక్కీరంగా చావవలసినది యేమి గనుక. అని విచారించుకొని తుపాకులుకింద వేసి యావత్తుకొని హతశేషమయిన ముప్పయిమందిశిఫాయీలతోటి రణభూమి విడిచి కాశీపురంలో నారాయణబాయిగారు వుండగా వారిలోపోయి కల్సుకున్నారు. యింతటి శిఫాయి ప్రపంచంమీద నక్వతీఝ్యాం——

ఆతర్వాత కుంఫిణీవారు విజయరామరాజుగారిని జయించి పద్మనాభంలోకి వచ్చి రాజుగారితో శేఖానా మొదలయిన సామాను దోచుక్కొని అక్కడినుంచి యుద్ధరంగమందు రాజుగారి రాజబంధువులు వొంటను ధరించుకొన్న వెల ఖరీదిసొమ్ములు తీసుక్కొని శవాలమీద బట్టలుకూడా తీసుక్కొనిపోయి నారు. మహారాజులుంగారు ధరించిన నగలు పతకాలు యావత్తు తీసుక్కొన్నారు. పరేకబా కట్టుకున్న వస్త్రంకూడా విప్పుకొని పోయినారు. ముసి రెండుఘడియలుకు మళ్లీయాశెనుంచి రాద్ధయు—— పోయి కన్నులు పిండిగాసుతో విజయరామరాజుగారు పడ్డారని చెప్పేసరికి ఆమాటలువిని రాజు

కోటలో వున్న పాలకొండ విజయరామరాజు తన పరాక్రమం యావత్తు అగపర్చి అనేకమందిని చంపినారు గన్క కుంఫిణీవారు యితనిని గురించి చాలా శ్రమపడ్డారు గాని సాధించలేకపోయినారు. యింతలో కోటలో వారికి భత్యఖర్చులున్ను లేకపోయినందున్ను వుండి నిభాయించలేక కోట వదిలిపెట్టి లోపల ప్రవేశించి ఫితూరీచేశినారు. వారు పారిపోయిన నాల్గుదినములకు వారికి తెలిశి కుంఫిణీవారు కోటలో ప్రవేశించి చింతచెట్లు యావత్తు కొట్టి పారవేశినారు పాలకొండ విజయరామరాజుగారు కొండల్లో ప్రవేశించి చేశ్న ఫితూరీ యింతంతకాదు. ఆ॥ అతని పెద్దకొమారుడు అతనితో విరోధపడి తండ్రినివిడిచిపెట్టి తల్లినికూడా తీసుక్కొని కుంఫిణీవారిదగ్గిరకు వచ్చేవరకు అతణ్ని చేపట్టి తండ్రి వినహాచేసి యితనికి పట్టంకట్టినారు. యిట్లా జరుగుతూ వుండగా యీ పట్టంకట్టిన చిన్నవాడున్ను పోయినాడు గన్క అతని ఆ రాజ్యం ఆడమనిషి చేస్తూ వచ్చినది. అటుత॥-

జాతులవారికి తోచినలాగు విజయరామరాజు కింద వున్న పద్ధెనిమిది జమీందారులలో వఖజమీందారుడు యింతపనిచేసినాడు. విజయరామమహారాజులుంగారు నిబద్ధిగా మనతోను యుద్ధం చేస్తే మనకు బహు ప్రయాస తగులును ఆయన వైరితనంచాలపుంజానున్ను చంపక మనతోనున్ను కత్తికట్టక తనుమాత్రం చచ్చిపోయినాడు. అని అప్పుడు తోచి నారాయణగజపతి మహారాజులుంగారివద్దికి సమాధానం మాటలుజర్గించి నెలగకి పన్నెండువేల రూపాయీలు తౌజీ యిచ్చేటట్టున్ను ఆరునెలలనాటికి మీరాజ్యం మీకు యిస్తామని ఖరారు చేశి మేస్తరువైపు దొరవారు సమాధానం చేశి పూసపాటివారిని శీతారామనగరంలో తెచ్చి ప్రవేశపెట్టినారు. అక్కడ కొన్నిదినములు వున్నతరువాత బంగాళానుంచి లాడ్డు వచ్చినాడు. గన్క నారాయణగజపతిమహారాజులుంగారు పోయి కల్సుకున్నారు. అప్పుడు లాడ్డు యీయనను చూచిన యితనిమాటలున్ను సౌందర్యానకు సంతోషపడి మీ రాజ్యం మీకు యింమను మని వైపుతో చెప్పి పోతాము. అని శెలవు యిచ్చినారు. త॥ వైపువొరవారు చేశిన కుయుక్తి మరిరెండు నెలలకు వీర్కి రాజ్యం యావత్తు యిస్తే మీరిపోతారని సఖం రాజ్యం ప్రస్తుతంలో యిస్తావున్నాము. తతింమ్మా మీరు పెద్దవారు అయితే యిప్పిస్తామని శెలవుయిచ్చి తన శేయశేర్తులను మంత్రాంగం చేశి కుదిర్చి మన్యాలుయావత్తు యావరిసంస్తానం వారికి యిచ్చి వీరికిపంన్నెండు లక్షలరూపాయీల తాలూకా యిచ్చి అందులో తమకు ఆరు లక్షల రూపాయీలు యిచ్చేటట్టు నిమ్కరువ చేసుకున్నారు యిదిగాక రాజాగారి రాజబంధువులకు లక్షరూపాయీలు మొఖాసాలు వుండగా యిది కూడా వారికి యిచ్చినారు. యీదివంవగకు నారాయణగజపతి మహారాజులుంగారు రాజ్యం చేసుకుంటూ వున్నారు.

సమాప్తము



శా కల్పతరుః। సకలభువనాశ్రయ శ్రీవిష్ణువర్ధన
మహారాజాధి రాజరాజ పరమేశ్వర పరమభట్టారకః।
పరమబ్రహ్మణ్యో మాతాపితా పాదానుధ్యాతః। అస్యేతు
త్యాది సేనానిపుణః। గుహాఙ్గహ ప్రతిహతశక్తిక్తైనతేయ
ఇవ వినతానంద జననః। యుధిష్ఠిర ఇవ భీమసేనో
ధృతప్రచండాదుతి మండలః। పాతువిషయ నివా
సినో రాష్ట్రకూట ప్రముఖాం కుటుంబిన సర్వానిజ్ఞప్తి
మాజ్ఞాపయతి విదితమస్తువః। కౌండిన్యగోత్రయ నాజస
నేయసబ్రహ్మచారిణె గబ్బిశర్మణః। పుత్రాయానిరిశ
మమర్మణః। పుత్రాయ రంగాదికస్యరాభిధానాయ,
అస్మత్కృద్ద సహాయనిమిత్తే సాధకపూర్వం సర్వకర
పరిహారేణ యా। గ్రహారీకృతపల్లి వాకగ్రామ వస్తాదశే
గ్రామాధికః। కొప్పనిగ్రామధిక పొత్తూరి పర్వతశ్చ
పల్లనిగ్రామధిః చపోదరు వాకశ్చ సాక్షి సంప్రదుత్తా
ఇతిఏతే నామపథయాః। పూర్వతః పొత్తూరి పర్వతశ్చ
పూర్వాంతః। ఆగ్నేయతః। సత్తువనామపంద్రః। ప్రా
ద్భావ గరుగుశ్చ। దక్షిణతః కనువతవకాశాత్।
వుమ్మెంగమాగతః। పురాణపంధాః నైరుత్యాచ స్వప
పంధాః। పశ్చిమతః। వుమ్మెంగికొప్పనిగ్రామధికయో
ర్మధ్యే నిజగరనది వాయువ్యతః। కరకుతిగ సీమ్మెవ।
సీమావుత్తరతః పంపానది యీశాన్యతః చికల్యూరి
శీమ్మెవశమా। అశ్యధర్మ పరిన తే పచిద్భాధా కర్తవ్యా
యకరాతిసపంచ మహాపాతక సంయుక్తా నరకం
గమిష్యతి। తథాభంగ దతావ్యాసేనోక్తం॥ బహు
భిర్వసుధాదత్తం। బహుభిస్యానుపాలితం। యస్య
యస్య యథాభూమి। తస్యతస్య తథాఫలం॥

స్వదత్తం పరదత్తం వా
యోహరేతి వసుంధరా
షష్టిర్వర్ష సహస్రాణి
విష్టాయాం జాయతే క్రిమిః॥
సర్వానేతాన్భావినః
పార్థివేంద్రాన్భూయోయాచతె రామచంద్రః
సామాన్యోయంధర్మ సేతున్నృపాణాం
కాలేకాలే పాలనీయోభవద్భిః॥
మద్వంశజాః పరమహీపతి వంశజా వా
పాపాదపేతమనసో భువి భావిభూపాః
యేపాలయంతి మమధర్మమిమంసమస్తం
తేషాం మయా విరచితాంజలి రేషమూర్ధ్ని॥
అజ్ఞప్తిరస్య ధర్మస్య ధర్మస్య కాటయరాజః॥
గ్రామాంత్రి గావాస్స పయః॥
ప్రనావాః ప్రభూతస్య నసఖిలాదభూమి
క ప్రాశ్చ [illegible] ద్రవీ[illegible]
భూ[illegible]స్సు[illegible]భూ వసత్యాః॥
[illegible]స్తు [illegible]॥
సంహిత [illegible]గతావివన్ను భూ[illegible]జాః
దెవాః ప్రయా[illegible] నాజుసర్వేత్ర
ముభీధరంతు [illegible]॥

న గాహరూపం వృత్తం దిం

త్రిభువనాంకుశే ముహారునై పుళ్ళొలత ౦-౦-౩ ౪ అంగుళము—

---

## శ 1087

### రాజేంద్ర చోళుడు

గుంటూరుజిల్లా యిలాకా కూరపాటి తాలూకాలో చేరిన శిరిపురంలో వున్న శిలా శాసనము—

ఇల వెలనాటిగొంక వసుధీశ తనూభవుడయిన
చోడ భూ। తలపతి చోడపట్నము మూదంబున గట్టె
భుజాబలంబునం। గొలదిజయించి యందు రిపుకుంజరు
భీమునిజంపి ఆంధ్ర భూః తలము వడారువేలు సతత
స్థితి నేలె నురేంద్ర లీలలక్॥ ౧॥

స్వస్తి సమస్త ప్రశస్త సహితం శ్రీమన్మహా
మండలేశ్వర కులోత్తుంగ చోడగొంకయమహారాజుల
ప్రియాత్మజుండైన రాజేంద్ర చోడకుమారుండు కొం
డపడమట పన్నెండామిడె శిరిపురంబున రామేశ్వర
దేవరకు దీపనైవేద్య భోగంబునకై యేది ఆగ్నేయం
బున దక్షిణముఖంబై నాదండ గట్టియును చెరువును
గుడియుత్తరంబున తాటితోటయు నూతి తూర్పున




మచిలీపట్టణము.

సంపుటము ౨ } ఏప్రియల్ 1927. { సంచిక ౯

# స్వాగతము.

## 1

(నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు.)

మ॥ పరిభవద్ధిల్ల క్షయాంతమై సకల సం ♦ భావ్యంబుగా నొప్పుష్టి ।
పరిభవత్సంభవ 'మాంధ్రభారతి' కి శో ♦ భాప్రభవోద్దీపన।
పరిభవంబై తగ "స్వాగతం"బిడె 'ప్రభా' ♦ వత్స పరిభావోదయా।
'పరిభవా!' భావిత భావిభావు క,వి వ ♦ స్వత్పాలితాబ్దోదయా। 1.

మ॥ అమలంబవ్యయ మపరిమేయమును న ♦ వక్తంబ చింత్యంబు 'కా।
లము' సృష్టిస్థితి నాశహేతువగు లీ ♦ ల స్వప్రహ్మవిష్ణ్వాగ్రి భా!
గములండ్రిందీక బ్రహ్మాఖండ మన వి ♦ ఖ్యాతంబు కానైన నూ।
త్న మహావర్షయుగోదయంబునకు నా ♦ ధారంబవై యేలుమా॥ 2.

మ॥ సవితాదేవతకుం బ్రదక్షిణ సమ ♦ స్కారంబులాద్యంబుగా।
భువితో నర్పణముం బొనర్ప, ననిశం ♦ బు న్గాలచక్రింబు నా।
కు వలెం బ్రోకగ, షష్ఠి సంతతిని నీకు ♦ జ్యేష్ఠతావాప్తి వై।
భవ మేనారదుడిచ్చె నాతని కృప ♦ స్వర్గిల్లి మమ్మేలుమా॥ 3.

| | |
|---|---|
| ౧. బాలమూర్తి | ౫ తలములు * |
| ౨. కుమారమూర్తి | ౬ తలములు |
| ౩ నరమూర్తి | ౧౦ తలములు |
| ౪. క్రూరమూర్తి | ౧౨ తలములు |
| ౫ తామసమూర్తి | ౧౬ తలములు |

వైవిధ్యముగ రూపభేద లక్షణమును నిర్ణయించి ప్రమాణ కొలతలతో దానిని లక్షణబద్ధముజేసి మూర్తిని చిత్రించెడివారు. ఈ సమయమందు శిల్పి, లావణ్య రసమును తొణకనీయక సాదృశ్యమును భంగముజేయక తన సహజశక్తిని వినియోగించి సృష్టించును.

చిత్రము నిర్ణయించ దలచినది భావయోజన మగుటచే ప్రమాణ సాదృశ్య, రూపభేద లక్షణముల విస్తరించి వ్రాయదలచలేదు. యీ లక్షణములను విపులముగ శుక్రాచార్యుడు తన నీతిసారమందు ప్రతిమాలక్షణ ఘట్టమందు రచించియున్నాడు. దానిని జూడదగును.

భావమనునది మానసిక ప్రవృత్తుల నిరూపించును ప్రాచ్య చిత్రకారులు బాహ్య ప్రకృతికంటె మానసిక ప్రకృతి నిరూపణమునందె యెక్కుడు శ్రద్ధవహింతురు. బాహ్య ప్రకృతిని వారు నిరూపింపలేకపోలేదు. కాని ఒక్కొక్కప్పుడు మానసిక భావపోషణకొరకు బాహ్య ప్రకృతిని రచనయందు నిరసించెదరు

బాహ్య-మానసిక ప్రకృతుల్లలో మానసిక ప్రకృతికి ఆధిక్యత నిచ్చెదరు. ఇందులకు యోగబుద్ధుని ప్రతిమయె ప్రబలతర నిదర్శన మగుచున్నది.

"The whole spirit of Indian thought is symbolised in the conception of the Buddha sitting on his lotus throne calm, impassive, his thoughts, freed from all worldly passions and desires, and with both mind and body raised above all intellectual and physical strife; yet filled with more than human power, derived from perfect communion with the source of all strength"

*E. B Havel.*

బుద్ధుడు నిద్రాహారముల త్యజించి సర్వసంగ పరిత్యాగుడై మోక్షమార్గమును సాధించుచుండెను. ఆతని దేహము శుష్కించినది పంచప్రాణములు జేయొక ప్రాణియె మిగిలియున్నదేమొ. శరీరమునందలి ఎముకలు, నరములు లెక్కించుటకుకూడ యవకాశము గల్గుచున్నది.

పాశ్చాత్య చిత్రకారు డీమూర్తిని చిత్రింపవలసి వచ్చిన యతడు బుద్ధుని బాహ్య స్వరూపమును చిత్రించుటలోనే తన కుంచె నాడించి పాండిత్యమును ప్రదర్శించెదువాడేమొ. కాని ప్రాచ్యశిల్పి బుద్ధుని మానసిక శుద్ధ సాత్వికానంద భావనిరూపణయందె తనశక్తిని నడిపి సిద్ధిపొందెను.

అందగాడయిననేమి? కురూపియైననేమి? పొడగరియైననేమి? కుబ్జుడయిననేమి? బలిష్ఠుడైననేమి? బలహీనుడైననేమి? ఇట్టి విశేషములు బాహ్య దేహ సౌరభమును దెల్పును. కాని ప్రాచ్యశిల్పి యాసించినది బహిర్గత దేహవల్లిక గాదు. ఆంతరంగిక హృదయభావము. కనుకనే యాతడు బాహ్య ప్రకృతి నిరూపణమును నిరసించినాడు సంపూర్ణముగ నిరసింపలేదు. కాని క్రొత్త దేహకాంతిని తెచ్చిబెట్టి దానికి సహితము నిర్మలత్వము నిచ్చినాడు. ఇంక ముఖమునందు యతని ప్రయత్నము సఫలమైనది. నిర్మలానంద తన్మయత్వ నిమీలిత నేత్రముల మధ్య బుద్ధుని తపస్సు-దీక్ష—సాత్విక సంతసము బహిర్గతమగుచున్నవి.

౪

భరతశాస్త్రము (నాట్యకళ) భావశాస్త్రము, శిల్ప చిత్రకళలకు లక్షణశాస్త్ర మిదియె. భావ పోషణ కొరకు భరతశాస్త్రమునుండి హస్త నేత్ర-విన్యాసములు-భంగిమములు యింక యనేకములయిన విషయములు శిల్పశాస్త్రమందు జేర్చబడినవి.

చిత్రకళయందు భావనిరూపణకై వర్ణలేపనమేర్పడినది భావము వేరు—వర్ణము వేరుజేయక ప్రాగ్దేశీయులు వర్ణమును భావమున కనుగుణ్యముగ నుంచిరి.

సాత్విక, రాజస, తామసములకు తెలుపు, ఎరుపు, నలుపు వర్ణముల నుపయోగించిరి శివుడు తెల్ప కైలాసము తెల్పు, నంది తెల్పు అట్లె సరస్వతి తెల్పు, హంస తెల్పు పద్మము తెల్పు వస్త్రము తెల్పు యిట్లు తెలుపు శుద్ధసాత్విక నిరూపణకై యుపయోగపడును. ఎరుపు పసుపు మొదలగు రంగులు రాజసచిహ్నములు. శ్రీరామ తీర్థస్వామిని జపనీయులు కాషాయ వస్త్రములయొక్క యుద్దేశ్య మెరింగింపకోరిరి కాషాయము అగ్నివర్ణమనియు యీ భారతయోగి సర్వసంగ పరిత్యాగుడై బాహ్య దేహమును తాను బ్రతికియుండగనే దహింపనెంచుననుయుద్దే

* తలయొక్క నిలువుకొలత తలమనబడును చేతియొక్క పిడికిలికొలత 4 అంగుళములు. అట్టి మూడుపిడికిళ్లు ఒక తలమనికూడ చెప్పబడును.

శ్యముతో అనగా తనకు దేహమునెడ నెట్టి మమకారము లేదని తెల్పుటకై అగ్నివర్ణ కాషాయమును ధరింతురని చెప్పెను. సాత్త్విక, రాజస, తామసగుణములు మూడును కలసి యుండుచోట నీలము నుపయోగింతురు, రాముడు కృష్ణుడు మొదలగు దేవుళ్లు నీలమేఘులు. ఊదా నీలి నలుపు మొదలగునవన్నియూ తామసచిహ్నములు. శుద్ధ సత్త్వమందు రాజస, తామసములు లేవనుటకై గాదు సూర్యుని కాంతి తెలుపు. కాని సూర్యుడు తెలుపుగాదు సూర్యదేవతయగు గాయత్రి "ముక్తా, విద్రుమ హేమ, నీల,ధవళచ్ఛాయైః" యను పంచవర్ణములు గలిగియున్నది.

ఇంద్రధనువునందు సప్తవర్ణములు గోచరించును. ఆసప్తవర్ణములయొక్క కాంతి తెలుపు అదే సూర్య కాంతి ఆసప్తవర్ణములు సప్తమయూఖములగల శుద్ధసత్త్వమగును [illegible] వర్ణము ముఖ్యచిహ్నము అన్యోక్తి చిహ్నము ఇక్కడ [illegible] యున్న [illegible] వర్ణాంతరమును బహు వైవిధ్యము చిత్రించును. ఇవి లక్షణము లన్నియూ [illegible] నా భావము [illegible] చూపుదును.

నేటి [illegible] పరిధిని వేసుకు పాటుపడుచున్న చిత్ర [illegible] యుందురు [illegible] ప్రజ [illegible] నిదర్శనములు.

---

# భ్రాంతి.

డి. నారాయణమూర్తిగారు, యల్. యమ్. యస్.

ఒకపుడు హేమంతనిశి; దిశి ♦ నపూర్వ కిరణ
ముజ్జ్వలస్ఫూర్తితో వెలు ♦ గొందుచుండ
మా గృహస్థ వితర్దిపై ♦ మందపవన
వీచికలు స్పృశింపగ, నెదో ♦ యోచనంబు
సల్పుచును మేనువాల్చితి, ♦ సరసిజారి
మెల్ల మెల్లన మేఘాల ♦ నెల్ల జీల్చి
నిజకిరణ రశ్మి నామీద ♦ నింపెనపుడు;
నాకనులు చూచె నాగగ ♦ నంబువంక;
శ్యామవర్ణాంబరము, స్వచ్ఛ ♦ సౌమ్య వదన
మును, సునీలమౌ కుంతల ♦ ములును విశద
మగునయనముల స్త్రీ స్వరూపాన ♦ గగన సీమ
తోచె నొక వ్యక్తి, శీఘ్రతో ♦ చూపుకోలది
కరచరణ యుగళములు కదిలి ♦ కదలెను మెల్ల;
హస్తమును చాచి ననుబిల్చు ♦ నట్లు తోచె
తలచిన కొలంది నాపిరి ♦ యా తళుకుబేల
నొప్పుచుండె నాగగన ♦ మందున్న ఛాయ
సంభ్రమాశ్చర్యములు గల్గె; ♦ ఛాయ దానికి
రెక్కలైన గట్టుకపోవ ♦ మక్కువయ్యె;
అపుడు చలిగాలి వీచిన ♦ ట్లయ్యె; నంత
నంగనారూపమంతయు ♦ తాంబు నాలి
దేనికదె విడిపోయె; నా ♦ మేను చల్ల
బడియె; నొక్క నిట్టూర్పు నే ♦ విడచినాడ॥

## శ్యామల.

(అనువాదకుడు) జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు

"నేను 1932 సం|| రములో బి. ఏ. పరీక్షకు బొంబాయి యూనివర్సిటీ కాలేజిలో చదివాను. పరీక్ష లయినతర్వాత పూనా సమీపానవున్న స్వగ్రామం వెళ్ళాను. అక్కడే నాతలిదండ్రులు నివసిస్తున్నారు. నాతండ్రి ఆపురములో ఉద్యోగము చేస్తున్నాడు నేను సామాన్యకుటుంబంలో జన్మించాను. అందువల్ల బి. ఏ వరకూ చదువుకుంటానని ఎవ్వరూ అనుకోలేదు. కాని నాతండ్రి నావిద్యకోసం అనేకకష్టాలు పడ్డాడు. ఋణాలుచేశాడు. నేను బి. ఏ. ప్యాసయి, నౌకరిలో ప్రవేశించి, తనను సుఖపెడతానని ఆశించాడు. నేనూ అలాగే అనుకున్నాను. వేసంగిశెలవలు గడిచేయి. బొంబాయి వెళుదామని ప్రయాణసన్నద్ధుణ్ణవుతున్నాను. ఇంతలో తంతిఒకటివచ్చింది. అందులో నేను పరీక్షలో జయమందలేదని వుంది. అది వినగానే అపరిమితమైన దుఃఖం గలిగింది. హృదయం కృంగిపోయింది. నాహృదయాకాశాన దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆశాజ్యోతి అకస్మాత్తుగా అంతరించడముచేత మాటాడలేకపోయాను. నాతండ్రికూడా ఖిన్నుడయినాడు కాని విచారించవద్దనీ, మళ్లీఏడు కష్టపడి చదివి ప్యాసవచ్చుననీ చెప్పి. కచేరీకి వెళ్లాడు. స్నేహితుల కీసంగతి తెలిసి నన్ను ఊరడించుటకు వచ్చారు. కాని నేను సంతోషంగానే వున్నట్లు కనబడ్డాను వారికి.

విషాదమేఘాలావరించుచున్న హృదయముతో స్వగ్రామమున ఉండుటకు మనస్సు అంగీకరించదములేదు. రాత్రి భోజనమయింది. పరీక్షలో అపజయం పొందడంతో, ఈప్రపంచం శూన్యమూ, దుఃఖమయమూ అనిపించింది. రాత్రి పదకొండుగంట లవుతుంది. ప్రకృతి నిశ్శబ్దంగా వున్నది. నాబట్టలు చిన్నపెట్టెలో పెట్టుకుని ఒకవుత్తరం వ్రాసి, మేజాబల్లపైనుంచి, ఎవ్వరు చూడకుండా తలుపుతీసుకొని బయలుదేరాను. బళ్ళు వుండేచోటుకువచ్చి బొంబాయికి బండి కట్టించుకొన్నాను. బొంబాయి వెళ్లాక ఉద్యోగార్థమై బొంబాయివెళ్ళానని తంతిఇవ్వవచ్చుననుకున్నాను.

బొంబాయి చేరాను. కాని నాదగ్గర పదిహేనురూపాయలు మాత్రమే ఉన్నవి. ఒక వారంరోజులు లోగా ఉద్యోగం సంపాదించి తీరాలని దృఢనిశ్చయము చేసుకున్నాను. కాయస్థుణ్నవడంచే ఒక క్రైస్తవ భోజనశాలకు వెళ్ళాను. చాలా అసహ్యకరంగావుంది. కాని భోజనం రేటు తక్కువని అక్కడేవున్నాను. తరవాత ఒక చిన్ననోటుబుక్కు, పెన్సిలు తీసికునిబయలుదేరాను. ప్రతివీథీ తిరిగాను. గోడలమీద కట్టివున్న బోర్డులన్నిట్నీ పరిశీలిస్తూ కొన్ని పేర్లు నోటు బుక్కులో వ్రాసుకున్నాను. హోటలుకు వచ్చి, అందరికి దరఖాస్తులు పంపాను; అణాబిళ్ళ లంటించిన కవర్లపై నా చిరునామా వ్రాసి, అందులో ఉంచాను. కాని మూడు నాలుగురోజు లయేసరికి చాలా చోట్లనుంచి ఎండార్సుమెంట్లు రాసాగినవి. అంతమాత్రాన నిరుత్సాహుడనవలేదు. స్వయంగా వెళ్ళి మాట్లాడితే ఏమైనా లాభం వుంటుంది

గాని, యింటిదగ్గర కూర్చుని లార్డులా ఉత్తరాలు వ్రాస్తే, ఉద్యోగాలు తమంత నవి వచ్చి నన్నాహ్వానిస్తవా అని కార్లుండేచోటుకు వెళ్ళాను. ఒక్కటే కారు వుంది. ఏపనీ లేక ఆలోచనా నిమగ్నుడై సిగరెట్ కాల్చుకుంటున్నాడు కారు డ్రైవరు. కారునుసమీపించి "అయ్యా! డ్రైవరు గారూ!" అన్నాను.

"ఏ." అనిగర్జించాడా డ్రైవరు. కొంచెమైనా జంకక "స్వామీ! పురంలో వున్న గొప్ప కంపెనీ యేదో కొంచెం దయయుంచి చెప్తారా"

"ఆల్బర్టు ట్రాన్స్‌ఫర్డు కంపెనీ చాలా గొప్పదే కాని క్రిందటి సంవత్సరం వచ్చినంత లాభం యివ్వడు దానికి రావటం లేదయ్యా!"

"పోన్లే. దానిపేరే నాకుకావలసింది. లాభం ఎందుకయ్యా నాకు? ఆ కంపెనీ మేనేజరు నెరుగుదువా?"

"అహ్హా హ్హా హ్హా! నే నెరుగనూ? నిన్న సాయంత్రమేకదూ బెన్నెట్టి కంపెనీ మేడవరకు కారులో అతణ్ణి తీసుకు వెళ్ళింది. చాలా మంచివాడు. పావుగంట ఆపాడు. దానికికూడా పావలా యిచ్చాడు."

"క్షమించండి, నన్నక్కడికి తీసుకు వెళ్లండి."

ఏదో చెప్పబోయాడు మళ్ళీని అతడు. కాని మళ్ళీ మాట్లాడనీయ లేదు. కారు ఎక్కి "అర్జంటుగా నన్నా మేనేజరు బంగాళాదగ్గిరికి తీసుకు వెళ్ళాలి." అన్నాను. కారు బయలుదేరింది. పదినిముషాల్లో ట్రాన్సుఫర్డు కంపెనీ మేనేజరు హోరేసు బెన్నెట్టిదొర బంగాళావద్ద ఆగింది హాలులో కూర్చున్నాడాయన ఒక్కడూను. నౌకరుచే లోనికి కబురంపాను "ఎవరో వచ్చారని చెప్పమని"

లోనికి రమ్మనమని జవాబు వచ్చింది. వెళ్లి దొరగారికి సలాంచేసి నా సంగతంతా క్లుప్తంగా చెప్పాను.

"బుక్‌కీపింగు, టైపురైటింగు, షార్టుహ్యాండు, డ్రాఫ్టింగు చేతవునా?"

"హా,"

"టెన్నిసు, బ్యాడ్‌మింటన్,—"

"ఫుట్‌బాల్, క్రికెట్, సంగీతం..."

"సరే. బాగానే వుంది. మా ఆఫీసులో వుండవలసినవాడవే. రు 120-0-0 లు జీతం యిస్తాను రేపు పొద్దున్న పదిగంటలకు ఆఫీసుకురా."

"నిజమా వేళాకోళమా" అని భ్రాంతుణ్ణి అయ్యాను ముందు. మర్నాడు వెళ్ళాను. నిజమే అయింది. పనిలో చేరాను. తండ్రికి వుత్తరం వ్రాశాను.

## 2

ఆరు మాసాలు గడిచినవి. అకస్మాత్తుగా విషజ్వరం తగిలింది నాకు. అంతే. స్మృతిలేదు. ఎన్నాళ్లల్లా ఒళ్ళెరగకుండా పడిపోయానో నాకే తెలియదు. ఒకనాడు జ్వరం కొంచెం తగ్గి కళ్ళు తెరిచాను. విశాలమైన గదిలో వున్నాను. సుసజ్జితమైన శయ్య—ప్రక్కనే ఉపచారములు చేస్తూ ఒక కాంత—

"ఇది ఏమిట" న్నాను. ఆ సౌందర్యవతి మెల్లగా జవాబిచ్చింది-"ఇది గోకేల్ మెడికలు ఆస్పత్రి. మీ రిచ్చటికి వచ్చి మూడు వారాలయింది. ఎవరో దొరగారు రెండుమూర్లువచ్చి చూచి వెళ్ళారు. కొందరు ఉత్తరాలు పంపారు. ఇదిగో మీతలగడ క్రిందనే పెట్టాను వాటిని. మీ గది తాళంచెవి యిదిగో. ఏమీ కలవర పడక పడుకోండి. ఒక గంటక్రితమే డాక్టరుగారు

వచ్చి చెయ్యి చూచి వెళ్ళారు. నేను ఈ ఆస్పత్రిలో రోగులకు ఉపచారము చేయడానికి నియోగింపబడిన దాదిని. మీకు సంరక్షణ చేయుటకు నన్ను ఏర్పరిచారు."

ఆ యువతి అద్వితీయ సౌందర్యవతి అని చెప్పుటకు వీల్లేదు. కాని ముఖం ఆకర్షణీయమయినదే. నేత్రాలు తేజోమయములైనవే. ఫాలరంగము విశాలమయినదే. ఆమె పెదవుల పయి నిరంతరము మందహాస చంద్రికలు తాండవిస్తూ ఉంటవి—ఆమె మధురకంఠ స్వరము మాత్రము వాటన్నిటికంటె అనురంజకంగా వుంటుంది.

నా శరీరం క్షీణించిపోయింది. అవయవపటుత్వము సన్నగిలింది. నడచుటకు శక్తిచాలదు. కూర్చోలేను, ఒక్క అస్థిపంజరమే కాని రక్తమాంసాలులేని శరీరం. నన్ను చూచుటకు నేనే అసహ్యించుకొన్నాను. కాని నా సంరక్షణకు నియమింపబడ్డ దాది ఉపచారములవల్ల జ్వర తీవ్రత క్రమంగా తగ్గుదల మార్గం అనుసరించింది. అనుదినమూ, ఉదయమున వచ్చి ఆవుపాలు కాచి యిచ్చేది. ఆమె రెండేసి రోజులకొకమాటు నీళ్లుపోసి, పరిశుభ్ర వస్త్రముల ధరింపజేసేది. ఆమెవచ్చి దగ్గర కూర్చుని ఎంతో ఆదర పూర్వకంగా సంభాషిస్తోంటే ఎంత ఆనందము కలిగేదో, ఆమె నన్ను విడిచి వెళ్ళేటప్పుడు అంత దుఃఖము కలిగేది. ఆమె వయస్సు ఇరవై సంవత్సరాలకు మించదు. విసుగు లేకుండా, రోగినని ఏవగించుకోక బిడ్డకు తల్లివలె వివిధములగు పరిచర్యలు చేస్తూవుండేది.

ఉదయమూ సాయంత్రమే కాకుండా అప్పుడప్పుడు వచ్చి నా పక్కనే, దగ్గరగా కూర్చుని నే చెప్పేకబుర్లు వినేది. కాలేజీలో మేష్టరుగారిపై కోపగించి, అందరము కట్టు కట్టి ఆపూట కాలేజీకి వెళ్లకుండేవాళ్లమనిన్ని, కాలేజీ మీటింగులో మాకిష్టమయిన వాడధ్యక్షుడుగా ఎన్నుకోబడకపోతే ప్రిన్సిపలుగారికెదురుతిరిగే వాళ్లమనిన్ని, ఒకనాడు మీటింగులో గాంధి ఎక్కువా తిలక్ ఎక్కువా అనే వాదంవచ్చి కొట్టుకొని పోయామని, ఇట్లాంటివే ఎన్నో చెప్పేవాణ్ని. నేను చెప్పే సంగతులు శ్రద్ధగా ఆలకిస్తూ నవ్వొచ్చేచోట నవ్వుతూ, భయం కలిగేటప్పుడు భయం వ్యక్తీకరిస్తూ సరదాగా కొంచెంసేపు గడిపేది. కాని గదికవతల ఎవరిఅడుగుల చప్పుడయినా వినబడినా, లేక గడియారం గంట కొట్టినా, ఏదోపనిమీద అక్కణ్నుంచి త్వరగా వెళ్లిపోయేది.

నన్నామె గౌరవించేది. వయస్సుకూ, కబుర్లకూ తగిన ఉద్యోగంలో వున్నానని గ్రహించింది. ఎకౌంటెన్సీలో నాకపారమైన ప్రజ్ఞ వుండడంవల్ల మేనేజరు సంతోషించి జీతం రెట్టింపుచేసినాడు. నాలుగురోజులు గడిచినవి. ఆమె తనకథ చెప్పింది. పేరు శ్యామల. తల్లిదండ్రులుగాని బంధువులుగాని లేరు. సత్కులీన. దిక్కులేకపోవటంచేత చిన్నప్పణ్నుంచి కష్టపడి కొంత వరకూ చదువుకొని దాదుల పరీక్ష ప్యాసయి ఆ ఆస్పత్రిలో ముప్ఫయి రూపాయల జీతానికి కుదిరింది. అద్దెలేకుండా నివాసార్థమొక గది నిచ్చారు. ఆమెకు భోజనంకూడ ఉచితమేనట.

మా యీ సహానుభవము స్నేహముగా మారినది.

స్నేహము ప్రగాఢమయింది. ఆ స్నేహము ప్రణయముగా పరిణమించింది. ఈ ప్రేమ ప్రథమమున ఎవరిహృదయంలో జనించిందో చెప్పలేను. ఈ ప్రేమబీజమును, నా మనస్సునుండి

పెరికివేద్దామని ప్రయత్నించాను కాని మొదట సాధ్యంకాలేదు. రెట్టించిన ఉద్రేకంతోను ఆవేశంతోనూ, ఆ ప్రేమచంద్రిక్షి చూచిన సముద్రంలాగున పొంగి నాహృదయము నాకు మించుకొన్నది ఇంతవరకూ ప్రేమ అనేది నవలల లోనూ, నాటకాలలోనూ, చదవడమే కాని ఎప్పుడూ అట్లాంటిదని ఎంచలేదు. యథాప్రకారంగా అనుదినమూ శ్యామల వస్తున్నది. పరిచర్య చేస్తున్నది. నా వద్ద దాదివలె మెలగటం లేదు. ఆప్తురాలివలె దగ్గరగా కూర్చుని మనస్సులో వున్న సంగతంతా చెప్పేది, కొన్ని మాటల్లో నాయెడల ఆమెకున్న ఆదరము, అభిమానము, ప్రేమాకూడా ప్రతిధ్వనించేవి.

ఈ విధంగా కొన్ని రోజులు గడిచేయి. మాయిద్దరి హృదయాల్లోని భావాలూ బాగా వికసిస్తున్నవి. శరీరంలో రక్తం యిదివరకువలె ప్రవహించుతున్నది. అవయవ పటుత్వం కలిగింది. ఆరోగ్యవంతుణ్ణయ్యాను. ఒకనాడు సాయంత్రం అయిదు గంటలకు శ్యామ వచ్చి నాదగ్గర కూర్చుంది. గదికి సమీపానవున్న ఉద్యానవనంనుంచి పుష్పసౌరభ సమ్మిశ్రమైన మలయమారుతమువీస్తూ, నాహృదయమును ఆనందమయము గావించుతున్నది. అస్తమిస్తూన్న సూర్యుని వివిధవిచిత్రవర్ణ రంజిత కిరణకాంతి కిటికీ ఊచలలోనుంచి గదిలోకి ప్రసరిస్తున్నది. నేనేదో చెపుతున్నాను. ఆమె అతిశ్రద్ధతో ఆవిషయము వింటున్నది నేను నిన్న కాలేజీలో జరిగిన సంగతి చెబుతున్నాను.

"మేము యఫ్. ఏ. చదువుతున్నప్పుడు మాక్లాసులో ఒక పాణిగ్రాహువతి ఉండేది. ఆసౌందర్యరాశి రోజూ ఏదో కలహం తెచ్చి పెట్టేది! ఉపాధ్యాయుడు పాఠాన్నిగురించి ఉపన్యసిస్తున్న సమయమున హఠాత్తుగా లేచి వెళ్లి ప్రిన్సిపాలుతో ఎవరో విద్యార్థి తనవంక తదేకదృష్టితో చూస్తున్నాడని చెప్పేది. కాని ఆ సుకుమారి..."

ఆవాక్యము పూర్తి చేయలేకపోయినాను. ఏదో కఠిన పదార్థము తగిలినట్లయినది, నా హృదయమునకు. శ్యామలవైపు చూచాను ఆమె వదనం ఎర్రబారుతున్నది. నన్నుచూచి తలవంచుకున్నది. నేనేం చేస్తున్నానో, ఏమంటున్నానో నాకే తెలియకుండగా వున్నది. నా చేతులతో శ్యామలను దగ్గరగా లాగుకొని ఆమె హృదయము నా హృదయము సమీపమునకొచ్చేటట్లుగా, గట్టిగా కౌగిలించుకొని అగ్నిమువలె మెరుస్తున్న చెక్కిళ్లపై గబగబ ముద్దుల మీద ముద్దులు పెట్టుకొన్నాను. రక్తనాళములలోని రుధిరము ఉప్పొంగి ఒళ్ళు ఝల్లుమన్నది. ఆగగూడదనుకొన్నాను ఎప్పటికీ మారనని. ఈ కార్యమంతా హఠాత్తుగా జరగడముచేత, మొదట కొంచెము కంగారుపడి పట్టు విడిపించుకోబోయినది కాని సాధ్యం కాలేదు. వ్యాసమంతా వేగము తగ్గించి తప్పనిసరిగా శ్యామల తన కోమలకరములు నామెడమీదనే వేసి ఊగుతున్నది. ఆ ఆలింగనములో ప్రపంచమే మరిచిపోయినాను. కొంతసేపటికి తెలివివచ్చింది నాకు. ఆ సమయమున నాకు నిద్రపోయిన బుద్ధి మేల్కొంచినది. జరిగినదంతా తనహృదయ దౌర్బల్యమువల్లనే అని తలచినది శ్యామల కౌగిలినుండి ఆమెను విడిచినాను. హృదయమునకు మాత్రం ఆనందము కలిగించినది. శయ్యపై మేను వాల్చినాను. శ్యామల అక్కడనే కూర్చున్నది. ఎల్లెడలా నిశ్శబ్దము. గడియారం టిక్ టిక్ అను శబ్దం మాత్రం మానిశ్శబ్దమును భేదిస్తున్నది. నిమిషాలు గడిచిపోతున్నవి. అయిదు–పది పదిహేను–ముప్ఫై. కాని మాలో

ఎవరమూ మాట్లాడలేదు. తుదకు నేనే అన్నాను ఇట్లాగ.

"శ్యామలా! నన్ను క్షమించగలవా ?"

అయిదు నిమిషాలు ఊరుకొని ఆమె "మణిలాల్' నేను ఎందుకు నిన్ను క్షమించాలో నాకు తెలియదు. కాని మణిలాల్ ! ఇప్పుడు నువ్విట్టి పని చేయగూడదు. అది నీఆరోగ్యమును భంగపరచవచ్చును" అన్నది. ఆమె కన్నులవైపు నా దృష్టి ప్రసరించింది. రక్తారుణలోచనయై వున్నదామె. "రేపు సాయంత్రం నిన్ను వేడినీళ్ళ స్నానం చేయించవలసినదని డాక్టరు గారు చెప్పారు" అన్నది.

"నువ్వు నాపైన చూపిన దయకు ప్రత్యుపకృతి ఏవిధంగాచేసి, నీఋణం తీర్చుకుంటానో."

మర్నాడు సాయంత్రము స్నానాంతరము శ్యామలవచ్చి "డాక్టరుగారు నీవారోగ్యవంతుడవైనావనీ, ఇక నిక్కడ వుండనక్కరలేదనీచెప్పినారు." ఆ సమాచారం నాకు నచ్చలేదు. ఎందుచేతనంటే రోగులు తను జీవితమంతా అక్కడే గడుపుతారా ?

"బలం కలిగేందుకు మంచి బలవర్ధకౌషధము సేవించండి." అంది శ్యామల.

"సరే" అన్నాను.

## 3

ఒక వారమురోజులు గడిచేయి. పనిలోప్రవేశించాను. కాని నాహృదయములో మహాసమరము జరుగుతున్నది. శ్యామలను విడిచిపెట్టినప్పుడేమీ ప్రణయసంభాషణ జరగలేదు ఏదో ఆరోగ్యమును గురించిమాత్రమే జరిగింది. గతము ఒక్కసారిగా మరిచిపోదామనుకున్నాను. కాని శక్యమా ? కచేరీలో పనిచేసే సమయమున దృష్టి శ్యామలవైపు ప్రసరింపనిచ్చేవాణ్ని కాదు గాని యింటికి వెళ్ళాక, ఆమనోహరప్రతిమ నా హృదయదర్పణమున ప్రతిబింబించి హృదయాన్ని కలచివేసేది. ఎవరూ గదిలో లేనప్పుడు "నేను ఆస్పత్రికి ఏమంటపెట్టి వెళ్లను ?" అని ప్రశ్నించుకొన్నాను కాని జవాబులేదు.

మళ్ళీ రోగగ్రస్తుడనయి, ఆస్పత్రికి వెళ్ళి ఈసారి నాప్రేమఅంతా శ్యామలకు విశదీకరిద్దామనుకొన్నాను. కాని అది ఎంత తెలివితక్కువ పని? కాని నాకది తెలివితక్కువపని అని అనిపించలేదు. వెర్రివాని హృదయమూ, ప్రేమోన్మత్తుని హృదయమూ ఒకేవిధంగా ఉంటవి. నీటిలో తడిపిన చొక్కా తొడుక్కున్నానురాత్రి. చన్నీళ్ళస్నానం చేశాను. కాని తువ్వాలుతో తలతుడుచుకొనక నీళ్లు తలపైన ఆరిపోయేటట్లు చేశాను. తడిసిపోయిన దుప్పటి కప్పుకొన్నాను. శయ్యాజలముతో నింపివేశాను. మందు యెక్కువ మోతాదును తాగాను. కాని జ్వరంరాలేదు సరిగదా ఇంకా కొంచెం ఆరోగ్యం కలుగుటకు కారణభూతములయినవి.

శ్యామల, మంచిదే అయితే,నాచిరునామా ఎరుగుదికూడా, నాకొక లేఖ వ్రాయదూ ? ఒకవారం గడిచినది, శనివారమునాడు సాయంత్రం నాలుగుగంటలకే ఆఫీసునుంచి యింటికి వెళ్ళాను ఈవిరహవేదన దుస్సహంగావుంది. ఏలాగైనా వెళ్లి నా మనస్ఫూర్తిగ నిన్ను ప్రేమిస్తున్నానని ఆమెకుచెబుతాను. ఆమె అంగీకరిస్తుందాసరే, లేకపోతే రాత్రిళ్ళుకూడా కచేరీలో పనిచేసి, నావిచారం అంతరించుటకు యత్నిస్తాను. కాని శ్యామలను చూడడమెలాగ? ఉత్తరం రాద్దామనుకొంటే, అది ఆమెకు చేరడమెలాగ? ఏమీ తోచడంలేదు. నౌకరువచ్చి,

దీపం వెలిగించి "బాబుగారు, విచారంగావున్నట్లు కనిపిస్తుంది. ఏంబాబూ!" అన్నాడు.

అసలే మనస్సు పరిపరివిధాల పోతున్నది. ఈ ప్రశ్నయానికితోడు కోపంకూడా కలిగింది. "ఛీ పో, అవతలకి" అన్నా వాడు వెళ్ళిపోకుండ "పాపం ఎందువల్లనో తెలియదు. నిజముగా బాబుగారు మనసున కలత తెచ్చిపెట్టిం దేదో సంగతి" అనేసరికి మరింత ఒళ్ళుమండి "పో, అవతలకు, వెధవ వేళాకోళాలు" అని తరిమాను. ఆముసలివాడు పరుగెత్తుకు పోయినాడు, నవ్వుతూను.

భోజనమయింది. నాఆలోచనకు అంతు కనబడటంలేదు. పండ్రెండు గంటలయింది. ట్రాము కార్ల హడావుడి సన్నగిలింది. అపుడపుడు దూరంగా మోటారుకారుల "చార్, చార్" శబ్దం మాత్రం వినబడుతూ, ప్రకృతి నావరించుకొన్న నిశ్శబ్దమును భంగపరుస్తున్నది. ఉత్తరం రాశాను అప్పుడు. నిద్రపోయినాను. ఓహో! ఏమి అద్భుత స్వప్నములు కలిగినవో చెప్పలేను. వర్ణనాతీతమయిన ఆనందం ఆవిర్భవించింది, మనస్సులో ఆస్వప్న వీధిని ప్రయాణము చేస్తున్నప్పుడు.

మర్నాడు సాయంత్రం ఫోర్ట్ తోటలకు షికారు వెళ్ళాను. ఆరు గంటలయింది. అప్పుడే కముకు చీకటిపడిన తరువాత వెళ్ళుట అంత క్షేమకరంకాదని తెలిసే వెళ్ళాను. ఆతోటల సమీపాన సముద్రంవుంది. చల్లనిగాలివీస్తున్నది. ఒక మేక గోడవద్ద నిలుచుని సిగరెట్ వెలిగిస్తున్నాను. ఇంతలో వెనకనుంచి "ఏయ్" అని వినబడింది. తిరిగి చూచుసరికి నలుగురు దుర్మార్గులు నన్ను చుట్టడించి, నా జేబులోవున్న రెండు వందల నల్లపైరూపాయలూ, రిస్టువాచి, ఉంగరములూ తీసుకొని, నన్ను కొట్టారు. ఏం చెయ్యను? నిర్ఘాంతునివలె నిలబడిపోయాను. ఒకడు నావీపుపై గట్టిగ గుద్ది వచ్చే శుక్రవారం నాడు 200-0-0 తీసుకురా, లేకపోతే చంపేస్తాను తెలిసిందా. వెళ్ళిరా" అన్నాడు.

ఈ గొంగలు నెలాఖరున ఎక్కువ తిరుగుతూంటారు. అఖరువారంలో జీతాలు యిస్తారు కదూ. ఆడబ్బు ఉద్యోగస్తులను కొట్టి తీసుకుంటూవుంటారు.

## 4

సోమవారము ఉదయాన ఈ సంగతి 215 నెంబరు స్టేషనుకు రిపోర్టుచేస్తే శుక్రవారం నాతో వస్తానని చెప్పాడు. నేను పోలీసుస్టేషను లోనుండి యివతలకు వస్తున్నాను. అకస్మాత్తుగ శ్యామల కనబడ్డది. అప్పుడే ఆమె మోటారు నుండి క్రిందకు దిగినది. ఆస్పత్రి దాది ధరించే దుస్తులుకాక ఒకపట్టుచీర, కట్టుకొన్నది. కంఠమున ఒక బంగారు గొలుసు వున్నది. ముంగురులు ఫాలరంగమున గాలికి చెదరి యిటూ అటూ పడుతున్నవి ఎంతో అందముగా వుందప్పుడు. ఆమె నన్ను వీక్షించలేదు. పోలీసు స్టేషను కామె ఎందుకు రావలెను? నన్ను అగాధమున ముంచుతుందో, ఆనందసన్నిధాన ముంచుతుందో అడుగుటకు ఇదే తగిన సమయమని తలచి "శ్యామలా! నన్ను మరచినావా?" అన్నాను.

ఆమె నావంక చూసింది. కాని ఆమె ముఖమున మందహాస చంద్రికలు వికసించలేదు. ఆమె చూపులలో నిరసనము — అనాదరము విసుగు—కోపము వ్యక్తీకృతములయినవి.

"నన్ను క్షమించాలి"

"కాని—" అని ఊరుకున్నదామె. మళ్లా

ఇట్లా అంది—

"ఆరోగ్యంగా వున్నారా?"

బలవంతాన ప్రయత్నించి చిరునవ్వు నవ్వింది దామె.

"ఆరోగ్యంగానే వున్నాను కాని ఇప్పుడే పోలీసు స్టేషనులో ఒక కేసు దాఖలు చేసి వస్తున్నాను."

ఆమె ఆతురతతో చూసింది నన్ను. "ఒక అరగంట నాతో వుంటే జరిగిన సంగతి చెప్తా" నన్నాను. "ఇప్పుడు రాను" అని అంటుందేమో అని సందేహించాను. కాని ఆమె హృదయము కూడా ఎందుచేతనో ఉద్విగ్నమయి వుంది అనీ ఆహృదయమున ప్రచండసమరము జరుగుతున్నదనీ గ్రహించాను.

"ఆస్పత్రి విడిచినప్పణ్ణుంచీ—"

"అవును. డాక్టరు నన్ను రెండురోజులు పని నుండి తొలగించినాడు" అంది శ్యామల.

"బహుశా పోలీసువారితో చెప్పి కేసు చేయించుటకు అనుకుంటాను."

ఇరువురము కారు నారోహించాము. "ఖాలాబాగ్ రోడ్డుని పోనియ్యవోయి" అన్నాను. కారు బయలుదేరింది. నేనూ, శ్యామలా నిశ్శబ్దముగా కూర్చున్నాము. కారు ఎంత వేగంగా పోవుతున్నదో, అంత త్వరితముగా మాయిరువురి హృదయములలోని భావములూ పరుగిడుతున్నవి. కెసిల్ రిస్టారెంటూ, కెన్నెడీబ్రిడ్జీ, ఓపేరా సూదాటి మారిన్‌లైన్సు స్టేషను నమీపించినాము.

"నువ్వేం రాశావూ?"

"నేనేం రాశాను నీకు ఉత్తరంలో"అన్నాను. నిజం చెప్పే మాటయితే నేను ఆమెకు ఏం వ్రాశానో నాకే జ్ఞాపకం లేదు. ఒక కవరు నాచేతిలో ఉంచింది శ్యామల. ఉత్తరం విప్పి చూశాను. అదిట్లున్నది

"ప్రియమిత్రమా!

నీసౌందర్య దేవతను పూజిస్తున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను. రేపు సోమవారం నిన్ను ఛార్మి తోటలో పరిగ్రహిస్తాను. జవాబువ్రాసి ఆస్పత్రి తపాలాపెట్టెలో వేస్తే, ఈవేళసాయంత్రం అయిదుగంటలకువచ్చి జవాబు ఏం వ్రాశావో చూసుకుంటాను.

మణి."

"ఈవుత్తరం నీకు చేరలేదా? లేక ఇందులోని సంగతులు నీకు సమ్మతముకావా?"

"కాని నాయీలేఖ కొంచెం అలజడి కలిగించింది ఆస్పత్రిలో."

"ఏమిా? ఏమయిందాయేం?" అన్నాను. కంగారుతో.

"నిన్నపొద్దున్న డాక్టరు బాగా తాగివచ్చి "నీకోసం ఎవరో యువకుడు వచ్చినాడు" అన్నాడు."

"నాకేం తెలీదు అని చెప్పావా?" అని అడిగాను.

"లేదు. లేదు. అవును. నేను సంరక్షణ చేసిన యువకుడు చాలా కృతజ్ఞత—' డాక్టరు బల్లమిాదకొట్టి— "బాగానేవుంది. ఇలాంటి దుర్మార్గులకు ఒక పాఠంచెప్పాలి. లేకపోతే ఇంకా ముదిరిపోతుంది. ఎవరిని ప్రేమించాలో నేర్పుతాను వారికి. ఇవాళ నా ఆస్పత్రిదాదికి ప్రణయలేఖ వ్రాశాడు. రేపు రేపు నాదగ్గరకు వచ్చి "డాక్టరుగారూ, నా ప్రణయతృష్ణ తీరుటకు ఎవతెనైనా పిల్లని పంపుతారా?" అని అడుగుతాడు. ఇలాటివి ఈప్రదేశమున జరగకూడదు." అన్నాడు."

"ఇంకా — " అన్నాను నేను.

"ఒక సార్జెంటుతో మాట్లాడినాడు డాక్టరు వారిద్దరూ సన్నాగం పన్నినారు. నువ్వు జవాబు తీసుకొనేందుకు వస్తావుకదూ, అప్పుడు సిన్న రెస్టు చేతామని అనుకున్నారు. నా ఉద్యోగం కొరకు కేసు పోలీసుస్టేషనులో దాఖలు చేయడానికి వచ్చాను." అన్నది శ్యామల.

"అయితే, ఈఉద్యోగం లేకపోతే బ్రతక లేవూ?" అన్నాను. ఏమీ బదులుచెప్పలేదు శ్యామల నామాటలోని అర్థం గ్రహించింది. అందుకుకూడా సమ్మతించేటట్లు ఆమె ముఖవైఖరి సూచించింది ఏమీ మాట్లాడలేకాను చలికి చెదరిన ఆడపక్షి మగపక్షి పక్కలోచేరుటకు ఎంతఆత్రపడుతూ ఉంటుందో, అప్పుడాపక్షి హృదయము ఎట్టిస్థితిలో ఉంటుందో, అటువంటి స్థితికే శ్యామల హృదయంకూడా లోనయినదని గ్రహించాను. కారులో డ్రైవరున్నాడని సంశయింపక ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకొన్నాను. ఆస్పత్రిలో వెనకజరిగిన సంగతి జ్ఞప్తికివచ్చింది మళ్ళీను. స్వప్నప్రపంచమున విహరిస్తున్న మనిషివలె కనపడింది శ్యామల నాకేసి నిర్నిమేష నేత్రాలతో చూసిందిఆమె, కొన్ని నిమిషములు గడిచినవి

"నేను పోలీసు స్టేషనుకు ఎందుకు వచ్చానో నీకు చెప్పలేదు. ఆదివారం సాయంత్రం నాచేతి గడియారమూ, డబ్బూ పోయినవి"

"నష్టమెంత?"

"సుమారు రెండువందల రూపాయలు"

"అంత డబ్బు జేబులో ఎందుకుంచుకొన్నారు?"

"శనివారంనాడే జీతం యిచ్చారు. ఇంటి దగ్గర దాచడం మరచిపోయాను"

"ఎందుచేత?"

"శనివారాదివారాలు రెండురోజులూ, నా మనస్సు వికలమయియుండడం వల్ల"

"ఏల?"

"అందుకు నువ్వేకారణం"

ఆమె నవ్వింది. ముంగల చెక్కిళ్ళపై వకముద్దు ముద్రించి,

"శ్యామలా! నువ్విప్పుడు నాదానవేకదూ? నీకు ఆపాడు ఉద్యోగం వద్దు" అన్నాను.

---

## ఒక నాడు.

మంత్రిప్రగడ భావనారాయణగారు, (కవితాసమితి సభ్యుడు)

రాణనొప్పారు చంద్రికా ♦ రజనిఁ బుష్ప
శయ్యపైఁ బవ్వళించి భా ♦ స్వత్ప్రసన్న
మందమారుతములకింత ♦ మైమఱచితి
సరసమోహన దివ్య సాం ♦ చాలినాఁగ
సానపెట్టిన సూనాస్త్రు ♦ శరమనంగ
నవవయోవిలాసిని యొక ♦ నళినసేత్ర
అల్లనల్లన నాచెంత ♦ కరుగుదెంచి
నన్నుఁ జెరకాలమొత్తఁగిన ♦ నాటివోలె
మందహాసముతో నంక ♦ మందుఁ జేరి
నన్ను గిలిగింతఁగొల్పె నే ♦ నంబులోన
ఎందుఁ జని మాయమైపోయె ♦ నే నెఱుఁగని
కానఁగారాదొకింత నా ♦ కనులకిపుడు
ఎటు నీవియోగాబ్ధి నే ♦ నీదుగింక !

# పహాస్యాలు

## డ్రైవరు.

ఒకరు:— ఇంగ్లాండులో డ్రైవర్సు లెక్కువగుచున్నవి.
రెండ;— అయితే పెళ్ళిఅంటే యింక భయమే వుండ వలసిన పనిలేదు

## తలపు ద్రై.

భీమయ్య;— ఈ తలపుర్రె యెవరిది ?
మ్యూజియంనౌకరు;— అక్బరు చక్రవర్తిది
భీమయ్య;— యింత చిన్న దేం.
మ్యూ. నౌ;— ఆయన చినప్పటిది. (ల. సాం)

## తాకు రీకు.

"ఓరి తాకురీకు చూచి వెంకయ్యవనుకున్నాను రామయ్యవట్రా నీవు పుల్లయ్యా" (ల. సాం)

## పేర్లు.

"క్షేమమా వెంకట్రావుగారూ"
"క్షేమమేనండి రామారావుగారూ"
"నాపేరు రామారావు కాదే!"
"నాపేరు వెంకట్రావుకాదే!" (ల. సాం.)

## చాణక్యుడు.

"చాణక్యుడు బ్రతికివున్నట్లయినే రాచకీయ విషయములలో నేమిచేసెడివాడో!"

"చాణక్యుడు బ్రతికేవుంటే వృద్ధాప్యముచే రాచకీయములోనే ప్రవేశించడు"

## పొడుగు, పొట్టి.

"అదేమిటమ్మా, జడ్జిగారి పిల్లకి ఒకకాలు రెండవ కాలుకంటె చిన్నదట"

"ఆసంగతి నాకు తెలియదు కాని ఒకకాలుకంటె రెండవది పొడుగనిమాత్రము విన్నానమ్మా"

## ఉరి.

"ఏమమ్మా, అతనిని పెళ్ళి చేసుకుంటావు?"

"పెళ్ళి చేసుకోకేకంటె అతనిని వురితీస్తాను"

"పెళ్ళిచేసుకుంటే అతనే వురి తీసుకుంటాడుగా!"

## నౌకరు.

"సీతమ్మగారి నౌకరు మానుకుందమ్మా. వజ్రంలాటి మనిషి"

"సీతమ్మగారి నగలన్ని దొంగనగలను సంగతి అందరికి తెలిసేవుందిగదా!"

## ప్రేమ.

"స్త్రీలంటే అంత చెవి కోసుకుంటావు, యింకా పెండ్లి చేసుకోలేదేం"

"అది నాకు తెలియదు కాని అనేకమంది పువ్వులంటే ప్రేమిస్తారు అంతమాత్రమున తోటమాలీలవుతున్నారా"

## సిగరెట్

భార్య:— ఆదీపము ఆరిపివేశా రెందుకు ?
భర్త;— నాసిగరెట్ వెలుగుచున్నదో లేదో చూతామని.

## కోపము.

దొర;— నన్ను పెండ్లిచేసుకొనమని అడిగితే నీకు కోపమా?
దొరసాని:— అడిగితే కోపములేదు కాని నేను పెండ్లి చేసికొనుటకు సమ్మతించానంటే కోపం వచ్చిందన్నమాటే

## పెళ్ళిళ్ళు.

ఇద్దరు బాలికలు తాము పెండ్లాడదలచిన భర్తలను గురించి ఇట్లాలోచించుచుండిరి.

"ఒకటిమాత్రము నిజము నిద్రలో గుర్రుపట్టేవారిని పెండ్లిచేసికొనను"

"నీవెట్లా కనుక్కుంటావు ?"

## గారడివిద్య.

"మనవూరు గారడివాడు వచ్చాడు. రూపాయలు రూపాయలు మాయంచేస్తాడు."

"మా ఆవిడ మాయం చేస్తుంది. కాని గారడివిద్యయేం రాదే!"

## క్షమాపణ.

భార్య:— మీమీద నాకనవసరముగ కోపము వచ్చినది ఆవేశం హెచ్చినది. ఒక గంటసేపు యేమి అనలేక నోరు మూసుకొన్నాను. క్షమిస్తారా, క్షమించరా?

భర్త:— క్షమించుట కేమున్నది? ఇటువంటి (నిశ్శబ్దపు) అవకాశ మెంతటి అదృష్టవంతునికి కలుగుతుంది.

## కుక్కలు.

"యేమండి, మీ యింటివద్ద కుక్కలు మొరుగుట లేదుకదా"

"అబ్బే, యేమి వుండదండీ"

"అయితే యీ యిల్లు తీసికుంటాను. నాకిదివరకే రెండు కుక్కలున్నాయి. అవి పగల్లా మొరుగుతాయి. ఈబాధకాక యింకా బాధపడలేను."

## పరీక్ష.

ఒక కుర్రవాడు పరీక్షలో తప్పి అన్నగారికిట్లు తంతినిచ్చెను.

"పరీక్ష తప్పాను. నాన్నను సిద్ధముచెయ్యి"

అన్నగారిట్లు జవాబిచ్చెను. "నాన్నను సిద్ధముచేసాను ఇక నీవు సిద్ధపడు."

## సౌఖ్యము.

"ఇతరుల సౌఖ్యము చూస్తే కొందరికి గిట్టదు."

"అవును. అందుకనే పాశ్చాత్యులు బ్రహ్మచారులపై పన్ను విధించ దలచినారు"

## వివాహము.

"ఒక చెవిటివాడు, ఒక మూగ స్త్రీ పెండ్లిచేసుకొన్నారు."

"వారికున్న సౌఖ్యం బ్రహ్మకైనా లేదు.

## ముద్దాయి.

మేజ:— ఆయన్ని నీవు కొట్టావా?

ముద్దాయి:— చిత్తము

మేజ:— ఇపుడేమి చేయదలచినావు.

ముద్దాయి:— కొట్టలేదని చెప్పదలచినాను.

# గ్రంథస్వీకారము.

1. శ్రీ బ్రహ్మనందిని:—

రెండవ సంపుటము నాలుగవసంచికను కృతజ్ఞతతో నందికొంటిమి. ఇది కడపజిల్లా ప్రొద్దుటూరు గ్రామములో వెలువడు పవిత్రమాసపత్రిక. సంపాదకులు డి. రాజశేఖర శతావధాని కైప శేషశాస్త్రిగార్లు. సంవత్సరచందా రు 3—0—0 లు.

2. విద్యార్థి:—

ఇదియొక మాసత్రయపత్రిక. సంపాదకులు వావిలాల గోపాలకృష్ణయ్యగారు. గుంటూరు శాలకు నేతా మిత్రమండలి పక్షమున ప్రకటింపబడుచున్నది. ఇందు చక్కని పద్యములు కథలు గలవు సంవత్సరముచందా ఒక రూపాయి.

3. కవిత:—

ఇది కవితానికేతనము ఆలమూరుపక్షమున వెలువడు మాసపత్రిక. ఆంధ్ర కవిశేఖరుల వ్యాసము లనేకములు కలవు. సంపాదకులు వేదుల కామశాస్త్రిగారు సంవత్సరచందా రు 2—0—0 లు మాత్రమే.

4. శ్రీ రఘురామచంద్రమశ్శతకము:—

ఈ శతకము చిట్టాయవలస అగ్రహారము బాలకవి సంకుల లక్ష్మీనారాయణమూర్తిగారిచే రచియింపబడినది శైలి మధురము. వెల రు 0—2—0 లు.

5. బ్రహ్మభారతి:—

ఇది బర్మాలో వెలువడు మాసపత్రిక. సంపాదకులు సోమరాజు రామానుజరావుగారు.

6 ఆంధ్ర క్రైస్తవపత్రిక:—

ఇది బందరులో రవరెండు జి. నథానియల్ గారి సంపాదకత్వమున వెలువడి ఆంధ్రక్రైస్తవుల యభివృద్ధికి పాటుపడుచున్నది ఇదియొక వారపత్రిక. సంవత్సరచందా రు 3—0—0 లు.

7. ఈ క్రిందిగ్రంథములను కృతజ్ఞతతో నందికొంటిమి వాటినిగూర్చిన విమర్శనలు రాబోవు సంచికలో ప్రకటింపబడును.

1. ఆంధ్రకవిత్వ చరిత్రము, మొదటిభాగము — భోగరాజు నారాయణమూర్తిగారు.
2 శృంగార రాధామాధవము.
3. పద్మరాగము (వేగుచుక్క గ్రంథమాల వారి నిరూపకనవల.)

# కీర్తికోసం.

వెంపటి నాగభూషణంగారు.

ప్రతిలేనిదుఃఖంతో దిగులుపడి, ఏమీతోచక పోవడంచేత, యెదుటగావున్న కిటికీలోంచి చెట్లవైపుచూస్తూ కూర్చున్నాను. నన్నూ, నాకవితా సామగ్రిని చూస్తే, యీదిక్కుమాలిన ప్రపంచానికి యెందుకు, యింత యీర్ష్య? నేను వారికేమి అపచారంచేశాను? నా తెలివితేటలను చూస్తే అందరికీ యింత యేవపెందుకు? ఇంత మందిలో ఒక్కరికైనా మంచివుద్దేశం కలుగకూడదూ? నేను, నాజీవితం, నాకవిత్వం, నాపాండిత్యం, అన్నీ అడవిలో వెన్నెలమోస్తరు వ్యర్థమేనా? ... ఇదరిచే నిరసింపబడుతూ, యింకా బ్రతకటం యెందుకు? ఏనున్నా పుచ్చుకొనైనా లేకపోతే, ఏరులోనైనా పడైనా, ప్రాణంతీసుకుంటే....

దూరాన, గాజులు గల్లుగల్లు మన్నాయి. పేరంటానికి వెళ్ళిన చిన్నీ అప్పుడే యింట్లోకి వస్తోంది....అక్కడనుంచే నన్నుచూస్తూ

"ఏమండోయ్, యేమిటి అట్లా విచారంగా కూర్చున్నారు?" అని ప్రశ్నించింది.

నేను మాట్లాడలేదు.

చిన్ని దగ్గరగావచ్చి నామొగం పైకెత్తి...

"ఏమిటి, దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" అన్నది.

జవాబులేదు

"అయితే యెందుకు యీచింత నాకీదినం కొత్తచీర కొనిపెట్టినందుకా?"

"లేదు. లేదు. అందుకనికాదు." అంటూండగా, నానేత్రాలలోనుంచి రెండు నీటిబిందువులు క్రిందపడ్డాయి.

"అయితే, యేమండోయి. శ్రుతిమించి రాగానపడ్డదే వ్యవహారం. చిన్నపిల్లవాడిలాగు యేమిటీ యేడవడ? బాగానేవుంది....కాకతీరి కూర్చుని అట్లా నట్టింట యేడవరాదు... వూర్కోండి...అయినా, కారణం యేమిటో చెప్పరాదూ?"

చెప్పినా నీకు తెలిసేదికాదు. ఈవిషయంలో నీవేమీ చెయ్యలేవు.

"ఆ. ఆ. నాకు తెలియదూ? యెంతమాట? సంగతియేమిటో చెప్పండి. నేను సాయం చేస్తాను.

"అబ్బే. లాభంలేదు. నీవీ విషయంలో యేమీ చెయ్యలేవు. నన్ను మళ్లీమళ్లీ ప్రశ్నించకుండా వుండడమే గొప్పసహాయం...ఇంట్లోకి వెళ్ళి ఆకొత్తచీరె విడు....

"అయితే, అసలు సంగతి యేమిటో చెప్పరా?...నాకు కోపంవస్తుందిసుమా!... అసలుకథేమిటో చెప్పండి ఆపైనచూతాం."

"ఉట్టి పెంకెమనిషిగద. మాటఅర్థంచేసుకోలేవు. వేధిస్తావు..."

"అవునులెండి పోసి, అందుకనే, వెడుతున్నాలెండి..."

"ఆ, వెళ్ళకు చెప్తావిను...

"నాకర్థంకాదుగా.

"అర్థమయేటట్లు చెప్తావిను...ఇంత పెద్ద ప్రపంచములో, నన్ను నాకవిత్వాన్ని ఎవరూ లెక్కచెయ్యరేం?

"ఓహో. పెద్దప్రశ్నే ... చెయ్యమంటే, వాళ్ల చేతకాక అన్నమాట.

"చూడు. చిన్నీ నేను పదిహేనో ఏటనుంచీ కవిత్వం వ్రాయడం ప్రారంభించినాను. అప్పటి నుంచి యిప్పటివరకు విధివిరామం లేకుండా వ్రాస్తూనేయున్నాను. కాని అందులో ఒక్కటి బాగున్నదని యెవ్వరూ నోటినిండా చెప్పలేను మరి యీమనుష్యజాతి యేమిజాతియో తెలియడంలేదు. శుద్ధ గొర్రెతత్వం. ఒకరుయేదంటే, తక్కినవారంతా అదేఅంటారు. దీర్ఘంగా ఆలోచించి సంగతియేమిటి అని ఆలోచించినవాడొక్కడూలేడు. ఈ చెప్పుడుమాటలు విని పత్రికాసంపాదకులు యెవ్వరూకూడా నాపద్యాలకువారిపత్రికలలో స్థానం యివ్వడంలేదు ..."

"అయ్యో, అదేమిటండీ. పేటకొక పత్రిక, వీధికొక ముద్రణాలయం వున్న యీ దినాలలో గూడా మీకవిత్వానికి ప్రోత్సాహం లేకపోవడం చిత్రంగావుందే!... అంటే అర్థమేమిటంటే మీకవిత్వాన్ని సరిగా గ్రహించి అందులోవుండే తత్వ రహస్యం వారికి గ్రాహ్యం కాలేదన్న మాట..."

"అదికాదూ. అసలు యెవ్వరైనా ఒక 'జీనియస్' వున్నాడంటే లోకమంతా వాణ్ని అణగతొక్కడానికి ప్రయత్నిస్తుంది. మంచివాళ్ళకి, గొప్పవాళ్ళకి యిది కాలంకాదు. 'మీడియోకర్స్' వృద్ధిపొందేకాలం. అటువంటప్పుడు నన్ను లోకం యెట్లా కవిగా వొప్పుకుని ఆదరిస్తుంది. అది అసంభవం..."

"వాళ్ళ మొహం పోసిస్తురూ. వాళ్ళకేం తెలుసు... ఈ భాగ్యానికేనా యింత దుఃఖం. బలేవారండీ మొత్తానికి... (కొంచెం ఆగి)... నాకొక్క ఆలోచన తోస్తోంది. మీరు ఆ ప్రకారం చేశారంటే మరుక్షణం ప్రపంచమంతా మీ పాదాలదగ్గరకు వస్తుంది"

"ఆగు. ఆగు... నువ్వు చెప్పడానికి ముందు నాకొక ఆలోచన స్ఫురించింది... విను...పోనీ, యికముందునుంచీ పద్యాలు సినీమా పత్రికలకు పంపిస్తాను. గజలచెయ్యి గనుక తప్పకుండా ఆమోదిస్తారు. అప్పుడు సినిమాలలోనైనా నేను పైకి వస్తాను."

"చాలు చాలు. చాలునుగానీ చిన్నిని సభకు రాజేశ్వరి[illegible]"

"అదికాదూ. సినిమాలలోనైనా నేను గురి నోట్లో పడదామని."

"దానికి వేరే మార్గాలున్నాయి. చెప్పబోతుంటే అడ్డువచ్చి యీ అర్థంలేనిమాటక్కడ కాస్తా జారవిడిచారు. ... ఆమార్గం యేమిటంటే ... అట్లా చేస్తే మీకొక్క తప్పకుండా పేరవేస్తుంది. కాని అందులో కొంచెం కష్టం వుంది. దానికి మీరొప్పుకుంటే చెప్తాను. ..."

"చెప్పు యేమిటో చూస్తా!"

"రేపు సాయంకాలం మీరూ నేనూ కాలువగట్టు దగ్గరకు వెళదాం!"

"ఎందుకూ?"

"అబ్బ వినండి పూర్తి[illegible]."

"వెళదాం"

"వెళ్ళి?"

"అబ్బ యిందుకే నాకు కోపంవస్తుంది మాట పూర్తిగా వినకుండా మధ్య మధ్యలో ప్రశ్నలు అడ్డంవేస్తారు"

"ఆ లేదులే చెప్పు."

"వెళ్ళిన తర్వాత మీరు హఠాత్తుగా కాలువలోకి [illegible]."

"అమ్మయ్యో అంతపనే?"

"అహహ ఇదేనా ధైర్యం ... మీకు యీపాటి వచ్చుగా?"

"అవునవును. మరచిపోయినా అయిన ఎం దుకు అట్లావురకడం?"

"వినండిమరి వురకండి వురికి యీతరాని వానికిమల్లేనటించి మునుగుతూ తేలుతూ, సహాయంకోసం కేకలు వెయ్యండి ... ఆపైనచర్య నే నడుపుతా."

"ఎవరు రాకపోతే?"

"అటువంటి అసహ్య ప్రశ్నలు అడక్కండి.

"అట్లాగేనా శుభంమాత్రంనీకక్కరలేదూ!"

## 2

చిన్నీ పెద్దపెట్టున అకస్తు కోమటి దీర్ఘాలు తీస్తూ యేడుస్తోంది. కాలువలోపడి మునుగుతు, తేలుతూ సహాయంకోసం నేను కేకలువేస్తున్నాను. యాభైమంది ప్రజలు చిన్నీ చుట్టూ మూగారు. 'పాపం', 'అయ్యో', 'వాడికర్మం' 'సరిగా నడవలేనూ' అనేవారూ 'ముక్కుమీద వేలు వేసుకొనేవారూ', 'శివ శివ' నారాయణ నారాయణ అని అంత్య మంత్రాలు చదివేవారూ, నిలిచి చూచేవారు, నిర్ఘాంత పోయేవారు, 'అమ్మా ఆయన మీకేమి కావలె? అని ప్రశ్నించేవారు, అడుగదిగో గుటకలు వేస్తున్నాడు లాభంలేదు అనేవారు, వీరేకాని సాయంచేసేవా రెవ్వరూ కనబడలేదు. చిన్నీకి దుఃఖం మెండయింది. నిజంగా యెవ్వరూ రక్షింపకపోతే నాపని యేమికావాలి. ఆమె అనుకున్న ఆలోచనలన్నీ యివ్వాడేమి కావలె?... నేను యీది బయటకువచ్చానా చిన్నీ పరువు అంతా పోతుంది. అనుకున్న పని పాడవుతుంది. చిన్నీరోదనం వింటూంటే నీళ్లలోవున్న నాదేహం పులకరించింది. చలించింది. ఏమైతే అదిఅయింది వడ్డుకుజేరి చిన్నీని ఓదార్చుదామా అనుకున్నా. కాని యేమంటుందోఅని మనస్సుఒప్పలేదు. ... అట్లాగే తేల్తూ మునుగుతూ అరుస్తూ, ఏడుస్తూ చప్పట్లు కొడుతూ నేను కాలువలోపడి ప్రవాహంతో పోతున్నా... కొత్తగ నీరు వచ్చింది కాలువకి... ఇట్లా నేనెంతసేపు నటించగలను. ఆయాసంవస్తే నాపని యేమికావాలి? ...

చిన్నీ రోదనం హెచ్చింది. నన్ను కాలువలో పడేసానే అనేదొకటి తను అనుకున్న ప్లానులన్నీ పాడవుతున్నాయే అనే బెంగ ఒకటి. నేనిట్లా యెంతకాలం నటించగలననే సందేహం అవీ యివీ గంపెడయి చిన్నీని క్రుంగదీసినాయి. ఇంతలో వంతెనమీదనుంచి బంయ్ బంయ్మంటు జమీందారుగారి మోటారువస్తోంది. జమీందారుగారి కొడుకు షికారుపోతున్నాడు. ఇందరు ప్రజలిక్కడ కూడేటప్పటికి అతనికి తమాషా కలిగి మోటారు ఆపి దిగి సంగతియేమిటన్నాడు. చిన్నీ హోరు హోరున యేడుస్తూ నీళ్ళలో పడి తన్నుకుంటూన్న నన్ను చూపి... ఇంతమంది మొగవారు యిందాకానుంచి చూస్తున్నారు. యేమిలాభం ... నీవైనా రక్షించాలి" అన్నది చివరకి... అతను నావంక చూచాడు. ఒక్క త్రుటిలో పెద్దపక్షిలాగు ఎగిరి కాలువలోకిదుమికి నావైపు యీదుకుంటూవచ్చాడు. అంతా ఆశ్చర్యపడ్డారు. అతని జరీదుస్తులు అతని ఠీవి అతని గౌరవం యేమీ ఆలోచించకుండా యింత సాహసం పనికి రాదన్నారంతా. అతను యీది నన్ను పట్టుకొని వడ్డుకు జేర్చాడు అంతా చుట్టూమూగారు. చిన్నీ ఏడుస్తూనాదగ్గరకొచ్చి నీళ్ళుతుడ్చి తడిసిన వస్త్రాలని విడదీయడం మొదలెట్టింది. కాని ఆమె ప్లానులు పూర్తిగా సాగలేదనే అసంతృప్తి ఆమె కళ్లలో కనబడుతోంది. నేను కళ్లు మూసుకొని శ్వాస పెద్దదిచేసి ఆపసోపాలుపడ్తు చిన్నీ చెప్పినదానికేం భంగము లేకుండా పట్టిం

చానను. అంతకంతకు నేను కళ్ళు నిలవేసి కాళ్ళు నిగడతన్ని చూశాను. అది చూచి చిన్ని మరింత బిగ్గరగా యేడ్చింది.

ఇంతలో, "తప్పుకోండి. తప్పుకోండి" అని కేకలు వేసుకుంటూ, వార్తాపత్రికల తాలూకు ఫొటో తీసేవాళ్ళు పదిమంది కెమెరాలతో తయారైనారు. వారు పనిచేసుకొని నాపేరు అదీ తెలిసికొని వెళ్లిపోయారు.... చిన్నికి కొద్దిగా తృప్తికలిగింది ...జమీందారు గారి అబ్బాయి నన్ను అతను మోటారుదగ్గరకు తీసుకువెళ్ళి అందులో కూర్చోపెట్టి, తనుకూడా నాప్రక్కనకూర్చుని, చిన్నినికూడా కూర్చో మన్నాడు. అతనివి తడిబట్టలు, నావీ తడిబట్టలు; స్పర్శదోషంచేత చిన్నివి తడిబట్టలు. మోటారు కదిలింది. అతను మోటారును మాయింటిదగ్గర ఆపి నేను లోపలికి నడవడానికి సాయంజేశాడు. అతడొకవైపు చిన్ని ఒకవైపు పట్టుకొని నన్ను లోపలికిజేరవేసి ఒకకుర్చీలో కూర్చోపెట్టాడు. చిన్ని లోపలికి వెళ్ళి క్రొత్తవస్త్రాలు పట్టుకువచ్చి నాతడిబట్టలు విడిపించి, అవికట్టి, పక్కమీద పడుకోపెట్టింది. ఇంకా నేను నటనలోనేవున్నా. నేను స్థాయిగా పడుకున్న తర్వాత, జమీందారు గారి అబ్బాయి నావంక చూచి, 'వెడతాను' అనే అభిప్రాయసూచకంగా తలత్రిప్పాడు. ఆసందేశంనేను చిన్నికి అందిచ్చాను. చిన్ని అతనివైపుచూచి "ఏమండీ, మీరిట్లా వెళ్ళడం భావ్యంకాదు. ఆతడిదుస్తులువిడిచి, యీక్రొత్తవి ధరించి, కొంచెంసేపు విశ్రమతీర్చుకొని పోవచ్చును." అన్నది మెల్లగా, మృదువుగా.

"ఫరవాలేదులెండి. పోయివస్తాను" అన్నాడు

"మీరట్లాఅంటే యిక చెప్పేదియేమున్నది. మీరుచేసిన యీఉపకారం మేము యెవ్వరమూ మరువలేము. ఆసమయంలో సాక్షాత్తు భగవంతుడిలాగ వచ్చారు......" అని చిన్ని యింకేమేమో అంటూండగా, అతను "యీమాటల కేమివచ్చెలెస్తురూ" అంటూ బయటకు వెళ్ళాడు. చిన్ని గడపదాక వెళ్ళి "అయితే మీపేరేమో చెప్పారేకారు" అన్నది కోమలంగా. అతడది అందుకొని "నాకీర్తి నల్దిక్కులా వ్యాపించనక్కర లేదుగానీండి; మీఆయన కాలువలో పడడం యెట్లాసంభవించింది?" అని కొద్దిగా యెత్తిపొడుపు ప్రశ్నవేసి, మోటారులోయెక్కి వెళ్ళిపోయాడు. ఆమాటలు వినేటప్పటికి చిన్ని ముఖం చిన్నబోయింది. మంచంమీద వున్న నేను నాలుక కరచుకొన్నాను.

## 3

ఇంకా సరిగా తెల్లవారకముందే పిల్లకాయలు "పేపరు, పేపరు" అంటూ కేకలు వేస్తూ వచ్చారు. చిన్ని అప్పుడేలేచి, వాకిట్లోకి వచ్చేటప్పటికి ఒక ముసలి జవాను అయిదారు పత్రికలను యిచ్చి వెళ్ళాడు. గభాలున లోపలికి పరుగెత్తుతూ వచ్చి "చూశారా, నాకీర్తి ఎట్లాపాకిందో" అని నాలుగు వార్తాపత్రికలు విప్పి నాముందర పడవేసింది. ప్రతిపత్రికలోను మధ్యపుటలో మధ్యగా, జమీందారుగారిఅబ్బాయిది, నాది, బొమ్మలు ప్రచురించి, వాటిపైన పెద్దపెద్ద అక్షరాలతో యిట్లా అచ్చువేశారు.

"విచిత్ర ప్రాణరక్షణము. గొప్పప్రమాదము. ఒక కవిశేఖరుడు హఠాత్తుగా కాలువలోపడుట. ఒకజమీందారుని పుత్రుడు సాహసముతోదుమికి, అతనిని రక్షించుట."

చిన్ని యొక్క విచిత్రఆలోచన చూచి, నాకు కడుపుబ్బ నవ్వొచ్చింది. ఉభయులము నవ్వినాము.

# చానమ్మ

ఆండ్రి శేషగిరిరావుగారు, సారస్వతసమాజము.

బ్రహ్మతేజమును మహాక్షాత్రమును ఒక్కట తనయందు చిక్కబట్టి పరశురాముని వలె 'ఇదం బ్రాహ్మమిదం క్షాత్రమ'ని చాటి చెప్పిన అసహాయశూరుడై ఒప్పిన తన పతి ఒకప్పుడు విధివశముచేత స్వబలము చెల్లాచెదరు కాఁగా రణరంగమునందు ఒంటరిపాటున నిలువరాక వీరవిహారము విరమించి ఇంటికి వచ్చుట చూచి ఆతనికి వీరసందేశమిచ్చి ప్రబోధితుజేసి సమరోన్ముఖుగావించి వీరస్వర్గమిప్పించిన వీరపత్ని, చానమ్మ, ధన్యచరిత్రము ఆంధ్రలోకమునకు అందు ముఖ్యముగ ఆంధ్ర రమణీమణులకును ప్రాతఃస్మరణీయముకదా !

చానమ్మ ఖడ్గ తిక్కన అర్ధాంగి. తిక్కన కొట్టరువు సిద్ధయామాత్యుని జ్యేష్ఠ పుత్రుడు. విరాటపర్వముఁ దొట్టి తుదముట్ట ఆంధ్ర మహాభారతమును 'ఆంధ్రావళి మోదముం బొరయ' బుధసంతోషము నిండా' రచించిన తిక్కన సోమయాజి ఈతనికి పినతండ్రి కుమారుడు. పదమూడవ శతాబ్దియందు విక్రమసింహ పురమున (నెల్లూరు) రాజ్యమేలిన మనుమసిద్ధిరాజునకు మంత్రి మణియై, సేనానియై రణతిక్కన పేరు గొంచెను.

యాదవులకు కాటమరాజు ఏలిక. ఆతడు కనిగిరిసీమలోని యెఱ్ఱగడ్డపాడున కధిపతి. కనిగిరి సీమలో ఒప్పుడు అనావృష్టిదోషము సంభవించెను. వచ్చిన బీళ్లన్నియు ఎండి ఎడారులగుటచే పశువులకు మేత కఱవైనది. అప్పుడు కాటమరాజును యాదవులును తమ పసువుల మందలను మనుమసిద్ధిరాజు మేత బీళ్లకుఁ దోలికొని వచ్చి పుల్లరి యిచ్చు నొడంబడికపైని తోలకరించు వరకును మేపుకొనిరి. పశువుల మేతయైన ఊదవాయు అక్కడ తమ కోడెదూడలలో నేదో నష్టము కలిగినదన్న కారణమునఁ బుల్లరి నెగవేసిరి. అందుపై మనుమసిద్ధిరాజు ఆలమందల అటకాయించెను. అప్పుడు పోరుపొసగెను.

సిద్ధిరాజు గొప్పసైన్యమును సమకూర్చుకొని సమరసన్నాహములు సాగించెను. తిరునామాల తిప్పరాజు, శ్రీ కంఠరాజు, పెదవేగి చొక్కరాజు, పెదపరదరాజు, అద్దంకొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు, ఉల్లకొండ సోమన్న, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాప తిమ్మరాజు, వెలకంచి వెంగళపతిరాజు, ప్రభగిరి పట్టణము పద్మశేఖరుడు మున్నగు యోధులు మనుమసిద్ధిరాజునకు బాసటయై వచ్చి నిలిచిరి. ఈ వీరులందరకు ఖడ్గతిక్కన మొనగాడై జైత్రయాత్రకు వెడలెను.

కాటమరాజుకూడ యుద్ధసన్నద్ధుడయ్యెను. పల్నాటిప్రభువైన పద్మనాయడు, పల్లికొండ ప్రభువైన చల్ల పిన్నమనాయడు, దొనకొండ అయితమరాజు, యెఱ్ఱయ్య, పాచయ్యనాయుడు, పుత్తమరాజు మొదలగు యాదవవీరులు కాటమరాజునకు దోడ్పడవచ్చిరి. ఈసైన్యమునకంతయు పిన్నమనాయని మంత్రియైన బ్రహ్మరుద్రయ్య అను ఆరాధ్యబ్రాహ్మణుడు ఆధిపత్యము వహించెను.

ఉభయవాహినులును పాలేటియొడ్డున పంచలింగాల కొండకడ డాకొని తలపడిరి. అప్పుడు దొమ్మియుద్ధము జరిగినది. అందు సిద్ధిరాజు సేనలు యాదవవీరుల పరాక్రమధాటికి ఆగలేక వీఁగఁ బాఱజొచ్చెను. నిజబలములు చేవ దొరగి చెట్టొకపిట్టలై చెదరిపోఁగా ఒంటరిపాటున యుద్ధభూమిని నివ్వెఱపడి నిలిచియున్న తిక్కన్నను తిలకించి ప్రతిపక్షయోధుఁడైన పిన్నమనాయఁడు.

పోరు నిలుపుమోయి ♦ భూసురోత్తముండ!
పోకాదు మాతోడ ♦ సమరంబుఁ జేయ
అగ్రజాల్ మీరు యా ♦ దవులను మేము
ఉగ్రము మామీఁద ♦ నుంపగ రాదు;

అని అహమహమికతో ఎత్తిపొడుపుమాటలాడెను. అపుడు తిక్కన్న చేయునది లేక తనమరదృష్టమునకు దురపిల్లుచు మఱల నింకొకప్పుడు సేనల కూర్చుకొనివచ్చి తలపడవచ్చునని తలంచి సంగ్రామరంగమునుండి గుఱ్ఱమును మరలించుకొని పురమునకు వచ్చెను.

వైరికి వెన్నిచ్చివచ్చిన తిక్కన్ననుచూచి విక్రమసింహపురవాసులు ఈసడింపు పలుకులాడి వికవికనవ్విరి. అవును, నవ్వరా? అయిన ఇంట బుట్టి కానిపని జేసినచో నవ్వరా? పుట్టినది శౌర్యమునకు విశ్రామభూమియగు రొట్టరువు వారివంశమున. పూనినది అసాధారణమును అనన్యదురాపమునైన వాహినీపతిత్వము. చేపట్టినది కఠోరఖడ్గము. వహించినది 'రణతిక్కన' యను బిరుదు. అట్టిచో పగఱకు వెన్నిచ్చిన మెడల నవ్వులపాలు గాకుండునా?

ఇట్టి ఈసడింపువాక్యములు ఆతనికి ఇంటియందు విస్తరించి వినిపించినవి. 'కనుపుచెఱుప బుట్టిన ఈబడుగొట్టు' అని సిద్ధయామాత్యుడు కొమారుని ఉల్లము ఉచ్చి పోనాడెను. తిక్కన్న స్నానమాడఁబోవ ఆడువారు జలకమాడు మఱుఁగుపట్టున భార్య చానమ్మ నులకమంచము అడ్డుపెట్టి దానిపై పసుపుటుండనుంచి నీళ్ళబిందెఁ దెచ్చిపెట్టెను. ఇదియేమని వ్యసనపడి ఆతఁ డడుగగా చానమ్మ—

క॥ పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనపు ♦ నాయకులెందుఱ్
ముగురాఁడు వారమైతిమి;
పగమేటికి జలకమాడ ♦ వచ్చిన బోటకా.

అని మొదలకించి సూటిపోటు మాటలాడెను. ఇన్నాళ్ళదనుక తలలో నాలుకవలె అనుకూలవతియై యుండిన అర్ధాంగి నేఁడిట్లు వెడిమరాలై యుండుట గమనించి ఆతఁడు భోజనమునకు లేచెను. తల్లి పోలమ్మ అన్నములో విఱిగిపోయిన పెరుగుపోసెను. ఇదియేమని యాతఁడన ఆమె తుత్రించి చైచినట్లు

క॥ అసదృశముగ నరసీతుల
మసిపుచ్చక విఱిగివచ్చు మగ పందక్రియన్
గసవుఁ మేయఁగఁ బోయిన
పసులుఁ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్.

అని పరియాచకము లాడెను.

చేసికొన్న భార్య అట్లు తూలగనాడెను. కడుపార కన్నతల్లి ఇట్లు తూలాడించి తూలనాడెను. అందుతో నాతనికి ఉక్రోషము వచ్చినది. వైరుల శరవర్షమున చప్పగ చల్లారిన ఆతని శౌర్యమును, నిప్పుకణములవంటి వారి పోటుమాటలు లేవంజోపి రవులబెట్టినవి. చిర

కాలనముపార్జితమైన వంశప్రతిష్ట రూపొంది అప్పుడు తిక్కన్న నిట్లని హెచ్చరించెను.

సీ॥ విజయాధిపునిదాడి వెరువెంటఁదగిలినఁ
బ్రాణముల్ దాచిన పందగజము!
పెంపేది పోలేటి బిరుదులన్నియుఁబైచి
పసుగెత్తువచ్చిన పాయఁబోతు!
దురములోఁ జావక దొరలెల్ల హసియింప
మంచాన కోరిగిన కొంచెకాఁడ!
చతురంగబలముతో సమరంబు సేయక
మానంబు విడచిన మందబుద్ధి
గీ॥ యనుచు నాశ్వేలవారు నిన్నపహసింప
ధరణి నెల్లారులో నెట్లు తిరుగగలవు?
వైరులను గెల్చి సత్కీర్తి వరలుమయ్య!
మంత్రికులమౌళి! తిక్కనామాత్య మౌళి!

తిక్కన తినుచున్న అన్నమును విడిచివేసి వెంటనే గుఱ్ఱము నెక్కి యుద్ధభూమికి ఉడాయించెను. అయితే ఇప్పుడాతనికి జయసంపాదనము ప్రసక్తిగాదు. కొట్టరువువారి వీరవంశమునకు తనమూలమున వచ్చిన మచ్చ తుడిచివేయవలయుననియే ఆతనిదీక్ష. ప్రాణములకు తెగించిన పరశురాముడు ఖడ్గముతో కదనరంగమున ప్రవేశించెను.

తిక్కదండనాథాగ్రణి ఖడ్గధాటికి మారు లేకుండెను. వచ్చినవాడు ఫల్గునుడని యాదవ వీరులు బెదిరి పరిభ్రమించిరి. అదికని యాదవ సేనాని బ్రహ్మదుర్గయ్య ముందునకువచ్చెను. ఆప్రవరుల కిరువురకు చాలసేపు ద్వంద్వ యుద్ధము జరిగినది. తుదకు ఇద్దరును నేలకొరిగిరి. అప్పుడు క్షాత్రమిశ్రితమైన బ్రాహ్మ్యము రక్తస్రవంతులలో ప్రవహించినది.

ఇట్లు మొక్కవోని అసహాయ సాహసుడై విక్రమపౌరుషాదుల నెఱపి వీరస్వర్గమలంకరించి

ఉ॥ చిక్కకమన్మసిద్ధి విభుచే
మును గొన్న ఋణంబు దీర్చెమా
తిక్కనమంత్రి సోమశిల
దేవరసాక్షిగఁ బెన్నసాక్షిగా
నెక్కినవాజి సాక్షిగ మహి
న్నతికెక్కిన కీర్తిసాక్షిగా
మ్రొక్కక మారకొన్న రణశూ
రులు సాక్షిగఁ గొండసాక్షిగన్

సమరధర్మము నీరసపుచ్చి వచ్చిన ఖడ్గతిక్కనకు వీరసందేశమిచ్చి రణమునకంపి వీరస్వర్గసుఖమొసంగి అతడు అపయశకూపమున బడకుండ కాపాడినకీర్తి వనితాశిరోమణియగు చానమ్మది. పతికిఎదురాడనోడి చానమ్మ మూగయయి యుండినచో ‘ఖడ్గతిక్కన, రణతిక్కన’ అని జనామోదము నొందియున్న పతిబిరుదు బీరములు బెడిసకొట్టియుండును; యశోభరితమగు కొట్టరువు వారి వంశము దుర్యశ పంకమున ద్రుంగుచు పడియుండును. పోలమాంబ వీరమాత యగుటకు బదులు భీరుమాతయై యుండును; విశేషించి తాను వీరపత్ని యనిపించుకొనుటకు వీలులేకుండ యుండును; ప్రమాదించిన పతికి విధ్యుక్త వీరధర్మము జ్ఞప్తికిదెచ్చి పరువు మర్యాదలు నిలిపి వీరపత్ని యనిపించుకొనినది కావుననే చానమ్మ పుట్టుకచే ఆంధ్రభూమి పునీతమైనదని తెనుగువారు గొప్పగా చెప్పుకొనుచున్నారు. పుట్టిన ఇంటికి మెట్టిన ఇంటికి పరువు ప్రతిష్ఠలు సంపాదింపగలిగిన ఇట్టి స్త్రీ రత్నముల గాంచుటచేతనే గదా ఆంధ్రభూమి రత్నగర్భ యని పేరొందినది.

అభిమానవతియైన అంగన ప్రాణనాయకుడు పిఱికివాడగుట భరింపలేదు. అట్లగుటనే కదా, జోధపురాధీశ్వరుడైన జస్వంతసింగు మహారాజు

పక్షముగాని ఔరంగజేబుపై ఎత్తి వెళ్ళి యుద్ధమున గాయపడి ఓడి పురమునకు రాఁగా మానవతియైన జోధపురరాణి పురద్వారములు బిడాయించి, పరాజితుని దీనాననమును ఈ పుర స్త్రీలకు చూపనక్కఱలేదు' అని కచ్చితముగ కబురుచేసెను! అయితే జోధపురరాణివలె చానమ్మ కఠోరము పూనలేదు. మాటలతోడనే మనోరథ మీడేర్చుకొన్నది. ప్రమాదవశమున పెడమార్గము త్రొక్కిన పతులకు సరియైన మార్గమును చూపుటలో రమణీమణులు చానమ్మ చారిత్రమును మేలుబంతిగ చేకొనియెదరుగాక!

వీరపత్నియైన చానమ్మ విశ్రుతకీర్తికి విపులమగు ఆంధ్రావని యంతయు విహారమందిరమై వెలయుచున్నది.

(ఆంధ్రరమణీమణులనుండి)

## నెచ్చెలి.

మంగిపూడి వేంకటశర్మగారు.

ప్రచుట్టో సిగరెట్టో యానపడి యేయే వేళలన్ నిత్యమున్
నీచుట్టున్ దిరుగాడి యుచ్చకములన్ నిన్మెచ్చు నీచాత్ములే
నీచుట్టంబులుగాని స్నేహితులుకాని కారు నీశత్రులే
నీచెట్టన్ గనిపెట్టలేవుగద నిన్నేమందునో నెచ్చెలీ!

మదికింపైనను గాగయున్న హితమే మాటాడు మోమోటమున్
గదియంబోడు నిజాల మిత్రుడయినన్, గాపట్యహ్రస్ మిత్రుడో
ముదమాపత్తి సమేకమై మెలగుచున్ మోనంబు గావించు నీ
విదియున్ గానవమాయికాగ్రణివి నిన్నేమందునో నెచ్చెలీ!

చేదున్మాత్రలె వ్యాధిబాధితునకున్ జేజేత వైద్యుండిడున్
స్వాదుల్ వెట్టడు, మంచిమిత్రుడటులే సంతోషపెట్టంగ నీ
కేదిష్టంబది దిష్టమేయనకు బోధించున్ సదా సూక్తులే
నేదెల్పన్వలనే వివేకిరొ నిన్నేమందునో నెచ్చెలీ!

# ప్రణయస్వప్నము

వఝల వెంకటేశ్వరకవి

"ప్రణయమన నేమి? సకల ప్రపంచము ప్రణయ సంభూత మందురు. ఈ ప్రణయము దృగ్గోచరమో, హృద్గోచరమో, యెచ్చట నుండునో యెవ రెఱుంగుదురు? ఇప్పటి నా హృదయమువలె నుండునా? ఇట్టి యవస్థలో నొక్కొకమారు హృదయ మొకవిధముగాఁ గొట్టుకొనుచుండును. అట్టి హృదయావేగములే యంతర్భావముతో మేళవించు ప్రణయ దూతికలు. అగోచరమగు నా ప్రణయమే కవి! గాయకుఁడు! చిత్రకారుఁడు!— ప్రణయమే నానాభావముల సంతోష సంతాపములఁ గూర్చునది! ప్రణయమే నానారాగ కళాకలాపముల హృదయంబు నాడించునది! ప్రణయమే నానాకల్పనా విశేషముల నంతర్బహిర్నయనములకు నాలోకముఁ గల్గించునది! సౌందర్య నాయికా సాంగత్యంబునఁ దగు ప్రణయమువలననే నడుపఁబడుచు సంచరించు భావవిహంగ మనేక రూపములతో, అనేక చిత్రగమనములతో హృదయాకాశమున విహరింపుచుండును. తత్ప్రణయాపాదిత భావజలంబుల వాంఛా బీజంబులు మొలకలెత్తి హృదయాలవాలమున నాటుకొనుచుండును. ప్రణయమే ముందు జన్మించెను. అనంతరమున లోకము జన్మించినది. ప్రణయము సర్వ బంధువు. అప్పుడప్పుడు విషాద మేఘావృతమై ప్రణయ చంద్రబింబము ప్రకాశహీనమగునట్లు తోచుచుండును. కాని యది వట్టి భ్రమ! ప్రతిప్రాణి హృదయరత్నము ప్రణయ తేజోవిరాజమానమై యెల్లప్పుడును వెలుగొందుచుండును అట్టి ప్రణయమహిమంబు నెఱుఁగ నేకిందరముకాదు"

* * *

అని యొక శిలావేదికపైఁ గూర్చుండి వితర్కించుచుంటిని. అది సాయం సమయము. ప్రక్కనే యొక సెలయేరు మెల్లగా బారుచు చిన్న చప్పుడు గావింపుచుండెను. చిన్న పిల్లవాయువులు వీవ, నవకోమల వల్లీమతల్లికలల్లాడుచుండెను. కీరిక మధురగీతికల బాడుచుండెను. కోయిల ప్రణయ గానామృత రసంబు లొలికించుచుండెను. అక్కడక్కడ ఎండుటాకులు మర్మరధ్వనిఁ గావింపుచుండెను. ఈ రవంబు లన్నియు మన్మనోగానంబుతో మేళవింపుచుండెను. సూర్యుఁ డస్తాద్రి నధిరోహించుచుండెను, సంజకెంజాయ లెల్లెడలఁ గ్రమ్ముకొనియెను. ఆ ప్రదేశంబున నేనుదక్క మరి యెవ్వరును లేరు. మన్మనోగగనంబున ననేకాలోచనా మేఘములు పరుగిడుచుండెను. అత్తరిఁ బక్షికలకలధ్వనులు చెవులసోకి నాకించుక తన్మయత్వముఁ గల్గించెను. హృదయం బులికిపడెను.

"ఖగ వతంసము లనర్గళముగానట్లు
కవిపుంగవుల రీతిఁ గలకంఠగీతి
సలుపుచుండినవంచుఁ దలఁతువే నీవు?
కాదేనిఁ గలకంఠ గానంబుఁ జేయఁ
గారణం బెఱుఁగునే ఖగవతంసములు?
దైవ దివ్య ప్రసాదమునకు నతని
నొప్పుగా వినుతించుచున్నవారేమి?"

అను మాటలు నా చెవింబడెను. ఎవరుపల్కిరో తెలియదు. ఎవరు పల్కిరనికూడ వితర్కింపనైతిని. దాని యర్థము నాకు బోధపడలేదు. కాని నేనీరీతిగాఁ బ్రత్యుత్తర మొసంగితిని.

"ప్రణయ దైవతమును బ్రణుతించుకొరకు
బ్రణయంబుకాక కారణము లేదని
ప్రణయ దైవతమును బ్రణుతించుకొరకు
బ్రణయమొక్కటె చాలు బ్రణయంబె చాలు"

అని వచించి తెల్విఁ దెచ్చుకొంటిని. ఆహా! ఆరీతిఁ బ్రశ్నించిన దెవరు? ఎవరును గానరారే? అని యప్పుడాలోచించితి. ఆహా! జ్ఞప్తికి వచ్చినది. ప్రణయ దైవతము నా హృదయంబునఁ బ్రవేశించి నాచే నట్లు పలికించెను. ఆ వాక్యములు ప్రణయ దైవతమే పలికెను. ఆ జవాబు నే నెట్లిచ్చితినో నాకుఁ దెలియదు. ఇదియంతయుఁ బ్రణయ మహిమమే కాబోలు! అని యేదియో యూహించుకొనుచు నాకసమువంకఁ జూచితిని. అంత నాకుఁ జిన్న మేఘములు కనఁబడెను. శాంత భానుని తేజంబున నమ్మేఘంబు లించుక యెఱ్ఱఁబారియుండెను. ఆ యెఱుపుదనములోననే ప్రణయ రాగంబు గోచరమయ్యెను. ఆ మేఘంబు లొకదానితో నొకటి కలియుచు ప్రణయాబ్ధి నోలలాడుచున్నవి కదా! ప్రకృతియెల్లఁ బ్రణయమయము. ఇఁకఁ బ్రణయ మెచ్చటనుండునని తలంప

నేల? ప్రతి స్థలమునందును, ప్రతి వస్తువునందును బ్రణయ ముండునని తోచుచున్నది!

* * *

ఇట్లు తలంచుచుంటిని, అంతలో నాకను లించుక మూతపడెను. కాని కనులు మూసితినని నేను తలపనైతిని. కనులు మూసికొని యున్నను నాకుఁ బ్రకృతి గోచరమగు చుండెను వృక్షములు కనఁబడుచునే యుండెను. కాని యంతలో నా వనరంగమున చిన్న దారి కనఁబడెను. అంతకు మున్నా మార్గము లేదు. ఆమార్గ నాకు స్ఫురింపనే లేదు. నన్ను నే మరచిపోయితిని. ఆమార్గములోనుండి ఒకపురుషుఁడు మెల్లగా నడచి పోవుచుండెను ఆపురుషుడు నన్నుఁబోలి యుండెను. నా యాత్మ వానితోఁగూడ నేఁగసాగెను. నే నెచ్చట నుంటినో నాకు తెలియదయ్యెను పురుషుఁడు మాత్రము కనబడుచునే యుండెను.

"ప్రణయ దైవతమునివాస మెచ్చోటు?
ప్రకృతి జన్యములార! వచియింపరేల?"

అని యాతఁడు వచియించెను. ఆతని మాటల ననక మున్నె యాతండు ప్రణయ దైవతమును వెదకుచు నరుగుచున్నాఁడని తెలిసికొంటిని. ఆతఁ డేగుచున్న మార్గము చాల సన్నముగా నుండెను. ఆమార్గమున కిరుప్రక్కల దట్టముగాఁ బెరిగియున్న వృక్షము లుండెను. సూర్యుఁ డప్పుడే యస్తమించెను ప్రకృతి యంధకారమయమై యుండెను. అతని కించుక భీతి జనియించెను. ఆహా! యిది ప్రణయ మహిమయో, యేమి మహిమయో యాతని హృదయంబు నెఱుంగు శక్తి నాకుఁ గల్గినది! అట్టి సమయంబునఁ బ్రకృతియెల్ల నిశ్శబ్దముగ నుండెను. కాని యెచ్చటనో దూరమునఁ బ్రవహించు నది యొకటి చుమ్మల్లని చప్పుడు చెవుల సోకుచుండెను. ... మీఁదనో కూర్చుండి గ్రుడ్లగూబ బాళింపుచుండెను. కీటకములు గింగురుమను శబ్దమును గావించుచుండెను ఏకొండవల్లె లోపలనూయించుక నిదురఁ జెందు పసుపుల మెడలఁగట్టిన గంటలు చిన్న ధ్వని జేయుచుండెను. కాని యా ధ్వను లెవ్వియుఁ బ్రత్యేకముగాఁ బరిశీలించినం గాని చెవుల సోకవు. ఆ నిశా సమయము మిగుల భయంకరముగా నుండెను. ఆపురుషుఁడు మెల్లగాఁ దడవుకొనుచుఁ ద్రోవ ననుసరించి పోవుచుండెను.

"ప్రణయ దైవతము నివాస మెచ్చోటు?
ప్రకృతి జన్యములార! వచియింపరేల?"

అని మరల నాతఁడు మెల్లన గొంతెత్తి పలికెను. అట్టి ఘోర కానన ప్రదేశమున నాతనికిఁ బ్రత్యుత్తరమునొసంగువా రెవరు? ఆమార్గమున కిరువైపుల నున్నత శిఖరములును, నిబిడములగు మహావృక్షములును గలవు. ఆదారిని బట్టి మారు మాటాడకుండ నతఁడొక్కఁడును బోవుచుండెను. అట్లేగుచుండ మార్గము సన్నగిల్లెను. అయినను ధైర్య మవలంభించి యతఁడు ముందునకేగఁ బ్రయత్నించెను. కాని కంటకమయములగు తుప్పలలో నాతని పదములు దగుల్కొనియెను. దారిఁ దప్పితినని యెంచి వెనుకకుఁ బోవుచుండు వచ్చెను. కాని మార్గము కనఁబడలేదు. చుట్టును వృక్షములే! కంటకములే! ఎదుట నొక మహాపర్వతము! మార్గము ముందునకుఁ గానరాదు! వెనుకకు లేదు!— పాపము! ఆ పురుషుఁ డొనరించునదేమి?

"ప్రణయ దైవతమా! నీకొరకై యెన్ని కష్టములకయిన నోర్చి యీరీతిగా ఘోరవనంబులఁ జరియించుచున్నాఁడ. నిన్ను దర్శింప వెదకుచున్నాఁడ. నాకంటఁ బడవేల? నాయందుఁ గరుణయుంచుటకైనను నీకు లేదా? ఈ గాఢాంధకారమున—యీ నిబిడ వన ప్రదేశమున—ఎంతగా నన్వేషించినను? నీవు సర్వ ప్రపంచానకు వినోదురాలవేమో! యింకఁ గనఁబడవేల? లేదా నేనంతటి పాపముఁ జేసికొంటినా? లేక నీవు మాయవా? యోగనిద్రఁ దవా? భావగోచరుఁడవా? నా బుద్ధియునా బోధపడకున్నదే? ఇఁక నే నేమిచేయుదను? పోనిమ్ము వెనుకకు మరలిపోయెద ననుకొన్నను వెనుక మార్గము కానరాకున్నదే? ప్రణయ దైవతమా! ఇంచుక కనికరించి దర్శన మిప్పింతువు!"

అని ప్రార్థించుకొనుచుఁ గొంత తడవు నిరీక్షించెను. చాల వెనుక తిరిగ నతఁడు ప్రయత్నించెను. కాని వచ్చినమార్గముఁ గనుఁగొనఁజాలక సాహసించి ముందుకు నడువసాగెను. అంతకంతకు మార్గము సన్నగిల్లెను. అట్లతఁడు పోవుచు మెల్లగాఁ బర్వతమును సమీపించి యా పర్వత తీరము ననుసరించి నడువ మొదలిడెను. అట్టులు పోవంబోవ నాతనికి గుహయొకండు గోచరించెను. గుహాద్వారము చాల విశాలముగా నుండెను ఆతనికదియే మార్గమయ్యెను. "దైవమా! నా కిక నీవే తోవఁ జూపితి"వని అనుకొనుచు నాతఁడా గుహఁబ్రవేశించి పోవసాగెను ముందు వెనుక లించుకంతయుఁ గన్పింపవయ్యెను. గాఢాంధకారము!— ఒక్కఁడు!— భయోత్పాతకమగు పర్వతగుహ!— ఆగుహాయందట్టి ఘోర

జంతువులు వాసముండునో!— పాములే యుండునో, పులులేయుండునో!— అతండు నిర్భయముగా నేగుచుండెను, అందు గబ్బిలముల దుర్వాసన మాత్రము కొట్టుచుండెను. అప్పుడప్పుడు గబ్బిలము లతనిం దాకుచుండెను. కాని యాతఁడు లక్ష్యముసేయలేదు. అందు గాలికూడఁ దక్కువగానుండెను. అంతకంతకు దారి సన్నమయ్యెను. కొంతదూర మతఁడు వంగి తడవుకొనుచు నడచెను. గుహ మిక్కిలి సన్నమగుటంజేసి యాతఁ డంతటఁ గూర్చుండియే యరుగసాగెను.

“ ప్రణయ దైవతమ! నీ వాసమెచ్చోటఁ?
ప్రణయ దైవతమ! దర్శన మీయవేల? ”

అనుచు నాపురుషుఁడట్లే వెనుఁదిరుగక పోవుచుండెను. గుహ కూర్చుండుటకుఁగూడ వీలులేకపోయెను. అంత నాతండు ప్రాకుచుం బోవలసివచ్చెను. అంతలో గ్రమముగా నా గుహ మూసికొనిపోయెను.

“ అయ్యో; దైవమా; యిందులకా నన్నింతదూరము రప్పించితివి? యిఁక నేను మరలి పోవలసినదేనా? ఏమి నాగతి ప్రణయ దైవతమా; ఏల యింతగా నలయించెదవు? నీకు నేనేమి హాని గావించితిని. ” అని యతఁడు తలంచుచుండఁగా— ఆశ్చర్యము;— అత్యాశ్చర్యము;— అద్భుతము;— అత్యద్భుతము;— ఆ గాఢాంధకార గుహాలో నాయనాథునిపై నొక్కమారు దివ్య తేజంబు ప్రకాశించెను. ఆహా; అది ప్రణయ దైవతము దివ్య తేజఃకిరణ ప్రసారము;— అంత నతఁడు సంతోషితాంతరంగుండై యా దివ్యతేజం బగపడిన దెసవైపు దిలకించెను. అతని కచ్చట నొక సోపానమార్గము భూమిలోనికిని, ఒక సోపానమార్గము కొండపైకిని బోవునట్లులు కనంబడెను. తోడనే యాపురుషుఁడత్యాశ్చర్యముతో ముందు పైకరుగు మెట్లనెక్కెను ఆ మెట్లు కడకుఁ బర్వతశిఖరముమీదికి వచ్చెను.

ఇప్పుడా పర్వతశిఖరమున నెవ్వరున్నారు? నేనే; యితరు లెవ్వరును లేరు. ఆపురుషుఁ డెచ్చటనున్నాఁడు? యేమయ్యెను? ఆతఁడక్కడ లేడు. అతడే నేను; అతఁ డెవఁడో యనుమాట వట్టి భ్రమ ఇంతదనుకఁ బ్రయాణ మొనరించునతఁడు నేనే; యితర పురుషుఁడని నాహృదయము భ్రమించినది; ఆ పర్వత శిఖరమునుండి క్రిందికి సోపానము లున్నవి. దానినుండి మెల్లగా నేను క్రిందికి దిగినాఁడను. దిగి నలుదెసలఁ బరికించితిని. ఆహా! పర్వత శిఖరముగాని, సోపానములుగాని నాకుఁ గన్పింపలేదు. అదియొక పెద్ద యిసుక మైదానము, ఎచ్చటను చెట్టుగాని యొక వస్తువుగాని కన్పింపలేదు. ఒక వృత్తమధ్యమున నున్నట్లచ్చట నే నొక్కఁడనే యుంటిని. ఆకాశము జలధరశూన్యమై యతి నిర్మలముగా నుండెను. తన్మధ్యమునందుఁ బూర్ణ చంద్రబింబ మతి రమణీయముగా స్వీయ కాంతుల నల్దెసలఁ బ్రసరింపుచు నలరారుచుండెను. అది యేలోకమో యెఱుఁగనైతినిగాని నాకు నిర్భరానందము సంధిల్లెను. నా కేమిచేయుటకుం దోచదయ్యెను. ఇంక నెక్కడికిఁ బోవుదును? ప్రణయదైవత మెచ్చటగన్పట్టును. అని తలంచుచు నట్లే కనుచు నిల్చియుంటిని.

ఆ సమయమున నాయెదుటఁ గొంతదూరమున లీలగా నొక వస్తువు కంటఁబడెను. అది యేమగునోయను నాశ్చర్యముతో నట్లే నిరీక్షించుచుంటిని. అంతలో నది యొక చిన్న మొక్కవలెఁ గన్పట్టెను. ఆహా! యీ మైదానములోఁ గొత్తగా మొలక జనించుచున్నదేమి? ఇది ప్రణయమహాత్మ్యమే కాఁబోలునని యట్లే కనుచుండ నంతలోన మొలక పెద్దదగుచుఁ గ్రమముగా క్షణములో నొక వృక్షముగా మారెను ఆహా! ఏమి ఆవృక్ష సౌందర్యము!— తోడనే అయ్యది ప్రణయవృక్షమని నాహృదయంబునకుఁ దోచినది. ఆవృక్షము నవపుష్ప ఫల పర్ణములతో విరాజిల్లుచుండెను. తత్కుసుమములే ప్రణయ కుసుమములు? తత్పత్రములే ప్రణయ పత్రములు; తత్ఫలములే ప్రణయ ఫలములు; అని నాకుఁ బ్రణయ దైవతము తోపించెను. అట్లనే నావృక్షముఁజూచుచు నిలువఁబడి యుంటిని. అంతలోఁ గొన్ని ముకుళములు వికసించెను. ప్రణయవాంఛ లట్లే వికసించుచుండును. వెంటనే కొన్ని పుష్పములును, పత్రములును నేల రాలిపోయెను. అట్లె ప్రణయమున కప్పుడప్పు డంతరాయములు కల్గి కోరిక లీడేరకుండును. ఆవృక్షమునఁగల సత్ఫలము లట్లెయుండెను. అట్లె ఫలించిన ప్రణయము శాశ్వతమని నేఁ దెలిసికొంటిని.

ఆ సమయమునఁ బ్రణయ వృక్షముక్రింద నేదోయొక చాయ పొడకట్టెను. హృదయాంతరాళమున నుప్పొంగు కోరికలతో నట్లే యాచాయల దిలకింపఁ జొచ్చితిని. అది చాయకాదు. చాయయెల్ల మారిపోయెను. ఒక దివ్య తేజోవిలాసిని!— ఒక యపూర్వప్రభాభాసురాంగి!— ఒక దివ్యప్రభావ!— సౌందర్యనాయిక!— సౌందర్యరాశి!— పంచప్రాణ, కాంతులలో వింత గాఁ బ్రకాశింపఁ దొడంగెను. ఆమె నెమ్మోము నించుక కప్పిరం

గారు ముంగురులలో నొక నల్లని వింతకాంతి మిరుమిట్లు గొల్పుచుండెను. ఆ విలోకనములయం దేదో యొక దివ్య ప్రభ చూపట్టుచున్నది. ఆ సన్నని పయ్యెదలోనుండి వింతగా సగము సగము కన్పించు చనుదోయి యొకచందమగు నందమ్ము నొలికింపుచు విరాజిలుచుండెను. ఆ తనూవిలాసము బంగారు చాయలఁ గ్రాలుచుండెను. ఆ విశ్వమోహన దేవిం గాంచిన నాయొడలు గగుర్పాటైను. ఆ లీలావిగ్రహము!— ఆ నిత్య యౌవనవిలాసిని! ఆ సుందరి!— ఆ శ్యామాలలామ!— ఆమోహిని ఆమెయే ప్రణయదేవుని దేవి! సౌందర్యరాశి!

రెప్పనయిన వాల్పక నేనట్లే యామెం జూడఁ దొడంగితిని. ఆమెకూడనట్లే కదలక నిలువఁబడి నావైపు చూచుచున్నట్లు నాకుఁ దోఁచెను. ఆహా! ఎప్పుడు వచ్చెనో, ఎట్లు వచ్చెనో తెలియదు. ఒక దివ్య సుందరాకారుడు! ఒక మహాపురుషుఁడు!— అతఁడే ప్రణయదైవతము!— ఆమెప్రక్క నిలువఁబడి యుండెను. వారిద్దరును— ప్రణయదైవతము. సౌందర్యరాశి;— ఒకరిప్రక్క నొకరు భుజములపై జేతులు వైచికొని నయనానందకరముగా నాకు సాక్షాత్కరించిరి; వారిరువురు నాప్రణయ వృక్షంబు క్రిందనే నిలువఁబడి యుండిరి. ఆ దేవ దేవులఁగాంచిన నే నాంద సాగరంబున నోలలాడితిని. మానవజన్మ సంప్రాప్తి కిదియే సాఫల్యమని నేను తన్మయత్వమున మైమరచితిని.

ఆ దేవదేవులఁ గీర్తింపుచు దగ్గరకేగి నమస్కరింపఁ దలంచి ముందుకు నడువసాగితిని. నాదృష్టులు వారిమీదనే యుండెను. కాని సమీపించుకొలఁదిని వారు ఛాయలవలెఁ దోఁచిరి. అంతకంతకుఁ బ్రణయ వృక్షము కూడఁ జాయగాఁ గానబడెను. దగ్గరకేగితిని. ఏమున్నది? వృక్షములేదు; ప్రణయదైవతము లేదు; సౌందర్యరాశి లేదు; అంతర్ధానమొందిరి. నాలుదెసలఁ జూచితిని. ఏమియు గనఁబడలేదు. ఆకసమువంకఁ జూచితిని. యేమియుఁ గనబడలేదు. చంద్రబింబ మేమయ్యెను? గాఢాంధకారమే కాని తొలుత దిగివచ్చిన శిఖరమును, సోపానములును గొంచెము కనఁబడెను. అంత గుహలోనుండి భూమిలోపలికేగు మెట్లు జ్ఞప్తికి వచ్చినవి.

ఎవరో నన్ను స్పృశించినట్లయ్యెను. ఉలికిపడితిని. తెలివి వచ్చినది. కనులు తెరచితిని. సోపానములదొరసు నలుదెసలఁ జూచితిని. ఆచీకటిలో గొంచెము వెల్తురున్నది యేమియుఁ గనఁబడలేదు. సెలయేటి చప్పుడు చెవిఁబడినది. పూర్తిగా తెలివి వచ్చినది. ప్రణయస్వప్న మాశ్చర్యము గలిగించినది. నేను మునుపటి శిలావేదికపైనే కూర్చుంటిని.

## అమని

కొమరవోలు నాగభూషణరావుగారు.

నారసుగంధి నీ ప్రసవ ♦ సౌరభభారములంది, భృంగ వి
స్ఫార వినీలనేత్రి యుగ ♦ సన్నుతయై, సుకుమార కౌముదీ
కైరవవాహినీ రసవి ♦ గాహితయౌ వనలక్ష్మిఁ జూచుచున్
మారుత మిత్రుఁ బ్రీతిఁ గలసి ♦ మన్మథ రాజదె! యేగుదెంచెడిన్. 1.

అరుణకిసాలరేఖిక లొ ♦ య్యారములొల్కెడి మోవిగాఁగ, శ్రీ
కరమగు పుష్పగుచ్ఛములు- ♦ గబ్బిచనుంగవగాఁగ, మాధ్వసుం
దరులనఁబోలి యుండెడు ల ♦ తానికరంబులఁ గాంచి, శాఖలన్
గరములఁ గౌఁగలించెడిని ♦ కామముచేఁ దరు రాజకాండముల్. 2.

ఆరామస్థితమత్తకోకిల, తిరో ♦ కారాఢ్యమై పర్వఁగా
ధీరోదార విపంచికాస్వర మిళ ♦ ద్దివ్య న్నినాదంబుతో
నీరేజాసనురాణి పూతచరితో ♦ న్నిద్రోరు గీతావళీ
శ్రీరమ్యంబుగఁబాడె దివ్యమధుర ♦ శ్రీరాగ కంఠధ్వనిన్. 3.

# పంచమసోదరుడు.

శ్రీ శేషాద్రి రమణకవులు, శతావధానులు.

సడలంబారిన మూలసూత్రములతో సర్వస్వమీ భారతం
బడుగుంబట్టిన కాలమందయినఁ బూర్వాచార సందర్భముల్
విడువంజూచవు దుస్తరార్ష మత వల్లీవేల్లితంబైన నీ
యడుగుల్ ధన్యములోయి! పంచమకుమారా? నిన్ బ్రశంసించెదన్

చ॥ చిలికినయంతరంగమున జీర్ణమునొందిన దేహయష్టితో
నవయుచునుండి యెన్నఁడును న్యాయముదప్పి చరింపఁబోవు క
ష్టపితకు లెన్ని వాటిలిన జంకవు నీయెడ నార్షధర్మముల్
మెఱుఁగులఁ జెలంగుచుండును సుమీ ధరఁ బంచమసోదరాగ్రణీ॥ 2.

మ॥ అవమానంబున కోర్చికొందువు దురంతామర్ష వర్ణాశ్రమ
వ్యవహారంబులకున్ విధేయమతివై వర్తింతువేనాఁడు ప్రా
భవముల్ గోరవు నీచరిత్రమును నీభావంబు నీక్షాంతి సం
స్తవయోగ్యంబగునయ్య పంచమసుతా! ధన్యుండ వీవన్నిటన్॥ 3.

సీ॥ కులముపేరైన వాకొన మాని మిముజెప్ప
రానివాండ్రనిన దురాగతంబు,
కడవాడలో మిమ్ముఁ గడచి మీగతి మీరె
పడుఁడని వదలిన పాపఫలము,
పశువులకంటెను పక్షులకంటె మి
మ్మతిహీనులుగఁ జూచినట్టి దోసఁగు
చెప్పఁగోరానంత చెడ్డవ్యుత్పత్తి మీ
తలపైని గట్టిన కలుషభరము.

తే॥ గీ॥ నాగరకయుగమందు నెన్నటికిమీకు
నిలువ నీడనొసంగని నిష్ఠురంబు
తలఁచి వర్ణాశ్రమ ద్వేషములకుఁ జొరవె
శాంతమున నీదెసుమ్ము పంచమకుమార॥ 4.

చ॥ వలువలు లేవు కట్టుటకు, వాడలు లేవు వసింప, నింటి లో
పల నొక చేరెఁడైన గనుపట్టవు గింజలు, కామరోషముల్
తలఁప వొకించుకేని; ఋషిధర్మము నీయెడ శాశ్వతంబుగా
నెలకొని నీదు జీవిత మనింద్యము పంచమ సోదరాగ్రణీ॥ 5.

సీ॥ గండుకన్నమసేని కదనసంరంభంబు
వీనులవిందుగా విన్నయపుడు

హర్మ్యనాస్థానంబునందుఁ బేర్గనిన ది
వాకరు కథవినంబడినయప్పుడు
వైష్ణవ ధర్మైక వర్తనుండైనట్టి
క్షక్షోపితుని లీలఁ జదువునపుడు
పాండురంగనితోడ భాషించి నెరిగన్న
చోకమేళుచరిత్రిఁ జూచునపుడు
తే॥ గీ॥ పంచములు పూర్వమున గన్న ప్రాభవం
నాథునికయుగమున నొందు హైన్యమెల్ల
కనులముందు నటించు నేకాలమునను
సమధికోన్నతి గనునొ పంచమకులంబు ॥ 6.

# అన్యాపదేశము.

నుసర్ల రామమూర్తిగారు.

చక్కనగు ముద్దుకీర రా ♦ జమ్మ నేఁడు
మురిపెమెసలారు కనకపం ♦ జరముపీడి
బింబఫలమున కెచటికో ♦ వెడలిపోయి
కలతవెట్టెను, మనసు చం ♦ చలతనొంద ॥
ఉ॥ జానగు నీవిలాసముల ♦ జాణతనంబున కాత్మమెచ్చి నీ
కేను మదీయ మానసము ♦ నిచ్చితి, నెన్నిదినాలకైన నా
మానసమీస్థితిన్ వలపు ♦ మానగ, ప్రీత్యుపకారమెంచి, నా
పై నెనరూననొప్పు, సతి ♦ వాంఛలుదీర్పగనొప్పు గీరమా ॥
గీ॥ దృష్టిపథమునువీడి యా ♦ దృశ్యమైన
నెచట నీకేమికష్టంబు ♦ లెనయుననుచు
జాలిబడి నాదు హృదయ పం ♦ జరము నన్ను
కదలిపోనీదు నీవైన ♦ గనుగుకొమ్ము ॥
గీ॥ పంజరంబందు బంధింప ♦ బడితివనుచు
కినుకబూనినచోఁ బ్రీతి ♦ కిరియగునె?
గుణులకోపమ్ము కలహా ♦ రణముగాదు
నన్ను నేచంగ నిది తప ♦ ణమ్ముగాదు ॥

# అనేక రకాలు.

ఒక మిత్రుడు

"ఎంతసేపాసిద్ర? నీకోసంగంట సేపటినుంచీ కని పెట్టుకుని కూర్చున్నా; కాస్త కళ్ళు తెరిచి చూడలేవూ? నీ వొక్కతెవే వెళ్ళావా ఏం రాత్రి నాటకానికి. లేకపోతే అమాయకపు పిల్లల్ల వాళ్ళు నిద్రింతా నిన్ను చుట్టుకుంటారా? కళ్ళకు నీళ్ళు రాచుకుంటే నిద్రమత్తు వదులుతుంది. ఎంతసేపుపోయినా కరువు తీరదులే, నిద్రకు. అది అంతం ఉంటేగా. తలంటిపోసుకొని, వెచ్చగా అన్నం తిని నిద్రపోతే జబ్బుచేస్తుందని తెలియదూ? ఎందరు లేపినా విదిలించుకొని, ఒత్తిగిలి పడుకోటమేనా? ఇవాళకిచాల్లే. మర్యాదగా లేస్తావా? లేదా?"

"అబ్బ! ఏమిటా చంపుకుతినడం. రాత్రంతా నిద్రలేకుండా కాస్సేపు కళ్ళుమూసుకొని పడుకుంటే ఒకటేమోతా. నీవుకూడా మేలుకుంటే తెలుస్తుంది, నిద్రపడుతుంటే, దగ్గరచేరి సణుగుతూంటే ఎట్లా ఉంటుందో."

"నీ నిద్రకు నియమమేంలేదులే. తెల్లవార్లు మేలుకున్నా, నిద్రపోయినా, పగలుకూడా వంతు తీర్చాలిసిందేగా? అవసరమైతే నిద్రపోనిస్తా. అది విస్తారమైతేపోగొట్టొద్దూ?"

"పోనీ, ఇకనిద్రపోనలే. నీవు రాకపోయినా నిద్రపోతేకూడా తప్పేనా ఏం. ఇందాక అన్నం తిని కొంచెంసేపు నీవు వస్తావేమోనని వసారాలో ఆ మంచంమీద పడుకున్నాను. ఎంతసేపు కనిపెట్టుకుకూర్చున్నా తమకు దయవస్తేగా. వచ్చిన తరువాత లేపుతావని కళ్ళుమూసాను ఇంతలోనే తమరు దయచేయడం. అత్తగారు లాగా ఒకచిన్న అవసరంలేని లెక్చరు కొట్టడం. ఎవరన్నా చిన్న పిల్లాడ్ని తీసుకువచ్చి చెవిదగ్గర సంగీతం మేళాలు పెట్టించకపోయినావూ, మా కోడలిది బండనిద్ర అని ఇరుగుపొరుగు వాళ్లందరితో చెప్పడానికి వీలుండేది. ఇంకా కాస్త పెద్ద గొంతుకతో అప్రతిష్ఠనడానికి బాగుండేది"

"చాల్లే సత్యం! పనిలేనప్పుడల్లా, నీదగ్గరకు వచ్చి చేతులుకట్టుకు కూర్చుని తలఊగిస్తూ, ఉపదేశాలన్నీ వింటాలే, పొద్దుగూకినా ఇంకా తొందరలేదేం. అనసూయ ఆడబిడ్డ కొడుకు పుట్టిన రోజట. నిన్ను ఎంతసేపో లేపి, లాభం లేదనుకుని తప్పకుండా వెంటబెట్టుకు రమ్మని నాతో మరిమరి చెప్పి వెళ్ళింది. త్వరగా రా, వెంకటలక్ష్మి వచ్చిందట అత్తారింటి దగ్గరనుంచి, చూద్దాము. నల్లగా పిక్కట్లాపడ్డాయో?"

"ఏమిటి చూసేది మనవూళ్లో అదితాగోసిల్లు, నల్లగా నళ్ళకన్న మంచివైతేగా. ఎంతసేపు చూసినా, తన చక్కదనం, తన నగలు, తన చీరెలు, తన మొగుడి ప్రయోజకత్వం, ఎప్పుడూ అంతేకా? పారలలాంటి పళ్లేసుకొని నగలకు నానోకడుతుంది. వెళ్ళు కావలెనంటే చూడ్డానికి. నోటి తుంపురులతో అభిషేకం చేస్తోంది. పది గజాలదూరములోవున్న వాళ్లకుకూడా జల్లు కొట్టాలిసిందే"

"ఆఁ! నీవంటూంటే జ్ఞాపకం వచ్చింది. సీతారాం రవ్వదుద్దులు తెప్పించుకుంది. నిన్ననే వచ్చాయట, బజారులో వర్తకులకు చూపి ధర కట్టించి ఇవాళనే వాళ్ళాయన యింటికి తెచ్చాడు. ఆవిడకూడా పేరంటానికి వస్తుంది బహుశ."

"బహుశ యేం. వచ్చితీరాలి. దుద్దులు లేనప్పుడు అంత తిప్పుకొనేది అవి వచ్చిన తరువాత చాలిస్తుందా, అంతరిమధ్యా కూర్చుని కనబడేటట్టు తిప్పుకోకపోతే తోస్తుందా. ఇది

వరకు ఏక్కడకువచ్చినా, గాజులు గలగల లాండేట్టు, పళ్ళెంపుచ్చుకుని కులుకుతూ వడ్డనకుతయారయ్యేది. ఇప్పుడు దుద్దులు అందరూ చూచేట్టు తలతిప్పుతూ మాటలు చెపుతుంది."

'సౌభాగ్యమంటే ఆవిడది'

"నిజంగానే. ఇక వారంరోజులుదాకా వాళ్ల బండికి కావలసినంత పనుంటుంది. వాళ్ళాయన కచేరీకి నడిచివెళ్ళాలిసిందే"

"పోనిలే. ఎందుకు ఊళ్ళోవాళ్ల సంగతంతా, వాళ్ళు మనకు నచ్చరు. అదోరకం. వాళ్లతో చేరేవాళ్లే వాళ్లతో మాట్లాడుతారు. అందరూ కూర్చునేది కట్టకట్టుకుని ఊళ్లో వాళ్ళనందరిని వెక్కిరించడం మొదలుపెట్టేది. మన మెవరమన్నా దగ్గరకు వెళ్లితే, పూర్వసువాసినలందరూ, పుణ్యం పురుషార్థం అంటూ ఎత్తుకుంటారు. తక్కిన వాళ్ళు దారంసుడ్డకు ముడి వేస్తారు"

"ఇకనన్నా వదిలిపెడుదూ. నిజంగానే, వాళ్లన్నట్టు పుణ్యమూ, పురుషార్థమూ; ఏదో, వాళ్ళ యిష్టం వాళ్ళది. ఇక మన సంగతి ఆలోచించు. అదేమిటె పల్లెటూరు పడుచులాగా, మొగలి పూవుల జడతో తయారైనావు. విప్పేయి, జాజిమొగ్గలు, దవనంకలిపి వంకరజడ వేయించుకుందాము. మల్లెపూవులు చెండ్లకుమాత్రం చాల్తాయి. మధ్యగులాబీపూవుపెట్టి, పైన పెట్టుకోవచ్చులే."

"అయితే నన్ను మాట్లాడనీయవా ఏం, నాకు ఈజడ బాగానేవుంది. మళ్ళా అదంతా ఊడదీస్తే చాలా ఆలస్యం అవుతుంది. అందంగా లేకపోతే వచ్చేవారు రానంటారా ఏం?"

"అయితే నీవు చేసే ప్రతిజ్ఞ ఒకరికోసమేనా. ఏం. వంటిమీద నీళ్లుపోసుకోవడం మురికిపోవడానికా, మీఆయన్ని మెప్పించడానికా? ఆడవాళ్ల చక్కదనం ఆడవాళ్లకు అర్థంగాదనే వెర్రివేదాంతం నీకుకూడా పట్టించాడా ఏం. జడ చక్కగా అల్లుకుంటే, బాగుందనడమే కాని, ఎందుకు బాగుందో, అంతకంటె బాగాచేయడం ఎలాగో చెప్పమను. అన్నీ అమర్చితే అత్తగా రొచ్చి...అన్నట్లుంది. వెనకవచ్చిన కొమ్ములు ఎట్లాగైన వాడికాదు?"

"కోపము చాలించు. నీయిష్టం వచ్చినట్లుగా అలంకరించు చూచి ఆనందించు. కోరుక్కు తింటానన్నావా ఏం, నాకేం కష్టం నీవు, అంత మనసుపడితే."

"అయితే సుశీలా; చేతులతో నలిపి, రెక్కలన్నీ నలిపితేనేగాని, గులాబీపువ్వు చక్కదనం అనుభవించనట్లు కాదా ఏం."

"నలిపివేసినా ఏమవదు, నాజూకుగా చూచిన ఏంచేయదు. గులాబీపువ్వు దానికి మాత్రం తెలియదూ? ఇంకోళ్లు అనుభవించడానికి ఏర్పడ్డదాన్నని. అవతలవాళ్ళు ఉద్దేశం ఆలాటిదైతే......"

"ఎవరైనా అనుభవించాలిసిందన్నమాటే? లేకపోతే నిష్ప్రయోజనమేనా ఏం. సృష్టి సూత్రాన్ని నిమిషంలో విప్పి చెప్పేశావే. ఎందుకులే నీతో వాదించడం. త్వరగా, బట్టలు కట్టుకుని బయలుదేరదాం. అమ్మచేత తల దువ్వించుకుని అక్కడనుంచి మీ యింటికి వెళ్దాము."

## 2

"రండమ్మ. కూర్చోండి. ముత్తైదువలంతా రాలేదులే. అదుగో క్రిందకూర్చోవద్దు నన్ను చంపుకుతిన్నట్లే. రాముడూ! నీవు అవతలకు

కాస్త బరువుగా. ఇం. చాల్లే. అట్లా కూర్చోండమ్మ నేను అమ్మన్నను పిలుచుకువస్తాను."

"చూశావా సుశీలా! కునసంచ స్తే ఎదురుగా వచ్చి కూర్చున్నపిల్లని అవతలకి జరిపి, తివాశీ మీదకి కూర్చుంటేగాని వల్లకాదని బలవంతం చేసిందే. ఆకోటమ్మ ఎంతసేపటినించి నుంచున్నదో, అదైనా చూసిందా ఏం. చూసినా చూడనట్టుఊరుకుందే."

"ఇదిగో, నేనొకటి చెప్తానువిను, సత్యం; నీవు ఎప్పుడుచూసినా తప్పు పడుతూంటే బాగుండదు. గొంగళిలో, కట్టుక్కిలు ఏరడంలాగా ఏమిటి ఈపని. ఏమిమామగారిలాగ రామకోటి మొదలుపెట్టు తెలిసొస్తుంది. పది పన్నెండేళ్లదాకా మళ్ళా మనధోరణిలోకి రావని; అందరూ మనలాగే అనుకుంటారా ఏం చెప్పు"

"మనంమాత్రం ఏం కానిపని చేయమన్నాం? పాత మనుకోటమ్మంటే, మంచో, చెడో, ఆనాగ తేమీ చూడకుండా, నేను చెప్పానుకనుక చేసి తీరాలి, నీవుచెపితే చేయను, అనే వెట్టికబుర్లెందుకన్నా చెప్పనా?"

"నీకబుర్లెందుకు? అందరూ సవారీఎక్కితే మోసేవాళ్లెవరనే సామెత వున్నది తెలుసునా? నేను సవారీ ఎక్కేరకం అని నమ్మకమున్నప్పుడు మోసేవాళ్ళని గుర్తించలేనేం."

"తెలిసిందిలే? అవును, సమానులని తలుస్తే గౌరవిస్తారు. అన్నినగలన్నా వుండాలి, అంత లావన్నా వుండాలి, లేకపోతే ఆలా తిప్పుకోట నైనా చేతకావాలి. ఏం తెలియకపోతే ఎందుకు చూస్తారేం!"

"ఏం వెంకటలక్ష్మమ్మ అలావున్నావేం. చాలాచిక్కావు. మన ఊరునీళ్ళకంటె ఆనీళ్ళు కాక ఎక్కువకూడాను. అసలు నీది తగని వారు ణావుఒళ్ళు."

"ఏమీలేదు. చాలారోజులకిచూస్తే అలా కనబడ్డానేమో. మునుపటికన్న ఇప్పుడే బాగుంటూంది."

"అయితే! మీరు నెల్లూరులో లేరావేం?"

"లేదమ్మా! బియల్ చదువుతూన్నారు. మొన్నదాకా ఒంటరిగానే వున్నారు, ఎక్కడా అనువైన యిల్లుదొరక్క. మొన్న డిశెంబరు శలవల్లో తీసుకువెళ్లారు. కృష్ణమనాయని అగ్రహారంలోవున్నాం."

"మహామంచిజాగా చూశారే."

"అదికాదులే? స్కూలుకు దగ్గర. సముద్రానికిదగ్గర. బజారుకు సమీపంలో, సినీమాకు వెళ్లాలంటే దూరంగాని, మిగతా అన్నిచోట్లకు చాలా చేరువగా వుంటుందనీ..............

...ఏంపట్నమన్నమ్మా. మనఊళ్లోనూ వున్నాయి. ఆషాపులు. ఆచీరెల దుకాణాలు, చూస్తే కళ్ళు తిరుగుతాయి. ఆమనుష్యులే వేరు. అసలు ఆపద్ధతే వేరు."

"మనవాళ్లకన్న ఆవేపువాళ్లలో గుణమేం కనిపించింది నీకు?"

"ఒకటా అన్నీ గుణాలేనమ్మా. వెయ్యేళ్ళు తన్నుకున్నా అల్లాకాలేరు మనవాళ్ళు. వాళ్ళు చీరెలలాటివన్నా ఎప్పుడైనా చూచి ఉంటారా?"

"అంత నాజూకుగా ఉంటారేం? అందం కూడా తెలుసు కాబోలు"

"అందం అంటే వాళ్లకే తెలియాలి? నిజంగా వాళ్లని చూస్తూంటే నాకు మనఊరు మనవాళ్ళు అంటే రోతపుడుతూందమ్మా. ఇక్కడికి వద్దా

మంటే మనసు ఒప్పిందికాదు. ఏం తెలివి, ఏం మర్యాద."

"అందరూ, తలోవేపుకూ లాగుతున్నారేం ఇంతసేపటినుంచీ వింటున్నాం. నాకాపాట ఏమిటో తెలియనే లేదు"

"పాటవచ్చి ఉండకపోతే నాకూ తెలిసేది కాదులే! వచ్చిన చిక్కేమిటంటే అనేక పాఠాలుంటాయి. విశాఖపట్నంవైపున పాడేవి. గుంటూరువైపున పాడేదీ. ఇంకా యీలాగే ఏఊరువాళ్ళు వాళ్ల యిష్టంవచ్చినట్లు పాడుతారు."

"అందులో ఏదీతప్పంటే ఒప్పుకోరు. ఇంకో మాదిరిగా పాడరు. ఇన్నీ కలేసిపాడితే చివరికిలాతయారవుతుంది."

"ఎంతకాలమూ సీత అలకా, లక్ష్మణదేవర నవ్వు ఊర్మిళ నిద్రా చదవకపోతే, అందరికీ నచ్చేట్టు మామూలు పాటలేవన్నా పాడరాదా ఏం?"

"మామూలు పాటలంటే?"

"సీతా, రాముడు, ఈలాటిపేర్లేంలేకుండా"

"నీవూ తెలివిగలదానవే కాని, ఇంత తెలివితక్కువగా ఆలోచిస్తావేం! సీత అలకా, లక్ష్మణుడినవ్వు, కాకపోతే నీఅలక, మీఆయన కోపం ఎవరికి కావాలి? పెళ్ళవుతూంటే గౌరికళ్యాణా అనక్కర్లేదూ? మొన్న సమయంలో వాటింటో జరిగిందే, ఆపెళ్లిమీద పాటపాడి. ఆలాగే యీపెళ్లీ అవ్వాలని తెలియబరచాలన్న మాట. అలగటం తెలుసు, నవ్వడం తెలుసు, వాళ్ళెవరో సుహాను భావులు. మనందరం పూజిస్తాం, వాళ్ళనిబట్టి అనక్కరక, అంతగౌరవం, అలిగినా, నవ్వినా, అంత వాళ్ళయ్యేట్టయితే?"

"ఇంతసేపూ కూర్చోబెట్టి, చివరికీ ఎండిపోయిన పుచ్చు శెనగలా చేతులో బెట్టేది? అవన్నా ఒకొక్కగింజ రాలుస్తున్నారు. ఇందాకనుంచి ఆవియ్యపురాలు పాట విన్నందుకే యియ్యవచ్చే?"

"బుద్ధి ఉండో, లేకో వచ్చావు. వచ్చినందుకు, వాళ్లు వేడుక జేసుకుటూంటే చూడద్దా ఏం. అవిడంత ఉత్సాహంతో పాడుతుంటే, అంతమాత్రం తలనొప్పి ఆణుచుకోలేనిదానవు ఎందుకు వనిరాస్తావు? సరే, వచ్చావు, కష్టపడి ఇంతదాకా కూర్చున్నావు. వాళ్లకి తోచిందేదో యిచ్చారు. పేరంటం పిలిచేటప్పుడే ఎందుకు చెప్ప లేకపోయినావూ? సెనగలిచ్చేటట్టయితే రానని?"

"పిల్లలకి యియ్యరా ఏం?"

"వాళ్ళేమనా తెలియనివాళ్ళా? కనిపెంచుతూన్నవాళ్ళుకాదూ? వెధవసెనగలు తింటే కడుపునొప్పి చేయువూ? వాళ్ళకిస్తే తినకుండా ఊరుకుంటారా? కావలిస్తే ఏమపుమాన్పడానికి పెద్దవాళ్ళే వాళ్లదగ్గరున్నవాటిల్లో కాసిని పెడతారు."

"పోనీ తాంబూలమేం జబ్బు?"

"ఏం జబ్బా! ఇంకా నిమ్మళంగా అడుగుతావే? పసుపెరిగితే ఎంతచిక్కు. అదిగాకుండా పసిమంక, సరిగ్గా ఆకులుచీల్చి వేసుకోవడం చాతవుతుందా; ఎవరనా తుడిచి సున్నంగాచి యిస్తామంటే ఒప్పుగోరు. వృథాగా నలిపిపారేసేకాడికి ఎందుకు ఇయ్యడం. పెద్దవాళ్లు కావలెనంటే, కాస్త నలిపియిస్తారు."

"ఆవారడి పెద్దవాళ్ళకి మరికాసిని ఆకులు వక్కలు యీయవచ్చుగా!"

"ఎందుకూ, అనవసరంగా ఎక్కువియ్యడం."

"చిన్నపిల్లల కెంతకావాలి. అన్నం వండేటప్పుడు ఎంచుతున్నారు గనుకనా, తామల

పాకులు, లెక్కవేసి యియ్యడానికి: వాళ్ళకో భాగమేమిటి. వాళ్ళకని విడిగా ఎందుకూ?"

"అత్తగారికి, ఆడబిడ్డకి, తాంబూలాలు వాయినాలు ఇంకా యియ్యలేదేం. ఏవేళనుంచి కూర్చున్నారు."

"అన్నీ అమాయకపు ప్రశ్నలు వేస్తావేం సత్యం! మనమంటే సరాయివాళ్ళం. ఆలస్యమైతే స్పష్టంగా చెప్పి, బయటకు బయల్దేరుతాం. వియ్యాలవారు అలా అంటారా. ఎంతసేపైన కూర్చోవలసిందే. ఆడకుమాత్రం అంత తెలియదా ఏం, తనకెన్ని నగలున్నాయో తానేలాటి చీర కట్టుకుందో, అందరలాగా తనుకూడా తొందరపడి తేవాలా. చూడడం లేదా ఏం, ఊపిరాడకుండా, గొప్పింటిపిల్ల పని చేస్తోంది. తనకుకూడా ఆత్రమైతే? ఆగాలిసిందే కాసేపు."

"వియ్యపురాలనా, నగలు పెట్టుకొచ్చిందనా గౌరవించడం?"

"నగలున్న వియ్యపురాలు, నగలు లేకుండా పేదముత్తైదువలాగా వచ్చే ఆవిడతో ఎందుకు మాట్లాడావేం?"

"అయితే, ఏసంగతొచ్చినా యిక ఇకనగలేనా. మాట్లాడకుండా! చక్కదనం అక్కర్లా. సంగీతం అక్కర్లా? నగలన్నా వుండాలి. నాణెమన్నా తెలియాలి. లేకపోతే ఆలా నగలుపెట్టే వాళ్ళని అనుసరించి తిరుగుతూండాలి."

"వియ్యపురాలని ఆవిడకు చేసే గౌరవమేదీ మరి. సరిగా ఒకసారి మాట్లాడనన్నా లేదే."

"ఇంకా ఏంగౌరవం చేయాలి? నుంచోబెట్టారా ఏం. అందరూ తొందరపడుతూన్నారు. పంపించి తర్వాత తీరుబడి చేసుకొని మాట్లాడొచ్చు. ఇంతలో కూర్చోక ఏమవుతారు?"

3

"రండి. చిన్నిగారూ, యీవైపుకే రావటం మానేసారే!"

"ఏంలేదమ్మ, బాబు కచ్చేరికి త్వరగా వెళుతూన్నారు. ఇంట్లో పనితో సరిపోతూంది."

"కమలం వచ్చిందట కాదూ"

"ఏం రావటమోనమ్మ నాకేం అర్థంకాలేదు. ఆయనా ఆకి పోట్లాడుకున్నారట మొదలకుండా వచ్చి కూర్చుంది. ఏమే అంటే నీకెందుకంటుంది. ఏమి కానుందో తెలియదు. ఆలండిని చూస్తే కర్కోటకుడు. నేను గనుక వేగుతున్నా."

"ఘోరకలి వేసులేండి. అందుపడి అంటిస్తుంటారా, అందులో యీ కాలంవాళ్ళు?"

"మీరందరూ లేరావేం. కమలదంతా కొత్త మోస్తరుగా ఉంది."

"అయితే మీరేం చేయదలచుకున్నారు?"

"చెయ్యడానికేముంది. చోద్యం చూస్తున్నా నేనుకూడా. అమధ్య అల్లుడుకూడా, కాస్త పెంకెతనం చేశాడులే. ఉత్తసి దక్కిస్తూ, పెళ్ళాం కావాలంటూ వస్తాడు. నాకెందుకు మధ్య.?"

"పెద్దవారని మిమ్మల్ని అడుగలేదూ? వచ్చినప్పుడన్నా?"

"అడక్కేం అడిగాడు. నేనూ తగినట్టుగానే చెప్పాలే. తనూ, ఆవిడ ఏం అనుకున్నారో, ఏం చేసుకున్నారో మాకేం తెలుసు, మేం పంపమని తీసుకొచ్చినట్లయితే, తిరిగి పంపించే బాధ్యత మామీద వుంటుంది మధ్య మాకేం సమంధం?"

"పోనీ మీరన్నా, కూకలేసి పంపించరాదూ? పెద్దవాళ్లు మిమ్మల్నే అందరూ అంటారు."

"పిల్లలున్న తల్లి ఎవ్వరూ అంను. పిల్లపుట్టింటికి రవడం తప్పా? పెళ్ళికొద్ది అత్తారింటికి

వెళ్ళకుండా ఉన్నవాళ్ళో? అయినాగాని ఏం, అన్నం పెట్టలేమని పంపేయమా?"

"మీరు అన్నం పెట్టగలరు. అందుచేత అమ్మాయిని పంపించరు. మీవాళ్ళు మిమ్మల్ని ఇక్కడికి ఎందుకు పంపారు?"

"మానాడీ చిత్రాలన్నీ వున్నాయా ఏం. మాఆయన మామగారంటే ఎంత భయపడుతూండేవారు. ఇప్పటికైనా, పేరుచెప్పి నమస్కారంచేస్తారు."

"మీరూ ఎప్పుడన్నా, పోట్లాడి బాబును తిప్పలుపెడుతూండేవారా?"

"ఏదో, మాటా మాటా అనుకున్నా, వెంటనే సర్దుకునేవాళ్ళం. మా మామ్మ చివాట్లు పెట్టేది?"

"పెద్దవాళ్ళు చెపితే వినేవాళ్ళా?"

"వినకపోతే బ్రతుకనిస్తారా. కులానికి తలవంపులు తెస్తావని, బయటకు గెంటుతానని ముసలమ్మ విరుచుకు మీదపడేది."

"కులానికి తలవంపు తేవడమేం?"

"ఎవరన్నా అనుకుంటారా లేదా, అత్తారింట్లో ఉండాలిసినపిల్ల ఎందుకిక్కడుందని?"

"మరి కమలంసంగతో. అందరూ ఏమనుకోరాఏం?"

"నేను మొదటే చెప్పాగా, ఆజోలికెళ్ళను ఏంచేసుకుంటారో చేసుకోమను. అయినాగాని, అబ్బాయికి తెలిసొస్తుందిలే. అత్తారిమీద ధిమాకులుచేయడం అంటే ఏమిటో?"

"మీఅమ్మాయికి తెలుసా, వాళ్ళాయనకి ఎంతపొగరుదిగిందో."

"అమ్మాయికేగాదు చూచేవాళ్ళకి తెలుస్తొంది. ఆతను మమ్మల్ని పెట్టినబాధ దానికి మాత్రం తెలియదావం."

"బలేఉపాయం కనిపెట్టారండీ. అల్లుడి పొగరు అమ్మాయిచేతే దిగిస్తున్నారు. చాలా తెలివిగలపని చేశారు."

"అట్లాగే కావాలి. వాళ్ళవేలితోటే, వాళ్ళ కన్ను పొడవాలి."

"అయితే చేతికివున్న వేలుతో పొడుస్తా. "ఆవేలు విడదీసి దీసికొచ్చి, ఆపనికోసం ప్రత్యేకంగా తయారుచేసిపొడుస్తా? అట్లాఅదు సొంతవేలుతో పొడిచినట్లుకాదుగదా?"

"దీనికంతా ఓపి[illegible] చెపుతానినా. పెంకెవాడైతే ఏంచేయలేలే. [illegible]తాడుగాని, దానికి సలాంచేస్తాడు."

"ఏమనుకున్నా, రావడం మానేస్తేనో, ఏమన్నానా?"

"ఎంతకాలం ఈనాటకం?"

"సాగినన్నాళ్ళు, వారు వీరు కాకపోతారా; వీరు వారు కాకపోతారా? చివరికి[illegible] మొగుడులో ఏకమే."

"కాకపోతే రక్తి కడుతుంకాఏం"

"కావద్దని ఎవరన్నారు. ఇన్నాళ్లనుంచి, ఎట్లా ఉందో."

"ఇప్పుడిప్పుడే తెలిసొస్తోంది బాసిక్కుండా, నేనేమన్నా దానితో అన్నానా? ఏదో కష్ట సుఖాలు కలుపుకుంటో చెప్పుకుంటుంటే వినడా ఏం. అదికాకుండా ఎవరెరగని సంగతులా."

"సరే, ఆపిల్లెవరో, తెలిసితక్కువదగ్గమ్మాన్ని, కోడల్ని దిద్దుకోలేంది. ముసలకుండా ఊరుకుంది. మీరైతే ఏం చేసేవాళ్ళు? మా వియ్యపురాలు మంచి పనే చేస్తోంది అంటూ సంతోషించేవాళ్ళా?"

"నేనైతేనా, నాదగ్గర యీ తమాషాలు సాగవు. ఒక జెల్లాయిచ్చి నెట్టుకొస్తాను. మా

వంశం ఉద్ధరించాలి. తనేదో వెలగబెడుతుందని తీసుకొస్తే, తను బుంగమూతిచేసుకు కూర్చోడానికా — మా అక్కయ్య చూడు ఏం చేసిందో ?"

"ఏంజేసినా చేయగల సామర్థ్యం లేదా ఏం మీకు పిన్నిగారూ? కమలం వచ్చిందంటే మాకూ సంతోషమేలెండి. చాలా రోజులైంది చూచి. నాలుగు రోజులు కలిసి ఉంటాము. మీరుమాత్రం, ఈమాదిరిగా చేస్తారంటే, బాగుండదేమో. అడుసు తొక్కాకు సరే. వెంటనే కాళ్ళుకడుగుతే తేలిక, ఎండిపోతే బలవంతాన వదిలించాలిసొస్తుంది. మీకు మాత్రం తెలియదా ఎన్ని చూడటంలేదు. ఇదొక లీల."

---

## నామరహితుఁడు

లక్కరాజు సాంబసదాశివరావుగారు

నిర్వికారుఁడ వరయంగ ♦ నిర్గుణుఁడవు
నామరూపాది రహితుఁడ ♦ వో మహాత్మ!
అప్రమేయుఁడవు నిరంజ ♦ నాది సంజ్ఞ
లన్ దనర్చెదవంచు వ ♦ ర్ణనలఁ గూర్చి
స్తోత్రముల నిన్ను నుతియింపఁ ♦ జూతురేని
సురుచిరకిసాల శూన్యయా ♦ శుష్కభూరి
భూరుహవ్రజ దర్శన ♦ మునఁ గలంగి
మ్రోడుపడియుండు కలకంఠి ♦ పోల్కి నాదు
హృదయతంతులు చలనము ♦ వీగియుండు.

మాతృ సందర్శనోత్సవ ♦ మహితకాంక్ష
నన్యమును వీడి దీక్షమై ♦ నార్తిఁ జెందు
శిశువు పోలిక నిలపింపఁ ♦ జేరవచ్చి
దీనులగు మాదు లోపముల్ ♦ దీర్చు దనుక
భక్తమానస రంజనో ♦ పాయనియతి
నెగడు నిన్ను నిరంజన ♦ నిర్వికార
సంజ్ఞలన్ నుతియించుట ♦ సాహసమ్ము!
నిండుజాబిల్లి చలువల ♦ నిగ్గుమీరు
మందహాసమ్ము కరుణయు ♦ సందడింప
సతత వికసితాంభోజలో ♦ చనయుగమ్ము,
అఖిలసృష్టి క్రమాను సం ♦ ధానుభార
క్షేమకృద్విధాన రుచిర ♦ శ్రీవసమ్ము
చారుతరమంజుల లలాట ♦ సరణి నెగడ
"సకల రాజాధిరాజ నా ♦ యకుఁడ వనఁగ
ప్రకట మొనరించు రవి ప్రభా ♦ భాసమాన
హారకుండల మకుట కే ♦ యూరముఖ్య
శోభితాంగుని నిను రూప ♦ శూన్యుఁ డండ్రె!

ధర్మహానియు జగతి న ♦ ధర్మవృద్ధి
కలిగినేనియు శిష్ట ర ♦ క్షణము దుష్ట
శిక్షణము సేయ నవతరిం ♦ చెదు మహాత్మ,
అప్రమేయుఁడ వను బస ♦ త్యమ్ముగాదె!

సర్వభూత సమత్వము ♦ సాధుజీవ
భార నిర్వాహరక్షణో ♦ పాయదీక్ష
ఆర్త జన పరిత్రాణ వి ♦ ఖ్యాత వృత్తి
సత్య మార్గానురక్తియు ♦ సత్యవిముఖ
తాద్యనంత శుభోక్త గు ♦ ణాధికుఁడవు
నిన్ను నిర్గుణుఁ డంచు వ ♦ ర్ణింతు రేల?

దీనబాంధవ నామమ్ము ♦ దేవ! నీకు
నార్యదత్త విఖ్యాతమై ♦ యలరుచుండ
నామరహితుఁడ వనుట వి ♦ న్నావె తండ్రి!

# కమల*

కీ. శే. యజ్ఞస్వామి దీక్షితులుగారి భార్య సుబ్బమ్మ ఇప్పుడొక కోడలకు అత్తయింది. ఈ మహాపదవియొక్క అధికారాన్ని ఎన్నో విధాల చలాయించాలని ఆమెకు చాలా అభిలాష. తనకు సాధ్యమయినట్టయితే, ఆమె తన కుమారుణ్ణి, ఏమాత్రము కట్నములేని ఒక పేదమ్మాయికి భర్తను కానిచ్చేదేకాదు. ఆమె బహు జాగ్రత్తతో పదివేలరూపాయలు బ్యాంకులో డిపాజిట్టుగాగల అమ్మాయినే నిశ్చయించింది. కాని ఆబ్యాంకు దివాలాయెత్తడంతో పైసాఅయినా చేజిక్కలేదు. ఈ దురదృష్టమంతా కోడలిముఖానే వ్రాసుందనిన్నీ మరెన్ని వంకలుపెట్టో ఎప్పుడు తిట్టిపోస్తుండేది. ఆమహామహురాలి కోడలిపదవి నధిష్ఠించె భాగ్యంగల పిల్లదురదృష్టవంతురాలు కావడానికి అవకాశమే ఉండరాదు! ఎందువలనంటె, ఆమెది అతిపవిత్రజీవితము. కోడండ్రందరికి మార్గదర్శకమై, భార్యలందరికి ఆదర్శప్రాయమైందికనుక దీక్షితులుగారు ఈ ప్రపంచసుఖాల్ని ఎక్కువగ ఆశించని కాలంలో ఆయన్ని పెండ్లాడినప్పటికి సుబ్బమ్మ మహాదృష్టంవల్ల ఆమెవారింట్లోఅడుగు పెట్టిందిమొదలు పట్టిందల్లా బంగారమై-ఐశ్వర్యాభివృద్ధిచెందింది. ఇప్పుడామెకు యిరవై వేల రూపాయల నిల్వరొఖ్ఖముంది. ఈధనమంతా దీక్షితులుగారి అధికపరిశ్రమాఫలమేనని ఎవ్వరైన నోరుజారిఅంటె, వాడిని తగినన్ని శాపనార్థాలతో బహూకరిస్తుండేది.

“ఇంత దౌర్భాగ్యురాలిని కోడలిగాపొందే దురదృష్టం ఇంకెవరికైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా కలిగిందా? నేచేసుకొన్న పూర్వజన్మ పాపమే ఇట్లా ఫలించిందికాబోలు. ఇదిఎంత దౌర్భాగ్యపుది. ఒకటి కాదు, రెండుకాదు, పది వేలరూపాయలే!” అంటూ సుబ్బమ్మ విసుగుకోని ఘడియ లేనేలేదంటులో, అతిశయోక్తియేమాత్రంలేదు.

అనంతము, దుర్భరము, అగు సుబ్బమ్మ మహాకోపానికి గురయైన, ఆకమలకు పదిహేనేళ్ళైన ఉండీవుండడమే. తల్లి చిన్నతనంలోనే మరణించడంచేత, కమలను, తండ్రి బహుగారాబంతో, చాలప్రేమతో పెంచాడు. కాని, ఈఅత్తగారి అధికారంలోకి వచ్చింది మొదలు కఠోరశాపనార్థాలే కాని చల్లని దీవెనలు లేనేలేవు. కాని కమలకొక విషయంమాత్రం, అత్యధిక ఆమోదాన్ని, అమితసంతోషాన్ని కలుగజేస్తుండేది. అది తన హృదయేశ్వరుడు, సూర్యారావుయొక్క ప్రేమే. ఆయనైనా, తన హృదయమంతా నిండిన ప్రేమను, ప్రేమవీక్షణాలచేత ప్రేమవాక్కులచేత బహిరంగపరచడము చాలా భయంకరమైన పని.

ఎన్నో సందర్భాల్లో తల్లి కాఠిన్యాన్ని, నిరంకుశత్వాన్ని సహించి, మిన్నకున్నప్పటికి ఈబ్యాంకు దివాలావిషయంలో మాత్రం సూర్యారావుకు కోపం మితిమీరిపోయి బయటికి రాక తప్పిందికాదు. ఒకరోజున సుబ్బమ్మ తన సహజ వాగ్ప్రహారంతో, తిట్లను జడివానగా కురిపించింది. సూరి ధైర్యంచేసి, చాలనెమ్మదిగా “అమ్మా! బ్యాంకు దివాలాయెత్తితే దానిదేం తప్పే, ఇప్పుడెంత విసుక్కున్నా, పోయిన డబ్బేమైన వచ్చేదుందా? భగవంతుడు మనకేమి

* హిందూ బహుమతికథకు అనువాదము.

లోటుచేయులేదు. ధనమో, ధనమో, అని దేవులాడుకోవడ మెందుకే!" అన్నాడు. భార్య తరఫున వకాల్తా పుచ్చుకున్నాడని, సుబ్బమ్మ కెక్కడలేనికోపం వచ్చింది. కొడుకుమీద మండిపడ్డది. "నీకుకూడా పుట్టింది? ఇట్లారోజు లొస్తాయని నేననుకొంటూనే వున్నాను. ఇంతవు ఒకరినవాలసిన పనేముందిలే, నే తెలివితక్కువ దాన్నయినప్పుడు? ఇదియింట్లో అడుగుపెట్టగానే ఏభావిలోనో గుంటలోనో గుటుక్కున దూకాలి సింది" అని ఆపుకోలేని దుఃఖంతో కంట్లవెంట బొటబొట కార్చింది. పాపము సూరిది జాలి గుండె. "అమ్మా! అట్లా అనుకోవద్దు అందులో ఒకరిని సమర్థించాలనే ఉద్దేశంలేదే" అన్నాడు.

"నాకు తెలుసును లేరా, ఈకథంతా ఎవరు నడిపిస్తోందిని, ఆకుంక నామీద చాడీచెప్పి, ఇట్లాతోల్తుంది. ఈరోజుల్లో యేముంది, భార్య మాటంటె బంగారమ్మాటె. దాన్నింతటితో పోనిస్తాను" అంటూ కోపరూపందాల్చి, అక్కడ నుంచి సాగింది సుబ్బమ్మ. ఆభీకరరూపంతో తన కోపాన్ని కార్యరూపాన్ని పెట్టెటట్టుగా, వంటింటివైపుకి నాలుగడుగు లేసింది. కమల అప్పుడు వంటపనిమీదుంది కాని, అదృష్టవ శాత్తు, వీధివాకిటిదగ్గర ఎవరివో కాళ్ళ చప్పుడు వినబడ్డది. వెంటనే సుబ్బమ్మ ఆగింది. సూరి తలుపు తెరచాడు.

ఆశాస్త్రిమనిషి ఇంట్లో ప్రవేశించి "అంతా క్షేమమా? కులాసాగా మీయింటికొచ్చి వెడ దామంటె తీరికుంటేనా? ఇవ్వాళ్ళ వచ్చినందు కొక శుభవార్తకూడ తెచ్చానులే." అంటూ ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఈయన పేరు కుప్పుస్వామిశాస్త్రి పేరు మోగిన మిరాశిదారు, షుమారేభైయేళ్ల వయసు. పొట్టిగా లావుగా వున్నాడు. విశాల మయిన ముఖము. ఒకఅంగవస్త్రము వల్లెవాటు వేసుకొని, సేలం పట్టంచు ధోవతి కట్టాడు. నొసట్టమీద అందంగానే వున్నాడు. కాని సుబ్బమ్మకు మాత్రం ఆయనంటె అయిష్టం. దీనక కారణంలేకపోలేదు. కుప్పుస్వామిశాస్త్రి కి. శే. దీక్షితులుగారితో స్నేహంచేసి, వారిని తనవలలో వేసికొని, వారిచేత 'విల్' వ్రాయించి తన్ను సూరికి గార్డియన్‌గా యేర్పా టుచేయించి, స్థిరాస్థిగాక 20,000 రూపాయల రొఖ్ఖం తనచేతులో వేయించుకొన్నాడని సుబ్బమ్మ సందేహం. తన పెత్తనం సాగనీయ కుండా చేసిన యీ టక్కరి తనమే సుబ్బమ్మ అసూయకు, ఆగ్రహానికి కారణం కాని సూరికి మాత్రం శాస్త్రిగారంటె చాలవిశ్వాసం.

"పిన్ని! కులాసేనా?" అని శాస్త్రి అడిగాడు 'పిన్ని' తన్నెంత ఆదరంతో చూసేది శాస్త్రికి తెలియకపోలేదు. అయినప్పటికి 'పిన్ని' అనే సబోధనంలో అత్యధిక ప్రేమను ప్రదర్శించాడు. "కులాసా? నాకులాసా అడుగుతావా. ఎవరికి మాత్రం, ఎట్లా కులాసాగా వుంటుంది. ఈపాడు కొంపలో ఇంతచక్కని కోడలు దొరికినతర్వాత పదివేలరూపాయలూ నేలకలుపుకుంది గాక, నాకు నాకొడుక్కి కాకుండా పుల్లలేస్తోంది. ఇంకా కులాసా ఎట్లాకూలిపోతుంది?" అంటూ సుబ్బమ్మ తన క్రోధపుచూపుల్ని సూరివైపుకు మరల్చింది సూరి అపరాధసూచకంగా తల వంచుకున్నాడు.

శాస్త్రి, సూరిని కోపంతో చూచి, అధికార స్వరంతో "బొత్తుగా, భయభక్తులులేవాఏం? ఇంతలోనె తల్లిఅంటె నిర్లక్ష్యమా?" "మాత్ర

దేశోభవ అంటం వినలేదా" అని సుబ్బమ్మ వైపుతిరిగి "పిన్నీ! దాందేముందులే, అవివరకుణమేమి మనసులో వుంచుకోబోకు, సూరిని మళ్ళ అమవు, అజ్ఞాన్లో తెచ్చేవాణ్ణి నేను. అన్నట్టు మరిచా, మీతో ఒకరహస్యంచెప్పాలి. ఇటురండి. ఎవరన్నా వింటారు" అన్నాడు. చాటుకు తీసుకెళ్ళి నెమ్మదిగా "నీకోడలి విషయమే మాట్లాడ్డానికి వచ్చాను. నేచెప్పేదంతా శాంతంగా వినుము. ఆవిల్ల విషయంలో నీవునన్ను ద్వేషించావని నాకు తెలుసు. కాని, అప్పుడు సంగతిసందర్భాలు అట్లావచ్చాయిలే. ఇప్పుడు సూరికి మంచిమనువు దెచ్చాను. ఇరవై వేల రూపాయలకట్నం! 'సరి' అని ముక్కాగ రేస్తే, మూడునిమిషాల్లో ముడేసే యేర్పాటు చేస్తాను."

"రూపాయలు అనగానే సుబ్బమ్మముఖంలో విచిత్రమైన మార్పుగలిగి, వికసించింది. "నాకేం తెలియడంలేదు. ఇదివరకే పెండ్లయిన వాడికి యిరవై వేలు కట్నమిచ్చే తెలివితక్కువ వాడెవడుంటాడు?" అంది. "ఆభారమంతా నాది. కుడవబోతూ కూటిరుచి అడగడమెందుకు. ఇదిగో, ఈనోట్లకట్టలెక్కబెట్టు, కట్నంలో నగం ముందే తెచ్చాను. ఏమనుకున్నావు, నావ్యవహారమంటే?" అంటూ శాస్త్రి జయసూచకంగా తల్లికొడుకులవంక చూచాడు. చూపుల్లోనే వారిచ్చిన అభినందనాల్ని నిశ్శబ్దంగా గ్రహించాడు. శాస్త్రి మరింత ప్రోత్సాహం పొంది, "కమల నేంజేయాలనా, నీసందేహం? దాన్ని పుట్టింటికి పంపుదాం, పీడావదుల్తుంది. నీవు సుఖంగా బ్రదకొచ్చు. నీసుఖానికంటె కావాలిసిందేమిటి పిన్నీ?" అన్నాడు. ఇంకేమో మాట్లాడి, శాస్త్రి, సూరి వెళ్ళిపోయారు.

సుబ్బమ్మకీ వ్యవహారమంతా చాలాసంతోషాన్ని గలిగించింది. శాస్త్రిమీదకోపమంతా క్షణంలో ప్రేమగామారిపోయింది.

కమల తండ్రియింటికి వెళ్ళి రెండేళ్ళయింది. తన అత్తగారినిరంకుశ ప్రభుత్వంలో ఆమెకంత భాగ్యమెట్లా కలుగుతుంది? "రేపే, నీవు సూరి, నీపుట్టింటికెళ్ళేటట్లు నిశ్చయించాము." అని అత్తగారు చెప్పగానె కమల హృదయం సంతోషంతో ఉప్పొంగిపోయింది. హృదయేశునితో సహా వెళ్ళడమంటె మరీ ఉత్సాహము. అత్తగారి అపూర్వకరుణవలని ఆశ్చర్యం, తండ్రిని చూడబోతున్నందు కమితానందం ఆమెశరీరాన్ని మైమరపజేసినవి.

పెండ్లి అయినతరువాత కమల కేమైన సుఖమున్నదంటె యదేసుఖం. త్రోవంతా ఆభార్యాభర్తలు ఏమేమో సంభాషించారు, దానికి, మొదలు చివరలు లేవు. ఆదంపతుల సుఖము అత్యధికము, ఆనందాయకమైనది. కమలకు ఆ ప్రయాణం దీర్ఘతరంగావుంటె బాగుండు ననిపించింది. తన ప్రాణేశ్వరునిపజ్జచేరి ఆమృదు మధుర వాక్కుల మార్దవాన్ని, ఇంకా ఎక్కువగా అనుభవించాలని ఆమెకోరిక.

కమల తండ్రి కూతురుని, అల్లుణ్ణి చూచి చాల సంతోషించాడు. సుబ్బమ్మ కఠిన హృదయమిప్పటికి మెత్తబడ్డదా అని ఆశ్చర్యపడ్డాడు.

సూరి, ఇక్కడ స్వర్గసుఖాలనుభవించాడు. పాపం! ఇంటివద్ద పానకంలో పుల్లలాగ, తల్లి తన సౌఖ్యప్రవాహానికడ్డుపడేది. మూడురోజులైనతర్వాత నెలరోజుల్లో మళ్ళీవస్తానని భార్యతోచెప్పి యింటికి వెళ్లాడు.

నెలరోజులు గడిచిపోయినవి.

ఒకరాత్రి సుబ్బమ్మ లాంతరు చేతితో పట్టుకుని, మాటిమాటికి బయటికి చూస్తూ, ఎవరి కొరకో నిరీక్షిస్తూంది. ఆరాత్రే సూరి, శాస్త్రి, వస్తామని ఉత్తరం వ్రాశారు. కనుకనే సుబ్బమ్మ ఎంతసేపున్నా ఎవరురాలేదు. ఆమెకు కసు గొచ్చి, తలుపుమూసి పడుకోబోయేటప్పటికి అడుగుల్చప్పుడు వినబడ్డది. తలుపుతీసింది. ఎవరి కొరకైతే, ఇప్పటివరకు వేచియుందో, వారు ఇప్పుడు వచ్చారు.

కాని వారిమౌనం, కళావిహీనత చూచేటప్పటిక సుబ్బమ్మకేదో అశుభసూచకంగా కనబడ్డది. గుండెల్లో రాయిపడ్డది. "పిల్లను తీసికొస్తామని వ్రాశారుగాదూ, ఏదీ ?" అని ఆతురతతో అడిగింది. వారు జవాబివ్వకుండా తలలువంచి అట్లె నిలబడిపోయారు.

"ఏం ! ఏమి సంభవించింది ?"

శాస్త్రి అప్పుడు నోరుదెరిచాడు. చింతాక్రాంతమై దీనస్వరూపమైన ముఖాన్ని పైకెత్తి "ఏమనిచెప్పేది పిన్నీ ! వ్యవహారమంతా ఇట్లా పెడదిరుగుతుందని యెవరనుకుంటారు ? అయ్యో పదిమందిలో తలెత్తుకుని తిరిగే ప్రాప్తికూడా లేదిక అయ్యో" అంటూ అవటించాడు.

"జరిగిందేమిటో చెప్పవేం ! కట్నంసొమ్మేమైన పోయిందా ?"

"లేదమ్మా ! లేదు. ఈ వృద్ధాప్యంలో, ఈ మహాపాపం సంభవించిందే, అని అఘోరిస్తున్నాను. అంతేకాదు. దీనిలో మీకుకూడా భాగం పంచినందుకు నాకు మరీ దిగులుగాఉంది."

"ఏమిటాపాపం, కట్నం పుచ్చుకోవడమే పాపమనా, నీవంటం ?"

"కాదు, పిన్ని, కాదు. అంతకంటె మహాఘోరమైంది. అయ్యో ఆవినయం, ఆచక్కదనం ఆచదువు, ఆ............"

"ఏమిటే ! అపిల్లేమైనా చచ్చిపోయిందా ?"

"చచ్చిపోవడమా, కాదు చంపుకుంది. ఈ పాపిష్టిగ్రామంనుంచి ఎవడో దుర్మార్గుడు, సూరికిదివరకే పెండ్లయిందని ఆమానవతికి ఉత్తరం వ్రాశాడట. అందుచేత భావిలోపడ్డదట" అంటూ కళ్లవెంటకారే నీళ్లను అంగవస్త్రంతో తుడుచుకున్నాడు.

సుబ్బమ్మ నిశ్చేష్ఠ అయిపోయింది.

"పరలోకశిక్ష సంగతట్లావుంచి, యిప్పుడు పోలీసువారి యెద్దడి ఎక్కువయింది. లంచం యిచ్చి తృప్తిపరుద్దామా, అంటె ఒప్పుకోలేదు.' అని ఒక నిట్టూర్పు విడిచాడు. 'పోలీసు అనగానే సుబ్బమ్మ వణకడం ప్రారంభించిది. శరీరమంతా చెమటబట్టింది. "ఇప్పు డేం చెద్దాము" అంది.

"నాకూ అదే ఆలోచన, మనం తీర్థయాత్రకు బయల్దేరితే పోలీసువారు పట్టుకోలేరు. నిన్ను పోలీసువాండ్ల చేతుల్లో వదలమనటానికి నాకు గుండె పగుల్తూంది."

సుబ్బమ్మకేమి తోచలా. ఇల్లువిడిచి వెళ్ళడమంటె ఆమెకు ప్రాణసంకటం. పోలీసువారంటె, అంతకు రెట్టింపు పాపం ముందు నుయ్యి, వెనకు గొయ్యి. సూరి"శాస్త్రిగారి సలహా బాగానే ఉంది. నీవు ఇంటిపట్టునుంచి వెళ్లడం నాకూ యిష్టంలేదు. కాని కాలంవస్తే తప్పుతుందా?" అన్నాడు. సుబ్బమ్మకూడ అట్లాగే తోచి, సూరివంక చూచి "నీవు కూడ మా వెంట వస్తావా" అంది. వెంటనే శాస్త్రి "సూరిఇక్కడ

ఉండవద్దా? ఈ పొలంబోట్రి ఎవరుచూస్తారు" అన్నాడు. సుబ్బమ్మ మారుమాట్లాడలేదు.

కమల ఇప్పుడు అత్తగారింటికి వచ్చింది. వెనుకటి కష్టాలిపుడు లేవు. కుప్పుస్వామిశాస్త్రి వన్నాగం, విచిత్రి కథ ఇప్పుడే తెలిసికుంది. జాలితో "పాపం! అత్తగారినెంత మోసంచేసారు" అంది. భర్తవంకచూచి, తన సహజ మాధుర్యం తోను, మందహాసంతోను "ఎంత టక్కరితన మండీ — మిమ్మి నమ్మనేగూడదు" అన్నది.

"ఇదా! మేము నీకుచేసిన ఉపకారానికి బహుమానం—ఎంతకృతజ్ఞత?" అంటూ సూరి కమల వదనైనకమలని కౌగలించుకొన్నాడు. ఆముద్దుల ముఖాన్ని ముద్దుపెట్టుకున్నాడు. ప్రేమను వర్షింపజేసాడు.

వారికింకా కావాలిసిందేముంది? ప్రేమ సందర్భంలో, నిరాటంకంగా, అత్యధికము, అనంతము అగు ఆనందాన్ని అనుభవిస్తారు!

## వియోగము.

పెనుమర్తి వెంకటరత్నంగారు, యువకవిమండలి.

ప్రాణేశ! నీపదాబ్జంబులు విడచి
ఎన్నాళ్ళు జీవవాహిని నీదగలను!
హృదయాంబరంబున నీతమస్వినుల
నీవులేకున్నచో నేనేమి సేతు!

కాలుసేతులుచిక్కి కడుకృశించినవి
కంఠమునందు గద్గదిక పుట్టినది
ఈనిరాశాశూన్య మిటులావరింప
బ్రతుకొక్క నరకబింబమువోలెనుండె.

ఎన్నాళ్ళనుండి ప్రార్థించుచున్నానొ!
ఈ నాకదుష్టాశ్రిక్షోణమ్ము లెఱుగు
ఎన్నాళ్ళనుండి క్షీణించుచున్నానొ
ఒకమాటు చూచిపోవోయి యీప్రాణి.

ఈచీకటులలోన నీకంటకముల
చూచినాచాలు నాశూన్య గేహమ్ము.

సగము కృశించె నాశాపుష్పవల్లి
ఎన్నాళ్ళుసహియింతు నీవిరాళినిటు!

ప్రార్థించిననునీకు పరిహాసమేల!
దీనమానవునితోరా నీదులీల
దీపమువెల్గించి చూచినంజాలు,
పోయెద నాదారి పోరు లేటికిక!

ఆగలేనురనాథ! ఆర్తికీలలకు
దహియించుచుండె నంతర్బాడబంబు
నీకునీరాజనాంతికదీప్తినైన
ధన్యనైపోదురా! త్రాతవీవేరా!

ఈమహా విరహంబు నెట్టులాగెదను
ఈమహాతర్ష నేనేలాభరింతు
ఆగలేనురనాథ! ఆగనేలేను
దయగల్గి నన్నునీ దరిజేర్చుకున్న.

# ప్రారబ్ధము.

టి. కృష్ణమాచార్యగారు.

## 1

అది శరద్రాత్రి నాల్గవజాము. ప్రభాత రోచిస్సులు దశదిశల విస్తరింపకుండులాగున తెల్లమబ్బులు మింటనల్లుకొనియెను. చక్రవాక దంపతులు భానుఁడెప్పు డుదయించునా యను నుత్కంఠతో విరహానలమున మ్రగ్గుచున్నవి. ప్రకృతికాంత యింకనుఁ దనయుల పర్యంకమున నిడుకొని జోఁగొట్టుచుండెను. ఎచ్చటఁజూచినను నిశ్శబ్దము నిరంకుశముగ పరిపాలన మొనర్చుచుండెను.

తుపాను వీచుటకుఁ బ్రారంభించెను. కరుణ సాగరుడు, అష్టశరద్వయస్కుఁడైన కిశోర కుమారుఁడను ముద్దుల తనయుని వెంటనిడుకొని చేపలబట్టుటకై గంగాప్రవాహ ముఖద్వారమునకు బయలు వెడలెను. ఆతని ధర్మపత్ని, తారిణి, "నాథా! ఇట్టి భయంకరమగు తుపానులో, బాబుతో నెట్లిలు సేరఁగలరోగదా!" అని విచారముతో బల్కెను

గంగా ముఖద్వారంబుకడకుఁ గరుణసాగరుఁడేగి యొక నావపై బాలుఁడును, దానును నెక్కి జాహ్నవీ గర్భంబునకు సాగిపోవుచుండెను. అంతకంతకు దుపానధిక మయ్యెను. అత్తరి బాలుఁడు "బాబా!" అని ప్రబోధించెను.

"ఏమి, నాయనా?"

"ఈవేళ నాకు బూచివలెనున్న నాకాశము చాల భయముగా నున్నది."

"నేనుండ నీకుభయమేల, తండ్రీ?" అని బుజ్జగించెను.

"బాబా! నీవెప్పుడైన నిట్టి తుపానుల్లోఁ జేపలఁ బట్టితివా?"

"లేకేమి? చాలసార్లు నేనిట్టి సమయముల యందే చేపలబట్టుటకై వెడలితిని ప్రాణాపాయకరమయిన తుపాను రాదులే తండ్రీ!"

నగరమునుండీ, జమీందారుల దివాణములలో మ్రోగుచున్న నహబత్, సన్నాయి మొదలగు వాద్యములు కరుణసాగర కిశోరుల కర్ణగోచరము లయ్యెను అట్టి భయంకర సమయమందు కూడ వారా సన్నాయి సంగీతము నాలకించి, నిర్మలానందాబ్ధినిఁ దేలియాడిరి.

"బాబూ! రాజాగారి దేవిడీలో వాయించుచున్న సన్నాయి మేళమును వినుచుంటివా? ఇప్పుడు 9 గంటలైనదని తెలియుట లేదా? అమ్మ వేగముగ రమ్మని చెప్పలేదా? ఇంత యాలశ్య—"

"నాయనా! ఇదిగో, ఇంకొకసారి వలవేసి-బాబూ! నీకు పంచవన్నెలచేప చాల యిష్టము గాదూ? ఇంతవఱకొక్క రంగు రంగుల చేపైన రాలేదే! అప్పుడే పోదమందువేమి?"

తండ్రి భాషణములేవియు నాబాలుని చెవుల సోకుటలేదు. ఆతని చిత్తము సన్నాయిదైన గానార్ణమున నోలలాడు చున్నది. ముద్దుల మోమున నమాయకత్వముతో నిండిన బ్రహ్మానందము తాండవ నృత్యము సల్పుచుండెను.

"బాబూ!" అని యున్నటులుండి యా బాలకుఁ డుత్కంఠతో సంబోధించెను.

"ఏమి కిశోరా! ఏమాలోచించుచుంటివి?"

"హాయిగానున్నది, బాబా!"

"సన్నాయి గానమా, తండ్రీ!"

"మనమింటికేగి త్వరగా నన్నముతిని సన్నా

యి సంగీతము వినుట కేగుదము — కానీ — బాబూ?"

"నా చిన్నారినాన్నా! ఈదినము నీ మోమేమో జాలినిఁ దోఁచేయుచున్న దేమీ? అమ్మపై బెంగయా? త్వరగానే పోదము లెమ్మ?"

## 2

కరుణసాగరుని నావ నదీమధ్యమునకు వచ్చెను. తుపాను ప్రబలముగా వీచుచుండెను. కిశోరకుమారుఁడు భయముచే జనకుని గట్టిగఁ గౌఁగలించుకొని వడవడ వడఁకుచుఁ గూరుచుండెను. కరుణ సాగరునిఁ జేతోవీధినిఁ గూడ భయోత్పాత ముత్పతిల్లెను. ఏదిక్కు గాంచినను మంచు దట్టముగఁ గప్పుకొని మూఢమతి నావరించి యుండు నజ్ఞానాంధకారం బునుంబోలె కండ్లు పొడిచికొనినను నేమియుఁ గనబడకుండెను. తరంగములు నురగలుకట్టి యంతరిక్షంబున కెగురునపుడు ధవళవర్ణముతో ధూమసంహతులు వెలువడుచున్నవి. శతఘ్నుల పోల్కి నావీచిక లొండొంటిఁ దాకి, పై కెగయు నట్టితఱి ప్రళయకాల మహారుద్రుని అట్టహాస మువలె నున్నది. కరుణసాగరుఁడు పలుమార్లు తుపానువేళల నదిలో పడవను నడిపెను గాని యెన్నఁడును నిట్టిభీతినిమానసంబున నెఱుఁగఁడు. ఆదుర్దినమున వాని యేకపుత్త్రుఁడైన కిశోరుఁడు వచ్చియుండెను. తారిణీ కరుణసాగరులకు, లేక లేక కలిగిన కుమారునిపై నత్యంతప్రేమయుండెను. అట్టి గారాబుపట్టినిఁ గరుణసాగరుఁడు గొనిపోవునపుడు తారిణి భద్రమని నాథుని హెచ్చరించెను. పాపము! కరుణసాగరుఁ డేల కిశోరునిఁ గొనిపోవలెను? భవిష్యద్ఘోర సంఘటన కేల భీతినొందవలెను? — ప్రారబ్ధకర్మము — విధి వ్రాలు దప్పింప నేరితరము?

కరుణసాగరుఁడు తన యదృష్టముపై నాధారపడి నావయొక్క చుక్కానినిఁ గడు నిపుణతతో నడుపుచుండెను. అతఁడు తనయుని మరింత బిగ్గరగఁ గౌఁగలించి, హృదయమునకు హత్తిబట్టి యొకపరి, "కిశోరా! నాముద్దులయ్యా!" అని, ప్రేమవాహిని పొంగిపొరల హెచ్చరించి, యాతని శిరమును గట్టిగ మూర్కొని, కన్నులఁ బ్రేమాశ్రువులు రాల్చెను. కాని బాలుఁడు నాతఁ డేమియు మాటాడక, మూఁగవాని చందమున బిగుల భీతమనస్కుఁడై తండ్రి హృదయమున కంటిపెట్టుకొని యుండెను. కరుణసాగరుఁడు తనూజాతునిపై ప్రేమ నాప జాలక హృదయపాత్ర వ్రక్కలగుతి, వదన మాకసమువంకకుఁ ద్రిప్పి, భోరున నేడ్చివైచెను. తటాలున నాకొన్న తరంగమొండు నావనుఁ దాకి, దానిని నీటముంచెను. గర్భనిర్భేద్య మొనర్చు వేలోక భీకరోగ్రకారాక్షసి కిశోరుని జనకుని హృత్సీమనుండి వేరుజేసెను. ఒకటి, రెండుతడవలు మాత్రము దూరమునుండి, వాయులీనమైఁ "కిశో — కిశో" అను నస్పష్టధ్వని వినవచ్చెను. కరుణసాగరుఁ డింకొకసారు "కిశోరా" యని నెలుఁగెత్తి పిలచెను. కాని యాధ్వని దశదిశలకుఁ బరువులెత్తి, యెచ్చోటనుఁ బ్రత్యుత్తరము గానక యలసి సొలసి పోయెను.

## 3

ఆనందకుటీరముకడ తారిణి చంచలమనస్కయై భర్తయొక్కయు, కుమారునియొక్కయు ఆగమనమునకై యెదురుచూచుచుండెను. సంజ కెంజాయ లాకసమున నంతరించెను. సంజ మొగ్గ లుల్లాసమొప్ప నంతమఁబూర్వమేవిచ్చెను. కాని చేపలబట్టుట కేగిన యిద్దఱిలో నొక్కరు నిలుసే

హైరి. జమీందారుల సేవకులు చేపలకొఱకునా లైవ మారే తెంచి చనిరి. తారిణి చిత్తము, గతించిన విపత్తును దెలిసికొన్నటుల, మిగుల వ్యాకుల మొందుచుండెను. అప్పుడామె తనలో "హా! దైవమా! ఈభయంకర తుపానుసమయమున బొట్టకూటికై నాలుగుపైసల సంపాదింపవలెనను కోరికతో నాభర్తను, నాముద్దులపట్టిని నదికి నేలబంపితిని? భగవానుఁడా! వారి నిలుసేర్ప భారము నీయది;" యని సర్వాంతర్యామినిఁ బ్రార్థించుకొనుచుండెను.

అంతలో గరుణసాగరుఁ డుస్మృత్తునిఁ జందమున లోనకేగి, "తారిణీ!" యని గద్గదస్వరమునఁ బల్కెను.

తారిణి ఆశ్చర్యచకితయై, యాతనిలువంబడి "హా! వచ్చితివా?— మన కిశోరుఁడేడి?— అతని నిమీలతో నగారిలోనికిఁ బంపితివా? సేవకులు నాలుగయిదు తడవలేతెంచి చనిరి." అనియెను.

కరుణసాగరుని కాళ్ళు గజ గజ వణఁకిపోవు చున్నవి. మారాడకయున్న భర్తంగాంచి, తారిణి "వలన వలఁదగిలింపుడు — ఏమి? — మారాడరు? — మధుపాన మొనర్చితిరా?" యని రూక్షస్వరముతోఁ బ్రశ్నించెను.

"తారిణీ! దేహము కుమ్మరసారె విధముగా దిరిగి పోవుచున్నది. పడిపోకుండఁ బట్టుకొనుము—మన కిశోరుఁడు తిరిగి యిలుసేరెనా?"

"ఆఁ-కిశోరుఁడా? —ఏమి? — ఇలుసేరుటయా? - ఎప్పుడు?"—

"హా! కట్టడిదైవమా! — రాలేదా?— అయితే"—

భర్తకరమునుఁ దారిణి గ్రహించి, "ఏమి, అయితే'—చెప్పుడు? —ఏమిజరిగినది?— త్వరగాఁ జెప్పుడు?" యని తొందరపెట్టెను.

అతఁడు భార్యమూపున శిరముంచి, గద్గద కంఠుఁడై, "హృదయేశ్వరి! కిశోరుఁడిక మనకు లేఁడు—జాహ్నవీమతల్లి—ఐక్యము" అనుచు నేడువసాగెను.

తారిణి భర్తను నిందించుచు నతని నవలకుఁ ద్రోసి, "ఎంతపని యొనర్చితిరి! మీరా ప"— అనియేమో నుడువబోచుండఁగా:—

"నేను మాత్రము శూన్యహృదయుఁడనై నేతెంచితిని." కరుణసాగరుని లోచనద్వయము నుండి నేలనేల్లబోలు బాష్పవారిధారలు ప్రవహించుచుండెను.

"మన ముద్దులయ్యకొఱకు గంగాగర్భమున జాలవరకు గాలించితిని. జనని యా బాలు నెచటనో దాచినది. బాలుని నాహృదయమునకు నొత్తిపట్టితినిగాని, ఎవఁడో?—క్రూరు డాతని నపహరించెను.— హా! తారిణీ! ఈ నిర్భాగ్యునిపైని నీతీక్షణదృంచలములఁ బఱపి, పూర్వమే భగ్నమైయున్న హృత్పిండమును మరింత బ్రద్దలుసేయకుము." అని నేలపై చతికిలబడి వలవింపసాగెను.

రూక్షకంఠస్వరములో తారిణి, "కుమారుని నదివాతంబెట్టి మీరుమాత్రము వచ్చితిరా?— పొండు. నాతనయునిఁ గొనిరండు" అనియెను.

"నాశక్తికొలఁది వెతకితినిఁగాని యాతఁడు నాకగపడలేదు."

"మారాడకపొండు. మరల నొకపరి శ్రద్ధతో వెదకుడు. బాలుని గంగ కర్పించి, యెట్లు నా మెసుటకే తెంచితిరి?"

"సరే. నేను పోవుచున్నాను. కిశోరుఁడగపడినా, తిరిగి వచ్చెదను. లేదా—"

కరుణసాగరుఁడు వెడలిపోయెను. తారిణి, భర్త కనఁబడునంత దనుకఁ జూచుచుండెను. దివాణమునుండి సేవకుఁడొకఁడు వచ్చి యింకను గరుణసాగరుఁడు రాకుండుటచే విసిఁగి సణుగు కొనుచు వచ్చిన తెన్నుఁబట్టెను.

## 4

నిర్భాగ్యురాలైన తారిణి—మిక్కిలి అమాయకురాలైన తారిణి—పరమ పతివ్రతారత్నమైన తారిణి—గడుసుదనము, నీటుగోటులు నాగరికతయున నెఱుఁగని తారిణి—ఇంక నెప్పుడో తననాథుఁడు, కుమారునిఁ గొని వచ్చునని యూహతో నాహారమును ముట్టక కటికనేలఁ బడి నిదురించెను. కొంతవడికి మేల్కాంచి, తనయుని వెదకుటకు వెడలిన భర్త తిరిగిరాకుండుటకు వెఱచి, తానే వానిని వెదకి తెచ్చుటకు నిశ్చయించెను. కానియీలోనఁ గిశోరుఁడే తెంచిన నెట్లు—ఇంకెక్కడి కిశోరుఁడు? అది యసంభవము.

సూర్యాస్తమయ మగుచున్నది. నీరెండ బంగారపు పూతవలెఁ గాంతులీనుచు జగంబున కొకవింత సౌందర్యమునుఁ గూర్చుచున్నది. అప్పటికిఁగూడ పతిరాకగాని, పుత్త్రునిరాకగాని కాన్పింపదయ్యె. గుండెలు తటతటం గొట్టుకొనుచుండ నమ్ముగుద సత్వరమున వెలికివచ్చెను.

భాగీరథీ నదీతీరము వెంబడి యామె గొంత వడి నడచెను. దేహమంతయు ముండ్లు గ్రుచ్చుకొనఁగా, కట్టినపుట్టమెల్లఁ జినుఁగఁగా మైమఱచి యామె చాలదవ్వు పాఱువాతెను ఎట్టకేలకుఁ గూత వేటుదూరమున నశ్వత్థ వృక్షముక్రింద నేదో మానవ కంకాళమువలెఁ గన్పట్టుటచే, నాదురదృష్టవంతురా లచ్చోటికేగి చూచెను. అది నిజముగ నొక మానవకళేబరమే! ఆనిర్భాగ్యుఁడెవఁడో కాదు. మన కరుణసాగరుఁడే! తారిణి గుండె బాదుకొనుచు, బోరున నేడ్చుచుండెను.

పట్టణమునుండి సన్నాయిగానము వాయులీనమై వినవచ్చుచునే యున్నది. కాలచక్రము తిరుగుట మానలేదు. ప్రజలు తమతమ కార్యముల నిమగ్నులై యుండిరి. దివాణములో నుత్సవము జరుగుచున్నది. కాని తారిణీ రోదన మాలకించువారెవరు? ఆమె దిక్కుమాలి, సుతునిఁ బోగొట్టుకొన్న వితంతువైనది. ఆమెకు 'నా' యనువారెవరున్నారు?

తారిణి విచారమును దిగమ్రింగి నిమీలిత లోచన బద్ధాంజలియై విశ్వనాథుని ధ్యానించి గుభాలున జాహ్నవీజనని కౌఁగలిలోని కురికెను. వెంటనే తల్లి ప్రియతనూజను నక్కునం దోదివికొని ముదుగొనెను. అంతటితో వారి విషాదాంతకథ యంతరించినది.

---

# విస్మృతస్మృతి.

భారతుల మార్కండేయశర్మ గారు, యువకవిమండలి.

ఇది మొదటిసారి యగునేమొ? అంతె. నేటి
కదియొకడసారి సింగపుం గొదమనెత్తి
మదకలనికాయ మీద సంహరణఖేల
అసలు క్షత్రజక్షతజ సమ్యక్ప్రబోధి
తాత్ము డటుపై నిధర్మరాజంతగురుడ
యానతిచ్చుట శ్వేతవాహన తపఃప్ర
కార భూగర్భ శకు కిముకాపలంబు..

ఎంతకుజాల డమ్మదబలేంధన పావకునంత వాని ని
ర్ధాంత దురంతదుఃఖము వదల్చె. నజేయుడు, సవ్యసాచి, తా
నంతటివాని కూర్మిసుతుడంట. ధరాచరణ క్రమ క్షమా
క్రాంత మనఃప్రశాంతుడు నిరాకృతదైత్యుని మేనయల్లుడున్.

ఎఱుగరువో యధఃపతనహేతువు కౌరవు లాదినంబు పెం
పఱుటకు మూల మున్నమితమై స్రుతియై దెసలాక్రమించి ము
న్నుఱికెడు ధార్తరాష్ట్రుల బలముద్ధృతియుం దలక్రిందులయ్యె, నెం
దఱకు దలంపులూరె, శ్రుతిధర్మువు గన్నులగట్టె నమ్మెయిన్.

అందఱు దండనాధులు! మహారథికుల్గల రందఱున్ నమి
త్కాండ పథేంద్రజిత్తులు! ప్రతాపగిరీశులు! నొక్కడేని జే
నఁదిర? కాకిమూకలక్రియన్ దెసకొక్కడు! చేరలేరు, మా
ధ్యందిన భానుమండల విధంబున యాందఱు నంధకారమున్.

అతడభిమన్యు డీ ఓసుదులయ్యాల కగ్గలమన్న నేమి? పి
ఠితరతరాల కగ్గలము! వృత్తభయంకరు డాత్మరోషరం
జితవదనోగ్రదీధితుల జెంతకు జేరగనీడు! విస్ఫుర
త్రితయ కరంబన వ్రిధికి రేచిన యప్రిన యూంతమూర్తియున్.

అదిలయకాలఖేలనమయా వితథీకృతధూర్తశాత్రి వా
భ్యుదయము ధ్వస్తకౌరవము నుచ్ఛ్వసితాఖిల జీవవాయు సం
పద ధరితాంబు భృద్గమన భంగివొనంగెను కౌరవాబ్దముల్
వొదలునె? యింక నప్రియము భయహేతువుగాక పోవునా?

అమరుల గీతులున్ గురుజనాంగముదూఱెను ద్వాదశార్కబిం
బము లుదయింపలేద లయవహ్ని శిఖావళి వీవలేద సం
తమన పరంపరల్ జగముదాఱ్కొనలేద నవాబ్దవృష్టి లో
కములు మునుంగలేద యవిగా? రణరంగమృతప్రమేయముల్.

మూడుమూర్తుల ఫల్గుణమూర్తి ధార్త
రాష్ట్రి నిర్మూలనముదాక ప్రతిదినంబు
కలువరింపించునట్టి దుర్గ్రాహ్యమూర్తి
భారతీ యతపః ఫలప్రాప్తమూర్తి.
ఈ తెనుంగు దునీలలో నింతవరకు
పెఱలమడి సంచులందేని వేచియున్న
దతిమదారాతి హృదయ సంగతకృపాణ
ధారమై నిశాతమునైన తత్ప్రశస్తి. ॥

# సుధాకరామాత్యుడు.

నిడుమోలు కనకసుందరంగారు, బి. ఏ. (ఆనర్సు)

## పదునైదవ ప్రకరణము.

### —♦ మనస్తాపము. ♦—

జయచంద్రుడు నాతని కొమరుడు స్వగృహాభిముఖులై పోవుచు మార్గమధ్యమున నొక్కింతయు మాటాడలేదు. ఇలు సేరిన పిదప ప్రఫుల్లుడు తన గదియందు ప్రవేశింప బోవు నపు డాతని తండ్రి పిలచెను. ప్రఫుల్లుడు చేర వచ్చి "యెందులకు?" అని ప్రశ్నించెను.

"ఎందులకా? — ఈ విషయమున నీతో గొంత ముచ్చటింపవలసి యున్నది"

"బాబా, యింకొకసారి మాటాడుదము లెమ్ము. భోజమున కాలస్యమగుచున్నది."

"కొంప కూలనున్నను నీవు భోజనమును విడువవు" అని జయచంద్రుడు విసుగుకొనుచు ననియెను.

"తమరుకూడ దయచేయరా?"

"నేను రాను. నాకీసమయమున భోజన మన్న నసహ్యముగనున్నది స్వల్పముగ ఫలాహార మొనర్చెదను. ప్రఫుల్లా, నీ హృదయము నం దెటులున్నదో కాని, అనుదినము తటస్థించెడి విషయములవలన నాకు మనస్తాపము హెచ్చు చున్నది."

ప్రఫుల్లుడు దీర్ఘమగు నొక నిట్టూర్పుపుచ్చి, వెడలిపోయెను. పాపము, తండ్రికంటె నాతని హృదయమే మనస్తాపాతిశయముచేత సంతప్త మగుచుండెనేమో! కాని సాధ్యమగునంత వర కాతడు హృదయకుహరమునందలి రహస్యవేద నను బయల్పడ నిచ్చుటలేదు. ఆనాడు మృణ్మయిచే నాహూతులై యాపె స్నేహితురాండ్రిరువురును వారి భర్తలును వారిగృహమున విందొనర్ప విచ్చేసియుండిరి. వీరి రాకనుగురించి ముందుగ తెలిసికొని యుండుటవలననే జయచంద్రు డానాడు భోజనము మానుకొనియుండ వచ్చును.

ఎప్పటివలెనే భోజనప్రయత్నములు చాల విరివిగ చేయబడెను. ప్రఫుల్లున కేమియు రుచించలేదు. ఆతడు తన భార్యకెదురుగ గూర్చుండి యతిథుల ప్రసంగమున పాల్గొనుచుండెను గాని పట్టెడన్నమైనను భుజింపలేదు. ఆతని భార్యకిట్టి యానంద పిపాసయేల? నిత్యము నిట్టిసంఘమును ప్రోగుచేయుటేల? యని ప్రశ్నించునటుల నాతడు మూగ్గెను. మనోవేదన పారదోలుటకాపె యట్లు చేయుచుండెనా? ఆతడు నదియే కోరుచుండెనని దేవునకే తెలియును. ఆత డిదియంతయు కండ్లార జూచుచు నేల యూరకొనును? అని యాతని హృదయ కుహరాంతముల బ్రవేశించి తరచి చూడగలిగిన పరిశోధకులు పృచ్ఛింపవచ్చును. ఆతని కాభోజనశాల యందలి వేడిమి దుస్స

హము గాజొచ్చెను. భోజనముతో వడ్డింపబడిన భక్ష్యములు విశేషముగ నుండెను. కాని ఆతడోపికతో నతిథులతో పాటు చాలసేపటివరకు గూర్చుండియె యుండెను. తుట్టతుదకు యింకను కూర్చుండుట దుర్భరమని యాతనికి దోచినపుడు ఆతడు చివాలున లేచిపోయెను. దూరముగనొక మూలనున్న కవాటమును దెరచి ఆతడు వీథిలోనికి తొంగిచూచెను. అప్పటికి సూర్యుడస్తాద్రి గ్రుంకెను. నిశాకాంత తన నీలాంబరములను భూమిపై గప్పుచుండెను. రాజమార్గమున నొక పేదరాలు గద్గద స్వరమున విలాప గీతముల బాడుచుండెను. ఆమె జీర్ణాంబరములును జీర్ణదేహమును వస్త్రహీనులై చుట్టును మూగియున్న బిడ్డలును ఆమె యధోగతిని చెప్పుచుండెను. ఆమె కళావిహీనమగు ముఖమును బైకెత్తి ప్రభుల్లునకు నమస్కరించి నపుడాతని హృదయము నీరయ్యెను. ఆతని హృదయమున శాంతియు శరీరమున నస్వస్థతయు నెటులున్నను అన్యుల దైన్యస్థితిని గాంచినపుడాతడు జాలి చెందకపోడు. ఆతడా దీనురాలకొక రూప్యమును సరివేయునప్పుడే మృణ్మయి జేరవచ్చి యాతని కరము కేలబూనెను.

" ఎప్పటివలెనే మీకీదినమున గూడ శిరోభారముగ నున్నదా? "

" మృణీ,శిరోభారమును హృదయభారమును రెండును కలవు. "

" భోజనముకడనుండి లేచి వచ్చుటవలన నేనిది గ్రహించితిని. కాని మన యతిథులందరు నొచ్చుకొనరా ? మీరు వారిసెలవడిగి క్షమింప వేడుకొనవలసినది."

" నీవీ యింటిలో కొంచెమైనను విశ్రాంతి కలుగనీయవా యేమి? నీయిచ్చవచ్చిన పనుల జేసుకొనుటకు నేనెట్టి యభ్యంతరమును కలుగ జేయుదలప లేదని యెరుగుదువు.కాని నిత్యము నీవీరీతిని ప్రవర్తించుచుండిన యెడల నాకు బిచ్చి యెత్తుట నిశ్చయము. ఇందుచే నాకు చిత్తవైకల్యము కలుగుచున్నటుల సూచనలగుపడుచున్నవి. వీనివలన నాజనకుని చిత్తవృత్తి యొక విధముగ పరిణమించుచున్నది."

" ప్రతిదినమును నేను నా స్నేహితురాండ్రి ఇండ్లకేగుటయో, లేక వారిని సకుటుంబముగ నా గృహమునకాహ్వానించుటయో తప్పక జరుగుచుండవలసినదే. నవీనసౌకర్యములు లేని యీ గృహమున మనముండి మీ జనకునకేల కష్టము కలుగజేయవలెను. దివ్యమగునొక గృహమును మనము నిర్మించుకొని యందు నివసింతము. మీరీవిషయమున మీపట్టుదల వదలనంతవరకు నేనును నాపట్టుదల వీడను "

" మృణ్మయీ, నీవెంత సాహసముతో మాటాడుచున్నావు? నీవు కోరెడి రీతిగానున్న వేరొక విధముగనైనను మనమీ గృహమున నచిరకాలములోనే విడువవలసి వచ్చుననుకొనియెదను. నాతండ్రికి మన చేష్టితములపై నేవగింపు హెచ్చుచున్నది. అతడీగృహమునకు సర్వాధికారి. మన మీయిల్లు వీడిపోవలెనని యాతడీక్షణముననైన శాసింపవచ్చును "

" ఆయన యట్లనుట నాకెంతయు సంతోషదాయకము "

" కాని నీవింకొక విషయము నాలోచించుటలేదు. నేను వేరొక గృహమును నిర్మింతునని కాని దివ్యభవనము నొకదాని నద్దెకు తీసుకొందునని కాని నీవెంచుచున్నావేమో నాయార్జనమునుబట్టి చూడ నేనీగృహములో నగముయి

నను వసతిగల యింటిని యుద్దేశ దీసికొనగలనను నమ్మకములేదు. ఇందలి రహస్యమిది ”

సగర్వముగ నవ్వుచు మృణ్మయి “మీరు తీసికొనకపోవచ్చును కాని నేను తీసుకొందును” అని పల్కి తన యతిధుల గలసికొనపోయెను.

ప్రఫుల్లుని యవ్వుల పాలొనర్చుటయన్న మృణ్మయికి జాల సంతోషము కాని మోందు కాదని ఆతడెరుగును. ఆయతిధులతో సరస సల్లాపము లాడుట కాతని కిచ్చకలుగ లేదు. నెమ్మదిగ నాతడు వారి సమక్షమునుండి తొలగిపోయి యా సౌధోపరిభాగమునుండి క్రిందికి దిగివచ్చి బహిర్ద్వారమువద్ద నొక్కించుక సేపు నిలచెను. పిమ్మట నాతడిటునటు బచారుచేయుచు నా వీధి యావలివైపునకేగి దూరమునుండి వినవచ్చెడి యాభిక్షుకురాలి యార్తాలాపముల వినుచుండెను. ఆతడొక్కొక్కపు డొక చోటనె నిలచి, యాలోచనానిమగ్నుడై యున్నటు లగుపడుచు నాకసము వంక తదేకదృష్టితో చూచుచుండెను. ఎదుటనున్న సౌధోపరిభాగమునుండి వినవచ్చెడి తన భార్యయొక్కయు నాపె స్నేహితురాండ్రయొక్కయు నవ్వులును గేంతలును ఆతని హృదయ భారమును తగ్గించుచుండెనో హెచ్చుచేయుచుండెనో చెప్పజాలము.

ఆతని హృదయ కుహరమునుండి బహిర్గతమైన దివ్యవ్యక్తి యొకడు రహస్య స్వరముల నాతని కిట్లుద్బోధించుచున్నట్లుండెను. “నేనాపెను వివాహమాడి యుండకూడదు. నేనిట్లు చేయుట మిగుల నప్రశస్తమని నేనొక్కించుక యాలోచించిచో స్ఫురించియుండెడిది. నా కన్నుల నంధకారమావహించినది. — కాదు. అంధకారము కాదు. అట్లని తప్పించుకొనలేను. దురావేశ మాక్రమించినది. అబ్బా, అది ఎంత తప్పు! ఘోరమగు నెట్టి పాపకార్యము. దేవుడు నన్ను తగురీతిని శిక్షించుచున్నాడు. నేనే దోషిని. ఆరేయి నట్టి వైపరీత్యము కలిగినపుడు నేనాపె చెంతకేగక యుండవలసినది. నేనాపె నెల్లపుడును దూరముగ నుంచి యుండవలసినది. ఆ పరిస్థితులయందట్లు చేయని మానవుడెవడైన ప్రపంచమునందు గలడా? మాయిర్వురి సమాగమమునకును లోపము నాదియే కాని, ఆపెది కాదు. కావుననే, ఆపె నన్నట్టి కష్టనష్టముల బాల్పరచినను నాసాధ్యమగు నంతవరకు నోపికతో భరించెదను. ఆపెను కామించినది నేను. భయంకరమగు నారాత్రి గడచినపిదప — ఆమరుసటి దినమున నేను సుధాకరుని గదియందు సంగ్రహించిన విషయములను నెరింగిన పిదప—నాపెనను గన్నెత్తి చూచుటకు సాహసించెడిది కాదు. నూవివాహమువలన సంప్రాప్తములగు నిర్బంధములకు నేనే బాధ్యుడను. నాహృదయాంతరమునందలి సంక్షోభముచే నాకు విసువుజనించుచున్నది. అబ్బా! మూడు సంవత్సరములా! యౌవనమదోద్రేకముచే నా జీవితము నాపె జీవితమున కంటగట్టుకొని మూడేండ్లు మించినది. మంచికొఱకో చెడుకొఱకో జీవితాంతమువఱకు నింతియే! కాని పశ్చాత్తాపమే నాహృదయరంగమున మూర్తీభవించియున్నది. మాయిర్వురికిని నడుమ నొక తెరయున్నది. నేను మరణించుటకు బూర్వము దానిని తొలగించు నవసరమేర్పడకుండునట్లు భగవంతుడనుగ్రహించుగాక! ఆపె శ్రేయమునే కోరుగాక!”

ఆతని ముఖమండలము నావరించిన ఘర్మబిందువులదుడుచుకొనుటకొకతుండును దేబోయెను. అంతనొక యడుగు ముందునకిడి మరల వెనుకకు

మరలెను.

కాని నిరంతర మాతని హృదయమును కార్చిచ్చువలె దహించుచున్న జిజ్ఞాస నిర్మూలనమగుటలేదు. అనవరతము నంధకార సమాశ్రితమై యగుపించునొక భ్రాంతి యాతని దృక్పథము నుండి తొలగిపోవుటయు లేదు.

కామించిన స్త్రీలను చేపట్టుటకై చేయరాని దుష్కార్యము లొనర్చిన మానవులు ప్రపంచమున నెంతమంది లేరు? కాని నేనట్టివారిలో నధమాధముడను. నన్నొక దుష్టగ్రహ మావహించియుండవచ్చును. "నీవొనర్చిన పాపము నిన్నుకట్టి కుడుపునని నమ్ముము." అమెను చేపట్టి యావివాహమండపముకడ నిలచినయా విషమక్షణము నుండి యీ వాక్యములు నాకు మరపురాకున్నవి. నా యీ దుర్భరజీవితమున ప్రతిగడియయు రాత్రిదినముల యందను క్షణమును నాయపచారము నన్ను బీడించుచున్నది. నే నెరిగియుండిన విషయముల గమనించి యాపెత్రోవ నాపెను బోనిచ్చి నా దారిని నేను మరలివచ్చిన నెంత శ్రేయోదాయకమై యుండెడిది. అయ్యో నే నట్లేల చేయుదును. కాని నేటికిని ఆమెపై నాకుగల ప్రేమ మానవాతీతము. నాతండ్రిగాని యింకెవరైనగాని నామెపై నిందారోపణ మొనర్చి నిరసించినపుడు నాహృదయము కృపాణాఘాతముచేవలె నదరుచుండును. నాకు సాధ్యమగునంత కాలమామెను సంరక్షించుట నావిధి.

ప్రఫుల్లుడీకీతిని పర్యాలోచన మొనర్చుకొనుచు రాజమార్గము వెంటబడి యెచ్చటికో పోవుచుండెను. ఆతడెచ్చటకేని యేగవలెనను స్థిరసంకల్పముతో బయలు దేరినట్లగపడడు. తుట్టతుదకాతడూరి వెలుపలనున్న మైదానము చేరెను. ఆతడచటనాలోచనానిమగ్నమగు హృదయముతో నిలువబడి యనేక పర్యాయములు తిరిగెను. అనాడు మాదన్న మంత్రి యెరిగించిన నూతనాంశములే ఆతని యాందోళనమునకు ముఖ్యకారణములై యుండవచ్చును.

సుధాకరుడవసాన సమయమున స్వహస్తముతో లిఖించియుండిన లేఖయొక్క నిజవృత్తాంతము ప్రఫుల్లునకుగాని, యింకెవరికిగాని యింతకు పూర్వ మొకింతయు దెలియదు. ఆనాడు తెలిసిన విషయములంబట్టి, యది రాధాకృష్ణు నుద్దేశించి వ్రాయబడియెనని విస్పష్టమయ్యెను. దీనిచే నీ హత్యా రహస్యము బట్టబయలగునా? అట్లు కాకుండుగాక యని ప్రఫుల్లుడు హృదయపూర్వకముగ నభిలషించుచుండెను. అందలి సత్యమును గప్పిపుచ్చుట ముఖ్యమని యాతనికే బాగుగ దెలియును. కాని యెన్నటికేనియు, యదార్థమే నిరూపింపబడునెడల అపరాధులకును నిరపరాధులకును దుర్భరమగు మనస్తాపము కలుగునని యాతడెరుగును.

ప్రఫుల్లుడాకసము నొక్కసారి పరికించెను. అంధకారబంధురమగు నారాత్రియందు అనిమేష నయనములతో నక్షత్రసహస్రములు ప్రపంచమును తరచి చూచుచుండెను. ఆజ్యోతిర్మయమండలముల వెనుకపొంచియుండి ప్రపంచమున సూక్ష్మతర వస్తు సంచయమును, రహస్యకర్మములను నిరంతరము పరిశీలన మొనర్చు దివ్యనేత్రి మాతనికపుడు జ్ఞప్తికివచ్చెను. మానవుల పన్నాగములును పోకడలను నిరర్థకములని ఆతనికి దోచెను. 'ఇట్లగుగాక, యీరీతిని జరుగకుండుగాక' యని శాసించుటకు మానవుడసమర్థుడని యాతని కప్పుడు బోధకట్టెను. సర్వాంతర్యామియగు భగవంతుని యిచ్ఛ

యనుల్లంఘనీయమైన భవిష్యత్తున కాధారభూతమై యుండును. ఆ పరాత్పరుని శాసనములు మానవ మాత్రుని హ్రస్వాలోచనా పరంపరలచే మార్పు జెందునా?

* * *

ప్రఫుల్లుని యారోగ్యము క్రమక్రమముగా క్షీణింపజొచ్చెను. నాల్గుమాసములు గడచినవిగాని నూతనాంశము లేవియు బయల్పడలేదు. పుత్రుని స్థితిని గమనించిన కొలదియు జయచంద్రున కలజడి హెచ్చుచుండెను. ప్రఫుల్లుడు వ్యవహార విషయముల జోక్యము కల్పించుకొనుట విరమింపవలెనని ఆతడు పట్టుబట్టెను. శ్రావణ మాసారంభమున బయలుదేరి యుత్తర హిందూస్థానమున దివ్యక్షేత్రముల దర్శించి రమణీయములగు ప్రదేశములకు విలాసార్థముగనేగి నాలుగైదుమాసములువిశ్రాంతిగ గడపి తిరిగిరావలెనని యాతడు పుత్రుని బంపివేసెను మృణ్మయి కూడనాతని వెంటనంటి చనెను. కాని పాపము ప్రఫుల్లునకు మనశ్శాంతి యంత సులభముగ లభించునా?

ఆతడు కార్తిక మాసమున మరల నిల్లుసేరెను. ఈమధ్య కాలమున నాతడు సందర్శించిన పవిత్రస్థలముల నిచట వివరింప దలపలేను. అకాలమున నిప్పటివలె ప్రయాణ సౌకర్యములు విరివిగలేకుండుటచే నాదంపతులు స్వగృహము జేరునప్పటికి మార్గాయాసముచే మిగుల బడలియుండిరి. జయచంద్రుడు ముంగిట వెన్నెలలో కూర్చుండి యుండెను. కుమారుని గాంచగనే యాతని శరీరము జల్లుమనియెను. ఈప్రయాణమువలన నాతని యారోగ్యమభివృద్ధి గాంచుటకు బదులుగ క్షీణించినట్లాతని కగపడెను.

తనకు మిగుల నారోగ్యముగ నున్నదని ప్రఫుల్లుడనియెను. మరునాడుదయమున నొక వైద్యునకు జేయిచూపించుకొమ్మని జయచంద్రుడు చెప్పినపుడాతనికి నవ్వు వచ్చెను. వ్యవహారముల ద్యజించి విశ్రాంతిగా నాల్గుమాసములు గడపుటచే నాతని కెంతయు కుశలముగ నున్నదని వక్కాణించెను. ఆతడు పలుచనైనట్లగపడుటకు కారణము ప్రయాణాయాసముగాని వేరొండు కాదు. మృణ్మయి మాత్రము పలుచనైనటుల కాన్పించుటలేదా? దేశాంతరముల నిత్యమును పర్యటనము చేయుచుండుట చేతను ప్రయాణసౌకర్యములు విరివిగ లేకుండుటచేతను ప్రయాణాంతమున వారు బడలినట్లగపడిరేమో కాని వారి యారోగ్యమున కెట్టిభంగమును కలుగలేదని ప్రఫుల్లుడు నొక్కి చెప్పెను.

ఆతడిక నెప్పటివలెనే తన వ్యవహారముల జక్కబెట్టుకొనుచుండెను. అంతకు బూర్వము క్షీణించియుండిన యాతని మనోవికాసమున సామర్థ్యమును మరల జిగిర్చినట్లగపడెను.



పదునారవ ప్రకరణము.

రహస్యసందర్శనము.



"రహస్యము.

రాజమాన్య రాజపూజితులైన మహారాజ రాజశ్రీ ప్రఫుల్లచంద్రామాత్యులకు.

మీ మిత్రుడు రఘునాథుడు వ్రాసికొను విన్నపము.

ఆర్యా,

నేటికి సుమారు నాలుగు మాసములక్రిందట మీయింటనుండి యపహరింపబడిన యుత్తర

మడతపెట్టుచు నతడు నిదానించి కొంతతడ వాలోచించెను.

"నేనే అతనివద్దకేల పోకూడదు?" అనుచు గోడపైనున్న చిత్తరువు ప్రత్యుత్తర మిచ్చునని కాబోలు దానిని తదేకదృష్టితో జూచెను. "అవును. నేనీరాత్రియే పోయెదగాక. అట్లు సేయుటే క్షేమము."

నిష్పుల్లనుగేచి రఘునాథుని యుత్తరములను తన ప్రత్యుత్తరములను వెంటనే ప్రఫుల్లుడు భస్మీపటలము కావించెను.

సాయంకాలమైనది. ఒక గడియ ప్రొద్దు పోవగనే ప్రఫుల్లుడు రఘునాథుని నెమకకొనుచు పడమర వీధికి బయలువెడలెను. ఆతని గృహము ప్రఫుల్లుడంతకు బూర్వమెరుగడు. కాని యచ్చటి వారలనరసి తుట్టతుదకు దెలిసికొనెను. ఆగృహ మొకటే యంతస్తుగల చిన్నమేడ. అది రఘునాథుని పిత్రార్జితము.

సుమారు పదేండ్ల వయస్సుగల బాలు డొకడు ప్రఫుల్లుని మేడపైనున్న యొక చిన్న గదిలోనికి దీసికొనిపోయెను. రఘునాథు డెవ్వియో కొన్ని కాగితముల నతి శ్రద్ధతో పరిశీలించుచుండెను. ప్రఫుల్లుని యాగమనము గమనించినంతనే అతడు కాగితముల నొక మూలకు ద్రోసి, లేచి నిలచి, ప్రఫుల్లుని సవినయముగ నమస్కరించి యొక యున్నతాసనము నొసంగెను. తానును అతని కెదురుగ నింకొక యాసనమున గూర్చుండెను. ప్రఫుల్లుడు శుభ్రవస్త్రముల నెల్లపుడు ధరించుననియు, మర్యాద లక్షణముల బాగుగ నెఱిగిన వాడనియు మన యాచార్యుడు గమనించియే యుండెను. కాని నేడు మాత్రము వ్యాధిగ్రస్తుడై విజీర్ణవదనుడై యుండుట నతడు గ్రహింపకపోలేదు.

"ఆర్యా? తమరే దయచేసి నందులకు నాకెంతయు సంతసము. అవసరమగు నొక కార్య విషయమున నేను చంద్రనగరమునకు రేపటి ప్రాతఃకాలముననే బయనము కావలసియుండు నేమో యని మాదన్న మంత్రి పుంగవులు శెల విచ్చియుండిరి. రూఢియగు వృత్తాంతము నీరాత్రి నాకెరుక పరతుమనిరి."

"తమరీ పట్టణమునందే నివసించుచున్నారా?"

"లేదు. నిన్న, నేనీనగరమునకు వచ్చితిని. వారము దినములిట నుండదలచితిని. రేపే తిరిగి పయనము కావలసివచ్చునేమోనని యిపు డగపడుచున్నది. నేనట్లు పోవుటయే నిశ్చయమగు నెడల నీపర్యాయము మీదర్శనభాగ్యమే లభించెడిదికాదు."

"నేను మిమ్ములను సందర్శింప వీలులేదనియే జాబు వ్రాయ నుంకించితిని. మేమిపు డన్య వ్యాపారములందు నిమగ్నులమై యున్నారము. చేయిజారిపోయిన యాలేఖను గూర్చి యికనేమియు తలచకూడదనియే నాయభిమతము. నష్టపడిన వారము మేము. మేమే దాని నెటులో భరింపక తప్పదు. ఈ విషయములతో మీకొక యుత్తరమును వ్రాయ వెంపరలాడితినిగాని మీరు తెలిసికొనిన నూతనాంశములను నాతో నుడివి కెరిగింతురేమోయని నాకు దోకదోచినది."

"లేదు. నేనట్లు చేయను. ఈ విషయము లందు నాకంటె మీకే మిగుల ప్రశక్తికలదు. ఆర్యా! మీకు సేమమేనా?"

"యథాప్రకారమే, ఎందులకు?"

"మీ శరీరము మిగుల కృశించినట్లగపడు చున్నది."

"అవును. నాకు నీనడుమ కొంచెము వ్యావ

హార సందర్భములందు ప్రయాసము కలుగు చున్నది. నేను భార్యాసమేతుడనై యుత్తర హిందూస్థానమున తీర్థయాత్రల సేవించుచు, విధి విరామములేక పెక్కు ప్రదేశముల దిరిగి యుంటిని. ఆప్రయాణము విశ్రాంతి నిచ్చియుండ లేదు. కాని మిగుల బ్రమోదకరమైనది. అది యటుండనిమ్ము. రఘునాథా! నీవిపుడు చెప్ప దలచిన విషయములలో నేదేని ముఖ్యమగు నంశమున్న నేను వినగోరెదను. అట్టిది లేదేని నీ వీ విషయమున కృషిసల్పుట యనవసరము."

"ప్రఫుల్ల చంద్రా! మీ యుత్తరము పోయిన యపుడు మీ గుమాస్తాలలో నొకడు స్వకీయోపయోగమునకు గాకున్న నన్యులకొఱకైనను దాని నపహరించె నేమో పరిశోధించ వలెనని తమ రాజ్ఞాపించియుండిరి. మీ గుమస్తాలు నలుగురికైన నొకకన్నుంచి పరీక్షింప వలెనని చెప్పితిరి. నేనీవిషయము మీకింత వరకేమియు విన్నవింపకపోవుటవలన నేను శ్రద్ధ వహించి యుండలేదని మీరెంచుచున్నారు కాబోలు."

"ఓహో! నీవు చెప్పునది వారివిషయమే యగు నెడల నేను సంతోష పూర్వకముగ విని యెదను." ఇటుల పలుకునపుడు ప్రఫుల్లుని ముఖము వికాసవంతమైనటుల రఘునాథుడు గమనించెను. "వారిలో నొకరు తీసికొనిరని దృఢపడినా?"

"దృఢముగ చెప్పజాలను. కాని యటుల జరిగి యుండవచ్చునని యూహించుటకు తావున్నది."

"చెప్పుము. మాతము. ఎవరిని మీ రనుమానించుచున్నారు?"

"విశారదుని విడచి మిగిలిన మువ్వురు గుమాస్తాలనుగురించియు సావకాశముగ పరిశీలన చేసితిని. కాని వారి విషయమున ననుమానాస్పదములగు కారణము లెవ్వియు బయల్పడ లేదు. వారు నిర్దోషులని నా నిశ్చితాభిప్రాయము. నీవు నన్ను నమ్మవచ్చును. — ఇక విశారదుడు మాత్రము మిగిలియున్నాడు. అతని విషయమునందే నేడు మీతో నేను ప్రసంగింప దలచితిని."

ప్రఫుల్లుడు విస్ఫారితనయనములతో రఘునాథుని ముఖలక్షణముల తరచి చూచెను.

"విశారదునిపై ననుమానమునకు తావు లేదని మీరు మొదటనుండియు ననుచుండిరి. నేను నట్లే తలచితిని. ఆతడపహరించుట అసంభవమని మీరు నొక్కి చెప్పితిరి. ఆయన మీ వద్ద పెక్కు సంవత్సరములనుండి పని చేయుచున్నాడు. ఆతని సౌశీల్యమును, ధర్మప్రవర్తనమును మీ రీ వివరలోనే పరీక్షించియుండిరి. నాకును అట్టి విశ్వాసమే యుండెను. కాని అతడు మీవద్ద కొలువునకు కుదురుటకు పూర్వమెచ్చటనుండెనో, యేమిచేయుచుండెనో నాకు నుంతేనియు దెలియలేదు. ఆసమయమునందే అతడు జీవితరంగమున ప్రవేశించినటుల తోచుచుండెను. అయినను, విశారదుని విడచి అన్యపురుషుల గొందరిని గురించి ముందుగ ముచ్చటింతము."

రఘునాథుడు విరమించెను. కాని ప్రఫుల్లుడు మాటాడక నింకను వినవలెనను కుతూహలముతో కూర్చుండెను. రఘునాథుడు మరల చెప్ప దొడగెను.

"నలందా నగరమున ప్రేమచందు, లాల్ చందు అను నిద్దరు మార్వారీ వర్తకులు నివ

ష్టిగ వస్త్ర వ్యాపారము చేయుచుండిరి. వారు ఋణగ్రస్తులమీద నన్యాయముజరిపి యెరుగరు. ధర్మశాస్త్ర ప్రవర్తకులగుటవలన వ్యాపారము వృద్ధి నొందుచుండెను. ప్రేమచందు తండ్రి గతించిన పిమ్మట వ్యాపారమునం దడుగుపెట్టి నాడు. ఇప్పుడిరువదియేండ్ల వయసువాడు. లాల్ చందు వృద్ధుడు అవివాహితుడు. రామచందను నొక మూడవ చుట్టమును చేరదీసి, కంటికి రెప్ప వలె నాదరించుచుండెను. ఆతడానందమయుడనియు సరసుడనియు ప్రజలనుకొందురు. గాని ఆదాయమును మించిన వ్యయమొనర్చునని యెరుగరు. అతనికి మాసమునకు నూరు రూప్యములు వేతనము. అంతకు మించి రెండు వందలాతడు వెచ్చించుచుండును. కావుననే, త్వరలో గష్టముల పాల్పడిరనుటలో నాశ్చర్యము లేదు? ప్రశ్నకర్తా! మీయభిప్రాయమేమి!”

“నిశ్చయమే!”

“వారి వద్దనున్న గుమాస్తాలలో వాసుదేవుడనువాడొకడు, యౌవనుడు, న్యాయపక్షావలంబి, చక్కని తెలివితేటలు గలవాడు. అతనికి రామచంద్రునకును గాఢమగు స్నేహము. వాసుదేవు డెంతవరకు నిందార్హుడో నేను చెప్పలేను గాని, రామచందు ఋణబాధ విముక్తికై యొక యుక్తిరమును సృష్టించి, వ్యాపారముపేరుచెప్పి యైదువందల రూప్యముల నపహరించినపుడు వాసుదేవునిపై గూడ ననుమానము కలిగెను. మీరాతని పృచ్ఛించినయెడల నిష్కారణముగ దనపై నింద మోపిరని యనును. ఇటుల ప్రత్యక్షముగ ననియుండెను. కాని ఆసొమ్ము నతడు తనచేతిమీదుగా నిచ్చియుండుటచేత, నతడే ఆయిద్దరిలో నికృష్టుడని యనుమానము కలిగెను. ఈ మోసము బయల్పడగనే రామచందు పరారియయ్యెను. ఆమరునాడు, శనివారమున, స్వగౌరవసంరక్షణార్థము వాసుదేవుడు లాల్ చందువద్దకేగి, రామచందుయొక్క దుర్వ్యయోద్యమములు సంపూర్ణముగ నెరిగించెను. వృద్ధుడగు లాల్ చందు అనంగుమనుమని వియోగమువలన చింతాక్రాంతుడై ప్రాణముల బాసెను.”

“ఏమీ! ప్రాణములబాసెనా?”

“అవును. నిశ్చయమే. రామచందు ఆధునికయువకులలో నుత్తమోత్తముడనియు నసమాన ప్రజ్ఞావంతుడనియు నమ్మిన లాల్ చందు ఆతని దుష్ప్రవర్తనమును, పరదేశగమనమును తెలిసికొనినంతనే గుండెలు బ్రద్దలై ఆరాత్రికే మరణించెను. ఆమరునాడు – ఆదివారమున, వాసుదేవుడు పరారియయ్యెను. రామచందు ఉత్తర హిందూస్థానమునకు పారిపోయెనని ప్రజలనుకొనిరి. ఆయిద్దరును దోషులని తలచిరి. వారిని వెదకిరి., చేరువనున్న నగరములకు చారులనంపిరి, కాని వారు పట్టుబడలేదు. సహృదయుడగు ప్రేమచందు ఆదియందు కలిగిన యాగ్రహము నణచుకొని, పరలోకగతుడగు లాల్ చందుపై గల యభిమానముచే రామచందుపై పగదీర్చుకొన దలపలేదు. ఏదియెట్లయినను రామచందిపుడు ఢిల్లీనగరమున నిరంతరాయముగ వ్యాపారమును జరుపుకొనుచు కుశలముగ నున్నాడు.”

“ఇక నారెండవ వాడు - వాసుదేవుడో?”

“ఆ! అతని విషయమునకే వచ్చుచున్నాను. వాసుదేవు డతనివెంటబడి పోయినట్లు యగపడదు. వృద్ధలాల్ చందు మరణించుటవలనను ప్రేమచందు తన్ను క్షమింపడని తెలియుటచేతను అత నొకమారుపేరు పెట్టుకొని, మాయవెంట్రు

కలను గడ్డమును ధరించి, ఒకసంచిలో వస్త్రపు సంచి యందు గొన్ని వస్తువుల నుంచుకొని యెవ్వరికిని గనపడకుండ నలందానగరమునుండి పారిపోయెను. ప్రఫుల్లచంద్రా! ఆతడు చంద్రనగరమునకేగి యట పతంజలియను పేర సంచరించెను."

ప్రఫుల్లుఁ డాశ్చర్యచకితుఁడయ్యెను. అంతవరకు నాతఁడు సావధానముగ వినుచున్నను ఆకథ యందు బిసక్తిలేనివానివలె జూపట్టుచు, ప్రశాంతముగ కూర్చుండియుండెను.

"ఆర్యా! నమ్మతము. పతంజలియే సుధాకరామాత్యుని మరణకాలమున భైరవి యింటి యందు బసచేసి యున్నవాఁడు; ఆహత్యకు గారకుఁడని యనుమానింపబడినవాఁడు ఈపతంజలి లేక వాసుదేవుఁడు–ఈరెంటిలో మీరిచ్చు నిచ్చిన పేరున నాతని బిలువుడు. ప్రస్తుతము మీరు వ్యవహారవిషయముల చేయుచున్న శారదుని యపరావతారమే!"

"కాదు. కాదు" అని ప్రఫుల్లుఁ డరచెను.

"అవును అని నేను చెప్పుచున్నాను. ఇరువురు నొకటియే."

---

# మధు ప్రకృతి.

ప్రభల రామబ్రహ్మానందంగారు, యువకవిమండలి

మాటిమాటికి నీస్మృతి మనమునఁదుఁ
దలపులకు బ్రాకి నీహస్తముల నివాస
మైన వేణువును, మధుర గానమందు
పులకరించు పరిబ్రహ్మ విలసనములు,
కనులగట్టుచు నిలచెను – వనులలోని
చిగురు మెత్తని తలపుల వగరురసము
వో! కళిందజాశ్రిత మధుశీకరముల
ప్రతిఫలించినవయ్య నీభావరుచులు.
అచట నా తమాలతరువు లల్లుకొనిన
నీలినీడల, గగురించు పూలపాట
బాడుచో నీవు – అరమూత వడిన బాల
గోపకు హృదయాశ్రిత మధుర కుసుమమచట
జారిపడినది – నిలువెల్ల చలనమొందె
కిసలయములును కోమల ప్రసవములును
మృదుల రాగానమెల్ల ద్రవించిపోయి
వేనవేలు రాధలు పుట్టి విధగణాల
పలుకరించె ప్రేమము నాల్గుచెంగులంగ.

2

కనులమూసితి నీరవ గర్భగీతు
తెడఁదడఁదడి సేసినవి – విడివడనిగాన
రావము, పరుగులకు నందరాని తలిరు
మెరుపుల తళతళ, నభపు మినుకుచుక్క
గుసగుసలు నన్ను నాయెద వశముపరచు
కొనియెను కిశోరమూర్తిని వనములెల్లఁ
జిగురులెత్తగ గానము జేసి చేసి
గజ్జెఘల్లుల పాలరేగల విలాస
నేత్రముల నృత్యములు సేసి, నిరత రాధి
కా ప్రణయహస్తములలో గనులుమూసి
సొమ్మసిలినాను;
మందారసుమమునుండి
షట్పదపు వెచ్చనయిన నిస్వనము ప్రబలి
శీతలానిల వీచికా శీతమగుచు
నన్ను మెలమెల్లదాకె;
నాకన్నులందు
విన్నదనమును అధఃగ వెరపులేని
సిగ్గుపులక దొంతరమేన, చిమ్మచీక
టులు జగాన నిండెను.

# వివిధ విషయములు

## సన్మానము,

ఎవరైనను తమ యింటికి వచ్చునప్పుడు ఆయా దేశస్థు లీక్రిందివిధముగ నెదుట ప్రశ్నింతురు

**అమెరికా:—** ఎట్లా వున్నారు?

**ఇంగ్లాండు:—** మీ రెవరు?

**ఇండియా:—** దయచేయండి. తమ రేపనినుండి వచ్చారు?

## నష్టము.

ప్రతి సంవత్సరము నవజనులు, అర్థనవజనులు రాపిడి మూలమున 8000 పౌనులు నష్టము బ్రిటిష్ ట్రెజరీ భరించు చున్నదట.

## కెనడా దేశము,

కెనడాదేశ మత్యంత త్వరితముగ నభివృద్ధి గాంచు చున్నది. పట్టణము లమితముగ పెరుగుచున్నవి. పారి శ్రామిక సంస్థలకు మితిలేదు. పనిపాటులు లేకపోవుట యనునది లేదు. బ్రిటిష్ దేశవాసు లీదేశమునుండి చాల సరుకులను దిగుమతి చేసుకొనుచుండిరి. కాని అచట గనులపనివాండ్ర సమ్మెకు ఫలితముగ యిచటి దిగుమతులు తగ్గినవి. అయినప్పటికిని కెనడా దేశవాసు లితర దేశముల నుండి ఆర్డర్ల నధికముగ తెచ్చుకొనిరి. ఇందుకు సహకార వాణిజ్యము కారణభూతమైయున్నది. ఇట్లు వ్యాపించి యున్న పూల్ విధానము (Pool system) ఐరోపాలో వరుసగ గాన్పించును. ఇచట పండు గోధుమలను సహ కార సంఘములద్వారా అమ్ముకొనుచుందురు. ఈపూల్ వ్యాపారము 1825 లో 75 కోట్లరూపాయలు. ఈపూల్ విధానమువలన సరకుల ధరలకు స్థిరత్వ మేర్పడి ఒడుదుడుకులు లేకున్నవి. గడిచిన 5 సంవత్సరములలో వ్యాపారపు దివాలాలు తగ్గినవి.

## భేదము.

పనిపాటులు చేసి జీవనమును చేయు బాలికలు కళా శాలలలో చదువు బాలికలకంటె, యెత్తులోను తూకము లోను బలములోను యెక్కువగ నుందురని కొలతలు మూలమున నిర్ణయించిరి.

## మందము.

మానవుని అరచేయి చర్మము కనురెప్ప చర్మముకంటె 76 రెట్లు మంద ముండునట.

## మూఢభక్తి.

పాశ్చాత్యులు వివాహములలో భార్యాభర్తలు ఉంగ రములు మార్చుకొనుచుందురు. ఈ ఉంగరములను ముం చిననీటితో దృష్టి లోపముపోవునని స్పెయిన్ దేశవాసులు నమ్ముదురట.

## చెట్లు.

హవాయిద్వీపులలో 700 రకముల చెట్లు కలవని వృక్షశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఈ దీవులు జనసమూహ మునకు దూరముగ నెచటనో యుండుటచే వృక్షములు నాశనము కాకుండ యుండినవట.

## జర్మనీ.

గత యేడు సంవత్సరములలో జర్మనీదేశము 44000 విమానములను 28469 పెట్రోలు మోటారులను, 10000 మెషీను ఫిరంగులను నాశనము చేయవలసినదిగ అంతర్జా తీయ మిలిటరీ కమిషనువారు వుత్తరువు లిచ్చిరట.

## సామ్రాజ్య శాసనసభలు,

సామ్రాజ్య శాసన సభలు మొన్న సమావేశములో చేసిన పనులు (1) ఆర్థికచట్టము లెక్కలేని స్వల్ప మార్పు లతో నంగీకరింపబడినది. (2) మారకము చట్టము అంగీ కరింపబడినది. (3) ఉక్కుసంరక్షణ చట్టము ఆమోదింప బడినది. (4) రిజర్వుబ్యాంకు విధానమును జాయింటుకమి టీకి రిఫరు చేసిరి. ప్రభుత్వమువారు 19 పర్యాయములు గెలుపొంది 17 పర్యాయములు వోడిపోయిరి. ఈ 19 గెలుపులలోను వీరికి వచ్చిన వోట్లు 1834 17 పర్యాయ

ముల కిటుమిలోను వీరికి పోయిన వోట్లు 1776 కనుక యీపక్ష్యము ప్రభుత్వమునకే విజయము చేకూరినది

### హిండెన్ బర్గ్

జర్మనీలో ప్రెసిడెంటు హిండెన్‌బర్గుగారికి సంవత్సరమునకు రు 45 000 లు జీతమును, 90,000 రూపాయలు ప్రెసిడెంటుగారికి భత్యమువగయిరా ఖర్చులకును ప్రత్యేకింపబడుచున్నవి మరి 56 250 రూపాయలు తమయిష్టం వచ్చిన ధర్మములకు చేయుటకుగాను హిండెన్ బర్గుగారికి ప్రత్యేకించిరి.

### హిందు దేశములో విద్య.

| రాష్ట్రము | నూటికి చదువుకున్న వారి సంఖ్య |
|---|---|
| మధ్యరాష్ట్రములు | 4.3 |
| బ్రిటిష్ ఇండియా | 6.5 |
| బరోడా | 14.4 |
| కొచ్చిన్ | 21.6 |
| తిరువాన్కూరు | 28.0 |
| బర్మా | 31.1 |

### స్త్రీల యభివృద్ధి.

మదరాసు రాజధానిలో శాసన సభలకు స్త్రీ వోటర్ల సంఖ్య 116 536 గత యెన్నికలలో వోటు చేసినవారి సంఖ్య నూటికి 19.3 1923 లో జరిగిన యెన్నికలలో వోట్లిచ్చిన స్త్రీల సంఖ్య నూటికి 11.36. మదరాసు శాసనసభకు ఉపాధ్యక్షులు స్త్రీ, శ్రీమతి ముద్దులక్ష్మమ్మ అమ్మాళ్. మదరాసు విశ్వవిద్యాలయపు సెనెటులో అయిదుగురు స్త్రీసభ్యులు గలరు.

టర్కీలో ఆరోగ్యబోర్డుకు అధిపతి బెద్రీహానూం అను స్త్రీ.

బ్రిటిష్ యిండియాలో స్త్రీల విషయమై ప్రభుత్వము వారు తటస్థముగనున్నను, సామంత రాష్ట్రములలో ననేక సంస్కరణలు ప్రతిపాదింప బడుచున్నవి. బరోడాలో 20 సంవత్సరములనుండి ఆచరణయందున్న బాల్య వివాహముల నెట్లు ఆపవలెనో శిఫారసులు సూచించుటకు ఒకసంఘ మేర్పాటుచేసిరి భరతపూర్ సంస్థానాధీశ్వరుడు బాల్య వివాహములను నిషేధించెను. తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రములలో, స్త్రీలకు శాసనసభ వోట్లుగలవు. శాసన సభ్యురాండ్రు కావచ్చును. తిరువాన్కూరులో ఒక స్త్రీ కార్యనిర్వాహక శాఖయందు కూడ సభ్యురాలే. మైసూరులో నీపద్ధతి మొన్ననే అంగీకరింపబడినది.

ఉద్యోగములు వోట్లు అభివృద్ధి సూచకములైనయెడల స్త్రీల యభివృద్ధి బాగుగ నున్నదనియే నుడువవచ్చును.

### చైనా.

చైనాలో హాంకాంగు గవర్నరు బాల్య వివాహములను నిషేధించుచు వుత్తరువు జారీచేసెను. 18 సంవత్సరములలోపు వయసుగల పిల్లవాడుకాని, 16 సంవత్సరముల లోపు వయస్సుగల పిల్లగాని వివాహము చేసుకొనరాదు.

### వజ్రము.

ప్రపంచములోనికెల్ల విలువగలిగిన కోహినూరువజ్రము పంచమ జార్జిచక్రవర్తిగారి కిరీటములోనున్నది. న్యూయార్కు నగల వర్తకుని అంగడిలో కోహినూరు వజ్రమునకు తరువాత స్థానము నాక్రమించు హిందుదేశ వజ్రమొకటి యున్నది. దీనినిమాసక్ వజ్రమందురు. వారన్ హేస్టింగ్సు యీ వజ్రమును యిండియానుండి ఇంగ్లాండునకు తీసుకు వెళ్ళెనట న్యూయార్కు నగలవర్తకు డీరాయిని వెల్లు మినిస్టరు డ్యూక్ వద్దనుండి కొనెను. ధర తెలియదు. 1831 లో లండను నగలవర్తకు డొకడు దీనిని షుమారు రు 21600 లకు కొనెను. 1911లో దీనివిలువ రు 444000 లుగ లెక్కకట్టబడెను. ఇపుడు దీనివిలువ 1200000 రూపాయ లుండునట, ఇప్పటి వజ్రముల హెచ్చుధర దీనియొక్క అనన్యమైన చరిత్ర దీని బరువునుబట్టి ధరను నిర్ణయించిరి దీనిబరువు 79 కారట్లు.

### ప్రకటన.

ప్రకటనలవలన చాల లాభముకలదు. ఇరవైయేండ్ల క్రింద మనిషి ఒకటింటికి ఒకసిగరెట్టు కాల్చగా యిపుడు మనిషి ఒకటింటికి 3 వంతున కాల్చుచున్నాడు. ఇది యంతయు ప్రకటనల ఫలితమే.

### వితరణము.

ఒక పిచ్చి ఆస్పత్రికి మార్సెలస్ నగర న్యాయవాది పాతిక వేల రూపాయలను దానముచేయుచు విల్లులో నిట్లు వ్రాసెను. "వ్యాజ్యాలలో మునిగి తేలి కొట్టుకొను వారినుండి యీ పాతిక వేలను సంపాదించితిని. వీరునూ దులు. కనుక వీరివలన వచ్చిన డబ్బు పిచ్చి ఆస్పత్రికే యిచ్చుచున్నాను."

# విమర్శనలు

## తొలిపలుకు.

మా నవ సంకల్పమునకును విధాతృ నిర్ణయమునకు నత్యంత వ్యత్యాసము. కాని కాలమతివేగముగ దొర్లుచున్నది. మా పత్రికా జీవితము నందొక వత్సరము గడచినది. ప్రథమసంకల్పములును తుదిఫలితములు నవలోకించినపుడు సంతసించుటకుగాని పరితపించుటకుగాని అవకాశములేదు. ఈ వత్సర కాలమున పత్రికా ప్రపంచమున గలిగిన ఒడుదుడుకులను గమనించినపుడు లోపాలోపములకు వగవ బనిలేదు. పత్రికలయొక్క అస్థిరతప్రజలలో నలజడి కలుగచేసినను నిరంతరాయముగ నొక వత్సరమును గడపగలిగిన మాకాంధ్రలోకము పరిపూర్ణ సానుభూతి చూపగలదని మా విశ్వాసము. ఈవత్సర కాలమున దేశమునకుగాని భాషకుగాని మావలన నేమైన మేలొనగూడినచో నది మా స్వయం కృషి ఫలితమని గర్వింపము. పండితులు ధనవంతులు మిత్రబృందము మాకొసగిన సహాయమును మరవజాలము. ఇంతటి ప్రోత్సాహముతో ద్వితీయ వత్సరమున జొరబడి ఆంధ్రలోకమునకు ప్రణామము లాచరించుచున్నాము.

మా ప్రథమోద్దేశములలో కొన్ని నెరవేర జాలినందుకు విచారించెదము. కారణాంతరములచే నవలను పూర్తిగ ప్రకటింప జాలక పోతిమి. మా నవలను సాంతముగ నీమాసము నుంచి ప్రకటించెదమని విన్నవించుకొనుచున్నారము. ఈనవలానంతరమత్యద్భుతమగు "పద్మరహము"ను భావపూరితమగునవలను ప్రకటించెదము.

ప్రతి వ్యాసమునకును డబ్బులో విలువగట్టు యీ దినములలో, ప్రతి ఫలాపేక్ష రహితముగ మాకు తోడ్పడిన వ్యాసరచయితలకు వందనములు; మాయుద్యమమునకు తోడ్పడిన పోషకులకు చందాదారులకు కృతజ్ఞతను వెలిబుచ్చుచు ముందుకును మాకెల్ల విధముల తోడ్పడ ప్రార్థించుచున్నారము.

## ఉగాది సంచికలు.

ప్రతి ఉగాదికిని ఆంధ్రదేశమున కర్పింపబడు కానుకలలో నగ్రస్థానములు వహించునవి "ఆంధ్రపత్రిక ఉగాది సంచిక" "బొంబాయి తెలుగు సమాచార్ ఉగాది సంచిక." ప్రభవ సంవత్సరాదిని వెలువడిన యీసంచిక ద్వయమును కృతజ్ఞతా పూర్వకముగ గైకొనుచున్నారము.

ఆంధ్రుల చారిత్రమును, ప్రస్తుత ఆచార వ్యవహార సాంప్రదాయములను చాటుటలో నీ రెండు నొకదాని నొకటి మించుచున్నవి. ఆంధ్రభాష నభ్యసించినవారిలో నమిత ప్రచారము చేయునది ఆంధ్రపత్రిక సంచికయు, రాష్ట్రేతర భారతీయులలో ప్రచారము సల్పునది రెండవదియునై యున్నవి. సాంవత్సరిక భారత దేశ వృత్తాంతములను, ప్రపంచ పరిణామమును

రెండత్యద్భుతముగ చాటుచున్నవి. రెండును ఆంధ్రకవితా ప్రపంచమున కగ్రస్థానమిచ్చినవి. బొంబాయి సమాచార్ సంచిక ఆంధ్రదేశ జమీందారులను గురించియు, పండితులను గురించియు, పత్రికలను గురించియు సంపూర్ణముగ వివరించి యున్నది. ఇందలి ఉమర్ ఆలీషాకవి గారి “ రాధేయుడు ” అను నాటకమును పఠించియే తీరవలెను. మూడు భాషలలో సంగ్రంథమును ముద్రింపించి వెలువడించిన సుప్రసిద్ధాంధ్రులు బొంబాయి వాస్తవ్యులు శంకర శాయన్న వర్మగారి నెంతయు నభినందించు చున్నాము. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక, భారతి, ఉగాది సంచికలద్వారా చేయుచున్న ఆంధ్రదేశ భాషా విషయక సేవ యెంతయు నమూల్యము. ఈ రెండు పత్రికలును చిరకాలము వర్ధిల్లునుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాము.

## రాష్ట్రీయ కప్పములు.

భారతదేశ ఆర్థికసభ్యుడు బడ్జెటులో నిల్వ చూపి, ఈనిల్వను రాష్ట్రకప్పములను తగ్గించుటకు వినియోగపర్చదలచెను. రాష్ట్రీయ ప్రభుత్వములు సెంట్రల్ గవర్నమెంటుకు తక్కువ కప్పము కట్టి డబ్బుమిగిల్చేయెడల, అభివృద్ధి కార్యములకు డబ్బుమిగులును కనుక ఈయాసనుచూపి, బడ్జెటును అంగీకరింపచేయుచున్నాడు. కనుక యీయాసను పునాదిగవైచి, మారకపు ధరను తారుమారు చేయగల్గెను. ఈరాష్ట్రీయ కప్పములు తగ్గించమనినపుడెల్లను, ఆర్థికసభ్యు డేదిరెటా యొక భయమును చూపుచునేయుం నను. పోస్టుకార్డులకు తగ్గించమనినచో, ప్రభుత్వపు ఆదాయము తగ్గును. ఆ ఆదాయము తగ్గును కనుక రాష్ట్రీయ కప్పము తగ్గదని భయపెట్టెను. ఉప్పుపన్ను తగ్గించమనినపుడు నిదియే భయము. పిడుగునకు బియ్యమునకు ఒకటే మంత్రము.

## నిరాశ.

ఈ పరిస్థితులన్నిటి నవలోకించినచో, నిరాశ జనించుచున్నది. శ్రీనివాస అయ్యంగారికి మొఖము మొత్తినది. జయకరుగారు కొంకనారి అవుదు మనిరి. నిరాశ సంజనితమగు గంభీరోపన్యాసము నొసగి ద్వంద్వ ప్రభుత్వమును గడుసు పెళ్ళాముతో పోల్చిరి. “ చూడండీ, మీరాజీతంలో వందరూపాయలు మిగల్చి కొని పిల్లలను సంసారమును పోషించండి. మిగతా 200 తీసికొని నాగుజ్జులకు నాగలకు ఖర్చుపెట్టు కుంటాను. నౌకర్లపై అధికారమునాది. ఈవిధముగ సంసారము గడుపుదాము ” అని గడుసు పెండ్లాము అన్నట్లుగ రాష్ట్రీయములలో ద్వంద్వ ప్రభుత్వములున్నవని జయకరుగారు నుడివిరి. రిజర్వు శాఖకు యెక్కువ ధనము ఖర్చుపెట్టబడుచున్నది. ప్రజాయత్త శాఖకు తక్కువ. ఈ రెండును కలిసి ప్రభుత్వ సంసారమగుచున్నది. ప్రభుత్వ విధానముయొక్క నిరంకుశత్వమునకు నిస్పృహ చెంది జయకరుగారు నుడివిన వాక్యముల నాలింపుడు “ ఈశాసన సభకు నిజ స్వరూపములేదు. ఈ ప్రభుత్వమున కడ్డులేదు. ప్రతి సంవత్సరము రాచకీయ సంబంధమైన మా యాత్రలవలన ప్రయోజనమేమి ? అంత్యదశ వచ్చినది. ప్రభు

త్వానివారు దోసిలొగ్గనియెడల, మేము తిరిగి యొక పక్షమునవలంబించి ప్రభుత్వమును వంగదేశమునుండి యత్నించవలసియుండును. మేము దుర్బలులమగుటవలనను, చీలిపోవుటవలన మాకు శక్తిలేదని మాకు తెలియును. దుర్బలులని యొక్క ఆగ్రహమేమి చేయగలదో యూహింపుడు. మీ పద్ధతులను మార్చుకొననియెడల, పరిస్థితులు విషమించును” అని జయకరు గద్గదస్వరముతో పలికెను. వంగదేశ రాజకీయ ఖైదీలను విడుదలలేదు. సంస్కరణ విషయములో బర్కెన్‌హెడ్డు ప్రభువు చూపుచున్న నిర్లక్ష్యము వర్ణనాతీతము. ఇప్పటికైనను నాయకులందరేకీభవించి, ప్రభుత్వ సంస్థల విడనాడి, నిర్మాణ కార్యక్రమమునకు దలపెట్టుచో లాభమేమైన నుండునుగాని, శాసన సభలవలన నిసుమంతైన ప్రయోజనము కాన్పించదు.

## సంచలనము.

శ్రీనివాసయ్యంగారి నిరాలాపములు లోకవంచ తాండవమాడుచుండ, ఇండియన్ నేషనల్ హెరాల్డుపత్రికా సంపాదకులగు బి. జి. హార్నిమన్‌గారు స్వరాజ్యపక్ష దాంభికత్వమును, వాగ్దానభంగమును ఘంటాపథముగ ఖండించిరి. కేంద్ర రాష్ట్రీయసభయందు దొసగిన వీరి యధ్యక్షోపన్యాసము, మదరాసు బీచ్‌లో వీరు కావించిన ప్రసంగము పలువురు స్వరాజ్యవాదులలో సంచలనము గలుగజేసినవి. మంత్రివర్గములను కూలదోయుదుమనెడి స్వరాజ్యపక్షవాదుల వాగ్దానమును మదరాసుపక్షమువారెట్లు కూలదోసినదియు మనకెల్లరకి విదితమే. మదరాసులో జస్టిస్‌పక్ష ప్రాబల్యముచే పెచ్చు పెరిగిన వర్ణవైషమ్యములను వీరు క్షమాపణగ జూపుచున్నారు. ఇది ద్రోహమనియు, స్వల్ప కారణములతో వోటర్లకు గావించిన వాగ్దానములను భంగపుచ్చరాదనియు హార్నిమన్‌గారు విస్పష్టముగ పలికెను. మదరాసులో స్వరాజ్యపక్ష మిట్లునది.

వంగరాష్ట్రములో పరిస్థితులను గమనింతము. ఇచటను శాసన సభావ్యామోహము నశించినది. ఇచట రాష్ట్రీయ సభాధ్యక్షులు కార్యక్రమమంతయు శాసన సభలకు వెలుపలనే జరుగవలెనని నుడివియున్నారు. దేశబంధు దాసుగారి మరణానంతరము స్వరాజ్యపక్ష కలిమియిక పటుత్వము తగ్గినమాట వాస్తవము. ఇది యిట్లుండగా, స్వరాజ్యపక్షములో నొకరొకరిపయి ద్వేషములునిందారోపణలు వ్యాజ్యములు బ్రబలుచున్నవి. దేశ స్వాతంత్ర్యము కొరకు బద్ధకంకణులై రణరంగములోనికి దూకిన మహానాయకులలో నంతఃకలహములు ప్రారంభించుట మన దురదృష్టమనవచ్చును. కనుక స్వరాజ్యపక్ష కార్యక్రమమును పునర్విమర్శించి దేశీయుల నందరి నేకీభవింపజేయు అసహాయోద్యమ కార్యక్రమము నొక దానిని తయారుచేయుటయో, లేక ఉన్న కార్యక్రమమును సవరణ చేయుటయో జరుగవలసియున్నది.

సహాయ నిరాకరణ సూత్రములను వీడి, ప్రభుత్వమున కొకవిధమగు తోడ్పాటు నొసంగుచుంటిమని శ్రీనివాసఅయ్యంగారే నుడివినపుడు, దేశీయ నాయకుల దౌర్బల్యమును గురించి వేరుగ వ్రాయ నవసరము లేదు. ఈ సమయములో సరియయిన నాయకత్వము కావలెను.

హక్కుల నొసంగెదమని బాల్డ్విన్ మంత్రి వాగ్దానము నొసంగెను. అధికారములోనికి వచ్చిన పిమ్మట నీవిషయమును మరచిపోయిరి. ఇంగ్లాండులో నచిరకాలములో పార్లమెంటు యెన్నికలు జరుగనున్నవి. ఆనాటికి స్త్రీలకు కావించిన వాగ్దానము చెల్లింపనియెడల, తమ పార్టీకి నష్టము కలుగవచ్చునని బాల్డ్విన్ పక్షము యొక్క అభిప్రాయము. స్త్రీలకు సమానపు హక్కుల నొసగినచో, ప్రజానురంజకత్వమును పొంది కార్మికపక్షముతో నీస్త్రీలు చేరి తమను వోడించెదరేమో అని భయము అధికారములో నున్నవారికి గలదు. కనుక వోట్లునిచ్చినట్లుగ నుంచవలెను, యియ్యనట్లుగను యుండవలెను కనుక రాబోవు పార్లమెంటు సమావేశములో స్త్రీల వోట్ల నధికము చేయుచు బిల్లు ప్రతిపాదించెయెడల, యీ శాసన మంగీకారమగునంతకి యేడాదిపట్టును. ఈలోపల పార్లమెంటుయెన్నికలు జరిగినయెడల మరి యేడేండ్లవరకు కాంసర్వేటివులు నిర్భయముగ పరిపాలింప వచ్చును. స్త్రీలకు వోటిచ్చిన చాలనష్టము కలుగగలదను భయము పాశ్చాత్యుల సైతము విడనాడలేదని యిందువలన తెలియగలదు.

---




మచిలీపట్టణము

సంపుటము ౨ | మే 1927. | సంచిక ౧

## ఒకపంటకాపు — సాయంకాలము

దువ్వూరి రామిరెడ్డిగారు

దినమెల్లఁ గృహ కార్యనిర్వహణ బద్ధీభూతచిత్తుండనై
యినుఁడస్తాద్రి నలంకరింపఁగ విహారేచ్ఛల్ తలల్ సూప బా
వనమై పండినపైరు చేలనడుమఁ బంగరు స్వప్నాలలో
నను దేలాడినయట్లు పోయితి మహానందంబు చేకూరఁగన్.

గూళులకువచ్చు పక్షుల కూజితములు
సంజకెంజాయ గారడి చక్కఁదనముఁ
వరుల వినవచ్చు కీటకావ్యక్తగీతి
కాపువానిని సైతము కవినొనర్చు!

ఆపొలంబొక దేవాలయంబొ యనఁగ
హృదయము ప్రశాంతమై చింతలెల్లఁ బాసె
ప్రకృతి సౌందర్యగరిమ నన్ బందిసేయ
నోరులేని పూజారినై యూరకుంటి.

చిలుకలదంతు కింకృతులుసేయుచు మామిడియాకు తోరణం
బులు చదల్లల గట్టినటుమూఁగి, చివుక్కునఁ గ్రాలి, దోర కం
కులఁ దమ నోటఁబెట్టికొని గూళులకుం గొనిపోవుచుండ; సం
చలనములేని నామనము సందడి చప్పటికుల్కి మేల్కనెన్

ఫలనష్టం బగుచున్నదన్న తలఁపులే భావ బుఁగుందింప చి
ల్కలసౌందర్యము, వానిస్వేచ్ఛ మదవాక్కర్ణ ప్రియత్వంబునుం
బలుకన్ శక్యముగాని సమ్మదము గూర్పన్, రెంటికిం జిక్కి యా
కులమై చిత్తము తోఁచితోఁపక యటం గూర్చుంటి ముగ్ధుడనై.

కాపువానికిఁ గలికి సస్యశ్యామ భూమి
యయ్యె హృదయంబు; కొంతసేపైన వెనక
కవియెమీఁదయ్యెఁ, గ్రిందయ్యెఁ గర్షకుండు!
తారలుదయింప నింటికి దరలిపోయె.

# దుఃఖమయ ప్రపంచము.

ఎస్. జి. ఆచార్యగారు

ఈ దుఃఖవదనాల
నీ జీర్ణవసనాల
నీ శుష్కదేహాల
నే గాంచ జాల !

౧

కొమ్మబుట్టిన మొగ్గ
ఇమ్ముగా వికసించి
కమ్మతావుల జిమ్మి
సమ్మదము నొసగవలె,—
అటుగాక యిటులౌట
అదియేటి న్యాయమో !
కలతనొందెసీ మనము;
కదలజాలను పదము ॥ ఈ.

౨

గొల్లకృష్ణుని మురళి
చల్లవెన్నెలపాట
నల్లరెక్కల గోర
మెల్లగా పాడవలె,—
అటుగాక కావుమను
టెటువంటి న్యాయమో !
కనులరాలును జలము;
కంపమొందును తనువు ॥ ఈ.

# మొల్ల.

ఆంధ్రి శేషగిరిరావుగారు; (సారస్వత సమాజము)

ఉ॥ తీయని తేనె మాటల నతి ప్రమదంబు జనించునట్లు రా
మాయణమున్ రచించి తన మర్త్యశరీరము వీడియు న్యశః
కాయముతోడ నెల్ల కవికాండము సన్నుతులీయ నాంధ్రిలో
కాయతనంబు నన్వెలయుచుట్టి పవిత్రను మొల్ల నెంచెదన్.

—రాపూరి చిట్టి వేంకటసుబ్రహ్మణ్యము, (సారస్వత సమాజము)

కవిత్వము చెప్పిన ఆంధ్రి రమణులలో చరిత్రకు తెలిసినంతవరకు మొల్ల మొదటిది. అక్షరాస్యులైన ఆంధ్రులలో ఆమె రామాయణము ఎఱుగనివారు సకృత్తుగ నుందురు. సుమతిశతకము, వేమనశతకము మొదలగు గ్రంథములతో బాటు మొల్ల రామాయణము ఆంధ్రి జనసామాన్యములో విశేషవ్యాప్తినొందియున్నది.

మొల్ల ఆతుకూరి కేసనసెట్టి తనయ. కేసనసెట్టి కుమ్మరికులమునకు చెందినవాడని జనశ్రుతి. ఆతడు 'గురులింగ జంగమార్చనపరుడు;' 'శివభక్తిరతుడు'; 'బాంధవహితుడు'; విశేషించి విద్యావంతుడు.

తన గ్రంథమున మొల్ల అత్తింటివారి వృత్తాంతమేమియు ప్రస్తావింపలేదు. తుదకు మగని ఊసైన నెత్తలేదు. అట్లగుటనామె బాలవితంతువైయుండునని చరిత్రకారు లూహించిరి. ఇది నిజముకావచ్చును. బాలవితంతువై ఇల్లుపట్టిన తనయకు విద్యాప్రియుడైన కేసనసెట్టి విద్యాబుద్ధులు నేర్పియుండవచ్చును. తనకు తండ్రియు ఒజ్జయునగుటచే కేసనసెట్టిని మొల్ల తన రామాయణమున 'గురుడని పేర్కొన్నది.

మొల్ల నివాస స్థానము గోపవరమున అచట వెలసియున్న శ్రీకంఠ మల్లేశుని వరముచేత కవిత్వము నేర్చికొంటినని మొల్ల తన రామాయణమున వ్రాసికొనియున్నది.

మొల్ల కాలనిర్ణయ మొనర్చుటకు ఆధారములు సరియైనవి లేవు. ఆమె పూర్వకవిస్తుతిలో శ్రీనాథుని తుదిగా తత్పూర్వులను మాత్రము పేర్కొనియుండుటచే శ్రీనాథునకు తరువాతిదియని తెలియుచున్నది. కృష్ణదేవరాయలకు పిదపనున్న లాక్షణికులు కొందఱు ఆమె రామాయణమునుండి ఉదాహరణము లెత్తికొనిరి. ఇట్లగుట నామె కృష్ణదేవరాయలకు సమకాలీనయను జన వాక్యము నిజమని నమ్ముటకు ఎడమున్నది.

## మొల్ల భక్తురాలు.

ఉ॥ "మానవకల్పకంబగుచు భుక్తికి ముక్తికి మూలమైనయా
రాజును దైవమైన రఘురాము"...

నుతించి 'పుట్టువుకృతార్థతంబొరయ' జేసికొనుటకే ఆమె రామాయణము రచించినది. మోక్షారాధకులకు అకలంకమగు భక్తియే కాని తదితరములు సాధనములు కావను ఉత్కృష్టనీతిని మొల్ల ఇట్లు చాటుచున్నది.

క॥ నేరిచి పొగడినవారిని
నేరక కొనియాడువారి నిజకృప ననుపం
గారణ మగుటకు భక్తియె
కారణ మగుఁగాని, చదువు కారణమగునే!

మొల్ల ఐహికసంపదల కాసింపని విరాగి. వలయు ధనమిచ్చి తన్ను పోషింప నిచ్ఛగించు చిల్లర రాజలోకమును జేకొనమెచ్చక, ఆమె, 'ఇహపరసాధనమిప్పుణ్య చరిత్ర' మని రామ నరపాలకుని గాథనుపవిత్రమైన ఉద్దేశ్యముతో, వ్రాసిధన్యురాలైనది. ఇందువలన ఆమెకు మోక్షచింతయేగాని ధనచింతలేదని తెలియ నగును. ఈవిషయమున మొల్ల 'మనుజేశ్వరాధముల' కీయనొల్లక 'కైవల్య పదంబు జేరుట కునై' భాగవతము రచించిన మహాకవి, మహా భక్తుడునైన పోతరాజును తలపించుచున్నది.

మొల్ల వినయావతి. తాను సహజ వినత కవితాచమత్కార, యయ్యు ఆమె వినయావతి యగుటచే తన గ్రంథమున కవి నిందచేయ లేదు. తనకు పూర్వము ఆంధ్ర సారస్వతమున రామాయణములున్నను తాను తిరిగి దానినే వ్రాయదొరకొనుటకు 'ఎందఱెన్నిమాఱులు రాజును దైవమైన రఘురాముని నుతించిన దప్పుగల్గునే?' యని చక్కని ఉపపత్తి వినమ్రమై నివేదించినది. స్త్రీజాతికి, కుమ్మరి కులమునకు ఆకాలమున అసాధారణమైన ప్రజ్ఞాపాండిత్యములు తనకడనున్నను మొల్ల పిసరంతైన గర్వము చెందలేదు. మహాకావ్యరచనకు వలయు ప్రౌఢిబలము, దక్షారత్వము, విద్యా సంపత్తి గలిగియుండియు ఆమె

సీ॥ దేశీయపదములు దెనుగులు సాంస్కృతుల్
సంధులు ప్రాజ్ఞ శబ్దపంక్తి
శయ్యలురీతులుఁ జాటు ప్రబంధంబు
లాయాసమాసంబు లర్థములును
భావార్థములుఁ గావ్య పరిపాకములు రస
భావ చమత్కృతుల్ పలుకుసరవి
బహువర్ణములును విభక్తులు ధాతు ల
లంకృతి చ్ఛందోవిలక్షణములుఁ
తే॥ కావ్యసంపద క్రియలు నిఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ......

నని వ్రాసికొనిన తన వినీతభావమును వెల్లడించినది. మొల్ల ఎంతటి విద్యావంతురాలో అంతటి వినయావతి. సజ్జనులగు వారికి విద్య ఇట్టి వినయశీల్యము నొసగునుకదా!

మొల్ల గ్రంథ రచనా ధర్మములు మిగుల మెచ్చదగినవి. ఆమె కాలమున శ్రీనాథుడు నెలకొల్పిన ప్రౌఢదీర్ఘ సమాసాడంబరమును, పోతరాజు పాదుకొల్పిన శబ్దాలంకార ప్రియత్వమును ఆంధ్రకవులను వశంవదులుగ జేసికొని రాజ్యమేలుచుండెను. ఉచితజ్ఞురాలగుటచే మొల్ల ఇట్టి కాలదోషములకు దోసిలియొగ్గలేదు. గ్రంథావతారికయందామె

క॥ మును సంస్కృతముల చేటఁగఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁగ్రమ్మఱ
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే!॥
ఆ॥ తేనెసోక నోరు తీయనయగురీతి
తోడ నర్థమెల్లఁ దోచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగ చెవిటివారి ముచ్చటగును
క॥ కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చిచెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మది కానుపించు విబుధుల కెల్లన్.

అని ఎలుగెత్తి చాటి సులభమైన శైలియే సుందరమైన శైలియని నిర్వచించినది. కేవలము

పాండిత్య ప్రకర్షణాఱకు వ్రాయు శైలియనిన ఆమెకు తెలనొప్పి. పాషాణ శైలిలో వ్రాయ బడిన గ్రంథములు అను నాగరికాభిప్రాయమున మూఁగ చెవిటివారి ముచ్చటలు. ఇట్టి ఉత్కృష్టా దర్శములతో సులభ సుందర శైలిలో గ్రంథరచనము గావించినది. కావుననే ఆమె రామాయణము సర్వాంధ్రలోక సమాదరణీయమై పాలు పారుచున్నది.

మొల్ల తన రామాయణమున కథానివేదనమునకే ప్రాధాన్యమిచ్చినది. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండములందు కథను ఆవేగముతో నడపి తనసంగ్రహనైపుణి వెల్వరించినది. మఱి యింకను సుందర కాండము మొల్ల రచనాకౌశల్యమునకు పిడిదిపట్టు. యుద్ధకాండమన్ననో మొల్ల సంగ్రహనైపుణికి, వర్ణనాచమత్కారమునకు తార్కాణమై తనరుచున్నది.

ఈ రామాయణమున రసవంతములగు ఘట్టములనొకటి రెండు పేర్చి పరామర్శింతుమేని మొల్ల రచనా సామర్థ్యము, భావప్రాగల్భ్యము వెల్లడి యగును. వనగాములగు సీతారామలక్ష్మణులు గంగానదిని దాటునప్పటి

చ॥ సుడిగొని రాము పాదములు సోకిన ధూళి వహించి [ రాయి యే
ర్పడ నొక కాంత యయ్యెనట పన్నగ నీతని [ పాదరేణు వి
య్యెడ వడి నోడ సోకి నిది యేమగునో యని సంశ [ యాత్ముడై
కడిగె గుహుండు రాముపద కంజయుగంబు [ భయమ్ము పెంపునన్ ॥

అనుపద్య మెంతటి మనోహర భావవిలసితమో రసజ్ఞులకు అనుభవపునరుక్తము.

అంగద పరాభవితయైన మండోదరి విలాప వర్ణనమున మొల్ల చదువరుల హృదయములను కలచగల శక్తిని చూపినది. పాతాళహోమాపహ్రియత్నమున విఘ్నము మఱచి యున్న రావణుని చూచి పరాభవ ఖిన్నయైన మండోదరి

మ॥ మయ దైత్యేంద్రునికిన్ దనూజనయి దేవేంద్రు గొప్ప [ నీ పత్నినై
జయ వెట్టింగను నిందజిజ్జననినై సర్వాంగనా [ పూజ్యనై
భయ మెన్నండు నెఱుంగనట్టి నను నిబ్భంగిన్ వనా [ టుండు ని
ర్భయ వృత్తిం దలపట్టి యీడ్వఁ గనుఁగొంటా లైతి [ నీ మంగళా ॥

క॥ రాముని దూతలు నన్నును
బాములు వెట్టంగఁ జూడఁ బండువె నీకున్
నా మానముఁ గాపాడని
నీ మానుష మేటికిపుడు నిర్లజ్జ వైరీ ! ॥

ఉ॥ ఈ ముని వృత్తికన్న దనుజేశ్వర ! రామునితోడ [ నేడు సం
గ్రామము నేసి గెల్చిననఖండరమావిభవంబుగల్గు నా
రాముని చేతఁ జచ్చిన స్థిరంబగు మోక్షము గల్గు నీ కిటై
యేమిటికింత దైన్య మిసి ! యిచ్చఁ దలంపుము [ రాక్షసేశ్వరా ! ॥

అని యెల్లముచ్చి పోనాడిన పలుకులు చదువరుల మనములు కలంపక మానవు.

లక్ష్మణ మూర్ఛావసరమున రాముని విచారము, నిష్ప్రహాకడు నేర్పుతో చిత్రింపబడినవి. సాహాయము చేయవచ్చిన వనచరులను చూచి అప్పుడు రాముడు

చ॥ వినుడు కపీంద్రులార ! పలవింపుచు మజ్జనకుండు [ నాకతమ్మునన్
జనియె; ధరాతనూభవ నిశాచరుచేఁ జెరవోయె; [ నేఁటితో
ననుఁ జూడుఁ డీ జెఱ; నింక యడియాసలనుండుట నాకు [ ధర్మమే
చనుఁడు నిజాశ్రమంబులకు సంశయమొందక [ మీరు గొబ్బునన్ ॥

అని మిక్కిలి విలపించినాడు. శరణు జొచ్చి తన్నే నమ్ముకొనియున్న విభీషణుని కాంచి

ఉ॥ అక్కటనీకునింటఁగలయట్టి సుబాంధవకోటిబాసినీ
వక్కడ దాఁగుడెంచితివహీనముదంబునమమ్మునమ్మి పెం
పెక్కఁగ రావణుండు తెగ నేలెడిలంక గడంగనీకు నే
డక్కఁగ నిత్తునన్ ప్రతిన తప్పె విభీషణనీవుపోవుమా॥

అని వాపోయినాడు. మూర్ఛావివశుఁడై యున్న కూరిమి తమ్ముని తిలకించి

క॥ నీవంటి తోడఁబుట్టువు
నీవంటి గుణోత్తముండు నిజమూహింపన్
భూవలయమందుఁ గలఁడే
భావింపగ నీవెతక్క పావనచరితా!॥

క॥ నిన్నిచట విడిచి పురికిని
జన్నను నినుఁ గన్నతల్లి నను డెంచి ననున్
నిన్నడుగఁ దడవ మదిలో
జిన్నంబోవుచును నేమి చెప్పుదును తండ్రీ!॥

అని నిస్పృహావశమున నిలువున నీరైనాడు. ఈ పద్యములు వజ్రకఠినమైన హృత్పిండమును కూడ చిదిపి కరుణారసమును చిందింపక పోవు.

మొల్ల రామాయణమున మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయము సీత పాత్ర పోషణము. ఆంధ్రకవయిత్రీమతులు చిత్రించిన స్త్రీ పాత్రలలో సీత పాత్ర ఉత్తమమైనది. సీత పాత్రను వర్ణించుటయందే మొల్ల తన ప్రతిభా ప్రాగల్భ్య విశేషములను మెఱపించినది. కరుణారస పూరితమగు సీత పాత్రను వర్ణించునపుడెల్ల మొల్ల సహజ కరుణార్ద్రమగు తన ఆడు హృదయమును వెల్లడి చేసికొన్నది. కంట కాపృత పుష్పసుకుమార గాత్రి సీత ఎట్లభి వర్ణింప బడినదో చూడుడు.

సీ॥ నడువనేరనికొమ్మ యడుగులు పొక్కులై
శర్కరస్థలముల శ్రమము జెందె
వీచిన చేతులు వ్రేళ్లు నెత్తురుగ్రమ్మ
పాటమరుకెంపుల పోల్కినమరె
వడిగాలి సుడివడి వాడిన లేఁదీగ
భావంబునను మేని చేవతఱిగెఁ
బూర్ణచంద్రుని కాంతి పున్నమ వేకువఁ
గన్పట్టుగతి మోము కళలవిడిచె

గీ॥ ధవుని నడుగడుగునకుఁ గైదండఁగొనుచు
నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురుఁ
బెదవు లెండంగ నీడకు సుడిలగొనుచు
మనసులోఁ జేవయూఁతగఁ జనెడు వేళ॥

వికృత వికార స్వరూపములగు రాక్షసమూక నడుమ అశోక వృక్షముక్రింద హనుమంతుడు చూచినపుడు జానకీమహాదేవి స్థితి ఎంత దయనీయముగ వర్ణింపబడినదో కనుడు.

సీ॥ పతిఁబాసినట్టి యాపదకంటెఁ బలుమాఱు
వివిధమాయలచేత వేఁగి వేఁగి
వీరదానవకోటి వికృత వేషంబులు
కనుఁగొని చిత్తంబు గ్రాఁగి గ్రాఁగి
తనదిక్కు లేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోఁగి లోఁగి
కర్ణకఠోరంబుగా నాడు మాటలు
దొరఁగెడి కన్నీటఁ దోఁగి తోఁగి

ఆ॥ రాముఁ దలఁచుకొంచు రామునిఁ జేర్కొంచు
రామ! రామ! యనుచు రమణి వలుకఁ
గపివరుండు చూచి కామినీరత్నంబు
సీతయనుచుఁ బొంగెఁ జిత్తమందు॥

సీత రావణుల సంభాషణ ఘట్టమున మొల్ల మెలకువతో సీత పాత్రను పోషించినది. ఇచ్చో సీతాదేవి పతిభక్తి పరాయణత నిరుపమానముగ ప్రదర్శిత మైనది. కనుడు.

సీ॥ కూకటి ముడికినై కురులు కూడనినాఁడె
బెదరక తాటకఁ బీటమణచె
గాధేయుఁడొనరించుఁ గ్రతువును రక్షింపఁ
బెక్కండ్ర దైత్యుల నుక్కణంచె
నవనిపై విలసిల్లు నఖిల రాజన్యులు
వ్రేలఁ జూపఁగ లేని విల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ గ్రిమ్మరునప్పుడు
ఖరదూషణాది రాక్షసులఁ జంపె

అను పద్యము చేకొననగును. “కూరాటి తేకులు, కావేటి గుజ్జములు, చెవి నిల్లుకట్టుకొని దేవర చిత్తము వాని భాగ్యము,” మున్నగు కందువమాటలు, జాతీయములు ఆమె శైలికి నవర జనముగొని తెచ్చినవి,

సీటికొలని తామర అనినట్లు పరామర్శించు కొలదిని మొల్ల రామాయణమునందలి మెరుగులు వెల్లడియగుచునే యుండును. మొల్లగ్రంధరచనోద్దేశ్యములు ఉత్తమోత్తమమైనవి. ఆదర్శముగా శ్లాఘనీయమైనవి. కథానివేదమున ఆమె చూపిన కవితా చమత్కారములు అసదృశమైనవి. ఇట్లు పవిత్రోద్దేశ్యము, ఉన్నతాదర్శము, కవితా చమత్కారములును చూపి స్త్రీ లోకమునకేగాక పురుషలోకమునకు గూడ ఆదర్శప్రాయమై వెలయుచున్న ఆంధ్రకవయిత్రీమతల్లి మొల్లకొక నమస్కారము.

— ‘ఆంధ్ర రమణీ మణుల’నుండి.

## సౌందర్యప్రతిమ

(పెమ్మరాజు రాజగోపాలముగారు సారస్వతసమాజము)

1

మిలమిలకాంతులన్ జిలుకు మేనిసువర్ణమరీచికావళీ
చలనము మార్గమందోలకు స్వర్ణమయూఖిని యీమెయెవ్వరో
సలలితగీతికాగమనసంపద వచ్చుచునున్నదీ కెలం
కులనిదెడాయ, నాహృదయకూలము దూయగభావవాహికల్.

2

శారదకౌముదీరజని చల్లగవచ్చిగ్రమించు స్వాప్నికా
కారమువోలెచిత్రముగ కన్నులపండువజేసి యింతలో
దారినిసాగినావెవనితా మెలమెల్ల ప్రశాంతవాహినీ
నీరము బారుతీరుగను నీదుమనోహర రూపమేగెడున్.

3

హృద్యయగవీచి జను శరిమెళమువోలె
స్వర్ణకాంతిని క్షణమాగు నంజరీతి
ఒక్కసారిగ మనసును నోలలార్చి
సంతసంబున నేగెనీ కాంతయెవరో?

4

ఆమెవచ్చుట యేగుట లరయ నెదిమొ
మధుర మధురవాగతము నెమ్మదికిదట్టి
నట్టులనుతోచుచుండెడాన నామెఛాయ
యస్ఫుటంబుగ సంచార మాచరించు.

# లోకవార్త.

విశ్వనాధ సత్యనారాయణగారు.

## 1

నేను పద్యాలు వ్రాయుదునన్నమాట
లోకవార్తయై పోయెను————
నే నెఱుంగుదు కొందరి నాకు వలెనె
వారుకూడ పద్యాలు వ్రాయుదురు కాని
అన్నియపుడెల్ల పద్యాలు రావటవియు
మంచు కొండలపైన కైలాస శిఖర
భాగములకోషమంది బిగించుకొన్న
మంచుకన్నియ మార్తాండ కిరణసమితి
పెట్టు గిలిగింతలకు పట్టువదలిపోయి
కలకలని నవ్వ గతి నీటిపెరలు బిట్టు
తోసికొనివచ్చినట్లుగా వారి హృదయ
గర్భములనుండి భావమూగించుకొనుచు
ఏమధుర సంధ్యలోననో వెలికివచ్చు
నట————

ఆ మహాత్ముల కడకు పద్యార్థమెవరు
పోవుటకు గుండె నిలుకడ లేనివారు
వారి నెవడేని యొకడు వాంఛించునేని
అతని మందహాసమ్ములో నతని యితని
యందలి యసూయ యురిమినయట్లై తెలియు
గాన నాతని వంకకు గాని పోరు.

## 2

నేను పద్యాలు వ్రాయుదునన్నమాట
లోకవార్తయైపోయెన————

ఇంక నొకరీతి కవులుగలారువారు

వారి కైతకులేని గౌరవము తెచ్చు
కొనుటకై పూర్వకథిత సత్కవులవోలె
నభినయింతురు——
వారియందు పద్యమ్ము పర్ధించదెవఁడు.
ఎవఁడు నీచులనుండి కావలెనటంచు
కోరుచు పరాభవము తెచ్చుకొనెడు వాఁడు.

3

నేను పద్యాలు వ్రాయుచున్న మాట
లోకవార్తయై పోయెను.

మఱియు కొందరున్నారు యశోలిప్సలమిత
బాలకులవాంఛితమ్ముగా కట్టకట్టి
పత్రికాధిపులకును పద్యాలు పంపి
అవ్వి పడలేదటంచు మేఘాలలోన
కొత్తయర్థాలను చదువుకొనెడివారు.
అకట భాషాపరిజ్ఞాన మెఱుగరాని
పత్రికాపతి కవ్వారియెడల లేని
పోని 'సంపాదకీయ దర్జా' వెలుంగు——

4

నేను పద్యాలు వ్రాయుదునన్న మాట
లోకవార్తయై పోయెన ——

నేను వ్రాసిన పద్యాలు నిగిడిపోయి
తెలుగుదేశాన సర్వపత్రికలయందు
నల్లుకొన్నవి——
కొందరవిచూచి మెచ్చుటండిన నిజమె
అని పరిహరించుకొన్నారు——
నావిరోధులు కొందరు నన్నుగూర్చి
వాని నాధారముగజేసి వార్తలవ్వి
యివ్వి వెదజల్లినారు——

కళ్ళ యుద్దాల తత్వవేత్తలొక కొంద
రిరులలో వెల్గురేక తారాడరాని
సందుగొందులలో నిద్రపోవుచుండి
వానిగని నవ్వుకొనుచుండ్రు——
ఎవరెఱుంగరాక పరిహసించుచుండ్రు—
వారి పరిహాసములలోని వైభవంబు
వారి మట్టుకే—— ——

5

నేను పద్యాలు వ్రాయుదునన్న మాట
లోకవార్తయై పోయెను——

పండితులు కొందఱికి నేను వ్రాయునట్టి
పద్యములు నచ్చవట వారియందు కించి
దర్థమైనను గోచరించదట వారి
కేమి సేయంగవలె——
కొందరేమొ నాయందభిమానముండి
ఏదివ్రాసిన నేను బాగేయటంచు
మెచ్చుకొనుచుందురు——

6

ఏది యెటులున్న నేమి యీమాత్ర నిజము
నేను పద్యాలు వ్రాయుదునన్న మాట
లోకవార్తయై పోయెను——

ఎవడో యొక రరుదెంచి నన్నే మియైన
వ్రాయుమని వచ్చి నను "పీక్కుతినక" పోడు
ఎవడయిన నన్ను పద్యాలు వ్రాయుమంచు
అడుగుటది నాకు గిలిగింత పెట్టినట్లు
అందుచే నేదో యొకటి వ్రాయకయు పోను.

# సుందరకాండ పారాయణం

లక్కరాజు సాంబసదాశివరావుగారు బి. ఏ.

"రండి! భావగారూ! త్రోవతప్పి వచ్చినట్లున్నదే!" అని వకీలు వల్లభరాయుడుగారు తన కచేరీసావడిలోనికి వచ్చుచున్న ఒక పూర్వాచార వాసనల గ్రోకినట్లు కన్పడుచున్న ముప్పదియైదేండ్ల బ్రాహ్మణుని బాంధవ్య పూర్వకముగ నాహ్వానించిరి.

వల్లభరాయుడుగారు బాపట్లలో పేరుమ్రోగిన వకీలు. అనగా అవృత్తిలోనే ప్రతిభానంపన్నత మాటయెట్లున్నను విశేషము ధనమార్జించినాడన్నమాట. ఆవూరిలో వడ్డీలకుగాని తాకట్టు పత్రములకుగాని అప్పయిచ్చి అప్పుతీర్చుకొనుటలో తేలని బీదగృహస్థుల ఆస్తులను కట్టుకొని జోగులను చేయుటలో మొదట ప్రసిద్ధివహించిన ఋణదాతల సాంప్రదాయములో వల్లభరాయనిగారుపేరు మిన్నయైనది. ఈయనకు నెలకు సగటున ఎనిమిదివందల రూపాయలు రాబడియున్నదని యింకంటాక్సు లెక్కలవలన తేలుచున్నది. వచ్చిన బ్రాహ్మణు డాయూరికాపురస్థుడు జంధ్యాల వెంకయ్యగారు. దురాశాపాలుగాక వైదీకపు వృత్తిలోను నంతగ సంపాదన లేక పూర్వార్జితమగు అయిదు ఎకరములు తరి మాగాణి భూవసతివలన తనముగ్గురు బిడ్డలను భార్యను బెట్టుకొని చల్లగ కాలయాపన జేయుచున్నాడు.

ఆదరణపూర్వకముగ అందులో సబాంధవముగ పలుకరించిన వల్లభరావుగారితో మనశాస్త్రిగారిట్లు సంభాషించిరి "వెంకయ్యగారిభార్య సూరమ్మగారి మేనత్తకూతురు ఆకుబిడ్డమగడును, వల్లభరాయుడుగారి కుమారుని బావమరదియును వద్దకులు లేండి!"

వెం. శా:- ఎంతమాట! పొద్దున లేచినది మొదలు తనుతోటి పెద్దాబాగల బంధువుల నాశ్రయించి మనుగడ వెళ్లబుచ్చుకొను నావంటి వారిని హేళన చేయుట న్యాయమా?

వల్ల:- కోపగించుకొనకండి! ఇప్పుడు మీర న్నమాటలవలననే మీరెంతటివారో తెలుస్తున్నది. నాలుగువేలు మనవి కావు అనిఅనుకొన్న నాలుగైదు నెలలలో నలుభైవేల ఆస్తికి మీరధికారులు కానున్నామనా బీద అరపులు అరస్తున్నారు. అబ్బా మీరెంత వారండి. మీరుచెప్పకున్నను నాకు ఊరిలోని సంగతులు అందులో వెంకయ్యశాస్త్రిగారు అదృష్టవంతులు, లా, అంతయును వారి వైపుననున్నది తప్పక గెలుస్తారని రోజును కొనుసారు మ్రోగునట్లు వాదప్రతివాదములు వకీళ్లలో జరుగుచుండ అందులో ఒకడైన నాకు తెలియదని మీరెట్లా అనుకున్నారండి పాపము!

ఈ వాగ్ధోరణి మన శాస్త్రిగారిని చిత్రప్రతిమను చేసివైచెను. కాని యొకగడియలో తెప్పరిల్లి ఆశ్చర్యమును జూపుచు ఇట్లుప్రశ్నించెను.

వెం. శా:- ఇదేమిటండీ నేను ఏగోడవ ఎరుగనే! నాకు నలుబదివేల ఆస్తి ఎట్లు దూకిపడుతుంది. నాకుఎవరును సన్నిహితులగు పూర్వసువాసినులైన లేరే!

వల్ల:- మీఅమాయకత్వమునకును ఊరిలోని కొందరు వకీళ్ల ప్రల్లదనములకు నవ్వువచ్చుచున్నది. మీరు మీపెదతండ్రిగారి మనుమని దత్తత చెల్లకూడదని దావా వేయదలచి రాజేశ్వరరావుగారికి వకాల్తా యిచ్చుటకు ప్రయత్నములు చేయుచున్నారనో యివ్వాళ యిస్తా

తెగి లేదు. సుహాలక్ష్మి కట్టుతోప్పి యున్నందున అప్పుగా అప్పు చేసి వివాహమొనర్చిరి. తను పదునెవత్సరమునకే విధివశమున దావా వోడి పోయిరి. అల్లుని రాక శుభప్రదము కాలేదని భావనపడి, కూతురుని పాతిరి, అల్లుని అదవైట్టి ఆ మాట నాటినుండియు ఋణబాధవలన నిగు చే మంచముపట్టెను. కాని భార్యదీక్ష యొక్క భర్తాకప్రవృత్తిగల వల్లభరాయుడు గారు పరామర్శింపవచ్చి తాను శక్తి వంచన లేకుండ పాటుపడితిననియు తాను ప్రత్యేకము పట్టణము వెళ్ళి ఒక నెయ్యి రూపాయిలిచ్చి హైకోర్టు వకీలు అనూర అయ్యరుగారి సలహాను కూడ తీసికొంటిననియు క్రిందికోర్టులో పిచ్చి సాక్ష్యపు బనాయింపులు తప్ప "లాపాయింటు" బాగా చూడరని అప్పటి కోర్టు జడ్జి అనుభవశాలి కాదనియును నేవియో నచ్చచెప్పి మరల మిగిల రెండు యెకరములను తామే తాకట్టు పెట్టుకొని హైకోర్టున కప్పీలుచేయింప శాస్త్రి గారిచే నిశ్చయము చేయించుకొనిరి.

ఆమరునాడే శ్రీపతి కామయ్యగారు తాలూకా మాస్తా శాస్త్రిగారిని పరామర్శింప వచ్చి ధైర్యముచెప్పి యీక్రింద విధమున సలహా నిచ్చిరి.

"శాస్త్రిగారూ! భయపడకండి. మీరుతప్పక అపీలు చేయండి. వచ్చెడి సోమవారమునాడు శ్రీరామలింగేశ్వరున కభిషేకము మహాన్యాస పూర్వకముగ చేయించి నాటినుండియు సుందర కాండపారాయణ షుమారీమాసములో మూడు మార్లైనను చేసి తుదువరి నిత్యమును దీక్షగ మీకిపిక ఉన్నంతవరకు వ్యాజ్యము పైనలకు వంతవరకును పారాయణ చేయండి. వ్యాజ్యము యెందుకు గెలువరో చూస్తాను. మీరు చూశారు బాబా! అప్పుడు తహసీలుదారు నామీద ఎట్లా మండి పడ్డాడో. రామలింగేశ్వరునకభిషేకము చేసి మరునాడు సుందరకాండ పారాయణ మొదలుపెట్టేసరికి వెంటనే జవాను వచ్చి తహసీలుదారు పిలుస్తున్నారని చెప్పాడు. ఇక్కడే వెళ్లినానుగదా! మండిపోతున్న తహసీలుదారు గొర్రెపిల్లవలె అయిపోయి "కామయ్యగారు తొందరపడ్డానండీ" అన్నాడు. నేను యిక్కడ పారాయణ మొదలుపెట్టేసరికి అక్కడ ఆయన కోపము టక్కున త్రాచుబాము విషమువలె దిగింది.

"నిజము సంగతియేమిటంటే. వంటబ్రాహ్మడు తరువాత నాతో చెప్పాడు. కామయ్యగారు ఆనాటిరాత్రి తహసీలుదారుగారు సుఖభోజనము చేసిన తరువాత కోడి రామమూర్తిగారి బోధప్రకారము అటుయిటు వరండాలో పచారు చేయుచుండగా సమయము కనిపెట్టి నడుమునకు అంగవస్త్రము బిగించి ఆయన పాదములపై సాష్టాంగపడి వారిబిడ్డలలో తానొకడనియును తనది బుద్ధిలోపమనియును తనను పిచ్చుకతోను వారి కోపము బ్రహ్మాస్త్రముతోను, తనను మశకముతోను వారిని హస్తితోను పోల్చి ఇంక యేమేమో వేడికొని వారుక్షమించు నంతవరకును కాళ్లువదలక తనకు ఉద్యోగ భిక్షపెట్టుడని ప్రార్థించిరి. తాసీలుదారుగారు మరునాడు కామయ్యగారి వద్దనుండి written apology తీసుకొని క్షమించిరి.

3.

శాస్త్రిగారు కామయ్యగారి సలహాను తూచీ తప్పకుండ మరునాడే ప్రారంభించి ఆధైర్యమున క్రమక్రమముగ ఆరోగ్యము నందుచుండిరి. చిన్నప్పుడు చదివిన తాతంభొట్లుగారి సులక్షణ

సారజ్ఞానమును వినియోగించి అందులో నేటి దినసైకనాటక రచనాబిరుదాంకితులగు కొందరిరచనవలె శాస్త్రవిరుద్ధములున్నను ఛిద్రాన్వేక్షకులకు అచ్చుపడునది కాదుగదా! కేవలము భక్తిపూర్వకముగ గద్యాయనుకొని శ్రీరామలింగేశ్వరుని మీద నొకదండకమును గూర్చి నిత్యమును సంధ్యాసమయముల శ్రీరామలింగేశ్వరుని దర్శించుచు భక్తితత్పరులైయుండెను. దండకము క్రింది విధమున బరగుచున్నది.

“ఓంకారరూపా! ఉమాచిత్త నీరేజభృంగా! రమానాథపద్మాక్ష! శీతాంశు సర్వేశనాథాక్షి గీర్వాణకోటీరమాణిక్యసంశోభితాంఘ్రిద్వయా! పావనా! భాస్కరాచంద్రనేత్రా! లసద్దివ్యచారిత్ర! యేనాడు వాణీశవైకుంఠులున్ దావకద్దివ్యలింగ స్వరూపంబు నాద్యంతముల్ గాంచనేరని యత్నంబులన్ కార్యభంగంబులన్ జెంది గర్వాపసంహారులై యుండ నిన్నెంచ నేనెంతవాడన్ దయాసత్య నిత్యస్వరూపా! విరాటూపి! అల్పజ్ఞుడైనట్టి నాదైన వాచాటనల్ జేసి నన్నున్ గటాక్షింపవే అర్ధనారీశ్వరా! నాడు దేవాసురుల్ నిన్ను బ్రార్థింప హాలాహలమెల్ల జంబూఫల ప్రాయముల్ దోప భక్షించి వారెల్లరున్నిష్టకామ్యార్థముల్ గాంచిసౌఖ్యముంజెందంగ సాయంబు గావింపగా లేదె, యాకీర్తినే నేడు నీభక్తుడైనట్టి నావిన్నపంబున్ విచారించి నాదైన వ్యాజ్యమ్మునన్ గల్గు లోపాలు జడ్జీలకేమాత్రమున్ గానరాకుండగా మింగి నాపక్షమే తీర్పుజెప్పంగ సాయమ్ముగావింపవే నీలకంఠా! శుభాకార! ఇక్ష్వాకువంశ పాదోధి రాకాశ సుధాంశుండు శ్రీరామచంద్రుండు లంకాధినాథున్ బొరిగొన్న పాపమ్ముదూలింపగాజేయు నీదివ్యశక్తిప్రభావంబు నేనెంతు శ్రీరామలింగేశ్వరా! దేవ! దక్షాధ్వరధ్వంస! గంగా జటాజూట శోభాయమానోత్తమాంగా! కంఠమాతనుజాది భక్తాళి చిత్తాంబుజాంతః పతంగా! భుజంగాది నాథాకృతాహార సంశోభితాంగా! హర! ఈశ! సర్వేశ! సర్వజ్ఞ శూలాయుధా! రుద్ర! మృత్యుంజయా! భవ్యకారుణ్య! దృష్టిన్ గటాక్షించి రక్షింపవే నన్ను వ్యాజ్యమ్ము మున్ముందటికిన్ నాదు పక్షమ్ము తీర్పు గావింపగాం జేసి కాత్యాయనీవల్లభా! దేవదేవా! నమస్తే నమస్తే నమస్తే నమః”.

దావా అపీలునకుపంపి సంవత్సరమైనను ఇదనుకాలేదు. శాస్త్రిగారు చిలకలూరిపేటలో నున్న అయిదుయకరముల మాన్యమును గూడ తాకట్టుపెట్టి ద్రవ్యమును దెచ్చి ప్రైవేటు వెంకటరావు చేతిలో బోయుచుండిరి. సుందరకాండ పారాయణయును శ్రీరామలింగేశ్వరుని దర్శనమును జరుపుచుండిరి. ఇట్లుండగ శాస్త్రిగారి తపస్సు పండినదేమో అనునట్లు వెంకటరావు వద్దనుండి యీక్రింది విధమున తంతివచ్చెను.

Tomorrow Judgment day, mostly favourable
VENKATARAO.

[రేపు తీర్పు చెప్పు దినము అనేక విధముల మన పక్షమే అగును.

వెంకటరావు.]

ఆరాత్రి శాస్త్రిగారు త్రిజటా స్వప్నమును మరపించు నొక స్వప్నమును గనిరి. అందు ఆపాదకంఠాభరధారియగు గౌరవాంగుడును నగు నొక వ్యక్తి ప్రత్యక్షమై ఆయనవంక అయిదారు నిముసములు కన్నుఱెప్ప వాల్పక చూచి మొదట నస్పష్టముగ నేదియో కొంత సణిగి తరువాత స్ఫుటముగ శాస్త్రిగారికి బోధసేయ మొదలిడెను. శాస్త్రిగారు మొదట నావ్యక్తిభక్తవశంకరుడగు శంకరుడనియే తలంచెనుగాని (మత్త

వారణ ముఖ్యచర్మకృతోత్తరీయ మనోహరు' డగుటకు బదులు నల్లనిగౌను ధరించియుండుట చేతను, 'గంగా జటాజూట శోభాయమానోత్తమాంగము'నకు బదులు కోడిపుర్రవలె శిరోజశూన్యోత్తమాంగుడును, 'భుజంగాధినాథాకృతాహార సంశోభితాంగ'మునకు బదులు Stiff collar చే నలంకృతమగు కంఠంబు కలవాడును, త్రినేత్రుడును నగుటచే త్రిశంకరుడుగాక హైకోర్టు జడ్జి కాజాలునని నిశ్చయము చేసికొనెను. అవ్యక్తి యిట్లు చెప్పెను. "ఓశాస్త్రీ నీవంత బుద్ధిహీనుడవేం? జడ్జిమెంటు చెప్పవలసినది జడ్జినైన జేమ్సును నేనుగాని జానకీపతియును చంద్రశేఖరుడునుగాదు. కార్యసాధనమునకై- అది ధర్మబద్ధమయినచో - స్వప్రయోజనాధిక్యతయు, సుగ్రీవుని బోలు మిత్రకార్యతత్పరుడును నగు సుమిత్రసాహాయ్యమును, హనుమంతుని బోలు స్వామి కార్యనిర్వాహణ దీక్షాబద్ధకకణుండును బుద్ధిబల సంపన్నుడును, యుక్తాయుక్త వివేచనా కుశలుండును నగు హనుమంతునిబోలు సుభటసంవృతుడై యుండవలయునుగాని పరద్రవ్యాభిలాషియు వంచకుడును నగు వకీలువల్ల భరాయుడిబోలు మిత్రసాహాయము కాదనియును, సార్థవారధి కోవెలవద్దనున్న అరుణాచల అయ్యరు Best Coffee Hotel మొదలు చైనా బజారులోని "ఆనందభవనము'వరకుగల కాఫీ హోటళ్ళ యజమానులో "మారుతతుల్యవేగమునను, అశోకవనఫల విధ్వంస నిర్వాహకుడగు హనుమంతునిబోలుటయేగాని వేరుగ ఏమాత్రమును సమ్మానగని సేవకుడు వేంకటరావు సాయమునుగాదనియు చెప్పి యికనైనను బుద్ధితెచ్చుకొనుమని ఫెళ్లున నొకచెంపపెట్టుపెట్టి అంతర్ధానమాయెను. ఆచెంపపెట్టునకు త్రుళ్ళిపడి శాస్త్రిగారు చెంపను చేతిపెట్టుకొని గంద్రగోళముగ లేచిరి. నిజముగ ప్రక్కనున్న వెలిసెమిది నుండి నొక పిల్లి ఆయన చెంపపయిన ఫెళ్ళున దూకినది.

ఆమరుసటిరోజు సూర్యోదయము కాకముందే మెయిలులో దిగిన వేంకటరావుగారు వచ్చి హైకోర్టులో క్రింది తీర్పే ఖాయపరచినట్లు విశదపరచిరి.

---

## అభిలాష.

శ్రీ. శ్రీనివాసరావుగారు, (కవితాసమితి.)

మామకస్వాంత సంభవిత దురంత
భయద చింతా ధ్వాంతపటల నిర్దళన
చటుల ప్రలాప విస్తారంబులనుచు
నాశింతు నీమందహాసదీధితుల.

భవదీయ హృదయ భూభాగప్రవహిత
వాంఛాసలిల పూరవర్ధిత ప్రణయ
బీజముల్మహనీయ వృక్షరూపమున
శుభవాసితములు గా నభిలషించెదను.

అధరాబ్జ సుమధుర మధురసపాన
ముదిత మత్తమిళింద మూర్తినోసర్చి
లలిత తనూపరిరంభ దానమున
నలయించి వెలయింప నభిలషించెదను.

# నా మ త ము.

## (క ల్పి త ము)

అంకితము:— నా కుమార్తె శ్రీకృష్ణవేణికి.

(శ్రీ సోమసుందరంగారు.)

"Confession is a better sort of repentence" అంటూ వెనకటికొక ఆంగ్లప్రబుద్ధుడు చెప్పాడట, నాకూ నిజమేననిపించింది. అందుకనే నారహస్యాలు బయటపెట్టేసి, ధన్యుడౌదామనే ఉద్దేశంతో నాజీవితం అంతా భాగించి వ్రాద్దామనుకున్నా, అందుచేత ముందర ఈశీర్షిక మొదలుపెట్టాను. ఇది "నామతం" మీరు దీనినే "రటమతం" అనండి, యింకా ఏమన్నా అనండి. మీరన్నారని నాకేమీ ఆగ్రహమంటూ ఉండదు.

—ఇది ఉపోద్ఘాతము

ప్ర వే శి క.

సర్వప్రపంచానికి – నమస్కారములు!
సర్వ మానవకోటికి – నమస్కారములు!
పిపీలికాది బ్రహ్మపర్యంతం – నమస్కారములు!
సకలానికి, సమస్తానికి సర్వానికి – నమస్కారములు?

మీకుకూడ — డిటో

ఇన్ని వందనాలు చేస్తాడేమిరా అని ఆశ్చర్యపోకండి. ఇలా చేయడ మతిచాంధసమంటారేమో! అనండి. ఎవరికొరకు చేస్తాను? "బుద్ధికర్మానుసారే!". జీవితంలో ఎన్ని అడుసులు తొక్కొందే, ఎన్నిసారులు పాదప్రక్షాళనాలు చేయొందే ఏమవుతుంది? అది అట్లాఉంచండి. ఈ లోకమనే గుడ్డిగురిగింజ తనకుండే నలుపెరగకుండా, నాతప్పు వెదకవస్తుంది! ఇట్లాంటి లోకానికి, అతినుష్కర్మ భూయిష్టుడుగాను, అడ్డమైనవాళ్ళచేతా ఆదవడా ఈదవడా వాయింపించుకుంటూ ఉండే అతిక్షుద్రజీవిగా నేనొక్కడనే అవుపడుతున్నట్లుంది. వాళ్ళకట్లా అవుపడట మేమిటి! నాకుకూడా అట్లాగా తోస్తుంటే! అ దునిమిత్తార్థము, ప్రాయశ్చిత్తార్థము, సర్వపాప నివారణార్థం, (రాబోయేవాటికని గ్రహించనగును) అప్పుడప్పుడు నాచెంపలు నేనేవాయించుకొనేవాణ్ని. అయితే అదిమటు కతిరహస్య ప్రదేశాల్లో జరుగుతూఉంటుంది.

ఏడాదికి ఒక్కపర్యాయము గుళ్లోకి గర్భాలయంలాక వెళ్లే మామూలుంది. అక్కడికి వెళ్ళి రెండు మూడు క్షణాలకంటే ఎక్కువఉండేవాణ్నికాదు. అసలు ఉండటం అట్టె మామూలులేదు. అది కాకపోయినా, అట్టెఆలస్యము చేస్తాంటే వెనకవచ్చేవారికి స్థలమేమైనా కావాలనా? అందుకని ఉండేవాణ్నికాదు. చెప్పుకుండే దోషాలు, వేసుకుండేచంపలు — అన్నీఅక్కడ అతిరహస్యంగా జరిగిపోతుండేవి. అక్కడ ఎవరూ ఉండరు: చూడరు. అంతకంటె పవిత్రమైన సాన్నిధ్యం మరింకొకటి దొరుకుతుందా?

ఇక్కడకు శుభ్రంగా ఇస్త్రీగుడ్డలు వేసుకొని, చేతికర్ర తీసుకొని, వెళ్ళి సీటుగానిలుచోని, ఆరాతిదేవుడిని నాకు కావలసిన నాలుగు మాటల్ని ముఖాముఖిగా అడిగేసి వచ్చేవాణ్ని. ఏమిటా ఇంతధైర్యంగా, నిర్భయంగా వెళ్ళి ఆమహామహుణ్ని అడుగుతా డనుకుంటారేమో! భయమెందుకు? ఆయన్ని తండ్రి అన్నారు: మనల్ని బిడ్డలన్నారు. మనబిడ్డలు మనదగ్గరకు వచ్చి మారాంచేసి "నాన్నా! ఇవ్వాళ అవి

కావాలి: ఇవికావాలి" అంటూ చనువుగా అడగడంలే. అలా బిడ్డలడుగుతూంటే, అందులో ఉండే ఆనందం, తండ్రులైనవారికి తెలుస్తుంది. ఒకవేళ నిరసించి చీదరించుకొంటే, ఆయన తండ్రికాదు. ఆయనకే లేకపోతుంది పుత్రిపరిష్వంగసుఖము! అట్లా దేవుడు అందులో రాతిదేవుడు, చేయడని నాకుబాగా నమ్మకము. దేది అందుచేత చనువుగా వెళ్ళి వస్తూవుండేగాడ్ని ప్రతిపటా!

ఇవ్విధంగా 20 ఏండ్లు గడచిపోయినాయి. ఒకరోజు ఆగుడి అర్చకుడు "ఏమిటండీ! ఇలా రిక్తహస్తాలతో ప్రతిపటా వచ్చిపోతూవుంటారు. తృణమో, ఫణమో కానుకతీసుకరాకూడదు?" అంటూ ముఖావనగ అడిగాడు. "ఏమిటాని, ఇతడెంతచేసినా పూజారి, నన్ను అడగటమేమిటి. చిన్న పెద్ద వ్యత్యాసము లేనట్లుంద"నకోని కోపంవచ్చి కోపపడితే, ఏమనుకుంటాడో పాపమనుకొని సౌమ్యంగా నవ్వుతూ "ఓయి పిచ్చివాడా! రేపటినుంచి వెర్రివాడవనాలసివస్తుది నామటుకు నేను వచ్చేది ఎదుకనుకున్నావు, యాచనార్థమే" అన్నాను. అనేటప్పటికి బిత్తరపోయి, "ఏమిటన్నాడు" బహుశః ఆతడికి వ్యవహారంతా ఎడ్యుకేటెడ్ ఎత్తుకతింటం (Educated Beggary) అనిపించినదేమో! దానికి నేనేం చేయగలను?

"అట్లాఅడుగు మరి చెప్పుతాను. నాకు ప్రస్తుతం ౧౫ ఏండ్లువెళ్ళి ౨౦ది వస్తుంది. లోయరుసెకండరీ ప్యాసయినాను" అనేటప్పటికి "అబ్బా" అన్నాడు ఆశ్చర్యంగా. ఆరోజుల్లో "అదేఎక్కువ! మరేమిటి అనుకున్నావు" దరిమిలా ప్లీడరుపరీక్షకి వెళ్ళాను. నాకున్న ఎకరన్నర అమ్మేసిపోశాను. ప్యాసుకోరయ చించటానికివచ్చాను." అంటూ చెప్పి యింకా చెప్పుతూనేఉన్నాను. "ఇంక చాలించండి" అన్నాడు. "ఎబ్బే అదికాదు. ఇంక రెండేవున్నవి." వినుమంటూ "నీవు ఎప్పుడో ఇట్లా అడుగుతావని నాకూ భయంగానేవుంది. అట్లా పెద్దమనుష్యులను అడగటం దోషమనిన్నీ, దైవసాన్నిధ్యంలో ఉండేవాళ్ళు అసలే అడగకూడదనిన్నీ, అట్లా అడగటం మహా దోషమనిన్నీ, అట్లాంటిపాపం ఎన్నిజన్మాలకైనా తీరదనిన్నీ, పైగా ఈ విధంగా అడగటానికి నీకేమిహక్కుగాని అథారిటీగాని అర్హతకాని లేదనిన్నీ, నాబోటి పెద్దమనిషి ఎవరైన నీమీద ధర్మకర్తలకు రిపోర్టుచేస్తే నిష్కారణంగా నోటిదగ్గర జీవనం పోతుందనిన్నీ కాబట్టి ఎప్పటికీ ఇటువంటిపనులు చేయవద్దనిన్నీ సౌమ్యంగా మనవిచేసి పోదామని వస్తున్నాను.

ఇంకో కారణం ఏమిటంటే, చెప్పితే నీకు కోపం వస్తుందేమో" అన్నాను.

"పరవాలేదులెండి" అన్నాడు పూజారి.

"అయితే ఇక్కడ ఆరగింపుకు మహా దివ్యంగా ఉండే చిత్రాన్నము చేస్తారట, అది కాస్త రుచిచూడాలని చాలా అభిలాషగాఉంది. దాన్ని మీరేమన్నా తీరుస్తారా అని వస్తున్నాను" అన్నాను. ఆపూజారి పక్కున నవ్వాడు. మహా ఆగ్రహ భూయిష్టుడై, ఒకసారిప్రాయశ్చిత్తంచేద్దామనిన్నీ, దానితో పెద్దపెద్ద వాళ్ళతోను, కాబోయే లోయర్ సెకండరీ ప్లీడర్లతో (Lower Secondary future Lawyers) ప్రవర్తించవలసిన విధం సులభంగా గ్రహించటానికి వీలయేటట్లుగా తిరిగి నవ్వాను.

ఆమాట మాడిపోవచ్చునా! ఆకొయ్యొ వెధవ తిరిగి నవ్వాడు నాకు అరికాలిమంట నెత్తికెక్కింది. వాడితో వృథాగా కలహంపెట్టు

కుంటే రేపటినుంచి కొబ్బరికాయ, తాంబూలం, దక్షిణ తీసుకొనిరానివానికి దైవసాన్నిధ్య లేదం టాడేమో అని అవమానాన్ని దిగ్రమింగుకొని నవరంధ్రాలు నాయకంగా మూసుకున్నాను. అసలే నాకున్న తృణమో, ఫణమో చక్రవుకు తగలేస్తే, పైగా దేవుడికంటూ ఇవ్వడెక్కడ తెచ్చేది? కాకపోయినా ఆయనకు మన మివ్వట మేమిటి? ఆయనే లోకానికిచ్చేవాడైతే. గుడ్డు పోయి పిల్ల నెక్కిరించినట్లుందేమో అనిపించింది. ప్రస్తుతపు పరిస్థితుల్లో ఆదేవుడికైనా ముట్ట జెప్పితే లంచంకింద పరిణమిస్తుందేమో అనిపించింది. అందుకని మానేశాను.

ఇంతకూ నేనడిగిన చిత్రాన్నంసంగతి పూజారి ప్రత్యుత్తర మియ్యకుండానే వచ్చినవాటికి శేష గోపురం, వత్తి పెట్టి పావలాలు సంపాయిస్తున్నాడు. ఇదీ ఒకమంచి ఉద్యోగమే అనిపించింది. ఇంతకూ నాకోరిక తీరనేలేదు. అయినా అడిగి చూద్దామని పూజారిని పిలిచి "ఏమంటా'వన్నాను "ఏమిటి" న్నాడు. "చిత్రాన్నం సంగతే" అన్నాను. "చిల్లరడబ్బులు ఒకఅర్థపావలాసంతన చేసుకర"మ్మన్నాడు. ఏడు పెట్టేగుప్పెడు మెతుకులకు అర్ధపావలా ఎక్కడ తెచ్చేదనుకొని, మెవరేనన్నా ఆరోజు అడిగితే పెట్టకపోతారా అని, మళ్ళీ అడక్క వెళ్ళిపోయాను.

ఇంతలో కొద్ది రోజులకు పరీక్షాఫలితములు వచ్చినాయి. నానెంబరు 888, 333 గా మూడు సార్లు కండ్లమసగవల్ల అచ్చుపడ్డా, నిజానికి, ఆతండ్రి, ఏటా ఆయన దర్శనంచేసినందుకు, ప్యాసుచేసాడు. పాపము, ఒకరోజు నాస్నేహితు డొకడు వచ్చి,

"మొత్తానికి గట్టెక్కావు. చాల అదృష్ట వంతుడవోయ్" అన్నాడు. "ఉట్టి పరమఛాంధసుడవల్లే వున్నావే! అదృష్టం అంటూ ప్రపంచంల్లో లేనేలేదు. కష్టపడ్డానేమో; ప్యాసు అయినానేమో!" అన్నాను. ఇట్లా చెప్పటంలో ఒక కారణముంది. ఇలా ఇలా దేవుడ్ని యాచిస్తుంటే ముట్టిన బిక్ష అంటే, రేపటి నుంచి వాళ్ళంతా ఎక్కడ ప్రాణాచారాలు పట్టుతారో అనే భయంతో చెప్పలేదు. చెప్పితే వాళ్ళు వృద్ధికిరారు? నాకు ప్రపంచకంలో అపలెవరు డకూడదు. ఒకవేళ వున్నా వృద్ధికి రావటం అంటే అసలే గిట్టదు. నాకడుపు తరుక్కుపోతుంది.

నేను ప్యాసుకావటానికి పూజారి దేవుడికి నాపక్షంలో "బీదబ్రాహ్మణుడు, పాపం ఏటా వస్తుంటాడు," అంటూ సిఫార్సుచేసి వుంటాడనిపించింది. అందుచేత యేదైనా కొబ్బరికాయ, తాంబూలం, దక్షిణ (మొత్తం పావలా మించకుండా) తీసుకొని వెళ్ళి ముట్ట చెప్పుదామనుకున్నాను. ఇవ్విధంగా ముట్టజెప్పటంలో ఒక ఆధిక్యముంది. దేవుడికి కానుక యిచ్చినట్లూ అవుతుంది, తర్వాత అర్చకుడిని "నీవేతీసుకో" అనే అర్థం స్ఫురించేటట్లూ వుంటుంది. Two at one shot.

కాని కొద్దిరోజులుదాక తీసుకపోవటం పడనే లేదు. ఒకరోజు మా అమ్మ నన్ను పిలిచి "నాయనా! నీవు ప్యాసయితే 20 బిందెల పానకంచేయిస్తానని మ్రొక్కుకున్నాను. ఎల్లుండి మంగళగిరి వెళ్లుదాం" అన్నది. "గుళ్లోకి యిప్పుడు ఆడవాళ్ళను బొత్తిగా రానివ్వటం లేదు. కాకపోయినా యిక్కడే చేయవచ్చుట. డబ్బు నాకిచ్చేసెయ్యి" అన్నాను. ఆమె దాని కొప్పుకోని రూ 10 లు యిచ్చింది. అందులో నాబడ్జెట్టు (Budget) ప్రకారం నాలుగణాలు

(Annas four only) ఖర్చు చేసి పరికరాలుతో వెళ్ళి, అర్చకుడికి ముట్టచెప్పాను. తీసుకున్నవాడు, నాకు కొంచెం సంతోషంగా చిత్రాన్నం పెట్ట కూడదూ? అది పోయింది. పైగా "నాకేమైన బహుమానం చేయరా" అంటూ దేబెరించాడు.

"ఓయి వెర్రివాడా! అవి నీకే! లేకపోతే ఆరాతిదేముడు తింటానికి అనుకున్నావా" అంటూ వచ్చేశాను. మిగిలిన రు 9-12-0లు ప్లీడరు దుస్తులకుగాను ఖర్చు అయిందని గ్రహించనగును. (Pleader's Equipment).

* * * *

ఏలాగైతేనేం ప్లీడర్నియినా! లోపమంటూ లేకుండా రోజులు గడుస్తున్నాయి. ఆర్జనవిషయం విపులంగా ఆపై సంచికలలో రాద్దామనుకున్నాను. ఇప్పటినాకు ౩౫ ఏండ్లు నిండినాయి. నావృత్తిలో నేను వృక్షాలులేనిపూళ్ళో ఆముదపు వృక్షంగా వెలిగిపోతున్నాను రెండు చేతులతో సంపాయించుకున్నాను. ఇలాంటి సందర్భాల్లో మాకొక మునసబు గారుండేవారు. ఆయనకు వితంతువులంటే అమిత అభిమానం. వచ్చిన కొద్దిరోజులకే ఒక సంఘం ఏర్పాటు చేసాడు. అందులో మనంకూడ ఒక మెంబరు

ఈ సంగతి మాఅమ్మకు, భార్యకు తెలిసి గొల్లున గోలెత్తారు అప్పటికే నాలుగుమంది పుట్టారు. ప్రథమ కాన్పు మొగపిల్లవాడు తక్కిన కాన్పులు ఆడపిల్లలు. అందరికీ పెండ్లిళ్లు చేసాను. "సంపన్నగృహస్తు"నైనాను. ఇంకా దిగులేమి ఉంది?

ఒకరోజు భోజనాల ముందర మాఅమ్మ ఏమిటిరా? యిలా చేసావు? ఇందుకేనా నీవుచదువుకుంది? నలుగురుతోపాటు నారాయణఅంటు ఉండకపోతే బ్రతుకు తెరువులుంటయ్యా?" అన్నది. నా భార్యకూడ చిన్నా పెద్దా లేకుండ నీతులు చెప్పటానికి వచ్చింది. నీతలకాయి నీకేం తెలుసు? ఇదేం వంటచేయటం అనుకున్నావా? అంటూ గదమాయించాను. మళ్ళీ నోరెత్తితే ఒట్టు.

మాఅమ్మ నేమనేది? నీకు తెలియదు. మునసబుగారి ప్రాపకంకోసం చేశానులే అంటూ సౌమ్యంగా గ్రహించేటట్లు చెప్పాను.

ఈ ఉద్యమంల్లో ఎంతవరకు నా సంఘాన్ని బలవత్తరపరచింది. ఎన్నివివాహాములు చేయించింది ఎన్ని పత్రికలు వ్రాసి పంచి పెట్టింది. లోకానికీ నాకూ బాగా తెలుసు. ఇంతచేసినవాడ్ని తీరా నాదాకవస్తే యేలా తెలివితేటలతో ప్రవర్తించానో గ్రహించాలి అనుకొనే మహాత్ములు (శ్రీసురుపాదులు) దయచేసి ఈ ఆంధ్రభారతియొక్క నవంబరు సంచికలోని పశ్చాత్తాపమా ప్రాయశ్చిత్తమా? అనే శీర్షిక దయచేసి చదువుకొనుడు. ఆదిలో ఆ గ్రంథకర్తకు నమస్కారాలు చేయకపోవటం తప్పే వృద్ధాప్యానికి సహజం. ఇప్పుడైన ఆగ్రంథకర్తకు నమస్కారము!

* * * *

ఇప్పటికి 50 సంవత్సరాలు పూర్తిగా వస్తున్నవి. మొత్తానికి మా ఇంట్లో వకుళ వృక్షం మీద ఉండే వాయసంతోపాటు వంతుగా అర్ధశతాబ్దం ఆయుష్షు పోసికున్నాను ఇంకేమి గావాలి? Grey hairs must be respected అన్నారు. ప్రపంచం గౌరవిస్తూనే వుంది అనుకుంటాను కనుక నామాటా చక్రవర్తి రూప్యంతోపాటు చెలామణీ.

మునసబుగారికేం మమ్మల్ని అందర్నీ మంగల ములోపెట్టి మాయమైనాక ఉభయ భ్రష్టత్వ ముగ ఊడ్చుకపోయిందిమేము ఆ సంఘాలు ఆమతాలు ఆభిమానాలు నా మీసాలతో పాటు ఊడ్చుకపోయినాయి. చివరకు మిగిలింది నేను. నేను నాబిడ్డలుపూర్వంనుంచిసుస్థిరంగఉండే సంఘాలు! జనకంటకంపూర్తిగ ఏర్పడ్డది సత్యతో పాటు మళ్లీ కలవాలంటే ఏదో మ్యాజిక్ జేస్తేనే! ఈమధ్యనే నవీన పద్ధతులతో తయారు జేసిన శాస్త్రీయ క్షమాపణ భస్మం ప్రయోగించాను ఆదెబ్బతో అందరు పడిపోయినారు, మళ్ళ అంద సాత్త్వికం ఆర్జించుకున్నాను.

# మా తో ట లో.

పా.వి. రాఘవరావు, సారస్వతమిత్ర సండలి.

ఊరివెలుపల మా ♦ కొక తోటకలదు
ప్రకృతికాంతయె దాని ♦ బాలిచ్చి పెంచు

♦ ♦ ♦

కమ్మతావులతోడ ♦ గంధవాహనుడు
తోటలో నెల్లప్డు ♦ దోబూచులాడు
మావితేనియ గ్రోలి ♦ మదమెక్కి పికము
జోరుల నెవ్వరి ♦ జోరసీయకుండ
పగలు, మాపులుగూడ ♦ పాటలబాడి
మెలకువతో నెప్డు ♦ మెలగుచుండెడిని.
ఈపాటవిని మది ♦ నీర్ష్యజెంది
కీరము గొంతెత్తి కెరలుచు బాడు—
షట్పదంబులు తమ ♦ ఝ్ఝాంకారములతో
శ్రుతులు వేయును పక్షి ♦ రుతముల వేడ్క
ధూమయోనులుమింట ♦ దొలుకాడ గాంచి
అనుపమానంబైన ♦ తనపురివిప్పి
మందాక్షముగ కేకి ♦ మతిమతియాడు.

♦ ♦ ♦

ఈ తీరుగానుండి ♦ మాతోటలోన
తీగ గులాబియు ♦ తీగ మల్లెయును
రాధామనోహరల్ ♦ రమణీయముగను
అల్లుకొనిన మంది ♦ రాంతరమందు
ఒక్కప్రక్కకు నేను ♦ ఒదిగిపరుంటి
మంచి ఆలోచనల్ ♦ మదినూహసేయు
దుఃఖ సాద్రిములోన ♦ దొరలిపోయితిని.

♦ ♦ ♦

ఘల్లు ఘల్లురనుచు ♦ కల కలనగుచు
తనుసృజించిన జీవ ♦ తతి జూడుమంచు
కాంత యొర్తుకనాదు ♦ చెంతనిల్చుండి
నారక్తనాళాల ♦ నోరిమి బాకు
మనుజుని ఆత్మను ♦ కొని పైకిలాగి
వానితో లంకెను ♦ వైచి ఆకాంత
ప్రకృతి నేననుచును ♦ బరుగునంబోయె—

♦ ♦ ♦

తన కొఅకేదైన ♦ మన జూడీపుడమి
తన చేతితో జేసి ♦ కొనగలండెకట !॥

# సరసాలు.

మ. వెం. రా.

**1**

చిన్ని చేతులతోను
చిరుమబ్బు కెరటాలు
జాబిల్లి రేకతో
జతగూర్చినాడు.

**2**

సరిలేని దనిచాటే
విరికన్నె వలపంతా
గురుతుచూడాలనీ
మరిపించినాడు.

**3**

కోయిలల పాటలకు
కోపమొచ్చిందనీ
భ్రమరకుమారుణ్ణి
బ్రతిమాలినాడు.

**4**

మురిపాలు మెరయించి
తరితీపు సేయించే
సరసాంగినేస్తము
జరగదన్నాడు.

**5**

పసివాడుతూందనీ
పన్నెపీడిందనీ
తీవముద్దియగతికి
దిగులువడ్డాడు.

**6**

సన్నజాజులగుంపు
తన్నుకాదన్నదని
మన్ననల కాసపడి
సన్నగిల్లాడు.

**7**

సిగ్గుపోరలన్నిటినీ
చిమ్మిదగ్గర జేరి
గొజ్జగితోతన
కోర్కెదెల్పాడు.

**8**

చెలువమలపరచుకొని
పలుకరించిందనీ
కలువనెచ్చెలిమీద
తలపునిలిపాడు.

**9**

చేసన్నలకుబదులు
చెప్పనంటూన్నదని
చేమంతికెదురుగా
చేరినిల్చాడు

**10**

అల్లుకొనిపోయింది
వెల్లడౌతూందని
మల్లెచెప్పినమాట
చెల్లదన్నాడు.



# బౌద్ధమతము

ఇంద్రగంటి నాగేశ్వరశర్మగారు

శ్రీమంతంబగు నీ భరతఖండమునందు యుగ యుగారంభమునను, సన్మార్గమును రక్షించుటకొరకును దౌర్మార్గ్యమును నశింపఁజేయుటకును, ధర్మమును బాగుగా నెలకొల్పుటకును భగవంతుఁ డవతారంబులఁ దాల్చుచుండును. తా నవతరించుటయేగాక లోక సంరక్షణార్థమై మానవమాత్రుల యందుఁగూడ తన దివ్యశక్తుల నారోపింపఁజేసి వారలచే సద్ధర్మ మడుగంటఁజేయించి ప్రజలను సన్మార్గానువర్తులగునట్లుగా జేయించుచుండు ననియు లోకవిదితము. ఇట్టి దివ్యశక్తు లారోపింపబడినవారలలో బుద్ధుఁ డొకఁడు. ఈతఁడొక నూతన మతప్రబోధముచే సద్ధర్మమును పోద్రోచెను.

బుద్ధుడు మొదట సామాన్య మానవుఁడేయైనను స్వయముగ జ్ఞానాన్వేషణ మొనర్చుతరిని బోధివృక్షముక్రింద విశ్వవ్యాపకుఁడగు భగవంతునిచే దివ్యశక్తు లారోపింపఁబడి జ్ఞానబుద్ధుఁడై యతిశీఘ్రముగనే మానవకోటిలో నొకదివ్యమూర్తియై యుత్తముఁ డనిపించుకొనియెను.

యద్యదా చరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరేజనాః
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ||

అను గీతావాక్యము ననుసరించి యుత్తముఁడని లోకములో బుద్ధుఁ డనిపించుకొని, యాతఁ డేయే సత్కర్మల నాచరించుచుండెనో, యాయా సత్కర్మలను లోకముకూడ ననుకరించుటకు మొదలిడెను ఆతఁడు దేనిని ప్రమాణముగ దీసికొనెనో లోకముకూడ దానినే ప్రమాణముగ దీసికొని ప్రవర్తించుట కారంభించెను.

ప్రతిదినమును మానవుఁడు తానొనరించు సత్కర్మల మూలముననే ముక్తిని వడయుననియు గాన నీతివర్తనమే యాతనికి ముఖ్యమనియు బుద్ధుఁడు ప్రజలకు బోధించెను. పరిశుద్ధమగు నాలోచనము, పరిశుద్ధమగు ప్రవర్తనము, ముక్తిఁ బొందుటకు ముఖ్యసాధనములనియు, త్యాగముతోఁ గూడిన భూతదయయే ధర్మముయొక్క స్వరూపమనియు బోధించెను. ఇవి యందఱకు సాధ్యములనియు; అందువలన ప్రజలలో కొందరి కాధిక్యము, మఱికొందర కనాధిక్యము లేదనియు, అందరును సమానులే యనియును, న్యాయప్రవర్తకులగు వందరును పూజ్యులేయనియు బోధించెను. ఇట్టి బోధన యందరకును సులభగ్రాహ్యమై లోకములో శీఘ్రముగా వ్యాప్తిఁ జెందెను.

బుద్ధ భగవానుని యీమతము హిందూ మతమందలి కొన్ని ముఖ్య సూత్రముల పురస్కరించుకొని బయలుదేరి తన్మత సంస్కరణ రూపమున హిందూదేశమునందే కాక ప్రపంచమం దంతటను వ్యాప్తినిజెంది మానవకోటి కింతింత యనరాని మహోపకార మొనర్చినది. బౌద్ధమతావలంబులగుట యన ప్రజలు కొన్ని మతవిషయకమగు కట్టుబాట్లకు లోనగుటయే.

ఈమతము మన హిందూ దేశమున కొనరించిన మహోపకారము లెవ్వి?

నియమపద్ధతిని విచారించిన నీమత మదివరకు వ్యాప్తములోనున్న మతానుసారులగు బ్రాహ్మణ క్షత్రియులకు నూతనమగు జ్ఞానప్రబోధ మొనరించినదని తెలియనగును.

రాజకీయ పద్ధతిని జూచిన నీమతము మొట్టమొదట మన దేశమున సంఘీభావము నొసగూర్చి, తన్మూలమున రాజకీయ రంగములోకూడ నభిప్రాయ భేదములు లేకుండ చేసినదని వచింపవచ్చును.

చారిత్రాత్మకముగ నాలోచించిన నిది సరియగు హైందవ మతోత్పన్నమునకు కారణమాయెనని తెల్లమగును

ఈ మతవ్యాప్తికిని ఈ మతమందలి యావత్ప్రాభిప్రాయమునకును బుద్ధ భగవానుని పవిత్ర జీవితము నాతని భూతదయ నిరుపమాన నైతిక బోధనలు, నాతని మృదువైన చక్కని ప్రవర్తనయుఁ దోడ్పడినవి ముఖ్యముగా మహానుభావుని మూర్తియందలి (Personality) మహత్తరమగు నొకవిధమైన దివ్యశక్తియే కారణమనవచ్చును, ఈశక్తియే సామాన్య మానవులకు (Common people) మోక్షమార్గానువర్తియై, రక్షణమై దేశమున నెక్కుడు ప్రచారముఁ గావించినది. హిందూదేశాభివృద్ధికిఁ దోడ్పడిన శక్తులలో నియ్యదియే యధికతరమగు శక్తికలదైనది.

బుద్ధదేవుడు తన నూతనమత వ్యాప్తమువలన సామాన్య మానవాత్మీయధర్మమును (Common spiritual right) ప్రచారములోనికిఁ దెచ్చుటచేతనే హిందూదేశమున నిజమగు జాతీయతను సృష్టిఁజేసి శాశ్వతముగ నెలకొల్పఁ గలిగినాఁడు ఈ జాతీయతయే యతిత్వరితముగ చక్రవర్తియగు నశోకుని హృదయాకర్షణ మొనరించెను. చంద్రగుప్తుని కాలము, అనగా మౌర్యవంశ రాజ్యస్థాపనము నాటికే పరిపక్వమొందిన దేశము అశోకుని కాలము

నాటికి (సుమారేబది వత్సరములలోనే) తనయొక్క పరిపక్వదశను (maturity) గ్రహించెను. ఈమతమే యిట్టి పరిపక్వగ్రహణమునకు ముఖ్యకారణము. ఈకాలమున బ్రాహ్మణక్షత్రియులు ప్రపంచములో తామే ముక్తిని బడయుట కర్హులమను దురూహలను మఱల్చుకొని, పవిత్రజీవితమువలన బ్రాహ్మణుండు నబ్రాహ్మణుఁడు, భాగ్యవంతుండు నిరుపేద యంట్టియులుగూడ సద్గాని కర్హులేయని గ్రహించిరి.

ప్రజలు కొన్ని కొన్ని శాఖలకుఁ జెంది యున్నచో నాయాశాఖలలో నైకమత్యము కలిగొని, తన్మూలమున సందరియందు నైకమత్యముండునని యభిప్రాయ పడుట కలలోని వార్త. నిజముగ నాలోచించిన శాఖలు ప్రజలను వేరు వేరుచేయును. ఒక శాఖకును, మరియొక శాఖకును గల పరస్పర వైషమ్యములవలన నైకమత్యమునకు బ్రజలలో నావేలేకుండఁ బోవును. ఈ విషయ మిప్పటి బ్రాహ్మణాబ్రాహ్మణ వైషమ్యములనుబట్టియు, నప్పటి (బౌద్ధమతారంభ) కాలమందలి చాతుర్వర్ణములలోని పరస్పర వైషమ్యములను బట్టియు నందరకును ముఖ్యముగ చారిత్రపాఠకులకును విదితమే. బౌద్ధమతము హిందూదేశమునందొక తెగకుఁ జెందినదిగాదు. ఇదియొక వ్యక్తిని పూజించు మతము (Hero worship.) మఱియు నిది యొకనిరంకుశమఠమునుమతాధికారము (Monastic order) కాని యొక మతమాత్రమును బ్రాహ్మణ మతమువలె (Like Hinduism existing before the birth of Buddha) నొక తెగకుఁ జెందినదికాదు. ఈ మతస్వీకారమున కందరు నర్హులే. ఇందువలననే నందఱును సమానులని తెలియును. అశోకునంతటి గొప్ప చక్రవర్తి తన రాజ్యమందున్న సన్యాసులకు తనకును భేదమేమియును లేదనియు, తానుగూడ నొక సన్యాసినని దలంచుటకును కారణ మిదియే. బౌద్ధమతోద్దిష్టమగు నీయుత్కృష్టాశయము ప్రజలలో వ్యాపించి సంఘీభావమును మఱింత బలపఱచినది.

ఇట్లు మతవిషయకమగు నైకమత్యము ప్రజలలో వ్యాపించుటచే రాజకీయరంగమునగూడ ప్రజలలో వైషమ్యములు లెక పరిపాలనా విధానము బాగుగా సాగును. ఈహేతువుచేతనే యశోకుఁడు మాదువంతులకు పైగా హిందూదేశము నెంత చక్కగాఁ బరిపాలన మొనర్చినదియు, హిందూదేశ చారిత్ర పఠనమువలన వెల్లడియగుచున్నది.

ఇట్లు ప్రజలలో మతైకమత్యము (Religious-union) రాజకీయైకమత్యము (Political-union) నకు తోడ్పడునని దేశచారిత్రములఁ జదివిన తెలియఁగలదు. ఇంగ్లండు దేశమును ఆంగ్లోశాక్సనులు జయించి వేర్వేర చిన్న చిన్న రాజ్యములను స్థాపించినపు డింగ్లండు దేశీయులు గ్రహారాధకులుగ (Heathens) నుండిరి. కెంటురాజ్యమునేలు ఎథెల్బర్టు యేడవ శతాబ్దములో క్రైస్తవమతమును స్వీకరించిన ఫ్రాంసుదేశపు రాజకుమారికను వివాహమాడి తానుగూడ క్రైస్తవ మతావలంబు డాయెను. అప్పటినుండియు నొక రాజ్యమునుండి మరియొక రాజ్యమునకీ మతము వ్యాపింప నచిరకాలములోనే యింగ్లండుదేశీయులలో మతైకమత్యము సమకూడినది. ఈ యైకమత్యమే రాను రాను రాజకీయ రంగములోగూడ ప్రతిఫలించినది. ఎనిమిదవ శతాబ్దమునాటికి వెసెక్సురాజుక్రింద నింగ్లండు దేశమంతయు నొక్కటి యగుటకు కారణము సమస్త ప్రజల మతము నొక్కటి యగుటయే

ఈవిధముగ నేదేశ చారిత్రమును జూచినను మతైకమత్యము రాజకీయైకమత్యమునకు దోడ్పడునని తెలగలదు బౌద్ధమత మిట్లు మన దేశములో మొదట ప్రజలలో నైకమత్య మొనగూర్చి, పిదప రాజకీయ వైషమ్యములనుగూడఁ బోద్రోచి పరిపాలనావిధానమునకు దోడ్పడినది

బౌద్ధమత విస్తృతికి పూర్వ మీదేశమున నెక్కుడభివృద్ధిలో నున్నది హిందూమతము. ఇయ్యది బ్రాహ్మణుల సొమ్మయి యుండెను. అందువలననే యీమతము బ్రాహ్మణమతమని పిలువబడుచు వచ్చెను. ఈమతముకని పదుద్దిష్టమై, సామాన్యమానవుల కగ్రాహ్యమై యల రారుచుండెడిది. అందుచే సామాన్య మానవుల మోక్షప్రాప్తి యగ్రవర్ణముల చేతిలో బడెను. రాను రాను బుద్ధుని కాలమునాటికి ప్రజలు మనఃపరిణామమునొంది యజ్ఞానబద్ధములగు నమ్మకములను అంగీకరింపని కాలమాసన్న మాయెను. ఆసమయముననే బుద్ధుఁడు యీమతమును సంస్కరించెను. ఈ హిందూమత సంస్కరణమే బౌద్ధమతము. ఈతఁడు వేదసమ్మతమైన యార్య మతమునకును నప్పటికే ప్రచారములోనుండి వేదసూత్రములను లక్ష్యము చేయని జైనమతమునకు నొకవిధమైన సమ్మేళన మొనరించెను. ఈసమ్మేళనమే సరియగు హైందవమతోత్సన్నము. ఇదియే బౌద్ధుఁడుపదేశించిన నూతనమతము. అప్పటిమత ప్రచారకులగు నగ్రవర్ణముల యుపదేశములవలన తమకును మోక్షమునకును చాల దూరమని తలపోసి ముక్తియెడల

విరక్తిభావమును కలిగియున్న సామాన్యమానవుల కీనూతన మతము మహోపకార మొనర్చినది. మానవుని సత్ప్రవర్తనము వలననే యాతఁడు ముక్తిని వడయుననన్న యీమతమువలన ముక్తిమార్గము బహు సులభమాయెను. ఈ త్తమ మార్గానువర్తు లగుటకుఁ బ్రబోధించిన యీ మతసంస్కారికి నూతనమత స్థాపకునకు మానవకోటి యెంతయు కృతజ్ఞత జూపవలసి యున్నది

మనదేశములో బుద్ధుని కాలమునకు ముందున్న సామాన్య మానవులవలెనే యొకప్పుడు (15 వ శతాబ్దమునకు ముందు) యూరోపుఖండములో గూడ సామాన్యులందరును తమ మతాధికారియగు పోపు (Pope) ను ఆతని యనుచరులును చెప్పిన విధముననే నడచుకొనినయెడల తమకు ముక్తిగలుగుననియు, లేనిచో మోక్షద్వారములు బంధింపబడుననియు నమ్మియుండిరి. కాని 15 వ శతాబ్దమున పెంపొందిన మతవిషయకమగు నొక యుద్యమము (Conciliar-movement) వలన నా వెఱ్ఱియూహలు మాయమయ్యెను. ఎవఁడు బైబిలులో చెప్పినట్లు తన ధర్మము నాచరించునో వానికే మోక్షము సమకూరుననియు, పోపుగాని యాతని శిష్యులుగాని ముక్తిమార్గమును బంధింపలేరనియు ప్రజలకు గోచరించినది. అంతటితో పోపుయొక్క సర్వాధికారమునకుఁ గొఱంత గలిగెను. అతని యధికారమును చాలవరకు క్షీణించెను. ఈవిధముననే మన దేశములో బుద్ధుని నూతనమతము అభివృద్ధి చెందినకొలదిని బ్రాహ్మణుల యధికారము క్షీణించినది. కొలదికాలములో బ్రాహ్మణులుగూడ సామాన్య మానవులవలెనే బౌద్ధమతావలంబులయిరి.

బౌద్ధయుగముననున్న సామాన్య మానవునకును అంతకుపూర్వపు సూత్రయుగమందలి సామాన్య మానవునకును మనస్సులో చాల భేదముకలదు. సూత్రయుగములో సామాన్యమానవుఁడగ్రజాతికి మతవిషయములలో నొకవిధమగు బానిసగ నుండెననవచ్చును. ఏమన వారెట్లు చెప్పినట్లు చేయుటయేగాని, యొకించుకయైనను స్వబుద్ధిని వికసింపఁజేయు నవకాశమును కలిగియుండలేదు. కాని రానురాను మనఃపరిణామమునొందుచు వచ్చి బౌద్ధమతావలంబులై స్వాతంత్ర్య మోక్ష సామ్రాజ్యాన్వేషకుఁడగుటకు మానవుఁడు తన మనస్సుచే నూతనశక్తులను సంపాదింపసాగెను. ఇపుడు నిశ్చల ధ్యానము, అగాధమగు భూతదయ, నిరుపమవిజ్ఞానము, ఇవియే తనయాత్మయొక్కయున్నతాదర్శములని గ్రహించెను. ఈ యున్నతాదర్శములే మానవునియొక్క పరమావధియని గీతావాక్యములు కూడఁ జెప్పుచున్నవి. ఈ యాదర్శములే మోక్షార్హములు. ఇట్లు (సామాన్య) మానవులు బౌద్ధమతావలంబులయి తమ తమ మనములను వికసింపఁ జేసికొనిరి.

అజంతా, యెల్లోరా, అమరావతి మున్నగు బౌద్ధ విహారములయందును స్తూపములయందును గనుపట్టు శిల్పమీమతప్రచారమువలననే యెక్కుడభివృద్ధిఁ గాంచినది. అప్పటికాలమున నీమతవ్యాపకులగు బౌద్ధభిక్షుకుల విహారార్థమయి మతాభిమానులగు రాజులమితమగు ధనమును వెచ్చించి తమ యాస్థానశిల్పకారులచే నేకశిలామయమగు పర్వతములను దొలిపించి యెక్కుడు పనితనమును వెల్లడింపఁజేసి చిత్రకళ నభివృద్ధిఁ జేయించిరి. ఇది యంతయు నీమతవ్యాప్తికొఱకే; లేనిచో శిల్పకళయంత యభివృద్ధిని గాంచి యుండదనవచ్చును. అమరావతి స్తూపములమీదను అజంతాలోని శిలలమీదను హిందూ బౌద్ధపురాణములలోని గాధలన్నియును కనులకు గట్టినట్లు చిత్రింపఁబడినవి. మతవ్యాప్తి, మతప్రాశస్త్యము తన పరమావధిగ నిడుకొని చిత్రకారుఁడు తనమహోత్తర జ్ఞానప్రభావమున రూపలేఖనము, శారీరవ్యాపారములు, నాధ్యాత్మిక తత్త్వములు మున్నగునవన్నియు మానవకోటియొక్క నేత్రములకు గోచరింప జేయగల్గెను. ఆకాలముననే శిల్పకళలో ప్రపంచమందలి యన్నిదేశములకన్న మన దేశమే మిన్నయని పొగడ్తనొందెను. ఆశిల్ప నైపుణ్య మిప్పటికిని చెక్కు చెదరక విదేశీయులచేగూడ పొగడ్తనొందుచున్నది. శిల్పకళనుగూర్చి యుత్తమమైన గ్రంధములుకూడ నాకాలముననే మొదట మనదేశములో వ్రాయఁబడెను.

బౌద్ధమతమందలి యహింసా సూత్రానుసారులయి యనేకులగు మాంసాహారులు శాఖాహారులయిరి. జీవహింస నొనర్చుటకు మిగుల భయపడసాగిరి. క్రూరమృగములను వేటాడుటగూడ మానుకొనిరి.

హిందూదేశమున నీమత మభివృద్ధినొందెడు కాలమున చైనా జపాను మున్నగు దేశములన్నియు నజ్ఞానాంధకారమున మునిగియుండినవి. అచ్చటినుండి కొందరు పండితులు మన దేశమున కేతెంచి దేశీయభాష నభ్యసించి విజ్ఞానదాయకమగు బౌద్ధమత గ్రంథములఁ జదివి జ్ఞానోపార్జన మొనర్చుటయే కాక తమ మూలమున తమ దేశీయులను గూడ తరింపఁ జేసిరి.

మొత్తముమీద బౌద్ధ మతము మన దేశీయులనేకాక ప్రపంచమందలి సగముకన్న నెక్కుడు ప్రజలను మానసికముగను, నైతికముగను నభివృద్ధినొనర్చి ప్రపంచమున ఘనమగు నుపకార మొనర్చినదనుటకు సందియములేదు కు

ఇట్లనుటచే మన దేశమున నూత్రయుగమందలి జనులు నీతిబాహ్యులనియు, మానవ నామమాత్రులనియును వచించుటగాదు. బౌద్ధ యుగముననే నీబుద్ధుని యవతారము వలననే యిట్లాయెననుటయును గాదు. బౌద్ధ మతావతారమునకు ముందు ప్రజలలో ధర్మ మడుగంటినది. మనోదౌర్బల్య మావరించినది అయ్యవి యెక్కుడుగ (పూర్తిగ) నీమతవ్యాప్తివలన నాశనమొందినవి. ముఖ్యముగ నీ మతమే యప్పటి సామాన్య మానవుల యౌన్నత్యమునకు గారణమాయెను.

# జొన్నచేను.

తుర్లపాటి గోవర్ధనరావుగారు.

సెనగపూవైకదాడిగిన చిన్నదాన
కవులుమావారు తొలకరికాలమందు
పలుకరింత్రె? కవిత కాటవెలదివంచు
నవ్వుమురిపెమ్ము కవితలనడక లంద
చందములుకలిగి వలుపుసాని శార
దమ్మవోలె వరింతె హృదంతరమ్ము.

◆ ◆ ◆

వడిసెలనుజూచి కవిసార్వభౌముడుండె
మంచయే సర్వసామ్రాజ్యమంచు పట్ట
మహిషితోడుగా నిను స్వయంవరపు మాకు
గూడ కన్నెదావను ఈడుజోడు గూడె.
తల్లిదండ్రిలాచేనిలోం దాగియున్న
చుండిరి వడిసెలకు అన్న చూడనేగె
నాదరికి బిట్టవ్రాలకుండగ దినమణి
యిపుడిపుడె యొత్తిగిల్లెడి నిచటజేయు
మన రహస్య సంభాషణమ్మును వినంగ
దోసమని శుభమన్నిటందోచె వేగి
రింపకుము తొందరేల నీరేయి నిచట
నుండుమనెదె – నంతనమె – ఏనూకిశేగ
మానితిని లేజొన్నలు మంచెకింద
దాచితివొకో నాకోసమై? తాటిపండు
కలదు చెట్టుపై గడనిమ్ము కొట్టితినుచు
నెటులో పొట్టనింపుదు నాకలియులేదు
అంతగా హాయిగా నిద్రబోద మొకట.

కవిసరస, సరే, యెక్కింత కాలమున్న
తటిపి లేదూడ పాల్దీసి తల్లి లేగ
లందు నాకొఱకు నదిగో ఆవుతల్లి
కట్లుత్రెంపలేకయుతిం చెంకలవుచాల
పాలు చెంబులోవాని దాగ్రంగనిత్తు
దప్పికయి జొన్నరొట్టెతినంగ నిక్క
మయిన నిజుదు నాచేతి త టకముతింట
దోసమా? అన్నమగాదు త్రోసిపుచ్చ
జాతి గుటికల్లునిల్వంగా జాలవెంను
నమ్మకములేనిచో కృష్ణునడిగి రాధ
నడిగి ఆయిలాకన్యక నడిగిరమ్ము
సంశయింపకుమోయి, ఈసమయమందు
అరుగొ తలిదండ్రు లన్నగా రచటనుండి
వచ్చుచున్నవారలు భయమువలదు నీకు
ప్రకృతి సౌందర్యమును గనవచ్చితంచు
ధైర్యమునుజెప్పి కొన్ని పద్యములజదివి
వారిలో స్నేహరీతిని వఱలుదేని
తుదకు ద్వదభీప్సితమును దీర్తునుగ సఖుడ.

◆ ◆ ◆

అయిన నుండెదనీవన్న యటులె వీరు
తామరసనేత్రి లిండ్ల బందాలుగారు?"

("రసవాహిని" నుండి.)

# ఎందుకో

ఒక మిత్రుడు.

రమణను అరెస్టు చేశారట! చిన్నప్పటి నుంచీ ఒకతల్లిబిడ్డలులాగా, ఎడబాయకుండా, ఒకకంచంలోనే అన్నం తింటూ కలిసి పెరిగాము. చదువుకున్నాము, సరైనఉద్యోగాలు దొరికినాయి. ఎవరికివారు సుఖంగా కాలక్షేపం చేస్తున్నాము. నలుగురిచేత అవుననిపించుకున్నాం గాని, ఎవరు వేలువంచడానికన్న వీలులేదే: పోనీ, ఇంకా నేనన్నానంటే, "ఏదో క్లబ్బులో బిగ్గరగ మాట్లాడుతాడు, పెద్దలనీ, పిన్నలనీ విచారించకుండా నోటికి వచ్చిందల్లా అనేస్తాడు, అడ్డమైనవాళ్లతో స్నేహం చేస్తాడు," అని యింకా యీలాటి ధోరణిలోనే — తలా, మీసాలు నెరిసిన ఘనులు ఆక్షేపిస్తూంటారు. రమణసంగతలా కాదే!

ఆపిలకజుట్టూ, మడత నలగకుండా అంచులు కనబడేట్లు, తీర్చేబిళ్లగోచి, మూడురేకల గంధం, కనుబొమ్మల్లో కుంకంబొట్టు, పెద్దమనుష్యులు తొడుగుకొనే కోటు, వాళ్లు వేసుకున్నట్టుగానే సన్నగోరంచు ఉత్తరీయం, పింజవెట్టి భుజాల మీదుగా వేసుకోడం — పూర్వాచార పరాయణులందరూ, రమణ ఆఫీసుకు వెళ్ళేటప్పుడు చూచి మురిసిపొయ్యేవాళ్ళు. నారాయణ శాస్త్రిగారు — ఎంతపేరుంది ఆయనకి మావేపుకల్లా సాంప్రదాయాభిజ్ఞుడని? — అలాటాయన, నడివీధిలో అందరిఎదుటా "నాయనా, నిన్నుచూస్తే నమస్కరించాలని బుద్ధిపుడుతుందోయీ, కులదీపకుడవు." అని రమణను చూడటంచేత తన జన్మకు సాఫల్యం కల్గినదన్నట్టుగా ఉప్పొంగిపోలా? ఎవరెరుగరు అతడెలాటివాడో ఒకరిజోలికి వెళ్తాడా, ఒకరిని పల్లెత్తుమాట ఎన్నడన్నా అన్నాడని విన్నారా!

రమణను అరెస్టు చేసారుట!

పాపయ్యను చంపినందుకా! ఆతను చెడ్డవాడే, చాలామందిని యేడిపించాడు. ఎంతమందినో బెదిరించి డబ్బులాగాడు. భార్యాభర్తలను కాకుండా చేసాడు సరే, ఎన్నయినా ఉన్నాయి. రమణ, ఆతన్ని చంపడమెందుకు; చంపాడా? అసలు చంపాలిసిన అవసరం ఏం వచ్చింది? నిజంగా చంపాడనేనా అరెస్టు చేసింది?

జైలు అధికారితో మాట్లాడాను, జామీను మీద తీసుకురావడానికి వీలుంటే తీసుకురావచ్చుగదా అని. నేరం రుజువౌతుంది ప్రత్యక్షంగా చూచామని చెప్పేవారున్నారు. ఎలా వదలడానికి ఒప్పుకుంటారు? మాట్లాడడానికి కన్నా వీలులేదన్నారు! ఈ కొత్త నియమం ఎందుకో, ఎప్పటినుంచో? ఇంకా ఎవరున్నారు ఆతనికి? పాపం! ముసలిది తల్లి. ఈమాట వినగానే విరుచుకుపడిపోయింది; ఎన్నికష్టాలుపడి పెంచి పెద్దవాణ్ని చేసింది ఆయిల్లాలు. కష్టం వృథాగాకుండా ప్రయోజకుడై మంచివాడని అందరిచేత అనిపించుకుంటూ, నాలుగు కాలాలపాటు సుఖంగా వుండకుండా ఎంత కష్టం వచ్చింది! ఆవిడ ఎట్లాబ్రతుకుతుంది. మళ్ళా నలుగురిలో తల ఎత్తుకు తిరగడమేలా? యెవరాదరిస్తారు. మేం వున్నాం, నీకేం భయంలేదని ఓదార్చేవారన్నా ఏరీ?

అనుకోని సంగతులు జరిగినప్పుడు, కలా, నిజమా అనుకుంటాము. కలన్నా ఇంతచిత్రంగా నమ్మడానికి వీలులేకుండా వుంటుందా? విచారణకుముందు నేనన్నిసార్లు మాట్లాడ్డానికి వెళ్లినా

తీసుకురావద్దనేవాడట. ఏం వుందో మనసులో, నాతోనన్నా చెప్పరాదూ? తనకేంకష్టం ఎందుకు దాపరించాలి. తను జైలులో మగ్గుతూంటే, నేను బయట సంతోషంగా కాలం గడుపుతున్నాననుకుంటాడా, తన అవస్థ అంతా చూస్తూ?

కేసు విచారణకు వచ్చింది. ఎంతమంది జనం వచ్చేవారు చూడడానికి! అందరికీ అతనంటే అంత అభిమానం. కొట్టేస్తారని దృఢంగా నమ్ముతున్నారు ఎవరినిచూచినా. లేకపోతే— రమణ కూనీ చేశాడని జడ్జీమాత్రం నమ్మగలడా ఏం?

సాక్షుల నందరినీ విచారించారు. అందరూ తలోవిధంగా చెప్పారు; ఎవరికీ పాఠం సరిగా రానట్టు తెలుస్తూనే వుంది. ఇంకా కొట్టేయడానికి ఏం అభ్యంతరం ఉంది? అంత ధైర్యం ఉండటంచేతనేనా—రమణ తనపక్షం వాదించడానికి వకీలునన్నా పెట్టుకోంది? కష్టాలందరికీ వస్తాయి. తను అంతసిగ్గుపడటం ఎందుకు? ఎవరెరుగరు అంతా అన్యాయమని?

తీర్పుచెప్పాలి. విచారణంతాఅయింది చెప్పిందంతా అందరూ జడ్జీగారితోపాటు విన్నారు. తప్పుడుమాటలేవో నిజం సంగతులేవో తెలుసుకోలేడూ? న్యాయపీఠాని అధిష్టించాడు న్యాయాధికారి!

పాపయ్య అనేపెద్దమనిషిని చంపావని నేరం మోపారు. నీవేమంటావు అని న్యాయాధిపతి రమణనడిగాడు. కళ్లనీళ్ళు ఆపుకుంటూ, సన్నగా చిక్కిపోయి, కళ్ళుగుంటలుపడి, మనధోరణే లేనట్లు వెర్రిచూపులతో నిలుచున్నాడు. అడిగిన రెండుమూడు నిమిషాలుదాకా కళ్ళు తెరవలేదు. మాట్లాడలేదు.

కళ్ళు తెరిచాడు ఆదేమిటో ఆ క్రొత్తకళ! దూకడానికి ముందు సింహంలాగా గర్జించాడు "ఈలోకంలో న్యాయం జరగదు. అది నాకక్కరలేదు. ఆలాటి పాపాత్ముణ్ని ఈలోకంలోంచి పంపించివేసినందుకు నాప్రభువు నన్ను మెచ్చుకుంటాడు. హత్యజేసినందుకు ఉరివేస్తారు కాదూ? మీరుడీఉపకారం అంటే నావాళ్ళదగ్గరికి నేను వెళ్ళేట్టు చేస్తారు. ఏదీ, ఆమాటకాస్త త్వరగా చెప్పండి."

నేనేనా, లేక పిన్నవాళ్లందరూ నిర్ఘాంతపోయినారా? మనస్సు చెడిపోయింది కాబోలు. లేకపోతే ఆధోరణిఏమిటి! న్యాయం—

ద్వీపాంతరవాస శిక్ష విధించారు.

## 2

నాలుగురోజులు గడిచినాయి. ఆరోజులు, మామూలు రోజుల్లాగ లేవు. పగలు, రాత్రి, ఎంతపెరిగాయి. ఎంతసేపుచూచినా చీకటి పడదు. చీకటిపడ్డదా తెల్లవారడం ఎప్పటికో?

మరునాడు వుదయం రమణను తీసుకువెళ్ళిపోతారట. అప్పుడన్నా జైలుదగ్గరకు వెళ్లి కడసారి చూద్దామనుకున్నాను; తొందరగా నిద్రపోతే చీకటితోనే మెళుకువ వస్తుంది. అందుచేత మధ్యాహ్నంవచ్చిన ఉత్తరాలు చదువుకుంటూ వసారాలో జాజిపందిరికి దగ్గరగా కుర్చీలో కూర్చున్నాను

ఏమిటిది —

"నం 121 ఖైదీ వెంకటరమణయ్య నిన్న రాత్రి ఆత్మహత్య కావించుకొన్నాడు. అతని జేబులో మీపేరవ్రాసిన కవరు కనిపించింది. దీనితో పంపినాము."

చివరకు ఎంతచేటుమూడింది. నారమణ నాతో చెప్పకుండా యీ లోకంలోంచి వెళ్ళిపో

తాడా నాకు తెలియనీయకుండా. ఎన్నాళ్లనుంచీ ఆవేదనం తాడాస్తున్నాడో. ఆమంచికి ఆప్రతిష్టకి ఇదా అంతం? హృదయవేదన విడిచిపెడుతుందనే కాదు. మమ్మల్ని విడిచిపెట్టి తాను ఒంటరిగా పరిగెత్తింది? మేమేంకావాలి.

తన నోటివెంటవిని ఓదార్చి ధైర్యం చెప్పేందుకు బదులుగా ఈవిధంగానా, నాకీకథ తెలియాల్సివచ్చింది. ఎంత దురదృష్టవంతుణ్ని. రమణ ఇంకా ఎందుకు కనబడతాడు మోసం——

రమణ ఉత్తరంలో సంగతులు క్రింద వివరిస్తున్నాను. అందరికీ రమణమీద ఏమన్నా అనుమానం వుంటే తొలగిపోతుం . ఉత్తరం ప్రస్తుతాంశానికి సంబంధించిన మట్టుకు వుదహరిస్తున్నాను.

“నిన్ను వదలిపెట్టి వెళ్లానని కోపపడతావు. అది నాకూ తెలుసు. అమ్మ పాపం ఒంటరిది. ఎంతకాలం బ్రతుకుతూంది ఇంకా యీదుఃఖముతో? స్వార్థపరత్వం దీనికి కారణం. మిత్రుణ్ణి కష్టపెట్టి నాసుఖమార్గాన్ని చూచుకున్నందుకు వెనకటి సంగతులన్ని తెలుసుకుని క్షమిస్తావని నాకు నమ్మకముంది. నేను చేసినపని మంచిదో కాదో, ఎందుకుచేశానో, తెలుస్తుంది, ఇదంతా చదివినతరువాత. నీకు నీతోకలిసి ఐదుగురే యీసంగతి ఎరుగున్నదల్లా. అందులో ముగ్గురు ఇంకో లోకంవారు.

సుందరేశుడి ఉత్సవాలకి వెళ్ళినప్పుడు చూశాను ఆమెను. ఇంకా చాలామంది చక్కని పిల్లలు వచ్చారు

నాకు ఆపిల్లలను చూస్తే అంతప్రేమ ఎందుకు కలగాలి. ఆ అమ్మాయికూడా నన్నే ఎందుకు ఆదరించాలి. ఎందుకుఅంటే ఏమీ అర్థంకాలేదు. చంద్రుడు చక్కనివాడనా కలువముడియడం? అందరిలాంటిదైతే ఏమీ ఇబ్బంది లేకపోయేది. జమీందారుల యింటిబిడ్డ వెంట ఎంతవుందో పరివారం. ఎంతప్రేమిస్తున్నా నాతో మట్లాడాలని ఎంత ముచ్చటున్నా తప్పించుకు రావడానికి వీలుండేదికాదు. ఎప్పుడూ విడవకుండా ఒక ముసలి దాసీది ఉండేది. దాన్ని చూస్తేనే నాకు భయం వేసేది. ఆకళ్లల్లోంచి అసూయ మాత్సర్యం కురుస్తూండేవి. ఆ బంగారం బొమ్మను చూచినప్పుడుకూడా ఎంతకోరకోరలాడేదని ఏమైతేనేమి ఏదోవిధంగా వీలుచేయమని ఎట్లావచ్చేదో నాకేచిత్రంగా వుంది. అలాగే రోజుకు ఒకగంటో, రెండుగంటలో, ఆమె నాదగ్గరవుండేది ఇంటికి వెళ్ళడానికి నన్ను వదలలేక, వెక్కి వెక్కి ఏడుస్తు, బండిలో ఎక్కిపోయేది. ఎంత సంతోషంగా గడిచినాయి ఆరోజులు !

వేసవి కనుక జబ్బుచేస్తుందేమోనని, తలిదండ్రులు ఊరుపంపించారట, వచ్చిన రెండు నెలలనుంచీ, మనసులో ఏదో బెంగగావున్నట్లుండి ఏమీ తోచక చివరకు జబ్బుకూడ చేసిందట నేను చూసేటప్పటికి కాస్త నిమ్మళంగావుంటే ఉత్సవం చూడాలని ఒకనాడు అందరూ బలవంతంచేస్తే బయలుదేరిందట. చాలా సన్నంగానూ, బలహీనంగాను వుంది. అయితే, ఆకళ్లు, ఆసంతోషం చిమ్మేకళ్ళు! ఆచిగురుపెదవులు ! ( నన్ను వెంటాడిస్తున్నాయి; కలలోను మేలుకున్నప్పుడూ, కనబడేవి అవే. వాటి కోసమే గా మిమ్మల్నందరినికూడా విడిచిపెట్టి వెళుతూంటి. అక్కడాఉంటాయా అవి!

వారంరోజుల్లో వెళ్ళిపోతానని చెప్పింది. తండ్రి జమిందారని మొదట చెప్పానుకాదూ? తన మేలు కోరేవాళ్ల మాటలన్నీ పెడచెవినిబెట్టి చెడ్డవాళ్లందరినీ ఆదరించి వాళ్ల చెప్పు చేతల్లో

ఉంటూ రకాల పాలయి నాడుట. మొదట నుంచీ చాలా ఘనంగా బ్రతికారు. పెద్దలందరు సంపాయించి యిచ్చిన డబ్బంతా పోవడానికి వప్పుకున్నాడుగాని పేరు పోకూడదట. అందుకోసం వంశమైనా నరే ఎవరి కడ్డం కలిగినా లెక్కచేయకుండా చేయడానికి సిద్ధపడ్డాడు. సాటి జమిందారుకు పెద్దమొత్తంబాకీ. ఆతడికి యీ యేకైన కూతురుని పెళ్ళాడాలని కోరిక. చేతిలో చిక్కాడుగా? నిర్బంధించాడు. పిల్ల నియ్యకపోతే కోర్టుకెక్కించడం పెళ్ళిచేస్తే పుస్తెకట్టకముందు బాకీ రద్దుచేసినట్లుపత్రంమీద వసూలు వేయడం ఈ రెండింటిలో ఏదారి మేలు? పిల్లకి యిష్టంలేదని సంబంధం ఒప్పుకోకుండా, రచ్చకెక్కి ప్రతిష్ట పోగొట్టుకోవటమా?—ఇటు బాకీచెల్లుతుంది. అటు అండగా కలిగిన అల్లుడువస్తాడు. పిల్ల కయిష్టమయితేనేం ఉత్తరోత్రా సుఖపడటంకలుగుతుంది, ఆవిధంగా చేయడమా?—ఆలోచనలకేం, మంచివాళ్ళకి చెడ్డవాళ్ళకీ సమానంగానే వస్తాయి మంచివి, చెడ్డవి, వాటినిపట్టి వ్యవహరించేటప్పుడు తేలుతుంది ఒక్కొక్కరి పెద్దమనిషి తరహా—తన తాతల పరువు నిలబెట్టడానికి, కూతురిని బలి యిచ్చేయాలిసిందేనా? బంగారపు పంజరం అని పిట్ట సంతోషిస్తుందా ఎన్నడైనా—నాఆలోచనల కేంలే — ఈమాదిరి ధోరణిలోపడితే చెప్పాలిసిన సంగతులు వెనకబడతాయి, విషయం తెలిసిన తరువాత నన్ను బాగా యెరుగున్న నీకు చాలా తేలిగ్గాతెలుస్తాయి నాఊహాలెట్లా ఉండేవో?

ఆవారంలో ఆరురోజులు గడిచిపోయినాయి —పోతున్నాయని భయపడ్డకొద్దీ, లేనిపోని జవసత్త్వాలు తెచ్చిపెట్టుకుని అలాపరుగెత్తటం యెందుకో; విడిపోయే రోజులు దగ్గరపడ్డాయని విచారం.ఇద్దరం ఒకచోట ఉన్నామనిసంతోషం; మాకుకావలసిందిసంతోషంపడుతూన్నదివిచారం ఎలా కుదురుతుంది.

నాలుగు గంటలు వేశాయి. మామూలుగా వచ్చే వేళయింది. రేపటితో జీవితంలోంచి సంతోషం మాయమౌతుందని నాకూ తెలుసు. ఎప్పుడు వస్తుందాఅని ఎదురు చూస్తున్నాను. రోజూకన్న కాస్త ఆలస్యంగా వచ్చింది. అవాళ ఎంత బాగుందని చెప్పను. సన్నచుట్టుజరీచీర, ఎడమవేపు కుచ్చెళ్ళు వచ్చేట్టుగా కట్టింది. నీలం పట్టురవిక, మెడదగ్గర చదరంగా కత్తిరించింది తొడుక్కుంది, మెళ్లో కెంపులు రవ్వలు కూర్చినపట్టెడ; చేతులకి రోజాగాజులు, ముత్యాలగిలకలు; ఒకేమాదిరి జాజిమొగ్గలతో వంకీల జడ, దానిమీద నడుంగా పచ్చలు. రవ్వలు, నీలాలూ, పొదిగిన తిరుగుడుపువ్వూ — ధరించినవన్నీ సామాన్యంనగలే, ఆమె దర్జా ఆనగలతోనూ, ఎర్రబడ్డ కళ్లతోనూ, చక్కదనం చిమ్మేస్తు. కాని నవ్వుతెచ్చుకుంటూ మెల్లిగా నడిచి నేను కూర్చున్న సోఫాదగ్గరకు వచ్చింది.

"కూర్చోవూ!" అన్నాను. ఏమీ జవాబు చెప్పకుండా, రవివర్మ ఊర్వశి పురూరవ పటం వంక చూస్తు నుంచుంది నావైపన్నా చూడలేదు.

నేను దగ్గరకు వెళ్ళాను...! "కూర్చోవూ? ఎందుకింత ఆలస్యంగా వచ్చావు. చూడు గడియారం, అయిదయింది. నేను యీలోకంలో సుఖపడేదాంట్లో ఒకగంట తగ్గించేశావా?"

"రమణా! (నీవు పిలిచినట్లే పిలిచేది. ఆమె కూడా నన్ను) మన జీవితాలు చాల చిత్రంగా కనిపిస్తున్నాయి. నేను పుట్టుకతోనే కష్టాలు తెచ్చిపెట్టుకున్నాననుకో? నన్ను ఎరుగున్నతరు

వాతనేకాదు నీవిలా విచారపడటం ? జీవితంలో మనం అనుకున్నట్లుగా సంతోషంగా ఉండటానికి వీలులేదుకదా ? ఇకముందు సుఖపడటంఅంటే కష్టాలుపడలేమని తోచినప్పుడు, వెనకసంగతులు జ్ఞాపకంచేసుకుని ధైర్యం తెచ్చుకోటం:— అదుగో, మళ్ళా ఏడుపు మొదలుపెట్టావా ? ఏడవటం మావంతుకాదూ ? నేనుచూడు ఎంత సంతోషంగా వున్నానో ? ఎందుకు విచారించడం గంటసేపు ఆలస్యం చేశానన్నావే. ఈ గంట కాస్తా ఏడుస్తూ గడిపేస్తావా ? రేపుసాయంకాలము నీ...నీకు కనబడదు తెలుసునా ?"

" నామాటవినవూ ? మావూరు వెళ్ళిపోదాంరా ? నీసుఖం చూడకుండా ఆముసలాడికి డబ్బుచూచి నిన్ను కట్టిపెడుతూంటే తల్లిదండ్రులని ఇంకా అభిమానిస్తావెందుకూ ?"

"నాసంగతి తెలియదు ఊరుకో, నాన్నా అమ్మా విచారించడంలేదా ఏం. వాళ్ళకీ తెలియదూ, కడుపులోతిండి, కట్టుకునేందుకు బట్ట అబ్బేందుకే యీపెళ్లని ? ఏంచేస్తారు వాళ్ళు మాత్రం. నేను నిర్భాగ్యురాల్ని. అమ్మ పుట్టింటివారిది మంచిసంస్థానంకాదూ ? నాన్నమాత్రం పేరున్నవాడుకాదూ ? వాళ్ళునేటికి యీదశకు వచ్చారని విచారపడకుండా వాళ్ళకడుపున పుట్టి, మాటవినకుండా కూడా విచారపెట్టనా ? ఆముసలాయన ఏం అనుభవిస్తాడు పాపం: మనస్సు రమణకి ఇచ్చేశానుగదా ? శరీరాన్ని కొనుక్కుంటున్నాడు. డబ్బుకడతాడు మెడకితాడేసి యింటికి తీసికెళ్తాడు. నమస్తోపచారాలు చేయిస్తాడు. అంతేనా ?"

" నాకాసంగతులు చెప్పవద్దు. నామాటవిని నేను చెప్పినట్టుగా చేయవూ ? ఎందుకు అంత దయలేదు నామీద ? సుఖపడటానికి సుళువైన మార్గముంటే అది పిడిచిపెట్టి తప్పుదారితీయడం ఎందుకూ ?"

" నీఆలోచన మంచిదే ! కాని నేనాలోచించింది మంచిదైనా కాకపోయినా అవశ్యం చేసి తీరాలి. నిన్నుబట్టి నీవు సుఖపడుదామని చూస్తున్నావు, నేను ఇంకోళ్ళను సుఖపెడదామని చూస్తున్నాను. సుఖమేటికిలే కన్నందుకు పెంచినందుకు వారిని తలవంచుకోపనిలేండా చేద్దామనుకుంటున్నాను. అదినాకు సుఖం. నేను సుఖపడనా కష్టపడనా ? ఏదినీకిష్టం ?"

" క్షమించు ఏదో ఉద్రేకంలో అన్నాను. నీసంగతి తెలియక కాదు ?"

"రమణా! మనకిద్దరికి అంతపుణ్యం కూడానా? ఒకరు తప్పుచేయడం, ఇంకొకరు క్షమించడం అంటూ, మనయిద్దరివీ తప్పులే. జమీందారుల పిల్లని బ్రాహ్మడు ప్రేమించడం తప్పు, ఆపిల్ల ఆతణ్ణి నిరాకరించకపోవడం తప్పు.— తప్పులే చేశాం సుఖపడ్డామాలేదా ?"

"అసంగతులన్నీ ఎందుకుగాని నేనొకటి చెపుతాను తప్పకుండా చేసితీరాలి."

" ఏమిటి "

" పెళ్ళికి రావడం "

" నీపెళ్ళికా "

" ఏమిటి "

" పెళ్ళికి రావడం "

" నీపెళ్ళికా "

" మరెవరి పెళ్ళికనుకున్నావు ? నీపెళ్ళికి పిలవద్దులే, నాపెళ్లికిరా !. . . . . . . ."

ఏమిటా ఏడుపు నెత్తిమీద నీళ్ళకుండ కాస్త కిందికి దించుదూ ? చెప్పేసంగతివిను. నీవువచ్చి తీరాలి తెలుసునా ! నిన్నుచూస్తే నాకుధైర్యం

వస్తుంది. ఎందుకంటే ఎంతవిచారపడుతున్నావో నాకు తెలుసు, నేను ఊహించగలను గనుక, లేకపోతే, ఆవేళకి కళ్ళనీళ్ళు పెట్టుకుంటే ఎంత అమర్యాద. పరువేమన్నా ఉంటుందా? అమ్మా నాన్నా, అసలు నేను ఏంగోల చేస్తానో అని దిగులుపడుతున్నారు. నిన్ను చూస్తే నాకు కావలసినంత ధైర్యంవస్తుంది. నీకుమాత్రం ముచ్చట గాదు. నేనంత ధైర్యంగా ఉండటం చూడటం? ఏం రావూ? శుభ లేఖ కావాలా? పెళ్లికూతురు పిలిస్తే చాలదూ? నీ వెప్పుడన్నా చూస్తావూ? ఆపాటకచేరీలు, ఆ తమాషాలు, ఆవింతలూ, డబ్బుచ్చుకోకుండా తిన్నన్నిలడ్డూలు — కొత్త పంచెలూ."

"చంపేద్దు. ఎందుకట్లా బాధిస్తావు; మాటలతో చంపడం ఎందుకు"

"మాటలతోనా. మాటలతో బ్రతికాము. మాటలకోసమే, మాటలు తలుచుకుంటూనే బ్రతుకుతాము. వస్తావుకాదూ?"

"సరే"

పైన సంభాషణంతా చదివావుగనుక సంగతి చాలావరకు నీకు తెలిసిపోయింది. ఇద్దరం ఎంతకష్టపడుతున్నామో, ఒకరిని ఒకరు ఎంతగా ప్రేమించామో, ఎందుకు వచ్చింది ఆపాడు పెండ్లి!

ఎంతోసేపు వుండలేదు. చీకటిపడకముందే వెళ్ళిపోయింది. నేనుకూడా ఆరాత్రి చాలా సుఖంగా నిద్రపోయినాను. మరునాడల్లాకూడా సంతోషంగానే నడచిపోయింది. పెద్దతుపానుకు ముందుండే ప్రశాంతిలాగా కనిపించింది నాకు

సాయంత్రం మామూలువేళకే వచ్చింది. చాలాసేపు తోటలో కూర్చుని మాట్లాడుకున్నాము. కనుచీకటి పడుతుండగా మాధవరం తోటకు షికారువెళ్ళాము. ఒకమూలకువెళ్లి రాచయుసిరిక చెట్టుక్రింద మల్లెపొదలచాటున కూర్చున్నాము. మాట్లాడుకో లేదు. ఆట్టే ఒకళ్లని ఒకరు కరుపుతీరేటట్టు చూచుకుంటూ కూర్చున్నాము. చెట్ల ఆకులు కదిలినా ఎవరో మమ్మల్ని చూస్తూన్నారని భయమేసేది. రెండు మూడు మాట్లు అలాగే అనుకుని చుట్టూరా వెతికాను. ఎవరన్నా ఆపొదల్లో దాక్కొని మమ్మల్ని చూస్తూన్నారేమో ననుకుని;

ఎవరితోనైవను వారు యింటికి వచ్చేశాము. తెల్లారే, ఆమె వాళ్ళ ఊరువెళ్ళింది నేమూ మన ఊరు వచ్చేశాను. 'ఏమిటిరా యీవేషం. కళ్ళుగుంటలు పడ్డాయేమ'ని నువ్వు అడిగావు జ్ఞాపకంలేదూ? ఇప్పుడు ఆవేషం జ్ఞాపకం తెచ్చుకో అర్థమౌతుంది

నెల్లాళ్లకు శుభలేఖ వచ్చింది. నాకు కాదు. నీకు! అది నీవు చూడకుండా దాచాను. మా పినతల్లి కూతురి పెళ్లికని బయలుదేరాను తెలియదూ? అక్కడికే, సదస్సులో కూర్చున్నాను. ఆముద్దుమొఖం, ఆచిరునవ్వు, వన్నెతరగకుండా సాక్షాత్కరించాయి! "పిల్లకీ సంతోషంకాదా ఏం, ఎవరికిపట్టింది ఇంత అదృష్టం" అన్నాడు ప్రక్క కూర్చున్న ముసలాయన, నాకు తప్ప ఎవరిక తెలుసు ఆసంతోషం, ఆనవ్వు, ఏమిటో, ఎందుకో, అంతమంది జనములో ఎక్కడ కనుక్కుంటుంది నన్ను పాపం, నాకోసం నాలుగుమూలలా చూస్తూనేవుంది. ఆ అయిదు రోజులు ఆచూపే, ఆమాదిరిగానే ఎవరితోనైవను వారు పంచెలుకట్టుకొని బసుమానాలు పుచ్చుకొని ఊళ్ళకు చేరుకున్నారు. నేమూ బసదగ్గర నుంచీ బండిలో సామాను లన్నీ ఎక్కించి ప్రయాణమైనాను. ఒకచిన్న కబురు వచ్చింది.

ఎవరు తెచ్చారో తెలియదు. బండివాడు యిచ్చేడు. అసలు వాడే తెచ్చాడేమోనని అనుమానం. చించడంతోనే చిన్న కాగితం మడత రెండుంగరాలు బయటపడ్డాయి.

మసిద్దరిపేర్లూ ఉన్నాయి ఉంగరాలమీద. వేలినుంచి తీసివేయవలదు ఎప్పుడూ నన్ను చూడాలని తొందరపడి రావద్దు. నిన్ను చూడాలంటే నేనెట్లాగో తెలియపరుస్తాలే. చూడక పోతే మరిచిపోవుగా!

ఏడుపువచ్చినమాట నిజమే. ధైర్యం చెప్పేందుకు ఏదీ దగ్గిర! ఇష్టంవచ్చినంత సేపు దిగులు పోయేదాకా బండిలో ఏడుస్తూనే ఉన్నాను. బండివాడు ఎందుకని అడగలేదు. వాడూ నాతో పాటే

నేనెంత కష్టపడుతున్నా నీతో చెప్పూదామంటే ఎందుచేతనో మనసొప్పేదికాదూ: వేదన మరింత ఎక్కువౌటం మొదలుపెట్టింది. గుండె పగిలి చచ్చిపోతానేమోనని అనుకునేవాణ్ణి భయమేసేది. చచ్చిపోయినా కొంతమేలేగా; ఒక్కొక్కప్పుడు, ఆమెఏమి చేస్తుందో సాయంకాలముపూట అందరూ సంతోషంగా షికారు వెళ్ళుతుంటే ఒకమూల కూర్చుని కళ్ళనీళ్ళు కారుస్తూ ఆమెను తలుచుకుంటూ నేను కూర్చున్నట్టుగానే తనుకూడా మంచిచీరెలు, నగలు వదిలేసి, ఏం సౌఖ్యాలు అనుభవించకుండా నాలాగే విచారిస్తు కూర్చుందేమో అనిపించేది. నవ్వు మొగంతో, ఆజమీందారుతో కలిసి మోటారులో షికారు వెళ్ళుతూన్నట్టుగా తలచుకుని, ఆమెను తిట్టేవాణ్ని — నన్నిలాకష్టపెడుతూ నన్నుచప్పగా మరచిపోయి సుఖపడుతూందని.

మూడేళ్ళు గడిచినాయి మనసులో ఎంత దుఃఖమున్నా, దాన్ని దాచి, లేనిపోని నవ్వు తెచ్చుకుంటూ చాలా ఖులాసాగా వున్నట్లు బయటికి కనబడదామని ఎంత యత్నించేవాణ్ని. ఒక్కొక్కప్పుడు నన్ను చూసుకుంటే నాకే అసహ్యంవేసేది. నేనేదీనికంతా కారకుణ్నేమో:— నేను 'తప్పక రమ్మని' బలవంతం చేస్తే నామాట తీసివేయలేక వచ్చేదేమో?. . . అప్పుడు, ఈ దుఃఖం, ఈ వేదన, అనేవి ఎరగకుండా ఎంత సంతోషంగా కాలం గడిపేవాళ్ళం? ఒకవేళ నామీద ప్రేమవున్నా నన్ను పెండ్లి చేసుకుని పేదవాడి పెళ్ళాము కావడం యిష్టం లేదేమో ?

మామూలు వేళకు ఆఫీసునుంచి వచ్చాను. ఆవాళ మరీ ఎందుచేతనో ఏమీ తోచ లేదు. మాటిమాటికి ఆమె తలపుకు వస్తుంది. జ్ఞాపకం వచ్చి, కళ్ళనీళ్ళు వచ్చాయి. జన్మంతా ఇలా గడిచి పోవాలిసిందేనా. మేము ఏం పాపం చేసామని మాకీశిక్ష:—

తలుపు తోసుకుని ఎవరో ఆవిడ లోపలికి వచ్చింది. ఎవరో, ఎందుకో! నాకోసం ఎవరూ రావడం మామూలులేదే. నాకెవ్వరూ దగ్గిర బంధువులన్నా లేరు. సరే. లేచి నుంచున్నాను. ఆమె తిన్నగా దగ్గరకువచ్చింది. అంతవరకు ముఖంవంక నేనుచూడలేదు, 'రమణయ్యాగారు!' అని పలకరించింది. గుర్తుపట్టాను. ఆ! ఎరక్కేం ఆమె స్నేహితురాలు. మేము వెనుక మాధవరం తోటకు షికారు వెళ్ళినప్పుడు మావెంటవచ్చింది, మాస్నేహం సంగతి తెలుసు.

'కూర్చోండి' అని సోఫా చూపించాను. "ఎప్పుడు వచ్చారు, ఎక్కడనుంచి, చాలాకాలమైంది మిమ్మల్ని చూచి" అడుగుదామనుకున్న సంగతులు ఆలవికావు 'ఆమె' ఎట్లాఉందో తెలుసుకుందామని ఎంతో ఆదుర్దాగాఉంది.

కాని రావడంతోనే ఆమాట అడిగితే ఏమను కుంటుందో మాటల ధోరణిలో ఆమె చెప్పదా అనుకున్నాను.

"చాలాదూరంనుంచి వస్తున్నానులెండి. వేసగిలో ప్రయాణం చేయడం కష్టమే: అయినా చేయాలసినపని చాలా అవసరమైనది. నా ప్రాణం కన్న ఎక్కువగా చూచుకొనే ఒకరి గౌరవం కాపాడటం. అందుచేత ఎండా వాన, నన్నడ్డుపెడుతాయా? మీరు క్షేమంగానే వున్నారుకాదూ?"

'క్షేమంగా వున్నట్టుగానే కనబడటంలే.'

"దానికేం అందరినీ మోసబుచ్చటంలేదు. సంగతులన్నీ తెలిసిన నాకుమాత్రం—

"నన్ను సంతోషపరచే సంగతి మీకు తెలుసు చెప్పరూ."

ఆమె కొంతసేపుమౌనంగకూర్చుంది. తరువాత

"చూడండి వేసగి తీవ్రంగావుంది. సామాన్యంగా ఎండకు చెట్ల ఆకులు, పువ్వులువాడి, మాడిపోతాయిగా?"

"అవును"

"కొన్ని మామూలుఎండే భరించలేవు. సూర్యుడు కాస్త కన్ను తెరిచాడంటే, ఆచక్కదనంఅంతా జారవిడిచి తొడిమవదలి క్రిందపడి మంటిలో కలిసి మాయమౌతాయి."

"అవిమరీ మంచిరకం పువ్వులై తేను. సామాన్యంగా ఎంతో మంచిజాతి పువ్వై తేనేగాని మామూలుఎండకు మాడిపోదు."

"నేను చెప్పినదీ మంచిపువ్వుల సంగతే."

"అన్నిపువ్వులూనా"

"అన్నిటి సంగతీఎందుకు, మనకుకావలసింది"

నావంక చూడలేకపోయింది కళ్ళనీళ్ళు తుడుచుకుంటు పెద్దగా ఏడుస్తు 'మమ్నందరినీ విడిచిపోయింది' అని పడిపోయింది

"పోయింది! ప్రేమించాను బాగా, అవునురే' ఎంతబాగానో నాకుమాత్రమే తెలుసు. భూమిమీద ఉండకుండా పోయిందా? నాఆశలన్నీ—"

ఆమె తెప్పరిలి లేచికూర్చున్నది. ముఖం తుడుచుకుని పాపిట చక్కబరచుకొని, నేను నుంచున్నచోటికి వచ్చింది.

"మనం విచారపడటంవల్ల ఏంలాభంలేదు. పోయింది. మనంమాత్రం ఎప్పుడో వెళ్ళిపోక కూర్చుంటామా? అయితే వెళ్లిపోక ముందు ఒకపని చేయాలిసివుంది. నావంతు నేను నిర్వహించాను. మిగిలినదిమీవంతు ఆమెకోసం— మిమ్మల్ని ప్రేమించి, మీకష్టాల్ని తెలుచుకుంటూ విచారంతో కృంగిపోయి అంత చిన్నతనంలోనే చచ్చిపోయి దే, ఆమెకోసం – చేస్తారుగాదూ?

"తప్పకుండా మీకుమాత్రం తెలియదూ" నేనేం జవాబుచెపుతానో."

"సరేవినండి. మీకుఒకర్ని ఒకరు ఎడబాసిన తరువాత, మీసంగతులేమీ నాకు తెలిసేవికావు. ఆమెమాత్రం ఎప్పటికప్పుడు మీయోగక్షేమం తెలుసుకుంటూనే వున్నదట. "రమణా" అంటూనే ప్రాణం విడిచింది. చివరకు నాకుతప్ప ఎవరికీ అదేమిటో తెలియదు. అందరూ వెంకటరమణా అనో, జానకీరమణా అనో అన్నదనుకున్నారు. కాని ఆరమణులందరూ ప్రసాదించలేని సుఖసంపత్తిని ఒనగూర్చిన రమణఎవరో నాకుమాత్రమే తెలుసు...... ............ అదంతా గడిచిపోయింది. ఆమాటలతో ఏంప్రయోజనంలేదు. ఇవిగో, ఇవి చూచారా?"

చిన్న కాగితములు చేతికిచ్చింది. చూచాను. ఫొటోగ్రాఫులు, నేనూ ఆమె వున్నాంవాటిల్లో. ఎవరుతీశారు? ఎప్పుడు? ఎక్కడ? మారహస్యం వెల్లడయిందా?

"ఫొటోగ్రాపులు చూశారుగదా! ఇవి మనం ఆరోజున మాధవరం తోటలోకి వెళ్ళి నప్పుడు తీశాడు. మధ్య మధ్య క్లిక్, క్లిక్, అని చప్పుడు వినబడలా, అదే.—"

"ఆమె చచ్చిపోయింది బ్రతికున్నన్నాళ్ళు మంచిదనిపించుకున్నది. అందరూ ఆమెను తల్లిలాగా చూసుకునేవారు కాపురానికి వచ్చిన ఏడాదికి ఒకపిల్లవాడు కలిగాడు.—రమణ అని పెట్టింది ఆతనిపేరు—తరువాత కొద్దిరోజుల్లోనే చచ్చిపోయింది. జమీందారు మంచం పట్టాడు. ఆతనుకూడా ఎంతకాలమో బ్రతుకునే లేదు. పిల్లవాడున్నాడుకదా వారసుడు, వాడికి ఆస్తిని దక్కనీయకుండా చేయాలని, దివాను పట్టుపట్టాడు. దగ్గరవారసుడి డబ్బు బాగాతిని వాడికి సంక్రమించేటట్టు చేయాలని చచ్చిపోయిన రాణీప్రవర్తన మంచిదికాదని, ఆపిల్లవాడు జమీందారుకు వారసుడుకాడని, ఋజువుచేయ డానికి యత్నిస్తున్నారు. ఈమాటలన్నీ చాలా మంది నమ్మి, పిల్లవాడ్ని తోసివేసి ఆపెద్దాతనికి ఆస్తిఅంతా వచ్చేటట్టుచేయాలని చూస్తున్నారు. ఇంతలోనే వీరికి ఒకదుర్మార్గుడు సాయపడ్డాడు. వాడు యీఫొటోగ్రాపులు లక్షరూపాయలకి అమ్మేడు, వీటికి ప్రతులుతీసి పంచిపెడుతారట. ప్రజలు చూశారా అంటే ఇంకేమన్నా వుందా? లోకంలో శాశ్వతంగా అపకీర్తి నిలిచిపోతుంది కాదూ? నేనెంతో కష్టపడి వీటిని సంగ్రహించు కొచ్చాను నన్ను చంపేద్దామని చూచారు. నేను అరచేతుల్లో ప్రాణాలుపెట్టుకుని మిమ్మల్ని వెతుక్కుంటూ నాలుగువందల మైళ్ళ దూరం నుంచి వచ్చాను. ఈ కాపీలు తగలబెట్టేయచ్చు. వీటి అసలు ఫిలుములు ఒకరిదగ్గర వున్నాయి. ఆత పెలాటివాడో మీతో చెప్పాను కదా. మంచితనంగా రాబట్టడానికి వీలులేదు. మీరు ఏవిధంగానన్నా ప్రయత్నించి అవి సంపాదించి తగలబెట్టేయాలి. అప్పుడు, ఆమె మంచిపేరు నిలుస్తుంది, పిల్లవాడికి ఆస్తి దక్కుతుంది; అలా చేస్తారా?"

"చేస్తాను. ఆతడెవరో నాకు తెలియదే"

"నేను చెపుతాను నాకు తెలుసు. ఆతని చిరునామా ఈకాగితంమీద వున్నది తీసుకోండి. రేపు సాయంత్రంలోగానే మీరు అవి సంపా దించాలి. లేకపోతే, నన్ను వెంటాడుతున్నా రన్నానే వాళ్ళు యిక్కడికి చేరుకుంటారు. అప్పుడు వాళ్ళచేతుల్లోపడితే మనం పడేశ్రమ అంతా వృధాఅవుతుంది. శాశ్వతంగా నిలిచి వుంటుంది, ఆమెకు వారు అపాదించే కళంకం"

"నేను నాశక్తికొద్ది యత్నిస్తాను. నాప్రాణం పోయినా యేమి లక్ష్యంచేయను. ఏవిధంగా నైనా రేపు సాయంకాలంలోగా ఆదుర్మార్గుడి దగ్గరనుంచి తీసుకువచ్చేస్తాను. అంతేకాదూ?"

"అవును. మీరు తప్పకుండా కృతకృత్యులు కాగలరనే నమ్మకం నాకువున్నది. మీకన్న ఎవరున్నారు, ఆమెకు ఈ లోకంలో!—బంధువులుగాని, స్నేహితులుగాని, ఆమె నభిమానించే వారుగాని—విజయంమీకే నేను వెళుతాను. ఇక నన్ను వాళ్ళుపట్టుకున్నా ఏం భయంలేదు. చంపుతారు అంతే. వాళ్ళకు కావలసిన వస్తువులు దొరకవుగా – సెలవు–మనము దరం మళ్ళా ఆలోకంలోనే కలుసుకుందాం. ఎందుకుఈపాడు లోకంలో –ఎన్నాళ్ళని.—"

వెళ్ళిపోయింది. నేనూ ఏంచేయాలో నిశ్చ యించుకున్నాను. రేపటిదాకా ఊరుకోటమెం దుకు? ఒకనిమిషం గడిచినకొద్దీ ఏంరానున్నదో తెలియదుగదా? ఆతనిసోఫాను నంబరువు

కంలో చూచి, ఫోను చేశాను. ఇంటిదగ్గర లేదని ఎవరో జవాబు చెప్పారు. ఆమాదిరిగా గంట గంటకు, ఇంటికిరాలేదనే జవాబు, నాకు అనుమానం కలిగింది ఈసంగతులన్నీ తెలుసుకుని ఒకవేళ, ఫిలిములు పట్టుకుని పారిపోయినాడేమో. ఒకతూరి చేతులోంచి తప్పించుకుంటే ఇకమళ్లా దొరుకుతాడా? నాకేమీ తోచిందికాదు. ఎందుకోసం పిలిచానో, గ్రహించి, ఇంటిదగ్గరఉండి కూడా లేడనిపిస్తున్నాడో — ఏసంగతీ తేలడానికి తిన్నగా అతనియింటికే బయలుదేరాను.

ఎంతో పొద్దుపోలేదు. నాటకాలకి సినీమాలకీ వెళ్లినజనం ఇంకా తిరిగిరావటం లేదు. అందుచేత బండి త్వరగానే చేసుకుని, కాస్త దూరంగా తీసుకువెళ్లి నిలవబెట్టుమని బండివాడితో చెప్పి నేను తలుపుకొట్టాను.

కిటికీతలుపులన్నీ వేసిఉన్నాయి. లోపల దీపం వున్నట్లెక్కడా కనుపించడంలేదు. బయటంతాకూడా ధూళెత్తుతూంది. మనుష్యులు కాపురంచేస్తున్న ఇల్లులాగలేదు పగిలిపోయిన కుంపట్లు, వాడిపోయిన మొక్కలు, పొయిలోకి పనికొచ్చే పాతసామానులు, ఎక్కడవక్కడ రాసులుగా పడివున్నాయి.

నాలుగైదుమాట్లు కొట్టినతరువాత నౌకరు వచ్చి తలుపుతీశాడు. "పంతులుగారున్నారా" అన్నాను. నన్ను ఎగాదిగా చూచి కదలిచిరిచి "ఏమో" అంటూ చప్పున తలుపేసుకుపోయినాడు. నేను తలుపు రెక్క పట్టుకుని ఒకఅడుగు లోపలికివేసి "మీకోసం ఎవరో వచ్చారు. మాట్లాడవలసినపని వుందట అని చెప్పు" అని వారివెంట కొంచెం దూరంలో నేను లోపలికి నడిచాను.

మేడమీదికి ఎక్కి, వసారాముందర చిన్న గది తలుపులోపలికి తోసుకువెళ్ళాడు. నేను బయట నిలబడ్డాను. 'ఎందుకు తీశావురా! బుద్ధిలేదూ! ఇంటోలేరని చెప్పు' అని బిగ్గరగా లోపలినుంచి బొంగురు గొంతుకతో కేకలు వినపడ్డాయి. నౌకరు బయటికివచ్చాడు. నేను వెంటనే లోపల ప్రవేశించాను.

చేయి విరిగిపోయిన కుర్చీమీద కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు కాళ్ళదగ్గర నల్ల కుక్క పడుకునివుంది. నన్నుకనిపెట్టి మొరిగింది.

"దా నాయనా, కూర్చో, ఏ పనిమీద వచ్చావు. మన దేవురాగు? అన్నాడు. మనసులో భావాలన్నీ బయటికి తోచనీయకుండా"

"ఇదిగో, పాపయ్యగారూ: ఎందుకువచ్చిన కబుర్లు. ఏవుర్రైతే ఎందుకుగాని నీదగ్గరఉన్న ఆవస్తువులు ఇచ్చేస్తావా ఇయ్యవా?'

"పిచ్చిపిల్లాడా! ఎంతసంపాదించా, వాటి మూలంగా? నీవే చెప్పు ఎవరైనా అంత లాభం వస్తుంటే చేతులారా చెడగొట్టుకుంటారా?"

"నీవు మనిషివికాదు రాక్షసుడవు. పచ్చిమాంసం తినేవాళ్లకున్న నీతులవాన్ని నీకులేవు.' ఒకళ్ళని అల్లరిపెడితే నీకేంవస్తుంది. సంపాదించిన డబ్బుచాలదు? ఇస్తావా, లేదా?

"ఎన్నిమాట్లు చెప్పను బాబూ, పడిఉండ నిద్దూ.'

"మర్యాదగా ఇయ్యవన్నమాట. అంతేనా? నామాటవిను. చెడిపోతావు. నా సంగతి తెలుసునా?"

"కావలసినంత మర్యాద వస్తుంది. దానికేం సంగతి తెలిస్తే ఏంలాభం. పోలీసువాళ్ళసంగతి తెలుసుకాదూ నీకు?"

"మాటలన్నీ చాల్లే. చంపేస్తా తెలిసిందా.

ఎక్కడున్నాయో బయటకుతీయి?"

"చంపుతావా! చంపటం ఎంతకష్టం నాయనా ఆపోలీసువాళ్ళదేం పోయిందో నీవు నన్నుచంపితే వాళ్ళకెందుకూ! వాళ్ళదేం పోయిందని నిన్ను పట్టుకుంటామంటారు. ఇనపపెట్టెకేం భయముంది"

" ఈయువన్నమాటేనా ? భూమిమీదవుండ తలుచుకోలేదన్నమాట. కానీలే, నీలాటి పాపాత్ముడు ఒకడు వదిలినా కొంతమేలే."

"నీమాటలువింటే ముచ్చటేస్తుంది గాబూ ఏదుకులే. మాబుచ్చిబాబు కులాసాగా మాట్లాడుతున్నాడు మీరు రావలసిన పనిలేదని వాళ్ళకు కబురుజేయనా ? స్టేషను దగ్గరే. అడుగ్గాపడి పరుగెత్తుకొస్తారు పాపం."

టెలిఫోను చేత్తోపుచ్చుకొని నంబరుచెప్పాడు రివాల్వరుతో కాల్చేశాను కిక్కురుమనకుండా క్రిందపడ్డాడు ఇనపపెట్టెలోవి బయటకు తీసి నాశనం చేశాను.

అనుకున్నపని జరిగిపోయింది. ఆమె పసుపు నిలిచింది

ఇలా తటస్థించితే నీవుమాత్రం ఇంతకన్న ఏంచేసేవాడవు!!

---

## స్వారాజ్యమరీచి

బెజవాడ రామచంద్రారెడ్డిగారు బి. ఎ., ఎం. యల్. సి.

ఉ॥ కొండలమందె డెందమదిగో యిదుగో యిటుగానవచ్చె నా
నందస్వరాజ్య నీరమని నాయకులెందరొ యాశజెప్పి నే
చందము గానరాక కడ చాయలు నూసిన కారణంబునన్
చిందరవందరయ్యె ధృతి జీర్ణములయ్యెను నాశపాశముల్.

సీ॥ తిలకాదినాయకుల్ తీవ్రంబుగాదోలు ♦ రథములు దారిలో రాలిపోయె
అనిబెసెంటమ్మ యఖిల యాతురముతో ♦ నడిపిన గజములు నలిగిపోయె
గాంధిమహాత్ముండు కడునేర్పుమీరంగ ♦ తోలినతురగముల్ సొలిపోయె
దాసునెహ్రూవరుల్ దాని జూపంగ ♦ నేగినకాల్బల మాగిపోయె.

గీ॥ దళిత స్వారాజ్యనీరంబు దవ్వులరిగె
దేశవాసుల దాహంబు దీవ్రమాయె
త్యాగశీలుర పోకడ లాగిపోయె
కార్యశూరుల పొలకువ కానదాయె॥

క॥ నిర్దయులగు నాంగ్లులకు
వ్యర్థముగాఁ మొక్కి మ్రొక్కి వ్యాకులపడుచున్
దుర్దశత హైందవోర్వియు
దుర్దమ దుఃఖంబుబొంది దూలెడునిపుడున్॥

# ఛత్రపతి శివాజీ

సింగంపల్లి వెంకటాద్రిగారు.

క్రీ॥ శ॥ 1674 సంవత్సరమువరకు శ్రీ శివాజీ పట్టాభిషిక్తుడు గాకుండెను. ఆకారణమున శ్రీ శివాజీ తన ఖడ్గబలముచే బుద్ధికుశలతచే నెన్ని రాజ్యములు సంపాదింపగలిగినను విశేష సైన్యముల సమకూర్చగలిగినను ప్రజలపై సర్వాధికారము వహించుచుండినను మకుట ధారణము లేనందున ఆయన శాసించు శాసనములకును, యేర్పాటులకును సర్వ జనాంగీకారము గణ్యత లేకుండెను. మొగల్ చక్రవర్తుల సామంతుడుగనో, మహావీరుడుగనో పరిగణింపబడుచు వచ్చెనేగాని సింహాసనారూఢుడై రాజముద్రిక మొదలుగాగల రాజచిహ్నముల ధరించి, స్వతంత్రించి ప్రజలనుండి పన్నులు వసూలు జేయుటకుగాని, జమీందారులయొద్దనుండి కప్పములు నజరానాలు గైకొనుటకుగాని, తోడి దేశాధీశుల మన్ననల నొందుటకుగాని తగిన అధికారము గౌరవ ప్రపత్తులు లేకుండెను. కొందరు మహారాష్ట్రులు తాము ఢిల్లీ పాదుషా యొక్కగాని, ఆదిల్ షాయొక్కగాని శాసనములకు బద్ధులమై యుందుమేగాని రాజాధికారములేని శ్రీశివాజీ యాజ్ఞలకు లోబడుట క్రమముగాదని తిరుగుబాటు చేయుచువచ్చిరి ఇట్టిచిక్కులు కలుగుచుండుటచే శ్రీ శివాజీ శ్రేయోభిలాషులు పట్టాభిషేక మహోత్సవము జరిపి రాజ్యాధిపత్యము వహించినట్లు ప్రకటించుటకై ప్రోత్సహింపసాగిరి ప్రజలును హిందు సామ్రాజ్య పునః ప్రతిష్టాపనమునకై యువ్విళ్ళూరుచుండిరి కాని శివాజీ మూర్ధాభిషిక్తుడగుట కొక యాటంకము కలిగెను. సనాతన హిందూ మతాచారము ననుసరించి క్షత్రియకులసంజాతుడుమాత్రమే సింహాసనారూఢుడగుటకు, మకుటధారణమునకు అర్హత కలిగియుండెను. శివాజీవంశీయులు బహుకాలమునుండి కృషీవలులుగను, పశుపాలకులుగ నుండి శూద్ర ధర్మముల నిర్వహించుచు వచ్చిరి. క్షత్రియధర్మము లవలంభించినట్లు తగిన యాధారములు లేకుండెను శివాజీ సింహాసనారూఢు డగుటకు పూర్వము క్షత్రియుడుగ పండితపామరులచే నంగీకరింపబడవలసివచ్చెను. శివాజీ యుత్తమ క్షత్రియుడనియు నెల్లవిధముల సింహాసనారూఢు డగుట కర్హుడనియు ప్రకటింపగల పండితుం డెక్కడ దొరకునా యని వెదుక చ్చిరి. కాశీపుర నివాసియగు "గంగాభట్టు" అను మహా పండితుడు లభించెను. ఆయనతో సమానముగా వాద ప్రతివాదములు జరిపి యేశాస్త్రమునందయినను, యేవిషయమునందయినను గెలుపొందగల శక్తి యెవ్వరికిని లేకుండెను. ప్రతివాది భయంకరుడగు నామహాపండితుడు శ్రీ శివాజీ సూర్యకులాబ్ధిచంద్రులగు వుదయపురాధీశ్వరుల సంతతిలో నొక శాఖవాడని ప్రకటించి పట్టాభిషేక మహోత్సవమునకు తగిన సుముహూర్తము నిశ్చయించి దేశమంతట నావిషయము ప్రకటింపజేసెను. మహోత్సవము అతి వైభవముతో జరుగుటకు తగిన యేర్పాటులు చేయసాగిరి. సనాతన పద్ధతి ననుసరించి సామ్రాజ్యాభిషేకము సక్రమముగ జరుగవలసిన విధివిధానముల నారయుటకు తగిన వస్తువులు సమకూర్చుటకు పండితసంఘములు నిర్ణయింపబడెను. ఉదయపురము, జయపురపు మహారాజుల పట్టాభిషేక మహోత్సవములందు అవలంబించు పద్ధతుల దెలిసికొన కొందరు నియమింపబడిరి. ఆసేతు హిమాచల పర్యంతమునంగల భూసురోత్తములకును, దేశాధీశులకును, వణిజులకును, శూద్రులకును వేయేల యందరకును శుభలేఖలు అహ్వానములంపబడెను. లక్షలకొలది ప్రేక్షకులు వచ్చిరి. వారివారికి తగినరీతుల సన్మానములు జరుగుటకు నగరమునందంతటను, మహారాష్ట్ర దేశ మంతటను వసతులు యేర్పాటుప బడెను. శివాజీ నిత్యకృత్యములు నిర్వర్తించుకొని సతతము పండితులతో సద్గోష్ఠి సలుపుచు వచ్చెను. గురువగు రామదాసులకును తల్లియు వృద్ధ తపస్వినియగు జీజీభాయికిని సర్వోపచారము లొనర్చుచు వారిచే దీవనలందుచు వచ్చెను. మహోత్సవమునకు కొన్నిదినముల పూర్వము దేవతానుగ్రహము పొందుటకై మహారాష్ట్రమునంగల పవిత్రక్షేత్రముల సేవించుటకును, పుణ్యతీర్థముల గ్రుంకులిడుటకును బయలుదేరను. ప్రతాపగడమునంగల భవానీ మాతను దర్శించి పూజ లత్యంతవైభవముతో జరిపి కానుకగ నొక సువర్ణఛత్రమును సమర్పించెను. ఆఛత్రమును రచించుటకు యేబది శేర్ల బంగారము పట్టెననియు యేబదివేల రూపాయలు విలువగుయ్యెననియు చరిత్రకారుల యభిప్రాయము. రాయగడమునంగల దేవతల కందరకు నేత్రోత్సవముగా యుత్సవములు జరిపించెను. కా

పండితునిచే క్షత్రియుడుగ ప్రకటింప బడుటతోడనే శ్రీ శివాజీకి యర్హత కలుగకుండెను. యజ్ఞోపవీత ధారణము కావలసియుండెను. చిరకాలమునుండి తనవంశీయులును తానును క్షత్రియ ధర్మములు పరిత్యజించినందులకు పాప పరిహారార్థముగ ప్రాయశ్చిత్తవిధులు గంగాభట్టు యధ్వర్యముక్రింద జరిపి యజ్ఞోపవీతమును గాయత్రీ మంత్రమును వడసి భూసురాశీర్వచనముల పొందెను. ఈసందర్భమున గురుదక్షిణగా గంగాభట్టునకు ముప్పదియైదువేల రూప్యములును బ్రాహ్మణులకు సంభావనల క్రింద యెనుబదియైదువేల రూప్యములును లభించెనట. ఆ మరుసటిదినమున శ్రీ శివాజీ తన జీవితకాలములో కని కానక చేసిన పాపదోష నివారణార్థమై ప్రత్యేకప్రత్యేకముగా తనయెత్తు బంగారము, వెండి, రాగి, యశదము, తగరము, సీసము, ఇనుము, పట్టు, కర్పూరము, ఉప్పు, వెన్న, చక్కెర, పుష్పములు, ఫలములు, తమలపాకులు, మధువు మొదలుగాగల వస్తువులతో తులదూగి వానినన్నిటిని బ్రాహ్మణోత్తములకు పంచిపెట్టి దానముల గ్రహించినందులకై ఐదులక్షల రూప్యములను సంభావనగా పంచిపెట్టెనట! చూచితిరా; శివాజీకిగల దేవబ్రాహ్మణభక్తి?

పట్టాభిషేక మహోత్సవదినమువరకు అనుదిన మేదో నొక కార్యమును జరిపి విరివిగ విరాళము లిచ్చుచునే వచ్చెను. సుముహూర్తమునకు పూర్వపు దినమున ప్రత్యేకముగ పండితులద్వారా తెప్పింపబడిన పవిత్రమగు గంగాతోయముతో స్నానమాడి పవిత్రుడై ధారాళముగ దాన ధర్మముల జేసెను. పట్టాభిషేక మహోత్సవ దినము సంప్రాప్తించెను. ఆక్రిందటి రాత్రియంతయు యుపవసించి భగవద్ధ్యానమొనర్చి యుండెను. ఉషఃకాలముననే లేచి నిత్యకృత్యములు మంత్రపూర్వకముగా నిర్వర్తించి సమయమున కెదురుజూచుచుండెను. లగ్నము సమీపించుటతోడనే శ్రీ శివాజీ విలువగల ధౌతవస్త్రములు, రత్న ఖచిత సువర్ణాభరణముల ధరించి, బంగరుపిడుల గుంచెలుగాగట్టిన చమరీమృగముల వింజామరములు వెండితీగల కుంచెలవలె ధవళకాంతులతో సేవకుల చేతులందు ప్రకాశించుచుండ శ్వేతాతపత్రాది రాజచిహ్నములు భృత్యకోటి హస్తముల నలంకరించుకొని వెంటరా మహారాష్ట్ర రాజ్యలక్ష్మిని చేబట్టుటకు శ్రీ శివాజీ ప్రత్యేకముగ నిర్మింపబడిన దివ్యమందిరమును ప్రవేశించి జయజయ ధ్వానములు మిన్నుముట్టుచుండ మంగళతూర్య నినాదములు మాఱుమ్రోగ నొక మణిమయ సువర్ణపీఠము నధిష్ఠించెను. ఆయన చెంతనే సహధర్మచారిణియగు శౌర్యభాయ్ సాలంకృతయై కూర్చుండెను. యౌవరాజ్యాభిషిక్తుడుగ గానలసిన శంభాజీ వేఱొక పీఠముపై కూర్చుండెను. సమస్త మంగళవాద్యములు మ్రోగుచుండ బ్రాహ్మణులెల్లరు యుచ్చైస్స్వరములతో మంత్రములు పఠించుచుండ వందిమాగధవర్గము స్తోత్రపాఠము లొనర్చుచుండ అష్టదిక్పాలురవలె సువర్ణ పీఠమునకు అష్టదిక్కుల అష్ట ప్రధానులు గంగాతోయమును హేమకలశములతో శ్రీ శివాజీ మూర్ధభాగముపైనను, శ్రీ శౌర్యభాయ్ శంభాజీల యుత్తమాంగములపైనను అభిషేకము జేసిరి. పదునారుగురు వృద్ధబ్రాహ్మణ ముత్తయిదువలు కనక పళ్ళెరములలో దీపములనుంచి హారతులెత్తి దృష్టిదోషమును పారద్రోలుటకోయన శివాజీచుట్టును ద్రిప్పిరి.

అంతట శివాజీ లేచి తానదివరకు ధరించిన ధౌతవస్త్రములనెల్లతీసివేసి జిలుగుసరిగ పూలపనిచేసిన యంగరకాను ధరించి అమూల్యమగు శిరోవేష్టమును, నవరత్న హారములను సుగంధ పుష్పమాలలను దాల్చి రత్నఖచితమగు బంగరుపిడియును రక్తవర్ణములగు పట్టుత్రాళ్ళుగల ఖడ్గమును బాణ విల్లనంబులాదిగాగల యాయుధములను పుష్ప గంధాక్షతలతో పూజించి కనులకద్దుకొని వృద్ధులకును బ్రాహ్మణులకును సాగిలబడి వారి దీవనలందుకొని పిమ్మట మంత్రి సామంత దండనాథులు వెంటరా వికసిత వదనముతో సహస్రకిరణునివలె తేజోరాశియై రత్నఖచితమగు సువర్ణ సింహాసన మమర్పబడిన దివ్య మందిరమును బ్రవేశించెను. ఆ మందిరమును వర్ణింప బ్రహ్మదులకైన నశక్యము. ఆమందిరముయొక్క కుడ్యములు నవగ్రహములనుబోలు రూపములతోను తదితర శుభచిహ్నములతోడను రమణీయముగ నలంకరింపబడెను. సింహాసనమున కష్టదిక్కులను స్వర్ణ మణిమయ స్తంభములు ప్రతిష్ఠింపబడెను. వానిపై నొక బంగారపు చాందినీ యమర్పబడెను. ఆచాందినీపై వింత రంగుల పూలతీగలు ప్రాకుచున్నట్లు రత్నములు చెక్కబడెను. ఆచాందినీనుండి మంచి ముత్యముల సరములు వింతరీతుల వ్రేలాడునట్లు అమర్పబడెను. మందిరముయొక్క అడుగుభాగమంతయు రత్నకంబళములతోను మొగమల్ గుడ్డలతోడను పఱచియుంచబడెను. సింహాసనముపై వ్యాఘ్రచర్మ మొకటి యుంచబడెను. ఆసింహాసనమును రచించుటకు ముప్పదిరెండు మణుగుల బంగారము పట్టెననియు నలుబది లక్షల రూప్యములు వ్యయమయ్యెననియు తెలిసికొనగోరెద. సింహాసనమున కిరుప్రక్కల శ్వేతాతపత్రాది రాజచిహ్నములు వింతవింత రంగుల దుస్తులు ధరించిన భటుల చేతుల ప్రకాశించుచుండెను.

బంగారు బల్లెమును, డాలును మొదలగు వివిధాయుధములు విచిత్ర వేషధారులగు భృత్యుల హస్తముల ప్రకాశించుచుండెను. కనకమయమగు మత్స్యములును గజాననములును మూరు మొగ్గలుదీర్చినట్లు స్తంభములపై సమర్పబడెను. సింహాసనమునకు సమీపమున నొక బంగారు బల్లెముయొక్క కొనకు కనకమయమగు త్రాసు సమముగ వ్రేలాడుచున్నట్లు యుంచబడెను. హిందూ మహమ్మదీయాది సకల వర్ణములవారును యెట్టి హెచ్చుతగ్గులు లేక సమానముగ నాదరింపబడుదురని సూచించుటకట్లు యేర్పరుపబడెనని చదువరులు గ్రహింతురుగాక!

మందిర ముఖద్వారమున భద్రగజములును ఉత్తమాశ్వములును, పూలమొక్కలును చిగురు జొంపములతో నింపబడిన పన్నీటి పాత్రలును సుస్వాగత మిచ్చుటను సూచించుటకై యేర్పరుపబడెను. దర్బారు మందిర మంతయు హిందూ సాంప్రదాయానుగుణ్యముగను మొగల్ సాంప్రదాయానుగుణ్యముగ నలంకరింపబడెనని చరిత్రకారుల యభిప్రాయము. నిర్ణీత సమయమున విప్రకోటి మంత్రములు పఠించుచుండ సమస్త మంగళతూర్య నినాదములు మిన్నుముట్టుచుండ వందిమాగధవర్గము జయజయధ్వానము లొనర్చుచుండ బ్రాహ్మణ ముత్తయిదువలు లాజలు పుష్పములు వెదజల్లుచుండ కోటబురుజులనుండి నూటయొక టిఫిరంగులు భూమ్యాకాశములు బ్రద్దలగునటుల మ్రోగుచుండ శ్రీ శివాజీ మహారాజు వినయవినమితోత్తమాంగుడై రాజఠీవితో సింహాసనారూఢు డయ్యెను. సభాసదులపై రత్నఖచితములగు హేమకమలములును, సువర్ణరజత పుష్పములును, మంచి ముత్యములును, పగడములును సుగంధపుష్పములను వెదజల్లబడెను. బ్రాహ్మణ ముత్తయిదువలు హారతులెత్తి దృష్టి దోషమును పోగద్రోలిరి. అంతట యధ్వర్యుడగు గంగాభట్టు శ్వేతఛత్రమును సింహాసనమున కూర్చుండిన శ్రీ శివాజీ మస్తకముపైనుంచి రాజముద్రికను హస్తమునందుంచి శ్రీశివాజీ మహారాష్ట్ర రాజ్యలక్ష్మిని చేకొనెననియు నాటినుండియు మహారాష్ట్ర సామ్రాజ్యాధిపతియగు శ్రీ శివాజీ సర్వాధికారము వహించి ధర్మరక్షణము గావించుననియు ప్రకటించి శ్రీ శివాజీ ఛత్రపతికి జై శ్రీ శివాజీ మహారాజుకు జయ్, అని జయజయధ్వానములు మారుమ్రోగ పలికెను. సభ్యులెల్లరు అంగీకార సూచకముగ నిలుచుండి దిక్కులు పిక్కటిల్లునట్లు జయజయ శబ్దములు గావించిరి. బ్రాహ్మణులు ఛత్రపతిని వివిధముల నాశీర్వదించి కాశ్మీర శాలువలను పట్టు వస్త్రములను సువర్ణ నాణెములను బహుమతిగ నొందిరి. ఉత్తమాధికారులును రాయబారులును యుచిత రీతుల కప్పముల నజరానాలను ఛత్రపతికి సమర్పించి సన్మానములొందిరి. ఆయా యధికారులకు తగిన చిహ్నములను, బిరుదావళులను వుద్యోగ నిర్ణయపత్రముల నను గ్రహించి గజాశ్వములను ఆభరణములను బహుమతి యొసంగెను. ఉద్యోగులెల్ల రదివరకు కలిగి యుండిన పారశీక హోదాలను త్రోసిపుచ్చి సంస్కృత నామములతో గూడిన హోదాల నిచ్చివేసెను. ఆంగ్లేయ ప్రభుత్వ ప్రతినిధియగు "ఆక్సెన్డన్" అను నాయన నారోజీపంత్ అనుద్విభాషిచే ఛత్రపతికి పరిచయము గావింపబడెను. ఆయన ఛత్రపతికొక వజ్రపుటుంగరమును నజరానాగా యిచ్చి తనప్రభుత్వమునకుంగల యామోదమును వెల్లడించెను.

దర్బారుముగియుటతోడనే శ్రీశివాజీ విచిత్రముగనలంకరింపబడిన భద్రాశ్వముపై నధిష్టించి మంత్రిసామంత దండనాథులు వెంటరా సర్వసైన్యపరివృతుడై అత్యంత వైభవముతో అతిరమణీయముగ నలంకరింపబడిన పుర వీధులగుండా సౌధాగ్రములనుండి పురస్త్రీలు పుష్పవృష్టితో నింపుచుండ యూరేగింపుటుత్సవము గావించుకొనెను. ఈయుత్సవకాలమున నగరమునంగల నానా దేవతలను సందర్శించి వారికి పూజలుగావించి కృతకృత్యుడయ్యెను. ఆమరుసటిదినమున యుత్సవమును జూడ వచ్చినవారికెల్లరకు దోసెడులతో బంగారు వెండి నాణెములను పంచిపెట్టి తన వితరణబుద్ధిని జాటెను. ఈవిధముగ పండ్రెండు దినములు బ్రాహ్మణాది సమస్తవర్ణముల వారికిని, వికలాంగులకును ధనమును వెదజల్లెనట. మహోత్సవమునకు పూర్వమును అనంతరమును అష్టాదశవర్ణముల వారికి పంచ భక్ష్య పరమాన్నములతో విందులజరిపి భూతతృప్తిగావించెను. ఉత్సవము జూడవచ్చిన ఏబది వేల బ్రాహ్మణులకును, వికలాంగులకును నాలుగు మాసముల పర్యంతము అన్నదానము వస్త్రదానము గావించెనట! ఆహా! ఏమి! శ్రీ శివాజీ భూతదయాళుత్వము.

పట్టాభిషేక మహోత్సవము ముగిసిన పండ్రెండవదినముననే వీరమాత శ్రీ శివాజీ తల్లి జీజీభాయ్ పరమపదించెను.

శ్రీ శివాజీ యుత్తరక్రియలు యుచితరీతి జరిపి శుద్ధియగుటతోడనె మరల నొకపర్యాయము దర్బారు గావించి పలువుర పలువిధముల సన్మానించి బుచ్చెను.

శ్రీ శివాజీ ఛత్రపతికి జై. (యదునాధసర్కార్.)

# రహస్యప్రణయము.

బి. టి. కృష్ణమాచార్యులుగారు.

శారద చక్కని చుక్క. పన్నెండేండ్ల ప్రాయముగల బాలిక. ఇంకా వివాహము కాలేదు. ఆమె తండ్రిగారంటే నూజవీడంతా చాలా గౌరవం "ఆ రామయ్యగారికేం, ఆగర్భ శ్రీమంతులు" అనేవారు అందరూనూ. ఆయన శారదకు తగిన వరుణ్ణి విచారించుతున్నాడు. బెజవాడ కాపురస్తులయిన నాగేశ్వరరావుగారి యేకపుత్రుడికి తన పిల్లనిచ్చి వివాహం చేయటానికి నిశ్చయించినాడాయన చివరకు. ముహూర్తంకూడా నిశ్చయించుకు వచ్చాడు. ఇంట్లో అందరూ సంతోషించారు. ముసలమ్మకూడా "మా చిట్టితల్లి అదృష్టవంతురాలు" అని ముద్దాడింది శారదను. కాని శారదకు మాత్రం ఆ సంబంధం యిష్టంలేదు. ఎందుకంటారేమో? ఆ పిల్ల ఇదివరకే ఒకణ్ణి ప్రేమించింది. అట్లా అని ఆమె తల్లిదండ్రుల మాటలకు వ్యతిరేకించలేదు. తనలో తానే దుఃఖముతో కుమిలిపోతూండేది పాపం ఆ పిల్ల. ఆ సంగతి ఎవరికీ తెలియకపోయింది.

ఒకనాడు సాయంకాలం ఆ చిన్నది బిందె చంకనెట్టుకొని మంచినీళ్ళు తేవటానికి వూరి బయట పెద్దచెరువుకి వెళ్ళింది. తెల్లగా తోమిన బిందెమీద అస్తమయభానుడిమరీచులు ప్రణయ తాండవం ఆడుతున్నాయి. వదులుగా వేసిన ముడిలోనుంచి మల్లెమొగ్గలు ఒక్కటొక్కటిగా నేలపొడుగునా రాలుతూవస్తున్నాయి. కాని ఆముద్దరాలు దానిని గమనించలేదు. ఆబాలిక భావనా ప్రపంచములో ఎన్ని ఆకాశహర్మ్యాలు పుట్టి మబ్బులో మాయమౌతున్నాయో ఎవరికేం తెలుసూ?

ఆమె తిన్నగాపోయి చెరువులో మోకాటి లోతుకు వెళ్ళేసరికి హటాత్తుగా తాను నీళ్లల్లో వున్నట్లు జ్ఞప్తికివచ్చింది. నిట్టూర్పువిడిచి బిందె నీట్లోముంచింది ఆకన్య. ఇంతలో ఎక్కడ నుంచో ఒక చక్కని విషాదగీతిక వినపడింది.

"ఇదిగో పశ్చిమదిక్కున కృష్ణపక్షి
శాంబరీరమ్య చంద్రఖండంబు పొడిచె
అగ్నిశిఖవోలి దందశూకాస్య విషము
లారయుచున్నవి హృదయకోటరమునందు"

శారద ప్రక్కకు చూచునప్పటికి కృష్ణుడు సాక్షాత్కరించినాడు. అతనిచేయి పట్టుకొని "కృష్ణా! ఎచ్చటకు పోతున్నావు?" అని అడిగింది

"ఎక్కడికో పోతాను నాచెయ్యివదులు."

"హా! పోతున్నావా? కృష్ణా! పోయెదవా?"

"పోకేంవుంది?— నాశుష్క హృదయాంతరంలో చిమ్మ చీకట్లుకమ్మినాయి. హృదయపాత్రలో అమృతరసం ఇంకిపోయింది. ఎవడో దుర్మార్గుడు ఎన్నాళ్లనట్లో పెంచుతూన్న నాగులాబిరాణిని నిర్దయతో తుంచేసాడు. ఇంక నాకేంవుంది ఇక్కడ?— నామొరవినేవాళ్లెవరు? వెళ్ళిపోయి అక్కడి చెట్లతో మృగాలతో చెప్పుకుని ఒక్కసారి ఏడ్చేస్తాను. ఇక్కడుంటే ఈ పాడుప్రజలు "మనసారగా నేడ్వనీరునన్ను" ఆకాశాన కెగిరి మబ్బులరథాలెక్క అనంతకోటి బ్రహ్మాండాలు తిరుగుతాను. అక్కడైనా దొరక్కపోతుందీ, నాతలదాచుకోటానికి తావు?"

"కృష్ణా! కృష్ణా! ఎందుకట్లా వైరాగ్యం నీకు? మనం ఒకటి తలచుకుంటే, దేవుడొకటి తలచాడు నీబోటి బుద్ధిమంతులు సుఖదుఃఖాల్ని

సమంగా చూడాలి. ఆడదాన్ని నేనే ధైర్య కవచం తొడుక్కుంటే, మొగాడివి నీకేం!— స్నేహితుడా! ఇదిగో ఇటుచూడూ—ఇంకనూ మన పూర్వపుసంగతులు మరవవా? నీవిట్లా విచారించటంవల్ల ప్రయోజనమేమిటి? మాత్రం డ్రిగారితో ఒకటి రెండుసార్లు చెప్పాను. ఆయన "ససేమిరా" అన్నాడు. చూచిచూచి వాళ్ళఆజ్ఞ దాటలేను? ఆడదాన్ని, ఇ కారెంగు రోజులలో నేను పరాధీనురాల్ని అవుతూన్నాను. కాబట్టి నామీద ఆశవదిలేసి, ఎక్కడికైనా పోయి పెండ్లిచేసుకొని,హాయిగా కాపురంచేసుకో ఈయభాగ్యురాలిని మరిచిపో."

"హా! శారదా! నీనోటినుండి రావలసిన పలుకులేనా యివి? నాహృదయం తెలిసిన నీకు ఇలా అంటం భావ్యమేనా? ఏనాడు మన యిద్దరికీ అనురాగం అంకురించిందో ఆరోజునుంచే నాజీవితాన్ని నీకోసరం ధారపోయటానికి నిశ్చయించాను:— రాధామాధవులవలె నాయందు నీకు, నీయందునాకు భక్తితోకూడిన అపూర్వ ప్రణయము ఉదయించింది. ఇక నాకీలోకంతో సంబంధమేమిటి?— నాదారి నేను చూచుకొంటాను."

"అబ్బ! కృష్ణా! మాడిపోయిన చేనికింకా ఎందుకు అగ్గిరగిలిస్తావు? నీ వాగమృతధారలతో నా హృదయ విపంచీతంత్రులన్నీ కదలిపోయినాయి. నాహృదయం నీవు ఎరిగుండికూడా ఇలా మాట్లాడటం నీకు న్యాయమేనా?— ఎందుకంతనిర్వేదం నీకు? నీకు లోకంతో ఎంతో పని ఉంది. ఎన్ని సౌఖ్యాలులేవు అనుభవించటానికీ ప్రపంచములో?—నేనంటే దురదృష్టవంతురాల్ని—ఆడవాండ్ల మనస్సు నీకు తెలియదు. తాముప్రేమించిన పురుషుడు తమకు లభించకపోతే ఆప్రేమను మనస్సులో కప్పిపుచ్చి వారితో మనస్సులోనే సౌఖ్యానుభవాల్ని అనుభవిస్తారు. నాకీజన్మలో సుఖంలేదు. కాబట్టి యింతటితో నన్ను బాధపెట్టక, నాకు కాబోవు భర్తకు ఋజుమార్గవర్తిగా ఉండేటట్లుచేయి. దైవసముడగు భర్తకి శుశ్రూషచేసే భాగ్యం నాకు కలుగచెయ్యి. ఇంక ఎన్నిజన్మలెత్తినా నిన్నే భర్తగా దయచేయుమని భగవంతుణ్ని ప్రార్థిస్తు కాలం గడుపుతా."

"హా! పరాత్పరా! ఇంకెక్కడి లోకం నాకు!" అని అంటూ మెల్లగా నడుస్తూంటాడు కృష్ణుడు.

"ఈ మహానౌక ఝంఝూమారుతము చేత
ఈమహాంబుధిలోన నెచట మున్గునోకదా?"

"కృష్ణా! అతిసాహసంచేయకుమా నాబోటి అనర్హురాలి కోసరం సర్వసంగ పరిత్యాగానికి ఒడిగట్టకుసుమా. అట్లాంటి త్యాగానికి నేను తగను ఒక అభాగ్యురాలికోసరం ఆత్మత్యాగం జేయకు. పరిశుద్ధ మనస్సు కలవాడవగు నీవు ఈ పతితురాలికొరకు— హా! భగవంతుడా! ఈ ప్రపంచంలో నన్నెందుకు పుట్టించావు? ఈ పాపపు దేహాన్ని "భరింపలేను జీవింపలేను" అని ఏడుస్తు కొంతసేపు నిల్చుండి, చివరకెట్లాగో అట్లా బిందె బుజాన పెట్టుకొని వెళ్ళిపోయింది పాపం అమాయికురాలు శారద.

## 2

కృష్ణుడు పద్దెనిమిదేండ్ల వయస్సువాడు. చిన్నప్పటినుంచీ శారదకి కృష్ణుడికి పరమస్నేహం. ఎక్కడికి వెళ్ళినా వీళ్ళిద్దరు ఒకటిగా ఉండేవారు. అందుచేతనే తోడిపిల్లలు వీళ్ళిద్దరినీ మొగుడూపెళ్ళాలనేవారు పాపం. రాను రాను వారిస్నేహం ప్రణయంగా పరిణమించింది.

మొట్టమొదట రామయ్యగారుకూడా శారదను కృష్ణుడికే యిచ్చి పెండ్లిచేస్తానని చెపుతూ ఉండేవాడు. కొద్దిరోజులక్రిందటనే ఆ రెండు కుటుంబాలవారికీ విరోధాలేర్పడ్డాయి. ఆ కారణంచేత వాళ్ళిద్దరూ పెండ్లిచేసుకొనే భాగ్యం కలుగలేదు.

శారదావివాహం ముగిసింది. కాని ఆపిల్ల నవ్వు అన్నమాటే యెఱుగదు. నవ్వటం ఏలాగుంటుంది? కడుపులో గంపెడంత సముద్రం పెట్టుకుంటే!

ఆమె పెనిమిటిపేరు అప్పారావు. అతను బహుక్రూరుడు. దయ అనేమాట అతని హృదయంలోగాని, శరీరంలో ఏ మూలనైనాగాని, కంచు కాగడాలుపెట్టి వెలికిచూచినా కనబడదు అదేంపాపమో మరి?—

కొన్నాళ్ళకు శారదకు కార్యం అయింది. అత్తవారింటికి పంపారు. బెజవాడలో అప్పారావుకి ఒక వేశ్య వున్నట్లు, అతను జూదానికీ, తాగుడుకీ, భోగందానికీ డబ్బంతా తగలేస్తున్నట్టూ తెలిసింది శారదకు. ఏం చేస్తుంది పాపం? పురాకృత కర్మాన్ని అనుభవించక తీరదుగా!

శారద కాపురానికి వెళ్ళినదగ్గిరనుంచి భర్తచేత పడరాని యిడుములపడుతూనే ఉంది పతివ్రత. అప్పుడప్పుడు కృష్ణుణ్ణి తల్చుకొని ఏడుస్తూనే వుండేది ఏతోటలోనో, ఏదొడ్లోనో!

అప్పారావు ఉంచుకొన్న రాజరత్నాన్ని ఒక అరవవాడుకూడా వుంచుకొన్నాడు. అందుచేత వీళ్ళిద్దఱికీ పడేదికాదు. అప్పారావు ఒకనాడు డ్రామున్నరతాగి వేశ్యాగృహానికి వెళ్లుతూన్నాడు. దారిలో అరవవాడుఎదురుపడ్డాడు. అప్పారావుకి అసూయ,కోపంపొంగివచ్చి వాణ్ణి బాకుతో పొడిచి చంపాడు. తర్వాత భోగందానింటికివెళ్ళి కూర్చున్నాడు. పైలక్షణాల్నిపట్టి సంగతంతా గ్రహించింది రాజరత్నం. పోలీసువాళ్ళతో చెప్తానని బెదిరించి వాడి ఆస్తిపాస్తి అంతా కాజేసింది. వెధవసన్యాసిలాగ, మహాపాపపుకళ మొహాన తాండవమాడుతూండగా, పీడవదలి పిశాచం పట్టినవాడై, సరకులన్ని అమ్ముకొన్న సర్తకునిమాదిరి, నిమ్మకు నీరెత్తినట్లు, వచ్చాడింటికి అప్పారావు. యమభటుడ్లాగ ఇంటికివచ్చిన భర్తనుచూచి గదిలోకెళ్ళి తలుపేసుకుంది శారద. తూగుతూ తూగుతూ వచ్చి దున్నపోతులాగ పందిరిమంచముమీద పడి నిద్రపోయాడు దుర్మార్గుడు ఇంతట్లో — శారద ప్రేమించిన, తనకు శత్రువులైనను వారిని ప్రేమించి వారికోసరం ప్రాణాలర్పించ దలచుకొన్న — కృష్ణుడు శారదదగ్గరకువచ్చి అప్పారావు ఖూనీచేసినట్లు చెప్పాడు. అప్పుడు శారద పిడుగు తలమీదపడ్డట్లు నేలమీద పడిపోయి, కొంతసేపటికి లేచి తనభర్తను రక్షించమని కృష్ణుణ్ణి ప్రార్థించింది. "సరే"అన్నాడు. కృష్ణుడు సాలోచితంగా.

## 3

మర్నాడు పోలీసుభటులు ఇనపమురుగులు చేతులకుతగిలించి తీసికెళ్ళారప్పారావుని. విచారణ జరిగింది. విశ్వాసఘాతకురాలు రాజరత్నం అప్పారావుకి వ్యతిరిక్తంగా సాక్ష్యం చెప్పింది. అందుచేత అతనికి వురిశిక్ష విధించారు న్యాయమూర్తులు.

తెల్లవారితే అతడు వురిస్తంభం ఎక్కాలి. కృష్ణుడు రక్షిస్తానన్నాడు. ఏమో ఏమౌతుందో? అదిగో జైలుఖానాలో కూర్చుని ఏమో తనలో తను మాట్లాడుకుంటున్నాడు అప్పారావు.

అతని మాటల్నిపట్టి చూస్తే అతడిప్పటికి సన్మార్గంలోకి దిగినట్లున్నాడు. చూశారా? అతడెంత గంభీరంగా వున్నాడో! ఏవో కొన్ని వుత్తరాలు వ్రాస్తున్నాడే! ఓహో! భార్యకి బంధువులకి కాబోలు.

ఇక నాలుగు గంటలలో అప్పారావుపాత్ర లోక నాటకరంగంలోంచి తెరచాటుకు పోతుంది. అదిగో జైలుతలుపు చప్పుడౌతోంది. దగ్గిరుంటే మాటాస్తుంది రండి.

మహా గంభీరంగా జైలులోకి ప్రవేశించాడు కృష్ణమూర్తి. తలవంచుకొనివున్న అప్పారావు కృష్ణుణ్ని చూచి నిర్ఘాంతపోయాడు. అప్పుడు కృష్ణుడు మెల్లగాను, దృఢస్వరంతోను "మిత్రమా! ఇదిగో, నాదుస్తులు నువ్వుధరించి నీదుస్తులు నాకియ్యి — త్వరగా –" అన్నాడు,

"కృష్ణా! నాప్రియమిత్రమా! ఈమహా ఘోరపాపిని రక్షించి, నీప్రాణాలు త్యజించుదామనుకొన్నావు కామోసు. అది వట్టి పిచ్చితనం స్మా. అంత సాహసానికి నేనొప్పుకోను. నేను మహాపాపిని — హంతకు — పతివ్రతయైన శారదని పలుకష్టాలు పెట్టాను. నాకీజన్మం మీాద తిపిపోయింది. బ్రతికినన్నాళ్ళు దుష్కీర్తే కాని సత్కీర్తి రాదు. నాప్రాణాలు వదలాలని కోరిక పూర్ణంగావుంది. నీసాహసం నాదగ్గర చేయకూడదు. నీకు నమస్కారం నన్నొదిలి వెళ్ళు" అన్నాడు కళ్ళనీరుకారుస్తూ.

"నేను ఆలాగన్నానా? నిన్ను దుస్తులు మార్చమన్నానేకాని. నేచెప్పిందానికి మారాడ వద్దు. వేషం కానీ" అన్నాడు కృష్ణుడు.

చిట్టచివర కెట్లాగైతేనేం వాడిదుస్తులు వీడు, వీడిదుస్తులు వాడు ధరించారు. కృష్ణుడుతర్వాత ఒక ఉత్తరం చెపుతాను రాయమన్నాడు.

"ఎవరికి?"

"ఆకాశరామన్నకి."

"తారీఖు —"

"అక్కరలేదు."

"అయితే కానీ"

చేయిని ఎందుకో కోటులోపలి జేబులోకి పోనిచ్చి చెప్పటానికి మొదలుపెట్టాడు కృష్ణుడు.

"నావిధ్యుక్తధర్మమును నేనాచరించినాను. ఇక సంతోషముతో యాత్రసేవ యొనర్చెదను. విశేషణము విశేష్యముతో ననుసరించియుండు భంగి ఎన్నిజన్మలెత్తినను ఈ రెండువస్తువులును వేరుకావు—"

అప్పారావు ఒకసారి మొహం పైకెత్తి చూచేసరికి ఇంకా కృష్ణుడుచేయి అతనిహృదయాన్ని విడువలేదు.

"అదేమిటి చేతులో?" అని అడిగాడప్పారావు.

"ఏంలేదు త్వరగారాయి" అని తొందరపెట్టాడు కృష్ణుడు.

కృష్ణుడుచేయి మెల్లగా అప్పారావు నాశికాపుటాలదగ్గిరకి వచ్చింది. ఏమిటో అని అతను పైకిచూశాడు. ఏదో పొగలాగ తనచుట్టు ఆవరించింది. ఏదో పోనీలే అని రాయటానికి మళ్ళీ కలం తీసుకొన్నాడు. కృష్ణుడు చెపుతున్నాడు.

"జీవితము మహాకలాగైతే—కొంచెం ఆగి మరల—జీవితం మరొకవిధముగా పరిణమించిన యెడల, మరువవలదు. కృతజ్ఞత—"

ఇక రాయటం మాని అప్పారావు ఏమో గిలుకుతూన్నాడు. ఉన్నట్టుండి తటాలున అతను లేచి విరుచుకుపడబోతూండగా పట్టుకొన్నాడు కృష్ణుడు. అతన్ని మెల్లగా క్రిందపడుకోపెట్టి తలుపుదగ్గరకు వెళ్ళి తన దగ్గిర లంచంతిన్న చెఱ

సాలాధికారినిపిల్చి స్మృతితప్పివున్న అప్పారావును తీసుకొని పొమ్మని ఆజ్ఞాపించారు. వానిచేతి కేదో పత్తరంకూడా యిచ్చి రామయ్యగారి కిమ్మని చెప్పాడు.

## 4

న్యాయస్థానం దగ్గఱకు తీర్పువిని జనులంతా వచ్చారు. అప్పారావు వేషంతోవున్న కృష్ణుణ్ణి వురిస్తంభం వద్దకు తీసుకొచ్చారు. అప్పారావు శత్రు కూటంలో వాళ్ళంతా అతని చావుచూడటానికి వచ్చారు. కొందరు, "పోతాడులే, శనేశ్వరం వదలిపోతాడు" అని, ఇంకాకొందరు, "ఏమన్నా గ్గుడైనా చచ్చేటప్పుడు మంచినేకాని చెడునెంచ కూడదంటారు పాపం నిర్భాగ్యుడు, నిర్భాగ్యపు చావుచస్తూన్నాడు. చూడ కూడదు. పోదాం పదండి" అనిన్ని అనుకుంటూ పోయే వాళ్ళు పోతున్నారు. చూడ వచ్చే వాళ్ళు వస్తూన్నారు.

కృష్ణుడి మొహంలో గంభీరం, ప్రశాంతం ఆనందం తాండవమాడుతూన్నాయి. అక్కడుండే ప్రజలంతా అతని ముఖలక్షణాల్ని చూచి ప్రతిమలులాగ కూర్చున్నారు. అందరికీ ఆశ్చర్యంగా నేవుంది—అందరికీ మనస్సులో ఆవేదనగానే వుంది న్యాయాధీశునికి ప్రమాదం ఎత్తినట్టు కనిపిస్తోంది. "ఏమి? నిరపరాధిని అపరాధి అని తీర్పుచెప్పానా ఏమిటి?—ఓహో దేవతలంతా నన్ను నిందించుతోన్నట్లున్నారు. అయ్యో" — అని పశ్చాత్తాపాలు ఆపుకోలేక అస్పష్టంగా వుచ్చరిస్తున్నాడు న్యాయాధికారి.

నిర్ణీతసమయము దాటింది చివరకి తలారులు కృష్ణుడి మెడకి తాడు తగిలించేశారు. "ఒకటి—రెండు—మూడు" అన్నారు. కృష్ణుడు అస్తమించాడు. సూర్యుడు మూర్ఛపోయి పశ్చిమ సముద్రంలో పడ్డాడు. జనులు గప్చిప్మని ఇండ్లకి వచ్చారు. ఆనాడు మొదలు మూడు రోజులవరకు పశుపక్ష్యాదు లన్నియు ఎచ్చటి వచ్చట నద్దుమణగియున్నవి. పశువులు కండ్లనెంట నీరుకార్చినవి. కాని కాలచక్ర పరిభ్రమణాం మానలేదు. ప్రకృతిలో ఎచ్చట చూచినా విచారసూచికమైన చిహ్నములే కనబడుతూన్నాయి. అంతాకలిసూయ.

---

## నిద్రలో నిద్ర — స్వప్నమున స్వప్నము.

కాకులపాటి గురుమూర్తి గారు.

గగనమున నుడుగణముఁదోలుచు
నగమువెన్క-ను నిక్కి-చూచుచు
అంగనల యంగములనంగుని
బెంగచే బెగడొందఁజేయుగఁ
జంద్రుఁ డుదయించెఁ
నిద్దుర
జెందవలెనంటేఁ. 1

పట్టెమంచము నట్టెయెక్కి-తి
దిట్టముగ దుప్పటినిఁ గప్పితి
కట్టెబారితి నిముసమున నీ
పొట్టు లేవగటంచు తోడనె
చంద్రుఁడే తెంచెఁ
నిద్దుర
జెందుచుండంగఁ 2

సాయకుని శరవేగ రాగము
నాయకల గుసగుసలా లేను
నాయకుల ప్రార్థనలా యీనది
గాయకుల చే నున్న దిదియున
వీణ వినవచ్చెన్
నిద్దుర
వేగ మనమయ్యెన్ 3

ఎవ్వడెరుగని గాత్రింతి యహా!
నన్ను నగు కంఠమునఁ బాడెను
వన్నెగొందున్నది భామ? యనగను
విన్నవారల పిడకుండెడు
గానమును వింటిన్
నిద్దుర
మౌనమున నుంటిన్ 4

ఆః వెదుకగ చుట్టుఁజూచితి
వేదముగు నొక వనముగాంచితి
నదిమలంబగు కొలనిగట్టునఁ
బలముగ నేనుంటఁ గాంచితి
చిత్రముగనుండెన్
నిద్దుర
మాలిమిటులుండెన్. 5

చెక్కిందను పత్రఛాయలు
చెక్కనందులఁ జంద్రికాంతులు
చెక్కిందనె కలియుముగ్గు లి
వ్వె వేసిరో చూతమంచును
గట్టుపీడుటయున్
నిద్దుర
యట్టులేయుండెన్. 6.

బిరబిరను పరువెత్తి యిరులకుఁ
గలుపులేదను తలపుఁజేఅగ
దూరమున నొకదారమోయున
వరుస చెట్టుల చీకటిని నే
నేను కనుగొంటిన్
నిద్దుర
నేను యనుకొంటిన్. 7

కారుమబ్బులఁ బుట్టె వెంఅవని
కాననాంతంబునకుఁ జేఅగఁ
గరము కౌశలంబుపడె చూపుచు
గగనం బాసందమునుఁ గూర్చెడు
కాంతిఁ గనుగొంటిన్
నిద్దుర
గలత నొందింపన్. 8

నా రికరమున వీణ నింపుగ
సారెకును మీటితినుగని నగి
మరుని పల్లోరమనగ నొంగుచు
పరసులోఁ దానమునుఁ జేయగఁ
గాంత యరుగంగన్
నిద్దుర
యందమును గంటిన్. 9

కాంతవదనము చంద్రబింబము
కాంతకనులు సరోజదళములు
కాంత కురులు నీలములు నా
కాంతమధ్యము సింహమధ్యము
అందమును గంటిన్
నిద్దుర
నాదమును దెల్పన్ 10

అబ్బురంబగు నాపె గుబ్బల
నుబ్బగనుఁ జేయంగ మదనుఁడు
అబ్బనే మీసౌఖ్యమంచును
ఉబ్బితిని నీగుటము పొంతను
వేదనలఁ జెందన్
నిద్దుర
వెతలనందంగన్. 11

# గ్రంథస్వీకారము.

## 1. శృంగార రాధామాధవ సంవాదము.

వెలిదిండ్ల వేంకటమహాకవి ప్రణీతము. ప్రకాశకులు జి. ఎస్. శాస్త్రి అండ్ కో వారు మద్రాసు చక్కని క్యాలికో బైండు 154 పేజీలు, వెల రు **2-0-0**

సృష్టి, స్థితి, లయ కారణభూతుడగు పరమాత్ముడు ప్రపంచపాలనకై అనేకావతారములు దాల్చి దుష్టశిక్షణము శిష్టరక్షణముల నెరవేర్చుచుండుట లోకవిదితము. అవతారములలో నెల్ల నవతారము శ్రీకృష్ణభగవానుడు లోకరక్షణమును గావించుచు తన్నారాధించి తన పొందు నగోరు గోపికల కుచితరీతిని ప్రణయ మహిమను వర్షింపచేసి యెట్టిరూపమున భగవత్సాన్నిధ్యము నపరు పొందగోరుదురో అట్టివారికి అట్టి రూపమున కన్పట్టుదునను గీతా వాక్యమును సార్థకపరచెను. శృంగారమునకు రాధామాధవులనే పెట్టినపేర్లు. రాధామాధవుల ప్రథమసమాగమము అటుపిమ్మట రాధ విరహము, చిరకాల వియోగ భారము, పునర్దర్శనము అత్యద్భుతముగ వర్ణింపబడినవి. పునర్దర్శనా ఘట్టమే యత్యద్భుతమై. యీ ప్రబంధమునకు మెరుగు పెట్టుచున్నది. విరహవేదనచే సొక్కి సోలియున్న రాధ కృష్ణుని గాంచి యెత్తిపొడుపులు పొడిచి పోవుచున్నపుడు,

> "ఇది కదియంగ వేళయని
> కృష్ణుడు పానుపుడిగ్గి రాధికా
> మదవతి చేతజేరి నును
> మై పులకించి చెమర్ప నొక్కకే
> లందుటున దీసి కన్నుగవ
> నొత్తుక యోచెలి కోపమున్న మం
> చిది పలుమేల నొక్క చెవి
> చేవిను నాదొక విన్నపంబునన్"||

యని కృష్ణుడు వచింప రాధ యింకేల నిరసింపగలదు. రాధను కట్టుబడ చేసిన శ్రీకృష్ణుడు తన ప్రేమ సుధారసమును వివిధరీతుల గ్రోలజేసి తుదకు,

> "వలువురి మాటలున్ వినక
> నా తలిదండ్రుల నమ్మబోక పె
> ద్దలు తెలుపంగ నూకొనక
> దైవమునుం గొలువంగలేక నీ
> చెలిమియె భుక్తి ముక్తియని
> చేతి నింతటిదానవౌట చే
> తలియక మోసపోతి పర
> దేశిని జేసితి వంగనామణీ"||

అని జయించినాడు.

వెలిదండ్ల వెంకటపతిమహాకవి శైలి యాబాలగోపాలమునకు సులభగ్రాహ్యము. దీర్ఘసమాసములు సులభగ్రాహ్యము కాని పదజాలము లిందు మచ్చునకైన కానరావు. అచ్చ సంస్కృతముకాదు, అచ్చ తెలుగునుకాదు. కేవలము వాడుక భాషలో నీ ప్రబంధము వ్రాయబడినది. వాడుకభాషా ప్రాశస్త్యమును పదునెనిమిదవ శతాబ్దాదినే యీ మహాకవి గుర్తించి వ్రాయగలిగెను.

ఈ గ్రంథమునకు ముద్రణాపద్ధతికూడ వన్నె దెచ్చినది. యే సుమతీశతకము మాదిరి నెలయుచుండెడి యీ గ్రంథమును ఫెదర్‌వైటు పేపరుమీద ప్రతిపేజికి చుట్టు నెరుపు బార్డరునుంచి ముద్రించుటచే గ్రంథ మాకర్షణీయముగ నున్నది

ఈ గ్రంథము నిట్టి ప్రాశస్త్య మార్గమునకు గొనితెచ్చిన జి. యస్. శాస్త్రి అండు కంపెనీవారు ప్రశంసాపాత్రులు.

## 2. పద్మరాగము (నిరూపక నవల)

గ్రంథకర్త:- బూర్లె వెంకటరమణయ్యగారు, వేగుచుక్క గ్రంథమాల, బరంపురంవారి 23 వ గ్రంథము. చందాదారులకు వెల రు **1-0-0** ఇతరులకు రు **1-8-0**.

ఇదియొక పరిశోధక నవల. తేటతెలుగులో వ్రాయబడినది. కూనీలు, నాణెముద్రణము మొదలగు అపరాధ పరిశోధక నవలలకు గావలసిన సరుకు లన్నియు నిందు కానవగును. శైలి సులభము

## 3. ఆంధ్రకవిత్వ చరిత్ర (మొదటిభాగము)

గ్రంథకర్త:- భోగరాజు నారాయణమూర్తిగారు. విజయనగరం, 200 క్రౌను పేజీలు ఫెదరువైటు పేపరు, క్యాలికోబయిండు రు **2-0-0**

వాఙ్మయోద్ధరణమున కనేక పరిస్థితులు సమ్మేళనము కావలెను. డబ్బు, మేధాసంపత్తి, దేహారోగ్యము అన్నియు కూడిరావలెను. విజ్ఞానచంద్రికామండలి నామమాత్రావశిష్టమై, భాషాపోషణములేని యీ రోజులలో విజయనగర సంస్థానాధీశ్వరులు వాఙ్మయోద్ధరణమునకు దల పెట్టుట ఆంధ్రమాతయొక్క యదృష్టము. విద్యావేత్తల

రేమూరి నృసింహం పంతులు, బురాని శేషగిరిరావు, జానికిరావు పంతులుగార్లు నారాయణమూర్తిగారి యుద్యమమునకు దోహదము లొసంగుట ప్రశంసనీయము. ఇన్ని యనుకూల పరిస్థితులను బురస్కరించుకొని శ్రీయుత భోగరాజు నారాయణమూర్తిగారు సంవత్సరముల తరబడి గ్రంథపఠనము గావించి ఆంధ్రవాఙ్మయమునకు శాశ్వత సేవజేసి యున్నారు.

ఇది మృదుమధుర శైలిలో వ్రాయబడిన గ్రంథము. ఆంగ్లేయ కవిత్వ చరిత్రల పోకడలను, రహస్యములను గ్రహించి మన వాఙ్మయమునం దట్టి గ్రంథములు లేని లోపమును గుర్తించి వీరేశలింగం, రామమూర్తి, సుబ్బారావుగార్లిదివరలో రచించిన కవి జీవితములకు వన్నె దెచ్చు నీ గ్రంథ రాజమును ప్రచురించి యున్నారు. ఆయా కవుల కవిత్వపద్ధతుల నొకదానితో నొకటినిపోల్చి (Comparitive study) గ్రంథమును వ్రాసియుండిరి.

కవి త్రయయుగము పోతన శ్రీనాథ, పెద్దన, వీరేశలింగ యుగములుగ నీ గ్రంథమును విభజించి ఆయా యుగములం దుండెడి కవిత్వ లక్షణములు యుగకర్తల లోని గ్రంథములయందును వారి సమకాలికులగు తదితర కవుల గ్రంథములందును యెట్లుకన్పట్టుచున్నవో సూచించి వారివారి గ్రంథ ప్రాశస్త్యములను విపులముగ వర్ణించిరి. ఆంధ్ర కవిత్వమునం దేమాత్ర మభిరుచి గలిగిన వారికి నీగ్రంథ మత్యంతోపకారియగును.

తదితర భాగములను నారాయణమూర్తిగారు రచిరకాలములోనే ప్రచురింతురు గాక! నారాయణమూర్తి గారి యుద్యమము ఫలితముగ కొనసాగుటకు శ్రీవిజయనగర సంస్థానాధీశ్వరులకును, విజయనగర కళాశాలాధ్యక్షులకును, శ్రీనారాయణమూర్తిగారికిని భగవంతు డాయురారోగ్యముల నొసంగుగాక!

## 4. సర్వలక్షణ సారసంగ్రహము

గ్రంథకర్త శ్రీపట్టలూరు కుప్పయ్యంగారు ప్రకాశకులు వేంకటరాం అండు కంపెనీవారు బెజవాడ. క్రౌను అక్టేవో 55 పేజీలు, వెల రు **0—4—0**.

ఇది సులభశైలిని వ్రాయబడిన చక్కని తెలుగు వ్యాకరణము. ఆంధ్ర విశ్వ విద్యాలయపు వైస్‌చాన్సెలరు గారగు కట్టమంచి రామలింగారెడ్డిగారు చక్కని ఉపోద్ఘాతము వ్రాసియున్నారు.

## 5. శ్రీ వెంకటేశ్వర శతకము

గ్రంథకర్త అవధానుల కామేశ్వరశర్మగారు, తణుకు ఒక అణా పోస్టుబిళ్ళ పంపినవారికి ఉచితము. ఇందలి భక్తిరసము ప్రశంసనీయము.

## 6. శ్రీరామతీర్థ శ్రీశైలోన్నత సద్గురు పరంపరా తనియన్లు.

“ఉభయవేదాంత ఆంధ్ర సాహిత్య సరస్వతి విద్యాభూషణ శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార కుమార వేంకటాచార్య అయ్యవార్లంగారిచే స్వీయశిష్య జనోపయోగార్థమై స్వీయాచార్య పరంపరతో జేర్చి ప్రకటింపబడినది” ఈ చిన్ని గ్రంథమును కృతజ్ఞతతో నందుకొనుచున్నారము.

## 8 ఆంధ్రవీరులు (మొదటిభాగము)

శ్రీ శేషాద్రి రమణకవులు. నందిగామ. ప్రకాశకులు వేంకటరాం అండ్ కో బెజవాడ. క్రౌను అక్టేవో 128 పేజీలు, వెల రు **0—8—0**.

ఆంధ్రవీరుల చరిత్రములను వ్రాయుట కిదియే మొదటి ప్రయత్నము. ఆంధ్రవీరులను పంస్మరించి యుప్పొంగుట కీగ్రంథ మనుకూలించును. ప్రతి విద్యార్థియు గ్రహింపగల చక్కని తేట తెలుగులో వ్రాయబడినది. ఇందు చాణక్యుని జీవితము చేర్చబడి యున్నది. చాణక్యు డెట్లు యాంధ్రుడో నిరూపించిన నేతయు కొంగుండెడిది ఇందు రెండు వాదములు కలవనియు, అనుమానమే చాణక్యు డాంధ్రుడని వ్రాయుటకు దోడ్పడెనియు, శ్రీ శేషాద్రి రమణకవులు వ్రాసి ముగించిరి. చాణక్య డాంధ్రుడను వాదమును విశదీకరించినయెడల కథా ప్రాశస్త్యము హెచ్చుడిది దాదాపు దక్షిణ హిందుదేశము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన గౌతమీ పుత్ర శాతకర్ణి చరిత్ర హృద్యముగ నున్నది. బాలచంద్రుని పౌరుషము ఖడ్గతిక్కన శౌర్యము, ప్రతాపరుద్ర భాషోద్ధరణ, కృష్ణరాయలనాటి వాఙ్మయ వికాసము అక్కన్న మాదన్నల రాజనీతి రహస్యములు చదివినపుడు ఒడలు పులకరించును. ఇంకను ముల్లోత్తుంగ చోడుడు, రామరాజు యాచమనాయుల చరిత్రములు పొందుపరుపబడినవి. విద్యాలయాధికారు లీగ్రంథమును పఠనీయ గ్రంథముగ నుంచదగి యున్నది.

# సుధాకర మాహాత్మ్యము.

నిడుమోలు కనకసుందరంగారు, బి. ఏ. (ఆనర్సు)

## పదునేడవ ప్రకరణము;

## "నీవేమియు చేయరాదు."

"విశారదుని జూచినపుడెల్ల నాకు —" ప్రఫుల్లుడీవాక్యమును పూర్తిజేయలేదు. "విశారదుని జూచినపుడెల్ల నాకు అనుమానము కలుగుచునే యుండెడి" దని అతడు చెప్పబోయెను. కాని యందలి యంత్యపదములాతని హృదయకుహరాంతమున గుప్తములై బహిర్గతములు కాలేదు. అతనిముఖము కళాహీనమై రోగగ్రస్తమైనటుల కన్పడెను. ఫాలభాగమును వ్రేళ్ళతో నొక్కికొనుచు, స్వప్నము గనుచున్నవానివలె శూన్యదృక్కులతో నిశ్శబ్దముగ ప్రఫుల్లుడు కూర్చుండెను.

"ప్రఫుల్లచంద్రా! మీరాలోచించుచున్న దేదియో నాకు దెలియును. చంద్రనగరమున నారాత్రి యా మారణకార్యము నొనర్చినది పతంజలియేయని మీరనుటకు సిద్ధపడుచున్నారు" అని రఘునాథు డనియెను.

ప్ర:— అతని విషయమున నీవిశేషము లన్నియు మీకెట్లు తెలిసినవి?

రఘు:— కానిండు. ఈరహస్యము బయల్పరచుటకు నాకు భయములేదు. — నలంచాపురవాసియగు దేవదేవుడను నొక పెద్దమనిషితో నాకు గొంత పనికలిగినది. అతడు కొన్ని ప్రాత యుత్తరములను నాకిచ్చియుండెను. వానిలో నొకటి మీవద్ద గుమాస్తాగా పని చేయుచున్న వాసుదేవుడను వానివలన వ్రాయబడినటులుండెను. ఇది దైవికముగ తటస్థించినదే గాని యిందు నా ప్రయత్నమేమియు లేదు. ఆయుత్తరము నాకిచ్చినవానిలోనుండెనని దేవదేవుడుకూడ నెరుగడు. దానిని చింపివేసి యుంటినని అతడెంచుచుండెను. అందు అప్రస్తుతమగువిషయమున రెండుమూడు పంక్తులుమాత్రము వ్రాయబడియుండెను. కాని విశారదుడును, వాసుదేవుడు నొకరేయనుట స్పష్టమయ్యెను. పతంజలికూడ నితడేయని నిన్ననే గ్రహించితిని.

ప్ర:— ప్రేమచంద్రుని జీవిని రచ్చకీడ్వ దలచుకొనుచున్నారు కాబోలు.

రఘు:— లేదు. నేను ప్రేమచంద్రుని చూచియుంటిని. ఆ స్వార్థత్యాగశీలుని గూర్చి అతని యభిప్రాయము మార్పుచెందినది. రామచంద్రునొక్క సహవాసదోషమువలన వాసుదేవునికూడ నవమానింపవలసి వచ్చెను గాని నిశ్చయముగ నాతడీవిషయమున బుద్ధిపూర్వకముగ ద్రోహమొనర్చి యుండలేదని ప్రేమచంద్రుడు నమ్ముచున్నాడు. ఏది యెట్లున్నను ఆనాటి దుర్నయమున కతడు చేసినకుట్రకును ప్రాయశ్చిత్తము చేసికొనుచున్నాడు. గంజి మెతుకులను దినుచు, అహోరాత్రములు పనిచేయుచు, సంపాదించిన సొమ్ములో విశేషభాగమును కూడబెట్టి రామచంద్రుడపహరించిన మొత్తమును ప్రేమచంద్రునకు తిరిగి ముట్టజెప్పవలెనను సంకల్పముతో అడపదడప కొంతమొత్తమును అతని కందచేయుచున్నాడు. తానెచ్చట నున్నదియు,

నా సొమ్ము నెవ్వాఁడపహరించినదియు తెలియనీయక తనవద్దనుండి వచ్చుచున్న పత్రికను మాత్రము పేరు చేసినను తెలియనీకని జాగరూకతతో నతడా సొమ్మును వాడుచున్నాడు. ఆ మనుజుడుకూడ తన యాజ్ఞానుసారము నీకీపని చేయుచున్నాడు. కావున నీ సంపాదించిన కీర్తికి రెట్టింపు మొత్తము చేయుచున్నది.

ప్రఫు:— అట్లయిన విశారదుని రచ్చకీడ్చుటకు నేను ప్రయత్నింపకూడదా?

రఘు:— లేదు లేదు. విశారదుని సత్ప్రవర్తనమును, ఆయన సాహచర్యము నొనర్చుటకు రామచంద్ర కాళిదాసేమైనను మొదలగు విషయములను గమనించినచో నితడు మీవద్ద నెంతనమ్మకముతో బనిచేసెనో అట్లే పూర్వమును ధనసంబంధమైన వ్యవహారములందు కడుజాగరూకతతో మెలగియుండెననియు యొప్పుకొనక తప్పదు.

"ఇతడే—" ప్రఫుల్లుడు సంశయాస్పదుడైనట్లు కొంచెమాగి, తాను చెప్పదలచుకొన్న వాక్యమును పూర్తిచేసెను. "నేను భద్రగుప్తునకు వ్రాసిన యుత్తరము నపహరించియుండలేదు కదా?"

రఘు:- ఆవిషయమును మీరే ఆలోచించుకొనవలసియున్నది. ఇతడు దోషియని నేను నిర్ణయింపకున్నాను. మీ యుత్తరము పోయిన సమయమునందే, అటుపిమ్మట కొన్ని దినములకు దేవదేవునకు నేనుచూచిన యుత్తరము వ్రాయబడినట్లుండెను. అందు ధనమునుగూర్చిన ప్రసక్తియు కలదు. ఋణవిముక్తినొందినందులకు సంతసముగనున్నదని విశారదుడందు వ్రాసియుండెను. కాని ఋణము యెంతమొత్తమైనదియు తెలిసికొనుటకు నాకు వీలుపడలేదు. దేవదేవుడేమియు చెప్పలేదు. ఆ ఉత్తరమును నాకిచ్చినందులకు తన యజాగ్రతను తానే నిందించుకొనెను. ప్రఫుల్లచంద్రా! కష్టపడి పనిచేయుచు మితవ్యయ మొనర్చు విశారదుడు ఋణము దీర్చుకొనుటకు వలయు ధనమును నిలువజేసుకొనియుండును. నీసొమ్ము నపహరించుట కాతని కేమియవసరము?"

ప్రఫుల్లుడు తలయూచెను.

రఘు:- "కాని, అనుమానమునకు లోనయి సంచరించెడు వ్యక్తినే మనము సాధారణముగ ననుమానించుచుందుము. ఆ యుత్తరమును భద్రగుప్తునకు జూపి సొమ్మపహరించిన పురుషునకు నల్లని గడ్డముండెనట. అట్టి గడ్డమే చంద్రనగరమునకు వచ్చిన పతజలికి యున్నట్లు చెప్పుచుండిరి. కాని యీనగరమున నెందరకో సహజములయిన యట్టి వెండ్రుకలుండగ విశారదుని యనుమానించుట పొరబాటు."

ప్రఫుల్లు డాయభిప్రాయముతో తాను నేకీభవించినటుల తల యూపెను.

రఘు:- "ఆర్యా! మీకింకను అనుమానముండి, నిజము తెలిసికొనవలెననెడి యభిలాషమున్న యెడల, విశారదున కట్టి గడ్డము నొకదానిని తగిలించి, భద్రగుప్తునకు జూపింపుడు. ఏది యెట్లున్నను మన సంశయములు నివారితములు కావచ్చును."

ప్రఫుల్లుడు వెంటనే ప్రత్యుత్తర మొసగెను. "వలదు. నేనట్లు చేయదలపను. విశారదునకీ విషయమున నెట్టి ప్రసక్తియు నుండెనని యిదివరకెన్నడు ననుమానించియుండలేదు. అట్టి సంశయము—కలుగదు. అసంభవము."

ఆతనిపై యెన్నడు ననుమానమే లేదా? ప్రఫుల్లుడు పల్కిన యంత్యవాక్యము సత్యా

దూరమని రఘునాథుడు గ్రహింపగల్గెను.

"ఆర్యా, పోనిండు, మీాయిచ్ఛవచ్చినరీతిని మీారు చేయవచ్చును. ఈ నూతనాంశములను మీాకెరుకపరచి నాకీయ్యుక్త ధర్మమును నేను నెరవేర్చుకొనుచున్నాను. మీారు కోరిన నే తప్ప, నేనిందు కృషిచేయను కాని యింకొక ముఖ్యాంశమిం దిమిడియున్నది సుడీ!"

"అదియేద్ది?"

"చంద్రనగరమునకు సంబంధించినది. వివిధములగు నాలోచనములు నాహృదయము నాశ్రయించుచున్నవి. సుధాకరామాత్యుని మరణమున కాతడు కారకుడని నేను చెప్పను. కాని యెవరు చెప్పగలరు? ఇప్పుడు బయల్పడిన విశేషములవలన నాతనిపైగల యనుమానము వృద్ధిచెందుటకును, తగ్గిపోవుటకునుగూడ నవకాశములు కన్పడుచున్నవి. "ఆ సమయమున వకుళయొక్క విపరీతప్రవర్తనము మీాకు జ్ఞప్తియందున్నదా? ఆపె స్వప్నము—అస్మశానవాటికయం దాపె విపరీతప్రసంగము—ఆపె యావేశము?

ప్రిథుల్లుడా సందర్భములు మరపునకు రాలేదని యొప్పుకొనెను. అప్లేలజరిగెనో తాను గ్రహింప జాలకుండెననికూడ చెప్పెను. కాని యీ సంభాషణమునందు దనకేమియు బ్రసక్తిలేనివానివలె నన్యథాయుత్తమగు చిత్తమున నాతడు పల్కుచుండెను.

"వకుళా వాసుదేవులొకరి నొకరు కామించియుండిరి. చంద్రనగరమును చేరక పూర్వమాపె నలందా నగరమున వసించుచుండెను. ఆతని కా చిన్న తటస్థింపని యెడల వారిరువురును వివాహమాడెడివారే"

ప్రిథు:- "ఓ హెూ! అటులనా వారిరువురును కాముకులా? ఆపె చాల నుత్తమురాలు.

రఘు:- కావచ్చును. కాని కాముకుల విషయములో నుత్తమ స్త్రీలైనను అందరితో బాటే. తాము కామించిన పురుషులకొరకై నేటిదనుక స్త్రీ లెంతటి సాహస కార్యములకైన నొడి గట్టి యున్నారు. అత డాదుష్కార్యము చేసి యుండెనని యెడి భయమువలన నాతడు బయటపడకుండ వకుళ కాపాడుచున్నదేమోనని నేననుకొనుచున్నాను. అట్లుకాని యెడల నామె సాహసమునకు గారణ మగుపడుటలేదు. అయినను తానదివరకెన్నడును తన జీవితకాలములో నెరిగియుండని సుధాకరామాత్యునిపై గవిసి వధించుటకు మారువేషమున నాయింట తలదాచుకొన్న వాసుదేవుడేల పూనుకొనునో దురూహ్యముగ నున్నది."

ప్రిథు:- "అది యసంభవము"

రఘు:- నిశ్చయమే. మీా జనకుడీ నేరము నాతనిపై మోపి న్యాయస్థానమున విచారణ చేయించినను అతను నిందితుడని నిర్ధారణచేయుటకు తగిన సాక్ష్యములేదు.

ప్రిథు:- ఏమంటివి? ఈ విషయములు నా జనకున కేల తెలియవలెను. నీ వేమియు నాయనకు దెలుపరాదు.

రఘునాథుడాశ్చర్యచకితుడై "తెలుపకూడదా?" యని ప్రశ్నించెను.

"కూడదు. ఆపతంజలియే మన విశారదుడని నీ వాయనకు దెలుపవలదు. పతంజలి దొరకినాడని నీవెన్నడును వెల్లడింపరాదు."

రఘు:- ఆర్యా! ఇదియేటి యన్యాయము, ఈపతంజలిని పట్టుకొనుటకే నేను చాలకాలము

నుండియు దీక్షతో కృషి చేయుచుంటిని. నేటి కాతడు దొరకినాడు. కావున, నే నీ విషయము నింతటితో విడువను. జయచంద్రుడుకూడ నూరకుండడని నా నమ్మకము. పోనిండు — మనము బుద్ధిపూర్వకముగ దీనిని గప్పిపుచ్చ నెంచినచో మాదన్నమంత్రి యూరకొనునా ?

ప్రఫు:- రఘునాథాచార్యా ! మన మీ విషయమును వెల్లడిపరుపరాదని నేనిదే చెప్పుచున్నాను. నీవేమియు చేయరాదు

ర:- మాదన్న మంత్రికీ యుదంతము తెలిసి పతంజలిని పట్టుకొన్నచో ?

ప్ర:— అట్లు సంభవించినపుడు మనము దానిం గూర్చి సావకాశముగ విచారింపవచ్చును.

రఘు:— కాని, ప్రఫుల్లచంద్రా ! పతంజలియే నిశ్చయముగ హం—

ప్ర:— ఆ ప్రసంగమును మానుము ! రఘునాథా మరల మరల దీని నుచ్చరింపవలదు. నా తండ్రి కిదొక్కింతయు దెలియనీయరాదు. ఇందలి రహస్యము లన్నియు బయల్పరచి, నా హృదయ భారమును దీర్చుకొనవలెనని యభిలాష నాకు కలదు. కాని యన్యులను కష్టనష్టముల పాల్పరచుటకు నే నియ్యకొనను. పతంజలిని సాధించుటకున్న ప్రస్తుతము మాని పోవుచున్న గాయములకు తిరిగి యంపపుకోత పెట్టుట యగును. దీనివలన మనలో కొందరికి మరణమో — అంతకంటె నధమమగు నవస్థయో సంభవించుట నిశ్చయము.

రఘు:— నేనొక్క ప్రశ్న నడుగుదును. దానికి సమాధానము జెప్పుడు. పతంజలియే సుధాకరామాత్యుని జంపిన హంతకుడని మీ రెరిగినచో, నింకను మీరతని గాపాడజూతురా!

ప్ర:— ఈ దుష్కార్యమును జేసినది పతంజలియేనని నాకు దెలిసినచో, నాతని దగురీతిని శిక్షింపజేయుటకు నేను వెనుదీయను. కాని పాపమాతడు నిర్దోషియని నేనెరుగుదును.

రఘు:— అట్లయిన మీ కెవరిపయి ననుమానము కలదు ?

ప్ర:— ఈ పాపకార్యమును చేసినదొకరని నే నాదినుండియు విశ్వసించుచుంటిని. చంద్రనగరవాసులచే తీర్మానింపబడినరీతి నది యాత్మహత్యయో లేక ప్రమాదవశమున జరిగినదియో యగునెడల హంతకు లెవరైనదియు విచారింపవలసిన పనియేమి? కాని హంతకుడు పతంజలి కాడనుట నిజము.

రఘు:— హంతకుని బట్టుకొనగలమా ?

ప్ర:— పట్టుకొనవచ్చును, కాని మనమాతని శిక్షింపజేయలేము.

రఘు:— హంతకుని పేరు చంద్రనగరమున జరిగిన విచారణ సందర్భమున విని యున్నారా ?

ప్ర:— లేదు. ప్రపంచములో నెవరును విని యుండలేదు. ఇంతటితో పోనిండు. ఈ విషయమున పతంజలి కెట్టి ప్రసక్తియు లేదని నేను ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను. విశ్వసింపుడు. ఈ కారణముచేతను నింకను గొన్ని కారణాంతరములచేతను, మీరు నాకు నేడు తెలిపియుండిన విషయములు మన కిరువురకు రహస్యములుగ నుండవలెను. నా [illegible]వెంట నేను విశారదుని వదలివేసెదను. మీరు నాకిది వాగ్దానము చేసెదరా ? ఇందులకై మీకింతవరకు గలిగిన వ్యయ ప్రయాసలకు నేను మీరు కోరిన సొమ్మునిచ్చుటకు సంసిద్ధుడను.

రఘు:— వలదు. వలదు ఇంతవరకు వ్యయ ప్రయాసలేమియు కలుగలేదు. కాని మీరు

కొంతన:. తనసామాన్యమనుఁడీ! నాకు విస్మృత మాటయు వచ్చెను.

ప్రే.— మంచిది అట్లే ఒకానొకవేళల, మీరు నాయాజ్ఞకు లోబడి వర్తించిరని చెప్పెదను. నేనివిషయమున నెట్టిజోక్యము కలుగఁజేసుకొనవలదని శాసించితినని సమాధానము చెప్పుకొనెదను.

రఘు.— కానిండు. ఈపరిసక్తి నింతటితో నాపుదము. కాని యన్యులద్వారమున నిదిబయల్పడునెడల నన్ను నిందింపవలదు

ప్రే.— లేదు. లేదు. రఘునాథా! నీకు నేనెంతయు కృతజ్ఞుఁడను. ఇక సెలవొసగుఁడు. స్వామీ! నిజముగు ప్రఫుల్లచంద్రుఁడు రఘునాథునకు నమస్కరించి, సెలవుగైకొని గృహాభిముఖుఁడయ్యెను. ఆచార్యుఁడు నాతని గొంతవరకు సాగనంపి తిరిగి యిల్లుచేరి, తన యధ్యాసనమున గూర్చుండి, ప్రఫుల్లుని సంభాషణ క్రమమును పూర్వాపరక్రమముగ నింకొకసారి జ్ఞప్తికిదెచ్చుకొని, ఆలోచనానిమగ్నుఁడై కొంతతడవట్లు కూర్చుండెను. సుధాకరామాత్యుని మరణసందర్భములఁగూడ నొకసారి జ్ఞాపకముచేసికొనెను.

“ఆ సాయంతనమున మృణ్మయి సుధాకరుని దర్శింపవచ్చియుండలేదుకద” అనిన వాక్య మొకటి యతని నోటినుండి బయటబడినది.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

### వకుళ.

---

గత ప్రకరణమున వివరింపబడిన విశేషములు గడచి రెండుమాసములు జరిగినవి. పడమరవీధి యందున్న స్వగృహమున రఘునాథుఁడు నిజాసనమున గూర్చుండి యిట్లు తలపోయుచుండెను.

“ప్రఫుల్లుఁడు నన్ను మోసగించుచున్నాఁడు. నేనీ విషయమున నెట్టిజోక్యమును కలుగఁజేసికొనరాదని శాసించితిమి, ప్రఫుల్లుఁడీ పట్టణమున గూర్చుండి తన యిచ్చవచ్చినరీతిని రహస్యములను బయల్పెట్టుచున్నాఁడు. తన తండ్రిని మాధవన్న మంత్రినిఁగూడ నూరకుండుమని యాతఁడేల కోరఁడు? అట్లు చేయుటకు మారుగా నాతఁడు వారియిష్ట ప్రకారము కృషిచేసుకొననిచ్చుచున్నాఁడు. కాబట్టి ప్రయాసపడి పతంజలిని వెదకుచు, వాఁడు చనిపోయెనని తలచుచున్నారు.-ఈవిషయమును నేనొసగుదమని కూడ వారిపుడు గ్రహించుచున్నారు. నే నసమర్థుఁడనని మాధవన్నమంత్రి నాపై కినుకవహించుచున్నాఁడు.

రఘునాథుఁడెదుట బల్లపైనున్న కొన్ని కాగితములనందికొని వ్రాసియుండిన వ్రాతను కొంత వరకు జదివికొని మరల నిట్లు స్వగతముగ నాలోచింపఁజొచ్చెను.

“మాధవన్నమంత్రి సమక్షమున నేను సమాధానము చెప్పికొనవలసి యున్నది. నేనింక నాయనను దర్శింపలేను. ప్రఫుల్లుని జూడకుండ నాయనవద్దకేగుట సమంజసము కాదు. పతంజలి యెచ్చటనున్నది? – వీరింక నెరుగరు. నలందా నగరమున దేవదేవ్రు డొరలతో నీవిషయము చెప్పను వాసుదేవుని గూర్చిన వివరముల నడుగవచ్చిన వారిని ప్రేమచంద్రుఁడు శీఘ్రముగనే తన యింటిలోనుండి సాగనంపును. ఇక జయచంద్రుఁడును, మాధవన్న మంత్రియు నీ పతంజలి కొరకు దేశమంతయు నెంత వెదకించిన నేమి లాభము? అతఁడు వారిచెంతనే యున్నాఁడని వారు పాపము, యెరుఁగరు. ఈరహస్యమును నేనును ప్రఫుల్లుఁడు నెరుగుదుము. కాని, యిది యింకను దాచుట నాకు క్షేమకరముగ నగు

చుకొనచు “ సందేహ మేమి? ” యనియెను.

“ అవును. సందేహము కలిగెనుకదా ”

“ ఆత్మహత్యయేనని పతినారని కాదా? న్యాయస్థానమున విచారణఫలితముకూడ నట్లని యేకదా? ”

“ ఎల్లరును నమ్మలేదు. నీవట్లు విశ్వసింపని వారిలో నొకతెవు. ఆతని శవమును సమాధి యొనర్చినపుడు మాదన్న మంత్రి ప్రభృతు లచ్చోట నుండిరి. నీవనినవాక్యములను విని యుండిరి.”

వకు;—“ నేను కారణాంతరములచే నాయభిప్రాయమును మార్చుకొనవలసి వచ్చినది. నేనా రాత్రి చేసిన యకృత్యమున కెంత పశ్చాత్తాపమొందితినో భగవంతునకే యెఱుక! నేనా యకార్యమునకు ప్రాయశ్చిత్త రూపకముగ నేమిచేయవలసిన—

రఘు;—వకుళా ! తొందరపడకుము. చాల కాలముగ నీతో మాటాడవలయునని నేనిచటకు వచ్చియుంటిని. నేనుకూడ నానమయమున, నాత్మహత్య యేనని తలచియుంటిని కాని యటుపిమ్మట చేయబడిన పరిశ్రమవలననే నాయభిప్రాయమును మార్చుకొనవలసి వచ్చినది. సుధాకరు నెవరో హత్యచేసిరనుట యదార్థము!

వకుళ మారుమాటాడలేదు.

రఘు:—ఆసమయమున మీయింటివద్దనొక నూతనుడు విడిసియుండెను. నీకు జ్ఞాపకమున్నదా! అతనిపేరు పతంజలికాదా ? వకుళా ! ఆహత్యకు కారకులెవ్వరైన నున్నయెడల నతడు పతంజలియై యుండవలెనని చంద్రనగరవాసులందరనుకొన్నుటనీకు జ్ఞాపకమున్నదా ? ఇన్నాళ్లవఱకిని తెలియరాక రహస్యముగ సంచరించుచు, పతంజలి జాగరూకతతో ప్రవర్తించుచున్నాడు. నీవేమందువు?

వకు:— నేననుటకేమున్నది ? నాకేమియు తెలియదు.

రఘు :— అటులైన, వినుము ; పతంజలి నేటికి పట్టుపడినాడు !

“ పట్టుపడెనా? ” యని వకుళ యొక్క ప్రాటున నాకఱిందన మొనర్చెను.

రఘు ;— దొరకనాడు. అనతిదూరములో నున్నాడు. కొలది దినములలో కారాగృహప్రాప్తి నొందగలడు. కాని, నిన్నీరీతిని భయపెట్టిన నేమిలాభము! అతడు దోషియైనను ఆతనిపై నిపుడెవరును పగ సాధింపదలచియుండలేదు. ఆహత్యజరిగి పెక్కు సంవత్సరములు గడచినవి. మాదన్న ప్రభృతులిక దీని నింతటితో వదలివేయ వచ్చును. ప్రఫుల్లచంద్రుడా హంతకునకు మిగుల సహాయము చేయ వచ్చును. వారందరు దయయు దాక్షిణ్యమును గల సజ్జనులు. వకుళ, భయ విహ్వలచిత్తయై ప్రకంపితమగు కంఠమున నిట్లు ప్రశ్నించెను. “పతంజలియే దోషియని మీరువిశ్వసింతురా?”

“ఏమంటివి ? నేను విశ్వసింపనా ? నేనేగాదు మాదన్నమంత్రియు, సూక్ష్మబుద్ధిగల యనేకులును విశ్వసింపుచున్నారు.

వకు;— పతంజలి నిర్దోషియని నేను బహిరంగముగ చెప్పుచున్నాను. అతడు సుధాకరా మాత్యుపై వ్రేలైన నెత్తలేదు. ఆ ఘోర కార్యమును చేసినది నేనే నని మీవద్ద నేనేల నొప్పుకొనరాదు ?

రఘునాథుడీ యంత్యవాక్యమును వినినంతనే యాశ్చర్యచకితు డయ్యెను.

“ వకుళా ! నీవేనా ! ”

సాఫల్యము కలుగ నేరదు. మన యభ్యుదయము నిమిత్తము నూతనాంశముల నన్వేషింప వలసి వచ్చినపుడు అన్యుల కండ్లలో మన్ను చల్లుట దోసము గాకపోవచ్చును. కాని నేను దాపలేని యీ రహస్యమును ప్రపంచములో నెవ్వరికిని తెలియకుండ దాపగలనని మిమ్ము నమ్మించి మీరొసగు బహుమతుల గ్రహించుట నాకు హితము కాదు ఈవిషయము మితటితో సమసి పోవుట యసంభవము. కొలది దినములలోనే క్రొత్తవింతలు బయల్పడ వచ్చును. దీనిని తటితో నాపివేయవలెనని మీరును నేనును ప్రయత్నింపవచ్చును. కాని ప్రఫుల్లచంద్రా! నామాట వినుడు! యిది యింతటితో సమసిపోదు. అట్లగుటకు నొక్కింతయు తావులేదు......కావున మనము వేరు మార్గముల నాలోచించిన లాభమేమియు నున్నట్లగపడదు. ఆఘోర కార్యమున పతంజలి పాల్గొని యుండెనని మీరు విశ్వసించు నెడల నా విషయమును బహిరంగముగ మాద న్నామాత్ర్యాన కెగించి పతంజలి నాతని వశము నందేల విడువకూడదు ?

ప్రఫు:- రఘునాథా! నిష్కారణముగ పతంజలిపై నేరమునేల నారోపించెదవు? అతడేమియు నెరుగడని భగవంతుని సాక్షిగ నేనుప్రమాణము చేయుచున్నాను, అతడు సుధాకరునిపై చిటికెన వ్రేలినైన నెత్తలేదనియు, నాతని శిరోజము నైన ముట్టలేదనియు నానిశ్చితాభిప్రాయము. ప్రపంచమున నింకెవరినైన నీహత్యాపకారకులుగ నెతువుగాని పతంజలిని మాత్ర మనుమానింపవలదు. ఆతడు నిర్దోషి యని నేను చెప్పుచున్నాను.

రఘు:- అట్లయిన నొక స్త్రీ హంతకురాలై యుండి యుండవచ్చునా ?

ప్రఫు;- ఎవరు? ఆ స్త్రీ యెవరు ?

రఘు,- వకుళ.

ప్రఫు;- వకుళ నన్యాయముగ నిందులోనికేల యీడ్చుకొని వచ్చెదవు? నీకామెపై ననుమానము కలదా ?

రఘు;- వుండినవుండవచ్చును. లేకున్న లేకపోవచ్చును. ఆమె విషయమున గొంత విచారింపవలసియున్నది

ప్రఫు:-పతంజలిపైకంటె నామెపై నేరమును మోపిన గొంతవరకు సమంజసమే.

రఘునాథుడు ప్రఫుల్లునికడ సెలవుగైకొని వెడలిపోవుటకు బయనమయ్యెను. "ప్రఫుల్లచంద్రా! నేను ముఖ్యముగ నొక విషయము మీతో విన్నవింపదలచి నేడిచటకు వచ్చియుంటిని, నాకు సాధ్యమగునంతవరకు పతంజలి యొక్క రహస్యమును నేను బయల్పడనీయను. కాని యన్యుల ప్రేరణమువలన నది లోకమునకు దెలియవచ్చునెడల నాపై మీరు కినుక వహింపవలదు. నేనిక పోయి వచ్చెదను.



# హాస్యాలు

### లేవడం.

" వ్యవసాయములోకల్లా కష్టమైన పనేమిటి? "

" పొద్దున్నే అయిదింటికి లేవడం "

### మార్పు.

" కిందటి నెలలో నాలుగు చోట్ల పనిచేశావు ఇపుడు నాదగ్గరమాత్రము నిలకడగా వుంటావాయేం ? "

" నిజమే. అందరికీ నేనెంత అవసరమో దాన్నిబట్టే తెలుస్తోంది"

### అరపు.

జడ్జి:— యీసారి యెవరయినా అరిస్తే యిక్కడనుంచి పంపివేస్తాను.

ముద్దాయి:— శెభాష్. శెభాష్, (అని అరచెను.)

### భీమా.

ఇంగ్లాండులో నొక దొరగారు తన కూతురుకు కవల పిల్లలు పుట్టినయెడల పదివేల పౌనులు యిచ్చునట్లొక కంపెనీలో భీమాచేయించెను. కొంతకాలమునకు కవలపిల్లలు పుట్టిరి. కంపెనీవారు పదివేలపౌనులు యిచ్చిరి. ఈ కష్టములో తనకు సగపాలు రావలెనని దొరగారి అల్లుడు వ్యాజ్యము తెచ్చెను.

### వింతచర్యలు.

1. కలకత్తాలో మజ్జిగలో నీరు కలిపినందుకొక గొల్ల దానిపై వ్యాజ్యము తెచ్చిరి. మజ్జిగలో యిదివరకే నీరు కలిపినట్లు తెలియదని ఆగొల్ల దెంతవాదించినను వినువారు లేకపోయిరి

2. వియన్నా నగరములో నొక కన్యగలదు. జుట్టు దువ్వుకొనకుండా కాలము గడిపేయెడల ఆమెకు 80 వేల పౌను లియ్యవలసినదని యొకరు మరణ శాసనములో వ్రాసిరి. అపరిష్కార మాకన్య యావజ్జీవితము గడిపినది.

### కోతులు.

" కోతులంటే నాకు భయం "

" ఎందువల్లన ? "

" వాటినిచూస్తే మాబంధువులంతా జ్ఞాపకంవస్తారు"

### నోరులేక పోవుట.

భార్య:— నోరులేని పశువునయినా దయాదాక్షిణ్యము లతో చూస్తారుకాని నామాటే చూడరు.

భర్త:— నీవుకూడా నోరుమూసుకో. నాకు దాక్షిణ్యం వుంటు దో లేదో చూతువుగాని.

### సంగీతం.

" కొండ్లోకి వెళ్ళినపుడంతా సంగీతం పాడుతారేం"

" బహుశా, అక్కడ సంగీతం అనేవారు యెవరు వుండరు. లేదా దొడ్లో మనిషివున్నట్లు గుర్తేమో. "

### కాఫీ.

భర్త:— కాఫీలో యీగపడింది.

భార్య:— అబ్బా అంత గల్ల తేమిటి? ఈగ కాఫీ అంతా త్రాగయ్యదులెండి.

### వందనములు.

" పత్రికలకు వ్రాస్తే యీ రోజుల్లో ప్రతిఫలం లేదండీ "

" అది నేనంగీకరించను. నేను పంపిన వ్యాసమల్లా వందనములతో పంపించేశారు "

### ఇష్టము.

మేజి:— నీభార్యతో నీవు యిష్టముగా యెందుకుండవు?

ముద్దా:— ఆమెచేసే వంట నాకిష్టముగా వుండదుగనుక.

### చెముడు.

" మీ యావిడకు సరిగా వినపడదనుకుంటానే? "

" నన్నుగురించి యితరులు చెప్పినప్పుడు తప్ప "

### టీ.

" నీవు త్రాగే ప్రతి టీ కప్పు నీ యాయుర్దాయము తగ్గిస్తుంది. "

" ఆవిషయం నేను నమ్మను. ఆలెక్కప్రకారం ఐతే నేను రెండువందల యేండ్లక్రిందే చచ్చిపోవలసింది."

# విమర్శనలు

## శ్రీ శివాజీ మహారాజు

ఛత్రపతి శ్రీశివాజిమహారాజు నామమాసేతు హిమాచల పర్యంతము మారుమ్రోగుచున్నది. త్రిశతాబ్దముల క్రింద [illegible]ఏకవీరుడు భారతదేశమున జన్మించి, భారతదేశ స్వాతంత్ర్యము కొరకు పోరాడియున్నాడు. ఈతని నామము పాదుషాను సైతము కలంచుచుండెడిది. దేశభక్తి చాతక ప్రజలలో నింకను నిలచియుండుట కితడే కారకుడు. పరస్త్రీని కన్నెత్తియైనను చూడలేదు. తన మహాసామ్రాజ్యము నష్టదిగ్గజముల సహాయ సంపత్తితో నేలెను. భక్తిపూరితుడు, దానధర్మనిరతుడు, శాంతమూర్తి, ఆవేశరహితుడు, పౌరుషమూర్తి. ఇన్ని సద్గుణముల తేజోపుంజమగు శివాజిచక్రవర్తి స్వాతంత్ర్యవాయువులను వెదజల్లుచు తనరాజ్యమును రామరాజ్యముగ నేలెను. అట్టి మహనీయమూర్తి పవిత్రనామము [illegible]మాసమున మూడవతేదీని స్మరించి భారతదేశము ధన్యత చెందినది.

శివాజి "కొండయెలుక" అని వ్రాసిన పాశ్చాత్య చరిత్రకారుల వాక్యములు నిందాపూరితములు. శివాజి బందిపోటుదొంగ కాదు. స్వాతంత్ర్యరక్షణార్థ మవతరించిన పుణ్యమూర్తి. చీలిపోయిన భారతదేశ ప్రజ నైక్యము చేయ నడుముకట్టిన కర్మవీరుడు. అట్టి శివాజీకి జన్మస్థానమైన భారతదేశము, అందు ముఖ్యముగ మహారాష్ట్రప్రాంతము, సఖ్యతలేక కలతలతో నిండియుండుట విచారకరము. శివాజీ హృద్గతమగు స్వాతంత్ర్యాగ్నిలో సహస్రాంశమైనను మన హృదయములలో నున్నదేమో దివిటీ పెట్టి వెతకుము. శివాజీ నామస్మరణము స్మృతిచిత్రాలు వాయిద్యములతోను, ఉపన్యాస పరంపరలతోను, పత్రికాఘోషలతోను పూర్తికానేరదు. ఆమహామహుని పవిత్రనామమును సార్థకము చేయుటకు ఆ మహనీయుడు తలపెట్టిన కార్యమును కొనసాగించుట మనవిధి. అందుకై బొంబాయి అఖిల భారత సమావేశములో మన నాయకులెంతవరకు పాటుపడిరో గమనింపుడు.

## బొంబాయి సమావేశము

బొంబాయిలో జరిగిన అఖిల భారత సంఘ సమావేశపు తీర్మానములలో నతి ప్రాముఖ్యమైనది హిందూమహమ్మదీయ సఖ్యతను సంబంధించినది. నియోజకవు హక్కులు ఉభయవర్గములతో శాశ్వతమైత్రి యేర్పడదు. ఏదెట్లున్నను ఉభయపక్షములవారు నొక యేర్పాటు చేసికొనుట భావ్యభివృద్ధి సూచకమే.

ఇతర తీర్మానములవలన స్వరాజ్యపక్షము స్వాతంత్ర్యతను బొందినది. మొదటిలో కాంగ్రెసుకును స్వరాజ్యపక్షమునకును సంబంధముండ రాదని వాదించినపుడు, కాంగ్రెసు భారము వహించిన నేగాని ప్రపంచము స్వరాజ్యపక్ష బలమును గుర్తించుటలేదని నెహ్రూ మున్నగు నాయకులు వాదించి, కాంగ్రెసుచే సమ్మతింప చేసిరి. కాలప్రవాహములో విపరీతములు జనించేనరికి మొదటి యేర్పాటు మార్చుకొనవ

“డైవర్సు శాసనము” కూడ [illegible] హిందుచట్టములో డైవర్సు అనుమతిలేదు. [illegible] కలవి రెండు. (1) పురుషులు తమ భార్యలకు మనోవర్తులనిచ్చి విడాకులు పుచ్చుకొందురు. (2) కోర్టులో వ్యాజ్యెము తెచ్చి తమను వదలినభార్యలను వశపరచుకొందురు. దీనినే Restitution of Conjugal Rights అందురు. మొదటి యేర్పాటుప్రకారము పురుషుడు తనభార్యకుపోషణమిచ్చి వదిలివేయవచ్చును. భాగ్యవంతుల పిల్లయైగాని జారత్వమునకు మరగిగాని పుట్టింటికడ చేరినపుడు కూడ భర్తను మనోవర్తియిచ్చి విసర్జించుకొనమనుట యనుచితము. అటువంటి సందర్భములో కోర్టుద్వారా భార్యను తనవద్దకు రప్పించుకొనవచ్చును. అయిష్టముతోగూడిన భార్యను నిర్బంధముగ దెచ్చుకొని భర్త యెట్లు సుఖింపగలడు? కర్మవశాత్తు తెచ్చుకొనినను యేనూతిలో పడినను యేనిప్పు అంటించుకొన్నను యేవిషము తిన్నను భర్త యేమిచేయ గలడు? భార్య రానన్నచో కోర్టువారు శిక్షవిధింతురు. ఈశిక్ష విధింపజేసినంతమాత్రమున భర్తయొడిలోపడునదేమి? “ఇంతచర్చ యెందుకు, భార్యను డైవర్సు చేసిన చాలదా” యని యందురు. అదియే మాప్రశ్నయు నైయున్నది, కాని హిందు శాసనము ప్రకారము డైవర్సు లేదు. స్వాతంత్ర్యము ప్రబలుచున్న యీదినములలో, మంచిభార్య చెడుభర్తను వదలుకొనుటకును, మంచిభర్త చెడుభార్యను వదలుకొనుటకును, సావకాశ ముండవలెను. సంఘ సంస్కరణవాదు లెల్లరు నీశాసనమునకై పోరాడవలెను.

కృష్ణాజిల్లా బోర్డు—

జిల్లాబోర్డు విషయములో ననేక వదంతులు వ్యాపించుచున్నవి. పురాతన నాయకులు తెరచాటుననుండి అనేక నాటకములు ఆడుచున్నారు. ప్రబలియున్న అనేక వదంతులను నిష్పక్షపాతముగ నిచట విమర్శించుచున్నాము. దానికి తగిన ప్రత్యుత్తరములిచ్చి నాయకులు తమ నిర్దోషిత్వము నెలకొల్పవలెను.

1. బందరు తాలూకాబోర్డునకు కాంగ్రెసు సభ్యులగు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అధ్యక్షులగుటకు ప్రయత్నించుచున్నారు. వీరధ్యక్షులయి జిల్లాబోర్డు మెంబరగుచో తమ వోటును రెడ్డిగారి కిచ్చెదరేమో యను భయము ప్రజల కావహించినది. కనుక తాలూకాబోర్డు సభ్యులు ప్రథమమునందే, వీరిచే తమ వోటును రామచంద్రరావుగారి కిచ్చునట్లు వాగ్దత్తము చేయించుకొనవలెను. కాంగ్రెసు సభ్యులు తాలూకాబోర్డు అధ్యక్షులుగ రావచ్చును, గాని జిల్లాబోర్డునకు రామచంద్రరావు గారేల రాకూడదో!

2. రామచంద్రరావుగారి పక్షమువారు బందరు నాయకులను సందర్శించి తోడ్పాటు కోరగా, మీకు తమకేమియు తెలియదని చెప్పి చాటున రెడ్డిగారికి ప్రయత్నము చేయుచున్నారట. అట్లయినచో రెడ్డిగారిని బెజవాడ తాలూకాబోర్డు ప్రెసిడెంటుగ రాకుండచేసెదమని బెదరించి, మరిద్దరుముగురిని బెజవాడ తాలూకాబోర్డునకు నియమింపజేసిరట. అందువలన రెడ్డిగారికి ఛాన్సుపోయినది.




మచిలీపట్టణము

సంపుటము ౨ } జూన్ 1927. { 3 వ సంచిక

# అంగారపర్ణుడు.

నుసర్ల రామమూర్తిగారు.

( ప్రవేశము – అర్జునుఁడు.)

ఆహా! ఏమి? యీ యామినీకాంత శోభా విశేషము. ఈ గంగాసంతతియు శరత్కాల చంద్రికా ప్రసార ప్రతిబింబితమై భూదేవికెంత వింత సొంపుగనుఁ గలిగించుచున్నది? మంద మందాకినీ వీచికల తరంగమాలికలఁ దూగుటుయ్యాలలూగు మరాళదంపతులతోడను షడ్జమ స్వరముచే మనోల్లాసముఁ బ్రకటించు కేకీచయంబుతోడను విలాసార్థముగ విహారయోగ్యంబై యీ పరిసరప్రదేశము నయనానందకరంబగుచున్నది. ఆహా! ఏమి యీ నదీరామణీయకము.

సీ|| జలములపైఁ బ్రాకి ♦ విలసిల్లునట్టి నై
వాలజాలము జటా ♦ భరముగాగ
మృదుమృణాళముల భ ♦ క్షించుహంసలవన్నె
నవ్యవిభూతి వ ♦ ర్ణమ్ముగాగ
మధుపానమున సంభ్ర ♦ మముదాల్చు భ్రమరఝం
కారంబు వేదవా ♦ క్యములుగాగ
కమనీయకల్హార ♦ సుమములు మేనికై
గ్రాలెడు రుద్రాక్ష ♦ మాలగాగ
గీ|| జపతపోనిష్ఠుఁడౌ మౌని ♦ చందమునఁగ
నెసఁగు గంగాభవాని ప ♦ శ్చిమ్ముపవహించి
కలుషములడంచి మమ్ము కృ ♦ తార్థులను జేయ
నివియ క్షైకొమ్ము మన్నన ♦ స్తుతిశతంబు||
ఆహా! ఏమి యీ తారాగణంబుల సొబగు.
గీ|| యామినీకాంత చంద్రిక ♦ య్యాకలమను
రమ్యతరమైన నీలాంబ ♦ రంబునందు

జల్లువిరులన నెసఁగ న ♦ క్షతశ్రీ సమితి
వరలుచున్నవి క్షేత్ర ప ♦ ర్వమ్ములగుచు ॥

ఆశ్రితులపై గంగాభవాని చూపు నవ్యాజ ప్రేమరసం బెంతని కొనియాడుదుము.

గీ॥ నిండు వాత్సల్యమున జన ♦ నీమతల్లి
కన్నబిడ్డల జోకొట్టు ♦ కరణిఁ దోఁప
వలల నెడు తూగుటుయ్యాల ♦ లందు నునిచి
కల మరాళములూచు గం ♦ గా స్రవంతి ॥

జీవయాత్రానంతరము జీవుండు మోక్ష సాధాకోహాంబునకు నాసించి త్వరపడునట్లే జలమాన్నికా నికరంబులు తీవ్రగమనంబునకు బ్రిఘటించుచున్నను నదీమతల్లి సాగరుఁ జేర నెంతత్వరపడుచున్నది. చరాచరంబు లన్నిటి యందును భగవత్ప్రతిములు ప్రతిబింబించు చుండునుగదా. ప్రతి వస్తువునకు గమ్యస్థాన మొకటి యుండును. దేశాటనంబుచే మానవు నకు జ్ఞానాభివృద్ధి గలుగుననట యిట్టిదియే కదా.

మ॥ అరిషడ్వర్గములన్ జయించుచు యసా ♦ ధ్యంబంచు [జీవుండు దు
స్తరసంకల్ప వికల్పచిత్తుఁడయి, శ్రీ ♦ దస్వాంతుఁడై, [ముక్తిఁ దా
నర యన్ జింతిలురీతి, గంగ నిజ గ ♦ మ్యస్థానమున్ [జేరగా
నురుఘూర్ణధ్వని సంకులోన్నత తరం ♦ గోద్రేకయై [యొప్పెడిన్ ॥

ఈ పరసరోపవనంబులు కైలాస యోగ్యంబులై కనఁబడ్డెడు. ఈ మందపవమానిల పరిమళ వ్యాప్తిచే నీ ప్రదేశంబున నెవ్వరో నాయికా నాయకులు విహరించుచున్నట్లు లూహింపఁదగియున్నది. (పరికించి) ఏమిది! క్రమక్రమముగ — సువాసన యీసమీపమున నుండియే [illegible]చున్నట్లున్నది. ఎవరైన నిటు వచ్చుచున్నారా! (ఆతురతతో సెలవు పరికించుచుండును.)

(అంగారపర్ణుఁడు చేత విల్లునమ్ములఁ ధరించి ప్రవేశించును.)

అంగా:- ఓరి, ఎవరురా......

(కిర్మీరజామలు ప్రవేశింతురు.)

అర్జు:- (ఎదురేగి) అన్నయ్యా, చూచితివా! ఆతఁడెవరో యాగ్రహావేశమున వచ్చుచున్నాఁడు.

ధర్మ:- తమ్ముఁడా! భయమందకుము, రానిమ్ము.

అంగా:- ఓరా! దుర్మదాంధులగు మానవాధములారా! జలక్రీడార్థమ గనానసహితుండనై వచ్చిన నావిహార కౌతూహలంబున కాట కపరనుట కెట్లు సాహసించితిరి. ఇప్పటికైన వివేకముగలిగి వెడలిపొండు. ప్రాణముల దక్కించుకొనుఁడు. నిశీథినీసంధ్యలు భూతయక్ష దానవ గంధర్వవిహార యోగ్యంబులగుటచే మానవకోటి యట్టిసమయముల సంచరింప రాదుగా. ప్రాణములపై నాసలేని మానిసులారా! ఇప్పటికైన క్షమాపణ గోరి వెడలిపొండు.

అర్జు:- మహాశయా! శాంతింపుడు, తమరెవరో యెఱుఁగనగునా?

అంగా:- ఓరా! గంధర్వరాజును. అంగారపర్ణుఁడను. నన్నెఱుఁగవా ఏమి? నీ పొగరుబోతుతనము. ఇప్పటికైనను మరలిపొమ్ము.

అర్జు:- ఓయీ! గంధర్వరాజా! నీవా! మేమిందుండి వెడలవలయునని యీ యభిమతం.

అంగా:- అభిమతముగాదు. ఆజ్ఞయునవలయును.

అర్జు:- నీయాజ్ఞ మాచేఁ దిరస్కృతమైనది. నిరంకుశముగ నీవు సంచరించుటచే జనులు నిను జూచి జంకుచుండిరి. నేడు సోదరులగు మేమే నిరాటంకముగ సంచరింప నెంచితిమి.

కావున నిందుండి మాకభ్యంతరముఁ గలిగింప కుండుట నీకు గర్తవ్యము. మేము శక్తిహీనులము కాము. కళత్ర సమేతుండవై యుంటివి గానఁ దొలఁగియుండుట నీ కే శ్రేయోదాయకము. మమ్మెదిరించుట నీకెంతయు హానికరము. గంధర్వా! స్వాతిశయము నిరుపయోగము, హితబోధనాలకింపుము. పొమ్ము (ముందునకు నడచుచుండును.)

అంగా:- (కోపముతో) నిలువుము. ఓయీ! నాయాజ్ఞ కెదురాడి నీవెటకేగగలవు. నీకు గాలమాసన్నమైనట్లు తోఁచెడి. లేనిచో నిష్కారణవైరమునకు గడంగవు. నీ వేషము వలన బ్రాహ్మణుఁడవని గ్రహించితిని. నాయూహ సమంజసమైనచో నా విహారంబునకు విఘాతంబు గలిగించి, నాకుఁగోపాతిరేక మొనర్చక మరలిపొండు. నాయనుభవంబున నున్న నీ గంగాతీరంబును, నీ వనంబును వీడి దూర మేగుము.

భీముడు:- (ధర్మజు నవలోకించి) అన్నయ్యా! ఈగంధర్వుఁడు గర్వాంధుఁడివలె నున్నాఁడు. ప్రతిక్రియ సల్పుట సమంజసమని తోఁచెడి.

ధర్మ:- భీమసేనా! శాంతింపుము పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వలె నాతనితోఁ బోరుటకు నీవు పోవలయునా? అర్జునుఁ డాతని కేమాత్రముఁ దీసిపోవఁడు. మన మీవలనుండి సందర్భము లెట్లుండునో పరికించుచుందము. (అని దూరముగాఁ జూచుచునుందురు)

అర్జు:- నీవంత బలశాలివైనచో నితరులు దుర్బలులనుకొంటివా? ఈపుణ్యతరంగిణి కలుషహారిణి, గంగానదీవతి, ఉచ్చనీచవిభేదరహితంబుగ సర్వజన సేవ్యంబుగదా. లోక మెఱుంగనివారియెదుట నీ భీకరారావములు జయప్రదములగు. వనప్రవాహంబు నొక్కని యధీనంబులా!

గీ|| గగనమందుండి, శివ జటా ♦ గ్రమ్మునంది
హిమనగముఁ జేరి యందుండి ♦ పృథివిఁబడియు
సాగరైక్యత దుద కద్భు ♦ శ్యంబులందు
చంచలపు గంగ నీకెట్లు స్వార్జితంబు ||

అంగా:- గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినదన్నట్లు నాహక్కు భుక్తముల విషయమును ప్రశ్నించుటకు బయలుదేరితివా? చాలు. చాలు! నీ యప్రస్తుత ప్రశంసఁ గట్టిపెట్టుము.

గీ|| తర తరమ్ములనుండి గం ♦ ధర్వగణము
లనుభవించుచు నుండిరి ది ♦ వ్య ప్రవంతి
జగమెఱుఁగు బ్రాహ్మణుఁడ ♦ జందెమేల?
సమర మిపుడేల? అధిక ప్ర ♦ సంగమేల? ||

నీ వృథాప్రలాపములచే నన్ను జయింప జాలవు. యుద్ధసన్నద్ధుండవు కావలసివచ్చును. యోచించుకొనుము. అనాలోచనీయుండవై యున్నలో నుఱుకకుము.

ఆ|| గీ|| తగరు నగముతోడఁ ♦ బగగొని డీకొన్న
జగము మెచ్చునొక్కొ ♦ జయముగనునె?
కలహమిపుడు నీకు ♦ గంధర్వుతోడనా!
పులినిజేరు హరిణ ♦ పోతమట్లు ||

అర్జు:- ఓయీ! గంధర్వరాజా! నీ స్వాతిశయోక్తిచే జంకి వెనుకంజ వేయఁజాలను. సమయ మాసన్నమైనపుడు వైరి నెదుర్కొనక తప్పునా? యుద్ధమే సిద్ధమగుగాక!

అంగా:- (స్వగతము) ఆహా! ఇతఁడు తరుణప్రాయమున నున్నవాఁడు. ఎంతటిహితబోధ నొనర్చినను వినఁడాయెను. ఇతఁడు బ్రాహ్మణునివలెఁ దోఁచెడు. రణమున నితఁడు మరణించినచోఁ బాపము నన్నుఁ జుట్టుకొనును. బ్రహ్మహత్యకు మనస్సంగీకరింప కున్నది. అయినను సాధ్యమైనంతవఱకు ప్రాణాపాయమునకే వెడలఁదరుమవలయును.

నిలిచిన చెట్లనీడలను నిల్వక ♦ నిద్దురగొన్న గహ్వరం
బుల నిమురింపకుండ వన ♦ భూములలోవలసం జరించు చా
కలములు మెక్కు చాంకటికి ♦ నప్పటికప్పటికిన్ లభించు, దా
ర్వ్యాల సెలయేళ్ళ నీరముల ♦ గ్రోలుచుం గాలము ద్రొబ్బుచ్చి, గా
వలసిన రాజ్యభాగమును ♦ బంచుకొనన్ గమనించి, పంచబో
వలసినదంచు నన్ బనుప ♦ వచ్చితి నిచ్చటికిన్ సుయోధనా ॥ 3
పన్నెండేడు లరణ్యవాసమున కే ♦ ప్పక్ రానికష్టంబు, తె
న్నెన్నో చెంది త్రయోదశాబ్దమున ముం ♦ దెట్లో ప్రవర్తిల్లినా
మన్నా! పోవు మటంచు పాండవులు ని ♦ న్నర్థించుచున్నారలో
యన్నా! దీనులఁగావ న్యాయమగున ♦ న్నా! నీకు దుర్యోధనా ॥ 4
వారును మీరు నచ్చమగు ♦ వారసు లత్యాదిగాని నేను, న
వ్వారికి మీకుఁగూడ సమ ♦ బంధుఁడ సంధిసేయంగఁ జెప్పగా
జేరితినిన్ను మచ్చరము ♦ చెందక దూరము సేరఁజూచు, చ
వ్వారిగ వారిభాగమును ♦ వారికిఁబంచవగదే సుయోధనా ॥ 5
శకునిదురంతవాక్యము ల ♦ సారములౌ శనిగాఁడతండు, సూ
తకులునిమాట నమ్మ ♦ విపదంబులు నేకురతుండు వెప్పు డ
య్యాకుటిలు లార్యపూజితులు ♦ నా గురుభీష్ములకీయుదంత, మిం
తకు వచియింపరాదె, విశ ♦ దంబగు సర్వము నోసుయోధనా ॥ 6
కురుకుల భూషణోజ్జ్వలు డ ♦ కుంఠిత బాహుబలుండు భీష్ముఁడా
గురుఁడుఁ గృపుండు నాగుకుని ♦ కూరిమిపుత్త్రుఁడుఁ జెప్పునట్లు శే
ర్వరుఁడు సంధికార్యమని ♦ పాండుకుమారులు వల్కుచుండి రా
దరమున నీమదింగల యా ♦ దార్థముఁ దెల్పుము కౌరవేశ్వరా ॥ 7
కడుపునఁగన్న బిడ్డలను ♦ గంపలఁ గ్రొంతలఁబట్టజేసి నిన్
గొడుకుపలెన్ గనుంగొనుచుఁ ♦ గూరిమిఁబ్రోచినడి పెద్దలందఱిన్
గడబిడఁగాగఁజేసి కుల ♦ కాంతల దుఃఖము గోడుగోడునన్
గుడుఁవగజేసి రాష్ట్రమున ♦ గూడును గుడ్డయు లేక త్రాగఁ జా
రెఁడ యున గంజిలేక ప్రజ ♦ తెల్లరు గొల్లున గోలపెట్టగా
మడియఁగఁజేసి యీపరు న ♦ మస్త మహీపలయమ్ము పొందగా
గడగుటకంటె నీచమగు ♦ కార్యము గల్గునె కౌరవాగ్రణీ ॥ 8
పరువునకుం బ్రతిష్ఠకును ♦ ప్రాభవకీర్తికి నాలవాల మీ
భరతకులంబు! వన్నెయును ♦ వాసియుఁగల్గి వెలుంగుచున్నదీ

సంచితసాధువర్తనుడు ♦ సంజయుడింతకుమున్ను సంధిఁగో
ర్పించు టసాధ్యమంచు వి ♦ పించిన ధర్మతనూజుఁడావిధిం
బెంచియు సాత్త్వికుండగుట ♦ చే వినయంబున నన్నుఁ గూడఁబొ
మ్మంచు వచింప వానికెదు ♦ రాడఁగఁజాలనివాఁడనౌట నే
తెంచి పరాభవింపబడి ♦ తిం గదరోరి సుయోధనాధమా. 17

బందుబడాయిఁ గోరువరు ♦ వర్గములంగొనివెళ్ళిగొల్లడా
కక్కఁడిపు డేడచిక్కవడె ♦ నా విడకాతనిఁబట్టికట్టనా
రండని సేనలన్బిలిచి ♦ రాక మరేటికి వెన్కకేఁగు మున్
మెండితనంబు మోటుతన ♦ మున్బ్రకటించెదవోయి దుర్మతీ. 18

మాయలమంత్రజాలముల ♦ మచ్చులఁ గెల్వఁగ నేఁడుధర్మజుం
డేమనుకొంటివా? సభకు ♦ నీడ్చి కులాంగనఁ గట్టుబట్టలం
దోచియు నధర్మమంచు సతి ♦ బోవని క్రీడియటంచు నెంచితో?
మాయలమారికృష్ణుఁడను ♦ మాటమదిన్విడఁబోకుమూఢుఁడా. 19

తీరనియంత కచ్చగల ♦ దేని కిరీటినా? ధర్మపుత్త్రినో?
మారుతినో? సమీరకమునం మాకొకనిఁ గెల్చి వసుంధరాస్థలిన్
బేరుఁ బ్రతిష్ఠగౌరవముం బెంపెసలార్చుకొనంగ రాదె, యీ
తీరుసనంధివాక్యములఁ ♦ తెల్పఁగవచ్చిననన్నుఁ బట్టఁగాఁ
జేరెదవా దురాత్మ విను ♦ జెప్పెదవిన్ము రణంబునందు నీ
వారలనిన్ను నీదుపరివారము నెల్లహరించి ధర్మజున్
భారతభూమికంతటికిఁ బట్టముగట్టుకయున్నఁ గృష్ణుఁడీ
పేరునఁబిల్వఁబోఁడు రిపుభీముఁడు భీముడుగాఁడు పార్థుఁడా
పేరునకుండఁగండిఁకను ♦ బెక్కువివాదములేల నీకునా
కారయమీఁదుయుద్ధమున ♦ కై వెనసిద్ధముగండు పోయెదన్ 20

# మా న వ బో ధ

కోగంటి దుర్గామల్లికార్జునరావు ( సరసకవిమండలి

చచ్చెనటంచు దుఃఖమునఁ జచ్చినవానికి నేడ్చినన్ గదన్
జచ్చినవాఁడులేచి మరి చక్కఁగ వచ్చునె ధాత్రిఁ నీస్థలిన్
జచ్చుటలేదె యెల్లరును జావనివాఁడు గలండెయారయన్
జచ్చినవానికై మదివిచారమదేటికి మానవోత్తమా!

# భారతీయ కావ్యసృష్టి

ధర్మనైష్ఠుర్యం — భవభూతిరామునకు.

ఆకిరాజు నిత్యానందశాస్త్రిగారు.

శ్లో॥ అపూర్వకర్మ చండాలమయి ముగ్ధే విముంచ మాం।
శ్రితాసి చన్దనభ్రాన్త్యా దుర్విపాకం విషద్రుమం॥

ప॥ నన్నపూర్వకర్మ చండాలుడగువాని
ముద్దరాల విడిచిపెట్టుమమ్మ
ఆశ్రయించినావు చందన భ్రాంతితో
దుర్విపాకమైన విష కుజమ్ము॥

ప్రేమ కత్యంతాస్పదురాలైన అర్ధాంగి విషయంలో ఘోర ద్రోహాన్ని సంకల్పించడంవల్ల కలిగిన శోకాన్ని చిత్రించడం ప్రస్తుతాంశం. సౌందర్యాతిశయ విలోక జనంవల్ల పుద్గమించే కుతూహలాన్ని ఈవర్ణన ప్రసారించదు. ఇది కరుణజనకమై సహానుభూతిని హృదయ కంపాన్ని ప్రేక్షకులకు ఉత్పాదిస్తున్నది. మితిలేని శోకం, అనుతాపం పొంగి బయటికి వస్తూవున్నా చిత్తస్థైర్యాన్ని ప్రకటించే శూరుడు ప్రదర్శితుడవుతున్నాడు.

సుస్థిరమైన పాతివ్రత్యాన్ని అనుష్ఠిస్తూ దారుణమైన శోధనను భరించిన పావనత్వంచేత తన అనురాగాన్ని సర్వాన్ని ఉపార్జించిన సహచారిణితోగూడి రాముడు పితృసింహాసనం ప్రాపిస్తాడు. కాని అగ్నిజ్వాలలకు శరీర సమర్పణం జేసిన సీతకుగూడా అపకీర్తమవుతుంది. అచిర కాలంలోనే వ్యాప్తమై అది రాముడి చెవిని సోకుతుంది. పరమపావనిని ధర్మపత్నిని, సంపూర్ణంగా పరిత్యజించి మరివొకమారు ఘోరారణ్యాలకర్పించి నిత్యశోకసాంద్రమైన జీవితంలో కూల్చడానికి రాముడి మనస్సు సంక్షోభిస్తుంది. ప్రజాభిప్రాయంలో అపవిత్రురాలై నిష్కళంకమైన కీర్తితో లోకంలో అత్యున్నతస్థానాన్ని అలంకరించినట్టి తనయొక్క సాహచర్యానికి యోగ్యతను కోలుపోయిన భార్యకు, స్త్రీప్రపంచానికి అనుకార్యకాని భార్యకు, పట్టమహిషీత్వాన్ని, సహధర్మచారిణీత్వాన్ని ప్రసాదించడం యెట్లాగని రాముడు తర్కిస్తాడు. సంభ్రమ వివశుడవుతాడు తుదకు చిత్తాన్ని వశం చేసుకుంటాడు

శ్లో॥ సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతం।
యత్పూరితం హి తాతేన మాం చ ప్రాణాంశ్చ ముంచతా॥

ప॥ మంచివారల కేపని చేతనైన
ప్రజల లోకము యొక్క ఆరాధనమ్ము
నన్ను ప్రాణమ్ము లనుగూడ విడిచిపెట్టి
దాన్ని జనకుడు పూరించినాడుగాదె॥

అని భార్యా పరిత్యాగానికి కృతనిశ్చయుడవుతాడు. కాని సీత నిశ్చలంగా తన అంకాన్ని ఆశ్రయించి నిద్రిస్తుంటుంది. దృష్టి ఆమెమీదికి ప్రసరిస్తుంది. తిరిగి శోకానికి వశ్యుడవుతాడు.

శ్లో॥ శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం
సౌహృదాదపృథగాశయామిమాం
ఛద్మనా పరిదదామి మృత్యవే
సౌనికో గృహశకుంతికామివ॥

ప॥ శైశవమునుండి పోషించినట్టి ప్రియను
మైత్రిచే వేరు ఆశయం లేనిదాన్ని
నెపముతో నిచ్చుచున్నాను మృత్యువునకు
గృహశకుంతిక సౌనికు డిచ్చినట్లు॥

అని అనుకుంటాడు. తన దుష్కృత్యానికి కంపిస్తాడు ప్రపంచంలో తనవంటి పాపు లుండరనుకుంటాడు. సీత పవిత్రత మనస్సుకు స్ఫురిస్తూ వుంటుంది.

(కిమిదస్పృశ్యః పాతకీ దేవీం దూషయిష్యామి)
(అంటగూడని పాతకిని దేవిని యేమని అపవిత్రపరుస్తాను)

శ్లో॥ అపూర్వకర్మ చండాలమయి ముగ్ధే విముంచ మాం॥

ప॥ నన్నపూర్వకర్మ చండాలుడగువాని
ముద్దరాల విడిచిపెట్టుమమ్మ॥

అని సీత నుద్దేశించి అంటాడు.

పరమ పవిత్రురాలని ఆత్మకు తెలిసివుండిగూడా తననే సర్వభావాలతో ఆరాధిస్తూవున్న భార్యను రాముడు పరిత్యజించడం న్యాయమని యీకాలంలోవున్న మనకు తోచడం కష్టతరమైన విషయమే. ప్రస్తుత కాలంలో ప్రభువుల ప్రభుత్వ వర్తనతోటే గాని తదితర వర్తనతో ప్రజలకు యేమీ సంబంధం లేకపోయినా భారతవర్షపు ప్రాచీన చరిత్రలో రాజే మతానుశాసకుడనీ, ధర్మ మార్గదర్శి అనీ, ధర్మంయొక్క స్వరూపమనీ జ్ఞప్తికి తెచ్చుకో వలసి వున్నది. యెప్పుడుబట్టినా జయప్రదమైన రాజ్యపాలన పాలితుల భావంలో పాలకులకు వున్న గౌరవోపపత్తిమీదనే ఆధారపడి వుంటుంది.

మన దృష్టిలోవున్న శ్లోకంలో రాముడు భార్యనుండి వియుక్తుడు కాబోతూ వున్నాడు. తన గుర్మార్గానికి తపిస్తాడు. ఆయన దుఃఖం దుర్భరంగా వుంటుంది అపూర్వ కర్మ చండాలత్వాన్ని తనయం దారోపించు కుంటాడు. ఉపస్థితం కాబోతూవున్న వినాశం ఆయనకు కనబడుతుంది. క్షణంలో ఆశలన్నీ అడుగంటి పోతవి. తనమీద మేను వాల్చి నిదిస్తూవున్న భార్యమీద ఆయన దృష్టి ప్రసరిస్తుంది. తమ పరస్పర భావి ప్రేమానుభవం అపహృతమై ఆయనకు గోచరిస్తుంది. తద్గర్భస్థమై ప్రాణ యుక్తంగా గోచరిస్తూవున్న, దోష మెరుగని ఆపసిజీవి తనతో ముడి పెట్టుకొన్న వాత్సల్యసూత్రం తెగి ఆయ నకు సాక్షాత్కరిస్తుంది. ద్రోహాన్ని యెదురొక్కనే నిస్స హాయమైన పవిత్రత అంతరాత్మ దృష్టికి భయభక్తి ప్రతి పాదకం కావడంవల్ల రాముడు భయసమ్మిళితమైన భక్తి వశుడై చలనం లేనివాడౌతాడు. సీత నిద్రావస్థ దానికి మరింత తోడ్పడుతుంది. విష వృక్షం చందన తరువని భ్రాంతిపడి మోసపోయినవిధంగా సీత తననాశ్రయించి మోసపోయిందని తలుస్తాడు. ఈఆత్మనింద ఆయన సం కల్ప నిర్వహణానికి కొంత బలాన్ని యిస్తుంది. ఈవచనం ఉత్పత్తి చెయ్యదలచుకున్న కరుణారసాన్ని వున్నతస్థాయికి తెచ్చి, గాఢం చేసి. దానికి సంపూర్ణతను కలిగిస్తుంది.

దుస్సహమైన దుఃఖవేదన ననుభవిస్తూవున్నా స్థయి ర్యంతో, శాంతంతో సర్వాన్నీ భరించే ఉదారహృద యుడి ఆకృతిని జీవంతో వున్నట్టుగా ప్రదర్శించడమే పర్యవసానంలో యీసర్గంయొక్క ప్రయోజనం.

పరమ సాధుత్వంతో ఆడంబర రహితమైన రూపాన్ని ధరించివున్న యీవచనం భారతవర్షపు వుదాత్త రచనలకు చిహ్నమై మహోన్నతమైన శాంతి భావాన్ని, స్థిమితత్వా న్ని ప్రకటిస్తున్నది

## నన్ను ఉద్యోగము చేయమన్నందుకు.

ఆవంత్స వేంకటరంగారావుగారు.

నామనోవాంఛ యీడేరనట్టి విషమ
కాల మరుదెంచె యింక దుఃఖమ్మెనాక;
ఈ మహాదుఃఖవార్ధి నెట్లీదగలనొ
నాకు యీార్పులనే వ్రాసినాడు నలువ
మీరు నాయిచ్ఛనుంత చేకూరనీరు.
జీవనమ్మకళల సేవజేసిగడువ
దృఢముగా నిశ్చయించి పితృణముతో తె
నాదుమాటలు పాటించినారుకారు
చిత్రములు వేయకుండ, విశేషమైన
భావములిమిడ్చి పద్యాలు వ్రాయకుండ
ప్రకృతినిదురించు శాంతవిభావరీవ
విత్రివేళల సువిశాల విశ్వమంత
మలయమారుత సింహాద్రిమధ్యమాది
దీనమైనట్టి రాగాలు తీసితీసి
బాధతొలగించు పాటలు పాడకుండ
నన్ను పనిచేయమంటారు నాకువలదు;
నాకు పనియేల? గొప్పధనమ్మదేల?
నాకపూర్వమైనట్టి యానందమొసగు
గాన, చిత్రలేఖన, కైత, కళలుకలవు;
కళలతో జీవనమ్మనే గడపలేని
క్షామమేనన్ను మనసార గాంచెనేని
భిక్షుకుడనై వీధుల విపినములను
దిరిగి ప్రాణాలుత్యజియి తు నోరులు లేని
యొక వివిక్త ప్రదేశపు టొడిసిడాగి;

◆ ◆ ◆

నన్ను పని చేయమంటారు నాకువలదు;
నాకు పనియేల? గొప్పధనమ్మదేల?
నాకపూర్వమైనట్టి యానంద మొసగు
గాన, చిత్రలేఖన, కైత, కళలుకలవు.

# అపోహ :

శ్రీ వెంపటి నాగభూషణంగారు.

చిన్నీ చమత్కృతివలన నేనిప్పుడొక మహా కవి శేఖరునిగ లోకమునకు విశదము చేయబడి తిని. కీర్తికోసం నేనేదినం సీటిపత్రికేశం చేశానో ఆనాడే నాపేరు పత్రికలద్వారా గొప్పప్రచార మైంది. అట్టి మంచివింత ఆలోచనసూచించిన సౌభా గ్యవతి చిన్నీకిని, అర్థాన్ని సఫలంచేసిన చిరంజీవి జమీందారుగారి అబ్బాయికిని చిరకాలము లకు కృతజ్ఞుడను. ఈ పని జరుగకపోయిన నేనే "మ్యూట్ యిన్గ్లోరియస్ మిల్టన్" అల్లేనో మరుగుపడి వుండవలసివచ్చేది. అదృష్టమంటే అట్లా కలిసిరావాలి !

ఇప్పుడు మాయింటికి తరుచుగా వస్తూపో తూండేవారిలో, చిన్నీ ఆలోచనా సఫలకార కుడు, నా ప్రాణరక్షకుడు, శ్రీ జమీందారుగారి అబ్బాయి, చిరంజీవి రామనాథ్ ఒకడు. సాధార ణంగా ప్రతిరోజూ, పొద్దున్నో, సాయంత్రమో, లేక వీలుంటే రెండుపూటలూనో. అతగాడు తనకారులో మాయింటికివచ్చి ఒకగంట, గంట న్నరకాలం కూర్చునిపోతూండేవాడు. ఏజబ్బు గావుండో, ఏవూళ్లో లేకపోవడమో సంభవించి నప్పుడుతప్ప, తక్కినప్పుడల్లా అతను తప్పకుండా వచ్చేవాడు. అతను మాయింటికిట్లా రావడం చూస్తే పనిలేని పెద్దమ్మలందరికీ కొంచెం కష్టంగా వుండేది. "జమీందారుగారి అబ్బాయి యేమిటి, వీళ్ళింటిచుట్టూ యిన్నిసార్లు తిరగడం యేమిటి ? " అనుకొనేవారు, ముక్కుమీద వేలితో. మరికొందరు వాకిళ్ళలో కూర్చుండి వుత్తుల ప్రతానికి ప్రత్తివొత్తులు చేస్తూ "బాబుగారి అబ్బాయి, వనమ్మగారింటికి తరుచు గావస్తున్నాడు; ఇదివరకెప్పుడూ యిట్లావచ్చి ఎరుగడు; ఏదో కారణం వుండకపోతుందా ? " అనుకునేవారు. మరికొందరు పొద్దున్నే చెంబు పుచ్చుకు దగ్గరకి నీళ్ళకువచ్చి "చూసేవావదినా విన్నావా వీన్నీ, ఆయనయింట్లో లేకపోయినా, చిన్నబాబుగారొచ్చి కొంతసేపు కూర్చుని పోతూంటారుట. మరి, ఎవ్వరితో మాట్లాడు తారో, యేమిటో ? చిత్రంగావుంది " అనుకునే వారు, అటేమిటోమాపోగాని యీ మాటలన్నీ నాచెవినిపడేవి. పనిలేని పెద్దముండలందరూ, యిట్లాగే వాగుతూంటారు, వాళ్ళమాటలకు అర్థమేమిటి, అని సరిపెట్టుకొనేవాణ్ణి. కాని చాలామార్లు అమాటలే వేదఘోషల్లే చెవిన పడ్డంవల్ల, ఆలోచనచెయ్యక తప్పింది కాదు. నాకెవడో ఇంగ్లీషని "నోస్మోక్ విథౌట్ ఫైర్" అన్నట్టు, ఏమీ రహస్యంలేనిదే నాలేకపోతే యీపాడు మాటలన్నీ బయటికి వస్తాయా, అని సందేహం కల్గింది. కాని, యీ సందేహం నిజమైన సంగ తులమీద ఆధారపడలేదు కనుక, నేనేదైనా వెంటనే చెయ్యడానికి అవకాశం లేకపోయింది.

## 2

మేము కాపురమున్నది ఒక జమీందారీ గ్రామం. కేవలం గ్రామమని చెప్పడానికి వీల్లేదు లెండి. గ్రామంకన్న పెద్దది, పట్నంకన్న చిన్నది. అదీ ఆపూరుస్థితి. జమీందారుగారు (ప్రజలం తా, దొరగారంటారు లెండి) చాలామంచివాడు ఆయనమీద ప్రజల కేవిధమైన కోపముగాని

లేదు. తక్కిన జమీందారులవలె గాక, యీయన కొంచెం దాన-, ధర్మం అని సంతర్పణలని, బ్రాహ్మణులని డబ్బు కర్చుచేస్తాడు పైగా, ఎక్కువతీవి, అవిలేవు. నిరాడంబరంగా వుండి, సామాన్యరైతులు, వారితో కలిసిమెలసి తిరుగుతాడు... ఆయన గుణాలే అలవడినాయి. కొమారుడికి రామనాద్ ప్రసాద్ ఒక్కడే కుమారుడు వేరే కొడుకులు కుమార్తెలు ఎవ్వరూలేరు. అందుచేత చాలా గారాబంగా పెరిగాడు. ఇతనికిప్పుడు నాయీడే, సుమారు, యిరువైఏళ్లు. అట్టే పెద్దవిద్యలు అంటలేదుగాని అన్నిటిలో అభిరుచిగల మనిషి. ఇంటిదగ్గర సంస్కృతం, తెనుగు, ఆంగ్లం, పఠించాడు. అవి అరంచేసుకోగలడు, ఆనందించగలడు;— ఈపాటికప్పుడే తండ్రితో వెళ్ళి, మనదేశంలోని ముఖ్యపట్టణాలని, పుణ్యతీర్థాలని చూచివచ్చాడు. లోకజ్ఞానం, లోకానుభవం, బాగానేవుంది. పైగా, యువకుడు, రూపసి, రసాస్వాదుడు, విలాసవంతుడు. ఇతను, నేను, అనేకసార్లు, అనేకసలాలలో కలుసుకొన్నాం; కాని చూపులతోనే సరిపొయ్యేది. మాయిద్దరికి ప్రథమపరిచయం యెప్పుడంటే నేను "సీటిప్రవేశం" చేసినప్పుడు ఆ "గజేంద్రమోక్షమే" మాయిద్దరి నెయ్యమునకు ఆదికారణం.

నాకతనియందు ఒకవిధమైన గౌరవం, ప్రేమ, వాత్సల్యము, అతనికిగూడా నాయందు ఒకవిధమైన గౌరవం, ప్రేమ, వాత్సల్యము. ఈఅన్యోన్య బంధనాలతో ఉభయులమూ కట్టబడ్డాము. అతను నాకుచేసిన మేలుని, ఎన్నటికి మరచిపోలేను. అప్పటినుంచి, అతనికి నాయందేదో యింటరెస్ట్ కల్గింది. కనబడినప్పుడల్లా నాకవిత్వానిగూర్చి ప్రశంసించిపొంగిడేవాడు, ప్రోత్సహించేవాడు. పద్యాలసంపుటం అచ్చువెయ్యాలని వున్నదే "సరే, కానీ, డబ్బిస్తా" అన్నాడొకమారు. కాని నేనే వెనుకంజవేశాను. కవిత్వంలో అతనికి చాలా రుచివుంది మరీ. గ్రామ్యగీతలు, ఏలపాటలు, అంటే చెవి కోసుకొనేవాడు. అటువంటివి నాచేత ప్రత్యేకం రచింపించి, కంఠగతంచేసి అప్పుడప్పుడు పాడేవాడు. వీటికోసం మొట్టమొదట రోజుల్లో అప్పుడప్పుడు మాయింటికి రావలసివచ్చేది. అదే, నెమ్మది నెమ్మదిగా, ఎక్కువై, తరుచై, అలవాటైనది. తరువాత అతను రాని రోజులేదు. అతను, నేను, ఎప్పుడైనా, వారి కారులో షికారుపోతూండేవాళ్లం. మధ్య మధ్య చిన్నీ కూడా వచ్చేది. ఇవన్నీ చూస్తే, నెక్కుమాలినలోకం వూరుకుంటుంది? వాళ్లకళ్లు కుట్టినాయి, ఎవరియింటికిపోని, జమీందారు కొడుకు, మాయింటికిరావడం, మాట్లాడడం, మేముతా కలిసి షికారుపోవడం చూస్తే, ఓర్వలేనిఘటాలు వెక్కి వెక్కి ఏడ్చేవి. ముసలమ్మలు ముక్కునవేలువేసుకొని దెప్పిపొడిచేవారు. కాని, నవీన సాంప్రదాయాలను అనుసరించే యౌవనదంపతులందరిగతీ యింతేగదా అనుకొన్నాను?

అయినా " ఆయనలేకపోయినావప్పుడు, ఎవరితోమాట్లాడుతాడో, ఏమితెస్తాడో " అనే ఒక ముసలమ్మ వాక్యం నన్ను వేధించివేయించింది. నాకూ, సంశయంకల్గింది. చిన్నీ, నాగరికత ప్రపంచంలో ఉద్భవించి, స్వేచ్ఛాజీవనంలో వికసిస్తున్నా, అల్లరిచిల్లరవేషాలు, యేమీలేవు. పట్టుమని పదినిముషాలైనా వాకిటిగుమ్మంలో నిల్చుని యెరుగదు. పరపురుషులను కన్నెత్తియైనా చూడదు. కాని, జమీందారుగారి అబ్బాయి నన్ను రక్షించి పుణ్యంకట్టుకున్నప్పుడు

చిన్ని, తన కృతజ్ఞతను తెలుపుతూ మాట్లాడక తప్పింది కాదు. మరి, యిప్పుడతను నా కోసం తరచుగా రావడంచేతి, చిన్ని యెప్పుడైనా పలుకరించి మాట్లాడవలసి వచ్చేది. ఒకప్పు డెప్పుడైనా నే నింట్లో లేనప్పుడు వచ్చి అతను కాసేపు కూర్చుంటే మాట్లాడే ది! అంత మాత్రానికే తప్పేం? కాని ముసలమ్మలు లేని పోని కబుర్లెందుకు పుట్టిస్తారు. సంగతేమిటో నెమ్మదిగా పరీక్షించి కనుక్కోడానికి నిశ్చయించు కొన్నాను

### 3

చిన్నిచర్యలన్నీ సూక్ష్మంగా పరీక్షించడం రహస్యంగా గమనించడం ప్రారంభించాను. అప్పుడప్పుడు,అసందర్భపు, అసమంజసపు ప్రశ్న లు గూడా అడిగేవాణ్ణి. "అయితే చిన్నీ చూడు యీదినం నేను షికారుకానుగాని, నువ్వు, రామనాథం కలిసి వెళ్ళండి."

"అమ్మో, మీరు లేకుండానే?"

"మీరిద్దరూ వెళ్తే నాకు చూడాలని ముచ్చటగావుంది."

"చాల్లెస్తురూ, అసహ్యం మాటలు, ఇకె ప్పుడు అనకండి."

మరొకప్పుడు,

"చిన్నీ, యీ వేళింకా రామనాథంరాలేదేం?"

"ఏమో? నాకేం తెలుసు?"

"అహా, నీకు తెలియకుండా వుంటుందీ?"

"ఎట్లా?"

"మీరు, మీరంతా ఒకటేగా!"

"ఊహు. ఇంకేం. నేర్చుకున్నారు మెట్లా గైతేనేం, మంచిమాటలు!"

ఇంకొకప్పుడు.

"చిన్నీ, రామనాథానికి జ్వరంగావుందట."

"అయ్యో, పాపం!"

"ఏం అతనంటే అంతజాలిపడ్డావు."

"నాకంతాఒకటే!"

"అయితే, నీకునేనూ, అతనూఒక్కటేనా?"

"అబ్బే అదెట్లా, మీరు మీరే, అతను అతనే, అంతా ఒక్కటేఅంటే ప్రాణికోటిఅంతా అన్నమాట.

"ఆజ్వరమే నాకొస్తే?"

"అంత అపవాక్యం ఎందుకిప్పుడు, తీరి కూర్చుని?"

"వచ్చిందనుకో?"

"రాదు."

"వస్తే?"

"వస్తేనా, నేనడ్డుపడ్తాను."

"నిజంగా?"

"మరి మీబోటి దేవుడులాంటి నాయకు డకు, నాబోటి దేవతలాంటి నాయిక అడ్డుపడ కుండ వుంటుందా?"

ఇన్నిసార్లు పరీక్షచేసినా, నాయందు చిన్నికి వుండే ప్రేమ, లేశమైనా తగ్గినట్టు నాకెక్కడా కన్పడ లేదు. కాని, నేనడుగుతూండే ప్రశ్నల సందర్భం గ్రహించింది చిన్ని. నేనేమో, ఆమె మీద అనుమాన పడుతున్నాననే సంగతి కనుక్కొంది.

నేనప్పుడే యింటికివచ్చాను. సావిట్లోకివచ్చే సరికి రామనాథం, చిన్ని, ఒకరిముఖం ఒకరు చూస్తూ మిక్కుటంగా నవ్వుతున్నారు. నన్ను చూసేటప్పటికి చిన్ని తటాలున లోనికిపోయింది. నాకొకింత సందేహం కల్గింది. ఇదివరకెప్పుడూ వారట్లా నవ్వుతూండగా నేచూడలేదు. ఒకవేళ ముసలమ్మలు వేసిన అపవాద నిజమేమో?— ఏమో? రామనాథం వెళ్ళిపొయ్యాడు చిన్ని,

దొడ్లో చంద్రికాంతపూలు కోస్తోంది హఠా త్తుగా వెనక్కి వెళ్ళి "ఎందుకిందాక అట్లావిరగ బడి నవ్వుతున్నావు?" అని అడిగాను. "అప్రశ్నకు తుళ్ళిపడి, జారిన పయ్యెదను సరిజేసి, "ఏం, నవ్వితే?" అన్నది ఒక చక్కనిపోజ్ పెట్టి. ఆసమయంలో నాకపన్ని మెండుకు.

"అయితే, ఆవికారం ఏమిటి?"

"కొత్తవికారం!"

"అట్లాగా?"

"కాకేమిటి?"

"అయితే, ఎప్పుడూలేనిది యీ దినమింత నిర్భయంగా——

"నిర్భయంకాక?"

"ఇంత, తెగించావేం?"

"తెగించక నాకేం?"

"కొత్తమోజా?"

"అయితే కావచ్చు!"

అంతటితో నేను గిరుక్కున తిరిగి సావిట్లోకి వచ్చి ఉయ్యాలమీద కూర్చుని "యీవింతచర్యకు, కారణం, యేమిటా అని దీర్ఘాలోచన చేశాను. చిన్న నల్లని మబ్బులల్లె అనుమానాలోచనలు నన్ను పీడించడం మొదలుపెట్టినాయి. కాని, యింకా నిదర్శనాలు చూడందే తొందరపడి ఏపనీచెయ్యవద్దనుకున్నాను.

## 4

ఆదినం గడచిపోయింది. చిన్ని నేనూ మాట్లాడలేదు. నాహృదయంలో రోషానలం ప్రజ్వరిల్లుతోంది.

మరుదినంగూడా యిద్దరం మాట్లాడలేదు. ఆమరుదినంగూడా మాటలులేవు. వంటమనిషి మధ్యవర్తిగా అన్నిపనులు జరిగిపోయినాయి. ఈ రెండుఱోజులూ, నాకు రెండు యుగాలుగా తోచినాయి. ఎప్పుడూ యిట్టిది జరగలేదు. ఒక్కక్షణమైనా చిన్నితో మాట్లాడకుండా వుండలేదు. ఇప్పుడు నేనీతోవ నడుస్తే ఆమె ఆతోవ వంచి నడుస్తోంది పైగా, యీ రెండు రోజులూ రామనాద్ వచ్చాడు. నేనుకోపంతో ఏదో గదిలో పనివున్నవాడికిమల్లె నటించడం చేత, అతను చిన్నితోనే మాట్లాడిపోయేవాడు. చిన్ని అతనితో మాట్లాడేది కొంతసేపు. ఇవన్నీ చూస్తే నా అనుమానము మరింతహెచ్చింది.

ఇది యిట్లావుండగా, నావు అదలు, చిన్ని చెల్లెలు, చిట్టి, చూడ్డానికి వస్తానని వ్రాసింది. నేనీఅవస్థలోవుండగా వస్తే నాకు కష్టంగానే వుంటుంది. అందుకని ఏమంటాను? మమ్మల్ని చూచి ఏడాది అయింది. వద్దంటే బాగుంటుంది? సరే, రమ్మన్నాను. కాని, ఎప్పుడువచ్చేదీ రూఢిగా వ్రాయలేదు. ఈ సంగతి వంటకత్తె ద్వారా చిన్నికి తెలియజెప్పాను. చిట్టి వచ్చేలోపలే నాఅనుమానం తీర్చుకోవాలి అనే అభిప్రాయంతో వున్నాను.

ఈ మాట్లాడకపోవడాలతో నాలుగునినాలు గడచినాయి.

సాయంత్రం షికారువెళ్ళి, ఎవ్వరూ స్నేహితులు కనపడకపోవడంవల్ల వెంటనే తిరిగి వచ్చాను. చీకటి పడుతూ, పడుతూవుంది. రేవెన్నెలగూడాను. ఇంటికివచ్చేసరికి తలుపు బిగించివుంది అంతా నిశ్శబ్దంగావుంది. అటువంటి వేళప్పుడూ తలుపువేసి వుండేదిగాదు. వెంటనే అనుమానం స్ఫురించింది. వాకిట్లో దిగి చూశాను. గడపలకింద మోటారుకారు చక్రాల చారలున్నాయి ... సరే, అనుకొని, తలుపు పిల్చాను. కాని జవాబులేదు. రెండు, మూడుసార్లు వృథాగా తలుపు తట్టాను. పాడు

బడ్డ యిల్లంత నిశ్శబ్దంగావుంది. కొంచెం డిటెక్టివ్ పని చెయ్యాలనుకొన్నాను. పక్కనున్న గేటు గోడ యెక్కించి దూకి లోపలికి ప్రవేశించాను. దొడ్లోకి తెరుచుకున్న అన్ని కిటికీలు, ద్వారాలు మూసేవున్నాయి. ఎక్కడా, ఏమీ శబ్దంలేదు. ఎవ్వరూ లేనట్టుగావుంది. అట్లైతే బయట తాళం వుండాలిగా? ఆలోచిస్తుండగా పడకగది ప్రాంతాన గుసగుసలు వినబడ్డాయి. మెల్లగా అక్కడికి చేరుకున్నాను. కిటికీ రెక్కల సందులోంచి చూచాను. గదిలో "బెడ్ రూం లైటు" వెలుగుతోంది. పందిరి పట్టెమంచం మీద తాంబూలంపళ్ళెం పన్నీరుబుడ్డి వున్నాయి. ఆ మంచానికి ఆనుకొని ఆచిన్ని తెల్లనిచీరకట్టుకొనినిల్చుంది, చేతులో మల్లెపూలదండ కాబోలు వుంది. ప్రక్కన కుర్చీలో ఒకపురుషుడు కోటు తొడిగికొని, టోపీతో కూర్చున్నాడు. వెల్తురు తక్కువ. పైగా అతని ముఖానికి చిన్ని అడ్డం వున్నది. వాకిట్లో మోటారు చక్రాల చారలున్నాయి. బహుశః యితను రామనాథం కావచ్చును, బహుశః యేంకర్మం, నిజంగా అతడే అని స్ఫురించింది. లేకపోతే, యింకే నూతన పురుషుడు లోపలికి రావడానికి ధైర్యం చేస్తాడు. ఆగదిలో వారొకరి నొకరు తాకుతున్నట్టే కన్పించింది నాకు. నాకు ఒళ్ళంతా చెమటలు పోసినాయి. ఈ ఘోరకార్యం, నా కన్నులార . , . ." అనుకుంటుండగా యీక్రింది సంభాషణ వినబడ్డది.

"ఎన్నాళ్ళకు యిట్లా కలుసుకొన్నాం?"

"ఎన్నిదినాలనుంచో యిక్కడకు రావాలని ప్రయత్నం."

"అయినా, మీరు భాగ్యవంతులుగా?"

"అయితే యేం?"

"మాబోటివాళ్ళెట్లా పనికివస్తారు?"

"ఏమి చిత్రంగా మాట్లాడుతావే?"

"చిత్రం నాదా, నీదా?"

"మరి, యీపన్నీరు, అత్తరు, అవి యెవరికోసం."

"నీకోసమే?"

"నిజంగా?"

"అవును."

"ఈమల్లెదండో?"

"ఇదీను! నీ సిగకు చుట్టాలని ప్రత్యేకం తయారుచేసి తెప్పించాను" అంటూ చిన్నిదాన్ని ఆ పురుషుడి తలలో పెట్టి "ఆహా, ఎంత బాగున్నావు!"

"నీకన్నానా?"

నాగుండె ఝల్లుమంది రక్తం స్తంభించింది. శ్వాస నిల్చిపోయింది. ముచ్చెమటలు పోసినాయి. చిన్ని యింతపాపిష్టి, జారిణి, పెనుభూతం, అని నేను కలలోనైన తలపలేదు. ముసలమ్మలు అనుకొన్నమాటలు నిజమే? వారం క్రింద "ఎందుకు అట్లానవ్వావు" అని అడిగితే తీవ్రంగా, నిర్లక్ష్యంగా జవాబు చెప్పి మాటలాడడం మానేసి, రామనాథంతో . . . అబ్బ. అబ్బ. ఎంతటి ఘోరం, తాను మొదలు నాతో వచ్చినప్పుడు చేసిన ప్రజ్ఞలు, చెప్పిన పలుకులు ఏవీ? ఇంత చంచలత, అని తెలుస్తే మొదలే? ఇప్పుడు నన్నిట్లు నట్టేటముంచుతే? ఎన్నిమాటలు మంచిమాటలు, తియ్యనిమాటలు, నమ్మించేమాటలు, చెప్పింది మొదట్లో? అయ్యో, అయ్యో, ఎంతపని. అపరిదిష్ట. అటూ యిటూ కాకుండా, చెడిపోయానే? స్త్రీలను ఎప్పుడైనా నమ్మవచ్చా? ఒక్క క్షణమైనా

కైకేయీ, వున్నారంటే చాలు ప్రపంచాన్ని తొంగదీయటానికి. నాకు తగువాళ్లలో తల వొంపులౌతుందే! చిన్నీ, రామనాథం, మాట్లాడడం ధోరణిచూస్తే నాకు మొదటినుంచి అనుమానమే! ఆమొదటదినమే "ఏమో మీపేరు చెప్పారేకాదు" అని రామనాథాన్ని పలుకరించింది — ఇట్లు అనుకుంటూంటే నాదేహం దహించుకుపోతోంది. ఇంతలో తిరిగి సంభాషణ ప్రారంభమైంది

"అయితే చిన్నీ మీ ఆయనెప్పుడు వస్తారు?"

"ఇప్పుడు రారులే?"

. (నేనెక్కడికైనా పూడ్చిపెట్టుకు పోయినా ననుకుంది కాబోలు)

"అయితే, చిన్నీ నాతో రావు మరి?"

"రాకేం, వస్తా, తప్పకుండా వస్తా?"

సన్నని, వాడిగల ముల్లుగల బాణం వచ్చి నాహృదయములో గ్రుచ్చుకొంది. ఇద్దరూకలసి లేచిపోవడానికి ప్రయత్నం కాబోలు. భగవంతుడా, సుకీవిధినాకు. రహస్యసంభాషణ క్లైమాక్సు వెళ్ళింది. నేనింకా భరించలేక పోయాను. కళ్లల్లోంచి నిప్పులు కార్తున్నాయి ఒథెల్లో చివరరంగంలో డెస్డిమోనాను గురించి అన్నవాక్యాలన్నీ పఠనం చేశాను. ఆశ ఒదులుకున్నాను. మనస్సు నిశ్చయంచేసుకొని, గట్టిగా తలుపుతన్నాను రాలేదు. మరీ గట్టిగాతన్నా, గడియవూడి క్రిందపడ్డది. భయంతో, చిన్నిని, ఆపురుషుడు కౌగలించుకొని నిల్చున్నాడు మూలగ. చేతులో రివాల్వారు లేదుగాని, వున్నట్టయితే, ఆయిద్దరూ, ట్టాభస్మమై పొయ్యేవారు.

"చిన్నీ" అని గట్టిగా గర్జించాను.

జవాబులేదు చలనంలేదు.

నరసింహ ఉగ్రావతారమెత్తి, ఒక్కసారి దుమికి చిన్నిదగ్గరకెళ్ళి చెయ్యిపట్టుకొన్నాను. పురుషుడు చిన్నిని చాటుచేసుకొని దాక్కుంటున్నాడు. ఇంతట్లో పెద్దగాలివచ్చి ఆచిన్నదీపాన్ని కాస్తా ఆర్పేసింది. చిన్నిని కదిపాను. కదలలేదు. ఒక్కక్షణంలో నన్ను తప్పించుకొని చిన్ని దొడ్లోకి పరువెత్తింది. ఆమెవెంటనే పురుషుడుగూడా పరువెత్తాడు. వారిని పట్టుకోడానికి నేనూ పర్వెత్తాను. వారు తులిసికోట దాకా పర్వెత్తి ఆగారు. వెన్నెలలో సరిగా ముఖాలు కన్పడడంలేదు. నేనూ, వారివెంటనే పర్వెత్తి, తులసికోటదగ్గరకెళ్ళి ఒకరిచెయ్యి పట్టుకొన్నాను.

"ఏమిటి బావా, యిదీ బాగానేవుంది. నాచెయ్యి పట్టుకుంటావేం. వదులు, మీచిన్ని అదుగో…నీవంతటివాళ్ళుగూడా చిన్నినిగూర్చి యింతఅపోహపడ్తారని నేనెప్పుడూ అనుకోలేదు" అని కిలకిల నవ్వుతూ చెయ్యి విదలించుకొంది మఱదలు చిట్టి. ఇంతగొప్ప పరాభవ మెన్నడు యెవరికి జరిగిందాఅని ఆలోచిస్తూ తులిసికోట పక్క జారవిడువబడిన టోపీ, బట్ట, కోటును, చూస్తూండగా, వెనకనుంచి ఆకస్మికంగావచ్చి, నాచిన్ని చిన్నీ, చిన్నారిచిన్నీ, పొన్నారిచిన్నీ, ముద్దులచిన్నీ, ముత్యాలచిన్నీ, వరాలచిన్నీ, వజ్రాలచిన్నీ, వైఢూర్యాలచిన్నీ, వలపులచిన్నీ, వనలక్ష్మిచిన్నీ, సౌందర్యరాసిచిన్నీ, శృంగార దేవతచిన్నీ — పిల్లగాలికి కంపముచెందు తన బాహులతికలు నాకంఠంచుట్టూ పెనవైచి, "చూశారా, మీమఱదలు, రామనాథం" అని శూలంలాటి మాట విసిరేసింది!

# ప్రశాంత గీత

భారతుల మార్కండేయశర్మ గారు, యువకవిమండలి.

రాత్రులకు రాత్రులెట్లొ తారాడిపోయె;
నాయహర్ముఖ మాధుర్యమా! యనంత
భావగర్భితమౌచు నేర్పరువరాక
నన్నుషస్సమయాన్విష్టు ననువుచుండు.

నేనమిగిలితిఁ దొంటి సందియములందు:
నాదు సామాజికా జీవనంబునందు
నొంటిపాటుననుండు; నెందొ వివిక్త
కాననాధ్వ సంచరణాప్తిఁ గలఁగుచుండు:

నావిధి భావనాకృతులునాటితి భావము భావముం బ్రతి
ష్ఠావశమంబొనర్చి; యనుషంగవ పుర్వభవంబుగూర్చి సం
భావసి వెల్వరించితిని; నా ప్రణయోక్తికళా ప్రతోళులం
దే వివరించుకొంటి సకలేప్సితభంగులు పేరు పేరునన్.

పలికినమాట యుచ్ఛ్వసిత వాయుతమాకులతోట; రాయబా
రుల యగపడ్డ వస్తునికురుంబము: తెచ్చినదెల్లహార్ద సం
కుల కవితామనోజ్ఞసుధ: కొల్చినచుంబన సంయుతా శిరో
క్తుల పసలందుకొమ్మనుచుఁ బల్కుటః లందుఁ బ్రతిశ్రివంబులౌ.

భావిభారత మహత్వ ప్రసక్తుల కెన్నియో యంజలుల నొగ్గుచుంటి సతము:
ప్రకృతిసౌభాగ్య ప్రభావంబుఁ జేర్వ్యెరఁ బలు ఘణుతులవంతు బలుకుచుంటి:
కటుతావటుత్వసంకలిత కవిత్వ తత్వాలలో నాయంతఁ బాలుగొంటి:
ప్రీతియామవిరతి సంగత మనస్కుడనౌచుఁ బరుగెత్తి దివినంటఁ దిరుగుచుంటి:

కమ్రహృదయంబు దిష్టలోకములఁగఱఁగి
చూడ్కులో స్ఫురింపఁగ నలుచొప్పులంను;
ప్రీతిని మేషంబు దుఃఖాశ్రువితతినో? ము
దశ్రుసంతతినో? హృదవధిగాఁగ.

తెనుఁగును సంస్కృతంబును మధించిన గుంఫన లెన్ని వేల భా
వనలనిమిడ్చి నా యాసలు భావము నీకిదమిత్థమంచుఁ బ
ల్కినరుచిఁ దెల్పలేదు: నిరళీకృత సర్వకళాకలాప మీ
వునను నపాంగధీధితి నవుం జిఱుతం గడు తేటఁజేసితో:

ఏమిటఁగఱంతువో? ప్రేమకేని తెలియ
దీవు వత్తువు: పోదువు: నీ ప్రసన్న
మగు తపర్తువులో సన్నమయ్యె ఝరిణి:
నీ గళోత్పన్న గతంబు నిబ్బరించె.



# నరుడు — మృత్యువు.

ప్రభల రామబ్రహ్మానందంగారు.

మృత్యువు వస్తుందన్నారు - నరుడు వెనుదిరిగి చూశాడు. ఏమీ కనుపించలేదు.

"ఎట్లావుంటుందబ్బా? మృత్యువు." అనుకున్నాడు. ఆలోచించాడు. ఏమీ పాలుపోలేదు. కనుపించినవాళ్ళందరినీ అడిగాడు "ఎట్లావుంటుంది" అని. కొందరునవ్వారు కొందరు పరిహాసం చేశారు.

"ఇట్లాకాదు. మృత్యువు వస్తుందన్నారు- తొందరగా యీచోటును విడిచి యింకోచోటికి పోదాము. అక్కడ మృత్యువుబాధ వుండదు" అనుకున్నాడు.

పరుగెత్తుతున్నాడునరుడు-ఎక్కడాఆగడంలేదు.

చెట్టుకదలి గాలివిసిరింది.

నరుని ఒళ్ళు పులకరించింది. "మృత్యువు కాదుగదా!" అన్నాడు.

కొంతదూరం పోయేటప్పటికి ఒకపెద్దబండ వున్నది మార్గంలో- రెండడుగులు వెనక్కువేశాడు: కొంచెం పరికించిచూచి పాషాణమని తెలిసికొని పరుగెత్తుతున్నాడు.

దూరాన అక్కడో మావిగున్న చక్కగా ఫలించివున్నది.

ఆచోటికి చేరాడో లేదో నరుడికి కాళ్లనొప్పులనిపించినది. నడువలేనిస్థితి తోచింది. కూర్చున్నాడు.

ఒక విసురుడు గాలికి చెట్టుపండుఒకటి నేలబడ్డది. నరుడు దానిని గ్రహించాడు. మంచి పరిమళం వేసింది. నోటిలో ద్రవమూరింది.

చివరకు దానిని తిన్నాడు.

ఇంతలో మృత్యువుసంగతిజ్ఞాపకానికివచ్చింది వెనుకటివలె పరుగెత్తబోయి, పరుగెత్తలేక మెల్లిగా నడుస్తున్నాడు.

ఒక తటాకం సమీపించింది.

నోరు పిడచకట్టుకుపోయినట్టుంటే తృష్ణదీర్చుకుందామనుకున్నాడు.

తృష్ణతీర్చుకున్నాడు.

ఇంతలో వ్యక్తి కనుపించింది.

"మృత్యువు ఎంతదూరంలోవుంది"

నవ్వుతూ "సమీపంలోనేవుంది" అన్నదావ్యక్తి తెల్లబోయి నాల్గువైపులా చూచాడు.

ఒకవైపున మబ్బులు ప్రతిఫలిస్తున్న తటాకం ఒకవైపున గాలికి కదలుచున్న చెట్లు కనుపించినవి. ఒకవైపున పెద్దకొండ కనుపించింది.

"ఎక్కడ?" అన్నాడు వణుకుతో.

"కొంచెం కళ్ళువిప్పిచూడు"

కళ్ళుమూసి తెరిచాడు. వ్యక్తి మాయమైంది, నాల్గువైపులా చీకట్లు ముసుకొన్నవి.

"రా! రా!" అను కేకలు వినబడ్డవి.

నరుడు చీకట్లోకి పరుగెత్తాడు.



# ప్లీడరీ

జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు.

రాజమండ్రిలో రామయ్యను ఎరగని వాళ్లేవరూ లేరు. ఎందుచేతనంటె అతడు అంత ప్రసిద్ధ పురుషుడు. అంత ప్రసిద్ధపురుషుడు ఎలాఅయినాడంటారేమో. అతడు కాఫీహోటలు పెట్టినాడు. భోజన హోటలు దానికి అనుబంధం. ఊళ్లోవున్న వర్తకులతో చాలమందికి రామయ్యే పురోహితుడు. పైగా దస్తావేజులు వ్రాస్తాడు. జూదమాడుతాడు. ఇన్నివిధాల డబ్బు రెండు గుప్పిళ్ళా డబ్బు గడిస్తున్నాడు రామయ్య. పది ఎకరాల పల్లంకూడావుంది. రామయ్యకు వేంకటరావు కుమారుడు. ప్రతిక్లాసులోనూ తప్పకుండా రెండేసేళ్ళు దండయాత్ర కొడుతూ స్కూల్ ఫైనల్‌వరకూ చదివేటప్పటికి రామయ్య నిలువ చేసిన రెండువేల రూపాయలూ ఖర్చయినవి.

కాలం ఎప్పుడూ ఒకేమాదిరిగా వుండదు. అదృష్టదేవత రామయ్యను విడిచినది. రామయ్య హోటలు ప్రక్కనే మదరాసునుంచి వచ్చిన శ్రీనివాసయ్యరు హోటలు. విద్యుద్దీపాలు-నిలువుటద్దాలు మేడనిండా అలంకరించి డాబు చేసేసరికి రామయ్య ఖాతాలు క్రమక్రమంగా అయ్యరు హోటలుకే మారినవి. ఏం లాభం లేకపోవడముచేత రామయ్య హోటళ్ళూ, కాఫీ హోటలూ మానివేసినాడు. పౌరోహిత్యం విషయంలోకూడా ఇలాగే కాంపిటేషను సంభవించినది. అని మానేశాడు. గౌరవహీనమయిన పనులు చెయ్యకూడదని తనలో తానే తీర్మానించుకున్నాడు. ఎవరో యిద్దరు ముగ్గురు పాత స్నేహితులు కనబడి "ఏమోయి రామయ్యా! హోటలు కట్టిపెట్టావేం?" అంటే "బాబూ! ఏం చెయ్యమన్నారు. తడి లేకపోతే దీపం ఆరిపోతుందోయి. అయినా అది గౌరవహీనమయిన వృత్తి. ఏదో కడుపుకోసం ఆవృత్తిలోకి దిగాను. మనవ గౌరవంలేని పనులు చేస్తే లాభం వస్తుందటోయి నాయనా? అయినా కరువిడిపట్టు వరిటి చాలా ఎక్కువగా వున్నది. స్కూల్‌ఫయినల్ ప్యాసయినాడా మరి. బి.ఏ వరకు చదివించితే ఎక్కడో అక్కడ పదిరాళ్ళు సంపాదించుకుంటాము. ఏమంటావు?" అని అడిగినాడు.

స్కూల్‌ఫయినల్ మొదలుకొని బి.ఏ వరకూ వేంకటరావు ఒక్కొక్క క్లాసులో నాలుగేళ్ళు ఫేలయ్యేవాడు. బి.ఏ సీనియరు క్లాసులోనికి వచ్చునప్పటికి అతనికి 30 యేళ్ళు వచ్చినవి. 9 ఎకరాలు అమ్మివేశాడు రామయ్య. వున్న ఒక యెకరం మీదా పదేహేను వందల రూపాయలు అప్పుచేసినాడు. ఒకనాడు ఒకడు అప్పుకువచ్చి 'ఏమోయి! రామయ్యా! మతిలేదా ఏమిటి నీకు?' వున్న భూమి అంతా అమ్మేశావని విన్నాను. పైగా తాపేశ్వరం వెంకన్నవద్ద పదిహేను వందలు అప్పు పుచ్చుకున్నావట. ఏమిటీవరస? ఈపాటికేనా చదువు మాన్పించి ఏ సబ్‌రిజిస్ట్రారాఫీసులోనో గుమాస్తాపని వేయించు మూర్ఖుడక." అంటే రామయ్య ఇలా అన్నాడు.

"పోవోయి నీకేం తెలుసు. శ్రీరంగనీతులు చెప్పవచ్చావా? అయితే మొన్న నీకూతురి పెళ్ళికి వరుని కట్నంకోసం రెండెకరాలూ అమ్మి ఆడంబరముగా చేశావా లేదా? ఎందుచేత చేశావు. అల్లుడు వుద్ధరిస్తాడనేనా? ఇలాగే

నేనూ. రేపొద్దున్న ప్లీడరీప్యాసయి ఈబుణా లన్నీ వాడు తీర్చుకోడూ?"

వేంకటరావుకు పెళ్ళి సంబంధాలు రా సాగినవి.

"ఏదో ఉద్యోగంలో ప్రవేశించి ధనార్జన చేస్తుంటేనే కాని వివాహం చేసుకోను" అని వేంకటరావన్నాడు. 'ఈయేమటప్ప' అన్నాడు రామయ్య. కోపంతో వేంకటరావు ఇట్లాబదులు చెప్పినాడు.

"అయితే చెయ్యండి. వద్దంటే తప్పదంటారు. భార్య కాపరానికివస్తే చదువు చట్టుబండలవు తుంది. కోరి పెళ్ళిచేసికొని ఎంతమంది కొంప ముంచుకున్నారు."

వేంకటరావు తల్లి సోమమ్మ ఇలా అన్నది—

"ఓరి వెర్రినాయనా! ఇప్పుడిప్పుడే నీ చదువు చూసీ, రూపంచూసీ పెండ్లి సంబంధాలు వస్తు న్నవి. ఏదో ఒకటి ముడిపెట్టకపోతే కాకులయిన లోకులు 'ఈడు ముదిరిపోయిందనీ, 'రెండో పెళ్ళివాని లాగున్నా' డనీ, 'ఆస్తి ఏమీలేదట మ్మా' అనీ, ఇంకా మరెన్నో విధాలఅంటారు. తెలిసిందా? అట్టే గడుసుతనం చెయ్యబోకు."

వేంకటరావు మాట్లాడలేదు. శుభము హూర్తము నిశ్చయించి 'అంతకు తగిన బొంత'ని కట్టిపెట్టారతనికి అతడు బి. ఏ. ప్యాసయినాడు. తండ్రికీ, కుమారునకూ ఇప్పుడు అభిప్రాయ భేదాలు కలిగినవి. 'ప్లీడరీకి చదవరా' అం టాడు రామయ్య. 'యల్. టీ,' ప్యాసయి మేష్టరీ చేసుకుంటాను. కడుపులో నీళ్ళుకదల కుండా' అంటాడు వేంకటరావు.

"మేష్టరీచేస్తే ఏం లాభం వుందిరా? చచ్చు మేష్టరా" అన్నాడు రామయ్య.

"ప్లీడరీచేస్తే ఏం బలుసుతుంది నాన్నగారు, చవట ప్లీడరీ" అన్నాడు వేంకటరావు.

కుమారుడు తిరస్కరించినాడని రామయ్యకు కోపం వచ్చింది. అతని నేత్రములు ఎర్రబారి నవి. గంభీరంగా ఇలా అన్నాడు.

"ఓరి చచ్చుపెద్దమ్మా! మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా? ప్లీడరీచేస్తుంటే కలిగేఆనందం అనుభవించే సౌఖ్యం, వచ్చే డబ్బూ, పలుసరి వల్లా సంప్రాప్తమయ్యే గౌరవం మేష్టరీ చేస్తే లభించుతవా? చూడూ. కంచంపాటి శేషయ్య అధికార్ల వెంకటసుబ్బయ్యా, నీకంటె వయస్సు లో చిన్నవాళ్ళు నెలకి అర్ధమం అంచుండలు సంపాదిస్తూంటే, అన్నైదు రూపాయలు జీతం రాళ్ళు వచ్చే మేష్టరీ నీకు నచ్చిందా? నెలకి నాలుగు కేసులు వస్తే నాలుగురోజులు కష్టపడ తావో లేదో, నాలుగు వందల రూపాయలు చేతిలోపడతవి. 'ఫలానా మల్లావఝల రామ య్యగారి కుమారుడు వేంకటరావు ప్లీడరీచేస్తూ విశేషంగా డబ్బుగడిస్తూన్నాడట ఎంత అదృష్టం' అని మనచుట్టాలూ, స్నేహితులూ అనదిస్తుంటే—ఆహా—ఎంత సంతోషం కలుగుతుంది? నామాట విను బాబూ. పట్టుపట్టకు. అయిన అప్పు ఆవనేఅయిందే. పట్నం ప్రయాణానికి సిద్ధపడు. ఎక్కడో నోటువ్రాసి నాలుగు వందలు తెస్తాను."

## 2

వేంకటరావు మదరాసువెళ్ళి అహర్నిశములు కష్టపడి చదివి బి. యల్ ప్యాసయి వచ్చినాడు. ఆతని వృద్ధ జననీజనకులు కాశీ వెళ్ళినారు. భార్య సుబ్బమ్మ కాపురానికి వచ్చింది. వేంకట రావు రాజమండ్రిలో ప్రాక్టీసు (Practise) మొదలు పెట్టాడు. బీరువాలు కొనవలె. డబ్బు

లేదు. పుస్తకాలు కొనాలి. డిటో స్వగ్రామి మనుకు వెళ్ళిమునసబుకద్ద రెండు వేలరూపాయలు బదులు తెచ్చినాడు. డబ్బుగడించి తీర్చివేయ గలనని అతని ధైర్యం. తీరిపోతే నాలుగు కేసుల్లో పనిచేసి రెట్టి ఫుఫీజు ఏర్పాటు నోటులో వసూలు పెట్టించుకోవచ్చునని ఊహించినాడు వేంకటరావు. మెయిన్‌రోడ్డు ప్రక్కవున్న చిన్న డాబా ఒకటి నెలకు పాతిక రూపాయిల అద్దికి తీసుకున్నాడు. గోడకు బోర్డు తగిలించినాడు. "యం. వేంకటరావుగారు బి. యే. బి. యల్. జిల్లాకోర్టువకీలు" అని long coats కుట్టించి నాడు. కలకత్తా అంచు పంచెలు, సిల్కు చొక్కాలు ధరించేవాడు. అభ్యాసంలేని సిగ రెట్టు కారాకిల్లీ అలవాటు చేసుకున్నాడు. కొత్తగా కాపరానికి వచ్చిన భార్యకు కొన్ని చీరలు కొన్నాడు. అద్దాల బీరువాలు చేయించి సావడిలో అడ్డంగా పెట్టినాడు. గోడలనిండా రవి వర్మపటములు, నిలువుటద్దములు. అప్పు చేసిన రెండు వేలూ కర్చుయినయి.

కాలచక్రము శరవేగముతో తిరుగు తున్నది. రెండు సంవత్సరాలు గడిచినవి. రామయ్య సులభంగా "నాలుగు కేసులు వస్తే నాలుగువందలు వస్తవి" అన్నాడు. నెలకు కాదుగదా ఏడాదికి నాల్గైనా రాపటంలేదు. ఏవో రెండు మూడు కేసులువస్తే, అందులో ఒకటి Exparty Decree అవడమువల్ల పార్టీఫీజు ఎగవెయ్యడము, మరొకటి అరువుపద్దు, ఇంకొకటి నిర్ణయించుకున్న ఫీజు పన్నెండు రూపాయ లయితే, కేసు గెలిచినతరువాత నాలుగు రూపా యలు చేతిలోపెట్టి "బీదవాణ్ణిబాబూ. ఏదో సంతోషించండి" అనడము, 'ఛీ' నాకీ నాల్గు రూపాయలు అక్కరలేదంటే, చడీ చప్పుడు లేకుండా ఆనాలుగు రూపాయలూ, జేబులో వేసుకుని చక్కాపోవడమూ జరుగుతున్నది. ఆదాయము ఇంటి అద్దెకైనా సరిపోవడంలేదు. డబ్బు పుచ్చుకుని పత్రికలకు కథలు వ్రాస్తూ చిన్న చిన్న పుస్తకాలుగాస్తూ మహాగుట్టుగా కాలం గడుపుకొంటున్నాడు వేంకటరావు. కాని అతని హృదయమును దారిద్ర్య దవానలము దహించివేస్తున్నది శాంతి అణుమాత్రమైనా అతని మనస్సులోలేదు.

కాశీనుంచి తలిదండ్రులు వచ్చారు. ఇంట్లో పైడాబు (outward appearance) చూసి అబ్బాయి లక్ష్మీదేవిలా నాలుగుచేతులా గడిస్తున్నాడేమో ననుకొన్నాడు. కోడలు సుబ్బమ్మ తనూ, వేంకటరావు అనుభవిస్తున్న కష్టాలను అత్తమామలకు విశదీకరించినది రాత్రి భోజ నానంతరము రామయ్య ఇలా ప్రశ్నించినాడు.

"ఏమిరా నాయనా! ఎల్లాం pay చేస్తోందీ ప్లీడరీ?"

"నాపిండంలా pay చేస్తోంది. నెలకు నాలుగు వందలు వస్తుందన్నారు మీరావేళ. నాలుగు వందలుగాదు నలభైకాదు 1-14-6 కూడా రావడంలేదు నాన్నగారూ! నన్ను ఈవృత్తిలో ప్రవేశపెట్టి చంపేశారండి."

"ఏంకష్టమవుందిరా ప్లీడరీ రు 200 లయినా రావడంలేదూ?"

"అబ్బ. మీకు వెర్రేమిటి. చెబుతు న్నాగా దమ్మిడీ రావడంలేదని.

"ఎందుచేతరా? ఏమీరా రాకపోవడం? దీనిలోవుండే కష్టంఏమిటో చెప్పు"

"అయితేవినండి నాన్నగారూ! ఈజిల్లాలో కోర్టులున్న ప్రతిఊళ్ళోనూ ప్లీడర్ల కాంపిటీషన్ చాలా Keen గావుంది. ఎందుకు రాజమండ్రిలో

140 మంది వకీళ్లున్నారు. వారిలో బాగా డబ్బు సంపాదిస్తున్నది ఒకరు లేక యిద్దరు. కేసు వంద రూపాయలకుకాదు పన్నెండురూపాయల పావలాఅర్ధణాకు ఒప్పుకుంటున్నారు. రామచంద్రపురం వెళితే అక్కడా అంతే. అమలాపురం వెళితే అంతకంటె అన్యాయంగావుంది.

"డబ్బురాకపోతే ఉత్సాహం వుండదు. భార్య నగలకూ, చీరలకూ, కూరలకూ పోరు పెడుతుంది. అప్పుడు కోపంవస్తుంది. అలాంటి సమయంలో ఎవడైనా పార్టీవస్తే ఆకోపావేశమున చిరాగ్గా బుస్సూ మంటూ మాట్లాడితే ఆపార్టీ లేచి చక్కాపోతాడు. అతడు వెళ్ళకుండా ఎటువంటి dilemma లో వున్నా బలవంతాన ముఖమున మందహాసము తెచ్చిపెట్టుకోవాలి. ఉత్సాహంగా మాట్లాడాలి వాళ్ళతోటి. ఇదే చాలా కష్టమైనపని.

"కేసునిలవదు. నిలిస్తే గెలవదు. గెలిస్తే అరువుపద్దు. నిలబెడితే వుళ్ళిరాడు. పార్టీని మంచిచేసుకుని డబ్బులాగాలి. లేకపోతే ఇంట్లో గిన్నెలు డింకీలు కొట్టుకుంటవి. అద్దె పాతికరూపాయలూ ఇవ్వకపోతే ఇంటియజమాని నానా కేకలు వేస్తాడు."

"సిగరెట్లు కాల్చకపోతే fashion కు భంగమాయెను. హానరబుల్ వాచ్‌మార్కు కాలిస్తే పిసినిగొట్టుప్లీడరంటారు. నేవికట్ కాని సిజర్సుకాని కాకపోయినా Elephant మార్కయినా కాల్చాలి. పెట్టేబేడ అదెక్కడనుంచి వస్తుందీ ?"

"Law-journal తెప్పించాలి. కాకపోతే up to date Law తెలీదుగదా. దాని చందా డబ్బేదీ ? ఈ ఊళ్లో మొత్తం అయిదుకోర్టులు ఉన్నై. అయిదుకోర్టులకూ 400 మంది బంట్రోతులు ఉన్నారు. ఒక్కొక్కడికి ఏడాదికి 0-4-0 అయినా ఇవ్వాలి. వందరూపాయ లవుతుంది నాన్నగారూ ! డబ్బేదీ ?

"ప్లీడర్‌చేస్తే ఇంటిదగ్గరనుంచి కోర్టుదాకా నడిచివెడితే నవ్వుతారు రానూపోనూ జట్కాకాకపోయినా ఒంటెద్దుబండైనా ఉండాలి. అరణాలవుతుంది రోజుకి. దానికో డబ్బు. మధ్యాహ్నం టిఫిన్‌కర్చు. అక్కడైన జడ్జీకోర్టులో ఒక కేసూ, మునసబుకోర్టులో ఒక కేసూ వాదించవలసి ఉంటుంది దానికి దీనికి టైము ఒక్కటవుతుంది టైము extend చేయమని మునసబుగారు కాని జడ్జీగారు కాని అందుకు ఒప్పుకోరు అపుడు ఒక కేసు వ్యర్థమై పోవలసిందేగా ?

"ఏదైనా ధర్మకార్యంచేస్తే చందా ఇమ్మంటారు. ఇవ్వకపోతే 'వీడు చవటరా' అని అంటారు. ఒకరూపాయి ఇవ్వాలి. Bar-dinnerవస్తే 1-0-0 ఇవ్వాలి చందా.

"ఇంకా ఎన్నివున్నాయండీ నాన్నగారూ !
"మేష్టరీకూడా ఒకవుద్యోగమేనా ?" అన్నారు,
"ప్లీడరీకూడా ఒకవృత్తేనా ?"

రామయ్య నిట్టూర్పువుచ్చి "నాయనా ! అలా గోతిలోపడ్డాను భ్రాంతిచేత ఏం చేయ్యను మన్నావు. కాశీలోవుండి గడించితెచ్చినాను మూడువందలు. ఎల్. టి. ట్రయినింగు కానీ, అయ్యో ! నీమాట వినలేదు." అన్నాడు.

రామయ్య తను వేసిన ప్రోగ్రాం అడ్డంతిరిగిందని బెంగపెట్టుకొన్నాడు. ఆమనోవ్యాధికి జ్వరం అనుబంధమయింది రామయ్య పదిరోజులకు మరణించినాడు.

సంపూర్ణము.

# దేశభాషలు

సుంకర వెంకటరత్నముగారు

తొలుత [illegible] భాషయన నేమో కొంచెము విచారింతము. మన హృదయాంతర్గతాభిప్రాయముల నితరులకు వెల్లడి చేయుటయే భాష యనబడును. శిశువు మాతృగర్భము నుండి భూమిమీద పడినతోడనే రోదన మారంభించును. క్రమముగా పెద్దవాడైనకొలంది తల్లినిబట్టి అమ్మ, అయ్య, మున్నగు పదములను నేర్చుకొని యక్కడనుండి భాష నభివృద్ధి జేసికొనును. తల్లిదండ్రు లుత్తమజన్ములయినచో వారు మాట్లాడు స్వచ్ఛమైన భాషను నేర్చుకొనును. నీచ జన్మలో జనియించినచో వారు మాట్లాడుభాషయే నాని కలవడును. ఇట్టిభాషయే శిష్టజనులచే వ్యవహృతమైనచో నది శిష్టభాష యనందగును. భాషయనునది మనుష్యుల చేతనే కాక పశు పక్ష్యాదులచేగూడ జెప్పబడుచున్నది. దూడ తన ఆకలి యైనప్పుడుగాని, తల్లి దగ్గఱ లేనప్పుడు గాని అంబా యని యఱచును. అదియు భాషయే. పూర్వము పక్షులు మాట్లాడుచుండగా నాభాషను మనుష్యులు కూడ గనిపెట్టెడివారని మనకు కొన్నిచరిత్రాంశములవలన తెలియుచున్నది. నేటికిని కొంతమంది చిలుకలు మొదలయినవానిని పంజరములలో బెట్టి మనభాషను నేర్పుట మనము కన్నులార గనుచునే యున్నాము.

పూర్వము నాగరికతయన్న నేమో యెఱుంగని దినములలో మానవులందఱు నరణ్యములలో నేయే కొండ చరియలలోనో నివసించుచు గృహాదులులేక యధికమైన యవస్థను బొందుచుండెడివారు. వీరిట్లుండగా నేవేళనో క్రూరమృగములు వచ్చి వారికపాయములు కలుగజేయు చుండగా వారు భీతులై యెవరికివారు యథేష్టముగా నెక్కడకోపోయి క్రూరమృగముల బాధనుండి విముక్తులై యచ్చటచ్చట చిన్న చిన్న గృహముల నేర్పరచుకొని జీవము గడుపుచుండెడివారు.

ఆయా దేశములకు వెళ్ళినవారు తత్తద్దేశములనుబట్టి శీతోష్ణస్థితులనుబట్టి యనేకములగు భాషల నలవడజేసి కొనిరి. ఈవిధముగ పెక్కుభాష లుద్భవిల్లి సర్వత్రి వ్యాపించినవనుటలో నతిశయోక్తి యేమియులేదు. ఇట్టి భాషనే కొంతమంది పెద్దలు సంస్కరించి యది శిష్టజన వ్యవహారయోగ్యముగా నేర్పరచిరి. అరవము, కన్నడము, మళయాళము, గ్రీకు, లాటిన్, జర్మనీ, ఇంగ్లీషు తెలుగు మున్నగున వనేకములు దేశభాష లేర్పడినవి. ఈభాషలలో నొకదానిలోని పదములు మరియొక భాషలో జేరుటకూడ గలదు. ఇట్టి సాంకర్యము దేశదేశముల దిరిగి వర్తకము మొదలగువానిని జేయు వ్యాపారులవలన గలిగియుండవచ్చును. ఇంకను నితరభాషల నేర్చుకొన నుత్సుకులయిన భాషాభిమానులయినవారివలనగూడ గలిగియుండవచ్చును. ఇప్పటికి నింకను నన్యభాషా పదములు మన భాషలో చేరుచుండుటయు గనుచున్నాము.

తత్తద్దేశీయులు వారివారి దేశభాషలలో నెక్కుడు ప్రావీణ్యమును బొందియుండవలయును.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అన్నట్లు మనకు తల్లియు, జన్మభూమియు స్వర్గముకంటెం గూడ మహత్తరములైనట్లో యట్లే మనదేశములో బుట్టిన భాషను నేర్చుకొనుట యనునది మిక్కిలి గౌరవదాయకము.

"కష్టాదపి కష్టతరం పరగృహవాసః పరాన్నంచ" తన గృహమును విడిచి పరగృహమున నివాసముచేయుట పరులయన్నమును భుజించుట యెట్లు కష్టతరమో తన దేశ భాషనువిడిచి పరభాష నాశ్రయించుటకూడ యట్టిదే.

పరభాషను నేర్చుకొనుట సమంజసము కాదని మాత్రము నాయుద్దేశము కాదు. స్వదేశభాషను ప్రధానముగా ప్రథమముగా నభ్యసించి యందులో ప్రావీణ్యతను సంపాదింపవలయును. ప్రతి పండితునకు తనయొక్క దేశభాషలలో గావ్యనిర్మాణ మత్యంత శ్రేయోదాయకము.

విద్యాభ్యాసము జేయవలయునన్న దేశభాషలో జేయుటయే యత్యంతసులభము సుబోధము నగుచున్నది. ఇతరులకు బోధించవలయునన్నను దేశభాషయే ప్రథమ సోపానము. స్వదేశభాషను విడిచి పరభాష నాశ్రయించుట సర్వవిధములం గష్టసుఖములయందు మనకుం దోడ్పడుచు సుఖదుఃఖములయందు సమభాగినియైన స్వకాంతను విడిచి ప్రేమస్వరూపమే యెఱుగక ధనలోభముచేసే కుంటివానినయిన వలచు వేశ్యయొక్క సంపర్కమువంటిది.

తనభాషకు హీనత నాపాదించుట మాతృద్రోహము వంటిది. స్వదేశభాషా విముఖత్వము దేశద్రోహమునకు హేతువగును. తన దేశభాషను స్మరింపనివాడు తనజాతికి నగౌరవము సంపాదించినవాడగును.

స్వదేశ భాషాభిమానులు గనుకనే నన్నయాదులు తమ దేశ భాషయైన యాంధ్రమున బంచమ వేద మనబరగు భారతమును రచించి కీర్తిశేషులైరి. పూర్వపు రాజులకు గూడ స్వదేశములందు స్వభాషలయందు నత్యంత గౌరవ

ముం జెడిదని తెలియుచున్నది.

ప్రస్తుత కాలమున గొంతమంది స్వభాషా స్వరూపమునే గుర్తెఱుగక పరభాషా వ్యామోహమునందే పడిపోవుచున్నారు కొంతమంది మాట్లాడుచు నీమాటకు మన యాంధ్రమున నేదో యందురు, అది నాకు సరిగా తెలియదు? అని యందరు. పరభాషా ప్రవీణులేయైన నేమిలాభము ఇట్టివారి స్థితి యత్యంత శోచనీయము.

దేశభాషా సేవయే మాతృ పాదారవింద సేవ. స్వదేశ భాషా గౌరవమే జాతీయగౌరవము. దేశభాష లనేక విధము లన్నసంగతి పూర్వము చెప్పియే యున్నాను దేశ భాషలలో నగ్రస్థానము వహించినట్టియు, మనయొక్క యాత్మగౌరవమునకు హేతువయినట్టి యాంధ్ర భాషను గూర్చి కొంత విపులముగా జర్చింప నుత్సుకుడను.

ఆంధ్రమను శబ్దమున కనేకులు పలు విధములుగా నుత్పత్తి జెప్పిరి. "అంధ దృష్ట్యుపఘాతే" అను ధాతువు నుండి యాంధ్రశబ్దము పుట్టినదని కొంతమంది చెప్పుదురు. ఆంధ్రుడను రాజు పాలించుటవలన నీదేశమున కాంధ్ర దేశమను నామము సార్థకమయ్యెనని కొంతమంది మతము. కొంతమంది యభిప్రాయ మిట్లె యింకను విభిన్నముగా నున్నది. ఎవరెట్లు చెప్పినను నాంధ్రుడను రాజు పాలించుటచే నీదేశమునకు నాంధ్రదేశమనుసంజ్ఞ కలిగెననియు ఆంధ్ర దేశమున నుండువారలు మాట్లాడు భాషగనుక యాంధ్రభాషయని పేరు వచ్చినదన్నచో బాగుండును.

ఆంధ్రమును తెలుగని వ్యవహరింతురు. తెలుగనగా త్రిలింగ శబ్దభవమని పలువుర యభిప్రాయము.

ద్రాక్షారామము, శ్రీశైలము, కాళహస్తి యీమూటి యొక్క మధ్యనున్న దేశముగనుక త్రిలింగమను నామము కలిగెను ఈ తెలుంగునే తెనుంగనికూడ వ్యవహరించుచున్నారు. కొన్నికొన్ని పదములలో నున్న లకారము నకారముగా జెప్పబడుచుండుటయు గలదు.

తెనుగుభాషకుం బూర్వమునుండి యనఁగా నన్నయ మొదలు నేటివఱకును నతి గౌరవము లభించుచున్నది. కావ్య రచనగూడ నాంధ్రముననే చేయుచు నట్టి తెనుగు భాషకు వ్యాకరణములనుగూడ రచించిరి.

కృష్ణదేవరాయలు మాతృ భాషయగు సంస్కృతమున రసమంజరీ, మదాలస చరిత్ర మొదలగు గ్రంథములను రచించినవాడయ్యు వానితోం దృప్తిఁబొందక "దేశభాష లందు తెనుఁగు లెస్స" యని చాటి ఆముక్తమాల్యద యను గ్రంథరాజమును రచించిన సంగతి మనకెల్లరకును విశదమే. సంస్కృతాంధ్ర పండితులను, గవులను దన యాస్థానమునఁ బోషించుచు నిత్య విద్యాగోష్ఠి సలుపుచు నాంధ్రభాషా సారస్యమును గ్రహించి నొక్కి చెప్పిన మాటగాని వేఱు కాదు.

"స్వస్థాన వేషభాషాభిమతాః సంతోరసప్రలుబ్ధధియః
లోకేబహుమన్యం తేవైకృతకావ్యానిచాస్యదపహాయ"

అని నన్నయ చింతామణి సూత్రము. అనఁగా రసైకాయత్తచిత్తులగు పండితులయిన కవులు తమతమ వేషభాషాదులం దభిరుచి గలవారయ్యు వానిని విడిచి యాంధ్ర భాషా కావ్యములనే రచించుచున్నారు అని యర్థము. ఈభాషకు వైకృతమను నామాంతరముకూడ గలదు. సంస్కృత ప్రాకృతాదులనుండి వికారమును బొందియున్నది గనుక వికృతమను సంజ్ఞ కలిగినది. ఈ యాంధ్రభాష యిరువదిరెండు భేదములు కలిగి యున్నది. శౌరసేన, మాగధ పైశాచ మొదలగు షడ్విధముల ప్రాకృతములలో దద్భవ తత్సమదేశ్యములచేఁ బదునెనిమిది రూపములు. సంస్కృతభవ సంస్కృత సమములచే రెండు విధములు. దేశ్యమనియు. గ్రామ్యమనియు రెండు విధములు. కలసి యిరువదినాలుగు విధములు. ఇంకను "అహేయ మన్య దేశీయం యత్తదేవ ప్రయుజ్యతే" అను చొప్పున నితర దేశ భాషాపదములుకూడ నిందు జేరవచ్చును.

ఇట్టి యాంధ్రభాషకు నన్నయ, అథర్వణుడు, చిన్నయ సూరి ప్రభృతులు వ్యాకరణముల రచించిరి.

సంస్కృతమున చాంద్ర వ్యాకరణము, సారస్వత వ్యాకరణము, జైమినివ్యాకరణము మొదలగున వనేకములు గలవు. అవియన్నియు మనదేశమున లేవు. ఆంధ్రదేశమున పాణినీయ వ్యాకరణమొక్కటి మన కాదర్శముగా నున్నది. పైఁజెప్పిన వ్యాకరణము లన్నిటిని సవరించి, లోపభాగములను బూర్తిజేసి, యన్నిటవిషయము సంగ్రహించి యత్యంతోపకరముగా పాణిని రచించినాడు గనుకనే దానికున్నంత ప్రాముఖ్య మితర వ్యాకరణములకు లేదు. ఆంధ్రముననన్నయో పూర్వ వ్యాకరణములను గొన్నిటి భాగములను సవరించినను, గొన్నిటిని విడిచినను మన కందరకు సుబోధమగురీతిని చక్కని ప్రణాళికతో నాంధ్రమున రచించినాడు గనుకనే చిన్నయసూరి మన కృతజ్ఞతకు బాత్రుడయినాడు. బాల వ్యాకరణమే ప్రస్తుత మనకందరకును శరణ్యముగా నున్నది.

ఈవ్యాకరణకర్తలందరుభాషయిట్లుండవలయును మేము చెప్పినరీతిని భాష నుపయోగింపక పోయినయెడల నది గ్రామ్యమగును, గ్రామ్యమనగా నపభ్రంశ మనదగును అట్టి యపభ్రంశమును మనము మాట్లాడగూడదు, అని

నియమము చేసిరి. “ సంస్కారార్ధో నియమః ” అని యమాద్ద్రామ్యం హె యత్వపభ్రంశ, అనినన్నయ గ్రావ్యమ నపభ్రంశపర్యాయముగా జెప్పి, భాషకు నియమము జేసియున్నాడు. తక్కిన లాక్షణికులుకూడ నద్దాని నంగీకరించిరే యున్నారు.

ఇప్పుడు కొంతమంది యీనియమముల నంగీకరించుట లేదు. పూర్వకాల స్థితికిని నిప్పటి కాలస్థితికిని దారతమ్యము గలదు. పూర్వపు వేషభాషాచారాదు లిప్పుడు లేవు నాగరికత వృద్ధియైనది. కాలము విపరిణామము బొందినది. అట్లె భాష మారుచున్నది. మనము నిత్యము వ్యవహరించు భాషనే గ్రాంథికముగా జేయవలయునని వీరి పట్టుదల. ఈయభిప్రాయమునకు భిన్నాభిప్రాయము గలవారు దీని నంగీకరించినచో భాషాస్వరూప నాశనమగునను భయముచే దీనిని తిరస్కరించుచున్నారు. అందఱకన్ని విషయములలో నేకాభిప్రాయ ముండదుగదా, భిన్నరుచిర్హి లోకః అని చెప్పబడియె యున్నది కనుకనే యీవిషయములలో గూడ నిరుపక్షములవా రేర్పడి హోరాహోరిగా బోరాడుచుండిరి. కాని యింతవరకు నెవ్వ రేమియు దేల్చినవారు కారైరి.

పూర్వము నన్నయాదులు భారతాదులను రచించిరనగా నప్పటి శిష్టజన వ్యవహార భాషనుగూర్చి వ్రాసియున్నారు. పామరులు మాట్లాడు భాష యది గ్రామ్యమే యగును. ఇప్పుడును భాషాపారంగతులగు పండితులునగు శిష్టులు వ్యవహరించు భాషనే గ్రాంథికముగా జేయుట మంచిది కొంతమంది యత్యంత నీచభాషలో గ్రంథముల రచించుచుండిరి. అట్లుజేయుట భాషాస్వరూప నాశనము చేయుటయే యనదగును.

ఇంగ్లీషులోఁగూడకొంతమంది నవీనులు (Daughter) డాటర్ అను పదమును (Dater) అని యున్నచో బాగుండును. భాషాసౌలభ్యము చేకూరును వర్ణములన్నిటినిగూర్చి పదము ప్రయోగించుటకంటె నల్పసంఖ్యాక వర్ణములచేత పద ప్రయోగము భాషకుసుకరముగ నాయని వాదించుచున్నారట. ఇట్టి పదము లింక ననేకములుగా నున్నవట. పూర్వపు పండితులు (Daughter) అనియున్నచో దుహితృశబ్దము తద్భవముగా నుండును. భాషల కత్యంత సంబంధము నుండుట మంచిదను యుద్దేశముతో (Dater) డాటర్ అనునది సరికాదని ప్రతివాదన జరుపుచున్నారు. కనుక మన భాషలలో నిట్టివాదనలు పెట్టుకొని కాలము గడపుటకంటె ఇప్పటి శిష్టజన వ్యవహారము నేభాష కలదో దానిలోనే గ్రంథములు వ్రాసినచో సర్వ జనులకు సాధారణముగా విశదమే యగుచుండును.

ఎట్లు వ్రాసినను పూర్వపు భాషకు నిప్పటి భాషకు భేదము కలదుగదా! భాషకుఁ గొంతవరకైన నియమ ముండవలయునుగదా! అట్టి నియమముకొరకు వ్యాకరణము లవశ్యములుగదా. పూర్వపు వ్యాకరణము లిప్పటి భాష నంతను సాధించలేదుగదా అనవచ్చును. వ్యాకరణ ముండవలసినమాట నిజమే. లేనిచో నిజముగా భాషాస్వరూప నాశనము జేసినవారమే యగుదుము.

భాషావిజ్ఞానులీకార్యమునకు పూనుకొన్నచో నట్టికొరంత కూడ తీరిపోవును. మొన్న నూతనముగా నొక వ్యాకరణము బయలుదేరినది. అది కొంతవర కిప్పటి భాషకు జాలినదై యున్నది. ఇట్టె సంపూర్ణముగా నింక కొంతమంది వ్రాసినచో మనభాషకేమియు కొరతయుండదు.

శిష్టజన వ్యవహారము గ్రాహ్యమని పూర్వ లాక్షణికులు నంగీకరించిరే యున్నారు అట్లు వ్రాయుట జనులకందరకు నత్యంతోపయుక్తముగా నుండునని నాయభిప్రాయము.

ఇఁకొక చిన్నవిషయము. దేశభాషలలో నన్నిటికంటె యాంధ్రమే గొప్పది. కనుక యాంధ్రమునే యభ్యసింపవలయు నంటివి గదా, ఆంధ్రమున నన్ని విషయములు మనకుఁ దెలియునా? యని యందురేమో. నిజమే ఆంధ్రమున భౌతిక, రసాయన, వృక్ష, జంతు శాస్త్రములు మొదలగునవి లేవు వానిని పరభాషలో నేర్చుకొనవలసినదే. ఇట్టి శాస్త్రములు మనభాషలో లేకపోవుట గొప్ప కొరతయనక తీరదు. (?) ఆశాస్త్రములం దభిరుచిగలవారు తమ బంధువులను విడిచి, శరీర కష్టమున కోర్చి ధనవ్యయమును లెక్కింపక లండనూ, యమెరికాలో వెళ్ళి చదువవలసినంత దుస్థితి గలవారగుచున్నారు. అట్టి శాస్త్రములను మనలో నెవరయిన రచించినచో మన యాంధ్రులకు నాంధ్రభాష కెంతయో లాభము. నేర్చుకొనుటకూడ సుకరముకదా! ఇంగ్లీషువారి కాశాస్త్రములు లేనిచో వారుకూడ నేర్చిరియో, యెజర్మనియో వెళ్ళి నేర్చుకొనవలసిన గతి పట్టునుగదా అట్టి కరవులు వారికి లేవు గనుకనే వారెంతయు నిట్టి శాస్త్రములలో నిపుణులై ధనమును గడింపగల్గుచున్నారు, మనకట్టి దుస్థితి కలుగబట్టియే మనలో నెందఱో చివరకు దరిద్రులుకూడ నగుచున్నారు.

భాషావిభేద వాదములుమాని శిష్టజనవ్యవహారభాషలో

గ్రంధరచన గావింపుచు, నీభాషకు దగినట్లుగా వ్యాకరణ ములు రచించి యాంధ్రభాషలో లేని శాస్త్రాదులను పర దేశములలో జదివి ప్రవీణులయినవారయినను రచించి యట్టికొరతనుగూడ దీర్చి "దేశభాషలందు దెనుఁగులెస్స" యను కృష్ణరాయ వచనమును సార్థకపరచుచు నాంధ్ర భాష నభివృద్ధి జేయుదురుగాక !

---

కందుకూరి రామభద్రరావుగారు.

# తృప్తి

అస్తశైలముపైనుండి అర్కుఁడపుడు
పసిడికాంతులు దిశలందుఁ బరపుచుండె,
కిలకిల ధ్వని శ్రోత్రపుటలపు గొలుప
పక్షిగములెల్ల గూండ్లకు బయనమయ్యె,
మలయుఁ డానంద మొలయంగ మెలగుచుండ
చివురు గొమ్మలు మన్ననల్ సేయుచుండె
విసరి పాటలఁబాడుచు బసులనెక్కి
చిన్నికుఱ్ఱలు గృహములు జేర జనిరి,
సృష్టియంతయు నానంద వృష్టినుండె
విడచుచుండఁగ భావాళి నడచుచుంటి
మలినమగు జీర్ణవస్త్రంబు మలచికట్టి
నడుము వ్రుంగగ, దేహంబు సడలియుండ,
పండ్లుడూడఁగ, దౌడలు పాడుబడఁగ,
కండ జీర్ణించి యెముకలు గానుపింప,
తలకు తైలంపు స్పర్శయే తగులకుంట
జనపపీచట్లు 'సెండ్రికల్' గనఁబడంగ
చేతగలయట్టి కఱ్ఱపై నూతగొనుచు
ముసలినడకకు నరములు మొఱగుచుండ
గరికగంపను నెత్తిపైఁ గలిగియొకతె
ఎదురుపడియెను పెనుజాలిబొడవ యెదను
"అవ్వ ! నీకేల యీకష్ట" మంటి నేను
"బాబు ! లేక బువ్వయెట్ల" ని పలికె నవ్వ
అంతనివ్వెరపడి యిటులంటి మఱల
"ఏదినీవ్వుత్తి నీయున్కి యేది ? ఎవరు
దిక్కు ?" అన నవ్వనాదిక్కు తిరిగియనియె-
"చల్లగాఁజూచు మహాలక్ష్మి తల్లిదక్క
లేరు నాకింక దిక్కెవ్వరు లేరుభువిని,
ప్రొద్దుపొడువఁగనేలేచి చద్దిగంజి
త్రాగి వెడలుదు గడ్డికై వేగిరమున
ప్రొద్దుగ్రుంకెడి తరికింత ప్రోగుజేసి
పట్టుకొనిపోయి దరినున్న పట్టులందు
అమ్ముకొని దానితో జీవనము సేతు,
బాధయనకుండ ఎండయు వానయనక,
గరికదెచ్చి యమ్మటయె నాగణనసుండి,
పడకనుండి బాబదిగో ! ఆగుడిసెయుందు
లేదు నాకింక కొఱతయేలేదు" అనియె—
ఏమి ! ఈయవ్వనిశ్చయంబేమి ! ఓహో !
ఈమె స్వేచ్ఛజీవనమేమి ! ఎంతఘనము !
ఏమి ! ముదుసలియైయుండి ఎంతపట్టు !-
లేదు లక్షలు గణియింపలేదు ఘనత
లేదు ఉద్యోగకాంక్షల లేదు ఘనత
లేదు ఇంద్రభోగాదుల లేదు ఘనత
లేదు వేయేల ? ఆశలలేదు ఘనత
పట్టుదలయును స్వేచ్ఛజీవనము గలిగి
తృప్తియునుగలిగి హర్షముగా దోగియుండి
ముగితహృదయుఁడునైయుండి, ముదుసలివలె
తల్లి మహాలక్ష్మి దయనమ్మి పల్లవించు
జీవనముగలవారిదే జీవితంబు ॥

# నా యుద్యోగప్రయత్నము

భాస్కరం

నేను నాతలిదండ్రులకు ఒక్కడనే కుమారుడను. మాతండ్రి బెజవాడయొద్దనున్న నొక కుగ్రామమున 'కంట్రాక్టరు' చేయుచు పూర్వార్జితమగు ఆస్తిలేకున్నను చేతనైనంతవరకు న్యాయమార్గమున ధనార్జనచేయుచు 'రామయ్య' గారంతవారు కావద్దాఅని అనిపించుకునేటట్లు జీవయాత్ర చేయుచుండేవారు. మేమున్నది కుగ్రామమైనందున పెద్దచదువునకు వీలులేదని నా మాతామహులును నా మేనమామ ఉద్యోగపు ఊరైన బందరు తీసుకునివెళ్ళి తగిన కట్టుదిట్టములలో నుంచి చదువుచెప్పించాడు. స్కూలు జీతపుఖర్చులు అవ్వ మానాన్న లేకపోతే మాతాతగారు పద్దుతూ ఉండేవారు. అప్పుడు నా సహాధ్యాయులలో నాకు మంచి పేరుండేది ప్రతితరగతిలోనూ యించుమించుగ మొదటివానిగనో రెండవవానిగనో పరీక్షలలో నెగ్గుతూఉండేవాణ్ణి. అప్పటి ఖులాసారోజులు తలుచుకుంటే ఇప్పుడు గుండె గుభేలుమని నేను జీవన్మృతుణ్ణాఅని నాదేహం తోస్తుంది. ఏఫోర్తుఫారమో చదువుతూవుండగా మాతల్లి పరలోకమునకేగినది. కాని మా మేనమామగారి ఆదరణవలన తల్లిదుఃఖమును మఱచి క్రమముగా స్కూలుఫైనలు పరీక్షలో నెగ్గాను. మా నాన్న ఏతాలూకాలోనో సిఫార్సులమీద ఉద్యోగమిప్పిస్తాను నాకు చేదోడు వాదోడుగా నుంటావని అన్నాడుగాని అప్పుడు నాకు బి. ఏ. కావలెనని యున్నందున పైచదువున కారంభించాను. 'ఇంటరు' పరీక్షలు ఇంకా పదిరోజులకు తెలుస్తవనగా మాతండ్రిగూడా జీవయాత్ర చాలించాడు. దానితో నాకు బి ఏ ఆశలన్నియును అడుగంటినవి. కాని బంధుశ్రేయోదాయకుండు నా మేనమామ తన కుమార్తెనిచ్చి బి ఏ, కూడ చెప్పిస్తానన్నాడుగాని మేనరికము, అప్పకూతుళ్ళను చేసికొనుటలో యిష్టములేనివారిలో నొకడ నగుటచేత నొప్పుబడలేదు. దానికి ఉచితజ్ఞుడగు మేనమామకూడ బదులుచెప్పలేదు.

ఇంతలో నాకు కొంతమంది దూరపుబంధువులలో ఒకాయన నా తెలివితేటల విషయము విన్నాడుగాబోలు — ఎవరో యిహా పిల్లనిస్తుంటారులెండి. నాకు కోఆపరేషను లేని ఆరోజులలో ఇంగ్లీషువిద్యయే జీవనాధారమని నమ్మి ఆరోజులలో అల్లుళ్ళకై స్కూళ్ళన్నియు వెదకుచూ 'మాస్కూలు రిజస్టరు' త్రిప్పి ఆరోజులలో నావిషయము ఏలనాపిల్లగల గృహస్థునకుండా వుంటారు - ఒకరోజున నా మాతామహులయింటికి ఇంకొకఆయనను వెంటబెట్టుకొని వచ్చి ఉభయ ఖర్చులుపెట్టి నాకు తనకూతురునిచ్చి పెండ్లిచేస్తాననియును, నేను సొమ్ము ఏమియును పెట్టనక్కరలేదనియును వివాహమైనది మొదలు స్వస్థగేడు ప్లీడరీ ప్యాసుఅయి పట్టాపుచ్చుకొనేవరకు తనదేపూచీ అనియు చెప్పి నాచేతను మాతాతగారిచేతను ఒప్పించాడు. ఎందువల్లనబ్బా ఆంధ్రప్రపంచమున వివాహము కావలసిన నిరుద్యోగి బాలురు ధనవంతులు మంచి తెలివితేటలు గలిగి ఆరితేరినవారు లేరా, ఈయన యిన్నివిధముల నాకై ప్రయత్నముచేయుట యెందుకని ఆ రాత్రి అల్లా నిద్రలేకుండా ఆలోచించాను. నాకుమాత్రము రెండు కారణాలు తోచాయి, కట్నాల

పిచ్చి పెరిగియున్న యీదినాలలో ఎఫ్ ఏ చదివే వరకు ఏ 1116 రో ఒకమారు జ్ఞాపకమురించండి కాదుగదా అందుమూలమున ఒక్కమార్కుగా యిచ్చుటకన్న మూడుమార్కులుగు సంవత్సరములు మీఁద యిచ్చుట తేలికగదా! వివాహాము తరువాత నీవార్తానములన్నియు హృదయక్షేత్రేషు ఏయిబ్బంది లేదుగదా!

వివాహాము అయినది. బి. ఏ చదువుట నిశ్చయింపబడ్డది. మామగారు ‘ఫిలాసఫీ’ తీసుకోమన్నారు. నేను “ఫిజిక్సు” తీసుకుంటానన్నాను. ఇదియే మా యిద్దరి కలహ నాటకమునకు నాకు తెలిసినంతవరకు ప్రథమాంకములోని ప్రథమరంగము. మామగారికి నాభేదాభిప్రాయము వినగానే కోపము వచ్చినది. ఆయనకు కోపం రావడానికి ప్రత్యేకపు కారణం అవసరం లేదు లేండి. తప్పుగాని ఒప్పుగాని పెద్దవాడు, అందులో మామగారును అన్నిటికన్న ముఖ్యముగా తనంతప్రయోజకుడు, నీకన్నిటికన్నను పైపెచ్చు విద్యాభ్యాసనార్థము తనపై ఆధారపడి తన మాటపట్టులలో వుండవలసిన నేను ఎదురుచెప్పితే విని సహించుట కష్టముగాదా! కాబట్టి వెంటనే ఆయన బి. ఏ. మొదట తప్పుతావు అని శపించాడు. ఇక ఈయనతో వాగ్వాదము లాభములేదని “ఫిలాసఫీ” తీసుకుంటానని విజయనగరం వెళ్ళి మహారాజావారి కళాశాలలో “ఫిజిక్సులో” ప్రవేశించాను. సంగతి తెలిసి కోపం పెచ్చుపెరిగి ఎట్లో అత్తగారి శ్రాద్ధము కోడలుపెట్టినట్లు డబ్బుపంపుతూ శాపనార్థాలతో ఉత్తరాలు ఓపికగా యింగ్లీషులో తనభాషాపాండిత్యమంతా కనపడేటట్లు వ్రాసేవాడు. దీని కంతా అంతరార్థము డబ్బు పంపకుండా వుండడానికి ప్రయత్నముగదా అని ఊహించి అప్పటికి జవాబు వ్రాయకుండా అప్పుడప్పుడు డబ్బు కోపము డిమాండ్లు తరువాత రిమైండర్లు పంపుతూ ఉండేవాణ్ణి. రెండేళ్లు గడచినవి. మార్చి పరీక్షలో ప్రథమ భాగమునందు నెగ్గాను. తరువాత సెప్టెంబరులో రెండవ భాగముకూడ ప్యాసయినాను. వెంటనే మామగారికి గుండెల్లో రాయిపడ్డది. ఇక విశ్వామిత్ర ఋణము వలె ఫస్టుగ్రేడునకు కావలసిన ఆరు ఏడు వందలలో తప్పవనుకున్నాడు గాబోలు! వెంటనే ఏవో “గిల్లి కజ్జాలు” ప్రారంభించాడు. అప్పుడప్పుడు జరిగిన కలహాములలో ఆయనకు నాపైగల low opinion కు గల కారణము లీక్రింద సుదహరింపబడినవని తెలుసుకొనుటకు సావకాశము కలిగినది.

1. తాను dear son-in-law తో ప్రారంభించి yours affectionately తో ముగించు మూడు వ్రాయు ఉత్తరముకు జవాబు నేను శ్రీయుత స్వాములగు చిన్నలు పెద్దల శుభాశీర్వచనము కాక్షించుచు నమస్కార పూర్వకముగ తెలుగున వ్రాయు విధమున వ్రాయుచుండుట.

2. వివాహాము కాగానే విద్యావంతుడు కొనిన పైని నలుగురు పెద్దమనుష్యులచేత నాకు మందలింపులుచేయించి తనకు డబ్బు ఖర్చు కాకుండా మాట దక్కించుకొనేటట్టు వీలుచేయక నేను బి. ఏ కూడ చదువుట

3. ఎఫ్ ఏ మూడుమార్కులు తప్పినను దరఖాస్తుపెట్టుకొనగానే రు 15-0-0 జీతము మీఁద సర్కారు ఉద్యోగము దొరుకుట (19 వ శతాబ్దాంతమునందు) నేను బి. ఏ ప్యాసు అయి ఎన్ని దరఖాస్తులు పెట్టుకొనినను నేను ఉద్యోగము సంపాదించుకొనలేక అప్రయోజకుణ్ణి

అయినందువల్ల.

4. తను సకల జాతీయోద్యమము లందును విముఖుడైనను నేను నాశక్తికొలది నియమముగ ఖద్దరు కట్టుకొనుట.

5. ఇతరుల శ్రేయస్సుచూచి ఓర్వలేక వ్యుత్పత్తి పెట్టి నారదావతారములగు తన ముఖ్యబంధువుల నొకరిద్దరిని నేను మాత్రమును గౌరవించక పోవుట.

ఎట్లాగైతేనేం ఫస్టుగ్రేడు చదువు వెనుక బడినది. వెంటనే నేను ఉద్యోగమునకై వెదుక వలసి వచ్చినది. సామాన్య సంసారిని అయినను అంతగా బాధించడం బాగుండదని నాకు తోచి ఏ కలెక్టరు ఆఫీసు గుమాస్తో ఏ స్కూలు మాష్టరో వెదుక ప్రయత్నములు చేస్తూ ఉందా మనుకున్నాను.

## 2

వెంటనే బందరు గుంటూరు కలెక్టరాఫీసులకు బాపట్ల మునసబ్ కోర్టుకు ధరఖాస్తులు వ్రాశాను. మామయ్యగారు వాటిని చూచి your honour, your honour's అని అనేకచోట్ల కలిపి మరల నాచేత తిరిగి వ్రాయించాడు. రిజిస్టరుచేసి పంపాను. ఎన్నిరోజులున్నను బాపట్ల కోర్టునుండి జవాబురాలేదు. బందరు గుంటూరు నుండి గుమస్తావ్రాతక్రింద కలెక్టరు దస్కతులతో "you have to produce a loyalty certificate from an officer not below the rank of a Tahasildar" అని ఆర్డర్లు వచ్చాయి. ఇంతలో మాయూరియొద్దనున్న నొక హైస్కూలులో Science assistant పదవి ఖాళీఅయినదని తెలిసి దానికి ధరఖాస్తు ఒక అర్ధరూపాయి కవరు పెట్టి 'స్టైపు' కొట్టించాను.

అప్పటికి యింకా సర్కారువారు బ్రాహ్మణేతర ప్రముఖులలోని రాజభక్తియొక్క లోతును కనిపెట్టలేదు. అందువలన ఎక్కడనో సకృత్తుగా గానితా ఆ బోర్డు లేనియును (చిన్నదస్కతా Initials) పెద్దదస్కతా అని కాగితములమీద దస్కతు పెట్టు సందర్భములయందు గుమాస్తా వలహాతీసుకొను ప్రెసిడెంట్లచే అలంకరింపబడ లేదు. ఇంకా బ్రాహ్మణ న్యాయవాదులే ఆ అధికారాలు చలాయిస్తున్నారు. నియోగి అయినప్పుడు వైదీకులు వణికిపోతున్నారు వైదీకి అయినప్పుడు నియోగులు హడలిపోతున్నారు ఇక అన్ని విషయములలోనూ ఉపజాతి మత్సరములు అవిచ్ఛిన్నముగా ప్రభుత్వము సాగించు కొనుచున్నది. ఈ హైస్కూలుకు పునాది యీ మత్సరమే అని తెలిసింది. కాని రక్షకుడు నాకున్నాడని మంచిరోజు చూచి,

"To
The Secretary
Through
The Head master

అని దరఖాస్తు తయారుచేసి రెండు బత్తాయి కాయలతో Head master గారి దర్శనమునకై వెళ్ళాను. లోపల నా వలెనే దరఖాస్తులతో సిద్ధముఅయినవారెవరును లేరని బయట గోడకు చేరగిలబడి కునికిపాట్లుపడుచున్న 'సాహెబు' ను అడిగి తెలిసికొని మెల్లగ లోపలికి వెళ్ళి నమస్కారపూర్వకముగా మొదలు ఫలములు తరువాత దరఖాస్తును ఆయనకు అందిచ్చాను. ఆయన నావాలకముచూడగానే గ్రహించి దరఖాస్తుకూడ విప్పకయే, మా భీమారావు మామయ్య అసహాయోద్యమములో పనిచేసి నందులకు జిల్లా మేజస్ట్రేటు ఆయనకు అందిచ్చిన నోటీసు వ్రాసియున్న ధోరణి జ్ఞప్తికి దెచ్చుకొనుచు ఏమండీ మీ Qualifications ఏమిటండీ అని యింగ్లీషులో సాధికారముగ ప్రశ్న వేసాడు.

అంత నాకు ఒప్పుమండి దరఖాస్తు చిత్తగించండీ అందామనుకుని కార్యవేది నైనందున మరల వెనుకకుతగ్గి లేనిపోని వినయము తెచ్చుకుని "నేను కొత్తగా బి ఏ మదరాసు విశ్వవిద్యాలయములో ప్యాసయినాను. నా అభిమాన శాస్త్రము (optionals) physics. స్కూలుకు నేను ప్రతివిద్యార్థిని. ఈ జిల్లావాణ్ణి- విజయనగరం మహారాజావారి కళాశాలలో చదివాను. నాపేరు యు. భాస్కరరావు' అని ఎంతఅడుచు ప్రయత్నము చేసినను దాగని గడుసుతనముతో జవాబుచెప్పాను. ఏమనుకున్నాడోగాని పాపము ఆయన నవ్వుచు "జీతము ఎంతకావలెననుకూరు." అని అన్నాడు.

నేను- ఇంతకుముందు పదవిలోనున్న రంగారావు గారికి రు 60 లు అని విన్నాను అంతకే నేనును ఇష్టపడుతాను......అది 12 నెలలు యిచ్చే ఆచారమనుకుంటాను.

ఈ చివరవాక్యము ఎందుకు అనవలసివచ్చిందో చెప్పుతాను వినండి. L.T లు అవసరమైన పదవులలో తప్ప మిగిలినవానియందు ప్రతియేడును ఏకొత్తబిఏనో తెచ్చి అవునర నైవేద్యముతో ఆసంవత్సరము కాలక్షేపముచేసి 9 నెలలే జీతమిచ్చి వేసంగిసెలవలకు ముందే వారికి 'పావుటావు' యిచ్చుట పరిపాటి అయింది. కొన్ని చోట్ల L.T. కై 80-4-100 అని ప్రకటించి వచ్చినవానికి ఏనూరు రూపాయలవరకోగాగానే ఏదో వంకబెట్టి అతనికి హస్తోదకములిచ్చి మరల L.T. కై 80-4-120 అని ప్రచురించుట యాచారమైయున్నది. ఇది అయినను ఏమేనల్లునికో ఏవడ్డకునికో ముందుగనే ఉద్యోగము యివ్వ నిశ్చయించి legality కోసము advertise చేయుట అయితున్నది.

హె. మా- ఇంకా మాస్కూలు 9 నెలల శేరములోపలికి దిగలేదులెండి. కాని మీరు రు 50 లకు ఒప్పుకోనిన సాగుంటుంది.

నేను:-కష్టసుఖములు తెలిసిన వారే యిట్లా అంటే ఎట్లాగండీ మీయిష్టము అని సన్నాయి నొక్కులతో యింగ్లీషులో జవాబుచెప్పాను. తరువాత ఆయనవద్ద సెలవుతీసికొని బయలుదేరి సెక్రిటరీగారివద్దకు వెళ్ళాను.

## 3

అస్థాలు సెక్రటరీ...విశ్వనాథశాస్త్రిగారు లోపరు సెకండరీప్లీడరైనను అధికారుల ప్రాపకము సంపాదించి మాతాలూకాబోర్డు ఉద్యోగములంకరించి యున్నారు. దానికితోడు స్థాలు సెక్రిటరీ. చుట్టుపట్టుల వైదికోద్యమమునకు బట్టుకొమ్మ. ఈయనకు ముందున్న నియోగి ప్రెసిడెంటు తనక్రిందనున్న వైదీకుల నందరిని అణగద్రొక్కాడను కోపమున తాను నియోగుల నందరిని నీళ్ళుకావళ్ళు మోసేటట్టు చేస్తానని భీష్మ ప్రతిజ్ఞచేశారు. ఈ మధ్య బ్రాహ్మణుల నందరిని గుడ్డపు బండ్లు తోలేటట్టుచేస్తానని చాణుక్య ప్రతిభాప్రభావమును జాటిన యొక బ్రాహ్మణేతర నాయక ప్రముఖుని వాక్యము లకు మూల మీశాస్త్రిగారి నియోగి నిరసనా వాక్యమేనని చాల మంది అనుకుంటారు.

సెక్రిటరీ గారికి నమస్కరించి నిలువ బడ్డాను. నేనింకా పెద్దవాణ్ణి కాకపోవుటచేతనో లేక ఖద్దరు బట్టలు ధరించి యుండుటచేతనో లేక తన యధికార స్వభావకారణమునో నన్ను కూర్చుండమని చెప్పకయే-తలనైన ఎత్తకుండా "ఎందుకు వచ్చావయ్యా" అని ప్రశ్నించి మరల జవాబున కెదురుచూడవలసిన అవుసరం లేదని తలంచుటచేతనో - ఒకవేళ నాజవాబు

మామూలురీతిని నాయుడిగారిని దర్శించి నిలుచబడ్డాను. నాయుడుగారు నావాలకము చూడగానే కనుబొమలు ముడివైచి నన్ను రూక్షవీక్షణముల తిలకించి "ఎందుకువచ్చావయ్యా" అనునట్లు కనుబొమలు ఎగురవైచెను నేను మామూలుప్రకారము ఒప్పచెప్పాను.

నా:- సెక్రిటరీని చూచారా ?

నే:- ఇంకాలేదు.- అని అబద్ధముచెప్పాను.

నా:- 'ఎందువలన' అని సహర్షముగ ప్రశ్నించాడు.

నే:- ముందు తమరినిదర్శించి తరువాత అంతగా అవుసరమైతే ఆయనను చూద్దామనుకున్నాను.

నాయుడుగారి మొగము ముడివీడినది.

నా: మీకు తప్పకుండా సాయముచేస్తాను లెండి అన్నాడు.



తరువాత Committee Membersను Exofficio President కోర్టు మునసబ్‌గారిని దొరసామి అయ్యంగారిని కూడ దర్శించి నా వాంఛితమును దెలియపరచితిని. ఈయన నెల్లూరు పురవాసి. ఈయన యొక్కడే నాకు కొంచెము ఆశచూపించినది.

## 4

జూన్ 25 వ తేదీ రాత్రి ఏడుగంటలమొదలు 10 గంటలవరకును కమిటీ మీటింగు జరిగినది. కార్యక్రమపు వరుసలో ముఖ్యమైనవి మెంబరు లగుట కెవ్వరర్హులు అనినిర్ణయించుట, రెండవది Physics assistant post లో తగినవానిని నియమించుట, కుప్పయ్యశ్రేష్ఠిగారు లేచి "ఈస్కూలుస్థాపింపబడినప్పుడు అనగా నేటికి 25 సం. వత్సరములక్రిందట వాగ్దానముచేసిన ప్రకారము రు 500 ల విరాళము ఈ నెలాఖరులోగా యిచ్చినవారే మెంబర్లగానుండ నర్హులు. అట్లు యియ్యనివారి సభ్యత్వము automatic గా జులై ఒకటవ తేదీనుండియును పోతుంది" అను తీర్మానమును పెట్టెను. ప్రస్తుతము చేయునదిలేక ఎల్లరును దానిని అంగీకరించిరి. తరువాత హెడ్మాష్టరుగారిని పిలచి దరఖాస్తులు తీయమనిరి. అవి మొత్తము 12. అందులో 3 విశాఖపట్టణం 1 గంజాము 2 గోదావరి 2 గుంటూరు 2 మద్రాసు 1 నెల్లూరు జిల్లాలనుండియును ఆజిల్లానుండి నాదియొక్కటి మాత్రమే వచ్చినవి. ప్రెసిడెంటుగారు నెల్లూరునుండి వచ్చినవానికి సిఫార్సుచేసిరి. కాని నా అదృష్టవశమున అందరును తదితరజిల్లాలనుండి వచ్చిన దరఖాస్తుల త్రోసివేసి ఆజిల్లాదియైన నా దరఖాస్తుతీసి స్వ 'జిల్లా'భిమానమును జాటిరి. నాదరఖాస్తు చదివినమీదట యీక్రిందిచర్చ జరిగినది.

శె:- ఇతను raw graduate కాన ఏమి చెప్పతాడో రేపు క్లాసుయిచ్చి teach చేయించి బాగావుంటే appointment order యిద్దాము' అని నియోగినగు నామీద హేయభావమును వెల్లడి చేశాడు.

వెంటనే బ్రాహ్మణుడు చెప్పిన దానికి వ్యతిరేకముగ చెప్పటయే వ్రతముగాగల మేకయ్యనాయుడుగారు నాపైని యభిమానమును పురస్కరించుకొని "ఇట్టి విషమపరీక్ష ఈమురదృష్టుడగు నీ దరఖాస్తుదారుని కేనా అందరికిని అంతేనా ?" అని ఎత్తిపొడిచాడు.

ఎట్లాగైతే నాకుద్యోగము యిచ్చుటకు స్థిరపరిచారు. ఇక జీతము నిర్ణయము కావలసివచ్చింది.

ఖాన్‌సాహేబు:- ఈదరఖాస్తుదారు ఈజిల్లా

వాడే కాన నెలకు రు 50 లకు వస్తాడు

కుప్పయ్యశెట్టి:- మేస్టరీ అన 360 రోజులలో ఏ 180 రోజులలో పని. అది అయినా రోజుకు 8 గంటలచొప్పున ఏ 600 గంటలలో అవుతుంది. ఆచొప్పున గంటకు ఒక రూపాయి చొప్పున అయిన రు 600 లకు నెల 1 కి రు 50 చొ॥ పడ్డై. కాబట్టి రు 50 లు చాలు అని నేను ప్రతిపాదిస్తున్నాను.

ప్రెసిడెంటు:- అది ఎంతమాత్రము బాగుండ లేదు. అత నొకవేళ కక్కుర్తిపడినను స్కూలు prestige కి లోపము. అదిగాక రాత్రి 8 గంట లవరకూ బి. ఏ క్లాసులో Electric light ముందర కండ్లుపోయేటట్టు Laboratory Experiment చేసే కష్టము మీాకేం తెలుస్తుంది.

చివరకు ప్రెసిడెంటుగారి మాటే నెగ్గింది. ఉద్యోగము రు 60 లపై యియ్యా నిశ్చయింప బడినది. మరునాడు జులై 1 వ తేదీ మొదలు జూన్ 30 వ తేదీ ఆఖరువరకు నెలకు రు 60 ల జీతముపై మేష్టరుద్యోగము తమ స్కూలులో యిచ్చినట్లు —— ఆటవిడుపువాడు నామేనల్లుడు పలకచుట్టును కాయిరాయితో పెట్టుకొను గొలుసు పూజవలెనున్న దస్తూరితో వ్రాయ బడిన appointment order నాకొందిచ్చిరి.

---

## అప్పుడు

ఈశ్వర

**1**

అపరిచితురాలు - ఎవరోయిల్లాలు - నాకు
నడుగరానియేదో ప్రియురాలు !...
ఆమె
నన్ను గ్రిగంటజూచిన నగ్నహృదయ
భావ రాగమ్ములోని రహఃవిలాస
రేఖ లింతింతలై మహాలోకములను
దాటి, నాకమ్ములనుదాటి, దాట
రాని చీకటులుదాటి, తారకాశ్రేణిదాటి,
గగనవానంత పులకితానంతగతుల
నమృతరోచులు నర్తించునపుడు
అపుడు
ఆవిమలప్రేమ - ఆవివిక్తాలయమున
నిలుకడలేని గుండెలో నిలుచునొక్క
నేనెవండను ?
కన్నెత్తలేన, విడవ
లేను కన్నీరు; నిట్టూర్పునైనలేను !

**2**

ఆమె కన్నెత్తి ననుజూచినపుడు-
అనంత
జలధరశ్యామమాలికా పులకితస్మి
తైన గీతమ్ములెన్ని రోదోఽంతరమున
మ్రోగి మార్మ్రోగినవియో ?
తమోనిబద్ధ
మపుడు విశ్వమ్ము జీవనాంత్యమ్మునుండి
యులికిపడిపోయి, యట్టెనిట్టూర్చి, యేమి
పలువరించెనో ?
బధిరవిభ్రమమునుండి
జరిగిపోవు నాప్రణయినీ స్వానుహృదయ
నిశ్శ్వసనమట్లు: కన్నెకన్నీటిఛాయ
తెరలుకొని తేరుకొని మెల్లజరిగిపోవు
కలికిలేనవ్వునుసివలే, గాలివడల
గదలిపోయె నెదోక్షణిక ప్రశాంతి !
ఆమె కన్నెత్తి ననుజూచినపుడు- అపుడు.

# వీరమాతలు

సింగంపల్లి వెంకటాద్రిగారు

భరతమాత గర్భమున నిర్వక్రపరాక్రమ శీలురగు నారీమణు లెందరో జననమొందిరి. వీరి చరిత్రములు నవరత్నములతో సువర్ణ పత్రములపై లిఖింపదగి యున్నవి. వీరి నామములు చేష్టలు చిరస్మరణీయములు. స్త్రీలు అబలలనుట అవివేకము. వీర వనితామణులలో కొందఱి చరిత్రములు పాఠక మహాశయుల కెఱింగించెద

## 1. దుర్గావతి.

పదునాఱవ శతాబ్ద మధ్యమున నర్మదా నదీతీరమున నొక హిందూ రాజ్యమును దుర్గావతి అను నారీమణి పాలించుచుండెను. 1564 వ సంవత్సరమున మొగలులు ఆమె రాజ్యమును ముట్టడించిరి. ఆప్రభ్వీణి ధైర్య మవలంభించి సర్వ సైన్యముల సమకూర్చి స్వీయాధిపత్యమున శత్రువులతో సమర మొనర్ప సాహసించెను. ఎంతకాలమో తీవ్రముగ ప్రతిఘటించెను కాని దురదృష్టవశమున నామె కంటికి తీవ్రమగు గాయము తగులుటచే రణరంగము నుండి మరలుట తటస్థించెను. తోడనే సైన్యములును పాఱిపోసాగెను. శత్రువు లామెను వెంటాడజొచ్చిరి. దుర్గావతీ సంగతి కనుగొని మాన రక్షణార్థమై మావటి వాని చేతనున్న అంకుశము గైకొని యద్దానితో ప్రాణత్యాగ మొనర్చెను. బోటికి మానము ప్రాణము అనునది సత్యోక్తియే.

## 2. చంద్ సుల్తానా.

మొగల్ ప్రభువులు అహమ్మద్ నగరమును 1595 వ సంవత్సరమున ముట్టడించిరి. ఆసమయముననే రాజ్యము చిందరవందరగా నుండెను ఐనను చంద్ సుల్తానా తన చాకచక్యములవలన రాజ్యమునఁగల చిక్కుల నన్నిటిని చక్కబెట్టుకొని సైన్యముల ప్రోగుచేసి మొగలులతో డీకొనజాలెను. రాజ ప్రాసాదమునుండి రణరంగము నందలి పరిస్థితుల జాగరూకతతో కనుగొనుచు వచ్చెను. కొంతవడికి తన సైనికులు ఓడిపోవుటజూచి అపజయమున కోర్వలేక కవచమును దాల్చి కరవాలమునుబూని పగతురపై కొదమసింగము వలెనుఱికి అత్యంతసాహసముతో పోరాడ జొచ్చెను. నిజసైన్యముల పరిపరి విధముల ప్రోత్సహించెను. యుద్ధము చాలా కాలము జరిగెను కాని కొంత కాలమునకు ఫిరంగులు ప్రేల్చుటకై సాధారణముగా యుపయోగించు సీసపుగుండ్లు నిశ్శేషమైపోయెను. అంతట చేయునదిలేక కోశాగారమునన్న వెండి బంగారు నాణెముల కరగించి గోళముల తయారుచేయించి ప్రయోగించెనట. అవియును కొంతకాలమునకు చాలకుండుటచే తన శరీరముపైనున్న సర్వాభరణముల వినియోగించి యుద్ధము కొనసాగించెను. విశేషకాలము పోరు జరుగుటచే మొగలుల సైన్యములును సన్నగిలుట సంభవించెను. అంతట సంధిపొసగెను. రాజ్యము శత్రుస్వాధీనము కాకుండ కాపాడి సత్కీర్తినొందెను.

## 3 నూర్జహాన్.

నూర్జహాన్ అను పదమునకు జగజ్జ్యోతి అని యర్థము చెప్పవచ్చును. ఈమె జహాంగీరు పట్టమహిషి. జహాంగీరుతో బాటు యీమె నామమును నాణెములపై ముద్రింపబడుచుండెను. జహాంగీరు దుర్వ్యసనలోలుడు. ఆ కారణమున నూర్జహాన్ రాజ్యతంత్రము నడపుచువచ్చెను. ఆమె భర్త 1620 సంవత్సరమున మహాబత్ ఖా నను వానిచే యోడింపబడి ఖైదీగ చేయబడెను. అపుడు నూర్జహాన్ పురుషవేషముదాల్చి అశ్వారోహణ మొనర్చి శత్రు శిబిరమున జొచ్చి ప్రాణనాథుని బంధవిముక్తునిగ జేయ సాహసించెను ఆమె ధనుర్బాణముల చేబూని వీరమాతవలె విజృంభించి సైనికుల ప్రోత్సహించుచు ఘోరముగ యుద్ధమొనర్చెను ఇట్లు యుద్ధము జరుగుచుండగా ఒకానొక దినమున ఆమెయధిష్టించిన మదగజము యమునానదీ ప్రవాహమున బడి మృతినొందుట తటస్థించెను. ఆమెయు ప్రమాదస్థితియందుండెను. భటులిది గురుతెఱింగి ఆమెను రక్షింపజూచిరి. ఆమె యెట్టి భయ సంశయములు లేక వామాంకముపై నాశీనుడైయున్న దౌహిత్రు శరీరమున గ్రుచ్చుకొనిన బాణమును నెమ్మదిగ తీసివేయుచుండెను. భగవదనుగ్రహమున వీరిరువురును తీరమును చేరగల్గిరి. అంతటితో యూరకొనక ధైర్య సాహసములబూని సైన్యముల బలపఱచి మహాబత్ ఖాను నోడించి ప్రాణనాథుని బంధవిముక్తునిగ జేసి కృతకృత్యురాలయ్యెను.

## 4. కృష్ణాకుమారి.

కృష్ణకుమారి రాజపుత్ర స్త్రీ. ఉదయపురాధీశ్వరుని కొమరిత జగన్మోహిని. ఈమెను చేబట్టుటకు యెందఱో రాజకుమారులు యత్నించి విఫలులైరి. కొందరు రాకొమరులు యొండొరులతో యుద్ధము లొనర్చి మృత్యువాత

బడిరి. వేయేల, రాజపుత్రస్థానమంతయు సంక్షోభమునకు గురియాయెను. ఈ కామాగ్నిని చల్లార్చుటకు తండ్రియగు రాణా సర్వశక్తుల వినియోగించెను. కాని ప్రయోజనము శూన్యము. తుదకీ సంక్షోభమునకు కారణభూతయైన కృష్ణకుమారిని సంహరింప నిశ్చయించుకొనెను. ఈ దారుణకృత్యము నిర్వర్తించుటకై విశ్వాసపాత్రులగు కొందరు రాజభటులు నియోగింపబడిరి. రాజాజ్ఞ అనుల్లంఘనీయముగదా! ఖడ్గధారులగు భటులు కుమారి ముఖపద్మమును వీక్షించుటతోడనే పశ్చాత్తాపహృదయులై చంప చేతులాడక కన్నీరు కార్చుచు తిరిగి పోవుచు వచ్చిరి. పాపము వారందఱు రాజదండనమునకు పాత్రులైరి. తుదకామె సోదరియగు చంద్‌భాయి ప్రోత్సహింపబడెను. చంద్‌భాయ్ కృష్ణకుమారికడకేగి విషపూరితమగు నొక సువర్ణపాత్రము నొసంగి ఉదయపుర రాజ్యరమా రక్షణార్థమై ప్రాణములు త్యజించుట భావ్యమని బోధించెను. పాపము! షోడశవర్షప్రాయురాలగు నాపూర్ణేందువదన పాత్రము చేబూని కొంతవడి భగవన్నామ సంకీర్తనమొనర్చి "ఓ పాత్రమా నావయోరూపశీలములు నీకు సమర్పించుచున్నదాన" అని పలుకుచు నెట్టి కొంకు జంకులులేక నా పరమసాధ్వి విషముగ్రోలి ప్రాణముల పరిత్యజించెను. లోకములో సుందరులై పుట్టుటయు గొప్ప తప్పిదము కాబోలు? తల్లీ! కుమారీ నీజీవితము ధన్యతమము. నీనామము ప్రాతఃస్మరణీయము! ఈవిషాదాంత నాటకము పందొమ్మిదవ శతాబ్దారంభమున జరిగియుండెను.

### 5. తులసీభాయ్.

పదునెనిమిదవ శతాబ్దమునను పందొమ్మిదవ శతాబ్దమునను పిండారీలనువారు దేశమంతటిని కొల్లగొట్టుచు వచ్చిరి. పిండారీలు తమ స్త్రీశిశువులతో గుఱ్ఱములపైనను ఒంటెలపైనను వచ్చి గుంపులు గుంపులుగ బయలుదేరి దండయాత్రలు సాగించెడివారు. 1817 వ సంవత్సరమున మహీద్‌పురప్రాంతమును కొల్లగొట్టసాగిరి. మహీద్‌పురాధీశ్వరియగు తులసీబాయ్ భద్రగజముపై నధిరోహించి శత్రువుల చెండాడుచు తనధైర్యస్థైర్యములు వివిధములు ప్రకటించుచువచ్చెను. దురదృష్టవశమున ఆమె యధిష్ఠించిన గజేంద్రమునకు ప్రబలమగు గాయము తగులుటచే నది బెదరి ఘీంకారమొనర్చుచు స్వాధీనమునకు రాక సఱుగిడజొచ్చెను. ఆసంధిగ్ధావస్థయందు శూపమొక బాణము వక్షస్థలమున నాటుటచే వీరస్వర్గము ప్రవేశింప తటస్థించెను. ఈమె యుద్ధము చేయుచున్నంతవఱకు పంచశరద్వయస్కుడగు బాలుడొకడు ఆమె వామాంకముపై నాసీనుడై యుండెనని ప్రతీతి. అతడామె దత్తపుత్రుడట! పిల్లలనిన తల్లులకెంతటి ప్రేమ! ఆదత్తపుత్రుని సోదరియగు భీమాభాయ్ వింశద్వత్సరియగు వీరకాంత. ఆమెయు రణరంగమున ఉత్తమాశ్వము నధిరోహించి కరవాలము బూని మహిషాసురమర్దనివలె విజృంభించి కిరాతులగు నాపిండారీలను తుత్తునియలుగావించి చిన్నితమ్ముని రాజ్యమును రక్షింపగల్గెనట!— ఏమి: భీమాభాయ్ సాహసవిక్రమములు?

### 6. సుల్తానారిజయా

ఈమె ఢిల్లీసామ్రాజ్యమును 1236-1239 వఱకు పాలించెను ఈమె పరిపాలన మత్యంత శ్లాఘ్యముగనుండెనని ప్రసిద్ధి నిత్యము రాజచిహ్నములు ధరించి సింహాసనాసీనయై సకలకార్యములు నిర్వర్తించుచు వచ్చెను. ఈమె సామంతప్రభువుల నాహ్వానించి వారితో స్వయముగ రాజ్యాంగ విషయముల గుఱించి సంప్రదించుచుండెడిది కొంతకాలమునకామెకును సర్దారులకును వైమనస్యములు కలిగెను సర్దారులామెపై యుద్ధమునకు సారసిల్లిరి. ఆమెయు విజృంభించి పోరాడి పరాజితుల చేయుచు వచ్చెను. కాని ఒకపర్యాయము ప్రాణముల గోల్పోవవలసివచ్చెను. స్త్రీలు పురుషులకు తెలివితేటలయందేమి, సాహసవిక్రమములయందేమి ఎంతమాత్రము తీసిపోజాలరు

### మృత్యువు.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు.

గీ॥ అర్ధరాత్రమైనది; కాలుఁ డంధకార
రూపమవగుంఠనముఁగప్పె; రోదసివయి
నదిగో! గణగణమ్రోగుచున్నదియు గంట
నాకుఁ బయలురాక వేళయైనయది యపుడె!
ప్రభువు శాసనమది దాటరానిదగుట

నేనుబోవక తప్పదు; కాని నన్ను
వెళ్ళవలదని యడ్డగించి తలలు [లూని
మోదుకొనియేడ్చుచు నుబిక్క మొగము
చూచుచున్నట్టి మావారిఁ జూచినపుడు
లిలోపలఁ జిఱునవ్వు జాలువాఱు.

# వివిధవిషయములు



## ఒక సంఘం.

బర్లిన్‌లో బొందుమనుష్యుల సంఘముకలదు. అందులో అయిదుగురు ఒక్కొక్కరు 2240 పౌనుల బరువుందురట. ఇందులో సభ్యుడుగా చేరదలచిన వాడధమము 300 పౌనులైన బరువుండవలెనట.

## ఇండియా ఆఫీసు.

ఇండియా హైకమిషనరుగారగు సర్ అతుల ఛటర్జీగారు శిల్ప శాస్త్రజ్ఞుడగు సర్ హార్బర్టు బేకరు గారితో ఇండియా కౌన్సిలు భవనము నిర్మాణమును గురించి ఆలోచించుచున్నారు. లండనులో ఇండియా ఆఫీసుగలదు. ఈఆఫీసు కొరకు ఇండియా ధనమునుండి 50 లక్షలుఖర్చుపెట్టి ఆరు లేక తొమ్మిది అంతస్థుల బిల్డింగును కట్టనున్నారు. లోపలి కొయ్యసామగ్రికి హైందవ సాంప్రదాయమును, సౌధముయొక్క బాహ్య స్వరూపమునకు ఆంగ్ల సాంప్రదాయము నేర్పరచిరట! పైకి ఆంగ్లసాంప్రదాయము లేని యెడల తక్కిన సౌధముల ముందిది దిగదుడుపుగనుండునట!! హిందు దేశపు డబ్బు పాశ్చాత్య దేశమునకు చేరుట కిదియొక మిష!!!

## సీసా.

ఆఫ్రికాకు 750 మైళ్ళ దూరమున ప్రయాణముచేయుచున్న ఒక ఓడనుండి ఒకసీసాను పారవేసిరి. ఈసీసా ప్రయాణముచేసి చేసి చిలీతీరము చేరెను. చిలీ అమెరికాలోనిది. పారవేసిన మూడేండ్లకు చిలీ తీరమున కనబడినదట! మొత్తమున 9000 మైళ్ళ ప్రయాణము చేసినది.

## భాగ్యవంతము.

ప్రపంచములోనికెల్ల న్యూయార్కులోని పార్కువీధి భాగ్యవంతమైనది. ఈవీధిలో 4000 కుటుంబములు నివసించుచున్నవి. ఒక్కొక్క కుటుంబమునకు సాలుసరి ఆదాయము లక్షయేబది వేలు మొదలు 3కోట్లరూపాయలవరకు కలదట.

అమెరికాలో న్యూయార్కునందు 110 అంతస్తుల మేడ నొకదానిని కట్ట ప్లానులు తయారు చేసి యున్నారు. దీనినే లార్కిన్‌టవర్ అని పిలతురట. నేలమీదనుంచి 1208 అడుగుల యెత్తు. అచటనే వూల్‌వర్తు బిల్డింగు కలదు. దీని అంతస్తులు 60. ఈబిల్డింగుపైన లార్కిన్ టవర్ 416 అడుగుల యెత్తుండును. 80 లక్షల యిటుకలతో నీసౌధమును కట్టుదురట. దీని క్రింద నలభై వేల టన్నుల ఉక్కు కావలెనట. యీఉక్కును తెచ్చుటకు 22 మైళ్ళ పొడుగు గల రైలుబండి కావలెను. 50,000 చదరపు అడుగుల స్థలములో నీ భవనము నిర్మింపబడును.

## గురుగోవిందు.

గురు గోవిందసింగు శిక్కుమతస్థులకు గురువు, ఒకనాడు గాడిదను కొనివచ్చి సింహపుమాదిరి వేషము వేయించెను. అంతట నాగాడిదె తన

మామూలు అరుపు అరువసాగెను చూచు చున్న శిక్కులందరు నవ్వుచుండిరి. వీరందరు దీనికి గారణమూరసిరి. అంతట గురు గోవింద సింగిట్లు ప్రత్యుత్తరమొసగెను. "మీ పేర్లకు సింగ్ అనుపదము తగిలించుకొని పిరికి పందలై సంచరించుచో, మీరును గాడిదెవలెనే సంచరించిన వారగుదురు." అందరును సిగ్గుపడిరి. ఈ విధముగ నుపమానములతో సచ్చురీతిని బోధించుటచే, శిక్కుమతము ప్రజలలో త్వరిత గతిని వ్యాపించగలిగెను.

రంధ్రాన్వేషణము.

ఇతరుల యందొకరు చూచునవి తప్పులు. అందుకనే రంధ్రాన్వేషణము ప్రతివారికి నాశకమైనది. నాగరికులగు స్త్రీ పురుషులు కూడ సిగ్గును విడచి తప్పులు వెదకుచుదురు. వీరిని కాదనువారులేరు. అహంభావపూరితులగు గొప్పవారి నవ్వు విషపూరితము, హాసికుడు, హేళనచేయువాడు, ఉపమానములతో వెక్కిరించువాడు, వీరందరును స్త్రీ పురుషుల లోపాలోపముల నాధారపరచుకొని కాలము గడుపుచుందురు. సొమ్ముకూడ వెచ్చించి వీరి పరిహాసములను జూచుచుందుము. అనగా మన వంటి వాని గురించి వీరు వెక్కిరించుచున్నప్పుడు మనము వినగోరుదుము. అనగా మనలను మనము డబ్బిచ్చి వెక్కిరింపచేసికొనుచున్నాము. వ్యక్తి వైషమ్యములు, అసూయల నీవిధముగ పెంచుకొనుచున్నాము.

సూర్యచంద్రులు తమలో మచ్చలు లేని యెడల వారు సూర్యచంద్రులు కానే కారు. నిజముగ మానవులు తమ తప్పులవలన గొప్పవారగుటలేదు. తప్పులున్నప్పటికిని గొప్పవారగుచున్నారు. పేకింగులేని దేహ్యెబొమ్మపూర్తి కాదు. మానవునకు లోపము సహజము. లోపము లేకపోవుటయే గొప్పలోపము.

---

## విషాదము.

మల్లాది చంద్రశేఖరరావుగారు బి. ఏ., బి. ఎల్.

మానినీలోకమం దభిమాననంచు
పడతులందరిలోన రూపసినటంచు
వసుధ మహనీయ సౌభాగ్యవతినటంచు
మగని కూరిమిగల్గిన మగువననుచు
నింతకాలంబు జాల గర్వించియుంటి

♦ ♦ ♦

పారిజాతంబు దెచ్చిన ప్రాణవిభుని,
కొమరుమీరంగ గొర్కెలం గూర్చువాని
నెపుడు నాయింటనుండు శ్రీకృష్ణునకట;
చనటినై యిట్లు దానంబు జేసియుంటి;
నేడు భామగాపాడ నెవ్వాడులేడె!

♦ ♦ ♦

వెలది పుట్టినదినమని పిలువవచ్చి
పతిని తనయింటికొకసారి బంపుమనుచు
వేయివిధముల నన్నెంతొ వేడినపుడు
నిముసమాత్రంబు మూరాడ నేరనైతి
నకట! రుక్మిణినేమని యడుగబోదు.

♦ ♦ ♦

మాయలోబడిపోతి నేమాటలేక;
భర్తృదానంబు జేసెడి పడతికలదె!
గగనకుసుమంబుగాదె సౌఖ్యంబునేడు!
వసుధ సర్వంబుగల్గిన ఫలము జేమి?
విభుడు లేనట్టి లోకంబు వెలది కేల?

(సత్యభామ.)

# మీ ఋణము తీర్చుకొన్నా.

వారణాసి వరదేశిగారు.

1

రామారావుపంతులు జిల్లామునసబుగుంటూరులో. భాస్కరం ఈయనకూతురు. వయస్సు పదమూడేళ్ళు. ఆమెది చాల దురదృష్ట జాతకం. పెళ్లి అయిన ఏడాదిలోనే భర్త పోయినాడు. ఆదరించి కనిపెట్టేతల్లికూడా కడ తేరింది. కళత్రవియోగము కూతురి వైధవ్యవేదన మునసబుగారిని రాచపుళ్ళవలె వేధిస్తూ వున్నవి.

విచారమగ్నమైన ఆమెమనస్సునకు కొంత సావకాశంకలిగించడానికి భాస్కరమ్మనుపంతులుగారు బాలికోన్నత పాఠశాలకు పంపించేవారు. భాస్కరమ్మయు శ్రద్ధతో చదువుకుంటూ ప్రస్తుతం లోవరుశెకండరీలో ప్రవేశించి ది. పాఠశాలలోని ఉపాధ్యాయినులందఱు "ఇంత చక్కని తెలివైన పిల్లపై భగవానుడెంత చిన్న చూపు చూచాడో" అని విచారించేవారు.

భాస్కరం ప్రతిరోజూ తండ్రిగారి గుఱ్ఱపు బండిలో పాఠశాలకు వెళ్ళేటప్పుడు కొందెకారులు సైకిళ్ళమీదకూడా వెళ్ళి ఆమెనేత్రాలు తమ వైపు మరలించుకోవడానికి ప్రయత్నించేవారు. భాస్కరంమాత్రము వాళ్ళని చూడకుండా తన ధ్యానంమీదనే యుండేది. కొన్నాళ్ళకు ఉత్తరాలుకూడా వ్రాయుటకు ప్రారంభించారు. ప్రవర్తనమున అగ్నిశిఖ అనదగిన భాస్కరమును ఆ ఉత్తరాలేమీ పెడమార్గమున పెట్ట లేకపోయాయి.

2

వాసుదేవరావు గుంటూరుకళాశాలలో ఇంటర్మీడియేటు చదువుచున్నాడు. చేతెత్తుమనిషి. స్ఫురద్రూపి. వయస్సు పంధొమ్మిది సంవత్సరములకన్న హెచ్చుండదు. తోడివిద్యార్థు లీతని మేధాసంపత్తిని వేవిధములు కొనియాడేవారు. పరోపకారమంటే ప్రాణం.

అది శుక్రవారం ఉదయంనుంచీ ముసురు పట్టుకుంది. పదవగంట సమీపించడంవల్ల వాసుదేవరావు అప్పుడే యిస్త్రీమడతలు కట్టుకొని పువ్వులరంగడులాగ చురుగ్గానడుస్తూ బడికి పోతున్నాడు.

ఇంతలో భాస్కరం ఎక్కినబండి ఆదారినే వస్తూంది. గుఱ్ఱము వేగముగా నడవడంవల్ల బురద తన బట్టలుమీద పడునని యాతడొక ప్రక్కకు తప్పుకొన్నాడు. అదేమిగ్రహచార మోకాని పరుగిడుచున్న గుఱ్ఱము కాలుజారి ముందుకి ఒరిగింది. ఈ యవస్థలో ఏనాటిదోకాని సీలవిరిగిపోయింది. బండి ఒకప్రక్కకి పడింది. బండిలోనున్న భాస్కరం రోడ్డుమీద పడింది. పడడంలో సరిగా రాళ్ల మీద పడడంచేత ముఖాన్ని గాయంతగిలి నెత్తురుకారడం ప్రారంభించింది. వాసుదేవరావు భాస్కరాన్ని యీలోపుననే రక్షిద్దామనుకున్నాడు గాని ఆకంగారులో తానుకూడ పడిపోయేడు. తక్షణములేచి స్పృహతప్పిన యీ పిల్లను తనయొడిలో కూర్చోపెట్టుకుని తనజేబురుమాలుతో గాయాన్ని తుడుస్తూ రక్తప్రవాహాన్ని ఆపేడు. ఈలోపుగా నాదారిని బోవుచున్న తనస్నేహితు నొకనిని పంతులుగారిని తీసికొని రమ్మనమని పంపివేసాడు వాసు. ఒకబండిని తెచ్చి డాక్టరుగారింటికి తీసికొని పోయాడు. ఈ కథంతా జరిగేటప్పటికి భాస్కరానికి మెల్లగా తెలివొచ్చింది. మొదట వాసుదేవరావునే

చూచింది. ఎందుచేతనో కాని కళ్ళుమూసుకొంది. తరువాత అందర్నీచూచి మళ్ళీ కళ్ళు మూసుకొంది. ఆమెను ధైర్యంగా ఉండమని సౌజ్ఞచేసేడు. భాస్కరం తనస్థితిని జ్ఞప్తికితెచ్చుకొని, వాసుచేసిన సహాయానికి కృతజ్ఞురాలనని సూచనగా కనపడుస్తూ ఒక్క నమస్కారంచేసింది. డాక్టరు ఆమె గాయానికి మెల్లగా కట్టుకట్టేడు. భాస్కరం నెమ్మదిగా లేచి కూర్చుంది. ఇద్దరిబట్టలు బురదయ్యేయి. ఛటాలున ఆమె వాసు మోచేతినుండి రక్తము కారుటను చూచి తన చీరెతో నెమ్మదిగా తుడిచింది. డాక్టరు వాసుకుకూడ కట్టుకట్టేడు.

ఇంతలో పంతులుగారు జట్కామీద వచ్చేరు తండ్రిని చూడడంతోనే భాస్కరానికి కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. మునసబుగారు కూతుర్ని దగ్గరకు తీసుకొని, వాసుని శ్లాఘించేరు. ఆయన పాడైన బండిని ఇంటికి జేరవెయ్యడానికి ఏర్పాటు గావించి, వాసునికూడా బండిలో రమ్మన్నారు. పంతులుగారు కోరడంచే వాసు ఆయనమాట తీసివెయ్యలేకపోయేడు. బండినడవడం ప్రారంభించింది. కూడా వున్న విద్యార్థులలో కొందరు గాళ్ళు, వాసుదేవరావుకి భాస్కరంతో కలిగిన సహచర్యానికి కళ్ళల్లో కారం చల్లుకున్నారు. ఆమధ్యాహ్నం వాసు బడిలోనికిరాగానే అందరూ షేక్‌హ్యాండు లిచ్చేరు. ప్రిన్సిపాలుగారు కూడ వాసు నభినందించేరు.

3

సాయంత్రం ఐదుగంటలయింది. వాసుదేవరావు టెన్నిసు ఆడుతున్నాడు. ఆసమయంలో పెద్దగోల, కేకలు వినబడ్డాయి. అందరూ అటునిటు "ఏమిటా ?" అని చూచారు. సమీపంలోవున్న తాటాకుకొంపలంటుకున్నాయి తక్షణం వాసు తనబ్యాటు నచట పడవైచి పరిగెత్తేడు. "ఈకోజున ఏపిల్లని ఒడిలో కూర్చోపెట్టుకుంటాడో" అని చెంతనున్నవారు కొందరు పరిహసించారు.

వాసుదేవరావు ఇళ్ళుకాలే ప్రదేశానికి వెళ్ళి, మంటకు సమీపంలోనున్న తాటాకుకొంపల ఆకులు లాగివేయడం ప్రారంభించేడు. ఇదివరకే గడకర్రలవలె నిలుచున్న పెద్దమనుష్యులందరూ వారికి సాయంచేసేరు. ఆహడావిడిలో వాసుచెయ్యికి గరికవమ్ము గీసుకుపోయింది. అందుచే రక్తంకారింది. జెబురుమాలుతో కట్టుకట్టి అపని పూర్తిచేసి మరోవైపునకు వెళ్ళేడు.

ఈలోపుగా బండివిరిగిపోవడంవలన క్రొత్తగా తెప్పించిన మోటారులో షికారుగా మునసబుగారు ఆయనకూతురూ వెళ్ళుతూ మంటలు చూచి, అక్కడికి డ్రైవర్ని కారుని పోనిమ్మన్నారు. వాసుకనుక అక్కడవుంటే తప్పక ఆదిక్కుమాలినవారికి సాయంచేస్తాడని తలచింది భాస్కరం ఆవైపు చూచేసరికి ఆమెకళ్ళు చేతులతో మూసికొని భయంచేత వణకింది. తనపిల్ల మంటలోపడి కాలిపోతూంటే కేకలువేస్తున్న స్త్రీని చూచింది. వాసుదేవరావు ఆర్తనాదంవిని మండుతూన్న ఇంటిలోకిపోయేడు. ఈసంగతే చూచి భాస్కరం, తన్ను మున్నొకసారి రక్షించిన వాసుకేమి అపాయం రానున్నదో అని వణకింది భయంతో.

"ఏమిటమ్మా" అని మునసబుగారడిగితే కళ్ళవెంట నీరు ప్రవహిస్తోండగా భయంతో చెప్పింది భాస్కరం వాసునకు వచ్చిన ఆపదను గూర్చి. తోడనే వారిద్దరూ ఆస్థానానికి వెళ్ళి ఏమి చెయ్యడానికీ తోచకుండా నిలబడ్డారు. ఇంతలో బంగారంవంటిపిల్లని చేతితోపట్టుకొని వాసు

బహుకష్టంమీద వచ్చేడు. వాసుని చూడడంతోటే భాస్కరం ముఖము వానాకాలంలో బీరపువ్వంతయింది. రోదనచేస్తూన్న ఆస్త్రీ తనబిడ్డని లాగికొని ముద్దాడి వాసునకు దండాలెట్టింది. వేడిచే వాసు దాహముకావాలని సౌజ్ఞచేసి స్మృహతప్పి నేలమీదకొరిగేడు. మునసబుగారు వెంటనే మంచినీళ్ళకై పరిగెత్తేరు. భాస్కరం వాసుని తన తొడమీద పడుకో పెట్టుకొని తడిగుడ్డతో అద్దుతోంది. పంతులుగారు మంచినీళ్ళు తెచ్చి వాసు గొంతుకలోపోసి కొన్నినీళ్ళు ముఖంమీద చల్లారు. కొంతసేపటికి వాసుకి తెలివొచ్చి తనకు పరిచర్య చేయుచున్న భాస్కరంకేసి చూచి ఆశ్చర్యపోయేడు. "మీ ఋణం తీర్చుకొన్నా"నని భాస్కరం కోకిలస్వరంతో అంది. వాసుదేవరావు ముద్దుమాటలువిని తనబాధ మఱచిపోయి భాస్కరంలో లీనమైపోయేడు.

♦ ♦ ♦

సంస్కారప్రియులైన మునసబుగారు వాసుదేవరావునకు భాస్కరమ్మకు వివాహం చేయుచున్నట్లు కొంతకాలమునకు పిమ్మట గుంటూరులో జనవాక్యం బయలుదేరింది.

---

# ప్రకృతి చిత్రములు.

బులుసు వేంకటరమణయ్యగారు.

క్షుద్రపుష్పరసంబు ♦ గ్రోలు నరాళంబు
చంపకసుమము యౌ ♦ చింపదేమి ?
వర్షధారోదక ♦ హర్షియౌ చాతంబు
గాంగ నిర్ఝరమునఁ ♦ బొంగదేమి ?
కాసారవాసియౌ ♦ కలహంసతతికి వ
ర్షర్తువనంగ రో ♦ షంబదేమి ?
శ్రీమించి రహినించు ♦ శిశిరపద్మములకు
రాకానిధుండన ♦ రవ్వదేమి ?
ప్రియగుణములయ్యు నొండొంటఁ ♦ బ్రియముకాని
వస్తువులకిట్టి శత్రుభా ♦ వంబుకలుగఁ
గారణంబొండుగలదె ? ♦ యొక్కయెడ నీదు
పక్షపాతము కాకున్న ♦ పరమపురుష ! ౧.

"కోకో"రవమ్మున ♦ లోకమ్మురంజించు
కోయిలమాఁటనే ♦ గోరనేల ?
షడ్జ, నాట్యంబుల ♦ సంతసించెడి కేకి
చెడుదుర్దినమునె యౌ ♦ చింపనేల ?
ప్రాణమర్పించియుఁ ♦ బ్రభుని గాచెడి శేపి
నీచవృత్తిని బొట్ట ♦ నింపనేల ?
కరుభీతచిత్తలై ♦ గంపించు నేణముల్
ఘోరకాననములఁ ♦ గుందనేల ?
అనుగుణములైనఁ ♦ గాకున్న నంతకంటెఁ
దక్కువైనను యన్యోన్య ♦ తను ఘటింప
కారణంబొండుగలదె ! ఒ ♦ క్కయెడ నీదు
పక్షపాతముగాకున్న ♦ పరమపురుష ! ౨.

రాకేందు నంశుజా ♦ లములు చకోరిక
కెన్నడు బువ్వగా ♦ నెనయగలవు ?
ఫలభారనమ్రితం ♦ బరఁగు వృక్షంబులు
పరకార్యపరత నె ♦ ట్లరయగలవు ?
మకరందమును జిల్కు ♦ సకల కుసుమములు
తుమ్మెదనెట్లు హ ♦ ర్షమ్మునించు ?
శుకపిక శారికా ♦ నికరంబు స్వాభావి
కముల నన్యులనెదఁ ♦ దలఁపనేల ?
చూడఁ గొందఱిపను లాత్మ ♦ చోదకములు
నై యభిర్వ్యాప్యహర్షంబు ♦ నలవడంగఁ
జేయఁ గారణమొక్కటి ♦ "మాయ" నీదు
పక్షపాతంబనంగనో ♦ పరమపురుష ! ౩

# తమాషాలు

## మోహం.

"మోహించడం అంటే బ్రతికున్నంతకాలం జరగవలసిందే. నాసంగతిచూడు ఇప్పటికి మూడుసార్లు పెళ్లి చేసుకొన్నాను"

## విసుగు.

భార్య:- నేనంటే మీకువిసుగు లేదుగదా! మళ్లీ బ్రహ్మచారి అవాలనేకోరిక లేదనుకుంటాను.

భర్త:— అట్లేలేదు. ఈరాత్రి నీవుచచ్చిపోతే రేపుదయమే పెళ్లి చేసుకోవలెననుకుంటున్నా తెలుసునా?

## కష్టము.

డాక్టరు:— ఇకముందు మీయాయన కష్టపడి పనిచేయలేడు

స్త్రీ:— అల్లాయితే ఇప్పుడే వెళ్లి చెపుతాను కొంచెం తేలికగావున్నా ఉంటుంది.

## భోజనం.

జడ్జి:— నీకైదేళ్లు శిక్ష వేసాను ఏంచెప్పుకుంటావు

ఖైదీ:— అయితే 1932 సం|| జూనుదాకా భోజనానికి రానని మాయింటికి కబురు పంపించండి.

## ప్రేమ.

ప్రశ్న:— నేనుమోహించిన స్త్రీమెడ ఏవిధంగా సంచరించాలి.

జవాబు:— నిర్లక్ష్యంగా ఉండు. నీతోటివారిని పొగడుతూవుండు. నీదృష్టిఆమెపైనిగుడ్చకు. నీచూడ్కులు ఇతరస్త్రీలపై ప్రసరింపజేయి. బ్రహ్మచారిగగాని, పెళ్లాం చచ్చినవాడుగగాని డైవోర్సుచేయునట్లుగగాని సంచరించడానికి నిశ్చయించుకున్నట్లుగగాని కన్పడు.

ప్ర:— అనగా?

జ:— మళ్ళీ పెళ్ళి చేసుకో,

## మూతపడుట.

"పురుషుడు పెళ్ళాన్ని పుస్తకం చదివినట్లుగా పఠనము చేయాలి"

"అయితే పుస్తకము మూత పడునట్లుగా పెళ్ళాం మూత పడుతుందా?"

## గట్టిగుండె.

డాక్టరు:— మీఆయన సిగరెట్ కాల్చటం మానివేశారు యెంతో గట్టిగుండె అయితేనేగాని అది సాధ్యం కాదు.

స్త్రీ:— అవును. నాది గట్టిగుండె కాబట్టే యిట్లు జరిగింది.

## అవసరము.

అవసరానికి సిద్ధాంతముతో నిమిత్తములేదు. దుబారాకి అసలే సిద్ధాంతం లేదు.

## మరుపు.

ఇంటి అద్దె అడిగే యజమానికి యింటి చూరులో రంధ్రాలు జ్ఞాపకముండవు.

## రశీదు.

జడ్జి:— (ముద్దాయితో) నీవు తాగి గల్లంతు చేసినందుకు 50 రూపాయలు జరిమానా.

ముద్దాయి:— ఇదిగో యేభై రశీదు యిప్పించండి.

జడ్జి:— రశీదు యియ్యరు యిక్కడ.

ముద్దాయి:— ఇయ్యకపోతే డబ్బు కట్టను. రేపు చిత్రగుప్తుడుగారు "నీవుఫలానానాడు తాగావు" అని అడుగుతారు. "అవును. 50 రూపాయలు జరిమానా యిచ్చాను" అని చెప్తాను. "యేది రశీదు చూపించు" మంటారు. అప్పుడు నేనేమి చెప్పేది.

## పొగాకు.

బ్రిటిష్ సామ్రాజ్యమును అనీరాణి పరిపాలించుచున్నపుడు వర్జీనియా ప్రజలు ప్రజల సంరక్షణార్థము పుం

చివరమును ప్రసాదింపుడని కోరెరట. "అయితే శాగాకు దానము తీసికొండి" అని రాణీగారు ప్రత్యుత్తరమిచ్చిరి.

ఆదాన ఫలితములే నేటి వర్జీనియా సిగరెట్లు!

చుట్ట.

బర్కానా హెడ్ ప్రభువు కీమధ్య 18 అంగుళముల పొడవుగల యొకచుట్ట బహుమతివచ్చెను అది కాల్చుటకు నాలుగు గంటలుపట్టును. నాలుగు గంటల తీరుబడి చిక్కేవరకు ఆచుట్ట లండన్ లైబ్రరీలో దాచనున్నారు.

సంభాషణ.

"ఎంత మంచిపని చేసినా మా ఆవిడ నన్ను మెచ్చుకోదు"

"ఇంకా నీపని నయమే. నేనేపని చేసినా మాఆవిడ తప్పుపట్టుకుంటుంది"

మోటారు.

భార్య:— మనమొక మోటారు కొనుక్కుందాము.

భర్త:— సరే మీనాన్న యిష్టపడితే—

భార్య:— యిష్టపడ కేంచేస్తారు!

భర్త:— డబ్బియ్యటానికి.

పెండ్లి.

ఒకతె:— మావాళ్ళు నన్ను జమిందారుగారి అబ్బాయికిచ్చి పెళ్లి చెయ్యాలనుకున్నారు. ఇంతలో జమిందారుగారు సంవత్సరానికి రు 10000 లు నగల మజూరికింద కంసాలి కిస్తారని తెలిసింది.

రెండవది:— అయితే యేమిజరిగింది?

ఒకతె:— అంత మానాన్న నన్ను కంసాలివాని కిచ్చి పెళ్లిచేశాడు.

వ్యాపారం.

"ఖర్చులేని వ్యాపారం తేలికగా జరిగే వ్యాపారం ఒక్కటి చెప్పు"

"ఉత్తరధృవముదగ్గర మంచుగడ్డ వ్యాపారం."

తెలియుట.

(స్త్రీ):— మన మిద్దరము పారిపోయి మోటారులో తిరుగుచున్నట్టు మానాన్న కెట్లా తెలిసింది?

పురు:— నిన్న ఆరు గంటలకు మన మోటారు దెబ్బ తగిలి పడిపోయింది మీనాన్నే.

డ్రైవరు.

డ్రై:— నా మోటారును యెడమవైపునే నడిపానండి. ఆమనిషి గాబరాపడి మోటారుకింద పడితే నా తప్పంటారేమిటి?

న్యా:— తప్పంతా నీదే.

డ్రై:— ఎందుచేత?

న్యా:— చచ్చిపోయినవాని తండ్రి మ్యునిసిపల్ చైర్మన్ అన్న పోలీసు సూపరింటెంటు. అతని చెల్లెలిని నేను పెళ్లి చేసుకోవా లనుకుంటున్నాను.

బాల్షివిక్.

బాల్షివిక్:— (ఒక అమెరికాదేశపు ప్రయాణికునితో) "మీరీదేశములో నుండరాదు."

అ. ప్ర:— అట్లయితే వెళ్లిపోతాను.

బాల్షివిక్:— వెళ్ళటానికి ప్యాస్‌పోర్టు వున్నదా?

అ. ప్ర:— లేదు.

బాల్షివిక్:— ఆలాగయితే వెళ్ళరాదు. ఏదో నిశ్చయం చేసుకో. 24 గంటలు గడువు, తరువాత కాల్చివేస్తాము.

గర్వము.

ఉపా:— గర్వమనగా నేమి?

బాలుడు:— ఎవరికి యిష్టంలేని వస్తువది.

ఉపా:— అంటే!

బాలు:— గర్వము గలవాడు తన యాధిక్యతను గురించి మాటాడును కాని తన పతనమునుగురించి మాట్లాడడు.

ఉపా:— ఇది యెవరి లక్షణము.

బాలు:— పెద్దల లక్షణము

నోటు.

ఒకరు:— నూరు రూపాయలు నోటు పోయిందన్నావు దొరికినదా?

రెండవ:— అంతా వెతికాను. అన్ని జేబులు చూచాను. ఒక్క జేబుతప్ప.

ఒకరు:— ఆజేబుకూడా చూడక పోయినావు?

రెండవ:— అందులోకూడా లేకపోతే గుండె పగులుతుందని చూడలేదు.

వంట.

భర్త:— నేను వంట బాగాచేస్తానని పెళ్ళి చేసుకున్నట్లు యెందుకు చెప్పావు? కూర తరగటమైనా చేతకాదే.

భార్య:— భర్త గొప్ప చెప్పవలసినపు డేకారణము కన్పించకపోతే ఏమిచెప్పను?

# "అనుభవించక తప్పదు"

సి. లక్ష్మీనారాయణగారు.

## 1

తాలూకాకచ్చేరీలో గోపాలరావు సులోచనములు పెట్టుకొని, తలమీద పాగాలేకుండా బల్లముందర కూర్చొని వ్రాస్తున్నాడు. ప్రక్కన ముతుకధోవతి కట్టుకొని చొక్కాతొడుక్కొని నెత్తిన పాగపెట్టుకొని చేతిలో దస్త్రాలకట్టతో నొక గ్రామమునసబు నుంచున్నాడు. గోపాలరావు కొంచెమునేపేదో వ్రాసి వ్రాసి కాగితములు ప్రక్కనపెట్టి తల కొంచెము పైకెత్తి "ఏం, మునసబుగారూ! మామీద బొత్తుగా దయలేదు?" అన్నాడు.

మునసబు:— చిత్తం, చిత్తం, మామీద యుండాలెకాని మాదేమున్నదండి బాబు.

గోపా:— ఆలాగనకు ఏలాగైనా గ్రామమునసబువు. గ్రామంలో పలుకుబడిగలవాడవు. నీకేమయ్యా మహారాజువు

మునస:— ఏదో మీదయలెండి.

గోపా:— అయితే మునసబుగారూ! మరి మీ గ్రామంలో మంచినెయ్యి దొరుకుతుందటగా.

మునస:— (ఆలోచించి) ఆలాగేదొరుకుతుందండీ

గోపా:— అయితే, రేపు పంతక్క రెండు వీశెలు మంచిదిచూచి, మోతాదుచేత, పంపించండి.

మునస:— సరే, అలాగేలెండి. మీ మాటకు అడ్డుచెపుతానా? మరి, మాపని సానుకూలం చేయలేదు గదా!

గోపా:- అల్లాత్రొందరపడతావేం. ఉండు కానీవు నింపాదిగా చూస్తాను కదూ!

మునస:- ఏదో కాస్త త్వరగా దయచేయిస్తే శెలవు పుచ్చుకుంటాను.

గోపా:— సరే కానీవు కూర్చోండి.

అని గోపాలరావు లెక్కలు సరిచూచుకుంటున్నాడు ఇంతలో సిరాఅయిపోవడంచేత అయన బంట్రోతును "రాములూ! సిరా తీసుకొనిరా" అని కేకవేసి కుర్చీలో మరలకూర్చుండి, "ఏమండీ! మునసబుగారూ! యీసారి మామూలు యిప్పించారుకారు" అన్నాడు.

మునస:— (చేతులు నలుపుకుంటూ) లేదండి. మీదగ్గర దగాచేస్తామా? తప్పకుండా యీసారి వచ్చినపుడు యిస్తాను.

గోపా:— ఏమోలెండి! మీపని అయినాక, మేము కనపడతామా?

మునస:— అలాఅనకండి, పెద్దలు పొద్దునలేస్తే తాలూకాతోనే మాకుపని ఇవాళతప్పించుకొంటే రేపు తప్పించుకోగలమా?

గోపా:— ఏమండి మునసబుగారూ! మీబోటివారే యిలాచేస్తే, ఇతరులేమంటారూ? మామూళ్ళు ఎప్పటికప్పుడిస్తే బాగుంటుంది. మాకు పనిచేయుటకు గూడ సంతోషంగా ఉంటుంది. మరొకసారివస్తే అప్పటికప్పుడే

మునస:— సరేలెండి! యిప్పుడు యేమి తీసుకరాలేదు కాని రేపు మోతాదుచేత పంపుతాలెండి, కాని మాపనిమాత్రము సానుకూలమయ్యేటట్టు చూడండి.

గోపా:— నీవు యిన్నిమాట్లు చెప్పవలెనా? కాని, మీరు పట్నవాసం వస్తూ పూరక వస్తారా? కాబట్టి దగ్గర పైకముంటుంది చూడండి.

మునస:— (ఆలోచించి నిమ్మళంగా మూట విప్పి) యిది మాపైకంకూడ కాదండీ, ఎవరో పెద్దమనుష్యులు దగ్గిరుంచమని యిచ్చినారండీ, అని చెప్పుచు మూడురూపా యలువిప్పి చేతిలో పెట్టబోవును?

గోపా:— ఏమండీ! ఎంత అది.

మునస;— మీరు చెయ్యిపట్టండి. చెప్పుతానూ ఇప్పటికి యిది తీసుకోండి తరువాత, మళ్ళీ వస్తాముగ.

గోపా;— అబ్బా! ఇందులో బేరమేమిటండీ, హ స్తము యిప్పించాలి. తప్పదు.

మునస;— తమరు యీసారి కరుణించాలి. ఇంకేమి లేదండీ.

గోపా;— సరేతెండి. కాని బంట్రోతుమామూ లేది?

మునస;— ఏమో తమరు చిత్తగించాలి.

గోపా.— ఏమిటండీ, దీనిలోనే వానికికూడ యివ్వమంటారా? బాగుంది. యివ్వండి, యివ్వండి.

మునస:- ఇదిగో యీఅర్థరూపాయి తీసికోండి.

గోపా:- సరే, యివ్వు. (అని జేబులో వేసు కొనును.)

మునస:- చిత్తం. సెలవుపుచ్చుకుంటాను.

గోపా:- సాయంకాలము కనపడండి. మీపని చూచి చెప్తాను. నేను చెప్పింది మర్చిపోకండి సుమా? పండుగనాటికి తప్పక పంపండి.

మునస:- శెలవిప్పిస్తారా? తప్పక పంపుతాను.

(నిష్క్రమించును)

2

గోపాలరావు 50 సంవత్సరముల యీడు గలవాడు ఆతనికి ప్రథమభార్య చనిపోయినది అందుచే రెండవ భార్యను వివాహామాడెను. ఆమెపేరు శకుంతల, వయస్సు 18 యేండ్లు మంచి అందకత్తె. అందుచే గోపాలరావుకు శకుంతలపై నమితప్రేమ.ఆమె నోటినుండి మాట రావడమే యాలస్యం. తక్షణమే కోరిన వస్తువు తెచ్చియిస్తూవుండేవాడు.

ఒకరోజు సాయంకాలము వూళ్ళో పోలీసు పందెములు జరిగినవి. వాటిని చూచుటకు గోపాలరావు, భార్యా సమేతుడై వెళ్ళినాడు. మొట్టమొదట భార్యను తీసుకొని వెళ్ళుట సమంజసము కాదేమోయనుకున్నాడు. కాని పేరుధైర్యముచేసి బయలుదేరి వెళ్ళేసరికి అక్కడ అంతా భార్యా భర్తలు కలసి మెలసి తిరగడం చూచేసరికి ధైర్యంవచ్చింది. శకుంతలకూడ నవ నాగరికతా ప్రపంచములో విచ్చలవిడిగా తిర గాలని యభిలాషపడే స్వభావంకలది. కాబట్టి వెంటనే యందరితో కలసి యానందమును తానుకూడ పంచుకొన్నది. పందెములు మొదలుపెట్టారు. జరుగవలసిన లాంచనాలు సక్రమంగా జరిగిపోయినాయి. పొద్దుకూకిన వెంటనే గెలుపొందిన వారికి బహుమతులు యిచ్చుటకు ప్రారంభించారు. తరువాత విం దులు ఆరగించేవేళ వచ్చింది. అంత కలసి పుచ్చుకొన్నారు. కాని కొత్తవింత యొకటి జరిగింది. స్త్రీల కందరకు పండ్లు, పసుపు, కుంకు మ పంచిపెట్టబడినాయి.

అప్పటికి బాగా చీకటిపడ్డది. మామూలుగా కవులు చెప్పినట్లు చుక్కలు వెన్నముద్దల్లాగ ఆకాశంలో తెల్లగా వున్నాయి. అది చలికాలం అగుటచే కొంచెము చలిగాలి విసురుతోంది. అప్పుడు మతాబులు, చక్రబాణాలు, అవ్వాయి చువ్వలు మొదలగు మందు సామాగ్రి కాల్చు చున్నారు. జనసమ్మర్దన మెక్కువగనుండుటచే

కాల్చిన మందు సామాగ్రిలోనుండి కొన్ని పేలి కొందరు గుడ్డలు కాలి గాయములు తగిలినాయి. ఇటుల అంతయు పూర్తిఅయిన వెంటనే కొందరు మోటారులలోను, మరి కొందరు జట్కాలలోను యిండ్లకు వెడలి పోయిరి.

**3**

(సాయంత్రం పూలతోటలో గోపాలరావు మిత్రులగు రఘునాథం, సోమేశ్వరరావు ప్రసంగము.)

రఘు:- అరే! మనయింటిప్రక్క గోపాలరావు వానిభార్య నిన్న ఎక్కడకో కలసి షికారు వెళ్ళుచున్నారు చూచావా?

సో:- నీకు తెలియదురా వారెక్కడికి వెళ్ళినది? మన వూరిలో జరుగుచున్న పోలీసు పందెములు చూచుటకురా.

రఘు:- ఏమీ లేదుకాని, మనలో ఒకదురభ్యాస మున్నదిరా. యేమిటంటే యెన్నడు బయటికైనా రాని యాడువాండ్రనుతీసికొనిపోలీసు పందెములు చూడ వెళ్ళడము బాగాలేదు.

సో:- ఆలా వెళ్ళడము తప్పుయనిన నేనంగీకరించను సుమా! ఎందుకంటె స్త్రీలకు మనము బహిరంగ స్థలములలో తిరిగినట్లు వారికి కూడ స్వాతంత్ర్య ముండవలెను. మరియు అది ప్రస్తుత సివిలిజేషన్ కూడాను.

రఘు:- అయితే నేనొక్కటడుగుతాను చెపుతావా? ఏమిటంటే పోలీసు పందెములను చూచుటకునలుగురిలోనికి తీసుకొని వచ్చిన వారు, ఆడువారిని యితర సమయములలో ఘోషాలోనుంచు టెందుకు?

సో:- అది తప్పు అని నేనొప్పుకుంటాను, కాని గోపాలరావంతటి ముసలాయన తన రెండవ చిన్న వయస్సుగల భార్యను వెంటతీసుకొని రావడము మాత్రము బాగాలేదని నేనొప్పుకుంటాను. ఎందుకంటె యీరోజులలో చాల మంది కుర్రవాండ్లు యిదేపనిమీద వచ్చి పద్వించుటకు ప్రారంభిస్తారు.

రఘు:- కాబట్టి నేను చెప్పునదేమంటే ఆడవాండ్లను పోలీసు పందెములవద్దకు చూచుటకు తీసుకొనివెళ్ళుట మాత్రము మనవాండ్లది చాలతప్పు.

సో:— అరే! మన కెందుకురా! వాండ్లకు యిష్టమైంది తీసుకొని వెళ్ళారు. కాబట్టి మనము నేటికి దానివిషయమైన చర్చఆపి యింటికి వెడదాము.

(అని నిష్క్రమించును.)

**4**

(గోపాలరావు గృహము)

పోలీసుపందెములలో జరిగిన విందారగించి గోపాలరావు శకుంతలయింటికి వచ్చారు. వెంటనే శకుంతల భర్తను మడికట్టుకొనమనిచెప్పి, కాళ్ళు కడుగుకొనుటకు నీళ్లు తెచ్చియిచ్చింది. శకుంతలకు యిలా ప్రొద్దుపోవునను సంగతి తెలిసి ముందుగ పెందలకడనే వంటచేసి పెట్టియుండుటచే పాకము బాగుగా చల్లారిపోయినది. కాని గోపాలరావుకు ఆకలి అంత యెక్కువగా లేకపోవుటచే కొద్దిగా భుజించెను. ఇంతలో శకుంతల భర్తతో "ఏమండోయి! చూచారా మరి" అంది.

గోపా;— ఎవరిని?

శకుం;— ఇవాళ అక్కడికి వచ్చినవాళ్ళను.

గోపా;— చూడకేం. ఇంకా చత్వారం రాలేదుగా. అయితేమేం?

శకుం;— ఏమీలేదు. మీకెన్నిసారులుచెప్పినా తీసుకరారుగదా?

గోపా;— అప్పుడే నీసొద మొదలుపెట్టావు. కాని చెప్పు ఏమిటో?

శకుం;— మాటంటేనే మీకంత విసుకుపుటితే యింకెందుకులెండి.

గోపా;— ఇంతమాత్రిమునకేనా కోపం? కావలసిందేమిటోచెప్పు. నీవు అడిగినదంతా తెచ్చియిస్తూనే ఉంటినిగా.

శకుం;— నేనుమాత్రిం లేదంటానా? కాని ఆ అనసూయను చూస్తే ఎంతముద్దొస్తోంది. ఆబట్టలు, నగలు ఎంతఅందముగా ఉన్నాయో చూచారా?

గోపా;— అయితే అలాగా నీవుకూడ దొరసానిలాగా వుంటావా యేమిటి?

శకుం;— ఉంటె తప్పా? ఉండేవాళ్లంతా మనవంటివాళ్ళేగా.

గోపా;— బాగానేవుంది కాని, నేను యిన్నియేండ్లవాణ్ని దొరనయ్యేది యేలాగోచెప్పు మరి. అప్పుడు మనమిద్దరము దొర దొరసానిలాగుంటె నాకుయిష్టమే.

శకుం;— మీకంతాహాస్యమూ, పరాచికమూ, కాని నాకు మండిపోతున్నది సుమా?

గోపా;— నేనొక్కటి చెప్పుతాను వింటావా? యేమిటంటే నాయుద్యోగము చూచావా చిన్న గుమాస్తా, జీతమూ కొద్ది, కాబట్టి యేదో మనకున్నంతవరకు చక్కగాఉంటే చాలదూ?

శకుం;— యేమి? డబ్బు ఖర్చు అవుతుందని పిసినిగొట్టుతనమా, యీ వున్నదంతా యేబిడ్డలు తినిచావనూ? మనయిద్దరికి చాలదా? మరియు మీరు బంట్రోతుకు యియ్యవలసిన సొమ్మునుకూడ ంవ్వక, సంపాదించుచున్నారని నలుగురు అనుకుంటున్నారు. ఇదంతా యెవరికో నాకు తెలియకున్నది?

గోపా;— నీవు అడిగినవన్ని తెచ్చియిస్తున్నా యిలా కోపపడితే ఎట్లా?

శకుం;— చాల్లెస్తురూ? ఎవరన్నావింటే నవ్వుతారుకూడాను! అంత నామాటప్రకారం నడుస్తున్నట్టే?

గోపా;— ఇదంత యెందుకు? నీకేమికావలె? రేపు తప్పక తెప్పించుతాను.

అప్పటికి షుమారు పదిగంటలగుటచే త్వరగా శకుంతలకూడ భోజనముచేసి వచ్చి వక్కవేశినది. పక్కమీద కూర్చొని యిద్దరు తమలపాకులు వేసుకుంటున్నారు. ఇంతలో శకుంతల, "ఏమండీ! రేపు మంచినాటకము వాడదామా?" అన్నది.

గోపా;—నీకు యెప్పుడూ దొరసానిఅవుదామా నాటకాలకు వెళ్లుదామానితప్ప వేరొకటి లేదుకదా?

శకుం;— ఆమాటలకేమికాని, చెప్పండి? స్థానం నరశింహరావుగారు చింతామణి వేస్తాడట, చాల బాగుంటుందిసుమా! మీరు నేను కలసివెళ్ళి, డబ్బుకు వెనకాడక ఛైరుకు వెళ్ళి కూర్చుందాము. సరేనా?

గోపా;— నేను రాలేనూ, మరియు నాటునాటకాలంటే సరదాలేదు. కాబట్టి నీవు వెడితే వెళ్ళు. ఇంటిపక్క సోమేశ్వరాప్రిభార్య వాళ్ళు వెళ్ళుతారా?

శకుం;— ఏమో నాకు తెలియదు. వారితో నాకువంతా? వాళ్ళున్నట్టు నేనున్నానా

యేమిటి? కాబట్టి వారువస్తే సరే, లేని యెడల నేపోక తప్పదు

గోపా:— సరే! రేపటిసంగతి చూద్దాము. పొద్దుపోయినది నేటికి పడుకుందాము. అని నిద్రపోయిరి.

మరునాడు గోపాలరావుగారికి పెందలకడనే వంటచేసిపెట్టి, తానుతిని, భర్తను త్రిస్థ్రముగ నిద్రబుచ్చి సోమేశ్వరావువెంట నాటకానికి వెళ్ళింది శకుంతల. నాటకంలో వీరిద్దరినిచూచిన వాళ్ళంతా కలిపురుషుని మహిమకు ఆశ్చర్యపడి యిటువంటి చిన్నిపిల్లలను వృద్ధునకు యిచ్చి వివాహము చేసినందులకు శకుంతల తల్లిదండ్రులను బహు నిరసించిరి. కాని గోపాలరావుగారిని వృద్ధాప్యదశలో చేసుకొన్న వివాహమాహిమను అనుభవించక తప్పదని యిరుగుపొరుగు వారంతయు బహు నిందించిరి.

సంపూర్ణము.

## తాతగారి కత్తిగంటము.

గోవర్ధనరావుగారు

వ్రాసినటువంటి గీతకీర్తనలు మూసె
చినుగు తాటాకులందు తుప్పును వరించి
మూలఁబడె కత్తిగంట మ్మపూర్వమయిన
గ్రంధరాజి తగులఁబడె నల్లుకొన్న
యాశ మొకటి దక్క——
భాగవతమనిన 'వరాలగోత' మంచు
జెప్పినారంట, భావనాసిద్ధి యేమొ?
కత్తి పౌరుషచిహ్నమ్ము గంటమాక
విత్వ తీవ్రత జాటు నావిద్య సుంత
యలవడెను కాని తీవ్రత యబ్బలేదు
భారతీదేవి జైమినీ భారతమ్ము
వ్రాసినది కాదె గంటమ్ము వట్టి వీర
భద్రినకయి ఆ కవిమణి భాగ్యమేమొ.
ఆ 'వరాలగోతము' వ్రాయు నట్టివేళ
పోతనకు బల్కుటతోడైన పుణ్య మేమొ
మీరు చేసిన సుకృతికి మేరలేదు.
అచ్చువచ్చిన కతన తాటాకు పోవె
దానితో నేగె గంట మేదైన నొకటి
యున్న వ్రాయనలవి కాదు ఓహొహా! యింత
దుర్బలులమని కోపగింతువొక్కొ? తాత
తాళిదళ సంపుటములు కాంతార సీమ
నుండి తేఁబని లేదు. గంటమ్ము వ్రాయి
బెట్ట బనిలేదు. హంసతూలికలు చెక్క
ననవసరము భాష్యాంతమాదిని మహేంద్రు
దెలియువఱకు విద్యాగహనము లింక లేవు
అన్నిటను స్వతంత్రులము తాతయ్య, మేము

"రసవాహిని నుండి"

# అఖండయతి.

కృష్ణమూర్తిగారు

ఈయతినిగురించి దీని గ్రాహ్యాగ్రాహ్యతల విషయమై ప్రాచీన మహాకవిపుంగవు లెంతదనుక యీయతిని వాడిరి యను విషయము శ్రీగిడుగు రామమూర్తి పంతులవారు తమ తెలుఁగుపత్రికలలో విపులముగఁ జర్చించియున్నారు కావున దీని స్వీకరణవిషయమును నేనిపుడు జర్చింప ననవసరము. కాని యీయతివిషయమున గవిజనాశ్రయాప్పకవీయముల యభిప్రాయములను నందలి సమంజసత్వము లను వివరించుట యీ నా వ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము.

"మానుగవిశ్రమాక్షర సమన్వితమై స్వరమాదినన్ దదీయాను గుణాక్షరంబె కొనియైనను జెప్పఁగ నొప్పు నీకిరీట
భానుసహస్రభాసి వృషభాధిపు డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండయతి పొల్పగు నాదికవి ప్రసిద్ధమై—"

(భీమనఛందము)

అని యీరీతిని కవిజనాశ్రయమునం దఖండ యతి చెప్పబడినది

కాని యీపద్యమునందు లక్షణమంత వివరముగ జెప్పియుండ లేదు. లక్ష్యమును జూచినచో "వృషభాధిప" యను పదము నిచ్చుటంజేసి యుపసర్గసంధి యతియే యీతని యఖండ యతియేమో యన్నట్లున్నది.

ఇతర లాక్షణికుఁడగు కస్తూరి రంగయ్య యీ పద్యము వలన సర్వత్ర అఖండయతి కవిజనాశ్రయాంగీకృత మైనట్లు తలంచెను. మహాకవుల ప్రయోగముల జూచినను కవిజనాశ్రయ మతప్రకారము సర్వత్ర అంగీకారమే యన్నట్లున్నవి. సరే, యిక నాధునికప్రయోగముల సంగతి కేమి యతిప్రాసములే యనవసరములను నీకవులగుంపు కెంత లఘువుగనున్న నంతమేలు. సర్వ వర్ణములకు సర్వవర్ణములు యతిగానుంచవచ్చునన్న గిరిగద్దలవలె దలలూచువారు పెక్కండ్రాధునికులలో నున్నారు. యుక్తాయుక్తములతో వారికిఁ బనిలేదు. ఎంత తేలికగనుండి వారి కక్షరములువ్రాయ శక్తిలేకున్నను గవిత్వమువ్రాయ వీలగునో యట్లు వాదప్రతివాదములఁ బయలుదేరతీయుదురు. కావున నిట్టి యల్పవిద్యాపరిగ్రహులతో నిప్పుడు పని లేదు.

కవిజనాశ్రయమందు లక్షణములఁ జెప్పి వాని కుదాహరణములును దానే కల్పించి చూపుట సంప్రదాయము. ఎచ్చటను నితరకవుల పద్యముల నేనికిని లక్ష్యముగ నీయలేదు. కావున నీయఖండ యతికిని లక్ష్యముఁ దానే కల్పించి యిచ్చెను. కస్తూరి రంగయ్య తన పుస్తకములో లక్షణము చెప్పి లక్ష్యము లితరకవి పద్యముల నిచ్చెను. అప్పకవియు నిదేరీతి నితర కవుల పద్యముల నిచ్చెను. అందుదాహరణములుగ నిచ్చిన భారతాది మహాకవుల పద్యములిప్పుడు ముద్రితగ్రంథములలో నాప్రకారము లేకుండుట ముద్రణ యంత్రాధిపతుల యనాదరమును దత్కార్యాలయస్థ పరిశోధక మహాశయుల యొక్క విపరీతసాహసమును దెలుపుచున్నవి. ఒక్క యీ యతిప్రాస విషయకములగు మార్పులేకాక వ్యాకరణ విషయములగు మార్పులును పెక్కులు గలిగినవి. ఈ మార్పులను మరియు వీని వలనఁ గలుగు నష్టములను శ్రీరామమూర్తి పంతులవారు చూపించిరి కావున నీవిషయములు ప్రతి విద్యావంతునకును విశదమై యుండును. గాన విశేషించి వ్రాయ నక్కర లేదు.

అట్లే యీ యఖండయతి కిచ్చిన యుదాహరణములు భారతములోనివి తదితర గ్రంథములలోనివియు నిప్పుడు పరిశీలించిన నవి వానికి లక్ష్యములుగా నుండఁజాలవు. ఈఘనకార్య మాచరించినది లక్షణ గ్రంథకర్తలో లేక, పరిశోధకులుగ నుండిన మహాశయులో యూహింప శక్యము గాదు. కొన్ని కొన్ని మాత్రము సవరించుటకు వీలుగాకయో లేక యవకన్పింపకయో యిప్పటికిని నట్లే నిలచియున్నవి.

కవిజనాశ్రయమున విశేషించి లక్షణము చెప్పకపోవుటచేత నంతటను నఖండయతి వాడవచ్చుననియే దాని యర్థమని పలువుర యాశయము. "విశ్రమాక్షర సమన్వితమై స్వరమాదినన్" అని సామాన్యముగ నెచ్చటైనను విశ్రమస్థానాక్షరముతోఁ గూడుకొని స్వరమాదినచో నని యర్థమేగాని యొకచోటనే యని నిర్ధారించి చెప్పలేదు. కావున నెల్లయెడల నఖండయతి వాడవచ్చుననియే కవిజనాశ్రయాభిప్రాయము

అప్పకవీయమునం దీవడినిగూర్చి యెట్లుచెప్పబడినదో వచించెదను అందరును బదియుఁ బండ్రెండుగను యతులు చెప్పగా నందులకంటెను నెక్కుడుగ నలుబదియొక్క యతుల నప్పకవి చెప్పెను. దీనినిబట్టిచూడ నితఁడు విపులముగ నీవిరతులనుగురించి చెప్పదలచినట్లు స్పష్టపడుచున్నది. మఱియు నొకేయతియం దంతర్భావమువాడు యతులను గూడ విడదీసి విభిన్నముగ జెప్పెను విశేషించి యేలాక్షణికుఁడును జెప్పని అందును ప్రయోగములు వ్యాఖ్యము లై

యున్న విశేషవళియను నొకవళిని జ్ఞ కును, క వర్గమునకును (తుదివర్ణము విడిచి) యతి వేయవచ్చునని చెప్పెను. దీనికి భారతములోని యొక పద్యమునే లక్ష్యముగ నిచ్చెను. అదియు నిప్పుడు ముద్రిత భారతాదులలో మార్చియే యున్నది. మఱియు నీయతిప్రాసములకొక యాశ్వాసమును వేఱుగ జెప్పెను. వీని నన్నియుంజూడ నప్పకవి యీవిషయములను వ్రాసిన లాక్షణికులకన్న విపులముగ జెప్పదలంచినట్లు స్పష్టపడుచున్నది.

అట్టి యప్పకవికీ యఖండయతిమీద ననుగ్రహము లేక పోయినది. అప్పకవి యుభయవళులని పేరుంచి యందు కొన్నిటినే చెప్పి యవియే యఖండ యతులనియు దక్కినవి గావనియు జెప్పెను. అట్లు తన యిచ్చవచ్చిన ట్లఖండ యతులను జెప్పుచు నీభీమన పద్యమును సరిపెట్టుటకై తన యుభయవళి ప్రభేదమగు నుపసర్గసంధి యతికి బైభీమన పద్యమును లక్ష్యముగ నొసంగి యీ యొక్క విభేదమే భీమనకిష్టమనియు. దానే యాతనికన్న నెక్కుడుగ నఖండ యతిని విస్తరించితిననియు సూచించెను. అదియుంగాక నులక్షణసారమునందు గొన్ని పద్యములు భారతములోనివి యఖండ యతులకు లక్ష్యములుగ నిచ్చినట్లు వచించి యాలక్ష్యంబులం జూడగనే తనకెక్కడలేని యాశ్చర్యము గలిగి బహుపుస్తకంబుల నిరీక్షించి వానినెల్లం బ్రక్షిప్తంబులుగ నెఱింగినవాడనై లక్షణవంతంబులగు పురాతన కవి ప్రోక్తంబుల వివరించెదనని కొన్ని పద్యములు దిద్ది తన యభిప్రాయానుసారముగ వ్రాసెను.

అప్పకవి చెప్పిన యీయుభయవళు లెంతవఱకు యుక్తి యుక్తములుగనున్నవో చూతము. యుష్మదస్మచ్ఛబ్దయతు లుభయ యతులు యుష్మదాజ్ఞ, అస్మదాజ్ఞ యీపదములకు హల్లునకుగాని అనంగా ద యనుదానికిగాని ఆజ్ఞయందు డు అకారమునకుంగాని యతిచెల్లునని యభిప్రాయము ఇది యుభయవళిగా నప్పకవిచే నంగీకృతము కాని యుష్మ ద్భాగమునకును దానికిని తద్భాగమన మనుదానికిని, అస్మ దాజ్ఞ యనుదానికిని మదాజ్ఞ యనుదానికిని బరస్పరము భేదమేమియో తెలియకున్నది. యుష్మదాజ్ఞ కంగీక రింపబడిన యఖండయతి తదాజ్ఞ కంగీకరింపకుండుటకుం గారణమేమి? ఇట్లే యీయుభయ యతులలో గొన్ని చెప్పి కొన్ని చెప్పలేదు. ఎందువలనం జెప్పలేదో యూ హించుటయు గష్టము. కావున నప్పకవి చెప్పిన యీయ ఖండయతి యంతగా యుక్తియుక్తముగ నున్నట్లు తోచదు.

కాగా భారతాది మహాకవుల గ్రంథములలో ననేకము లగు ప్రయోగము లున్నవని భాషాసంశోధకులగు శ్రీరామ మూర్తి పంతులవారు వినగించుటయు, నప్పకవి చెప్పిన యఖండయతి యంతగా సమంజసముగ లేకుండుటయుం జూడ గవిజనాశ్రయమునందుం జెప్పంబడిన రీతిని సర్వత్ర అఖండయతి నంగీకరించుటయే యొంతయు యుక్తతమమని నాయభిప్రాయము.

---

# రాధికా నిర్వేదము.

సోమంచి వాసుదేవరావుగారు.

మ॥ యమునా సైకతభూములందు నల బృందారణ్య కుంజ ప్రదే
శములందున్ లతికానికాయ విలసచ్ఛాదోపలోత్తుంగ ధా
మములందున్ మురవైరిఁగూడి విహరింపన్ సాంగిఁతిన్ దాదృశో
ద్యమముల్ నందతనూజుండుగ్ విడిచె నాహా చేలనైతిఁగదా॥ 1.

మ॥ కుసుమామోద విభాసి శీత మరుదంకూరంబు లామోదమున్
బ్రసరింపంగ లతాంతశయ్యలపయి నిద్రిన్ జెందు నన్నాతఁడిం
పెసఁగన్ మన్మథకేళిఁదేల్చె నిఁక నన్వీక్షింపరాఁడేలకో
వసుదేవాత్మజుఁ డింతకున్ విడిచెనో వాల్లభ్యమున్ నాపయిన్। 2.

శా॥ ఆతండేనును మున్ను నంగ సుఖదివ్య శ్రీవిలాసంబులన్
బ్రీతిన్‌బొంది చరించు నీరవిసుతాప్రేంఖత్తరంగావళీ
శీతోదంచిత సైకతస్థలములీచెంగల్వ పూఁదోఁటలీ
చూతారామములీనికుంజములు నొవ్వంచున్ గాంచినంతన్ గడున్ ॥ 3.

మ॥ అకటా! యెట్లు దురంతదుస్సహ లతాంతాస్త్రంబులన్ మారభూ
తక మేయున్ సహియింపఁజాలుదును శీతంబైన వాతంబు వా
రకనాపైఁ బొలయంగనేకరణి నోర్వన్‌జాలుదుఁ గా శారికా
పికకీరధ్వను లెట్లు సైఁచెద మహోద్వేగాతిరేకంబునన్ ॥ 4.

ఉ॥ "నమ్మిననాతిగా మఱి యనాథకదా యలరాధ దానిని
కమ్మగు ప్రేమఁజూడఁదగుఁగాని మనోభవ దుర్భరాస్త్ర జా
లమ్ముల యేటుపోటులఁ గలంపగఁ జాతురె యట్లుసేయ నా
యమ్మ" యటంచు నెంచెడల యంబుజలోచనుఁ డేమి సేయుదున్ ॥ 5.

శా॥ పౌరస్త్రీ పరిరంభ సౌఖ్యవనధి వ్యాలోల కల్లోల డో
లారత్యుత్సవ లోలుఁడయ్యెఁగద లీలామానవుండక్కటా!
యా రామానుజు మీఁదఁ బ్రేమ యిఁకనేలా? చిత్తమా! తద్గుణ
శ్రీ కాఁగిల్లెద వేల? యేల యిఁకఁ దచ్ఛ్రీపాదముల్ గొల్చెదో ॥ 6.

చ॥ అనయమునన్ను బ్రేమఁగను నాహరి నేఁడు ప్రియంబుఁజూపనే
రనియతఁడై కడంక మధురాపురలోలవిలోచనావిలో
కన మదనాస్త్రజాలములఁ గంపితుఁడై తదధీనమానసుం
డును నయియుండుటన్ గనఁ గడున్‌గడుఁ గొందలమందె డెందమున్ ॥ 7.

శా॥ ఆవక్త్రాబ్జవిలాస మావికచ నేత్రాంభోజ లాలిత్యమా
శ్రీవత్సాంకితహార విస్ఫురిత లక్ష్మీహారి వక్షస్థలం
బావాచా చతురత్వమా గుణగణం బాహావమా భావమా
భావప్రోద్భవ సత్కళా విభవమున్ భావింపఁగా శక్యమా ॥ 8.

ఉ॥ పున్నమచందురుండు నగు మోము విశాల సరోజపత్రముల్
గన్నులు కంబుకంఠముచలన్మధుపంబులు వీక్షణంబులుం
జన్నవనీలముల్ కురులు చంద్రశిలాతలముల్ గపోలముల్
చెన్నుగనొప్పు శౌరి సుఖలీలలఁజెంది సుఖించు టెన్నఁడో ॥ 9.

మ॥ నిరతంబున్ హరిపాద సంస్మరణమున్ జేతున్ మనోవీధి "శ్రీ
హరి! గోవింద! ముకుంద! మందరధరా!" యటంచున్ వచింతున్ రమా
వరసేవాపరతన్ జరింతునకటా! ప్రారబ్ధమో కాని యా
కరుణావార్ధి కృపన్ గడింపఁగ నశక్యంబయ్యె నాకీయెడన్ ॥ 10.

# సుధాకరామాత్యుడు.

నిడుమోలు కనకసుందరంగారు బి. ఏ. (ఆనర్సు)

## పందొమ్మిదవ ప్రకరణము — ప్రఫుల్లుడు - విశారదుడు.

వారిరువురును - ప్రఫుల్లుడును, విశారదుడును - గవాక్షముచెంత నిలువబడి యున్నారు. రఘునాథాచార్యుడు కొంతదూరమున వసారాయందు పచారుచేయుచున్నాడు.

విశారదుడు తలుపు త్రోసికొని గదిలోనికి ప్రవేశించినపుడు ప్రఫుల్లుడా గవాక్షమువద్ద నిలువబడి దీర్ఘాలోచనా నిమగ్నుడై యుండెను. అస్తంగతుడు కానున్న సూర్యుని యరుణ కిరణ ప్రసారమువలన నాతని ముఖము తేజోవంతమై యున్నను, ఆతని చిత్తసంక్షోభము సూచించుచునే యుండెను.

"విశారదా! పనియేమి" యని అతడు ప్రశ్నించెను.

విశారదుడు తలుపునకు గడియపెట్టి సుధాకరుని చేరబోయి తన వచ్చినపని దెల్పుకొనెను. సుధాకరామాత్యుని తానే చంపితినని వకుళ రఘునాథునివద్ద నొప్పుకొన్నది. రఘునాథుడీ విషయమును మాదన్నమంత్రి కెరిగించెను. వకుళ నాడు కారాగృహమున నిర్బంధితురాలై యుండెను.

ప్రఫు;- రఘునాథు డూరకొనలేదు. ఏదియో నొకముప్పు దెచ్చిపెట్టుచునేయుండును.

విశా;- ఆర్యా! [illegible]నాతని దోసమేమియు నున్నట్లగపడదు ఆతనికి వేరొండు మార్గము లేకుండెను.

ప్రఫు;- అట్లయిన దీనికి గారకులెవరు?

విశా;- జయచంద్రామాత్యులు. ఆర్యా! ఈయన్యాయమును వెంటనే నివారణచేయవలెను.

ఆతడు మాటాడిన ధోరణినిబట్టి చూచిన నతడే యజమానియు ప్రఫుల్లుడాతని సేవకుడుగ నున్నట్లగపడుచుండెను. ప్రఫుల్లుడు వామహస్తమును గవాక్షద్వారముపై నూన్చి, తన ముఖమున జీరాడుచున్న శిరోజములను కుడిచేత వెనుకకు ద్రోసికొనెను. ఆతని హృదయమున దుర్భరమగు నూతనాందోళము ప్రబలియున్నటుల నాతనిముఖము చెప్పక చెప్పుచుండెను. ఒకప్పుడు దట్టముగను నల్లగనున్న ఆతని శిరోజములు నేడు పలుచబడి యున్నవి. రజితసూత్రములు నందు లేకపోలేదు.

"ఆమెను రక్షింపకతప్పదు" విశారదుడు మరలననెను.

ప్రఫు:- నిజమే, కాని ఆపని చేయగలవారెవరు?

విశా:- ఒరులెవరు చేయకున్న నేనే చేయక తప్పను.

ప్రఫుల్లుడు వంచియున్న తలనెత్తి విశారదు నొకసారి విస్ఫారితనయనములతో గాంచెను. కాని వెంటనే యాగవాక్షద్వారముగుండ వెలుపలకుదృష్టిని మరల్చుకొని ఆలోచనానిమగ్నుడై యిట్లనెను.

" ఆసమయమున ఆయింటి యందున్న పతం జలివి నీవేనని నాకు తెలియవచ్చినది"

"అవును. నేను ఈవిషయమునుమీరు మొదట నుండియు నెరుగరా ?"

"మొదటనుండి యనగా నెప్పటినుండి?"

" అనగా—నేను మీ వద్ద గుమాస్తాగా ప్రవేశించినప్పటినుండి......?"

" లేదు. అప్పటినుండియు నెరుగను?"

" ఆర్యా ! మీ కీ విషయము తెల్లమయ్యె నని నే నప్పుడప్పుడు తలచుచుంటిని"

నిశ్శబ్దము— ఇప్పుడైనను వారిరువురి నడుమ నేమేమి రహస్యములున్నవో కాని వారాం తర్య శుద్ధిగ మాటాడుకొనదలపలేదు. సమా ధానముల నొసగుటకు ప్రిఫుల్లుడే చాల వెను కాడుచుండెను.

"నీవే పతంజలివని నా కీనడుమ తెలియ వచ్చినది. నీకు వాసుదేవుడను వేరొక పేరున్న దియు నాకు తెలియును. ఈ విషయమునై నీతో ముచ్చటించుటకు తగు సమయమునకై నేను నిరీక్షించుచుంటిని. కాని మనకెక్కడను తీరిక యుండుటలేదు."

తీరిక లేదా ! ప్రిఫుల్లుడిది నొకమిషగా చెప్పదలచుకొనియెను గాని యది సత్యదూర మని విశారదు డెరుగడా ? కాని వాసుదేవుడు— మన మాతని నిజనామముతో నికముందు పిలువ నగును – తన యజమాని హృదయమున నశాం తిని గలిగించు ప్రసంగముచేయు నిచ్ఛలేక– "నిజమే. మనకు తీరికయుండుటలే"దని యొప్పు కొనెను. " ఆర్యా ! వకుళగతి యేమగును ? ఆమెను కారాగృహములోనుండి వెంటనే విడి పింపవలెను."

" నిజమే "

" ఆమె నిర్దోషియని నిర్ణయింపవలెను"

" అన్యుల కష్టనష్టముల పాల్పరచియేనా?"

" వలదు. అట్లుచేయు నవసరము కలుగునని నేను తలపను."

" అదియెట్లు తప్పింపగలవు ?"

" ఆర్యా ! అది తప్పించుట సాధ్యమగునని నానమ్మకము. ఇట్టి విషమస్థితి సంభవించునని నేను పెక్కు దినములనుండి తలంచుచుంటిని. సక్రమమగు నొక మార్గమును ద్రొక్కి, యెవ రికిని నష్టము వాటిల్లకుండ ప్రవర్తించుటకు వీలు కలదు."

" వకుళ నిర్బంధితురాలగునని నీ విదివరకెరు గుదువా ? నాకిదివరకెన్నడు నట్టి యూహయే జనింపలేదు."

"నాకును తోచియుండలేదు. నావిషయమే నేను ముందు వెనుక లాలోచించుచుకొంటిని. నే నే పతంజలినని యెవరైనను గ్రహించు నెడల సుధాకరామాత్యుని జంపిన నేరము నాపైమో పెదరని నే నెరుగుదును. నిర్దోషినగు నేను అన్యాయముగ శిక్షకు పాల్పడను. నేను నేరస్థు డను కానని స్పష్టపరచుకొనవలసి యున్నది. కాని యట్లుచేయుట యందన్యులను రచ్చకీడ్వ నవసరము లేకుండ ప్రవర్తింపవలసి యున్నది. అటుచేయనగునని నాకు తోచెడిని."

" ఎట్లు "

" నిజమంతయు చెప్పకుండుటవలన. నేను చెప్పుటవలన నెవరు చిక్కులబడెదరో వారిని గుర్తింప లేకపోవుటవలన—ఇది సాధ్యమగుననుకొందును "

వారి చూపు లొక్క నిముసము మాత్రి మొండొంటిని కలసికొన్నవి. ఆచూపులందలి

అంతరార్థము అనంతము. ప్రఫుల్లుడు మరల సంభాషణమును సాగించెను.

"ఏది యెటులున్నను నీపూర్వ చరిత్రము బట్టబయలు కావలసిందే కదా?"

"కానిండు. ఈహత్యయొక్క భారము వకుళపైనుండి తొలగించునపుడు నాభుజస్కంధములపైనుండియు తొలగించుకొందును. నా నిజనామరూపములను వెల్లడిపరువలెనని నేను పెక్కుదినములనుండి కోరుచుంటిని"

"ఇన్నాళ్ళు నీవేల యూరకుంటివి?"

"ఆర్యా! ఈ రహస్యము నిన్నాళ్లు గుప్తముగనుంచినది నాకొరకు గాదు."

ప్రఫుల్లుడది యెరుగును తనకొరకే రహస్యముగ నుంచబడెననియు నెరుగును. కాని ఆతడు ప్రత్యుత్తర మొసగలేదు. సంతాపకరములగు సంశయములు పెక్కులాతని యాలోచనల నరికట్టెను.

ప్రఫు;- నా పెట్టెలోనుండి నీవా యుత్తరము నపహరించి, పిమ్మట నాకా యుత్తరము వ్రాసితివికదా?

వాసు;- మీపెట్టెలోనుండి నేనా యుత్తరము నపహరింపలేదు. మీరు దానినందు దాచితిరని చెప్పితిరేకాని యది వాస్తవముకాదు. ఇతర కాగితములతో కలిపి దానిని మీరు చేతబట్టుకొని పోవునపుడది మీచేతులలోనుండి జారి పడియుండవచ్చును. దానికి సమాధానము నిపుడు విన్నవించుకొందునా?

ప్రఫుల్లుడు తలయూచెను.

వాసు;- ఆయుత్తరము పోయిననాటి యుదయమున మీరు కచేరి గదిలోనికి వచ్చినపుడొక నూతనపురుషుడు నాచెంతనుండుట మీరు గమనించి యుండవచ్చును. అతడు నలందాపురవాసి. ఒక కృషీవలుడు. దేవదేవుడనువాడు. నేనేదో కార్యాంతరమున బయటకు పోయియుంటిని. తెరువరి యొకడు త్రోవ చెప్పుమనికోరుచు నా యెదుట నాగెను. ఆతనికి సమాధానము చెప్పునపుడు మేమొకరి నొకరు గురుతించుకొంటిమి. నేను కొంత ధనమును - ఇన్నూరు రూప్యములను — అతని కీయవలసి యుండెను. రామచంద్రు, యీపేరు మీరిదివరకు వినియుండవచ్చును.

ప్రఫు:- వినియుంటిని.

వాసు;- రామచంద్రు పరారియగుటకు పూర్వము ఒక దొంగయుత్తరమును సృష్టించి యందుపై నాచేత సంతకము చేయించి, కొంత సొమ్మపహరించెను. దేవదేవుడు నమ్మకముపై సొమ్మిచ్చియుండెను. అది తిరిగి యివ్వనే లేదు ఆ ఉదయమున దేవదేవుడు నన్ను కలుసుకొన్నపుడు తాను గోల్కొండ విడచిపోవుటకు మున్ను తనకీయవలసినసొమ్ము నిచ్చివేసినను సరే లేకున్న నానిజనామము వెల్లడిపరచెదనని బెదరించెను. అతనునాతో గూడ నీ కచ్చేరిలోనికి వచ్చి కూర్చుండెను. ఎంతసేపు చూచినను లేచిపోవడు. నేనేమి చేయవలసినదియు తోచలేదు. నానిజనామమును వెల్లడిపరచినను నాకు భయము లేకుండెను. అప్పటికే ప్రేమచంద్రున కీయవలసిన సొమ్మంతయు చెల్లించి ఋణవిముక్తుడనై యుంటిని. కాని చంద్రనగరమున సందలి వృత్తాంతము వెల్లడిచేయవలసి వచ్చెడిది. ఈ విషమస్థితిని తమ కెరిగించి, నిజమును వెల్లడిపరుపవలెనో లేక నా యిన్నూరు రూప్యములను మీరిచ్చెదరో యడుగవలె

నని తలచితిని. కాని అట్లుచేయుటకు నాకు ధైర్యము చాలలేదు."

ప్రిషు;- ఎందువలన ?

వాసు;- ఎందులకందురా ? నేనీ విషయమును మీతో ప్రస్తాపించుటకు మీకిష్టముగ నుండ దేమోనని తలచితిని. ఇప్పటికైనను మీతో నీప్రసంగము చేయుటకు నాకిష్టము లేదు.

ప్రిషు;- తరువాత చెప్పుము.

వాసు;- నేను నాబల్లవద్దకూర్చుండి పర్యాలోచన మొనర్చుకొనుచుండగా రెండువందల రూప్యములు కావలెనని నీలకంఠుడుమిమ్ముల కోరియుండెను. నేను దేవదేవున కీయవలసిన మొత్తముకూడ నంతయే యగుటవలన నాకు చాల నాశ్చర్యము కలిగినది. మరునాడు ప్రాతఃకాలమున నేను కొన్ని పత్రములతో నీకచ్చేరీలోన ప్రవేశింపగనే మీ యాసనముక్రింద నొక కాగితమును జూచితిని. దానిని మీబల్లపై నుంచవలెనని యెంచి, దానిని తీసిచూడగ నది గతదినమున తమరు వ్రాసిన యుత్తరమేనని తెలిసికొంటిని. నాకు భగవంతుడే తోడ్పడుచున్నాడని నేననుకొంటిని. కావున్న మీరు బుద్ధిపూర్వకముగ నాసొమ్మును నాకీయవలెనను సంకల్పముతో నాయుత్తరము నచట విడిచియుంటిరేమోయనికూల తలపోసితిని. ఈ రెండు యూహలును సమ జనములగునా కాదా యని నేను తర్కించుకొంటిని. నేనాయుత్తరమును గైకొని స్వగృహమునకేగి, పతంజలివేషమునకై తెచ్చుకొన్న గడ్డములను మీసములను తగిలించుకొని, భద్రిగుప్తునివద్ద నాసొమ్మును తీసికొంటిని. స్వలాభముకొరకు మాత్రమే నేనటుల చేసియుండలేదు. నేనా యకార్యమొనర్చుట కెంత వెనుకాడితినో వర్ణింపజాలను. సొమ్ము చేజిక్కినపిమ్మట గూడ దాని నుపయోగించుకొనుటకు చాల వెనుకాడితిని. ఆరాత్రి నేను దేవదేవుడు విడిసియున్న బసకేగి, పిలగునెడల మరునాటిరాత్రికి సొమ్మిచ్చివేయుదునని చెప్పితిని. ఈయ లేకున్న నాతడు చేయదలచినది జేసికొనవచ్చునంటిని. దేవదేవుడు మరునాటివరకు వేచియుండుట కియ్యకొనెను. నేనవ్విడింటికేగి యాయుత్తరమును మీకువ్రాసియుంటిని. చంద్రినగరమున సుధాకర రామాత్యుని మరణసందర్భమునందలి రహస్యములు వెల్లడిచేయవలసి వచ్చుచున్నదనియు, నవి గోప్యముగా నుంచుటకా సొమ్ము తీసికొనబడియెననియు, మీకిష్టమగునెడల నందులకు వినియోగింతుననియు నందు వ్రాసియుంటిని. అట్లుగాక, మీసొమ్ము మీకు కావలెనని కోరునెడల నొక చిరునామాకొక యుత్తరము వెంటనే వ్రాయవలెనని కోరితిని. అట్టి యుత్తరము వ్రాయనియెడల, నాదినమున సొమ్ము వెచ్చించెదననియు, నెప్పటివలెనే రహస్యములు గుప్తముగ నుంచెదననియు తెలియజేసితిని. మీరు ప్రత్యుత్తరమంపలేదు. నేనాసొమ్మును దేవదేవున కిచ్చితిని. ఆయుత్తరము వ్రాసినది నేనేనని మీరు గ్రహించిరో లేదోయని నాకనుమానముగనున్నది.

ప్రిషుల్లు;- లేదు. నీపై నాకనుమానము కలుగలేదు. కాని నినొక ప్రశ్నమడుగదలచితిని— నీవు మాయింట గుమాస్తాగా నుండవలెనని కోరివచ్చితివా ?

వాసు:- లేదు. లేదు. నాకు తెలియకుండ నా కాళ్ళు నన్ను మీ చెంత కీడ్చుకొని వచ్చినవి. నా దురదృష్టమువలన నలందా నగరమును విడిచి రామచంద్రునితోనే నేనును పారిపోయి వచ్చినపుడు నాలుగైదు దినము లచ్చటనే గడపి నా కాంతరంగికుడగు నొక మిత్రుని జూచుటకై యాతని స్వగ్రామమగు విజయ నగరమున కేగితిని కాశీనాధుడను నొక వర్తకునియింట గుమాస్తాగా నన్నతడు ప్రవేశ పెట్టెను. నేనచట నొక సంవత్సర కాల ముంటిని. కాశీనాధుడు వృద్ధుడగుటవలన వ్యాపారము నంతయు ముగించుకొని, నాపై మిగుల నభిమానము కలవాడగుట వలన నన్ను మీతండ్రికి శిఫారసుచేసెను.

ప్రభు:- నీవు మాకొనర్చిన సహాయమునకు కృతజ్ఞులము. నీవు నలందానగరమునుండి పారిపోవుట పొరబాటుకాదా?

వాసు:- ముమ్మాటికిని పొరబాటే. నే నేపాప మెరుగనని ప్రమాణము చేయుచున్నాను. నేను నిర్దోషినగుటయే కాక రామచంద్రు దుర్మార్గముల దొరకుచుండెనని కూడ నే ననుమానింపలేను. అతడన్యులను మోస గించినట్లే నన్నును మోసగించెను. ప్రేమ చంద్రునకు యదార్థమిప్పుడు తెలిసినది. రామచంద్రు అమిత వ్యయ మొనర్చుచుం డెనని నాకు తెలియును. ఆతని పినతండ్రి సొమ్మును పంపుచుండెనని చెప్పుచుండెడి వాడు. అది నమ్మకుండుటకు కారణ మగు పడలేదు నేను లాల్ చందునకే నిజమంతయు తెలుపుట గొప్ప తప్పు. గుండెబ్రద్దలయి ఆవృద్ధుడు వెంటనే మరణించెను. నేనిందు లకు క్షమార్హుడను కాను. నేనే ఆతనిని చంపినటుల నెంచుచున్నాను. ఆతని ప్రేత నన్ను తరుముకొని వచ్చుచున్నట్లుండెను. రామచంద్రు సహవాసదోషమువలన ఉత్తర మును సృష్టించినది నేనని యనుమానపడుదు రని వేరొకభయము నన్నావహించినది. అచ్చటనుండి పలాయనమగుట తప్ప గత్యం తరము నాకు స్ఫురింపలేదు. ఆదివారము సాయంకాలమున చంద్రనగరమువరకు పోయితిని. రామచంద్రు పారిపోయిన మార్గ మును వదలి వేరొకమార్గమును పట్టితిని. సాధ్యమగు నెడల వకుళను కలుసుకొని నేను చెడ్డవాడనగుట నిజమయినను, ప్రజలను కొనునంతటి దుర్మార్గుడను గానని విశదము చేసిపోవలెనని నే నుద్దేశించితిని. ఆర్యా! తలవని తలంపుగ ననేకవిషయము లొక్క చో సమకూరుచుండుట విచితగదా!

ప్రభు:- నిజమే నీవట్లె యనవచ్చును.

వాసు:- ఇంకను విచిత్రము. నేను చంద్రనగర మును చేరినదైయెదునిముసములలో నే వకుళను కలిసికొంటిని. నేను మారువేషమున నుం డుట మరచి యామెను పలకరించితిని. ఆమె నివ్వెరపడెను. నిజము నామెతో చెప్పు టకు వెరచితిని. కుటిలులగు మిత్రులవలన కష్టములపాల్పడితినని మాత్రము చెప్పితిని. ఒకటిరెండు దినములు నేను రహస్యముగ తలదాచుకొనుటకు తావుచూపుమని యామె నడిగితిని. నన్నామె భైరవియింటికి గొని పోయి, యొక బాటసారిననియు, నాపేరు పతంజలియనియు చెప్పినది. నేనాయిల్లు విడచిపోవకమునుపే సుధాకరుని మరణవిష యమున చిక్కుకొంటిని ...... నాకింతటి దురదృష్టమేలకలుగవలయునో తోచుటలేదు.

నావిధ్యుక్త ధర్మములను ఋజుమార్గానుసరణముగ నెరవేర్చుకొనవలెనను యున్నతాదర్శములతో నేను జీవితరంగమున ప్రవేశించి యారీతిని మెలంగియుంటిని. పురాకృతకర్మ ఫలమనుభవింపక తప్పదు.

ప్రిఫు:- పురాకృత కర్మఫలముగ నీకంటెను రంత కష్టముల ననుభవించువారు పెక్కురు గలరు. నలందానగరమునందలి నీఋణములన్నియు దీరిపోయినవా?

వాసు:- నాకస్వయముగ ఋణము లెన్నడును లేవు. అన్యులసహవాసదోషమువలన నేర్పడిన యప్పులు పూర్తిగ తీరిపోయినవి. మీకీయవలసిన రెండువందల రూప్యముల నేనిపుడు కూడబెట్టుచున్నాను. సుమారొక నూరురూప్యములు నిలువచేసితిని. మాన్వగ్రామమున నివసించుచున్న నాతల్లిని పోషించుటకు కొంతసొమ్ము వెచ్చించుచున్నాను. లేకున్న నిప్పటికే అప్పులన్నియు దీర్చియుందును.

ప్రిఫు:- నా రెండువందల రూప్యములకై నీవు శ్రమపడవలదు.

వాసు:- రెండువందలుకాదు. రెండులక్షలయినను తీర్చుటకు నా కంఠమున ప్రాణములున్నంతవరకు ప్రయత్నింతును.

ప్రఫు:- నేను మోక్షమార్గమున నీకు సహాయము చేయగలను.

వకుళను వదలివేయుడని ప్రిఫుల్లుడాజ్ఞాపించినంతమాత్రమున నా పెకు విముక్తికలుగజాలదని వాసుదేవుడెరుగును. ఈ విషయమును రఘునాధునితో ప్రస్తాపింప నతడు యదార్థమును జెప్పుటకు వెనుకాడలేదు.

"ఆపె నిర్దోషియని మీరు చెప్పుచున్నారు, విశారదుడు కూడ నటులనే చెప్పుచున్నాడు. కావున, 'నీపెను వదలివేయు' డందురా? ఆకాశమునందలి నక్షత్రములనుకూడ తెమ్మనుడు! ఈ రెండు పనులకు నేనసమర్థుడనే!"

ప్రఫు:- ఆపె యేపాపము నెరుగదు. ఈవిశారదుడు — యితడెవరో నీవెరుగుదువు — ఇందలి సత్యాసత్యముల నిరూపింపగలడు.

రఘు:- ప్రఫుల్లచంద్రా! వకుళ నిర్దోషి యని మీరు చెప్పవచ్చును! విశారదుడుకూడ నందులకు తలయూపును. తాను నిర్దోషినని కూడ చెప్పదలచును. కాని యీ వాదమంతయు నిరర్థకమని మీరెరుగుదురు. హంతకు డెవడో, దోషి యెవడో, వానిని బట్టి తెచ్చి, 'ఇతడే దోషి' యని మాదన్న జయచంద్రామాత్యుల యెదుట నిరూపించుట సార్థక మగునని మీకు తెలియును. అటులయిననే వకుళను విడచుటకు వీలుండును.

ప్రఫు:- మా కుటుంబ విషయములయిన చిక్కులిందెన్ని యిమిడి యున్నవో నీ వాలోచించితివా?

రఘు:- నేనూహించుకొనగలను.

రఘునాధునకు యదార్థ పరిస్థితు లెరుకపడలేదని ప్రిఫుల్లు డెరుగును. అయినను ఆవిషయము నతడు తర్కింపలేదు.

ప్రిఫు:- ఇందలి సత్యము నాతండ్రికి గోచరమగునెడల నతడీ విషయమున నెట్టి ప్రసక్తియు కలుగ జేసికొనడు. నా మాట నమ్ముము.

రఘు:- ఆవ్యక్తి యెవరో నీ వెరుగుదువుగదా?

ప్రఫు:- ఎరుగుదును. భగవంతుడు నన్ను దయజూచుగాక!

ప్రిఫుల్లుని హృదయాంతరమున నావేదన

యినుమడించెను. రహస్యమును బయల్పరుప వచ్చి నంపుల కాతని కాతురము హెచ్చెను. రఘునాథునకుగూడ నాతనిపై మిగుల జాలి కలిగెను. రహస్యమును బయల్పరుపవలసిన యావుసరము లేదని తెలుపునటుల విశారదుడు తల యూచెను. ప్రఫుల్లుడు తలవంచుకొని హృదయకుహరమున నుబుకుచున్న యావేదనా తరంగముల సాధ్య మగునంతవరకు నుపశమింపజేసికొని కర్తవ్య మేమి యని యాలోచింప జొచ్చెను. రఘునాథునకును జయచంద్రునకును సంతృప్తికరమగు సమాధానము చెప్పిననేగాని వకుళకు కారాగృహవిముక్తి కలుగదని యాతడెఱుగును.

ఒక క్షణములో ప్రఫుల్లు డేకాంతముననున్న తన జనకుని సందర్శింపనేగెను. ఆలసించునెడల మనోధైర్యము తన్ను వీడునను భయమువలన గాబోలు. ప్రఫుల్లుడు జనకుని గదిలో ప్రవేశింపగనే ప్రస్తుతాంశమును విన్నవించెను. ఆతడు వేదనాయుతమగు ప్రశాంతముతో నాల్గుమాటలను మాత్రము చెప్పెను ఆత డావేశపూరితుడై యున్నటుల ప్రత్యక్షముగ నగుపడుచుండెను.

"వకుళ నిర్దోషియని నీకు తెలియవచ్చినది కావున నాపెను విడిచివేయవలెనని నేనాజ్ఞాపింపవలెనా? ప్రఫుల్లా! ఏమిది? నీయభిప్రాయమేమి?" అని జయచంద్రు డాశ్చర్యముతో పల్కెను

ప్రఫుల్లు డాయుదంతము నెఱిగించెను. ప్రమాదకరమగు వాక్య మేదేని తననోటినుండి బయటపడునేమోయని శంకాన్వితహృదయముతో నతడు చెప్పిన కథ సమంజసముగ లేదనుటలో విశేషములేదు.

జయ:- ప్రఫుల్లా! నీవు చెప్పునది నాకు బోధపడుటలేదు. వకుళ నిర్దోషియని నీ వేస్వయముగా నెరుగుదువా? ఆసమయముననే నీకది తెలియునా?

ప్రఫు:- అవును. నేనే స్వయముగ నెరుగుదునని చెప్పుట సత్యదూరముకాదు.

జయ:- అనగా, దోషియెవరో నీకు తెలియుననుటయేకదా?

ప్రఫు:- లేదు. నాకది తెలియదు.

ఈ సమాధానము చెప్పునపుడు ప్రఫుల్లుడు బుద్ధిపూర్వకముగ నసత్యము చెప్పుచున్నటుల నాతనిముఖము చెప్పక చెప్పుచుండెను.

జయ:- అటులైనయెడల నీవిషయమున నీకేమి తెలియునని నీవిందు జోక్యము కలుగజేసికొనజూతువు? అది ఆత్మహత్యతప్ప వేరొండుకాదని నీవు మొదటినుండియు చెప్పుచునే యుంటివే!

ప్రఫు:- అది ఆత్మహత్యకాదు.

జయచంద్రున కిదియంతయు వింతగ కాన్పించెను "అది ఆత్మహత్యకాదని నీకు మొదటనే తెలిసియుండెనా?" అని జయచంద్రుడు కుమారుని ప్రశ్నించెను.

ప్రఫుల్లుడు దీనికేమి సమాధానము చెప్పును? ముఖ్యమగువానిని బయల్పరచి అప్రస్తుతమగు విషయమును గోప్యముగ నుంచుటెట్లు? ప్రఫుల్లుడు లోలోన తర్కించుకొని యిట్లనెను.

"ఆర్యా! నామనమునం దానుమానముండెడిది. ఏదియెట్లున్నను, వకుళను విడిచిపెట్టవలెను."

జయ:- ప్రఫుల్లా! నీవు చెప్పునదేమియు నాకు బోధపడుటలేదు. నిన్నే నేను గ్రహింపలేకున్నాను. ఈవిషయమున నీప్రవర్తనము నాకు వింతగనే కన్పడుచుండెను. దోషి

యగు వానిని నీవు మనఃపూర్వకముగ దాచి వేయుచున్నట్లు మాదన్నమంత్రి తలచుచున్నాడు.

ఈవాక్యములను వినినంతనే యిన్ని సంవత్సరములనుండియు నెవరి నెందులకు తాను దాచుచుండెనో వెల్లడి చేయవలెనని ప్రఫుల్లున కుత్సాహము జనించెనుగాని ప్రయత్నపూర్వకముగ నతడాయావేశమును కొలదికాలములో శమింపజేసికొనగలిగెను.

"ప్రఫుల్లా! నీ వేమని యాలోచించుచున్నావు?" అని జయచంద్రు డడిగెను.

"నాయనా! పతంజలిచేత నాతని యుదంతము నంతయు జెప్పించకుండ నుండుటకు మార్గమున్నదా యని నే నాలోచించుచున్నాను."

"ఏమేమి! పతంజలి పట్టువడెనా?"

"అత డెచట నున్నదియు తెలిసినది. అతడే—"

ఆగదియొక్క తలుపు తెరువబడుచున్నట్లు శబ్దమాయెను. ప్రఫుల్లుడు వెనుకకు తిరిగిచూచెను. జయచంద్రుని వంశమున కెట్టి కీడు మూడ నున్నదో యెవ రెరుగుదురు?— అట్లా గదిలో ప్రవేశించినది మాదన్న మంత్రియు, న్యాయాధిపతియగు సురేంద్రుడును.

ఇంతిం తనరాని హృదయవేదనమున కోర్చి శరీరారోగ్యమును చెడగొట్టుకొని యేయంశమును రహస్యముగ నుంచవలెనని ప్రఫుల్లచంద్రుడు రాత్రిందివములు ప్రయత్నించుచుండెనో అది నేటికి బహిరంగము కావలసి వచ్చెనని అతడు తలచెను.

# విమర్శనలు

## వినిర్మలజీవి:—

వేదాంతసూత్రముల కాలవాలమగు నీహైందవభూమి నేటి రాజకీయతంత్రములనిన విసువు చెంది దారితెన్ను గానక నడచుచున్నది. పరాధీనమైన జాతికి వేర్వేరు రాజకీయములు లేవు. కాని పాశ్చాత్యవిద్య నభ్యసించినవారెల్లరు పాశ్చాత్య వాసనలకు చిక్కుకొని, తర్కశాస్త్రమే శరణ్యముగ గైకొని, మాటమాటకు అక్షరమునకు ప్రత్యేకార్థముల నాపాదించుకొనుచు, తమతమ స్వార్థముల నెరవేర్చుకొనుచున్నారు ప్రజలు, రాజకీయ (కు) తంత్రముల నెరుగని ప్రజలు, నాయకులయొక్కయు విద్యావంతులయొక్కయు చర్యల నవగాహన చేసుకొనలేకున్నారు. వాగ్వాదనలు విశేషముగ చెలరేగుచున్నవి. తర్కవితర్కములు, నిందాపనిందలు, వ్యక్తిదూషణలు పెచ్చుపెరిగినవి. ప్రవర్తన, అనుగుణ్యత మచ్చునకైన గానరావు.

నాయకుల యన్యోన్య విమర్శనలట్లు విషపూరితములై యున్నపుడు, ప్రజలకు వీరియెడ భక్తి యెట్లుండగలదు? అహంకారము, స్వాభిమానములు దలయెత్తుటతోడనే అసహాయోద్యమము క్షీణదశకు వచ్చినది. అసమర్థులు కూడినపు డసహాయోద్యమమున కింతకంటె మఱియొక గతిపట్టదు. పనిపాటలులేక అంతఃఛిద్రములు పెంచుకొని ఉద్యమమునకు శిథిలావస్థ దెచ్చి పెట్టుకొనిరి. ఏకాయత్తచిత్తులను జేయు ప్రణాళిక లేకపోవుటచే వ్యక్తిదూషణలు బయలువెడలినవి. ఏసహాయముచే మనము పైకివచ్చినామో, ఆసహాయమునే మనకిపు నెర [illegible]ట్లు నిరసించుచున్నాము. ఆడలేక మద్దెలఓడన్నట్లు శ్రీనివాస అయ్యంగారివంటివారు పత్రికల నేల నిందించవలెను? శుద్ధనోటే జర్లు తమ యంతరాత్మకుగూడ వ్యతిరేకముగ రాజకీయములలోనికి కులకక్షల నేల ప్రవేశపెట్టవలె? వినిర్మలజీవి లక్షణము లివికావు. వినిర్మలజీవికి స్వాతంత్ర్యనినాద మెచటినుంచి వచ్చినను గౌరవప్రదమే. జఠరాగ్ని కాదు, అధికారుల నిరంకుశము గాదు, సంఘబహిష్కారము కాదు, మరియేది వినిర్మల జీవిని తన కార్యముపట్ల విముఖునిగ జేయజాలదు. వినిర్మలజీవెల్లపుడు సిద్ధాంతములు నిర్ణయించుకొని కార్యసంకల్పమునకు దిగునుగాని, కార్యమును సంకల్పించుకొని సిద్ధాంతమును నిర్ణయించుకొనడు. వినిర్మలజీవి ఆదివారమునా డండలమెక్కనూ మెక్కడు, సోమవారమునాడు జోలికట్టినూ కట్టడు.

## జయంతి:—

స్వాతంత్ర్య విహీనమగు మనుజుని జీవితము వ్యర్థము. మారుమూలల కాలము గడుపుచు స్వేచ్ఛా గౌరవములు గాపాడుకొను చున్నవారనేకులు గలరు. అట్టివారికి స్వాతంత్ర్యనినాద మెచటినుండి వచ్చినను కర్ణపేయమే. పసుల కాపరుల యానంద తన్మయత్వము, పక్షిరాజముల స్వేచ్ఛావిహారము, సెలయేళ్ళ ప్రవాహము, ఇవన్నియు స్వాతంత్ర్యపిపాస నధికము చేయుచునే యుండును. అట్టులనే వాఙ్మయ వికాసమునకు తత్కాలమున మానవోద్ధరణమునకు గడంగు యే సంకల్ప వికల్పము లయినను ఆకర్షణీయములే. జాతీయాధిక్యత ఆజాతియొక్క వాఙ్మయాధిక్యత ననుసరించియే యుండును. జాతీయవికాసమునకు దోడ్పడు యెట్టి వాఙ్మయ ప్రయత్నమున కైనను హృదయపూర్వక స్వాగత మొసగెదము.

మా బందరుపుర వాస్తవ్యులును, కవిశేఖరులు నగు విశ్వనాథ సత్యనారాయణగారి సంపాదకత్వమున వెలువడిన "జయంతి" పత్రికకు స్వాగత మొసంగుచున్నాము. ఇది త్రైమాస పత్రిక. పత్రికయొక్క యాజమాన్యము ననుసరించి చిరకాలము వర్ధిల్లగల దనుటకు సందియము లేదు. ఇందు చక్కని విమర్శనలు, భాషావిషయిక మయినవి, చరిత్రాత్మకమైనవి, కలవు. ప్రతి పత్రికకు నొక సంపూర్ణ వ్యక్తిత్వమున్నపుడే జయప్రదముగ కొనసాగగలదు. ఆంధ్రదేశములోని పత్రికలన్నియు వెనుకబడి యుండుటకు గారణము పత్రికలన్నియు నొకే మార్గమున నడచుటయే. భాషావిషయిక విమర్శనలతోగూడి స్వాతంత్ర్య గీతారవములతో నొప్పారు జయంతి ప్రత్యేక వ్యక్తిత్వముగలిగి యున్నదనియే మా నమ్మకము. త్రైమాస పత్రిక యగుటచే విమర్శన లింకను విశేషముగ ప్రచురించుటకు సావకాశము గలదు.

## ఉపసంహారము :—

ఆంధ్ర దేశమునందు మా కృష్ణామండలము విద్యావంతులతోను, నాగరికులతోను గూడి యున్నదనుట నిర్వివాదాంశము. ఇందువలననే దేశమునందు యే నూతనోద్యమము ప్రవేశించినను దానికి మా మండలము దోహదమొసంగుచున్నది. బ్రాహ్మణేతరోద్యమము, తరువాత కమ్మకులాభిమానము, ఆపైని అడుసుమిల్లి లింగం పార్టీలు మున్నగు ద్వేషపూరితమైన వుద్యమములు తలయెత్తి మండలము నంతను నీచస్థితికి దెచ్చినవి. మన నాయకులు తటస్థముగనున్నంతకాలము కుల వైషమ్యములు హెచ్చు పెరిగినవి. ఆరు సంవత్సరములు విధి విరామములులేక ప్రజలు పడినపాట్లు దేవుని కెరుక.

ఇది యటులుండ, నిజమైన బాధ్యతలేని స్వల్పాదాయములుగల ఈ స్థానికసంస్థలనే మనము నిర్వహించుకొనజాలమనెడి కళంకమును దెచ్చి పెట్టుకొంటిమి. స్థానిక సంస్థల నాక్రమింపుడను కాంగ్రెసు తీర్మానమును కెడచెవినిబెట్టి ప్రజల యిక్కట్లుమితిమీర నేటికి కన్నులు తెరచితిమి. మా మండల చరిత్రయందు జూన్ 21 వ తేది అత్యంత ప్రాముఖ్యమైనది. కుల పిశాచమును పాతాళహోమము చేయుటకు కొన్ని కాంగ్రెసు సిద్ధాంతముల నయినను నణగద్రొక్కుకొని రాజకీయ తంత్రములను పన్నితిమి. ఈపరిస్థితుల నవలోకించినప్పుడు, రాజకీయములో యెత్తుకు పైయెత్తు వేయవలెననెడి తిలక్ మహాశయుని యాదేశము సరసమని తేలుచున్నది. ఏది యెట్లున్నను జిల్లాబోర్డు పాలనమున మీర్జాపురము హాయామునకు స్వస్తి చెప్పుటకు కావించిన భగీరథ ప్రయత్నములు జయప్రదములైనవని వ్రాయగల్గుటకు సంతసించుచున్నాము. "రెడ్డిగారు, రెడ్డిగారు" అని బొబ్బలిడిన నాయకులును పత్రికలును, కమ్మకుల పిశాచమును లేవనెత్తి చూచిన నాయకులును పత్రికలును చివరకాలమునందయినను తమ అపోహలను దిగమ్రింగుకొని శ్రీయుత ధన్వాడ రామచంద్రరావుగారిని ఏకగ్రీవముగ జిల్లాబోర్డు అధ్యక్షులుగ నెన్నుకొనుటలో దోడ్పడుట సంతోషావహము. కొన్ని సందర్భములలో కొన్నికొన్ని నిజసంగతులను తెలిబుచ్చవలసి వచ్చినపుడు మమ్ములను పరిహసించి మా నాశనమును అపేక్షించిన పత్రికలు లేఖకులు నేడు తమతమ సిద్ధాంతములను మార్చుకొనుటవలన సత్యమే జయము పొందుననుసామెత సార్థకమగుచున్నది. ఇన్ని పరిస్థితులు మేళవించి ప్రజలలోను, నాయకులలోను ఐకమత్యము కుదురుటవలననే మీర్జాపురాధీశ్వరుడు కృష్ణాజిల్లాబోర్డు భవనముపై కడచూపునయినను ప్రసరింపజేయక ఒంటిగంటకే బందరు సరిహద్దులను వీడి ఆత్మగౌరవమును కాపాడుకొనవలసిన స్థితి సంభవించినది. శ్రీరామచంద్రరావుగారు జిల్లాబోర్డును పరిపాలించి మంచిదశకు దేగలరని మాకు దృఢమైన విశ్వాసము గలదు.

## పత్రికలగోడు.

"సమదర్శిని" 10—6—27 వ సంచికలో కె. నరసింహారావు నాయుడుగా రిట్లు వ్రాసియున్నారు.

* * * *

ఆంధ్రభారతి బందరుపురమునుండి వెలువడు మాసపత్రిక. సంపాదకులు తల్లాప్రగడ రామారావుగారు. వీరు వ్రాయు వ్యాసములవల్ల భావములో వీరి కేమాత్రము ప్రవేశము లేదని జెప్పవచ్చును. వీరికి వ్యాస విచక్షణయన్న నేమియు తెలియదు. వారు భావములో ప్రావీణ్యులై యుం

డినగదా వ్యాస వివక్షణ చేయుటకు? వీరు యే స్కూలు ఫైనల్, ఇంటరుమీడియటువఱకు చదివి, భావ కవిత్వముతో రెండు పద్యాలు అల్లటం నేర్చి కథలు వ్రాయుట వచ్చినప్పటి కొక పత్రికాధిపతియై వెలసినారు. పత్రిక పోషణ జరుగవలెననిన దాని కార్యనిర్వాహక వర్గ మంతయు యశము నార్జించినవారై యుండవలయును. వారిచే నడుపబడు యీ పత్రిక నుచ్చదశలోనికి రావలెననిన తత్సంపాదకులు వ్రాయు వ్యాస రాజములవలన వచ్చును కాని, భాష యేమియు నేర్చుకొనక పత్రికంతయు తప్పుల తడికగా జేసి, భాష కెనలేని ముప్పు దెచ్చుచున్నారు.

ఈమాసపు టాంధ్రభారతిలో సంపాదకులు వారి యింటి వ్యవహారములనుగురించి వ్రాసియుండిరని బందరు పురమంతయు గగ్గోలుపడుచున్నది. అది యెంతవరకు సత్యమో గాని, అప్రస్తుత ప్రసంగములు దెచ్చి ప్రచురించుట హేయము, నీతి విరుద్ధము. వారియొక్క స్థితులు లోకమునకు వెల్లడి యగుటకు కాబోలు! వారినిగురించి లోకమంతయు విచిత్రముగనే చెప్పుకొనుచున్నవి. కాని, వారి సంసార గోడు నెప్పటి సమాచార మప్పుడే పాఠకుల కెఱిగింప జేయుటకేగాబోలు, యీపత్రిక స్థాపింపబడినది? యే పుట్టలో యే పామున్నదో, యెవరికి దెలియును? తన బంధుల నేమియు నొనర్పలేక నసహాయుని వలె తన గోడు నంతయు పత్రికలలో ప్రచురించిన నేమి లాభము? పత్రికకు గౌరవము వచ్చుననికూడ తెలియదు కాబోలు, మన సంపాదకులకు?

సాభిప్రాయ విశేషములలో కృష్ణాజిల్లాబోర్డు సందర్భమున సీతారామయ్యాగారిని దూషించినట్లుగ యున్నది. ఆవ్యాసమువల్ల ఆంధ్రభారతి సంపాదకులకు, సీతారామయ్యాగారికి మనస్పర్థ లున్నవని తోచుచున్నది. సీతారామయ్యాగా రుదారస్వభావులు, శాంత హృదయులు, నిర్మల స్వభావులు. కాని సీతారామయ్యాగారనిన అంత యేవగింపు యెందులకో తెలియకున్నది. మనస్పర్థ లుండవచ్చును వైషమ్యము లుండవచ్చును. కాని వారినిగూర్చియు, తమ పత్రికలో వ్రాసి వారి గౌరవమును గూడ పోగొట్టుచున్నారు. చేత కలమున్నదని యెంచి తామిచ్చవచ్చినట్లు వ్రాయుటయేనా? లేనిపోని నీలాపనిందల నన్నింటిని ప్రచురింపజేయుటయే వీరిపనిగాబోలు! పత్రిక చేత నున్నదని యెంచి, గృహ కల్లోల విషయములను వ్రాయుటయా? అనవసర విషయము వ్రాసి ప్రజాందోళన జేయుటకంటె, పత్రిక ప్రచురించుట విరమించిన బాగుండునని మా యుద్దేశ్యము.

* * * *

## మా మనవి :—

పత్రికా సిద్ధాంతములను వ్యక్తీకరించుట పత్రికాధిపతియొక్క విధికాని, పరులయొక్క విధి కాదు. ఒకపత్రికను విమర్శింపబూనినపుడు, ఆపత్రిక యేయుద్దేశ్యములపై నేర్పడినదో తెలిసికొని విమర్శించుట న్యాయము అన్నిపత్రికలు నొకేమార్గమున త్రొక్కిన ప్రయోజనము లేదు. కథలు, తమాషాలు సాభిప్రాయ విశేషములతో కొందరికి విసువు జనించవచ్చునుకాని వాటినే అత్యంతముగ ప్రేమించువా రనేకులుందురని విమర్శకులు మరువకుందురుగాక.

“ సమదర్శిని ”లో కె. నర్సింహారావునాయుడుగారు వ్రాసిన “ పత్రికలగోడు ” అనువ్యాసమును మాకు సంబంధించినంతవరకు పైన పునర్ముద్రించితిమి.

నరసింహారావు నాయుడుగారు మాపత్రిక మీద కావించిన విమర్శన కితరపత్రికల కేల పోవలయునో తెలియకున్నది. మాకే పంపియున్న యెడల సంతసముతో ముద్రించెడివారము.

ఓ నాయుడుగారూ, మేము భాషాప్రవీణులము కాకపోవచ్చును. స్కూల్ఫైనల్, ఇంటర్మీడియెటుతో మాచదువు చాలించుకొనియుండవచ్చును భావకవిత్వము వ్రాయగలమని మీరు పొరబడియున్నారు. అదియును మాకు చేతకాదని మనవిచేసుకొనుచున్నారము. అంత మాత్రమున విమర్శనాధికారము మాకు లేదందురా? ఒక నాటకమునందు పాత్రను ధరించకపోవచ్చును. సంగీతము రాకపోవచ్చును. అంత మాత్రమున నాటకమునం దేయేపాత్రలెట్లు

ప్రవర్తించినవో తెలిసికొనజాలనూ? ఇంకొక మాట. పత్రికాసంపాదకులకు స్కూల్‌ఫైనల్ ఇంటర్మీడియెట్ చాలదనియు, బి. ఏ; ఎం. ఏ, డిగ్రీలుండవలయుననియు మీతలంపుగాబోలు. బిపిన్ చంద్రపాల్ ముట్నూరి కృష్ణారావు గార్లవంటి వార్లకు మీయాదేశముల ప్రకారము పత్రికా ప్రపంచమునందు స్థానమేలేదు. అట్టి వారి తరగతికి మావంటి అల్పులుకూడ చేర గలుగుట మాయదృష్టమే గాని వేరుకాదు. అదికాకపోయినను, పత్రికాధిపతులకే యిట్టి డిగ్రీల యావశ్యకతను ప్రతిపాదించుచున్నపుడు, పత్రికా విమర్శకులకెట్టి డిగ్రీలు నిర్ణయింతురో తెలిపి, తమనామమునకు చివర యేమి డిగ్రీ తగిలించవలయునో సెలవిండు.

నాయుడుగారూ, మాపత్రికలో మేము ప్రకటించిన యింటివిషయములేమో తాము ఋజువు చేయగలరా? ఋజువు చేయలేనపుడు మీరువ్రాయు వ్రాతల కర్థమేమి? మీరు మాయింటివ్యవహారములను దెలిపినచో నసహాయులమైనను తమబోటివారి సహాయమును గైకొని నంసారసాగరము నీదగలమను ధైర్యము మాకున్నదిగాన, తామొకింత ముసుగును తొలగించి దర్శన మిప్పింపుడని ప్రార్థించుచున్నారము. ధైర్యమున్నట్లు చేయవలెనుకాని చాటు నుండి యొకదెబ్బకొట్టిన ప్రయోజనములేదు.

ఇక కృష్ణాజిల్లాబోర్డు విషయము. సాభిప్రాయ విశేషములలో సీతారామయ్యగారిని దూషించితిమట. సీతారామయ్యగారికి మాకు మనస్పర్థలున్నవట. ఏమి చిత్రమండీ నాయుడుగారూ, రాజకీయవిషయములలో అభిప్రాయభేధము ఉండకూడదా? కర్జనుప్రభువు కాంసర్వేటివ్ అయితే, ఆయున అల్లుడు కార్మిక వర్గమునకు చెందలేదా? మోతీలాల్ నెహ్రూ స్వరాజ్య పక్షమునకు చెందితే జవహరలాల్ నెహ్రూ సోషలిస్టుపక్షమునకు చెందలేదా? అయినను మేము చేసిన దోష మేమున్నది దూషణమేమి? "సమదర్శని"యు మెచ్చుకొనుటవలననేకదా మాకృష్ణాజిల్లా బోర్డు వ్యాసమును పునర్ముద్రించుకొనినది! సీతారామయ్యగారు రెడ్డిగారిని అధ్యక్షులుగ చేయవలెనని ప్రయత్నించిన మాట అబద్ధమా? అట్లయినచో సీతారామయ్యగారు మా వ్యాసము నేల ఖండించలేదు? వారు ఖండించలేదు సరే, శ్రీ నాగేశ్వరావు పంతులుగారిని కొన్ని విషయములను తెలుపగోరితిమి వారేల తెలుపలేదు? వారును వారును పెద్దలగుటచే కాబోలు. రాజకీయవిషయములలోకూడ సత్ప్రవర్తన కావలసియున్నది. "సత్ప్రవర్తన, సత్ప్రవర్తన" అని గోష్ఠి గోలపెట్టెను పాశ్చాత్య రాజకీయమంతయు సత్ప్రవర్తన లేక చిందరవందరయై యున్నది. అట్టి దురవస్థ మన రాజకీయములందు చొచ్చుచున్నటచేతనే గాంధిమహాత్ముడు రాజకీయమునందాధ్యాత్మిక సూత్రముల బ్రతిపాదించెను. దీనిని జ్ఞప్తియందుంచుకొని, ఒకవిషయమాలోచింపుడు. నిన్న జస్టిస్‌పక్షము, యీరోజున కాంగ్రెసు, రేపు స్వతంత్ర, యెల్లుండి యింకొకటి అవలంబించుచున్న రెడ్డిగారినిగాక, నిరాడంబర జీవులును నిగర్వులును కాంగ్రెసు పక్షపాతియునగు శ్రీ ధన్వాడ రామచంద్రరావు గారిని అధ్యక్షులుగ నెన్నుకొనమనుటయా, మాదోషము!! ఈదోషమేనా, సీతారామయ్యగారి "ఉదారస్వభావము, శాంతహృదయము, నిర్మలస్వభావమునకు" ముప్పుదెచ్చినది? ఇటు

వంటి ముప్పు యెట్టిదో చదువరులే యూహించుకొనగలరు.

ఇంక భాషకుముప్పుదెచ్చితి మందురా? దీర్ఘససములు,ప్రబంధపదతస్కరణములకు మేము దిగ్గజాలకున్నను వాగ్ధోరిణిని గ్రామఫోనుమాదిరిగ గురిపింపజాలకున్నను మాట్లాడుకొను భాషలో మాయుద్దేశములను వెలిబుచ్చదలచితిమి. అట్లనే వెలిబుచ్చుచున్నాము. వెలిబుచ్చగలము. ఇది దోషముకాదని ఘంటాపథముగ నుడువగలము.

పత్రిక కగౌరవము కలిగినను, ప్రజాకంటకము గలిగినను, మాపత్రికను జంకులేక విరమించెదము దాని కొకరి సలహా యవసరములేదు. ప్రపంచమునకు లేశమాత్రము మాతో నవసరములేని యెడల పట్టుకు ప్రాకులాడు వారము కాము. ప్రస్తుతముమాపత్రికకుప్రజలుచూపు ఆదరణ గౌరవములుతక్కినపత్రికలయెడచూపు గౌరవాదరణల కేమాత్రము తీసిపోవను దృఢనమ్మకముతో మా పత్రికనిలకను కొనసాగించితీరుదుము. అట్లుకాకపోయినను పత్రికనుపెట్టునపుడొకరిని యడుగనులేదు ఇపుడొకరి సలహా నననుసరింపవలసిన యగత్యములేదు. మేము దొంగలముకాము ఏకాంగ్రిసుడబ్బును దుర్వినియోగముచేసినవారముకాము ఏకాంగ్రిసుడబ్బు మాకాధారముకాదు ఏకుటుంబము శిథిలము చేసినవారముకాము ఒకరిని దివాలాతీయించనూలేము, ఇంకొకరిని తీయించుటకు సిద్ధముగనూలేము. న్యాయమని తోచినచో, మాఅంతరాత్మ చెప్పినప్రకారము, స్వపక్ష పరపక్ష వివక్షతలేక విమర్శించ గలవారమేకాని, ఒకరు దూషిస్తారని; మరియొకరి భూషిస్తారని మాసంకల్పములను మార్చుకొనజాలము.

పాపము! నాయుడుగారికి ఉన్న పత్రికలేమియును నచ్చలేదు. ఒకసాహితి పత్రిక వీరికి నచ్చినది. బహుశా వారికి సాహితి పత్రికతో కొలదిపాటి సంబంధముండి తీరవలయును. అదియునుగానిచో, చనిపోయినవాడెపుడును మంచివాడనువాక్యము సార్థకము కావలెనేమో! పాపము, సఖి పత్రిక ప్రశంసకు తగినదేకాని అందు కొన్ని జుగుప్సాకరములగు స్వీయచరిత్రాత్మకములు తుంటరి వ్యాసములున్నవట. సాహితిలోకూడ కట్టివ్యాసములు ప్రచురింపబడలేదని శ్రీనాయుడుగారు తెలుపగలరా? లేక సాహితీసమితిలో చీలికలు తటస్థించి కాథలిక్కులు ప్రొటెస్టెంటులుగ మారినపిమ్మట యేర్పడిన "సఖి" మీదద్వేషమా యిది? మొత్తమున సాహితీసమితి పరిణామముతో మననాయుడుగారికి సన్నిహిత సంబంధమున్నదని మాతలంపు.

మేము వ్యక్తిదూషణ గావించితిమని నింద మోపిన నాయుడుగారే మాపై వ్యక్తిదూషణకు గడంగిరి. వీరివ్యాసము చదివినయెడల వీరికిని భాషాప్రావీణ్యము లేదేమోయనిసందియముకలుగుచున్నది. శ్రీ నాయుడుగారు కూడ మాతోకలిసినయెడల, యిరువురము కలిసి యెచటనైనను భాషాజ్ఞాన మలవరచుకొనవచ్చును.

శ్రీనరసింహారావునాయుడుగారీప్రపంచమందు జీవించియున్న వ్యక్తియా, లేక ప్రచ్ఛన్న వేషధారియా యని సందియము కలుగుచున్నది. కనుక శ్రీ నర్సింహారావు నాయుడుగారిని మాకొకపర్యాయము దర్శనమిప్పింప వేడుచున్నాము. వారికి వీలులేనిచో వారి చిరునామాను తెలియపరచినయెడల నెపుడు దర్శించమనిన నపుడు దర్శనము చేయగలము. సమదర్శిని పత్రికమాత్రము నీవివాదము నింతటితో విరమింపచేయునుగాక.




మచిలీపట్టణము

సంపుటము 2 | జూలై 1927. | 4 వ సంచిక

# ప్రేమ

ఉమర్ ఆలీషా కవిగారు

రంగము :— గుడారము.

(ప్రవేశము :— అభిమన్యుడు, ఉత్తర)

అభి :— ఉత్తరా! అజాతశత్రుండగు యుధిష్ఠిరుఁడు నేడు గురువైన ద్రోణాచార్యునిచే నడపఁబడుచున్న సంగ్రామమున పన్నిన పద్మవ్యూహమును భేదించుటకు నన్ను నాయత్తముచేసి నన్నుద్దేశించి "నాయనా! అభిమన్యుకుమారా! నేడు మావంశము నిలుపవలయుసుమా" యని వాత్సల్యముతోఁ దల దువ్వి పలికినాఁడు. నేనిదే నీయొద్ద అనుజ్ఞను దీసికొని యుద్ధభూమికిఁబోవుచున్నాను. ఇది మిగుల సుదినము. నాతల్లి సుభద్రా గర్భమున నేనున్నప్పుడు, మా మామ శ్రీకృష్ణుఁడు పద్మవ్యూహము ప్రవేశించి రణపాండిత్యము నభ్యసింపఁ జేసినాఁడు అది నేడు ప్రదర్శింపవలసిన యవసరము తటస్థించినది కాంతా! మనకు నేడెంతభాగ్యమో!

ఉ॥ ద్రోణుఁడు కర్ణముఖ్యకురు
దోర్బలయోధులు యుద్ధభూమిలో
బాణములన్ ధరించి రణ
పాండితిఁజూపెడు వేళవారి వి
న్నాణము నెంచి నాపితృలు
ణంబుదీర్చి హితంబుగూర్ప గీ
ర్వాణులు కీర్తిగీతములు
పాడఁగ ప్రార్థివులెల్ల చూడఁగన్॥

ఉత్త :— నాథా! లోకభీకరులును శస్త్రాస్త్రకళాకోవిదులు నగు కురుయోధులంత సులువుగనెట్లు జయింపసాధ్యమగును.

అభి :— ఉత్తరా! సందేహించెదవేలా.

మ॥ తలపూవాడఁగనీక చెక్కుటను స్వే
దంబైన జాల్వారనీ
క లతాంగుల్ గోయుచీ రిపుసం
ఘాతంబు నిర్జించి రా
జ్యలతాంగిన్ గొనివత్తు దుందుభులు
మ్రోయన్ దివ్యులావైరికో

టుల యూడంబుల నెక్కి కీర్తిసతి నా
ట్యంబాడ నేడెంతయుఁ

ఉత్త:— ప్రాణేశ్వరా! నీవన్నది నిజము. నీ పరాక్రమము త్రిలోకవిదితము, కాని

చం॥ పరఁగు మనంచు నీతులను
బల్కెడుదానను గాను గాని యీ
దురమున కీవు బోవలదు
ద్రోహులు కౌరవులన్ జయింప దు
స్తరము సురారికైన రణ
ధాత్రిని గాండివి లేనియట్టి యీ
తరుణమునన్ రణంబు శుభ
దంబని తోచదు ప్రాణవల్లభా॥

అభి:— కాంతా! నీకింత చింతయేల.

ఉ॥ ఆలమదల్చి నా జనకు
డర్జునుఁ డవ్వడు నీకు శత్రులన్
గూలిచి బొమ్మ ప్రొత్తికలకున్ వసనం
బులు దెచ్చియిచ్చె నే
నాలమునందు వారి హతి
మార్చి తదీయకిరీటపంక్తి ర
త్నాలను దెచ్చియిచ్చెదను
నచ్చనగాయలు వాడుకొంటకున్

ఉత్త:— అట్టియదృష్టము నాకుబట్టునా, నాథా!

ఉ॥ ఆడినమాటె కాని యెదు
రాడఁగ నీయవు కోటి చెప్పినన్
వీడవు నీమతంబు గురు
వీరులు క్రూరులు వారినోర్చగా
గూడునె నీకు నీరణము
గూడదు నా మన వాలకించు న
న్నాడదటంచుఁ దిట్టి
తెగనాడకు రమ్ము శుభంబు నీకగున్॥

అభి:— (చేయిపట్టుకుని) కాంతా? నీవెంత జేలవు చతుస్సముద్రముద్రితమయిన ధరాచక్రమునంగల మహావీరాధివీరులు వచ్చి సమర సముత్సాహులయియున్న నీసమయమున వెన్నిచ్చి పాఱిపొమ్మనుచున్నావా, చాలు.

ఉ॥ క్షత్రియుడై జనించిన నె
చ్చాలదు యుద్ధమునందు శూరుడై
శాత్రవులన్ జయించి నిజ
శౌర్యము లోకము మెచ్చబోరు టే
క్షాత్రము గాన నేను జని
కౌరవకోటిని నుక్కడించి మా
గోత్రము నిల్పుదన్ ప్రజలు
గోవులు బ్రాహ్మణులున్ సుఖింపగన్॥

ఉ:— మీ రెన్ని చెప్పినను నేనీయుద్ధమునకుఁ బొమ్మని చెప్పనోపను. నాకేమో నే డన్నియు దుశ్శకునములగుచున్నవి.

అభి:— అవి ఎట్లు సంఘటించును. శకునములు దేవతల చేతులలో నుండును. ముక్కోటి దేవతలు మనకు విజయము చేకూరునని దుందుభులు మ్రోయించుచున్నారు. ఇంక నీవు దుర్నిమిత్తములనేల శంకింపవలెను.

ఉత్త:— అదియేమోగాని మీరు రణంబునకుఁ బోవుటకు నామనంబంగీకరించ లేదు.

అభి:— అది స్త్రీజనస్వభావము.

చం॥ మగడు రణాంగణంబునకు
మార్తురగెల్వఁగఁ బోవుచుండ నా
త్మగరితతో వచింప ప్రమ
దంబున నౌనని చెప్పి పంపఁ నే
మగువయు సాహసింప దిది
మార్గము సాధ్వులకెల్ల ప్రాయికంబుగ
నిటవచ్చుచున్న వినబోలు నెం
వీరుడుఁ నాడమాటలన్॥

ఉత్త:— నాథా? అటులయిన నన్నును నీ వెంట యుద్ధమునకుఁ దోడ్కొని వెళ్ళుము.

అభి:— అది అనుచితము

చం॥ వనములఁ దోడినెచ్చెలులు
పాటలుపాడఁగఁ నాడుకొంను నీ
దినములుబుచ్చినావు రణ
తీరులెఱుంగవు బాణతూణముల్
గొని రిపుకోటి కత్తుకలఁ
గోయఁ నెఱుంగవు పట్టుపట్టి నా
వెనుకకువచ్చిచూడఁదగు
వేడుకయేమివచింపు మంగనా॥

ఉత్త :— నేనును రిపునికాయనిర్భేదన మాచరించుసీకుఁ జేదోడువాఁదోడునై యుండెదను.

అభి :— అది యసంభవము. నీవిట్టి తగని కోరికలు కోరవలదు.

ఉత్త :— ఇది తగనికోరిక గాదు.

ఉ॥ ఎందరు సుందరాంగు లని
కేగరు వైరులగెల్చి ధాత్రి మె
ప్పందరు సత్యభామ నర
కాసురుఁ గీ మొనమొన్న గూల్చె నే
నెందుకు ధార్తరాష్ట్రుల జ
యింపనొ చూచెద నేడు నీవు నీ
శ్శ్యందనమెక్క నేను రథసారథినై
వెనువెంటవచ్చెదన్॥

అభి :— (కౌగలించుకొని) భర్తృదారికా! నీ ప్రసన్నహృదయమున కవనతవదనుఁడనై యభినందించుచున్నాను. అదే రణనిస్సాణము మ్రోయుచున్నది. నాకై ఎల్లవారునుసమరోత్సుకులై నిరీక్షించుచుందురు (నిష్క్రమించును).

ఉత్త :— నేనును నీవెన్నంటియే వచ్చుచున్నాను. అక్కటా శరవేగమునబోవు నిన్ను నేనెట్లు గలిసికొనగలను. నేనింక హతాశను గదా. హతాసులు ప్రాణములువాయుదురదురే, నేనేలవీడలేదు?

తే॥ గీ॥ మెరపువలె నాదువిభుని సుందరముఖాబ్జ
మనియు నెడుకారుమేఘా లవతరించె
వారి గురియుచున్నది నేను బ్రతుకనింక॥

ఉ॥ ఈ యెలజవ్వనంబు నేనెట వీ
డ్తునునొంటిగ దుఃఖభాజనం
బై యెసలారునా బ్రతుకు
నందిక సౌఖ్యము లేదు లేదు నా
ప్రాయము వ్యర్థ మీకలిమి
వ్యర్థము ప్రాణవిభుండు లేని నా
గేయము రుద్రభూమిక మ
గించెద జీవితనాటకాంకమున్॥

సీ॥ ఎవరు నాహితమునరర్థింతురు నేను నె
వ్వరిహితంబెనసి జీవనము సేతు
ఎవరు నన్నింక మెప్పింతురు నేను నె
వ్వరిని మెప్పింపకాపురము సేతు
ఎవరు నా యెలప్రాయమీక్షింతు రెవని ప్రా
యమునుజూచి నేను నెయ్యంబు సేతు
ఎవరు నాముచ్చట లీడేర్తురెవరి ము
చ్చటదీర్ప నేను నిచ్చకము సేతు

తే॥ గీ॥ ఎవరితోడిదొ లోకంబు నెవరువిభుఁడో
అతఁడె లేకున్న నేనెట్లు బ్రతుకగలను
భూమినూడఁదీసినచెట్టు బోలె నేల
వ్రాలి వసివాడి దుఃఖాల గూలిపోదు॥

సీ॥ ఈ ప్రాణములనిల్ప నేదినావిభువచ
శ్శృంగారరససుధా సేచనంబు
ఈ ప్రాయమును బెంప నేది నావిభుదృగం
చలచలన్మధుపూర కలశచయము
ఈకాలమునుబుచ్చ నేదినావిభుసవ్వ్యా
నెమ్మోముసొగసు వెన్నెలవెలుంగు
ఈ వైభవముజూడ నేది నావిభువదం
బులమ్రోయుగజ్జెలం దెలరవంబు

తే॥ గీ॥ లేదు నేనింకజీవింప లేను నాదు
కట్టెకొనిపోయి నానాథు కడను బెట్టు
డతని వీక్షించి ప్రేమాగ్నియందు కాలి
కరగిపోయెద నానాథు కొఱకు నేడ్చి॥

# ఉత్తరుని ప్రశ్నలు

శ్రీ. తి. ప. నారాయణస్వామిగారు

చ॥ కురుపతి సంగరంబె మది । కోరి వడిన్ మనగోగణంబుకై
సరథగజాశ్వ సైనిక వి । శాల చమూనివహంబుఁ గూర్చి యు
త్తరమున నేఁడు గోవులను । దాఁకెనటంచును వింటి నిన్న కా
వరమున దక్షిణంబు పసి । బట్టె సుశర్మ యదెంత చిత్రమో ॥ 1.

కం॥ ననుభూమింజయుఁ దగుణీ । జనమారుని నిఖిలశత్రుసంహారకుఁ జే
కొనక రణభూమికుఱుకుట । గనఁ, బులిమీసములనూఁగు । గతియయ్యెఁగదా ॥ 2.

మ॥ మముఁ జంపించుట కాలఁబట్టగ సుశ । ర్మన్ ముందుగా నల్ప సై
న్యముతోఁ బంచిన మత్స్యభూపతియనూ । నాటోపధాటీచమూ
సముదాయంబు రహింపఁబోవునటకా । సామిన్ గుబేరాశకై
యమితానీకినిఁ బంపఁజేపడువిరా । టాధీశు గోసంఘముల్ ॥ 3.

కం॥ అనియెంచి దక్షిణాశకు । మనగోవులకై త్రిగర్త । మహిరమణున్ జ
య్యన బంచి కొదువబలముల । ననుపఁగ దలపోసె నుత్త । రాశకుఁ గడకన్ ॥ 4.

చ॥ జనపతి దక్షిణంబున సు । శర్మ బహువ్రజమున్ మరల్చి యొ
య్యన గొనిపోవుచుండిన జ । నశ్రుతి వించు ననల్పసైన్యమున్
గొనుచుఁ బసిన్ మరల్పగ న । కుంఠితవిక్రముఁడేగెఁ దండ్రి । యీ
గిను మెద నెంచడయ్యెనె యొ । కింతయుఁ, దప్పెను కార్యపద్ధతుల్ ॥ 5.

కం॥ గాంగేయ కుంభజన్మకృ । పాంగాధిప ముఖ్యరథిక । వర్యులతోడన్
సంగర మొదవెను నిక నా । కుం గాదగు నర్ధమెద్ది । కోరిగణింపన్ ॥ 6.

క॥ రథముఁ గడువంగదగు సా ♦ రథి యొక్కఁడు లేమి నేఁడలంకెద త్రుటిలో
వధియింపనె రిపులను సా ♦ రథి పేరి నొకండు దొరకి రహియించినచోన్ ॥ 7.

క॥ కలహాశనుఁడాడగని ♦ మ్మలభూపతులెల్ల నౌర ♦ బుడుతఁడితండెం
తలుచేసె ననుచు మెచ్చగ ♦ కలనన్ గురువీరులను జీకాకొనరింతున్ ॥ 8.

చ॥ కమలభవాండ భాండమున ♦ గల్గిన శూరసమూహమెల్ల ని
క్కముగ విరాటసూతి కెన ♦ గాదగు చాపరహస్యవేదిఁగం
దుమెయని యక్కజంబుమది ♦ దోప గనాడెడురీతి యుద్ధరం
గమునఁ బరాక్రమించి కడఁకన్ మనగోగణమున్ మరల్చెదన్ ॥ 9.

ఉ॥ ఎక్కటిపోరిలోఁ బశుప ♦ తిన్ విషమాక్షుని దాకినంత న
వ్వక్క ! కిరీటి యెంతటి య ♦ మానుష విక్రముఁడంచుఁ బల్కి పే

రెక్కిన యోధులఁ గలన ♦ లీలజయించిన నన్నుఁ గాంచి యీ
యుక్కరి ; యర్జునాదులనె ♦ యొద్దు రణంబులనంచుఁ బల్కరే ॥ 10.
కం॥ రథమంథర మహితాంభో ♦ నిధిలోఁ దిరుగాడవాహ ♦ నీపతికలఁగన్
రథికుఁడనై సారథినై ♦ మథియింతుఁ గురుప్రవీర ♦ మయసైన్యాబ్ధిన్ ॥ 11.
చ॥ తలపరుగాక కౌరవులె ♦ దఁ బరిమ్లుష్టరిపుప్రజాంగనా
గళవిలసన్మృగీమదను ♦ కర్దమమాదరవారిచేతిలో
నలరెడినన్ను ! నింతపరి ♦ హాసకమయ్యెనే యుద్ధకేళి ? నా
యలవుఁ బలంబు శౌర్యము బ ♦ లాఢ్యులు గఁదురుగాక నేఁడనిన్ ॥ 12.
ఉ॥ కొండొక నాకరాజ్యరమఁ ♦ గొల్పడి మాయమరోదరంబునం
దెండ చొరంగరాని యవ ♦ నీధ్రివనీతతులందుఁ డాగి పం
డ్రిందు సమల్ వసింపగను ♦ ధీయుతులచ్యుత ధర్ములైన యా
ప్పాండవులా ? యరాతిగణ ♦ భంజనుఁలుత్తరుఁడేవిధంబొకో ॥ 13.
మ॥ రదనేమి ధ్వనిగర్జగానిరతధా ♦ గావాహిబాణౌఘ ని
ర్మధితారాతి కిరీటరత్నరుచిశం ♦ పాలీలగారక్తధా
తుధునీవార ముదృష్టియైతగనహే ♦ తూద్భూతకల్పాంతతో
యధరంబోయన మించికౌరవులశౌ ♦ ర్యగ్రీష్మముంబాపెదన్ ॥ 14.
మ॥ వికటాటోపనటత్కబంధము భయా ♦ విర్భావధావద్రథి
ప్రకరం బాహతివల్గదశ్వకముస ♦ ర్వబాంతి క్రుత్తాంగదో
గ్రకబాహుప్రజముల్లుఠద్రథముదు ♦ ర్మేధోవసావిస్రగం
ధికరందాంగకమై చలంగదురముఁ ♦ దీవ్రంబుగాఁ జేసెదన్ ॥ 15.
సీ॥ జాలమార్గములమృగీ ♦ లోలలోచనల్ లీలాదృగుత్పల ♦ మాలలనుప
లీలావరిష్కృత ♦ శూలాయుధులురణా భీలశూరులు వేన ♦ వేలుగొలువ
హేలావిజితశత్రు ♦ జాలుండటంచుజ నాళిమద్విక్రమ ♦ శీలఁబొగడ
పోలనాశ్రితమహీ ♦ పాలలోకంబుతో బాళిమైమత్స్యభూ ♦ పాలుడలర
తే॥ గీ॥ కలనఁగురువీరులను లీలఁ ♦ దోలఁచి యాల
మలఁచి జయమును గొన్ననన్ ♦ దలఁపనట్టి
బలయుతుండొక్కఁడైన నీ ♦ యిలను వేడ్క
నలరునే ? నన్నుసేవించి ♦ వెలయఁగాక ॥ 16



# స్వయంకృతాపరాధము.

తోలేటి పేర్రాజుగారు.

చెడిపట్నం చేరమన్నమాట వెంకమ్మవిషయంలో సార్థకమైంది. చిన్నప్పుడు పుట్టింటనైతేనేం, పెద్దప్పుడు అత్తవారింట్లోనైతేనేం, వెంకమ్మ మహా అయిశ్వర్య మనుభవించింది. పదిమందికి పెట్టినచెయ్యి. భర్త బ్రతికున్నకాలంలో వీరిల్లో చిన్నసత్రము. తీసుకురావడానికి కామేశ్వరావుకు, వండిపెట్టేటందుకు వెంకమ్మకు విసుగు విరామముండేదికాదు.

కామేశ్వరావును చూచి, అతని ఆస్తినిచూచి, అతను బ్రతికున్నంతకాలం" మాబాకీమాట ఏం చెబుతారు? " అని అడిగేవాళ్లేలేరు. కామేశ్వరావు కాలంచెయ్యడంతోనె వచ్చాయి అన్నివైపులనుంచిబాణాలు, వాతంట్లు సమనులు. చెరువెండడంతోనే చేపలు బయట పడ్డట్లు, కామేశ్వరావు కాలంచేయడంతోనే వెంకమ్మ మాధవుడు బయాలు పడ్డారు.

పువ్వులమ్మిన వూళ్లో కట్టెలమ్మడం కష్టం. వెంకమ్మయెవరితో చెప్పకుండా మాధవుణ్ణి వెంటబెట్టుకొని రాజమహేంద్రవరం చేరింది. కాయకష్టం చేసుకొని కలో కంజో తాగి తను పిల్లాడు బ్రతుకకలమనే ధైర్యం. తెల్లవారుజామునేలేచి యెనిమిదింటివరకు ముప్ఫై నలభై బిందెలయితే ఊళ్లో నీళ్లు పోసేది. తొమ్మిదిగంటలు మొదలు ఒకప్లీడరుగారింట్లో వండిపెట్టేది. తానెంత కష్టపడినా మాధవుణ్ణివృద్ధిలోనికి తెచ్చుటకే. మాధవుడికి పన్నెండోయేడు. స్వతహాగా తెలివిగలవాడు. మాధవుడికి పద్ధెనిమిదేళ్లు వచ్చేసరికి స్కూలుఫైనలు పేసయినాడు.

రాజమహేంద్రవరంలోనే ఆర్ట్సుకళాశాలలో మధ్యతరగతి చదువుచున్నాడు. ఇతనికి హిందూఆచారాలు చూస్తే ఆట్టేనచ్చేవికావు. ప్రక్కయింట్లో నారాయణరావుగారని ఒక బ్రహ్మ సమాజకుడున్నాడు. మాధవుడు తెలివితేటలుగలవాడు కనుకనే నారాయణరావు యితన్ని ప్రేమిస్తూఉండేవాడు. తీరికయినప్పుడల్లా బ్రహ్మసమాజాన్నిగురించి చిల్లర ఉపన్యాసాలిస్తూండేవాడు. మాధవుడికి క్రమేణ ఈయన మాటంటె పత్యమైపోయింది. బ్రహ్మ మందిరానికి ప్రతివారం నారాయణరావుగారితో వెళుతుండేవాడు. మాధవుడు ఒంటరిగానున్నప్పుడల్లా పూర్వాచారాలను గురించి ఆలోచిస్తూ "ఏమిటి చెప్మా! మనపెద్దలంతా యింత తెలివితక్కువవారు" అనేవాడు. మాధవుడు ప్రప్రథమములో బ్రాహ్మణేతరులతో భుజించడానికి శంకించినా, క్రమేణా పరిపాటయిపోయింది. ఒక శుభముహూర్తాన యజ్ఞోపవీతంకూడా పరిత్యజించాడు. సమాజం పెద్దలలో ఒకడైనాడు.

వెంకమ్మ మాధవుని ప్రవర్తన ఏమిబాగుండలేదనుకొనేది. భర్తపోయినప్పుడుగాని ఆస్తి అప్పులవాళ్లపాలయినప్పుడుగాని కూడ అంతరివిచారించలేదు, కొడుకు ప్రవర్తనాన్నిగూర్చి బెంగపెట్టుకుంది. తనెత్తుకొడుకుని మందలించేదెట్లు.?

వెంకమ్మ క్రమేణా బెంగచే మంచమెక్కింది అన్నహితువు నశించింది. బల్లిలాగు మంచాన్ని అంటిపెట్టుకుపోయింది. ఒకరోజునకొడుకుని దగ్గరకుపిల్చి మంచంమీద కూర్చోపెట్టుకొని, వీపునెమురుతు "నాయనా! మీనాన్నగారు పోయినా ఏలోపములేకుండా నిన్ను పెంచి పెద్దవాణ్ణిచేసాను, నువ్విప్పుడు బి. ఎ చదువుచున్నావు. దేవుడను

గ్రహించి ఆయుర్దాయమిస్తే, నీపొట్ట నీవు పోసు కోగలవనే ధైర్యం నాకుంది. రామయ్యమామ పెద్దకూతురు రాధను నీకిమ్మని సుబ్బయ్యబాబు చేత కబురంపిస్తాను ఏమిటి నీఅభిప్రాయము?" అంది దీనంగాఅతనికేసిచూస్తూ

మాధ:— అమ్మా, యిప్పుడుతొందరేం. బి.ఎ. పరీక్షకూడాకాని, చూచుకొందా లే-

వెంకమ్మ :— అబ్బాయి-యింకా తొందరేమ నేనా! నీయీడు జనార్దనానికి ఇద్దరాడపిల్లలు ఒక మొగపిల్లాడును నీకు రేపంతర వేదికి ఇరు వైమూడేళ్ళు ఇరవైనాలుగో పడొస్తుంది. అదికాకుండా నీకడుపున ఒకకాయ కాస్తే చూ డాలని నాకుమాత్రముండదు!"

మా :— అమ్మా, నావివాహంవిషయములో నీవు బెంగపెట్టుకోవద్దు, అని వెళ్ళిపోయాడు.

మనోవ్యాధికి మందు లేదుగదా. వెంకమ్మ స్థితి బొత్తిగా మారిపోయినది. నాలుగు మె తుకులైనా నోటనిపోవడంలేదు ఇక రోజు మీాదున్నట్లుంది ఒకరోజున కొడుకునిపిల్చి,

వెం :—నాయనా, నేటికి పదిహేనురోజులనుంచి, ఒక్కమోస్తరుగావుంది. ఏతెల్లవారుఝా మునో యీకాస్తప్రాణం గుటుక్కుమం టుంది-రాధను వివాహంచేసుకోవడంలో ఏ మాలోచించావు" అంది కళ్ళనీళ్ళుగారుస్తూ.

మా :— అమ్మా చెప్పానుకాదా, యీ బి. ఎ. పరీక్ష అయాక చూచుకొందామని.

వెం :— అబ్బాయీ, వివాహం నువ్వెప్పుడుచే సుకున్నా, నేబ్రతికుండగానే మామయ్యను పిలిపించి ఖరారుచేసుకొంటాము, నీఅభ్యంత రమేమిా లేదుగదా"

మా :— అమ్మా, ఇక నీదగ్గరదాచడ మెందుకు యదార్థం చెబుతున్నాను విను. రాధను నేను పెళ్ళిచేసుకోను. మనలో చాలా దు రాచారాలున్నాయి. అవన్నీ బాపేటందుకు నేను కంకణం కట్టుకున్నాను. నేను బ్రహ్మ సమాజంలో ప్రవేశించాను. ఏరజస్వలైన పిల్లనో, లేకపోతే ఏభర్తపోయినపిల్లనో వి వాహం చేసుకొంటాను.

వెం :— నాయనా, బుద్ధిమంతుడవు. త్వరగానే తెమిల్చావు. కష్టపడి విద్యచెప్పించినందుకు ఎంతవాడవయావు! మహా తెలివిగలవా డవు పుట్టావు మమ్మలనుద్ధరించడానికి. స్వ యంకృతాపరాధం. నిన్ననవలసిన పనిలేదు. మాకాన్న పోవడంతోనే ఏకూలిపనిలోనో నిన్నుప్రవేశపెడితేయింతపాపముకాకపోదువు అయ్యో, ఆయాసమెక్కువవుతోంది నీబెంగ తోనేపోతున్నా యాదవకులానికిముసలమ్మపు ట్టింది. నేపోతున్నా నీయిష్టం నారాయణా— నారాయణా—అంటు ప్రాణం విడిచింది—.

మాధవరావు బి. ఎ. పేసయాడు బి. ఎల్ చదువుదామా ఎల్. టి చదువుదామా అన్న మీామాంసలోపడ్డాడు. ఏది చదివేటందుకైనా గణించిపెట్టేఅమ్మ చచ్చిపోయింది. నారాయ ణరావుగారిని అడిగి ఏలాగో బి. ఎల్ చదువు దామనుకొన్నాడు. కాని నారాయణరావుగారు పూటకు గతిలేని నిరుపేదగృహస్థు. "కావలెను" అన్నప్రకటనలు ఏమైనా కనబడతాయేమోనని రోజు వార్తాపత్రికలు చూస్తుండేవాడు. ఒక దినమున ఒక ఆంగ్లదినపత్రికలో నీక్రింది ప్రక టన కనబడింది.

కావలెను. కావలెను.

విద్యారూపుడగు బ్రాహ్మణవరుడు.

ఏబదివేలరూప్యములఆస్తిగల, యౌవనవం తురాలిని విద్యావంతురాలిని అగు ఒకనాయుడు

పిల్లను వివాహమాడుటకు.

వివరములు వలయువారు

"ఓ"

C/o మెడ్రాసుమెయిలు అని వ్రాయవలెను.

ఈప్రకటన చూడడంతోనే పేదకు పెన్నిధి లభించినట్లు అపరిమిత సంతోషపడ్డాడు. తన నిమిత్తమే ఈప్రకటన ప్రకటించారనుకొన్నాడు.

తిన్నగా నారాయణరావుగారి యింటికి వచ్చి ఈప్రకటన వారికి చూపించాడు. వారుకూడా సంతోషించి "బాగుందన్నారు" ఈవ్యవహార ములోపూనుకొని పనిచేయ వలసిందని నారాయణరావుగారిని మాధవుడు ప్రార్థనా పూర్వకముగా వేడుకొన్నాడు. "ఆలస్యం అమృతం విషమన్నట్లు" కాలయాపనచేస్తే పిల్లమించిపోతుందని నారాయణరావు పత్రికాధిపతిపేర ఆపిల్లవిషయమై యావత్తుతెలుపవలసిందని తంతినిచ్చాడు.

సాయంకాలమయినది. మాధవుడు ఆరాటానికి మితిలేదు. రాత్రిభోజనముచేసి ఒంటరిగా పడుకొన్నాడు. నిద్దురపట్టదు. "తండ్రి నిరతాన్నప్రదాత, కర్మిష్టి – మాతాతో యజ్ఞంచేసిన సోమయాజి. నేనో నాయుడుపిల్లను పెళ్లాడదలచుకొన్నాను" అంటూ ఆలోచిస్తూ పడుకొన్నాడు. అంతలో "నీ బెంగతోనే మరణిస్తున్నాను" అన్నతల్లిమాట తలంపుకొచ్చింది.

"మావాళ్లకు బొత్తిగా తెలియదు బ్రాహ్మణుడు అన్నిజాతుల స్త్రీలను వివాహంచేసుకొనేటందుకు అర్హుడని వేదాలేచెప్పుకొంటున్నాయి ఈ పైభై వేలరూపాయలే నానాన్నకిచ్చి "నన్ను పెళ్ళిచేసుకో" అని ఏకులస్త్రీఅయినా అంటే" నేను చేసుకోనుపో అంటాడా ఎప్పుడు అనడు అటువంటప్పుడు నేను చేసుకోవడంలో ఆక్షేపణేముంటుంది గనుక"! అంటూ ఏమోమోఆలోచిస్తూ పడుకొన్నాడు.

తెల్లవారింది. మెయిలు ఎప్పుడువస్తుందాఅని ఎదురుచూస్తున్నాడు, మాధవుడు. ఆదినముననే నారాయణరావుగారిపేరొక ఉత్తరమువచ్చినది, అందులో నీక్రిందివిధంగా వుంది.

రామానుజంచవుదరి. ఎమ్. ఎల్ సి

జి. టి. మదరాసు,

3-8-20.

నారాయణరావుగారికి.

అయ్యా :—

నమస్కారములు.

ప్రకటనానుసారముగ మీరుయిచ్చిన తంతి చేరినది. పిల్లకు రేపు ఫిబ్రవరినెలకు ఇరువది రెండేళ్ళు వెళ్లును. ఇచ్చటనే డిప్యూటీ ఇనస్పెక్ట్రెస్సు పనిచేయుచున్నది. పిల్లపేరు యామినిపూర్ణతిలక.

మీరు వివాహంచేసుకొన నుద్దేశమున్నచో వచ్చి పిల్లను చూచుకొనవచ్చును. మీరాకకెదురుచూచుచుందుము.

ఇట్లు

(రావుసాహెబు) రామానుజంచవుదరి.

నారాయణరావుగారు మాధవుని వెంటబెట్టుకొని మెడ్రాసులోతిన్నగా చౌదరిగారింటికి వెళ్ళారు పాశ్చాత్యపద్ధతిని షేకుహాండ్లు చేయడ తో యథావిధిగా మర్యాదలయినాయి. చవుదరిగారిది మూడంతస్తుల దివ్యసౌధం. అంతా కలసి సౌధోపరభాగానికెళ్ళారు. అంతా విద్యుద్దీపాలతోను విద్యుద్వీసనకర్రలతోను నిండివుంది. నాలుగువైపుల వున్న స్ప్రింగు సోఫాలు, వాటిమీదున్న మొఖమల్ దిండ్లు, మధ్యనమర్చిన నయనానందకరములగు తివాచులు చూడడం

తోనే ఇతనొక జమీందారుడని గ్రహించారు.

మాధవుడు నారాయణరావుగారు అట్లా కూర్చున్నారు. అంత చౌదరిగారు "డియర్ యామినీ" అని కేకేశారు.

తోడనే "కమింగుసార్" అనే కేక వినబడింది. అంత కొంతసేపట్లో పక్కగదిలోనుంచి "టిక్కుటక్కు" మను శబ్దంతో వచ్చిందొక "లేడీ"

"వాట్సిదిమేటర్" అంది చౌదరిగారి కేసిచూస్తూ.

"టేకయువర్ సీటు" అన్నాడు చౌదరి మందహాసం చేస్తు.

"యీమె మాఅమ్మాయి యామినీపూర్ణతిలక" అన్నాడు మాధవుని కేసి నారాయణరావు కేసి చూచి.

"యామినీ, ఈయనే నిన్న అప్లయిచేసుకొన్న మాధవరావుగారు" అన్నాడు పిల్లకేసి నవ్వుతూచూస్తూ.

"అయిసి" అంటూ ఆమె మాధవుని సమీపించింది. ఏంచేస్తుందో అనుకున్నాడు గాని చెయి పట్టుకోవడంతోనే షేక్‌హాండు. మర్యాదగదా అనుకొన్నాడు పాపంమాధవుడు.

ఒకరినొకరు చూచుకొన్నారు "ఆల్‌రైట్ అంటె ఆల్‌రైట్" అనుకొన్నారు.

శుభమస్తు శీఘ్రంఅని వచ్చే ఆదివారమే ముహూర్తం నిశ్చయించారు.

రామానుజంచౌదరిగారు "చేయబోయిచేస్తాము కనుకనా" అని మహా వైభవంతో చేసేటందుకు నిశ్చయించారు స్నేహితులకు బంధువులకు శుభలేఖలు వ్రాసారు. అయిదురోజులు ద్దామనుకొన్నారు కాని పిల్లకు క్యాజువల్ లీవు రెండురోజులే దొరకడంచేత రెండురోజుల్లోనే అంతా ముగించేటందుకు నిశ్చయపరిచారు. వివాహం రేపనగానే రావలసిన బంధువులు స్నేహితులు వచ్చారు. ఇల్లు మహా కోలాహలంగావుంది.

ఆదివారం ఉదయం సరిగా ఏడుగంటలకే యావన్మంది కాఫీ త్రాగేశారు. తొమ్మిదిగంటలకల్లా ఒకపెద్ద చావడిలోనికి శుభముహూర్తానికి వేంచేశారు. దంపతులిరువురు పాశ్చాత్య పద్ధతిని అలంకరించుకొని ఎదురెదురుగా రెండు కుర్చీలమీద కూర్చున్నారు.

"ఆమరణాంతము కష్టసుఖములందు ఒండొరులబాయక, దాంపత్యసుఖ మనుభవించెదము" అని ప్రమాణకాలయాయి. అంత ఒకరిఉంగరము ఒకరు మార్చుకొన్నారు. అయిందంటె అయిందన్నారు. ఏమిటి వివాహం.

## 3

నాయుడు పిల్లను పెండ్లాడినందునను, చౌదరిగారికిగల పలుకుబడివలనను, అతని రోజుల మహిమచేతను ఒక కంపెనీలో మేనేజరుగా ప్రవేశించాడు. నెలకు నూటయేబది రూపాయల జీతం. నెల కావడంతోనే ఆమిడో రెండొందలు తెచ్చేది. ఈయన నూటయేభై తెచ్చేవాడు. ఆపైని రామానుజంగారి ఆస్తి. పప్పుమీద నెయ్యి, నెయ్యిమీద పప్పు అన్నట్లుంది వీరి పని.

వీ రుండేది ఒక దివ్యసౌధం. అందట విద్యుద్దీపాలు, పంకాలు, స్ప్రింగు సోఫాలు, కుర్చీలు, తూగుటుయ్యాలలు, జల యంత్రాలు గలిగిన ప్రమదావనాలు, వచ్చి పోయేటందుకు మోటారుకారులు, వీరి పని అప్పట్లో యేలా వుండాలో ఆలా వుంది.

ఒంటరిగా కూర్చున్నప్పుడల్లా యామిని "ఏమిటి చెప్మా స్వర్గం స్వర్గమంటారు స్వర్గంలో మాత్రం యింతకంటె యేముంటాయి" అనుకునేది.

యామినికి తనకున్న పనికాక తలమీద వెంట్రుకలన్ని చిల్లర వేహారాలు, గరల్ గయిడు ఉద్యమానికి కమేండరు. లేడీ క్లబ్బుకు శక్రటరి. బ్రాహ్మణేతర స్త్రీల సభకు అగ్రాసనాధిపతురాలు. ఆంధ్ర స్త్రీల సంఘమునకు కోశాధిపతి. యామినికి తెలియనివారు మద్రాసు మొత్తానికి లేనేలేరు.

మాధవుడు శ్లేష్మంలో పడ్డ యీగలాగ తన ఉద్యోగంలో పడి కొట్టుకుంటూ వుండేవాడు. సాయంకాల మారు గంటలయేది యింటికొచ్చేటప్పటికి. పగలు పనిచేత పాపం భోజనంచేసి యెనిమిదింటికే పడుకునేవాడు. యామిని వ్యావర్తంతా తీర్చుకొనివచ్చేటప్పటికి రాత్రి యే పదిగంటలో అయ్యేది. ఈవిడికో వేళ, ఆయనకో వేళ.

చౌదరిగారు కూతుర్ని చూచి మురిసి పోతూండేవాడు. "చూస్తూండగా ఎంతపేరు సంపాదించింది" అని తలచుకొని ఆనందించేవాడు. యామిని విషయం అడిగినవాళ్ళకు ఎక్కడికి వెళ్ళిందో చెప్పలేకపోయేవాడు ఇంకా ఎంత దవుతుందో చూచేటందుకు నోచుకోలేదు పాపం చౌదరి. ఒకనాడు రాత్రి పన్నెండు గంటలకు ఒకవాంతియైనది తెల్లవారుఝామున మూడు గంటలకు మరొకటయింది, ఎనిమిది గంటలకల్లా పరమపదించాడు. పోయేటప్పుడు యామిని" అంటూ ప్రాణాలు

## 4

మాధవునకు తగనుద్యోగం దొరికింది. రాత్రి పగలు ఎంతచేసినా యింకా యేదో కొరతుండనే వుండేది. సాయంకాలమై యింటికొచ్చేటప్పటికి తలకాయి నొప్పిగాను ఆవలింతలుగాను వుంటూండేది. మిత్రుల ప్రోత్సాహము వలనను, తన స్వబుద్ధివలనను బడలిక తీరేటందుకుగాను ఔషధరీత్యా ఒక్క ఔన్సు సీమసారాయును సోడాలో పోసుకు త్రాగుచుండేవాడు. దురభ్యాసాలు పాలుగాకుండా వుండాలిగాని అయాయంటె వదల్చుకోవడం అస్థిరదేహులగు మానవులకు తరంకాదు. ఔన్సు గ్లాసులల్లాపోయి పెద్ద పడిలో కొచ్చింది. మరికొన్ని రోజులకు గ్లాసు లవసరమే లేకపోయింది. బుడ్డి నెళ్ళగా బుడ్డి ఖాళీ చేస్తూండేవాడు.

సాయంకాల మవడంతో నేతిన్నగా రిఫ్రెష్మెంటు రూముకో వెళ్లడం మొదలు పెట్టాడు. టీ, స్కాచివిస్కీ, జార్జిపోర్టు, బర్గండి మూడు కత్తుల బ్రాండీ పొట్ట పట్టినంత త్రాగి తూల్తూ యేరాత్రి పదిగంటలకో యింటికి చేరేవాడు.

ఇదె అతనికి ముప్పు తెచ్చింది. త్రాగుడు హెచ్చినకొలది పని మందగించిది. క్రిమేణా కంపెనీకి రాబడి హెచ్చేనకొలది త్రాగుడుబిల్లులు హెచ్చెయాయి.

పూర్వపు చురుకంతా నశించింది, బద్ధకం మాంద్యం అశ్రద్ధ ఒక్కపెట్టున ఆవహించాయి, ఒక వ్యవహారంపట్ల అశ్రద్ధ వహించడంచేత కంపెనీకి తీరని నష్టం కలిగింది

పై అధికార్లకు చాలా కోపం వచ్చింది. తక్షణం పనిమానుకోవలసిందని శాసించారు. వారి నష్టంవిషయంలో కోర్టులోదావా తెచ్చారు. యామినీ పలుకుబడున్నది కాబట్టి పదిమందితో

చెప్పి ఏదోకొంత ముట్టచెప్పి కేసు రద్దుచే యించింది.

చూస్తూండగా మన కళ్ళఎదుట మాధవున కెంతగతిపట్టిందో చూడండి. ఆర్జితం నశించింది. కాని దానితోవచ్చిన త్రాగుడుమాత్రంపోలేదు. "చింతచచ్చినా పులుసుచావదు" ఇతనిజీవిత మంతా అధమాధమమగు స్త్రీధనముమీద ఆధారపడవలసి వచ్చింది. ఆవిడ అనుగ్రహిస్తే ద్వాదశి ఆగ్రహిస్తే ఏకాదశి అన్నట్టుంది.

ఈ రోజుల్లో గడించిపెట్టే భర్తఅంటేనే లక్ష్యంలేదు. ఆలికి కూడెట్టడం ఊరికి ఉపకారమా" అంటారు. అటువంటిస్థితిలో మనమాధవునివంటివారిపాట్లు పెరుమాళ్ళకెఱుక. ఈయన ఉద్యోగం పోవడంతోనే ఇంట్లో పనిచేసే పనివాండ్లను మానిపించింది యామిని. ఇతన్ని చాలా నిర్లక్ష్యంగాను అసూయగాను చూడడం మొదలుపెట్టింది. అంతా స్వయంకృతాపరాధం, చేసుకున్నది అనుభవించక తీరదు. మాధవునికి యామిని ప్రవర్తనాన్ని చూస్తే చాలాకోపంగా ఉండేది. యేంచేస్తాడు. గుడ్డికన్నుమూస్తే ఎంత తెరిస్తేఎంత. కోరలుతీసినపాము బుసకొడితే యేంప్రయోజనం

## 5

రమణారావు మాధవరావుకు ప్రాణస్నేహితుడు. బి. ఏ పరీక్షకు వెళ్ళడం మొదలుపెట్టి వచ్చే గోదావరీ పుష్కరాలు మూడోవి. ఎంత మంది స్నేహం కాకుండా ఎలావుంటారు? రమణారావు మొన్న పరీక్షలో బి ఏలో కృతార్థుడైనాడు. ఫస్టుగ్రేడు చదివేటందుకు పట్నం వచ్చాడు.

రమణారావు సుందరుడని ఒప్పుకోనక తప్పదు. ఆజానుబాహుడు, పచ్చని శరీరము, పొడుగుకి తగినలావు, స్కాచికట్టు గుజ్జుమీసాలు. నొక్కునొక్కులుగా ఉన్న బెంగాలు క్రాపు. సార్థకనాముడు. ఏమాత్రమైన ఉద్దేశమున్న స్త్రీలను వశపరచుకోవడం ఉగ్గుతోనేర్చిన విద్య.

ఒకనాడు సాయంకాలం అయిదుగంట లైంది. రమణారావు తిన్నగా మాధవరావు యింటికి వచ్చాడు. మాధవుడు యింటిలోలేడు. యామినిమాత్రం షికారు వెళ్ళేటందుకు సిద్ధంగా వుంది. రమణారావు గుమ్మమువద్ద నిలబడి "మిస్టర్ మాధవరావు" అని మృదుమధురంగా ఎలుగెత్తి పిల్చాడు. అంత టోయలెట్టు చేసుకొంటూన్న యామిని "ఎవరో వెయిటు చెయ్యాలి" అని బాటోయితుచేత కబురంపించి పూర్తికావడంతోనే బయటికొచ్చింది.

"రండి కూర్చోండి" అంది. నవ్వుతూ క్రీగంట అతని కేసి చూస్తూ. రమణారావు చిరునవ్వు నవ్వుతూ పెళ్ళికొడుకువలె లోపల ప్రవేశించాడు. అంత యిరువురు ఎదురెదురుగా రెండుకుర్చీల్లో కూర్చున్నారు. రమణారావు "పారిందిరా పాచిక" అనుకొన్నాడు. నిమేషకాలం ఒకరితోనొకరు మాట్లాడుకోలేదు కాని రెప్పవాల్పక ఒకరినొకరు చూచుకుంటూనే యున్నారు.

"మీరెవరో నేను తెలుసుకో వచ్చునా" అన్నాడు రమణారావు ఓరగా ఆమెకేసిచూస్తు.

యా:- "మీరెవరికోసం వచ్చారు."

ర:- "మాధవరావుగారి కోసం."

యా:- "అట్లయితే ఆయనభార్యనే నేను" అంది (నవ్వుతూ తలక్రిందవంచి.)

ర:- అయిసి.

యా:- మీపేరు.

ర:- "బాబు రమణ అంటారు"

యా:- "మీరేనా మొన్న ఆర్ట్సు కాలేజీ డేని ప్రమిలార్జనీయంలో అర్జునుడేసినది."

ర:- "ఎగ్జాక్ట్లీ."

యా:- "ఆలా చెప్పరేం మరి. తోటలోకి వెడదాంపదండి" అంటూ వీధిగుమ్మం ఘడియ వేసింది.

ఇరువురు తోటలో మల్లిపందిరక్రిందున్న చలవరాతిమీద కూర్చున్నారు.

"నిర్భాగ్యుణ్ణి బాగుచేసేవాడు అదృష్టవంతుణ్ని పాడుచేసేవాడు వుంటారా! రేపు శెలవల్లో యింటికి వెళ్ళే అవసరముకనపడదు" అని తనలో సంతోషపడుతూ ఒక నిమిషము మాధవుడు ఆలాగేకూర్చున్నాడు.

యా:- చూస్తారేమి యేమైన రెండు పాటలు పాడండి అంది ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

రఘునాధరావు ఆతృతతోను భయంతోను తోటంతా కలియచూడ్డం మొదలు పెట్టాడు.

యా:- "యెవరు తోట్లో లేర్లెండి" అంది మెల్లిగాను.

ర:- "ఉంటే మాత్రం వదిన" అన్నాడు ఆవిడి మొగంకేసి చూస్తూ.

యా:- "అటయితే అభయ మెందుకు. వదిన్ని కాను మరదలిని అవుతానేమో"

ర:- "ఎలాగైతే ఆలాగే కానియ్యండి"

యా:- పాడండి మరి.

ర:- "ఏంపాటలు నావన్నీ గాలిపాటలు" అన్నాడు పెదవి విరుస్తూ.

యా:- పరవాలేదు పాడండి. పాటయొక్క మంచి చెడ్డలు నిర్ణయించేభారం నాది అంది.

ర:- "సాయంకాలే వనాంతే కుసుమిత సమయే" అన్నశ్లోకం సంగతులుమీద సంగతులేసిపాడాడు. పాడేటప్పుడు అతని మొగంలో వింతమార్పులుదయించాయి. కన్నులు స్థూలదృష్టికి కనుపడని వస్తువుని దేనినో చూస్తున్నట్టున్నాయి. మొఖంలో వింత ఆనందం ఉదయించింది. యామిని సమ్మోహనాస్త్రం తగిలిన దానివలె నిశ్చేష్టురాలైంది.

యా:- "అద్భుతంగాపాడారు మరొకటి." అనడం తడువుగానే శ్లోకాలు పద్యాలు సుమారు ఒక అరగంట పాడాడు.

యామిని పరవశురాలయింది. "పాపం చాలా శ్రమపడ్డారు. కాసిని పాలు పుచ్చుకొనండి లేకపోతే టీ కాచి యిస్తాను" అన్నది.

"ఎందుకులే నీ కాశ్రమ వద్దు"అన్నాడు.

మొగమాటం పడకని ఒక గ్లాసుతో పాలు తీసుకొచ్చి నోటిదగ్గరెట్టింది. "నాకు శ్రమంటారుగాని మీరిందాకడనుంచి నాకోసం పడుతూన్న శ్రమఅంది నవ్వుతూ.

ర:- "నాకు శ్రమేమిటి స్త్రీలపట్ల పీకిచ్చేస్తాను. వారానందమే నేనెప్పుడు కోరుతూంటా" అన్నాడు కొంటెగా ఆమెకేసి చూస్తూ.

యా:- అట్లాయితే ఏది ఒకసాంగు.

ర:- నిన్నుగనయుటే నా
కన్నిట సుఖమని నామది
నెన్నితినో వన్నెలాడి రమ్మా
ఇటు రమ్మా! వేగరమ్మా! ముద్దిమ్మా
కౌగలిమ్మా॥

యామిని పరవశమైంది. లలాటమున ఘర్మబిందువులు ముత్యాలవలె మెరుస్తున్నాయి. ఆనందపారవశ్యంచేత నేత్రాలు అశ్రుపూరితములయినాయి. ఒళ్ళు పులకరించింది. హృద

యంలో ఏవేవో నూతనభావతరంగాలు బయలు దేరాయి. మనస్సులో అనరాని ఆలోచనలు పరుగులెత్తాయి. యామిని ఇక నిలువలేక పోయింది. అతని పాటలు పూర్తికా కాకముందే గాలిలో తేదీగలాగ ఊగుతూ రమణారావు దగ్గరకు వచ్చి నిలబడి "ఆడవాళ్ళు ఒంటరిగా ఉన్నప్పుడు ఏమిటీ పాటలు" అని బుగ్గమీద పొడిచింది. రమణారావు ఒళ్ళు గగుర్పొడిచింది. అతను మాత్రం ఊరుకుంటాడు గనుకనా "............................

"కామాతురాణాం నభయం నలజ్జా" అన్న పెద్దల మాటలు వ్యర్థమౌతుంది కనుకనా? స్త్రీలపాలిటి అమూల్యాలంకారమగు లజ్జవస్తుతహ యామిని ఎరుగనే యెరుగదు. యామిని రమణుని రాకకు ఎదురు చూడవలసిందే. యిరువురు కలసి యే బీచికో యే సినీమాకో వెడుతూండేవారు. ఇట్లు మోహావేశోన్మాదులగు ఆ దంపతులు పరువు మర్యాదలను పాటింపక జననిందను నరకుగొనక, పాప భీతిలేక, స్వేచ్ఛగా సంచరిస్తూండేవారు.

ఒకనాడు సాయంకాలము నాలుగు గంటలయింది. యామిని షికారు వెళ్ళేటందుకు ముస్తాబై మల్లిపూవ్వులు కోస్తూదోడ్లోవుంది. మాధవుడు తిన్నగా మల్లిపందిరదగ్గిరకువచ్చి యామిని చూడకుండా వెనుకనుంచి కళ్ళు మూసాడు. అంత యామిని తత్తరపడి "తెలుసు చేతులు తీయండి" అంది. మాధవుడు మాట్లాడలేదు.

"ఈ మాత్రం తెలియకపోతే నా బ్రతుకెందుకు చేతులు తియ్యండి భావగారు" అంది నవ్వుతూ. మాధవుడు ఆలాగే పట్టుకొని నిలబడ్డాడు. "అబ్బా వదలండి! తెలుసు రమణారావు భావగారు యిక తెలిసిందాండి" అంది యామిని. అంతమాధవుడు చేతులుతీసి దూరంగా నిలబడి అతితీక్షణంగా నిమేషంకాలంచూచాడు. అతని ముఖంలో కోపము క్రోధము ఒకసారి ఉదయించాయి. మనిషి చాలా భయంకరాకారందాల్చాడు. యామిని తిరిగిచూచి నిర్ఘాంతపోయింది. శరీరం ఒణికింది. మేను చెమర్చింది. ఒళ్ళో మల్లిపూలు అప్రయత్నంగా క్రిందపడిపోయాయి. నోట మాటలేదు. తప్పిదం చేసినట్లు గుండెలు దడదడా కొట్టుకొన్నాయి. పోత విగ్రహంలా చూస్తూ నిలబడిపోయింది. మాధవుడు ఆమెను నిదానుంచి ఆపాదమస్తకం చూచి, తలపంకించి, పళ్ళు బిగించి గిర్రున తిరిగి ఎక్కడికో పోయాడు.

మాధవుడు పొద్దుగుంకకముందే యింటికి వచ్చాడు. యామినింకా రాలేదు. ఒక కుర్చీలో కూలబడి యామిని ప్రవర్తనాన్నిగూర్చి యోచించడం మొదలు పెట్టాడు. ప్రపంచకమంతా అంధకారంగా కాన్పించింది. విచారము కోపము ఒక్క పెట్టున ఆవహించాయి. "ఉస్సూ" అంటూ ఒక్క వేడినిట్టూర్పు విడచి తిన్నగా యామిని గదిలోనికెళ్ళి వెర్రిచూపుల్తో నలువైపులా చూడ్డం మొదలుపెట్టాడు. ఎదురుగా ఉన్న కోటు స్టాండు మీద ఎవరివో పంట్లాములు కోటులు షర్టులు కనుపించాయి. నిర్ఘాంతపోయి ఎవరివై యుంటాయా యని చూచేటప్పటికి (ర. రా) అని పొడక్షరాలు కనుపించాయి. అస్వతంత్రుడగు నాతడు విచారముతో విశ్వమును మరిచాడు. పరుపుమీద పడుకొని వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టాడు. పక్క మేజామీదనున్న పుస్తకాన్ని తీసాడు అది తారా శశాంకవిజయం. అది తెరవడం తోనే ఎవరిదో ఒక ఛాయాపటం కనుపించింది.

చూడడంతోనే కళ్ళు మిరుమిట్లు గొలిపాయి పళ్ళుబిగించాడు. తల పంకించి "మిత్రద్రోహీ తగినఫలిత మనుభవించకపోవులే" అని ఆపటాన్ని క్రిందపడేసి కాలితో రాసాడు.

పొంగిపొరలి వస్తున్న విచారము తనలో తానే దిగమ్రింగుకొని ఒక పడకకుర్చీలో కూలబడ్డాడు. ఆవ్యక్తి యీలోకంలో తాను స్వయముగా చేతులారా చేసుకొన్న హాని యాతన ననుభవిస్తున్నాడు. అతనికి లోకమంతా అంధకారంగా కనుపించింది. ఆనిశ్శబ్దసమయమున ఆనిర్జనస్థలమున - గవాక్షమునుండి ప్రసరిస్తూన్న పిల్లవాయువులచే కళ్ళు మూతలుపడ్డాయి. నిద్రాదేవి కటాక్షించే కొంత ఆరాటం తీరింది.

గోడనున్న గడియారము "టంగు" "టంగు" యని తొమ్మిదికొట్టింది. అంతలో తలుపులు "గభాలు" మని తెరచుకొని రమణా యామినులు బిరబిర మాధవుని సమీపంనుంచి ప్రక్కగదిలోకి వెళ్ళి తలుపు వేసుకొన్నారు.

ఆ అలికిడికి మాధవునికి మెళుకు వొచ్చింది. వెంటనే లేచి నలువైపులు తేరిపారచూచాడు. కొయ్యలాగయినాడు. నిశ్చేష్టితు డైనాడు. అప్రియత్నంగాబొటబొటమనికన్నీళ్ళుకారాయి. కారణ మేమి - స్వభార్య-తన కళ్ళయెదుటనే పరపురుషునితో పోతూంది - చూచి ఎవడుసహిస్తాడు, ఇంతకంటె భయంకర పరిదర్శన మేముంటుంది. అట్టి పరిస్థితుల్లో యెవరికోరిముంటుంది.

మాధవుడు భయంకరాకారాన్ని దాల్చాడు? మందు దట్టించి సిద్ధంగావుంచిన రివాల్వరుదాల్చి రెండోదండధరుడు లాగు ఉరుముతు ద్వారము దగ్గరకు వెళ్ళి "గభాలు" మని ఒకతాపుతన్నాడు. తలుపులట్టె ఊడిపడ్డాయి. లోపలికి పులివలె ఉరకపోయాడు రమణారావు మీదికి.

మాధవుడు ద్వారమున అడ్డముగా నిలబడి వికటహాసము గావిస్తు "ఇదిగో యిప్పుడైనను నీవు కావించిన పాపములను తలచుకొని పశ్చాత్తాపపడుము - ఇదిగో - స్వయంకృతాపరాధ ఫలమనుభవించుటకు సిద్ధముగ నుంటివా కాచుకొమ్ము" అని అరచుచు "డామ్మని" రివాల్వరును పేల్చెను.

అంత యామినివైపు తిరిగి "రాక్షసీ! నీమూలమున ఎంతఘోరమునకొడిగట్టితిని? బ్రహ్మహత్య స్త్రీహత్య. తుదకు ఆత్మహత్య యొనర్పవలసి వచ్చినదిగా! నాభ్రష్టతకు నీవేమూలము- నాచిత్తవిభ్రమమునకు నీవేకారణము - ఈనా సర్వనాశనమునకు నీవే కారకురాలవు. ఛీ. ఛీ. ఇదిగో దానిఫలితము - అనుభవింపుము. అని రివాల్వరును ప్రేల్చెను. అంతపాపము యామిని నాధా-నా-ధా - మా-ధ-వా - ఆ-అ - అని చేతులుజోడించి మొదలునరికిన కదళికవలెపడెను.

ఉన్మాదుడగు మాధవరావు భీషణాట్టహాసములు కావించుచు "మాధవా! నీతండ్రినిరతాన్న ప్రదాత- తల్లి లోకమాత- సత్యస్వరూపురాలు. అట్టివారిపొట్టనుదయించి నాగరికతమను అంధకారమున పడిపోతివే. ధనాశాపరుడవై ఒక నీచస్త్రీని వివాహమాడితివి. ఛీ పాపీ! తల్లిని చేతులార చంపుకొంటివి. క్రియకు నిన్ను నీవే చంపుకొనుచుంటివి ఓ-హూ! దేహము దహించుకొని పోవుచున్నది. స్వయంకృతాపరాధమునకు తగినఫల మనుభవించినగాని మనశ్శాంతి గలుగదు" అనిగర్జించి కడసారిభార్య పేటికళేబరమువద్ద చతికిలబడి రివాల్వరును ప్రేల్చుకొనెను.

స్వయంకృతాపరాధులగు రమణా యామినులయు మాధవునియొక్కయు ప్రాణవిహంగము లనంత విపినములవైపున నెగిరిపోయెను.

# విజయ రాఘవనాయని భార్య.

ఆంధ్ర శేషగిరిరావుగారు (సారస్వతసమాజము.)

కర్ణాటాంధ్ర సామ్రాజ్యనియంతయై కృష్ణదేవరాయల ప్రాపుపొంది అరవదేశమున తంజావూరు మధుర మొదలగు తావులందు ఆంధ్ర నాయక రాజ్యములు వెలసి వర్థిల్లినవి. ఈ ఆంధ్ర నాయకరాజులు తెలుగుదేశమునుండి మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు, గాయకులు, వేశ్యలు మొదలయినవారిని అచ్చటికి తీసికొనిపోయి వలస నెలకొనిరి. క్రీస్తుశకము పదునేడవ శతాబ్ది ద్వితీయార్థమునందు తంజావూరు ఆంధ్ర నాయక రాజ్యమున విజయరాఘవ నాయడును మధుర ఆంధ్ర నాయకరాజ్యమున చొక్కనాథనాయడును ప్రభుత్వము చేయుచుండిరి.

తంజాపురమున రాజగోపాల విలాసమను భవనమున విజయరాఘవనాయడు ఒకనాడు కొలువుదీరి యుండెను. అప్పుడు మధురనుండి చొక్కనాథనాయని బంధువులును స్థానాపతులును, పురోహితులును వచ్చి రాఘవనాయని దర్శించి ఆతని భేటికి యోగ్యమయిన వస్త్రభూషణాదులు సమర్పించిరి. “వచ్చిన వర్తమానమేమి” అని నాయడు వారిని ప్రశ్నించెను వచ్చినవారు యిట్లు చెప్పిరి “మా యేలినస్వామి రాజా చొక్కనాథనాయనివారు వివాహము చేసికొన తలపెట్టి కన్యకార్థము దేవర సముఖానకు పంపినారు. వారికిని మీకును తరతరములనుండి యిచ్చిపుచ్చుకొనుటలు వున్నవికదా! ఇది చిరకాలముగా నడచి వచ్చుచున్న సంబంధమే. కావున దేవరవారు దయతలచి శుభవార్త దయచేయవలెను”

వివాహ ప్రస్తావన వచ్చుటతోడనే సాధారణముగ వినువారి ముఖములందు కొంత వికాసము కల్గును. కాని విజయరాఘవనాయని వదనము అప్రియత్నముగ సంకుచితమాయెను. వచ్చినవారితో ఆతడు యిట్లు చెప్పెను. “మీదొర యేమొగము పెట్టుకుని కన్యకను యిమ్మని అడుగ పంపినాడు? వెనుక మీ చొక్కనాథ నాయని పితామహుడయిన తిరుమలశౌరికి మా అచ్యుత రఘునాథమ్మను పట్టమహిషిగా వివాహము చేసిరి. ఆ తిరుమలశౌరి ఒకప్పుడు కొత్తగానగరు కట్టించి పట్టమహిషియగు అచ్యుత రఘునాథమ్మకు చూపించెను. హాస్యముకొఱకు ఆమె ఆకొత్తనగరు తంజావూరులోని తన తండ్రి నగరికి సాటి రాదని చెప్పి నవ్వెను. ఉడుకుబోతు అగు తిరుమలశౌరి ఆనవ్వు తాలిమాటకు వోర్వలేక ఆమెను బాకుతో పొడిచి చంపినాడు. ఆ సమాచారము విని మావారు అందరును ఘోడుఘోడున దుఃఖించి, యిటువంటి క్రూరకర్మునకు తెలియక పిల్లనిచ్చినాము. ఇచ్చినందుకు తగినశాస్తి అయినది ఇక జన్మజన్మేపి మనము వారితో సంబంధము చేయరాదు. అని ఒట్టుపెట్టుకొన్నారు. ఇట్లు జరిగియుండగా తిరిగి సంబంధము కావలెనని మీదొర యేబుద్ధితో మావద్దకు మిమ్ములను పంపినాడు?”

విజయరాఘవనాయడిట్లు వారికోరిక త్రోసిపుచ్చెను. వారు తెచ్చిన భేటివస్తువులను స్వీకరింపలేదు. పైగా తన సేవకులకు ఆజ్ఞాపించి వచ్చినవారిని తత్క్షణమే కోట బయటకు పంపించివేసెను. అక్కడయినను వారికిబత్తెము భరణము విచారింపలేదు. ఈవిధమున అవమానముపొంది వారు మధురకు పోయి రాజా చొక్కనాథనాయనితో నడచిన వృత్తాంతము యావత్తు శ్రుతపరచిరి. అది విని చొక్కనాథనాయడు మండిపడి తన దళవాయి వెంకట కృష్ణప్పనాయని పిలిచి దండుకూర్చుకొని పోయి తంజావూరు కోటను ముట్టడింపుమనెను ప్రభుని ఆజ్ఞ తలనిడుకొని వెంకట కృష్ణప్పనాయడు తంజావూరు కోటను ముట్టడించెను. తంజనగరము సేనాని వెంకటకృష్ణప్పనాయనికి యెదురెక్కి యుద్ధము చేయసాగెను. తంజావూరుకోటలో విశేషసైన్యముండెను. అందుకు మధురవారు యెంత మాత్రము జంకక దండు పురికొలిపి ఫిరంగులు మోర్జాలపై యెత్తించి కోటపైనివున్న జనముమీద లక్ష్యముంచి ప్రేల్చిరి. ఎడతెగని గుండుదెబ్బల కాగలేక తంజావూరు సేనలు విరిగిపోవదొడగెను. కొంచముకొంచముగా తంజాపురి కోట శత్రువుల స్వాధీనముకాజొచ్చెను.

అప్పుడు వెంకటకృష్ణప్ప నాయడు విజయరాఘవ నాయనికి యిట్లని కబురుచేసెను. “విశేష సైన్యముతో మేము కోటలో చొరబడుచున్నాము క్రమముగా మీ సేనలు విరిగిపోవుచుండుట మీరు చూచుచునే వున్నారు గడియకో అరగడియకో కోట మా స్వాధీనమైతీరును. ఇప్పుడయినను మీరు మా రాజునకు కన్యనిచ్చి సంధి చేసుకొనుచో మాఫౌజును వెనుకకు మరలించు

కొని పోరయెదము.” దీనికి విజయరాఘవ నాయుడు “రాజ్యము పోయినా, సర్వ నాశనమయినా, మీకు భయపడి కన్యను యిచ్చువారము కాము రాజీ ప్రస్తావన మాతో తలపెట్టవలదు” అని ప్రతివార్త బంపెను.

కొంతసేపటికి తంజావూరి కోట మధురవారి సేనలతో నిండిపోయెను. రాణివాసపు స్త్రీలున్న అంతిపురమును మాత్రము యింకను శత్రువులు ఆక్రమింపజాలకుండిరి. అప్పుడు అచట సందడి కయ్యము జరుగుచుండెను. అది చూచి విజయరాఘవనాయుడు తన కొమారుడు మన్నారప్పనాయనితో యిట్లుచెప్పెను. “కుమారా! ఈయుద్ధమున మనము ప్రాణములువిడుచుట నిజము. మనము మరణించినపిమ్మట మధుర సేనానులు మహలు-చొచ్చి మన చిన్నదానిని తీసికొనిపోయి తమ రాజునకు వివాహము చేయుదురు ఇది తప్పదు అప్పుడు మనమాట బోటు పోవును. వారిమాట చెల్లును. రాజ్యము పోయినా ప్రాణములుపోయినా సర్వనాశనమయినా, వారు పట్టిన పట్టు చెల్లనియ్యరాదు. మన పౌరుషము నిలువుకోవలెను లేవా మన పేరుకు హానివచ్చును. మానము పోవును కాబట్టి స్త్రీలనందరిని మనమే దైవికము పొందింపవలెను. మహలులోనికి పోయి యీకార్యము నెరవేర్పవలసిన భారము నీమీదనున్నది” మన్నారప్పనాయుడు యిది వినెను. అవిలంఘనీయమగు తండ్రిఆజ్ఞ ఒకవంక, వీరుని ప్రథమధర్మమగు స్త్రీమాన సంరక్షణము ఒకవంక హెచ్చరింపగా ఆతడు అంతిపురమునకు దారితీసెను.

ఎదుటి దళము కోటచొచ్చెనని వినుటతోడనే మానవతియైన విజయరాఘవనాయుని భార్య అభిమానవతులగు తక్కిన అంతఃపుర స్త్రీలనందరిని ఒక్కచో చేర్చెను. మందుగుండలు రప్పించి వారిచుట్టు పేర్పించెను. శత్రువులు హఠాత్తుగ చొరబడినచో మందుగుండలకు నిప్పు పెట్టుటకు యిక అవకాశముండదేమోనని ఆమె ఆనతినంది రాణివాసపుస్త్రీలు కత్తులు జముదాళ్ళు దూసికొని ప్రాణములు అర్పింప సంసిద్ధులై వుండిరి.

ఏలినవారి ఆజ్ఞ యెప్పుడువచ్చునా అని విజయరాఘవ నాయని రాణి యెదురు చూచుచుండెను. ఇంతలో కుమారుడు మన్నారప్పనాయడు అచటికివచ్చెను. “ఏలిన వారికి క్షేమమా? మాకు యేమి వుత్తరువుయిచ్చిరి?” అని రాణి ఆతనిని ఆత్రముతో ప్రశ్నించెను, అతడు తాను వచ్చిన పని తల్లికి చెప్పెను. వెంటనే రాణి పొడుచుకొని మరణించెను. అదిచూచి మిగిలిన రమణీమణులు ఒకరినొకరు కత్తులచేత కటార్లచేత నరుకుకొన ప్రారంభించిరి ఇంతలో మన్నారప్పనాయడు మందుగుండలకు నిప్పు ముట్టించెను. కనురెప్పపాటులో అగ్నిజ్వాల ఛటచ్ఛటాయమానమై ఆనగరిలో అడుపురుగు లేకుండ దగ్ధముచేసెను.

అప్పుడు విజయరాఘవనాయడు మన్నారప్పనాయడు మొదలగువారు నిశ్చితతో యుద్ధముచేసి వీరమగణము పొందిరి.

తంజావూరు ఆంధ్ర నాయక రాజ్య సంబంధమున అరవదేశమునందు వలస నిలిచిన ఆంధ్ర పురంధ్రి విజయరాఘవనాయని పత్నియు మిగిలిన ఆంధ్ర రమణీమణులును యీవిధమున మానముకొఱకు మాటకొఱకు సంఘవిలయమును పొంది, ఆ ధ్రకీర్తిని దిక్కులు తెలివొందునట్లు ప్రకాశింపజేసిరి. అరవదేశమున వలస నెలకొన్నతోడి ఆంధ్ర రమణీమణుల సాయమున విజయరాఘవనాయని భార్య ఆనాడట్లు ఆర్జించిన కీర్తి ధనమునకు అరవదేశమునందున్న ఆంధ్రులేకాక స్వదేశమునందున్నవారు కూడ వారసులై వున్నారు.

“ఆంధ్ర రమణీమణుల” నుండి,



# నిజమైన ప్రేమ

## 1

మహబూబునగరు మండలమునకుఁ బూర్వ నామము పాలమూరు మండలము. ఈ మండలములోని కందూరుచరిత్ర ప్రసిద్ధమైనది. చాళుక్యులకాలములో నీనగరము హైదరాబాదువలె భోగభాగ్యములతోఁ దులతూగినది. ఇపుడన్నియుఁ బాడుపడిన దొడ్లె. ఏమంటివెళ్ళ యెందరాంధ్రవీరులు రక్తముతోఁ దడిసెనో, యేబూడిదకుప్ప యెందఱ సహగమనము గావించిన వీరకాంత భౌతికదేహ పరమాణువులతో నిండినదో, యెవరు నిశ్చయింపఁ గలుగుదురు? ఈ గ్రామమునకు బైట నొక తటాకముగలదు. దానికట్టపై దంపతులు కౌగలించుకొన్నటులొక శిలావిగ్రహముగలదు. ఆదంపతులెవరో తెలుపువారు లేరుకాని సంవత్సరమున కొకమారు గ్రామమువారు వీరవిగ్రహములకుఁ బూజ గావింపుచుందురు. చెఱువుకట్టపై బావివలె నొకగుంట త్రవ్వుదురు. వీరవేషములతో నొక యువకుఁడు వచ్చి యొక శిలావిగ్రహము నాగుంటలో వైచును. ఒక వీరకాంత పసుపుబట్టలతో వచ్చి యొక స్త్రీవిగ్రహము నాగుంటలోఁ బడవేయును. గొల్లవాండ్రు కొమ్ములవాండ్రు వింత వింత నృత్యములతోఁ బాటలఁ బాడుచు గుండమును బూడ్చుచుందురు. ఈ యాచారములకుఁ బూర్వచరిత్రకుఁ గల సంబంధము జానపదుల గీతములవలన గ్రహింపనగునేమో.

## 2

మనము చదువఁబోవు కథ తొమ్మిదివందల సంవత్సరముల నాఁటిది. తైలపదేవుడు ప్రసిద్ధుఁడయినరాజు. ఇతనిభార్య భూలోకసుందరి యనదగు పద్మలదేవి. అనురాగమున నీయిరువురిదే. దేహములు వేఱైనను వీరి హృదయములు రెండును నొకటె. వీరిరువురు పుర సమీపమునందున్న వనమునకు సాయంకాలమున వాహ్యాళి వెడలిరి. అవి వసంత దివసములు మృగములు వనమంతటను గలయ దిరిగి జలముకొరకు వెదకుచుండెను. పక్షులు పగలెల్ల వినోదముగా నఱచియఱచి జలార్థమై పఱతెంచుచుండెను. జలశూన్యమగు నాప్రదేశమునందున్న రెండు కొండలను గలిపి యొక కట్టకట్టించి యాదంపతులు తటాకమును నిర్మింపవలయునని యొకమాటై నిశ్చయించుకొనిరి. పద్మలదేవి తన భర్తతో "ప్రాణేశ్వరా? నా యభిమతమువిూ కెఱుంగఁ జేయవచ్చునా" యని పల్కెను. తయిలపదేవుఁడు ప్రియురాలిని ప్రేమమయములగు చూపులతోఁ జూచుచు "నాకోర్కెయు నీకోర్కెయు నొక్కటి కాదుగదా" యనెను. ఒకరిమొగ మొకరు చూచుకొని అటులైన మన తలంపుల నీపాఱుటాకుపై ముల్లుతో వ్రాయుదమని యిరువురు వ్రాసి ఒక పత్రము నొకరు మార్చుకొనిరి. ఇరువురి యభిప్రాయము లొక్కటిగానుండెను. ఇరువురితలపులు రెండు కొండలఁగలిపి తటాకమును గట్టవలయుననియే. సంతోషముతో తటాకప్రతిప కియ్యకొని యమూల్యములగు తమ భూషణములను విలిచి రొక్కము తెప్పించి పనివాండ్రచేఁ దటాకనిర్మాణము జేయించుచుండిరి. తయిలపదేవుఁడు తూర్పువైపు కొండనుండి కట్టవేయించుచు వచ్చెను. పద్మలదేవి పడమటవైపు కొండనుండి కట్టవేయించుచు వచ్చెను. అచిరకాల

మునఁ దటాకము పూర్తియయ్యెను. గొప్ప వర్షము కురిసి చెఱువు నిండెను. హఠాత్తుగా రెండుకట్టలు గలిసిన చెఱువుకట్ట మధ్యభాగమున గండిపడి జలమంతయుఁ బోవుటేగాక జలప్రవాహ వేగముచేఁ గందూరులోని బీదల గృహములు కొన్ని నష్టమయ్యెను. తటాకమునకు గండిపడుటయుఁ బట్టణభాగము నష్టమగుటయుఁ గూడ నీదంపతులకు సంతాపకారణమయ్యెను.

3

వరుణపూజలు చేయవలయునని కొందఱు తటాకము నరబలి కోరుచున్నదని కొందఱు గండి బాగుగాఁ గలుపఁబడలేదని కొందఱు తటాకమును తెగిపోవుటనుగూర్చి ప్రసంగించుచు తెల్లవారువఱకు ఇసుక వేసినను రాలనటుల గ్రామవాసులందఱు చెఱువుకట్టపైఁ జేరిరి. పరితాపతప్తులగు రాజదంపతులుగూడ నచటకు వచ్చి ప్రజాభిప్రాయములు శ్రద్ధాభక్తులతో నాలకించుచుండిరి. ఆయూర నొక యోగిని గలదు. శతవృద్ధురాలు. బంగారువంటి మేని చాయ. ఉన్నతమగు దేహముతో నామె రామాయణకాలమునాఁటి అనసూయను జ్ఞాపకమునకు దెచ్చుచుండును. ఆమె పదవ సంవత్సరమున గందూరు చేరెననియుఁ దొంబది సంవత్సరముల నుండి మహేశ్వరాలయమునఁ దపము చేసికొనుచుండెననియు వృద్ధులు చెప్పుచుందురు. ప్రశాంతముగనున్నపు డామెవద్ద కేఁగితిమేని అనుగ్రహముకలిగినచో నాగఁతుకులకు త్రికాలములను త్రిమూర్తుల నాఁటనుండి తైలపదేవుని కాలమువఱకు జరిగిన సంగరములను తత్త్వములను పూసగ్రుచ్చినటులఁ జెప్పఁగలదు. నాఁడా యోగిని గండిను దునిలచి "ప్రజలారా! రాజదంపతులాడి దంపతులంటి

వారు వారి హృదయములవలె నీకట్టలు రెండును గలసినవి గాని జలము నుపయోగించుకొను పౌరదంపతులలో నైక్యభావము లేదు. అందుచేఁ గట్ట తెగినది. ఎన్నిమారులు వేసినను బ్రజాభావములు సవరింపబడునంతవరకీకట్టనిలువదు. ఒక ప్రతిక్రియమాత్రమింపులకుఁ గలదు. పరస్పరానురాగము హృదయపూర్వకముగాఁగల దంపతులీ గండిలో దుముకవలెను. వెంటనే గండిపూడ్చి వారి విగ్రహములను గండిపై బ్రతిష్ఠించినచోఁ గట్ట నిలువఁగలదు. ఇందులకు బౌరులే తగినవారు గాని తటాకనిర్మాతలగు రాజదంపతులు తగరని యావృద్ధాంగన వచించెను. వచ్చిన ప్రజలలోఁ ద్యాగులు లేకపోలేదు. పరస్పర ప్రేమబద్ధులగు దంపతులము మేమను వారులేరు.

4

కందూరులోఁగల ఒడ్డెరకుటుంబములలో అనుమంచిపాడ్రి కుటుంబము పాఁడిపంటలలోఁ బేరుమోగినది. వెంకటదాసు కరప్రవ్వుటలో, బావులు త్రవ్వుటలో, కందకములు తీయుటలో, కోటలు కట్టుటలో, నేర్పరి కందూరుకోటకట్టినదితఁడె. వీఁడు విరోధులకుఁ దమకోట గుట్టు చెప్పునని యో సాటిరాజులకు దుర్భేదములగు కోటలుకట్టునని యో తైలపదేవుఁడుతలంచి వీని కుటుంబమునకుఁ బ్రతిమాసము నూఱు లక్ష్మమాడలు పుట్టిబియ్యము కట్టడిచేసి యూరిలో నుంచెను. కలవాఁడగుటచే వేంకటదాసు తన తోబుట్టువును బావమఱఁది నింటనుంచుకొనెను. తోబుట్టువు కుమార్తె పేరు సీత. వేంకటదాసు కొడుకు రాముఁడు. సీతారాములు ఆదికాలము నాఁటి సీతారాములవలె కలసిమెలసి యుండిరి. ఆటపాటలలోఁగూడ సీతారాములు భేదము

నెఱుఁగరు. సీతకుఁ బదిసంవత్సరములు రామునికిఁ బదునేను సంవత్సరములు నిండని డకమున్న దైవవశమున నీకుటుంబమంతయు నంతరించెను. ఆదరింపవచ్చిన బంధువులు చిక్కినంతవఱకు ఆస్తి హరించిరి. కడకుఁ పెద్దలార్జించిన పూరియిల్లు సీత, రాముఁడు అంతకుటుంబమునకు మిగిలిరి బంధువులెవరు నీ జోక్యము పెట్టుకొనరైరి. ఎన్నఁడు శ్రమయెఱుఁగని సీతారాములు కులవృత్తియగు మంటిపనికి బయలుదేరిరి. ఇప్పుడు రామునకు యిరువదియేండ్లు సీతకుఁబదునైదేండ్లు. వీరికిరువురికిఁ బెండ్లికాలేదు. సాంఘికధర్మములు తెలియవు, ప్రతికూలభావములు లేవు. కాయకష్టముచేసి ఇరువురు చెఱిచేటెడు ధాన్యము దెచ్చికొని కొంతధాన్యముమార్చి ఉప్పు వెల్లుల్లి మిర్యము లోనగు వస్తువులు దెచ్చికొని మిగిలిన ధాన్య మీద్దరుదంచి యొకరు వంటపనిచేయుచుండ నొకరు పైపని సవరింతురు. తరువాత నిరువు రొకపాత్రలో భుజించి యొకచాపపై బరుండురు. వారికి ప్రేమయననేమో? మోహమననేమో? తెలియదు. భేదభావము నెఱుంగక పనిపాటలలోఁగూడి, యాడుచుఁ బాలనీరు వలెఁ గలసియుండిరి. తటాకోద్ధారణమున కాత్మార్పణము గావింపవలసినది సీతారాములే యని చెఱువుకట్టపై మూఁగిన జనసామాన్యమున కొక్కమారు స్ఫురించెను.

## 5

తటాక నిర్మాణమున కొప్పుకొనిన పని వాండ్ర గుంపులో సీతయు రాముఁడుగూడఁ గలరు. యజమానియగు నొక పనివాఁడు (మేస్త్రీ) ఈ దంపతు లొకచోట నున్న యెడల బని బాగుగాఁ జేయరని చెఱియొక గుంపులోఁ జేర్చెను. తూర్పు కొండనుండి యొక గుంపు కట్టబోయ నారంభించెను. పడమటి కొండనుండి యొక గుంపు కట్టఁబోయ నారంభించెను. సీతయు, రాముఁడు వేఱువేఱు గుంపుల యందుండుటచేఁ బగటివేళ గంజి ద్రాగునపుడు తప్ప కలసికొనుటకే యవకాశము లేకుండెను. తటాకనిర్మాణదీక్షలోనున్న మనము కలసికొనకుండుటయే ధర్మమని యా నూతన దంపతులు తృప్తినొందిరి. రెండు కట్టలు కలుపు దినమున సీత మట్టి తట్టలు కొలదిగ నందించెను. రాముఁడు రెంటిని గలిపెను. ఇరువురిటుల హృదయపూర్వకముగాఁ గలిపిన కట్ట తెగిపోవుట వారికెంతయో విచారము కలిగించెను. నిజమైన ప్రేమగల దంపతులు తామె యని విశ్వసించునా బాల దంపతులు తలంటిబోసికొని పసుపు వస్త్రములు గట్టుకొని జాజి పిగలతోఁ గొంగు ముడులతో చెఱువు కట్టపైఁ జేరిరి. వెంకటదాసు కుటుంబ మంతరించును గాఁబోలునని వృద్ధులు కన్నీరు విడిచిరి. నిజమైన ప్రేమ కొక దృష్టాంతర మేది? యువకులు తల్లడించిరి, రాజదంపతులు బాలదంపతుల మెడలో రక్తకుసుమహారము వేసి వీరగంధము పూసి వీర తాంబూలము నొసంగి సత్కరించిరి. యోగిని యా పుణ్యదంపతుల నాశీర్వదించెను. ఉత్తరపు దిక్కున నున్న చనుగొండలపై మబ్బుపట్టి పెద్ద జడివాన కురియుచుండెను. చెఱువు కట్టపై దుంపులు పడుచుండెను. చల్లని వాన గాలి వీచుచుండెను. ప్రజా సమూహము నిశ్శబ్దముగానున్న యా సమయమున చెఱువులోనికి సెలయేఱు ప్రవహింప సాగెను. చెఱువులోని పల్లపుభాగమంతయు నిండిగండినుండి నీరు పోవుచుండెను. కొంగు ముడులతోఁ బసుపుబట్టలతో నున్న సీతయు రాముఁడు గండిలో దూఁకిరి. బురదతో నిండి

యున్న యీ గండిలోఁ జెట్టుపట్టులతో నున్న యీ దంపతులు కూరుకొనిపోయిరి. పౌరులందఱు వారి మహత్తరత్యాగమును గీర్తించుచుఁ దట్టలకొలఁది మట్టిని దెచ్చి గండిని పూడ్చివేసిరి. గండి పూడెను. చెఱువులో నీరు నిలచెను. మఱునాఁడు ఈ వీర దంపతుల విగ్రహములు తటాకాగ్రమునఁ బ్రతిష్ఠింప రాజదంపతులు నిశ్చయించిరి. యోగిని తన యావజ్జీవితమా విగ్రహములఁ బూజించుఁ బూజారితనము నిర్వహింతుననెను. నగరశిల్పులలోఁ బ్రముఖుఁడొకఁడు దంపతుల విగ్రహము లొక కుఱువిందశిలపై జెక్కి తెల్లవారువఱకు దటాకముపై జేర్చెను. ఇంటికొకడు చొప్పున బసివాండ్రు వచ్చి యాలయము గట్టిరి. ఈ వీరస్మరణము నాఁటినుండి నేఁటివఱకు జరుపుటలో బ్రజలందరు యథాశక్తిని బాలుగొనుచున్నారు.

ఉపసంహారము.

వీర పూజలందలి యాచారములు వీరగానములయందలి భావములు వీర శిలలయందలి నిర్మాణ చాతుర్యము బరిశీలింతుమేని ఆంధ్రజాతీయ వికాస మభ్యుదయము నొందిన నాఁటి చిత్రకథలు గోచరించి వాఙ్మయాలంకారములగుటకు సంశయముండదు. ఆంధ్రదేశమునందు గానవచ్చు ప్రతి వీర విగ్రహము త్యాగసంగతమైనదే. ప్రతి వీరకాంతా విగ్రహము ఆత్మత్యాగ వ్రతమును బోధించినది. విస్మృతి సాగరమున మగ్నమై ఉపేక్షాతరంగములచే నావరింపబడి యదృశ్యములగుచున్న చారిత్రిక చిహ్నరత్నములు సేకరించుట కవియువకుల విధులలో నొకటి. సీతారాముల నాదికాలము నాటి సీతారాములను వలెఁ దత్త్రిశ్యులు నేటికి బూజించుచున్నారు. భక్తులు తామొందు సుఖము లా విగ్రహారాధనమువలన లభించినవిగ విశ్వసించుచున్నారు. ఏది యెటులయినను సీతారాములది నిజమైన ప్రేమయనుట సత్యోక్తియే.

## కవిగానము

వఝ్ఝుల వేంకటేశ్వరకవి.

రమ్యతరముగఁ జిన్న వర్షంబుగురిసె;
ఇంద్రచాపంబు పలురంగు లింపుమీరఁ
దూర్పుదిక్కునఁ గాంతులతో వెలింగె
పిల్లవాయువుల్ మెల్లన వీవఁదొడఁగె;
నిర్జనంబగునొకచోట నిశ్చలముగఁ
గోరికదలిర్పఁగాఁ గవికూరుచుండె.
హంస తన్మయత్వంబున నల్లనిలువఁ
బికము తనపదంబులకడ వేగ వ్రాల,
మించుగానామృతంబు నొల్కించుచుండె.

* * *

పండుతినఁబోవు చిలుక యప్పట్టునందు
నటులె యొకయింత కదలక యాగిపోయె.
నయనములు వెలయఁగఁ బురివిప్పినాట్యమాడు
నెమిలియాడుట మాని యాసమయమందు
నిశ్చలంబుగ నచటనే నిలిచిపోయె.
బాలసహకారసాల సత్పల్లవములఁ
దినుచు కోకిల యిట్లనుకొనియె మదిని.
"పాటలెన్నింటినో నేను పాడియుంటిఁ
గాని యింతటిహృద్యంబుగా నొకటియు
నుండలే దీతడెట్టి ఘనుండొకాని—
ప్రకృతిరూపస్వభావ విభ్రమములెల్లఁ
దెలుపు కవిరాజు! ధీరుండు దేవుఁడతఁడు!"

శ్రీ వాసుదేవరావుగారు.

# ముద్దుటుంగరము.

౧

" నేనీయను. దీనిమాత్రము నేనీయను. నాప్రాణముండగా నేనీయను. కావలెనన్న నన్నుఁ జంపివేయుఁడు; పిమ్మట దీనికొనుఁడు. సకలము నిచ్చివేసితిని. ఏమియు దాఁచలేదు. ఉన్నవన్నియుఁ బోయినవి. దీనిమాత్రము నాపంచప్రాణములతో సమానముగా జూచుకొనుచున్నాను. దీనినైన నిలుపుఁడు. మా నాన్నగారు తమ జ్ఞాపకసూచకముగా నిచ్చియున్నారు. ఎప్పటికిని దీని దూరము సేయకమని యాజ్ఞాపించియున్నారు. ఇంకనైన మీపట్టు వీడుఁడు. అంతగా గావలసియున్న మీరు కట్టిన మంగళసూత్రము దీసికొనుఁడు. కాని, దీనిమాత్రము నేనీయను, నన్ను జంపినను. "

శాంతాలోచనములలో నశ్రులు కురియుచుండెను. కంఠము శోకగద్గదితమయ్యెను. అతిదీనయై పురుషోత్తమరావునకు, గట్టెదుట నిలిచియుండెను. సర్వాంగము గడగడ వణకుచుండెను. పురుషోత్తముఁడు హతాశుఁడయ్యెను. భగ్నమనోరథుఁడయ్యెను. అత్యంతాగ్రహపరవశుఁడయ్యెను. అతని నేత్రము లగ్నికణములు గ్రక్కుచుండెను. శాంత పలుకజాలకపోయెను.

" ఈయవా? ఈయవుకదా? తండ్రిగారి జ్ఞాపకసూచకమన నేమి? జీవించియుండ జ్ఞాపకసూచకమా? చచ్చునప్పుడు మరొకటి యడిగి తీసికొనవచ్చును. చచ్చిన పిమ్మట జ్ఞాపకసూచకము. ఇప్పుడు నీవు నాకిది యీయకతప్పదు. ఈనాఁడెట్లును నేను విడువను. ఆహా! నీపతిభక్తి! భర్త యనంతబాధలు పొందుచుండ నీకలంకారములు శృంగారములు కావలసివచ్చెగా! తప్పదు; ఈయకతప్పదు. నీప్రాణముండగనే తీసికొందును " అని పురుషోత్తమరావు కర్కశస్వరముతో ననుచు, నుగ్రరూపుఁడై యామెచెంతకు దూకెను. శాంత తెచ్చవడి భయపడి యించుక వెన్కకుఁ దొలఁగెను. అంతనాతఁ డధికతర కోపావేశమున నటబడియున్న కత్తినెత్తికొనెను. ఈవిచిత్ర వర్తనము శాంతకు నూతనము. ఇట్టి దెన్నఁడును సంభవించియుండలేదు. ఆమెకిప్పుడేమియుఁ దోఁచలేదు. భయచకితయై పరుగిడిపోయెను. భర్తయనరానిమాటలనుచు నోరునకు వచ్చినట్లెల్ల దిట్టుచు నామెవెంట బడియెను. శాంత వంటయిల్లుజేరి ప్రాణరక్షణోపాయము నన్యము దోఁచక తలుపులు మూసికొనెను. పురుషోత్తమరావు తలుపులపై నత్యాచారము లొనర్చెను. కాని శాంత తలుపుఁదీయలేదు.

" శాంతా, శాంతా, యీయవుగా? నీభర్త గొప్ప చిక్కునఁ జిక్కియుండ నీకలంకారములా? కులుకులా? సంతోషమా? భర్తయెటుబోయినను జింతలేదుకదా! నీకలంకారముండిన జాలుకదా! శాంతా, నీపతిభక్తిపరాయణత్వము నేటికి నాకు దెలియవచ్చినది. నాయెడ నీకుగల ప్రేమానురాగము లిట్టివని నేడు బోధపడినవి. శాంతా— "

" వలదీ నిష్ఠురములు. అన్నియుఁ బోయినవికదా! నేనీయనంటినా? పట్టుఁబట్టితినా? ఏమాత్రమైన నను మానించితినా? అడిగినప్పుడెల్ల నిచ్చివేయలేదా! నాకుగల ప్రేమానురాగములు మీహృదయమునకైనఁ దెలియదా? పోనిండు; నాన్నగారు జ్ఞాపకసూచకమని యెన్నడును దీని దూరము సేయకమని యాజ్ఞాపించినందున దీనిపై నాకు నాప్రాణములకన్న నధికప్రీతి. అందుచే వేడుచున్నాను. ఈ యొక్కటి నిలుప బ్రార్థించుచున్నాను " అని రోదనస్వరమున శాంత లోపలనుండియె ప్రత్యుత్తర మిచ్చెను.

" అట్లయిన నీవీయవు— "

" నాప్రాణములుండ— "

" ఇదిగో నేవెడలిపోవుచున్నాను. ఈయింటనుండను నేటితో నీకును నాకును దీరిపోయినది. ఇంక స్వేచ్ఛాయలంకారములు ధరించి కులుకుచుండుము. భర్తప్రాణాపాయకర బాధలందుచుండ నొక్కవస్తు వీయఁజాలని, భర్త బ్రతిమాలినను వస్తువులపై మోహము వీడలేని, భర్త దేశభ్రష్టుడగుచుండ నేమాత్రమును విచారములేని, మహా

పతివ్రతాశిరోమణి యనిపించుకొని బ్రతికియుండుము. నేనిదే వెడలిపోవుచున్నాను." అనుచు గోపోద్రేకమున నడుగులు ధ్వనించుచుండ వెడలిపోయెను,

"వలదు—వలదీకోపము—" పురుషోత్తముడు వెడలిపోయెనని యామెకు దెలిసెను. ఇట్టి విషమస్థితిలో నేస్త్రీయైన నేమి చేయగలదు. శోకావేగము కొంచెముగా శమించెను శాంత శాంతచిత్తముతో నాలోచింపసాగెను.

"నిజముగనే యేదియో భయంకరసంకటము నేడు నూతనముగా నుపస్థితమై యుండబోలును. కాకున్న నింత విసుగునకు గారణమేమి? నేటివర్తనము మున్నెన్నడైన జరిగియుండెనా? ప్రియవచనములనన్ను బ్రతిమాలుటయు నేనొక్కటొక్కటిగ దీసి యిచ్చుటయు జరుగుచుండెను. కాని, యీనాటివలె గొట్టవచ్చుట, ఈ నాటిరౌద్రరూపమే నాకు నెఱుగను. సంకటము కలిగియుండుట నిజమే! ఎట్టిభయంకర సంకటములు నేడు నూతనముగా సంభవించియుండును? ఇట్టి భయంకరసంకటము లుపస్థితములు కాని దినమొక్కటైనా నే నెఱుగను. కావుననేకదా నా యొడలిపైనున్న నాన్నగారు నాకు వివాహకాలమున నొసగిన యలంకారములన్నియు మాయమైపోయినవి. అన్నియు బోయినవి. ఇదొక్కటిమాత్రము మంగళసూత్రము మాత్రము నేను మాత్రమే మిగిలియున్నాము దీనిపైగూడ నిప్పుడైదారు మాసములనుండియు దృష్టిపాఱియున్నది. ఎంతచెప్పిననేమి? దృష్టిదీనిపైనుండ నిదిమాత్రము నాకు దక్కుననియేనా నాయాస. నేడో రేపో యీయకతప్పదు. అయ్యో, నాన్నగారత్యంత ప్రేమపూర్వకముగా జ్ఞాపకసూచనమని యిచ్చిరే! ఏనాటికిని దూరమొనరింపకు మనిరే! ఇచ్చుటకు నిశ్చయించితినే, నాన్నగారెఱిగిన నేమందురో. యేమందురు? అన్నియుబోయినవి ఇదొకటిమాత్రమునిను న్రక్షింపగలదా? భర్తమహాఘోరాపదనుండ నీయవైతివా! అనియేయందురు. నిజమే ఒక్కవైపున విపదాంధకారమున మునిగియుండ నేనలంకరించుకొని కులుకుటయా? నాన్నగారేమియు ననరు. అదియుగాక నాన్నగారిప్పుడీప్రాంతములా లేరు, అయ్యో, ఎందున్నారోకదా! ఒక్క కమ్మయైనను లేదు మీకుమారితెనిట్లు దిక్కుమాలిన దానినిజేసి మీరేకాకులై యెందున్నారోకదా మీయాజ్ఞదాటుచున్నందులకు కలుగవలదు ఇచ్చివేయుదును. నాకేయలంకారమును వలదు. మంగళసూత్రమొక్కటే గట్టిగానున్న జాలు."

అని శాంత దీర్ఘాలోచనమొనర్చి నిశ్చయించి, మెల్లగ వంటిల్లు వీడి, భర్తనువెదకుచు నాతనిగదిలోన కరిగి చూచెను. అందు పురుషోత్తముడు దీర్ఘాలోచనా నిమగ్నుడైయుంటచే శాంత లోనకువచ్చుటయు నెఱుగడు. శాంత యొక్కనిముసము భర్తసమక్షమున నిలిచి యాతని దదేకదృష్టితో దిలకించెను అతడు నిశ్చలుడైయుండెను, అన్యమనస్కుడైయుండెను పలుకరింపలేదు. శాంతకామానము ఆవర్తనము అసహ్యము య్యెను. కన్నులనుండి టపటపమని యశ్రువులు కారెను. ఆమె దుఃఖవేగము భరింపజాలక తటాలున నాతని యురోభాగముపై వ్రాలెను. అతని వక్షోభాగము కన్నీటచే దడిపివేసెను.

శాంత పవిత్రనేత్రాంబువులచే స్నానమొనర్చబడిన దగుటచేగాబోలు! అతని హృదయము కరిగెను. పురుషోత్తమరావు కనులు దెఱచి యామెనట్టె బిగ్గరగాగిట నదిమి పట్టుకొనెను. అతని నేత్రములు నశ్రుపూర్ణము వెలార్చెను. ఇంచుక డడవూరకుండి పురుషోత్తముడు మృదుమధురమైన ప్రేమాపూర్ణమైన స్వరమున నిట్టులనెను.

"శాంతా! శాంతింపుము. శాంతింపుము. ఈనాటి నాప్రవర్తనమును మన్నింపుము. ఒక భయంకరాపత్సముద్రమున జిక్కియుంటచే నొడలు మఱచితిని. మన్నింపుము. శాంతా నీవిప్పుడిక్కడికివచ్చిన కారణము నే నెఱుంగననుకొంటివా? నీసహజ సద్వివేకబుద్ధి నిన్ను బోధించుటవలన నిచ్చివేయుదుననని కృతనిశ్చితవై వచ్చియున్నావని నే నెఱుగకపోలేదు. కాని నాకదివలదు. నేను దీసికొనను. అన్నిటినిమాయమొనర్చిన పాపకర్ముడను, కఠినచిత్తుడను, నిన్ను లంకలోని పార్వతి నొనర్చివేసితిని ఇకనైన బుద్ధితెచ్చుకొందును విచారపడకుము. మరల నాయుద్యోగమునకై ప్రయత్నించెదను. నాయుడుగారు విశాలహృదయులు, దయార్ద్రచిత్తులు. నాదుష్టప్రవర్తనము మూలముననె యతడు నన్నుద్యోగభ్రష్టు నొనర్చెను. అదియు నామేలుకొఱకే యని యిప్పుడు నాకు దోచుచున్నది. ఇప్పుడు రేపు నాయుడుగారిని దర్శించి నేనిక సచ్చరిత్రుడనగుదునని వచనమిచ్చి కడచినవాని క్షమింపవేడి, నాయుద్యోగము మరల సంపాదించెదను. దుఃఖింపకుము. లెమ్ము "ఇక నిశ్చింతతోనుండుము."

౨

పురుషోత్తమరావు సదాచారసంపన్న కులీనవంశసంజాతుడు కాని విపులైశ్వర్యవంతుడు కాడు. సామాన్యస్థితిమంతుఁడు కొడుకొక్కఁడేయగుటచే నతని దలిదండ్రులు కడు గారాబమున బెంచుచుండిరి. ఇతడు కోరినవన్నియు నొడగూర్చుచుండిరి. అదరు బెదరులేక ప్రవర్తింపసాగెను, అట్లుండియు దనవయసున నిరువదియవయేట నెల్లెట్లో బి యే, పట్ట పరీక్షయం దుత్తీర్ణుడయ్యెను. విద్యార్జనాశక్తి ప్రబలమైయుండెను. అప్పటికి కాంత కాపురమునకువచ్చి రెండేండ్లయియుండెను.

బి. ఎ. పరీక్షలో నుత్తీర్ణుఁడు కాగా న్యాయశాశాలలో బ్రవేశించి బి. యల్. పరీక్షకుఁ జదువవలయునని పురుషోత్తమునకు బ్రబలేచ్ఛ. కాని తండ్రి విషజ్వరపీడితుఁడై, యిరువది దినములు పడరాని బాధలు పడి యిరువదొక్కటవదినము పరలోకగతుఁ డయ్యెను అప్పటికిఁ దల్లి లోకాంతరగతయై పదునాల్గు మాసములైయుండెను. ఈవిధముగ జననీజనకులకు వంచితుడై యన్య సహాయము లేకునికి పురుషోత్తముఁ డేదే నుద్యోగమున బ్రవేశింపవలసి వచ్చెను.

ఏయుద్యోగమున ప్రవేశింపవలయుననుట యాతనికొక పెద్ద సమస్యయై నిలిచెను ప్రభుత్వోద్యోగమున నున్న మిత్రులొక కొందరితనిఁ బ్రభుత్వోద్యోగమున జేరుమని బోధించిరి. ప్రభుత్వోద్యోగ మన్నఁ బురుషోత్తమునకు గిట్టదు. అయ్యది కేవలముగ బానిసతనమేయని యితని యభిప్రాయము. ఇతడు తొలుతనుండియు స్వేచ్ఛాప్రియుఁడు. "మాస వేతనము ఇరువది- ఇరువదైదు. ఎన్ని వత్సరములో రేయింబవళ్ళుఁ దిరిక లేక, సంసారముపై నాశవదలి, కష్టించి పని చేసిన నలువది, యేబది. అంతకు మించుటకుఁ గలియుగము మునుఁగవలయు. అటుపై బ్రాహ్మణాబ్రాహ్మణసమస్య ప్రబలమైయున్నది. బ్రాహ్మణద్వేష మెల్లకడలను వ్యాపించియున్నది. అట్లుండియు నేకారణముననైన నేమి— ఒక్క యుద్యోగము లభించెనా కేవలము దాస్యము, అటుపై నధికారులవలన "సంజాయిషీలు జుర్మానాలు, సస్పెన్షన్లు, డిస్మిస్సులు,, దినదిన గండము. అన్ని గండములు గడచి పెంఁడివేను కొని నాలేండ్లు బ్రతికినగదా "హెహ్ షహ్!" యేదెట్లు తప్పినను "డ్యాం ఫూల్సు, యూస్లెస్ ఇడియట్సు" మొదలగు బిరుదములు తప్పవు! ఎట్లోర్వవచ్చును? ఛీఛీ నేనీ "స్లేవరి" కొప్పను ప్రయత్నింపను" అని యందరతో ననుచుండెను.

తుదకుఁ దనతండ్రికి బాల్యమిత్రుడగు నాయుడుగారి వర్తకసంఘమున నలువది రూప్యముల మాస వేతనమునకు కుదిరెను. అనతికాలముననే తన నైపుణ్యముఁ బ్రదర్శించి క్రమ క్రమముగా నలువదివలకు హెచ్చింపబడెను.

కాంతాబాయి జనకుడు ప్రభుత్వోద్యోగమున నున్నత పదవి నలంకరించియుండెను ధనికుడు. నవీనాచారప్రియుఁడు. కాంత జన్మించిన యెనిమిదవనాడే యాకస్మికముగా దల్లినిఁ గోలుపోయెను. కనులందెఱవని పుగడు వెళ్ళని, యాపసికూన నాతఁడు తన యక్కగారిచేఁ బెంపించుచుండెను. ఆబాలయు నమ్మలేని లోపము నెఱుఁగకయే దినదినాభివృద్ధిఁ జెందుచుండెను. సంస్కృతమున నించుకయు, మాతృభాషలో సామాన్యముగను జ్ఞానము నార్జించెను. అనంతర మామెను పదునారవ సంవత్సరమున జనకుడు పురుషోత్తమునకిచ్చి వివాహమొనర్చెను. అతఁ డధికసంపన్నుఁ డగుటను, బుత్రిక యొక్కతె యగుటను నటుపై నాబాలిక మాతృవంచిత యగుటను నాతఁడామెను సాలంకృత కన్యాదానమొనర్చెను. అప్పటికి నాప్తబంధువులును మిత్రవర్గము నాతని మరలఁ బెండ్లాడుమని యెంత బోధించినను సమ్మతింపడయ్యెను.

కాంతశ్వశురగృహావాసమునకు వెడలి పోయెను. కాంత యత్యంత రూపవతి కాదు. కాని సర్వావయవములును దిద్దినట్లుండెను, సామాన్య సౌందర్యవతులలో నొక్కరిత. కాని యుత్తమ గుణవతి. పుట్టింట నెంత గారాబముతో బెరిగియున్నను మేనత్త యుపదేశమువలన సంసార నిర్వహణజ్ఞాన మామె కించుక యలవడియుండెను, అత్తింటి కరుదెంచి నప్పటినుండియు నత్తగారికి సకలకార్యములందును సాయపడుచు, నామెవలనఁ దన కేమైన దెలియవలసియున్న నడిగి తెలిసికొనుచు వినయవిధేయతతో మెలగుచుండి యత్యల్పకాలముననే యత్తగారికి దలలోని నాల్కయై యామె మెప్పువడసెను. అనతికాలముననే యత్తగారు సకల సంసార నిర్వహణ

భారము సంపూర్ణముగ నీబాలపై మోపి నిర్విచారముతో శాంతి పూర్ణ హృదయముతో పరలోకమునకు వెడలిపోయెను.

శాంతాబాయి స్వతంత్రియై, గృహకృత్య నిర్వహణ దక్షయై సర్వవిధములఁ బతికిఁ దోడు నీడయై దినములు బుచ్చుచుండెను. భర్తృసౌఖ్యమే తనకు సౌఖ్యమని భావించి, యతని సకల రీతులను దనియించుచుండెను. శాంతా పురుషోత్తముల సంసారయాత్ర పలువురకు నిదర్శక యోగ్యమయ్యెను. కొందరకు మత్సర కారణమయ్యెను. ఈవిధముగా శాంతా పురుషోత్తము లఖండ సుఖముతో అతులానందముతో సంసారసౌఖ్యము లనుభవించుచుండిరి.

మానవు లందరు నెల్లప్పుడును సౌఖ్యమునే యనుభవించుచుందరుగదా! సుఖ దుఃఖములు సమ భాగములుగ దైవము నిర్ణయించియుండ నీ శాంతా పురుషోత్తములు మాత్ర మానిర్ణయమున కపవాదులు కానేల?

పురుషోత్తమరావునకెట్లో సప్తవ్యసనములలో నొక్కటి యలవడెను. ఆవ్యసనము నానాటికి నధికమై దృఢదారువై నిలిచెను. ఆయభ్యాస మలవడిన నాటనుండియు నీతడింటికి వచ్చుట క్రమము తప్పెను. ఉద్యోగ కార్యనిర్వహణ దక్షతయు మందగించెను. క్రమముగా నీత డిలు మఱచెను. ఉద్యోగ కార్యాలయమున కీతని యాగమనము దేవతా దర్శన మయ్యెను. నాయకుడుగా రొకటి రెండుమారు లీతని నిర్లక్ష్యభావమును గని మందలించిరి. కాని బాగుగ బాదుకొని వేరుపారియున్న యా వ్యసనము వలన నీతనికేదియు దెలియలేదు. అన్నిటియందును నిర్లక్ష్యభావము వహించెను. శాంత యొడలిపైని యలంకారము లొక్కటొక్కటిగ అప్పుడప్పుడు మాయములగుచుండెను. శాంతా హితోపదేశము లాతనికి గర్ణకఠోరములుగ నుండెను. భార్యాభర్తల ప్రేమానురాగముల కొకవిధమగు మాలిన్య మేర్పడెను. అప్పటికిని శాంత క్షమాశీలయగుట నాతని నెన్నివిధములనో ప్రియవచనముల గారవించుచుండెను. ఈతని నిర్లక్ష్యభావము కారణముగ వర్తకమున నాయకునగారికి నష్టము, గష్టము గలుగుచుండెను. నాయకుడు విసిగెను. కడుదూర మాలోచించి, కడ కీతని నుద్యోగభ్రష్టునిఁ జేసివైచెను. అంతియేగాక "నీ కింకనెక్కడ నుద్యోగము లభింపకుండఁ జేసెద" ననియు నొక్కి చెప్పెను.

ఇంతదనుకఁ బురుషోత్తమరా విలుమఱచియుండెను. భార్యను మఱచియుండెను. తన్ను మఱచియుండెను. లోకమే మఱచియుండెను.

పురుషోత్తముఁ డుద్యోగభ్రష్టుడై వారము పది దినములెట్లెట్లో యందందుఁ గాలము గడపెను. తదనంతర మొకనా డాతని కన్నులఁ గ్రమ్మియుండిన గాఢాంధకారము దూరమయ్యెను. వెలుఁగగఁబడియెను. తననిజస్థితి చక్కగ గానవచ్చెను. ఆవెంటనే యాతని కిల్లు స్మృతికివచ్చెను. శాంత తలపున నిలిచెను. అంత నాతని లోచనము లశ్రుపూరితము లయ్యెను. కొంత తడవునకు హృదయమును బదిలపరచుకొనెను. స్వగృహాభిముఖుఁడయ్యెను.

శాంత సహజ శాంత చిత్తముతో యథాయోగ్యరీతి నాతని సత్కరించెను. ఆనాటిగోలె దీర్ఘకాల వియోగదుఃఖమును మఱచి శాంత మరల గృహసౌఖ్యము లనుభవించుచుండెను. కాని యుద్యోగభ్రష్టుఁడైయున్నఁ దన భర్త మరల నేయుద్యోగమునయిన నార్జించుదనుక సంసార యాత్ర నిర్వహించుటకు మార్గమేది? అంతవనుక బోగా నిప్పటి కొడలిపైమిగిలియున్న యలంకారములొక్కటొక్కటిగ మాయము లగుచుండెను. పురుషోత్తమరావు ప్రతిదివసము నుదయమున లేచి యుద్యోగ ప్రయత్నమునకని బయటికి వెడలిపోవుచుండును. ఇష్టమైన సాయంతన మింటికి వచ్చును. వచ్చి తన ప్రయత్నములు విఫలము లయ్యెనని వచించును. ఇంటికి గాని దినములు లేకపోలేదు. అటుపై నాటకములకనియు, నాటపాటలనియు, మిత్రుల యిండ్ల విందులనియు వెడలిపోయిన దినములు కొన్ని.

ఇట్లుండ నొక్కనాడు పురుషోత్తమరా వెందుండియో సాయంతన మింటి కరుదేరుచుండెను. త్రోవ ననతిదూరమున నారుణీదేవాలయాధిపతి కేశవు లీతనికెదురయ్యెను. పురుషోత్తముని హృదయము తీవ్రముగ గొట్టుకొనసాగెను. పాదములు తొట్రుపడెను. దేహమున జెమ్మటగ్రమ్మెను.

అతఁడేదేని సందులోజొచ్చి పోయి కేశవులును దప్పించుకొన దలచెను. కాని యచట సందులేదు. ఇకఁ బది గజములు నడువవలయును. పురుషోత్తముఁ డతి త్వరగామి యయ్యెను సందులో దూర నుద్యుక్తుఁడయ్యెను అంతలోఁ గేశవు లీతని సమీపించి "ఏమయ్యో, పంతులూ, నన్ను చూచి సందులోకెళ్తున్నావు! బయంలేదు లేవయ్యా!" అని యనెను

పురుషోత్తముఁ డట్లే నిలచెను

"ఏమయ్యో, బాపనయ్యా. బొత్తిగా కన్పట్టంలేదే. మూడో నంబరు దుకాణంకాడి కెళ్తున్నావంటగాదా. నా దుకాణంకాడికి రానికాడికి నా బాకీమాటేమంటావయ్యా! ఎందా కోర్చుకోమంటావు? ఒకటా రెండా నూట డబ్బైయైదీయాలెగదా? యెగ్గొట్టానికే నూస్తుండావా యేమిటి! నాలుగు నెల్లయినై కదా! ఇదుగో, అదుగో అన్నావు నాకిత్రికూడా పోయిందంటగందా? యాడ తెస్తావయ్యా! పెళ్ళాం మెళ్లో పుస్తయినా అమ్మి నా బాకీ దమ్మిడీతో నాక్కట్టకపోతే నేనూరుకుంటానా? ఇంతకూ పరువు మర్యాదలు నూసి బాపనయ్యవుకదా అని వూరుకున్నకొద్ది బొత్తిగా మొహం దాచేశావు. ఇంకోరయితేనా నిలబెట్టి పుచ్చుకోనంటయ్యా ఎందుకు పాత ఖాతాదారుకని వూరుకున్నాను, ఎందా కూకున్నా గతీమతీలేదు. అయ్యా యింక నీపరువుదక్కదు. రేపు పదిగంటలకెల్లా నా బాకీ అంతా తెచ్చి కట్టకపోతే పదకొండో గంటకు నీ యింటికాడి కొచ్చి కూకుంటా. అది మరేదయ్యా నీకు? మరేద దక్కించుకోనాలంటే తప్పొద్దు ఆఖరుకు వందయినా సరే. యేమంటావు?" అని కేశవులు నిష్ఠురముగా బలికెను.

పురుషోత్తముడు తల వాల్చియే వినుచుండి యింతలో వీడు తన్ను విడచినందులకు దా ధన్యతగాంచి నపరిమితానందమంది "సరే; రేపిచ్చెద" నని వడివడిగ నడచుచు నాలోచనాధీన మనస్కుఁ డయ్యెను.

'రేపు పది గంటలకెల్లా — ఆఖరుకు వందయినా — తెచ్చి కట్టాలె. లేకుంటే యింటికాడికొచ్చి కూకుంటా. పరువు దక్కదు' అను నీవాక్యము లాతని కర్ణరంధ్రములలో జాగృతములై యుండెను.

"ఐదు వందలయినా లేకుంటే 'టుస్సీ' యవునా? రేపు సాయంకాలమునకు దెచ్చి యీయవలెను. లేకుంటే నే నురిపోసికొని ప్రాణము విడిచెద" నని సౌభాగ్యవతీ విలాసినీహఠము. ఎట్లు తేగలను? గడువు మీరిన గౌరవహాని, స్త్రీహత్యా పాతకము ఒక్కమారే చుట్టుకొనగలవు. దిక్కేది? ఆలోచించెను. ఒక్కటే యుపాయమున్నది. అట్లొనర్పవలెనని నిశ్చయించెను. అటుపిమ్మట నారాత్రి జరిగినదంతయుఁ బ్రథమ ప్రకరణమున దెలుపఁబడియున్నది.

౩.

ప్రారంభ ప్రకరణమున నుడువబడిన విషయములు ఘటించిన యా మఱునాటి యుదయ మేడు గంటలకుఁ బురుషోత్తమరావు వస్త్రములు ధరించి "నాయుడుగారిని దర్శింప బోవుచున్నా" నని భార్యకుఁ దెలిపెను. ఆమె మందహాస విలసన్ముఖియై "భోజనమున కింటికి రావగునా, లేక —" అని యేమో యనుచుండ నాతడు "ఆఁ — ఇంటికే వచ్చెద. ఎక్కడకును బోవ" నని వచించి వెడలిపోయెను.

రవివాసరము. నాయుడుగారొక్కరే మేడపై నున్నారని ద్వారపాలకుడు పురుషోత్తమునకుఁ దెలిపెను. ఒంటరిగా నుండుటయుఁ దన యదృష్టమే యనుకొనుచు బురుషోత్తమరావు సోపానపంక్తి నారోహించి నాయుడుగారి గదికడ నించుక చాటున నిలిచెను.

గదిలో మధ్యభాగమున నొక పెద్ద బల్లయుండెను. దానికి నలువైపులను గుర్చీ లమర్పబడి యుండెను. అందొక ముఖ్యాసనమున నాయుఁడాసీనుడైయుండెను. గోడలకందందు బహుళముగ స్వదేశ విదేశముల రంగుల చిత్తరువు లలంకరింపబడి యుండెను. వానికి నడుమ నడుమ నాప్త బంధువులయు, మిత్రులయు ఛాయాపటము లుండెను. ఒక్కెడ నొక్క "సోఫా"యు, రెండు "ఈజీ చేయిర్లు" నుండెను ఆ ప్రక్కనె యద్దముల పెద్ద "బీర్వాలు" రెండును, సాధారణమగు "బీరువా" యొకటియు నుండెను.

నాయుడుగారు బల్లకడ నగ్రాసనమున నాసీనుడైయుండెను అతడు స్థూలకాయుడు. అజానుబాహుడు, అతని కించుమించుగ నేబదియేండ్లుండును. బంగరు చట్రముల యుపనేత్రము లాతని కొకవిధమగు నంద మొసగుచుండెను. శిరోజములు తెల్లనైనను చక్కగ గత్తిరింపబడి నడుమ పాపిటయుండి, పెట్టని "టోపి"యై యుండెను. మీసములు నెరిసియున్నను నతి శ్రద్ధతో మెలివేయబడి యిరు మొనలు సూదిమొనలవలె నుండెను. అతని విశాల లలాటభాగ మాతని యున్నతౌదార్యమును జాటుచుండెను. ఎడమచేతి వ్రేళ్ళుల నడుమ బొగఁ బారుచున్న "హావన్నా చెరూ" టొకటుండెను. కుడిచేతి వ్రేళ్ళుల నడుమ నూదా "పెన్సి" లొకటి యుండెను. అతని

కట్టెయెదుట నొక పెద్ద పుస్తకము తెఱచియుంచబడి యుండ నాయుఁడా లేఖినితో నాతఁడందేవియో గురుతు లిడుచుండెను.

పురుషోత్తముఁడు సంశయపూరిత హృదయముతో, కంపిత పాదములతో విగళిత ధైర్యముతో ఒక్కింతసేపటఁ జాటున నిలిచియుండెను. హృదయమును గుదురుపఱచుకొని నాయుడుగారికిఁ గనబడురీతి నిలిచెను. రెండుమూడు నిముసము లయిన పిమ్మట నాయుఁడు చుట్టను బీల్చి పొగ విడుచుచుఁ జుట్టినంటియున్న బూడిదఁ దొలగింప నిటు చూచెను. పురుషోత్తముఁ డటనుండుటఁ జూచెను

"ఓ! పురుషోత్తంగారా! రండి" అని నాయుఁ డాదరించెను

పురుషోత్తముని హృదయము మరలఁ గంపింపసాగెను. పాదము లధికాధికా ధైర్యముఁ దాల్చెను. నోట మాట లయిన వెలువడునో లేదో యని సంశయము కలిగెను. ఎట్లెట్లో లోన కడుగిడెను.

"కూర్చుండుడు యేమి పనికలిగి వచ్చితిరి?" అని నాయుడు మందహాసముతో నడిగెను.

పురుషోత్తమ రా వెట్టుల సంభాషణ నుపక్రమింతునా యని యాలోచించుచు నూరకుండెను.

"నావలన నేమిపనియుండివచ్చితిరి?" అని నాయుడు ముందున్న పుస్తకమునుండి దృష్టిమరలింపకయే యడిగెను.

ఇక నుపోద్ఘాతములకుఁ దీరిక లేదని తెలిసికొని పురుషోత్తముఁ డొకటి రెండు మాటలలోఁ దను వచ్చినపని దెలుప నిశ్చయించుకొనెను.

"అయ్యా నాయుద్యోగము మరల—"

నాయుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. "ఆమాటలిప్పుడు వలదు. మీవంటివారు—"

"అయ్యా, నేనిప్పుడు పవిత్రవర్తనుఁడ నగుటకు సంకల్పించుకొంటిని. పూర్వపు దుర్వ్యాపారములను మాని—"

"సంతోషము మానితిరా? మానుదురా? మానియున్నఁ బరమ సంతోషమే. మానుదునన్నట్లు సంకల్పించుకొన్న మీకు సద్బుద్ధి కలిగినందులకుఁ బరమ సంతోషమే. ఇంక నే జేయదగిన దేమున్నది? త్వరగా జెప్పుడు. వేరు పనియున్నది."

"సర్వ దుష్కృత్యములను మాని యిప్పుడు నేనింటి కడనే బుద్ధిగలిగ యున్నాను—"

"సంతోషము. ఎంతకాలమునుండి?"

ఇపుడు పురుషోత్తముండు నిశ్చయముగా గొప్ప చిక్కున జిక్కుకొనెను ఎంత కాలమునుండి యని యనును? "దీర్ఘకాలమునుండి" యనునా? అందువలన నేమగునో? యేనాటియందంతము లానాడీతనికి తెలియుచుండునా? అసత్యభాషణ దోషము నెత్తికి జుట్టునేమో! వచ్చిన పని కాటక మగునేమో! "కొలది దినములనుండి" యనునా? బహు స్వల్పకాలమని యుద్యోగమీయ నిరాకరించునేమో? యేమి చేయును? యేమనును? ఈ యాలోచన మంతయు నొక్క క్షణమాత్రమని హృదయమున నుద్భవించి యంతరించెను. కడ కెట్లయినను సరేనని ధైర్యము దెచ్చికొని తటాలున "బదిపండ్రెండు దినములనుండి" యనెను

"ఓ బహుస్వల్పకాలము! ఈ యల్పావకాశమునందే మీ వ్యసనములను సంపూర్ణముగా మానితిరని విశ్వసింపవలనుపడదు. ప్రస్తుతము యేకారణమున నయిననేమి?— మానియున్నారని నమ్మవచ్చును. కాని దీర్ఘకాల మిట్లేయుందురని నమ్మికయేమి? ఇప్పు డన్నియు మీరు మానియున్నట్టుల మీకు దోచుచుండవచ్చును. కాని యీమానుట నిలకడమీదగాని తెలియదు అందునను మీయుద్యోగము ధనముతో సంబంధించినది. చేత ధనము విపులముగనుండును. మనసు మరల మారును. ఇది మీకే కాదు. అందఱకు సామాన్యమే. కావున ప్రస్తుతము మీరుద్యోగ ప్రయత్నము మానుడు ద్రవ్యార్జనా ప్రయత్నమునకు ముందు జ్ఞానార్జనమునకుఁ బ్రయత్నించిన మేలగును. మీరు దుర్వ్యసనములను బూర్తిగా ద్యజించితిరనియు, సుజ్ఞానము నార్జించియున్నారనియు నాకు నమ్మిక పొడమినప్పుడు నేనే మిమ్ముఁ బిలిపించెదను"

"అయ్యా నా మనోనిశ్చయము నాసంకల్పము—"

"కానిండు; మాతము. ఇప్పుడు నాకు వేరు పని యున్నది."

"నా యుద్యోగము—"

"నాకు వేరు పనియున్నదని చెప్పుట నిది మూడవ మారు."

ఇక మాటాడ వీలులేదు పురుషోత్తముఁ డచ్చోటు వాసి వెడలిపోవుట తప్పదయ్యెను. ఉద్యోగము మరల సంపాదింతునని కొండంత యాసతో వచ్చియుండెను. ఆశాభంగమయ్యెను. కన్నుల నీరు గిరుక్కున దొర్లెను హతాశుడై, విచార పూర్ణ హృదయముతో నాతఁ డాగ వీడిది వెలికి వచ్చెను. ఇంటికి బోవు టెట్లు? అనేక విధాలోచ

వలు మనసున నొక్కమారె ముప్పిరిగొన నాతఁ డన్యమనస్కుఁడై సోపానావరోహణ మొనర్చుచుండెను. ఆకస్మికముగా నాతనికన్నుల కంధకారము క్రమ్మెను తటాలున నొక్క మెట్టుపైఁ దడవు నిలిచెను. ఆసమయమున నాతని హృచ్చక్షువులకు నానా దృశ్యములు కనఁబడెను. కేశవులు తనయింటికడ నరుగుపై గూర్చుండి పరిపరి విధములఁ దన్ను దూషణవాక్యము లాడుచున్నట్లు తోఁచెను. అంత నాదృశ్యము నిమేషకాలమున నదృశ్యమైపోయెను. ఆవెంటనే తన ప్రియవిలాసినీ టుస్సీలకై పట్టు బట్టి చేలాంచలమును గంఠమునకు బిగించుకొనుచున్నట్లు తోఁచెను. అరనిమేషమున కాదృశ్య మదృశ్యమైపోయెను. భార్య కాంత తానడిగిన వస్తు వీయనని పట్టుబట్టి మూర్ఛనొందినట్లు గనబడియెను. అనంతరము నాయుడుగారు తనునుద్యోగమునఁ జేర్చుకొనుట లేదని స్పష్టముగ నుడువుట స్మృతిపటలమున నిలిచెను. ఇవన్నియు వర్ణించుటకి తేకాలము పట్టినది; కాని యీ విచారము లన్నియు క్షణకాలమునకన్న నధిక కాల మాతని చిత్తమున నిలిచియుండలేదు. అంత నేమో మనోనిశ్చయము గావించికొని నలువైపులను దృష్టులఁ ద్రిప్పెను. క్షణార్ధమున నదృశ్యుఁ డయ్యెను. అనంతర మొక్క క్షణమునకు ద్వారముకడ బ్రత్యక్షుఁ డయ్యెను.

ద్వారపాలకుఁ డీతని సమీపించి "పంతులుగారూ, నాయుడుగారి శెలవయ్యిందాండీ?" అని ప్రశ్నించెను.

పురుషోత్తముఁడు నిస్తేజుఁడై, కన్నుల నీరు కారుచుండ నధరము కంపించుచుండ, పాదములు తొట్రిల్లిపడ నస్పష్ట స్వరమున "లే—లే—లేదు—" అని యనుచునే యచ్చో నిలువక ద్రుతగమనమున వెడలిపోయెను.

౪.

"ఒంటిగంట యైనది. భోజనమునకయిన నింటికి రాక నాయుడుగారితో బనియా? అంత పని యుండిన వచ్చి భోజన మొనర్చిన వెంటనే పోయియుండరాదా? నాయుడుగా రుద్యోగ మిచ్చియుందురా? ఇంటికి రాకయే కార్యాలయమున కరిగియుందురా? అత్యవసరములగు బను లుండబోలును! ఒక్కవార్తయైన బంపియుండరాదా?

"నాయుడుగా రుద్యోగమునఁ జేర్చికొనకుండిన? ఇప్పటికింకను నింటికి రాని కారణ మేమైయుండును? చిరకాలము నుండియు జేరుపారియున్న యభ్యాస మొక్కపూటలో నదృశ్య మగునా? క్లబ్బునకే పోయి యుందురు. కాక పోయిన విలాసినీ గృహమునకు! అంతకన్న నిక బోవ స్థలమేమున్నది?

"అయ్యో, యీక్లబ్బెన్నడు రూపుమాయునో కదా! రేయుంబవళ్ళుఁ గ్లబ్బే! భోజనము క్లబ్బునందే, పానముఁ గ్లబ్బునందే. ఇల్లు వాకిలి యక్కరలేదు. భార్య యుపవాస ముండినను, రోగపీడితయైనను, కడకు జచ్చినను చింత లేదు. స్మృతికే రాదు. ఈక్లబ్బును దలఁచినంత నాయొడలు కంపమెత్తుచున్నది. ఆపాపము స్తకమును దగ్ధ మగుచున్నది. ఎంత యోర్చుకొన్నను నొక్కొక్కప్పుడు దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది. ఈక్లబ్బు మూలముననేకదా యింతటి దుర్భర దారిద్ర్యము సంభవించినది! ఇకనయినను దెలియదా? ఇప్పుడేల దెలియును. అర్ధజ్ఞాన మార్ధనాయక మందురు. కాని యర్ధనాశనము నరర్ధదాయకమే. సంపూర్ణ వినాశ మందినఁగాని సుజ్ఞానోదయము కాజాలదు.

"క్లబ్బునకే పోయియుందురా? లేక—ఎక్కడ కరిగిన నేమి? వేళపట్టున నింటికరుదెంచి భోజన మొనర్చి పోవరాదా? వలదందునా? అయినను నక్కడి భోజనవస్తువు లింట లభించునా? అక్కడిపానము లింటదొరకునా? అక్కడి యాటలు, పాటలు, సయ్యాటలు, వినోదములు, నింటనెక్కడివి? అయ్యో యీక్లబ్బుమూలమున నెన్నికొంపలు కూలినవో, కూలుచున్నవో, కూలనున్నవో కదా! దైవమా. యీక్లబ్బును నిర్మూలమొనర్ప నేరికయిన సద్బుద్ధి నొసఁగవా! కనులుదెఱచి చూడవా?

"రాత్రి యంతయు నెంతో బుద్ధి దెచ్చికొనిరి. క్లబ్బుపేరయిన దలపననిరి. ఆటపాటల చెంతనయిన బోవననిరి. ఏ దుర్వ్యసనముపొంత నైన జననిరి. నమ్మితినే. సంతసించితినే. ఇంక బాగుపడుదుముకదాయని భావించితినే! కాని—కాని— అన్నియు వృథా భాషణములే యగునా? మృషావాక్యములే యగునా? నన్నోదార్ప—నాకనుల నీరు తుడువ నిట్లనియుందురా? కాకున్న నిప్పటికి నింటికి రాని కారణ మేమైయుండును."

అని నానావిధముల జింతించుచు, శంకించుచు కాంత మగనిరాక కెదురునూచుచు నింట గూర్చుండియుండెను. వీధి నే యలికిడియైనను నాతఁడే యరుదెంచెనని భావించి, వికసితనేత్రయై చూచుచు—రాకునికి నిరాశవహించి మరల నాలోచనానూత్రము నల్లదొడగు. రెండుగంట లయ్యెను. మగనిజాడ లేదు. ఆమెకీ విచారమునకు దోడుగ మిక్కు

టముగ నాకలి యగుచుండెను. ఇక వేళ మీగుటచే నాతఁడింటికిరాడని యామె నిశ్చయించుకొనెను. ఒక్కమారు బయటికరిగి చూచి, యతడు కానరానందునకు విచార పూర్ణహృదయముతో నానావిధ సంశయ పూర్ణస్వాంతముతో నామె లోనకరిగి రెండుమెతుకులు నోట బడవేసికొన నెంచెను. అంతలో నెవ్వరో తలుపుదట్టిన చప్పుడు వినవచ్చెను. శాంత తటాలున బోయి తలుపు దెఱచి చూచెను. నాయుడుగారి సేవకుడు నిలిచియుండెను.

"అమ్మగారూ, పంతులుగార్ని రమ్మనండీ" అని సేవకుఁడనెను.

"లేరింటలేరు. ఉదయము నాయుడుగారిదగ్గరంచి వత్తునని చెప్పి పోయినవారింకను భోజనమునకైనరాలేదు. ఉదయమునుండి భోజనము లేదు అక్కడ లేరా? కార్యాలయమునను లేరా?"

"లేరమ్మగారూ, ఆదివారం కాదటండీ యాడికెళ్ళారండీ? నాయుడుగారి యింటికాడనుంచీ పొద్దున్నే యెళ్ళారండీ ఇంకా యింటికి రానేలేదాండి?"

"లేదు. రాలేదు."

"వస్తే నాయుడుగారరగత్తెంగా వచ్చి పొమ్మన్నారని చెప్తారాండీ?"

"ఆఁ. సరేగాని, దేనికో? నీకేమైన దెలియునా!"

"నాకేం దెలుస్తదండీ! పంతులుగారు నాయుడుగారింటికొచ్చారాండి. నాయుడుగారేమన్నారోగాని, పంతుల్గారు కళ్ళు తుడుసుకుంటూ మా యిచారంతో యెళ్ళిపోయినారండి నాకేమా జాలేసింది ఆనక నాయుడుగారితో మఃవిశేశాండీ కొంచెం సేపూరుకుండి, యేమనుకున్నారో మళ్ళీ నన్ను పిల్చారు. నేనెళ్ళి నిలిచా. పురుసోత్తంగారిని యెంబడెట్టుకరా పో అన్నారండి. ఇందాకా రెండుమార్లొచ్చాను. పిల్చానండీ. ఎవరూ పలక్కపోతే యెళ్ళిపోయినానండి. ఇంలేనండి. మళ్లీ నన్నుపిల్చి పంతుల్గారిని తీసుకరా అన్నారండి నాయుడుగారు. వస్తే చెప్తారాండీ."

"ఆఁ."

సేవకుడు వెడలి పోయెను. శాంత యొక్కమారు వీధిలో నిరునంకలను జూపుమేర దూరము దృష్టి సారించి చూచి ఖిన్నవదనయై యింటిలోన కరిగెను.

"ఇక నీపూట నింటికి రారు. నాయుడుగారి యింటను లేరు కార్యాలయమునను లేరు. ఇక్కడ నింటను లేరు. ఇంక నెక్కడ కరిగియుందురు? నాయుడుగారుద్యోగమునీయ నిరాకరించిరట! నిరాశాభీర హృదయముతో నెక్కడకో పోయిరట! ఎక్కడికో యేటికి? క్లబ్బునకో కాక యా భూలోక స్వర్గమునకో పోయియుందురు నేడు క్రొత్త కాదుగదా! ఇదేమి) ఇంత దనుక నన్నుఁ బీడించుచుండిన యాకలి యిప్పుడేమయ్యెను ఇప్పుడు భోజనముచేయను ఇంటికి వచ్చిన పిమ్మటనే చేయవచ్చును.

"కాని నాయుడుగారప్పుడుద్యోగమీయ నిరాకరించి, యిప్పుడు పైపైనిన్ని వార్తలంప నేటికో? మనసు కరిగియుండునా? ఉద్యోగమిచ్చుటకే యిన్ని వార్తలంపుచుండు? ఇదియేకానోపు. ఇంటికి వచ్చిన వెంటనే పంపుదును." అని యాలోచించుకొనుచు "జీమ చిటుకు"మన్న భర్తయేవచ్చెనని చూచుచుహాతాశయగుచు, బరిపరి పరస్పర విరోధాలోచనలకు హృదయమున స్థానమిచ్చి నింటగాచియుండెను.

అయిదు — ఆఱు — గడ కెనిమిది గంటలు నయ్యెను. శాంత యిక భర్త రాడని నిశ్చయించి రెండుమెతుకులు తిని పరుండవలెనని తలచెను ఈమె కీవిధము నూతనము కాదు పగలు రెండుమూడు గంటలవఱకు నిరీక్షించి యింకి భర్తరాకునికి నొక్కపట్టైదన్నముఁదినుట నీమెకు నిత్యాచారమై యుండెను.

శాంతాబాయి వంటయిలు చేరిచేరకమున్నే వీధితలుపు లొక్కపెట్టున భీకరముగ ధ్వనించెను. శాంత యొక్కపరుగునఁ బోయి తలుపుఁ దెఱచెను. పూర్తిగా దెరచు లోపలనే యొక వ్యక్తి యాసందునఁ దటాలున లోనకుఁ జొచ్చి, తూలి పడవలో నేలకొఱిగెను. "మూయుము తలుపు మూసివేయుము" అని యనెను.

పురుషోత్తముని మొగ మెండదగిలి నల్లవడియుండెను. సర్వాంగములు గంపించుచుండెను. నేత్రము లగ్నిస్ఫులింగములఁ గ్రక్కుచుండెను. ఆనడవయంతయు దుర్గంధపూరితమైపోయెను. శాంతకు భర్త పరిస్థితి తెలియవచ్చెను. మెల్లగ నాతనిఁ బట్టికొని పోయి పడకిల్లు చేర్చెను.

పురుషోత్తమరావు చొక్కాచాటున జంక నిమిడ్చికొనియుండిన యొక చిన్న మూటను తాకి తనలోనిట్లనుకొనసాగెను. "దాచు దీనిని దాచు. జాగ్రత్తగా దాచు. పెట్టెలో వలదు. భూమి మూరెడు త్రవ్వి యాగోతిలో నిట్టే దాచు ఇప్పుడేమియు నడుగకుము జాగ్రత్తగా దాచు. ఎవరైన— ఎవ్వరైనను సరే— వచ్చి యన్నడిగినను నిటు లేగనుము. ఊర లేరనుము. నేను త్రాగలేదు. త్రాగినానని కొనెదవు సుమా! లేదు. లేదు, ఇకం ద్రాగనని యొట్టుం బెట్టుకొంటినిగాదా! ఇక నట్టిపనిం జేయుదునా? వంద కేశవులకు— పరువుదక్కదట! ఇప్పు డెవరి పరువు దక్కినదని యడిగితిని. శాంతా, యెవరు వచ్చి యడిగినను లేరనుము ఒక్కటేమాట చెప్పివేయుము ఇంట లేరు ఊరిలోనే లేరు, ఎక్కడనో— యేయూరనో— చెప్పలేననుము ఒక్కమాటే చెప్పివేయుము. ఇదుగో— శాంతా, తలుపు దీయనేవలదు. ఏమియును జెప్పనేవలదు పలుకకుండి. వారే వెడలిపోవుదురు బహుజాగ్రత్తగా దాచుము, ఒట్టుసుమా! నేను సురాపానము చేయనే లేదు ఆహ్హాహాహా! ఒట్టు పెట్టినను నమ్మవే? పిచ్చి పిల్లా; ఇక నేజేయను. ఇదే కడసారి. త్రాగియుండి నేనెప్పుడైన నింటికి వచ్చియుందునా? నాకంత మాత్రము తెలియదనుకొన్నావా? లేదు— లేదు. ఉండుడుము. ఎవరా తలుపుదట్టువారు? విలాసీ— విలాసవతి విలాసినీ ఉండుడుము. తెచ్చియున్నాను. రేపు తప్పక టుస్సీలు నీ మెడలో నుండును ఆహాహాహాహా! విలాసీ! ఇంట లేరనుము. ఈయొక్కపూట యోర్చుకొనుము! అయ్యో! వలదు. వలదు. కంఠమును జుట్టియున్న చెరగు దీసివేయుము. నన్నె వరిపాలు సేసి పోయెదవు? నీవే నాకు స్వర్గదేవతవు నీయిల్లే నాకు స్వర్గలోకము! నీపలుకులే నాకమృతవుసోనలు? ఆహ్హాహ్హాహ్హా! ఏదీ— విలా— యేదీ— ఒక్క— లేరు— ఇంట లేరనుము. ఈయడట! చచ్చిన యబ్బ యిచ్చెనట! అంత పంతమా? లేదు. విలాసినీ— లేదు. నేనింటికే పోవను. పోనీ— నూతిలో దూకనీ గోతిలో దూకనీ — దాహము నాలుక యెండబారినది"

శాంత శీతలోదకము ద్రావనిచ్చెను, పురుషోత్తముడు కొంతతడ పూరకుండి మరల బ్రారంభించెను.

"ఆహాహా! ఆ పెరయే యంత పట్టుబట్టకుండిన నెట్లయి యుండునో? అతడును, ఇంజనీయరును, ఉదారహృదయుడు. అనుమానించినాడా? సంకోచించినాడా? అబ్బబ్బబ్బ! తలయూడి పడిపోవుచున్నది. ఇంకను నీకనుమానమేనా? నేను ద్రాగనేలేదు. శాంతా, శాంతా ఒక్కమాటెసుమా! దాచితివా? అంతే పాతాళములో దాచు ఇంజనీయరు క్రొత్త— ప్రక్కవీధి— గొప్ప మనసు కలవాడు అతని భార్యయో మహోదార గుణ సంపన్న, అనుపమరూపవతి దాహము—"

పురుషోత్తమరావు గదిలో నొక్క చాపపైబడి యిటునటు బొరలుచు నసంబద్ధాలాపన మొనర్చుచుండెను. భాషణ మసంబద్ధము అస్ఫుటము, పరస్పరవిరుద్ధము.

శాంత యతి దీనవదనయై తలవంకించి యాతని చెంతన కూర్చుండి యుండెను అతడు దాహమనినప్పుడెల్ల నాతని నోట నీరు పోయుచుండెను ఈతని భాషణమంతయు వినెను. క్లబ్బు, సురాపానము విలాసిని శాంతకు క్రొత్తవిషయములు కావు కాని యీమూటలో నేమున్నది? త్రాగ ద్రవ్య మెక్కడిది? భూమిని త్రవ్వి దీని గోతిలో దాచుటేమిటి? ఎవరువచ్చి తన్నడిగినను లేరనుట యేమి? ఇంజనీయరు భార్య అనుపమరూపవతి, మహోదార గుణసంపన్న, పట్టుబట్టినది— ప్రక్కవీధి— క్రొత్త! ఏమీ వ్యవహారము? శాంత కేమియు తోచలేదు. నిశ్చయముగ నేనే డీమెకు బిచ్చిపట్టెను

పురుషోత్తముడు క్రమేపి క్రమేపి కడకు నిద్రావివశుండయ్యెను.

శాంత యాలోచింపసాగెను ఎన్ని విధముల నాలోచించినను నేమియు దోచదు. కడకు విసిగి యీ మూటలో నేమున్నదో చూడ నుత్సుకయయ్యెను. గదివీడి వంటయింట జొచ్చి, దీపపువెలుగున నామూట విప్పిచూచెను. శాంత కొడలు జల్లుమనెను. చెమటబట్టెను. యేదో యొకవిధమగు భయంకర సంశయభయము లామె నొక్కమారె ముట్టడించెను. అంతధన మెక్కడిది? నాలుగు వందల యిరువది నాలుగు రూప్యములు నారణాలు! శాంత నానావిధ పరస్పర విరోధాలోచనలతో యారేయంతయు గడపెను.

(సశేషము)

# శ్రీరామనవమి

చింతా దీక్షితులుగారు (సాహితీసమితి)

వచ్చెఁ జైత్రము, కోకిల
లుచ్చైఃకంఠములతో కుహూకుహూమనియెన్
విచ్చెఁ మల్లెలు, ప్రజలకు
హెచ్చెఁ తాపంబుదినము లేగినకొలఁదిన్.

ఆపట్టణంబు ధనికుల
లోఁపుట్టెఁ గలవరంబు, లోకాలేలే
శ్రీపతి వివాహకార్యము
నేపగిదిం జేతుమంచు, నెల్లాననుచున్.

నిరుడు పూసలపేర్లు నిండుగాదగిలించె
నతడు; నే నీయేడు అతనిమింతు;
గుంటూరుమేళంబు కొనివచ్చె నిరుడాత
డీయేడు ఏలూరి దేనుదెత్తు;
పదినూర్లు వెచ్చించె పందిళ్ళకతఁ డేను
వెచ్చింతు నీయేడు వేలకొద్ది;
'పాపి' నాతడు పిల్చి బాగోతమాడించె,
నీయేడు 'కామాక్షి' నేనుదెత్తు;
వాలుమొగ్గలసానుల వాడుదెచ్చె,
నేను 'కారువాగట్టెడి' సానిదెత్తు;
గ్యాసులయిట్లేడు పందిళ్ళగట్టెనతడు,
తోరణాల్ కట్టెదను లైట్లతోడ నేను.

అని పంతాలాడుచు, ధన
మునునీళ్ళగతిన్ వ్యయింపమురియుచు నాయూ
రను ధనికవరులు పూనిరి,
ఇనకులమణి పెండ్లికార్య మెచ్చుగఁ జేయన్.

◆ ◆ ◆

భక్తుడొకడుండె నాయూర, వాని పుణ్య
వశమునన్ జేసి రాములవారి దివ్య
దర్శనాధికభాగ్య మాతనికిగలిగె,
నుత్సవాల్ ఘెల్లుమనునప్పు డూరిలోన.
" ఊరివారలు చేసెడి యుత్సవాలు
చూడవచ్చితివా? యేమి? సుందరాంగ!
చూడవచ్చును రారమ్ము, వాడ వాడ
త్రిప్పిచూపెద భక్తుల తెన్నులెల్ల."

అనగ చిరునవ్వు మొగమున నందగింప
ఆణిముత్యాలురాల పద్మాయతాక్షు
డిట్లుపలికె: "ఈయుత్సవాలేల నాకు
భక్తహృదయాలె నాయుత్సవాలు వత్స!
" గొప్పగా నుత్సవాలంచు జెప్పుచుంటి,
నాకు పెండిలి చేయుచున్నారటంటి,
కాన నావైభవంబేమొ కల తెరంగు
సిగ్గువిడనాడి యొకింత చెప్పవయ్యా."

అని పలుకు సారసాక్షుని
గని యాభక్తుండు భయము, ఘనమౌ సిగ్గున్
మనమున పెనగొననిట్లనె
" వినవా నాసామి, యచటి వింతలనెల్లన్."

" ఏలూరి సానుల మేళాలుగలవంట,
గుంటూరి సాని బాగోతమంట,
చెంచు నాటకమంట, చెలువలాడెదరంట,
'కారువా' సానులు గట్టుదురట
తారాశశాంకగాథను నాటకంబాడు
వారంట నెల్లూరి వారసతులు
పందిళ్ళ ముస్తాబు వనితల ముస్తాబు
గ్యాసులైటుల తళ్కు—గాజుతళ్కు—
చెప్పగానన్ని చిత్రాలు చెప్పరాని
సోకులా యూరగలవంట! సొమ్ముకేమి
పోయి చూచెదమని చెప్పి పొరుగుపల్లె
పురుషులెందరొ వచ్చిరా పురముచూడ!
రారమ్ము చిత్రచిత్రాలు చూడగవచ్చు
శ్రీరామనవమి ఆయూరనంట;
వెన్నెలరాత్రులు వీధులు కన్నుల
వైకుంఠమట యుత్సవంపువేళ;
అవి మేళములుగావు అవి తాళములుగావు

అవి నాటకములుగావంటు వింటె
ఒక చోట బాగోత మొక చోట గొల్ల క
లాపంబు భామకలాపమొకట.
తోలు బొమ్మల యాటల తొందరలును
"కరువా" సాని నృత్తాల గడబిడలును
దాకు. రేకుల పూవుల తళ తళలును
గాజుపూసల వైభవాల్ గాంచవచ్చు.
అనుచు నూరూరునుండి యయ్యతివలెంద
రెందరో నూతనోత్సాహ మినుమడింప
రోజు రోజుకు దిగినారు; క్రొత్త నగలు,
క్రొత్త చీరలు, వేషాల క్రొత్తలొప్ప.
అద్దాలలోన బండిన
బిడ్డలకన్ చన్నుగుడుపు వికచాబ్జముఖుల్
బిడ్డలు వెంటను రా నడ
దిడ్డముగా నడుచు మడ్డి తెరవలు వీధిన్.
మా దేశమున బుట్టి మమ్ము బ్రోచెడు దేవ
తలకు 'లాంక్లైరు' వస్త్రాలు గట్టి
మడితోడ బూజించు మా దేవతతికిని
'జర్మనీ' పూవల సరాలనుంచి
నిండారు భక్తితో నీరాజ నంబీ 'జ
పాను' కర్పూరంపు పలకలుంచి
అతిభక్తి, నైవేద్య మారగింపగ పంచ
దారగుండను, దేవతలకు బెట్టి
చౌక 'జర్మనీ' పటముల నంతరించి
బ్యాండు మేళాల గొప్ప వైభవముగూర్చి
వారవనితల పచ్చి శృంగార మొప్ప
చేయుచున్నారు పూతయాసీత పెండ్లి॥
లేరా శిల్పులు, నిపుణులు
లేరా యీగాజు పూసలే గావలెనా?
లేరా చిత్రాల్ వ్రాసే
వారులు ఈగాజు బొమ్మ సొబగులె దిక్కా?
భేరీభాంకారములు దిశల్ పిక్కటిల్ల
విప్రవరులెల్ల చేయంగ వేదఘోష
రమణ వేశ్యలు మంగళారతులనీయ
జర్మనీబొమ్మలకు పెండ్లిజరిగెనపుడు!
ఒక్క జానెడుపొట్టకు ఒక్కముద్ద
పెట్టువారేరి? శ్రీరాము పెండ్లియంట!
అనెడిమాటలు వెల్వడె, నచట వేచి
యున్న యొకభిక్షుకుని నోటినుండియపుడు.
భోగకాంతవచ్చె ముందుగా మాటాడ
నన్న పకుగు పెట్టి నాగృహస్థు;
వచ్చినారు రాము లిచ్చెదరిష్టార్థ
మన్న నవ్వులోనను, హాస్యమునను!

♦ ♦ ♦

నల్లని మోముపై తెల్లని 'ఫేస్ పౌడ'
రొత్తి సింగారించె విత్తకాంత,
కత్తిరముంగురుల్ కలిపి దానులిపెట్టి
పక్కపాపిడిదిద్దె వారకాంత,
మెడలేని పొట్టిచేతుల రైక ఘటియించి
కంచిచీర ధరించె కమలనయన;
బుగ్గనువిడియంబు పొలపార చిరునవ్వు
నటియించె పెదవులు 'నాగవేణి'
నాట్యగానాభినయ నిపుణత్వమొలుక
భరతు డాత్మహత్యకుదిగు పగిదితోప,
తెరవలిద్దరుపాడి త్రైతెక్కలాడ,
సానిమేళాలు వీధుల సాగుచుండె.
ముందుగా మేళతాళాలు పోవుచుండె,
ముందుగా గ్యాసులైట్లన్ని పోవుచుండె,
వాహనముపైన రవివర్మపటములుండె,
వెనుక నావాహనము మెల్ల వెడలుచుండె.
చామరాల్ లేవు, స్వస్తివాచకులు లేరు,
కాగడాల్ లేవు, భక్తవర్గంబులేదు,
మరచిరా తొందరను దేవుమాటవారు,
వెనుకనొంటరి దేవుండు వెడలుచుండె!"

♦ ♦ ♦

అనెడి భక్తునిమాట లయ్యంబుజాక్షు

డాలకించెను; చిరునగ వాననమున
గదిరె; నాతడు నిజభక్త గాంచిమరల
పలికెనిట్టుల నూదుచు ప్రతిపదంబు.
"పెరవిత్తముల చిల్లపెంకులుగా నెంచ
రరసిరా పుణ్యకాలంబునందు?
పరభామలను మాతృభావంబుతో నెంచ
రరసిరా పుణ్యకాలంబునందు?
ఆవైభవంబు భక్త్యావేశమున నెంచ
రరసిరా పుణ్యకాలంబునందు?
అతిపవిత్రములంచు నారేబవళ్ళెంచ
రరసిరా పుణ్యకాలంబునందు?
ఇట్టియుత్సవాల్ జరుపుట యెవరికొరకు?
వారవనితల సంతోష పరచుటకునో?
కోడెగాండ్లకు ముదము చేకూర్చుటకునో?
ఎవరిగొప్ప వారే ప్రకటించుటకునో?
వారని భక్తిశ్రద్ధల
నైరైనను రాముదలచిరే సప్రేమన్?
నోరార నుచ్చరించిన
శ్రీరామాయనెడి పిలుపు చెవులంబడెనే"
శ్రీరామనవమి యుత్సవ
మీరీతిని జేయువారి కేనేమిడుదున్?
శ్రీరామభక్తియున నే
మో, రమ్మాచూతుగానియుత్సాహమునన్"
ఏటిదరిన్ వసించె నొకయింతి;
కృశాంగి జరాభరంబుచే
మాటలు తొట్రిలున్;
అచట మండితమాసిక తాతలంబు; ఆ
చోటను దారువిగ్రహము సొంపులు
గుల్కుచునుండె; దానిపై
నూటిగ దృష్టినిల్పి మధుసూద
నుధ్యానముచేసె భక్తితో.
కనులం దిగడాప్రుచుండె విగ్రహము సొగసు
మనము శ్రీరామునను వాసమై వెలింగె;
నాల్కపయి నిల్చె శ్రీరామనామమంత్ర
మనుపమానంద పరవశమయ్యె నామె.
శ్రీరాముడా యవ్వ జేతితో నిమిరి,
బాష్పాల తన పచ్చబట్టతో తుడిచి
తియ్యని పలుకాడి తేనెలుచిలికి
" మోక్షమో యవ్వ నీ యుంగలగలదు
చే కొమ్మటంచామె చేతులబట్టె;
అవ్వ రాముని కౌగిలందున జేరి,
"వచ్చావ నాతండ్రి వచ్చావటోయి
వచ్చావ శ్రీరామ, వరములిస్తావ
ధనము నాకెందుకు ధాన్యంబులేల
వయసు నాకెందుకు వైభవాలేల
వద్దు మేడలు నాకు పల్లకీల్ వద్దు
వద్దు శ్రీరామ నావద్ద నీవుండు
నావద్ద నీవున్న నాకు లోటేమి;
శ్రీరాముయెపుడు నా చెంతబాయకుమ
శ్రీరామ నాముద్దు చెల్లించవయ్యా"
అని భక్తితో వేడ హరిమోదమందె
దైవంబు అవ్వ, యిద్దరుఒక్కరైరి.

◆ ◆ ◆

భక్తుడానందానవారిని జూడ
బాష్పాలు వెలువడె; వాని వారింప
కనులమూసింతలో కనులను దెరచె
రాముడు నాభక్తురాలునుగూడ
మాయమైపోయిరి; వాయువువీచె.
అర్పణంబు జేతునయ్యా నాయాస్తి నీ
కంచు దేవునెదుట నాడిమొదట,
చేయిచాటుబెట్టె చెంతభర్తనుజూచి
నాల్కసూపునట్టి నాతిభాతి.
హృదయమునుదాచి, ముదముతో పైమెరుం
గులనుజూపి, ధనముకూర్చి పెద్ద
లంచమిచ్చువారు రాముని దయనెట్లు
పొందగలరు? మోక్ష మందగలరు?

# సుధాకరామాత్యుడు.

నిడుమోలు కనకసుందరంగారు, బి. ఏ. (ఆనర్సు)

## ఇరువదియవ ప్రకరణము.

## పతంజలి చరిత్ర.

విశాలమగు నా గదియొక్క ద్వారములన్నియు మూసి వేయబడియెను. వాసుదేవుడు స్వీయవృత్తాంతమును కథారూపమున విన్నవించుకొనుచుండెను. తా నెరిగియున్న విషయములన్నియు నతడు చెప్పియుండలేదు. ఒక ముఖ్యాంశమున యదార్థమును గుప్తపరచుటకు గూడ ప్రయత్నించెను.

ఆగదియందు నార్గురు పురుషులుండిరి. అందరు నాజానుబాహులు. వారందరును నిలువబడియే యుండిరి. జయచంద్ర సురేంద్రులు చేరువ నుండిరి. మాదన్న మంత్రి యొక గవాక్షము చెంతనే నిలచియుండెను. ప్రఫుల్లుడింకను కొంచెము దవ్వుననుండెను. మేజాబల్ల కావలి వైపున వాసుదేవుడు స్వీయచరిత్రమును వివరించుచు నిలువబడి యుండెను. వీరందరికి నెదుట సూక్ష్మదృక్కులతో నెల్లరి ముఖ లక్షణముల ననునిమేషమునను పరికించుచు ప్రతి వాక్యమును సావధానముగ వినుచు నిలచియున్నవాడు రఘునాథాచార్యుడు.

ప్రఫుల్లచంద్రుడెంత వాదించినను వకుళను విడిచి పుచ్చుటకు అతని తండ్రి యొప్పుకొనలేదు. ఈ విషయమున రఘునాథుని హృదయము పాషాణ సదృశమైన ట్లగపడుచుండెను. "ఈ సందర్భమున ప్రస్తాపించుటకు బూర్వము ఆయువతి నిర్దోషియని సప్రమాణముగ నిరూపింపుము." అని వారిద్దరు ననిరి. కావుననే వాసుదేవు డెరిగియున్న యంశములను సవిస్తరముగ విన్నవింపదలచెను. పెక్కు దినములనుండియు గడు జాగరూకతతోను నమ్మకముతోను తమవద్ద పనిచేయుచున్న విశారదుడే పతంజలి యని జయచంద్రునకు దెలిసినపు డాత డాశ్చర్యచకితుడయ్యెననిన వింతయేమి?

చంద్రనగరమున భైరవియింటికి తాను పోయిన వృత్తాంతమును క్లుప్తముగ వర్ణించి, ఆమరణము సంభవించిన రాత్రియందలి యుదంతమును, తానా యింటినుండి యొకమారు వెడలి పోయి మరల తిరిగివచ్చుటకు కలిగిన యవసరమును వాసుదేవుడు వివరించుచుండెను. అతని నోటనుండి వెలువడెడి ప్రతివాక్యమును అమితశ్రద్ధతో రఘునాథు డాసమయమున వినుచుండెను.

"భైరవియింట సుమారొక వారముదినములు నేనున్నపిదప నిక నచటనుంట శ్రేయస్కరముకాదని యెంచి యందువాసరమున నేను ప్రయాణమై పోవ నిశ్చయించుకొంటిని. నేనా సాయంత్రము బయలుదేరి నలందానగరమునకు పోవనుంటినని తెలియబరచితిని. కాని నేను పొద్దుగ్రుంకిన పిదపనే బయలుదేరి వేరొక మార్గమున విజయనగరము చేరవలెనని సంకల్పించుకొని, ఒకులెవరును నన్ను వెన్నాడకుండ నుండుటకై యసత్యమును వెల్లడిచేసితిని. సుమారు నాల్గుగడియల పొద్దుండగనే నేను

భైరవితో చెప్పి యిల్లు వెడలి పోయితిని. కాని నేనెంతో దూరము సాగిపోవకమునుపే నన్ను న్వయముగ నెరిగియున్న రక్షకభటు నొకని గాంచితిని. నేనపుడు మారువేసమున నుండినను వాడు నన్నానవాలు పట్టునేమోనని భయపడి తిని. అంత వెనుకకుదిరిగి, యొక యంగడిలోని వస్తువులను పరిశీలించుచున్నటుల నటించి, వాడు సాగిపోవగనే మరల భైరవియింటి కేగితిని. ఆయింటితలుపులు తీసియుండుటవలన నేనెవరికి నగుపడకుండగ నాగదిలోనికేగి చీకటిపడువరకు నచటనే యుండ నిశ్చయించుకొంటిని ''

" ఒక్కక్షణమాగుము. ఆసమయముననందే సుధాకరామాత్యుడు భైరవియింటికి తిరిగి వచ్చినటుల తెలియుచున్నది. నీవాతనిని జూచి తివా ? '' అని జయచంద్రుడు పృచ్ఛించెను.

" ఆర్యా నేను చూడలేదు. నాకెవ్వరునగు పడలేదు.

" తరువాత ? "

" మేడపైయంతస్థున నా గదియందు నేను వేచియుండి చీకటిపడగనే యెవరికి నగుపడకుండ నా యింటిలోనుండి బయటబడు నవకాశమున కెదురు చూచుచుంటిని. నన్నెవరేని చూచిన యెడల నేను తిరిగి యింటిలోనికేల వచ్చితినని యడుగక మానరు. నేనపుడు బహిర్ద్వారము వద్దనే యుండెను. సోమనాథుడు లోన ప్రవే శించి సోపానముల నెక్కుచుండెను. ఆతడు సగము దవ్వెక్కివచ్చి, చేతనున్న ద్వారము గుండ వెలుపలకువచ్చిన యొక నూతనునితో మరల వెనుకకు దిగిపోయెను ఆ నూతనుడెవరో అపుడు నేనెరుగను కాని ప్రిపుల్లచంద్రుడే యని యిపుడెరుగుదును. సోముడాతని వీధివరకు సాగనంపి మరల మేడమెట్ల నెక్కివచ్చెను. నేను నా గదిలోనికి పారిపోయి లోన గడియ వేసికొంటిని. సోముడు తన గదిలోని కేగి వెం టనే మేడమెట్లను దిగిపోయి యింటిలోనుండి వెడలిపోయెను. అటుపిమ్మట కొన్ని నిమిషము లకు నేను ప్రయాణ సన్నద్ధుడనై నా నీలవర్ణపు సంచిని చేతబట్టుకొని సోపానముల పైభాగమున నిలచి ముందు వెనుకల నరయుచుంటిని.

" ఆ గదియందు నేలపై నగుపడిన మైనపు చుక్కలెట్లు పడినవో నీవీ సందర్భమున చెప్ప గలవా ?" అని యాతరుణమున ప్రిపుల్లుడు ప్రశ్నించెను. వాసుదేవుడు చెప్పనున్న రహస్య ము బయల్పడకుండ కొంతకాల మాలసింపజేయు టకే ప్రిపుల్లుడా పృచ్ఛ చేసియుండెనని ఆతని ముఖము చెప్పక చెప్పుచుండెను.

" ఆర్యా ! వినుడు, సోముడు తన గదియం దున్నపుడు నా వెండిబొత్తాము నేలపై పడి పోయెను. అంత నొకమైనపువత్తిని వెలిగించి బొత్తాముకొరకై వెదకితిని. ఆ సమయమున మైనపు చుక్కలు భూమిపై పడియుండ వచ్చును. "

" కానిమ్ము... నీవు సంచిని చేతబట్టుకొని మేడమెట్లపై నిలిచియుంటివి. తరువాత నేమి జరిగినది?'' అని జయచంద్రుడు త్వరపెట్టెను.

వాసుదేవుడు గతమును జ్ఞప్తికిదెచ్చుకొను టకుగాబోలు తన యరచేతిని ఫాలమున నొకింత సేపుసిలిపి, మరల తన యుదంతమును వివరింప నారంభించెను.

" ఆసోపానముల పైభాగమున మొదటి మెట్టుపై నేను నిలచియున్నపుడు చెంతనున్న గది యందెవరో వివాదపడుచున్నటుల ధ్వని వినవచ్చెను, ఒకరి కంఠధ్వని రోషపూరితమై యుండెను, రెండవధ్వని కొంత వినమ్రమైయుండెను.

వారనుకొనుమాట లెవ్వియు నాకు వినబడలేదు. ద్వారము మూయబడియుండెను.''

" ఆకంఠధ్వనులు రెండును పురుషులవేనా?'' అని మాదన్నమంత్రి ప్రశ్నించెను. ఆతడడిగిన ప్రథమప్రశ్న మిదియే.

" అవును– అవుననియే నాయభిప్రాయము.'' అని వాసుదేవుడు – ఆలోచనాపూర్వకముగ అస్పష్టమున – ననియెను.

" పిమ్మట ? ''

" అంతట బాధాసంతప్తమగు నొకమూల్గును భయభ్రాంతమగు నొకయరపును నాకు విన వచ్చినవి. ''

" అయినను నీవు లోనికేగలేదా ?'' యని మాదన్నమంత్రి యడిగెను.

" లేదు. నేనటుల చేసియుండవలెనని నాకు దెలియును. ఇందులకే నన్ను నేను పలుమార్లు నిందించుకొని యుంటిని. కాని నేనింక నాయింటిలోనుంటినని యొరులకు దెలిసిన నేమిముప్పు వాటిల్లునోయని భయపడితిని. నాపూర్వ వృత్తాంతము బయటపడకుండా నేను కాపాడుకొనవలసియుండెను. అదియునుగాక, సందేయుపద్రవమును గలిగియుండలేదని నేనూహించుకొంటిని. ఆర్యులారా! నామాట విశ్వసింపుడు! ఆగదియందెవరో యొకరు సంచరించుచున్నటు లడుగులచప్పుడుకూడ నాకు వినవచ్చెను. ఎవరో యొకరు మెల్లగ మాటలాడుచున్నటులు కూడ వింటిని. నేనచటనుండి పారిపోవుటకది యదనని యెఱిగితిని. రెండంచెలను గడచితినో లేదో, ఆగదియొక్క ద్వారము తెరవబడెను. ఎవరో యొకరు బయటకు తొంగిచూచిరి వారెవరో నేనెరుగనుగాని నన్ను చూచినంతనే వారు భయభ్రాంతులైరి. ఆవ్యక్తి తలుపును తిరిగి మూసికొని లోని కంతర్హితుడయ్యెను. అపుడు నేనుకూడ భయపడి తిరిగి సోపానములనెక్కి పైకేగితిని. ఆవ్యక్తి యాగదిలోనుండి వెలువలకువచ్చి, సోపానములను దిగి యిల్లువిడచి పోవువరకు నేనచటనే యుంటిని. నేనంత బయట బడి యెవరికిని దెలియకనే, చంద్రనగరమును విడిచిపోయితిని.''

మాద;– విశారదా! ఆవ్యక్తి పురుషుడా స్త్రీయా!

" ఆవ్యక్తి పురుషుడే '' అని విశారదు డధోవదనుడై నిర్లక్ష్యముగ ప్రత్యుత్తర మిచ్చినపు డాతని ముఖలక్షణములయందలి వివర్ణమును సురేంద్రుడును రఘునాథుడునుగమనింపకపోలేదు.

మాద;– అతనిని నీవు మరల గురుతింపగలవా ?

విశా:– ఏమో. చెప్పలేను. బహుశా గురుతింపగలుగుదు ననుకొందును.

జయ:– ఆసమయమున దురంతమగు నొకహత్య జరిగియుండెనని నీవెరుగవా ?

విశా;– ఆర్యా, నేను ప్రమాణపూర్వకముగ చెప్పుచున్నాను వినుడు. అట్టి యనుమానము నాకిసుమంతయు కలుగలేదు. చాల దినములు– సుమారొకమాసము – గడచిన పిదప నానాడు జరిగిన యదార్థవిషయములు నాకు దెలిసినపు డాశ్చర్యచకితుడనైతిని. ఆసమయమున నానిజవృత్తాంతము బయట బడునేమో యనియెడి భయమువలన నా యాలోచన మితర విషయములందు జొచ్చియుండలేదని నేననుకొంటిని.''

సురే:– నీవే లోన ప్రవేశించి యీదుష్కృత్యము నొనర్చియుండలేదు కద!

విశారదుడు ప్రశాంతముగ ప్రస్ఫుటముగ " లేదు '' అనియెను.—" లేదు. సుధాకరామాత్యునిపై నిష్కారణముగ నేనేల గవయు

దును? నేను జీవితకాలము నందెన్నడు నతని దర్శించి యుండలేదు. ఆ పేరున పిలువబడు న్యాయాధిపతి యొకరుండిరనికూడ నాకు తెలియదు. ఆతని మృతకళేబరము గోతియందు త్రోయబడిన పిదప చాల దినములకుగాని నే నాతని పేరే వినలేదు."

"కాని - నీవు భైరవి యింటి యందున్న సమయమున నతడు కూడ నచటనే బసచేసి యుండెనని నీకు దెలిసియుండును."

"సురేంద్రవర్మా! క్షమించుము! నేను గాక నన్యు లెవ్వరైన నాయింటియందుండిరని నే నెరుగను. నా కపుడపుడగుపడెడి వకుళ గాని సేవకురాలుగాని నాతో నెన్నడు నా విషయము ముచ్చటించలేదు. నే నా యింట నన్యులతో ప్రస్తాపింపలేదు. సుధాకరామాత్యుడచట నుండెనని నే నెరుగను. నాకది తెలిసి యుండినను ఆయనను హింసించుటకు పూనికొని యుండను."

నిశ్చయమే. నేత్రవాక్చలనముల సూక్ష్మదృష్టితో పరిశీలింప గలిగిన న్యాయాధిపతి సురేంద్రుడుకూడ నా మాటలు విశ్వాసపాత్రములని యెంచెను. అచటనున్న వారందరికి నేమియు దోచలేదు. వకుళకు కారాగృహవాస మిప్పించుట పొరబాటని మాత్రము వారికి స్పష్టముగ నగపడెను.

విశ్వా:- "వాసుదేవా! నీ నీ చెప్పిన దంతయు యదార్థమని ప్రమాణము చేయుదువా?"

"ఎన్నటికైనను నే నందులకు సంసిద్ధుడను. సుధాకరామాత్యుని గది యందు జరిగిన స్వల్ప విషయములు నా కెరుకయున్నంతవరకు యదార్థముగ మీకు విన్నవించుకొంటిని. వకుళ కీ సందర్భములం దెట్టి పనిత్రియు లేకపోవుటయే గాక నాపె ఆ సమయమున యింటిలో లేదని నేను గుండెపై చెయినుంచుకొని నిర్భయముగ చెప్పగలను."

"ఆపురుషు డెవరో చెప్పగలవా?"

"నేను చెప్పజాలను. ఎవరైననేమి? మేడ మెట్లను త్వరితగతి నవరోహించి వెడలిపోయెను. నిదానముగ నేనతని జూచుట కవకాశము లేకుండెను."

"కాని వాడు బయటకు తొంగి చూచి నపుడు వాని ముఖమును చూచియుంటివి కదా"

"ఒక్క నిమేషకాల మాత్ర మాముఖమును చూచితిని. తరువాత రానున్న విషయమంతయు నాకపుడే తెలిసియున్న యెడల, నేనింకను జాగరూకతతో చూచియుండెడివాడను."

"నీవు మాకు చెప్పదలచిన దంతయు నిదియేనా?" జయచంద్రుడాతురతతో ప్రశ్నించెను.

"ఇదియే వకుళ నిర్దోషిత్వమును నిరూపించుటకు చాలును."

"ఇక ప్రఫుల్లా, నీకేమి తెలియునో చెప్పుము. ఆత్మహత్య కాదని నీ వాసమయముననే యూహించితివని చెప్పితివి కాదా" అని జయచంద్రుడు కుమారు నడిగెను.

ప్రఫుల్లుడు ముందునకు వచ్చెను. ఎల్లరును దృష్టుల నతనిపై నిగుడ్చియుండిరి. ఆతడొకించుక సేపటులే నిలచియుండెను. పొంగి పొరలివచ్చెడి యావేశమును వదిలవరచుకొన యత్నించుచుండెననియు, పైకగుపడునంతకు జాల మిక్కుటముగ నతని హృదయము లోలోన భయభ్రాంతి సంతప్తమై యుండెననియు ప్రత్యక్షముగ దెలియవచ్చుచునేయుండెను. సురేంద్రుడాతని ముఖలక్షణము నతిజాగరూకతతో పరిశీలించుచుండెను. ఈవిషయమంతయు, నందును ప్రఫు

ల్లుని ప్రవర్తనమును, ఆతనికి గడు విస్మయము గలిగించెను

ప్రఫుల్లుని ముఖమండలము కళావిహీనమై యుండెను. చిరుచెమట లాతని ఫాలభాగమున నేర్పడుచుండెను. ఒకప్పుడు తుమ్మెదలనుబోలి నల్లగను సొంపుగనుండిన యాతనికురులయందు రజతసూత్రములిపుడు ప్రత్యక్షముగ నగుపడు చుండెను.

"నేను చెప్పగల విశేషము లెవ్వియులేవు. నే నిది యాత్మహత్య కాదేమోనని యనుమానించుట కొక కారణముండెను." అని ప్రఫుల్లు డనియెను. ఒక్క క్షణమా గది యందంతయు నిశ్శబ్దముగ నుండెను జయచంద్రుడు తప్ప నోరు లెవ్వరును ప్రఫుల్లుని మరల బ్రశ్నించుటకు సాహసింప లేదు.—"ప్రఫుల్లా! ఆకారణ మెద్ది? ఆసమయముననే నీ వది మాకేల చెప్ప వైతివి?"

"నే నపుడద్దానిని చెప్పజాలకుంటిని. ఇపుడైనను సాకల్యముగ వివరింపజాలకున్నాను. దాని స్వభావమంత—చెప్ప నలవి కానియంత—" ప్రఫుల్లుని వాగ్ధోరణి కవరోధము కల్గెను. ఆతని కావేళ మినుమడించి నటులుండెను. లేకున్న సరియగు పదమే స్ఫురింపదా? ఆతడు దిటవు దెచ్చుకొని స్ఫుటముగ నిటు లనెను.

"ప్రస్తుతము మనము విచారింపవలసిన యంశమునకు విశారదుడు వివరించిన వివరములు చాలునని నాకు దోచుచున్నది."

"ప్రఫుల్లా! నీ కిటులనే తోచుచున్నదా?"

"అవును. మన సుధాకరుని మరణముతో వకుళ కెట్టి సౌఖ్యమును లేదనియు, నుండుట కవకాశమును లేదనియు నేను దేవునిపై నొట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. నాయనా! నన్ను నమ్ముము. నే నిది బాగుగా నెరుగుదును."

"కాని నీవు తెలిసినదంతయు నేల బయట పెట్టవు?"

"ఏలనన, నందుల కింకను అదనురాలేదు. మాదన్న మంత్రివర్యా! తమరు నాపై కినుక వహింపవలదు. నేను మీకునింకను చెప్పుటకు వీలున్నయెడల నటులతప్పక చేయుదును. ఈ రహస్యము నాహృదయమును పెక్కునాళ్ళ నుండి క్రుంగదీయుచున్నది. వీలగు నెడల నాదియందే దీనిని సవిస్తరముగ వెడల గ్రక్కియుందును."

"వీలు లేకుండుటకు గారణ మేమి" యని మంత్రివర్యుడు పృచ్ఛించెను.

"నేను మాటాడుటకు వీలు లేదు. వీలుండు నెడల నటుల చేయుటకు మీయందరికంటె నేను విశేషముగ సంతసింతును."

"అటుల చేయనని నీ వేరికైన వాగ్దత్తమొనర్చితివా?"

ప్రఫుల్లుడు కొంచెమూగెను. "అవును—కావచ్చును— కొంతవరకటులే యెంచవచ్చును. నాకు దెలిసినది మీకు జెప్పినయెడల, యిచ్చట నున్నవారిలో ప్రతియొకరును, నావలెనే యీరహస్యమును తమ హృదయ కుహరములందు దాచియుంతురు."

"నీకా ద్రోహిపై ననుమానమున్నదా?"

"నాకొక యనుమాన ముండి యుండవచ్చును. కాని విశేషములకు - యీ రహస్యభేదమునకు - మీరును నేనును కొంతకాలము వేచియుండవలెను."

"రహస్యభేదనమా! అట్టి దెన్నడైన జరుగ నిత్తురా?" యని మాదన్న యొకింత కోప

ముతో- వేడిమితో- పలికెను.

"తప్పక జరుగఁగలదు. కాలము - కర్మము దైవము- అన్నియుఁగూడి యందులకే కృషి సల్పుచున్నవి. వకుళ నిష్కపటి; నిర్దోషి; నేనింతకంటె నెక్కుడు స్పష్టముగ హృదయపూర్వకముగ — నాయవసానసమయమునందైనను నుడువఁజాలను. ఆమెను కారాగృహమునుండి వెంటనే విడిపించిపుచ్చవలెను."

ఆమె నిర్దోషిత్వమును గూర్చి విచారించుటకే వారందరు నచట చేరియుండిరి. గాన నిఁక వారు చేయవలసినపని యేమియు నగుపడలేదు. అనుమానము - ఏవగింపు - విచిత్రమగు నూహలు - అందరి హృదయముల నావహించి యుండెను. మాదన్నమంత్రి యసంతృప్తుఁడై యెవరికిని తెలుపకుండ మెల్లగ వెడలిపోయెను. ఆసందర్భమున ప్రఫుల్లుఁడు మెల్లగ విశారదుని సమీపించి, హృదయపూర్వకముగ నమస్కరించుచున్నటుల నేత్రయుగ్మమును మూసెను. అంతట సురేంద్రుని ప్రక్కకు జరిగి,

"ఆర్యా! వకుళను విడుచుటకు మీరింక ననుజ్ఞ యొసఁగవచ్చును" అనియెను.

సురేంద్రుఁడాతని తనిమిషలోచనుఁడై యొకింతసేపు చూచి "నే నటుల చేయవచ్చునా? రఘునాధునితో నాలోచించి యటులే చేయుదును ఇఁక. కాని విశారదుని నేను రహస్యముగ నొక్క ప్రశ్న మడుగవలసి యున్నది"

"ఏల? ఆమె నిర్దోషియని నీవు నమ్మవా?"

"నమ్మకేమి" అనుచు విశారదుని భుజముపయి జేయినుంచి యవలకు గొంపోయి "విశారదా! ఆగదియొక్క ద్వారముకడ నీవుచూచిన ముఖ మెవాది?" అని యడిగెను.

ప్రఫుల్లుఁడు వారిని వెంబడించియే యుండెను.

"విశారదా! చెప్పుము. సురేంద్రామాత్యా! మీరును నావలెనే రహస్యమును దాచెదరు కదా!" అని ప్రఫుల్లుఁడనియెను.

"నా యనుమానము నిజమేయగు నెడల తప్పక చేయుదును."

"చెప్పుము, విశారదా! మొదట నుండి తుదివరకు నీ వెరిగియున్నదంతయు సవిస్తరముగ తెలుపుము" అని యనుచు ప్రఫుల్లుఁడు వారి సమీపమునుండి వెడలి పోయెను.

* • *

ఒక గడియ గడచినది. జయచంద్రుఁడు రఘునాథుఁడును మన కథావృత్తాంతమును గూర్చియే మాటాడుకొనుచుండిరి.

"ఇఁక వకుళ సంగతి. రఘునాథా! నీవిచ్చటనే యున్నావా?" అనుచు సురేంద్రుఁడా గదిలో ప్రవేశించి, తలుపును మూసి, వారిని సమీపించెను. అతని ముఖలక్షణముల గాంచి వారాశ్చర్య చకితులయిరి. అది వివర్ణమయి క్లేశ ముద్రాంకితమయి యుండెను.

"ఆర్యా! ఏమిది? మీ కస్వస్థతగ నున్నదా?" యని జయచంద్రుఁ డాదరముగ ప్రశ్నించెను.

"అస్వస్థతయా? లేదు. నన్నడిగెద రేల? అటులుంటిననియా? ఓహో! చాలసేపెండలో నిలచి యుంటిని" అని సురేంద్రుఁడు బనులు చెప్పెను.

---

ఇరువదియొకటవ ప్రకరణము.

పరిశిష్టము.

---

వేసవికాల మంతరించుచున్నది. వేసవిదినములు క్రమముగ హ్రస్వములు కాఁజొచ్చినవి.

అది ఆషాఢమాసము. సాయంకాలము ఆకసమున దట్టముగ మేఘాచ్ఛాదితమై యుండెను. జయచంద్రు డేగదియందు గూర్చుండి యుండినపుడు మనము మొట్టమొదట నతనిజూచితిమో ఆగదియందే నేడును కూర్చుండియున్నాడు. పుత్రసమానుడగు సుధాకరుని మరణ వివరముల నెఱుగగోరి యాతురముతో విజీర్ణముఖముతో నాడతడు కూర్చుండెను. నేడో, ఆతనిరూపమింకను మిగుల విజీర్ణమై యుండెను. ఏలనన నేటికి యదార్థమతని కెరుకపడినది.

ఎవ్వరి ఆరోగ్యమునుగూర్చి అతడు పెక్కునాళ్ళనుండి చింతాక్రాంతుడైయుండెనో, ఆప్రఫుల్లుడు పరలోకమున కేగెను పాపము! ప్రఫుల్లుని బాధించినది యనారోగ్యము కాదు - హృదయవేదనమే. జ్వరార్తునకు దాపముపశమించినపుడు గాని భగవంతునియందు భక్తికుదిరినపుడుగాని యపుడపుడు శాంతిలభించును. కాని హృదయవేదనాభరితునకు, అట్టిశాంతి గగనపుష్ప సదృశము.

ప్రఫుల్లుడు మార్గమునందే యిలు విడచి యుత్తరహిందూస్థానమునకు భార్యా సహితుడై పయనమయ్యెను. రెండు మూడు నెలలు పుణ్యతీర్థముల సేవించి రామపురమను నొక కుగ్రామమున గొన్నాళ్ళు గడిపెను. ఆ తడచటనే నిలువ యుండదలచుకొనలేదు. గాని యాతనికి క్రమక్రమముగ బలహీనత హెచ్చుటచే నటనుండి కదల లేడాయెను. మృణ్మయికా కుగ్రామమొకింతయు నచ్చలేదు. అచట స్నేహితులు లేరు. చుట్టములు లేరు. సంతోషముతో కాలముపుచ్చుటకు తగు నవకాశములు లేవు. జ్యేష్ట మాసమున ప్రఫుల్లుడు మరణించెను.

జయచంద్రుని కచ్చేరియందు గొన్ని మార్పులు కలిగినవి. ఆతని రెండవ కుమారుడు—నీలకంఠుడు—ఇప్పుడు సర్వ వ్యవహారములను పరిష్కరింప బూనుకొనెను. ఆతడు వివాహము చేసికొనుటకుగూడ దలపెట్టియుండెను. జయచంద్రునకు మరల మనశ్శాంతియు, సౌఖ్యమును లభింప వచ్చును. కాని మృణ్మయికి దుర్గతి సంప్రాప్తమయినది. ప్రఫుల్లుడు చనిపోవునప్పటికొక దమ్మిడియయినను తనవద్ద లేదు. కొంత ఋణముకూడ నుండెననుట నిక్కము. ఆతని దహన సంస్కారములకు జయచంద్రుడే సొమ్మంప వలసివచ్చెను. ఆతడు సాధారణముగ దయార్ద్ర హృదయుడయినను, ఆమెయన్న మండి పడుచుండెను. ఆపెకు సంవత్సరమున కిన్నూరురూప్యము లీయబడునని జయచంద్రుడాపెకు దెలియజేసెను. ఆపె యిచ్చవచ్చిన రీతిని వెచ్చించుకొనుట కిన్నూరురూప్యముల నదనముగ నిచ్చెను విశారదుడు జయచంద్రునకు నమ్మిన బంటుగనుండి తన స్వస్థానమునందే పనిచేయుచుండెను. ఆతనినే వాసుదేవుడని కొందరును, విశారద వాసుదేవుడని కొందరును పిలుచుచుండిరి. మృణ్మయికి పైన వివరింపబడిన యేర్పాటులను తెలియజేయుటకును, ప్రఫుల్లచంద్రుని కళేబరమును దహనమొనర్చినచోట నతని స్మారకచిహ్నముగ నొక తులసికోటను నిర్మింప జేయుటకును వాసుదేవుడు నియమింపబడెను ఆ తులసికోటపై నమర్చిన పాలరాతియందు చెక్కబడిన వీయక్షరములే.

"ప్రఫుల్లచంద్రామాత్యుడు,
వయసు ముప్పది తొమ్మిది."
"సర్వకర్మాణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః"

మత్ప్రసాదా దవాప్నోతి
శాశ్వతం పదమవ్యయమ్.
[ భ. గీ. 11-56 ]

తనకు నియమింపబడిన కార్యముల నిర్వర్తించి వాసుదేవుడు జయచంద్రుని కొల్వున బ్రవేశించెను. కాని యాతని స్థితి మారినది. అతడిపుడు జయచంద్రామాత్యుని అంతరంగికులలో నొకడు. గుమాస్తాలందరు నతడేయజమానిగా నెంచవలసి యుండెను. అతనివేతనము మిగుల నభివృద్ధిచేయబడెను. అతడు వేరుగ నొకయింటి నద్దెకు దీసికొనెను. కొలదికాలములో నతడు వకుళను వివాహమాడనుండెనని మెల్లరనుకొనుచుండిరి. మాదన్న జయచంద్రామాత్యుని సామర్థ్యతవలననే అతనికి యున్నత పదవి లభించెనని జను లనుకొనుచుండిరి. కాని యదార్థ మాలోచించినచో ప్రఫుల్లచంద్రుడు తన జనకునకు వ్రాసిన యీక్రింది వాక్యములే అతని యభివృద్ధికి గారణములు." ఇతడు మిగుల సమర్థుడు. నా గౌరవమును కాపాడుటకు స్వార్థమును త్యజించినవాడు. నాకొరకైన నాతని బహూకరింపుడు."

ప్రఫుల్లుడింతకంటె నేమియు వ్రాయలేదు. వాసుదేవు డతని నేరీతిని గాపాడియుండెనో జయచంద్రునకీ నడుమ—సురేంద్రామాత్యుని ద్వారమున— దెలియ వచ్చినది. ప్రఫుల్లు డసువుల విడిచిననాటికి బూర్వదినమున నొక యుత్తరమును సురేంద్రున కంపెను. ప్రఫుల్లు డాయుత్తరము నప్పుడెపుడు వ్రాయుచు సుమారొక వారము దినములకు ముగించియుండెను.

జయచంద్రున కాయుత్తరమువలనను అన్యవిషయములవలనను మితిలేని మనస్తాపము గలిగియుండెను. అపుడా నీరెండ యందతడు కూర్చుండి యుండినపు డది యాతని బాధించుచుండెను. ప్రఫుల్లుని మరణమువలన గలిగిన విచారము నతడు దిగమ్రింగెను. కాని ప్రఫుల్లుని భార్యపయి నతనికి మిగుల నేవగింపు కలిగెను. తన కుటుంబమునందు కలిగిన దుర్భరకష్టపరంపరలకు ఆమెయే ప్రథమ కారణము. ఆమె లేకున్న తన కుమారుడును—ఆహా! పుత్రసమానుడగు వేరొకరునుకూడ—సజీవులై యుండి జీవితరంగమున సమున్నత పీఠాధికారులయి యుండెడివారు కదా!

ఇంతలో నొక యశ్వశకట మా గృహాంగణమున నాగిన శబ్దము వినవచ్చెను. కొలది నిమేషములలో సేవకు డొకడు పరుగెత్తుకొని వచ్చి, "మృణ్మయీదేవిగారు వచ్చుచున్నారు." అని యజమానికి విన్నవించుకొనెను.

"ఎవరు ?"

"ప్రఫుల్లచంద్రామాత్యుని వితంతువు వచ్చి యున్నారు."

ఇంతలోనే మృణ్మయివారి కట్టెదుట నిలువబడెను. జయచంద్రుడు సేవకుని చేరువకు బిలచి, రహస్యముగ నిట్లు చెప్పెను.

"శకటమును. పోనీయకుము అందలి సామానుల నింటిలోనికి తేనీయవలదు. నా కోడలిచట నుండదు."

మగడు చచ్చి మాసము దినములయినది. కాని మృణ్మయి యథాపూర్వకముగ నీటుగ నలంకరించుకొని యుండెను జయచంద్రునకాపె సందర్శన మసహ్యముగ నుండెనని అతని ముఖలక్షణములు చెప్పక చెప్పుచుండెను. మృణ్మయి యది గ్రహింపని దానివలె నటించుచుండెను. ఆపె యిట్లు చెప్పసాగెను,

"మీ కుమారు డనవసరముగ మనోవ్యథ కల్పించుకొని కృశించెనేగాని, ఆయన శరీరమునం దెట్టి రుగ్మతయు లేదని పలువురు వైద్యులు చెప్పియుండిరి. నేనును అటులనే చెప్పుచుం డెడి దానను. కృశించి, కృశించి తుదకు మరణించిరి.—అది మంచిది కాదు. తలచుకొన్న యెడల తప్పక నారోగ్యము చిక్కెడిదే'......

జయచంద్రు డాపె కేమియు సమాధానము చెప్ప లేదు.

"నేను నా యింటియందు తిరిగి ప్రవేశించుట కెట్టి యభ్యంతరమును లేదుగద!'

మృణ్మయి యకస్మాత్తుగ గృహమున బ్రవేశించి, యందే నిలచిపోవుటకు పన్నాగము బన్నినదని జయచంద్రు డెరుగకపోలేదు తన యభిప్రాయమును స్పష్టముగను విపులముగను వాసుదేవుని మూలమున నాపె కిదివరకే తెలియ జేసియుండెను. ఆ వర్తమానమందుకొన్న పిదప గూడ నచటకు రాగలిగిన మృణ్మయి యొక్క సాహసమున కతడచ్చెరువొందెను.

"నేను నీకిదివరకంపిన వర్తమానమును నీవు సరిగ నవగతము చేసికొనలేదేమో. ఈ యింటి యందు నీకిక తావులేదు."

మృ:- "కాని, నే నిచట నుండక తప్పదు.'

జ:- వీలు లేదు. ఎన్నటికిని వీలు లేదు.

మృ:- పోనిండు. నేనిక నెచటి కేగవలసినదియు నిర్ణయించుకొను వరకు కొన్ని దినములైన నిందుండవలయును. అదికూడ వలదన లేరు కదా!

జ:- నిన్నెచటికైన తీసుకొనిపోవుటకు నా సేవకుని నీ వెంట పంపెదను. కాని అభాగ్యుడైన నా కుమారునికి బుట్టినిల్లగు నీయింట నొక క్షణమయిన నీ వుండుటకు వీలు లేదు.

మృ:- నేను నీకుమారుని భార్యనే కదా.

జ:- ఆతని పాలిట నీవేమై యుంటివో చెప్పెదను వింటువా?

మృ:- ఏమై యుంటిని?

జ:- రాక్షసివి.

మృ:- చిత్తము.

జ:- వివాహమునకు బూర్వ మాతని పాలిట రాక్షసివి-పిమ్మటను రాక్షసివైతివి.

క్రోధారుణ నేత్రములతోను విచార సంతప్తములగు వాక్యములతోను జయచంద్రుడటుల పలుకుచున్నపుడు పూర్వోదంతములు కొన్ని మృణ్మయి యంతరంగమున పొడసూపెను. అతనికి సర్వమును తెల్లమయ్యెనని ఆమెకు తోచెను. ఆపె లజ్జావనతముఖియై "మీరేమి వింటిరో, యెవరిపై నను మానము కలిగియున్నారో నే నెరుగను. గతము గతమే. నేనెట్టి యకార్యమును చేసి యెరుగను. సాధారణముగ నన్యకన్యలు చేయు దానికంటె నధికమగు పాపమేమియు నే జేయ లేదు" అనియెను.

"మృణ్మయీ! భగవంతుడు నాపుత్త్రుని క్షమించినాడు. నిన్ను గూడ క్షమించుగాత."

ఆమె హృదయవారాశియందు పూర్వవృత్తాంతము లొకదాని వెనుక నొకటి యుత్తుంగ రంగములవలె నుదయించుచుండెను. ఆమె వివాహమునకు బూర్వము జననీ జనకులతో దరచుగ జయచంద్రునింటికి వచ్చుచుండినపుడే, ప్రఫుల్లున కామెపై ప్రేమోదయము కలుగునట్లు ఆపె ప్రవర్తించియుండెను. ప్రవర్తనమే కాదు. క్రమ క్రమముగ నతని వశమొనర్చుకొనియుండెను. ఆతని దప్ప వేరొకని వివాహమాడనని రహస్యముగ నాతనికి బాసచేసెను. ఆవిషయమును కొంతకాలము రహస్యముగ

నంచుటకు ప్రఫుల్లుడు నంగీకరించెను. కాని ఆమెకు ప్రఫుల్లునియందు లక్ష్యములేదు. ఆమె విశ్వాసఘాతకి యగుటకు వెనుకాడలేదు. కాని అతనిం జేపట్టుటవలన లభించెడి ధనసమృద్ధియు, నున్నతపదవియు నామె యాసించుచుండెను. వారి వివాహనిశ్చయమును వెల్లడిపరుపకుండుటకు కారణము ప్రఫుల్లునికంటె నున్నత సంబంధము వధువుకు దొరకుననియే కాని వేరొండుకాదు. ఆహా! ఈ యాలోచనము ప్రఫుల్లునకు దెలిసియుండినచో! ఆమె తన్ను వలచియుండెనని బేలయగు ప్రఫుల్లుడు హృదయపూర్వకముగ విశ్వసించియుండెను. ఆమె స్వగ్రామమున కేగినపిదప, సుధాకరామాత్యుడు చంద్రనగరమున నామెను కలసికొన్నపుడు నాతనితో గూడ నీరీతినే ప్రవర్తించియుండెను. అతనిం గూడ నెమ్మదిగ వలలో వైచుకొని, తన్నే వివాహమాడుదునని యొప్పించుకొనెను. ఆమె హృదయపూర్వకముగ ప్రేమించిన దతడే. కాని, అతడు ధనికుడు కాకుండుటవలనను, ధనసంపాదన మొనర్చుకొని యౌన్నత్యమునకు రావలసినవాడగుటను, తానపేక్షించెడి యమిత ధనవ్యయమున కంగీకరించునో లేదో యను నెట్టి యనుమాన మామెను వేధించుచుండెను. తుట్టతుదకు వీరిర్వురిలో నెవని నామె వివాహమాడ నిర్ణయించుకొనెడిదో చెప్పుట దుస్సాధ్యము. అయినను ప్రఫుల్లుని అతనిధనమును ఆమె ఎన్నుకొని యుండెడిదని మనమూహింపవచ్చును.

ఆమె యిర్వురితోను రహస్యముగ నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచు, గొంతకాలమును గడపెను. ఇంతలో సుధాకరామాత్యుడు న్యాయవిచారణమునకై చంద్రనగరమునకు వచ్చుటయు, నారాత్రి ప్రఫుల్లుడాతని జూడ వచ్చుటయు సంభవించినవి. తన రహస్యము బట్టబయలగునేమోయనియు తన కాముకులిర్వురు తన్ను త్యజింతురేమోయనియు మృణ్మయి తల్లడపడసాగెను. ఈ విషయమై సుధాకర ప్రఫుల్లచంద్రులేదో ముచ్చటించుకొనిరని ఆ సాయంకాలమున నామె యింటికి వచ్చినపుడు ప్రఫుల్లుని ప్రవర్తనం బట్టి యామె గ్రహించెను. కాని, యీ విషయము నతని బ్రశ్నించుట కామె వెనుకాడెను. మరునాడు ప్రాతఃకాలమున, సుధాకరు డాత్మహత్య కావించుకొనెనని యామె విన్నపుడు కొంతవరకు తానెయే కారకురాలైనట్లు కలతజెందెను. ఈ యకాల మరణమునకు గారణమేమైనను—అతడు నిశ్చయముగ నాత్మహత్య కావించుకొన్నను—లేకున్న ప్రఫుల్లుడు క్రోధాతిరేకమున నాతనిపై గవిసి యాతని జంపియున్నను—ఇందులకు తానే ప్రథమకారణమని ఆమెయు నెరుగును.

ఆమెకు వేరొక విషయముకూడ తెలిసినది.— ఆమరునాడు సుధాకరుని ప్రాత యుత్తరముల వెతుకుచు నందు తానతని కధికప్రేమతో వ్రాసియుండిన యుత్తరములను ప్రఫుల్లుడు సంగ్రహించెనని.

అటుపిమ్మట చంద్రనగరముననున్న దినములలో ప్రఫుల్లుడామెను కలసికొనలేదు. ఆమెయు నతని సందర్శించుటకు సాహసింపలేదు. కొన్ని మాసములు గడచినపిదప వారు మరల గోల్కొండయందు కలసికొనిరి. అన్యోన్యానురాగము ప్రబలమయ్యెను. ప్రఫుల్లుడు తమ వివాహవిషయమును ప్రస్తావించినపుడు మృణ్మయి యందులకు నిరభ్యంతరముగ నియ్యకొనెను. సుధాకరుని మరణమునం దితని కెట్టి ప్రసక్తి యుండెనో మృణ్మయి తెలిసికొనలేదు. ప్రఫు

ల్లుని వివాహమాడిన ధన ధాన్యములతో తుల తూగ వచ్చునని యువ్విళ్ళూరుచు మృణ్మయి యాదురంతమును మరచిపోయెను.

కాని వివాహానంతరము అతనికెట్టి యిల్లా లైనది?— సరసుడగు వప్రిపుల్లు డాపెవలన నెట్టి మనోవ్యథ బొల్పడియెను? అంతయు నాపెకే యెరుక. అచ్చట నిలచియున్న నాసమ యమునకూడ నాపె స్మృతిపథమున నిది యంతయు ప్రత్యక్షముగ నగుపించినది. జయచంద్రుని కన్నులగప్పి అతని వశపరచుకొనుట కాపె పన్నిన పన్నాగము విఫలమైనది. దురభిమాన తమోనిబిడీకృతమగు నాపెహృదయమున నెన్నటికేని పశ్చాత్తాప భానోదయమగు నెడల నా వెలుగువలన నాపె తనువు భగ్నమగుట నిశ్చయము. వివాహమునకు పూర్వమతనిపాలిట రాక్షసివి; పిమ్మటను రాక్షసివైతివి; జయచంద్రుని పల్కులు సర్వోచితములు.

మృణ్మయి యీ యాలోచనముల నవలకు పారద్రోలి ప్రస్తుతాంశము నింకొకసారి జ్ఞప్తికి దెచ్చుకొనెను. "నేను యిల్లువాకిలిలేక బిచ్చ మెత్తుకొనవలసినదేనా? సంవత్సరమున కిన్నూరు రూప్యము లననెంత? నేనాసొమ్ముతో నెటుల కాలము గడుపగలను?"

"నీపుట్టింటికడనే నీవుండవలెనని నాయభిప్రాయము. అటులైన నిన్నూరురూప్యములు చాలును." అని జయచంద్రుడు శాంతముగ బదులుచెప్పెను.

"ఇన్నూరు! నాదుస్తులకొరకైన చాలదే"

"నీయిష్టమువచ్చిన రీతిని వెచ్చించుకొమ్మ నాకెట్టినిమిత్తమును లేదు. నేను జీవించియున్నంతకాలము నాసొమ్ము మూడుమాసముల కొకతూరి యేబదిరూప్యముల చొప్పున నీకు పంపుచుందును. నా మరణానంతరము అందుల సగమే నీకు రాగలదు.

"నేనిదియంతయు నిదివరకు వాసుదేవునివలన తెలియబరచియుంటిని. నాజీవితకాలమునందు గాని - అటుపిమ్మటగాని - ఇంతకు పైబడియొక దమ్మిడియైనను నీకీయను".

ఆమెకు భవిష్యత్తంతయు నొక చిత్రపటమువలె గోచరించెను. ఆపె యాశలన్నియు నడుగంటుటవలన ముఖము వివర్ణమయ్యెను. ఇక బొమ్మలపెండ్లిండ్లులేవు; విందులులేవు; నృత్యగీత వాయిద్యాదులవలన నానందములేదు. గత వైభవమును దలచుకొని నిట్టూర్పులు పుచ్చుచు మృణ్మయి యికముందు సంఘమునకు దూరస్థయై యుండవలెను. ఏగృహ మసహ్యకరముగ నున్నదని ఆపె నిరంతరము భర్తతో వాదించుచుండెనో, ఏగృహమునందామె కిపుడు నిలువతావు లేదని జయచంద్రుడు తెలియజేయుచుండెనో, ఆగృహము తానికముందు నివసింపబోయెడి స్వగృహముతో పోల్చిచూచిన నొక దివ్యప్రాసాదమువలె నుండగలదు.

"నీవిచట నెంతకాలము నిలిచినను లాభము లేదు. నాకు నావకాశమునులేదు" అనుచు బయటకు దారిచూపువానివలె జయచంద్రుడు ద్వారమును చేరవచ్చెను.

"నేనిచట నుంచిపోయిన వస్త్రములును నాయాభరణములును - యేమైనవి?"

"నీవస్తువుల నన్నిటిని పదిలముగ మూటకట్టించియున్నాను. నీవు చెప్పినచోటికి వానిని పంపివేయుదును."

ఆపె యేమొకమాట చెప్పకనే యచటనుండి వెడలిపోయెను. గృహాంగణమున వేచియున్న శకట మాపెతో కదలిపోయెను.

ప్రఫుల్లచంద్రుడు సురేంద్రునకు వ్రాసిన జాబు.

"సురేంద్రామాత్యశేఖరా! మీకిదివరకే తెలిసియున్న విషయములుగాక నేను మీకింకను కొంత సమాధానము విన్నవించుకొనవలసి యున్నది. మీరు నాకు మిత్రసత్తములు. ఈ యంశములను మాదన్నమంత్రివర్యున కెరిగించి నన్ను కృతకృత్యుం జేయుడు.

"నే నానాడు చంద్రనగరము కేగుటకు పూర్వమే మృణ్మయిని మనసార ప్రేమించి యుంటిని. ఆమె కోరికవలన నీ విషయమును పెక్కు మాసములు రహస్యముగ నుంచితిమి. నే నచటకు పోయిన పనినిగూర్చి సుధాకరునితో ప్రస్తావించిన యనంతరము మే మేదో లోకాభిరామాయణమును ముచ్చటించుకొనుచు కొంతసేపు కూర్చుంటిమి. నేను పరమానందుని ఇంటి కేగవలసియున్నదని యంటిని. తాను కూడ పోవలసియున్నదని సుధాకరుడు నవ్వుచు ననెను. ఒక మాటపై నింకొకమాట వచ్చెను. కట్టకడకు మృణ్మయి తన్ను వివాహమాడుట కంగీకరించెనని సుధాకరు డాంతరంగికముగ నాతో ననియెను. అతడు నవ్వులాట కట్లనుచుండె నేమో యనుకొంటిని. నా సమాధానమున కతడు నొచ్చుకొనెను. మృణ్మయినిగూర్చియు తమ దాంపత్యమును గూర్చియు నతడు విపులముగ ప్రస్తావించునపుడు నాకు వెఱ్ఱియెత్తినటులుండెను. నే నేమంటినో నాకిపుడు తెలియదు. నా ప్రేమ ధనమును దొంగిలించి, నన్ను మోసగింపవలెనను దురుద్దేశముతో నాతడు కృషి చేయుచుండెనని నాకు గోచరించినది. మే మొకరి నొకరు నిరసించుకొంటిమి. ఆమె మమ్మిరువురను మోసగించెను. కాని మాకా యనుమానమే కలుగలేదు. మేము పోరాడు పులులవలె నుంటిమి. నా కటుల తోచినది. నేను తీవ్రక్రోధావేశపరవశుడనని బాల్యమునుండియు నన్ను మీ రెరుగుదురు. అతడేమియో యెత్తిపొడుపుమాట యనుటవలన — లేకున్న, నా మాట నా కటుల స్ఫురించుటవలన — నేను సక్రోధుడనై నా యెదుట బల్లపైనున్న కృపాణమును చేపట్టి అతని వక్షస్థలమునకు గురిచూచి విసరితిని. నే నతని గత జీవుని జేయ తలచియుండలేదని భగవంతుని సాక్షిగ చెప్పగలను. కృపాణము నిశితమై యుండెనని నే నెఱుగను. నే నేమి చేయుచుంటినో నాకు తెలియదు. కత్తిని కేల బూనితినని కూడ నెఱుగను. ఆ యావేశమున క్రిందుమీదు తెలియలేదు. అతడు వెంటనే మరణించెను. స్వయంకృత దురంతమునకు నే నే భయభ్రాంతుడనై యరచితిని. నా యావేశము క్షీణించినది. నేనును అతనివలెనే నిశ్చలముగ నిశ్శబ్దముగ నిలువబడితిని. నే నతని సహాయమున కేగక పూర్వమే అతడు మరణించెనని గ్రహించితిని. నే నాయుత్తరక్షణముననే ద్వారములను తెరచి భిషగ్వరుల సహాయము నేల యపేక్షింపలేదో యని పిదపకాలమున నెంతకుందితినో నేను తప్ప యితరు లెరుగరు. ఆత్మసంరక్షణోపాయములు మన ముగ్గుపాలతో దారి నేర్పుకొన్నవి. నే నాదురంతమును బహిరంగ పరుపకుండుట కదియే కారణమని నా నమ్మకము. ఆహా! నే నెంతటి పిఱికిపందనైపోయితిని. ఎన్ని సంవత్సరముల హృదయవేదనము నది తప్పించెడిది!! కాని ఆసమయమున — నేటికిని కనపడక నే—తప్పించుకొని పోవుటెటులాయని నే నాలోచించుకొంటిని. భయభ్రాంతిచే సత్వములుడిగి ప్రతి శబ్దమును సావధానముగ వింటి

అంతయు నిశ్శబ్దముగ నున్నపుడు నేను మెల్లగ ద్వారమును తెరచి ముందు వెనుకల నరసితిని-- అపుడే యొక వ్యక్తి, నాయెట్ట యెదుట నగుపడెను. అతడు మేడ మెట్లపయి నిలచి చెవులను నిక్కించి, యేదియో వినుచుండెను. ఆదీపము వెలుగున మాయిరువురల నేత్రములు కలసికొనెను. నే నెన్నడు నిది మరువలేదు. తుమ్మెద రెక్కలవంటి శిరోజములకు దిగువ నగ్నిస్ఫులింగమువలె నతని కన్నులు మెరయుచుండెను. ఆకన్నులే నన్ను పెక్కు సంవత్సరముల వరకు హృదయశల్యములవలె వేధించినవి. అటుపిమ్మట నావద్ద కొలువునకు గుదిరిన విశారదుని రూపులు నాకు వాని నపుడపుడు స్ఫురింపజేసినను, నాకనుమానము కలుగలేదు. ఏలనన విశారదుడు తన మారువేసమున వదలి, నూతన వ్యక్తివలె నగుపడుచుండెను. ఆహా! సురేంద్రా నేనీవిశారదుని ఋణ మెన్నటికైన తీర్చుకొనగలనా? నేను హత్యనొనర్చితినని అతని కాక్షణమున తెలిసియుండకపోవచ్చును. కాని మరునాడీవిషయము దేశమునందు మార్మ్రోగినపుడు అతనికి యదార్థము తెలిసి యుండవచ్చును. ఇంక ననుమానముండినయెడల, నావద్ద కొలువునకు గుదిరినపిమ్మట నాతనికి సర్వమును విదితమై యుండును. నన్ను గాపాడుటకై, అతడే మారుపేరున సంచరించెను. నాజనకు డతని దగురీతిని బహూకరించునని నమ్మెదను. అతడు మీయెదుట తన యుదంతము నెరిగించుకొనునపుడు కూడ నాకొరకొక యసత్యమును వచించియుండెను. ప్రఫుల్లచంద్రు డాయిలువిడచి పోయిన పిమ్మటనే తానొకవ్యక్తిని సుధాకరుడున్న గది యొక్క ద్వారముకడ చూచియుంటినని అతడు చెప్పెను. సురేంద్రా, అతడు చూచినది నాముఖమేగాని వేరొకటికాదు. ఇన్ని సంవత్సరముల నుండియు నతడు నా మనోవైకల్యమును పరిశీలించుచునే యుండెను. సాధ్యమగు నపుడెల్ల నా మనశ్శాంతికరములగు కార్యముల నుచితరీతి నొనర్చుచుండెను.—పూర్వకథ యింకను కొంత చెప్పవలసియున్నది.

"సోపానములపైనున్నయావ్యక్తియు నేనును సుమారొక యరనిముస మొకరినొకరు చూచుకొంటిమి. అతని జూచుటవలన కలిగిన భయోత్పాతముచే నేను ముందున కడుగిడలేక లోనికేగియుందును. అతనిం గాంచినపిమ్మట, ప్రజలెవ్వరు నన్నునుమానింపకుండ చేయవలెనని నేనూహించుకొని యుందును నాకీయాలోచన మంతకుబూర్వము కలుగలేదు ఆకత్తిని సుధాకరుని వక్షస్థలమున గ్రుచ్చుకొన్నటు లగుపడుటకాతని దక్షిణహస్తమును దానిపై నుంచితిని. అసంపూర్ణమగు నాయుత్తరమును పిమ్మట కనుగొని యందలి యంత్యవాక్యమును రచించితిని. అంతయు నొక స్వప్నముగ దోచెను. దీపము నార్పివేయవలెనని నాకు స్ఫురించెను. ఏలనో తెలియుదు అంత గుండె దిట్టము చేసికొని బయలుదేరితిని. కాని నాయదృష్టము బాగుగలేదు రెండవపర్యాయము నేను తలుపు దెరచినపుడొక యువకుడు సోపానముల నెక్కి పోవుచుండెను. వెనుకకుతిరిగి సుధాకరునితో మాటాడుచున్నటుల నటించవలెననెడి యూహ దైవికముగ నాకు పొడకట్టెను. మరునాడు పంచాయితీసభవారియెదుట సోమశేఖరుడు చెప్పిన మాటలను వినకున్న, నేనా నయముమునం దేమంటినో యెన్నటికిని జ్ఞప్తికివచ్చెడిదే గాద. నేమన్న నేమి ఆమాటలు నాకుపకరించినవి. సుధాకరుడుకూడ నాతో మాటాడుచుండెనని సోమశేఖరుడు సహా

జముగ నూహించుకొనెను. ఇదియే ప్రజలకు తెలిసినది. కావున, నేనచటనుండి వెడలిపోయిన పిమ్మట నాదురంతము జరిగియుండెనని ప్రజ లనుకొనిరి. నాపై ననుమానము కలుగకుండ చేయుటకిదియే ముఖ్యకారణమనుట నిస్సందేహము. వాడు నన్ను వీథిగుమ్మమువరకు సాగనంపెను నేనప్పటినుండియు నిర్దోషివలె వర్తింపవలసియుండెను. అటుపిమ్మట నేను పరమానందుని యింటికేగితిని. మృణ్మయితో నేమోయంటిని. ఆమె ప్రత్యుత్తరమువలన సుధాకరుని యూహలు కొన్ని కొంతవరకైనను — నిరాధారములని నాకుతోచెను. ఆకుకార్య మొనర్చినపిదప నిదియంతయు నెట్లుచేసితినో నాకే ఆశ్చర్యముగనున్నది. నేను మరల రాజమార్గము వెంట వచ్చుచుంటిని. ఒక వర్తకుడు తన దుకాణము యెదుట నిలచియుండెను. నేనతని గమనించితినని వాడెరుగడు. ఆచటనాగి యెదుటనున్న మేడయందే సుధాకరుడు విడిసియుండుటవలన నాతని గది గవాక్షముల దిక్కై చూచి సుధాకరుడు బహుశా నిదురించియుండునని — ఆవర్తకుడు వినుటకుగాను — బిగ్గరగ ననుకొంటిని.

"సురేంద్రా! అటు పిమ్మట కొంతసేపటికి మిమ్ములను కలసికొంటిని. మీకు జ్ఞాపకమున్నదా? మీరు సుధాకరునితో మాటాడవలెనని పోవుచుంటిరి. ఇంటియందు దీపము లెవ్వియు లేకుండుటవలన నతడును ఆయింటియందుండు నితరులును శయనించియుందురని నేనంటిని ఆహత్య నెల్లడి యగునని నేను భయపడితిని ఆరాత్రి నేనెటుల గడపితినో యెవ్వ రెరుగుదురు. సుధాకరుని ముఖమండలము విస్ఫారిత నయనములతో నాకన్నుల కట్టినట్లుండెను. అంధకార బంధురమగు నానిశీథమున విగతజీవుడై పడియున్న సుధాకరుని చిత్రప్రతిమలు నలుదిక్కుల నాకు గన్పించుచుండెను. అనుమానమును జనింపజేయునేమోనని పడక గదియందు దీపము లేకుండగనే నిద్రించితిని. ఆహా! ఆత్మాపరాధమువలన నెంతటివాడైన బేలతన మబ్బును గదా!

"శవపరీక్షయు, న్యాయవిచారణము మున్నగు విషయములు మీరెరుగుదురు. సురేంద్రా! నేను నాపాత్రమును యథోచితముగ ప్రదర్శించితినా? అవునని ఫలితమువలన నూహించుచున్నాను. ఆ ప్రథమ దినమున సుధాకరుని కాగితములను పరీక్షించినపుడు తమరు నావద్దనే యుంటిరి. ఆత్మహత్యకు గారణమేదియో గ్రహించుట కాతని యుత్తరములు మొదలగు రహస్యపత్రములను నేను పరిశీలింపవలెననిరి. మృణ్మయి వ్రాసిన యుత్తరములందు చాలగ నుండెను వానిని చదువుటవలన సుధాకరుని వాదనము సత్యదూరము కాదని నేను గ్రహించితిని. ఆమె మాయిర్వురిపైన నొకేతీరుని ప్రేమవర్షమును కురిపించినది. — యిర్వురికిని విశ్వాస ఘాతుకురాలైనది.

"నేనామె నేల వివాహమాడితినని మీరు ప్రశ్నింపవచ్చును. ఏలనో! ఏలనో! ఏలనన, కామాంధకారమున నాకు గన్నులగపడలేదు. ఏలనన, నేనున్మత్తుడనైతి ననుకొనుడు! కొన్ని మాసములైన పిమ్మట మేమిరువురము తిరిగి కలిసికొన్నపుడు, నా హృదయాంతరాళమున భగ్నమైనదని నేననుకొనినప్రేమ శతముఖముల ప్రజ్వరిల్లినది. నేను దానికి తలయొగ్గితిని. నేనంతకు పూర్వమే యొనర్చిన పాపకార్యముకంటె నామెను వివాహమాడుట యధిక పాతకము కాజాలదని నాకిపుడు తోచుచున్నది. ఆమె నన్ను

సాక్షిగ పెండ్లాడినపుడు నా కీయూహ గలిగినది. నా యాలోచనము లెటులున్నను, నే నామెను హృదయపూర్వకముగ ప్రేమించి యుంటిని. నేటికి నాప్రేమ తరుగలేదు. ఆమెను నా ప్రాణ సమానముగ జూచుకొనుచు, నేను నాజీవితకాల మును వెళ్ళ బుచ్చుకొంటిని.

"ఇదియ నాజీవిత చరిత్రము. నేను మహా పాతక మొనర్చినమాట నిశ్చయముగాని నేనెంత పశ్చాత్తాపము చెందితినో భగవంతున కెరుక. సురేంద్రామాత్యా! మీరే యూహింపుడు! సుధాకరుని ప్రాణము లతని శరీరమును విడచిన యుత్తరక్షణమునందే నాకు శిక్ష ప్రారంభ మయ్యెను. అది మొట్టమొదట భయరూప మున నుండెను. అటుపిమ్మట నది హృదయ పుట భేదకమగు పశ్చాత్తాపముగ మారినది. మానవమాత్రు డెవడును దానిని జయింప జాలడు నేను స్వాభావికముగ నరహంతకుడ గాను. సుధాకరుడును నేనును ప్రాణమిత్రులము. నాజీవితమంతయు ప్రాయశ్చిత్తవ్రత నిర్వాహణ మునకే సరిపోయినది. ఒకవంక నకాలమరణము వాతబడిన ప్రాణమిత్రునకై సంతాపము, వేరొక వంక నిజము బయటబడునేమో యనెడి భయము. ఈ రెంటిలో నేదియే నొకటి నన్ను క్షణము పీడించుచుండెను. ఆహా! ఆతని బ్రతి కించుటకై నా ప్రాణములనైన నిచ్చుటకు నే నెల్లపుడు సంసిద్ధుడనై యుంటిని. మొట్టమొదట కలిగిన భయము శమించినపిదప నేను నిజము వెల్లడిపరచి యుందునుగాని విష మావస్థయందున్న నాతల్లినితలచి యూరకుంటిని. ఆమె యనారోగ్య స్థితియం దీవర్తమానము విన్నచో వెంటనే మరణించియుండెడిది. ఆమె మరణించినపుడు, నిజమును వెల్లడిపరచు సమ యము మించిపోయెను. నాజనకుని నాభార్యను తలచి యటుపిమ్మట నూరకొంటిని. నాశరీ రా రోగ్యము చెడియెనని నాజనకు డనుకొనియెను. అది కొంతవరకు నిశ్చయమే. నేను నానాట క్షీణించుచువచ్చి, దుర్బలుడనై పోయితిని.

"సురేంద్రా! చెప్పవలసినవివరములన్నియు చెప్పితిని. నామరణవార్త తెలియవచ్చినపుడు —ఇందులకీయుత్తర మందిన పిదప నెన్నియో దినములు పట్టదు.—మాదన్నమంత్రికి సర్వము నివేదింపుడు నాతండ్రివిషయములో సర్వమును మీ కేవదలి వేయుచున్నాను. నాతండ్రినన్నుమా త్రమైన నమమానించుచున్న యెడల-వాసుదేవుని చరితము విన్నపిదప నేను దేశాంతరముల కేగుట కియ్యకొనిననాజనకునకు నా యెడ హేయభావము కలిగెనని స్పష్టమగుచునేయున్నది-ఆయనకుగూడ సత్యమంతయు విదితముచేయుడు. భగవంతుడు మిమ్ములరక్షించుగాత. నేటికినాకుచిత్తశాంతిలభిం చినది. మీకును భగవానుడు హృదయప్రశాంతి ననుగ్రహించుగాక!

పరిపుల్లచంద్రుడు."

పరిఫుల్లుని మరణవార్త గోల్కొండకు చేరిన పిదప సురేంద్రుడు మాదన్నామాత్యుని సందర్శింపనేగెను. మంత్రివర్యు డాయుత్తరమును సావధానముగ జదువుకొని, వేడినిట్టూర్పుల నిగుడ్చుచు, నిట్లనియె.

"సురేంద్రా! నేను మొదటినుండియు జెప్పి నది యదార్థమని నేటికి విదితమైనది. నాసుధా కరుని నామము నిష్కళంకమై చిరస్మరణీయ మైనది.........సురేంద్రా! మన మెల్లరము పాతకులము. భగవంతుడు మనల ననుగ్రహించు గాత!"

సంపూర్ణము.

# తమాషాలు

### ఆరవ వేలు.

పురు:— నిన్నుతప్ప నితరులను ప్రేమించను. నన్ను పెండ్లాడి నాకోరిక నెరవేర్చవా?

స్త్రీ:— చదువు చక్కదనం సరిగానే వున్నాయికాని ఆచేతికి ఆరువేళ్ళున్నాయి. వాటినిచూస్తే నా కిష్టం లేదు,

పురు:— అయితే ఆరవవేలుని యిప్పుడే కోసి వేసుకుంటున్నాను. అని వెళ్ళిపోయి డాక్టరుచేత ఆరవవేలు కోయించివేసి యింటికివచ్చి పెండ్లాడమని కోరెను.

స్త్రీ:— మీ వేలే కోయించివేసుకొనే కఠినత్వం మీదగ్గర వుంటే పెళ్ళయినతరువాత నామీద యెంత కఠినత్వం చూపిస్తారో? కనుక మీరు నాకువద్దు.

### విచారణ

రాబోయే రాయల్ కమిషన్ వారీక్రిందివిషయములను గురించి విచారణ చేస్తారట

1. ఆత్మస్తుతి పరనింద సంఘకృషి
2. ఆంధ్రి మ్యారేజి బ్యూరో చేసిన పెళ్ళిళ్ళు.
3. పత్రికాశకోద్యమము.

### ప్రేమ.

భర్త:— నిన్ను మాత్రమే నేను ప్రేమించుచున్నానని ఘంటాపథముగ చెప్పుచున్నాను.

భార్య:— మీ రొక్కరుమాత్రమే మీయబద్ధమును నమ్మేటట్లు చేస్తున్నారని ఘంటాపథముగ చెప్పుచున్నాను

### పార్శ్వలు.

రామయ్య పెద్ద పార్శ్వలను తపాలాఫీసుకు తీసికొనివెళ్ళి బుక్కుపోస్టుద్వారా పంపమనిఅడిగెను. తపాలాధికారి బుక్కుపోస్టుగా పంపుటకు నిరాకరించెను. అంతట రామయ్య యిట్లనెను. "రెండువైపుల తెరచివుంటే అది బుక్కుపోస్టు అన్నారు. ఆప్రకారంగానే యీపార్శ్వలుకు రెండువైపులు తెరచియున్నదిగా!"

### నాటకము.

పిల్లవాడు నాటకశాలలో లావువానికి వెనుక కూర్చొని యుండినందున, వేషములు కనిపించుటలేదు, అంతట నాకురవాడు లావువానితో నిట్లు ప్రార్థించెను. "అయ్యా, వేషములు కన్పడుట లేదు కొంచెము ప్రక్కకు జరగండి"

లావుమనిషి:— జరగటానికిమాత్రము వీలులేదు. ముందు నేను కూర్చున్నానుగనుక నాతలకాయ యెల్లాఆడితే నీతలకాయికూడ అల్లా ఆడించు.

### సినీమా.

పిల్లవాడు:— మా అమ్మని చూడటానికి వెళ్ళుతాను ఒక పావలా యియ్యరా.

యజమాని:— మీ అమ్మ యెక్కడుంది?

పిల్లవాడు:— సినిమాలో.

### అదృష్టము.

ఒకరు:— నీవు అదృష్టవంతుడవయ్యా యేవ్యాపారం చేసినా లాభం వస్తుంది.

రెండవ:— అవును. నిన్ననే ఒక పెట్టి కొన్నాను నిన్న చూస్తే 44 వుంది. ఈపూట చూస్తే 118 వుంది.

ఒకరు:— ఆపెట్టిలో యేం వుంది.

రెండ:— థర్మామీటరు.

### చూడలేకపోవటం.

రైలులో ప్రయాణము చేయుచున్న ప్రయాణికుడొకడు కండ్లు మూసుకొనెను. ప్రక్కనున్న స్నేహితుడు యెందుకు కండ్లు మూసుకున్నావని యడిగెను. అక్కడ ఆడవాళ్లు నిలుచుండటం చూడలేక అని జవాబుచెప్పెను.

### కవిత్వం.

"కిల్లీనములుతుంటేనే కాని నాకు కవిత్వం కుదరదు."

"అయితే కిల్లీ మానివేయండి"

### పెండ్లి.

"ఛీ, యీ ఆడవాళ్ళని నమ్మరాదు. ఎంత మంచిదాన్నయినా నమ్మరాదు"

"ఎందువలన?"

"నన్ను పెండ్లాడటానికి వధువు కావాలని మారు పేరుతో ప్రకటిస్తే, వచ్చిన దరఖాస్తులలో మా ఆవిడ దరఖాస్తుకూడా ఒకటి"

### పట్టణము

" పట్టణమనగా నేమి ? "

" అక్కడ ఒక సినిమా కంపెనీ అయినా వుంటేనే అది పట్టణం అనిపించుకుంటుంది. "

### గొప్ప

" మగవాడి గొప్ప యేమిటో చెప్పు "

" తాను తెచ్చిన చీర బాగుందని భార్యచేత అనిపించటమే గొప్ప "

### సుళువైన మార్గము

" రాజకీయంలో సుళువైన మార్గమేది? "

" గెలిచినవాడు మావాడని చెప్పుకోటం. "

### రాజకీ,

భర్త:— అమ్మాయిని చూడటానికి వచ్చిన అబ్బాయి యేమి సంపాయిస్తున్నాడో యేమైనా చెప్పాడా ?

భార్య:— ఆసంగతి చెప్పలేదుకాని మీరు యేమిసంపాయిస్తున్నారో అడిగి తెలుసుకున్నాడు.

### అప్రాచ్యుడు

ఒకప్లీడరు:— (కోర్టులో మరియొక ప్లీడరుతో) నీవంటి అప్రాచ్యపు ప్లీడరును మరెవరిని చూడలేదు.

జడ్జి:— ఆగండి. శాంతించండి నేనున్నాననే సంగతి మరిచిపోయారు కాబోలు.

### లోబరచుకొనుట

" మీఆయనను నీవు యింట్లో లేనపుడు యెట్లా లోబరచుకోగలవమ్మా ? "

" పిల్లను ఆయనదగ్గర వదిలి వెళ్లుతాను "

### దొంగతనము

ఒకగు:— ఒరే, రాత్రి మీయింట్లో దొంగ ప్రవేశించాడుట నిజమేనా ?

స్నేహి:— నిజమే రాత్రి మాయింటికి వచ్చాడు.

ఒకగు:— ఎవరు పట్టుకోలేదూ ?

స్నేహి:— పట్టుకేమి ? పట్టుకున్నారు. తీరా చూస్తే నేనే అవటంచేత వదిలిపెట్టారు.

### తప్పులు

" మా మొదటి ఆయనే నన్ను బాగా చూచేవారు. ఎప్పుడూ ఒకతప్పయినా పట్టుకొనలేదు " అని క్రొత్తగా పెండ్లి చేసుకొనిన యొక విధవ స్నేహితురాలికి వుత్తరము వ్రాసినదట

### జ్ఞాపకము

ఒక నాటకము హాలులో గోడమీద యిట్లు వ్రాసి యున్నది. " నా ఉపకారము మరచిపోకూడదు. నన్ను జ్ఞాపకం వుంచుకొనవలెను. ఎందుకంటే పద్యం పాడిన తరువాత ఒన్సుమోర్ అన్నది నేనే. "

### నాశనము

డబ్బు మనిషిని పాడుచేయును. గ్రంథములన్ని తిరగవేసి పరిశోధన చేయగా చేయగా నాశనము కాదలచిన వాడు కోరదగిన వస్తువు మరియొకటి లేదని ధృవపడినది.

### ప్రయాణము

" ఏమిటండీ మీరుకూడ మూడవతరగతిలో ప్రయాణము చేయుచున్నారు ? "

" నాలుగవతరగతి లేదుగనుక. "

### ఎటువైపు

ప్లీడరు:— డాక్టరుగారూ, మొన్న జిల్లా బోర్డు యెన్నికలో యెటువైపు చేరారు !

డాక్టరు:— గెలిచేవాడివైపు.

### మేడ

" ఎందుకయ్యా మేడకట్టావు ? "

" ఇదివరకల్లా నాకేకలు యింట్లోనే నిలిచిపోయినవి. ఇప్పుడు గాలిలో యెగురుతవి. "



## రాజీ సభ

స్వకీయవిలేఖరి.

ఖాండవపురం, ఏప్రియల్ 15:—

పత్రికలలో నిదివరకు ప్రచురించినప్రకారము స్త్రీపురుషుల రాజీసమావేశము, అందలితీర్మానములు బరిశీలించినచో దేశములో గలిగిన నూతనపరిస్థితులు, స్త్రీపురుషులలో ప్రజ్వరిల్లిన రాజకీయనైపుణ్యత సులభగ్రాహ్యము లగుచున్నవి. నూతనభావోదయము కలిగిన సమావేశమునకు అధ్యక్షుని యెన్నుకొనుటలోనే యీ నూతనభావోదయము వ్యక్తమైనది. స్త్రీప్రతినిధులందరు స్త్రీయే సభాధిపతి కావలెననిరి. పురుషు లనేక సమావేశముల కిదివరకే యధ్యక్షులుగ నుండిరనియు, స్త్రీల సధోగతిపాల్చేసిరనియు, డిప్రెస్డుక్లాసుకు చెందిన స్త్రీనే అధ్యక్షురాలుగ యెన్నుకొనవలయునని స్త్రీలందరు బల్లగుద్ది వాదించిరి. బల్లలు గుద్దుచున్నపుడు కలిగిన గాజుల గణగణ, అందుపై చెలరేగిన కరతాళధ్వనులు మిన్నుముట్టి భూనభోంతరాళములు బద్దలగునట్లుండెను. ఇంతయుత్సాహము సూరత్ కాంగ్రెస్సందయినను కానరాలేదు. ఎట్టకేలకు స్త్రీపురుషులలో జ్ఞానోదయమైనది అందువలననే సభ జయప్రదముగ ముగిసి హిందేశమునకు త్వరలోనే స్వరాజ్యము రాగలదని యాసబొడమినది. నావిమర్శనల నిందు పొందుపరచుటకంటె సభావృత్తాంతమునే యిందు వివరించుచున్నాను.

ఆహ్వాన సంఘాధ్యక్షులగు గర్వభంగరావుగారు ప్రార్థన వందేమాతరములు జరిగినపిమ్మట లేచి యీక్రింది యాహ్వానసంఘాధ్యక్షోపన్యాసము నొసంగిరి.

"సోదర సోదరీమణులారా, నేడు సుదినము. ముమ్మాటికిని సుదినము. మన చాకచక్యములు, తెలివి తేటలు ప్రదర్శితములు గావలసిన దినము. మన స్వరాజ్యార్హతను నిరూపింపవలసిన దినము. సభాప్రయత్నములు విషమదశలో ప్రారంభమైనవి. నేడు మీకు హృదయపూర్వక స్వాగత మొసగగలనని కలలోనైనను యనుకొనలేదు. ముఖ్యమైన కష్టము భోజనపు యేర్పాటులలో తటస్థించినది. పురుషుల పట్టుదల చూడవలెననెడి యుద్దేశముతో స్త్రీలు వంటచేయుట నీచముగ నెంచిరి. నాస్ కోఆపరేషన్ నాన్ కోఆపరేషన్ అని మిన్నిష్టమును ఆశ్రయించవచ్చును. సభ్యత్వముల నవి బడయవచ్చును. కాని వినతిపత్రముల నియ్యరాదని వాదించేవారు పురుషులు. దీనిని బట్టివారి బుద్ధి కుశలత తెలియగలము. ఖద్దరు ఖద్దరు అని విదేశనూలు బట్టల సంఘమును స్థాపించి ప్రోత్సహించవచ్చును. ఇది పురుషుల బుద్ధికుశలతే. ఇన్నిటిని పురస్కరించుకొని యెవరో ఒకరు త్యాగముచేయుట తప్పదయ్యెను. కనుక వంటవండి వడ్డించి విస్తళ్ళు యెత్తివేసేవరకు పరసహాయమును కోరక, ఆఖరుకు నాభార్యా పుత్రికల సహాయమునైనను కోరక, అందరకును బుద్ధి చెప్పవలెననెడి యుద్దేశ్యముతో యిందుకొడిగట్టు గంటెని. నా యీత్యాగము ఫలించినయెడల నాజన్మ సార్థకమగును. ఇంతకంటె దీర్ఘోపన్యాసముతోను, పదగుంభనముతోను శుష్కప్రలాపములతోను మిమ్ములను బాధించదలచుకొనలేదు. శాంతముగ సభాధిపతి నెన్నుకొనప్రార్థన.

అన్నపూర్ణమ్మగారు

ఇట్లుపన్యసించిరి. స్త్రీల సధోగతికి త్రొక్కినది మగవారు. పురుషుల భోగేచ్ఛలకు దిన

దిన గండములు గడుపునది స్త్రీలు. ఎన్నాళ్ళు స్త్రీలు సహించియుండగలరు? నిజముగ పురుషులకే పశ్చాత్తాపమున్నయెడల స్త్రీనే అధ్యక్షురాలుగ యెన్నుకొనవలెను.

కావమ్మగారు.

ఈ తీర్మానమును నేను బలపరచుచున్నాను. పురుషులు మాటమాటికి అడ్డు వచ్చుచున్నారు. ఇంకను వారి కఠిన స్వభావమును వీడనియెడల, యికనుంచి స్త్రీలు పురుషులను పెండ్లిచేసికొనకుండ బహిష్కరించవలెను. ఇందుకు మా నాన్నగారు గర్వభంగరావుగారు పడుచున్న పాట్లు వర్ణనాతీతములు.

డాక్టరు గర్వపోతు గరుడాచలంగారు.

స్త్రీయాధిపత్యము వహించిన సమావేశము జయప్రదము కాలేదు. ఇంకా సరోజనీదేవిని అడగండి, బెసెంటును అడగండి. ఇందుకు దుంపశుద్ధి రావుగారే అప్పాలు.

మరిడీ మహాలక్ష్మమ్మగారు.

డాక్టరుగారి గర్వము మితిమీరుచున్నది. అందుకు ప్రాయశ్చిత్తముగనైనను మనము స్త్రీనే యెన్నుకొనవలెను. అలంకార ప్రియులును, గొప్పయింటపుట్టి గొప్పయింటమెట్టిన బక్కపల్చనమ్మగారిందు కెంతయునర్హులు. ఇంతటివాదోపవాదములు, తర్కవితర్కములు ఏసభాకార్యక్రమమునందును లేవు. స్త్రీలు పురుషులకెందును తీసిపోజాలరు. జరుగుచున్నది రాజీసమావేశము మన స్వాతంత్ర్యముల కొరకు మనము ప్రాణములనైనను సర్పించి పోరాడవలెను. ఇందుకు జంకితిమేని మనము స్వరాజ్యమున కర్హులము కాము. ఈ సమావేశము సూరత్ కాంగ్రెస్ నుమించుననుభయము కలదు. వేయి సూరత్ కాంగ్రెసులైనను భయము లేదు. మీమీ పౌరుషములను, ధైర్యసాహసములను నిలబెట్టుకొనునుటకిదియేతరుణము.

మందబుద్ధి శాస్త్రులవారు.

నేను వయోవృద్ధుణ్ని. ఏలాగయినా శాంతం గలవాడిని. ఈ సభకు స్త్రీలువద్దు. పురుషులువద్దు, మనజాతికే సంబంధించని వానరమూర్తిగారిని అధ్యక్షులుగ నెన్నుకొనుడు. స్త్రీలయెడకాని పురుషులయెడకాని యేమాత్రము వీరికి పక్షపాతములేదు.

కరతాళధ్వనులు చెలరేగుచుండ వానరమూర్తిగా రధ్యక్షస్థాన మలంకరింప పుష్పమాలాలంకృతులుగ జేసిన పిమ్మట యీక్రింది యుపన్యాసము నిచ్చిరి.

అధ్యక్షోపన్యాసము.

నాయుపన్యాసము క్లుప్తముగ నుంచదలచితిని. డిక్షనరీలు, ఎన్సైక్లోపీడియాలు నాకు తెలియవు. అందువలన సులభశైలిలో ముగిస్తాను. పురుషులు మాకు చాలా ఉపకారము చేసినారు. వారిని తృణీకరించరాదు. ఇందుకు మాకొండముచ్చు గోరియేసాక్షి.

పురుషులు:— కరతాళధ్వనులు.

స్త్రీలు:- వినుడు, వినుడు.

అధ్యక్షుడు:- అయినప్పటికిని యిప్పటికైనా తెలివితెచ్చుకొని పురుషులే నన్నీ అధ్యక్షపదవికి చేర్చినారు. కనుక పురుషు లొకప్పుడు తప్పు చేసినను, తమ తప్పును దిద్దుకొనగలరని తేలుచున్నది. మ్యునిసిపల్ లోకల్‌బోర్డులలోను శాసనసభలలోను స్త్రీలకు ప్రాతినిధ్యము లేదనియు, అన్నిఉద్యోగాలు అన్ని బిరుదులు అన్ని గౌరవాలు పురుషులకే పోవుచున్నవనియు ఆందోళన బయలుదేరినది. స్త్రీలు అజ్ఞానాంధకారములో మునిగియున్నంతకాలము యెట్లినను

చెల్లినది. ఇపుడు స్త్రీలలో గలిగిన నూతనవికాసమును పురుషులు తగినరీతిని గౌరవింతురుగాక. స్త్రీపురుష సంగ్రామములు లేకుండ చేయుదురుగాక.

మరిడి మహాలక్ష్మమ్మగారు,

ఈక్రింది తీర్మానము నుపపాదించిరి.

"ఇంతవరకు స్త్రీల నధోగతిలో నుంచినవారు పురుషులే గనుక పురుషు లీక్రింది విషయముల నక్షులు జరుపవలెను.

(1) స్త్రీలకు ప్రభుత్వ సంస్థలలో నింతవరకు స్థానము లేదు గనుక ప్రభుత్వమువారు కొన్ని సీట్లను ఆ యా సంస్థలలో ప్రత్యేకించవలెను.

(2) ఉద్యోగములు పురుషులే చేస్తున్నారు గనుక వంట చేయుట కభ్యంతరము స్త్రీలకు లేదు. కాని పైపనులలో చిక్కుకలుగుచున్నది కనుక పురుషులు యిండ్లు ఊడ్చుట, కూరలు తరగుట, చెంబులు నీళ్ళు అందిచ్చుట మున్నగు చిన్న పనులు చేయకతప్పదు.

(3) పురుషులు అధమము నెలకు నాలుగు రోజులైనా వంటచేయవలసి వస్తుంది. అపుడు వారు హెూమ్సైన్సుగ ఫెయిల్ అవుతున్నారు. గనుక వంటలో ఎలిమెంటరీ కోర్సు పురుషులు విధిగా నేర్చుకొనవలసియుండును. అందు నిమిత్తము బోధనా తరగతులు యేర్పాట్లు చేయవలెను.

(4) స్త్రీలు పిల్లలను కనుటచేతనే గనుక పిల్లలను పెంచేభారము పురుషులదే.

(5) ఇంతవరకు ఆడపిల్లలే అత్తవారింటికి వెళ్ళుచున్నారు. ఇకమంది పురుషులే అత్తవారింటికి వెళ్ళవలెను.

(6) ఇంతవరకు పురుషులు స్త్రీలను "ఒసే, ఏమే" మొదలైన నీచపదములతో పిలచుచున్నారు. గనుక యికనుండి అట్లు పిలువరాదు.

(7) ఈ తీర్మానము 1928 జనేవరి ఒకటవ తేదినుండి అమలులో నుంచవలెను. పురుషులందరును భిన్నముగ ప్రవర్తించేయెడల స్త్రీలు పురుషులనే పెండ్లి చేసికొనరాదు.

(8) స్త్రీల యుద్యమమునకు పత్రిక కావలసియున్నది. దానికి సిరాకాగితములు పురుషులేయిచ్చి పురుషులే పంపిణీదారులుగా నుండి, స్త్రీలు కన్నరచే భావములను వ్యాప్తిచేయించవలెను.

(9) పురుషులలో మీసములు గడ్డములు గొరిగించుకొనుట గనుక యీ చాకమైనందున స్త్రీ పురుషుల గుర్తించుట కష్టముగు మన్నది, కనుక పురుషు లికమీదట గడ్డములను మీసములను విధిగా పెంచి తీరవలెను.

సోదర సోదరీమణులారా, అన్ని విషయములు తీర్మానములోనే యిమిడియున్నవి గనుక నేను ప్రత్యేకముగ యుపన్యసించను. మనకు కావలసినది సంపూర్ణస్వాతంత్ర్యము, సామ్రాజ్యాతీతస్థానము. లేనిచో శాసనసభ్యనసభ. ఈ తీర్మానములో ఒక కామాగాని ఫుల్‌స్టాపుగాని త్యజించుటకు వీలులేదు.

గర్వభంగము:— పురుషులకేలేని స్వాతంత్ర్యము మీకెందుకు? ఇంకా నల్లానాగారినిఅడగండి.

పురుషులు;- సెభాష్.

స్త్రీలు:- సిగ్గు, సిగ్గు.

మహాలక్ష్మి:- నల్లానాగా రవసరములేదు. గిల్లానాగారవసరములేదు. పురుషులకు స్వాతంత్ర్యములేదని శాసనసభలలోనికి పోవటము మానివేశారా? స్వరాజిస్టులు శాసనసభల్లో ప్రవేశిస్తే మాకేనా అభ్యంతరము. ఇటువంటి ఆటంకములను రూల్ అవుటు చేయవలెను.

అధ్యక్షుడు:- రూల్ అవుటుచేస్తున్నాను.

స్త్రీలు:- కరతాళధ్వనులు.

తీర్మానము అధికసంఖ్యాకులచే అంగీకరింప బడెను. ఓర్వలేని "మామా బసవన్న" గారు పోల్ డిమాండు చేసిరి. ప్లేలీస్టుతో గుమాస్తా హాజరు సామాన్యమందునను, అప్పటికే కాలాతీతమైనందునను, పోలుఅవసరము లేదని అధ్యక్షులు రూలింగు ఇచ్చిరి. అధ్యక్షునకు వందనములతో సభముగిసెను.

---

# అభిసారిక.

యామిజాల సూర్యప్రకాశరావుగారు.

౧.

అల్లదె సాంధ్యరాగిణి వియత్పథమందున కాలకుంచెతో
మెల్లగ చిత్రలేఖనము మృద్వమలాంచిత పాణి పల్లవా
పుల్లముతో లిఖింపగనె, పూర్ణపుటంధము నాల్గువైపులం
దల్లుకొనె న్విచిత్రమగు యామ్యశుభాంధవ మున్న దేమహో.

అంతట గంధసంకలితమైన జలంబునఁ దీర్థమాడి, మ
త్కుంతల రాజభారమును కొప్పుగ గూర్చి, శిరీషపుష్పములే
వింతగనందుదాల్చి, నిశ వేగిర తావక పాదపద్మ ప
ర్యంతర మాధురీరసము, ద్రావగ లేచితి నీనిశీథముఁ.

శ్యామల హృద్వనంబుల విశాలతటాక జలార్ద్రకంజకా
కోమలసంధ్య రేకలు నొకొక్కటె వ్రాలుచునుండె నయ్యయో!
ఓ మధురాధినాథ! ఇక నోర్వగలేని విషాదగీత గా
నామధుర స్వరస్వనమునందు మదాత్మయు నైక్యమొందెడుఁ.

తావక నామకీర్తన సుధాకవితాక్షరగాన సన్నిభా
భావమనోహరాకలిత భారము నొప్పు శుకాశికథాళులఁ
ఈ వనభూరుహావళుల నీవని తొంటరిగా విపంచి కా
రావము సర్దుచేసుకొని రాగము దీయుచు బాడబూనెదఁ!

వికల హృదయవీణాతంత్రి తె(?) గుట వన
స్వరమపస్వర కల్లోల చలనమొంద
నాగిపోయెను గాన మీ యబలకపుడు
తమరి యన్వేషనార్థమై తరలలేను!

ఎగసెఁ మత్తమధూకరాళి పదనాస్యైకంబు నన్పొప్పఁగాం
గక మంచు పరాగలేశములు నాకాశంబు నందావరిం
పగ, నీగాఢనిశీథ యాత్రికు నభఃపాంథిలబ్ధ మాటంకమై
"తగునే నీకిది" యంచు నాపుటకు బ్రత్యాసన్నమై నొప్పెడిన్ !

మాయయజ్ఞాన గుణముల మయముతోడ
మభ్రమందుండి జార్చిన యవనికనగ
గుసుమగర్భరజః వ్యాపకోన్నతదిగా
కట్టి నట్లయ్యె నాకన్నుగవల కడ్డు!

జలధరపంక్తిరాజము విశాలనభోంతర శుభ్రసీమమం
దలరెడు తారకా రుచిరధామవిలాసరస ప్రసారముల్
తొలుతనె రూపుమాపి, తమ త్రోవనుఁబోవుట జూడ వాన దా
రలు నికటప్రదేశముల రాజిలునేమొ వనాంతరమ్ములన్.

జలధరధ్వాన మీవైపు సలుపుచుంట,
వరతటిల్లత లావైపు వరలుచుంట,
గాంచనట్టి నిట్టూర్పుల గలచినైచె
నీయనాథరాలకు జిత్తమిట్టిచోట !

విపుల విద్యుత్తటిల్లత వెలుగు గాంచ
భయము, లజ్జయు హృదయానఁ బరిఢవిల్లి
శాంతసామ్రాజ్య నిర్జన సానుభూము
లందు "బిక్కు బిక్కు"మను నే నలరవలసె ॥

అసమ సుధారసాభియుతమైన పదాబ్జపవిత్రపీఠికా
కుసుమ రజఃప్రశస్తమును కూరిమితోడ తమోనివృత్తికై
వశమును జేసి, పుణ్యపరిపాకమును న్ఘటియింపజేసి, నీ
వశదృశలీల కీర్తిఁగొనవమ్మ యుదారగుణాత్మ – శర్వరీ !



# గ్రంథస్వీకారము

**1. సతీమణి (అయిదంకముల నాటకము.)**

గ్రంథకర్త కపిల వీరభద్రరావుగారు, ప్రకాశకులు "శారదా బృందము" రెడ్డి పోలవరము, 119 పేజీలు, వెల రు 1-0-0

ఇది తేటతెనుగులో వ్రాయబడిన నాటకము ఇందలి. కథ సినీమా కంపెనీలలో చూపబడు "సతీసదర్బా" అనునది. సతీమణి తన మాన రక్షణార్థము పడిన యిడుమ లిందుగాననగును.

**2. ఈశ్వర శతకము:—**

గ్రంథకర్త డాక్టరు గుళ్ళపల్లి నారాయణ మూర్తిగారు, రాయవరం తూర్పు గోదావరి జిల్లా.

ఇందలి పద్యములలో ననేక సాంఘికనీతులు బోధింపబడినవి. శైలి మధురము, మతము, వేశ్యాసంస్కరణము, వరశుల్కము, పునర్వివాహము, అహింస, దానము మున్నగు యావద్విషయములు హృదయాహ్లాదకరముగ వివరింపబడినవి. ఈ గ్రంథమును వలయువారు గ్రంథకర్తకొక యణాబిళ్ళను పంపిన బడయగలరు.

**3. వీరకాంతలు:—**

గ్రంథకర్త వడ్లమూడి వేంకటరత్నముగారు, క్రౌను 92 పేజీలు వెలఆరుఅణాలు.

రసపుత్రవనితల శౌర్యము, స్త్రీల పాతివ్రత్యము బోధించు చక్కని కథలిందు కలవు. శైలి సులభగ్రాహ్యముగా నున్నది. మాన రక్షణార్థమై దాహిరకన్యలు పడుపాట్లు హృదయమును కలచివైచును. బాలికా పాఠశాలలలో పఠనాగ్రంథముగ నుంచుట కిది యెంతయు ననుకూలించును.

**4 దుర్గాదాస్ (నాటకము)**

బరంపురం వేగుచుక్క గ్రంథమాలవారి నాలుగవ నాటకప్రచురణము. గ్రంథకర్త వారణాశి భానుమూర్తిగారు డెమ్మి ఆక్టేవో 111 పేజీలు, వెల రు 1-0-0.

విజ్ఞానచంద్రికా మండలివారు నాంధ్రులకు రాజస్థాన కథలందుత్సాహమును గలుగజేసియుండిరి. ద్విజేంద్రరాయల గ్రంథము లనువాదింపబడి, ద్విజేంద్రునియొక్క స్వదేశాభిమానము స్వాతంత్ర్యనీతి యాంధ్రదేశమునకు బ్రస్ఫుటము చేయబడెను. రాజస్థానమునకు సంబంధించినదగుటచేతను, ద్విజేంద్రుని స్వతంత్రరచనా ప్రదర్శితమగుటచేతను నీనాటక మాంధ్రుల కాకర్షణీయమే. అనువాదకులు నీనాటకమును సరళశైలిలో రచించిరనుట వాస్తవము. నాటకములందు పద్యము లుండరాదను వాదన ప్రబలిన యీదినములలో ననువాదకులు కొలదిపాటి పద్యములను మాత్రమే జేర్చుట ప్రశంసనీయము. నాటకకథను గురించిగాని, ద్విజేంద్రుని యుద్దేశ్యములను గురించిగాని సవిరళమైన యుపోద్ఘాత మిందు లేకుండుట యొకలోపము. అయినప్పటికిని గ్రంథవిషయమునుబట్టి, పాత్రౌచిత్యమును ప్రదర్శనాయోగ్యతను నిర్ణయించవచ్చును.

ఇందలి పాత్రలకును, చరిత్రయందు మనము పఠించిన పాత్రలకును భేదముకలదు ఇందుకు కారణము ద్విజేంద్రుని స్వదేశాభిమానము స్వాతంత్ర్యరచనములని వేరుగ నుడువనక్కరలేదు. కథానాయకుడు దుర్గాదాస్. రాజపుత్రస్థాన స్వాతంత్ర్యమునకై సర్వమును త్యాగము చేసిన పుణ్యమూర్తి, ఉదారపురుషుడు. ఆశ్రిత రక్షణకై తన రాజపుత్ర వంశీయులను సైతము విడనాడి మహారాష్ట్రదేశమునకు పోయి, అచట స్వాతంత్ర్య తృష్ణను ప్రజ్వలింపజేసిన మహావీరుడు కర్మయోగి, పరదారావర్జితుడు. ఔరంగజేబు మనుమరాలగు రజియాను అజితసింహునకిచ్చి విడదీయుటలో దుర్గాదాసునకు వర్ణసంకరము సంభవించునను భయముకలదేమో! రజియా అజితసింహుల ప్రేమవృక్షమును పెంచి ఫలింపజేసియేయుండిన హిందు ముసల్మాను సఖ్యతతో నాటక మంతయుండెడిది కాని తుదకు "మొగల్ మరాఠ రాజస్థానములు విధ్వంసము లయ్యెను హిందూ ముసల్మానుల యైకమత్యమునకును, ఆర్యభూమి నుద్ధరించుటకును చేసిన ప్రయత్నములన్నియు వితథములైనవి. మరల నార్యావర్తమున రాజపుత్రుల యౌన్నత్యము సంప్రాప్తించునని నేను విశ్వసింపను" అను మాటలతో దుర్గాదాసు పాత్రమును ముగింపజేసి, కథ నసంపూర్ణముగ వదలివైచెను. దుర్గాదాసుకంటె కూడ నధికముగ హిందు ముసల్మాను సఖ్యతకు పాటుపడినది దిలేర్ ఖాన్ ఇతను చాలవరకు తన యాశయమును కొనసాగించుకొని కృతకృత్యుడయినాడు. ఔరంగజేబులో పిరికితనమును విషాదమును కన్పట్టుచున్నది. చరిత్రలోని ఔరంగజేబు కఠినాత్ముడు, రౌద్రమూర్తి, కక్షసాధించుకొనుటలో దారా పుత్రాదులను సైతము నరకుచేయనివాడు. ద్విజేంద్రుని యౌరంగజేబునకు సంసారము యెడ మమకారము మెండు. భర్త మరణమునకును పుత్రమరణమునకును కక్షసాధించుకొనిన యోధ ప్రధాని, సహజ స్త్రీలక్షణముగ, గుల్నారా పై ననితీర్పుగొని సందివనా దుర్గాదాసుని హేతు వమును లొంగిపోయి, స్త్రీలకు సహజముగ నుండు దయాదాక్షిణ్యాదులను పొందినదై గుల్నారా దానును క్షమించి వదలెను. భీమసింగ్ యొక్క త్యాగము నిరుపమానము. రాజపుత్రుల సాహసౌదార్యములు రమ్యముగ చిత్రింపబడినవి. నిర్వహింపు జరింపచేయు రంగములిందు లేకుండుట ముఖ్యమైన లోపము. కథాభాగము నిచట నివరించుచో జనువనుల యుత్సాహమును తగ్గించుమనెడి భయముతో నాధారమును చూపవారలకే వదలి, యీనాటక మెంతయు ప్రదర్శన యోగ్యంబని మనవిచేయుచున్నాను. కుక్కగొడుగులవలె నుద్భవించుచున్న నాంధ్రభాషామణి యవతారములనేడు పరిశీలించుచున్నపుడు, యీనాటక మెంతయునాదరణ పాత్రముగ తోచకమానదు.

5. మురళీధ్వని:—

బరంపురం వేగుచుక్క గ్రంథమాల వారి యనుబంధ గ్రంథము. గ్రంథకర్త కవితాసమితి కార్యదర్శియగు పురిపండా అప్పలస్వామిగారు. ఇది యిరువది హంశములతో నొప్పారు ఖండ కావ్యము. ఇందలి పద్యములు కొన్ని పత్రికలలోనిదివరకే ప్రకటింపబడినవి. వాటినన్నిటిని సంపుటించి యొక గ్రంథ రూపమున నాంధ్రదేశమునకు లభింపజేసిరి. వెల రు. 0-4-0

6. శృంగార మల్హణచరిత్ర:—

గ్రంథకర్త ఎడపాటి ఎఱ్ఱన ప్రకాశకులు జి. యస్. శాస్త్రి అండ్ కో మదరాసువారు ఇది శృంగార గ్రంథమాలయందలి మూడవ కుసుమము. చక్కని ఫెదర్ వైటు పేపరుమీద ముద్రింపబడినది. క్రౌను 158 పేజీలు. వెల రు. 2-6-0 లు.

కథాస్థానము కళ్యాణపురము. కథానాయకుడు మల్హణుడు. యజ్ఞదత్తునికి తపఃఫలముగ జన్మించిన సుగుణమణి. మల్హణుడు విద్యానిధి యను భూసురోత్తమునియొద్ద విద్య నభ్యసించుచుండెను. కళ్యాణ పురమునందు మదనసేన యను వేశ్యకలదు. ఆ వేశ్యకు పుష్పగంధియను కూతురు కలదు నిరుపమాన సౌందర్యము, సద్గుణములన్నియు నీమెయందు మూర్తీభవించి చినవి. పుష్పగంధి విద్యానిధియొద్దనే విద్యాభ్యాస మొందుచుండెను, "కులమును, గుణమును, రూపును గలిగిన బాలికకు విద్య గలిగిన యెడల" భాగ్యమేమనవచ్చును! ఇట్లు పుష్పగంధీమల్హణులు విద్యానిధియొద్ద సకల శాస్త్రములు, యితిహాసములు పఠించుచుండ మోహమేర్పడుటయు, యిర్వురును కలిటయు సంభవించినది. మదనసేన నిజముగ వేశ్యమాత. డబ్బే ప్రధానముగ గలది "డెందంబేరికి నియ్యక యుందరి దన యాత్మలోనడపుచు నయునా నందంబుగ మెరయుగవలె నందంబున వారకాంత లద్దముభంగిన్" అని యీమె బోధించుటలో నాశ్చర్యములేదు. ధనదత్తుడను వైశ్యుని చేపట్టమని వేశ్యమాత పట్టుపట్టెను. పుష్పగంధి మనస్సు మల్హణునియందు లగ్నమై యున్నది. అయినను విధిలేక తల్లి మాటలకొడంబడవలసి వచ్చెను. తరువాత పుష్పగంధీ మల్హణునుపడినవిరహతాపము, మనోహరీవాక్సుధారసమునైనను గ్రోలవలెననెడి మల్హణుని కోరిక, తత్ప్రేరణమున పుష్పగంధి యింటి కవాటము దరిజేరుట, అంధకార బంధురమైన యా చీకటిలో పుష్పగంధి యుమియ నది మల్హణుని పైబడుట, దానినే పరమప్రసాదముగ గైకొనుచున్న మల్హణుని మెఱుపులో పుష్పగంధి గుర్తించుట, తరువాత నిరువురు శివాలయమునకు బోయి తపస్సుచేసి కైవల్యము నొందుట మనోహరముగ వర్ణింపబడినవి విప్రలంభ శృంగార మత్యంతరమణీయముగ వర్ణింపబడినది. శైలి మృదు మధురము. కఠిన మాట, సమాసము, మందునకైన గానరావు.

ఈగ్రంథమును రచించినకవి కృష్ణదేవరాయల కాలమునకు చెందినవాడు (1500) నియోగి బ్రాహ్మణుడు కృతికర్తయు నియోగిబ్రాహ్మణుడు. ఇరువురును శివభక్తినిధులే. నాయికా నాయికులు కూడ శివభక్తిమూలముననే కైవల్యమును పొందిరి.

ఆధునికభావ కవితా రచయితలలో నెవరును ఎఱ్ఱనార్యుని కవిత్వమునుబోలు సులభ కవిత్వమును వ్రాయలేరనుట యతిశయోక్తి కాదు. ప్రతిపద్యము సారభూయిష్టము, నీతిబోధకము. వట్టి విప్రలంభ శృగారమును వర్ణించునపుడుకూడ కవి నీతిబోధనమునుమరువలేదు. ప్రకాశకులుకూడ స్వల్పమాత్రము మార్పులను గావించి, కవిశృంగారరచనా సామర్థ్యములకు వన్నెదరుగకుండ చేసిరి.

ఈకథపండితారాధ్యచరిత్రమునుండిగైకొనబడినది. ఇందలి శృంగారమును పఠించియానందించవలయునేకాని, విమర్శింపబూనుట కేవలము వెఱ్ఱి యనిపించకమానదు

# దర్శనిశ.

కరి నారాయణాచార్యులుగారు.

ఉ॥ చీఁకటిఁ గ్రుమ్మరించె సర ♦ సీరుహశోభ నడంచె జారచో
రాళుల మానసంబులకు ♦ హాయినిఁ గూర్చె జగంబు మూర్చె సౌ
ఖ్యాకరదంపతీ హృదిని ♦ యాతన నించె ముదంబుడించె చీ
కాకొనరించె నీ పనుల ♦ గణ్యములాయెను దర్శశర్వరీ! ॥

మ॥ సకలాశాసరసీరుహాక్షులు వెసన్ ♦ సంతోషిత స్వాంతలై
సకలాఘంబులఁ దోలు పర్వమని సు ♦ స్నానంబు గావించి మ
స్తక భాగంబులయందు నూడ్చు తడివో ♦ శక్రోపలాభంబు లౌ
చికురంబుల్ విరిబోసె నాఁ దశదిశల్ ♦ చీకట్లు గ్రమ్మెన్ గనన్ ॥

సీ॥ అష్టదిక్తోయజా ♦ తాననా నేత్రోత్పల వరకజ్జలకరం ♦ డక మనంగఁ
జతురానన నోరు భో ♦ జనపాతకధూమ విస్తృత భూరిమృద్ఘట ♦ శ్రేష్ఠమనగ
జంభాసురాతి ♦ శతయజ్ఞహోమ సంభూతోరుధూమ సం ♦ ఘాతమనంగ
దిత్రిపురారికోదండ ♦ తీవ్రమౌర్వీ వక్త్రసంజాత విషలిప్త ♦ చాపమనగ.

తే॥ గీ॥ గూడుకొనియెను రోదసీ ♦ కుహరమందు । గండశైల ఘనాఘన ♦ గంధహస్తి
పాకశాసనమణి బల ♦ భద్రచేల । నీలరుచిమీఱి యులతమో ♦ నిచయమపుడు ॥

సీ॥ సురసమూహంబెల్లఁ గరమాకటికిసోలి, మనకూడు లేదంచు ♦ మఱియుసుక్రె,
సకలజీవంజీవ ♦ సముదయంబుఁ గరంబుఁ దమకు భోజనము లే ♦ దంచు గుందెఁ
దారకాతోయజా ♦ తాక్షులందరుఁ గడుం దమభర్త రాకలే ♦ దనుచు వగచె,
నల నిశాలలితాంగి ♦ యధిక వేదనచేతఁ గాంతుండు రాడంచు ♦ జింతనొందె,

తే॥ గీ॥ నిట్లు సురలు చకోరక ♦ ఋక్షనిశలు, కొండఱికి భోజనంబును ♦ గొందఱికిని,
ప్రాణవిభుడగు నా పద్మ ♦ వైరిసపుడు, మాటిమాటికిఁదలచిరి ♦ మనమునందు ॥

సీ॥ రాకానిశాచంద్ర ♦ రమణీయకౌముది, యబ్బలేదనిగుందె ♦ నాలుమగలు,
దర్శనిశాసాంద్ర ♦ తరతమం బిదెయంచు, సంతోషమ్మందెను ♦ జారచోర,
లలకోక సందోహ ♦ మలఘు వేదనచేతఁ, గుములుచుండెను కసుం ♦ దమమటంచు
నలదివాభీతాళి ♦ యత్యంతనిబిడాంధ, కార మాయెనటంచు ♦ గరము మెచ్చె ॥

తే॥ గీ॥ నిట్లు లమవసరాత్రిగ ♦ యింపుమీఱి, కొన్ని ప్రాణుల బాధించు ♦ చున్నదయ్యు
గొంత ప్రాణిగణమునకు ♦ సంతసంబు, సంఘటింపంగఁ జేసెను ♦ సాకతముగ ॥

---

# వివిధవిషయములు

వార్తాపత్రికలు.

అమెరికాలో వార్తాపత్రికలు కొన్ని చందా దారులచే ఆకస్మిక అపాయములకు (Accident Insurance) భీమాచేయించుచున్నవి. ఏచందా దారుకైనను చేయిగాని కాలుగాని ఆకస్మిక ముగ విరిగిపోయినయెడల భీమా మొత్తమును చందారున కిచ్చివేయుదురు. ఒకనాడొక పత్రిక యీవిధముగ ప్రకటించినది "ఆకస్మిక అపాయ భీమా పాలసీని తీసికొనండి. ఈ మధ్యనే ఒక చందాదారు కాలు విరిగితే 500 డాలర్లు యిచ్చాము." అనగా చందాదారుల యొక్క కాళ్ళుచేతులు చల్లగా వుండగా చూడటానికిష్టములేదన్నమాట!

ఇంపీరియల్ రికార్డ్సు.

కలకత్తానుండి ఢిల్లీకి హిందుదేశపు రాజధాని మారినను, కొన్ని యింపీరియల్ రికార్డ్సు, 1857 తిరుగుబాటుకు పూర్వపువి, ఢిల్లీకి కను తీసికొనిపోబడలేదు. ఇవుడు ఆరికార్డ్సునుకూడ తీసికు వెళ్ళు ప్రయత్నములు జరుగుచున్నవి. అందువలన కలకత్తావారికి చాల కోపముగా నున్నది. ఈ రికార్డ్సు ననుసరించియే కలకత్తాలో చరిత్రపరిశోధన జరుగుచున్నది. ఇపుడు రికార్డ్సును తీసికొనిపోవుచో పరిశోధన కడ్డుకలుగును. ఢిల్లీలో నింతవరకు కేవలము గుమాస్తాలు ఉద్యోగస్తులే యున్నారు అను వాడుకపడినది. యీరికార్డ్సును ఢిల్లీచేరిస్తే విద్వాంసులంతా అక్కడికి చేరుతారు. అందువలన ఢిల్లీకి ప్రాముఖ్యత వస్తుందని ప్రతిపక్షుల అభిప్రాయము. తక్కిన ప్రాంతములమాట మాకెందుకు, యీరికార్డ్సుంతా మాకలకత్తాకే యవసరము, కనుక యిక్కడ నుంచి మార్చరాదని కలకత్తావారిపట్టు.

విద్యుచ్ఛక్తి.

విద్యుచ్ఛక్తివలన ప్రపంచములో ననేక మార్పులు కలుగుచున్నవి. వంటిలో నొప్పులను తీసివేసి సరియైన రక్తస్రావమును కలుగజేయుటకు డాక్టర్లు దీనినుపయోగించుట మనము గాంచుచునేయున్నాము. ఇప్పుడు విద్యుచ్ఛక్తి యొక్క ఊదాకిరణముల మూలమున వెంట్రుకలను మొలిపింప వచ్చునట. బట్ట తలలు గలవారికి సైతము వెంట్రుకలు మొలచునట. శరీరములోని ముడుతలను కూడ తీసివేయ వచ్చునట.

డీన్ ఇంజ్ గారి వాక్యములు.

ఈశ్వర ప్రేమ గల వారి హృదయములో నెట్టి మానవునిపైనను ద్వేషముండజాలదు.

నాగరికత వృక్షము వంటిది. ఆ వృక్షము యొక్క వేళ్ళు యెండిపోవుచున్నవి.

ఇతర వర్ణములవారిని నీచముగ చూచుచుండుట వలననే, శ్వేతముఖుడు తన క్రింద నున్న ప్రజలలో భయోద్వేషములను కలుగ

జేయుచున్నాడు. ఇందువలన చాల అపాయము కలదు.

తాబేలు అయి పుట్టుటకంటె కుందేలు అయి పుట్టుటమంచిది. జీవచ్ఛవమగు కుందేలగుటకంటె జీవముగల తాబేలగుట మంచిది.

మానవుడు బల్లెములతో సింహాసనము నేర్పరచుకొనగలడు. కాని దానిమీద కూర్చొనలేడు.

ఆత్మ త్యాగము ప్రకృతి సిద్ధాంతములలో నొకటి.

వ్యక్తులకు దారిచూపునది హేతువే కాని ప్రజలకు దారిచూపునది హేతువుకాదు.

సీతాకోక చిలుక.

సీతాకోక చిలుకయొక్క కంటిలో 500 lenses వుండునట.

ఇనుము.

15 రూపాయల ఖరీదుగల ఇనుముతో, 45 రూపాయల ఖరీదుగల గుర్రపు నాడాలు ను 600 లు ఖరీదుగల కత్తులు 1200 రూపాయలు ఖరీదుగల సూదులు తయారు చేయవచ్చునట. లేదా తొంభైవేల రూపాయలు ఖరీదుగల గడియారపు స్ప్రింగులను తయారు చేయవచ్చునట.

కెమల్ పాషా.

టర్కీ దేశములో బూర్సా అను పట్టణము కలదు. కాంస్టాంటునోపిలుకు 60 మైళ్ళ దూరములోనున్నది. ఈ పట్టణమున నొక సౌందర్య యువతి తన తండ్రితో పనిపాటలు సంపాదించుకొని జీవితము గడుపుటకు వచ్చెను. టర్కీ రిపబ్లిక్ ప్రెసిడెంటు అగు కెమల్ పాషా యీ యువతి సౌందర్యమునకు ముగ్ధుడై డబ్బు ఖర్చుపెట్టి ఆమెకు విద్యచెప్పుట కొప్పుకొనెను. ఆ యువతి కిపుడు పదిహేడేండ్లు. కెమల్ పాషా ఆ యువతినే యిప్పుడు వివాహము చేసికొనదలచుకున్నాడు.

వేల్సు యువరాజు.

వేల్సు యువరాజు స్పెయిన్ దేశమునకు వెళ్ళినపుడు గిత్తలపందెమును (Bull Races) చూచుటకు వెళ్ళెను. వేల్సుయువరాజుతో కూడ స్పెయిన్‌దేశపు రాజును రాణీమరితెయు వెళ్ళిరి. ఆపందెములలో నొక గిత్తకు గాయము తగిలి నందున పిచ్చియెత్తి చూపరులమీదకు పరుగెత్తి వచ్చెను. ఇట్లు వచ్చుటలో నాగిత్త స్పెయిన్ దేశపు రాణీమరితపైకి వచ్చెను. అంతట వేల్సు యువరాజు తన ప్రాణమునకు హాని కలుగనున్నను జంకక స్పెయిన్ రాణీమరితను కాపాడెను.

పారిస్.

పారిస్‌లో 2500 మంగళ్ళషాపులున్నవి. ఇందులో 500 ప్రత్యేకము స్త్రీలకొరకు ఏర్పడినవి. ఇచట స్త్రీలు తమజుట్టును రకరకములుగ కత్తిరించుకొనుట ఫేషన్. ఈ ఫేషన్ మారి, ఇపుడు స్త్రీలందరు జుట్టు పెంచుకొననుండుటచే, చాల మందికి జీవనాధారము పోవునని యూహించబడినది.

స్త్రీలు.

మంచిలోను చెడులోను అగ్రస్థానము స్త్రీకే చెందును. మంచిస్త్రీకిని చెడు స్త్రీకిని మధ్యస్థానము పురుషు డాక్రమించుకొని యున్నాడు. స్త్రీకున్నటువంటి యునాగరికత, క్రూరస్వభావము, అనీతివర్తనముల పురుషున కుండవు. ఆవిధముగానే ఆత్మత్యాగములోను ఘనతలోను స్త్రీకి లభించే యగ్రస్థానము పురుషునకు లభించదు. అని యొక యింగ్లీషు ఫ్రొఫెసర్‌గారి యభిప్రాయము.

# విమర్శనలు




## కవి:—

కవిత్వము పుట్టుకలోనే యలవడవలెను. పుట్టుకలో పొందినదానిని సాధనచే పెంపొందింపవలెను. ధనముచే కవి సృష్టింపబడజాలడు. పత్రికలలో ప్రకటించిన మాత్రమున గౌరవ మబ్బదు. ప్రజల కరతాళధ్వనుల నపేక్షించెడి భిక్షుకుడు కాడు కవి. నిరాడంబరుడు. తాను రచించిన పద్యములను గద్యములను ప్రతులు తయారుజేసి పత్రిక కొకటివంతున పంపుచు నెందులోనో యొకదానిలో ప్రకటింపబడక పోవునాయనెడి ధైర్యసాహసములుండవు. ఏకాంతమున తన్ను తాను సంతృప్తిపరచుకొనుటకు, దైవము ప్రకృతులతో సంప్రతించుకొనుటకు, కవి ప్రయత్నించును. కాని, పుట్టుకనుండే ప్రణయగీతాలతో — ప్రణయమంటే తెలియనప్పటికిగూడ — ప్రారంభించి, కృష్ణ కర్ణామృత భావములను సంగ్రహించి, పౌరాణికగాధలను యెత్తివ్రాసి కాలము గడుపజాలడు. బాలకవులు, బాలసరస్వతులు ప్రతివాది భయంకరులు, కవిరత్నలు మున్నగు నేటి యాంధ్రదేశము నావరించియున్న బిరుదావళులు మన కవి కవసరములేదు. ఏభాగవతములోనుంచో ఆధునికకవులు భావములనెత్తి వ్రాయుట యెందులకు? బమ్మెర పోతనామాత్యుని కంటె యెక్కువగ భావములను ప్రస్ఫుటము చేయగలరనియా! అందరు ద్విజేంద్రునినాటకముల నేలఅనువాదింపనేల? స్వాతంత్ర్యరచనాశక్తిలేకనా? నేటి సాహిత్య ప్రపంచములో నెల్లరును భావములకు పరాధీనులై యుండుట జూచుచున్నాము. రాచకీయముగ ఆర్థికముగ పరాధీనులైయున్న జాతికి స్వాతంత్ర్యపుటూహాలు కలుగజాలవు. స్వాతంత్ర్య మార్గములను త్రొక్కినవారే భాషోద్ధారకులు.

## ఐర్లాండు దేశము:—

స్వాతంత్ర్య సంగ్రామమతి కష్టభూయిష్టము. దీనికంతులేదు. ఏడేండ్లలో మీరేమి సాధించగలిగితిరని అసహాయోద్యమమునందు బాల్గొనిన వారిని ప్రశ్నించుచుండుట మనకు తెలిసియే యున్నది. యేడువందల సంవత్సరము లతితీవ్రముగ స్వాతంత్ర్యసమరము కావించిన ఐర్లాండు దేశము నేటికిని కృతకృత్యురాలు కాకపోయెను. అచటి ప్రజలు చూపిన త్యాగమపారము.

రక్త ప్రవాహములు సెలయేళ్ళవలె పారినవి. ధనము విచ్చలవిడిగ ఖర్చుపెట్టబడినది. ఇట్టి మహాయజ్ఞము సంపూర్ణముగ కాకపోయినను చాలవఱకైనను జయప్రదమయ్యెననుట నిర్వివాదాంశము. బ్రిటిష్ ప్రభుత్వము కుల వైషమ్యములను అంతఃచిద్రములను కలుగచేసి మందుగుండు సామానులను విచ్చలవిడిగ ఖర్చుపెట్టి నిరంకుశముగ బాలించి చివరకు జేయునది లేక రాజీకి దిగినది. ప్రజలును ఏడు శతాబ్దముల ఘోరయుద్ధముతో విసిగి వేసారి, గౌరవభంగము మాత్రము కలుగకుండ రాజీచేసికొనిరి. ఈ రాజీవలన ఐర్లాండు దేశములో రెండు కక్షలు బయలుదేరినవి. ఒక కక్షవారు రాజీ కంగీకరించి, రాజుగారి ప్రమాణవచనము తీసికొనుట కంగీకరించిరి. వీరికి కాస్గ్రేవు మున్నగువారు నాయకులు. రెండవ పక్షమువారు సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరవలెను కాని బ్రిటీషు ప్రభుత్వమునకు లొంగిపోయి ప్రమాణవచనము గైకొనరాదని వాదించిరి. వీరికి డీవెలరా మున్నగువారు నాయకులు. ప్రజలధిక సంఖ్యాకులు రాజీ కనుమతించినందున కాస్గ్రేవు వర్గము ప్రాబల్యమునకు వచ్చి మొదటి ఐర్లాండు దేశపు ప్రభుత్వమునకు కాస్గ్రేవు ప్రధాన మంత్రియయ్యెను. అపుడు వీరిపక్షము వారు పార్లమెంటులో 62మంది యుండిరి. ఆనాటినుండియు డీవెలరాపక్షము వారుకూడ యెన్నికలలో పాల్గొనుచు విజయము నొందిన పిమ్మట ప్రమాణవచనమున గైకొనకుండిరి. వీరి పక్షమువారు 47 మంది కలరు. తదితర పక్షములవారు 40 మంది యున్నను, వారు ప్రభుత్వముతోనే యేకీభవించుచు వచ్చిరి. కాస్గ్రేవు ప్రభుత్వము నేటివరకు నవిచ్ఛిన్నముగ బాలించినది. దేశీయుల యాశయముల నన్నిటిని సాధించజాలకున్నను, యీ ప్రభుత్వమువలన దేశీయులకు గల్గిన మేళ్ళు చాలగలవు. అందువలననే మొన్నటి యెన్నికలలోకూడ, కాస్గ్రేవుపక్షము వారధిక సంఖ్యాలుగ వచ్చిరి. వీరిహయాములో వ్యవసాయ మభివృద్ధిగాంచినది. గ్రామ పునర్నిర్మాణము విశేషముగ కొనసాగినది. సహకార క్రయవిక్రయ విధానము బాగుగ వ్యాపించినది. వ్యవసాయదారుల కందుబాటుజేసిన సహకార దీర్ఘవాయిదా ఋణములు ప్రశంసాపాత్రముగ పనిజేసినవి. ఆదాయపుపన్ను తగ్గింపబడినది. తేయాకు కోకోలపై సుంకములు తీసివేయబడినవి. పంచదారపై సుంకము చాలమటుకు తగ్గింపబడినది. ఇకను అవసరమగు మార్పులను సూచించుటకు టారిఫ్ విచారణసంఘ మేర్పాటు చేయబడినది. న్యాయస్థాన నిర్మాణము విషయములో, బ్రిటిష్ పద్ధతుల ననుకరింపక, దేశీయ పద్ధతులలో నేర్పాట్లుకావించిరి. పాఠశాలలలో భాషను నిర్బంధముగ నేర్పుచుండిరి. అక్కడ వుద్యోగములు జేయువారెల్లరు భాషాప్రావీణ్యము నలవరచుకొనవలెను. కరెన్సీవిధానములో బ్రిటనుకును ఐర్లాండుదేశమునకును గల సంబంధ బాంధవ్యములను త్రెంచ విశ్వప్రయత్నములు కావించుచున్నారు. విదేశ వ్యవహారములపట్ల కావింపబడిన ప్రయత్నము లన్నిటిలోను కాస్గ్రేవు ప్రయత్నములు జయప్రదములైనవి.

ఈ యెన్నికలలో వీరి స్థానములు కొలదిగ తగ్గిన మాట వాస్తవమే. ప్రజాహిత కార్యముల కొరకవలంబించవలసిన పద్ధతులో ధనికులపట్ల పారిశ్రామికులపట్ల కొంతనిరంకుశపాలనమునకు గడంగవలసి వచ్చినది, అందు

వలననే వీరు కొన్ని స్థానములను కోల్పోయినను, భయపడవలసిన పని లేదు. మొన్న యెన్నికల ఫలితముగ నాయా రాజకీయ పక్షము లిట్లున్నవి. కాన్గ్రెసు పక్షము 45, డీవెలరా పక్షము 44 తదితరపక్షములు 58. మిగిలిన అన్ని పక్షములవారు ప్రభుత్వమునకే దోడ్పడుదురు. ప్రభుత్వపక్షావలంబులకు మొత్తమన్ని స్థానములలోను 713,836 వోట్లును, డీవెలరా పక్షమువారికి 318,586 వోట్లును వచ్చియుండుటచే, ప్రజాభిమానము కాన్గ్రెసు పక్షము పట్ల కలదని తెలియగలదు. ఈవిధముగ నేడువందల సంవత్సరముల ఘోర సంగ్రామముచే చెల్లాచెదరై యున్న దేశీయసౌభాగ్యమును మెల్లమెల్లగా నైర్లాండు దేశపు ప్రజలు పునరుద్ధరించుకొనుచున్నారు.

## మిత్రద్వయము :—

ఐర్లాండు దేశములో నిరువురు మిత్రులుండేవారు. ఒకరు ఓహిగ్గిన్సు, రెండవవాడు రోరీ ఓకానర్. ఇరువురును బాల్యమునుండి మిత్రులుగనే పెరిగిరి. దేశభక్తి వీరిరువురకు నుగ్గుపాలతోనే ప్రారంభమైనది. దేశముకొరకై వీరు కావించిన త్యాగమునకు మేరయేలేదు. ఐర్లాండు దేశముయొక్క స్వాతంత్ర్యసమరములో వీరమితముగ పాల్గొనియుండిరి. ఐర్లాండు దేశముయొక్క స్వాతంత్ర్యపరిణామమును మనము పయిన చదివియుంటిమి. ఐర్లాండు దేశము ఇంగ్లాండుతో సంధి జేసికొనినప్పుడు, ఓహిగ్గిన్సు సంధి కొడంబడి ఫ్రీస్టేటునుపక్షములోను, రోరీఓకానర్ సంధికొడంబడక రిపబ్లికనుపక్షములోను చేరిరి. ఓహిగ్గిన్సుయొక్క త్యాగశీలతకును మేధాసంపత్తికిని మెచ్చుకొని ఐరిష్ రిపబ్లిక్కు వైసు ప్రెసిడెంటుగను విదేశన్యాయశాఖావ్యవహారముల మంత్రిగను నియమించిరి. రోరీఓకానరు తన సహచరులతో దౌర్జన్యపద్ధతులకు గడంగి ఫ్రీస్టేటు పక్షము వారు సంపూర్ణ స్వాతంత్ర్యమున కాటంకముగ నిలచుచుండుటచే వారి నాయకులను హత్యజేయుటలో బాల్గొనెను. అందువలన రోరీఓకానరు న్యాయస్థానములో విచారింపబడి మరణశిక్ష విధింపబడెను. ఓహిగ్గిన్సు న్యాయశాఖా మంత్రిగ, తన మిత్రునిపై విధింపబడిన మరణశిక్షను ఖాయపరచవలసి వచ్చినను, వెనుకాడక స్థైర్యముతో తన విధాయక కృత్యమును నెరవేర్చెను. తరువాత, తన ప్రాణమిత్రుడు ఉరితీయబడువరకు రాత్రి మేల్కొనియుండి, ఉరిపూర్తి కాగానే క్రిందపడి మూర్ఛిల్లెను. మూర్ఛనుండి లేచి ఓహిగ్గిన్సు "నాధర్మమును నేను నెరవేర్చినాను" అనెను. ఓకానర్ ఉరితీయబడిన వెనుక, ఆతని మరణశాసనమును చదివిరి. ఆ మరణశాసనముతో ఓకానర్ యొక్క యావదాస్తి ఓహిగ్గిన్సుకు సంప్రాప్తమయినది. స్వాతంత్ర్య సమరములో భిన్నపక్షములకు చెందినను సాంఘిక విషయములలో వీరి మిత్రత్వము చెడలేదనుట కిదియే దృష్టాంతము. అంతటితో నీ యుదంతము ముగిసినది. అటుపిమ్మట, ఐరిష్ రిపబ్లికన్ సైన్యములను శిథిలము చేయు నిమిత్తము ఫ్రీస్టేటు పోలీసు నిర్మాణమునకు గడంగి మిక్కిలి పట్టుదలతో పని చేయు నారంభించెను. ఇందువలన రిపబ్లికను పక్షమువారికి ఓహిగ్గిన్సుపై ద్వేషము కలిగెను. రిపబ్లికన్ పక్షమునకు చెందిన ముగ్గురు ఒక కారును దొంగిలించి తుపాకులతో ఓహిగ్గిన్సును చంపవలెనని 9-7-27 మధ్యాహ్నము బయలుదేరి ఓహిగ్గిన్సుగారి

గృహ సామీప్యమును చేరిరి. మరి యిద్దరు అచటనే కాపలాయుండి ఓహిగ్గిన్సు బయటకు వచ్చినపుడు తమ మిత్రుల కెరింగించిరి. అంతట నాముగ్గురును మోటారుకారు దిగి తుపాకులను పేల్చిరి. గాయములు తగిలి ఓహిగ్గిన్సు దారిలో పడిపోయెను. ఓహిగ్గిన్సు చనిపోయినట్లుగ భావించి ముగ్గురును వెనుకకు పారిపోదొడంగిరి కాని, అతని హస్తము కదలుట చూచి ముగ్గురు హంతకులును తిరిగి తుపాకులను ప్రేల్చి కాల్చివేసిరి. ఓహిగ్గిన్సు ప్రాణము వీడుచు "నాశత్రువుల సాన్నిధ్యమున శాంతముగ ప్రాణములను వదలుకొనుచున్నాను. నాదేశముకొరకు నాప్రాణముల నర్పించితిని. వారినందరిని నేను క్షమించితిని." అనినుడివెను. ధర్మనిర్వహణమునందు నిర్భయముగ సంచరించవలెననుటకు ఓహిగ్గిన్సు ఓహినర్ గారి జీవితములే దృష్టాంతములు. దేశారాధనకు కావింపవలసిన త్యాగమునకు వీరి త్యాగమే నిదర్శనము. వీరి త్యాగము చెరసాలకు పోయేటప్పుడు ఆస్తిని పెళ్ళాం బిడ్డలపేర రిజిష్టరుచేసే త్యాగముకాదు. రాజకీయావసరములకు ప్రోనోటు వ్యాజ్యములు తెచ్చేత్యాగముకాదు. అంతా సంపాదించుకొని నిలవచేసికొనిన త్యాగమునూకాదు. నిష్కళంకమైనది. పవిత్రమైనది. అదర్శప్రాయమైనది.

## స్వీకారము.

ఈ క్రిందిపుస్తకములను కృతజ్ఞతతో నందికొంటిమి. వాటినిగురించినవిమర్శనలు రాబోవు సంచికలో ప్రచురింపబడును.

(1) శృంగారాహల్యా సంక్రందనము.
(2) తులసి.
(3) సంస్కరణ కథావల్లరి.






మచిలీపట్టణము

సంపుటము 3 | ఆగస్టు 1929 | సంచిక [illegible]

## సినీమా ప్రపంచము.

పాశ్చాత్య దేశములలో సినిమా కంపెనీలు విరివిగ వ్యాపించినవి. ఫిల్ములు తయారుచేయుటకు ప్రత్యేక కంపెనీలు యేర్పడియున్నవి. స్త్రీపురుషులు స్వేచ్ఛగ ప్రదర్శనములందు పాల్గొనుచుందురు. ఆదేశములలో నది దోషముగను ద్వేషముతోడను చూచుటలేదు. మన దేశములోకూడ ఫిల్ములు తయారుచేయుటకు ప్రథమ ప్రయత్నములు జరుగుచున్నవి. అట్టి కంపెనీలలో పురుషులు వేషములు ధరించుట చూచుచున్నాము గాని స్త్రీలు స్త్రీపాత్రలు ధరించుట అరుదు. ఇప్పుడిప్పుడు స్త్రీలుకూడ వేషములు ధరించి తమ అద్భుతనటనాకౌశలముచే పేరుప్రఖ్యాతులను సంపాదించుచున్నారు. అందులో మిస్ గోహర్ అనునామె యొకతె. ఈమె పేరును వినని వారుండరు. నెలకు వేనకు వేలు వేతనమిచ్చెదరట యీమెకు. ఈమెతరువాత మనము వినునది కృష్ణాజిల్లా జడ్జి బి. రామారావుగారి కుమార్తె. ఈమెకు నెలకు ఆరువందల రూపాయల జీతమిచ్చుచున్నారట.

## ఆంధ్రనటకులు.

ఆంధ్రనటకులలో పేరుప్రఖ్యాతులను సంపాదించినది బళ్ళారివాస్తవ్యులును ప్రభుత్వ న్యాయవాదియు నగు టి. రాఘవాచార్యులుగారు. వీరు సుప్రసిద్ధాంధ్రులు. వీరిని ఆంధ్రులుగ ప్రశంసించి గర్వించువారు లేరనిన నతిశయోక్తికాదు. "టైమ్సు ఆఫ్ యిండియా" పత్రికలో వీరును బళ్ళారి వాస్తవ్యులని వర్ణింపబడెను గాని వీరు ఆంధ్రులని కాని ఆంధ్రనాటకరంగోద్ధారణకు కంకణముగట్టుకొన్నవారని కాని యేమాత్రము వ్రాసియుండలేదు. ఈయన ఇంగ్లాండుదేశమున కేగెను. అక్కడ నాటకరంగములను దర్శించి అవి మన కెంతవరకనుకూలించునో పరీక్షింప దలచెను. వీరు బర్నార్డు షాగారితో గంటన్నర మాట్లాడెనట. కవిత్వము కళలకు ప్రాచ్యదేశములే పాశ్చాత్యదేశములకంటె మెరుగని బర్నార్డు షాగారు నుడివియున్నారు. తరువాత రాఘవాచార్యులుగారు హార్డ్గే ప్రభువును సర్ జాన్స్టన్ ఫోర్బ్సు రాబర్ట్సన్ అను సుప్రసిద్ధనటకుని దర్శించెను. ఆచార్యులుగారు అంతర్జాతీయ నాటకసంఘముల సమితిలో

మెంబరు. లండనునగరమందలి నాటకరంగములను దర్శించి పిమ్మట ప్యారిస్ నగరములో సమావేశమైన అంతర్జాతీయ సమితికి వెళ్ళిరి. పాశ్చాత్య దేశములనుండి నాటకరంగముల సందర్భమున మనము నేర్చుకొనవలసిన దంతగాలేదని వీరు తమ అభిప్రాయము వెలిబుచ్చిరి.

## గమ్యస్థానము.

ఎక్కడచూచినను సైమను కమిషను, నెహ్రూనివేదికము ఘోషిల్లుచున్నవి. ఆ సైమను కమిషను కొండనుత్రవ్వి యెలుకను పట్టుటకుపూర్వమే, మన నాయకులు నెహ్రూ పృముఖులు మున్నగువారు హిందు దేశ రాజ్యాంగ విధానమును నిర్ణయించిరి. అధినివేశపరిపాలనా విధానమును (Dominian from of Government) హిందూదేశ ప్రత్యేక పరిస్థితుల ననుసరించి మార్పులుచేసి యొంచి విధానమును తయారు చేసిరి. హిందుదేశమున కీవిధానము సంపూర్ణ మోక్షము నొసంగు ననుటకు వీలులేదు. అయి నప్పటికిని, అనేకమతములకు నివాసస్థానమగు నీదేశమున కలియిక కుదరవలెనననెంతో కష్టము. సంపూర్ణ స్వాతంత్ర్యమును గోరు వారికిగాని గాంధిగారి నిర్వచనప్రకారము స్వరాజ్యము గోరువారికిగాని యిదియెంతయు ననంతృప్తికరమే. మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు వివిధపక్షములవారిని చేరదీయవలెనినచో ఆత్మగౌరవమునకు భంగము రానంతవరకును ఎట్టిత్యాగమునైనను చేయుక తప్పదు అన్నిపక్షములవారును సమ్మతించిన మొదల తనకేయభ్యంతరమును లేదని మహాత్ముడు నుడివియున్నాడు. ఇప్పుడు నాయకులందరును లక్నోనగరమున సమావేశమై ఏకైకకంఠముతో నెహ్రూనివేదికను ఆమోదించి తమ రాజ్యాంగవిధానమును నిర్ణయించుకొనగల సమగ్రత భారతీయులకు లేకపోలేదని ఋజువుచేయుచున్నారు. ఇందుకనియే నెహ్రూపండితుని కలకత్తా కాంగ్రెసుపీఠము నధిష్ఠింపజేసి యావత్ భారతదేశము నిరాజ్యాంగ ప్రణాళికను ఆమోదించుచున్నదని ప్రకటింపనున్నారు.

## బ్రిటీషు రాజకీయవేత్తలు.

గ్రేటు బ్రిటనులోని పత్రికలు మన ప్రణాళికను తృణీకరించుచున్నవి. దేశము దీనిని ఆమోదించుటలేదని అసత్యప్రకటనలుగావించుచున్నవి. సక్లత్ వాలాగారు హిందుదేశమునకు స్వపరిపాలనతప్ప గత్యంతరములేదని వాదించుచున్నారు. పర్సెల్, జాన్‌స్టన్ మున్నగుకార్మికపక్షమువారు హిందుదేశస్థులకు అసంతృప్తి కల్గించుచున్నది ఆహారసమస్యగాని స్వపరిపాలనా సమస్యకాదని వెల్లడించియున్నారు. ఈరెండువాదములయొక్క అంతరార్థమును ఒక్కటే. విదేశస్థులు తమ సౌకర్యములకును తమ స్వార్థమునకును పాటుపడుదురేగాని పాలితుల క్షేమముకొరకు కృషిసల్పుదురనుటవెట్టి. లేనియెడల లేవు సైమనుకమిషనువారు ఒంటిపూటతిండి లేక యలమలమాడుచున్న 6 కోట్ల భారతీయులకు అన్నవస్త్రముల నొసంగు విధానమును నిర్ణయింతురా? సైనికఖర్చు యాభైఅయిదుకోట్లనుండి తగ్గనంతవరకును సివిలియనుల జీతములు తక్కువకానంతవరకును, విదేశములకు వస్త్రములక్రింద 60 కోట్లు పోవునంతవరకును, హిందుదేశస్థులకు అన్నవస్త్రము లెట్లు లభించునో యూహింపశక్యముకాదు. పెద్దలందరును ఆలోచించియే సర్వవ్యాధులకు చికిత్స స్వరాజ్యమని నిర్ణయించిరి.

# నవవికాసము

(వత్సరారంభమున)

వఝ్ఝల కాళిదాస కవి.

(ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము)

పలుకు పలుకు తేనె లొలుకు తీపులతోడఁ
గవుల కలము క్రొత్త గతులఁ జనియె;
కలకలమని నవ్వ జిలుకుచు లోకంబు
కానుపించె నవవికాసమునను ॥

తొగరు మామిడిగున్న చిగురు జొంపములలోఁ గోయిల కెంపుల గుబ్బలు మెరయ;
జిలుగు కోనేటిలో నలల దొంతరలపైఁ దమ్ముల రాగమందము నటింప;
జిలువ వన్నెటిగాలుల కౌఁగిలింతలకుఁ బూవుల కావి సొంపులవియ్యాఁగ;
జళుకు లీనెడి మిన్ను దాఁకు కొండలమీఁదఁ సంజ కెంజాయలు జాజువార;

గులుకు నవరాంధ్ర లేత చెక్కిళుల క్రొత్త క్రొత్త కన్నె గులాబిరంగులు చలింప
నవనవవికాస నూతనానంద రక్తి ప్రకృతి యంతయు రాగ సంభరితమయ్యె ॥

చల్లదనము నీ విశాల సృష్టిని నిల్పి
విభవ విభవ మింక వీనులలర
నాలకింపుడనుచు నమృతంబు లొల్కఁగా
గొనరి కొనరి కూసె గోకిలంబు ॥

చల్లనై కాంతమైన వసంతలక్ష్మి
వేయి రేకులతో నాత్మ విరిసిపోవ
నెల్లెడల నాటుకొనియున్న వృక్షపంక్తి
చివురు కొమ్మలతోడుత చెలువు నింపె ॥

చంద్రికా కాంచనోత్సవములో బులకించు కవుల లేఖిని నూతన కళలు జార,
ప్రకృతి స్వరూప వర్ణ విలాసమంతయు చిత్రలేఖకుల కుంచియల జేర,
గోయిల తొలిపాటకుఁ బొంగు గాయక కంఠంబులందు రాగంబులూర,
నరుణ భానుని తేజ మరసి లేచిన వీరవరుల కత్తులజాతు మెరుగుమీర

నాంధ్రశక్తి వత్సరారంభముననుండి క్రొత్త క్రొత్త చెలువు గూర్చుకొనియె
నోర్పు నేర్పు కూర్పు లొక్కట గుమిగూడ దనరకున్నె లోకమునకు జయము ॥

# తమాషాలు

## జ్ఞాపకం.

"మీ ఆయన తెలివిగలవారే!"

"అవును. వారికి నాకెన్నేళ్లో జ్ఞాపకములేకపోయినా నా పుట్టినరోజు మాత్రం బాగా జ్ఞాపకం వుంటుంది"

## కుట్ర.

వ్యాసకర్త:— పత్రికాధిపతులంతా కుట్ర చేస్తున్నారండి.

స్నేహితుడు:— యేం కుట్ర?

వ్యాసకర్త:— నా వ్యాసం పంపిస్తే యెవరు వేసుకోకున్నారు.

## తీపి.

భార్య:— ఆడవాళ్ళంటే మొఖం మొత్తిందికాబోలు.

భర్త:— తప్పకుండాను.

భార్య:— ఎందుచేత?

భర్త:— నాకు తీపి సయించదుగనుక.

## భార్య.

"అన్నిటికంటె తీపివస్తువేమిటి?"

"కోపము లేకుండా, నగలు, చీరలు, డబ్బు అడక్కుండా, నాటకానికి వెళ్తానని పోరకుండా, ముఖం ముడ్చుకోకుండా వుండే భార్య."

## భయం.

భార్య:— పెళ్ళాన్ని పోషించటానికి శక్తిలేనపుడు యెందుకు పెళ్ళి చేసుకున్నారు?

భర్త:— నేనుతప్ప నీకింకొకరు దొరకరనే భయంచేత.

## మరపు.

భార్య:— ఏమైనా వస్తే నన్ను మరచిపోతారు.

భర్త:— నీకంటె కావలసిన వస్తువు మరేముంది? ఎందుకు మరచిపోతాను.

భార్య:— అయితే నాపుట్టినరోజున నన్నెందుకు మరచిపోయారు,

## చిల్లర.

"వాన కురుస్తోంది. కాఫీ హోటలుకు పోకుండా వుంటే బాగా వుండేటట్లుంది."

"అవును. బాగానేవుంటుంది. అయినా జేబుచూడనియ్యి. జేబులో వుండే చిల్లరనిబట్టికూడా వుంటుంది."

## కుందేళ్లు.

ఒకదొరగారు వేటాడవలెననే సరదాతో బయలుదేరాడు. అక్కడ యేముంటాయి అని జవానును ప్రశ్నించాడు. "కుందేళ్ళను కాల్చవచ్చును." అని జవాబు చెప్పాడు.

"కుందేళ్ళు యెలావుంటవి?"

"నాలుగుకాళ్ళు పొడుగుపాటి చెవులు"

ఇంతలో ఒకగాడిద రాగా దానిని దొరగారు కాల్చివేశాడు.

జవాను:— అదేమిటండి దానిని కాల్చారు?

దొర:— అది కుందేలు. నాలుగు కాళ్ళు పొడుగుపాటి చెవులు వుంటాయని చెప్పావుగా!

## లేబరు యినస్పెక్టర్లు.

"ఇంతమంది Labour Inspectors యెందుకు బయలుదేరారు?"

"ఆడవాళ్ళ ప్రసవబాధ మాన్పటానికి"

## తమాషా.

జడ్జిగారు కోర్టులో యిట్లు చెప్పెను. "సాక్షి ఒకసారి చెప్పిన మాటలను మరల సవరించుకొన్నంతమాత్రాన అబద్ధమాడినట్లనుకోకూడదు. బెంచి యెక్కగానే నా వద్ద గడియారమున్నదని అన్నాననుకోండి. తిరిగి జేబు చూస్తే యింటివద్ద వదలిపెట్టుకొని వచ్చానని జ్ఞాపకము వచ్చి లేదంటే అబద్ధమాడినట్లా!"

జడ్జిగారు సాయంకాలము యింటికి వచ్చారు. భార్య "గడియారంకోసం అంతమందిని పంపారేమిటి" అన్నది.

"గడియారం ఏంచేశావేమిటి?"

"వచ్చినవారిలో మొదటివానిచేతికిచ్చాను."

## దొంగలు.

భాగ్యవంతుడు:— సభ్యోకి అంతా దొంగలే వస్తారు. అందుచేత నేను రావటంలేదు.

పూజారి:— మీఒక్కరికిమాత్రం స్థలం లేకపోతుందా యేమిటి?

## శాస్త్రము.

తల్లి:— (పిల్లను చూచి వచ్చుటకు వెళ్ళివచ్చిన కొడుకుతో) అత్తగారిని చూచావా!

కొడుకు:— పిల్ల పెద్దదైతే అత్తగారిమాదిరే వుంటుందని శాస్త్రమా!

## ఎంత సౌమ్యం.

జడ్జి:— (సాక్షితో) ముద్దాయిని చాల కాలమునుంచి యెరుగుదున్నన్నావు. ఇదుగో యీడబ్బు చూస్తే తీసుకునే స్వభావం కలవాడేనా?

సాక్షి:— చిత్తం. ఎంతసొమ్మేమిటిబాబు?

## జ్యోతిష్యం.

ఒక జ్యోతిష్యుడు:— తన వ్యాపారం బాగా లాభిస్తుందనుకుంటాను.

రెండవ జ్యోతి:— ముందుసంగతి నేనెట్లా చెప్పగలను?

## కారణము.

అన్నగారు గ్రామాంతరం వెళ్ళి ఆరు నెలలకు తిరిగి వచ్చెను. ఈలోపున తమ్ముడు గడ్డముపెంచెను. "కారణమేమి" ని ప్రశ్నించెను.

"నీవు మంగలికత్తి నీతో పట్టుకుపోతే చేసేదేముంది?"

## మార్చటం.

"మూరురూపాయల నోటు యెట్లా మార్చగలవు"

"చింపి పొట్లములు కట్టుతాను. లేకపోతే రోట్లో తొక్కి మాత్రలు తయారుచేస్తాను"

## సర్కస్ మేనేజరు.

"సర్కస్ మేనేజరు పని యేమీ బాగాలేదు"

"ఏంచేశాడు."

"నోట్టీసులలో తనబొమ్మ చూసేసరికి యింతైనాడు. తలకాయి లావైపోయింది. పులి నోట్లో తలకాయి పట్టటంలేదు."

## నెరవు.

"మగవాళ్ళ వెంట్రుకలు ఆడవాళ్ళ వెంట్రుకలకంటె త్వరగా యెందుకు నెరస్తవి?"

"ఎందుకనగా, చేతులకు గాజులు కావలసి వచ్చినప్పుడో, మెళ్ళోకి గొలుసులు కావలసివచ్చినప్పుడో భర్తలదగ్గరజేరి చేతులతో తరచుగ వెంట్రుకలు దువ్వుతోండటముచేత"

## జరగటం.

"బెజవాడలో అరండలు పత్రం బాగా జరుగుతున్నదాండీ?"

"ఏమోనండి. ముప్పై యేళ్ళనుంచి చూస్తున్నాను. ఒక్క అంగుళమైనా జరగడంలేదు."

## ఆర్పుట.

ఒక అమెరికాదేశస్థుడు యిటలీకి అగ్నిపర్వతములను చూచుటకు వెళ్ళెను. మార్గము చూపుటకు వచ్చినవాడు "యివి అగ్ని పర్వతములండి, ఎప్పుడు నిప్పులు కురుస్తోంటవి" అనెను.

ఆ. దే:— "అదెంత! మా నైగారాఫాల్సుతో యిట్టె ఆర్పవచ్చును."

## దర్జా.

ఒకరు:— ఇలా మంచంమీద పరుండి కళ్ళు తెరచి గంట వాయించగానే వచ్చే నవుకరుంటే యెంత దర్జాగా వుంటుందోయి.

స్నేహి:— నవుకరున్నాడా?

ఒకరు:— నవుకరు లేడుగాని గంటమాత్రం వుంది.

## కమిషను.

"డాక్టరుగారూ, మీవద్దకు రోగులను తెస్తే కమిషను యిస్తారటనే. ఎంత యిస్తారు."

"రోగి యేడి?"

"నేనే రోగినండి."

## నమ్మకం.

"మనగుమాస్తా యెంత నమ్మకస్థుడండీ. అతను చేసే పని నమ్మకంగా మనమే చెప్పివేయవచ్చు."

"ఇపు డేమిపని చేస్తాడు?"

"ఏమి చేయడు. నిద్రపోతాడు."

## అల్లరి.

అవ్వ:— (పిల్లవానితో) ఇంత అల్లరి చేస్తున్నావేం యివ్వాళ.

మను:— అల్లరిచేయకపోతే మాయింటికి నన్ను పంపించి వేయవని మాఅమ్మ చెప్పింది.

## చదువు.

"నీవేమిటి చదువుతున్నావు."

"ధనము, శ్రమ అనే గ్రంథము."

"అంటే?"

"నీవు నాకు పదిరూపాయ లిచ్చావనుకో అది ధనము."

"శ్రమ అంటే?"

"మళ్ళీ నాదగ్గరనుంచి వసూలుచేయడం."

## వివాహితులు.

పెండ్లి చేసుకున్నవారు బ్రహ్మచారులకంటె యెక్కువకాలం బ్రతుకుతారట.

## పత్రికా పఠనం.

ఒకడు తన గ్రామమును తన పదియవయేటనే వదిలిపెట్టెను. 70 వ యేట తిరిగి వచ్చెను. ఆగ్రామమునందున్న పూర్వ పరిచయస్థుని 90 యేళ్ళ వృద్ధునివద్దకి వెళ్ళి పలుకరించెను.

"ఇంకా జ్ఞాపకమున్నానా బాబూ."

"నిన్నుచూచి చాలకాలమైనా, ఉత్తరాలు రాయకపోయినా జ్ఞాపకమే వున్నావు. ఏలాగంటే పత్రిక బాగా చదువుచుండేవాడిని. ఎక్కడా నువ్వు చనిపోయినట్లు పడకపోవుటచే బ్రతికేవున్నావనుకున్నా."

## తరచుగ మారడం.

"ఉదయం వాన, యిపుడు యెండ. ఏక్షణం యెలా మారుతుందో చెప్పలేం. ఇంత త్వరగా మారే వస్తువు మరేదిలేదు."

"లేకేమండి. నాబాకీ మీవద్దనుంచి యెప్పుడు వసూలవుతుందో నిశ్చయంగా చెప్పలేను, ఇంతకంటె అది అంత త్వరగా మారుతుందాయేమిటి?"

## లాయరు.

లాయరు:— నిజంగా నా అభిప్రాయం కావాలంటే—

క్లయింటు:— ఆగండి, ఆగండి. నాకు కావలసింది మీ నిజాభిప్రాయం కాదు. లా పాయింటే నాకు కావాలసింది.

## నడక.

"డాక్టరుగారు వారంరోజులలో నడిచేటట్లు చేస్తానన్నారు"

"ఇపుడు నడుస్తున్నావా,"

"కారు అమ్మేశాను. బండి అమ్మేశాను. నడక కేంచేస్తా."

## సంతకం.

కొడుకు:— నాన్నా, నాన్నా, నువ్వు చేసినట్లుగ అన్ని పనులు నన్ను చేస్తుండమన్నావు నిజంకాదు నాన్నా.

తండ్రి:— అవును నాయనా.

కొడుకు:— నిన్న ప్రారంభించాను. ఇవ్వాళిటికి పూర్తి అయింది. చెక్కుమీద నీ సంతకం చేయటానికి.

## కోపము.

నడివేసంగిలో ఒకనాటి సాయంకాలం రాజమండ్రి గోదావరి పోతగట్టుమీద రెండోవాడిమీద కోపంతో—

మొదటివాడు:— ఆట్టే పేలావంటే జాగ్రత్త. ఏదో స్తంభందగ్గర ముంచుతా.

రెండోవాడు:— (మరీ మండిపడుతూ) ఛీ, ఫూల్ నోరుముయ్యి. నిన్నె 27 వ స్తంభందగ్గర ముంచుతా.

మొదటివాడు:— (కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతూ) 27 వ స్తంభందగ్గర నీరు లేదు. అదంతా తిప్పరా చవటా! నిన్నే అక్కడ పాతిపెడతా!

## రిఫార్మరు.

"మీవాడు రిఫార్మరయ్యాట్టండోయి"

"మావాడు యిదివరకునుంచి ఫార్మరేనండీ. ఇప్పుడు కొత్తగా అయ్యిందేముంది!"

## తెలివి.

జూనియర్ విద్యార్థి:— ఒరేయ్ రామం! ఎముకల్లోనుంచి నూనె తీస్తున్నారుటరా!

సీనియర్ విద్యార్థి:— ఎక్కడ చూశావురా?

జూ. వి:— "హిందూలో".

సీ. వి:— ఓస్. అదేమిటింత. రంపం పొట్టులోంచి ఐస్ తీస్తూండగా నాకళ్ళారా నేను చూశాన్రా.

జూ. వి:— అదెక్కడరా?

సీ. వి:— మెయిల్లోరా.

## విడోమారేజ్.

"ఏమోయీ మీసిష్టర్ విడోమారేజ్ చేసుకుంటుందట నిజమేనా ?"

"మా బావే విడోమారేజ్ చేసుకున్నాడు."

## అల్లుడు.

ఉదయాన్నే అత్తగారు క్రొత్తగావొచ్చిన అల్లునితో

అత్తగారు;— ఇప్పుడు కాఫీ తాగుతావా ? కాన్వెంటుండి పిల్లలతో చద్దివణ్ణం తింటావా ? పది గంటలకి మీ మామగారితో వేడిఅన్నం తింటావా ?

అల్లుడు;— ఇప్పుడు కాఫీతాగి, కాన్వెంటుండి పిల్లలతో చద్దివణ్ణం తింటాను. తరువాత పదిగంటలకి మామగారితో వేడిఅన్నం తింటాను.

## నేషనల్ యికానమి.

"నాయుడుగారూ, National Economy యేమిటి?"

నాయుడు;— Not to throw the cigars outside after you smoke.

— ఇలే యింకా,

నాయుడు:— కార్కు స్క్రూ లేకుంటే బిరడా తోసి రాజా చెయ్యడం (సీసా బిద్దలయ్యాకైనా బిరడా వుపయోగిస్తుంది.)

## ఇల్లరికం.

చెల్లెలు;— అక్కా ! సత్యాతీరావుగారి అల్లుడు యిల్లరికమా యేమిటే ?

అక్క;— ఏమే యివ్వాళ్ళకు తోచింది నీకీఅనుమానం ?

చెల్లెలు:— సంవత్సరానికి పదకొండునెల్లు యిక్కడే వుంటాడేమో ఆయన ?

అక్క;— ఆయన ఆస్తంతా పెళ్ళాంపేరుంది.

## కొన్ని సంగతులు.

పూర్వమొక పుస్తకాలు అమ్మేఆయన మొదట పుట్టినపిల్లవానికి ఒకటోఅంకమని రెండోవానికి రెండో అంకమని అయిదోవానికి అయిదో అంకమని పేర్లుపెట్టి ఆరోవాడికి సంపూర్ణమని పెట్టాడు. ఇంకోడు పుడితే వాడికి తప్పొప్పులపట్టీ అని పెట్టాడట ఈకాలంలో అటువంటి విచిత్రవిషయమే ఒకటి జరిగింది. ఆయన ఒక నాటక కంపెనీ మేనేజరు. మొదటి కుమారునికి రాధాకృష్ణ అని పెట్టాడు. రెండోవాడికి బుద్ధిమతీ విలాస్ అన్నాడు. మూడోవాడిని గులేబకావలిఅన్నాడు. ఇంక పుట్టబోయే పిల్లలు హరిశ్చంద్ర, బొబ్బిలీట.

*　　*　　*

కవితాసామాగ్రి బందరులో చౌకగా దొరుకుతుందని ప్రసిద్ధి. అమ్మలపాదలు, అనటికంబములు, హైమకుంభములు, నవమృణాళములు, కిసలయములు, చామరములు, సింగిణులు, తిలప్రసవములు, మదనశంఖము మొదలైన వస్తువులు పూర్వమునుంచి కవులకు అమ్మటం ఆచారం. ఇపుడు ఒక కవికుమారుడు దేవలోకంలో పురమాయించి తెచ్చిన మాంచి బండిచక్రముల వీధివీధుల వాడవాడల తిరిగి అమ్ముతున్నాడట. రమణి పిరుదులకు వుపమానముగా తీసుకొంటానికి బండిచక్రముల మాంచి మనోజ్ఞమైన వస్తువులని నిర్ణయించారు వారు.

*　　*　　*

తెలుగులోజయంతి. ఇంగ్లీషులో త్రివేణి ప్రచురించిన వారే అరవము, కన్నడము, హిందీ, తురకం, మరాటీ, మహారాష్ట్రం, ఫ్రెంచి, జర్మన్, మొదలైన చెప్పనీ భాషలలోను పత్రికలు పుట్టించి ప్రచురించి జ్ఞానతేజస్సును బందరు పరిభూములనుండి నలుదిక్కులకు పంపుతారని అంతా అనుకొంటున్నారు.

*　　*　　*

హిందూదేశమునుండి ఎవరో ఒక మహాకవి అమెరికాకు వస్తారుట. అక్కడనున్న పైస్ అనే మహాకవయిత్రిని వివాహం చేసుకుంటారుట. అమెరికాఅంతా ఆహిందూకవిని సన్మానించటానికి 2 మిలియనుల డాలరులు పోగుచేశారు. అమెరికా అంతా యీవిషయము విని అట్టుడికిపోయినట్లు వుడికిపోతున్నదిఅని నాకు మొన్న మొన్న క్రొత్తగావచ్చిన ఒకమిసెసరీ చెప్పినాడు.



# *ఆవర్తనము.

ఇంద్రగంటి నాగేశ్వరశర్మగారు.

౧

కేళీవనాంతర ♦ కేళికాసరసిలో
దళుకొత్తునత్తమ్మి ♦ తరుణివోలె
సహకార ఫలరసా ♦ స్వాదనానంద ను
ర్రీమించు నల రాచ ♦ చిలుకవోలె
శారద శర్వరీ ♦ చంద్రికాలోకాన
వసుగువారెడు చకో ♦ రాకివోలె
చిగురాకు కెరటాల ♦ చెలువొంది మించెడు
మధుర సౌరభ పుష్ప ♦ మంజరివలె

విమల బృందావనాంతర ♦ వీధిలోన
సమధికానంద సంతత ♦ సౌఖ్యవశత
ప్రణయ పులకితసయి నీదు ♦ పజ్జజేరి
పాడెదను మురళీధర, గో ♦ పాలకృష్ణ!

మాటలో తలపులో ♦ పాటలో చేతలో
గోపాల నిన్నెంచు ♦ కోనెడిదాన
నిదురలో కలలలో ♦ నిత్యంబు రేలలో
నినె మది ధ్యానించు ♦ కోనెడిదాన
సెలయేటి కెరటాల ♦ చిరుగానమున నైన
వేణుగానంబు నే ♦ వినెడుదాన
ప్రకృతిలో నెల్లెడ ♦ ప్రణయ యేళ నీరూపె
కలవుదీరగ కండ్ల ♦ గాంచుదాన

నీవు తోడిదెగా నాకు ♦ నిఖిల జగము
అయిన నా మ్రోల నీవున్న ♦ యెపుడునన్ను
గాంచుచుగాని మాటాడి ♦ గాంచుగదా కి
మురళీధర శ్రీకృష్ణ నీ ♦ మ్రోలనుంచి.

౩

కంటకావృతమైన ♦ కానడవినైన
తూలలో నైన యింకా ♦ గాలిలో నైన
కాళి గాత్రులనైన ♦ కారెండనైన
వలపూర చలమూర ♦ పరునెత్తిపోదు
ఓ శ్యామసుందరా! ♦ ఓ నటరాజ!
నినుగవేషించెదు ♦ నిముసాలలోన
దరిజేరగా లేని ♦ త్రపయొందు నన్ను
నీ దయంత నీవు నా ♦ నెలవున జేర
గళమును బంధించె ♦ కదునిర్దయాతను
నీ మధురాధర ♦ నిర్గతస్మేర
రుచితంపుటలలలో ♦ రోమాంచమయింది
వెర్రినై యువతనై ♦ వివశాత్మనై ని
న్గాంచుటయేగాని ♦ కలకను దేవ
మనసార నీతోడ మాటాడనైతి
నీ ప్రేమ పూరిత ♦ నేత్రవిద్యుములు
భవదీయ సుందర ♦ భాగ్యరేఖలును
నీ శిరీషకుసు మ ♦ పేశల సద్యశ
సర్వాంగకములును ♦ సారెసారెకును
నా కన్న కొలకుల ♦ నాట్యమాడంగ
నెమ్మేను మఱచియు ♦ నేనుండు కతన
మనసార నీపూజ ♦ మఱచిపోయితిని
మనసార కొనియాడ ♦ మఱచిపోయితిని.

* ఒకటవ భాగము మొదటి సంపుటమున ప్రచురించబడినది.



# గ్రంథవిమర్శన.

93. కాంతాపహరణము (సాంఘిక నాటకము)

గ్రంథకర్త:- పుల్లేటికుర్తి కృష్ణమాచారిగారు, డెమ్మి సైజు 168 పుటలు వెల రు 1-8-0 ప్రకాశకులు:- వేగుజుక్క గ్రంథమాల, పూడిపెద్దివారి వీధి బరంపురం, గంజాం జిల్లా

ఇది హాస్యరస పూర్వకమైన గ్రంథము. సాంఘిక లోపాల్ని ముఖ్యముగా మద్రాసు జీవితాన్ని విమర్శిస్తోంది. గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కం ఛాయలు అక్కడక్కడ కన్పించినా ఆగ్రంథంతో పోల్చిచూస్తే హస్తిమశకాంతర భేదం వుందని తోచకమానదు. ఈగ్రంథము వలన సంఘానికి మేలు కలుగుతుందో, కీడు కలుగుతుందో ఆలోచనీయం. ఎందువల్లనంటే చెడు త్వరగా అబ్బుతుంది కాని మంచి అంటుకోవడం కష్టం.

94. వీరఛత్రసాల్ (ప్రథమఖండము)

గ్రంథకర్త:— కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు. ప్రకాశకులు:— శ్రీ లక్ష్మీనరసింహా గ్రంథనిలయము, మచిలీపట్టణము, క్రౌను ఆక్టేవో 266 పేజీలు, వెల చందాదారులకు 0-12-0. ఇతరులకు రు 1-4-0.

బుందేలుఖండ స్వాతంత్ర్యచరిత్ర యిందు వివరింపబడినది. రామచంద్రవర్మగారి హిందీగ్రంథమున కనువాదము.

95. భల్లాణచరిత్ర

ప్రకాశకులు:- శృంగార గ్రంథమాలవారు, పోష్టుబాక్సు 110, మద్రాసు.

ఇదియొక ద్విపదకావ్యము. కృతికర్త చితారు గంగాధరకవి. ఈతడు పెనవెళ్ళగ్రామ కాపురస్థుడట. శివభక్తుడై యుండి యుండనోపును.

"సింధుకటకాధీశుడగు భల్లాణరాజు చరిత్రమిందు వర్ణితమైనది భల్లాణుడు శివభక్తాగ్రేసరుడు. జంగము లేదియడిగిన లేదనక ఇచ్చుటకు దీక్షబూనినవాడు. ఇతని భక్తిని బరీక్షించుటకై శివుడు విట జంగముడై యితని యొద్దకువచ్చి సంభోగార్థము వేశ్యనుగూర్చి కోరినాడు. శివుని మాయచే వేశ్య యొక్కతెయైనను బట్టణమున లభింపమిచే దనపత్నినే వేశ్యనుగా నా జంగమున కర్పించినాడు రాజు. శివుడాతని దీక్షకును, తెగువకును, భక్తికిని మెచ్చి యాతనికి సాయుజ్యము నొసగినాడు" అని కథాసంగ్రహము పీఠికయందు కలదు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణము నాధారముగా నిడుకొని కవి యీగ్రంథమును రచించి యుండవచ్చునుగాని యీరెంటిని పోల్చి చూచుటకు వీలు లేకున్నది. ఉచిత పదప్రయోగమునందును, రసపోషణము నందును యీగ్రంథము చాల వెనుకబడియున్నదని చెప్పక తప్పదు.

"పోసైన" "తరిగైన" మొదలగు ప్రయోగములు గ్రంథమునందనేకము లున్నవి. లంజవాడలోని సరసములను వర్ణించుపట్టుల విరసమే విచ్చలవిడిగ నున్నది. కథా పఠనమువలన భక్తియు, ముక్తియు లభించునేమో కాని రక్తిమాత్రమిందు మాకగపడుటలేదు.

కవి సింసుడైనను, కవిత్వము లోపభూయిష్టమైనను, యీగ్రంథము శృంగార గ్రంథమాలవారి ప్రచురణమగుటచే ఫైదరువైటు కాగితములపై చక్కగ నచ్చొత్తింపబడి ముచ్చటగ బైండు చేయబడినది దీనివెల రు 2 లు.

(ని. క. సం.)

96. శృంగార సావిత్రి.

శృంగారగ్రంథమాలవారి ఆరుదవ కుసుమము. కర్త తంజావూరు రఘునాధరాయలు. వెల రు 2 లు,

ఇదియొక చక్కని ప్రబంధము. కథాభాగము తెలియనివారుండరుగనుక దానినిచట వివరించుట యప్రస్తుతము. రఘునాధరాయలు ఆంధ్రుడు. చోళరాజ్యమును తంజావూరు రాజధానిగ 1650 ప్రాంతముల నేలి పండితాదరణకును, దానధర్మములకును ప్రఖ్యాతిజెందినవాడు. ఈయన మహాకవికూడను. రామాయణము, వాల్మీకి చరిత్రము, పారిజాతాపహరణము మొదలైనవి తెలుగునను, రామాయణసంగ్రహము, సంగీతసుధ మొదలయినవి సంస్కృతమునను రచించెను. ఈయన రచించిన రామాయణమును, మధురవాణియను వేశ్య సంస్కృతమున బరివర్తించెనట. శృంగార సావిత్రియనగనే పరమ పతివ్రతయగు సావిత్రి జీవితమును వర్ణించుటలో బయల్పరచగలుగు శృంగారమేముండునని సందేహము కలుగకమానదు. మేనకయను వేశ్యను ప్రవేశపెట్టిన కథాసందర్భములో శృంగారముత్పన్నము కాబడినదికాని వేరొండు లేదు భక్తిమార్గము మృదుమధురశైలిలో వర్ణింపబడినది. ఇందలి హాజూరు సాహెబూ నజీరు వుమరు మొదలగు పదములు అన్యదేశ్యములు. 72 పేజీలోని "తచ్చి

తురకవు" అను పదము సంస్కారణయోగ్యము. ఈవిధముగ మరుగుపడిన గ్రంథములను ప్రాశస్త్యములోనికి దెచ్చుచున్న శృంగార గ్రంథమాలవారు ప్రశంసాపాత్రులు.

## 97. ప్రభవ (ఖండకావ్యము)

గ్రంథకర్త:- శ్రీరంగం శ్రీనివాసరావుగారు. కవితాసమితి. ప్రకాశకులు:- కవితాసమితి, విశాఖపట్టణము, వెల రు 0-8-0.

ఆంధ్రభారతీ పాఠకులకు శ్రీనివాసరావుగారి పద్యములు క్రొత్తవికావు. వారి పద్యములను విడివిడిగ గాంచినపుడు కొంత వినువు జనించెడిది, కాని వారి పద్యములను సంపుటీకరించి గ్రంథముగ ప్రచురించినపుడు పఠించినచో మానవజీవిత పరిణామమును ప్రకృతి లక్షణములతో నెంత రమ్యముగ పోల్చినదియు తెలియగలదు. మానవుని ప్రజ్ఞ నీక్రిందివిధముగ వర్ణించిరి

"నా నిజప్రజ్ఞ కొన్నము! నే నపూర్వ మానవాతీత తేజః ప్రభుపరీత శక్తిగల్గిన చండశాసనుడ నిజము! కాని నన్ను సృజించి నాగతులు నడపు ఘను డతీతతగుండొకొక్కరుడు గలడు!"

చివర మతస్వీకృతి అను చిన్నికథను పద్యరూపముగ వివరించిరి.

## 98. బొంబాయి ఆంధ్రుల సంఘము. రెండవ సంవత్సర నివేదికము.

బొంబాయి ఆంధ్రసంఘమువారి 1927—28 నివేదిక చాల సంతసము నొడగూర్చుచున్నది. కులవర్ణ రాజకీయ సాంఘిక విభేదములను గమనింపక ఆంధ్రులందరిని గౌరవించే సంఘ మిది యొక్కటే. తమవారిని తాము గౌరవించుకోలేని ఆంధ్రరాష్ట్రవాసుల కిది కొంతయు మార్గదర్శకముగ నున్నది. వీరు కావించు మహాకార్యములలో పేర్కొనదగినవి రెండు కలవు. కొన్నిలక్షల ఆంధ్రులు నివసించుచున్న బొంబాయి రాజధానిలోని విశ్వవిద్యాలయమువారిచే ఆంధ్రభాషనుగూడ దేశీయ భాషలలో నొకటిగ చేయ నాందోళన చేయుట, రెండవది రెవరెండు హెరాన్‌గారి ఆంధ్రచరిత్ర పరిశోధనమునకు దోహదమొసంగుట. ఈ రెంటియందును విజయము కల్గినచో ఆ గౌరవము బొంబాయి ఆంధ్ర సంఘమువారి దనుటకేమాత్రము సందియములేదు.

## 99. నూజవీడు స్వాభివర్థనీసంఘమువారి ప్రచురణములు.

గ్రామ పునర్నిర్మాణము, గృహ పరిశ్రమలు, ప్రజారోగ్యము పరిశుభ్రత అను మూడు కరపత్రములను కృతజ్ఞతతో నందికొంటిమి.



# వృక్షవర్ణములు.

ఆవంత్స వేంకటరంగారావుగారు బి. యె.

వంతతము భూసురులకెల్ల సహజమైన
విమల తేజస్సు మేన దీపించు కతన
చెట్లలో శ్రేష్ఠములు రావి చెట్లుగాగ
జువ్విచెట్టులు వైశ్యులో సుజనులార!
రమ్యపాలాశ వస్త్రధారణముచేసి
శాతశరవాల పాళి హస్తములబూని
క్షత్రియుల పోలె శౌర్యము జాటుగాన
రాచవారు వృక్షముల తురాయి చెట్లు.
అచ్చటచ్చట మార్గ మధ్యమ్ములందు
సంగడులు వెట్టి విపుల కాయములతోడ

సవడసుల వర్తకము చేసి బ్రతుకు కతన
చెట్లలో కోమటులు మర్రిచెట్లు కావె.
జీవనము అంపములతోడ నీయుగాన
తాడిచెట్లు వడ్రంగులు తనులలోన
కరములలవిత్రములు పూను కారణమున
చింతచెట్లను కాపులు చేసె కవిత.
నిశిత కంటక కీర్ణపనిసిలకాయ
రాజి నస్పృశ్యములయి పర్యంత భూము
లందు జీవించి సంతాపమందుగాన
తుమ్మచెట్లు పంచములు గాదె చూడ.

# వివిధవిషయములు

## జపాను దేశపు స్త్రీ.

జపాను దేశమున వధువునకు నేడు వివాహ మనగా ఆమె తల్లి పండ్రెండాజ్ఞల నీవిధముగ బోధనచేయును.

1. అమ్మాయీ! వివాహానంతర మీవు మాదానవుకావు. ఇప్పటివరకును మాయాజ్ఞలలో నెట్లు మెలగితివో అట్లే ఇకపై నీవు అత్తమామలయాజ్ఞలతో మెలగవలయును.

2 నీపై నీభర్తకు సంపూర్ణాధికారముండును. అతనియెడ నీవు వినయముగ మెలగవలయును. భర్తయానతి శిరమున ధరించుటయే భార్యకు పరమధర్మము.

3 నీవు మీఅత్తను తల్లితో సమముగ భావింపుము

4. భర్తవలన నెప్పుడును సందేహింపకుము. ఒకవేళ భర్త తప్పుదారిబడినను అలుకచెందకుము. ఓరిమి దాల్పవలయును. అతడు నీయెడ ప్రసన్నుడుగ నుండునప్పుడు నీవు మృదుభావముతో నతనిదోష మెరుగజేయుము.

5. మితభాషిణివై యుండుము. ఇరుగుపొరుగువారితో నసంతుష్టివాక్యము లాడకుము. అసత్య మసలే పలుకజనదు.

6. నిత్యముప్రాతఃకాలముననే మేల్కాంచవలయు. రాత్రి అందరు పరుండినవెనుక నిద్రింపుము. పగలెన్నటికిని నిద్రపోవలదు.

7. ఏబదిఏండ్ల వయస్సు పూర్వము ఏసామాన్యసభలోగాని, సార్వజనీన కార్యమునగాని పాల్గొనకుము. జనసమూహమునడుమ పోరాదు.

8. సాముద్రికునకు నీచేయి యొసగవలదు.

9. ఉత్తమరీతి నింపుము. గృహకృత్యముల నెంతయు మితవ్యయముగ గావింపుము.

10. యౌవనప్రాయమున వివాహమైనను యువకులతో నధికసంసర్గము జనదు!

11. నీవేష మాడంబరముగ నుండరాదు.

12. తండ్రివంశమునకుగాని ధనమునకుగాని యహంకారము వహింపరాదు.

13 ధనికురాలవైనను అత్తగారింట తండ్రి ఐశ్వర్యమునుగూర్చి గర్వోక్తులు పలుకజనదు.

## ఆఫ్ఘన్ దేశము.

మహమ్మదీయులలో శాస్త్రప్రకారము ఒకరికంటె హెచ్చుమంది భార్యలుండవచ్చును. భాగ్యవంతులకీ నియమము బాగుగా ననుకూలించుచున్నది. కాని ఆఫ్ఘన్ దేశపు రాజగు అమానుల్లాగారు ఒకరుకంటె నెక్కువమంది భార్యలుండరాదని శాసించిరి. దీనికి కారకురాలు రాజుగారి భార్యయగు సౌరియారాణిగారని తెలియుచున్నది, ఈమె తన పలుకుబడిని వినియోగించి పర్దాపద్ధతిని తొలగించినది. ప్రభుత్వ నవుకరీలోనున్న వారెవరైనా యీనియమము భిన్నముగ నడిచేయెడల, తాము తమ వుద్యోగములను వదులుకొనవలెను. త్రాగుడు కూడ మాన్ప తీవ్ర ప్రయత్నములు జరుగుచున్నవి.

## పంజాబు మెయిలు

బొంబాయినుంచిడిల్లీకిపోయే పంజాబు మెయిలు 21 గంటలలో ప్రయాణము పూర్తిచేసెనట. ఇంతవేగముగను, ఆలస్యము లేకుండగను

 

ప్రయాణముచేయు రైలు మరియొకటి హిందుదేశములో లేదట.

క్రూరమృగముల వలన మరణములు.

1926 లో క్రూరమృగములవలన 1962 మంది చనిపోయిరి. తోడేళ్ళవలన 465 మందిన్ని, చిరుతపులులవలన 218 మందిన్ని, ఎలుగుబంట్లవలన 78, ఏనుగులవలన 56 మందిన్ని, మరణించిరి. 1927 లో క్రూరమృగముల వలన చనిపోయినవారి సంఖ్య 2235 ఇందులో 1033 మంది పెద్దపులులచే చంపబడిరి.

గొప్ప దావా.

డుమ్రాం రాజ్యపు దావాకు రు 32,50,000 ఖర్చుఅయినది. నాలుగు వారములు విచారణ జరిగెను. వకీలుచేసిన న్యాయవాదుల సంఖ్య 20, అందులో ఒక న్యాయవాదిని ముందుగ మాటాడి అవసరమైనప్పుడు వచ్చునట్లేర్పరచినందుకు (Retaining fee) రు 40000 ల వంతునను పనిచేయు దినములలో రోజుకు రు 1500 వంతునను ఫీజు ఏర్పాటు చేసుకొనిరి. చివరకు రాజీ జరిగి దావా రద్దు చేసికొనబడెను.

మరణ సంఖ్య.

వంగ రాష్ట్రములో సంవత్సరమునకు 15 లక్షలమంది మరణించుచున్నారు. ఇందులో సగముమంది పదిహేనేండ్లకు లోపువారు. కలరావలన చలిజ్వరమువలన నాలుగు లక్షల తొమ్మిదివేలమంది చనిపోవుచున్నారు. అజ్ఞానముచేతను, ముందుగనే జాగ్రత్తపడకను యింత మందిచనిపోవుచున్నారని బెంగాల్ పబ్లిక్ హెల్తు డైరక్టరుగనున్న బెంట్లీగారు తెలుపుచున్నారు.

కోటీశ్వరులు.

సర్ జార్జి విల్సు అను నాయన చనిపోవు చున్నను కుటుంబమునకు 14 కోట్ల రూపాయల ఆస్తినిచ్చెను. ఇవి ప్రభువు 15½ కోట్లనిచ్చెను కలకత్తాలో వర్తకముచేసి మొన్న మొన్ననే మరణించిన సర్ డేవిడ్ యూలు అను నాయన 23 కోట్లు గడించియిచ్చెను. ప్రస్తుతం ఇంగ్లాండులో భాగ్యవంతులు క్రింద వివరించుచున్నాము.

| | |
|---|---|
| ప్రాత్ కోనావ్రిగ్లీ | 8½ కోట్లు. |
| సర్. ఆర్. హౌర్షర్ | 8½ కోట్లు. |
| హెచ్. ఒ. విల్సు | 7½ కోట్లు. |
| ఎఫ్ ఎన్. హెచ్. విల్సు | 7 కోట్లు. |
| నార్తుక్లిఫ్ ప్రభువు | 7 కోట్లు. |

గాయములు.

1927 జూన్ 30 తో అంత్యమైన సంవత్సరములో నానా మృగములచే హింసింపబడిన వారి సంఖ్య యీక్రింద వివరింపబడినది.

| మృగము. | మొత్తము గాయములు తగిలినవారిలో 100 కి. |
|---|---|
| 1 పులులు | 83.41 |
| 2 సర్పములు | 14.39 |
| 3 తోడేళ్ళు | 16.00 |

ఓడలు.

ఈ సంవత్సరము జనేవరి 1 మొదలు జూలై 1 వరకు సూయజ్ కాలువగుండా 2230 ఓడలు ప్రయాణముచేసెను. 1927 లో నీ కాలములోనే 2918 న్ని 1926 లో 2639 న్ని తిరిగినవి.

సూక్ష్మదృష్టితో పరివరిస్తూ తమకు రానున్న ఆపాయాలను యిట్లు కనిపెట్టి తప్పించుకుంటవి. శత్రువులు ఎవరన్నా కనపడ్డప్పుడు తమ తలలను యిసకలో దాచుకొని శత్రువులను తాము చూడడం లేదు కనుక శత్రువులుకూడ తమను చూడజాలరని అనుకుంటూవుంటవి. ఇది సామాన్యంగా ఎడారులలో నుంటవి.

ఆహారపదార్థములు.

కోతులు;— వీటిని చైనావారు తింటారు. సింహళంలో వెడ్డాస్ అనే జాతివారు వీటిమీదనే ఆధారపడి వుంటారు.

నక్కలు;— పరిశ్రుతి అనే మ్యునిసిపాలిటీకి నక్కలనేవి పాకీవాళ్ళు, కనుక వీటిని తినకూడదంటారు. కొన్నిదేశాల్లోని పక్షులు నక్కమాంసాన్నే తింటాయి. నక్కలు మనిషిమాంసం కోసం మెదురుచూస్తుంటాయి. కొన్నిదేశాల్లో నక్కమాంసాన్ని జబ్బువాళ్ళకు మందుగా వుపయోగిస్తారట.

పిల్లులు;— 1871 లో ఫ్రెంచివారికిని జర్మనీవారికిని జరిగినయుద్ధంలో ప్యారిస్‌నగరాన్ని ముట్టడించారు. ఆముట్టడి సమయమందు 5000 పిల్లులు తినబడెనట. వీటియొక్క మాంసం, కుందేళ్ళు, ఉడతల మాంసంకంటె యెక్కువ మన్నితంగా నుండి, యెక్కువ రుచికరంగా వుంటుందట.

ఎలుగుబంటి;— ఎలుగుబంటి మాంసాన్ని యిరోపాఖండంలో మందుక్రింద వుపయోగిస్తారట. నార్వే, రష్యా, పోలండు దేశములవారు దీనిని తింటారట గాని జీర్ణించుకొనుట చాలా కష్టమట. ఈమాంసాన్ని ఉప్పుతోకలిపి యెండబెట్టి తరువాత వండుతారట.

ఎలకలు, పందికొక్కులు;—

మదాసు రాజధానిలో వీటిని తినేవారున్నారు. వీటిమాంసం కొన్నిపక్షుల మాంసంతో సమాన రుచికరంగా వుంటుందట.

గబ్బిలము;— వీటిని అనేకమంది తింటారు.

గుఱ్ఱము;— అమెరికను ఇండియనులు గుఱ్ఱ మాంసాన్ని భక్షిస్తారు 1864 లో ప్యారిస్ నగరమందు ఒకమీటింగు చేసి యికనుంచి గుఱ్ఱ మాంసాన్ని తినాలెనని తీర్మానించారట. అందుకోసం 1886 లో గుఱ్ఱం మాంసము తీయటానికి మొదటి కసాయి దుకాణం ప్రారంభించారట. ప్యారిస్ ముట్టడి సమయంలో (65000) అరవై అయిదు వేల గుఱ్ఱాలను చంపి తిన్నారట. ఇంగ్లాండునందు 1868 ఫిబ్రవరిలో బిక్నెల్‌గారి అధ్యక్షతక్రింద జరిగిన విందుభోజనంలో గుఱ్ఱం మాంసం ఉపయోగించారట ఒకప్పుడు రోమను దేశస్థులు గాడిదమాంసం తిన్నారట. పర్షియా దేశస్థులు అడవిగాడిద మాంసాన్ని చాలా గొప్పగా భావిస్తారట.

ఏనుగలు— ఆఫ్రికాలోను ఇంగ్లాండులోను ఏనుగమాంసం తినేవారున్నారు. డాక్టరు లివింగుస్టన్‌గారిట్లు వ్రాసియున్నారు.

"ఏనుగకాలు కోసి వండిన మాంసం తిన్నాము. చాలారుచికరంగా వుంది. ఈమాంసం తినేవారు కడుపు బల్ల పెరగకుండా మాత్రం జాగ్రత్తపడాలి. ఏనుగ శరీరములోని మాంసము నాలికలోని మాంసం, ఎద్దు, గేదె మాంసములంత రుచికరముగా వుంటుంది. తక్కినభాగములలో వుండే మాంసము ఎవడో మరీ ఆక

లిగా వుండేవాడు తినవలసిందేగాని అందరూ తినదగినంత రుచికరంగా వుండదు."

పాములు:— వీటిని చైనా వారున్నూ, ఆస్ట్రేలియావారున్నూ తింటారు. వీటియొక్క చర్మాన్ని ఒలిచివేయటానికి ఒకతమాషాపద్ధతుంది. కొబ్బరిచిప్పకొక రంధ్రంచేసి పాముతోకని ఆ రంధ్రములో దూర్చి ఎత్తైన స్థలములో కూర్చుని ఆ కొబ్బరి చిప్పను రెండు కాళ్ళ సందున అదిమిపట్టి ఆ తోకను ఇటునటూ లాగవలెనట. ఈ పద్ధతి కంసాలి తీగను కమ్మెచ్చులో పెట్టి లాగినట్లుంది. ఇట్లు చర్మం ఒలచబడిన పామును ముక్కలు ముక్కలుగా తరిగి బంగాళా దుంపను వేయించినట్లుగా వేయిస్తారట. కొంతమంది పామును ఊరగాయగా పెడతారట.

వేదపురుగులు:— నీచజాతులవారు వీట్ని తింటారట వీటిని బియ్యపు పిండితో వుడకపెట్టి వుప్పుకారం కలిపి వుండలు వుండలుగా చేసి తింటారట. ఇది యించుమించు చల్లిపిండి మాదిరి వుంటుంది.



## సాధువు—శ్రీ రామకృష్ణ పరమహంస.

మల్యాల వేంకటశేషగిరిరావుగారు.

తే॥ గీ॥ దక్షిణేశ్వరుగుడిదరిఁ ♦ దావుజేరి
సాధువొకఁడుండె నాదేవు ♦ సన్నిధాన
పిలువ బలుకఁడు నెవరికి ♦ బేర్మినైన
రాఁడుఁ జూడఁడు బ్రజల నా ♦ వ్రతిత తపసి.
కావి వలువలచే గప్పి ♦ కాయమెల్ల
మౌన రూపము దాల్చి యా ♦ మునివరుండు
నలువు ధ్యానంబు రేబవల్ ♦ శాంతమతిని
కాల మీరీతి తపమునఁ ♦ గడుపు నతఁడు.



అంత నొక్క దినంబున ♦ నంబరమున
మేఘము లలముకొనియెను ♦ మిక్కుటముగ
చిత్రమై దోచ వినువీధి ♦ శీకటులను
మునిగె బ్రహ్మాండ భాండము ♦ పూర్తిగాను.
అట్టి తరిని కాల వనిత ♦ పట్టఁబట్టి
ఏమి సంభవించునో యని ♦ యెంచుచుండ
గాలి యేతెంచె నంత దు ♦ ర్ఘటముగాను
అంతలోనె మేఘములన్ని ♦ యంతరించె

ధవళ ఛత్త్రంబు దాల్చెను ◆ ధరణివనిత
విశ్వమెల్లను నిండెను ◆ వెల్గుతోడ
బయటకును బోయి చూచ యోగి ◆ పైకి జూచి
పక పక, నగి గంతులిడుచు ◆ పదుగులిడుచు
నాడఁ జొచ్చెను ప్రజలెల్ల ◆ గూడి జూడ.

◆ ◆ ◆

అంత శ్రీరామకృష్ణుఁడు ◆ నచటి కరుగు
దెంచి "యిదియేమి చోద్యము ? ◆ దివ్యపురుష !
బయట కెప్పుడు రాక దే ◆ వళయమునుండు
నీవు తన్మయత్వము జెంది ◆ నేడిఁదేల
తాండవం బాడుచుంటివి ◆ తపము మాని ?
నీదు యాట లనర్థంబు ◆ సాదరమున
నెఱుఁగఁ బల్కవె యానంద ◆ మెనఁగ మెనఁగ"
అని వచింప సాధువప్పుడు ◆ "అయ్య ! ఏమి
జెప్పఁగన్నిక నీతుచ్ఛ ◆ జీవి, మాయ
చేత గప్పబడుచునుండె ◆ చిత్రముగను
మాయ నా జీవి యామేఘ ◆ పుంజమట్లు
గనుటలేదె ? యొక్క త్రుటిలో ◆ ఘనఘనంబు
ప్రాకు నాకసమంతయు ◆ రజనియాలము,
తరలి పెద్దపవన మొందు ◆ దాని వెంట
చెదర గొట్టెను మేఘముల్ ◆ చీలిపోవ
మంట గలసెను నల్లని ◆ మబ్బులెల్ల
తెల్లనయ్యె ప్రపంచము ◆ తేటపడఁగ
గంటి మెప్పటి యట్ల నా ◆ గగన వీధి
యటులె యీమాయ గప్పి ◆ యంతసేపు
వదల దెంతయునైహిక బంధమకట
ఆరయ లేమావరాత్పరు ◆ ననఘునసిన"
సాధువాక్యముల్ విని చాల ◆ సంతసిల్లి
జ్ఞాన మార్గము దెలిసి యా ◆ జ్ఞానమూర్తి
తరలిపోయెను దన త్రోవ ◆ దక్షిణంబ ॥



# మరచిన దేమిటి?

శిస్ట్లా వెంకటరామమూర్తిగారు బి.ఎ. బి.ఇడి.

బందరునుంచి కన్యాన్వేషణకోసము వచ్చిన స్నేహితులతో కలసి ఆవేళ సాయంకాలము నేనూ పంతులూ షికారు వెళ్ళేము. పంతులు నాదగ్గరేమీ రహస్యాలు దాచుకోడనే గర్వము నాకు బాగా వుంది. దాచుకోలేడు. ఎప్పుడైనా వీలుచూచుకొని దెప్పుతూండేవాడినికూడాను అతని వెల్లడితనానికి. అయినా చెప్పడము మానలేదు. తన మనోవేదన తీర్చుకోడానికి యిదేమార్గమని అతని వుద్దేశము. హృదయము పడే మహా ఆలోచనల కలవరముతో సానుభూతి చూపగల మరొక హృదయముకోసరమూ వెతుకులాడటము నైజము. అల్లాంటి మహాహృదయము నాదని నా స్నేహితుడికి బాగా తెల్సు. నాకు రాజమండ్రి బదిలీ అయినతరువాత పంతులు రావడానికి అదే మొదటిసారి, ఆ షికారంతా మేమిద్దరమూ ఒకటేమాటలు. తృప్తితీర స్నేహితులంతా గోదావరి ఒడ్డుకి పోదామంటే చాలామంది వుంటారని మ్యూజియం వైపు బయలుదేరాము. పోస్టాఫీసుదాటేం. ఎదురుగుండా యెవరో అమ్మాయి పిల్లాడినెత్తుకుని వస్తూంది. అందరమూ చూశాము. ఎంతో అందమామెలోంచి మెరుస్తూంది వలిపేబడ్డ పువ్వులా సుకుమారము వికసిస్తూంది. ఆమె దృష్టి పంతులుమీద పడిందని అందరమూ గ్రహించాము. పంతులు మా అందరిలోకి చిన్నగా, సన్నగా, అందంగా వుంటాడు. అంచేత అని మిగిలినవాళ్ళు అతని అదృష్టాన్ని యెగతాళిచేస్తూ మ్యూజియం మలుపు తిరిగారు. ఆమె దృష్టిలో మామూలుచూపు కాదని నేను గ్రహించగలను. అది చనువుతో చేరినసిగ్గు పలకరింపులో ప్రశ్న మొగము వాడిపోయింది. ఆ ముఖములోకి యెక్కడ లేని భీతి, అనుమానము, ఆవేశము, అన్నీ నిర్మలమైన ఆకాశములో మూగిపోయే మేఘాల్లాగు క్రమ్ముకువచ్చేయి. అవి అన్వయించాలి. మా స్నేహితుని మోము చూశాను. అతని ముఖమూ మారింది. అతడాదిక్కే చూడ్డములేదు. అతనిలో ఆవేళ సంతోషానికి తావులేదని నాకు తెలుసు. ఇది చాల క్రొత్తగా కనిపించింది. ఆమెసంగతి నాకు యిదివరలో చెప్పలేదు. ఆమెతో యితనికే పూర్వపు పరిచయముంటే చెప్పకుండా వుండడము అసంభవము. కాక యేదో ప్రణయ కలవరముంటే యిలాంటి సందర్భాల్లో అందరికన్నా హెచ్చుగా విఱ్ఱవేస్తూ అనందించేవాడు, ఏ ఆడదాని కళ్ళయినా అప్రయత్నముగా తనమీద పడి మరల లేకుండావుంటే,

అప్పటికి మేమిద్దరము మాట్లాడుకోలేదు. ఆరాత్రి యింటికిపోయేక అతనికి నిద్దురరాని ఆవేశములో నన్ను పిలిచి నీతో యింతవరకూ చెప్పనిసంగతి వొకటివుంది. చెప్తాను విను అన్నాడు.

ఆమెను గురించే అని నాకు తెలుసు. "ఇందాకా మనకి కనబడ్డాదే షికారుకుపోయినప్పుడు, ఆపిల్లపేరు శారద మాకు కొద్దిగా బంధువు. నేను బి. ఎ. పరీక్షకు పరదాకా స్నేహితులతో వుండాలని బందరులో చదువుకొన్నా యీవూరే కట్టేను. పరీక్షలకివచ్చినప్పుడు వాళ్ళింటిలోనే మకాముచేసేను. నాకు అక్కడ భోజనము చెయ్యడానికి మనసు పొయ్యేదికాదు. ఏదో మిష పెట్టి హోటలులో చేసేవాడిని. ఇంటికి వెళ్ళినప్పుడు భోజనానికి లెమ్మంటే యేవేవో సాకులు కల్పించేవాడిని. స్నేహితులింటికి వెళ్ళానని, హోటలులో నిర్బంధించారని, ఎవరెవరో హోటలుకి తీసుకువెళ్ళారని. ఎప్పుడూ నన్ను పిలవడానికి యీశారదే వచ్చేది. అప్పటికామె రజస్వలయిందికాని కాపురంకాలేదు, యౌవనములో పొంగుగా మిసమిసలాడుతూ యింతకన్నా యెన్నోరెట్లు అందంగా కనపడేది. అప్పుడే సిగ్గు ముడుతలువిడిన పువ్వురేకుల్లాగు నవనవలాడుతూన్న అంగాలు కదుపుకుంటూ వచ్చినప్పుడల్లా యేవో క్రొత్త రంగులు వారిపొడుగునా విరజల్లుతూన్నట్లుండేది. ఆమెను చూచిన మొదటిసారే చాలా చిరపరిచితురాలైన ఆమెలా వికసించింది. "అన్నా భోజనానికి లెమ్మంటూంది" చిన్న సిగ్గుతో తలుపు పక్కగా నుంచుని. నేనప్పటికే అల్లుకొన్న మిష యెంతో మొంగమాటంగా మొహమూ వంచేసుకొని చెప్పేటప్పటికి "పోనీ, రాత్రికి తప్పకుండా రండి" అనేది. రాత్రి అంతే. మళ్ళీ మర్నాడు. ఇంక లాభము లేదనుకున్నారు కాబోలు.

"పోనీ, యిష్టమైతే వీలైనప్పుడే" అని నవ్వుతూ చాలా చనువుగా పెంకిగా అంది.

ఆపిల్లని చూచినప్పటినుంచీ యేవో వింతభావాలు కలవరపెట్టేవి. ఆమె యెంత చక్కగా పాడుతుం దనుకున్నావు. నాకు అసలు సంగీతములో అనుభవములేదు. అయినా పాట వినడమంటే వినువుగా వుంటుంది. ఆమె పాడుతూంటే మొదటిసారి నాలో పాటలో కలుగుతాయనే వుద్రేకాలు కలిగాయి. ఆవీణ తీసుకొని రాగము యెత్తుకుంటే అప్రమతిలోని అలలు మెల్లిగా ప్రాకివచ్చి నాక్రమ

అణువులోనూ కలిసిపోయి అల్లలలాడిపోతూన్నట్లు హృదయమంతా కంపమెత్తేది. ఎన్నోసార్లు యీవూళ్ళో వాళ్ళేం వాళ్ళయింటి వీధి గొట్టులోవుండే అబ్బాయిదగ్గరకే వచ్చి సాయంకాలము పూటల్లా కూర్చుంటూండే వారట ఆ పాటవిని ఆనందించడానికి. పరీక్షలైనా శాలోపము ఒకరిద్దరు స్నేహితులువచ్చి సాయంకాలమల్లా యింటివద్ద వుంచేసేవారు నాకెంతో సిగ్గేసేది. అయితే పుస్తకాలన్నీ అరుగుమీదంతా పరిచేసి చదివేస్తున్నవాళ్లకు మల్లే కనపడేవాళ్ళం. ఆపాటలోపము యెదురు చూసే వాళ్ళము. ఆమె గ్రహించునట్లు, సరిగ్గా కనిపెట్టునట్లు పాడేవి తృప్తులనుజేసి పరవశుల మైపోయేలాగు.

ఆమెనుచూడ్డానికీ, ఆమెతో ఆడుకోడానికి ఎందరో పిల్లలు వచ్చేవారు. చిన్నపిల్లలుకూడా. చిన్నపిల్లల్ని దగ్గిరకి తియ్యడములో నాకు చాలా ప్రఖ్యాతివుండేది. ఒకమారు యేమైందా. వాళ్ళ పొరుగింటివాళ్ళపిల్ల చిట్టి అరుగుమీద నుంచుంటే, ఆఅమ్మాయికి మూడో నాలుగో యేళ్ళు. నేనువెళ్లి తీసుకువచ్చేను. అరుగుమీద కూర్చున్నాము. అరుగుదాటితే వాళ్ళ పెద్దహాలు. దానిలోనే యీమె సంగీత కచ్చేరీలు. పిల్లల్ని ముద్దులొలికే నలిపేయడమంటే నాకెంతో యిష్టము. హాలు కిటికీదగ్గరకి వచ్చి గూట్లోకి వంగి రెండుచేతులతోటి యినప బెజ్జాలు పట్టుకుని శారద నుంచునివుంది. నాకెందుకో వెక్కిరిస్తోనట్టు అనిపించింది. ఆమె బెదరినట్టయింది. "చిట్టీ" అని పిలిచింది.

"చిట్టి రాద" ని మరీ గట్టిగా చిట్టిని నాలోకి చేర్చుకుని "నువ్వు వెళ్ళవుకదూ" అని అడిగా శారద వేపు చూస్తూ, సిగ్గులో దాగలేకపోయిన చిన్న నవ్వు ఆ పెదవులమీద నృత్యము చేస్తూంది.

"చిట్టీ, నువ్వు నాదానివికదూ, నీకు తాయిలాలు పెడతాను రావూ"

"రాను" ను అన్నా.

చాలాసేపు మాయిద్దరి ఆతురత చూసి వూరుకుంది. ఆమె ఆకర్షణ హెచ్చైపోయింది. నాకన్న హెచ్చుగా ఆమెకు తను కావాలన్నట్లు ఆముఖములో కనిపెట్టినట్లు "నేను వస్తాన" ని రెండుచేతులూ జాపింది ఆమెవైపు. "తలుపు[illegible], వెళ్ళిపోయి రా" అంది.

"చిట్టి[illegible], నాది, నాకావాలి" అన్నాను. వెంకేతనంగా.

"నాకూకావాలి చిట్టి."

"చిట్టి వెళ్ళటానికి వీలులేద" ని గట్టిగా దగ్గిరగా తీసాను.

"అబ్బా, చిట్టీ" అని గట్టిగా పిల్చింది. చేతి పట్టు వదిలింది. పంపించబోతూ మళ్ళీ దగ్గరకు తీసుకుని "మీవాళ్ళందరిని చూస్తే చిట్టికి భయం"

"మావాళ్లెవరూ లేరిప్పుడు"

కొత్త వికాసముతో యినుపబెజ్జాలకి బుగ్గలని రాస్తూ చిట్టిని వెళ్ళిపోయి రమ్మని కనుసైగ చేస్తూంది. నేను అది చూడనట్లే "నీతోటికూడా ఒంటరిగా ఆ చీకటిగదుల్లో ఉండడానికి భయం మాచిట్టికి."

"చిట్టికి అలాంటిభయాలు లేవు. కొత్తగా నేర్పితే తప్ప. వదిలేయండి వచ్చేస్తుంది!"

వదిలేసా. చిట్టి తలుపు దగ్గరకి పరుగెత్తింది. వెనకాల నేనూ లేచి వెళ్ళా. మీద తువాలు కిందపడింది. శారద తలుపుతీసింది. గుమ్మంలోకి వెళ్ళిపోబోతూన్న చిట్టిని అమాంతం యెత్తుకువచ్చేసా. "ఆ" అని వెగటు మొహము వేసింది శారద.

"చిట్టి నిలా యిమ్మండీ, పాటనేర్పాలి"

నేను లోపలికి వెళ్ళి "యింద అన్నా" నవ్వుతూ వచ్చి "చిట్టీ" అంటూ దూరంనించే ముద్దుతో అందుకుంటూంది. నాచెయ్యి ఆమెకు తగిలింది ఆమె మెత్తని వేళ్ళు తగిలాయి. కొద్దిగా వణికేయి నావేళ్లు. ఆమె పిల్లని తీసుకున్నా యింకా అట్లాగే వుంచాను. ఒళ్ళంతా పులకరించింది. వేడి రక్తము తొందరగా ప్రతి నాడిలోంచి ప్రవహించుతూన్నట్లయింది. ఇంతవరకు ఆపుకున్న వుద్రేకము ఆవేశాత్తో తొందరపెట్టేసింది. ఏం చేయాలి ఆసమయంలో. అప్రియత్నంగా ఆమె రెండు చేతులూ గట్టిగా పట్టాను. చేతులు లాక్కొంటూ జారిపోతూన్న పిల్లని క్రిందకి దింపుతూ "మీచిట్టిని మీరు తీసుకుపొండి" అంది. ధైర్యం హెచ్చింది.

"శారదా, అట్లా దిగులుగా చూస్తావేం"

"నేను వెళ్లాలి, చిట్టినితీసుకు వెళ్ళిపొండి."

"చిట్టి కావాలన్నావే"

"మీ రేమంటారో అని."

"నేనేమంటా మధ్య, నేను వెళ్ళిపోతాలే" అంటూ వచ్చేసా. చూపులు మెల్లిగా మూసేసేలాగ తలుపువేసి చిట్టితో వెళ్ళిపోయింది. అరుగుచివర నుంచొని స్తంభాని ఆనుకున్నా. ఒక కాలు గాలిలో వూపుతూనా

హృదయ వేగముతో సమానంగా. ఇద్దరు కుర్రాళ్ళు నవ్వుకుంటూ వెళ్లిపోతున్నారు. ఎవరో అమ్మాయి "శారదా" అని పెరటి గుమ్మంలోంచి పిలుస్తూ నన్ను చూసి బిడియంగా వెళ్లిపోయింది. స్తంభాన్ని కౌగలించుకుంటూ వెనక్కి చూశాను. ఆ మొహంలో కోపము లేదు. ఎంతో సంతోషము. "నా అందాన్ని అనుభవించి ఆ వెర్రి మొహం మెండకట్టా చెడతావ"ని పలకరిస్తున్నట్లు కనిపించింది ఆ వదనము. మెల్లిగా కిటికీదగ్గరికి వెళ్ళాను. ఇంకా పచార్లే.

"మీ అమ్మేది" అన్నా. "బైటుంది. గోపాల మామగారింటికి వెళ్ళింది." ఇంక నా బాధ గ్రహించుకో.

మర్నాడు శారద ఒకటి రెండుమార్లు పెరట్లో కనపడింది. మాట్లాడించాలనుకొన్నాను. కాని ఏదో వసిగొకటి వచ్చిపడింది. దానికి తోడు భయం. అంతవరకూ లేని యీ కొత్త భయమేమిటో. ఆమె చూస్తూంటే యెవరు అనుమానపడుతున్నారో అని దిగులు. ఇటువైపు అటువైపు చూడ్డము. వంచిన మొహములోంచి రెండు మూడు చూపులు దొంగిలించడము, పెదవులు కొరుక్కోడము యింతే. ఇదివరకు వాళ్ళ అమ్మా వాళ్లముందు ఆమెతో చనువుగా మాట్లాడిన ధైర్యము పోయిందిప్పుడు.

శనివారమునాడు పరీక్షలైపోయాయి. వాళ్లింటిలో కూర్చుని తీరుబడిగా కబుర్లు చెప్పాను. ఆవేళ శారద అమ్మతోటి అమర్నాడు వెళ్లిపోవాలన్నా.

"అయితే యీ ఒక్కరోజైనా భోజనానికుండా" లంది. సరేనన్నా. ఆవేళ విందు అనేక ఫలహారాల్తోటి. ఒంటిగంటయింది. అలసి అంతా పగలే నిద్దరోయ్యారు. శారద గదిలోకి వెళ్లుతూంది. తలుపు తీరుగుతూ ఒకమారు చూసింది యీ దీనుడివేపు. దానితో తల తిరిగింది అప్పటికే అనేక ఆలోచనలు. ఆవేశాల్తో హృదయము కంపమెత్తుతూంది. కోపముకూడా వచ్చింది, నన్ను తప్పించుకుంటూందికదా అని. మెల్లిగా గదిలోకి వెళ్లా. తలుపు వేస్తూండడము చూసిందనుకుంటా. మంచముమీద తలగడలో మొహము పెట్టి యెదురుగావున్న రాధా కృష్ణ పెద్దపటము చూస్తూ పడి, కాళ్ళు కదుపుతూంది నేలమీద, మంచము చాలా ఎత్తుఅవడముచేత.

మేమిద్దరం ఒకేవిధంగా మనోవేదన పడుతున్నామా అనిపించింది. నాసిగ్గును విడిచి మాట్లాడ నిశ్చయించుకున్నా.

"శారదా, నేను నిన్ను......"

"నేనూ మిమ్మల్ని......"

"అయితే నాతో వచ్చెయ్యకూడదూ?"

"అయితే నా అందాన్ని నా శరీరాన్ని ప్రేమించింది మీరు ?"

"నీ అందాన్ని."

"అయితే నా శరీరానికోసం మొందుకాపడుతారు"

"నీ వేదాంతం నన్ను దహించివేస్తోంది."

"నా రెండుమాటలు వినండి. మనమిద్దరం ప్రేమించుకున్నాము. దానికి దేవుడే సాక్షి. మా వాళ్లు నా చిన్నతనంలో యెవరికో ఇచ్చి పెండ్లి చేసినందువల్ల పాతివ్రత్యానికోసం కొన్ని ఆశలు కట్టి పెట్టుకోవాలి. శరీరాలు కలియకపోయినా మనస్సులు కలిసాయి. ఈజన్మలో కాకపోయినా మరోజన్మలో మిమ్మల్ని భర్తగా కోరుకుంటా" అంది.

నేను మాట్లాడలేకపోయినా. శారద నేర్పిన నీతులు మాత్రతోన, విగ్రహం నానోరును కట్టివేశాయి.

"శారదా, నిన్ను మరవలేను. నిన్నే, నాహృదయములో పూజిస్తా. ఈ జన్మలో యింకొకరిని పెండ్లి చేసుకోను. ఎప్పటికైనా నీ అందం చూస్తూనే ప్రాణాలు విడుస్తా." అని ఆవ్రేశాన్ని ఉన్మాదునివలె వదిలేసి మా వూరు చేరుకున్నా.

మిక్కిలి ఆతురతతో యెదురుచూస్తూన్న పరీక్షా ఫలితాలు వచ్చాయి. పరీక్ష తప్పింది. ఇంక చేసేదేమిటి. చెన్నపట్నం ట్యుటోరియలు కాలేజీలో ప్రవేశించా. తప్పినట్టు యెవరికి తెలిసిందో యని దించిన మొహము యెత్తకుండా తిరిగేవాణ్ణి సిగ్గు దిగమింగుకుంటూ. నాది తప్పదమేమిటి ఖర్మము కాకపోతే.

సెప్టెంబరుకి మళ్లీ సెంటరు యీవూరే. నాకు చెన్నపట్నం వెళ్ళగానే అందుకుంది మలేరియా. మహాబాధ పెట్టేసింది. అందరు పట్టుపట్టి పరీక్షకి వెళ్లవద్దని. నేనసలు 15 రోజులు ముందరే వెళ్తానంటాను. ఎవరైనా స్నేహితులు చదువుకుంటూన్నవాళ్లుంటారు వాళ్లతో చదవాలని ఆఖరికి యెల్లాగైతేనేం వారంరోజులుందనగా వచ్చిపడ్డాను. మా వాళ్లింటిలోనే ఒక పార్టీ మిగిలిందిలే

వచ్చిననాడు శారద కనపడలేదు. ఇల్లంతా వెతికాను. షికారు వెళ్లిందేమో, స్నేహితులతో ఆడుకోడానికేమో రాత్రి భోజనాలయిందాక చూశా. ఈమారు నా జబ్బు మూలాన్ని భోజనాలక్కడే ఒకటే వైరిభ్యాస. కనపడలేదు శారద. ఇల్లు చూస్తే కొత్తగా వెల్లవేసినట్లు తోరణాల్తోటి, ముస్తాబుల్తోటి కనపడుతూంది. రాత్రి పడుకునేముందర "పిన్నిగారూ, యీమధ్య విశేషాలేంటి."

" నేనిలా కృశించి ప్రాణాలు విడవాలిసిందేనా "

శారద కన్నులనుండి అశ్రుధార సెలయేరులాగ ప్రవహిస్తోంది.

" శారదా యెందుకలా విలపిస్తావు "

" నాకోసం మీరుపడే సంతాపం చూడలేక. "

" శారదా " అంటూ ఆకళ్ళల్లోకి చూశా. ఆమె భయపడినట్లయింది బెదరింది.

" నేనింకోరిదాని ;. అపవిత్రనైపోశా. నన్ను మరచిపోండి. మీమీద ప్రేమ ఎన్నటికీపోదు. సెలవా " అంది దీనంగా.

" శారదా, నిన్నెలామరుస్తా "

" నేను కలిసుకాలిని. కాని యేం చేయగలను— "

ఈమార్కే సహజం.

నాకు అర్థమయింది. ఆమె అందుకే ఆరాత్రిఆగింది. నన్ను కలుసుకుంది పాతివ్రత్యము నిలబెట్టుకోడానికి.

" శారదా, మనతో యీ మన ప్రణయగాధకూడా మరచిపోతా. "

చేయిజాచింది. చేతిలో చెయ్యివేశా. మరచిపోయానుయిన్నాన్నా. ఇప్పుడు మళ్ళీ జ్ఞాపకము వచ్చింది, ఆమె కనపడ్డనించి.

## పండితుడు.

కొత్త సత్యనారాయణమూర్తిగారు.

క. కలఁడు ధనపాలుఁడనువాఁ
డిల సార్థకనామధేయుఁ డేలికలయయి భూ
వలయమున నున్న వారల
వలనను గర్వంబుగొనుచు వసుధాధిపుఁడై.

జగమునకు హాయిగూర్చు నా చంద్రుడకట! మన్పహాకళంకమున ఖ్యాతిదొరగినట్లు
ప్రకృతి ధరణీశచంద్రుఁడు పరమనైచ్య, నిలయమను దుర్గుణంబొకటి గలిగియుండె.

అర్థిబృందమటన్నను నార్తులన్న, నతిథిజనమన్న ధనము వ్యయంబటంచు
మనమునను భీతిగొంది తత్క్షణమె తనను, దర్శనము దూరముగఁ జేయఁదలచు నతఁడు

ధనము ప్రార్థింపకయు తన్ను గనిన మనుజు నమిత ప్రేమోదయంబున నాదరించు
విభునిపరిమాణి మగపడు, వేవిధముల ధనము రక్షించుట ముఖ్యమను నతండు.

కాన, గోకంబు నిర్గంధమైన కుసుమ, మంచుఁ దెగడుచు నావిభు నల్పదృష్టి
సరయునది గూర్తమేసుమీ ! ఆత్మప్రజనె యాదరింపని పతి నీచుఁడనుట లెన్న.

అట్టిపాలనమును సల్పునతని నగరమునకు నరిగెను పేదబ్రాహ్మణుఁ డొకండు
అతఁడు శాస్త్రవిశారదుం డధిక పాండితీ ప్రకర్షవిరాజిత ధీవరుండు.

అరిగి శుడకట్లా యధిక ప్రయాసమునకు జేనికొలువును జేరి యనూననైజ
ధీప్రభావంబున నొసంగె దీవనలను గాని ధనపాలుఁ డాతనిఁ గాంచఁడయ్యె.

ఏవంవిధముగఁ బ్రతిదిన మావంతయు మార్పులేక యరిగెడు విప్రున్
భూవరుఁడుగాంచి యొకనా డీవిధముగఁ బల్కె నైచ్యమేర్పడురీతిన్.

ఆర్యా! చిరకాలముండి మమ్మాశ్రయించుచున్న దానికిఁ గారణమున్నఁ దెల్పుఁ
డడియు విని సంతసించెద మంతెగాని, యేము మీకేమియు ధనంబు లీయ లేము.

వాని మాటలు విని యాపండితుండు, భక్తి తాత్పర్యములతోడఁ బలికెనంత
అధిప! ధన ధాన్యములు నాకు ననవసరము, లేను గాంక్షించునది యల్పమైనదొకటి.

భవ్యభవదీయ సుగుణ సంపదల వినియు ధనము గోరక సేవింపఁదలచినాఁడ
సన్నిధిని గూర్చుండి యీయున్న కొలువునందు మాట్లాడుటకు దేవ యాజ్ఞయిమ్ము.

మరియు నేకాంతముగ నొక్కమాట మాత్ర మనుదినము మీతో చెప్పెద నదియె నాకు
ముఖ్యమని విప్రుఁడనఁగ నాభూవరుండు సమ్మతించెను దానిని సంతసముగ.

నాఁటినుండియు సభలో నహరహంబు, తాని సజ్జనుఁ గూర్చుండి వాని చెవిని
"తాను దప్పించనగోతిలో దానె పడు"నటంచు నేకాంతముగఁ బల్కు సవనిసురుఁడు.

"వీఁడు చెప్పిన త్రోవ్వన తేఁడు రాజ్యభారమును బూను" నని ప్రజలు పండితునకు
స్వీయ వ్యవహారములనెల్లఁ జెప్పుకొనుచు, లంచము లొసంగ ధనమపుడు లక్షలయ్యె.

చూపరులు చోద్యమందగ నాపురమున, సౌధముల నెన్నొగట్టించి స్వల్పకాల
మునకు ధనియైన శాస్త్రిని పురనివాసి, యొకఁడుగాంచి యసూయచే వికలుఁడయ్యె.

అతఁడు రాజపురోహితుఁడగుటవలన పండితుని వృద్ధి కన్నుల పాలఁబడెను
దానఁ దన్నాశనము చేయఁబూని యాతఁడు వేచియుండెను సమయంబు వేవిధముల.

ఇది యటుండ పురోహితుఁ డుదయమునను లేచి వాడుక త్రోవ్వన నాచరింప
రాజగృహమున కరుగ నారాజు వాని, నడిగె సంగతులేమి! దేవా! యటంచు.

ఇదియె యదనని విప్రుఁడు మదినిదలచి, యనియె నీరీతి దేవర! ఆలకింపుఁ
డేమి చెప్పుదు మొన్ననె యీపురాన కరుగుదెంచెను బేద బ్రాహ్మణుఁడొకండు.

అనతికాలంబునకె భవదాదరమున నతడు గడియెంచె ధనరాశి నమితముగను
దాన నాతఁడు గర్వియై తమదు నేరములనె చాటుచునుండె నీపురమునందు.

తమదు పరిశుద్ధ కర్ణ రంధ్రములయందు, దుస్సహాదురంత దుర్గంధ దుర్గుణంబు
నలవుగానుండి నిత్యము కలుగజేయు, నేవ యింతింతగాదని యీసడించు.

మఱియు నీనాటినుండియు మాటలాడు నపుడు తన నాసికకు గుడ్డ యడ్డముగను
గట్టుకొనునట వాడెంత గర్వియౌనో! కాంచగలరెంత వితండము గలుగ దేవ.

అనెడి విప్రుని వాక్యంబు లాలకించు, మనుజనాథుఁడు హృదిని సంశయముదోఁప
"సరి" యటంచు దలయూఁచె, పరులకెవుడు కీడు వాటిల్లఁజూతురు కిల్బిషాత్ములు.

ఆదినంబున విద్వాంసు సౌధమునకు, నరిగి విప్రుఁడు క్షేమంబు లరయు వాని
రీతి నటియించి పల్కె నీరీతి నార్య! విన్నవించెద నొకమాట వినుమటంచు.
అనుదినంబును మాటాడు నవసరమున, నుద్భవించును దుర్గంధ మొకటియంచు
మీదు విషయంబు చెప్పెనుమీ విభుండు. దాన కష్టంబుతోఁచె నవ్వానికకట!
కాన సంభాషణముచేయు కాలమునకు, వదన మాచ్ఛాదనము దేనివలననైన
నల్పుకొను టుత్తమం బంచు జనవిభుండు, దలచియున్నాఁడటని నాకుఁ దెలిపె నేఁడు.
చెప్పుటయె మీదు ప్రకృతి శ్రేయమంచు దలచియుంటిని చెప్పుట తగని యెడల
నన్ను క్షమియింపుడని పల్కె నక్క వినయములను జూపుచు కుత్సితభూసురుండు.
పాపమా! మాయ నెఱుగని పండితుండు విప్రవచనంబు నిజమని విశ్వసించె
దైవ మక్కట! యెటుచేయఁదలఁచినాఁడో, కాని తెలియదు రాఁబోవు కర్మఫలము.
అంత మఱుచటి దినమున నరిగి జేని, మ్రోల మాట్లాడుచును వస్త్రమును ముఖాన
నడ్డమును బెట్టుకొన్న యాయనపరాధు,గాంచి యంతయు నిజమని యెంచె విభుడు,
ఎంచి యంతట వచియించె నీవిధముగ, శాస్త్రిజీ! మీకు సాయంబు నలుపలేదు
ఇంతదనుకను మమ్మాశ్రయింతురనుచు, స్వప్నమందైన భావింపజాలనైతి.
" ఇదిగో! లేఖనుగైకొని యేగి నగరునందు కోశాధిపతికీయ నతఁడు పెక్కు
బహుమతు లొసంగునని" యిచ్చె పార్థివుండు, ముద్రవైచిన యుత్తరమును రచించి.
అంత పండితుఁ డుప్పొంగు సంతసమున దానిగైకొని రాజాజ్ఞవూని తన ని
వాసమునకేగి గృహమున పనులఁ దీర్చి, కొనియు నరిగెద నామీదననుచు తలచె.
ఇట్టి సమయంబునను బురోహితుఁడువచ్చి, జరిగిన యుదంతమంతయు నెఱిగి తనదు
పన్నుగడ ఫలము పండకే పండితునకు, బహుమతు లొసంగెనని చాల పరితపించె.
పరితపించి సుఖప్రీతి బఱపియతఁడు, కొంతసేపుండి యరుగుచు నంత నచటి
భూవిభుని లేఖ నేకాంతముగ గ్రహించి, స్వీయ పంచాంగమున దాచి వెడలెనకట!
అధికమగు రాజబహుమతు లందఁగోరి, యతిముదంబునఁ గోశాధిపతికి విభుని
లేఖ నొసఁగిన నతఁడు పరీక్షచేసి, వానినాసిక వాఁడి ఖడ్గానఁదఱిగె.
అంత హృదయంబు భేదిల్లునట్టులతఁడు, కావుకేకలువైచి " నాకర్మ "మనుచు
మొత్తుకొని నెత్తినోరును మోదుకొనుచు, నరిగె గేహంబునకు దైవమా! యటంచు.
అరిగి తనచేష్టలకు విస్మయంబునొంది యాతఁ డవనీపతిగృహంబు కరుగఁడయ్యె
పండితుఁడుమాత్రమట పూర్వపద్ధతిగను, జేనిదర్శించె మఱునాఁటి జేవకడన.
ఱేఁడు ధనపాలుఁడది విచారించి తనదు, ప్రియపురోహితు భటులచేఁ బిలువనంపె
నాత డాత్మీయ దురవస్థ నంత పలికి, ఘోరముగ విన్నవించి గగ్గోలుపఱచె.
దాని వినిన విభుండు యథావిధిగను శాస్త్రివర్యుని పూజించె సంతసముగ
దాను ద్రవ్వినగోతిని దానె పడునటంచు నభియుక్తజనము వచించెనపుడు.

# కన్నకొడుకు.

నిడుమోలు కనకసుందరంగారు బి.ఎ.(ఆనర్సు)

౧

నాగేశరావు వైద్యుడు. విద్యాపూర్తియైన పిమ్మట వైద్యవృత్తి నవలంబించి పదునైదు సంవత్సరములనుండియు స్వగ్రామమునందే నివసించుచుండెను. తోటపల్లియందతనికి విశాలమగు చక్కని గృహమును బంగారు పండెడి పొలములును కలవు. జీవనోపాధికెట్టి కొదువయు లేనివాడగుటచేతను, స్వతంత్ర జీవనాపేక్ష కలవాడగుటచేతను, పల్లెటూరైనను తన స్వగ్రామమునందే — బంధు మిత్ర జన మధ్యమునందే — కాపురముండి స్వకీయోద్యోగమునందు జాగరూకతతో పనిచేయ నిశ్చయించుకొనెను. పల్లెటూళ్ళయందు వైద్యవిషయముల్ల ప్రబలియున్న యజ్ఞానమును నిర్మూలనమొనర్చి, జానపదుల యారోగ్యమును కాపాడి పెంపొందించుట దేశాభ్యుదయమున కావశ్యకమని అతని ఆశయము.

నాగేశరావు మేధావి. ఉత్తమాదర్శములును, కార్యదీక్షయు అతని విద్యకు వన్నె దెచ్చినవి. శస్త్రప్రయోగ మొనర్చు వైద్యుడు యోధునివలెనే దయాశూన్యుడని లోకోక్తి. కాని నాగేశుని యద్వితీయమగు మేధా సంపత్తికి నవనీతమువంటి అంతఃకరణముతోడై కొలదికాలములో నతని కెనలేని యశస్సు చేకూర్చినది. పదునైదు సంవత్సరములు గడచునరి కాతని పేరు పరగణా యందంతటను ప్రసిద్ధికెక్కినది. ఆర్తులగు రోగులతో ముందుగ బేరమాడి, వెలనిర్ణయించుకొని, కొంత సొమ్మును గ్రహించి మిగిలినది వచ్చువరకు వారిని త్రిప్పలబెట్టు నాచారము నాగేశరావెరుగడు. అతని యౌషధ సంసేవనమువలన విగతరోగులగువారు సంతోషపూర్వకముగ నిచ్చు దానిని స్వీకరించుట, నిర్ధనులగువారు హృదయపూర్వకముగ నిడు నమస్కారములతో సంతృప్తిచెందుట, జీవనోపాధిలేని రోగుల యన్నపానాదులకై యొక్కొక్కప్పుడు ప్రత్యేకముగను మరొకప్పుడు రహస్యముగను దానము చేయుట ఇవియే అతని నియమములు. కాని ధనవంతులగు వారియొద్ద ధనము గ్రహించుటకు వెనుదీయడు. కావుననే అతని వృత్తి మిగుల లాభకరముగనుండెను. జలము తటాకములోనికే ప్రవహించును గాని యెండియున్నను మెట్టపై కేగునా?

ఉన్నతవిద్యా సంపాదనమువలన లభించిన విజ్ఞానప్రవృత్తి ఉద్యోగపర్వతమున నార్జించిన యశోధనములతో బాటు నాగేశరావునకు దాంపత్యసుఖముకూడ కొదువలేకుండెను. అతని భార్య సుశీల, సురూపి, సుకుమారహృదయ. సుశీల చలికొండ కాపురస్థుడగు నాగేశుని పెద్ద మేనమామ కుమార్తె. పల్లెటూరి పడుచుల అడకువ, మెలకువ, దైవచింతనము భర్తృసేవానిరతియు నామెయందు మూర్తీభవించినవి. అర్థవిహీనములును అసహ్యకరములునై అనుదినము మార్పుచెందెడి పట్టణపుపడతుల కట్టు, బొట్టు తీరుల కామె యెంతవిముఖయో, వారి అహంకారము, ఆత్మవంచనము, హృదయదారకములగు హేయభావములకు నామె యంతదూరస్థ. జాడ్యపీడితులగు దీనులకు చేతనగు వైద్యసహాయ మొనర్ప సంకల్పించుకొన్న

నాగేశున కాసె నహవాసమే ఉత్సాహకరమై యుండెను.

ఆ సుఖదంపతుల జ్యేష్టపుత్రుడు రంగధాము నకు పండ్రెండేండ్లుండును. అతని పిమ్మట శారద యును పదియేండ్లకుమార్తెయు. నారాయణుడను నైదేండ్ల కుమారుడును కూడ కలరు. సుశీల మరల నిపుడు గర్భవతియై యున్నది.

జ్యేష్టపుత్త్రునియందు జననీజనకుల కను రాగము మెండు. రంగధాముని మేధానంప త్తియు, కుశాగ్రబుద్ధియు బాల్యమునందే విదిత ములగుటవలన నాగేశు డాతనికి నూతనాంశ ముల విశేషముల నేర్పుచుండెను. నాగేశుడువ యోగించెడి శస్త్రములను వాడుటయెట్లో రంగ ధామునకు బాగుగ తెలియును. ఆటలయందును అతడు బహునేర్పరి. అతని కుశాగ్రబుద్ధిని పెం పొందింపవలెననెడి యుద్దేశ్యముతో విల్లంబు లను తుపాకుల నుపయోగించు విధములను కూడ నాగేశుడు నేర్పెను. ఆబాలుడు ఆట తుపాకులను కడు చాకచక్యముతో నుపయో గించుట కలవాటుపడెను. గురిచూచి తుపాకితో కొట్టుటయందతని కప్రతిమానమగు శక్తియల వడెను. ఆటతుపాకులనేగాక ప్రాణాపాయ కర ములగు రివాల్వరులను కూడ నతడు రెండు మూడు పర్యాయములు కడు జాగరూకతతో నుపయోగించి యుండెను. విద్యావిషయము లందును ఆబాలుడు వెనుకబడి యుండలేదు. అట్టివాడు జననీజనకులకు ప్రేమాస్పదుడై యుం డెననుటలో విశేషమేమి ?

## ౨

అది వేసవికాలము. వడగాల్పులు రివ్వున వీచుచుండెను. మధ్యాహ్నము రెండుగంట లవ్వుటకు రెండెడ్లుల బండియొకటి తోటపల్లినుండి రెంటచింతలగ్రామము దిక్కై పోవుచుండెను. బండితోవ యెండిన మాగాణిచేలనడుమనుండి పోవుచుండుటచే గట్లు కాలవలు కన్నములు తరచుగ మార్గమధ్యమున దాటవలసి వచ్చినను బండి యొకచోటనైన నాగుటలేదు. తొట్టిలో కూర్చుండిన రామయ్య యెద్దుల తోకలను విరచుటయు, ఛో, అహాయ్ అని తఱచుగ నద లించుటయు, కొఱడాతో వినరికొట్టుటయు తప్ప మార్గమందలి మిట్టపల్లములను చూచుట లేదు. ఎద్దులు బలిష్ఠములై బాగుగ నడక కల వాటు పడినవగుటచే గుర్రములవలె బరుగు లెత్తుచున్నను ఇంగుల నాయాసపడి నోట నురు గుల గ్రక్కుచుండెను. పక్షులుకూడ తమగూం డ్లలోనుండి బయటకురాని యానమయమున నాగేశు డాబండిపై నెక్కి యిట్టి యుత్కృష్ట ప్రయాణ మేలచేయుచున్నాడో ప్రస్తుతమే తెలియగలదు.

ఆబండి రెంటచింతల గ్రామమును ప్రవేశించి రాజవీధియందలి పెద్దయింటిముందు నాగెను. రామయ్య బండితొట్టిలోనుండి నేలపై కురికెను. నాగేశరావుకూడ శీఘ్రముగనే బండిదిగి రామ య్యవెంట నాయింట ప్రవేశించెను. ప్రాంగణ మున నొకరోగి మంచముచుట్టును సుమారు పదిమంది స్త్రీపురుషులు దీనములగు ముఖము లతో కూర్చుండియుండిరి. వైద్యుడు రోగి యొక్క యెడమచేతియందును కుడిచేతియం దును నాడిని పరీక్షించి వెంటనే తనచేతియం దున్న చిన్నపెట్టెలోనుండి యొక యౌషధమును తీసి రోగియొక్క పెదవులపై వ్రాసెను. రామ య్య వైద్యున కెదురుగ మంచమున కావలి వైపున నిలచి, ఆత్యాతురమున రోగిముఖము

నవలోకించుచుండెను. మూసికొనియున్న యా రోగియొక్క నేత్రము లాయౌషధప్రభావము వలన నైదునిమిషములలో విచ్చినవి. విచ్చినంతనే వానియందు ప్రతిబింబించిన వస్తువులలో నాగేశుని ముఖమండలమే మొదటిది. వైద్యుని యొక్కయు రోగియొక్కయు నేత్రములు కొన్ని నిమేషములవరకు నట్టే యేకసూత్రగ్రథితములై యుండెను. రామయ్య కన్నులనుండి పొంగి పొరలువచ్చు బాష్పజలము నాపుకొనజాలకుండెను. నళిని వైద్యుని ముఖమునుండి దృష్టి మరలించి రామయ్యపై ద్రిప్పి "మామా!" యని బిగ్గరగ నేడ్చెను. నాగేశుడు వెంటనే రామయ్య నావలికి బోనాజ్ఞాపించి రోగికి శీతలోపచారములొనర్ప నియమించెను.

రోగికాశ గండము గడిచినది. నాగేశుడు రెండుమూడుగంట లచ్చటనే యుండి కొన్ని యౌషధములనిచ్చి, వాని నుపయోగించురీతులను రామయ్య కెరిగించి స్వగ్రామమునకు వెడలిపోయెను. నాటినుండియు నళినియొక్క ఆరోగ్యము క్రమక్రమముగ కుదుటబడుచుండెను. అనుదినమును నాగేశుడు రెంటుచింతల గ్రామమునకు వచ్చి రోగిని పరీక్షించి, ఔషధములనిచ్చి పోవుచుండుటచే కొలదిదినములలోనే సంపూర్ణస్వాస్థ్యము కలిగెను.

## 3

రామయ్య రెండుచింతలకు కరణము. నళిని ఆతని మేనకోడలు. కాకినాడలో ధనవంతుడగు నొక వర్తకునియొక్క పుత్రిక బాల్యమునందే మాతృహీన యగుటచే పుట్టినింటనే యుండి పెరిగెను. ఆమె కిపుడు పదునెనిమిదేండ్లు. రామయ్య సంక్రాంతిపండుగకు తన సోదరిని మేనకోడలిని స్వగ్రామమునకు తీసికొనివచ్చి యుండెను; ఆసమయముననే నళిని రోగగ్రస్తయగుటయు నాగేశరావువలన బ్రతికింపబడుటయు పైన వివరించితిమి. పండుగకై తీసికొనివచ్చిన చెల్లెలిని, పిల్లను తిరిగి సురక్షితముగ కాకినాడకు పంపగలిగినందులకు రామయ్య మిగుల సంతసించి నాగేశుని తగురీతిని బహూకరించెను.

కాని నళినియొక్క రోగము నిశ్శేషము కాకుండుటచే నాగేశుడు అనుదినమును కాకినాడకుపోయి, ఆమె ఆరోగ్యము ననుదినము పరీక్షించుచు తగిన యౌషధముల నిచ్చుచు వచ్చుచుండెను. ఈ రీతిని నాల్గు మాసములు గడచినవి.

ఈ సమయమున నాగేశుని ప్రవర్తన మొక నూతన మార్గమును త్రొక్కినది. ఇతర రోగులపై నతనికి శ్రద్ధ క్రమక్రమముగ క్షీణించుచు వచ్చెను. తన దర్శనార్థమై వచ్చిన రోగులు కోటిపల్లియందు వేచియున్నను కాకినాడకుపోయి నళిని చూచివచ్చుటమాత్రము మానెడివాడు కాడు. దినములు గడచినకొలదియు, నాతడు కాకినాడ యందే యెక్కువ కాలము గడుపుచు ప్రతిదినము మధ్యాహ్నము పండ్రెండు గంటలవరకు మాత్రమే కోటిపల్లియందు కానవచ్చుచుండెను.

రోగులతోబాటు భార్యాపుత్రాదులయందు కూడ నాతనికి మమకారము తగ్గినది. ఇంటియందు నేమేమి కావలయునో అతడు విచారించుట లేదు. సంపూర్ణ గర్భవతియగు భార్యయొక్క నేమమరచుట అరుదైనది. కాని సాధ్వియగు సుశీల పాపమేమి చేయగలదు? నాగేశుడు పిల్లలపైనను, తనపైనను చూపెడి

రివాల్వరొకసారి పేలినది. నళిని నిశ్చేష్టయై నేలగూలినది. ఒకనిముషములో నాగేశుడు ఆశ్చర్యవిభ్రమములు ముఖమున తాండవింప నాగదిద్వారముకడ ప్రత్యక్షమయ్యెను. రివాల్వరును తన వక్షస్థలమునకు గురిపెట్టుకొని, తలనెత్తునరికి నాగేశరావు "ఏమిది?" యని ప్రశ్నించుచున్నట్లా బాలునకు దోచెను.

"అమ్మకొరకు—" అని యనకపూర్వమే రివాల్వరు రెండవసారి పేలినది. రంగధాముడు విగతజీవుడై నేలబడియెను.



# ఈర్ష్య.

మహీధర రామమోహనరావుగారు

గీ॥ కోకిలా! శ్రావ్యతర భవ ♦ త్కూజితమునఁ
బాలఁగరగించు రాణ; ♦ విరాగినైనఁ
మోహమునఁముంచు నేర్పును ♦ మోహరించె
బాటఁబాడుము; కోకిలా! ♦ బాడుమనగఁ

మలయవాయు కిశోర సం ♦ హితవరాగ
ధూసరాశాంత మధుమాస ♦ వాసగమునఁ
పల్లవార క్తకంఠనై ♦ బాలులిచ్చు
కుహు కుహూరాయను బల్లవి ♦ గొనుచుఁమత్త
చంచరీక కులావ్య క్త ♦ ఝ్ఝాంకృతిఁ శ్రుతిఁ
జేసి; వినువారి మనను రం ♦ జిల్లునట్లు
జిత్తరంజనముగ నెలు ♦ గెత్తి, నేఁ; వ
సంత గీతికలం బాడు ♦ సమయమందు.

ఎచటిదో యొక బలిపుష్ట ♦ మెదుటి శమ్మ
వృక్షశాఖాగ్రమందుఁ ను ♦ హృదులతోఁడఁ
నధివసించి యొకింతసే ♦ పాలకించి
వికృతకూజితములఁజేసి ♦ వెక్కిరించెఁ.

అంతతో నూరకుండక ♦ నధికరోష
వివశమై, మిత్రవర్గంబు ♦ వెంటఁరాఁగఁ
నేచి పైఁబడిదన్నుచుఁ ♦ హింసఁబెట్టె
క్రౌర్యతకు గారణ మొకండు ♦ గల్గియున్నె.

జనులు గుత్సింపఁ బంధులు ♦ సంస్తుతింపఁ
గృహముఁజేరఁ జనుచునొక ♦ మృగయువాడి
కోలఁజచ్చెఁ—సదయుడైన ♦ బాలుఁడొకడు
బెంపఁ గాయాలుమానఁగఁ ♦ బెరుగుచుంటి.

వెక్కిరించిన నేనొందు ♦ వెలితియేమి?
దన్నినంతన నేఁ గాంచు ♦ దక్కువేమి?
దిట్టినంతలో యోగను ♦ దేలికేమి?
స్వీయదుర్గుణ గుణముఁజూ ♦ పించెఁగాక.

క్రించువరచిన నెత్తి నె ♦ క్కించుకొనిరె?
ఈసడించిన గౌరవ ♦ మిచ్చిరొక్కొ?
తన్నుఁగాఁబక్కిరా లచ్చిదార్చినారొ?
కోకిలా! యని బిల్చిరే! ♦ గూసినంత.



# శిథిలద్విత్వము

శ్రీ వేంకటరత్నంగారు, బి. ఏ.

శిథిలద్విత్వమనగా సంయుక్తాక్షరమును తేల్చి పలుకుట, దీనిగూర్చి ఆంధ్ర గ్రంథమాలవారు ప్రచురించిన బసవపురాణ పీఠికలో ప్రభాకరశాస్త్రిగారు కొంత వ్రాసినారు, తరువాత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారతిలో (5 సంపుటము సంఖ్య 3) వ్రాసిన "నన్నయ పూర్వపు తెలుగు—శిలా శాసనములు" అను వ్యాసములో అద్దంకి శిలా శాసనముగూర్చి వ్రాయుచు శిథిలద్విత్వముగూర్చి కొంత వ్రాసినారు. వారువ్రాసినది చదివినమీదట నాకు కలిగిన అభిప్రాయమును యీ వ్యాసమూలముగా వ్రాయుచున్నాను. నా అభిప్రాయము పొరపాటగునేని పండితులు, నాదు తప్పును మన్నింప వేడుచున్నాను. శిథిలద్విత్వము ఆంధ్రభాషలో మొదటినుండి యున్నదని నమ్మువారిలో నేనొకడను. ఇది ముఖ్యముగా శివకవుల వ్రాతలలో అధికముగా కనబడును. తక్కినవారిలో అధికముండియున్నను ప్రచురింపబడిన పుస్తకములలో ఎవరెంత మార్చినదియు తెలియదు. అయినను "అద్రుచు, చిద్రుచు" మొదలయినవి కొన్ని శిథిలద్విత్వములుగ నిలచిపోయినవి. భాషాశాసకులకు వ్యాకర్తలు శిష్టవ్యవహారములగుట వీనినిమాత్రము పరిగ్రహణీయములని వ్రాసినారు. ఏమనిన అది వారియిష్టము. అదే మనభాగ్యము.

శిథిలద్విత్వముగూర్చి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన దీక్రింద నుదహరించితిని. "......అట్టియు నీడ్వించి యగద్తపైపించె" (ద్విపదపాదము) కర్ణాట వ్యాకరణమున శిథిలద్విత్వమునుగూర్చి యొక ప్రకరణము కలదు. తెనుగున శిథిలద్విత్వ ప్రశంస కానరాదు. శిథిలద్విత్వమనగా సంయుక్తాక్షరము తేలబలుకుట. దీనిచే దత్పూర్వాక్షరము లఘువగును. తెలుగున "అద్రుచు, చిద్రుచు చిద్రిపలు" (కద్రివ) అను పదములుమాత్రమే కర్ణాట శిథిలద్విత్వములలో గొన్నియైనను దెలుగునగూడ ప్రాచీన కాలమున శిథిలద్విత్వములుగా నుండి యుండవచ్చును. "యగద్తపైపించె" నను ప్రయోగ మందుకు సార్థకము......"

అగద్త అనునప్పుడు తేల్చి పలుకవలయును. లేనిచో గణభంగమగును.

సోమశేఖర శర్మగారు భారతిలో యిట్లు వ్రాసిరి.

"శాసనమున ౭ వ పంక్తిలో "గొఱ్ఱియ" అను పదము నలముకాని, నగముకానికాకున్న గణభంగమగును. ఇప్పుడున్న రీతిని అది జగము (జగణము+గురువు) అగుచున్నది. ఎట్లన, 'ఱ్ఱి' సంయుక్తాక్షర మగుటచేత 'గొ' ([illegible]) వర్ణము గురువగుచున్నది. శాసనమున స్పష్టముగ కనబడునది సంయుక్తాక్షరము కాదనుటకు వీలులేదు. అందువలన దీనిని తప్పించుట కొకటే మార్గము కలదు. అందువలన యీపదమునందలి 'ఱ్ఱి' ని తేల్చిపలికి "శిథిలద్విత్వము" చేసినచో అంటి గణభంగములేదు. ఇట్లు సంయుక్తాక్షరములను గణభంగము కాకుండ తేల్చి పలుకవలసినచోట్లు కొన్ని బసవపురాణమున గలవు"

అని ప్రభాకరశాస్త్రిగారి వ్రాత నుదహరించి మరల శర్మగారిట్లు వ్రాసిరి.

"ఈశిథిలద్విత్వములు మన శాసనకాలమునుండి పాల్కురికి సోమనాథునినాటివరకు నుండెనని స్పష్టమగుచున్నది"

పైవిషయమునుబట్టి శిథిలద్విత్వము ఆంధ్రమున ఆదినుండియు కలదని పాఠకులు విశ్వసింపవలసియుండును. అట్టివి నేడు విరివిగ వ్రాసి యవి గ్రాహ్యములేయని నమ్మింతురా? ఏ వజ్రాయుధ పత్రికలోనో సబబు సందర్భములేని యొక వ్యాసము నిప్పులు గురిపించకపోదు.

శిథిలద్విత్వము పాల్కురికి సోమనాథునివరకు కలదని మాత్రము శర్మగారు వ్రాసిరి. కాని మొదటినుండి నేటివరకు కలదని నేను మనవి చేయుచున్నాను. ప్రబంధాదులలో పెక్కులున్నను ప్రచురణకర్తలు వానిని దిద్దివేసిరి. శిథిలద్విత్వము కాకపోయినను ద్విత్వటుల వేలకొలది ఉదాహరణములను గిడుగు రామమూర్తిగారు చూపుట లోకమునకు క్రొత్తకాదు. అంతియకాదు. ప్రస్తుత మిప్పటి సుప్రసిద్ధులగు మన యువకవులు కొందరు యీ శిథిలద్విత్వమును వాడుచునేయున్నారు, అట్టివి కొన్ని యీక్రింద నుదహరింతును.

## 1. రాయప్రోలు సుబ్బారావుగారు.

జడకుచ్చులు 38 పుటలో "మధుమాలి" యను ఖండ కావ్యమున "పరిమళ ప్రగాఢమగు భామ పాన్పు బందు" యిట "పరిమళ ప్రగాఢ" మనుచోట కేల నలికి శిథిలద్విత్వము చేయనిచో గణభంగము.

## 2. ఆదిపూడి సోమనాథరావుగారు.

"గీతాంజలి" మొదటి పుటలో "మాటి మాటికి బోర్లించి మరల నూత్న । ప్రాణమును నింతు నీవనవ్ర

ప్రాతయందు" యిట "నూత్నప్రణయ" లో శిథిల ద్విత్వము. వీరి గ్రంథములో నిట్టివి తరచు కలవు.

3. పురిపండా అప్పలస్వామిగారు.

"మురళీధ్వని" 8 వ పుటలో "హృదయవేదన" యను ఖండకావ్యమున "మోదశ్రుతి నాలపించె విషాద గీతి" ఇట "మోదశృతి" అనుచోట శిథిలద్విత్వము.

4. మంగిపూడి వేంకట శర్మగారు.

భారతి ప్రథమ సంపుటము ప్రథమ సంచికలో 8 వ పుట "తెలుగుపాట" యను ఖండ కావ్యమున 23 వ ముత్యాల సరమున "సాటిమించిన శాస్త్రజ్ఞానము" ఇట "శాస్త్రజ్ఞానము" అనుచోట శిథిలద్విత్వము. అందే 14 వ ముత్యాలసరమున "కాపువీరుల ఘనప్రతాపము" యిట "ఘనప్రతాపము" అను పదమున శిథిలద్విత్వము.

5. అధికార్ల సూర్యనారాయణరావుగారు.

"శారద" 2 వ సంపుటము 2 వ సంచిక 198 వ పుటలో "కవి మృత్యుదేవితో" అనే ఖండకావ్యమున "తరుణప్రాయము సొగసయ్యె; దధికులముల" యిట తరుణప్రాయము అనుచోట శిథిలద్విత్వము. ఇటుల చూపిన అసంఖ్యాకములు చూపవచ్చును. స్థలాభావమున స్థాలీపులాక న్యాయమున నివి చూపి విరమించుచున్నాను.

ముఖ్యముగా యీ వ్యాసము వ్రాసి ప్రకటించుటకు కారణమేమనిన శిథిలద్విత్వమాదినుండియు కవులు ప్రయోగించుచున్నారనియు నేడుకూడ ప్రచారములో కలదనియు పండితులు దీనిని అసాధువులని త్రోసివేయక పరిగ్రహింపవలయుననియు మనవిచేయుటయే. ఒక్కొక్కపుడు శిథిలద్విత్వము తేల్చి పల్కినగాని శ్రావ్యతయుండదు. పైని యుదహరించిన ఆధునిక కవుల ప్రయోగము లన్నియు నిట్టివే తేల్చిపల్కినచో వానియందము. ఊది పలికిన నివి కఠోరముగ నుండును. "నూత్నప్రణయ" మనునపుడు పూడిన నేమంత సొంపు? కావున యిట్టివి దోషములుగ తలంపక స్వీకరింపవలయునని విన్నవించుచు యీ వ్యాసము ముగించెదను. విషయమునింక విపులముగ పండితులు పర్యాలోచింతురుగాత!



## వాసంతిక.

పాటిబండ వేంకటసుబ్బారావుగారు.

గీ॥ నవనవోజ్జ్వల చిగురాకు ♦ లరసి యరసి
గుంపుగూడుచు లేమావి ♦ గున్నలందు
ఖగములెల్లయు సభఁజేయ ♦ శరణిఁదోఁచె
పడతిరొయొక్కతె యుల్లంబు ♦ పల్లవింప. ౧.

గీ॥ చైత్రమాసంబు శృంగార ♦ జనకముగుట
అంగనామణివేడ్క సా ♦ యంతనంబు
విసుగఁగోయుచుఁ బెరటిలో ♦ విశ్రమించి
మారువలఁ గదు మెండరే ♦ మనినవినవ. ౨.

గీ॥ ఖండశర్కర మధురంబు ♦ కన్న మిగుల
రుచికరంబగు సంగీత ♦ రోదనంబు
కాంత డెందము నెంతేని ♦ గందళించె
శరనుటపుల్లల మాదనుండుఁ గాఱువరువ. ౩.

గీ॥ తావమాసగలేని యత్త ♦ లిరువోణి
కినిసి మనమున శుకపిక ♦ కీరవములఁ
బారఁదోలఁగ నుంకించు ♦ బహుళగతుల
నందుఁగాసిన పిందెల ♦ నంటుకలిన. ౪.

గీ॥ లేచు, లేచినఁజేరాక ♦ రిత్తయగుచు
పంచబాణుని శరముల ♦ పట్టువడియు
మత్తకాసి విత్తంబు ♦ మందలింప
కోయిలారావముల విన్న ♦ గోసుమరల. ౫.



# అహంభావము

కొవ్వత్రి నారాయణమూర్తిగారు, బి.ఏ;యల్.టి.
సాహితీసమితి.

భావములన్నిట నేక
భావం బొక్కటె సర్వశుభంబులిడు నహం
భావంబొ గడుంగడు పా
పావహమై బిగిదగుల్చు భవబంధముల౯.

సీ॥ సేవకావ్యాప్తిచే జీవితాదర్శము నీటగల్పినదెల్ల "నేను"గాదె?
సదసద్విచక్షణా సరళిమీరెడురీతి నేరిపినదియెల్ల "నేను"గాదె?
సృష్టితేజోరాశి జీకట్లనడగించు నిబిడాంధకారంబు "నేను"గాదె?
చిత్తవిభ్రమణంబుచే నిహాపరధర్మ హీనునిజేయుట "నేను"గాదె?

ప్రేమ మార్గావలంబనా విముఖతయును
నీనశింపున్సృజించుట "నేను"గాదె?
సర్వమును సేవగించియు సర్వమేను
నేను నేనని మిడుకుట "నేను"గాదె?

కం॥ కారము నూరేకారము
కారంబావమును మిరపకాయయు నెంతో
కారము మిరియము శొంఠియు
కారములో కార మహంకారముగాదే!

ఉ॥ నేననుమాట మానుమని నెమ్మిసి నెంతగ బోధచేసిన౯
మానక "నేను నేన"నుచు మాటికి మాటికి విఱ్ఱవీగుచు౯
మానసముదాలి యేల నిటు మత్సరభావమునం జలించెదో
మానవనామ మర్కటమ! మైకమువీడు మికైన మేలగు౯.

# చంద్రుడు.

కొల్లూరి ధర్మరాయకవిగారు బి. ఏ. (ఆం. గీ. సా. వ.)

"ఎల్లప్పుడూ, విమర్శనలే వ్రాయకపోతే ఏదేనా కథ రాయకూడదూ, ఆంధ్రభారతికి?" అని మా చంద్రుడు నన్నడిగేడు. స్నేహితుడు కాబట్టి oblige చెయ్యవలిసొచ్చి సరే అని చెప్పి "నీచరిత్రే రాస్తాను సుమా" అని ముందుగా inform చేసేను. గ్రామ్యంలో గాస్తే accept చేస్తాను; నీమడిగట్టుకున్న భాషఅయితే వొద్దు, ఆ అరసున్నాలంటే నాకు చిరాకు" అన్నాడు. "గ్రామ్యం రాసినా, అరసున్నా లేకపోతే తెలుగు భాషేలేదు, మన కదిలేందే పూటి గడియదంటూ" నీయిష్టప్రకారమే కానీ" మన్నాను.

అసలు మా వాడి పేరు రామచంద్రుడే. అమాయకత్వానికి (అబద్ధమాడ లేకపోతే మరే వన్నమాట?) హరిశ్చంద్రుడు కూడాను. కాని స్నేహితులమధ్యమాత్రం మేడీజీ అయి "చంద్రు" డయ్యేడు. కవిత్వంలో మాచంద్రుడి కున్నంత సరదా మరెవరికీలేదని చెప్పొచ్చు. మావూళ్లో gentleman at large లో వాడే ప్రముఖుడు· వూసుపోని వాళ్ళకి వాడాప్త బంధువులాటి వాడు.

చిన్నప్పట్నించీ మేం విద్దరం స్నేహితులం. మా యిద్దరికీ స్నేహం కలియడానికి Common ground ఏదని మీరడగొచ్చు. నేను పదమూడోయేట, నాలుగు రోజులు కష్టపడి మావూళ్లో అంజనేయస్వామిమీద ఒక గీతపద్యం అల్లేను. circus feat చేసినంత పనైంది. మా వీధరుగు మీద కూచుని ఆపద్యం నాకు నేనే చదువుకుంటూ ఆనందిస్తూన్న సమయంలో మా మెదటింట్లో కొత్తగా దిగిన యీ రామచంద్రుడు నాదగ్గిరికొచ్చి "బాగుందోయ్ పద్యం ఏదీ మరో మాటు చదూ?" అన్నాడు నాయీడు వాడొకడు విని బుర్రఊపేడు, అంత కంటేఏమిటి కావాలి? తను రాసినదాన్ని మెచ్చుకోవడంకంటె. కవి అన్నవాడు లోకం వల్ల ఆశించేదేముంది యీరోజుల్లో? ఆమాటతో నా మొహాన్ని Johnson ఒకూ_. చంద్రుడు మొహాన్ని Boswell లక్షణం, ప్రతిఫలించేయి. అయితే యిక్కడ భేదం ఏమిటంటే Boswell జీవితమే Johnson రాయవలిసొచ్చింది.

మా చంద్రుడికి మొదట్నించీ thirst for fame తక్కువ; అంటే sublimest hero అన్న మాట. ఒకరు చెప్పేవిషయం వినడం అంటే చాలు వాడికొక విధమైన ఆనందం. ఎలాంటి సంగతైనా సరే, చెప్పేదాత యుండాలి గాని సావధానతతో వినడానికి సిద్ధం. ఈ మధ్య అనగా తే 18-7-28 దీనినాతోకూడా మా చంద్రుడు city క్లబుకివస్తే, వాణ్ణెరిగిన ఒకాయన చదూతూన్న పేపరు దించి "ఏమండోయ్, చూశారా, Emden చెన్నపట్నంలో ఎంత అల్లరచేసిందో?" అని latest news లాగు చెప్పేడు. "ఆఁ, అలాగనాండి!" అంటూ మాచంద్రుడత్యాతురతతో అమాయికంగా విన్నాడు. చెప్పొచ్చేదేమిటంటే యీ instinct నించే మా వాడిలో poetry వుందనినే గ్రహించాను. నిత్య ప్రకృతిలో తారసిల్లే విషయాలికి నూతనత్వం ఆపాదించేవాడేకదా, కవి.

అయితే యీ instinct ని ప్రజ్వరిల్ల జేయడానికి తగిన incidents ఎలా వొచ్చాయో చెప్పవలిసుంది. ఇక్కడేవుంది చిక్కు. మా వాడికి తెలుగులో ప్రవేశం తక్కువ. అంటే సంస్కృతంలో వుందని కాదు సుమండీ ? కాని వాడు పద్యం చదూతూవుంటే (అర్థం పొందిక లేకపోయినా) వినడానికి happy గా వుంటుంది. ఇదే వాడు కవిగావడానికి favourable గావున్న విషయం, యీరోజుల్లో. వాడు పాడే రాగం అపూర్వం, అనన్య సదృశం. అయితే అనంతకోటి రాగాల్లో ఒకాటి కాక పోదు. ఇంతకూ ప్రధానమైన ఇంపువుంది.

మా City క్లబ్బుకి వొచ్చే novels అన్నీ చంద్రుడు ఆమూలాగ్రంగా చదివేడు. నేటికి కూడా వాడికి వేగుజుక్కవారి "వాడేవీడు and Co.," novels అంటే అపరిమితమైన appreciation. ఆంధ్ర ప్రచారిణీవారి పుస్తకాల్లో కథ గ్రహించడానికి వర్ణనలు అడ్డుతగుల్తాయని నాతో చాలాసార్లు Complain చేసేడు. ఈతరవాత భారతి వగైరా పత్రికల్లో కథలు చదవడం మొదలెట్టి Novels విడిచిపెట్టేడు. వ్యావహారికభాష రానీ వాళ్ళంతా వాడికి దేవుళ్ళే. ఇదీమావాడిభాషా పరిచయం

వెనక చెప్పవలసిన సంగతి ఇప్పుడు చెబుతున్నాను, క్షమించండి; మాచంద్రుడి Private life అద్భుతం అయింది. పూర్వులార్జించిన మట్టి పెట్టుకొని వాడు ఋణం చెయ్యకుండా కాలక్షేపం చేస్తున్నాడు. తండ్రి చిన్ననాడే పరమపదించడాన్ని కుటుంబం జనాభా, చంద్రుడు ఒక్కడితో stop అయింది. వాళ్ళమ్మ ఏడాది కిందటిదాకా బతికేవుంది. భూమిమీద వచ్చే రు 150 రూపాయలతోటీ, ఆ యిల్లాలు పొదుపుగా కాలక్షేపం చెయ్యడమే కాకుండా, కొడుకుని ఇంగ్లీషుచదువులో పెట్టి school final వరకూ వెళ్ళేడనిపించింది. ఆవిడ జీవితకాలంలో కుర్రాడికి పెళ్ళిచేయలేకపోయిన విచారం తప్ప మరొకటింక ఆవిడకి లేకపోయింది. అంచేత చంద్రుడికిప్పుడు friends తప్ప "నా" అనే వారెవరూ లేరు.

నిజం చెప్పాస్తే మాచంద్రుడు మొదట్లో ప్రవరుడులాంటి ఘరానా మనిషి. పాతిక యేళ్ళున్నా యిప్పటికి పెళ్ళి విషయంలో వాడు తొందరపడడు. "ఏంవిరా చంద్రం, పెళ్ళికోసం ప్రయత్నించవేంవిరా?" అని నేను మూడేళ్ళకిందట అడిగితే, "సంగోరు పెళ్ళి చాలారోజులాయి కుదిరిపోయిందోయి; మొగపెళ్ళి వారం సిద్ధంగానే వున్నాం, పిల్లంటూ జతపడితే" అన్నాడు. అప్పటికింకా, వాడిలో వున్న కవిత్వపు germ బయలు పడలేదు గనక అలాగు జవాబిచ్చేడు. తరువాత వాడిచ్చిన poetic reply ముస్ముందు వినిపిస్తాను.

School final తో చదువుకి ఆశ్వాసాంతం చెప్పినా మాచంద్రుడికి మాసపావాప దోషం నించి ఇంగ్లీషులో taste అంతరించలేదు. రెండు మూడేళ్ళకిందట, ఓనాడు వాడికి Shelley's Love's philosophy చదివి explain చేసి, నాకాలూతు వెర్రి మొర్రి translation వినిపించేను. వాడికి ఆనందం అయింది. అప్పటినుంచీ erotic భావగీతాలుకూడా కథలతో పాటు పత్రికల్లో చదవటం మొదలెట్టేడు. "ప్రబంధాలుకూడా చదవాలి side by side" అని నేను చెపితే by chance తారాశశాంక విజయం తీసి మొట్టమొదట చదివేడు దాంతో వాడిలో latent గా వున్న ఆవేశం బైటపడ్డాది. వీరావేశం కాదు,

కవితావేశం. Few days కిందట వాడి పెళ్ళి గురించి అడిగితే, "చంద్రుడికి నక్షత్రాలకేం లోటు" అన్నాడు. Dangerous trend లో వస్తున్నాడే అని చాలా భయపడ్డాను.

మా చంద్రుడికి ఓ వేలువిడిచిన మేనమామ Khargpur side నివున్నాడట. అతని కూతురిని తన కొడుక్కి చేదామని చంద్రుడు తల్లి చిన్నప్పుడు తంటాలుపడింది. కాని ఆ మేనమామ కాస్త railway లో డబ్బు తెచ్చుకుంటూవుండడాన్ని, ఏకపుత్రికకి ఘనమైన సమ్మంధం చేద్దామని నిశ్చయించుకున్నాడు. బరంపురంలో ఒక ప్లీడరుగారి కొడుక్కిచ్చి పెళ్ళిజేసేసు దాంతోటి ఆమేనమామతో విరోధం కలిగి, చంద్రుడు వాళ్ళతో భోజన ప్రతిభోజనాలు సహా మానుకున్నాడు. పిల్ల కాపరానికెళ్ళేయినాడుకే విధివశంచేత వైధవ్యం సిద్ధించింది. ఆ కబురు hearsay వల్ల చంద్రుడికి తెలిసింది. ఇవతల కవిత్వలక్షణాలు కలగడం; అంతలో వావిగల విద్వస్తగురికి దొరకడం, ఈ రెండు పరిస్థితుల్లో చంద్రుడు భావకవి కాక తప్పింది కాదు.

వెంటనే (ఇంగ్లీషులో కొంచెం అన్నప్రాశన అయింది కాబట్టి) పద్యాంతాలు నాలుగు రాసి నాలుగు పత్రికలకీ పంపేసేసు. పద్యాంతాలంటే "ఏతాదృశగుణఖనికిన్" ఇత్యాది డబ్బా పద్యాలు కావుసుమండీ ఇంగ్లీషులో "To—" అన్న గీతాలకి తెలుగులో "—కి" అని వ్రాయబడేది అన్నమాట. నాకుమాత్రం మావాడిలో యీ turn చాలా outrageous గా కనిపించింది. ఓనాడు చంద్రుణ్ణి నా closet లోకి పిల్చి హితబోధజేసేను. "ఒరే చంద్రం పట్టుమని పాతిక లైన్లు prose నిర్దుష్టంగా తెలుగులో రాయలేవావెను. Crossbreed సమాసాలు చేస్తూ యతిప్రాసభంగం, ద్రుతం. అంటే idea లేకుండా, మోటైటి నువ్వు కవిత్వంలో పురకడం? బాగులేదు సుమీ" అని చీవాట్లేసేసు. తనికి రావలసిన place in literature నేను envy చేస్తున్నాననుకున్నాడు వాడి అమాయకత్వానికి, మొట్టమొదట గట్టు తెగి, అపోహ ప్రవేశించడానికిదే ఆరంభం. కృతయుగంలో పుట్టవలసిన వాడని అనుకున్న చంద్రుడికి, 20th century యొక్క stigma పొడసూపింది. నామాటమీద అది పరతున్న గురికూడా తప్పోయింది. "వాంతో స్తే పెదిమెలు అడ్డుతాయా?" అన్నాడు. "ఇది వాంతికాదు. Prevelant గా వున్న కలరా యొక్క effects గనపడుతున్నా" యని మనసులో అనుకొని వూరుకున్నాను.

సలభైయాభై గీతాల్లాగ, అవరసని రాసేసు. ప్రణయపుచీకట్లో పాటలాడేసు ప్రణయాకాశంలో పాటలుపాడేసు, ప్రణయకాంతారాల్లో పరుగులెత్తేసు, ప్రణయభావాల్లో పరమపదించేసన్నాడు. ఎన్నిరాసినా గాలికబుర్లయిపోయేయి, అందవలిసినచోటికి ప్రణయవార్తలందలేదు. స్వయంగా, reprints పంపించినా, transit లోనే మూరుచేతుల్లోపడి బుట్టదాఖలైపోయేయి అఖరికి పెద్ద ultimatum లాగ, ప్రణయపుష్పాలు పారేశానన్నాడు; ప్రణయఫలం తుత్రిలు భగ్నంఅయిపోయేయన్నాడు; single blessedness అన్నట్టు ఏకాంతప్రణయమే అభిలషిస్తున్నానన్నాడు; దగ్గిరకొచ్చినా నాకక్కర్లేదన్నట్టు పర్యవసానం తేల్చేడు.

'Grapes are sour' అన్న రకంగా ప్రణయం resign చేసేసు.

కవిత్వంలో 'నాకు ఏకాంతం' అని ఘోషిస్తే మాత్రం, society లో ఉండవలసిన జీవికి

social effects కలగక తప్పుతాయా ? వాళ్లతల్లి నాడున్న frugal habits చంద్రుడికిప్పుడు తప్పే యి. క్లాసిఫికేసనులోను కంపువాళ్లోను ఆవిర్భవిం చిన poetic negligee సంసారంలో వుంటే సాగు తుందా ? నిత్యకృత్యం ఎలాగ వెళ్ళబుచ్చడం, అన్న question చంద్రుణ్ణి face చేసింది. Literary avocation లో వుంటే, డబ్బిచ్చి కావ్యాల కోసాన్ని ఆశ్రయించే దాత లెవళ్ళూ యీరోజుల్లో లేరాయెను. వెనకటికి western poet ఎవడో "పిల్లిని, దానికళ్ళు తనకి ప్రసా దించమని" ప్రార్థిస్తూ గీతం రాసేడు; రాత్రి దీపం పెట్టుకొని రాసుకుందామంటే కిరసనా యిలుకి డబ్బు లేనంత దుస్థితి ననుభవించేడు. అలాంటి రోజులే యిప్పుడూను. పూర్వపు poetic excellence ఇప్పుడు లేకపోయినా, కవు లికి దరిద్రం Common feature గా నిల్చింది. ఉన్న నుడిచెక్క యేదో అమ్ముకున్నాక, చం ద్రుడికి life problem బోధపడ్డాది.

ఓనాడు నా closet లోకి మెల్లగా వొచ్చి, చంద్రుడు "ఏమిటి గతి!" అన్నాడు. ఆ ఒక్క మాటలోనూ, వాడేదో crime చేసినట్టూ, దానికి repent అయినట్టూ భావం స్ఫురిం చింది. కూర్చోపెట్టి భర్తృహరిలోని యాచనా పూర్వకాలు శ్లోకాలు చదివి చెప్పేను. దారి ద్ర్యం యొక్క హైన్యతి బోధ పడ్డేను. "Scott చెప్పిన, Literature is the staff life, but not the crutch of life, అన్నవాక్యో యొక్క భావం ఉంది! ఇతరమైన ఉపాధివుంటే, పోకుగా తిరగడానికీ, పెద్దవేషం వెయ్యడానికీ, కవిత్వం ఉపయోగం కాని, జీవితానికి దానినే ఊత కర్రగా చేసుకుందికి పిల్లేదన్నాడు. కీలకాదారి కీలకాద. దానికీమనిషి. నిత్య జీవితానికి సమ్మం ధం లేదు" అంటూ సేనేదో lecture కొడుతు న్నాను. అప్రయత్నంగా చంద్రుడు కన్ను గొన లంట రెండు అస్రుబిందువులు జారి పడ్డాయి. "చంద్రం, సుక్కోదివరకు రాసేనని విర్రవీగిం దంతా poetry కాదు. ఈ repentance లోనే నిజమైన poetry వుంది. ఇప్పుడు మించిపోయిం కేంలేదు. మన city press కి నిన్ను recommend చేస్తాను; proof reader గా ప్రవేశించు. నీకు తు కేదో నువ్వు జరగ లేకపో" వన్నాను.

---

## [లోకమాన్య] బాలగంగాధరతిలక్.

తూలిక రాఘవేంద్రరావుగారు.

సీ॥ తొలుత స్వరాజ్య మన్నలుకు హిందువులకు బోధించినట్టి ప్రభుండెవండు
భారత హితముకై పరదేశముల కేగి ఖ్యాతి గాంచిన మహా ఘనుడెవండు
ఉన్నత పద్యారం ను త్తీర్ణుడయ్యును నొల్లకయుండె యుద్యోగ మెవడు
గాంధియు మొదలైన గణనీయులకు నెల్ల స్వాతంత్ర్యమునుగూర్చి చాటె నెవడు॥

గీ॥ పరమపావనమూర్తియై బరగె నెవ్వ డిలను బాలగంగాధర తిలకనంగ
నిట్టి వానిని మరువకు డిలను మీరు భవ్యమతులార భారత పుత్రులార॥

# పరితాపము.

మహీధర వెంకటరామశాస్త్రిగారు.

ఉ॥ వారిధిఁ జేరి దాటెడు నుపాయము లేక మునింగినట్టు సం
సార విశాల సాగర లసత్సుఖ భోగతరంగమాలి వి
స్తారముచేత భీతిఁగని దాటు నుపాయము లేని వేళలో
నారయ నొక్కతేపనిను నాత్మఁదలంపక పోతినీశ్వరా ॥ ౧.

చ॥ అతులిత తావకీన చరణాంబుజసేవయె మోక్షమంచు సం
తతమెద ధైర్యమూని కడుదారుణమైన భవాబ్ధిఁజేరఁ గ
వ్విలముననైన నత్తరిని వీనరవోవక ఘోరమౌ, విరా
గిత గని నీదుపాదముల గేల నిమిడ్చి నుతింపనైతిఁగా ॥ ౨.

మ॥ మధుసించద్రిమణీయ యోగిజనకామానోవదేశంబె దు
ర్విధినందోహవ నీకుతారమను చున్ వేసారిపేక్షించి స
త్కృధనాన్యస్త మనస్కతం గొలిచి మోక్షానక్తిచే దావక
పృథితాంఘ్రిద్వయముం దలంపకిటు నే పాపౌఘముం జేరితిన్ ॥ ౩.

సీ॥ భవదీయ రూపంబుఁ బరికించి పరికించి
మేనుపై రోమాంచమూను వేళ
భవదీయ గుణములం బాటించి పాటించి
హృదయమ్ము నీరమై నెగడు వేళ
భవదీయ పాదాబ్జ భక్తిమై మాపక
కాయమ్ము మోహంబు గాంచు వేళ
తావక మాధుర్య దాయక నామమ్ము
చిత్తవిస్మరణంబు జేయు వేళ ॥

అతులితానంద సందోహ వితతవార్ధి
వీచికాశ్రేణి జిత్తమస్థిరము గాగ
మేను భక్తి వథమ్ముతో మేళవించి
యింపలర నిన్ను నాత్మదలంపనైతి ॥ ౪.

---

## ఐ. సి. ఎస్ (ఇండియన్ కుకింగు సర్వీసు)

ఆదేవవ్రతిగా జీవించేవాళ్ళకి తప్ప, సాధారణ సంసారులైన మగవారికి వంటంటే ఒక సారైనా గండం అనక తప్పదు. విధివశాత్తు వంటాపాకం వర్యా నస్తున్నవారికి, తమ భార్యలను పుట్టిళ్లకి లీవు యిచ్చిన మగవారికి, యిటువంటి అనుభవాలు తప్పవు. మా నాకీ వంట చేసుకోవలసిన భారం కొద్దిలో యేవిధవకూతురో ఉండడంచేత తప్పిపోయింది. కొందరు అన్నీ అనుభవించగలిగి కూడ అనుభవించరు. మానాయన పాత తరగతికి చెందినవాడు. ఆలండి కొందువాడు గనుక నాకు తప్పలేదు. అయితే విధివ్రాతచేత నేను, తెచ్చిపెట్టుకొని మానాయన, యిదే మా యిద్దరికీ భేదం. ఇంకోరకంవాళ్ళుకూడ వున్నారు. ఎవరైనా వండిపెడితే తింటారు, లేకపోతే యే వెంకటేశ్వర్లు కాఫీహోటలు యిడ్డెనలతోనో లేకపోతే ఉపవాసంచేసో కాలం వెళ్ళబుచ్చుకుంటారుకాని, వంటయింటివేపు చూడరు. ఒక చెంబైనా ముట్టుకోరు. ఇటువంటివారిలో మా అన్న ఒకడు. అయితే మాకెవరూ అక్కచెల్లెళ్ళు లేరు. వాళ్ళని తీసుకువచ్చి యింత పసుపుకుంకం పెట్టుకోవాలసి కాని, విధవలైతే వాళ్ళ ఆస్తి చక్కపెట్టుకోవాలని కాని చింత యేమీలేదు. కనుక ఒంటికట్టు రామలింగం మాదిరి నేను, నా యేకాంతవాసం తయారు. నా యేకాంతవాసం యేలాగు వచ్చిందో వ్రాయటానికిది తరుణం కాదు. వ్రాయాలసి ఉద్దేశ్యంలేదు. నా వుద్దేశం అల్లా మగవారికి వంటకు యెంతసంబంధం. స్త్రీల స్వాతంత్ర్యం హెచ్చిపోతోందే. వయోనిర్ణయ శాసనాలట విధవా వివాహాలట రజస్వలానంతర వివాహాలట వీట స్థితిలో చిక్కుతున్న పురుషునికి self-defence యేమిటి, అని నా ఆలోచన, నా పరిశోధన. ఇలాగ వస్తుతే ఆంధ్రా యూనివర్సిటీ వారు యేదైన బిరుదు — యే ఇండియన్ కుకింగ్ సర్వీసో - యిస్తే మహాధన్యుణ్ణి అవుతాను. వారికి పనికి రాకపోతే, యిందులో కూడ నేపట్టింది పుస్తకంపోయిందని యింత విచారిస్తాను.

ఇది మహాపట్టణం గనుకనూ యేఅయ్యరో యేఅమ్మో అవతరించి యేసరస్వతీ విలాస్ హోటలో, యేరామలక్ష్మమ్మ హోటలో ఉండకమానదు. పేటల్లో తిరుగుతోంటే గోడల మీద Signboards లాగ పెద్దఅక్షరాలు కనిపిస్తానేవుంటవి. ఏకమ్మ హోటలో, యే కావుల హోటలో అయితే ప్లీడర్ల బల్లలను మించిన బల్లలు, పాట్లమీద శుక్రవారమునాడు బూరెలు, ఆదివారమునాడు పరమాన్నం అని యేవో పెద్ద అక్షరాలు కనిపిస్తానేవుంటవి. ఇవన్నీ వదులుకొని యీపిచ్చి ముండాకొడుకు వంట వంట అంటాడేమిటి, నెలకు యేపన్నెండు రూపాయలో పారవేస్తే కాలం పోదా అని అంతా అనుకోవచ్చు. ఆసంబంధమైన పరిశోధనకూడ చేశాను గనుక దానినికూడ పాఠకులకు దాఖలు చేసుకుంటూ మొదట రామలక్ష్మమ్మ హోటలులో ప్రవేశించాను. మా రామలక్ష్మమ్మమట్టుకు చాల తెలివిగలదే, ఆమె గబుస్తు కోటలు దాటుతాయి. కూరలు వగైరాలు తలపెట్టుతే మట్టుకు మన కూర మనకే అసహ్యం పుట్టుతుందంటే ఆశ్చర్యం లేదు పైగా తుంటరివాళ్ళంతా ఆమెతో ఎక

నక్కాలాడుతోంటే అరికాలు మంట పెట్టేది. కిరసనాయిలు బుడ్డి దీపం పొగ అంతా ముఖాల్నిండా, గదినిండా, విస్తరినిండా కమ్మేది. ఏ శానిటరీ యినస్పెక్టరునైనా తీసుకు వచ్చి చూపిద్దామంటే ఆడదానితోటి యుద్ధం ఇక్కడకూడ ఆడదానితోటి యుద్ధమేనా నా బాబు దేవుడా అనుకొని మూతితిప్పిలాను అనే మాటలు చేరుకున్నాను. ప్రొప్రయిటరు అప్పుడే South Pole నుండో North Pole నుండో దిగివచ్చినట్లుగా కుర్చీమీద కూర్చుని డ్రాయరుమీద వ్రాసుకుంటూ కూర్చున్నాడు. కృష్ణాకలెక్టరుకూడ అంత తీవ్రంగా కూర్చుంటాడనుకోను. నేను వెళ్ళేసరికి "ఉక్కాగుంగో స్వామి, మీల్సుదా కావల్నా యేమి" అని అతివినయంగా ప్రశ్నించాడు. "అతివినయం ధూర్తలక్షణం" అని ఎక్కడో చదివివుండటం చేత నేను కొంత జాగ్రత్తగానే వున్నా. "పూటకు దా 0-6-0, నెలకు సారు 12-0-0లు స్పెషల్ మీల్సు 0-8-0, 15-0-0" అన్నాడు. సాధారణంగా బజారులో మామిడిపళ్లు వగయిరాలు మచ్చులు చూపిస్తారు. ఆ ప్రకారంగానే పూటకూళ్ళవాళ్ళుకూడ ఓ పూట భోజనం మచ్చు చూపిస్తే బాగానేవుండును. అటువంటి ప్రమాదాలికి వాళ్ళింకా దిగలేదు. గనుక ఒక అర్ధరూపాయి యిచ్చి ఆ స్పెషల్ మీల్సు యేమిటో చూద్దామనుకుని ఒక టిక్కెట్టు పుచ్చుకున్నా. కథానాయకుడు లోపలికి ప్రవేశించాడు. చుట్టూ మూడువేపులా వసారా, ఒక వేపు కుళాయి కుళాయిదగ్గరే పీపా, పీపా నిండా నీరు. కుళాయికి అటుప్రక్కనే అంట్లు తోమటం. అక్కడవున్న ముక్కి యింతింతా కాదు. కాళ్ళు కడుగుదామని పీపాలోకి వంగి చూస్తే దానినిండా అన్నపు మెతుకులు, పాకుడు జంతుజాలాలు యేవేవో కనిపించాయి. అక్కడే యెలాగో కన్నుమూసుకుని కాళ్ళుకడిగి లోనికి ప్రవేశించా. బ్రాహ్మణులకి అగ్నిహోత్రానికి సన్నిహిత సంబంధం గనుక మహా హోటలవాళ్ళు గాడిపొయ్యి ప్రక్కనే యేర్పాటు చేశాడు మా భోజనం. సీతాకాలమైతే కొంచెం వెచ్చగా వుండేదేమో కాని వేసవికాలమగుటచే యిక్కడకూడ మనకి విఘాతంగానే వుందని అనుకుని నోరుమూసుకుని విస్తరికేసి చూస్తున్నా. ఈ స్పెషల్ మీల్సు యేమిటో, యే బంగాళాదుంపవేపుడో, యే వంకాయిబజ్జో వస్తుందనుకున్నాను. ఇంతలో ఓ అప్పడం, మామూలుగ వండిన అలచందకాయకూర పైగా కాఫీ హోటలులోవుండే బంగాళాదుంపకూర, యింతపెరుగు, ఆపెరుగు మాత్రం పుల్లటి వాసన కొట్టింది. కొని తెచ్చుకున్న తద్దినాన్ని ఆపూటతో నెట్టివేద్దామనే నావుద్దేశం. పోట్లాట పెట్టుకోటమంటే చాలకష్టం, వృథాప్రయాస. నాప్రక్కనే ఒకాయన కూర్చున్నాడు. ఆయనకి అన్నంలో ఏదో పురుగు వచ్చేటప్పటికి కోపంవచ్చి ధాం, ధిం అనేసరికి, అయ్యరువచ్చి "ఏమ గాన్నా, ఫస్టుక్లాసు బియ్యంతెస్తే లేనిపోనివన్నీ కల్పిస్తున్నావే. నా రాబడి పడిపోటానికా యిలా చేస్తున్నావు. యిలా చేశావంటే డిఫరమేషన్ దావా తెస్తాను చూడు" అన్నాడు. పాపమాయన శానిటరీ ఇనస్పెక్టర్ని తీసుకువచ్చి చూపిస్తే "అయ్యరూ, ఎన్నిసార్లువూరుకున్నా నీమీద కేంప్లయింట్లు పోలేదు" అన్నాడు. "చిత్తం క్షమించాలి. అపురుగు ఏపైనుంచి పడిందో" అంటూ మెల్లగా యేదో మడిచిన కాగితం ఆయనచేతులో పెట్టేటప్పటికి గంఫా

కొట్టుతూ వుండేది. "నేవు పెళ్ళానికి కోపం వాళ్ళు కూడ నాన్నా ఆపరేటు చెయ్యడంతో వచ్చి నెమ్మికట్టితే నాగతెంకావాలి. విద్యయు మనవిద్య మనకి బాగా వుపకరిస్తోంది. వూరికే కట్టడికిపోతుంది" అనేవాడిని. నాన్నో ఆపరే చెప్పాడు కూడ, "ఏవస్తువైనా వాడేళ్ళుంటు. షన్ రావడం, వుద్యోగమే కాకుండా కావలసిన దాని ఉపయోగం తెలుస్తుంది" అని.



## భ క్త సం దే శ ము.

శాస్త్రి కేశవాచార్యులుగారు.

మ॥ అణుమాత్రుండవో, యాదివిష్ణో, చతురా ◆ మ్నాయాధికారుండవో
దినమానంబుల కాధిభూతుండవో బు ◆ ద్ధ్యజ్ఞవిధానుండవో
త్రిగుణరూపుండవో; కావో నాకిపుడు త ◆ ర్కంబేల? నీ నర్వల
క్షణ లక్ష్యంబెవనుండ సేయు మహరే ◆ శ్రీ; రామచంద్రప్రభూ ॥

శా॥ నీనామంబు భజించుచుండు, మదిలో ◆ నిత్యంబు సద్భక్తితో
ధ్యానింతున్ భవదీయ దివ్య జగదే ◆ కారాధ్యమూర్తిన్ మద
జ్ఞానంబున్ బరిమార్పుమా! భగవదా ◆ జ్ఞావర్తినై సద్గ్రహో
జ్ఞానంబున్ గనఁజేయుమెప్పుడు రమే ◆ శా రామచంద్రప్రభూ ॥

మ॥ భవకూపంబను నంధకారమున దౌ ◆ ర్భాగ్యంబుచేఁ జిక్కియున్
లవమైనన్ దరుగంగనీయ కిల పా ◆ లన్ బోసి యీదేహమున్
నవనీతంబునకన్న నెక్కువగ నా ◆ నందించి పోషించుచున్
భవదీయస్మరణంబెరుంగ నెపుడైనన్ రామ......

శా॥ ఏవానంబున, నేవనాంతరమునం ◆ దేయే నదీతీర్థముల్
స్నానంబులు చేయబోయినను, బ్రా ◆ గ్జన్మానుకర్మంబులం
దే వెన్నంటును, దీర్ఘయాత్రివలనన్ ◆ నేపారుపుణ్యంబునన్
నీ నిత్యంబున నమ్మువారెవరు తండ్రీ రామ.........

మ॥ మహాత్మ్యంబున జెప్పరే మునులు కా ◆ మక్రోధ మాత్సర్యముల్
దేహంబందున నుండునంతవరకున్ ◆ దేవాంఘ్రిసేవాజన
స్నేహంబొందగబోఁడు మానవుఁడనన్ ◆ వృష్టింపగానేల, నీ
నాహా! వంచకుఁడౌట నత్యమగుకాదా; రామ......



# ఆంధ్ర భారతి

మచిలీపట్టణము

సంపుటము 2 | సెప్టెంబరు 1927 | 6 వ సంచిక.





## బ్యాంకుల యవసరము:—

హిందుదేశము స్వయంసహాయముపై నాధారపడునది. గొప్ప మేధావంతులు గలరు శాస్త్రజ్ఞులు, పండితులు గలరు. కాని దుర్భర దారిద్ర్యమును బాపువారెవరును లేరు. మనకు గావలసినది పరపతి. పరపతిని సృష్టించుకొను టెట్లు? మేధావంతులందరుకలిసి పరిశోధించి నూతనమార్గము త్రొక్కవలెను. బాహ్యసౌభాగ్యమంతయు కల్పితమేకాని వేరు కాదు. నేడు మన వద్ద వెయ్యిరూపాయిలున్నచో రేపు రెండువేలు సంపాదించగలము. నేడా వెయ్యిరూపాయిలే లేనిచో మనకు రెండువేలు నష్టము వాటిల్లును. ఇటువంటి దుస్థితి నెట్లుబాపగలము? అన్నిప్రభుత్వములవారును కోట్లకొలది కరెన్సీనోట్లను సృష్టించుచుందురు. ఎందులకు? వాటిమూలమున తాత్కాలికావసరముల గడుపుకొనుటకు. నాచేతిలో పదిరూపాయల నోటున్నదనుకొనుడు? దానియర్థమేమి? ఆపదిరూపాయల నోటుతో నాయిష్టమువచ్చిన సరుకులను కొనగలను. అనిన, నానోటువిలువకు దేశము నాకు బాకీపడియున్న దన్నమాట. అనేకబ్యాంకులు కోట్లకొలది నోట్లను సృష్టించి కోట్లకొలది లాభముల గణించుచు నున్నవి. నిజమైన డబ్బులేక, కాగితపు ముక్కలను సృష్టించి లాభములు తీయుచున్నవి. ఇతరులకు డబ్బుకావలసి వచ్చినపుడు బ్యాంకులు నోట్లను సృష్టించి, నూటికి యేడెనిమిదికి వడ్డికి ఋణములిచ్చి లాభము సంపాదించుచున్నవి. ఏయుద్ధము తటస్థించిగాని, మరి యేసందిగ్ధావస్థ తటస్థించిగాని కష్టకాలము వచ్చినపుడు ప్రభుత్వములు తమ తమ బ్యాంకుల రక్షణకు వత్తురు. 1914 లో బ్రిటిష్ గవర్నమెంటువారును 1927 లో జపాను ప్రభుత్వమువారును తమతమ బ్యాంకులను రక్షించుకొనిరి.

హిందుదేశములో పరిశ్రమలు వ్యవసాయము బాగుగ కొనసాగవలసి యున్నవి. ఇందుకు బ్యాంకువ్యాపారము చాల యనుకూలించును. విశ్వాసపాత్రులును, తగినంత ద్రవ్యమును కావలసియుండుట చూచుచున్నాము. డబ్బులేనివారికి ఋణము లిచ్చుచుండుటచే, బ్యాంకులలో

డబ్బుండదు. హిందు దేశమున 33 కోట్ల ప్రజలు గలరు. వీరికిగల ఋణభారము 600 కోట్ల రూపాయలు. నూటికి నాలుగైదు వడ్డికి వీరికి ఋణముదొరికినచో, ప్రతిసంవత్సరము 30 కోట్ల రూపాయలవంతున తీర్చివేయగలరు. మరి 100 కోట్లరూపాయముల వరవతి లభింపగలుగుచో దేశీయవ్యవసాయము పరిశ్రములు కొనసాగి ప్రజాజీవితము సౌఖ్యమార్గమును ద్రొక్కగలదు. ప్రభుత్వమువా రెంతయధికముగ ద్రవ్యమును సృష్టించి విశ్వాసపాత్రులకు లభింపజేయుదురో, అంత యధికముగ ప్రయోజనముగలదు. కష్ట సమయములో ప్రజలును ప్రభుత్వమును సర్దుబాటులు చేసికొనినయెడల, శాంతిసమయములో వ్యాపారము వ్యవసాయము పెంపొందించి యేల లాభమును పొందజాలరో దురూహ్యము.

## సెంట్రల్ బ్యాంకులు.

మే ముదహరించు సెంట్రల్ బ్యాంకులు సహకార విధానమునకు చెందినవికావు. దేశార్థికమునకు తోడ్పడు కేంద్ర వడ్డీ వ్యాపార సంస్థలను గురించి వ్రాయుచున్నాము. ప్రతి దేశమున కొక్కొక్క బ్యాంకు కలదు. ఆవిధముగనే నేడు హిందుదేశమునకు సెంట్రల్ (కేంద్ర) బ్యాంకు కావలసియున్నది. ఈ సమస్య నూరు సంవత్సరములనుంచి వ్యాపించియున్నది. 1836 లో ఈస్టుఇండీస్‌లో వ్యాపారముచేయు పాశ్చాత్య వర్తకులు లోక బ్యాంకును స్థాపింప నెంచిరి. బ్రిటీషు దేశమునుండి ద్రవ్యము నీబ్యాంకు ద్వారా హిందూదేశమునకు దెచ్చి వర్తక వాణిజ్యములు కొనసాగించి లాభములను తీయుటయు, హిందుదేశ ఆర్థికవిధానములో స్థిరత్వము నెలకొల్పుటయునై యున్నది. 1773లో నిట్టి విషయమును మనస్సునందుంచుకొని వారన్ హేస్టింగ్సు కేంద్ర బ్యాంకును, పెద్ద పెద్ద పట్టణములలో బ్రాంచి (శాఖ)లను నెలకొల్పెను. దక్షిణాఫ్రికాకు రిజర్వు బ్యాంకు అను పేరుతో సెంట్రల్ బ్యాంకు గలదు. ఇంగ్లండుకు బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండు గలదు. అమెరికా, జర్మనీ, స్విట్జర్లాండు, జపాను మున్నగు దేశములలో నా యా పేర్లతో సెంట్రల్ బ్యాంకులు గలవు.

## నిర్మాణము

సెంట్రల్ బ్యాంకు లెన్ని విధములుగనున్నవి? వీటి నెట్లు నిరహించవలెను? ప్రభుత్వము లెంత వరకు తోడ్పవలెను? అను విషయములను చర్చించ వలసి యున్నది. సెంట్రల్ బ్యాంకుల ముఖ్యోద్దేశ్యము ఆర్థిక స్థిరత్వము నెలకొల్పుట. పద్ధతులు మాత్రము దేశకాల పాత్రముల ననుసరించి మారుచుండును. వడ్డీ రేట్లు మార్చి ఋణవ్యాప్తిని గావించినంతమాత్రమున సర్వము ముగియదు, సెంట్రల్ బ్యాంకుల వ్యాపారమునకును మితము గలదు. నిపుణతతో దురుద్దేశము లేక నిర్వహించేయెడల, ఋణములు లభించి ఆర్థిక స్థిరత్వ మేర్పడుటయు, తన్మూలమున వస్తువుల ధరలకు నిలకడ యేర్పడుటయు జరుగును. ఈ బ్యాంకులు మూడు రకములు (1) Federal Reserve System ఒకే బ్యాంకు వివిధ ప్రాంతములలో వ్యాపారము చేయును, ఇందుకు అమెరికా తార్కాణము (2) ఆ యా ప్రదేశములలో బ్రాంచిలను స్థాపించి వ్యాపారము చేయునవి. ఇందులకు జర్మనీలో రీచ్సి

బ్యాంకు గలదు. ఫ్రాన్సుకూడ నిందులకు నిదర్శనము (3) ఆ యా పెద్ద పెద్ద ప్రదేశములలో పెద్ద బ్యాంకు లుండును. ఈ పెద్ద బ్యాంకులకు వేర్వేరు స్థలములలో బ్రాంచిలుండును. ఇటువంటి పెద్ద బ్యాంకులను కేంద్రీకరింపచేయు సెంట్రల్ బ్యాంకు మూడవ పరకమునకు చెందియున్నది. ఇందుకు దృష్టాంతము బ్యాంకు అఫ్ ఇంగ్లాండు.

ఆర్థిక స్థిరత్వము, ధరల నిలకడ సెంట్రల్ బ్యాంకుల ముఖ్యోద్దేశ్యమైనపుడు, సెంట్రల్ బ్యాంకులు లాభములకొరకు పాటుపడరాదను వాదనగలదు. ఆచరణమున నిది సాధ్యము కాదు. భాగస్వాములు లాభములు పొందనిచో సంతృప్తిపడరు. ఇందువలననే సౌతు ఆఫ్రికన్ రిజర్వుబ్యాంకు విధానములో లాభముల పంపిణీ కేర్పాటు చేయవలసి వచ్చినది. లాభములు పంచిపెట్టినగాని భాగస్వాములు సంతృప్తిపడరని యూహించియే ఐర్లాండులో బ్యాంకింగ్ కమిషన్‌వారు సెంట్రల్ బ్యాంకే అవసరము లేదనిరి (1) డివిడెండు లేక లాభముల పంపిణీకి పరిమితి నేర్పరచుట (2) ప్రభుత్వము వారే బ్యాంకుల యజమానులుగనుండుట (3) ప్రభుత్వమువారికి బ్యాంకు భాగములలో కొన్నిటిని ప్రత్యేకించుట. ఈ మూడు మార్గములలో దేని ననుసరించియైనను కట్టుబాట్లు చేసికొనవచ్చును. మొదటి పద్ధతిని చాల సెంట్రల్ బ్యాంకు లనుసరించుచున్నవి. రెండవ దానికి యుదాహరణము ఆస్ట్రేలియాలోని కామన్వెల్తు బ్యాంకు. మూడవదానికి నిదర్శనము స్విట్జర్లాండులోని నేషనల్ బ్యాంకు. ఇచట భాగములలో నైదింట రెండుపాళ్ళు ప్రభుత్వమునకును, రెండు పాళ్ళు ప్రజలకును, ఒకపాలు పాత బ్యాంకులకును చెందును.

## పాలకుల సంబంధము:—

ఇటువంటి సెంట్రలు బ్యాంకులతో పాలకులకెంతవరకు సంబంధ ముండవలెననునది ముఖ్యాంశమై యున్నది. సెంట్రలు బ్యాంకులను కేవలము పాలకులు స్థాపించుటలోను కొన్ని చిక్కులు గలవు. స్వతంత్రదేశములలో స్టేటు బ్యాంకు లున్నయెడల, అధికారములోనున్న నాయా రాజకీయ కక్షులవారు తమ ప్రాబల్యమునకు అనువగురీతిని బ్యాంకు నిబంధనలు మార్పుచేయుచుందురు. కనుక రాజకీయ వొడుదుడుకులవలన బ్యాంకు వ్యాపారముకూడ నిలకడలేకయుండును. విదేశీయులు పాలించుచున్న దేశములలో స్టేటు బ్యాంకుల నెలకొల్పుచో, విదేశీయులు పాలితులను మరచి తమ స్వార్థమునకు అనుకూలించురీతిని బ్యాంకు నిబంధనలు మార్చుచుందురు. ఇదియును అనర్థమే. దేశములోగల పాతబ్యాంకులకు కూడ సెంట్రలు బ్యాంకులో భాగమునిచ్చి మిగిలిన భాగములను ప్రజలకు విడుదలచేయు నాచారము స్విట్జర్లాండులోను దక్షిణాఫ్రికాలోను గలదు. ఇట్టి యేర్పాటులో గొంతప్రయోజన మున్నది సెంట్రలు బ్యాంకులో పాతబ్యాంకులకు సావకాశమిచ్చినయెడల వ్యాపారపు కష్టసుఖములు పరస్పరముగ నాలోచించుకొని దేశసౌభాగ్యమునకు తోడ్పడుదురు. లేనియెడల సెంట్రలు బ్యాంకు వ్యాపారమునకును పాతబ్యాంకుల వ్యాపారమునకును పోటీగలిగి పరస్పర వైమనస్యములకు కారణమేర్పడును.

## ఆక్షేపణః—

గత సామ్రాజ్య శాసనసభా సమావేశము లో బ్యాంకింగ్ విషయములో భారతీయులకు సాహసములేదని అధికారసభ్యులు హేళన చేసియున్నారు. ఈ హేళనయొక్క అంతరార్థ మును పరిశోధించినయెడల ఈవాదన యెంతసత్య మని తేలగలదు. దేశము మొత్తముమీదనసహకా రోద్యమము 25 కోట్ల రూపాయిలతో వ్యాపా రము చేయుచున్నది. ఈ వ్యాపారమున మని షికి ముప్పావులా వంతునకూడ పరపతి లభిం చుట దుస్తరముగ నున్నది. హిందూదేశము వ్యవసాయముతో నిండియున్నది. వ్యవసాయ కుల ఋణము దేశము మొత్తముమీద మూడు వందలకోట్ల రూపాయలు అనగా మనిషి ఒక టింటికి తొమ్మిది రూపాయలు ఋణమున్నపుడు పన్నెండవవంతు ముప్పావలా మాత్రమే పరపతి లభించుచున్నది. సహకారశాఖలో అధికారులు కోట్లకొలది జీతములను సగ్రహించుచున్నారు. అనధికార సంస్థగా నుండవలసిన సహకారసంఘ ముపై అధికారము చలాయించుటకు అయిదు వందలు మొదలు రెండువేలవరకును జీతముపై వుద్యోగస్తుల నేర్పాటుచేయుటకంటె జీతముల క్రింద వెచ్చించుచున్న కోట్లకొలది రూపాయి లు వ్యవసాయకుల కొరకేల నుపయోగింపబడ రాదో తెలియకున్నది. పండినపంటలో ముప్పా తికగవర్నమెంటు శిస్తుక్రిందను కూలిపనుల క్రిం దను పోవుచున్నది. మిగతాపాతిక తిండిక్రింద సరిపోవుచున్నది. కట్టుగుడ్డలకు వివాహాది శుభ కార్యములు మొదలుకొని ప్రేతకర్మలు వరకును జరుగవలసిన నిత్యకృత్యములకుగాని, భూమిని యభివృద్ధికిదెచ్చి మరింత సారవంతముగ జేయు టకుగాని అవకాశము లేకున్నది. ఏడాదికి 60 కోట్లు సైన్యముక్రింద పోవుచున్నది. ఎందు కీసైన్యము. తిండిగుడ్డలేక మలమల మాడుచున్న ప్రజలనుసంరక్షించుటకా? బ్రతికేయవకాశమేలేని ప్రజలను కాపాడుటయనిన హేళన గాకపూనదు. రైళ్ళ లాభములా విదేశకంపెనీలకు పోవుచు న్నది. బంగారుగనులా విదేశకంపెనీలకు కం ట్రాక్టులీయబడు చున్నవి. ఉన్న పరిశ్రమలకా ప్రభుత్వమువారు సంరక్షణ నీయరు. బొంబా యిలో బాక్‌బే స్కీములో లక్షలు లక్షలు వ్యర్థమైనపుడు అడిగిననాధుడులేడు. అన్నివైపు లను బంధించివైచి నిబంధనములను త్రెంపుకొం డనిన గోచుచుట్టుమీద రోకలిపోటు కాకమా నదు. ప్రజలయొక్క దారిద్ర్యమునకు తమ్మా లము జనించు అసమర్థతకు తామే కారకుల మని ప్రభుత్వమువారు మరచి ప్రజలను మంద లించుట వెర్రియనిపించకమానదు.

## నీలువిగ్రహనత్యాగ్రహము.

బ్రిగేడియర్ జనరల్‌నీల్ అను బ్రిటిషు యోధానుయోధుడు 1857 లో జరిగిన సిపా యిల తిరుగుబాటు నణచుటలో యుక్తాయుక్త ములు గమనించక ప్రజలను బాధించి బ్రిటిషు సామ్రాజ్యమునకు మహోపకారము చేసి యున్నాడు. తాను క్రూరకార్యములను చేయు టయేగాక తన తాబేదారులచేతకూడ ఘోర కృత్యములను చేయించెను. ఈ నీలుగారు మేజర్ రీనాడ్‌గారికి తిరుగుబాటుసమయములో ఈ క్రింది హుత్తరువు నొసంగెను.

"ప్రత్యేకముగ సూచించబడిన గ్రామము లను నాశనము చేయవలెను. అందు నివసించు

చున్న పురుషులను నరికివేయవలెను. తిరుగుబాటులో జేరిన సిపాయిలు లొంగనియెడల బంధించి ఉరితీసి వేయవలెను. తిరుగుబాటు చేసిన ఫతేపూరు నగరమును ముట్టడించి పఠానులు నివసించు స్థలములను అందుండువారుసహా నాశనము చేయవలెను. తిరుగుబాటుదారుల తలకాయలను, ముఖ్యముగా ఫతేపూరుకు సంబంధించిన వాటిని, నరికివేయవలెను. అక్కడ నున్న డిప్యూటీ కలెక్టరును పట్టుకొనినయెడల అతని తలకాయను తెగవేసి యానగరములో ముఖ్యమైన మహమ్మదీయ సౌధోపరిభాగమున వ్రేలాడ వేయవలెను."

ఈ నీలుగారి చర్యలనుగూర్చి సర్ జార్జి కాంబెల్ గారిట్లు వ్రాసియున్నారు.

"బెనారెసులో నేమి జరిగినదియు నాకు సరిగా తెలియదు. కే గారు తెలియపరచిన యుదంతములను నీలుగారు గావించిన ఘోరకృత్యములును జరిగినవని తలచుచున్నాను. అలహాబాదులో విపరీతముగ ఉరితీయబడి నీలుగారు స్వయముగా నిట్టి ఘాతుక కృత్యములు చేయుటయేగాక ఆయనచే పంపబడిన సైనికోద్యోగి కాన్‌పూరులో నిర్లక్ష్యముగా అనేక మందిని హత్యచేసెను. తరువాత నీలుగారు యింతకంటె ఘోరకృత్యము చేసియుండిరి. ప్రజలను ప్రాణములు పోవువరకు బాధలు పెట్టెను. ( Tortured )"

కే గారు తమ గ్రంథములో నిట్లు వ్రాసియున్నారు

"మార్షల్లా ప్రకటింపబడినది. మే, జూన్ మాసములలో శాసనసభ అంగీకరించిన దుండగ కార్యములు అమలు జరుపబడినవి. సైనికులు సివిలు ఉద్యోగస్థులు, విచారణ లేకయే స్త్రీ పురుష విచక్షణలేక రక్తమును ప్రవహింప జేసిరి. అంతటితో రక్తముకొరకు దాహము మరింత హెచ్చినది. అప్పటి హిందూదేశపు గవర్నరు జనరల్ గారు బ్రిటీషు పార్లమెంటుకు పంపిన నివేదికలలోని ఘోరకృత్యము లన్నియు వివరింపబడియున్నవి. వృద్ధులు, స్త్రీలు, పిల్లలు కూడ తిరుగుబాటు నేరస్థులతోబాటు హత్య చేయబడిరి. వారిని ఉరితీయలేదు. వారిని స్వగ్రామములలోనే కాల్చి చంపి వేసిరి. అక్కడక్కడ కొలదిమందిని మాత్రము తుపాకులతో కాల్చి చంపివేసిరి. తామెవరిని విడిచి పుచ్చలేదనియు తాము కసితీర్చుకొన్నామనియు వ్రాతమూలకముగ ప్రచురించుకొనుటలో బ్రిటీషువారు యేమాత్రము వెనుకాడలేదు."

ఇటువంటి నీలుగారిని మేధావి అనియు శక్తిసామర్థ్యములు గలవాడనియు సాధు స్వభావము గలవాడనియు ఆత్మత్యాగము కావించినట్టి పుణ్యమూర్తి యనియు కానింగు ప్రభువంటి సైన్‌రాయి పొగడినపుడు వేరు చెప్పవలసిన దేమున్నది? ఈపుణ్యమూర్తియొక్క నామమును చిరస్మరణీయముగ జేయుటకే మద్రాసు నగరములో ఒక శిలా విగ్రహము స్థాపింపబడినది. ఈశిలా విగ్రహమును నిర్మూలము చేయుటకే నేడు మద్రాసు నగరములో సత్యాగ్రహము జరుగుచున్నది.



# ఇప్పటి చదువు.

ముడుంబ నరసింహాచార్యులుగారు.

(మంజరీ గేయము.)

భరతవిజ్ఞా ♦ నమ్ము వెల్లడి
పఱచు విద్యలఁ ♦ బొట్టనిండునె ?
స్కూలుఫైనలు ♦ ప్యాసుకమ్మని
కోరు నొకతండ్రి. 1.

ఇంటనందరు ♦ నింగిలీషె
వింటకింపుగ ♦ నాడరాదా ?
పాడు తెలుఁగది ♦ యేల ? నంచును
బల్కు నొకతల్లి. 2.

పేరునూరును ♦ లేని యాయు
ర్వేద విద్యా ధ ♦ నమ్ముగూర్చునె ?
నన్ను మెడికల్ ♦ కనుపుమని యొక
నందనుడు వల్కు. 3.

చల్దియన్నం ♦ బేల పొద్దున ?
జబ్బుచేయదె పిల్లవాండ్రకు ?
వేడికాఫీ ♦ నీయఁదగు, నను
వెలదియొక్కర్తు. 4.

పంచకట్టును ♦ పైనధోవతిఁ
గాంచనేహ్యము; ♦ వైటుషూటును
వేయ్స్టుకోటు, ధ ♦ రించి తిరుగుటె
ఫేషనను నొకడు. 5.

ముదుకఖద్దరుఁ ♦ గట్టగలమే ?
బుక్కమజిలినె ♦ మోటుదోచెను;
క్రొత్తయాగా ♦ పాణికోనుమని
కోరునొకలేమ. 6.

కానుకజుట్టును ♦ బిల్కయేమిటి ?
వెక్కిరించిన ♦ యట్లు; హాయిగ
ముందుక్రాపును ♦ దువ్వుకొనుటే
ముచ్చటను నొకడు. 7.

సిగయు ముడియుం ♦ గొప్పనేటికి ?
సిగ్గగున్; నా ♦ ల్జడకుఁ జివరను
రంగుపేలికఁ ♦ గట్టఁదగునను
రమణియొక్కర్తు. 8.

పుణ్యపాప వి ♦ చక్షణలతో
బొద్దుపుచ్చిన ♦ నేమిలాభము ?
ధనముపీలును ♦ బట్టిలాగుటె
ధర్మమనునొకడు. 9.

వావులేటికి ? ♦ మనసుకలిసిన
వారిజాక్షిని ♦ గూడి వాంఛలు
దీర్చుకొనుటే ♦ జన్మఫలమని
తెలుపునొక్కండు. 10.

ఔర ! కోర్కెలు ♦ పండె; నాగరి
కాగ్రగణ్యుల ♦ మైతి; మిప్పటి
చదువునకు మన ♦ మందితిమిగా
సహజమౌఫలము 11.

క్రోటనుల్ నా ♦ టించి, పండ్లకు
గోర్కెలూరిన ♦ నేమిఫల ? మా
గుబురుటాకుల ♦ హొయలులె మెచ్చుచు
గుల్కవలెగాక. 12.

# చార్వాకులు — సయిన్సు.

ఉమర్ అలీషాగారు.

ఈకాలములో దేశసౌభాగ్యమునకు మార్గదర్శకములో యనునట్లాంధ్రభాషను పెక్కు పత్రికలు బయలుదేరు చున్నవి. ఇందు ముఖ్యమైనది యారోగ్యమును సూచించు విషయము. పూర్వము చార్వాకు లనబడు నొకజాతి మన భారతదేశమును పాలించినది. దాని సిద్ధాంతకారుడు (ఆచార్యుడు) విరోచనుడు. ఈతడు పాషండుడని తరువాత గర్హింపబడెను. నీతని మతము వేదసమ్మతమే యనియు "సవాయేషపురుష యన్నరసమయః" యను వేద ప్రమాణములను సాక్షిగా గొని పురాణములన్నియును గ్రోడీకరించి యొక పెద్ద సిద్ధాంతము వ్రాసి సృష్టికి దల్లి కిందులుగా జేసినాడు. అతని సిద్ధాంత మారోగ్యము. ఆరోగ్యమే భోగ భాగ్యములకు గారణమని నీవి జరారోగ భారములచే ద్రవ్యించి శారీరక శాశ్వతత్వ మాపాదింపవలెనని శరీర మరణాంతర మారిపోయిన దీపమువలె సర్వ వినాశనమైపోవునని గాలిలో లీనమైన దీపకళిక యుష్ణవ్యాది తేజస్సులు బాసినట్లే జీవుడు లోకాంతరంగుడైపోయిన దిరిగి రాడని యదే పోవుట స్థిరమని యున్నరెన్నాళ్ళే స్వేచ్ఛోపభోగముల నారగింపవలసినదని యట్టి స్వేచ్ఛ కభ్యంతరమైనవెల్ల దురాచారములని స్వార్థపరుల ప్రబోధములు ఖండించి పెద్ద సిద్ధాంతగ్రంథములు వ్రాసి పెక్కు తార్కికుల నోళ్ళు బిగించి తన మతము సూర్యచంద్రాక్రమము గావించినాడు. కాని యది మన యభాగ్యమువలన ఖిలమైపోయినను తన్సూచకమైన యాయుర్వేదశాఖ లందందు మిగిలియున్నవి. అందు రసస్వరూప సార్ణయము ముఖ్యము. రసము హరవీర్యమని వారందురు. మానవశరీరమందు వీర్యమెట్టిదియో పంచభూతాత్మకమైన యీశ్వరస్వరూప జగత్తునందు పాదరసమట్టిది. జీవుడు కించిజ్ఞత్వాది గుణవిశిష్టుండును, యీశ్వరుడు సర్వజ్ఞత్వాది గుణవిశిష్టుండునై యున్నాడు. అనగా సముద్రమునకు బాయందలి యొక జలకణమునకును గల భేదమువంటిదే జీవేశ్వరుల భేదమనియు, నంతకన్న నధికము కాదనియు, సమిష్టిరూపకమైన సముద్రమునకున్న శక్తి వ్యష్టిరూపకమైన చుక్క కుండునట్లే యీశ్వరునకున్న శక్తి జీవునకుండుట యసంభవముకాదు. కావున హరవీర్యమగు పాదరసము శుద్ధిచేసి సేవించిన జరామరణములులేని సిద్ధి రససిద్ధిచే రానేర్చునని వారా సిద్ధాంతమును చేసి క్రమముగా పెంచి తంత్ర గ్రంథములు వ్రాసినారు. అవి 27 కలవు. ఒక్కొక్క తంత్రమున నొక్కొక్క సిద్ధయోగ మియ్యబడినది. మొదటి రసశుద్ధియనగా రసమునకు సూతమని పేరు. "సూత" యనగా శూద్రుడు. శూద్ర స్వరూపముగల రసమును రసేంద్రము చేసి "మృదు స్వర్ణదళం రసేంద్రం" యనగా రాజునుచేసి దానిని పారదముచేసి (యనగ బ్రహ్మస్వరూపముగ మార్చి యని) యట్టి మూలికాసహాయముగా సేవించిన జితేంద్రియత్వము చేకూరునని "పాతంజలి" యున్నట్టు యోగమతస్థులు "యోగాశ్చిత్తవృత్తినిరోధః" యని సిద్ధాంతములు సూత్రములు వ్రాసి బోధించిన చిత్తయికాగ్రత చిరకాలసాధ్యములను హఠయోగాది మహత్తరమైన నష్టసిద్ధులను ముద్రారూపకమైన బ్రహ్మతేజస్సును శింశుమారచక్రము సభూమిపటిని నగుపర్చి నిర్వాణమార్గము సులభముఁజేసిరి. దీనినే బాదరాయణు లత్యుత్తమోదేశమని వారందురు. ఇట్లే రసమును పెంచి పెంచి Chemistry లో గొప్ప ప్రదర్శనము జూపి నీచ లోహములను ఘన లోహములుగ మార్చి దానిని పదముచేసియని పేర్కొనినారు. అనగా బద్ధశుద్ధమైన పాదరసముచేత నీచ లోహము బంగారమగునని యర్థము. దానిచేయనగా యిట్టివస్తువు లన్నిటికి నొక పరిభాష గల్పించినారు. అది నేటికి వైద్య గ్రంథములలో వాడబడుచున్నది.

| | రూఢ్యర్థము. | వైద్యార్థము. |
|---|---|---|
| సూతము | శూద్రుడు | రసము |
| గంధము | వాసన | గంధకము |
| భాను | సూర్యుడు | రాగి |
| తీక్ష్ణ | కఠినము | లోహము |
| ఆరూఢము | నిజము | గవ్వ |
| గగనము | ఆకాశము | అభ్రకభస్మము |

ఇట్లే హేమవిద్యకు యజ్ఞధేయమని పేరు. ఇదే ఋషుల వద్ద నుండెడిది. ఈసూత్రములే పురాణములలో నుండెడి కథలని వారివాదము. ఉ॥ గోవును జంపిన చండాలుఁ డగ్నిలోఁగాఁ" నని యుండును. చార్వాకులనగా రసవాది, పైదానికి గోవనగా గోవంతితాళకము, చంపిన యనగా భస్మముచేసిన, దానితో బొదిగిన, చండాలుఁడు యినుము బంగారమై, యగ్నిలో గాలును — అగ్నిలో నిలుచును. గెటువనను కచ్చునని యర్థముచేయుదురు.

## బాల సూర్యోదయము.

శ్లో॥ సూతాత్రైగుణ్య గంధం పరిమిత మమృతం భాను తీక్ష్ణంచనేత్రం।
ఆరూఢం తచ్ఛమర్ధం గగనశరయుతం ॥

రససిద్ధిచే జరామరణములజయించి హాయిగ స్వేచ్ఛోపభోగములకై హేమవిద్యచేత గిలించి జీవనము చేయువారే యార్యపురుషులని యట్టి ఋషిశ్యమెల్లరకు సంఘటింపజేయుటయే మా మతమనిచాటి చెప్పిన యాప్రాచీన వైద్యసాంప్రదాయములపునరుజ్జీవింపజేసి పరిశోధించి యామహాభాగ్యము దేశమునకు సమకూరుగాక! ఇంతకన్న వేరు స్వరాజ్యమేమికావలెను?

గుడిపాటి వెంకటాచలంగారు,

# ఇద్దరం మిగిలాం.

## 1

మొదటతనే నన్ను చూచి చిరునవ్వు నవ్వింది బాదంచెట్టుక్రిందనుంచుని. అదివరకు నేనామెని సరిగ్గా చూడనన్నా లేను. నా మొహం చూసి ఆనందించే ఆడ దుంటుందనే ఆశ నాకుయెప్పుడో పోయింది. నన్నుచూస్తే అందరూ నవ్వడమేగాని చిరునవ్వు నవ్వే వారెవర్నీ నేను చూడ లేదు. అందులో అంత అందమైన మనిషి...అంతగొప్ప భర్తగల స్త్రీ......

## 2

అప్పణ్ణించి దొడ్లోకి వెళ్ళినప్పుడల్లా అవేపు చూసేవాణ్ణి. ఆమెకూడా కనపడ్డప్పుడల్లా మోహంతో నవ్వుతోంది. నన్ను చేసిన ఈశ్వరుడికిగాని, నన్ను కన్నతల్లికిగాని ముద్దువొస్తానను కోను. చిన్నప్పుడే ఒక నిర్భాగ్యురాలిని నాకు కట్టారుగాని, లేకపోతే బుద్ధిపూర్వకంగా నా మొహంచూసి యెవరూ నన్ను ప్రేమించరు. అట్లాంటి విషయములో యీమె నన్నట్లా గౌరవించడం, నన్నుకాదు, నాఅందాన్ని, నాకాశ్చర్యంగా వుంది.

నేను బళ్ళో పంతులు. ఆమె భర్త హెడ్మాష్టరు. నామీద ఆయనకెంతో యిష్టం. నావలె చెప్పిన మాటవిని పనిచేసేవాడు లేడు. ఎందరో నామొహం, నాయెర్రిజుట్టూ, చూడగానే ఉద్యోగం యిచ్చేవాళ్ళుకూడా, లేదు పొమ్మన్నారు. మరి పాపం యీయన పనియిప్పిస్తే, అంతమాత్రం కృతజ్ఞతచూపనూ మరి?

ఆయన్ని చూస్తే, మాబళ్ళో చాల భక్తి, భయంకూడాను. ఆయన పలకరిస్తేగాని, ముందుగా ఆయనతో మాట్లాడ్డానికి యెవరూ సాహసించరు. ఆయన భార్యనిచూసిన బళ్ళో అందరికి చాలా భక్తి గౌరవం పదిహేనేళ్ళ మట్టి వాళ్ళని యెరుగుదుము. ఏకష్టమున్నా ఆమెతో చెప్పుకుంటే తీరుస్తుందని అందరి అభిప్రాయం. వారికి బిడ్డలులేరు.

నేనెన్నడూ యిట్లాంటిది తలుచుకోలేదు. కలలోకూడా. నాకంటె ఆమె పదేళ్ళు పెద్దది. ఆమెకి నామీద యిష్టంకలుగుతుందని యేజ్యోతిష్కుడన్నా చెపితే, పిచ్చివాడని, దుర్మార్గుడని మెడపట్టుకు గెంటేవాణ్ణి.

## 3

ఒకరోజు రాత్రి దొడ్లో చప్పుడయింది తలుపు తెరిచి చూశాను. అర్ధచంద్రుడు బాదంచెట్టు ఆకుల్లో వేళ్ళాడుతున్నాడు. మెట్లుకిందికి దిగి యిటూ, అటూ నీడల్లోకి చూశాను. వెనకాలే నాచుట్టూ చేతులేసి, నన్ను గట్టిగా ముద్దుపెట్టుకుని, బాదంచెట్టు నీడకిందకి తీసికెళ్ళింది. నేను మాట్లాడకుండా వూరుకున్నా.

## 4

నిజంచెబుతున్నా అబద్ధం చెప్పవలసినపని నాకేమీలేదు. ఆమె నన్నట్లా కలుసుకోడం నాకేమీ ఇష్టంలేదు. ఆమెని, ఆమె మెత్తని పచ్చని శరీరాన్ని నల్లని జుట్టుని, చూస్తే నాకు భయం. ఏపార్వతో, లక్ష్మో, వొచ్చి నా ముందరనుంచున్నట్టుండేది. ఆమె పెద్దకళ్ళు నావేపు తిప్పేటప్పటికి నాపాదాలదగ్గర్నుంచి వొణుకు మొదలుపెట్టేది. ఆమెమీద నాకేమాత్రం మోహంలేదు. కాని ఆమెనన్నేంచేసినా వొద్దనడానికి ధైర్యంలేదు. ఆకళ్ళల్లో కోపం చూడగలనా? ఆమె పిలిస్తే, వొణుకుతో, విం

గడానికి పిలిచే మహాశక్తి దగ్గిరికి వెళ్ళేట్టుండేది. అదిగాక అర్ధంగాని ఆకర్షణవుండేది. మండే దీపానికి రెక్కల పురుగుమీద వుండే ఆకర్షణ తో చేది.

## 5

ఈమెకి నామీద యీ వెర్రి మోహం చూస్తే, నావాళ్ళు వొణుకుతోంది యింక యీమె బతుకంతా, లోకమంతా నన్ను రాత్రులు కలుసుకోడానికి లాగుంది. ఒక్క మాట మాట్లాడదు. నలిపి పిప్పిచేస్తుంది మాట్లాడ్డానికి నా నాలిక అంగిటినించి కదలదు. ఆమె పెట్టే అవస్థలన్నీ పడుతూ వూరికేవుంటాను. అంత గాఢంగా, మోహంగా, నన్నట్లా తాకుతూ, ముద్దుపెట్టుకుంటూ, అదుముకుంటూ వున్నా, భయమూ బాధేగాని, ఒక్క రవ్వ మోహం కలగదు. యేనాడు యీగోల ఆగుతుందా యీమె దృష్టి నామీద యెందుకుపడ్డదా హెడ్మాష్టరు గారికి తెలిస్తే యెట్లానా, అని అమితమైన విచారంగా వుండేది. కాల్చేసే ఆకలితో పిల్లి ఎలికని పట్టుకున్నట్లు పట్టుకునేది.

## 6

ఈమెకి మరీ వెర్రెత్తుతోంది? వివేకమంతా వొదిలేసింది. యింకోళ్ళకి తెలుస్తుందని భయమే లేదు. సిగ్గూలేదు. పగలుకూడా నాకు వొంటరిగా పెరట్లోకి వెళ్ళటమంటే భయంగా వుంది నాభార్య అనుమానపడుతున్నట్లు సూచనలు కనపడుతున్నవి. యిది వృద్ధండురాలు నేనంటే లోకంలో యెవరికీ భయంలేదు. కరాత్రి కళ్ళకికూడా. దీనికి లోకంలో యెవరేనిచూసినా భయంలేదు. అంతా చెప్పేసి దీని శరణు జొచ్చనా?

## 7

ఒకవేళ ఈమెకి పిచ్చేమో! మదపిచ్చేమో? అందరూ వూళ్ళో ఈమె మహాపతివ్రత అంటారు. హెడ్మాష్టరుగారికి ఆమెనిచూస్తే చాలా నమ్మకం విశ్వాసం.

అర్ధరాత్రి వొంటరిగాచింతచెట్టుకిందనన్నట్లా అంత అందమైన మనిషి కిక్కుతింటూవుంటే యేదన్నాదయ్యం ఆమె వేషమేసుకుని వొస్తాందేమోనని భయం వేసేది. ఆ అందం యీభూలోకపు విషయంగా కనపడేదికాదు. యెదో ఒక నిమిషంలో తన నిజమైన ఆకారం కనపరిస్తే.

పగలు నిశ్చయం చేసుకునేవాణ్ణి, రాత్రి యేమైనా వెళ్ళకూడదని, కాని పదిగంటలు కాగానే నాకాళ్ళే నన్నీడ్చుకుని వెళ్ళేవి. నిజం చెపుతున్నా. నా కామెమీద యేమీ మోహం లేదు. కాని మంత్రింపెట్టినట్లు దొడ్లోకి నా వొళ్ళునాకు తెలీకుండానే వెళ్ళేవాణ్ణి. వెళ్ళింది మొదలు ఆమె వెళ్ళిపోయిందాకా, నా దేహం వొప్పచెప్పేసి నుంచున్నేవాణ్ని, ఆమె వూపిరి గుడ్లగూబ అరుపు, గబ్బిలం రెక్కల చప్పుడుతప్ప యింక ఒక్క శబ్దంలేదు. ఒక్కరం మాటాడం.

## 8

వెళ్ళకుండా వుండడానికి నాకు శక్తిలేదు. యీయింటోంచి వెళ్ళిపోవడం నాకొకేమార్గం వేరేయిల్లు మాట్లాడాను. యిది యిట్లాసాగడం నాకు చాలా భయంగావుంది.

ఆవాళ రాత్రి ఆమె మాట్లాడింది. "నిన్ను వదలను, నాప్రాణం నువ్వు, లోకంలో యెక్కడికన్నాపో. అక్కడికి వస్తాను. నాకు భయంలేదు. సిగ్గులేదు"

నేను వెళ్ళాలని చూస్తున్న సంగతి యీమెకెట్లా తెలిసింది? యేంచెయ్యను?

## 9

అట్లా అంతసేపూ నన్ను వొదలక ప్రతి రాత్రీ పెరట్లోకొచ్చేసి, యెవరన్నా చూస్తారని భయంలేకుండా, అల్లరిచేస్తోవుంటే, యెన్నాళ్ళు దాగుతుంది? ఒకరోజు రాత్రి నే నింట్లోకి వొచ్చేటప్పటికి నాభార్య మంచముమీద లేచి కూచుని వుంది. దొడ్లోకి వెళ్ళానంటే, నమ్మ్తుందా? "అబద్ధాలు చెపుతారేం? ఆచెట్టుకింద మీతోవున్నది హెడ్మాస్టరు పెళ్ళాంకాదూ?" అంది అంతా చెప్పి నాతప్పులేదని వొప్పించాను. మర్నాడు ఆమెని నలుగురిలో పట్టుకుని అడుగ తానంది. నన్ను యెన్ని తిట్లు తిట్టినా సరే; ఆమె నేమీ అనవొద్దని కాళ్ళావేళ్ళాపట్టుకొని బ్రతిమాలు కున్నాను. వొప్పుకోలేదు. చివరికి సన్యసించి ఆరాత్రి యింట్లోంచి లేచిపోతానని బెదిరిస్తే, ఆమె దగ్గిరికి వెళ్ళనని పాడు వొట్లన్నీ వేయించుకొని వూరుకుంటానని వొప్పుకొంది.

## 10

పదిహేను రోజులయింది. ఒకసారన్నా నేను పెరట్లోకి వెళ్ళలేదు. కాని ఆమె ప్రతిరోజూ వొస్తున్న సంగతి నాకు తెలుసు. నాలుగురోజు లయింతరవాత దొడ్లోచప్పుళ్లు మొదలుపెట్టింది మెల్లిగా తలుపుతట్టేది. మొదట పిలిచేది. పాడేది ఒకరోజు కిటికీలోంచి తొంగిచూస్తె మెట్లమీద కూచుని యేడుస్తోంది ఉత్తరాలు రాసి చెట్టు కింది పారేశేది. పగలు నావంక దీనంగాచూసేది. వూళ్లో హెడ్మాస్టరుగారి భార్యకి జబ్బుగావుందని అనుకున్నారు. ఆయన బడికి ఆలస్యంగా వొస్తున్నారు.

నాకపరిమితంగా జాలివేసింది. నాకోసం యెంత బాధపడిపోతోందో? వెళ్ళాలనిపించింది. కాని నాభార్య భయం అమితం. దానికి తెలిస్తే యీసారి యింకేమైనావుందా?

## 11

చివరికిట్లా అవుతుందని నేనెన్నడూ అనుకోలా. ఒక్కరోజులో యింతజరిగిందని నమ్మకం లేకుండావుంది. నిన్నపొద్దున్న బాదంచెట్టుకింద చీటీ కనపడ్డది

"రాత్రి రాకపోతే నేను చచ్చిపోతాను. నిశ్చయం."

ఇంక యేమన్నాకానీ, అని నాభార్యపడుకోగానే, పెరట్లోకివెళ్ళాను. నన్ను యెంతి కామంతో, తృష్ణతో,మండేకోర్కెతో,నలిపేసిం దీ. పౌర్ణమి. బాదంపూత మీదసించి గాలి. లక్ష్మినిమించే అందంగలస్త్రీ నన్ను వొలిచి, నాపాదాలదగ్గర పడి, నాకోసం నాప్రేమకోసం నాదయకోసం, ప్రాధేయపడుతోంది.అబద్ధం.నా సంగతి అబద్ధమాడిందేమో, లేకపోతే దరిచి లాన నవమన్మథుణ్ణిగా మారానేమో, అని అనుమానం కలిగింది. నాకోసం తీక్ష్ణమైన ఆమె కోర్కె, ఆ మాధుర్యం, ఆ ప్రణయసమర్పణం, చూసేప్పటికి అన్నిరోజులకే మొదటిసారి నాకు ఆమెమీద మోహం కలిగింది. ఆమెకంఠం కావి లించుకుని ముద్దుపెట్టుకున్నాను. దగ్గిరికిలాక్కుని స్వాధీనం చేసుకున్నా. అధికారంతో దార్ఢ్యం తో, లాగదియ్యబోయి నాను. కళ్లుతెరిచింది. నామొహంవంక చూసింది నన్ను వొక్కతోపు తోసి, దూరంగా నుంచుంది కళ్లెత్తి తేరిపార నావొంక మళ్ళీ చూసింది. అణుచుకోలేని విచారంతో అసహ్యంతో గుండెపగిలినట్టు చిన్న కేక వేసింది. మళ్ళీ నాకేసిచూసి, కళ్ళుమూసుకుని చివాలున యింట్లోకి వెళ్ళిపోయి తలుపేసుకుంది. నేనట్లానే నిలబడ్డాను.

## 12

పక్కమీద పడుకుంటే, ఆమె సుందరస్వరూపమే కళ్ళకుకనపడుతుంది. నా కామెకావాలి. ఆమోహం, మాధుర్యం, అన్నీ కావాలి. నీవరికి, కొత్తగా అన్నాళ్ళకి పుట్టిన నా కోర్కె, నా మనోరథం ఫలించబోతోవుంటే, నిష్కారణంగా నాకర్థంకాకుండా, ఒక్కమాట మాటాడకుండా అటా వెళ్ళిపోయిందేం? యెక్కడికి వెడుతుంది. రేపురాదూ? నన్నెట్లా వొదులుతుంది? కాని నాపక్కన నిద్రపోతూన్న నాభార్యో? దీన్నించి తప్పించుకోడమెట్లా? యెదో ఒక తగాదా పెట్టుకుని, పుట్టింటికి పంపించాలి. వెడుతుందా? యేంచెయ్యను? దీనినోరు కట్టడమెట్లా? దాన్ని చంపెయ్యాలన్నంత కోపం వొచ్చింది. ఇంక నాకిదేం భార్య! దీంతో నాకేంసంబంధం? లేవకుండా దీనికి మత్తుమందు పెడితే,............ ............

తెల్లారకట్ట ఆ కేక లేమిటి? మాయింటి పక్కనే! యేడుపులు. వీధులోకి పరుగెత్తు కెళ్ళాను. హెడ్మాష్టరుగారి యింటో మనుషులు పోగవుతున్నారు. లోపలికి వెళ్ళాను. గుడ్డలూ, వెంట్రుకలూ కాలినవాసన, హెడ్మాష్టరుగారి భార్య కాలిపోయింది. గుర్తన్నా పట్టడానికి వీల్లేకుండా బొగ్గయింది.

## 13

తెల్లారి నాకోసం హెడ్మాష్టరుగారు కబురు పంపారు. ఒంటరిగ నన్ను గదిలోకి తీసికెళ్ళి, ఒక కాయితం చేతికిచ్చారు. ఆయనభార్య రాశింది. మొదటినుంచి నాతో సంబంధం సంగతిచెప్పింది. తరవాత యిట్లావుంది. "వాణ్నెట్లా యెందుకు మోహించానో తెలీదు. మీరు నాకేమీ తక్కువ చెయ్యలేదు. యెన్నడూ యెవరినీ కన్నెత్తైనా చూడని నేను, కలలోనన్నా పరపురుషుడిసంగతి మనసులోకి రానీని నేను; సతివంతురాలిని, పతివ్రతని, నామనస్సు ఒక్కసారిగా నాస్వాధీనంతప్పి, కళ్ళెం వొదుల్చుకుని, విదుల్చుకుని, వాడిమీద పడ్డది. గుడ్డిగా, పిచ్చిగా, వాణ్ని స్వాధీనం చేసుకున్నాను. నాసంగతి నాకేమీ అర్థంకాదు.

నిన్న రాత్రి వాడికి, ఆపురుక్కి, అసహ్యానికి నామీద ప్రేమ వొచ్చింది. వాడి ప్రాణానికి వాడు నన్ను ముద్దు పెట్టుకుని, లాక్కోవాలని చూశాడు. యెందుకో తెలీదు. ఆపని మంత్రంలాగు పనిచేసింది. వాడి కురూపితనం, నా మోహపురోత, అన్నీ తెర చిరిగినట్టుకనపడ్డాయి. వీడా నన్ను స్వాధీనం చేసుకునేది? వాణ్ణా నేను కామించింది. ఈస్వరూపము కోసమా నేను సిగ్గు లేకుండా తంటాలుపడ్డది? పరుగెత్తుకువచ్చాను. యింక మీ మొహం యెట్లాచూడను? యేం చేస్తే యీఅసహ్యం నా దేహంనించి వొదులుతుంది? యీపాపం, యీమలినం, వాడు తాకినచోట్లు, వాణ్ణి అదుముకున్న స్థలాలు? కాలుస్తా, కిరసనాయిలుపోసి కాలుస్తా. మీకు పనికిరాను. యింక నేనెందుకు? విచారపడకండి.

ఆ కోతిని, ఆ పురుగుని, యేమీచెయ్యకండి. వాడే మెరగడు, వాడిపనికాదు. వెధవనిపోనీండి.

... ... ... ... ... ... ...

చదివి ఆ కాయితం బల్లమీదపెట్టాను.

"గర్వపడకు. నిజం తెలిసిందా? యీసంగతి బయిటికి రానీకు, పో"

## 14

కాని నాభార్య వూరుకుంటుందా? నాకోసం

నన్ను వొలిచి, తను ఆమెకి నన్ను చిక్కకుండా చేస్తే, తాళలేక హెడ్మాష్టరుగారి భార్య ప్రాణహత్యచేసుకుందని చాటించింది, చచ్చినామె రాసిన ఒకటి రెండు వుత్తరాలు యిదివరకే దాచి వుంచుకొంది. తన మాటలు నమ్మలేక పోయిన వాళ్ళందరికీ ఆ చీట్లు చూపించి నమ్మించింది లేకపోతే యెవరు నమ్ముతారు దాని మాటలు? వూరంతా మోగిపోయింది. హెడ్మాష్టరుగారు కినవడ్డంలేదు. ప్రాణహత్యచేసుకున్నారని కొందరి దృఢాభిప్రాయం. పతివ్రత నాభార్యా, నవమన్మథుణ్ణి నేనూ, మిగిలాము.

## విచిత్రవివాహము

(దామరాజు వేంకటరమణమూర్తి గారు.)

విమలమగు సాయాహ్నమున నే
వీథివెంబడి పోవుచుండగ
దృష్టిపథమున నాతిబడియెను
తేరిచూడంగాఁ
మోహము
తివిరిపారంగాఁ. 1.

మొదటిచూపులె మాదుపాలిటి
కదటులౌ బంధమ్ములాయెను
కదలుటకు కాలాడలేదిక
కాంచుచుండంగాఁ
మోహము
గతులుదప్పంగాఁ. 2.

అటిపఁజేరక హృదయమున వే
వితములను తర్కించిపిమ్మట
నుతినొనర్చుచు నిష్టదైవము
నొక్కపెట్టునసే
మోహము
ముందులాగగనే. 3.

తరుణివెంబడి శీఘ్రగతి నే
పరుగులిడుచును జేరితిని; నే
కరము సంతోసమున గాంచితి
కాంతరూపంబుఁ
మోహము
కనుల గప్పంగఁ. 4.

కాంత! కాంత! ఎవరి వనితవు
సుంతయును విడువకను నీ వృ
త్తాంతమంతియు నెరుగజెప్పుము
సంతసించెదనే
కాంతరో
అంతరంగమునఁ. 5.

అనగనొడలు జలుక్కుమనగను
వెనుదిరిగి ననుఁజూచి యాత్మ నే
మనుకొనెనొ తెలిపోంగలేదిక
మగువ నను తోలగెఁ
మోహము
మగువపాలాయెఁ. 6

భీతినొందకు నాత్మలో నో
నాతి నిన్నిపుఁ డేమిసేయను; సు
నీతివంతుడ నాదుపత్నికు
నాతి బదులిమ్మా
మోహము
నన్నువిడదయ్యో. 7

తొడనే యాయింతి నన్గని
వీడుచున్నటి పమిటకొంగును
వేడుకతో సవరించుకొంచును
వెలది నావంకఁ
మోహము
తొలకులాడంగాఁ. 8

తళుకుఁజూపుల చూచిచూచియు
బెళుకులాడెడి నేత్రయుగ్మము
కళలునూత్నపు శోభగాంచగ
నెలతపలుకంగాఁ
మోహము
పలవరింపంగాఁ. 9

" రెడ్డిబిడ్డను యూరుదూరము
అడ్డుగా నేరొకటి పారగ
రెడ్డిదేవుని నాత్మఁగొల్చుచు
గెడ్డదాటంగాఁ
మార్గము
గెరలిపట్టంగఁ. 10

అత్తవారెవరు నీకని నే
తత్తరంబున పృచ్ఛఁజేయగ
చిత్తమున సిగ్గుతో తా క
న్నెత్తి ననుగాంచెఁ
బిత్తరి
చిత్తమును హరియించెఁ 11

పెద్దవారలు తల్లిదండ్రియు
దద్దయును నా పెండ్లికొరకై
హద్దులేని విచారసాగర
బద్ధులైయుండఁ
పెండ్లికి
సిద్ధులై చనగాఁ. 12

వరునిఁజూచియు మానసంబున
కరము చింతా సాగరంబున
దరినిగానక నున్న ననుతా
మరచి కనుగొనగాఁ
నాథుని
నిరసమొనరింపఁ. 13

తనయకిష్టము లేని పెండిలి
మనముఁ జేయగనేమి లాభము
అనుచు వారలు వేరునాథుని
గనుచునుండంగాఁ
నే నిటు
కష్టమునబడితిఁ. 14

రెడ్డిబిడ్డను నేను కులమున
రెడ్డి బిడ్డా ! చింతవలదిక
అడ్డుబెట్టక నీదుచూపుల
యతివ జూడవె నఁ
ప్రేమతో
యాదరింపవె నఁ. 15

అంచు యామెను జేర్చి నక్కున
మించు ప్రేమచె ముద్దుబెట్టితి
నంచలిత గాత్రుండనైతిని
చంచలాక్షిని నే
ప్రేమ పే
క్షించి నరయగనే. 16

ఏమి నాఘన భాగ్యసంపద
ఏమి నాదగు పూర్వపుణ్యము
ఈ మగువ నాకిటు చిక్కనంచును
నెంచనైతనిగా
దైవమా
ఎంచికూర్చితిగా. 17



# తెనుగు

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు.

నన్నయ మొదలు నేటివరకును గల యాంధ్రసారస్వతమును బరిశీలించినచో నందొక గొప్పభేదము గాన్పించును. యుగమునకును యుగమునకును నంతర మెంత యుండునో యంత ప్రభేదము మనకుఁ గాన్పించును. కాని పూర్వముకంటె నేఁడు సారస్వతమునందు నాగరకత యభివృద్ధి గాంచినదని మాత్రము చెప్పవచ్చును. పూర్వముకన్న నేఁడు వాఙ్మయాభివృద్ధికి మార్గములు పెక్కులు గలవు. మహామహులు నుదారశీలురునగు వారలు పత్రికలఁ గొన్ని స్థాపించి వాఙ్మయాభివృద్ధి గావించుచున్నారు. కొందరు ధనమునిచ్చియు వ్యాసములను దమ పత్రికలకు వ్రాయించుచున్నారను విషయము మిక్కిలియు నభినందింపదగియున్నది. ఈపత్రికలన్నియు వాఙ్మయాభివృద్ధికిఁ గారణములా యను సంగతి ముమ్ముందు చర్చింపబడును. ఈపత్రికలకుఁ దగినట్లు వ్రాయసకాళ్ళును లెక్కకుమీరి యున్నారు. ఇందరలోను సారస్వత విమర్శనముల వ్రాయువారికన్న పద్యములనే యందును గీతములనే వ్రాయువారు చాలాయెక్కువ యని చెప్పుట నేటి వారల సాహితీ జ్ఞానమును జాటుచున్నది. నేటి కవులలో మహాకావ్యములు వ్రాయువారు చాలా అరుదు. సామాన్యముగ నందరును ఖండకావ్యములనే రచింతురు. ఈ యనిబద్ధకావ్యములకు బ్రాచీను లెంత గౌరవము నొసంగిరో ముందు తెలియనగును. నేటి యాయా కవులయొక్క యాయా పుస్తకములం గూర్చిన విమర్శనలును క్రమశః విమర్శింపబడును,

ప్రస్తుతము నేటి కవులయొక్కయు గలిగీ కలుఁగని సాహిత్యజ్ఞానముగల యాధునిక పండితమ్మన్యుల గూర్చియు నించుక వచించెదను. ఈ వ్రాయబోవు వాక్యములు ప్రత్యేకతః యొక వ్యక్తినిగురించి చెప్పునవికావు. నేఁటి సారస్వతమున నాడంబరము పెచ్చుపెరిగినది. ప్రతివారును బండితులే. ప్రతివారును కవులే కావుననే నిజమైన పండితులెవరో నిజమైన కవీశ్వరులెవరో తెలిసికొనుట కడుంగడు దుర్ఘటము. ఏదో యొక పండితుడుగానీ యొక విమర్శకుడుగానీ యొకమాటననిచో బదిమందియు నావాక్యముల కర్థము తెలియకపోయినను నౌనౌనని తలలూతురు. ఇంతయేల? బహుగ్రంథ పరిశోధకులును విజ్ఞానులును భారతీదాసులును నయిన శ్రీయుత గిడుగు రామమూర్తి పంతులవారు వ్యావహారికభాషావాదమును లేవదీసిరి. పండితు లన్నవారు ఆవాదమునందలి లోపాలోపములఁ దెలిసినవారును నావాదము నంగీకరించినచో యుక్తియుక్తముగ నుండును. అట్లుగాక యావాదమునం దర్థమైనను దెలిసికొనలేని, గ్రాంథికమన నేమో యెఱుఁగని బృహస్పతులు సైతము ఆహా తప్పకుండా గ్రామ్యమే వాడాలి. గ్రాంథికమేమాత్రము వ్రాయగూడదు. పండితులకేం తెలుసును. వాళ్ళకేం తెలుసును" అని ప్రపంచము మారుమ్రోగునట్లు కేకలిడుట మనము నేడుచూచుచున్నాము. నిజమాడిన నిష్ఠురముగాని యీకాలపు వ్యావహారిక భాషావాదులలో నేకొద్దిమందియో తప్ప గ్రాంథికముగ నొక వాక్యము సైతము వ్రాయలేనివారు లెక్కకుమీరియున్నారనుట నిర్వివాదము. అట్టివారల నెందరనో చూచినాను. శ్రీ రామమూర్తి పంతులవారన్నారనగా అదివేరు. వారన్నారని నలుగురును గ్రాంథికముగ వ్రాయలేనివారు దాని నంగీకరించినచో బరిహాసాస్పదముగ నుండును.

భాషసంగతి యీవిధముగ నున్నది. ఇంక గవిత్వమును గురించి కొంచెము పరిశీలింతము. ఏ మహాత్ముడు త్రోవ జూపించెనోగాని భావకవిత్వమార్గము మిక్కిలి యనువుగా నున్నది. భాషయా — శ్రీ రామమూర్తి పంతులవారి నిర్హేతుక జాయమాన కరుణాప్రసారము — యతిప్రాసములా ? — నిన్నటిదాక మొరవెట్టిన దడియేగదా — ఇవి రసభంజకములు, కనుక నే త్యాజ్యములని — ఛందమా — గమనించువాడెవరు, అర్థమా — అడుగువాడెవడు. కర్మము జాలక యెవరయినను "అయ్యా తమరు నిన్న పత్రికలో వ్రాసిన పద్యముల కర్థమేమండీ" అని ప్రశ్నించినచో నాకవీశ్వరుఁడు ప్రాయశః ప్రత్యుత్తరమీయడు. అథవా అతనికి దయ పుట్టినచో "జస్-పోవయ్యా — జాతీయత, జీవము, కళ, ఆత్మగౌరవము దానిలోనేయున్నవి. మీకేమి తెలియును. ఆవసుచరిత్రయందలి పద్యములకంటె కావలసినంత అర్థమున్నది-" అని సందర్భములేని రెండు కూతలుకూసి దయచేయును. ఈస్థితిలో నొకరు వ్రాసిన పద్యమున కర్థమేమని యడుగు దుర్మార్గు డెవ్వడుండును.

పోనీ యీవిధముగా బద్యములవల్ల కవులకుఁ బ్రసిద్ధి యేమైనా యున్నదందుమా — అదియు నించుక చూతము. పనీపాట లేని పదిమందిచేరి యొక సమాజము స్థాపించి యా సమాజమునకు "కనకపు సింహాసనమున శునకముఁ గూర్చుండబెట్టి" యనున ట్లెవరి యదృష్టముకుల్కిన వారిని

సభాపతిగా నొనర్తురు. ఇక వారికి బనియేమున్నది. తేట గీతములవ్రాయ మొదలుపెట్టుదురు. మరునాఁడే పత్రికలోనో యవి ప్రచురింపబడును. అంత వారిలో వారే యెవరో యొకరు "ఫలానావారు ఫలానిపద్యముల నిన్న పత్రికలోఁ బ్రచురించిరి. ఆపద్యములలోని భావగాంభీర్యమింతింతగాదు. ఆపద్యములవ్రాసిన కవిశిఖామణికి కీర్తి ప్రతిష్టలు......" అని యేమేమో పత్రికలలో విమర్శనములు. ఈ విమర్శనములఁ జూడఁగానే సారస్వతాభివృద్ధికై యేర్పడిన పత్రికాధిపతులకు హాడలు.

ఇట్లని సమాజములన్నియు నీస్థితిలోనే యున్నవని నా యుద్దేశ మెంతమాత్రమునుగాదని పండితులకు మనవిచేయుచున్నాను. ఆంధ్ర సాహిత్య పరిషత్సభవంటి గొప్ప పరిషత్తులు ప్రపంచములో లేకపోలేదు. కాని యిట్టివియు నున్నవనిమాత్రము చెప్పుచున్నాను

ఇక లెక్కలేనంతమంది బాలకవులు. వీరు వ్రాయు పద్యము లెట్లున్నను వీరిమాటలుమాత్రము కోటలుదాటును మచ్చునకు గొన్నిమాటలు— ఒక కవిచక్రవర్తిగారన్నారు. "ఏమండీ నాకు యేడుపువస్తుందండి- ఇన్ని తెల్లకాగితములను నల్లగాజేయడం నాకేమి యిష్టంలేదండి—" అని మరియొకరు. నేను పత్రికలకు పద్యాలు పంపితే వాళ్ళు నాపేరుకు గారు అని పెట్టుతారు. అది నాకు చాలా అసహ్యంగా వుంది. నేను వారికి వ్రాశాను అట్లా పెట్టవద్దని. అయినప్పటికీ వారలాగ వుంచుతారు." అని అన్నారు. బహుశః నేనీ విషయములు విస్తరించి వ్రాయనక్కరలేదు. ఎందుకనగా— ఇటువంటివారు ప్రతి గ్రామమునకును, కనీసము నలుగురకు దక్కువగా నుండరని నాయూహ

ఇక వీరియర్థజ్ఞానమునుగురించి కొంచెము పరిశీలింతము. ఏదో యొక పుస్తకమునుగురించి చదువుచుండును (ప్రాచీన ప్రబంధముమాత్రము గాదు) అది చదివి దానిలోని యర్థము సరిగా దెలియకపోయినను, అహా యెంత బాగా వ్రాశాడండీ— బహు చక్కనిపుస్తకం. ఏం భావము. ఏమి Inner meaning అని తలతిక్కగా గూయుచుండును. ఒకతూరి శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి "పిండీపింఛని పాడియాఁబోదుగు" అను పద్యము నొక పెద్దమనుష్యుడు చదువుచు దనలోఁదానే మెచ్చుకొనుచు నుబ్బితబ్బిబ్బ లూగుచుండెను. అంత నా ప్రక్కనుండు యువకుఁడొకఁడా పద్యమున కర్థముచెప్పి "అయ్యా దీనిలోని భావవిశేష మేమియో తెలుపఁగలరా యని ప్రశ్నించినాడు. అంత నాతఁడు నోరునైనను దెరువలేదు. ఈవిధముగ నాధునికులలోఁ జాలమంది యాడంబరముగ సంచరించుచున్నారు.

ఇక నాధునిక విమర్శనముల సంగతి— అన్నిటికన్న మిన్నగ నెన్నఁదగినదియు, నెన్నబడుచున్నదియు నాధునిక విమర్శనములలో కవిత్వతత్త్వ విచారమే. ఇందు యథేచ్ఛగ జంకుగొంకులులేక ప్రాచీన ప్రబంధము లన్నియుఁ జాలవరకు తిరస్కరింపబడినవే. మరియు నేనివలన కావ్యమునకు శోభగలుగునని యాలంకారికులచే వచింపబడెనో యా యలంకారములే యనావశ్యకములని వచింపబడినది. ఇంతయేల? ఉపమాలంకారము వ్రాఁచే ప్రత్యక్షముగ దిరస్కరింపబడినది. ఎట్లు— "కమలముతో బోల్పకున్న సీతాదేవి ముఖము సుఖమియ్యదా?— చిన్నతనముఁ బూనునా?...... మఱియు గమలముతోఁ బోల్చుటం జేసి సీతాదేవిముఖ మానందదాయి యాయెనని భ్రమించు వెఱ్ఱులెవరైన నున్నయెడల వారికొక ప్రశ్న. ఏమన ఇక దేనితోఁ బోల్పఁబడినందున కమలము హర్షమునొసంగునది యాయెను?........" అని కవిత్వ తత్త్వవిచారములోని యుపమాలంకారముపైని యనర్థకమైన దాడి. ఈప్రశ్న యెంతవట్టు సమంజసముగనున్నదో పండితులకు దెలిసియేయుండును. కాని నాదొక చిన్న మనవి "ఆమెముఖము చంద్రబింబమువలె నున్నదమ్మా, వాడు తాడిచెట్టువలె పొడవుగా నున్నాడు." ఇత్యాది వాక్యములకును కవిత్వతత్త్వ విచారమందే వాడబడిన "స్త్రీపురుషు లెండిన కట్టెలవలె నున్నారు" "వెలుతురుచాయయు లెట్లు ఎడతెగని సంయోగము దాల్చియున్నవో యట్లే......" "...అభిమన్యునివలె నత్యంత సాహసోదగ్రులైన..." యను మొదలగు వాక్యములకును గతియేమి? ప్రాయశః యివియన్నియుఁ గుయుక్తియను త్రాటిచే బంధించి చెరసాలలోనుంచు పశ్చాత్తాపకరమైన నేరము గాదుగాబోలును. ఒక్క "సీతాదేవి ముఖము కమలమువలె నున్నది" యనునదే యట్లు కుయుక్తియను త్రాటిచే బంధింపబడిన దేమి? అట్లయిన సరియే కాని యా వెఱ్ఱివారి కొసంగిన దుర్భేద్యమైన గొప్ప ప్రశ్నమాత్ర మంతగ రుచికరము గాదని విన్నవించుచున్నాను.

అందే మరియొక చిన్న యాక్షేపణ.

ఆయ్యలరాజు రామభద్రుడను కవి తన రామాభ్యుదయములో రామవనవాసఘట్టమున దశరథుండు నానార్థ రత్నమాలను పుటలు దిప్పుచు నేడ్చినాడో యనునట్లు దరిద్రము పట్టిన శ్లేషాలంకారములు పెట్టి

కానకకన్న సంతానంబుగావున
కానకకన్న సంతానమయ్యె
.............................."

యని యున్నది. ఈ యాక్షేపణమునకు సమాధాన మేమీయవలయునో తెలియకున్నది. కాని ప్రాచీన పుంగవివర్యులు మనవలె పదములకొఱకుగానీ యర్థముల కొఱకుగానీ తడవుకొను విద్యావంతులు గాగనిమాత్రము తెలియవలయును మరియొక చిన్న ప్రశ్న. ధర్మరాజు పశ్చాత్తాపపడు ఘట్టమునఁ దిక్కన్న వ్రాసిన

"అల్పకాల భోగమైన రాజ్యమునకుఁ
గాన నల్పకీర్తిఁ ఘనుని, జరత
సింహాకల్పు, వంశశేఖరజన్ముఁ ద్రుం
చితి మదంబు వగలఁ జివుకకున్నె"

"జన సంపూజ్య పదారవిందుఁడగు ...."

మొదలగు పద్యములు మిక్కిలిఁ బ్రశంసనీయములని కవిత్వ తత్వవిచారములో వ్రాసియున్నవిగదా? దానిని జూచి "ధర్మరాజు సులక్షణసారమును దగ్గఱకుంచికొని పుటలు ద్రిప్పుచు నేడ్చినట్లున్న దని యేరయినను నాక్షేపించినచో నేమని ప్రత్యుత్తరమో తెలియరాకున్నది. శోక రసము వర్ణించునపుడును శ్లేషలు వీడరాని చీడలైనట్లు, తద్రసమునే వర్ణించునపుడును ఛందస్సు వీడరాని చీడ యాయెనని మఱియొకరు ప్రశ్నింపరు గాబోలును.

ఇంతకు శ్లేషకును గవిత్వతత్వ విచారమునకును పులికి మేకకున్నంతటి మైత్రి యుండుటయే యీ యాక్షేపము లకు నిదానమని తోచెడిని. ఇంతంతదీర్ఘ సమాసములతో నేడ్తురాయన్న నిట్లు యతిప్రాసములు దప్పకుండా ఛందస్సు పోకుండా నేడ్తురాయని యనరు గాబోలును.

ప్రాచీనులంతంత పండితులై మనవంటి సోమరి పోతుల కర్థముగాని పుస్తకముల వ్రాసినారేయని చింతింప వలసినదేగాని వానిలో సారములేదనుట యెంతయు వెఱ్ఱి మాట. నేడును గొప్ప పండితులు లేకపోలేదు. గొప్ప గొప్ప విమర్శకులు లేకపోలేదు. రసముచిప్పిల్ల స్వారస్యము గలుగు పద్యముల వ్రాయు కవీశ్వరులును లేక పోలేదు. కాని సుకవీశ్వరులకంటె కుకవీశ్వరులు పలువు రున్నారని చెప్పుటకు వీలున్నది. దీనికి లాఘవము నపేక్షించి సంక్షేపరుచిగల యాధునికులు కష్టించి పాండిత్యము సంపాదింప లేకుండుటయే హేతువు. ఇట్టి మన బుద్ధిని స్మరించికొని ప్రాచ్యులుసైత మిట్టులనే యాయా నిఘంటువులఁజూచి పుస్తకముల వ్రాసిరి యనుట కేవలము సాహసము ఈకాలములో జాలమందికి వసుచరిత్రము లోకువగ నున్నది. అందలి యొక పద్యమునకయినను నా యాక్షేపకు లర్థము చెప్పలేరనుట యసత్యముగాదు. వసు చరిత్రమునందలి పద్యముల కర్థము తెలిసికొని యందలి భావమును గ్రహించి యానందించు పండితాగ్రేసరులు నేడు లేకపోలేదు.

సామాన్యముగ నేటి విమర్శనము లన్నియు వ్యక్తిగత ములుగాని విషయగతములు గావు. ఒకడొక విషయమును వ్రాసిన నాతనిపై యభిమానముగలవారు బాగున్నదనియు కోపముగలవారు బాగుగ లేదనియు విమర్శింతురు. ఇట్టి విమర్శనములుమాత్ర మాదరణీయములు గావు. మఱికొందరు విమర్శింతురుగాని విషయముమాత్రము రాదు. ఇట్టి వియు నాదరణీయములు గావు. ఇట్టి విమర్శనములు వ్రాయువారలు తమకుఁ జుట్టము లగుటచేతనో, యభి మానము గలుగుటచేతనో గాని పత్రికాధిపతులు వీరికిఁ జోటు నిచ్చుచున్నారు. ఇట్టి విమర్శనములకుఁ జోటి చ్చుటకన్న నాపత్రికలకు వేరొండు హైన్యము లేదు. కాన విజ్ఞానులయిన యాయా పత్రికాధిపతులు విమర్శన ములఁ బరిశీలించి ప్రచురించినచో మిక్కిలి బాగుగనుం డును. ఈవిషయమునుగురించి వేరొక వ్యాసమునందు విపు లముగ విమర్శింపబడును.

# తమాషాలు

## 1

### నిశ్శబ్దము.

" మీఆయన నిన్ను వదిలివేసినాడట, నాకు చాలా విచారముగానున్నది "

" మాఆయన నాయెడ చాల కఠినముగ ప్రవర్తించినారు "

" నీవే మీఆయనదగ్గరకు వెళ్ళవని అప్పట్లోగా చెప్పుకుంటున్నారు "

" అవును. ఆవిషయములో మాత్రము మాఆయన నిశ్శబ్దముగ నున్నారుగనుక నాపరువుదక్కినది. "

### సంపాదన.

" బందరు వచ్చేటప్పటికి నాకు పందరూపాయలున్నవి. ఇప్పటికేదో అయిదారువేలుసంపాదించుకున్నాను"

"నీమాటేమిటి. ఒకరిని నెరుగుదును. వచ్చేటప్పటికి దమ్మిడిలేదు, తరువాత పెద్ద నగలషాపు పెట్టినాడు."

" ఆశ్చర్యమే. ఇపుడాయన యెక్కడ ? "

" జైలులో "

## 2

(ముం. భో.)

### చెవుడు.

తల్లి;— ఏమిరా ? అంతగట్టిగా అరుస్తావు ? ఎవరికి చెవుడని.

కొడుకు:— నాకు చెవుడమ్మా.

తల్లి:— నీకు చెవుడైతే అంతగట్టిగా అరవడమెందుకు.

కొడుకు:— నేనుచెప్పేది నాకు వినబడదుగాబట్టి.

### యజమానురాలు.

యజమానురాలు వంటవానిమీద కోపంతో "నీవేమిచేసినా పాడే! ఇదిగో విను— ఇంకమీద నీవునన్ను అడగందే యేపనీ చేయవద్దు" అన్నది.

అర్థగంట అయినతర్వాత వంటవాడు వచ్చినాడు.

" అమ్మగారూ, పిల్లి పాలుతాగుతోంది తోలనా ?"

### జ్ఞాపకము లేకపోవడం.

" నాన్నా, మిసోకినది ఎక్కడపుడుతుంది. దానిముఖ మెటువుంటుంది ?"

" యేమోరా, నాకూ జ్ఞాపకంలేదు ! "

" జ్ఞాపకములేదా ? మరి నీకు జ్ఞాపకంలేకపోవడంచేత రేపు నేను దెబ్బలు తినాలసిందేనా ?"

### సత్రాధికారి.

సత్రాధికారి;— నీవు వచ్చినెలనుంచీ పనిమానుకో.

వంటవాడు;— ఎందుకండీ! నేను చేసేవంట అందరు బాగుందంటారే ?

సత్రాధికారి;— అందుకోసమే నిన్ను మానుకోమనేది.

### మూడురొట్టెలు,

ఒకనివద్ద రెండురొట్టెలుండెను. అప్పుడు వానిఅన్న వచ్చి " నీదగ్గర రెండురొట్టెలున్నవి " అనెను.

తమ్ముడు:— నాదగ్గర రెండేవున్నవి.

అన్న;— అది ఒకటవది. ఇది రెండవది, ఒకటిన్నిరెండు మూడు.

తమ్ముడు:— అట్లాగయితే ఆమొదటిరెండు నావి. మూడవది నీది.

తీసివేయుట.

ఒకబడిపంతులు:— తీసివేత లెక్కలలో ఒక్కవిషయము బాగా జ్ఞాపకముంచుకోవలెను. అది యేదనగా, తీసివేయవలసినదియు ఎందులోనుండి తీసివేయవలెనో అది ఒకేవిధమగు వస్తువుగా నుండవలెను. వుదాహరణము 12 గోలీలనుండి 8 గోలీలు తీసివేయవచ్చును. 16 బల్లలలోనుండి 10 బల్లలు తీసివేయవచ్చు, కాని 8అరటిపండ్లలోనుంచి 6 మామిడిపండ్లు తీసివేయమనుట 17 నిమ్మకాయలలోనుంచి 9 గోలీలు తీసివేయమనుటగాని తగదు.

ఒకబాలుడు:— సార్, సార్, 4 ఆవులలోనుండి 8 శేర్ల పాలుతీయకూడదా?

కొబ్బరిచెట్టు.

భర్త:— మనఇంట్లో రోజూ ఎవరోవచ్చి కొబ్బరికాయలన్నీ దొంగిలించుకొని వెళ్ళుతున్నారు.

భార్య:— ఈరోజు ఎవరువచ్చి దొంగిలించుకొని వెళ్లరు.

భర్త:— ఎట్లా?

భార్య:— ఆచెట్టుకు నామడిచీరె కట్టినాను.

ఫొటోగ్రాఫ్.

ఒకచిన్నపిల్లవాడు పలకా బలపం, తీసికొని "అమ్మా అమ్మా, నేను బొమ్మరానేదీ" అని అన్నాడు. "యేది రాయి చూదా" మన్నది తలి.

పిల్లవాడు రాస్తున్నాడు- తండ్రివచ్చి.

"నాయనా ఎవరునేర్పారురా నీకీ కోతిరాయడం" అన్నాడు.

కొడుకు:— ఇదిగో, నీఫోటోగ్రాఫ్చూచి అచ్చేరాశా నాన్నా—

బహుమతి.

అన్న:— అమ్మనాకు ఒకబహుమతి ఇచ్చినది.

చెల్లెలు:— అట్లాగయితే నాకు అందులో సగం.

అన్న:— నాకు అమ్మ రెండు లెంపకాయలిచ్చినది: అందులో నీకు వకటి.

డాక్టరు.

ఒకడు:— డాక్టరుగారూ, నాకొడుక్కు పొట్టలో బల్ల పెరిగిందండీ.

డాక్టరు:— అట్లాగయితే రంపంమింగించు.

3

* వనితకావలయును! వివాహమునకు

వనితకావలయును.!!

ఆవంత్స వెంకట రంగారావుగారు.

సీ॥ పెద్ద మొగముదాని ముద్దుమాటలదాని
పొలుపైన పొడుగైన ముక్కుదాని
లేడికన్నులదాని లేతబుగ్గలదాని
నయమైన యేనుగు నడలదాని
నగవు వెన్నెలదాని నాణెంపుగటిదాని
ముడుతలువడినట్టి కడుపుదాని
పసిడిగాజులదాని పైట నిగ్గులదాని
కరవు దీర్చెడు దొరుగళ్ళదాని

గీ॥ సరిగదువ్విన నల్లని కురులదాని
మేలుకెంపుల రెట్ట తమ్మెట్లదాని
కన్నెలందరిలో దెబ్బ గలుగుదాని
వలచితిని యట్టివనిత కావలయునాకు
పిల్లగలవారు వేవేగ వివిధమైన
పత్రికలలోన ప్రకటింప ప్రార్థనమ్ము

* హాస్యరస ప్రధానము.

# కవిత్వపు ట్యూషను

శ్రీ [illegible] రాయకవిగారు ఏ. ఏం.
( [illegible] సాహిత్య సమ్మేళనము )

—♦ ప్రవేశం - గిరీశం ♦—

గి:— శ్రీమతి బుచ్చమ్మ Mrs Girisam, వచ్చిం దగ్గర్నుంచీ, నాలో new poetry పుట్టింది. అదికాని origin నుంచీ trace చేసుకువెడితే Wordsworth prelude అంతగ్రంథం తయారవుతుంది. (పరికించి చూచి) ఎవరది— మాబావ వెంకటేశంలాగుంది. పాపం మా అవధానులు మామగారు పోయింతర్వాత వాడికి Condolence letter రాద్దామనుకున్నాను కాని politic step కాదేమోనని ఊరుకున్నాను. Alright, personal గానే దొరికేడు. మరి తకరార్లేదు.

—♦ ప్రవేశం - వెంకటేశం ♦—

వెం:- చిన్నప్పుడు మాగిరీశంబావ చెప్పేవాడు తానేమో పెద్ద English poet నని నేరాసిన వితంతూద్వాహ ప్రబంధంమీద ఆంధ్రపత్రికలో పడ్డ review చదివితే తెలుస్తుంది నేనెంతవాణ్ణయానో.

గి:- Hallo, my dear brother-inlaw, Mr. Venkatesam, very sorry to hear of the demise of Mama garu. My Hearty condolences to you.

వెం:- (Serious గా) ఏదో, యింతకూ, దైవాజ్ఞ అనుల్లంఘనీయం కదా!

గి:- Really, really. అయితే యింకా మీఅగ్రహారంలోనే వున్నావా?

వెం:-అక్కడే వున్నానండి బావగారూ! యేదో కావ్యత్రయం కానిచ్చి కవిత్వంలో పద్దాక, తెలుగులక్షణం, అలంకారం, పాఠాలయేయి.

గి:- చెప్పేవుకావు బావా! అయితే వెంకటేశం వెంకటకవి అనేమన్నమాట.

వెం:- ఔనండి. నలక వేంకటకవి ప్రణీతమైన వితంతువ్యాహ ప్రబంధం మీరు చూసేరా?

గి:- బాగుంది కాని, మీయింటిపేరే incorrect గావుంది. "నలకా" అని వుండాలి. అక్కడ దీర్ఘం రావడం natural. Examples "ముండా, పురాణపండా" etc,

వెం:- లేదండి. పలకడంలో యెలాగైనా రాతలో పరిష్కృతమైన రూపం వాడాలి.

గి:- అల్లే, You are still... పెరటితోవనే వున్నావు. మాట్లాడేభాషలో రాయడం, మనల్ని పుట్టించిన బ్రహ్మదగ్గర్నుంచీ ఆచారమైపోయింది. The masses must under-stand you.

వె:- అయితే పద్యాల్లో రాసేటప్పుడు మాట్లాడినట్టు రాస్తే బాగుంటుందా?

గి:- Yes, Mr. Venkatesam, I mean, Mr. N V. Kavi;— ఎందుకూర్చుండడమూ? అగ్రహారం లో కూర్చోవడాన్ని; గ్రామోపాంతందాటికన్ను తెరవని నీకు లోకభోగట్టాలేం తెలుస్తాయి.

వెం:- అదేమిటండోయి, "లోకభోగట్టా"లని అనన్వయపు సమాసం వేస్తున్నారు? మన వ్యాకరణం ఒప్పుకోదే?

గి:- Damn your Grammar. భావముందా? వ్యాకరణంముందా? మనం మాట్లాడే మాక్కాలే పోగుజేసి వాటికి rules పెట్టేరు పూర్వం-మనకి spontaneous గా వొచ్చినమాటే correct. అదే real poetry.

వెం:- అయితే యిప్పుడలాటి ప్రయోగాలు వాడొచ్చునా యేఁవిటి?

గి:- By all means మరో కిటుకు చెబుతాను, విను. అలాటివి వాడితేఁగాని నీ కవిత్వాన్ని భావకవిత్వం అనరు

వెం:- పూర్వపు కవిత్వాల్లో భావాలున్నాయి కాని అప్పుడిలాగు రాయలేదేం?

గి: That is it. నీకు Romantic poetry వాసన తగల్లేదన్నమాట. Romantic poetry అన్నదే భావకవిత్వం Inspiration కొద్దీ వాంతిలాగొచ్చే కవిత్వం romantic అన్నమాట.

వెం;- అయితే మీరు కాని భావకవిత్వాలు చెబుతున్నారేఁవిటి?

గి;- ఓ, hundreds, why. లోగడ నీకు చెప్పిన Widow verse, highly romantic.

వెం:- ఇంగ్లీషులో కాదండీ, తెలుగులో మాట.

గి:- అదీ చెప్తాను. నా verse నేనే translate చేశాను, విను.

"తెల్లవారేసరికి లేచును,
యిల్లు వాకలి శుద్ధిచేయును,
తలుపుమూలకు చెత్తతుడిచి, వి
తంతు రత్నంబు."

వెం;- ఇదేఁవిటం డీపద్యం? ఘోరంగావుంది. అప్పకవీయం, సులక్షణసారం, వేట్లోనూ లేని రకం.

గి:- అవన్నీ stale rhymes అయిపోయేయి. కాక, నీఅప్పకవికి లక్షణంలో Knowledge ఉంటేనా? వాడు చెప్పిన సర్వలఘుసీసం వాడి లక్షణం ప్రకారం wrong ఒక్క గీత పద్యం తప్ప మరేది old stock యిప్పుడు పనికి రాదు.

వె:- (ఆలోచించి) ఇప్పుడు మీరు సెలవిచ్చిన widow పద్యం వృషభగతిరగడవరసలాగుం దేఁవిటి?

గి:- ఉంటే ఉండొచ్చు. Old names రద్దు పర్చడంలో కొంత reform చయిత ప్రోనసు నడిస్తే నడవొచ్చు లేకపోతే మానెయ్యొచ్చు-దీనికి "ముత్యాలసరం" అ modern name Widow ని ముత్యాల సరంతో decorate చెయ్యడంలో Literary and Social reforms రెండూ కలిసొచ్చేయి.

వెం:- మరి ప్రబంధం రాయడానికి మీగీతం, ముత్యాలసరం చాల్నా?

గి:- There you are wrong. ప్రబంధం మాట మరి తలపెట్టకు "ఛందం రాసినవాడు కవి" అన్నారు పూర్వం-ప్రాసకోసం యేడిసిన సామె తెది. నిజం గీతం రాసినవాడే కవి. ఇహ, కవి అన్నవాడి highest ambition యేఁవిటంటే చిన్న చిన్న గీతాలాప్రయడం అవి కలిపి feather-weight paper మీద ఒక volume లో అచ్చువేయించడం చేతనైతే తన పద్యాలకి తానే illustrations రాయడం volume కి add చెయ్యడ్యం.

వెం:- బొమ్మలుండాలేఁవిటండి? వాచకపుస్తకాల్లాగ.

గి:- కాదోయి-Art exhibit చెయ్యడానికి.

వెం:- అయితే దేని విషయమండి యీగీతాలాప్రయడం?

గి;- అది కవి యిష్టం-Poetry మాత్రం soul

stirring and animated గా వుండాలి. దానికి ప్రణయం లేందే కథ నడవను. అందులో తామసి, అసాధం, వియోగం, విషాదం యీ aspects ఉండాలి.

వెం;- అంటే ప్రబంధాల్లోని విప్రలంభం ఒక్కటే యెత్తి రాయాలన్న మాట?

గి;-No అదంతా nonsense, చందమ్మీన్ని వాళ్ళకి తిటడం. ముఖ్యంగా చందమ్మీన్ని కట్టుకం, Hindu-Moslem unity కి భంగం. కోపో సివ్వ కుమిలి కుమిలి యేడుస్తే వ్రాకుం టారు కాని ఒహాళ్ళని తిడితే వొప్పుకోరు. అది abuse, not poetry

వెం:- మరేంవి టాపియడం అయితే?

గి;- ప్రణయంఅని చెప్తానుకానోయ్.

వెం;- యేదివిటీ ప్రణయానికర్థం చెబుదురూ? నేనూ నేర్చుకుని రాస్తాను.

గి:- Yes, you are coming to the point. కవిత్వంలో tution చెబుతాం అంటే నాకు తెలిన శిష్యుడెవడూ దొరికేడు కాడు Come on, my old student and brother-in law: నా library లోకి పోయి మాట్లాడు కుందాం రా.

( తెర )

—• భావ కవిత్వ గ్రంథాలయం •—

[ ప్రవేశం—గిరీశం, వెంకటేశం. ]

వెం:- ( పరికించిచూచి ) అదేమిటండీ, ఆ బోర్డు మీద పేరెవరిది?

గి;- మా organisation మొదట్నుంచి చెప్తాను, విను. భావకవిత్వాల వాళ్ళని పదిమందిని పోగుచేసి, చిన్న literary సమితి start చేసి, దానికి నే నే అధ్యక్షుణ్ణయేను. ఈ Library మా society దే, ఆబోర్డుమీద నా పేరే.

వెం;- అయితే గిరీశం అనక "శ్యామలవాణి" అని రాసేరేమిటి?

గి:- Sceptre of authority, suggest చేసే name పెట్టేను. అదే beauty. అమ్మా నాన్నా, వుంచిన పేర్లో glamour, too much use నించి చస్తుంది

వెం;- అమ్మా నాన్నా యిచ్చినా తెలీదానికసలు ఇంటిపేరేది?

గి;- ఇంటి పేర్లేసుకోడం superfluous and ridiculous excess "శ్రీ" పెట్టుకుంటే వాళ్ళు. అందులో design లోవున్న "శ్రీ" ని artless eyes కి కనపడ్డం కాదు.

వెం;- అయితే మీరెన్ని నామాలతోనే రాస్తారా యేమిటి?

గి;- ఇదే అన్న మాటేమిటి. యేదో ఓ false name ఒహోక్కప్పుడు కేవలం anonymous'

వెం;- యెందుకండీ, అంత దొంగతనం భయమన్నా?

గి:- There you are wrong. భయం కాదు. అందులో వున్న romance, స్వంత పేరుతో రాస్తే వుండదు

వెం;- నాక్కూడా యేదేనా పొత్తైన పేరు పెడుదురూ?

గి:-అలాగేకాని ముందు మా creed understand చేసుకో. ప్రణయం సంగతి చెప్తాను విను. అబక్కమాటలో బ్రహ్మాండమంత meaning వుంది. కల్పవృక్షంలాంటి resourcefulness దానిది. యేఅర్థం కావలిస్తే ఆఅర్థంలో use చెయ్యొచ్చు.

వెం;- నానార్థం, విశ్వం, సాంబ...

గి;- Wait నీనిఘంటువులన్నీ కట్టగట్టి పారేయ్.

"ప్రణయం" అన్నమాట తెలిస్తే You are a scholar.

వెం;- అసలర్థమేనా చెప్పండి.

గి;- దానికి వేరే నేను verse లో expound చేసిన commentary చదూతానుండు. వెనక ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో పడ్డదది. భారతిలో gilt letters తో పడవలసిన article అది. Wide circulation కోసం మారుపేరుతో పత్రికలోనే వేయించాను. Go on here it is; read this. తెలియంచోట నన్నడుగు.

వెం;- (చదవబోతూ) యేంపద్యమో ముందు రాయలేదేమండి ?

గి;- Needless,- మీామమొక్కటి, మనం అలా రాస్తే తెలివైన readers, degrading గా భావిస్తారు.

వెం;- (చదువును)
"పొన్నపుప్పొడిలోని ముద్దుటుంగరము"
ఏంవిటండోయ్, ఈచరణానికర్థం ?

గి;- No, no శాస్త్రుల్లుగార్లా ప్రతిపదార్థం చెప్పడానికి, నీకుదొరకదు. ఇదంతా suggestive poetry, you must feel it. సరే. Stanza కానీ చెప్తాను.

వెం;- (చదువును)
"పొన్నపుప్పొడిలోని ముద్దుటుంగరము,
విప్పపూదేనెలో వప్పుబెల్లాలు
కొర్రికొక్కురు మెరుపులో గునపంపుపోటు,
మందమారుతములో మంచిముత్యాలు,
సెలయేటిపాటలో జీలుగుబెండు,
నెమిలికన్నులలోని నేరేడుపండు,
భారతీదేవి! నీప్రణయగానంబు."

(ఊరుకుంటాడు.)

గి;- యేం, తెల్లబోతావేం ? పెద్ద కవీశ్వరుణ్ణంటావు.

వెం;- నాకేం బోధపడ్లేదండి.

గి;- Alright, విను. The divine music of what you call pranaya, దానిస్వరూపాన్ని explain చెయ్యడానికి Nature లోంచి similar things cite చేశాను. Go on, చదూ; next stanza ditto.

వెం;- చదూతానుగాని నాకిప్పటికేమీా అర్థంకాలేదు.

గి;- Deep గా dig చేస్తే శ్లేషకూడా దాన్లో బయలుపడుతుంది.

వెం;- ఓ అర్థం తెలిసింది గనక నాకు రెండో అర్థానికి దేవులాడ్డానికి.

గి;-Despair కాకుండా చదూ నీకే తెలుస్తుంది.

వెం:- (చదవబోతూ) మొదటి stanza తరవాత యీాచుక్కలెందుకండీ ?

గి;- అక్కడ Poet's chain of thought, over inspiration చేత తెగిపోయిందన్నమాట. లోపించిన భావాలేవో readers కి guess చెయ్యడానికి విడిచిపెట్టినట్టు.

వెం;- (విసుగుగా) సరే యేదో. చదూతాను
"గరళపునిగ్గులో కలకండతీపి,
పక్షపాతములోన పంచమస్వరము,
చెంగావిచీరపై చిరిమల్లెచిలుక,
సింగపుబొబ్బలో చెట్టుసంపంగి,
జిలిబిలిపన్నీట చెకుముకువేట్లు,
మొగలిపూరేకులో ముత్యాలగడ్డి,
తేనెవాతెరలోన తెరచాటునీటు,
భారతీదేవి! నీప్రణయగానంబు."

♦ ♦ ♦ ♦ ♦ ♦

గి;- ఔను. Ditto అని చెప్పేనుకానూ అయితే యీ Stanza లోమాత్రం more complex ideas పెట్టేను. Poetic talent ఉన్నవాళ్లకే understand అవుతుంది. Go on, continue.

వెం;- (చదువును)

"శక్రచాపములోని జంపెతాళమును
మొగ్గపుట్టిననాడె ముద్దుగొన్నాడ,
పిన్న తెమ్మెరలోని పిల్లికన్నులను
ఉగ్గుతాగిననాడె యూడనేర్చితిని,
అళిగీతములలోని యావ్రలింతలకు
చిట్టినవ్వులనాడె చిటుకవేసితిని,
ప్రేమలోపుట్టిన ప్రేమరసంబు
భారతీదేవి! నా ప్రణయగానంబు"

♦ ♦ ♦

గి;- Yes. Note the last line. ఇందులో నా early understanding of pranaya చెప్పేను. చదూ. పదాలకూర్పులోవున్న spontaneous fluency, side by side గ్రహిస్తూవుండు.

వెం;- అన్నీ గ్రహించాలనే వుందండి, బోధపడితే.

గి;- Next stanza లో excellency of pranaya గ్రహించడానికి poet పడ్డ శ్రమలు describe చేశాను చదూ.

వెం;- యేమిటో, కానీండి.

"బంగారుజల్తారు పానకంబందు
మిరియాలపొడి కొంత మేళవించితిని,
బాలచందురు సుధాపాయసంబందు
ఏలకిపొడికొంత హెచ్చుచేసితిని,
చేమంతిబంతుల చిరునవ్వులందు
ముద్దుముద్దుగ చిన్న ముల్లుగుచ్చితిని,
ఇట్లుచేసితివేల నీవందువేమొ,
ప్రణయంపు మహిమయే
ప్రణయమహిమంబు"

ప్రణయఅంటే అర్థం ప్రణయమే అని తెల్పారేమిటండీ దీనిలో?

గి;- ఔను. That is the nearest meaning which can approach the sense of the word. "అతని కతండె సాటి" అన్నట్టు, ఆమాటికి ఆమాటే సరియైనఅర్థం.

వెం;- అయితే మీ commentary యేం వుంది దీనిలో?

గి;- అది last stanza చదివితే తెలుస్తుంది. అందులో ప్రణయాన్ని యెక్కడికక్కడ anatomise చేసి పారేశాను. ఆపాళ్ళు కలిపితే నీమట్టుకు నువ్వే తయారు చేసుకోవొచ్చు చదూ.

వెం;- (చదువును)

"నీలాలలోనున్న నియమంబు తీసి
బంగారులోనున్న పాలను దీసి
మేల్మి వన్నెటిలో మీగడల్ దీసి
నీహారగిరిలోని నీతిని దీసి,
కృష్ణవేణమ్మలో కీర్తిని దీసి,
యెండమావులలోని యింపును దీసి"
(నవ్వుతూ) తెలివితక్కువలోని విలువను దీసి"—

గి;- వేమిటోయ్ బావా, అందులో లేంది చదూతున్నావు? స్వంత కవిత్వ పెట్టినా కాని బాగానే వుంది. Ignorance is bliss అనే saying విన్నావా. ఆ bliss నువ్వు add చేశేవన్నమాట. నీలోకూడా latent గా Romantic instinct ఉందన్నమాట. నువ్విలాటి కవిత్వం చెప్పడం మొదడితే, Spenser లాగ నేను Poet of poets ని అవుతానన్నమాట.— Go on, continue.

వెం.- "పండుటాకులలోని పసువెల్ల దీసి
ప్రణయమా! నినుజేసె బ్రహ్మదేవుండు"
ఇక్కడీ పసువు దీశాడః దేవిటండోయ్? యెవరిది ?

గి;- Yes. you are right. నీకూడా అక్కడ శ్లేష suggest అయిందన్నమాట. పండుటాకులంటే, పాతశాలూలు తలకు చుట్టుకునే Old pundits వాళ్ళని set aside చెయ్యడవన్నమాట – లేకుంటేప్రణయానికి వాళ్ళు obstruction

వెం:- అంటే మానాన్నలాటి వాళ్ళా ?

గి;- మరేవిఁటి! నేను మీsister తో romantic poetry act చేసే రోజుల్లో, మీనాన్న యెలా చిక్కు పెట్టేవాడో, యెరగవూ? కాబట్టి ఆline లో అంతర్థంవుంది personal element also. It is the crowning line of the whole piece.

వెం:- (కుర్చీలో చేరబడిపోయి) ఇదంతా చదూతే, యేమోకాని నామనస్సు గాభరాగా వుందండీ.

గి;- Yes. అది inspiration యొక్క physical effect. ఆ surcharged bosom గొంతుకలో కొట్లాడకుండా యేదో ఓరూపంలో వెళ్ళగక్కెయ్యాలి.

వెం;- Inspiration ఏఁవిటండీ, నాకు కాళ్ళూ చేతులూ అందకుండా వున్నాయి, యీ అగాధంలో.

గి;- ప్రణయంవల్ల కలిగే agonised feelings యిప్పుడు నువ్వు experience చేస్తున్నావన్నమాట.

వెం;- మీలాగ నాకేం ప్రణయాల్లేవండి. ప్రణయ కవిత్వఁవే నన్నిప్పుడల్లర పెడుతూన్నది.

గి;- No my dear brother-in-law, నీకు ప్రణయం వుండాలన్న బాధలేదు. ప్రణయ కవిత్వం చెప్పే విధం teach చేస్తాను, నేర్చుకుంటావా.

వెం;- ప్రణయ కవిత్వఁవంటారు, భావకవిత్వఁవంటారు. మీమాట యేది సిసలు?

గి;- రెండూ ఒకటేనోయ్.

వెం;- సరే-చెప్పండి, ఆవిధానం ఏఁవిటో!

గి;- మొదట starting లోనే నువ్వు ఓప్రేయసినో, or whatever you call it, ఓప్రణయమూర్తినో create చేసుకోవాలి.

వెం;- ఔనుకాని, ఆడవాళ్ళకి, రామమూర్తి, కృష్ణమూర్తి అన్నట్టు "ప్రణయమూర్తి" అని మొగాడి పేరు పెట్టొచ్చా?

గి;- Nonsense; మూర్తిఅంటే image, idol అన్నమాట. ఆidol యొక్క altar మీద నీ life-blood ప్రవహింపజెయ్యాలి. ఈ library లో వున్న పుస్తకాలన్నీ, various poets యొక్క హృదయరుధిరధారలే అనుకో.

వెం;- చచ్చిపోరండీ, ఒంట్లోరక్తం యేరైపారితే.

గి;- Damn it. Figuritive గా చెప్పింది అపార్థం చేసుకుంటావేం?

వెం;- పోనిండి. యేదో ప్రణయమూర్తి అనేకంటె, యేదేనా పేరే పెట్టేస్తే?

గి;- పెట్టొచ్చు వీసరస్వతిఅనో, పెడితే Divinity కూడా కలిసొస్తుంది.

వెం;- ఔనులెండి. యేఁవిటి రాయడం, అసలు సృష్టిలోలేని మనిషిమీద?

గి;- అదే poet యొక్క creative faculty. లేని బాధపడుతూన్నట్టూ, లేనివేదన పొందుతూన్నట్టూ, కల్పించి, లేని ప్రణయమూర్తి

# అనుతాపము.

కొత్త సత్యనారాయణమూర్తిగారు.

మాయురె! మాకు జీవితము మారణకృత్యమునందె మున్గి, సా
హాయ్యముకై దురీక్ష్య సమరావని సైన్య సమన్వితంబునై
యాయువులంటఁగట్టి విలయంబునకైనఁ గడంగు ప్రాణి న
న్యాయముగా వధించుటయె న్యాయముగా! యిసి! దుష్టచిత్తమా! ॥ 1.

అసుఖదమైన రాజ్యమను నామిషఖండము నారగింప వే
వెన, శునకాళికిత్తి కడు వెంగలులై తమలోనె తాము సం
తసముగఁ గాటులాడి పసదక్కిన మాదృశ మానవాధముల్
పసరములౌనొ! లేక కులపాంసకులౌనొ! తలంప మాధవా? 2.

నష్టజనుండు దుర్జనుఁడనౌ ధృతరాష్ట్రతనూజబుద్ధియున్
స్పష్టముగా నెఱింగియును సైరణచేసి తొలంగనైతి, నీ
కష్ట మదేతయుంచు నకార్యపుబుద్ధిని రాజ్యకాంక్షచే
నిష్టమనంబుతోడ యతిహీనపు కిల్బిష మాచరించితిన్ ॥ 3.

బళిరా! భీమధనంజయాదులను శుంభత్సంగరక్షోణి, బి
ట్టలమన్ మార్కొను నాసుయోధనుఁడు నష్టాత్ముండు, యోధాగ్రగ
ణ్యులలో నెవ్వని పీఁగాఁదలఁచి యాత్మోత్సాహముం బొందెనో
యలరాధేయుని మాదు నగ్రజుని దివ్యాస్త్రాన్వితున్ మ్రింగితిన్ ॥ 4.

కొంగున నగ్నిదాఁచినటుఁ గొంతి విశేష విహీనబుద్ధిచే
తం గురుస్వామిభక్తి దృఢతత్పరు నూర్జితవిక్రమోన్నతున్
ఇంగితవేది కర్ణునెటు లెన్నోయి డాఁచెనో డాఁపకేమి యుం
డెంగద? స్త్రీలబుద్ధి యరుదే తెలియంగను బండితోక్తియున్ ॥ 5.

మానితవిక్రముండు నభిమన్యుఁడు పోవనశింపనిమ్ము, మ
త్సూనులు ద్రౌపదేయులటు చొక్కి దునింగినఁ ద్రుంగనిమ్ము, త
ద్భానుతనూజుఁ డగ్రజుఁడు పాండవవీరులకంచు మాట, మా
మానసము ప్రాణమానగ మంటన ద్రోచి కలంచెమాధవా? ॥ 6

అన్నా! రక్తమయంబునై యఖిల ప్రాణాపాయ సంపాదియై
యెన్నోరీతుల నాదు సర్వకులముల్ హీనస్థితిన్ ద్రోచి, మా
యన్నం గర్ణుని మ్రింగియున్న యలప్రాజ్యంబైన రాజ్యంబదే
మున్నన్ లేక త్రిలోకరాజ్యఫలమే యున్నన్ ముదంబొప్పునే ॥ 7.

# వివిధవిషయములు

## కథానాయిక.

ఒక యౌవన స్త్రీ. అంత పొడగరియు కాదు, పొట్టియును కాదు, తలిదండ్రులు లేని యనాథ. అద్వితీయమైన నేత్రద్వయము. అసాధారణమైన నీలకుంతలములు. చిరునవ్వుతో గూడినముఖము. అందమున రంభ. సాధారణ స్త్రీలు నవ్వివేయు సందర్భములలో నీమె మూర్ఛ చెందును. కన్నీరు, నిట్టూర్పులు నిరంతరము అందుబాటులో నుండును. ఆమెకు కోరిక జనించునా. నిద్రాహారములు మానును, సన్నగిలును. కొంతుకలను దువ్వనయిన దువ్వదు. జీవితమంతయు దుర్భరమై యేడ్చుచు కృశించుచుండును. ఇవియే కథానాయిక కుండవలసిన లక్షణములు. గ్రంథకర్తలు కాగోరువారు గమనింతురు గాక.

## చార్లేచాప్లిన్.

చార్లేచాప్లిన్ కిప్పటికి మూడు పెండ్లిండ్లయినవి. ఈ పెండ్లిండ్లవలన నీతనికి చాల ధననష్టము కలుగుచున్నది ఈతని మొదటి భార్యయగు మిల్ డ్రెడ్ హారిస్ యీతనిని 1921 లో డైవర్సు చేసెను. 1914 నవంబరులో మెక్సికో నగరమునందు చార్లేచాప్లిన్ సినిమా కంపెనీలో నటకురాలుగనున్న లీటా గ్రేను వివాహమాడెను. ఇది మూడవ వివాహము. వివాహమునాటి కీమెకు పదునారేండ్లు మూడవ వివాహమువలన యిరువురుబిడ్డలు గలరు. మూడవ భార్యనుకూడ వదలివేయుటవలన బిడ్డల సంరక్షణార్థము 2,00,000 డాలర్లు ప్రత్యేకించి దీనిమీద వచ్చు వడ్డీ తన భార్య కిచ్చునట్లును, ఆవడ్డీతో బిడ్డల పోషించవలెనని నియామకము చేసెను. పిల్లలు పెద్దవాళ్ళయి.పిమ్మట అసలు పిల్లలకు చెందును. ఈన భార్యకు 625 00 డాలర్ల నొసంగెను. ఈ నష్టములను భరించుటకు చార్లేచాప్లిన్ కు నవకాశమున్నది. సినిమాఫిలిం కంపెనీలలో నున్నవారికి ఖర్చు అధికమే. అయినప్పటికిని రాబడి వేయిరెట్లధికము. సంవత్సరమునకు చార్లేచాప్లిన్ యొక్క ఆదాయము 156,000 పౌనులు లేక 23,40,000 రూపాయలు. ఇది కాక వ్యాపారములలో లాభము మూలమున నింకను రాగలదట. ఆమొత్తమెంతో తేల్చుట కష్టము. సినిమా ఆక్టర్లలో నధికముగ సంపాదించువారు ముగ్గురు గలరు.

| | | | |
|---|---|---|---|
| హారోల్డులాయడ్ | సం॥కు ఆదాయము | రు 32 | లక్షలు. |
| టాంమిక్సు | డిటో | 32 | ,, |
| చార్లేచాప్లిన్ | ,, | 23 | ,, |
| డగ్లస్ ఫెయిర్ బ్యాంక్సు | ,, | 23 | ,, |
| మేరీపిక్ ఫోర్డు | ,, | 16 | ,, |

వీరెంతనధికముగ డబ్బు సంపాదించుచున్నారో అంత తేలికగా డబ్బు ఖర్చయిపోవుచున్నది.

## మోటార్లు.

గ్రేటుబ్రిటనులో 15 లక్షల మోటార్లు, మోటారు సయికిళ్ళు కలవు. సంవత్సరమునకు 2 లక్షలవంతున యీ సంఖ్య పెరుగుచున్నది లండను వీధులలో 6 వేల బస్సులు తిరుగుచుండును 356 మైళ్ళ పొడవుగల ట్రాంవేలయిన్లు లండనులో కలవు.

## మరణములు.

ప్రపంచములో ప్రతి సంవత్సరము చలిజ్వరమువలన 25 లక్షల మరణములు సంభవించుచున్నవి.

## కోటగిరి.

నీలగిరి పర్వతములమీద కోటగిరి యను ప్రదేశము గలదు. సముద్రమునకు 7 వేల అడుగుల యెత్తున నున్నది. ఇది చాలా ఆరోగ్యవంతమైన ప్రదేశము. అనేకమంది విదేశస్థులు యీ ప్రాంతమును సందర్శించి ఆరోగ్యమునొసంగుటలో కోటగిరి కాలిఫోర్నియా నగరమునుకూడ మించుచున్నదని నుడివియున్నారు. ఇక్కడ నివసించు

చూస్తు స్త్రీ పురుషులను చూచినయెడల యీ ప్రదేశ మెంత ఆరోగ్యవంతమైనదియు తెలియగలదు. 85 సంవత్సరముల వయస్సుగల స్కాట్లండు దేశస్థుడొకడు యిచట నివసించుచున్నాడు. ఇతడీ కొండలను గంటకు 4 మైళ్ళ వంతున యెక్కునట. ప్రతివారును 2 మైళ్ళ దూరము వంతున షికారు పోవుచుందురట. ఇక్కడ వస్తువుల ఖరీదుకూడ చాల తక్కువ.

### జనాభా.

గత నూరుసంవత్సరములలో ప్రపంచములోని జనాభా రెండురెట్లు పెరిగినది. ఇప్పుడు ప్రపంచములో జనాభా 170 కోట్లు. 1800 సంవత్సరములో 85 కోట్ల 80 లక్షలు. పాశ్చాత్యుల జనాభా అన్నిదేశముల జనాభాలకంటె హెచ్చగుచున్నది. 65 కోట్లు జనాభాగల పాశ్చాత్యులు సంవత్సరమునకు వెయ్యికి 12 వంతున పెరుగుచున్నారు. నల్లజాతులవారు వెయ్యికి 5 వంతున పెరుగుచున్నారు. లండను నగరములో జనాభా యిప్పుడున్నవిధముగా పెరిగినట్లయితే 2000 సంవత్సరములో లండను నగరముయొక్క జనాభా 2 కోట్లు కాగలదు.

### ప్యారిసు నగరమందలి స్త్రీలు.

స్త్రీలకు సౌందర్యము నొసంగునవి పాదములనుటచే ప్యారిసు నగరమందలి స్త్రీలు తమ పాదములను భద్రముగ సంరక్షించుకొనుచుందురు. ప్రతిదినము పాదములను కడిగి ఒక విశేషమైన సువాసన పొడిని పాదములకు రుద్దుచుందురు. వారమునకు రెండు మూడు పర్యాయములు చాలకాలము వేడినీళ్ళతోను సబ్బుతోను కడుగుదురు. సబ్బు పనికిరానివారు సోడా పానముతో కడుగుదురు. ఇందువలన పాదమునకు నొప్పులన్నియు పోవుటయేగాక ముడుతలుకూడ పోవును

### సౌందర్యము.

స్త్రీలు, పురుషులు గాని తగిన దుస్తులను ధరించుటవలన సౌందర్యము లభించును. దుస్తులను నిర్లక్ష్యము చేసినయెడల అందవికారము గలవడును. ముందు గమనించవలసినది వ్యక్తియొక్క పొడవు. కొందరు తాము పొట్టిగా నున్నామని, మరికొందరు తాము పొడుగుగా నున్నామని అనుకొనుచు తమను తామే విహ్వలముగ చూచుకొనుచుందురు. పుట్టుకతోనే వికలాంగులైన తప్ప పొడవు పొట్టిలు సౌందర్యమును తీసివేయజాలవు. అతి సౌందర్యముగల స్త్రీ పురుషులు అనేకవిధములయిన పొడవులలో నున్నారు. మనము విచారించవలసిన విషయము మన మెంతపొడవుగ నున్నాము మనపొడవున కెట్టిదుస్తులు అనుకూలించు ననునదియే. మంచి పొడగరియగు స్త్రీ జడ వ్రేలాడవైచుకొని పాదములకు పట్టాగొలుసులు పెట్టుకొన్న యెంత అందముగా నుండునో, కొంచెము పొట్టిగానుండు స్త్రీ కొప్పు పెట్టుకొని కాలికి అందెలు తగిలించుకొన్నచో అంతే అందముగ నుండును. కొంచెము పొట్టిగనుండు పురుషుడు లాంగుకోటు తొడుగుకొనిన యెంత అందముగా నుండునో పొడుగుగానుండు పురుషుడు షార్టుకోటుతొడిగితే అంతే అందము. ఎర్రనివారు తెల్లదుస్తులు యెర్రదుస్తులు కడితే యెంత అందమో, నల్లనివారు నల్లదుస్తులు ధరించిన అంతేఅందము కనుక శరీరఛాయ పొడవు పొట్టి వీటి నన్నిటిని గమనించి అలంకరించుకొనినయెడల సౌందర్యము చేకూరగలదు.

### శశి మోహనుడు.

సిల్హెట్ జిల్లాలో నొక గ్రామమున ఫయ్యాజ్ అలీ అను మండలము తాకోరు కలడు. అనేకమంది స్త్రీలను చెరచెను. గ్రామస్థుల పిరికితనమువలన యీ దుర్మార్గుని యాటలు చాలకాలము సాగినవి. ఒకరోజున ఆ గ్రామములో మరియొక స్త్రీ మధ్యవర్తిత్వముక్రింద 16 యేండ్ల యౌవ్వనవతిని చెరపచూచెను. ఈమెయొక్క పెనిమిటి నిరుపేద. ఈమెపేరు పవిత్ర. తనకిస్తానన్న ఆభరణముల నన్నిటిని త్రోసివైచినది. ఫయ్యాజ్ అలీ దౌష్ట్యము చేసి వారింట్లో ప్రవేశించెను. పవిత్రమాత్రము నిరాకరించినది. అంగీకరించనియెడల బలవంతముగ చెఱచెదనని అలీ బెదరించి వెళ్ళెను. ప్రక్క యింటిలోనున్న శశిభూషణుడు 16 సంవత్సరముల పిల్లవాడు. ఒకనాడు సాయంకాలము అలీవచ్చి పవిత్రను నిర్బంధించెను. అంతట శశిభూషణుడు ముగ్గురు స్నేహితులతో వచ్చి అలీ తలపై లాఠీకర్రతో మోదెను. అలీ అంతటితో చనిపోయినాడు. పోలీసువారు శశిభూషణుని అరెస్టుచేసి కేసుపెట్టిరి. కేసును విచారించి న్యాయాధిపతియును, అస్సెసర్లును శశిభూషణుడు నిర్దోషియని వదలిరి. అచట పోలీసు పరిపాలన యట్లున్నది.

## చదువు రానివారు.

| దేశము | సంవత్సరము | నూటికి చదువురాని వారి సంఖ్య |
|---|---|---|
| జర్మనీ | 1910 | .03 |
| హాలండు | 1910 | 1.0 |
| ఫ్రాంసు | 1910 | 4.7 |
| బెల్జియము | 1910 | 8.9 |
| ఇటలీ | 1905 | 30.6 |
| ఇండియా | 1921 | 92.0 |

## సలహాలు.

మానవు డీక్రింది యంశముల ననుసరించిన చాల లాభ ముండును.

(1) మృదు సంభాషణము.
(2) మితభాషణము.
(3) శ్రద్ధగా వినుట.
(4) నెమ్మది నడక.
(5) శాంతాలోచనము.
(6) దీక్షాపరత్వము.
(7) కార్య శూరత్వము.
(8) పట్టు, విడుపు.
(9) మౌనము.
(10) గడబిడ నణచుట.

## బర్ద్వాన్ మహారాజు.

బర్ద్వాన్ మహారాజాగారును వారికుమార్తె సుభారాణి దేవియు లండనులో ప్రసిద్ధిచెందిన మిస్ డాల్ ఫీనోల్ అను నామెవద్ద నాట్యము నేర్చుకొనుచున్నారట. కాల మహిమ!

## జమ్నాదాస్ ద్వారకదాస్.

బొంబాయిలో గొప్పవర్తకము కొనసాగించిరి. రాజకీయములో నధికముగ పాల్గొనిరి. దివ్యజ్ఞాన సమాజమునకు చెందినవారు, బెసంటమ్మగారికి కుడిభుజము. మొన్న వ్యాపారములో గొప్పనష్టము కలిగినందున [illegible] అప్పు పదమూడు లక్షలు. అక్కటకట.

## మండి రాజా గారు.

వీరు కాపూర్తలా మహారాజావారి అల్లుడు. కాపూర్తలా మహారాజావారికి [illegible] లోకూడ ఎక్కువకలదు. వీరు సాధారణముగ నచటనే కాలము గడుపుచు అధికారుల యనుగులకు మరుగులొత్తు చుండుటవలన సంతర్జాతీయ సభలకు ప్రభుత్వమువారు వీరిని సభ్యులుగ పంపుచుందురు. వీరి అల్లుడు మండిరాజా గారుకూడ అచటనే కాలము గడుపుచున్నారు. పాశ్చాత్యనాట్యము (Dancing) లో వీరతినిపుణులట. రిస్విట్జర్లండులో డాన్సింగ్ బహుమానము వీరికి లభించినదట. ఫ్రాంకణబర్గు అను స్త్రీతోకలసి నాట్యము చేయుదురట. పాశ్చాత్యనాయకులు పాశ్చాత్య నాట్య విద్యాకుశలుల నతి గౌరవించెదరు. హిందూదేశ చరిత్రలో నీకీర్తినుకూడ మండి రాజాగారు బర్ద్వాన్ మహారాజాగారు తీర్చిరి.

## కాప్టెన్ గ్రే గారు.

విమానములో భూమికి యేడుమైళ్ళ యెత్తున ప్రయాణముచేసిరి. వీరు అమెరికా దేశస్థులు. ఇంతయెత్తున యెగురుటకు వీరే ప్రథములు.

## చేబదులు.

ఒకానొక ప్రదర్శనమును జూచుటకు ఎడ్వర్డు చక్రవర్తియును అలెగ్జాండ్రా రాణియు వెళ్ళియుండిరి. అచట పువ్వులను విక్రయించుచున్న బాలికవద్దనుండి కొన్నిపువ్వులనుకొనిరి. జేబుచూడగా డబ్బు లేకపోయినందున, అలెగ్జాండ్రారాణివంక ఎడ్వర్డుచక్రవర్తి చూచెనట. ఆమెవద్దను డబ్బు లేకపోయెను. అప్రదర్శనమును చూచుటకు వచ్చిన జార్జిస్మిత్ అనునాయన కనిపెట్టి సావరిన్ ఎడ్వర్డు చక్రవర్తికి చేబదు లిచ్చెనట. "నీడబ్బు తిరిగి రాదుసుమా!" అని రాణి హాస్యముచేసెను. తరువాత స్మిత్ కు చేబదులు వాపసు యియ్యబడెను. చక్రవర్తి యంతటివానికి చేబదులిచ్చిన గౌరవ మీతనికిమాత్రమే దక్కినదట.

# మహారాష్ట్ర స్వాతంత్ర్యము.

హరనాథ వసుప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది.

(గతసంచికతరువాయి)

ఖాసిం;- ఆనంగతినే వచించుచుంటిని. ఏమి చక్కదనము! అందమున నాబాలిక దేవకన్యకనుమరపించినది. చేతికందియు దప్పించుకొని పోయినది. ఆబాలిక నిచ్చటకు గొనివచ్చి శయ్యపై కూర్చుండబెట్టి ఫిషావరు పులావు దిన్పింపజాలక పోయితిని. విశాలములైన యామె కన్నులకు గాటుక పెట్టజాలకపోతిని. ఎంత విచారము?

రంగ;- (స్వగతము) జగదీశ్వరా? ధైర్యము నొసంగుము. దారుణమైన రాజ్య సంపాదన చింతలో మునింగియుంటిని. లేకున్న నీనీచుని మత్సదాహాతిం బడగొట్టియుందును.

ఖాసిం:- అట్టి సుందరమైన ముఖమునం దట్టి కాఠిన్యమున్నదని యెవ్వరనుకొనెదరు.

రంగ;- ఆమె యేమిచేసినది?

ఖాసిం;- సుబహానల్లా! నే నా దేవకన్యంగాంచి పరమానంద భరితుడనై ప్రాణేశ్వరీ! యని పిలుచుచు సమీపమున కేగితిని. మిత్రమా నేనేమి చెప్పుదును! ఆరమణీమణి తటాలున బొడ్డులో నిమిడ్చియున్న కరవాలము నొకదానిని బైకిదీసి చేతబట్టుకొని నాముంచుకు దుమికినది. ఆశ్చర్యము-ఆశ్చర్యము-ఆనాడి వడిన వేణీభరము-బాగుగా విప్పి చూచుచుండిన రక్త వర్ణాంచిత నేత్రములు-మెఱయుచున్న కరవాలముతో గూడిన యామె రూపము జూచునప్పటికి నా చేతికరవాలము జారిపోయినది. తెల్లపోయి చూచితిని. అటు పిమ్మట వెనుదిరిగి పరువెత్తితిని. కాలికి జక్కగ బుద్ధి చెప్పితిని.

రంగ;- (స్వగతం) వీరబాలికా! నీవు ధన్యవు. జగదీశ్వరా! నీకరుణ నెంతని కొనియాడుదును, ఈపిరికివాని భార్యను ఆవనితామణిని వానంతియొక్క దీనబాంధవుడే రక్షించెను.

ఖాసిం;- మిత్రమా! ఏమియో యోజించుచుంటివి.

రంగ:- సర్దార్ బహద్దూర్! నాకీ నాడేలయో తలనొప్పిగానున్నది, అనుజ్ఞనొసంగిన పోయి విశ్రమింతును.

ఖాసిం:- మంచిది, నాకును విశ్రాంతియే కావలయును? అంతయు జీకటికోణమయి యున్నది. ఒక శేరు సారాయమును గ్రోలినగాని యాబంగారు బొమ్మను మరువజాలను.

(నిష్క్రమించును.)

రంగ;- ఆహా! ఎట్టి కర్ణకఠోరమైన మాటను విని సహించుకొన గలిగితిని! ఏమిచేయు

దును. లక్ష్మినన్వేషింపబోదునా. అందులకై రాజ్యవాంఛల బరిత్యజింపవలయును. అయినను నే నేల బోవలయును.–ఆమె నాకెవ్వరు–నే నామె నిదివరకే పరిత్యజించియుంటిని. ముఖము పోలికయైనను జ్ఞప్తిలేదు. అట్టిచో నేను మాత్ర మామెకెట్లు జ్ఞప్తికివత్తును–అసంభవము. ఆమెంగూర్చిన మోహము నాకేల—ఆమెకై నేనేల యుత్తరవాదిని గావలయును. ఎట్లును హైందవబాలికయే. భారత రమణి తన యభిమానము దానే రక్షించుకొనగలదు. నాకు రాజ్యమే కావలయును. కాని ఈ హృదయసంచలనమునకు గారణమేమి? ముఖ పరిచయములేని బాలికనుగూర్చి నాకింతజింతయేల. చేతులార విడిచిన భర్తను బ్రేమించు భార్యయుండునా. ఉండిన నుండవచ్చును. లేకున్న ఖాసింఖానుని పై కత్తి దూయనేల? ఎవ్వరికయి యాబాలిక వనములు పర్వతములును గుర్మ్మరుచు దేశ ద్రిమ్మరియై పోయినది?

( తానాజీ ప్రవేశించును. )

తానా;– రంగనాథా!

రంగ;– మీరెవ్వరు?

తానా;– గుర్తించలేదా! నేను మహాత్ముండైన ఛత్రపతిశివాజీ మహారాజుయొక్క సేనాధిపతిని. నాపేరు తానాజీ మాలశ్రీ ఈ సమయమునం దిరుగుటకుంగూడ పాదములువశముగాకున్నవి. వేడ్కలు నెఱసినవి. ముదుసలినై పోయితిని.

రంగ:– తానాజీ! ఏటికై మీరాక?

తానా:– నిన్నొక్క ప్రశ్నము నడిగెదను.

రంగ;– సంసిద్ధుడను.

తానా:– ఒక్కయడుగు నేలయే యధికమైనదో, ఒక్క ప్రాణమే గొప్పదో చెప్పంగలవా?

రంగ;– మీ ప్రశ్నకర్థము తెలియలేదు.

తానా:– రాజ్యము గొప్పదా, లేక ఛత్రపతి శివాజీయొక్క సంతానము గొప్పదా?

రంగ;– ఇప్పటికిని నాకర్థము కాలేదు.

తానా:– చిన్నసంస్థానమునకుగా మహారాష్ట్రాధిపతిం జంపింప సమకట్టుట మానవుని కార్యమే నా?

వ॥ ధనరాజ్యంబులంగోరి మానభ్రంశలన్ ♦
ధర్మంబులంబోకార్చిరి దు ।
ర్జనవృత్తిగ గయినేని శత్రుజన దు ♦
స్సంగత్యముగా జేరి స్వా ।
మిని జంపింప దలంచుచుండు ♦
రిది స్వామిద్రోహముగాదె యి ।
ట్లొనరింపందగు కార్యమానె చెపుమా ♦
యూహించి మితోత్తమా ॥

రాజ్యాభిలాషచే ప్రభువంశంబును నాశనము జేయించి దేశమును శత్రువుల కప్పగించుట యుత్తమపురుష లక్షణమగునా?

రంగ:– నన్నేల యిట్టి ప్రశ్నము నడుగుచుంటివి?

తానా:– శంభాజీని సర్వనాశనము గావించినదెవ్వరు?

రంగ:– నేనే యొనర్చితినా?

తానా:– నీవుగాక వేరెవ్వరు?

రంగ;– ఎవ్వరనంగలరు?

తానా:– ఒకరేల యనవలయును?

సీ॥ న్యాయబుద్ధిని విడ ♦ నాడి విరోధుల
యండనుజేరు నీ ♦ యపయశస్సు।
దేశవిద్రోహ బు ♦ ద్ధినిబూనియున్నట్టి
కుటిలుండవైన నీ ♦ కుత్సితంబు।
క్రూరుండవై నేడు ♦ కుత్సితాత్ములంగూడి

కయ్యంబుగోరు నీ ♦ కార్యపటిమ।
యవనులతో రహ ♦ స్యాలోచనల సల్పి
మర్మమిచ్చిన నీ యా ♦ ధర్మబుద్ధి।
చిరవిరోధియౌ యౌరంగ ♦ జేబుతోడ
మంతనముఁజేసి శంభాజి ♦ మరణమందు
కాలుఁగొన్నట్టి నీయొక్క ♦ పాపబుద్ధి
దేశమంతయుఁ దెలిసెనో తె ♦ లివిహీన

అంతరిక్షమందు సాక్షులై నిలిచి యున్న సూర్యచంద్రులు నీవొనర్చిన ద్రోహమును వీక్షించియున్నారు. కాని, రంగనాథా! జ్ఞాపకముంచుకొనుము. విధాత యీ పాపమును సహింపఁజాలఁడు. నీవొక్కఁడవు విశ్వాసఘాతకుఁడవై కృతఘ్నుఁడవై ప్రవర్తింపనియెడల నేటి దినమున మహారాష్ట్రదేశ మత్యున్నత గౌరవస్థానమున నుండెడిది. వీరశ్రేష్ఠుఁడగు ఛత్రపతియొక్క వంశమున కిట్టి పాట్లు లభింపక పోవును. ప్రళయమువలె గృహకల్లోల మావిర్భవించి మహారాష్ట్ర దేశమును ధ్వంసము జేయక యుండెడిది. దుర్భేద్యమగు రాయగడ దుర్గమందున్న సింహవాహనారూఢయైన దుర్గా ప్రతిమగల ధ్వజపటము మొగలాయి సేనాపతి యొక్క శయ్యపై యాచ్ఛాదన వస్త్రముగ నుండదు. రాజ్యపిశాచావేశితుఁడవై నిరాయాసముగ శంభాజీని నాశనముఁ జేయించిన నీ సావాసమున కేమనవలయు! ఛీ! ఛీ! రంగనాథా, తుదకిది యంతయు భవదీయ సర్వనాశనమునకే మూలమగును సుమా. నీవొనర్చిన ద్రోహము నిన్ను గట్టికుడుపక మానదు. నిశ్చయము.

రంగ:- తానాజీ! నేఁడు నామనస్సు క్రమముగ లేదు. అనుజ్ఞనొసంగిన పోయి విశ్రమించెద.

తానా:- స్వామి. తానాజీ నేఁడు నీయింటి కతిథియై వచ్చి యుండలేదు. ఒక్కమాటను మరువక జ్ఞప్తిలోనుంచుకొనుము. విశ్రాంతి యనునది నీయదృష్టమునఁ జెపఁబడియుండ లేదు

( నిష్క్రమించును. )

రంగ:- నిశ్చయముగ విశ్రాంతి యనునది నా యదృష్టమున లిఖింపఁబడి యుండ లేదు,



–♦ మూడవరంగము, భీమనదీ తీరము. ♦–

( గోవర్ధనుఁడను వంగదేశస్థుఁడు ప్రవేశము. )

కళ్యాణి — ఆది.

గోవ: ఏ పనిపాటలు లేక మెలంగెడి । యీజీవనమే ధన్యతమంబు ॥ యే ॥

1 కనులకు వెడి యీ విశ్వంబే నా । కాపురమందు గృహంబు । మనమలరగ సంచారమొనర్చుటె । మాననీయమగు నా కార్యంబు ॥ యే ॥

2 కాననమున వృక్షచ్ఛాయను హా । స్కాట్రావుచు గూర్చుండుక । వేణుధరుడనై గానము సేయుచు । విశ్వంబును మోహింపగజేతుక ॥ యే ॥

3 హాయిగ గంజాయిని త్రావుచు నే । నానందము నందెదను । వేయి విధంబుల భోగములను గని । విజృంభించి పన్ముదమందెదను ॥ యే ॥

దిక్కుమాలిన బంగాళాదేశమున నెక్కడ వీక్షించినను వ్యర్థులైన గంజాయిత్రాగు నావంటి వారల పాటలు వినవచ్చుచుండును. కాశీకేగి నచోఁ గడుపు నింపుకొను చింతయేమియు నుండదనియు గుంపులుగఁగూడి చక్కని యాడు వాండ్రు వచ్చి చాల యధికముగ నాదరింతు

రనియు గట్టిపెరుగు తీయని పాలు నొసంగుదు రనియు జనులు చెప్పుకొనుచుండ వింటిని. కాశి కేగి చూతునుగదా సర్వము నసత్యము. అంతయుఁ గల్ల. పాలు లేదు, పెరుగు లేదు. అంతచక్కని యాడువాండ్రను కాన్పింపలేదు. ఒక్క పెరుగమ్ముచున్న యాడుది మాత్రము రెప్పలల్లార్చుచు వేగముగ మాట్లాడుచున్నది. ఆమెశరీరచ్ఛాయయందు నాకంటెను నల్లనిది. వయస్సెంతయో తెలియలేదు. కట్టినచీరయొక్క దుర్వాసన నాలుగువీధుల దాటిపోవుచున్నది విశ్వనాథుఁడు జీవించియున్నను కాశీనగరమునకు దూరమునుండియే నమస్కార మాచరింపవలసియున్నది. అచ్చటినుండి బృందావనమునకు వచ్చితిని. ఆలోచించితిని. మహాప్రభుఁడైన శ్రీకృష్ణుని యనుగ్రహమువలన సమస్తమచ్చట లభించుననని వింటిని. వచ్చి చూతునుగదా యచ్చటి వృత్తాంత మంతకన్న యన్యాయముగ నున్నది. ఓరాధారాణీ! నీ బృందావనమున నీవు క్షేమముగనుండుము. నాకు సెలవొసంగుమని చెప్పి గోవర్ధన చక్రవర్తి ప్రస్తుతము మహారాష్ట్రదేశమం దడుగిడఁబోవుచున్నాఁడు. ఇచ్చటి మహారాష్ట్రులందరు మహాపిసినులట. చూడవలయును. దరిద్రుఁడైన బంగాళీవాఁ డిచ్చట నేమి భుజించునో వెదకికొనవలయును.

(నిష్క్రమించును.)

## నాలుగవ రంగము.

శిబిరముయొక్క లోపలిభాగము.

(రాజారాం మంత్రితోఁ గూర్చుండియుండును.)

ప్రధా:- మహారాజా! మన మింకెన్నిదినము లీసన్యాసివేషముతో నుండవలయును?

రాజా:- సచివాగ్రణీ!

చ|| పలు కడగండ్లనంది కాదు పిక ♦
ఖండనమందు విరోధివర్గముల్ ।
గెలిచి స్వతంత్ర రాజ్యమును ♦
నిల్పెను దానిని భోగమగ్నుఁడై ।
జలములఁగల్పె సోదరుఁడు ♦
సత్సచివోత్తమ యా స్వతంత్ర మా ।
యిల నిలువంగఁ జెట్టక స ♦
హింపదు నా హృదయంబు సౌఖ్యమున్ ||

గీ|| తెఁగి నేనీ మహారాష్ట్ర ♦ దేశమునకు
పారతంత్ర్య దుఃఖమ్మును ♦ బాఱఁదోలి
చెలఁగి స్వాతంత్ర్యమును బ్రతి ♦ ష్ఠింపకుండ
విడువఁజాల నీ సన్యాసి ♦ వేష మవని ||

అదియునుంగాక నీవేషమును ధరించుటయందు దోష మేమి?

ప్రధా:- జటాజూటముపై నుండిన కిరీటము శోభావంతము కానేరదు.

రాజా:- సచివాగ్రణీ! జటాజూటము నాశ్రయించిన కిరీటమే శోభావంతము గానిచో నింక మకుట గౌరవ రక్షణమునకు వేరాధార మేది? ఎవ్వఁడు జితేంద్రియుఁడై యంతరంగమును సన్యసింపఁజేయఁడో యట్టివాఁడు బహిర్వేషధారణ మాత్రమున సన్యాసి యనిపించుకొనఁడు. అట్టి వాని నాశ్రయించిన కిరీటము ప్రకాశమానము కానేరదు. అంతఃకరణ చతుష్టయమును జయించి బాహ్యాంతరింద్రియ నిగ్రహుఁడై కర్మవిదుఁడై సన్యసించిన యతి నాశ్రయించిన కిరీటమే లోకోత్తరమైనది. ఎవ్వఁడు విలాస ప్రవాహమగ్నుఁడై యింద్రియ సేవాతత్పరుఁడై పాప పంకిలమునఁ మునుఁగు

చున్నాఁడో వాఁడు చక్రవర్తియైనను వేయి కిరీటములను దలఁదాల్చి ధరించినప్పటికిని భయంకర నరకవహ్నిలోఁ గూలవలసిన కీటకతుల్యుఁడే. ఒక్కమారు చిత్తూరు రాజ్య చిరసన్యాసియైన మీవారుమహారాణా ప్రతాపసింహుని హృదయమునకు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ఆవీర శిరోమణి స్వరాజ్యోద్ధరణమున కవలంబించిన కఠోర వ్రతమును మహాత్యాగమును స్మరింపుము. ఆమహాత్ముడు రాజ్యసిద్ధియగువరకు,

సీ॥ ప్రాసాదసౌధముల్ ♦ వర్జించి పట కుటీ
రమ్ములలో నివా ♦ సమ్ముఁ జేసి
తతహంసతూలికా ♦ తల్పములను వీడి
పచ్చికమీఁదనే ♦ పవ్వళించి
రజత సువర్ణపా ♦ త్రములను విడనాడి
వనపర్ణమందె భో ♦ జనముఁ జేసి
విలువకు మించిన ♦ వలువల వర్జించు
సలలితవల్కల ♦ మ్ములను దాల్చి
సరస భక్ష్యాన్నపానాది ♦ సరణి విడిచి
కాయగసరుల భక్షించి ♦ గడపినట్టి
యమిత వీరుడు శత్రుభ ♦ యంకరుఁడు
ధర్మరూపుఁడు రాణా ప్ర ♦ తాపసిఁగు ॥

అట్టి మహానుభావులే కాలముతప్పి వచ్చినప్పుడు స్వరాజ్యోద్ధరణమునకై మునివృత్తి నవలంబించియుండ నింక మనలెక్కయేమి? అంత దూరముపోనేల? ఒకమారు మన మహారాష్ట్ర స్వతంత్రరాజ్య సంస్థాపకుఁడైనట్టియు నాతండ్రియునైన ఛత్రపతి శివాజీమహారాజు శత్రుహస్తగతుఁడుగాకుండఁ దప్పించుకొనుటకు సన్యాసియై సంచరింపవలసివచ్చినది.

చ॥ అని గెల పంచజాలక మ ♦
హాకుటిలుం డవురంగజేబు నా
జనకుని ఖిల్వఁబంచి కడు ♦
సాహసవృత్తిని మోసగించి బం
దెసు నిడ నా మహాత్ముఁడు మ ♦
దిం గడు ధైర్యముఁబూని శత్రులన్
గనులను గప్పి దాఁటెను య ♦
ఖండ యతీశ్వరవేష మూనుచున్ ॥

మహారాష్ట్ర స్వాతంత్ర్య నిర్వాహకుఁడైన యా మహాత్ముని శత్రుబారిబడకుండఁ గాపాడిన దీసన్యాసివేషమే. మహారాష్ట్ర పునస్స్వాతంత్ర్య సంస్థాపనకార్యము ముగియువరకు మనకిట్టి వేషమే తగినది.

(తానాజీ సంతాజీని వెంటనిడుకొని ప్రవేశించును.)

తానా:– సోదరా! ఏదీ, యామాటలను మరల వచింపుము, వినవలయునని కోర్కెగానున్నది. సుధామయములై మృదుమధురములైన నీపవిత్రవాక్యములను విని కర్ణానందభాగ్యమును బొందెదను. ఎన్నిసంవత్సరములక్రింద జరిగిన సంగతియో నాకిప్పుడు జ్ఞప్తికివచ్చుచున్నది. ఆసమయమున నాయీ శిథిలశరీరము కార్యనిర్వాహక సమర్థమై యున్నది. బాహువులయందుఁ బరిపూర్ణమైన బలమున్నది. హృదయమం దమితోత్సాహము గంతులువైచినది. కాని యిప్పుడేమున్నది? క్రమక్రమముగ నన్నియునశించినవి. వృద్ధుఁడనైతిని. నేత్రదృష్టియంతయు మందగించినది అట్లైనను నాకినాటికి నీముఖమండలమునఁ దిరిగి యా మహాపురుషుని – లోకోద్ధారకుని – స్వదేశోద్ధరణ దీక్షాబద్ధుని – ఛత్రపతి శివాజీయొక్క పవిత్రజ్యోతి కనంబడుచున్నది. ఇన్నిదినముల కాశివచ్ఛత్రపతియొక్క పవిత్రోద్యమముఁగూర్చి నీనోట వినఁగ నిరాశాపూరితమైన నాహృదయమున

మరల యుత్సాహ మంకురించుచున్నది. ఈజీర్ణ శరీరమం దెచ్చటనుండియో యొక నవీనబల మావిర్భవించినది. నాయనా! సత్యమును వచించితివి. కర్తవ్యమును గ్రహించితివి. మృతప్రాయమై పడియున్న మహారాష్ట్రదేశమున నూతనశక్తిని బ్రతిష్ఠింపుము.

సీ॥ జాతీయ శక్తి సం ♦ స్థాపనమ్మును జేసి
ధర్మమ్ము నెఱవేర్ప ♦ దలఁపుమయ్యా
అననూయ నైకమ ♦ త్యమును దేశమునందు
వృద్ధినందగఁజేయ ♦ వెడలుమయ్యా
శత్రు వంచితలైన ♦ సాధ్వీమణుల మాన
సంరక్షణము సేయ ♦ సాగుమయ్యా
పరిపంథివర్గము ♦ ధ్వంసముఁ గావించి
వంశగౌరవము ని ♦ ల్పంగదయ్యా
శత్రుకల్పిత దుష్కార్య ♦ సంఘటనను
గొల్లుగొల్లన నేడ్చుచు ఘోషఁబెట్టు
జన్మదేశము న్గాపాడ ♦ సాగుమయ్యా
శ్రితజనాధార శ్రీ శివా ♦ జీ కుమార ॥

గీ॥ వాసిఁజెడి తన్ను రక్షించు ♦ వారు లేమి
దిక్కులేని మహారాష్ట్ర ♦ దేశ మిప్డు
వేచియుండె నీయండకై ♦ వేగిరపడి
నీదు జన్మభూమిని గావ ♦ నిలువుమయ్యా ॥

రాజా:- తానాజీ! జాతీయోన్నతికి మూలాధారమైన యీ మహాసత్యమును మరచుటచేతనే దక్షిణదేశమున కీదురవస్థ వచ్చినదని తోచుచున్నది. ఆర్యా! మహారాష్ట్రుల నందరను నేటినుండియు శరీరబలముచేతనే కాక ధర్మబలముచేతను బలవంతులగునట్లు ప్రసాదింప నాకాజ్ఞమాత్రను ప్రార్థింపుము.

తానా:- త్రికరణశుద్ధిగాఁ బ్రార్థించెదను. కాని యింకొక పరమార్థమున్నది. ప్రస్తుతావస్థననుసరించి మనవారి కందరికిని బాహుబలమునకంటె యాధ్యాత్మికశక్తి యావశ్యకమై యున్నది. ప్రతి సైనికుని నీమాత్రము బోధింపవలయును. భుజబలము మానవకల్పితము. ఆత్మబలము దైవశక్తి. మన మీరహస్యమును గ్రహించి ప్రతి సైనికుని పరకీయ యాత్మవినాశనమునకు మూలమగు రక్తపాతమును గల్గించుట మిక్కిలి కఠినమనియు మన మహారాష్ట్రులకు బోధించవలయును. అందువలనఁ బ్రతివాఁడును దైవబల సంపన్నుఁడగును. ఈ లోపుగ దేశమందలి భిన్నభిన్న మార్గములఁ జరించుచున్న మన వారలందరు నైకమత్యముఁ గ్గి తలకొక మార్గమున నేగక నొక్కటై కర్తవ్యమును నెఱవేర్చెదరు. సైన్యబలముకూడ వృద్ధిఁబొందుట కవకాశమున్నది.

రాజా:- పూజ్యుఁడవైన నీ యానతిని నేజేసెద.

తానా:- నాయనా! వృద్ధుఁడనగుటచే యుద్ధమందు నిన్ను వెన్నంటిపోవ, నీకు దోడ్పడు సామర్థ్యము నశించినది. అందుచే నాకన్న యీ యేక పుత్రుఁడైన సంతాజీని నీచేతి కందిచ్చుచుంటిని. రాజారాం! సంతాజీ శౌర్యహీనుఁడని యెన్నఁడును తలంపవలదు. తానాజీయొక్క వంశమునఁబుట్టిన పురుష రక్తమందియు శివాజీవంశ సంరక్షణము నకై యిని యోగపడవలయును.

రాజా:- (సంతాజీని కౌగలించుకొని) తానాజీ, ఏకగర్భజనితుఁడైన సోదరుని కన్న సత్యమంతె ప్రీతిపాత్రునిగఁ దలంచి సంతాజీకి నాహృదయమున స్థానము నొసంగితిని.

తానా:- సంతాజీ! కన్నతండ్రిని విశ్వాసఘాతకునిగాఁ జేయవలదు.

సంతా:- తండ్రీ! ఈ శరీరమున మీ రక్తము, ఈ హృదయమున భవదీయ దివ్యోపదేశము, ఈ యంతఃకరణ చతుష్టయమునఁ బరమేశ్వరవిశ్వాసముగాక నాకీ ప్రపంచమున వేరాధారమేదియును లేదు.

తానా:- కుమారా! నీ మొలనున్న కరవాలము, నా యాశీర్వాదము, దైవభక్తి, యీ మూఁడును నిన్ను గర్తవ్యమార్గమున స్థిరముగ నిల్పుఁగాక.

(సేవకుఁడు ప్రవేశము.)

సేవ:- దేవా! రాజా రంగనాధునిదూత యొకఁడు ద్వారముకడ నిలువఁబడియున్నాఁడు.

రాజా:- ప్రవేశపెట్టుము.

సేవ:- చిత్తము. (నిష్క్రమించును.)

రాజా:- ఈ నిర్భాగ్యుఁడేఁ యో నిష్ప్రయోజనములైన ప్రలాపముల నారంభించును.

(వార్తాహరుని ప్రవేశము)

రాజా:- నీ వెవ్వరవు? ఏటికై వచ్చితివి?

వార్తా:- నేను దీనప్రపంచాధికారియగు సమస్త హిందూస్థాన సామ్రాజ్యాధినాధుఁడగు అలంఘీరు పాదుషావారి గులాం అమీరు రిసాలాదార్ దోహజార్ మన్సబ్దర్ సిపాహసాలార్ సాహెబ్ జంగీ బహద్దరువారి దాసానుదాసుఁడగు రాజా రంగనాదునివద్ద నుండి వచ్చితిని.

రాజా:- అతిదీర్ఘమై కర్ణకఠోరమైన నీబిరుదావళిని గట్టిపెట్టి నీ వెందులకై వచ్చితివో తెలియఁజేయుము.

వార్తా:- రాజారంగనాధుని రాజ్యమును మీరు బలాత్కారముగ నపహరించినందువలన నతఁడు పాదుషావారి ప్రియసేవకుఁడును సేనాధిపతియునగు ఖాసింఖాన్ బహద్దరువారి పాదములపైబడి మొరలిడ దయావంతులగు సేనాధ్యక్షులు నన్ను మీకడకు దూతగఁ బంపియున్నారు. అందుచే జాలిగుండెగల నేను ఢిల్లీనగరమును సౌధరాజములను కోశాగారములను వదలి మీవంటి నిరుపేదలుండెడి యీ గుడిసెలకడకు దయచేసితిని. ఇంక నా రాయభారము నాలింపుడు. మీరు వెంటనే రంగనాధుని రాజ్యము నప్పగింపనియెడల పాదుషావారి మొగలాయీ సైన్యము దరుదెంచి బాలవృద్ధ యువ స్త్రీజనసహితముగ మిమ్ములను వధించి ప్రపంచకమున మహారాష్ట్ర నామముగూడ లేకుండఁ జేయఁబడును.

రాజా:- ఓహో, అట్లనా? మహారాష్ట్ర నామమునుగూడ నశింపజేయుటంత సులభమైన పని కాదనియు మాటలచే నసాధ్యమనియు మీ సేనాధిపతిగారును మీ యౌరంగజేబు చక్రవర్తిగారును నెఱింగియేయున్నారు. తెలిసినదా! ఖాన్ బహదూరుగారూ! మీ రెంతయో కష్టపడి సౌధంబులను విడిచి మా వంటి నిరుపేదల కుటీరములకడ కరుదెంచిన

ప్పుడు తగిన ప్రత్యుత్తరమిచ్చి సత్కరించి పంపుటావశ్యకము. కావున నీవు మాదానవ చక్రవర్తితోడను పిరికిపందయైన ఖాసింఖా నునితోడను నామాటలుగా నిట్లనుము.

మ॥ మదమాత్సర్య కృథాప్రపూరిత రిపు ♦ క్ష్మానాథ సంహారమై।
హృదయాభీల భయ ప్రకంపితమునా ♦ యీ మా కృపాణంబు మీ।
మదము న్గాలఁగఁద్రోసి మాకు జయ సా ♦ మ్రాజ్యాభిషేకంబు నీ।
య దగం జెందుచుచుం డెనం చెలుఁగుమా ♦ యత్యంత క్రూరాత్మకా॥

(కత్తిని దూయును.)

వార్తా:- (భయముతో) అయ్యో! క్షమింపుడు. దూత వధార్హుఁడు కాడని ఖురానులో నేగాక మీ రామాయణ భారతాది గ్రంథముల యందును వ్రాయబడియున్నది.

రాజా:- భయపడకుము. మా మహారాష్ట్రుల చేతిఖడ్గములు వీరవిరోధికంఠకృంతనమున కేర్పడియున్నవి. గాని నీవంటి భీతాత్ము లైన యల్పులను జంపుటకుగాదు. నీవిప్పుడే పోయి యహంకారమదోన్మత్తుఁడైన మీచక్రవర్తితో మహారాష్ట్రుల చేతికరవాలములు విరోధి రక్తపానమునకై వగఁగొని యున్న వనియును దానిని బరీక్షింపఁదలఁచుగలదేని తానింతకు ముందు వృద్ధిఁజేయుచున్న లోకనాశన సాధుపీడాకర మహాత్యాచారము నింకను బెంపొందింప వచ్చును. పాపము పండి ప్రతిఫలరూపమునఁ గొలది కాలములోఁ బ్రత్యక్షముకాక తప్పదు. అనినావాక్యములుగా వచింపుము. సచివాగ్రణీ! ఈ వార్తాహరుని సత్కరించి పంపుము. మేము కాళీమాత నర్చింప నరిగెదము.

వార్తా:- దూతకుఁ తప్పుఁడని మనవిజేసికొంటిని. మీ సత్కార మక్కరలేదు. వదలిన నా త్రోవను నే నేగెద

రాజా:- (నవ్వుచు) ఓయీ! నీ కానందియు మక్కరలేదు. మీదానవ చక్రవర్తికివలె మాకు భాషాసంబంధమైన విపరీతార్థము లేమియును లేవు. సత్కారమనిన గౌరవమే. భయపడకుము.

(వార్తాహరుఁడు నిష్క్రమించును.)

(సన్నాల్‌గడమునందలి కొందరు సిపాయీలు సర్దారును వత్తురు.)

రాజా:- సర్దారుమహాశయా!

సర్దా:- మహారాజా! ఉత్తరదిశనుండి మిడుతలదండువలె మొగలాయి సైన్యమువచ్చి మిడుతలదండువలె యాక్రమించుచున్నది. అది యట్లుండ మరియొక భయంకరవృత్తాంతముకలదు. వచింప నోరురాకయున్నది.

రాజా:- నిస్సంశయముగ వచింపుము.

సర్దా:- తమ బాల్యకాలమునాఁటి శిక్షాగురువులును వృద్ధపురోహితులు నగు నీలకంఠమహాశయులను మొగలాయీలు దారుణముగ వధించిరి.

రాజా:- ఏమంటివి? నీలకంఠుని వధించిరా? అతఁడు సదాచార సంపత్తిగల విప్రుఁడు అట్టివాఁడే వధింపఁబడెనుగా మాతా! అష్టభుజా! అట్టి విశుద్ధబ్రాహ్మణకుల తిలకునకిట్టి దుర్మరణ మేదోషమున లభించె?

సర్దా:- అయ్యా! ఊరడిల్లుఁడు. విచారింపకుఁడు.

రాజా:- అమాత్యా! మిత్త్రులారా! విచారపడవలసిన తరుణముకాదు. దీర్ఘాలోచనముఁ జేయవలసిన యవసరము వచ్చినది. ఇందలి

పరమరహస్యమును దెలిసికొంటిరా! మన మిప్పుడు జీవనమరణ సంధిలో నున్నాము. పవిత్రబ్రాహ్మణ రక్తపాతమైనది. మొగలాయిసైన్యము ప్రవాహమువలె వచ్చి మహారాష్ట్రదేశము నాక్రమింప నరుదెంచుచున్నది. ఏశక్తితో మన మాప్రవాహము నరికట్టవలయునో యోజింపవలయును. మన కుసైన్యబలము బాహుబలము సమృద్ధిగ జేకురువరకు సర్వశక్తులకు మూలాధారమైన మానసికబలము నార్జింపవలయును. అందులకుగా నేను దేవీమూర్తి నారాధించుటకై భైరవీ మందిరంబున కరుగుచుంటిని. ఓమహారాష్ట్ర దేశవాసులారా! మీరందరునుగలసి నేటినుండియుఁ గర్తవ్యపథమున సంచరింతురుగాక. మరియును, నేటినుండియు మన జన్మభూమిలో,

సీ॥ జాతీయధర్మ సం ♦ స్థాపనం బొనరించి
ప్రజలను బ్రోత్సాహ పరుపవలయు।
క్రోధ మాత్సర్యాది ♦ గుణములఁ బోఁద్రోలి
ప్రేమభావమును గ ♦ ల్పింపవలయు।
ప్రజ్ఞావిహీనులై ♦ పాడు జేసికొనిన
సాంఘికశక్తిని ♦ సాకవలయు।
అన్యోన్యవైరమ్ము ♦ లంతరింపఁగ జేసి
సోదరబుద్ధిని ♦ జూపవలయు।
చెదరిపోయిన సైన్యము ♦ న్గదురఁజేసి।
మన మహారాష్ట్ర దివ్య సా ♦ మ్రాజ్యమునకు।
సైన్యబలముఁ బెంపొందింప ♦ సాగవలయు!
బ్రిభువుఁజంపిన కసి దీర్ప ♦ వలయు నేఁడు॥

జయమాతా, అష్టభుజాదేవి

(అందరును నిష్క్రమింతురు.)

## మాకు మీకు భేదముండేదా?

మిన్నికంటి గురునాథశర్మగారు.

"భావాలవీథిలో పరుగెత్తుతుంటావు
జీవాలకోవలో చిందులేస్తుంటావు
మావాలె యీభూమి నీదికాదా?—లేక
మాకుమీకు భేదముండేదా?"

"చేతలే ఆనందమూరించురా, నీ
గీతలే మోదాన్ని పూరించురా
మాతెర్వు నీతెర్వొకటి గాదా?—లేక
మాకు మీకు భేదముండేదా?"

"ఉన్నట్టెవుంటావు, విన్నట్టెవింటావు
కన్నట్టెకనిరూపు కల్పించుతుంటావు
వన్నెచిన్నెలతోడ వాదాడుతుంటావు
మన్నించు యీసృష్టి నీదికాదా?—లేక
మాకుమీకు భేదముండేదా?"

"కిన్నరస్వరముతో కేల్గల్పుతుంటావు
చిన్నాకుపైరూపు చిత్రించుతుంటావు
చిత్రింబులోగూడ జీవాన్ని పోస్తావు

♦ ♦ ♦ ♦

జీవంలో ఆనంద మొలికించుతుంటావు
ఆనందమున మనస్సాగుతుంటావు
మనసునిలిచిన మోక్ష మరచేతిడంటావు
మంత్రవాదమ యిదీ మంత్రవాదీ—లేక
మాకుమీకూ భేదముండేదా

# సంపాదకీయదర్జా

శ్రీ వెంపటి నాగభూషణంగారు

అచ్చాఫీసులో కూర్చుని ప్రూఫులు దిద్దుతున్నా. ఐదు గంటలకల్లా నోటీసులుపంపించాలి. ఇక ఒకగంట వ్యవధి మాత్రమే వుంది. పని పూర్తి కాలేదు. ఆవేశంతో యిటూ అటూ హడావిడిగాతిరుగుతూ ప్రింటర్లను కేకలు వేస్తున్నా. ఈ సమయంలోనే వచ్చిందె మిత్రబృందమంతా. నేను అచ్చు ఆఫీసుపెట్టి పని సాగిస్తున్నదగ్గర నుంచీ నా స్నేహితు లందరూ (ఉంటారు సుమారు పది మంది.) అనుదినం వచ్చి సాయంకాలము నా కచ్చేరిలోనే యేదోవిధంగా కాలక్షేపం కానిస్తారు. వాళ్ళకిదో శరణాలయం. ఆదినం మామూలుకంటె వక అరగంట ముందే వచ్చారు కొందరు. నేను హడావిడి పడడంచూసి వాళ్ళందరూ నవ్వుకొన్నారు. ఇన్నొక పిచ్చివాడ్నిగా యెంచుకొన్నారుకాబోలు ! నేను పని తొందరలో వుండడంచేత అప్పుడు వారికేమీ జవాబుచెప్ప లేదు. పని పూర్తి అయింది. తరువాత స్నేహితులతో కలిశాను. వాతావరణ మత్యుష్ణముగా వుండడముచేత శరీరాలు వుడికిపోతున్నాయి, షికారు పోదామన్న యింకా వెచ్చనిగాలి వేస్తోంది. ఆసమయంలో యెవరికీ యేమీ తోచిందికాదు. ఎవరి వారు నిశ్శబ్దంగా కూర్చున్నారు ఆకస్మికంగా అన్నాడు శాస్త్రి– "ఏమోయి, యిందాక యేమో గలభాపడ్డావెందుకు ?"

నేను:– ఆ, అదా. ఏమీలేదు, ఏదో జాబ్ వర్కు పూర్తి చేయించా.

శాస్త్రి:– ఎప్పుడు జాబ్ వర్కు, జాబ్ వర్కు అని యేదు స్తూకొట్టుకోకపోతే యేదయినా పెద్దరాబడివచ్చే పని చూడరాదూ?

నేను:– చూసి చూసి నాప్రాణాలు విసికినాయి. ఎక్కడకుపోయి, యెందరికాళ్ళు పట్టుకున్నా: విదిలించి కొట్టారేకాని, ఆదరించి పని వక్కరూయివ్వలేదు. ఏమిచెయ్యను? చావనా ?

శాస్త్రి:– అయ్యో, యేమోయి. పిడుగంటి మాటన్నావు. ఈభాగ్యానికే చస్తారాయేమిటోయ్ ?

నేను:– మరి యేంచెయ్యమంటావు. ఉన్న ప్రెస్సుతో వచ్చే ఆదాయం చాలా స్వల్పంగా వుంది. మరి పనివాళ్ళకు జీతాలే యియ్యనా, ఆఫీసు అద్దెయియ్యనా, నా ఖర్చుకే వాడుకోనా ! ఇందులో యేది ముఖ్యం కాదు; చెప్పు ?

శాస్త్రి:– అవునులే సరి యింకేదయిన వుపాయం చూడు

నేను:– యేముంది. రాగిచెంబుతప్ప.

శాస్త్రి:– సరిపోయ్ ఇంత అధైర్యపడితే నీకేమి దొరుకుతావు

నేను:– అధైర్యం కాకపోతే ధైర్యం చెప్పేవారెవరు ?

శాస్త్రి:– అయితే యిదిగో విను. నేనొక వుపాయం చెప్తాను. నీవది చేశావంటే నీకు చాలా లాభం కలుగుతుంది !

నేను:– ఏమిటో చెప్పు; వీలయితే చేద్దాం.

శాస్త్రి:– మరి నీకు అచ్చాఫీసు వున్నదికదా.

నేను:– వున్నది; వుంటే ?

శాస్త్రి:– కాబట్టి దానికి తగినట్టుగా ఒక్క పత్రిక స్థాపించావంటే !

నేను:– సరి, సరి. పత్రికా ? యెందుకూ ? వున్నవన్నీ చాలవూ ?

శాస్త్రి: అంత గాబరాపడ్తావేమోయి. అదికాదు. ఎన్ని వుంటేమాత్రమేమి ? యేది బాగుంటే అదే చదువుతారు.

నేను:– అబ్బ. ఇప్పటికి యీ వూళ్ళో యే పదక పత్రికలో వున్నాయి. ఇది కొసరాయేమిటి ?

శాస్త్రి:– సరిపోయింది. తిరిగి అట్లాగే మాట్లాడుతావు.

నేను:– అదికాదు. నిజం చెప్పు. వున్నవి చాలవూ ? మ రొకటి యెందుకు చెప్పు ? లాభమేమిటి ?

శాస్త్రి:– నీ బుర్ర పెంకెది. ఆలోచనగూడా లేదు. మళ్ళీ– యెందుకు ?— అంటావేం ? లాభమా ?– కావలసినంత. చూడు. రేపు యీపాటికి ఆరు వందల చందాదార్లను చేరుస్తాను. లాభమెందుకుండదూ ?— అంతా లాభమే !

నేను:– శాస్త్రీ, నీమాట నీకే ! ఇప్పటికే దేశంనిండా పత్రికలు కుక్కగొడుగులల్లే వున్నాయి. ఒక్కటీ వుచ్ఛదశలో వున్నట్టు కనబడదు. ఎవరో డబ్బు యెక్కువున్న వారు చెయ్యాలసిందేకాని, మనపోటి వారు—

శాస్త్రి:– నీకు బాగుపడేవ్రాత లేదు. చెప్తే వినకపోతే యెవరు యేమిచేస్తారు. పత్రిక స్థాపించు నీవు. బాగుపడకపోతే చెవి తెగ్గోయించుకుంటాను !

ఇంతసేపూ మౌనంగా కూర్చున్న సోమూ అన్నా

డు— "అవునోయి, ఆ అభిప్రాయం బాగానేవుంది. శాస్త్రి చెప్పినట్టు పత్రిక స్థాపించి నీవు త్వరలో వృద్ధికి రావచ్చు."— "అవును, అవును" అన్నారు అందరూ నాకు తల దిమ్మెత్తింది. ఇందరు అవునంటున్నారు, పోనీగదా అని ఆవిషయం ఆలోచించాను.

నేను:. అయితే యేపత్రిక పెట్టమంటారు? అదికూడా తేల్చండి—

రావు:- వారపత్రిక అయితే!

సోమూ: దినపత్రిక అయితే బాగుండునుగాని, యిటువంటివూళ్ళో సాగదు!

నేను:- యింకా?

శర్మ:- పోనీ పక్షపత్రిక. ప్రతి అమావాశ్యకు, పౌర్ణానికి ప్రకటింపవచ్చు.

రావు:- అక్కే: అది బాగుండదు. ఉంటే వారపత్రికయినా వుండాలి. లేదా, మాసపత్రికయినా కావాలి!

సోమూ:- పోనీ, రెండు నెలలకో, మూడు నెలలకో ఒకసారి ప్రచురిస్తే?

శర్మ:- సరిపోయింది. అంత్య దశలో వెక్కిళ్ళు వచ్చినట్టా! పత్రిక సృష్టిలో వున్నదనైనా అందరికీ తెలియాలా?

రావు:- పోనీ, ద్వైమాస పత్రికో, త్రైమాస పత్రికో స్థాపించి, అది కేవలం లిటరరీగా నడుపుతే!

శాస్త్రి:. సరే. బాగానేవుంది. ఇప్పుడు లిటరేచరు కోసం, ఆర్టుకోసం, యీ స్థటిక్సుకోసమూనా పత్రిక. అటువంటిదానికి వ్యాప్తి తక్కువ. ఏదో మనవాడికి నాలుగుడబ్బులు వచ్చేదారి చూడాలి గాని.

నేను:- మరి, నీవేదయినా చెప్పు. అసలుసంగతి ప్రారంభించినవాడవు.

శాస్త్రి:- ఇదిగో వినండి అసలు పత్రిక ప్రకటించడం వల్ల లాభాలు.

1. "సంపాదకుడుగా వుండడం అదెంత ఘనత! అది కేవలం స్వర్గపదవి అన్నమాట. ఎడిటరు అంటే యేదేశంలోనైనా యెప్పుడూ గౌరవమే! వాళ్ళనే "Lords of the Fourth Estate" అంటారు దేశ క్షేమమంతా వాళ్ళచేతుల్లో వుంటుంది. మనకన్ని అవకాశాలు వుండవుకాబట్టి, ఊరిక్షేమమే మనకు ముఖ్యం. యేవిషయంలోనయినా, ఫలాని పత్రిక యేమి వ్రాసింది అంటారు. ఎడిటరు కాగానే యీ మానవ సంబంధాలను దాటి అతీతమైన వ్యక్తి అవుతారు.

2 ఏవిషయాన్నిగురించి అయినా యిష్టం వచ్చినట్లు వ్రాయవచ్చు.

3. ఎవరినిగురించి యెప్పుడేమి వ్రాస్తావోఅని అందరు నీయందు భయభక్తులతో వుంటారు.

4 ఎడిటరుకు సంబంధించిన యింటి విషయాలుకాని మరి యేవిషయాలు కాని అవలీలగా ప్రకటింపవచ్చు. తరువాతమాట దేవుడికెరుక. అటువంటి వ్యాసాలు యితర పత్రికలు ప్రకటింపవు చూడు మరి. అందుకని మనిషియొక్క స్వవిషయాలను స్వేచ్ఛగా వెల్లడించేటందుకు చేతులో పత్రిక అవుసరం.

5. ఎవరినిగురించి అయినా యిష్టంవచ్చినట్లు నిర్భయంగా వ్రాయవచ్చు. ఎట్టి సమస్యలనయినా తర్కింపవచ్చు. ఎట్టి సలహాలయినా యివ్వవచ్చు.

6. ఎందరెందరో పెద్దవారుగూడా నీకు వ్యాసాలు పంపుతారు. నీకు "ఆర్యా" "మహాశయా" అంటూ లేఖలు వ్రాస్తారు. ఎంత గౌరవం! వారంతా నీదగ్గరకు వస్తూపోతుంటారు! యెంత అనుభవం!

నేను:- సరే, యిన్ని చెప్పావు పత్రిక సంగతికూడా చెప్పు.

శాస్త్రి:. విను. దినపత్రిక పెట్టి మనం నెగ్గలేము. పక్షపత్రిక బాగుండదు ద్వైమాస, త్రైమాస పత్రికలకు అంత వ్యాప్తి వుండదు. ఇక మిగిలింది

వారపత్రిక, మాసపత్రిక— వారపత్రికంటావా, సరే ఒకవిధంగా బాగానేవుంటుంది. ఉన్నదిగా కృష్ణాపత్రిక, మాతృక. దాని మోస్తరే కాపీకింపు అంతకంటె యింకొకవిధంగా బాగుండదు. అంతే సైజు, అటువంటిదే కాగితం, అటువంటిదే హైటిలుపేజీ అన్ని పేజీలు అవసరంలేదు మొదట్లో— అది వారపత్రిక విషయం. మాసపత్రికంటావా? పెట్టిందిగా భిక్ష "శారద" తల్లి. అది ఆంధ్రదేశంలో ప్రకటింపబడగానే, అటువంటివి యెన్ని బయల్దేరినాయో? అదే సైజు, అదేకథ. కాబట్టి మాసపత్రిక విషయం అది.

నేను:- అయితే యీ రెంటిలో యేది నిర్ణయం.

శాస్త్రి:- యీ రెంటిలో యేదంటావా?— వారపత్రిక రభస యెక్కువ. ఇంకా యెస్టాబ్లిష్‌మెంటు కావాలి, ఇంకా అన్నీ కావాలి కాబట్టి మాసపత్రికే కానీ. నీ వొక్కడవయినా పని నడపవచ్చు. నెలరోజులకిగదా. నెమ్మదిగా చెయ్యవచ్చు నీవే ప్రూఫ్సు అవి చూడవచ్చు. ఇంకో గుమాస్తాకూడా అక్కరలేదు. చందాదారులకు యివ్వడానికంటావా? బయటి వూళ్ళవారికి పోస్టుందిగదా. ఊళ్ళో వారికి యేసాయంకాలం, చీకటిమరుగునో. నీవేవెళ్ళి, కిటికీల్లోంచి లోపల విసిరివెయ్యి తప్పేముంది. డిగ్నిటీ అఫ్ లేబరు. చూచావా? అప్పుడు నౌకరుకూడా అనవసరం.

సోము:- అయితే అప్పుడు ఎడిటరు, ప్రింటరు, పబ్లిషరు, డిస్ట్రిబ్యూటరు అన్నీ ఒకడే అన్నమాట!

శాస్త్రి:- అవును. తప్పా. అసలు దొరలట్లాగే చేస్తారు. నీకేమైనా తెలుస్తేగా!— మరి చూచావా. ఇదీ విషయం

నేను:- అయితే, మాసపత్రికలు వున్నాయిగా చాలా; మనదానికి చందాదార్లు చేర్తారా?

శాస్త్రి:- సరేలే. యెందుకు జేరరు? యెన్ని వుంటేమాత్రం యేమి? మనం క్రొత్తదారులు త్రొక్కుదాం!

నేను:- ఎట్లా?

శాస్త్రి:- వెర్రిమొగాలా! ఇందరున్నారు. ఒక్కరికి గూడా ఆలోచన లేదు. అన్నీ మట్టి బుర్రలు. క్రొత్తదారు లేమిటంటే!— ముందు పత్రికపేరు వింతగా వుండాలి— "సింహగర్జన"— "అరణ్యరోదనము"— "అమావాస్య"— "ప్రో పీనుడు"— "దుందుభిధ్వానము"— యేదో యిట్లాగే హడావిడిగా వుండాలి! తరువాత పత్రికకూడా వింతగా వుండాలి. క్రౌను సైజులో వేద్దాం. విషయసూచికపత్రిం వెనకాలవుండాలి. వ్యాసకర్తపేరు వ్యాసం అడుగుభాగాన వుండాలి అంటే దానికి అర్థం యేమిటంటే ఆవ్యాస భారమంతా వ్యాసకర్తదేగాని, సంపాదకుడిది కాదన్నమాట సంపాదకీయ వ్యాఖ్యలు పుస్తకం మధ్యభాగంలో వుండాలి. పత్రికంతా యెర్ర సిరాతోను, హైటిలుపేజీ ఆకుపచ్చ సిరాతోను, బొమ్మలు నైలెటు సిరాతోను అచ్చు వెయ్యాలి అప్పుడెంత స్ట్రైకింగుగా వుంటుందో ఆలోచించు— ఇవన్నీ చెయ్యకపోతే మన వ్యక్తిత్వం, ఆంధ్రిత్వం— అన్నీ నశిస్తాయి. ఇట్లా ప్రారంభించు. చందాదారులు తండోప తండలుగా జేర్తారు. రోజూ ఆర్డర్లు వస్తాయి. పత్రికా ప్రపంచంలో నీవు పయనీరు అవుతావు!

నేను: అన్నీ బాగానే వున్నాయిగాని, శాస్త్రి— ఒక్క సంగతి. రహస్యం. తిరిగి యెవ్వరితోనైనా అనేవు సుమా?— పత్రిక నడపాలంటే కొంత కల్చర్, కొంతశక్తి కావాలిగదా. అది మనదగ్గర నున్నాగదా. (బిగ్గరగా యెక్కడైనా అనేవు)— మరెట్లా?—

శాస్త్రి: ఓరి, పిచ్చివాడా, ఈకాలంలో కల్చర్ యెందుకు. అసలు నీకు పనేముంది. ఎందరో వ్యాసాలు పంపుతారు సంపాదకీయవ్యాఖ్యలు కాసినేగా నీవి, దానికేమిటి?— ఏపత్రికైనా చేత పుచ్చుకొని యెడిటోరియల్సు తీసి శీర్షిక మార్చి అదే వ్రాసెయ్యి. మీదుమిక్కిలి "ఫలానా పత్రికతో మేము పూర్ణంగా యేకీభవిస్తున్నాం" అని వ్రాయి. అంతే, కిటుకు— అందాకా యెందుకు— అసలు మేమంతా లేముటోయ్, నీకు సహాయం!

నేను:. సరే. అట్లాగే వేద్దాం. దసరాకి ప్రచురిద్దాం!

"సరే అంటే సరే" అన్నారు అంతా. నేనుగూడా సంపాదకుడనై బిపిను పాలు, బిసెంటు, పోర్నిమన్, చింతామణి దాసు, తిలకు, కస్తూరిరంగ అయ్యంగారు, కృష్ణరావు మొదలయిన ప్రాముఖ్య సంపాదకవర్గంలో చేర

పోతున్నాగదా యని వుబ్బిపోయాను. అప్పటినుంచి పేర్లు పుచ్చుకోవడం ప్రారంభము.

* * *

నిశ్చయించుకొంటే తిరిగిపోవడం యెప్పుడూ లేదు. పత్రిక వొస్తోందని కొన్ని పత్రికలకు ప్రకటన పంపాను



ఈవిధంగా పత్రికల్లో ప్రకటన వేయించాను దసరా యింకా రెండు నెలలుంది. అప్పుడే దేశమంతా హడావిడి అయింది. ఏదో క్రొత్త వుపద్రవం రానున్నదని అంతా అనుకొన్నారు. పత్రికా ప్రపంచములో "సింహగర్జన"— యిన్నో పేపర్— అనుకున్నారు. త్రోవవెంట పోతుంటే— "యీయనే "సింహగర్జన" సంపాదకుడు, ఏదో తెలివితేటలు గలవాడికిమల్లేనే వున్నాడు. పత్రిక రాకముందే యింత హడావిడి చేస్తున్నాడు. బహుశః పత్రిక బాగుండవచ్చు"— అనుకొనేవారు.

కొందరు, అంతకంటె నాకేమికావాలె. పేపరుకోసం, సిరాకోసము, బ్లాకులకోసము కవరు కాగితముకోసము, పైకి వ్రాశాను. అప్పుడే, యక్ఛేంజి పత్రికలు రావడము ప్రారంభించినాయి. రోజుకు ఒకటిరెండు ఆర్డర్లు వచ్చేవి. కానిచందామాత్రం ముందెవ్వరూ మనియార్డరు చెయ్యలేదు. అందరూ వి. పి గా పంపుమన్నారు. ఇవిగాక రోజుకు ఒకటిరెండు వ్యాసాలుగూడా వచ్చేవి. ఆఫీసులో ఎడిటోరియలుకుర్చీలోకూర్చుండి, యెర్రసిరాకలం పుచ్చుకొని అవి చదువుతూ. యిష్టమొచ్చిన మార్పులుచేస్తూ వుండేవాణ్ణి. గర్భనిర్భేదమైన సమాసాలను, ఆమూలాగ్రంగా కొట్టివేసేవాణ్ణి, యెందుకు అంతక్లిష్టం! యింకా విమర్శనకు గ్రంథాలు వచ్చేవి.

ఇవన్నీయేమిటిగాని నాకు వ్యాసాలతోపాటు వచ్చిన జాబులుకొన్ని యిక్కడ ప్రచురిస్తాను మాదిరికి. చూడండి ఎడిటరంటే యెంత గౌరవమే? అప్పుడు శాస్త్రి చెప్పిన మాటలు యిప్పుడు నిజమౌతున్నాయి. ఔర్గా ! —

* * *

1. మహాశయా !

వందన సహస్రంబులు.

ఈ కవరులో నాచే వ్రాయబడిన "సన్యాసి" అను పద్య వ్యాసమును బిడాయించి పంపుచున్నానుగాన తాము దయయుంచి గాబోవు పత్రికలో ప్రచురింపవలసినదిగా కోరుచున్నాను.

విధేయుడు,

..................వ్రాలు.

* * *

2 ఆర్యా,

నేను యొకానొక హాస్యరసపోషకమైన వ్యాసమొకదానిని రచించితిని దానిపేరు "దమయంతి చుట్ట కాల్చుట" దీనిని మీరు మీపత్రికలో దయచేసి యుచితముగా ప్రకటనము చేయుటకు వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను. తమ రంగీకరించినచో పంపెదను.

మీ యంగీకారము తెలియపర్చవలెను.

Yours sincerely,

......................

* * *

3 అయ్యా,

నమస్కారశతంబులు.

నేను యువకుడను. ఇదియే నా ప్రథమ ప్రయత్నము. మన మతములో సంస్కరణాభిలాష వృద్ధి కాగలందులకు యీవిధముగా కథలువ్రాయ సంకల్పించితిని గావున తమ రునాయందు దయయుంచి కథ పెద్దది అనిగాని యింక యేవిధమైన ఆటంకములుగాని కల్పించక నాయీ ప్రథమ ప్రయత్నమునకు ప్రోత్సాహమొసంగి నన్ను యొక్కువ వుత్సాహవంతునిగా చేయగలందులకు హృదయపూర్వకముగా వేడుచున్నాను. నేను యింత ప్రార్థించినప్పటికిని నాయందు తమకు వ్యతిరేకాభిప్రాయము కల్గినయెడల తిరిగి వాయుద్రమ్మక పంపగలందులకు దీనితో ఒక బిళ్ళ పంపుచున్నాను.

మీరు తప్పక మీపత్రికలో ప్రచురించెదరని నమ్ముచున్నాను

ఇట్లు
భవద్విధేయుడు

.......................

* ♦ *

4. Sir,

Here with a short poem for publication in your most esteemed monthly *which is going to come out in Desara days. It is only a little thing and cannot occupy more than a column* in a page Don t grudge to give such a small place. Moreover, my poem is mystic in temperament & character I have written it in free and simple Telugu so as to be understood by the readers. Publish this certainly.

Most obedient
Correspondent.

5. Respected Sir,

మాది family of poets మావాళ్ళందరూ కవిత్వంలో చాలా పేరుమోగినవారు అందుకని నేను పద్యం పంపుతున్నాను. మీదాంట్లో అచ్చువేయండి! తప్పకుండా!

I remain.
yours affectionately.

.......................

6. .....................పురం కాపరస్థుడు బ్రహ్మశ్రీ ..................... జ్యేష్ట కొమారుడు.................. సాష్టాంగ దండ ప్రణామంబుచేసి వ్రాయున దేమనగా—

ఆ 1927 సం మే నెలలో నేనొక కథను రచించితిని. అట్టికి యిదివర కెవరూ వ్రాసియుండలేదన్న అతిశయోక్తి గాదు. ఇప్పుడు దాన్ని ప్రచురిద్దామని అభిప్రాయం కల్గి మీకు పంపుచున్నాను. దాన్ని ప్రచురించి నన్ను కృతార్థుని జేయ కోరుతున్నాను.

చిత్తగించవలెను.

.......................

7 మహానుభావా!

నేను వకపద్యాన్ని పంపుతున్నాను. దాన్ని పత్రికలో ప్రచురించి నన్ను చందాదారునిగా జేర్చుకోవలసిం.

ఇంతే సంగతులు,

ఇట్లు,

.......................

8. శ్రీ బాలకవి...... అగ్రహారంవీధి... మొదలిస్టు .....పురం సభాపతి...... కుటీరం... —8-27.

పత్రికాధిపా!

నే మైదానిక్ సభాపతిని. మాకుటీరంలో సుమారు న్నూరు సభ్యులున్నారు. అందరు గట్టివారే! ఇది యీయేడే స్థాపించినాము. కేవలం ఆంధ్ర సారస్వతాభివృద్ధే ముఖ్యోద్దేశము. ప్రతిమాసు మేము మూడునాల్గు వ్యాసాలు పంపదలచుకొన్నాం. వాటికి మీరు డబ్బు యియ్యనక్కరలేదు. తప్పకుండా ప్రచురించి మమ్మల్ని, మాకుటీరాన్ని పైకి తీసుకురావలసింది—"

.......................

9. Most Revered Editor, Sir—

I am an B.A., of the Madras University, Madras. I ought to have got a second class at least, but only passed in the 3rd. Also, I passed the secondary grade short-hand and type-writing Examinations. I can write & speak well. While I am young, I got a prize for writing essay. I am good Badminton player & have won, I think 2 or 3 medals which I don't often wear. I have an excellent & good character, & good personality. I have appended a number of testimonials given to me by many varied men, for your patient perusal. I would have come there

inpersen, but I does not get casual leave in this wretched office. So, I sending this essay on "తొట్టిస్నానము దాని వుపయోగము", for publish in your monthly. The matter is good. Execution neat. It is written in nice round hand of my friend. Therefore, taking into considerations of all these publish this without fail"

Obediently yours

10. ఎడిటరుశేఖరా,

తమరు దయతో వ్రాసినకార్డు యిదివరకే చేరినది తరువాత నాసోదరునికి వివాహం జరిగినది. ఆతొందరలో తమకు జాబువ్రాయలేదు. నాకథను తమరు ప్రచురింపజాలరనియు, 0.1.0 బిళ్ళనుపంపుమనియు కోరినారు. కాని సదరు కథను యేల ప్రకటింపజాలరో వ్రాసిన సంతోషించియుందును. ఈసారియైన యెందుచేత ప్రకటింపజాలరో దయయుంచి వ్రాయించినచో చూచి లోపములున్న సర్దుకొందును. మావంటి భాషాభిమానులను సంతృప్తిపరచుట మీవంటివారికి ధర్మమైయున్నది. నన్ను మీరు యెరుగరు. కాని మీపత్రిక ఘనత వినియుండుటచే పంపియుంటిని. ఏమో చాదస్తముగా వ్రాసితినని తలంచవలదు. మావంటివారికి encouragemation యీయవలసినదని యెన్నియోసార్లు కోరితిని. కాని మీకు దయరాలేదు నేను యిదివరకు చాలా వ్యాసములను, కథలను చాలా పత్రికలకు పంపుటయు, వారు వేసుకొనుటయు కలదు కాని యిట్టివిధముగా యెచ్చటనూ జరుగలేదు. మీకు అతగా యిష్టంలేనిచో నాకథను Book Post ద్వారా not paid గా (అనగా బిళ్ళ అంటించకుండా) పంపించవలెను. ఎంతెయో శ్రమజెందితిని. ప్రచురించిన బాగుండును. మీ యిష్టము— కథ ప్రచురించిన బుక్కు నాకు పంపనకరలేదు. ఖరీదుపంపి తెప్పించుకొందును,

చిత్తగించవలెను.

........................వ్రాలు.

* * *

11. మహాప్రభూ.

అతి అనూచానముతో వినయవిధేయతతో భయభక్తులతో మిమ్ము ప్రార్థింపునదేమనగా— ఈ "కాళిదాస ఖండనము" అను విమర్శక వ్యాసమును మీ పత్రికారాజములో ప్రకటించి నన్ను కృతార్థునిజేసి, తరింపజేయ వేడుచున్నాను,

మీ శ్రేయోభిలాషి.

........................

* * *

ఇట్టి విపరీతపు లెఖ్ఖలు చదువుతూంటే నేను సంతోషము పట్టలేకపొయ్యేవాడ్ని. శాస్త్రసలహావల్ల నాకిప్పుడు ఒక అపూర్వ గౌరవం, అనూనశోభ ఘటిల్లినదని ఆనందము యింకా దసరా వారమున్నది. కాని పత్రికలు రాలేదు పోనీ, కొద్దిగా ఆలస్యమౌతుంది, అంతేగా అనుకొన్నా. వాళ్ళను జ్ఞాపకం చేస్తూ జాబు వ్రాశాను.

* * *

కబురు వచ్చింది. కలకత్తానుంచి కాగితాల కట్లు, బొంబాయినుంచి బ్లాకుల ప్యాకెట్లు వచ్చి పోస్టాఫీసులో వున్నాయిట. రెండు వి. పి. లు కలిసి నాలుగువందల రూపాయలు! అదేదీ?— దానికోసమే విశ్వప్రయత్నం చేస్తున్నాను!



# గువ్వరాయి

( ముద్దుకృష్ణమ్మ )

ఏదైనా ఒక మంచికథ వ్రాయాలని ఆలోచిస్తూ బల్లదగ్గర కూర్చున్నా. కొంతసేపు ఆలోచించేటప్పటికి లోపల లోపల ఏవో కథలు తిరగడం ప్రారంభించాయి కాని పైకిరావడం లేదు ఏదో వ్రాయడం ప్రారంభిస్తే దాని దారిని అదే తీసుకు వెళ్తుందని కలం కాగితం మీద పెట్టాను. ఇంతలోనే, 'బాబాయి' అని వెనకనుంచి ముద్దుగా కెవ్వుమని యేడుస్తూ మా అన్నగారి కొడుకు పిలిచాడు. వెనక్కి తిరిగి చూస్తే, మా అక్కయ్య నాట్రింకు సర్దుతూ ఉంది. దానికట్టడుగున నేను దాచివుంచిన గువ్వరాయిని మా బాబాయి సంగ్రహించుకుని వచ్చాడు.

"బాబాయి, ఇదేమిటి"
"అదా, గువ్వరాయి"
"ఎంచక్కా ఉంది, కాదూ?"
"ఔను, అల్లాగే"

"బాబాయి, నేను దీనితో ఆడుకోనా?"

"అల్లాగే ఆడుకో కాని, మరి ఎక్కడికీ వెళ్ళకుండా ఈగదిలోనే ఆడుకో, రాయి మాత్రం పారేయకేం ఈ గదిలోనే ఆడుకో" అన్నాను.

ఆ గువ్వరాయి చూస్తే నాకు జ్ఞాపకం వస్తూ ఉంది చిన్నప్పటి సంగతంతా. చిన్నతనం నుంచీ ఈ చేతిలోని అనేక వస్తువులు వస్తూవున్నాయి పోతూ ఉన్నాయి, కొన్ని తెలిసీ కొన్ని తెలియకుండాను. కాని ఆ గువ్వరాయిని మాత్రం అతిభద్రముగా కాపాడుతూ వున్నాను. ఆ రాయి అంటే నా ప్రాణం. మా బాబాయి కసుక ముట్టుకో నిచ్చాను.

చిన్నతనంలో మావీధిలో చాలామంది చిన్నపిల్లలు వుండేవాళ్ళుం కాని మేం ఎవ్వరితోనూ కలిసేవాళ్ళం కాము. మా రమణా, మా దత్తూ, మా చెల్లాయీ, నేనూ నేస్తం. మేం నలుగురం జట్టాపట్టాలు వేసుకుని అస్తమానం తిరుగుతూ వుండేవాళ్ళం. మాకు ఎప్పుడూ సరదా ఏమిటంటే, మా ఇసుకవీధిలో ఉన్న గువ్వరాళ్ళన్నీ ఏరుకురావడం వాటితో రోజంతా ఆడుకోవడం రాత్రి కావడంతోనే ఆరాళ్ళన్నీ మూలగదిలో చీకటిమూల ఎవ్వరికీ తెలియకుండా జాగర్త చేయడం! ఇదీ మాపని. రాత్రి నిద్రపోయే టప్పుడు తలాఒక ముద్దైన రాయీ తీసుకువచ్చి తలగడకింద పెట్టుకుని మరీ నిద్రపోయేవాళ్ళం. గువ్వరాళ్ళంటే మాకు అంతసర్దా.

ఒకనాడు మేం నలుగురం పొద్దున్నే బయలుదేరి రాళ్ళకని వీధంతా వెతుకుతూ వెళ్తూ ఉన్నాం. అందరికీ తలో మంచిరాయీ దొరికినా నాకు ఒక్కరాయీ దొరకలేదు. నాకు కష్టంగా ఉందని మా చెల్లాయి కనిపెట్టి 'అన్నయ్యా నీకు నే మంచి రాయి వెతికిపెట్టనా!' అంది. సరే అని ఎవరిధోరణ్ణి వాళ్ళు వెతుకుతూ ఉన్నాం ఇంతలోనే మా చెల్లాయి 'ఇదుగోరోయి మంచి రాయి, ఎంచక్కా ముద్దొస్తూ ఉంద'ని కలకలలాడుతూ కేకలేసింది. అందరం పరుగెత్తుకుని వెళ్ళాం. ఆ గువ్వరాయి చూడడంతోనే నా గుండెలు కొట్టుకొన్నాయి. గుండ్రంగా చాలా అందంగా ఉంది. దత్తు గుటకలు మింగుతూ నిలుచున్నాడు. 'రమణా ఎలా ఉందిరా' అని అడిగాను నేను. 'నీలాగేవుంద'న్నాడు. అందర్కీ

పకపకా నవ్వాం. ఆమాట అంత ముద్దుగా కనిపించింది. ఈ రాయి ఎవ్వరికీ ఇయ్యనంది మా చెల్లాయి. పొద్దుటినుంచీ ఒక్క రాయైనా దొరకలేదు 'కృష్ణుడుకియ్యవే, ఆరాయి' అని మా దత్తు మెల్లాభాసిగా అన్నాడు 'పోసీ ఇయ్యవే' అని రమణకూడా అన్నాడు. తీవ్రంగా రెండు నిమిషాలు ఆలోచించి 'సరే పుచ్చుకో' అని మహాదానం చేసింది మా చెల్లాయి. అప్పుడు ఆరాయి పుచ్చుకుని మహానందంతో జాగ్రత్తగా దాచి మా చెల్లాయిని ముద్దు పెట్టుకున్నాను. మా మణి అంటే నాకు అసలే ప్రాణం. అప్పటినుంచీ దానిమీద నాకు ప్రేమ మరీ ఎక్కువైంది.

ఆరోజు మాకుదొరికిన గువ్వరాళ్ళకు లెక్కలేదు. నాకుదొరికిన రాళ్ళన్నీ మాచెల్లాయిబళ్ళో పోశాను. సాయంత్రం మావీధి అరుగుమీద నలుగురం చేరాం. రాళ్ళన్నీ మధ్యగా పోశాం. ఇంతలో ఆఫీసునుంచి మానాన్నగారు వస్తూంటే దూరాన్నుంచి చూసి గబగబా రాళ్ళన్నీ ఎత్తుకుని చీకటి గదిలోకి వాడిపోయాం గదిమూల ఇదివరకు పోగుచేసిన రాళ్ళల్లో ఇవికూడా పోశాం. దాసీది మాకు పరమశత్రువు. అది చూస్తే తుడిచి పారబోస్తుందని వాటిమీద చిన్న చాప కప్పింది చెల్లాయి. వెనక్కి వెనక్కి చూసుకుంటూ నలుగురం నాలుగురాళ్ళూ చేత్తో పట్టుకుని మళ్లీ వీధిఅరుగుమీద మూలకు చేరి కూర్చున్నాం. ఎవరిరాయి వాళ్లు జేబులోనుంచి తీసి బయటపెట్టాం. నాకు నారాయినిచూస్తే ఎంతో సరదావేసింది "మనం నలుగురం, మన గువ్వరాళ్లు నాలుగూ" అని దత్తు ఏదో చెప్పబోతూవుంటే, మారమణ అడ్డువచ్చి "మనమూ గువ్వరాళ్ళమే" అన్నాడు. అందరం కిలకిలా నవ్వేశాం రాత్రి ఎవరిఇళ్ళకు వాళ్ళం వెళ్ళిపోయాం. భోజనం ఐనతరవాత మాచెల్లాయీ నేనూ, మారాళ్ళు పట్టుకుని పక్కమీద కూచున్నాం. "అన్నయ్యా, నీకు మంచిరాయి ఇచ్చానుకదా" అంది మణి. "ఔనే" అని కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నా. ఇద్దరం రాళ్ళు చేత్తో పట్టుకుని మానాన్నగారు పురాణం చదువుతూవుంటే వింటూ పడుకున్నాం. స్వర్గంలో దేవతలూ, దేవుడూ వుంటారనీ, వాళ్ళెప్పుడూ చిన్న చిన్నపిల్లల్లా ఆడుకుంటూ సంతోషంగా వుంటారని, వాళ్ళకు విచారాలులేవని, మావేపుచూస్తూ మానాన్నగారు చెబుతూవుంటే హాశ్చర్యంగా వింటూ వున్నాను.. ........................

స్వర్గంలో ఎక్కడచూసినా గువ్వరాళ్ళే. తమాషా తమాషారాళ్ళు. ఎంతో అందంగా వున్నాయి. "స్వర్గం స్వర్గం, గువ్వరాళ్ళు గువ్వరాళ్లు గువ్వరాళ్ళు" అంటూ పరుగెత్తా. నేను పరుగెత్తుతూవుంటే వెనకనున్నరాళ్ళు వెంట పరుగెత్తుకుంటూ వస్తూవున్నాయి. ముందువున్న రాళ్ళు దొర్లుకువస్తూవున్నాయి, ఇంక పరుగెత్తలేక ఆగిపోయా. అప్పుడు అక్కడ కూచుని దగ్గరగావున్న ఒకరాయిని తీయబోయాను. ఆరాయి అచ్చంగా నారాయిలాగే వుంది. మా చెల్లాయి నాకిచ్చిన రాయిలాగుంది. నాకుమరింత సంతోషంవేసింది. చేయి చాపి తీయబోతే ఆరాయిఅవతలకు దొర్లింది. నేను ముందుకు జరిగాను రాయి ఇంకాఅవతలకు జరిగింది. రాయిముందూ నేను వెనకా చాలదూరంవెళ్ళాం. నాకు ఆయాసం వచ్చింది. "అబ్బా"అని అగాను. ఆరాయి

కూడా ఆగిపోయింది. పోనీలేఅని కూచోబోతూ ఉంటే ఆరాయి కొంచెం ముందుకుదొర్లింది. "తప్పు" మని రాయి మాయమైపోయింది. చిరు నవ్వు నవ్వుతూ ఒక చిన్నపిల్లవాడు వచ్చాడు. నన్నుచూసి పకాపక నవ్వాడు. నేనూ గట్టిగా నవ్వాను. అక్కడవున్నా గువ్వరాళ్లన్నీ తప్పు తప్పుమని చిన్నచిన్నపిల్లలై పోయాయి. అందరం కలిసి ఆడుకోవడం మొదలుపెట్టాం కొత్తకొత్త ఆటలు చాలా ఆడాం. ఎంతసేపుఆడినా ఆయా సంరాలేదు ఇంకా ఇంకా ఆడుకొంటూ ఉన్నాం.ఇంతలో తప్పుమనిచప్పుడైంది.గభీలుమని కళ్ళుతెరిచి చూశాను దాసీది తలుపుతీసి చీపురు పుచ్చుకొని వచ్చింది నాగువ్వరాయి గుండెలకింద పడివుంది.

లేవడంతోనే పరుగెత్తుకుని వెళ్లి మొహాం కడుక్కుందాంఅని మారమణనీ దత్తుని తీసుకు వచ్చి మాచెల్లాయినిలేపి నాకుమంచికలవచ్చింది చెబుతానని అరుగు మూలకుతీసుకువెళ్ళికలంతా చెప్పడం మొదలుపెట్టాను. స్వర్గంలో గువ్వరాళ్ళున్నాయంటేఅందరిమొహాలూ వికసించాయి గువ్వరాళ్లన్నీ చిన్నచిన్న పిల్లలుగా మారిపోయారని చెబుతూవుంటే ఎంతో శ్రద్ధగావింటు "దేవతలూ గువ్వరాళ్ళే" అన్నాడు రమణ. "ఔనురా నీవుచెప్పింది నిజమే, మావిను"అంది మణి. కలంతా చెప్పేశాను. "స్వర్గం చాలా బాగుంటుంది" అన్నాడు దత్తు. "ఒరే, దేవతలు ఎలావున్నారురా" అని రమణ అడిగాడు ముందు గువ్వరాళ్లలాఉండి దొర్లిపోతూ వుంటారనీ తరవాత తప్పుమని చిన్నపిల్లల్లా ఐపోతారనీ వాళ్ళూ మనలాగే వుంటారనీ కాని తమాషా తమాషా ఆటలు ఆడతారనీ చెబుతూవుంటే, "అన్నయ్యా, మాకు నీవు ఆటలునేర్పాలి సుమా" అంది మణి. "ఒసే, అబ్బా, నీవుఉండు" అని రమణ ముందుకుజరిగి "ఒరే, దేవతలు, ఇంకా ఎలావుంటారో చెప్పరా" అన్నాడు. నేను చెబుతూ వాళ్ళు అచ్చంగా మనలాగే వుంటారు కాని మనకన్నా అందంగా ఉంటారనీ, గాలిలో ఎగరడానికి వాళ్లకి వీపుమీద నన్నని రంగులరెక్కలు ఉంటాయి" అని అంటూఉంటే రమణ వీపు తడుముకున్నాడు అందరం పకాపకా నవ్వాం. మానాన్నగారు వచ్చి "ఒరే, మొహాలు కడుక్కోండి" అన్నారు.

మేం ఎప్పుడూ ఇలా గువ్వరాళ్ళతో ఆడుకుంటూ వుండేవాళ్ళం. చీకటిగది మూలదాచిన గువ్వరాళ్లే మాఆస్తి. మాధ్యాస్నం ఎప్పుడూ వాటిమీదే ఉండేది. ఒకనాడు మాకత్తెర్లివు దాసీది ఆరాళ్ళన్నీ చూసి, మాఅమ్మమ్మ దగ్గరకు వెళ్ళి పిల్లలు ఆగదిలో ఎన్నిరాళ్ళు పోగుచేశారో చూశారా' అని చూపించి, అవన్నీ ఎత్తిమూరంగా పారవేసింది. మేం యేడుస్తూఉంటేమావాళ్లు చివాట్లు పెట్టారు.

మా అమాయకత్వం, చిన్నతనం, ఆటలూ సరదాలు అన్నిటినీ మాకు తెలియకుండా ఎక్కడో దూరంగా విసిరివేశారు. నేను మాత్రం ఆ నా గువ్వరాయిని జాగ్రత్తగా దాచాను. ఇప్పటికి దానిలో మామణి ప్రేమా మాబాల్యం, ఆనాటి ఆనందం, మాస్వర్గం కనిపిస్తూవుంటాయి, అది నాప్రాణం............

'ఒరే, బాబాయి, ఆరాయి బద్దలుకొట్టకురా. ఇదిగో కావలిస్తే ఈఉంగరం ఇస్తాను దీనితో ఆడుకో. మా అమ్మ కాదూ!'

# కృష్ణకుమారి

(ఇంద్రగంటి నాగేశ్వర శర్మగారు)

" విషము బూసిన కత్తి యసుర సమానుఁ
డాయమీరాముని యాలోచనము వ
మణీసింగు తనకూతు మడియింప నెంచె
కన్న ప్రేమను జంపి కడునిర్దయాత్మను !

పోషించు ప్రభువునే పొడిచిన యట్టి
విశ్వాస రహితుండు విమతస్థుఁడొకఁడు
మిత్రుఁడై తనయొద్ద మెలఁగుచునుండ
నెట్టి యాజ్ఞలనైన నీయఁదేవేఁకు !

ధైర్యసాహసమూర్తి జాలసింహుఁ
డాయాజ్ఞ వినుటయు నమితకోపాన
కాలుని చందాన కడుమండిపడియె
"కులగౌరవమ్మును కూలంగఁద్రోచి
పౌరుషమ్మును వీడి భాషింపనగునె
అనదలఁ బొలియింప నాజ్ఞలనొసఁగు
రాజుపై సద్భక్తి రాజిల్లునొక్కొ
సద్భక్తిఁ జూపెడు సరణి యిట్టిదియె
మారేనిపై' నంచు మఱలెనావేళ
ఆత్మగౌరవమున నలరారు కతన!
కొలువు కూటంబెల్ల కొందలమందె.



"రాజపుత్రులలోన ప్రబలు ద్వేషాగ్ని
అన్యదుష్టరుధిర మందున మునిగి
చల్లారి శాంతంబు సమకూడునేని
అర్పింతు ప్రాణాల నతిమోదమునను
పోరునష్టంబును పొందు లాభంబు
అనియెడు రాణుఁడి వినలేద మనసు

ఎన్ని ప్రాణంబులో యెగిరిపోయినవి
కూలిపోయిన వెన్నొ కొంపలు నుండు
ప్రాణభయంబుచే ప్రజలెల్ల కలసి
పరువెత్తుచుండిరి, పరదేశములకు
మాతృదేశంబుపై మమతనువీడి.

ఈ కష్టజాలంబు నెట్టులయిన బాప
వలదలై రక్తంబు ప్రవహింపనిందు
నా మేనిలోనుండి రయమొప్పగాను
యుద్ధంబు చల్లారు నువిదలు వినుడు
ఒక్క ప్రాణంబుతో నొకని మేనమున

తనుజూచి దుఃఖించు వనితలఁ గాంచి
ఆరీతిఁ బలుకుచు నతివ కృష్ణమ్మ
శాంతంబు నెమ్మోమ జనియించుచుండ
చిఱునవ్వు కెమ్మోవిఁ జెలువు నటింప
"మాతులగౌరవ మహిమంబు నెంచి
తనరు బాంధవ్యంబు దవ్వులఁ ద్రోచి
దేశమాతఋణంబు దీర్పఁ దలంచి
వరరాజపుత్రిఁ ప్రాణాలగొనుమ
స్వధర్మమును వీడి చనబోకు' మనుచు
తన మ్రోలనిలువంగ తరుణిని గాంచి
ఔదార్యవంతుఁడౌ యావనసింహుఁ
డట్టులే నిలుచుండె నాశ్చర్యపడుచు,
హృదయమ్ము నీరయి - యెడద చలింప
శాతకృపాణమ్ము చేతిని వదలె;
కన్నీరు వఱదలై - కాల్వలుగట్ట
చానను మడియింప సాహసమేది
వెడవిగడల్పక వెడలె నతండు—

ఎందఱో మగవార లీరీతి జనిరి
తమబీరముల నెల్ల దవ్వులం ద్రోచి—

♦ ♦ ♦ ♦

"మగవారలెందరో ముగియింపలేని
కార్యంబు నేరీతిం గడతేర్చ్బదాన
నేరీతి నెఱవేర్తు నిట్టియాజ్ఞలను
బానిసవృత్తియే బహుకష్టతరము
మానంబునట్టేట మడియగాజేసి
అర్థంబు ప్రాణంబు నన్నియు వదలి
స్వాతంత్ర్యమును ద్రోలి స్వమతంబు విడి
పారతంత్ర్యంబులో పడియుండవలెను.—
బానిసవృత్తియే బహుకష్టతరము
యజమాని పంపు సేయకపోయెనేని
ప్రాణంబునకుహాని బడయగావలెను—

♦ ♦ ♦ ♦

ఒయ్యారమొప్పగా నొక్కొక్క ఱేకే
విదళించి విదళించి విడబారునట్టి
పద్మసోయగముతో పరిఢవిల్లెడును
సుకుమారమైన మాసుందరికృష్ణ.

నందనోద్యానాన నాట్యంపు సలుపు
దివిజకాంతులలోని దివ్యతేజంబు
ప్రకృతిలో ననలెత్తు రమణీయలీల
సుకుమారమైన మాసుందరికృష్ణ
నెమ్మేన జెలువొందు నెన్నాకృతులను.

నీలిమాకాశాన నిగనిగమెఱయు
నిద్దంపు చుక్కయే నెలతసోయగము
చిగురుమొత్తమ్ములో జీరాడునట్టి
మార్దవమ్మును మించు మాకృష్ణసొంపు.

చిఱునవ్వు వెన్నెలల్ చిందించుకొనుచు
ఆదంభావమ్ము లతిమధురములు
ఎంతో మోదముతోడ నింతిపల్కెడిని
నాసేమముంగోరి నను మెచ్చుకొనుచు
నెచ్చెలినైన నానెలవునజేరి.

మేవాడురాజుల మేటిశౌర్యంబు
మేవాడుకాంతల మేటిధైర్యంబు
రసపుత్రికుల కౌర్య, మనమానకీర్తి
దేశాభిమానమ్ము, దేశీయభక్తి
కోకిలస్వనములో కొమకొంచుచుండ
కేటకెల్లంబుగాం దెలియంజేసెడును.

♦ ♦ ♦ ♦

అత్యంతసౌందర్య మతిదేశభక్తి
పాలబుగ్గలలోని పటుశైశవమ్ము
జీరాడుచుండగాం జేంచినట్టి
చిన్నారికృష్ణమ్మ, చెలువునంతయును
నలువ కేకేతిని నట్టేటగలుప
తలపుఘటిల్లెనో తలపవశమ్మె
తను దానజేసిన తలపును మఱచి.

జవ్వనంబున కింక సరియైన స్వాగ
తం బీయగాలేదు తరలుశైశవము
కాలగర్భంబులో గలసిపోవలసె
సుకుమారి సౌందర్య సూనంబు కృష్ణ.

తనరూపమే యాయె తనకు శత్రువుగ
సౌందర్యమున్మించు శత్రువే లేదు
చక్కని సౌందర్య సంపదకలన
సీతామహాదేవి చెఱనుంబడియె
పాంచాలి, ద్రౌపది పరిభవమొందె

ఖలులైన తురకల కపట తంత్రాన
పద్మినీరాణియు పరిభవమందె
సౌందర్య సౌభాగ్య సంపదకలన



ప్రాణంబునకునెల్ల ప్రాణమైనట్టి
చెలియను మడియింపఁ జెల్లునె నాకు
పాలతో బెంచిన భామిని కీపుడు
ఏలొ విషమిత్తు నిస్సిరో! నేను ?”



ఆశాంత గంభీర యామినీ సమయ
మందున నాదాసి యడుగడుగునను
తనలోన దానిట్లు దలపోసికొంచు
వెనుకాడ ప్రేమమ్ము విధి ముందు కీడ్వ
పొంగిపొరలెడు దుఃఖపుంజమ్ము నడచి
కంపితగాత్రయై కదలుచునుండె.

## 2

ప్రాంగణోద్యాన విశ్రాంతివేదికను
వెన్నెల వెలుగులో విశ్రాంతినుండి
స్వవిరచిత స్వాదుభావ సుగంధ
భక్తిగీతమ్ముల బాడుచునుండు
సుకుమారి కృష్ణను జూచె నాదాసి;—

వెన్నెలకే వింత విన్నాణ మొసగి
దివ్యతరంగాల దేలిపోయెడును
సర్వాంగ సుందరి సకియ కృష్ణమ్మ
కేకితి దుర్వార్త నెఱిగింపనోపు ?

“వయసును మించిన వైరాగ్యవృత్తి
నలరెడు కృష్ణను చెలువు నశింప
దారుణ విషవహ్ని దగుల బెట్టుటకు
నెట్టులఁ బనిగొందు నిస్సిరో నేను !
కంపించు దేహంబు కడువడి నిపుడు
బుద్ధి చంచలమందె భువి దిర్గుచుండె
దుఃఖాశ్రువులు పొంగి దొరలుచునుండె
కనులు గానగరావు కను విచ్చికొన్న
ఈయకార్యంబున కెటులొడంబడితి
భయ మొదవించెను ప్రకృతి యెల్లెడల
నను జూచి, నా యకార్యక్రియతిఁ జూచి.

చెలియను జంపగా చేతులురావు
“నేనంత దుర్మార్గ నియతిఁ గొప్పుదున
ఛీ యట్లు చేయఁగాఁ జెల్లునె” యంచు
చెదరిన మనముతో కదలెనచ్చోటు;

తడబాటులో దారి తప్పుట కతన
లేగులాబీ ముండ్ల, లేమ చెఱంగు
చిక్కుకొనంగ, నా చిఱుశబ్దమునకె
ఆగభీర పరిశాంత యామిని నపుడు
దిశలెల్ల కలయఁగ దృష్టిసారించె
నరమోడ్పు కనుదోయి నటునిటు కృష్ణ
చూచి సంభ్రమముతో “సుందరీ! చెలియ!
రమ్ము వేదికపైకి రమ్ము వేవేగ
సవరించి చెఱగును సమ్మోదమునను.

నా భావమున పొంగు నవ్యగీతాల
నతిశ్రావ్యమొప్పఁగా నతివ! పాడెదను.
రమ్ము విశ్రాంతికై రమ్ము నెచ్చెలియ”
అనుచు బిలచెను అతివ కృష్ణమ్మ
జరిగిన కార్యంపు సరణినెఱుఁగక
సన్నిహితమృత్యువు సంగతి లేక.

## 3

◆ ◆ ◆ ◆

"ప్రాణమ్ములను నిను బాయుమటంచు
నీతండ్రి దయమాలి నియమించెనన్న
సమరసమున్ గ్రోలి సఖియరో వినుము"
అని శోకభరమున నచ్చటగూలె
నా దాసి;—

◆ ◆ ◆ ◆

"నెచ్చెలీ కన్నీరు నించెద వేల
ఏమిశాశ్వతమన్న యెదినిత్యమన్న
తనువు శాశ్వతమంచు తలపోసినావ
పుట్టినవారలు గిట్టుట నిజము
ఇంతవంతను గుండె దవిందుల కేన
ననుగన్న తండ్రియే నాకేలయాజ్ఞ
యొసగెనో యెఱుగవ, యువిదరో నీవు
ఘనతరయుద్ధంబు ఘటియిల్లెనన్న
నామహాలమున దేశనాశనమునకు.
రణమున బలిమార్పఁ బ్రాణమ్ము వాయ
సిద్ధంబుగానుంటి చెలియరో నేను.

ప్రాణమ్ము తృణముగా భావించి మించి
బవరమ్ములో నిల్చి పగరనిర్జించి
ఘనమైన కీర్తిని గడియింపలేదె
మాకులంబున నున్న మహిళలందఱును
నిజదేశ భాగ్యంబు నిలబెట్టదలచి.

మాతృదేశంబుపై మమతయేయున్న
సేవ దేశమ్ముకై చేయందలచిన
తనమేని ప్రాణాలు వాయుటకైన
సిద్ధంబుగావలె చేతోముదమున.

ఈదృశమరణంబె యేను వాంఛింతు
నిజమనోరథమిష్ట నెరవేరు భాగ్య
మబ్బె నెచ్చెలికంచు హర్షింపబోక
జేలవై వాపోయెదేలనో నీవు!

రాజపుత్ర స్త్రీల రాణువ యెఱిగి
యీరీతి దుఃఖింప నేలనో చెలియ
నిజకులశీలమ్ము నిజదేశభక్తి
రాజపుత్రి స్త్రీల రక్తనాళాల
ప్రవహించు ననుమాట పలుమారు వినవె;
మఱచితివో వారి మహిమలనెల్ల
కలనిలో నురుకంగావలసిన యపుడు
వెనుకంజవైచిరే వీరవనితలు.

ప్రళయాగ్నిఁబోలిన బహుళవిక్రమము
మొక్కవోయని శౌర్య మెక్కటి దేశ
భక్తియు నిజకుల ప్రాభవమొప్ప
వైరులు వెఱగంది వెన్నిచ్చిపార
ఆమసింగము పోల్కి నత్యుగ్రమునను
ఖండనంబొనరించి పరిమార్చె పగఱ
రాణి వీరాబాయి రణరంగమునను!
పాదుషాయక్బరె భయమంది వెడలె
విజయమ్ముగాంచెను విధమెఱుంగకను.

ఈరీతి నువిదలు యొందఱో నున్న
చచ్చిన బ్రతికిన స్వాతంత్ర్యమునకె
నిలచిన పోయిన నిజదేశమునకె
అని తమ మనముల ననుకొని మించి
శౌర్యోజ్జ్వలమ్ముతో సమరరంగమున
ఎందఱో మడసి రంచెఱుగవో నీవు?

ఆ వీరవనితల నా పతివ్రతల
నక్బరు పాదుషా యాంకిపురాణ

ప్రాత్రియుల గెల్పించి యతిభక్తితోడ
అనిశంబు పూజించెనను కథానకము
పలుమారు వినలేదె భామరో చెప్పుము

అంతటి శౌర్యంబునవనిలోన జూపు
భాగ్యంబు నే నేల బడయనైతినని
వాపోదు నే వేళ భామిని నేను.

అట్టి పూర్వుల కీర్తి నడుగంట ద్రోచి
అలఘు జీవితమును మలినమ్ము నర్చి
యసువుల కాంక్షించు నసదనా నేను ?

దేశమాత ఋణంబు దీరిచికొనంగ
ఆత్మీయ సౌందర్య మర్పింతు నేను
స్వధర్మ మీరీతిఁ జలుపుదుగాక !
పూర్వకాంతల ప్రాంత బోయెదగాని
సమయ భంగముచేసి చరియింపలేను.

మా కులంబున మున్ను మసలినయట్టి
మహిళల ఖ్యాతిని మాపగాలేను
కడుమనోహరమైన కాసారమందు
వన్నె దెచ్చెడు నంచ వసియించుఁగాక
కాకంబునకుఁ దావు కలదె దలంప !

ఈ దృఢమరణమ్మె యేను కాంక్షింతు
నాకోర్కె నెరవేరు నాతిరో యిపుడు"
అని దాని నూరట బనిచె కృష్ణమ్మ.

"రసపుత్రి లెలమిని రాణింతురిగాక
ఐకమత్యంబుతో నవని నెల్లపుడు
ఈసు మనంబున నెడబాటు జేసి
శాంతిమై రాజులు చరియింతురిగాక !
ప్రియము దేశములోన రేకెత్తుగాక !"

అని లోని కోర్కెల నాశతో బల్కి
విష్ణుని భ్రాజిష్ణు గృష్ణుని దలచి
సమరసమును గ్రోలె సకియ యా వేళ !

4

"చివురు జొంపమ్ముల చెలువొందు సుమము
తీవ్ర జంఝూతపా తీక్ష్ణతాపమున
తనుదాన రాలెను ధరణిపై నిపుడు
సౌందర్య సౌభాగ్య సంపద వాసి !

♦ ♦ ♦ ♦

ఓ మృత్యుదేవతా ! ఓ సమరసమ !
పుణుకంగ జాలితి పుష్పంబుగాని
చతురబ్ధివలయిత తత మహీమండ
లాంతరంబున వ్యాప్తినందినయట్టి
అద్దాని సౌరభ మపహరింపంగ
శక్తి యొక్కింతయుఁ జాలదు నీకు ?

♦ ♦ ♦ ♦

ప్రాణంబునకు ప్రాణపదమైన నాడు
నెచ్చెలి నెడబాసి నిలువంగనోప,
సౌందర్యమత్తులై సమరంబు జేయు
పాడు దేశంబులో బ్రతుకంగలేను;
పరసుతా సహనమ్ము నాపగాలేని
పాడు దేశంబులో బ్రతుకేలనాకు ?
అతిమ్లేచ్ఛ సంతతి కాశ్రయమిచ్చు
పాడు దేశంబులో బ్రతుకంగవలెన ?"
అని విషసేవంబు నాదాసిగ్రోలె.

♦ ♦ ♦ ♦

భయద శీతలమృత్యు బాహువులందు
వసివాడిచిక్కిన వనితలమీద
చల్లని వెన్నెల జల్లగాసాగె
శాంతినాపాదించు సఖుఁడు రేరేడు
నిశ్శబ్దయామినీ నిముషాలలోన.

—♦ తుదిమాట ♦—

కృష్ణా కుమారి మేవాడు దేశాధిపతియు నుదయపురరాణాయునగు మణిసింగునకు కూతురు. తలిదండ్రు లీమెకు మొదట కృష్ణ యని నామకరణ మొనరించిరి. 1792 వ సం॥న జన్మించి 1810 లో ( 18 వ యేట ) దేశమునకై తనువును బాసినది. యుక్తవయసు రాగానే యీమెకు తండ్రి వివాహము గావింప నిశ్చయించెను. కృష్ణా కుమారియొక్క సౌందర్యమునకు గుణశీలములకు నచ్చెరువొంది రాజపుత్రు లీమెను వివాహమాడుటకు తమలో దాము కలహింపసాగిరి. వారందరు రెండు కక్షలుగ చీలిపోయి యుద్ధము చేయసాగిరి. రెండేండ్లు దేశమున ఘోర యుద్ధము కొనసాగెను. మణిసింగునకు ప్రాణసంకటమాయెను. యుద్ధము నాపుటకు సూత్రములు కనరాలేదు. ఉపాయాంతరము లేక, యొక మ్లేచ్ఛుని సలహాప్రకారము చిట్టచివరకు తన కూతునకు విషమీయ నిశ్చయించెను. సుగుణాల పోవగు కృష్ణాకుమారి దాసిచే బంపబడిన సమరసమును గాఢముగ విషమును పానమొనర్చి తనకుగల నిరుపమాన దేశభక్తిని ప్రకటించి దేశమునకు రానున్న యుపద్రవమునే పోద్రోచెను. యుద్ధములును శాంతించెను.

---

# ప్రణయమా — ప్రళయమా?

కవియోగము

ఓ ప్రణయభావమా ! ఆశ ! ఒక్కమారు  
కాలభీకర నీలాంబుదాళి యట్లు  
అస్మదాత్మకై పతకాదియందు నిట్లు  
క్రమ్ముకొననేల ? అంధకారమ్మునందు  
దోడు నీడలు లేకుంట దోచదాయె  
ఎట్లు నేనింక నిటవసియింపగలను

♦ ♦ ♦ ♦ ♦

కంటకవితాన తల్పాన గాళులాడ  
కుండ, జడిపోయి విలపించుచున్న నన్ను  
ఈ గభీర ప్రణయ పరాగా గమమున  
స్వామి ! రక్షణ సేయ నెవ్వారుకలరు ?  
కన్నులకు వస్తువేదియు గానరాదు,  
ఏకరీతిగ నదియొక్కటే కఠోర  
భూరి భీకర శబ్దంబు హోరు మనుచు  
గర్ణపుటముల లోబడి కలచుచుండె  
స్వామి ! యిది యేమి ?  
ప్రణయమో ప్రళయమొకద ?

# నూర్జహాను.

సింగంపల్లి వెంకటాద్రిగారు

“నూర్జహాన్” అను పదమునకు జగజ్జ్యోతి అని యర్థము. ఈమె కొంతకాలముక్రిందట హిందూ మహాసామ్రాజ్యమంతటిని అత్యంత వైభవముతో పరిపాలించి శాశ్వతకీర్తిని బడసెను. ఈయమ ముఖారవిందమును జూచి అక్బరుచక్రవర్తి తనూభవుడగు జహంగీరు సమ్మోహితుడై సర్వస్వమర్పించి ఆమె యనుగ్రహానుగ్రహములకు పాత్రుడై యుండెను. కాంతా కాంచనముల మహిమ యట్టిది. ఈమె తండ్రిపేరు “అయాసీ” దుస్సహమగు దారిద్ర్యానలముచే పరితపించుచున్న నీతడు తన మాతృదేశమగు పశ్చిమ తార్తారమును వీడి భార్యాసమేతముగ భరతధాత్రికి జీవనార్థమై బయలుదేరి వచ్చెను. ఇట్లు వచ్చుచుండగా త్రోవలో నొక దుర్గమారణ్యమధ్యమున అయాసీభార్య యొక స్త్రీశిశువును కనెను. కుటుంబభారముచే క్రుంగిపోవుచున్న అయాసీకి స్త్రీశిశూదయము వలన దిగులు మరింత యధికమయ్యెను. పాపమాపసిపాపనెందయిన పారవేయవలయునని పలుమారు యత్నించెను. కాని కన్న కడుపగుటచే చేతులాడకపోయెను. శిశువును చంకబెట్టుకొని అష్టకష్టముల పడుచు ఎట్టెటో ఆగ్రా నగరమునకు చేరగలిగిరి. అదృష్టవశమున అక్బరుచక్రవర్తి ఆగ్రా నగరమున ఆసమయమున నుండుట సంభవించెను. ఆచక్రవర్తి ముఖ్యమంత్రులలో నొకడగు అసఫ్‌ఖాను అయాసీకి కొంచెము బంధువు. ఆబంధుత్వము పురస్కరించుకొని అసఫ్‌ఖానుకడ కేగి ఆశ్రయించెను. అతడు అయాసీని తన కార్యదర్శిగ నియమించెను. తెలివితేటలు, చాకచక్యములుగల అయాసీ అచిరకాలమునకే యజమాని యనుగ్రహమునకు పాత్రుడయ్యెను. అతని కేదయిన ప్రధానోద్యోగము నిప్పించవలయునని యత్నించుచుండెను. ఇంతలో అయాసీ రాజభక్తిపరాయణతయును, బుద్ధిసూక్ష్మతయును, సామర్థ్యాతిశయములును చక్రవర్తి గుఱుతెఱింగి పదివేల సైనికుల కధిపతిగ నియమించెను

మరి కొంతకాలమునకు కోశాధిపతిగను, మంత్రిగను నియమింపబడెను. అదృష్టమున నిట్లు కలిసికావలయు. “సంపద బెంకాయ సలిలంబుభంగి” యని వేమన చెప్పియుండలేదా! మహదైశ్వర్య సంపన్నుడగు అయాసీ ఒకానొక దినమున అత్యంత వైభవముతో విందొకటి కావించి రాజకుటుంబమువారిని పురప్రముఖుల కొందర నాహ్వానించెను. ఆవిందునకు రాకొమరుడగు జహంగీరును వచ్చియుండెను. అతిథులెల్లరు విందారగించిన పిమ్మట అయాసీ కుటుంబమునందలి స్త్రీలు మహమ్మదీయమత సాంప్రదాయానుగుణముగ భోజన మందిరమునకేగి శ్రావ్యముగ పాడియు, నేత్రోత్సవముగ నాడియు ప్రేక్షకుల నానందసాగరమున నుఱ్ఱూతలూగించిరి. అందరలోకెల్ల అయాసీ కొమరితయగు నూర్జహాన్ విద్యుల్లతవలె నెందు జూచిన తానెయై మెఱయుచు ప్రకాశించుచు వచ్చెను. నూర్జహాన్ చిననాటనే చదువను వ్రాయను చక్కగ నేర్చుకొనెను. సంగీతము, చిత్రలేఖనము, నృత్యము మొదలగు లలితకళలయందసమానమైన ప్రజ్ఞ ప్రతిష్ఠ గడించెను. మణిమయాభరణ భూషితయై మిలుమిట్లు గొల్పుచున్న నూర్జహానును జూచిన యుత్తరక్షణమునుండియే జహంగీరు ఆమెను చేబట్టుటకు కృతనిశ్చయుడయ్యెను. ఆటపాటలన్నియు ముగిసినపిమ్మట జహంగీరు రాజమందిరమునకేగి తండ్రితో తన మనోభీష్టమును నివేదించెను. అక్బరుచక్రవర్తి కొడుకును నిందించుచు భృత్యకోటిలో జేరినవారితో వియ్యమందుట యవివేకమని మందలించెను. తరువాత కొన్ని దినములకే నూర్జహానును “షేర్ అఫ్గన్” అను వాని కిచ్చి వివాహము చేయునట్లు యేర్పరచెను. భువనైకసుందరియగు నూర్జహానును వివాహమాడుటచే అఫ్గనునకు తొందరలు చిక్కులు అనేకములు కలుగుచు వచ్చెను. పాపమాతడు చేయునది లేక వంగదేశమునంగల బర్ద్వాను మండలమునకు “నాయబ్”గ వెళ్ళి యచ్చట కాపురముండసాగెను. ఇట్లుండ కొంతకాలమునకు అక్బరు చక్రవర్తి పరమపదించెను. జహంగీరు సామ్రాజ్యాభిషిక్తుడయ్యెను. సర్వంసహా చక్రవర్తియగు జహంగీరు నిరంకుశముగ వ్యవహరించుట కెట్టి యభ్యంతరము నుండజాలదు. అతడు నూర్జహాను పెనిమిటియగు షేర్ అఫ్గనుని ఆగ్రానగరమునకు వచ్చి యుండవలసినదిగ యాజ్ఞాపించెను. రాజాజ్ఞను మీరలేక పాపమాతడు భార్యతో ఆగ్రానగరమునకు చేరెను.

షేర్ అఫ్గను మిక్కిలి ధైర్య సాహసములు గలవాడు ఐనను సత్స్వభావముగలవాడు నిష్కల్మషహృదయుడు, ఆకారణమున పౌరులెల్లర కాతనియందు ప్రీతి. ఒకానొక దినమున జహంగీరుపాదుషా కొలువుదీరియుండ నాడా

హారు దేతెంచి "అయ్యా, ప్రజలు క్రూర మృగముల బాధచే భయకంపితులై తమ రక్షణమునకు నిరీక్షించుచున్నారు." అని సవినయముగ చెప్పెను. తత్క్షణమే జహంగీరు షర్ ఆఫ్గనుని మృగయావినోదార్థము తనవెంట రా నియోగించి సపరివారముగ బయలుదేరెను. ఆవేట సమయమున షర్ ఆఫ్గనుడు చూపిన ధైర్యసాహసము లసామాన్యములు. అతడొకానొక వ్యాఘ్రముతో నిరాయుధుడై పోరాడి ముష్టిఘాతములచే నేలబడగొట్టెను. అట్టి మహావీరుని కామాగ్నిపీడితుడగు జహంగీరు రహస్యముగ నా యరణ్యమధ్యమున జంపివేయ కుట్రలు పన్నుచుండెను. ఈసంగతి గుఱుతెఱిగి తోడనే నగరమును వీడిపోయి వంగదేశమున కప్పుడు రాజధానిగ నుండిన "రాజ్ మహల్" నకు పారిపోయెను. నూర్జహానును పెనిమిటిదగ్గరకు చేరెను. ఆసమయమున వంగదేశమునకు కుతుబ్ ఖానను నాతడు పరిపాలకుడుగ నుండెను. అతడు చక్రవర్తి యనుగ్రహము సంపాదింపనెంచి నూర్జహాను భర్తయగు షర్ ఆఫ్గనుని వధించుటకు పెక్కుమార్గముల యత్నించుచు వచ్చెను. ఈసంగతి తెలిసికొని షర్ ఆఫ్గను రాజమహల్ నుండి బర్ద్వానుకు పారిపోయెను. బర్ద్వాను ప్రాంతమున బంగాళాకు చేరుచుండగనే గవర్నరుగ నుండిన కుతుబ్ ఖాను ఏదో మిషపై బర్ద్వానుకు వెళ్ళి షర్ ఆఫ్గనుతో కలిసికొని కలహము పెట్టుకొని వానిని సంహరింప బూనకొనెను. ఆసమయమున యుభయులకు ద్వంద్వయుద్ధము జరిగెను. ఆ యుద్ధములో నిరువురు హతులైరి. వెంటనే నూర్జహాను జహంగీరు రాణివాసమునకు గొంపోబడెను. స్త్రీజాత్యాంతర్యమున దిక్కుమాలిన బిడ్డగ వదలిపెట్టబడవలసి యుండిన నూర్జహాన్ సామ్రాజ్యాధిపతి యగు జహంగీరు పాదుషా పట్టమహిషి యయ్యెను. జహంగీరు నూర్జహాను బ్రతికియున్నంతకాలము చేతిలోని కీలుబొమ్మవలె పడియుండెను. ఆమెయే రాజ్యమంతయు అత్యంతనైపుణ్యముతో పరిపాలించి సర్వజన ప్రశంసాపాత్రి యయ్యెను.

# దారిద్ర్యమా.

ఎ. కామేశ్వరశర్మగారు.

అగ్రజాతిని, నంపు ♦ నార్యవంశమునందు
పొడమిన దివిజాళి ♦ పొంతజేరి
సకల శాస్త్రేతి హా ♦ సంబులం జదివిన
పండిత రత్నాళి ♦ పక్క జేరి
దానధర్మములందు ♦ దక్షులా, బ్రాహ్మణ
క్షత్రియ విట్ఛూద్ర ♦ సమితిఁ జేరి
కుల, గోత్ర, కర్మలఁ ♦ గొనియాడఁదగు నార్య
పాద పద్మంబుల ♦ పజ్జఁ జేరి

యీవు సుఖియించుచుండ ♦ నీ కేల, శూద్ర
మూర్ఖలోభుల, దుర్మార్గ ♦ మోర్లఁజేర,
తల్లి! దారిద్ర్యమా! నీకుఁ ♦ దగినవసతిఁ
గూర్చియుంచెను వాక్పతి ♦ కూర్మితోడ ||

# బ్రహ్మచర్యవ్రత ప్రభావము.

జమిలి నమ్మాళ్వారుగారు.

బ్రహ్మచర్య వ్రత ప్రాభవంబునఁగదా ♦ చిరకాలజీవులై చెల్గినారు
బ్రహ్మచర్య వ్రత ప్రాభవంబునఁగదా ♦ విజ్ఞానమూర్తులై వెలసినారు
బ్రహ్మచర్య వ్రత ప్రాభవంబునఁగదా ♦ ధర్మజిజ్ఞాసులై దనరినారు
బ్రహ్మచర్య వ్రత ప్రాభవంబునఁగదా ♦ వేదాంతపక్షమందు వెలిఁగినారు
ఉద్దిగనట్టి మన తొంటి పెద్దలెల్ల ♦ రట్టి నియమంబుచేతనే నలరినారు
దాని విడనాడి యాకీర్తి హీనమైన ♦ స్థితికి వచ్చితిమయ్యయో శిష్టులార ॥ 1.

క్షత్రియాలంకారుఁ గౌశికుఁ డెట్లు ♦ బ్రహ్మర్షిమూర్తియై పరఁగినాఁడు
వనచరుండైనట్టి హనుమంతుఁడేరీతి ♦ బ్రహ్మత్వమునుగాంచి ప్రబలినాఁడు
సాగరాత్మజుఁడైన భాగీరథుండెట్లు ♦ గంగను సాధింపఁగలిగినాఁడు
శూద్రజాతీయుఁడౌ శుకమహాఋషి యెట్లు ♦ లాచార్యపదవికి నరగినాఁడు
కాంచుఁడీ మీరు మామనఃకంజమందు ♦ వీని కెల్లను గారణవితతి యింక
ధరణిలో బ్రహ్మచర్యవ్రతమ్ము దక్క ♦ వేఱుకారణ మేదేని వెలసెనేని. 2.

సంగర రంగమందు ఘనశౌర్య పరా ♦ క్రమవిక్రముండు నా
యంగజుతండ్రి యంతటి మహాత్ముని ♦ లెక్కిడి కేవ్రతిజ్ఞలన్
భంగమొనర్చునట్లు ప్రతిభాయుతుఁ ♦ డౌచుఁ జెలంగినాఁడు కీ
ర్తింగనె నావగాసుతుఁ డదేవిధమో ♦ గనుఁడయ్య మీరలున్ ॥ 3.

అట్టి నియమంబులేకయే యార్యులార ♦ దేశ సౌభాగ్యగరిమంబు దివికిఁజేర
శల్యమాత్రావశిష్టమౌ శవముమాడ్కి ♦ మిగిలియున్నారమయ్య యోమేయులార॥ 4.

మీ పూర్వవిభవంపుఁ బ్రౌఢిఁ జెందఁగ మీకు ♦ కోరుచుండితిరేనిఁ చారులార
మీపూర్వరాజ్యంపు దాపుఁ గోరుచునుంటి ♦ రా మీరు మదిలోన రాజులార
మీపూర్వవర్తక మేపారగామీరు ♦ వాంఛింపుచుంటిరా వణిజులార
మీపూర్వసత్కృషి వ్యాపనోపాయంబు ♦ శోధించుచుంటిరా శూద్రులార
బ్రహ్మచర్య వ్రతావలంబనముతప్ప ♦ వేఱుమార్గంబు లేదయ్య విజ్ఞులార
పెద్దలెల్లరు యోజించి దిద్దవలయు ♦ వర్ణనియమప్రకార వినిర్ణయంబు ॥ 6.



# పద్మరహస్యము.

—— నాలుగవ ప్రకరణము—రాణిగంజ్. ——

ఇంతలో తలుపు తెరచుకొని సుముఖి యచట నిలబడినది. శాంత యామెనుచూచి సంతసముతో "డాక్టర్ బోస్‌గారిపుడే నుడివియున్నారు నాసోదరి పద్మ యపాయకరమగు వ్యాధిలోనై యున్నది. తనబిడ్డను పెంచుకొనగల స్థితి వచ్చునప్పటికి చాలకాలము పట్టును. కనుక యాబిడ్డను నీపోషణక్రింద నుంచుటకు నిశ్చయించితిమి." అని సుముఖితో ననెను. లోనికిపోయి వస్త్రములలో బసిగుడ్డును గొనివచ్చి "ఈపిల్లవానికి శశిభూషణుడని పేరుపెట్టవలసినది. పెద్దవాడగుచో నీపేరునుబట్టి గుర్తింపగలము. ఇందుకు నాకు కొన్ని కారణములు గలవు." యనెను. శాంత తడవూరకుండి "మేము రాణిగంజ్‌కి వెడలిన పిమ్మట మాసమున కొకపర్యాయము వచ్చి చూచుచుందుము. ఈలోపున డాక్టరు బోసు మహాశయుడు చూచుచుండును. పాలుపోసినా, నీరుపోసినా, భారము నీదే. ఎట్లు పెంచెదవో సుమా!" యనెను.

"మీబిడ్డకు భయములేదు. ఆ భారము నాపై నిడుడు." అని యాబిడ్డనుగైకొని సుముఖి బహిర్ద్వారము దాటెను. శాంత యామెను నెంబడించి బహిర్ద్వారమువద్ద నొక బ్యాంకునోటు నామెచేతిలో నుంచి "ఈ డబ్బుతో పిల్లవానికి వలయు సౌకర్యములను గావింపుము. కొలది కాలములో నింకను పంపెదను" అని యామె చెవిలో నింకనేమియో చెప్పి పంపివేసెను.

మూడువారములు గడచినవి. పద్మ వ్యాధి నయమై క్రమక్రమముగ కోలుకొనుచున్నది. ఈ వ్యాధిమూలమున నామెయొక్క స్వరూపము పూర్తిగ మారిపోయినది ఇపుడామె నానవాలు పెట్టుటయే బహుకష్టము. నిరంతర మామె యేదియో నాలోచించుకొనుచు, చిరునవ్వు, సంభాషణ యన నేమో యెరుగక కాలముగడుపుచుండెను. ఒకనాడు శాంతనుజూచి,

"అక్కయ్యా, నాబిడ్డను పాతిపెట్టబడిన స్థలమును నాకు చూపింపవా" యని యడిగెను.

"నీవు పూర్తిగ నారోగ్యము కలిగినపిమ్మట చూడవచ్చును. ఇంక పదునైదు దినములలో రాణిగంజ్‌కి పోవచ్చును. ఈ యుదంతము నంతను గడు రహస్యముగ నుంచవలెను సుమా!"

"ఆ విషయము నాకు దెలియును. నాకు బోధపడియున్నది"

"ఈ రహస్యమెచటనో యీపట్టణములో జరిగినది. దీనిని బయలుపడకుండ నుంచగలము. ఇచట మనల నెవ్వరు నెరుగరు. ఈ పట్టణమును వదిలితిమా, మన మిచటకెన్నడును రాము నీవు ప్రపంచములో తిరిగి తలయెత్తుకొనుటకు నావకాశమున్నది"

"అది సంభవమా? రహస్యముదాగునా?'

"సంభవము కాకేమి? ఇటువంటి రహస్యము లెన్ని దాగుటలేదు?"

"ఎప్పుడో యొకపుడిది బయల్పడునను భయము గలదు."

"అట్లు కానేరదు. డాక్టరుబోసు బహిరంగ పరచడు. ఈ యింటి యజమానురాలు మనల నెరుగనే యెరుగదు."

"నాదోషముయొక్క ఫలితము నేననుభవించుట న్యాయముకాదా? ఇపుడు రహస్యము దాచినను, ముందెన్నడైనను బయల్పడుచో--"

"అందుకు తగుయేర్పాట్లు చేసియున్నాను."

"నాబిడ్డడే బ్రతికియున్న యెడల?"

"ఏ అపాయము లేకుండ పెంచి పోషించు భారము నాది."

"భూదేవి రహస్యమును మ్రింగి వేయగలదా? ఆకులు చప్పుడైనను, గాలి రివ్వుమని వీచినను, నన్ను వెంబడించి నానేరములు బయల్పెట్ట యత్నించుచున్నట్లు తోచుచున్నది."

"మనోధైర్యములేక కలిగిన భ్రమ కాని వేరుకాదు."

ఈ రహస్యము బయల్పడగూడదని శాంత కెన్నడును తోచలేదు. వేసవి గడచినది. ఆకు నారములయినవి. అక్కచెల్లెండ్రిద్దరు రాణిగంజ్ చేరుకొనిరి. ప్రయాణమునకు పూర్వము డాక్టరుబోసు చూడవచ్చెను.

డాక్టరు:- మీచెల్లెలికి బిడ్డడు బ్రతికియున్నట్లు తెల్పిరా?

శాంత:- లేదు. ఆరోగ్యము పూర్తిగ గలిగిన పిమ్మట దెలిపెదను.

డాక్టరు:- బిడ్డకెట్టి యేర్పాట్లు గావించిరి?

శాంత:- బిడ్డ పోషణకు వలయు డబ్బును నేను పంపుచుందును. కాని మీరీవిషయమును రహస్యముగ నుంచెదనని ప్రమాణము చేయవలెను.

డాక్టరు:- వైద్యులిట్టి రహస్యములు బయల్పరచినచో వృత్తి కొనసాగునా?

శాంత:- మీరు ప్రమాణము చేసినగాని నా యాందోళన సమసిపోజాలదు.

డాక్టరు:- అట్లయిన వినుడు. మీరుకాని మీ సోదరికాని కోరిన తప్ప, యీ రహస్యమును వెల్లడి చేయనని దైవసాక్షిగ ప్రమాణము చేయుచున్నాను.

బోసుయొక్క సహాయమునకు కృతజ్ఞతను వెలిబుచ్చి శాంత ధనము నొసంగదలచెను కాని డాక్టరు మహాశయుడు ధనమును తీసికొన నిరాకరించి, రాణిగంజ్ చేరినపిమ్మట సుఖముగ జేరినట్లు జాబు వ్రాయకోరి సెలవు పుచ్చుకొని వెడలిపోయెను.

తరువాత శాంత పద్మలు స్వగ్రామము చేరుకొనిరి, రాణిగంజ్‌లోని యావదాస్తిని విక్రయించుకొని కాన్పూరులో నివాస మొనర్చుకొన దలచిరి. డాక్టరుబోస్ సుముఖి సంరక్షణ క్రింద నున్న బిడ్డను జూడవలెనని యొకటి రెండు పర్యాయములు ప్రయత్నించెను, కాని సుముఖి యానగరమును వీడి యెచటికో పోయెననియు, యెచటికి పోయినది యెవరికి దెలియదనియు గ్రహించెను. పోస్టులో జాబు వేసిన జవాబు రాగలదేమోయని యూహించి సుముఖికి పాత చిరునామాకు జాబు వ్రాసెను కాని యాజాబు తిరిగి వచ్చెను.

## అయిదవ ప్రకరణము - వసంతవిలాసము.

కలకత్తాలో వసంతవిలాసము చాల గొప్ప భవనము. సౌందర్యమునందుగాని, పరిమాణమునందుగాని దానినిబోలు భవనములు గానరావు. అది చరిత్రప్రసిద్ధమైనది. ఆయింటి యజమాను

ల కనాదినుండియు పేరుప్రతిష్టలు గలవు. ఆ యింటియజమానులు దయాదాక్షిణ్యముల కును, దానధర్మములకును, ఆచార వ్యవహారము లకును పేరెన్నికగన్నవారు. ఆ భవనమునకు ప్రస్తుతము యజమాని సుధీంద్రరాయలు. గొప్పవంశమునకు చెందినవాడగుటచేతను, వెతకి నను తప్పులు లేనివాడగుటచేతను, యిసుమంత గర్వము మాత్రము రాయల నావహించి యు న్నట్లు కన్పట్టును. ఆమాత్రము గర్వము లేనిచో కలియుగములో జీవితము గడచుట దుర్భరము కదా! సుధీంద్రరాయలు మితభాషి. అతని భావము లాతని హృదయమునం దిమిడియుం డును గాని పరులు గ్రహింపగల్గుట దుర్లభము. సుధీంద్రుడు రాయపుర సంస్థానాధీశుడు.

వసంతవిలాస నివాసులకు మూఢసాంప్రదాయములు కొన్ని గలవు. ప్రతిచెట్టునకును, ప్రతి పుట్టకును, ప్రతిగోడకును యేదియోగాథనాపాదించుచునేయుందురు. చీకటికోణ మేదియైన నున్న యెడల నందు దయ్యముగలదని భావింతురు. వసంతవిలాసమునకు పశ్చిమభాగమున డాబా గలదు. ఆడాబాపై వానకురియునపుడు రాళ్ళు పడిన శబ్దము కలిగినయెడల నా యింటి యజమాని కపాయము సంభవించితీరునను యొక మూఢసాంప్రదాయము కలదు ఇచటి స్త్రీలకు గూడ సహజ సౌందర్యమేకాని, తెచ్చిపెట్టు కొన్నది లేదు. సుధీంద్రరాయలకిరువ్వదియేండ్లు ఇంకనువివాహముకాలేదు. వివాహము చేసుకొనడని ప్రతీతి. కాని యాతని హృదయములోని భావమును తెలిసికొనగలవారెవరు?

సుధీంద్రరాయల కొక సోదరిమాత్రమే కలదు. ఆమెపేరు లలిత. మిక్కిలి సౌందర్యవతి. ఆమెను ప్రయాగలో వినయభూషణుడను బ్యారిష్టరునకిచ్చి వివాహము చేసిరి. సుధీంద్రరాయలు వివాహము చేసుకొననియెడల నాతని జమీందారీ యంతయు లలితకు సంక్రమించును. న్యాయస్థానములు సెలవులకు మూయబడుటచే లలితావినయభూషణులు వసంతవిలాసమునకు చూడవచ్చిరి. సుధీంద్రరాయలు గ్రామాంతరమునకుబోయి మూడుమాసములైనది. తన సోదరియు భావయు వసంతవిలాసమునకు వచ్చియుండుటను తెలిసికొనెను. కాని కార్యాంతరములచే రాజాలకపోయెను. ఒకనాడు వినయభూషణున కీక్రిందిజాబును తపాలాబంట్రోతు తెచ్చియిచ్చెను.



—• ఆరవప్రకరణము—జాబు •—

కాన్పూరు,
10—6—1907.

భావగారికి,

సుధీంద్రరాయలునమస్కారములు. మీరు వచ్చియున్నారని వినియుంటిని. వెంటనే రాజాలనందులకు చింతిల్లితిని. 15 వ తేది ఉదయం మెయిలులో కలకత్తా చేరుకొనెదను. మీ కందరకు కొత్తవార్త తెలుప సంతసమగుచున్నది. మీకందరకాశ్చర్యమును గలుగజేయువచ్చును. ఇచట నాకు వివాహమైనది. తలవని తలంపుగా వివాహమగుటచే బంధువుల నాహ్వానించుటకు సావకాశము చిక్కలేదు. నేను నా వెంట నాసతీమణినిగూడ దోడ్కొని వచ్చుచున్నాను.

ఇట్లు,
సుధీంద్రరాయలు.

వినయభూషణు డీజాబును లలితకు జదివి యీదినమే భావగారు వచ్చునదనెను. ఆపె హృదయములో రాయి పడినట్లాయెనని. ఇంత కాల మేయాస్తి తనకు సంక్రమించునని యువ్విళ్ళూరుచున్నదో, ఆయాస్తి రాగల యవకాశము లన్నియు పోయినవి. సుధీంద్రరావుగారు వివాహము చేసికొనెనను వార్తను వినిన లలితకు రోషద్వేషములు ప్రజ్వరిల్లినవి. వినయభూషణుడు తనయర్ధాంగి ముఖలక్షణములను వీక్షించి చిరునవ్వు నవ్వెను.

లలిత:- మీరేమి ? మీరు నవ్వెదరు

వినయ:- నవ్వక చేయునదేమి ?

లలిత:- నేను అనుకొంటూనేయున్నాను. ఈయింటికేదో ముప్పురానున్నది. నిన్న సాయంకాలము వాన కురియుట మీరెరుగుదురు గదా! అపుడు వినబడిన రాళ్ళ శబ్దమును గమనించితిరా! ఈయింటికేదో ముప్పురానున్నది. ఇవన్ని భ్రమలుగా మీరు తలచెదరు కాబోలు.

విన:- (నవ్వుచు) ఆడవాళ్లంతా యింతే ఒకరి చెడు నొకరు కోరుచుంటేనే గాని వారికి కాలము గడువదు. ఉగ్గుపాలతోనే యీ పాడుగుణ మబ్బుచున్నది.

లలిత:- రాబోయే వదినెగారికి కీడు కోరుటలేదు కాని యిందేదో మర్మమున్నదని నాదృఢ నమ్మకము.

విన:- ఉంటే మనకేమి ?

లలిత:- రాబోయే ఆస్తికిది యాటంకము కాదా.

విన:- ఏమిధోరణి? ఎవరయినా వింటే యేమవుతుంది ?

లలిత:- ఎవరైనా వింటుండగా అననే అనను. కొంతకాలమైతే అంతా మీకే తెలుస్తుంది.

విన:- టష్ ఆగుము. అదేదో బండి చప్పుడైనది భావగారు వచ్చినట్లున్నది.

## —♦ ఏడవప్రకరణము - దంపతులు. ♦—

వసంతవిలాసపు టావరణమునందు మామిడి చెట్లు బారులుదీర్చియున్నవి. ఈ వృక్షములాదిత్యసారథమునకు వన్నె దెచ్చుచున్నవి. అవి యెన్ని సంవత్సరములనుండి యుండునున్నవో యెవరికిని దెలియదు. వసంతవిలాసమును కాపాడు రక్షకభటులవలె వెలయుచున్నవి. ఈ నూతన దంపతుల బంధువులును మిత్రులును యాహ్వానించి సత్కరించిరి. సుధీంద్రుడు తన సతీమణితో వసంతవిలాసమున నడుగుపెట్టినది మొదలు నాభవనమునకొక నూతనశోభగ మలవడెను. నూతనగృహయజమానురాలిని, ధనమునందును గౌరవమునందును అగ్రస్థానము నధిష్టించియున్న సుధీంద్రుని యర్ధాంగిని, జూడ నగరమునందలి పరిచయముగలయావన్మందియు వచ్చిపోవుచుండిరి సౌందర్యమునకును సుగుణములకును నిలయముగు నాగృహయజమానురాలిని గాంచి, సుధీంద్రుని యదృష్టమును వేనోళ్ళ గొనియాడిరి. రోషద్వేషపూరితముగు లలితయు, ప్రపంచమునంతను నిర్లక్ష్యముగ జూచు వినయభూషణుడును, ప్రపంచము నిందించుననుభయముతో నూతన దంపతులకు స్వాగతమొసంగి వేడుకల నతివైభవముతో జరిపిరి.

పూర్ణిమనాటి రాత్రి దంపతులిరువురును నా మామిడిగున్నల నడుమ విహరించుచు సరససల్లాపములనాడుకొనుచుండిరి. ఇంతలో నొకపెద్దగాలి వీచి యాకస్మికముగ నాగిపోయెను. అంతట నా

మామిగున్నల యాకులలోనుంచి సణుగుడు శబ్దము వినవచ్చెను. సుధీంద్రుడు తన దృష్టినంతను నిగుడ్చి యందెవరైన నుంటిరేమోయని యిటు నటుజూచెను. కాని యెవరును కానరారైరి. అంత వానికి చీకాకు జనించినది. దీనికి గారణము లేకపోదు. వసంతవిలాసమునకు సంబంధించిన మరియొక గాధకలదు. ఏనాడు కొనుగాలి వీచి యాకస్మికముగ నాగినపుడు మామిగున్నల యాకుల నుండి సణుగుడు శబ్దము వినబడునో, యానాటి నుండి వసంతవిలాసమునకు దుష్కాలప్రారంభ మగునని ప్రతీతిగలదు. ఇందువలననే సుధీంద్రుడు ఉద్విగ్నుడైనది. ఈ విషయమును తన హృదయేశ్వరి కెరుకపరచినచో నామె వ్యాకులత జెందునని యందులకు సాహసింపలేదు.

సుధీం;- పద్మా, వసంతవిలాసము నీకు నచ్చినదా?

పద్మ;- వసంతవిలాస మింతగనుండునని కలనైన భావించలేదు కేవలము స్వర్గతుల్యముగ నున్నది

సుధీ ;- దానికి నీసౌందర్యము మెఱుగుబెట్టు చున్నది సుమా!

పద్మ సిగ్గున తలవాల్చినది. ఇంతలో లలిత యచ్చోట కేతెంచినది "లలితా, రమ్మ్మ"యని సుధీంద్రుడు సాదరముగ బిలిచి సంభాషించెను.

లలిత;- అన్నయ్యా, నాలుగు దినములక్రింద సాయంకాలము శుభవర్షము గురియుచుండ రాళ్ళచప్పుడు వినవచ్చినదని ఇవుడీమామిడి చెట్లనుండి వచ్చిన సణుగుడు శబ్దము వింటివి కదా! నాకేమో భయమగుచున్నది. నిన్ను చూచి మావదినెను జూచి ముచ్చట పడుచుండ, యీమహోపద్రవ మేమిటి?

పద్మ;- పరిశయమేమిటి, వదినా మీరంత భయ పడవలసిన యావశ్యకమేమి కలిగినది.

అంతట లలిత వసంతవిలాసమునకు సంబంధించిన గాధలనన్నిటిని సవిస్తరముగ వివరించెను. ఆత్మసంశోధన గావించుకొనుచున్నదాని వలె పద్మ ఆలోచనమగ్నమానస యయ్యెను సుధీంద్రుని కీ యుదంతము రుచించలేదు. అమాయకురాలు సుకుమారియగు పద్మ మనస్సును కలవరపరచుట కాతని కిష్టములేదు. అయినను పోకచేసియు సన్నజాలకు మౌనముగ మారకుండెను. పద్మయొక్క చిత్తవర్తనమును తీక్షణదృక్కులతో వీక్షించుచున్న లలిత "పద్మ జీవితము నందేమియో రహస్య ముండవలెను. లేనియెడల నీగాధలకు భయపడనేల?" యని తనలో తాననుకొనియెను.



——ఎనిమిదవ ప్రకరణము - కార్యాచరణము——

"నాకొక క్రొత్తపుస్తకము కావలెను"

"నాకూ కావలెను" అని మరియొకరనెను.

"అమ్మ నాకు ముందుకొనిపెట్టానన్నది"

"నేను పెద్దవాడిని—నాకు ముందు కొనిపెట్టుంది."

"నాపుస్తకము పూర్తి అయింది. నీదింకా పూర్తికాలేదు. అపుడే క్రొత్తపుస్తకమెందుకు?"

"కాకపోతేయే? పెద్దవాడిని గనుక ముందు నాకే కావాలి"

కంఠధ్వనులు పెద్దవైనవి. పరుషభాషణములు మితిమీరినవి. గృద్దులలోనికి దిగెడివారే కాని యచట నొక స్త్రీ ప్రత్యక్షమగుటచే వారి

కలహాముననెంతరాయముకలిగినది. ఆ స్త్రీ మనకు చిరపరిచితురాలగు సుముఖియే.

అది ఉదయము. రంగము భావనగరమున నొక చిన్న భవనము. ఆరు సంవత్సరములకు బూర్వ మిచట నొక వితంతు విరువురు పిల్లలతో బ్రవేశించినది. వారిలో పెద్దవానియందు మోటు దన మెక్కువగ గాన్పించును. ఆ మోటు దనమునకు దగినట్లు పెద్దగొంతుకకలదు. వాని పేరు కాళీచరణుడు. కాళీచరణునిజూచి తక్కిన పిల్లలందరు భయపడుచుండెడివారు. పిల్లులు కుక్కలమీద రాళ్లురువ్వుట, తోటలలోని చెట్ల కొమ్మలు విరిచి పాడుచేయుట, మున్నగు దుండగకార్యము లీతనికి నిత్యకృత్యములు. తోడిపిల్లల నందరను తుంటరులుగ జేసివైచెను. తమ తమ పిల్లల నందరు నాటలకు బంపునపుడు "కాళీ వద్దకు పోవలదు" అని తల్లులు కోపపడుచుండెడి వారు. కాళీచరణునకు స్వార్థపరత్వ మధికము. మంచివస్తువుల నన్నింటిని దనకే కావలెనని పోరాడుచుండెడివాడు. పెద్దవాడైనయెడల ఏబంది పోటుదారుగనో సంచరించునని ప్రజలనుకొనుచుండెడివారు.

రెండవవాని పేరు శశిభూషణుడు. శశిభూషణ కాళీచరణులకు రూపమునందును గుణములందును హస్తిమశకాంతర భేదము గలదు. శశిభూషణుడు వయస్సున నొక యేడాది చిన్న. కాళీచరణుని యందెంత మోటుతనము గలదో శశిభూషణునియందంత సుకుమారత కలదు. వీరిరువురును నాయూరనున్న పాఠశాలయందు జదువుచుండిరి. భర్త రైల్వే గార్డుగ పనిచేసి, యొకానొక ప్రమాదమున చనిపోయినపిమ్మట నధికారులిచ్చుచున్న కొలది పాటి పింఛనుతో కాలము గడుపుచు సుముఖి తన ఇర్వురు పిల్లల బెంచి పోషించుకొనుచుండెను. ఒకనాడా యిరువురు బాలురకును జరుగుచున్న పోరాటమును పైనచదివియుంటిమి.

కాళీ:- నే నెన్ని పర్యాయము లడిగినను యే వస్తువైనా అమ్మ యియ్యనే యియ్యదు. శశిభూషణుడు కావలెనన్నచో వెంటనే యిచ్చివేయును. ఈ బేధ మెందుకో అమ్మను అడిగి చూచెదను. అని తల్లిని సమీపించి అడిగెను కాని ఆమె ఏమియు ప్రత్యుత్తర మియ్యలేదు. ఒకనాడు కాళీచరణుడు తల్లి నిట్లు ప్రశ్నించెను. "అమ్మా యిచట ఎంత కాలమునుండి యుండి యుంటివి"

"ఆరు సంవత్సరములనుండి"

"అంతకు బూర్వము?"

"ఎక్కడుంటే యిపుడెందుకు? నీవు పోయి పాఠములు చదువుకో"

"నాకెందుకా? తామెక్కడ పుట్టి పెరిగినారో అందరు తెలుసుకుంటూనే ఉంటారు. నే నెక్కడ పుట్టి పెరిగినానో నాపుట్టుపూర్వోత్తరము లేమిటో తెలిసికొనకూడదా" అని కాళీచరణుడు లోలోన నణుగుకొనెను. కాని ప్రత్యుత్తర మెన్నటికిని బడయ లేదు.

---

—♦ తొమ్మిదవ ప్రకరణము - సంశయ తరంగములు ♦—

మూడు సంవత్సరములు గడచినవి. బాలు లిరువురును పెరిగి పెద్దవారగుచుండిరి. ఇరువురి జీవితములందును రహస్యమేదియో కలదు. తన పుట్టుపూర్వోత్తరములను గురించి తన తల్లి తనకెందులకు చెప్పదనియు, తనకును శశిభూషణు

నకు రూపమునందంత వ్యత్యాసమేల యుండ వలెననియు కాళీచరణుని సందేహము శశిభూషణునకును అతని పరిసరములకు అనుకూలత లేదు. శశిభూషణునకు పుస్తకములనిన ప్రేమ పాఠశాలయం దగ్రస్థానమీతనిదే. ఇతనికి త్వరలోనే కవిత్వలక్షణము లలవడెను. ప్రకృతి చిత్రమైనది. తల్లిముఖలక్షణములవీక్షించజాలని నిస్సహాయుడై స్నేహితులు లేక అనామకుడుగ సంచరించవలసివచ్చిన శశిభూషణునకు ప్రకృతి యే తల్లి. ఆప్రకృతియే నేడీతనికి గవిత్వలక్షణము లలవరచినది. ఇతడు మేధావి. ఇతని తెలివితేటల కెల్ల రాశ్చర్యపడుచుండెడివారు. తాను రచించిన పద్యములను సుముఖికి విని పించుచు నామెయొక్క మెప్పును పొందుచుండెడి వాడు.

కాలము గడచుచున్నది. ఒకనాడు తపాలా బంట్రోతు సుముఖి కొక జాబును దెచ్చి యిచ్చెను. కాళీచరణు డీసంగతి కనిపెట్టి జా బెచ్చటనుండి వచ్చినదని తల్లిని బ్రశ్నించెను.

స్వల్పపు టబద్ధములు కొందరు స్త్రీ లప్రయత్నముగ నుచ్చరించుచుందురు. ఉచ్చరించుటకు బూర్వ మాలోచించనైన యాలోచించరు. కాని సుముఖి యట్లు కాదు. ఆమెకు పాపభీతి మెండుగ కలదు. శశిభూషణునకు సంబంధించిన రహస్యము తప్ప సుముఖి జీవితమునందు మరియొక రహస్యము లేదు. అసత్యము పలుకుటకు వెనుకాడి "నాయనా, యీ జాబుతో నీకు నిమిత్తములేదు" అనెను. "ఇంకొక రహస్యమా! మరియొక యద్భుతమా!! ఆ జా బెచటనుండి వచ్చినదో నేనడుగకూడదు? ఇంకను రహస్యము లేమైన నున్నవేమో!" యని కాళీచరణుడు తల్లితో బిగ్గరగననెను. "అమ్మతో నింత కఠినముగ మాట్లాడవచ్చునా" యని శశిభూషణుడు మందలించినందున కాళీచరణుడు పిడికిలి చూపి బెదరించెను.

"సుముఖికి,

నీజాబు అందినది రేపురాత్రి 9, 10 గంటల మధ్య నియింటికి వచ్చెదను. పిల్లలను నిద్రపుచ్చుము. నీతో మాట్లాడవలసి యున్నది.

ఇట్లు,
శాం."

జాబు పెద్దదికాదు. అయినప్పటికిని ప్రాధాన్య విషయమం దిమిడియున్నది. కాళీచరణుడా రాత్రి నిద్రనటనచేసి, తల్లిచర్యల కనిపెట్టనుద్దేశించెను. "ఎవరైనా యీరాత్రి యిచటకు రావలె, లేదా అమ్మయైన నెచటికో బోవలె. చూచెదగాక" అని కృతనిశ్చయు డయ్యెను. కాళీచరణుడు జిత్తులమారి. సంకల్పించుకొన్న యెడల, బట్టుదలతో బనిచేయును. శశిభూషణుడు నిద్రబోయెను. కాళీచరణుడు నటించుచుండెను. అచటనున్నకిటికీ తెరువబడియున్నది. రాత్రి పదిగంటలవేళ తల్లియును మరియొక స్త్రీయును సంభాషించుచున్నటుల కనిపెట్టెను. ఆనూతనస్త్రీమనకు పరిచితురాలగు శాంతయే.

శాం:- నీ వొంటరిగనే యుంటివికద! పిల్లలు నిద్రపోయిరా?

సు:- ఇచట మరెవరును లేరు. ఇతరు లిచటకు వచ్చు మార్గములేదు. తలుపుకు తాళము బిగించి వచ్చితిని.

శాం:- మంచిపని చేసితివి. నన్నీ ప్రాంతమునందందరు నెరిగియుండుటచే దారిబోవువారెవరైన కనుగొని మన రహస్యములను వినవచ్చును.

సు:- మరేమియు భయములేదు.

శాం:- పిల్లవాని సుగుణము బాబు చేసినది లను గురించి వినినంపులకు సంతోషముగ నున్నది.

సు:- శశిభూషణుడు చాల చురుకైనవాడు, సుకుమారి, స్ఫురద్రూపి. ఈమధ్య పద్యములుకూడ వ్రాయనేర్చెనట.

శాం:- ఏమి! పద్యములువ్రాయునా!! వాటిని నాకు చూపవా? సుముఖి కొన్ని కాగితములను దెచ్చి శాంతకుజూప యామె యపరిమితానందమును బొందెను

శాం:- శశిని నీహస్తములలో నుంచినపిమ్మట, నింతవరకు గనులార చూడలేదు. కులాసాగా నుంటున్నాడా? ఏమైన ననుమానముతో సంచరించుచుండునా?

సు:- సుఖముగానే యున్నాడు. ఏయనుమానమునులేదు. నన్ను అమ్మాయని పిలచును

శాం:- రహస్యమును వెలిబుచ్చకుండ భద్రముగ నుంచితివా?

సు:- అందులకేమియు భయములేదు.

శాం:-సుముఖీ, అంతయు నీమీదనే యుంచితిని. నాచెల్లెలియొక్క రహస్యమును కనిపెట్టలేకపోతిని. ఆమెకుబూర్వము వివాహమైనది, యెవరిని పెండ్లాడినదికూడ నాకు తెలియనే తెలియదు నాకు తెలిసినదంతయు జరిగిన వృత్తాంతమే. శశి జన్మించినపుడు నాచెల్లెలు మరణావస్థయందుండెను. తనబిడ్డ మరణించెనని యామె యుద్దేశించెను. బిడ్డడు బ్రతికియున్నాడని తెలిపినచో నామె మరణించునని తెలువలేదు నీవు నిందించినను సరే, ఆమెక్షేమము కొరకే యీవిషయమును రహస్యముగా నుంచితిని. శశి బ్రతికియున్నట్లామెకు తెలియనే తెలియదు. ఆమెకేకొ నుండెన్నటికిని గూడ తెలియరాదు. నాచెల్లెలు పూర్వపు జీవితము మరచిపోయినది. దానికి సంతానముకూడ గలిగినది. ఇన్నిసంవత్సరముల నుంచి యీరహస్యమును కాపాడితిమి.

సు:- తల్లి జీవించియుండునప్పటికిని తెలియకపోవుట, చూడకపోవుట, సంభాషించకపోవుట, దుర్భరము.

శాం:- శశి కేకొరతయు నుండదు. చదువుకొనునంతవరకు చదువు చెప్పించెదను

సు:- ఇదంతయు నెట్లు నిర్వహింపబడునో తెలియకున్నది.

శాం:ప్రజలునీకొడుకుగనేభావించుచుండుటచే నిదియెట్లు సాధ్యమగుననియు నింతధన మెచటనుండి వచ్చుచున్నదనియుశంకింతురని తలచెదవు కాబోలు.

సు:- అవును. అవును. నాకొడుకే సందేహించుచున్నాడు.

శాం:- నాకు డబ్బు లక్ష్యముగాదు. రహస్యము కాపాడుటే ముఖ్యము. నీకొడుకుకు కావలసిన డబ్బుకు గూడ లోటు లేదు. నేను పంపుచుందును.

సు:- కాళీచరుడు సంశయించుచున్నాడు. వాని సంశయము పెరుగరాదు.

శాం:- నీ పుత్రుని కేవిద్య చెప్పించెదనో తెలుపుము. పాఠశాలలో రెండువేతనములున్నవి. ఒకటి శశికి లభించుచున్నదని వింటిని. ఇంకేమి కావలసినను లోటులేదు, నిన్ను నమ్ముచున్నాను సుమా!

(సశేషము)

# ఆంధ్ర భారతి

## మచిలీపట్టణము

సంపుటము 2 | అక్టోబరు 1927 | సంచిక ౭



## వాడుక భాష

భాషాప్రపంచములో మార్పు సహజము. ఆమార్పుయొక్క స్వరూపము నిర్ణయించుటలో భేదాభిప్రాయములున్నవి. పెద్ద పెద్ద పండితులు తలపట్లు పట్టుకునే యీరోజులలో వానిని విమర్శించుట కొంచెము సాహసమనిపించక మానదు.

"జయంతి" రెండవ సంచికలో సంపాదకులు వ్రాసిన వాడుక భాషా వ్యాసమునుచదివి యోచించితిమి. మరలచదివితిమి. మరల యోచించితిమి. వ్యాసము తమ వాదనను సమర్థించుకొనుటకు గావింపబడిన భగీరథ ప్రయత్నమువలె కాన్పించుచున్నది. సంపాదకులు పాటించిన గ్రామ్యభాష వాడుకభాషాభేదములతో మాకు నిమిత్తములేదు. వాడుకభాషయే గ్రంథములందు ప్రయోగానర్హమని భావించువారికి గ్రామ్యమనలే రుచించదుకదా! మార్పు సృష్టిలక్షణము గనుక యిటువంటి వాడుకభాషా ప్రయోగమునకు దిగినారమనుట సమంజసముగలేదు. భాషకు మార్పులేక బోదకాళ్లు వచ్చినవట! వాడుక భాషను ప్రయోగించి బోదకాలును సాగనిచ్చెదరట! భాషకు బోదకాళ్ళు వచ్చుటకు మూలకారణమేమో యోచింప వలసియున్నది. నియమములు తప్పించుట మార్పు కానేరదు. మన మెల్లర మభిలషింపవలసినవి కవులు తమసహజనైపుణ్యమును ప్రదర్శించు భావలక్షణములు కాని ఛందోబద్ధమగు లక్షణములుకావు. ఛందస్సుకులోబడే పెద్దన్న తిమ్మన్న భట్టుమూర్తి కృష్ణరాయలు మున్నగు మహనీయులు రచించిన కావ్యములు ప్రబంధములు నాచంద్రార్కము నిలచుటకు కారణములు వారు త్రొక్కిన వివిధ ప్రౌఢమార్గములే. భాషకు బోదకాలు పాశ్చాత్య సంస్కారముతో బయలుదేరినది. అనువాదములతో విజృంభించినది. ఎత్తివ్రాయుటతో హెచ్చుపెరిగినది.

వాడుకభాష గ్రాంథికభాష రెండును కావలసినవే. వాడుక మాటలలో భావములను వెల్లడిపరచెడిది వాడుకభాష. వాడుకమాటలలో దెలుపలేని భావములను స్ఫుటపరచే బాధ్యత గ్రాంథికభాషది. కానియీరెండిటియొక్క విలువ యవి ప్రయోగింపబడు స్థలముల ననుసరించి యేర్పడునని తెలిసికొనవలసియున్నది. మాట్లా

నకొనేటప్పుడు "అమ్మో, ఆవంకాయల నెన్ని తాసులముల కిచ్చెదవ"నిన "నీజిమ్మదియ్యా" తప్పదు. ఆవిధముగనే వ్రాతలోనికి వాడుక భాషా పదములు జొప్పించుటయు నసర్థకమే.

వాడుకభాష యనగా నెచటి వాడుకభాష? విశాఖపట్టణమువారి "వుల్లు లావైంది" అనువాక్యము కృష్ణాతీరమువారి కెంతయో వెగటుగ నుండ కమానదు అనంతపురప్రాంతములవారికి గంజాం విశాఖపట్నం మండలములవారి కారాకిల్లీలు రుచించవు. కృష్ణాగోదావరి మండలములవారి మిఠాకిల్లీలు గంజాం విశాఖపట్టణముల వారికి రుచించవు. ప్రతిగ్రంథములోను వాడుక భాషా పదములను (foot notes) గ చేర్చెయెడల, గ్రంథముకంటె టిప్పణము పెద్దదగును. ఏదయిన పుస్తకము చదువవలెననిన యాంధ్రదేశములో వాడుకయందున్న పదములనన్నిటి నవగాహన చేసికొని మరీ చదువవలెను. కవి తన భావములను వ్యక్తీకరించుటకు తన స్వతంత్ర మార్గము త్రొక్కవలెననేయెడల, నాకవియొక్క గ్రంథములను చదువుటకు బూర్వమాతని భాషను పఠనము చేయవలెను. ఈవిధముగ నాంధ్రదేశములో నుండు కవుల భాషలనన్నిటిని తెలుసుకొనులోపల యుగములు గడచిపోగలవు. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి యుపన్యాసము రక్తిగానుండుటకు గారణము వారు వాడుకభాష ప్రయోగించడమే. ఉపన్యాసములలో వారు వాడుకభాష యుపయోగించిరి. కాని వారిగ్రంథములలో నెచటనయిన నుపయోగించిరా?

ఇక వ్యక్తిత్వము కొరకనినయెడల ప్రత్యుత్తరమేలేదు. ఈపద్ధతులు త్రొక్కుటవలన వ్యక్తిత్వము నిలబడుటలేదు. స్వేచ్ఛను దుర్వినియోగముచేయుట యనిపించుకొనుచున్నది. ఇది యాంధ్రులకు సహజలక్షణమై పోయినది. అందువలననే మహాత్ముడు మనలను చివాట్లు పెట్టినది. చివాట్లను లక్ష్యము చేయకపోవుట కూడా మనవ్యక్తిత్వమే.

దొరలభాష యెందుకు నేర్చుకొనుచున్నాము? దొరలు మనప్రభువులు. మనకు నిర్బంధముగ నేర్పుచున్నారుకనుక. అయితే ఆంగ్లభాష నేర్పుచున్నారు, కాని లండనులో పుల్లయ్య మాట్లాడే భాషా, డబ్లిన్‌లో యల్లయ్య మాట్లాడే భాషా నేర్పుచున్నారా? రాజకీయము సారస్వతము, సాంఘికము సమిష్టిమీద నడువవలసినదేకాని వ్యక్తిమీద నడిపింప బ్రయత్నించుట వెఱ్ఱి. వ్యక్తిప్రాధాన్యత, సమిష్టిప్రాధాన్యత పాశ్చాత్యులు గుర్తెరిగినట్లు మనము గుర్తెరుగక, మన కనుకూలమైన వాటినే యవలంభించుచున్నాము. నేను కాళ్లతో నడవను, తలకాయతో దొర్లుతానంటే కాదనే మూర్ఖుడుండడు సాంఘిక శాస్త్రరహస్యమెరుగని కవికి విశాలహృదయము సున్న.

పద్యములకు గ్రాంధిక భాష, వచనమునకు వాడుకభాష కావలెననెడి వాదము సరియైనదికాదు. వాడుకభాషలో మాట్లాడుకొనునపుడు పేలవముగనుండు భావములను వ్రాతలోనికి మార్చి యున్నతపథమునకు దేవచ్చును. ఉన్నతపథమునకు దేబడని భావము లసహ్యకరములుగ నుండుననుటకు సందియము లేదు. వాడుకలోనుండే భావములయొక్క యతీతమైన యాంతర్యభావము గ్రాంధిక భాషలో నెవజల్లినట్లు మరియొక విధమున సాధ్యము కాదు. ఒక విధముగ చూచునెడల, పాకిపాటలలోనుండు ఉత్కృష్టభావములు పెక్క ఇప్పటి గ్రంథము

లలో గానరావు. అయినప్పటికిని వెంకిపాటలు పామరజనము సుదీర్ఘ్యైభించినట్లు, చదువుకొన్న వారి నుద్బోధించవు. గ్రాంథిక భాష యనిన కర్ణ కఠోరమైన పదములతో గూడినదికాదు. సులభ శైలిని రమ్యమార్గముల భావములను పరువు లెత్తించు పద్యములు పోతన్నగారి భాగవతము నందెన్నియో కలవు. ఈవిధముగనే గ్రాంథిక భాషలో వచనకావ్యములు పెక్కులు గలవు. వచనముకాని పద్యములుకాని గ్రాంథిక భాష లోనే వ్రాయబడవలయునని మావాదన. భాష నంతె సేకోన్ముఖములకు దెచ్చినవారమై, ఒకే భాష నుపయోగించువారి కొకేవిధమగు ప్రాధా న్యసూత్రములను నిర్దేశించినవారమై, అనవ సరమైన శ్రమ కలవరములను తొలగించినవార మగుదుము.

## ఆంధ్రవిశ్వవిద్యాలయము.

ఆంధ్రవిశ్వవిద్యాలయ పరిస్థితులు ఆంధ్ర స్వరూపమును వ్యక్తముచేయుచున్నవి. ప్రథమ మున శాసనసభలో కేంద్రస్థానములకయి వివి ధ ప్రాంతములవారు తమ తమ ప్రాంతములందు కేంద్రస్థానముల నెలకొల్పుటకయి యెంత ప్ర యత్నించినదియు నెల్లరకును దెలియును. ఆంధ్రు లలో ప్రతివాడును నాయకులే. ప్రతిపట్టణమును ముందుకురావలసినదే. అటువంటప్పుడు వివాద ములకంతుయెక్కడ? రాజమహేంద్ర వరం, విశాఖపట్టణం, విజయనగరం, బెజవాడ, గుం టూరు, అనంతపురం, అన్నిటికి కేంద్రస్థానములే కాక కార్యస్థానములుకూడ కావలసియున్నవి. అయితే, వీటినిర్ణయములో బరిగణింపవలసిన సూత్రము రాజకీయములోని కాకాలికమా (Opportunism) ధీమంతులకు ప్రతిభాశాలు రకుండవలసిన దూరదృష్టియా యనునది విచారణీయాంశము. రాజమహేంద్రవర పు కేంద్రస్థానమును దెచ్చి విజయవాడలో నెల కొల్పవలెనని వాదించెము. జస్టిస్‌పక్షపు నా యకులు నిర్దేశించినట్లుగ విజయవాడకు నాలు గవ కేంద్రమేల కొనసంగరాదో తెలియకున్నది. విజయవాడ చరిత్రప్రసిద్ధమైనది. ఆంధ్రదేశ మునకు మధ్యనున్నది. అటువంటి నగరమును, కాశీశ్వరరావుగారి “దురాశా” పీడితప్రయత్న మని యింకనేమేమియోయని, దూరాలోచన చేయక తూర్పుగోదావరి తుంగలోతొక్కవలెనని ప్రయత్నించుట పరిహాసాస్పదము. విజయవాడ పనికిరాక పోవచ్చును. తమ రాజమహేంద్ర వరమునకే కార్యస్థానము వచ్చునట్లేల ప్రయ త్నించకూడదు? అందులకు సీడెడ్ జిల్లాలవారను మతించరు కాబోలు. సీడెడ్ జిల్లాలవారనుమ తించని కారణమున రాజమహేంద్రవరమునకు రాదు గనుక విజయవాడకు రాకుండ యేమా యోపాయమో త్రొక్కుట తూర్పు గోదావరి వారికి న్యాయమని తోచినది. పిచ్చి కుదిరినది రోకలి తలకు చుట్టుమన్నట్లు, అనంతపురం దొర కినది. ఈపట్టణము చరిత్రప్రసిద్ధమూ కాదు. ఆంధ్రదేశమునకు నడుమనున్నదా, అదియును కాదు. ఆంధ్రదేశమునకు రెండు విశ్వవిద్యాలయ ములు కావలెను, ఒకటి ఉత్తరమునకు మరియొ కటి దక్షిణమునకు. ముందు దక్షిణమున కిచ్చినయెడల నీపర్యాయము ఉత్తరములో రాజమహేంద్రవరమునకు రావచ్చును, కనుక అనంతపురమునకు వోటు చేయండి యనుట యొక రాజకీయ యెత్తు. రాజకీయ యెత్తులతో, వోట్లతో, ప్రాతిపదిక సూత్రములను భన్నము

చేయుచున్నాము. ఒక విశ్వవిద్యాలయమునకే ధనములేక పెనుగులాడే ఆంధ్రదేశము రెండవ విశ్వవిద్యాలయము భరించుననుట వెర్రి. ఈవిశ్వ విద్యాలయపు గొడవ చెన్నపురిశాసనసభలోనికికూడ వచ్చినది. ఆంధ్రులు తమ తమ సమస్యలను పరిష్కరించుకొనజాలని యవ్యక్తులయి పోయినారు. "కాంగ్రెస్" వంటి పత్రిక యీకలవరమంతయు కాశేశ్వరరావుగారి దురాశా జనితమని వ్రాసి యుప్పొంగినది. రాజమహేంద్రవరమును సమర్థించువారి దురాశను మరచుచున్నది. శాసనసభయైనను దూర దృష్టితో, యోచించి తీర్మానింపవలసియున్నది

## జాయింటు పట్టాలు.

జాయింటుపట్టాదారులు వేర్వేరు వోటర్లుగ నుండుటకు సావకాశమున్నదా లేదా యను వాదము బయలుదేరినది. జాయింటు పట్టాదారులందరికట్టి హక్కులేదు. ప్రస్తుతనిబంధనలట్లు శాసించుచున్నవి. అయితే, భూమిపంచుకొని వేర్వేరు భుక్తములోనున్నపుడు పట్టావిడిపోనప్పటికి ప్రతిభూకామందు వోటరగుటకు సావకాశమున్నదని ప్రతివాదన సూచించుచున్నది. విభక్తమో అవిభక్తమో, పట్టా విడిపోనపుడు రూలుప్రకారము సావకాశములేదనియు, కావలసిన రూలు మార్చుకొనవలెననియు మొదటి వాదన సూచించుచున్నది. శాసనము శాసనమే. వాదన సమర్థనీయము. ఏది చెల్లవలెనో ప్రాజ్ఞులు నిర్ణయింపవలెనుగాక.

## అన్నపూర్ణాదేవి.

ఎంతోపుణ్యము చేసినకాని, యీ ప్రపంచములో ధన్యజీవితము బడయుట సాధ్యముకాదు. ధనము యశస్సు క్షణికములు. సత్యవ్రతము, దేశకార్యదీక్ష, విద్య, శీలము కలిసివచ్చుట యరుదు. దేశహిత కార్యములపట్ల భర్తలు చూపెడి త్యాగమునకు వెరపొంది నిరసించెడి భార్యలు పెక్కులుకలరు. భార్య విశాలహృదయమును సహింపనొల్లని భర్తలునుకలరు. ఇరువురేకీభవించినపిమ్మట, నిరాడంబర సేవ చేయుటయు దుర్లభమగుచున్నది. సృష్టివైచిత్ర్యమును దాటినవారు ధన్యులే. ఇందుకుదృష్టాంతము మాగంటి అన్నపూర్ణా దేవిగారి జీవితమే. మాగంటి బాపినీడుగారిని, వారిదేశసేవను యెరుగని యాంధ్రుడుండడు. వారికంటెముందు జాతీయరంగమున నూరికిదీక్షతో నిరాడంబరముగజీవితము గడపివేసిన వారిసతీమణి యన్నపూర్ణాదేవి ఆంధ్రదేశ నారీమణుల కాదర్శప్రాయమైనది. పక్వమునకు వచ్చినఫలమును త్రుంచివైచుట యెట్లు మానవనైజమో, సర్వవిధముల ధన్యత నొందిన జీవితమును త్రుంచివైచుట ఈశ్వరసంకల్పము. స్త్రీ ప్రపంచములో దేశహితకార్య దీక్షాదురంధరులరుదుగ నున్న నేడు ఆంధ్రదేశము అన్నపూర్ణాదేవిగారి మరణమువలన తీరని కొరత ననుభవించుచున్నది. ఇటువంటి యాంధ్ర నారీమణుల నొసంగ భగవంతుని ప్రార్థించుచు, శ్రీయుత బాపినీడు గారికి మాసానుభూతిని వెలిబుచ్చుచున్నారము.

# కవికుమారుడు

బూరెల వెంకటరమణయ్యగారు

కవికుమారునకిప్పుడిరువది నాలుగు వత్సరములు గడచినవి. ఆతనిది చామనచాయ శరీరము. ఆతఁడు మిగుల పొడుగుపాటి మానిసి గాఁడు; అట్లనిన బొట్టివాఁడునుగూడ గాఁడు. ఆతఁడెల్లప్పుడును దేశీయ వస్త్రములనే ధరించుచుండును. ఉత్తరీయమును వల్లెవాటుగా వైచికొను నభ్యాసము గలవాఁడతఁడు. ఆతని నీలకుంతలంబులు పరికుంచితంబులై యుండును. సర్వకాల సర్వావస్థలయందు నాతని ముఖసీమను మందహాస చంద్రికలు తాండవ మొనర్చుచుండును. ఆతఁడు మిత్రబృందముతో సభ్యతఁ గలిగి, మృదువచోరచనచే వారినానంద సాగరమున ముంచివైచుచుండును.

అట్లయ్యును నాతని యాంతరంగిక జీవనమును గుర్తించుట మానవమాత్రునకు కడుంగడు కష్టసాధ్యమగు కార్యము. ఆతని జీవితమంతయును రహస్య మేఘావృతమై గభీరమై, దుర్భేద్యముగ నుండును; దురూహ్యముగ నుండును. ఈయనంతవిశాల ప్రపంచమున, నసంఖ్యాకంబులగు జీవులకు నివాసస్థానమగు నీప్రపంచమున నాతనికి "నా" యనువారెవ్వరును లేరఁట! ఈప్రపంచమున నాతనికి సుఖమనుమాట లేదు. ప్రేమైకనిదానులగు వారుండినగదా సుఖము. ఏకాంతమున, దారుణాశాప్రకంపితాధరమునుండి, వేడినిట్టూర్పు గాడ్పులు విడుచుకొనుచు, చటులదుఃఖావి నిద్రాతిశయము వలన, కనుగొనల నుండి బాష్పముల్ గార్చుచు దినములను గడుపుకొనుచుండును. ఇంత పిన్న వయస్సున బంధుగులయందు భ్రాంతిని బారఁద్రోలి, అన్నపానీయముల యెడ నాశవీడి, భోగభాగ్యాళి యెడఁగల బుద్ధిమాని, పరమహంసల విధమున, బరగు టెందులకో?

నానుడి కతని మానసము సంక్షుభిత మాయెను. సంక్షుభితమై యిట్టి తన స్వాంతమునకు, శాంతి యెచటఁ గాంచవలెనని విశ్రాంతమునను, దేశదేశాలు తిరిగి వేసారినాఁడు. కాని యాతని మానసము శాంతిఁ గాంచలేదు. కావున దేశపరిభ్రమణమును చాలించి, స్వస్థలమును జేరుకొనినాఁడు. గృహమునకు వచ్చునప్పుడాతఁడు కన్నీటిదారలు, వేడి నిట్టూర్పులు, ప్రణయ వాయువులు, ఆనంద భవనములు, విహంగ రాజములు, కీమణిభ్య, హృదయబంధురులు, దారిద్ర్యష్టకేవి పీనశోకార్ద్రశోభమాభిలనైజ కరుణా ప్రభులు, మొదలుఁ గాఁగల కవితాసామగ్రిని సేకరించుకొని వచ్చినాఁడు.

ఈ దేశాటనానంతరము, కుమారకవి ప్రతి పత్రికయందును, నీతని ప్రేమ గీతములును, విషాదగీతములును, ప్రకృతి గీతములును, మృత్యు దేవతాహ్వాన గీతములును, నింక నెన్నియో పలు తెఱంగులగు గీతములు ప్రచురింపఁబడుచుండెడివి. మానవులకన్న నీతనికి పత్రికలే పరమ మిత్రములు కాఁజొచ్చినవి. 'పావన ప్రేమకే గతి పాలుపడుట, భ్రష్టమై పోయె జీవితప్రవాహవేగంబు', అను నదియే యాతని గీతికల సారాంశము (The burden of his song). ఎల్లప్పుడును, కవికుమారుని నోట నీపదములే వెలువడుచుండును.

ఈతని "ప్రేమగానము"ను వినినచో నీతని కొక ప్రియురాలున్నదనియే యూహింపవలెను. ఈతఁడెవ్వరికిని తన ప్రియురాని పేరును చెప్పఁడు. తన జీవిత సర్వస్వమువలెనయు నీతఁడామెకొఱకై ధారవోసియున్నాఁడు. ఆమెను అలలిత కోమల రుచిరభవ్య శృంగార దివ్యమూర్తిని' అబ్బ! ఎన్ని విశేషణములు! ఎంత గాఢానురాగము! యాతఁడు తన హృదయాంత

రాశీమున గాఢముగఁ జిత్రించుకొనియెను.

అంత గాఢముగ నీతనిచేఁ బ్రేమింపబడుఁ జిన్న కాంత యెవ్వతె? మానుషవ్యక్తియా? లేక, అమానుషవ్యక్తియా? ఇందే రహస్యమంతయు నిమిడి యున్నది. ఈవిషయమును దెలిసికొనుట కాధారములాతని గీతములు. శోక వైకల్యమువీడి భవదనంత విశాలగర్భంబునందు శాశ్వత సుషుప్తి నొనగూర్చి సౌఖ్యమిచ్చి పాకగాని నీకును జాలమేల? కౌగిలించిరమ్ము ప్రేయసీ! యని దీనాతిదీనముగ బ్రార్థించుచుండెనే, అట్లయిన మృత్యుదేవియే యాతని ప్రియురాలా యేమి? ఆమెయే కానిచో నీతఁడేల నామెను ముద్దులొలుకు పలుకులఁబిలుచుచు, ఎన్నటికి నయిన దయరాద యిందువదన? యనుచుండును? — ఔ నాతండు మృత్యుదేవతనే ప్రేమించియుండును. మృత్యుదేవత యిచ్చుసుఖము శాశ్వతము. అది నిర్వాణపదవి. మోక్షప్రదాతయగు గుహుఁడైనను నట్టి సౌఖ్యము నీయఁజాలఁడు. మృత్యుదేవత యిచ్చెడు సుఖమునకు కాషాయ వస్త్రధారణము, కమండలములు, శిరోజఖండనములు, "ఫలపవనాంబుభోజన శుభవ్రతవృత్తులు", మొదలగునవి యనావశ్యకములు. కాని యీ సౌఖ్యము ననుభవింపఁబోవునపుడు కాళ్ళు పీకకపోవు. కవి సమార్యుఁడ జ్ఞానియయినను లక్ష్యముచేయఁడు. అపుడుకూడ నాతనికి ఆనంతము మెండగును. దుఃఖబాష్పప్రవాహములనుండి యీడుకొనిపోవుచుంటిని; దానిని తన్నుఁదానను తయించుకొనగలఁడు.

కవికుమారుఁడు ప్రియురాలి ముంగురులసొబగునకచ్చెరువంది, జుమ్ముజుమ్మని తుమ్మెపై నెమ్మెఁగమ్ము తుమ్మెదల జుమ్ము నెగజిమ్ము వమ్మెనర్చు కుటిలకుంతలజాలంబు నిటలసీమ, అభినవాంభోద లీల, దాండవమొనర్చుయుని పాడుచుండునే. ఇనుపగడియలవంటి చేతులుఁగల మృత్యుదేవతకు తుమ్మెదలవంటి ముంగురులా! అట్టియిన వాటిని ముద్దుబెట్టుకొనుటకీతనికి జంకెందులకో? జంకి దుఃఖించు చెందు లకో? దుఃఖించి నిజముల నామెను. బిలచినెందులకో? ఆమెను గూర్చి "చిరు చెమట నించుకించుక చమ్మగిల్ల, ప్రణయ భానూదయంబునా ప్రజ్వరిల్లు, పూజ్యమగునట్టి కుంకుమ బొట్టు తనర" యని యనుచుండునే. మృత్యుదేవతకు కుంకుమ బొట్టా! "రమ్యసుస్నిగ్ధ ధవళాంబరంబుఁదాల్చి, హస్తపద్మంబునందొక పుస్తకము దనర" అని ప్రియురాలిని వర్ణించుచుండునే. మృత్యుదేవతకు ధవళాంబరంబా! పుస్తకమా! కానిచో నీతని ప్రియురాలు మానవ వ్యక్తియా యేమి?— యేమో. ఎట్లు తెలియఁగలదు. కవి హృదయము గూఢముగదా!

ఆతని ప్రియురాలెవ్వరయిననేమి. సర్వదా యామెకొఱకయి బాష్పకణముల రాల్చుచుండును. "వేదనోదగ్రమగు నాతని రోదనమును విని సహింపగలేక" యాతని "ననుసరించి, శాంతగంభీర శర్వరీసమయమందు, గోలుమని యేడ్చుకీచురాల్ గొంతునెత్తి". ఆమెను దలంచుచు, రాత్రుల నిదురలేక, ఒంటిగా "బాన్పుపైఁ గూరుచుండి సహజ ధైర్య మెడలంగ మిక్కిలి దైన్యవృత్తి.....ఏడ్చుచుండును వెక్కి వెక్కి". మఱియు "జాఱఁగాఁ గారు కన్నీటి జాలు చీర, చెఱఁగుతో నొత్తి ప్రియమున చెంతఁ జేర్చి, ఊరడించెడువార లెవ్వారు నన్ను" అని విలపించుచు శయ్యాతలమును కన్నీటి బిందువులచే తడిపివైచుచుండును. పలు

ప్రేమించునో. అట్టియెడ యెట్లు స్వచ్ఛమగు ప్రేమయగు?

ఎంత తపించుచున్నను కవికుమారునకు ప్రియురాలు లభ్యము కాకున్నది. ఎంతపిలిచినను రాకున్నది. ఈ జీవితమున పాపమాతనికి సౌఖ్యమే లేదు. కష్టములననుభవించుటకే గాక, సుఖములఁ జవిచూచుటకు నేఁబుట్టుట లేదనుకొనెఁడు. కష్టములలోననే సుఖముండును, దుఃఖములలోనే సుఖముండును, పీడవులోనే యానందముండును, అని పలుమార్లనుచుండును. "శాంతి లేని ప్రేమ" యనును. జీవితమునకు వలసినది ప్రేమయనుచుండును కాని యీతని వెఱ్ఱివేదాంతమీతనికే సుబోధకమగును; గాని, యితరులకెట్లు తెలియును

ఆంధ్ర వాఙ్మయప్రపంచమున పత్రికాభివృద్ధియు, పత్రికాప్రచారమును విరివిగా సాగుచున్న యీ కాలమున, కవికుమారుని గీతమాలికల సంఖ్య మిక్కిలి యగుచున్నది. "ప్రేమగానము" వృద్ధిగాంచుచున్నది. ఇంతకును యెవ్వరికయి తన జీవితమును ధారపోయుచున్నాఁడో, ఎవరికై యంత విచార సాగరమునఁబడి దరిగానకున్నాఁడో ఆమె యొక సామాన్యస్త్రీ సామాన్యయగుటచేతనే యీతని కంతసులభముగ లభ్యము కాకయున్నది. ఆమె పిలుచుటతోడనే వచ్చునా? ఆమెకందరును సమానులే. అందరనామె తృప్తి పఱుపవలయును. ఆమెకు కొన్ని నియమిత కాలములున్నవి. ఆ కాలమందుననే యామెయు వారిని చేరును. సమయముఁ జూచుకొని కవికుమారునిఁగూడ తప్పక వరించును. ఆ ప్రణయదేవతా పరిష్వంగనా సౌఖ్యమాతనికబ్బుటకు పూర్వమే యాతని విషాద గీతికలొక పుస్తక రూపమును దాల్చి, పాఠకులకు విచారముఁ గలుగఁజేసి, కీచురాళ్ళతో పాటు వారిని గూడ రోదనేయవలయునని కోరునేమొ!

ఓం శాంతిశ్శాంతిః. సంపూర్ణమ్.

## ప్రభాతము

గీ. తూర్పు తెలవాఱు చుండె నిద్దురను వీడి;
రాజమందిర మంగళారావములకు
నావిర్భాతోత్సవముఁ గాంచ నభిలషించి
పుర బహిర్భాగమున కన్ను దెఱచి వాఁడ
మహిమఘనుఁడై గోపాలమస్తకంబుఁ
గప్పుకొనియున్న నల్లని గుప్పటంబు
పొట్టపై దట్టఁ దొలఁగించి మొగము మీఁదఁ
బిమ్మటఁ గ్రమ్మఱ కపముగ సాంత మ్ముఁ దీయు
చున్న కాంతి; రాత్రి మాసికొన్న యష్ట
దిగ్గజాబ్జ మల్లలన తెఱచుచున్న
యట్లు నిన్న సాయంకాలమందు నొడ్డఁ
బడిన నిద్దుర యయ్యులందుఁ బడియు నెటులొ!
వాని దెబ్బచుక ప్రాణులు పఱువఁజూచి
కాలపురుషుండు తెల్లమొగంబు పెట్టి
వలనుగరములతో మెల్ల మెలఁగ లాగు
కొనుచునున్న తెఱంగునఁ; గనఁగఁ బ్రకృతి
మూర్ఛఁ దేఱుచు నున్నట్లు; పోవుచుండెఁ
దమము; వ్యాపించు చుండెను ధవళకాంతి
దృష్టిఫలమును గాంచక దిక్కు గనక
పరితపించు ప్రాణుల కండ్ల కలవు దీఱ
ముద్దులను మూటగట్టెడు మూర్తితోడ
దయను శైలంబు పయి సూర్యుఁ డుదయమందె

బ్రత్యూషమునం బ్రొంతవడుచున్న ప్రకృతికెల్లఁ
గుందనపుఁబూఁతఁ బూసి క్రొంగ్రొత్తఁజేయ,
గిరణములకుంచెఁ గైకొని యురుగుదెంచు
చుండె మెలమెల్లనతఁడు నేత్రోత్సవముగ ౩
చిన్న చిన్న మొగిళ్ళను జీల్చికొనుచు
మేటిమింటి యెడారిని దాఁటికొనుచుఁ
బర్వతంబులపై కెగఁబ్రాఁకుకొనుచుఁ
బచ్చికబయళ్ళఁ బేరెంబు వాఱుకొనుచు
నెల్ల చెఱువుల నదులను నీఁదుకొనుచుఁ
జెట్ల యాకులకును సందు చేసికొనుచు
బాల భానుని కిరణముల్ వచ్చివచ్చి
దారిప్రక్కను జెట్లక్రిందటఁ బరున్న
భిక్షువులబిడ్డలను ముద్దు పెట్టుకొనుచు,
మాటలాడుచు, నవ్వించు, చాటలాడు,
చయ్యాయి రహస్యములు చెప్పి, చాల్మసదన
ములకు రమ్మని పిలుచుచుఁ బూర్ణమైత్రిఁ
జూపుచున్నట్టు లున్నవి చూడఁజూడ ౮
తమకుఁ గడచిన రాత్రి యందఱకుఁ గలిగి
నట్టి గండంబు దప్పిన దనుచు దరులు
హిమకణాశ్రులు రాల్చుచుఁ గొమలుసాచి
కౌఁగిలింప నొండొరుల దగ్గరకుఁ బిలుచు
పోల్కిఁ గూండ్లగూయుచును బేఁబులుగుపింఛ
ప్రకృతి సతిరత్నభూషణవ్రజము వోలె
నలరు పువ్వులు తళతళ లాడుచుండె
రేయిఁ గన్నులు గానక చేయు లేక
పయనమును దీర యుల సరోవరములందుఁ
బండుకొని లేచి నిద్దుర బద్ధకమునఁ
దడబడుచు బిల్లవాయువుల్ నడచుచుండె
నప్పుడే రంగుపూసిన యట్లు నేల
పచ్చికలచేత నిగనిగల్ వఱపుచుండె.
గొలుచునెల్ల యచేతనంబులు సచేత
నములువలె జీవకళలతో నమరుచుండె
ఆ ప్రభాతమునందలి యా ప్రకృతినిఁ
గాంచఁగా నాకుఁ బదివేలు గన్నులున్నఁ
జాలుననుకొంటిఁ గాని నిశ్చయముగాను
జాలునో! చాలవో? యొకవేళ నున్న
స్ఫటికములువోలెఁ దెల్లని జలముతోడఁ
బాఱుచున్న యచ్చటి కొండవాఁగునందు
గాల్యకృత్యముల్ తీర్చి భాస్కరున కర్ఘ్య
మిచ్చి మఱలితి నంతట నింటివైపు.

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

పూడిపెద్ది వెంకటరమణయ్య

1

ప్రకృతిసౌందర్యపట పరంపరలఁ జూచి
పారవశ్యాన గళమెత్తి పాడికొనఁగ
రాగమేలను? గానశాస్త్రమ్ము లేల?
శ్రుతుల కలయికలును తాళగతులు నేల?

2

ప్రణయరాగాన జగము సర్వమ్ము మఱచి
యతివ నెమ్మోము వత్తాన నదిమికొనఁగ
సున్నితము లేల? పలుకుల సొగసు లేల?
తళుకు లేలను? రూపసౌందర్య మేల?

3

పొంగివచ్చెడు దుఃఖానఁ గరఁగిపోయి
భోరు భోరున నేడ్చివాపోవ వన్నె
చిన్నె లేలను? శబ్దవిశేష మేల?
నేర్పు లేలను? పదముల పేర్పు లేల?

4

భక్తిమై మేనుమఱచి నీపాదయుగము
నాశ్రయించి సుఖింప నో యబ్జవదన!
బాహ్యవేషమ్ము లేల? తత్త్వమ్ము లేల?
భాగవత మేల? త్యాగయ్య పాట లేల?

# వివిధ విషయములు

## ఆవేశము.

క్షవరము చేయించుకొనుచున్నపుడు పురుషులాగ్రిహావేశములు చెందుదురట. మెదడులో నాగ్రిహావేశములకు సంబంధించిన కేంద్రస్థానముకలదట. ఈస్థానమునకును ముఖముననుండి నాడులకును (nerves) సంబంధముండుట వలన నిది సంభవించుచున్నదని శాస్త్రజ్ఞులు కనిపెట్టిరట.

## లెజిస్లేటివ్ ఎస్సెంబ్లీ.

జర్మనీదేశస్థుడగు ఫ్రాంజ్ జోసెఫ్ ఫర్టువాంగ్లర్ గారు మన సామ్రాజ్య శాసనసభను గురించి యీక్రింది విధముగ వ్రాసియున్నారు :-

సామ్రాజ్య శాసన సభ్యులు హాజరైన ప్రతి దినమునకు యిరువై రూపాయలు తీసికొందురు. ఈభత్యము కాక ప్రయాణపుఖర్చులు ముట్టును. ప్రపంచములో గొప్ప సభ యని చెప్పుకొనబడుచున్నప్పటికి, సామ్రాజ్య శాసన సభకు అధికారము స్వల్పము. లెజస్లేటివ్ అస్సెంబ్లీ అను పదము డాబుగనే యున్నది. వైస్రాయి తలంపు శాసనమగుచున్న దేశములో, ప్రజా ప్రతినిధి సభ యనిపించుకొనజాలదు.

ఇది యొక డిబేటింగ్ సొసయిటీ వంటిది. గవర్నమెంటు ఉద్యోగస్తులు, గవర్నమెంటుచే నియమింపబడిన సభ్యులు కలిసి మొత్తం 140 నియోజిత సభ్యులలో 15 మంది ఆయా వ్యాపారస్థులై యున్నారు. జోషీగారొక్కరే కార్మిక ప్రతినిధి. ఈసభ్యుల నెన్నుకొను వోటరుకు రాబడి సాలుకు రెండు వేలుండవలెను. అందువలన పాటకపు పనివాండ్రకు నియోజకు హక్కు లేదు.

## జ్ఞాపక శక్తి.

జంతువులకు జ్ఞాపక శక్తి కలదాయని ఫ్రాన్సుదేశములో నొక సంఘమువారు చర్చించి తీర్మానమును వోటుకు పెట్టగా ఉన్నదను వారు 8 మందిని లేదనువారు 5 గురు అగుటవలన జంతువులకు జ్ఞాపక శక్తి యున్నదని సిద్ధాంతీకరించిరట!

## మోటారుప్రమాదములు

కాన్‌స్టాంటినోపిలునగరమందు మోటారు ప్రమాదము జరుగకుండ నుండుటకు గాను మూగవారు ఎర్రపట్టీలను, చెవిటివారు పసుపు రంగు పట్టీలను, గుడ్డివారు తెల్లపట్టీలను తగిలించుకొనవలెనను నియామకము చేయబడినది.

## డైవోర్సులు

బ్రిటనులో జరిగిన నూరు వివాహములకు ఒక్క వివాహము వరకున డైవోర్సు చేయబడుచున్నది. డైవోర్సు పొందిన పురుషులలో ముగ్గురకు యిద్దరువంతున పునర్వివాహము చేసికొనుచున్నారు. డైవోర్సు పొందినస్త్రీలలో సగముమంది మాత్రమే వివాహము చేసికొనుచున్నారు.

## ఆయుర్దాయము.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో ఆయుర్దాయము పెరుగుచున్నదట ఇపుడు సామాన్యపాయిని ఆయుర్దాయము 58. కాలము గడిచినకొలదిని యీ ఆయుర్దాయము పెరుగునని శాస్త్రజ్ఞు లూహించుచున్నారు. ప్రొఫెసర్ ఇర్వింగ్ఫిషరుగారు క్రిందివిధముగ నొకసందర్భములో తెలియపరచిరి.

| సంవత్సరము. | ఆయుర్దాయ పరిమాణము. |
|---|---|
| 1930 | 61 |
| 1940 | 65 |
| 1950 | 69 |
| 1960 | 72 |
| 1970 | 75 |
| 1980 | 78 |
| 1990 | 80 |
| 2000 | 82 |
| 2100 | 94 |

1881, 1921 సం॥ ల మధ్య హిందూదేశములో సామాన్యపాయి ఆయుర్దాయము.

| సం॥ | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| 1881 | 24.5 | 25.2 |
| 1891 | 24.4 | 24.9 |
| 1901 | 24.7 | 25.1 |
| 1911 | 24.7 | 24.7 |
| 1927 | 24.8 | 24.7 |

## వివిధదేశములలో సామాన్యపాయిని ఆయుర్దాయము.

| దేశము. | సంవత్సరము. | ఆయుర్దాయము. |
|---|---|---|
| నార్వే | 1915 | 55 6 |
| దక్షిణఆఫ్రికా | 1920 | 55-6 |
| హాలెండు | 1915 | 55-1 |
| ఇంగ్లాండువేల్సు | 1910 | 51-5 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 1910 | 50-5 |
| ఫ్రాంసు | 1910 | 48-5 |
| జర్మని | 1910 | 47-4 |
| ఇటలీ | 1910 | 47-0 |
| జపాను | 1910 | 44-3 |

## పుస్తకములు.

పోర్చుగలు పూర్వపురాజగు ఇమాన్యుయల్ ఇంగ్లాండులో నివసించుచున్నాడు. ఈయనకు పుస్తకములనిన ప్రీతి. 1500 సంవత్సరమునుండి పోర్చుగీసుభాషలో వ్రాయబడిన గ్రంథములనన్నిటిని పోగుచేయుచున్నారు ఈయనయొద్ద పదునయిదుగ్రంథములు తప్ప తక్కినవన్నియు గలవట.

## నాటకశాలలు

లండనునగరములో నాటకకంపెనీలకు నాటకశాలలుదొరకుటచాలకష్టము. వారమునకు అఱువేల రూపాయలవరకు అద్దె యివ్వవలసియుండును. ఇంతఅద్దె అయినను లండనులో నున్న

ఒకచిన్న నాటకశాలక్రై, నాటకశాలస్థిద్ధమయి నచో 8,000 వేల రూపాయలు అద్దె వారము నకు యివ్వవలసియుండును. గడిచిన జనవరి జూలై మాసములమధ్య లండను నగరములో 34 క్రొత్తనాటకములుప్రదర్శింపబడినవి. దామాషాచుని యీ 34 నాటకములు ఒక్కొ క్కటి 54 పర్యాయములవంతున ప్రదర్శింప బడినవి. అయిదునాటకములు ఒక్కొక్కటి 29 పర్యాయముల వంతునను 8 నాటకములు 20 వంతునను 9 నాటకములు 30 వంతునను 2 నాటకములు 40 వంతునను ప్రదర్శింపబడి నవి. ఇన్ని పర్యాయములు ప్రదర్శనములు జరిగి అధికముగా నాదాయము వచ్చినను ఖర్చు లు పూడ లేదు.

కూచిబీహారు మహారాణి

ఇంగ్లాండులో మెంటక్ అను ప్రదే శమున మహారాణి యిందిరాబాయి నివాస మేర్పరచుకొన్నది. ఈమె బరోడా గాయకువారుగారి పుత్రిక. మెంటక్ ప్రాంతము లో నక్కలు విశేషముగా నుండునట. ఆనక్క లను వేటాడుటలో ప్రావీణ్యమును సంపాదించు కొనుచున్నది

జపాను.

జపాను దేశము లో రాజుకుమార్తెక సింహా సనార్హత లేదు.

యూనియన్ జాక్.

జనరల్ స్మట్సు వారిపక్షమువారు దక్షిణ ఆఫ్రికా రిపబ్లికును పరిపాలించినంత కాలము బ్రిటీషు జాతీయ పతాకమగు యూనియన్ జాక్ను గౌరవించుచుండెడివారు. ఇప్పుడు జాతీయపక్షమువారు అధికారములోనికి వచ్చిన పిమ్మట యీగౌరవము నశించినది. ఈ పతాక మును యెత్త ప్రయత్నించినప్పుడెల్ల జనసా మాన్యము తిరుగబడి యూనియన్ జాక్ను చింపివేయుచుండిరి.

మంచి విషయములు.

ఈశ్వరుని ప్రేమించువారి హృదయములో మానవునిపై ద్వేష ముండదు.

వేళ్ళు కుళ్లిపోవుచున్న వృక్షమువలె నున్నది ప్రస్తుత నాగరికత.

ఇతర జాతులవారిని తృణీకారముగ చూచుట శ్వేతముఖుని యలవాటు. శ్వేతముఖుని యధీ నములోనున్న వారందువలననే శ్వేతముఖుని యెడ ద్వేషభావము కలిగియున్నారు.

పరుగెత్తి పాలుత్రాగుటకంటె కూర్చుని మంచి నీరుత్రాగుట శ్రేయస్కరము.

మానవుడు కత్తి కఠారులతో రాజ్యము సం పాదించవచ్చును కాని దానిని నిలబెట్టుకొనుట కష్టము.

త్యాగము ప్రకృతి లక్షణములలో నొకటి.

వ్యక్తులను నడిపించెడిది కారణమే (reason) సమిష్టిమీద ఈకారణము పనిచేయజాలదు.

జాంఘికుడొక కవి.— ఇట్లాతని పొగడిన నాతని కనుహ్యామోదముండును.— అట్లను వారితో నాతడు సగర్వుడై "గడ్డిమేయుచు తలపైకెత్తు వారలు తత్త్వవేత్తలగుదురేని, నేనునొక తత్త్వవేత్త" అని చెప్పుచుండును. ఇట్లు జీవిత తత్త్వాన్వేషణమున పరిభ్రమించుచున్న కాలజాంఘికునకు కొంతకాలమున కొకవింత యూహ జనించినది.— కాలము తెలిపెచ్చులన కేమి!— అది యెప్పటికప్పుడు మారిపోవుచుండును.

అందుచే కాలజాంఘికుడొక సంఘమేర్పరచి దాని సమాజమందిరమునందుండు పత్రికల జదువ నేతెంచు వారలకు నెలకొకతూరి యుపన్యాసమూలమున తన యభిప్రాయములను వెల్లడించుట యుక్తమని తలచెను. తనయభిప్రాయముల నెవ్వడు వినకపోయినను సరియె! పాటింపక పోయినను సరియె.— ఈప్రపంచమున ప్రతి వ్యక్తియు తన యభిప్రాయము నొకదాని నొక విషయమున కలిగియుండుట కర్హుడు. అందు కాతని కనేకవిధములుగ వాక్కుగలదు. అందున కాలజాంఘికున కీయభిప్రాయము కలిగిన తరువాత నా సంఘ సంస్థాపనకై యత్నింపమొదలిడెను.

ఆసంఘమున కాతడు తానుగాక మఱి యిద్దఱను చేర్చుకొనదలచి యాయూరనేయున్న వాణీసంజాతుని, లీలానందునిగూర్చి, "మూరాడు మూర్తుల సారంపు ముద్దరగ" నీగుణదర్శనీసంఘము నేర్పరచెను. వీరిచ్చుచుండిన యుపన్యాసధోరణికి యూప్రజనులు వీరిని దూషించుచుండినను కాలజాంఘికుడు మొండిధైర్యముతో ప్రతినెలయు నుపన్యాసమిచ్చుట మానలేదు. క్రమక్రమముగ వీరేమిచెప్పుదురో చూతమని కొందఱు రాబ్రారంభించిరి. ఇట్లు సభికులసంఖ్యాభివృద్ధికాగా నొకనాడెవ్వరేని కాలజాంఘికునితో "మహాశయా! మీ యుపన్యాసముల నేపత్రికయందేని ప్రచురింపరాదా?" యని ప్రశ్నింప కాలజాంఘికుడు "నే నేదో వెఱ్ఱివాడను! ఇష్టమువచ్చినట్టుల వాగుచుందును. ఇట్టి ధోరణికి పత్రికలయందుగూడ నెందులకు? అందఱును నవ్వుటకా?" యని యాతనికి బదులిడెను. ఆపెద్దమనుష్యుడట్లు చెప్పినను వినక బలవంతము చేసి పత్రికామూలమున తన వాగ్ధోరణి ప్రచురించుటకు బొనచేయించెను. అందుచే వారుపన్యాసములిచ్చునపుడు వానిని వ్రాసికొనుటకొక విలేఖరి కావలసినట్టుల తెలియుటయు, నేనందులకై వారివద్దకేగి యావని నేచేయగలనని చెప్పితిని. వారును సంతసించిరి.

నే నాసంఘవిలేఖరినైన తరువాత వాణీసంజాత లీలానందుల గుణముల తెలిసికొంటిని.— వాణీసంజాతుడు మేధావియని ప్రతీతి కాని యాతనిది కుతర్కమట!— ఆవిషయమెంతవరకు నిజమో యోచించుటకు పాఠకులకును శ్రోతలకును నధికారమివ్వబడినది. వాణీసంజాతుడు కవి, భాషాభిజ్ఞుడు. కవియగుటవలన నాతడెల్లపుడును కాలజాంఘికునిగూర్చి, "దేవ! మాయాంధకారంబు ప్రోవద్రోచి జ్ఞానకాంతి నొసంగెడి భానుడీవ!" యని పొగడుచుండును. కాలజాంఘికుడును ప్రతిమాఱును "శబ్దాక్షర సుధావిలసిత మహిమాలాలన మైత్రీప్రసంగముల నాటిచేతి, పాండితీప్రకర్షాస్వాదిత యమృతధారానిపాతనిభంబగు వాగ్ఘరీతరంగడోలికలనూగులాడించెడి వాణీసంజాతుడు" అని యాతని ప్రశంసించుచుండును.

వాణీసంజాతునకిట్టి ప్రశంసయుక్తమగునా కాదా యని తోపవచ్చును. దానిని నిర్ధరించుటకు నాకు శక్తి చాలదు. కాని నాయభిప్రాయమే

మనిన నాతని కవితయందంత మాధురియుండదు. లేదనియే చెప్పవలెను. కాని యాతడేదియో తనయానందముకొరకై వ్రాసికొని, దానిని పాడుకొని సంతోషించుచుండును. అకవితయందంత భావముకూడనుండదు. కాని — యీ కవితాశక్తిహీనుని కవితను గూర్చి చెప్పనేల నందురా? అతనిని కొన్ని పాదముల నప్పుడప్పుడు కాలజాంఘికుడు తనయుపన్యాసములో వినుచుండును కనుక. కాని వాణీసంజాతుని యభిప్రాయమే మనిన "కవితనవలికి చేతిగుడులని వారు విధిప్రేరితులై వెలువరింతురు. అది హృదయమున నుండు నొకశిఖరమగు జలపాతము. దానినివలలకు వెలువరించు మహిమ కవిదికాని కవితదికాదు! ప్రతిమానవునకును భావములుండును. కొందఱు పైకి వ్యక్తీకరింపగలరు. కొందఱకది యసాధ్యము. అట్టి హృదయభావముల మధురముగ వెలువరించువాతడే కవి!" అతడిట్లనుకొనుచు తన యసంబద్ధగీతములఁ జూచి మురిసిపోవుచుండును.

లీలాశుకుడు కూడ నొకవిధముగ కవియే. అతడు కూడ వాణీసంజాతునివలెనే ఛందస్సుతోను, పదములతోడను కుస్తీపట్టుచుండును. కాని వారిద్దరకును కొంతభేదమున్నది! వాణీసంజాతునకు కొన్ని భావములుండును, ఆ భావముల నాతడు వ్యక్తీకరింపగలడు, వెలువరింపగలడు. కాని లీలాశుకునకట్టి యవస్థలు గలుగలేదు. అతడేదియో పద్యమల్లవలెనని కూర్చుండును. గాని యొకదినమంతయు గడపినను పద్యమాత్రము—

లీలాశుకుడు స్థిరబుద్ధిగలవాడు కాడు. అతడు కొంతకాలము క్రిందట నొక చిత్రలేఖనాభ్యాసుడట! ఎపుడో యేకిని తెలియదు. అతడు చిత్రించు పటముల నెవ్వరును చూచుట కోపవందున నాతడాపనిని మానుకొనెను. ఆవానన యీతని కుత్కంఠమున నీతడు వాణీసంజాతుడు నొకనాడు "కవితా ప్రపంచమునంతయు మోహింపజేయున గాన నది కళలలో నెల్ల గొప్పది" యని నభిప్రాయము వెలిబుచ్చినప్పుడు "చిత్రలేఖనమే గొప్పదని" నభిప్రాయము చెప్పెను. అందుపై వారిద్దరు వాగ్యుద్ధమునకు దిగిరి. కాలజాంఘికుడడ్డువచ్చి "మిత్రులారా! మీరు పోరాడు నవసరము లేదు. భావములను రెండు విధములుగ వెలువరింపవచ్చును. హృదయభావములను కవిత్వమునను చిత్రమునను వెలువరింపవచ్చును. భావములవల్లనే వచ్చిన యీ కవితా చిత్రలకు జన్మస్థాన మొక్కటియే!— మీకొక యుదాహరణ మిచ్చుచుంటిని, గమనింపుడు!— పార్వతికిని గంగకును జన్మస్థాన మొక్కటియే. అదిమంచుకొండ. పార్వతి యంగసౌష్టవముతో నలరారుచున్నది. గంగకూలంకషయై ప్రవహించుచున్నది. సకల జన్మపావనియై సంతోషప్రదాయినియై యొప్పుచున్నది. పార్వతికూడ పద్మజనామోద సంధాయినియే! కాని వీరిద్దరిలోను గొప్పయెవ్వరు? — అవిషయమును శివుడే నిర్ణయింపజాలక శరీరమునందు సగభాగము పార్వతికిని తలను గంగకును నెలవులుగ నొసంగెను — సర్వవిధములవీరిని పోలియున్న కవితాచిత్రముల నేదిగొప్ప?— మనము నిర్ణయింపగలమా?— కాన వాదింపనేల?" యని చెప్పనకి వాణీసంజాతుడును, లీలాశుకుడును కూడ నోరు మూసుకొనిరి.

తరువాత లీలాశుకుడు కూడ కవిత్వము ప్రారంభించెను. అందుచేత వాణీసంజాతునిది

# శివానందలహరి. (ఆంధ్రీకృతము)

సోమంచి వాసుదేవరావుగారు.

శా॥ నిత్యుండున్ ద్రిగుణాత్ముఁడున్ జితపురానీకుండు సల్లోకుఁడున్
గాత్యాయన్యధినాథుఁడున్ మునిమనఃక మోహ్రిదు చిన్మూర్తియున్
సత్యుండాది కుటుంబి యాది ఆటియామ్నాయాంత సంచారుడున్
భూత్యుక్తుండును నృత్యసంభ్రముఁడు శంభుండిచ్చు నిష్టార్థముల్.

మ॥ భవ! పద్మాప్తుఁడొకండ యీ క్షితి నభోవ్యాప్తాంధకారంబుఁ ద్రో
చి వెనక్ లోచన గోచరుండగుఁగదా శ్రీకంఠ! నీవన్నఁ గో
టి వివస్వంత మహాప్రభాయుతుఁడవై రేచిన్ బ్రకాశించు నా
యవివేకోగ్రతమంబుఁ బాపుట యశక్యంబౌనె నీకో శివా!

ఉ॥ ఏనరవర్యుఁడెప్పుడు మహేశ పదాంబుజ సేవసేయు న
వ్వానిని గాంచి దండి నిజవక్షముఁ దన్నునటంచు నెమ్మదిన్
గ్లాని వహించు, వాని పదకంజములన్ గని దేవతావళుల్
మానిత మౌళి రత్నచయ లాలిత కాంతులఁ బూజసేయు, న
వ్వానిని ముక్తికాంత వరభావమునన్ సుఖఁజేయు నిచ్చలున్.

క॥ నానాసందాశ్రుజలా
నూన స్ఫుట పులకలక్ష్మితో వ్యద్యోగ
స్థానము ముముక్షు సేవ్యం
బై నెగడెడు శైవభక్తిఁ బ్రార్థింతు మదిన్.

క॥ అమితము దమృతస్థానం
బమలంబగు త్వత్పదయుగమనుగోష్టమునం
దు మదీయ భక్తి ధేనువు
నుమహేశా! పశుపతీ! కనుంగొనుము కృపన్.

చ॥ జడత పశుత్వమున్ గుటిలచారత ఘోరకళంకితాదులన్
గలిగినవాఁడఁగాను శివ! కగ్గిన నీతలమానికంబుగాఁ
సలరినవాఁడనౌదు నలయబ్జుఁడు దేశిక దూరుఁడున్ గళం
కలసితుఁడున్ నిశాచరుఁడుగాఁడె శిరోమణిగాఁగ శంకరా!

ఉ॥ భాసురభావచాపమును భక్తిగుణంబున వంచి యల్లనై కై
లాసపతి స్మృతి ప్రదరలక్షులచే ఘనపంక శత్రుసం
త్రాసిన మొనర్చి నెమ్మది ముదంబును బొంది సుధీవరుండు మా
హేశ రమా విలాసము వహించి చరించి సుఖించు నెంతయున్.

చ॥ భవపద పుష్కరంబు సనభక్తిఘనాఘనమాల తుష్టి వృ
ష్టి నెలయఁజేయుచున్నదది చెల్వుగనేని మనస్తటాకమం
దు వజలు నాత్మఁడే యిల ఘనుండగు నాతని జన్మసస్యముల్
మివుల ఫలించు సంతతమలీక విలోచన! పాపమోచనా?.

శా॥ దేవా! భర్తృవియోగమున్ గనిననాతిన్ బోలె త్వత్పాద రా
జీవార్చారతి గల్గు నామది భవచ్చింతన్ బొనర్పంగ మో
హావేశంబును బొంది స్థైర్యమునకై సాంబా! భవధ్యానసం
సేవా ధర్శన కీర్తనాదులకుఁ దాఁజింతించు నశ్రాంతమున్.

చ॥ సదయ! బవత్పదాబ్జపరిచర్య నొనర్చుటకుందు శిక్షచేఁ
బొదలె విధేయతన్ దనరె; బొల్పుగు శుద్ధమనంబు నొందెద్వ
త్పదవనజాశ్రయంబుఁగనె భావభవారి! మదీయబుద్ధి న
ద్విధి నొనరింపు దాని కుపదేశము దేవ! సవోధకున్ బలెన్.

మ॥ సతమున్ యోగి మనస్సరోజ దళ సంచారక్షమంబౌ భవ
త్తత పాదంబు కఠోర ఘోర రవిజోత్కద్వక్షమున్ దన్నుటా!!
శితికంఠా! యదియెట్లు త్వన్మృదు పదశ్రీగూర్చి శోకింతు మా
నిత యుష్మత్పద దర్శనంబిడు భవానీనాథ! చేనొత్తెదన్.

శా॥ పూజాద్రివ్య సమృద్ధికూర్పఁ బడనో భూతేశ! యట్లయ్యునే
యోజన్ బూజ యొనర్తు దుర్లభమునై యొప్పారు క్రోడత్వమున్
రాజద్దివ్య ఖగత్వమున్ బడయు; గానంద్వచ్ఛిరఃపాదముల్
రాజాకల్ప! తదీయవేషధరు డా రాజీవనేత్రుండు నా
రాజీవోద్భవుఁడున్ గనన్ గలిగినారా! త్వచ్ఛిరః పాదముల్?.

క॥ గ్రాసము విషము కలాపము, వాసుకి వసనంబు తోలు వాహనము వృషం
బో సాంబ! నీకుగలవే, మీశక్తుఁడ వీవు? భక్తి నీవె మహాత్మా!

క॥ సోమ కళాధరమౌళియుఁ గోమల ఘనకంఠమును నకుంఠము గిరిజా
రామాభిరామ తేజము, మామక హృదయమున నిలుచు మక్కువ నెపుడున్.

# పద్మరహస్యము.

సు:— ఎంతమాట. ఇదంతయు మీచలవే, మాజీవితము, నాకుమారుని విద్యయంతయు మీదయవలననే.

శాం:— నేను పోవలెను. పోవుటకు ముందు మాశశిని చూడవలెననియున్నది. చూడ వీలగునా ?

సు:— చూడవచ్చును. భయము లేదు.

శాంత లోన బ్రవేశించి నిద్రపోవుచున్న శశిభూషణుని జూచినది. దివ్యసుందర బాల విగ్రహమును గాంచి సంతసించినది. ఆమె కేదియో స్ఫురించినది. "ఇంత లావణ్యరాశి అనామకుడుగ నుండవలెను." అని విచారించుచు శాంత యాప్రదేశమును వీడెను.

కాళీచరణుడు కపటవేషమును బహు నేర్పుతో నిర్వహించెను. శశిభూషణుని మోము దిలకించుచు శాంత యశ్రువులను రాల్చుచున్నప్పుడు, కాళీచరణుడు కవాటమును దెరచి యామెను జూచి వెంటనే కనులు మూసుకొనెను. ఒక నూతన స్త్రీకింత యాతాటమెందులకు ? ఇదియే కాళీచరణుని సందియము.

ఆక్షణమునుంచి కాళీచరణుని హృదయములో నాందోళన పెచ్చు పెరిగెను. తన సూక్ష్మబుద్ధి నంతను ప్రయోగించి యింతకాలమునుండి తన తల్లి దాచుచున్న రహస్యమును బయలు పరుప కృతనిశ్చయుడయ్యెను. తన తల్లికేమి రహస్యము గలదు ? ఆమెకు రెండు వివాహము లయినవా ? మువ్వురిటికిని కాజాలదు. తనకును కాళీచరణునకును వయస్సున భేదము ఒక యేడాదిమాత్రమే. యేడాదిలో తన తండ్రి మరణించుటయు తరువాత తన తల్లి రెండవ పెండ్లి చేసుకొని శశిభూషణుని గనుటయు, పిమ్మట రెండవ భర్తకూడ మరణించుటయు నసంభవము. కనుక నీరహస్యము తనకు చెందినది కాదు. ఈరహస్యము కేవలము శశిభూషణునకు చెందినదే. ఇటువంటి వివిధాలోచనలు కాళీచరణుని తత్తరపెట్ట సాగెను. అంత నాతడు బయలుదేరి తన తల్లి పూర్వము నివసించియున్న గ్రామమునకు బోయి తన తండ్రియొక్క చరిత్రను దెలిసికొన బ్రయత్నించెను కాని లాభము లేకపోయెను. ఈవిధముగా మరికొన్ని సంవత్సరములు గడిచి పోయెను.

—: పదవ ప్రకరణము :—

ప్ర మా ద ము .

అది డిశెంబరు మాసము. ఒకనా డుదయమున కాశీనగరమునందలి గంగానది యొడ్డున ప్రజలు గుంపులు గుంపులుగా జేరుచుండిరి. అచ్చట నేదియో ప్రమాదము జరిగినట్లు తెలియవచ్చుటచే నింకను జనమధికముగా రాసాగిరి. ఇరువురు యువకు లెల్లరి దృష్టుల నాకర్షింపసాగిరి. వారిలో నొకడు స్పృహతప్పి పడియుండెను. ఆయువకుడు గంగానదిలో నీదుచు లోతునకు బోయి యచ్చట మునిగిపోయెను. అతనికి పరిచర్య చేయుచున్న రెండవ

యువకుడు ధైర్య సాహసములతో నదిలోనికి దుముకి యీదుకొనుచు బోయి తన స్నేహితుని రక్షించుకొనెను. అందరు నాతని ధైర్య సాహసములను మెచ్చుకొని వేనోళ్ల గొనియాడిరి. ఈయువకుడు మనకు నూతనుడు కాడు. మనకు చిరపరిచితుడగు శశిభూషణుడే. ప్రమాదమునొందిన యువకుని పేరు సతీశుడు. వీరిరువురును కాశీనగరమున హిందూవిశ్వవిద్యాలయములో సహాధ్యాయులు. వీరిరువురికిని స్నేహము మెండు. నిరంతర మొకరి నొకరెడబాయక సంచరించుచుండగా. ఆకారణమున, సతీశుని ప్రాణము రక్షించినందున సతీశుని కోరికమీదను, శెలవులలో గల కత్తా నగరమునకు శశిభూషణుడు బోదలచెను.

సతీశుని వృత్తాంతము పాఠకులకు దెలుప మరచితిమి. కలకత్తా నగరమున సుధీంద్రరాయలు సంతానము గలిగియుండెనని వేరొక ప్రకరణమున వివరింపబడినది. ఈసతీశుడా సుధీంద్రునియొక్క కుమారుడే. వయస్సున సతీశుడు రెండు మూడు వత్సరములు చిన్న. రూపమునందు శశిభూషణ సతీశులకు నెంతయో పోలిక యుండుటచే చూచువారెల్ల రాశ్చర్యపడసాగిరి. ఒకరిది కలకత్తానగరము వేఱొకరి జన్మస్థాన మెవరికిని దెలియదు. ఇటువంటి యువకుల నొకచో జేర్చుటయందు గల విధాత్రువైచిత్ర్యమును పాఠకులు గమనింతురుగాక!

—: పదునొకండవ ప్రకరణము :—

సత్కారము.

తన కుమారునికి సంభవించిన ప్రమాదమును గని పద్మ భయ సంభ్రమములతో గొట్టుకొనసాగెను. "ఇల్లు విడచి దూరదేశమునకు బోవుచో నేదియో ప్రమాదము రాగలదని యప్పుడే యనుకొంటిని. వాని నచటికి మీరెందులకు బంపవలయును?"

సుధీం:— పద్మా, సతీశునిపై నీకెంత ప్రేమయో నాకు నంత ప్రేమయే గలదు. ఇంటియొద్ద మనము గారాబము చేసినచో బిల్లలు ముమ్మం దక్కరకు రానేరరు. కనుక దూర దేశములకు బంపుటయే యుత్తమము.

పద్మ:— తక్షణమే మన మచ్చటకు బోవలయును;

సుధీం:— ఈ ప్రమాదము జరిగి నేటికప్పుడే పదునయిదు దినములు గడిచినవి. సతీశుడు దాను సుఖముగా నుండినట్లును నాలుగయిదు దినములలో తనమిత్రుని దోడ్కొని యిచ్చటకు వచ్చునట్లును జాబు వ్రాసియున్నాడు. మనమింతలో నాతనితో బోనక్కరలేదు. ఈశశిభూషణు డెవ్వరో!

పద్మ:— ఎవరయిననేమి? సతీశుని ప్రాణములను గాపాడినవాడు. గనుక మనకు ముఖ్యబంధువే. అతనిఋణమును మనమెన్నటికి దీర్చజాలము. శశిభూషణుడు భాగ్యవంతుల కుటుంబమునకు జెందినవాడేనా?

సుధీం:— లేదు. చాల పేదవాడని తెలియుచున్నది.

పద్మం:— పేదవాడయిన నేమి? మనము సత్కరించియే తీరవలయును అనుకొనుచు సంభాషణ ముగించి యెవరిపనియందు వారు మగ్నులైయుండిరి. నాల్గుదినములు గడచినవి. శశిభూషణ సతీశులు వసంతవిలాసమును జేరుకొనిరి. దంపతులిద్దరును శశిభూషణుని మిగుల గౌరవించిరి.

పద్మ:- నీవిక చదువు చాలించ దలచుకొనునట్లును యేదయిన నుద్యోగములో బ్రవేశింపదలచినట్లును, మానతీశుడు చెప్పియున్నాడు. అటువంటి యుద్దేశ్యమును మరల్చుకొనవలెను. నీభావిదశ మాపయి నిడుము.

శశిభూషణుడు కొంచెము శంకించెను.

సుధీం:- శంకించెదవేమి? నీమనస్సులో నేమున్నదో తప్పక చెప్పుము.

శశి:- నేను కొంచెము బాహాటముగా చెప్పుచున్నందులకు క్షమింపుడు. నేను గొప్పకుటుంబమునకు జెందినవాడను కాను. నాతండ్రి యొకానొక రైల్వే గార్డు. రైలుప్రమాదములో చనిపోయినాడు. మాయమ్మ నిరాడంబరజీవి. ఆమెకు లభించుకొలదిపాటి పింఛనుతో కాలము గడుపుచున్నది. మేము నిజముపేదలము. ముందుకు దారిలేదు. గొప్పవారి సంబంధము లేదు. ఈ రాజసౌధములో నే నొక కాకివలెనున్నాను. శరీరకష్టముచేసి సంపాదించుకొనవలసియున్నది.

సుధీం:- ఇదియేనా నీయాక్షేపణ?

శశి:- అవును మీకు నేనెంతయు కృతజ్ఞుడను. మీకును నాకును హస్తిమశకాంతర భేదము గలదు.

సుధీం:- నీవు కడు ధైర్యముతో దెలిపినందులకు నాకెంతయు సంతసమగుచున్నది. నీవు నిష్కపటివి.

అంతటితో వారికి సఖ్యత యేర్పడినది. ఎన్ని పర్యాయములు పోనుద్యుక్తుడైనను శశిభూషణుని పోనీయ్య లేదు. ఈయుదంతమును దెలియపరచుచు శశిభూషణుడు తమతో సుఖముగా నున్నాడని సుముఖికి జాబు వ్రాసియుండిరి.

శశిభూషణుని జీవితమునందు గలిగిన యీ యద్భుత మార్పునకు కాళీచరణుడెంతయు వగచెను. వసంతవిలాస మిపుడు శశిభూషణునకు స్వంత యిల్లయినది. కొన్ని దినములు గడిచినవి. శశిభూషణు డాప్రదేశమునందలి ప్రకృతివైచిత్ర్యములను దిలకించుచు తన పూర్వజీవితమును స్మృతికి దెచ్చుకొని ప్రస్తుత జీవితముతో బోల్చి చూచెను. సర్వభోగముల ననుభవించుచు నానందడోలికల నూగుచుండెను. వసంతవిలాస మను పదమును మాటిమాటికి స్మరించుకొనుచు యానందించుకొనుచుండెడివాడు. వసంత విలాసములోనికెల్ల సుధీంద్రుని పఠనాగారము శశిభూషణున కెంతయు నచ్చినది. నిరంతర మాపఠనాగారము నందలి గ్రంథములను దిరుగవేయుచు నడుమ నడుమ కిటికీలగుండ ప్రకృతి సౌరభ్యమును వీక్షించుచుండెడివాడు. ప్రతి దినము వేకువజామున నే మేల్కాంచి గ్రంథపఠనా మగ్నుడగుచుండెడివాడు. ఒకనాడేదియో గ్రంథమును తిరుగవేయుచుండ సుధీంద్రు డచ్చటికే తెంచెను. శశిభూషణుడు లేచి నిలబడి ఆర్ట్సు కాలేజిలో చదువుకొనునప్పుడు విశ్రాంతి లేక నేదియో యొక పని చేయుచుండెడివాడను" "సోమరితనము నీకు సరిపడదు కాబోలును. నేనొక యుద్యోగము నిచ్చెదను. అది నీకెంతయు తగి యుండును. చాలకాలమునుంచి నేనొక యాంతరంగిక కార్యదర్శిని వేసికొన దలచుకొనియున్నాను. పెద్దవాడనగు చుండుటచే సోమరితన మలవాటు పడుచున్నది. ఉత్తర ప్రత్యుత్తరములను వ్రాయుట, లెక్కలను వ్రాయుట, మున్నగు కార్యములను నిర్వహించుట కొకరు కావలసియున్నారు. నీవంగీకరించెడల సంతసముతో

నా భారము నీమీదనే యుంచెదను. నెలకు రెండు వందల రూప్యములు వేతనము నిచ్చెదను. అంతమాత్రమున నీవు మాగృహమును వీడవలదుసుమా !!

శశిభూషణుడు సుధీంద్రుని కాంతరంగిక కార్యదక్షుడై జీవితమునందు మరియొక మెట్టెక్కెను.

-: పండ్రెండవ ప్రకరణము :-

పూ దా నం చి.

శశిభూషణుడు వసంత విలాసమును జేరు సరికి, శాంత యచట లేదు. గ్రామాంతరము బోయియుండెను. శశిభూషణుడు వసంత విలాసమున జేరిన యారుమాసములకు శాంత యచటికి దిరిగి వచ్చెను. ఆమె నూతన వ్యక్తిని జూచెను గాని యావ్యక్తి శశిభూషణుడని తెలిసికొనలేదు. శశిభూషణుని తొమ్మిదవ యేట జూచెను గాని తరువాత నెన్నడును తిరిగిచూచి యుండలేదు.

ఉమ సుధీంద్రరాయుల మేనగోడలు. వయసు పదమూడు వత్సరములు. తలిదండ్రులగు లలితావినయ భూషణులు ఉమను వసంతవిలాసమునసే యుంచుచు వచ్చిరి. ఇందులో బ్రత్యేక కారణము లేకపోలేదు. సుధీంద్రుని యాస్తి తమకు లభించునసెడి యాస యేనాడంతరించినదో, యానాడే ఉమాదేవిని వసంత విలాసమునకు బంపిన యెడల నామెపై పద్మా సుధీంద్రులకు వాత్సల్యము పెరిగి సతీశునికిచ్చి వివాహాము చేతురని వారి యాశయము. పద్మా సుధీంద్రులు ఉమాదేవినికన్నకూతురుగ భావించి పెంచుచు వచ్చిరి. ఆమె యిప్పుడు మేరీ కళాశాలలో నాలుగవ ఫారము చదువుచున్నది. ఒక నాటి మధ్యాహ్నము ఉమ, పద్మ, శాంత ముప్వురు నిష్టాగోష్ఠి సల్పుచుండిరి. ఒక ముత్యాల సరమును జూపి ఉమ "అత్తయ్యా, కళాశాలలో నాకు బహుమానముగ నిచ్చిన యీ ముత్యాల సరమును జూచితివా? దీని నెన్నటికిని వదలను. దీనిలో నేది యో మహిమయున్నది. దీనిపై నాకమిత ప్రేమ" యని యనెను. శశిభూషణుడు వసంతవిలాసములో నతి చనువుగ సంచరించుచుండుటచే నీమాటలను వినుచు "నాకును చిన్న తనములో నెవరో బహుమానమిచ్చిన నా యీ పూదానంచిని చూచితిరా?" యని యనెను. ఉమ సిగ్గున యటనుండి వెడలిపోయెను. పద్మ యాపూదానంచిని గైకొని యిటు నటు త్రిప్పి బాగుగ నున్నదని యిచ్చివేసెను. శాంత మాత్రము కొంచెము కలవరమొందెను.

వసంత విలాసమునందలి నూతన వ్యక్తి శశిభూషణుడనియు, శశిభూషణుడు సతీశుని కాపాడి ప్రాణదాన మొసంగెననియు శాంత తెలిసికొనినది.

శాంత ముఖము వివర్ణము నొందినందున యస్వస్థత నెపంబున నచ్చోటును వీడెను. పద్మ తన సోదరి కేదియో బాధ కలిగెననియు, విశ్రాంతి కలిగిన నామె కూడుకొనుననియు తలంచి స్వకార్యమగ్నయై వెడలిపోయెను.

శాంత మోము తెల్లబడినది. దైవఘటనమున తన సోదరి కుమారుడు సోదరిచెంత చేరెననియు, నొకరినొకరు పోల్చుకొనక నొక చంచ నివసించుచున్నారనియు నామె గ్రహించినది. నిగ్రహము నశించుటకు శాంత కిదియే ప్రథమ పర్యాయము. ధైర్యము, శాంతము, జాగరూకత శాంతలోనుండి మాయమైపోయినవి. ఒక క్షణములో నుద్రేకముగ "పద్మా, యీతడే

నీప్రియ సుతుడు" అని యెలుగెత్తి యరచెడిదే కాని వెంటనే నిగ్రహించుకొని వెనుకకు మరలినది. ఆమె రెండు చేతులను కలిపి యేమియో యాలోచింప దొడంగినది. తాను చేయుచున్న కార్యము సమంజసమా, సోదరి గౌరవమును కాపాడుటకైనను తల్లిని కుమారుని యెడ బొటుచేయుట న్యాయమాయని యాలోచింప సాగెను. "నేనే కారకురాలిని. పద్మకొరకే యీరహస్యమును దాచితిని. ఇపుడైన నేనేల తొందరపడవలెను" అని తలపోసెను.

శాంతహృదయము నిలకడ నొందినది. సర్వము నాశనము కాలేదని తెలిసికొనినది. రహస్యము సురక్షితముగనే యున్నదని యూహించినది. వసంత విలాసపు రాణియగుపద్మ శశిభూషణుడు తన పుత్రుడని యెరుగనే యెరుగదు. శశిభూషణుకును పద్మ తన జనని యని యెరుంగడు. "ఈవిషయమును వీరికి దెలియ పరచువారెవ్వరు? సుముఖి వచ్చినను, చాల కాలముక్రింద నొక పర్యాయము మాత్రమే చూచియున్న పద్మయిపుడానవాలు పెట్టజాలదు పద్మ సుముఖినే యెరుగదు. నిరాశపడ నవసరము లేదు. పూదా నంచి పద్మ స్వయముగ నల్లినది. దానిపై పద్మ నామాక్షరములు గలవు. ఈయక్షరములను పద్మ చూచియుండిన! చూచియుండినచో నామె యిదివరకే చిత్తవైకల్యము నొందెడిది. కనుక భయము లేదు." ఇవియే శాంత యాలోచనములు. తరుణము మించకపూర్వమే యా పూదానంచిని శాంత సంగ్రహించదలచినది.

శశిభూషణుడు సాయంకాలము విహారార్థము బయటకు బోయియుండెను. శాంత యాతని గది ప్రవేశించినది. ఆతురతతో బల్లలను గోడ యలమారులను వెతకినది. శశిభూషణునకు రహస్య వస్తువు లేమియు లేవు. అతని వస్తువులన్నియు మేజాబల్లలపై నున్నవి. శాంత యందున్న పూదా నంచిని తీసికొని మెలమెల్లగ బయటికి వచ్చుచుండ ద్వారము కడ వంటలక్కయగు మాధవిని జూచి సంభ్రమము జెంది "శశిభూషణుని గది చూచి వచ్చుచున్నా"నని నుడివెను.

శశిభూషణుడు తిరిగి వచ్చినపుడు తన నంచిని చూచుకొనలేదు. మరునాడుదయము ఉదయము "మీపూదానంచినొకమారిచ్చిన, నేనామాదిరి ననుసరించి మరియొకదాని నల్లెదను" అని శశిభూషణునడిగెను. శశిభూషణుడు తనపూదా నంచి కొరకన్ని మూలల వెతకి విఫలమనోరథుడయి "పోయినది. ఎవరో తస్కరించినారు. నాప్రియమయిన వస్తువు పోయినద" నెను. ఈమాటలాదారిని పోవుచున్న సుధీంద్రుని చెవులకు సోకినందున "యేమిపోయినద" ని ప్రశ్నించెను.

"నాపూదానంచి."

"పూదానంచిపోయినదా? ఈయింటి వస్తువులెన్నడును పోలేదే! అయినను చూచెద. బాగాక. వెతకిదొంగను పట్టుకొనవలెను."

ఎవరో తస్కరించిరననేల? నేనే యెచటనైనా బారవేసితినేమో."

తన క్రోధమును చల్లార్చుటకు బన్నిన పన్నుగడయని సుధీంద్రుడు గ్రహించి "అట్లన్నటికిని గాద" ని వెంటనే పద్మతో యావత్ప్రత్తాంతము నుడివెను.

ఇంటిలో నేవస్తువైన పోయినపుడు గోడవ వంటలక్కయు నౌకరులు నగుటచే, పద్మ మాధవిని గద్దించి యడిగెను. "నేనావైపునకు బోలేదు,

నిన్న మాత్రియు శాంతమ్మగారచటనుండి వచ్చుచుండగ జూచితిని” అని జవాబు చెప్పినది. ఈమాటలు పద్మ హృదయమున ములుకులవలె గ్రుచ్చినవి. అయినను శాంతయొక్క కొండిగట్టనవ రమేలయని సందియము కలిగెను.

—♦పదమూడవప్రకరణము♦—

ప్రభాసము.

శశిభూషణునిపై ఉమాదేవికి ప్రేమయంకురించినది. ఇపుడిపుడే ప్రపంచమును దెలిసికొనుచుండుటనో, ధనాశాపీడితులగు తన జనని జనకుల యాశయమునకును స్వచ్ఛమైన నిష్కళంకమయిన తనయాశయమునకు నెంత వ్యత్యాసము గలదో తెలిసికొన నారంభించినది. శశిభూషణుడు ఉమాదేవిని చూచిన నాటనుండి మోహపాశబద్ధుడై సంచరించుచుండెనుగాని, భాగ్యవంతుడగు సతీశుని విడనాడి తనవంటి నిరుపేదను చేబట్టునా యనెడి సందియము మాతనికి లేకపోలేదు. ఒకయేడాది గడచునప్పటికి శశిభూషణుని ప్రేమబీజము పెరిగి మహావృక్షమై చిలువలు పలవలు విస్తరించుటచేత భరింపలేక నొంటరి సమయమున దన యభీష్టితమును ఉమాదేవి కెరిగింప నిశ్చయించుకొనెను.

శశిభూషణు డొకనాడు దన పఠనాగారమున కుర్చీలో కూర్చొని యాలోచనా పరంపరలలో నోలలాడుచుండెను. సుధీంద్రుడు కార్యాంతరమున నెచటికో బోవుటయు నానమయమునసే పద్మ ప్రతివేశులగృహమునకు బోవుటయు తటస్థించెను. ఉమ పుస్తకాభిలాష కలదగుటచే, శశిభూషణుని పఠనాగారమును పరిశోధింపదలంచెను. శశిభూషణుడింటలేడని యామెతలంపు. ఆకారణమున నామె పఠనాగారమును బ్రవేశించియాలోచనామగ్న మానసుడగు శశిభూషణుని గాంచి సంభ్రమముతో వెనుకకు బోదలంచెను. కాని ఉమ నర్ధాంగిగ బడసి సకలసౌఖ్యముల ననుభవింపదలచిన శశిభూషణుడు దనకింతకంటె యదనుదొరకదని యూహించి, వెనుకకు మరలనున్న ఉమను సంబోధించి “ఉమా, ఆగుము. ఇచట భయపడుటకు పరాయివారెవరునులేర” నెను. ఉమయేమిచేయుటకును దోచక నిలబడి సిగ్గున తల వంచి కాలి బొటనవ్రేలితో నేలమీద పిచ్చిగీతలు వ్రాయుచుండెను. బంగారు మేనిచాయతో నిగనిగ లాడుచు, నీలవర్ణపు చీరెను కట్టి మెరసిని పట్టురవికతో మోహినీదేవతవలె ధగద్ధగాయమానముగ మెరయుచున్న ఉమను జూచి మోహించని పురుషుండుండునా? ఒక సంవత్సరమునుండి పెరుగుచున్న ప్రేమ నింక నణచుకొనజాలక “ఉమా, ఎన్ని దినములనుండియో యదుగ బ్రయత్నించుచుంటిని. ఈ దినమున నాయభీష్టము చేకూరినది. కాని—” యని కొంత తడ వూరకొనెను.

ఉమ ప్రత్యుత్తర మీయలేదు.

“ కాని నెరవేర్తువన్న చెప్పెదను ”.

ఉమ మౌనముగ నిలబడియుండెను.

“ గాఢమగు ప్రేమవాహినిలో నీదుకొని పోవుచు దరిగానకయున్నది. నీవేనాసర్వస్వమవు. నా యారాధ్య దేవతవు. నా లక్ష్మివి. నా హృదయేశ్వరివి. నీవు తిరస్కరించినచో ప్రపంచమంతయు శూన్యము.” ప్రత్యుత్తరములేదు.

“అవును. పేదల నాదరించువారెవరు? ధనముండినచో నందరును చేపట్టుదురు. ”

ఉమ ధైర్యముతో నిట్లనెను.

“ఆర్యా, ప్రేమ కులభేదములను పాటించదనియు, పేదలు భాగ్యవంతులను తారతమ్యమును లక్ష్యము చేయదనియు నాకు తెలియును

కాని పురుషులప్రేమ యతిచంచలము. ప్రేమించినవారితో నెల్ల సర్వమునీవేయని చెప్పుచుండుట సహజమై పోయినది." అని చిరునవ్వుతో ననెను.

"ఉమా, నేను నిన్ను ప్రేమించుచున్నాను. హృదయ పూర్వకముగ ప్రేమించుచున్నాను. నాకోరికను మన్నించవా?"

"ఆర్యా, ప్రేమోద్రేకమున నెన్నిమాటలనైన ననుకొనుచుందుము. హృదయపూర్వకముగాని—"

"ఉమా, ఇంకను సంశయమేనా? నీవు నన్ను వివాహము చేసికొనజాలని యెడల—"

"మీరింత తొందరపాటున నే ప్రతిజ్ఞయు చేయ నవసరము లేదు."

"యావజ్జీవము బ్రహ్మచారినై యుందును."

"పురుషుల ప్రేమ పొంగిపొరలి వచ్చుచుండును స్త్రీల ప్రేమ గాఢముగ వారి హృదయములలోనే యణగియుండును."

"పరోక్షపు పల్కులు నన్ను సంతృప్తిపరుపజాలకున్నవి. నీవు నన్ను వివాహము చేసుకొననిచో నీ మ్రోలనే సర్వమును త్యజించిపోవుచున్నాను"

"ఆర్యా, నాకును యంగీకారమే. ఇదియే మనప్రధానము. తగిన సమయము లభించువరకీయుదంతము నెవరికిని దెలుపవలదు"

"మీ తలిదండ్రుల కిష్టములేనిచో?"

"మీభావము నాకు బోధపడినది. నాజననీజనకులు నన్ను సతీశునకిచ్చి వివాహము చేయదలచియున్నారు. అయినను ప్రేమపీడితులకు భగవంతుడు మూడు మార్గములు జూపియున్నాడుగదా?"

"ఏమిటవి?"

"నూయి, విషము, చిచ్చు. ఇక నేను వేరుగ చెప్పవలసినదేమున్నది."

# హృదయశాంతి

లక్కరాజు సాంబసదాశివరావుగారు.

"నా" యనెడువార లెవ్వార లీయనంత
విశ్వమున లేమి దున్నహ హృదయ భార
మునఁ గలంగుచు కాలవాహిని మునింగి
తీరమే నాటికైనను జేరలేని
వ్యర్థజీవితునిగ నెంచు నట్టి వేళ
అతివ! చేపట్టి యుద్ధరించితివి నన్ను.
నాటనుండియు నాకు నీ నాటివరకు
కష్టమనుమాట లేజాడఁ గానరావు
తావక ముఖచంద్రాతప దర్శనమున
మామక విచారతిమిరముల్ మాయుకతన
తేజ ముడిగెడు జీవంపు దీపకళిక
దినదినమ్మును నుత్తేజ మునఁ జెలంగు
ద్రవ్యహీనుండనయ్యును రాజభోగ
భాగ్యజీవితసౌఖ్యముల్ బడయుచుంటి
శక్తిహీనత దూరమై చనియె బుద్ధి
మాంద్యము తొలగె భవదీయ మహిమకతన
సౌఖ్యశాంత్యధిదేవతా స్థానమైన
అస్మదీయ హృదయవీథి యనవరతము
తనదు శాంతమహాదేవతా విహార
సీమయై హర్షదాయియై జెలగు దేవి ॥

రంగము-సభామంటపము.

(కన్యాకుబ్జ చక్రవర్తి మంత్రి పురోహి
తులు ప్రవేశించియుందురు)

"నాట్యానంతరము"

కన్యా:- (చేతిలో లేఖను చదువుచుండును)
స్వగతము.

ఈ॥ మేము విలాసమేర్పడంగ।
మేడను గట్టితి మదురోన।
నానా మహనీయ వస్తువుల।
నంతయు నాగ నలంకరించి యు
న్నాము మనోహరాంగులగు।
నారులు శావలెగాన నీవు।
నీ భామలు మూషవందలను।
బంపుము కప్పముగాగ నెంతయున్॥

మంత్రి:- (రాజు నభినందించును)

సీ॥ సర్వసర్వంసహా చక్రింబునీచేత।
బడి వసుంధరనాగ బడియెగాదె।
భరతఖండంబు నీ పాలనంబును గాంచి
రత్నగర్భ యటంచు బ్రాలెగాదె।
పుణ్యయార్యావర్త భూమి నీదాటిచే
జంబుద్వీపంబు నా జనియెగాదె।
చెప్పన్న దేశదేశాలు నీ వేలుట బంగా
రుగనులంబరంగె గాదె।

తే॥ గీ॥ నీదు సత్కీర్తి దశదశల్ నిండిపోయె
నీదు ఘానాంగనామణి నిర్జరాది
కుధరముల నెక్కి తిరిగి దిక్కుభికుంభ
ములను నాట్యంబు సేయుచు పొలుచు
చుండె॥

పురోహితుడు:- మహారాజునకు శుభమగుగాక

కన్యా:- (విచారముతో) మంత్రిసత్తములారా!
మీరు వచించు శుభము లశుభములుగను,
మీ మంగళాశీర్వాదము లమంగళములు
శాపములుగను పరిణమింపనున్నవి.

మంత్రి:- ఆహా! మహారాజు నోట యివియేమి?
అమంగళ వచనములు, అశుభములు శాం
తించును గాక. (ప్రకాశ) రాజా, ఏల నీవిట్లు
నెన్నడును పలుకని యమంగళములు పలు
కుచున్నావు. ఈ నీ వాక్యములవలన
మా మానసములు తల్లడిల్లుచున్నవి మాక
న్నులనుండి రక్తబిందువులు వారుచున్నవి.

తే॥ గీ॥ శుభము లశుభముగామాఱ చోద్యమేమి?
దీవెనలు తిట్లుగా మాఱ తీరువేమి
సంతసము విషాదంబుగా చనెడునట్టి
హేతువేమిటి సుగుణ విఖ్యాత చరిత॥

కన్యా:-ఆహా! మంత్రులారా! అనుల్లంఘనీయమైన
యీవిధి విధానమును గూర్చి, నాతో నింక
నేదియును ప్రశ్నింపకుడు. నాకీ రాజ్య
మునకంటె మరణమే లభించియున్న నేను
నాయదృష్టమునకును నాయదృష్టము నాతో
అతను, ఏడ్చియే యుండకపోదుము.

తే॥ గీ॥ రాజ్యమేటికి మరణంబు రాకపోయె।
మరణమే వచ్చి నన్ను సామ్రాజ్యపదము
నుండి తొలగించి మృత్యువు టువిదవచ్చి
ప్రజల బదులుగ నిడదె నీ రాజసంబు॥

మంత్రి:- రాజా, ఇది నీకు పట్టాభిషేకమై రెం
డవదివసము నీవచనములు జూడ మిగుల
వింతలును విచారభరితములు నైయున్నవి.

తే॥ గీ॥ ఏలపడియెద వెదను నాందోళనంబు
ఏల దూరెదు విధిని నీ కేమివచ్చె
చుక్కలిల రాలలేదు నల్ దిక్కులింక
బీటలను వారలేదు నీ కేటి బెంగ॥

కన్యా:- ఇదిగో, ఈ కాగితపు తునుక. ఈ తునుక వజ్రాభేద్యమైన నా హృదయకుహరమును నొక్క త్రుటిలో తుత్తునుకలుగా తునిగి వేసినది. ఇదేగైకొనుడు చూడుడు సచివులారా, నా మానస పరితాపమును మీ హిత వాక్యములచే మఱింత రవులజేసి నన్ను హతాశుని జేసివేయుఁడు.

ఉ॥ కాలము తప్పివచ్చినది
కాదనఁజెల్లదు తప్పిపోదు నా
ఫాలముపై విషాదమును
బాధల తీర్చి లిఖించె
ధాత దుఃఖాలకు బుట్టినిల్లగుచు!
గాసిలు నాగ్రహచార రేక శా
ఖాలవ దుర్విదగ్ధమయి
గ్రాలుచునున్నది చెప్ప నేటికిన్!

మంత్రి:- (లేఖ చదివి చెవులు మూసుకొని) పాపము శాంతించును గాక.

కన్యా:- ఆహా యిట్టి అవమానపూరితమైన లేఖపై, మంత్రీ, యింకను ఈమియ యేమి?

మంత్రి:- దేవా! దీనిపై ఈమియుటగాదు దీని వ్రాతయక్కరముపై నిష్ఠీవనము వేసి సులీమనముగావింపవలయును. మురికిగుండమునఁబడ వేయవలయును. కాలికింద పెట్టి మట్టవలయును.

తే॥ గీ॥ కులవధూటులహింసించి కూలి రావ
ణుండు నరకాగ్నిలోబడి యుండెనంత్రి
తిరిగి యాతని యవతార మురుగుదెంచె
వ్రితియుగంబున దుష్టులు బ్రబలుచుందు॥

కన్యా:- నీవన్నది నిజము. ఆ రావణుఁడే నేడీ నరకాసురునిగా నవతరించి సీతాసతులవంటి మన కులవధూటుల మున్నూరుగురను బలిమిని గొనిపోయి వారి మానభంగములు గావింప నడుముకట్టినాఁడు,

మంత్రి:- అక్కటా! ఇదియెంత అసంగతమయిన సంగతి. దురాత్ముఁడయిన నరకుఁడు మున్నూరుకు వధూటులను, అయ్యో, నోరెఱుంగని పసిబాలలను, సతీతిలకములను, బలవంతముగా నెత్తుకొనిపోవుటకు వానిచేతులెట్లాడగలవు? ఆతఁడాడు తోడబుట్టినవాఁడు కాఁడా? వాని కులమువంటిది మాకులము కాదా! పేదలను ధనికులు, బలహీనులను బలవంతులు, బాధింపవలసినదేనా! ఇంకగత్యంతరము లేదా! హా హా నీ చెయిద మతివిచిత్రము. ఓ! ఆకాశమా నీ వింక విరిగిపడవేమి. ఓ చుక్కలారా! మీరేల రాలిపోకున్నారు! ఓ సముద్రమా! ఏల నీవు ముంచివేయవు. ఓ యోగీ! యేల నీవు కాల్చి నీవిధ్యుక్తము నెరవేర్చవు?

మంత్రి:- రాజా! ఈ లేఖ యెట్లువచ్చినది?

కన్యా:- నరకునియొద్దనుండి.

మంత్రి:- ఏటికిట్లు వ్రాసినాఁడు

కన్యా:- కావరము మెండై వ్రాసినాఁడు.

మంత్రి:- అయ్యో, ఈనరకాసురునకు మన్న మాపూర్వులోఁడి అతని కిచ్చినది లక్షల వరహాల పన్నులు, చెల్లించవలసినట్లు సంధిచేసుకొన్నాఁడు. దానికి బదులుగా భారత కుల సంజాతలగు మూఁడు వందల సుందర నారీమణుల నియ్యవలసినదని లేనిచో యుద్ధము తప్పదని వ్రాయుచున్నాఁడే యిది యెక్కడి రాజనీతి. ఎక్కడి మాట ఎవరికుల వధూటుల నెవరొసంగెదరు? ఇది రాక్షస కృత్యము గాదా? ఇది పాపములలో మహా పాపము గాదా. అప్ప

విచిత్రమైనదని వినుటకుకూడ దుర్ఘటముగ నున్నది.

మంత్రి:- రాజా! ఈకమ్మ యెవరుదెచ్చినాఁడు?

రాజు:- నరకుని ప్రతినిధి.

మంత్రి:- వాఁడెందున్నాఁడు.

రాజు:- పురమునందే విడిసి యున్నాఁడు.

మంత్రి:- సరే, వానినిప్పుడే రావించి ఈకోర్కె చక్రవర్తియగు వానికి చెల్లదనియు ధర్మవిదులిది విన్న నిందుల దూషించెదరనియు కులస్త్రీల మానభంగముకన్న మహాపాపమింకొకటి లేదనియు, ఇట్టి దోషదూషితమైన కార్యముల జోలికి పోవుట స్వవినాశము గొనితెచ్చుటవంటిదనియు నచ్చచెప్పుఁడు. అట్లాతఁడు వినఁడేని వాని పాపఫలము చిరకాలమున ననుభవించునని నిష్కర్షముగా చెప్పి పంపివేయుము. ఆవల కర్తవ్య మూహింపవచ్చును.

కన్యా:- ఆతడట్లు వినువాడు గాఁడు.

తే॥ గీ॥ రాతికంటెను కఠినుఁడా రాక్షసుండు
అవని ధవుఁడను ఘోరకాలాగ్నియందు
జ్వాల; యీదురాత్ముఁడుయమభటుఁడుగాఁడె
మేలురాదు వానిని బలిమాలుకొన్న॥

మంత్రి:- ఏల వినడు?

చక్రి:- ఆనరకుఁడు పెద్దరాజభవనమొకటి నిర్మించి అందు అందమైన మన మూఁడు వందల కులవధూమణుల దాసీజనముగా నేమించి భోగింప నుద్యోగించెనట. అదే యీజాబు.

మంత్రి:- ఆహా! పాపము శాంతించునుగాక!

తే॥ గీ॥ విషయభోగంబులకు వెల వెలసులుండ
దుష్టుఁడు కులాంగనలఁగోర నిష్ఠపడునె
తినుటకును రేగుపండ్లుండ తెలిసిమాలి
రత్నముల మ్రింగఁజూచెనో రాక్షసుండు

మంత్రి:- ఉ॥ పాపపు మేడగట్టి విష
పాత్రల దుష్కరసంబుఁద్రావ నా
కాపురుషుండు గోరె కుల
కాంతలసంగతి యింత నామహా
పాపి స్వనాశనంబు గన
వచ్చును రావణులీల మీరు మీ
కోపము మాని ఆహరిని
గోపకుమారుని వేఁడుడియ్యెడన్॥

(ఆ కృష్ణుని ప్రార్థింతురు) ప్రత్యక్షమై

చ॥ వగవకుఁ డార్యులార కుల భామినులన్
జెరఁబట్టనోచునా
పగతురగూల్చిమీకులకు పావనమున్
బొనరింతు దుష్టులన్ జగమున రేగుచుం
దురు ని
జంబుగ చీమలరెక్కలట్టులా మృగపశు
లొక్కటౌణహతి
మృత్యువశంబగుటిగారె యేయెడన్॥

# మీరున్నీసా

పద్మరంజనుడు

కథాకాలము 1483 వ సంవత్సరము, రాజపుత్రస్థానమున రాణీపురమును రాజధానిగ చేసికొని మాధవవర్మ పాలించుచుండెను. కథా సంవత్సరముననే మాధవవర్మ మరణించుటచే సింహాసనమునకై యాతని యిరువురు కుమారులు, కేశవవర్మ అజితసింహులు, కలహించి ఢిల్లీ పాదుషాకు కప్పము కట్టుట కంగీకరించి పాదుషా సహాయముతో కేశవవర్మ సింహాసనము నాక్రమించెను. అంతటితో నూరుకొనక తమ్ముడగు అజితసింహుని చెరబట్టి పాదుషా కారాగారమునందుంచి మాసమున కాతనిపోషణ క్రింద వేయి రూప్యముల నిచ్చుచుండెడివాడు.

అజితసింహుని కారాగారమనిన యొక పెద్ద భవనము ఈభవనముచుట్టును పాదుషా సైనికులు కాపలా కాయుచుందురు. అజయుని భవనము పాదుషా రాజ్యభవనావరణముననే కలదు. రెండు భవనములకును మధ్య సుందరోద్యాన వనమును, ఈద్యానవనమున యిటు పిట్ట అటు వాలకుండ చూచుటకు సైనికులుందురు. అజితసింహుడు పాతికేండ్ల వయసు గల యువకుడు. సౌందర్యమున మన్మథ సమానుడు. వినీల నేత్రములు, అందమైన యా కురులు, చిరునవ్వు సూచించు ముఖారవిందము అతనికి వన్నె దెచ్చుచున్నను, అతడేదియో కష్టమువ దగుల్కొని యున్నట్లు యాతని ముఖము వాడియుండుటవలన తెలియుగలదు. సంగీతము, కవిత్వము లనిన నీతనికపార ప్రేమ. ఎట్టి మోటువాడైనను, సంగీతము కవిత్వమున కుప్పొంగని వాడుండునా? రాజకుమారుడైనందున గర్వ మీతనియెడ కాన్పించదు. విశాలభావ సమన్వితుడగు వినమృడు. ఒక్క నిమేష మీతనితో సంభాషించిన నీత డతిమేధావి యని తోచును. సంగీతము కవనముల యెడగల ప్రేమతోబాటు చిత్రవిద్య శిల్పములయెడ భక్తి కూడ నీతని కధికము. మూడు సాంప్రదాయము లీతనికి సగ మెరుక.

పాదుషా కుమార్తెలలో మీరున్నీసా పాలి యందకత్తె. ఈమె వయస్సు పదునారు సంవత్సరములు. ఆమెను వివాహ మాడుట కనేక రాజాధిరాజులు ప్రయత్నించి విఫలులైరి. పాదుషా తన కుమార్తెను బీజపుర సుల్తాను పుత్రునకిచ్చ్యదలచి సకల ప్రయత్నములు చేయుచుండెను. బీజపురపు యువరాజగు సలీంకూడ నందు సాహసమూర్తైను వివాహమాడ నున్నానని దాయని విర్రవీగుచుండెను. మీరున్నీసాకు మాత్రి మీసంబంధమనిన నిష్టము లేకుండెను.

ఒకనాడు పాదుషా వేటకు నెళ్ళియుండెను. పాదుషా రాజభవనమున లేనపుడే కావలి కాయువారలు తప్పతాగియానందించుటకు తగిన సమయము. ఈనాడును కావలికాయు వారొడలు మరచి యుండిరి. మీరున్నీసా ఇదే తగనున్న దానిని కొంతవరకు యోచించి అజితసింహుని భవనమునకు పోవుచుండెను. అజితసింహుని మీరున్నీసా ప్రేమించెనని పాఠకులకు వేరుగ విన్నవించవలసిన యగత్యము లేదు. అజితసింహుని వరాసరి సమీపించెను. అజితసింహుడుకూడ నీమెను ప్రేమించెను. ఏనాడేలనో తనప్రాణప్రియ విచారగ్రస్తయైయున్నదని అజితసింహుడు గ్రహించెను.

"మీరా, నేడునంతో విషముగ నేవేమి? ఏమి కష్టము సంభవించినది?"

"ఈజన్మమునకు సౌఖ్యము లేదు"

"అట్లనెద వేమి? నీసౌఖ్యమునకడ్డు తగులువారెవరు?"

"నాసౌఖ్యమును కోరుచుంటిననితలచువారే"

"నీతండ్రియా?

"అవును. బీజపురం యువరాజగు సలీమును

విగా నా ప్రాణేశ్వరుఁడవు"

"పిహా, సలీముకా! రాఁబోవు దినము రాఁబోవును సలీముకా! అట్లెన్నటికిని జరుగనేరదు. జరుగనేరదు"

మీరున్నీసా లేత ప్రియుని పలుకులకు సంతోషస్వాంతయైనది. తనప్రక్కనె కూర్చుని తనపై చేయివైచిన అజితసింహుని తప్పించుకొన ప్రయత్నించలేదు. "నదైనా బారిమూర్ఖుడ"ను భావమును తోపజేయు చూపుల నాతనిపై ప్రసరింపజేసెను.

"మీర్, నారాధ్య దైవమా, ఈసంబంధము జరుగఁజాలదు. ఇవ్వలేని సౌఖ్యము నాకేమియున్నది? మన ఉన్నత ప్రేమ ఫలించకట్లు బడుచో, జీవితము వ్యర్థ. మీర్, జీవితాంతమువరకును నన్ను దరిలేని మనోవ్యథను బారవైచెదవా? అని అజితసింహుఁడు పలికెను.

"దైవము మనప్రేమను సఫలముగాక" అని మీరున్నీసా పలికెను.

"నాచరిత్రము కించుక వినుము. నాతండ్రి మరణానంతరము రాణీపురమునందలి యుద్యోగస్థులెల్లరును నన్ను రాజుగా చేయదలచిరి. నీతండ్రి పాదుషాతోడ్పడి నాయన్న కేశవవర్మను సింహాసనాసీనుని చేసెను. నన్ను రాజును చేయదలచిన ఉద్యోగస్థులను నాయన్న క్రూరముగ వధించి నన్ను చెరబెట్టించి యుంచెను. నాయీకష్టములన్నియు నిన్ను చూచినంతనే మరపునకు వచ్చినవి"

"నీ వింతవరకునిపోరాడుచుండ సింహాసనమును వదలలేవుకదా! సింహాసనము కొరకు జరుపవలసిన ప్రయత్నములను విరమించుకొనలేవుకదా!"

"మాఅన్న కేశవవర్మ సింహాసనము నాక్రమింపనున్నాడని తెలిసినంతనే కొందరు సైనికులను చేరదీసి ఆతని సైన్యముపైబడి వారిసేనానాయకుని వధించితిని. అంతట మిగిలిన సైన్యము చెల్లాచెదరైనది. కేశవవర్మ పాదుషావద్దకు పారిపోయెను. నేను రాజునైతిని. కాని మూడు వారములు మాత్రమే నేను రాజును, తరువాత సంగతి నీకే తెలియును. పాదుషా సైన్యమునకును నాసైన్యమునకును ఘోరయుద్ధము జరిగినది. నాసైనికులెల్లరు మడసిరి. ఘోరారణ్యములలో బడి పారిపోవుచున్న నన్ను వెంటాడి ఖైదీగా జేసిరి మార్గమధ్యమున నేను బడినపాట్లు వర్ణించి నీకు వ్యథను చేకూర్చజాలను"

"మీకష్టపరంపరల యెడ నాసానుభూతి నశించదు"

"నేనుకోరునది సానుభూతి కాదు–ప్రేమ"

"నాప్రేమా! ఎంతదురదృష్టవంతురాలనో నీ యర్ధాంగి కానున్న యువతి యెచటపుట్టి పెరుగుచున్నదో! ఇతరుల ప్రేమించుచున్న వారిని నేను వివాహమాడుటెట్లు?"

"మీర్, నేనెవరిని ప్రేమించలేదని ప్రమాణము చేయుచున్నాను"

"అట్లయిన మిమ్ములనుతక్క యన్యులను వరింప నొల్లను."

"మీర్, నేడు నిజముగ ధన్యుడను. అనేక దినములనుండి అపేక్షించుచున్న మాటలు నేడు కర్ణపర్వములుగ వినవచ్చినవి. నేనిచటికి ఖైదీగ వచ్చిన నాటి దినము సుదినము. నీప్రథమ దర్శనము దివ్య దర్శనము."

"అయ్యో, మన ఆనందము క్షణికముకదా ఈరాత్రియే నాతండ్రి సలీమును విందుకు పిలచెను. అచటనే సలీమును నేను వరించవలెనట"

"అట్లుజరుగనియ్యనని శపథము చేయుచున్నాను"

"ఎట్లు జరుగనియ్యరు?"

"మీర్, నీకొరకు సమస్తమును త్యజించెదను. రాణీపుర సింహాసనాపేక్ష, స్వమతాభి

మానము, పూర్వుల సాంప్రదాయములు పేరు మతము కిరీటము దేశము వీటినన్నిటిని వదలి పెట్టెదను. నీవుమాత్రము నాకు దక్కిన చాలును."

"అట్లయిన నేను మీదాననే"

అజితసింహుడు తన ప్రియసిని గాఢాలింగనము చేసికొని చుంబనము చేసెను. జాగైన క్షేమము కాదని మీరా అచ్చటినుంచి వెడలి పోయెను.

3

వేటనుండి పాదుషా తిరిగివచ్చెను. మధ్యాహ్నము తండ్రి కూతురు విశ్రాంతిగ ముచ్చటించుచుండిరి.

పాదు:- మీరా, ఈసాయంకాలవు విందు సంగతి వినియేయున్నావు సలీమును వరించవలెను సుమా

మీరా:- తండ్రీ, నిన్ను విడచియుండలేను. క్షమింపుము. నాపుట్టిల్లు, పెరిగిన స్థలము విడలేను.

పాదు:- పిచ్చిదానా, స్త్రీయై జన్మించిన పిమ్మట యెన్నాళ్ళు పుట్టిల్లు ?

మీరా:- సలీం నాకిచ్చు గౌరవమునకు అర్హురాలను కాను. నాకోరికలకు ఆతని కోరికలకు చాల వ్యత్యాసము.

పాదు:- ఇపుడు వ్యత్యాసముండుగాక. భార్యాభర్తల కోర్కెలు సమ్మిళితములగుచుండును.

మీరా:- సలీమును నేను ప్రేమింపజాలను.

పాదు:- తండ్రి యేరితెచ్చు సంబంధము నేకన్యయు వరించదు. పెండ్లి యనంతరమే ప్రేమ యేర్పడును. అన్యోన్య సహవాసమే ప్రేమను కుదుర్చును.

మీరా:- ఈ సంబంధముతో నేను సుఖపడజాలను.

పాదు:- వెర్రిదానా, పిచ్చిభయమును వీడుము నేను వృద్ధవాడనైతిని. చాలకాలము జీవింపను. మరణించులోపల నీకు తగు కట్టుదిట్టము చేసిననే కాని తృప్తి చెందజాలను. సలీము సంపన్న గృహస్థుడు. గౌరవము గలవాడు. సుందరుడగు మేటివీరుడు.

మీరా:- తండ్రీ, నన్ను నిర్బంధింపవలదని మరియొకసారి ప్రార్థన.

పాదు:- నీవు చిన్నదానవు. నీభావి సౌఖ్యము నభిలషించి యీకార్యము నెరవేర్పక తప్పదు. వంసిద్ధురాలవు కమ్ము.

అని పాదుషా యుచ్చరించుచు వీడి స్వకార్యమగ్నుడయ్యెను.

4

ఆరాత్రి విందు యేర్పాటు చేయబడినది. అతిథులనేకులు విచ్చేసిరి. ప్రథమస్థానమున పాదుషాయునతని కుడిప్రక్కను సలీముతరువాత మిగిలిన యతిథులును కూర్చుండిరి. ఎడమప్రక్కను మీరాఉన్నీసాయు కూర్చుండెను. ఆమె ముఖము కళావిహీనమై యుండెను. అజితసింహుడు తనకు క్రిందిగనుండినను, పాదుషా యాతనికి సమానగౌరవ మొసగుచుండు వాడగుటచే నాహ్వానింపబడి మీరాఉన్నీసా కెదురుగ నాసీనుడై యుండెను. రానున్న సౌఖ్యమున నువ్విళ్లూరుచున్న సలీము తనకు మీరాఉన్నీసా యెడగల ప్రేమ ధారను కురిపింపసాగెను కాని ఆమె కది యెంతయు రుచింపనందున ముఖము నావలికి త్రిప్పివేసి అజితసింహుని వంక తదేక దృష్టితో జూచుచుండెను. సలీము యీయుదంతము నవలీలగ కనిపెట్టెను. సలీముయొక్క మమకారము

అజ సింహునిపై కసిదీర్చుకొొన ప్రేరేపించెను. ఎట్లయిన నాతని వంచింపగోరి సంభాషణకు మొదలిడెను.

సలీ :- అజితసింహులా ! క్షేమమా !!

అజి :- ఆ, క్షేమమే.

సలీ :- మీదేశమును వీడిన పిమ్మట మీకు సౌఖ్యము లేదు కాబోలు. అవును. పరదేశ మెట్లు సౌఖ్యపడగలదు

అజి :- వైదేశిక సౌఖ్యమేమి ?

సలీ :- తమ భార్యాయు తల్లియు తమకై పరితపించుచుందురు కాబోలు.

అజి :- (ఆవేశము నణచుకొొని) నాకొరకు విలపించు వారెవరును లేరు.

మీరా :- (ఆశ్చర్యముతో) ఎవరు? భార్యాయు తల్లియునా?

మీరున్నీసాకు కలిగిన కలవరము నజితసింహుడు కనిపెట్టెను. ఆతని యాగ్రహము హెచ్చెను. కోపమును పట్టజాలక "మూర్ఖా, నాయాంగతులు నీకేల" యని యనెను.

సలీ :- వదరుబోతా, నన్నవమానించుటకు నీవెవరవు ?

అజి :- పందిమాంసము తినే నీచుడవు రోషము కూడనా?

సలీం క్రోధము నాపుకొొనజాలక అజితసింహుని తలపై గుద్దెను. అజితసింహుడా దెబ్బను సహించి యొక్క క్షణమూరకుండెను. మందిర మంతయు నిశ్శబ్దము దాల్చెను. కాని యదియంతయు తాత్కాలికమే. అజితసింహుని రోషము విజృంభించినది. దెబ్బ గాఢముగ నాటినది. తన యొరనుండి కరవాలము నూడబెరికి సలీం తలను దెగనార్చెను. ఒక్క క్షణములో విందువేడుకతో గూడిన మందిరము రక్తప్లావితమగు స్థలముగ మారినది. మీరున్నీసా మూర్ఛపోయెను. అతిధు లజితసింహునిపై కసిదీర్చుకొొన నుంకించిరి కాని పాదుషా యడ్డుపడెను. "ఇ సంరక్షణక్రింద నున్నాడు. ఈతనిపై చేయి వేయవలదు. ఈతని రక్షణకు నేను బాధ్యుడను న్యాయాధికారులకు వప్పగించెదను. అచట న్యాయము పరిష్కరింప బడగలదు" అని పాదుషా పలికెను. అందరును సరే యనిరి. అజితసింహుడు కారాగారమునం దుంచబడెను.

కారాగారమున నున్న అజితసింహుడు తన స్థితిని గురించి తలపోయ నారంభించెను. తనను మీరున్నీసానుండి విడతీసిన తన యవ్యక్తపు నడవడిని గురించి తన్ను తానే నిందించుకొొన దొడంగెను. కారాగారము నందలి తన గదిలో నజితసింహు డటు నిటు తిరుగ నారంభించెను. ఆందోళన యాతని హృదయమునజేరి పెక్కురీతుల బాధించుచున్నది. తనపూర్వపు సాహస కృత్యములన్నియు జ్ఞప్తికి వచ్చినవి. ఒక మిత్రుడైనను లేక, సముద్రముమీద తుపానులో నడచుచున్న నావలోని ప్రయాణికునివలెనున్నది ఆతని జీవితము. ఎప్పటికైనను తన కోరిక నెరవేరగలదని యాసమాత్రము పోలేదు. రేయింబవళ్ళతని స్మృతి పథమున మీరున్నీసా తాండవ మాడుచున్నది. ఇంతలో సలీమునకు తనకును జరిగిన పోరాటము జ్ఞప్తికివచ్చినది. తనకు పెండ్లి కాలేదని మీరున్నీసాతో నుడివి మోసగించి పాపము చేసితినేయని అజితసింహుడు విలపింప దొడంగెను. తనకొరకు సర్వాభరణములను త్యజించి పతియే దైవముగ నమ్మి తోడు నీడుగ నున్న తనభార్యను మరచినాడు. సలీ మీరహస్యమును బయల్పరచినాడు. తన మోసకృత్యములను గురించి మీరా యెట్లు తలంచునని తనలో

తాను వితర్కించుకొనుచుండెను.

రాత్రి పండ్రెండు గంటలయినను అజితసింహుడు, పచారు చేయుచున్నాడు. పహారా కాయుచున్న భటుని యరపు లపుడపుడు విన వచ్చుచున్నవి. రాత్రి గడచినకొలది భయంకరపు టాలోచనలు హెచ్చినవి. ఆలోచనలలో గొంత తడవు వంచిన తల యెత్తనే లేదు. ఎట్టకే లకు ధైర్యము తెచ్చుకొని, తల యెత్తెను. ఎదుట మీరా ప్రత్యక్షమైనది. ఆమెను కౌగలించుకొనవలెనని ప్రయత్నించెను కాని యామె తప్పించుకొని యిట్లు పలికెను.

"ఈయర్ధరాత్రి యిచటికి వచ్చినందులకు మీరాశ్చర్య పడుదురు."

"నాకాశ్చర్యము లేదు. మిక్కిలి విచారములో నున్న నన్నోదార్చుట కెవరును లేనివేళ నాప్రేమించు వస్తువు వచ్చిన నాశ్చర్యము కలుగునా?"

"ప్రేమయను పదమును నుచ్చరింపకుడు. ఉన్మాదురాలనైతిని. లేని భ్రమను పొందితిని. అదంతయు జరిగిపోయినది. జరిగినదాని కెవరేమి చేయగలరు? ఇపుడు కనుల తెరచితిని. న్యాయాన్యాయములు వితర్కించుకొంటిని. నానిష్కళంకహృదయము భగవంతునికి దెలియును. ఇపుడైనను నాస్వార్థరాహిత్యమును మీరు గ్రహించియుందురు.?

"నాప్రేమను, నావాగ్దానమును భంగపుచ్చెదవా?"

"నావాగ్దానము భంగపరుపరాదు. మీరు నన్ను మోసగించితిరి. సర్వము మీరేయని నమ్మిన నన్ను మోసగించితిరి - అందుకు మిమ్ములను దూషించను, దూషించుటకును రాలేను."

"నీవు దూషించినను యంగీకరించెదను కాని నాయాశాపాశమును త్రెంచివైచు వాక్కు లను వినజాలను."

"గత భ్రమలను మరువ ప్రార్థన. నేను నిశ్చయించుకొంటిని. నానిశ్చయము నెవరును మరల్చజాలరు. నేనెందులకు వచ్చితినో తెల్పెదను వినుడు. ఈరాత్రి తాము గొప్ప ఘోరకృత్యమును చేసియున్నారు. అందుకు శిక్ష మరణమే. రేపు ఉదయము మిమ్ములను న్యాయాధికారికి వశపరతురు. వారికి కనికరమేమాత్రమునుండదు. నాతండ్రికి నామీద నమిత విశ్వాసము. ఈవిశ్వాసము నాధారపరచుకొని, తండ్రిని మోసగించి, 'కారాగృహమునుండి మిమ్ములను విడిపింప నొక యుపాయము పన్నితిని. ఇక్కడకు రెండుమైళ్ల దూరములో సింహపురమను గ్రామముగలదు. అచ్చట నేనెరుగున్న యొక బంధువు గలడు. నేనొసంగు జాబాతనికి జూపి, అతడొసంగు నశ్వము నధిరోహించి యెక్కడకైనను బోయి ప్రాణమును గాపాడుకొనవలెను."

"నన్ను విడుదలపుచ్చితివని మీజనకునికి దెలియుచో నాతడు నీపై మండిపడును. అపుడు నీగతి యేమి?"

"అతని పాదములపైబడి క్షమాపణ కోరుకొందును."

"ఈపహారా జవానులను దాటుట యెట్లు?"

"మాజనకుడు మద్యపానమును గ్రోలి మైమరచి నిద్రించుచున్నాడు. నాతండ్రి గదిలో బ్రవేశించి అంగుళీయకమును దొంగిలించివచ్చితిని. ఆయుంగరము మున్నయెడల నన్నెవరు నడ్డగించజాలరు. రేపు పది గంటల లోపున ఏబదిమైళ్లు దూరము దాటిపోవలెను. లేనిచో నపాయము వాటిల్లగలదు."

"నిన్ను విడిచిపుచ్చుటకంటె మరణమే శ్రేయస్కరము. నేను తప్పించుకొనిపోజాలను."

"అందువలన నాకు మరింత దుఃఖము కలుగును"

"అయితే నన్ను విడువవలసి వచ్చిందులకు నీవుగూడ విచారించెదవన్నమాట. మీరా, నిన్నిక మోసగించను. నిన్నవమాన పరచను. నాకు వివాహమైనది. మన ప్రేమవాహిని కిది యంతరాయమని నాకు తెలియును. నేనొక్కటి మాత్రము కోరుచున్నాను. నాధర్మపత్ని యేవ్యాధిచేతనైనను మరణించె యెడల-"

"అట్టిసందర్భములోనొశించబడెదను. కాని—"

"నాకాస నిచ్చితివి ఇంకను కొంతకాలము జీవించెదను. నీవే నాయారాధ్యదైవము. నీవేమార్గము త్రొక్కుమనిన నేనామార్గము త్రొక్కెదను. ఒక సంవత్సర కాలములో నేను నిన్ను వివాహమాడెద-"

"ఆర్యా, గడువును నిర్ణయింపకుము. నాహృదయములోని భావములను కప్పిపెట్టుకొనునంతటి యవ్యక్తురాలను గాను. మిమ్ములను తప్ప నన్యుల బ్రేమింపను. ఏకారణముచేతనైనను, మీపొందు లభింపనిచో ఆజన్మాంతము కన్యగనే కాలము గడిపివేయుదును."

"నిజముగనేను ధన్యుడను. మీరా, యీ ఉంగరమును తీసికొనుము. ఇటువంటి ఉంగరమే నాయొద్ద నున్నది. ఇదిగో చూడుము మంచిరోజు వచ్చినపు డీయుంగరము నిచ్చి యొక సేవకుని బంపెదను. వానిని వెంబడించి నీవు రావలయును సుమా"

"అట్లనే"

"నేనుపోయివచ్చెదను. నేడు మహాసుదినము."

అని అజితసింహుడు మీరున్నీసా సలహా ననుసరించి స్త్రీవేషమున కారాగారమునుండి తప్పించుకొనిపోయెను.

## 6

ఎనిమిదేండ్లు గడిచినవి. అజితసింహుడు బ్రతికియున్నంతకాలమును తాను మీరున్నీసాను వివాహమాడుట కష్టమని, సలీము యెట్లయిన నాతని చంపింప ప్రయత్నించుచుండెను. వేటనుండి తిరిగివచ్చుచున్న యజితసింహుని వర్తమానమెరిగి సలీమిరువది మంది యనుచరులతో నజితసింహునిపయి బడి బోరెను. తన యిరువురి యనుచరుల సహాయముతో నజితసింహుడు సలీము నెదిర్చి అతని భటులను పది మందిని చంపగా మిగిలినవారు ప్రాణరక్షణార్థము పలాయనులైరి. అజితసింహుడు గాయములతో నింటికి చేరుకొనియెను. ఒకమాట తెలుపమరచితిమి. పాదుషా కారాగారమునుండి పారిపోయివచ్చిన యజితసింహుడు సోదరునితో సంధి చేసుకొని రాణిపురమున నుండుటయు, కేశవవర్మకును పాదుషాకును గలమైత్రి సహాయమున యజితసింహుని ప్రాణదండనము తప్పుటయు చారిత్రిక విషయములు.

## 7

అజితసింహుని సేవకుడు డిల్లీకి ప్రయాణమైపోయెను. ఎకాఎకిని డిల్లీ చేరుకొనియెను. తక్షణమే మీరున్నీసాను దర్శించి అంగుళీయకమును జూపి అజితసింహుడు మీరున్నీసా రాకకై యెదురుచూచుచున్నటుల దెలిపెను.

మీరున్నీసా నడియవ్వనమున నున్నది సౌందర్యమినుమడించినది గాని యామె వదనము నిరాశ సంజనితమగు వర్ణము కలిగియున్నది. అజితసింహుని సేవకునిగాంచి,

"అక్కడివిశేషములేమి" యనిప్రశ్నించెను.

"అమ్మగారు మరణించి నేటికి మూడుమాసము లైనది. కొన్నిరాచకీయ కారణములచే నయ్యగారింత యాలస్యమును జేసిరి. తమను తక్షణమే వెంటతీసుకొని రమ్మనిరి.

"గాయము లెట్లున్నవి. ప్రమాదములేదు గద!"

ఆమాట యెవరు చెప్పగలరు?"

పిడుగో మునిగినదని తలంచినది. జాగుచేయుటకు నావకాశము లేదు. వెంటనే పయనమయి రాణిపురమును చేరుకొనినది. అంతః పురమున నజితసింహుడు పరున్న స్థలమునకు బోయి తనప్రియునిగాంచినది. "ఇంతబాధ పడుచుండియు నింతయాలస్యముగ కబురుచేసియుండిరే. బ్రతుకునో, బ్రతుకరో నాయదృష్టమెట్లున్నదో" అనివిలపించుచుండెను. "ఎంతమార్పుజెందిరి. ఆందోళన, కారాగారవాసము, నిరాశ పీల్చి పిప్పిచేసినవి." అనియనుకొనుచుండ అజితసింహుడు కనులను విప్పి "మీరా, వచ్చితివా" యనెను. ఆతని కన్నులలో నూతన కళ ప్రవేశించినది. "తుట్టతుదకు మనము కలుసుకొనగలిగితిమి. నీవాగ్దానమును పొందిన నాటినుండియెన్నడయినా నాకోరిక నెరవేరునాయని చింతింప నారంభించితిని"

"నేనును యట్టిబాధయే యనుభవించితిని. బాధకుతోడు యీ గాయములేమిటి?"

"అవును. నాదురదృష్టము. నాబాధ కష్టములు భగవంతునికే యెరుక. నాకు జీవితాశ లేదు. అవసాన సమయమునందయినను నిన్ను చూచినందులకు ధన్యుడను," అని కనులు మూసికొనెను. మూసిన కనులు తెరువనే లేదు. అజితసింహుని యాత్మకైవల్యము చేరుకొనినది. మీరా తనప్రియతముని మరణమును కనులార జూచినది. సమీపమున మేజాబల్లపై నున్న మందుసీసాను తీసుకొని, తనవద్దనున్న పొడిని దీసి దానిలో కలిపినది. అజితసింహుని మోమును దిలకించుచు నెమరుగ గోడనానుకుని కూర్చొని విషపునీటిని పుచ్చుకొనినది. మీరా యొక్క ఆత్మ యజితసింహుని యాత్మను కలిసికొనినది. ప్రేమ ప్రవాహమునకు వర్ణమతవివక్షణ లేదు. గొప్ప వేదయను నది లేదు ఆజన్మాంతము నిష్కళంకముగ జరుగవలసినదే.

---

# అభిలాష

వడ్లమూడి వెంకటరత్నంగారు.

1 అల్లదె! చూడుమా! గగనహర్మ్యతలంబున నవ్వు వెన్నెలల్
జల్లుచుమీఅ నస్మలి విలాసము తురపెసలాడు చందమా
మల్లనఁజేరఁ బిల్చుఁ దనయంతికభూమికినాడఁ బ్రేమముల్
జల్లునఁ జేపు చూపుల వెసంజని నేఁజరియింతు నచ్చటన్ ॥

2 తలతలవాడు నమృతపు దారములన్ మరబొమ్మకోలె ను
జ్వలగతినొక్క దాటునను చంమరు నంకముఁ జేరి వెండియున్
వలనుగ దేవమూర్తి వలె వత్తుఁగరావలితోన నిట్టులీ
యిల మెలఁగంగ లేముగద యెమ్మెయినైన ననుంగు మిత్రమా ॥

3 సాంద్రచ్ఛాయలనీను చిత్రదళ పంజాతోల్ల సద్భూమిజా
తేంద్రం బచ్చటఁ బచ్చతాజిగిని భాసిల్లున్, ఫలాలందు ద్రే
లుం ద్రుంగించుచుఁ గెంపులన్, ఫలదళా ల్తోరంబుగాఁ రాల్చి యా
చంద్రుఁడోము శశార్భకంబు మృగముల్ సంప్రీతితో మేపెదన్ ॥

4 ఊయలలూఁగుచుండు నలయాడల నొక్కెడ, కోతికొమ్మల
త్యాయతలీల నొక్కపుడు నాడుదు, కొమ్మలఁగూరుచుండి నే
కోయని కంఠమెత్తి కలకోమల నవ్యవిలాస మాధురి
స్థేయముగా నొకప్పుడు ప్రతిధ్వను లీనఁగ నాలపించెదన్ ॥

5 ఇమ్ముగ సమ్రగాగ్ర్యకము నెక్కి చరించెద నొక్కవేళ, మే
ఘమ్ములనెక్కి భీకరముగా నుఱుముల్ప్రచరింపఁ జేసి లో
కమ్ములనెల్ల నొక్క త్రుటికాలమునన్ జరియింతు నొక్కచో
నెమ్మదిగా శయింతు రజనీధవునంకతలిన్ మఱొక్కటన్ ॥

6 చదనగు వజ్రదేశమున జానుగ ముత్తెపు పాలగచ్చు చ
క్కదనము మీఱఁ దీర్చినదిగాని యిటుల్వలె మట్టినేలగా
దది, యటఁ దివ్య బొంగరము లాగవు నాశకటంబు మెల్లగా
నడికిప నాశకంబచట నాగకపేరెముపాఱు వింతగన్॥

7 నెమ్మిని సమ్మహీరుహము నీడవసించుచు పేదరాలి పె
ద్దమ్మ యొకర్తు కాబిడ విహాయసమంటఁగ రాట్నపుంశ్రుతిన్
గమ్మనఁ బాడుచున్ విమలకౌముది నాడికలట్లు తీయు దా
రమ్మును నాపె చెంతఁగథలన్ వినుచుందును కోర్కులూరఁగన్.

8 దండము చేతఁ దాల్చి యాల దండధరుంబలె చెండుచుండి కో
దండము పాశముల్నెలఁగ దాఁపెడి కాఱులు లేవ టయ్యె వా
రుండఁడు పాఠశాలయని యూరక గొణ్గడివారు లేరు చం
ద్రుండె స్పృశించుచుండు సుధదోఁగ శరీరము తన్మయంబుగాన్ ॥

9 మిత్రుడస్త ధరాధ్రిమెక్క శశితో మిన్నెక్కుదన్ సన్ను నా
మిత్రిల్ గుర్తిడలేక కాంచుచును నుస్మిలాక్షులై చందమా
మా త్రైలోక్య మనోభిరామ యిటురమ్మాయంచుఁ బ్రార్థింపవై
చిత్రింజూచుచు నవ్వుచుందునట సంస్థితుండనై తద్దయున్ ॥

10 నిసి యేతేజ ననంత హర్మ్యతలి బిండీభూత లావణ్య సా
రస మానరక్ష శిశుప్రకాండముల రారావు ల్విజృంభింప లా
లనతో వెన్నెల తప్పలాడుదుము లీలాలోలతన్, వేగ వ
క్షసము ల్పలెక్కెడి వారు లేరచట సౌఖ్యంబన్న వేఱున్నదే॥

# వనలత

చిట్టా శేషాచలం గారు.

హిమవత్పర్వత ప్రాంతమునందు దట్టమయిన యొకానొక యడవిలో దొంగల గుంపొకటి నివసించుచుండెను. ఈ గుంపులోనివారందరును భిల్లు జాతికి జెందినవారు. దీనికి నాయకుడు కదంబుడు. ప్రతిగ్రామమును దోచి నిస్సహాయులయిన బాటసారులను కష్టపెట్టుటయే వీరిపని. దొమ్మరాట వీరి కులవృత్తి.

ఒకనాడీగుంపు కాంచనపురమును జేరెను. ఆగ్రామమునందొక బ్రాహ్మణునికి జెందిన పర్ణకుటీరమొకటి గలదు. అర్ధరాత్రియందు కదంబుడా పర్ణకుటీరమును ప్రవేశించి యందేమియు గానక యారునెలల శిశువును మాత్ర మెత్తుకొని పోయెను. ఆశిశువును తన గృహమును జేర్చి వనలతయనుపేరిడి తనభార్య కొప్పగించెను. వా రాశిశువును పెంచుకొనుచు తమకు సంతానము లేని కొరతను దీర్చుకొనుచుండిరి. వనలత దినదిన ప్రవర్ధమానయై యపురూప సౌందర్యమును బడసి యెల్లర నాకర్షించుచుండెను. కదంబుడీమెను దొమ్మరవిద్యయందు నిపుణురాలిగా నొనర్చెను. త్రాడుపై నాట్యము చేయుటలో దన ప్రావీణ్యమును జూపి చూపరుల సమ్మోహితుల జేయుచుండెను. ఎచ్చటికిబోయినను కదంబుడామెను వెంటదోడ్కొని పోవుచుండెడివాడు. దొంగతనమునకు బోవునప్పుడుగూడ వనలత కదంబుని ననుసరింపవలసినదే. భిల్లుజాతికన్యయగు శశిరేఖ యీమెకు చెలికత్తె.

ఒకానొక సమయమున నీదొంగలగుంపొక బ్రాహ్మణాగ్రహారమును జేరెను. ఈ గ్రామమున కధికారి నాదరచందు. నాదరచందు వనలతయను సుందరమయిన యాటకత్తెవచ్చిన దని తెలిసికొని యాదొమ్మరగుంపు నాహ్వానించి తనయింటియెదుట దొమ్మరవిద్యలో నేర్పుగల ప్రావీణ్యమును జూపగోరెను. కదంబుడు నందులకంగీకరించి ప్రదర్శనము నేర్పాటు చేసెను. ఆప్రదర్శనమున తననైపుణ్యము నంతయు జూపుచున్న వనలతపయి నెల్లరును తమ దృష్టుల నిగుడ్చి చూచుచుండిరి. ఇంతవరకామె సౌందర్యమును గురించి యూహించుకొనుచు మా[illegible]యుచున్న నాదరచందామెయొక్క లావణ్యమయ విగ్రహమును గాంచి ముగ్ధుడయ్యెను. అంతటినుండి ప్రేమబీజము పెరిగి మొక్కలెత్తుచుండెను. నాదరచందామెకు వెయ్యిరూప్యముల విలువగల శాలువయును మఱికొంత ధనము నొసంగెను. కదంబుడాగ్రామము న[illegible] సంతకాలము తమకొకగృహము నేర్పాటు చేయ గోరి తగిన వసతిని బొందెను.

ఒకనాడు సాయంకాలము వనలత నీరు దెచ్చుచుండ నాదరచందు జూచి తనయభి[illegible]తను నెఱింగించెను. ఆమాటల కామె ప్రత్యుత్తర మొసంగక శీఘ్రముగ నచ్చోటు వాసెను. అనునది మిటులనే జరుగుచువచ్చెను.

ప్రేమ ప్రవాహమున కడ్డులేదు. కాలము నడుచుచున్నది. కాలముతోబాటు వనలతా నాదరచందుల ప్రణయబీజము పెరిగి పెద్దదగుచున్నది. వనలతగూడ యా బ్రాహ్మణుని మోహించియే యుండెను. ఒకనాడామె నాదరచందుతో దల్లిగాని తండ్రిగాని బంధువులుగాని యన్నలుగాని లేక నొంటరిగ కాలము గడుపుచున్న దీనురాలిపై నింత మోహమెందులకని ప్రశ్నించెను. అవివాహితుడును మోహావి

పీడితుడునగు నాదరచందుని కీవాక్యములు రుచింపలేదు. వనలతయు ప్రేమపీడితయై లోలోన కృశించుచుండెను. కదంబుడామెయొక్క విచారమునకు గారణ మెరుంగజాలక, నగలు మున్నగు వాటిని గొనివచ్చి సౌఖ్యము నొసగ నూర్పు బ్రయత్నించెను; కాని ఫలితము లేకపోయెను. చెలికత్తెయగు శశిరేఖ యొకనాడు "ఏదియో నాలోచించుచుంటివి. నీకోరిక నాకు తప్పక తెల్పుము. చేతనయిన సహాయము చేసెదను. చెలికత్తెనగు నామెకుగూడ నింత రహస్యముగ నుంచవలెనా" యని నుడివెను.

వనలత గద్గదస్వరముతో సర్వమును చెప్పి చివరకు మాట రాక యేడ్వ దొడంగెను. శశిరేఖ యామె శిరమును నిమురుచు ధైర్యవచనములు చెప్పుచుండెను గాని వనలత యామాటల నెంతమాత్రమును లక్ష్యపెట్టలేదు. ఇక్కడామె తనప్రియుని గానని యెడల యొక్క నిమిషమయినను ప్రాణము నిలుపలేదు. సూర్యచంద్రులసాక్షిగ నాతడే తన భర్తయనియు, ఎన్నికష్టములు వాటిల్లినను నాతని గూడిటే లోకమనియు నామె తలపోయుచుండెను.

వనలతకును నాదరచందునకును సంబంధించిన ప్రణయ వృత్తాంతము కదంబున కెట్లో తెలిసెను. కనుక తానక్కడ నుండ ననియు త్వరలో పరివారముతో నచటినుండి కదలవలెననియు నుత్తరువొసంగెను.

ఆది రాత్రిసమయము. పక్షులయొక్క అవ్యక్త మధురధ్వనియును, తుమ్మెదల గానరవమును, పచ్చగా పెరిగిన పయిరుల మనోహరతయు నెట్టివారినైనను నానందమున ముంచక మానవు. కోయిలలు హాయిగ పాడుచుండ నాదరచందు నిద్ర మేల్కాంచి తనహృదయేశ్వరిని జూచుటకయి నదియొడ్డునజేరి నిల్వబడి యుండెను. వనలతగూడ తనప్రియుని జూచుటకై నిశీథమున నచటికి జేరెను. నాయికానాయకు లిద్దరు నాయర్ధరాత్రమున పరస్పర ప్రేమ వాక్కులను వెలిబుచ్చుకొనుచుండిరి. "ప్రియురాలా, నీవు నాతో రమ్ము. నాసర్వస్వమును నీకర్పించెదను. మనమిద్దర మెచ్చటికైన బోయి సౌఖ్యముగ గాలము బుచ్చుదము" అని నాదరచందనెను. అందులకామె యశ్రువులరాల్చుచు యాతని భుజముమీద వ్రాలి "మనోహరా, నిర్భాగ్యురాలను పంజరములోని పక్షిని. దురదృష్టవంతురాలను. మనసౌఖ్యమున కంతరాయములు పెక్కులు గలవు మనోభీష్టమును నెరవేర్చుకొనజాలని జన్మ వ్యర్థము. నేనెందయినను బడి నాప్రాణముల త్యజించెదను. నాకయి మీరు కృశింపక మరియొకరిని జేపట్టి సుఖింపుడు" అని పరిపరి విధముల నేడ్వసాగెను.

వనలతయొక్క నిజవృత్తాంతమును దెలిసికొన విశ్వప్రయత్నములు చేయుచున్న కదంబుడారాత్రి చెట్టు మరుగుననుండి నాయికానాయకుల సంభాషణ విని కోపోద్దీపితుడై యింటికి జేరి యేమియు నెరుగనివానివలె నుండి, మరునాడు వెంటనే యీగ్రామమును వదలు ప్రయత్నమును జేయుచుండెను. మరుసటిరాత్రి వనలత దన ప్రియునితో రానున్న వియోగము నెఱుకపరచెను. ఆవియోగబాధ భరించుట కష్టము. తలిదండ్రుల మాట వనలత జవదాట దలచుకొనలేదు. తన మానస మీతని స్వాధీనము చేసిన యీమె నేడాతని బాయుటెట్లు? ఏమియుబాలుపోక తానెచటికి బోవునదియు నాతనికి జెప్పెను. వారిద్దరు నొకరినొకరు విడబాయు

నప్పుడెంతో ఖేదమొందిరి. అప్పటి వారి మానస క్షోభము వ్రాయ నలవి కాదు. మరునాడుదయము నాదరచందు భిల్లులా కిందటి రాత్రియే గ్రామమునుండి వెడలిపోయిరన్న వార్త వినెను. నిరుత్సాహుడై పోయెను. ఏమి చేయుటకును దోచలేదు. అతని ముఖభావమును గ్రహించి యెవ్వరైన నీవేమిట్లుంటివని యడిగిన నతడు మౌనముద్ర ధరించును. తదుపరి యాతడు వనలత కొంత కాలముండి వెడలిపోయిన కుటీరమునకు బోయెను. అది చాల ప్రశాంతముగ నుండి పిట్టలేని పంజరమును స్ఫురింపజేయుచుండెను. అట్లుండుటచే నాతని విచారము మఱింత యగ్గలమయ్యెను. ఇంటిలోని యన్ని వస్తువులపై నాతనికి రోతపుట్టెను. తన ప్రియురాలిని వెదకుకొనుచు నెరికిని దెలియకుండ నొకనాటి నిశీథమున బయనమై పోయెను. ఆరీతిగా నిద్రయనక హారమనక దారిలో బోవ్వగరాని యనేక కష్ట పరంపరలను దాటి తుట్టతుదకు కంసానది యొడ్డున తన ప్రియురాలిని కలుసుకొనెను. అప్పటి వారి సంతోషమునకు మేరలేదు. వనలత తన మనోహరుని గుటీరమునకు దోడ్కొనిపోయి యాతనికై పంచభక్ష్య పరమాన్నములను తయారుచేయుచుండెను.

"ఇది యేమి? మన మీదినమున క్రొత్త విషయమును గాంచుచుంటిమి. ఆరునెలలనుండి యీ వనలత జీవన్మృతయై పడియుండి నేడేలకో గొప్ప యానంద సముద్రమున మునిగియున్నది" అని తక్కుంగల భిల్లుజాతివారు చెప్పుకొన దొడంగిరి.

కదంబుడు తానదివరకు సహించక విడిచి వచ్చిన బ్రాహ్మణుడు మఱల తన గృహమున ప్రత్యక్షమగుటచే మండిపడెను. కాని యాకోపము మడచుకొని, యాతనికి దొమ్మర విద్యలు నేర్పి తన పరివారములో నొకనిగా జేర్చి నిల్చి యుంచెను. నాదరచందు నీడు సంతోషముతో ననుమతించెను.

అర్ధరాత్రి సమయము. కదంబుడు వనలత గది ప్రవేశించి యామెతో నొక క్రూరకార్య మొనరించుటకు సిద్ధముగ నుండుమని చెప్పెను. అతడు కంఠము నెఱిగెత్తి "నేను నిన్ను కన్న కుమార్తెవలె పెంచితిని. నీవు సౌఖ్యముగ నుండుటకై యనేక విధములయిన యేర్పాటుల నేర్పరిచితిని. అట్టియెడ నిన్నొక నూతన పురుషుని కిచ్చి వివాహమొనరించుటకు నా మనము సమ్మతించదను. వాడింద్రజాలము వల్ల నిన్ను వలలో వేసుకొన్నాడు. కాన వానిని నేను నాశన మొనరింపదలంచితిని" అని చెప్పుచు యామె చేతి కొక కత్తి నిచ్చి యాబ్రాహ్మణుని నగ్గరకు వచ్చినప్పుడు చంపమని చెప్పెను. ఆమె కేమి యొనరించుటకును దోచలేదు. కదంబుని యాజ్ఞ మీరిన రెండల వచ్చు కష్టముల నెఱుంగును. మారు మాటాడక కత్తిని తీసికొని యామె తన చెలికాడు పరున్నచోటి కేగెను.

నాదరచందు సౌఖ్యమును దోపజేయు ముఖకాంతితో నిద్రాసుఖము ననుభవించుచుండెను. ప్రియుని మంచము చేరినప్పటి కామె భయంకర స్వరూపిణియై కాన్పించెను. కన్నులెఱ్ఱనై యశ్రువుల గురియించుచుండెను. ఆతనిదగ్గరనుండి ముఖము నొకసారి వీక్షించెను. ఆహా ఏమి యీదివ్య సుందర తేజము! ఆమెకిదివర కెన్నడట్టి భువన మోహనరూప మాతనియందు కన్పడలేదు. కొంచెమాగెను. అట్టి రూపమును జేతులార భగ్నము చేయగలదా. ఆహా ఆమె! తండ్రో తమదుర్మార్గుడు! ఆమె మనోహరాకారుడయ

కర్మచ [illegible] బేమించిన వాని నామె చేతులతోనే చంపిం[illegible] జూచుచున్నాడు! [illegible]ధిచేత బలీయము దుర్లంఘ్యము. ఆమె ఖడ్గము నెత్తుచుండెను. కాని యది యామె తండ్రిచేత కిచ్చగించక [illegible]ద బడిపోవుచుండెను.

"నాతనిని చంపలేను. దానికి బదులు నేనే యాక[illegible]తో బొడుచుకొని యసువులను విడచి తండ్రి[illegible]రి కోపమును మఱల్చెదను" అనియామె తలపో[illegible]జొచ్చెను. నాదరచందా సమయమున [illegible]కస్వప్నముననుండి తన ప్రియురాలయిన వనలత మరణావస్థ యందున్నట్లుగాంచి కండ్లు తెరచి చూడగా కట్టెదుట వనలత చేత నొకక[illegible]తో నాత్మహత్య చేసికొనబోవుచుండెను. ఆతడు తటాలున మంచము మీదినుండి గంతు[illegible]సి యామె చేతిలోని కత్తిని లాగుకొనెను. [illegible]మెయు జరిగిన కథ నంతయు సవిస్తరముగా [illegible]ఖ్యానించెను,

ఆ[illegible] చెప్పి ముగించగానే నాదరుచం దిట్లనె: "ప్రేయసీ, మనము పరస్పరానురాగముక[illegible]వారము మృత్యువు తప్ప నితరమెద్దియును మనవ వేరు చేయలేదు. కావున సుఖముగా నీచేతు[illegible]లో నన్ను చావనిమ్ము"

వ[illegible]లత తనయాత్మతో యుద్ధము చేయలేకుండె[illegible]. ఆమె యొక్క లేమార్గము తనమనసునందు [illegible]ృష్టించి, గుఱ్ఱపు సాలనుండి రెండుచక్కని గుఱ్ఱవ[illegible]లను దెచ్చి తానును తనప్రియుడును యెవరి తెలియకుండ వాయువేగమున బోయి[illegible]. రాత్రంతయు పయనము చేసి యరుణోదయమ[illegible]గునరికి గుఱ్ఱములు రెండును యొక్క నదీ ప్రవా[illegible]మును జేరెరి. నదిని దాటవలసివచ్చెను. గుఱ్ఱమ[illegible]లను దిగిరి. నది యతిలోతుగా నుండెను. శతుృవులు వెంబడించి వచ్చుచున్నారే మోయని యొక మూల భయము. కాలితో నడువసాగిరి. కాని లాభము లేక పోయెను. అప్పు డొక నావ వారిక[illegible]ట బడెను. కొంచెము ధైర్యము చిక్కబట్టి యాపడవను పిలచి యది దగ్గరకు రాగా నందెక్కిరి. ఆపడవ యొక వర్తకునిది. వాడు వనలత పడవెక్కి నప్పటి నుంచి యామె సౌందర్యమును గాంచి ముగ్ధుడై యట్టి యువతీమణిని పొందినవాని జన్మమే జన్మము గదా యని పరిపరివిధముల తపించుచుండెను. నావికులతో నెట్లో యాలోచించి నాదరచందును నదిలో ద్రోయించెను. తురుక్షణ మావర్తకుడు వనలతయొద్దకు వచ్చి తన మనస్సులో నుండు కోర్కెను బహిర్గతము చేయ నామెయు మాటాడక యంగీకరించునట్లు పొడగట్టెను. తరువాత వనలత వర్తకునకు దాంబూలము తయారుచేయుచు నిదివరకే యామె తల వెండుృకలలో దాచితెచ్చిన విషమును తమలపాకులలోనుంచెను. ఆతడొక తాంబూలమును సేవించి ప్రాణమును బాసెను. మిగిలిన యాకులను నావికులు సేవించి నేలబడి మరణించిరి. ఆమెయుప్రియుని ప్రాణావనోద్దేశముగలదగుటచే నీట దుమికి చేపవలె యీవ్వన నదియొడ్డు చేరెను. అక్కడ తన ప్రియునికై వెదకెను. ఎందును గానబడక కడకొక దేవాలయములోని కరిగెను అందుండి వచ్చొక యార్తనాదము వీనుల సోకంత్వరితముగ నేగిచూడ శుష్కించిపోయి శల్యమాత్రావశిష్టుడైయున్న నాదరచందు పడియుండెను. అప్పుడామె యచ్చటికి సమీపమున నే యున్న యొక సన్యాసివద్దనుండి కొన్ని వనమూలికలను సంగ్రహించి వాటితో నాతని కాపాడెను. కొంతకాల మరుగునప్పటి కాతనికి తెలివి రాదొడంగెను. లేచి తిరుగుట కిం

కను వీలులేదు.

మొట్టమొదట వనలతను తన చెల్లెలిగా భావించిన సన్యాసి యిప్పుడామెను వేరు విధ ముగలలంచి మందిచ్చెదనని మోసగించి యొక చోటికి తీసుకొనిపోయి తనకోర్కె నెఱేం గించెను. ఆమెయు "నాభర్తను రక్షింపుము. తరువాత నష్టి కానిచ్చెదను" అని సన్యాసి నంగీకరింపజేసి వెడలెను.

నాదరుచంద్రుడింకను బలహీన స్థితిలోనే యుండెను. అర్ధరాత్రి సమయమున వనలత యాతనిని భుజములమీద వైచుకొని దేవళము నుండి బయలుదేరి వెడలిపోయెను. వెనుక నెవ్వరు నామెను వెంబడించలేదు.

ఆరుమాసములయినతరువాత భార్యపరిచర్య చేత నాదరచంద్రు సంపూర్ణ దేహారోగ్యవం తుడయి సుఖముగా కాలముగడుపుచుండెను. నివసించుటకిండ్లులేనప్పటికి చెట్లక్రిందనే నివసిం చుచు కందమూలములే భుజింపుచు సుఖముగా నుండిరి.

ఈ సుఖమయ సంసారమును చేయుటకు పరమాత్మ వారి కెక్కువ గడు వొసంగలేదు. ఒకనాటి సాయంకాలమున నిద్దరు మనోహర మైన యొకసరోవర ప్రాంతమున గూర్చుండిరి. వనలత తన జననము మొదలు నాటివరకు జరి గిన కథను నాదరుచంద్రుతో చెప్పుచుండ తటా లున యామె యొందులకో యదరిపడెను. నాద రచంద్రు ప్రియురాలినిజూచి "నీకు గలిగిన బాధ యేమి? ఏకారణముచేత నీవు ఖేదమువహించి యుంటివి?" అనియడుగ వనలత "స్వామీ మన యువసానకాల మాసన్నమయినది. అదిగో నాతండ్రి మనవ్రాణయు వ్యాపారము నెఱింగి చెప్పకుండ పాటిపోయినందులకు దగిన ప్రతీకార మొనర్చుటకు వచ్చుచున్నాడు. అదుగో ఈల ధ్వని. అది ప్రాణస్నేహితురాలగు శశిరేఖ యొక్క ఈలధ్వని. మనసెచ్చటికైనను పాఱి పోయి ప్రాణములను గాపాడుకొమ్మని హెచ్చ రించుచున్నది" అని చెప్పుచుండగనే కొన్ని వేట కుక్కలువచ్చి వారిని ముట్టడించెను. మఱికొన్ని నిమిషములకు కదంబుడు క్రోధ కషాయిత నేత్రుడై ప్రత్యక్షమయ్యెను. కన్నులనుండి విస్ఫు లింగములు రాల "ఓసీ నీచురాలా ఈకత్తిని గొని వానిని తత్క్షణమే పొడిచి నావెంట రమ్ము. నాపెంపుడు కుమారుడగు సునునకు నిన్నిచ్చి వివాహ మొనరించెదను" అని గర్జిం చెను. ఆసమయము భయంకరముగనుండెను. ఎదురు తిరిగినయెడల లాభము లేదని తలంచి వనలత యతని చేతిలో నికత్తిని తీసికొని పొడు చుకొని మృతినొందెను.

నాదరచంద్రుకూడ ప్రక్కనున్న భటులచే పొడువబడి మృతినొందెను.

కదంబునినోట మాటరాలేదు.అతడు నిశ్చేష్టి తుడయ్యెను. కథ యీరీతిగా జరుగునని యాతడనుకొనలేదు. వెంటనే భటులను పంపించి వేసి వనలతలేని గృహము గృహమే కాదని తలంచి యెవ్వరికి చెప్పకుండ యెచ్చటికో యెందులకో కనబడకుండ నేగెను.

నాదరచంద్రు వనలతల నిద్దరి నొకసమాధి లోనే పూడ్చిరి. శశిరేఖ ప్రతిదినము సమాధి యొద్దకేగి పూజించి మిత్రురాలికయి దుఃఖించి కన్నీరు కార్చుచుండెడిది.

# తమాషాలు

## 1

(ఒకరు)

### స్నేహము.

"మనము తుదివరకు స్నేహితులముగానుందము."

"సరేకాని. నాకు పదిరూపాయల బదులిమ్మా?"

"అయితే, యిదేతుంది. మనస్నేహానికి"

### ఆశ.

"రోగియగు భర్త మంచముదగ్గిర కూర్చుని భార్య:-

"డాక్టరుగారూ! ఇక ఆశ లేదనెదరా?"

డా:- "ఏమో నాకు తెలియదు; కాని మీరు దేనికయి ఆశిస్తూ ఉన్నారో ముందు చెప్పండి.

### ఏడుపు.

తండ్రి:- వాడెందుకోసం ఏడుస్తున్నాడు.

కొడుకు:- నేను వాడితో ఆడుకోనని.

తండ్రి:- నువ్వెందుకు వాడితో ఆడుకోవు.

కొడుకు:- వాడేడుస్తున్నాడు కాబట్టి.

### అధికారము.

"అచ్చీ! ఇకమీద నీవు నతో మోటుగా ప్రసంగింపకూడదు. అట్లయిన, ఊరుకోను. నీవు నన్ను దొరసానమ్మగారనియు, లేక అమ్మగారనియు, ఒకప్పుడమ్మా అని నన్ను పిలువవలయును. నీయజమానిని పిలువవలసివచ్చినప్పుడు దొరగారు, బాబుగారు, లేక బాబూ అని అతనిని పిలువవలయును.

అచ్చి:- చిత్తము.

◆ ◆ ◆ ◆

కొన్ని రోజులవెనుక, అచ్చి పరుగెత్తుచు వచ్చి గద్గద స్వరముతో,

"దొరసానమ్మగారు, లేక అమ్మగారు, ఒకప్పుడమ్మా, దొరగారు, లేక బాబుగారు, లేక బాబు, మేడమెట్లమీదపడి గాయం చేసుకున్నారు" అన్నది.

### తాళాలు.

వెంకటరావు:- ఇదేమిటోయ్. నారూమ్‌లో కొచ్చి తాళాలు తీసుకపోయాడు. అడిగితే మోటుగా మాట్లాడుతాడు. మనిషి ననుకున్నాడా, గాడిదననుకున్నాడా నరశింహం.

నరసింహం:- ఏమో! ఇందాకలా నీపాటవిని అనుకున్నాడేమో.

### సూర్యగ్రహణం.

శర్మ:- ఏమివోయ్, మీరందరెందుకు నవ్వుచున్నారు.

ఒకడు:- రామారావు ప్రశ్న విని.

శర్మ:- ఏమిటది.

ఒకడు:- లండన్‌లో సూర్యుడుకనిపిస్తాడా అని

రామా:- నేనల్లా అడగలేదండి. లండన్‌లో కూడా సూర్యగ్రహణం ఉటుందా అన్నా.

## 2

### వనితసిద్ధము- వివాహమునకు - వనితసిద్ధము.

దామరాజు వెంకట రమణమూర్తిగారు

సీ॥ మొగము పెదదించి ముద్దుమాటలుగల్గు
బొంతంటికాయంత ముక్కుగల్గు

లేడికన్నులుగల్గు లేతబుగ్గలుగల్గు
జోడకాళ్లతో తోగిన నీడకలను
నగవువెన్నెలకేమి నాణెంపుగటిగల్గు
క్షుద్బాధచే పొట్ట చుట్టుకొనును
పసిడిగాజులుబోలు పైసావు రెండేసి
కాసిగాజులు హస్తకాంతి కమరు
పైటనిగ్గులుగల్గు బాగైన పొడుగాటి
కంఠమందున ముచ్చికాసుపేరు
కురులు నల్పుకునెందు కొదువేమియును లేదు
మొన్ననే పెంచుట మొరిపెలింక
ఆదివారపు సంత నర్ధరూపాయిచ్చి
తమ్మెట్లు పెట్టితి తట్టచెవుల
నిద్రలో గొంతెము నీరు గ్రమ్మును కాని
మేలుగాంచిన యంత మేటి తెల్వి
పైనివ్రాసిన శోభచే పరగుచున్న
పడతుయొక్కర్తు నామిత్రుపజ్జగలదు
రావుగారికినిష్టమై గ్రాలెనేని
పత్రికలద్వార తమయభిప్రాయమేమొ
పగటివేసాలదాసరి వరకుగారి
కందచేయంగ ప్రార్థింతు నాదరమున.

## 3

### నాటకము.

"ఏమండీ నాటకములో బొత్తిగా వేషము వేయుట మానివేసినారు. మళ్ళీ యెపుడు వేస్తారేమిటి?"

"మంచి నాటక మాంధ్రభాషలో వ్రాసేవరకు వేషంవేయకూడదని ఒట్టుపెట్టుకున్నాను."

### టిక్కెట్టు.

టి.కలెక్టరు:- అయ్యా, మీటిక్కెట్టు చూపండి.

ప్రయాణికు డీటునటు వెతకి టిక్కెట్టు కనపడక "కనపడ లేదండీ" అని జవాబుచెప్పెను.

టి. క:- పరవాలేదులెండి. రాజాగారి బావమరిదిగారేగా. టిక్కెట్టులేకుండావస్తారుగనుకనా?

ప్రయా:- మీకు టిక్కెట్టు అక్కరలేకపోతే నాకు అక్కరలేదనుకున్నారా యేమిటి? నేనేవూరుపోవాలో నాకిపుడెట్లా తెలుస్తుంది.

### త్యాగము.

భర్త:- నీకొరకు సర్వత్యాగముచేస్తా.

భార్య:- అయితే, మీబ్యాంకు చెక్కులన్నీ నా పేర వ్రాసియిస్తూవుండండి.

### త్రాగుడు.

భార్య:- నాకొరకు త్రాగుడుమానండి.

భర్త:- నీకొరకు త్రాగుచున్నానని యెవరు చెప్పారు?

### పెండ్లి.

"మీయింట్లోజరిగినపెళ్ళిళ్ళలో యేది బాగా జరిగింది."

"నాదే."

### తెలివి తక్కువ.

కమలం:- నాకంటె తెలివితక్కువవాడిని పెళ్ళి చేసుకోమంటే యెట్లాచేసుకునేది?

రాజ్యం:- నేనైతే యెవరికిచెప్పకుండా చేసుకుంటాను.

### వేళ.

"ఇపుడు పదయింది భోజనవేళ అయింది."

"ఇంకాకాలేదు. గంట వ్యవధియుంది"

"అయితే గడియారము తప్పన్నమాట."

"ఆముసలివాడుమూడుసార్లూ మోటారు క్రిందపడ్డాడు"

"మూడవసారికూడా పడితే, మోటారుఆస్తి

అవుతాడు."

ఆలస్యము.

ఉపాధ్యా:- ఒరే, నీవు మూడురోజుల నుంచి బడికి ఆలస్యంగా వస్తున్నావు.

కుర్రవాడు:- అబ్బే లేదండి. గడియారం చూచే అలవాటు నాకు లేదండి.

వ్యాధి నివారణ.

"అయ్యా, మిమ్మల్ని యెక్కడో చూచిన జ్ఞాపకం."

"చూచే వుంటారు. నా ఫోటో తరచు పత్రికలో వేస్తు వుంటారు"

"అయితే తమకే వ్యాధినివారణ అయింది?"

అనుకోవడం.

తల్లి:- అమ్మడూ, యీకాస్త బువ్వతినేయి.

అమ్మడు:- నాకు అన్నం సయించడం లేదు.

తల్లి:- సయిస్తుందనుకొని తినేయి.

అమ్మడు:- తినేశాననుకొని ఊరుకో.

ఉపన్యాసం.

భార్యా భర్తలిరువురు మీటింగులో వుపన్యాసం విని యింటికి వచ్చారు.

భార్య:- జడ్జిగారి భార్యగాజులు చూచారా యెంత బాగున్నాయో! నా దృష్టి వాటిమీదే వుంది.

భర్త:- లేదు. చాలవరకు నిద్రపోతూనే వున్నాను.

భార్య:- వుపన్యాసం మజా అట్లా వుందన్నమాట.

పేరు.

పోలీసు:- నీపేరు చెప్పవయ్యా?

ఒకడు:- కావ్య పంచానన, కావ్యతీర్థక, కవిరత్న, కవిభూషణ, హాస్యరసపోషక, బాలకవి ప్రతివాది భయంకర—

పోలీసు:- ఆ. ఆ. ఆగవయ్యా, పెంసిల్ విరిగి పోయింది చెక్కుకోనియ్యి.

అసహ్యం.

"రామయ్య అంటే అందరికి అసహ్యమే"

"ఒక్కరికి తప్ప"

"ఎవరికి?"

"రామయ్యకి తప్ప"

బహుమతి.

పిల్లవాడు యింటికి యేడ్చుచూ వచ్చెను. తండ్రి చూచి "యెందుకు నాయనా అట్లా యేడుస్తున్నావు?" అనెను.

"క్లాసులో మొదటివాడుగా వున్నందుకు మాష్టరుగారిచ్చిన బహుమానం రూపాయి పోయింది.

తండ్రి:- పోని, పోతేపోయిందిలే, ఇదిగో యింకో రూపాయి తీసికో, నాయినా, యెట్లా పోయిందిరా?

కొడుకు:- క్లాసులో మొదటివాడుగా వుండక పోవటం వల్లే.

అర్హత.

హెడ్ గుమాస్తా:- బంట్రోతుపనికి దరఖాస్తు పెట్టావు? ఎంతవరకు చదువుకున్నావు?

దరఖాస్తుదారు:- బంట్రోతుపనికి చదువెందుకు బాబూ?

హె. గు:- ఈరోజులలో లోవర్ సెకండరీ ప్యాసయివాళ్ళు వస్తూంటే, యేమి చెయ్యమంటావు?

ద. దా:- మీ బోర్డు ప్రెసిడెంటుగారు వైసు ప్రెసిడెంటుగారు యేమి ప్యాసవనక్కరలేదు కాని బంట్రోతుపనిచేసికొనే ముందుకొడుకు పరీక్షలు ప్యాసవవలసింది.

# సుందరి.

సూ. అప్పలనరసయ్యగారు

సుందరమ్మకిప్పుడు పదునెనిమిదేండ్లవయస్సు ఆమె రూపురేఖావిలాసములఁ జూచిన జగమున నవతరించిన రతీదేవియేమోయని తోఁచకమానదు. ఆమె తలిదండ్రులు నిరుపేద లగుటచే నామెను పండ్రెండవయేట వెయ్యినూట పదునారురూప్యముల కొఱకు ముసలిబ్రాహ్మణునకు కన్యాదానముఁ గావించిరి. ఆమెకు, పదమూఁడవయేట, రజస్వల శాకపూర్వమే కార్యము గావింపఁబడియెను. ఆనాఁటినుండియు నామె భర్తతోఁ గాపురముచేయుటకు శ్రీకాకుళమునకుఁ బంపఁబడియెను. నాఁటినుండియు నామె తన జననీజనకులకడకుఁ బోయియుండలేదు.

సుందరమ్మ భర్త పేరిశాస్త్రి ఆతఁడు షష్టిపూర్తిజేసికొని నాలుగువత్సరములాయెను. ఆతనికిఁ బ్రథమభార్యవలనఁ గల్గిన యెనమండుగురు పుత్రులు, నలుగురు కుమార్తెలు నగు సంతానమంతటిలోను కనిష్ఠపుత్రుఁడొక్కఁడు మాత్రమే జీవించియుండెను. ఆతఁడు చెన్నపట్నమున ఎం. ఏ. పరీక్షకుఁ జదువుచుండెను. అతని కిరువదిరెండేడుల వయస్సువచ్చినను వివాహమై యుండలేదు. "నాచదువు పూర్తియగువరకు నేను వివాహము చేసుకొనను." అని యాతఁడు తండ్రితోఁ జెప్పియుండెను. కుమారునిమాట కెదురాడఁజాలక యాతనితండ్రి యేమియును జేయలేకఁ బోయెను.

సుందరమ్మ తనభర్తను బ్రేమించుచుండలేదు. అది యెట్లు సాధ్యమగును? తన యీడుజోడు స్త్రీలందరును నవయువ్వనులగు భర్తలతోఁ గాపురముఁ జేయుచు సుఖించుచుండగా నామె కాటికిఁ గాళ్ళుచాచుకొని ఆశాభారముచేఁ గృశించుచున్న భర్తతో నెట్లు సుఖింపఁగలదు? ఆమె యీ విచారముతోడనే గృశించిపోవుచుండెను.

వేసవికాలపు సెలవుదినము లిచ్చినతోడనే పేరిశాస్త్రి కుమారుఁడగు వెంకటరావు శ్రీకాకుళమునకువచ్చి చేరెను. ఆతనిఁజూచి యాతని తండ్రి యెంతో గర్వపడుచుండెడివాఁడు. కుమారుఁడును దండ్రియెడ నతిభక్తివినయములతో జరించుచుండెడివాఁడు. ఆతఁడెల్లపుడును దనగదియందు కుర్చీపై నాసీనుఁడై యేదోయొక పుస్తకమును జదువుకొనుచుండెడివాఁడు.

సాయంతనమయ్యెను. వేంకటరావు షికారునకుఁబోయియుండెను. పేరిశాస్త్రి సావడిలో పడకకుర్చీపై నాసీనుఁడై కాలిమీఁది పొక్కులను జిక్కుకొనుచుండెను. సుందరమ్మ వంటింటినుండి పెరటిలోనికిఁ బోవుమార్గమునయున్న సోపానములపైనాసీనయై యేదియో యాలోచించుచుండెను. చీకటులింకను దట్టముగ నలముకొనుటలేదు

పెరటితలుపున కవ్వల నేదో చప్పుడయ్యెను సుందరమ్మ భావతరంగములు భంగములయ్యెను. ఆమె యాచప్పుడు నాలకించి యచ్చటికిఁ బోయెను. అచ్చట సుమారు ఇరువది వత్సరముల వయస్సుగల యొక విలాసపురుషుఁడు నిలువఁబడియుండెను.

ఆతఁడు నామెయుఁ గొంతసేపు గుసగుసలాడుకొనిరి. సుమారొక యరగంటకాలమయిన వెనుక నాతఁడామెను దన వక్షస్థలమునకుఁ జేర్చుకొని చెక్కిలునొక్కి ముద్దాడెను.

చీకట్లు నలుదిశల నల్లుకొనియెను. సుందరి తలుపు గడియవైచికొని గృహములోనికేగెను. పేరిశాస్త్రి పడకకుర్చీపై నిదురించుచుండెను.

అతని తెల్లని శిరోజములు గాలిలో నల్లలనాడుచుండెను. అతని మొలలో తాళపుచెవుల గుత్తి వ్రేలాడుచుండెను. ఆమె యాతాళపుచెవులను తన చేతిలోకి లాగుకొని పైకిదీసెను. ఖజానాయున్న గదిలోని కేగునరికి యామెకుజోడు చప్పుడు వినవచ్చెను. ఆమె యాగదినుండి పైకిపోయెను.

## 3

రాత్రి పండ్రెండుగంటలయ్యెను. వేదిశాస్త్రి సుందరి చేతిపై తలనిడుకొని నిదురించుచుండెను కాని, సుందరికి నిదురపట్టుటలేదు. ఆమె తన భర్తను మెల్లగ విడల్చుకొని సాధ్యమయినంత కొంచెము చప్పుడుతోడ బైటకి నడచెను.

అత్యల్పమగు నక్షత్రకాంతి నలుదెసలు వ్యాపించియున్న ఘోరాంధకారములో విలీనమై పోయెను. చల్లని పిల్లవాయువులు వీచుచుండెను. అంతట నిశ్శబ్దముగనుండెను. వీధిలో శ్వానముల భయంకరారావము లోనర్చుచుండెను. ఆ భయంకరారావములకు సుందరి భీతిల్లెను గృహములోని కరుగుదమని యామె తలంచెను గాని మరల ధైర్యము దెచ్చుకొని ముందునకు జూచునరికి యామె కొక పురుషవ్యక్తి గాన్పించెను. అతడామెను జేరి "ప్రియతమా! ఈ భీకరమగు నిశాసమయమున సన మిచ్చుట మసలుటకన్న మన గృహమున కేగుదము రా కూడదా?" అని యడిగెను.

ఆమెయు "నేను రాజాలను. నీవు కోరినది తెచ్చితిని. గైకొనుమనుచు" నామె తన కంచుకమునుండి యొక కాగితమును దీసియిచ్చెను. "నేనిక నిలువజాలను, నాకేలకో భయము కలుగుచున్నది" అనుచు వెడలిపోవ నుంకించుండగా నాతడామెను తన వక్షమునకు జేర్చుకొని యామె చెక్కుటద్దములపయి ముద్దుల వర్షము గురిపించెను.

సుందరి తన చెక్కులను చీర చెఱగుతో దుడుచుకొనుచు "నన్నిక వదిలివేయుము, నాకు భయమగుచున్నద"ని చెప్పుచుండగనే యా పురుషుడు "సుందరీ! నేనుండగా నీకు భయమేల? నాకంఠమున జీవమున్నంతవఱకు నీకే యపాయమును రానీయన"ని పల్కుచుండ "ఎవరో వచ్చుచున్నారు. అటు చూడుము. అయ్యో దేవుడా! మన గతి యేమి కానున్నదో?" అను నంతలో నా పురుషుడు వారల దారసించెను.

అతని చూచి సుందరీప్రియుడు "వెంకటేశం! నీవక్కడా, నువ్వెందుకొచ్చావురా వెధవా! ఏలాగొచ్చావురా?" అనెను.

వెంకటేశము గంభీరముగా "మీమానములును, ప్రాణములుకూడ నాచేతిలో నున్నవి. ఒక్క క్షణములో మిమ్ములను చావగొట్టించగలశక్తి నాలోనున్నది. నేనట్లొనర్పకుండుటకై నాకేమి యొసంగెదరో చెప్పుడు" అనియెను.

సుందరి భయభ్రాంతయై నీవేమి కోరిన నది యొసంగెదను. నీవిచటనుండి వెడలిపోవలయును అని చెప్పెను. వెంకటేశము, "నాకు నీగాఢాలింగన సౌఖ్యము గావలయును. ఇప్పుడొసంగితివా సరి లేకున్న—" అనుచున్నంతలో సుందరి "మనోహరా! నీకిచ్చియున్న పది రూప్యముల నోటు నీతని కిచ్చివేయుము ఈతను వెడలిపోవును" అనెను.

వెంకటేశము "నేనందుల కంగీకరింపను. నేగోరినది నాకిమ్ము. నేబోయెదను. డబ్బు నా కక్కరకురాదు."

సుందరి యిటుకు మాటాడలేదు. ఒక నిముసమునకు బూర్వ మాతడు పల్కిన ప్రగల్భ

వచనముల నాతడు మరచెను.

సుందరి విశాల నేత్రములనుండి రెండుశ్రుకణములు రాలెను. వెంకటేశె మామెను గాఢాలింగన మొనర్చుకొనియెను.

4

వెంకటేశము మనోహరుని మిత్రుడు. తుంటరితనమున నాతడు శ్రీకాళహస్తి మంతటికిని పేరు కెక్కినవాడు. ఇతరుల నేడిపించుటన నాతని కత్యంత సంతోషము. ఆతని కనుచరులు పెక్కండ్రు కలరు. రాత్రివేళల నాతడు నిశాచరునివలె వీథిలో సంచరించుచుండును. ఒక నాడాతడు వీథిలోనుండి పోవుచుండగా పేరి శాస్త్రిగారి పెరటిలో సందడి వినవచ్చెను. ఆ సంగతి కనుగొనుట కాతడు లోనికేగెను. విషయము మనమెరిగినదే!

మనోహరరావు స్కూల్ ఫైనల్ పరీక్షను నాలుగు మారులుపోయియుండెను. గాని ప్రతి మారు నవజయము పొందుటలో ప్రతి విషయము ( one digit ) లోను ఒక అంకెగల మార్కులో వచ్చుచుండుటవలన నాతడు విసిగి పరీక్షకుబోవుట మానుకొనెను. ఆతడంతధనికుడు కాకపోయినను, చిన్నతనముననే గొప్ప సంబంధము వెదకి పెండ్లిగావించుకొని యుండుటవలన నాతని భార్య యింటినుండి తెచ్చుచున్న డబ్బుతో నీతడు విలాసముతో గాలము బుచ్చుచుండెను. ఆతనికి భూములు కొలదిగ నున్నవి; గాని, యాభూములపైనుండి వచ్చు యాదాయము తక్కువ యైనను వాటిపై పెట్టుబడి మొత్తమెక్కువై యుండెను.

వెనుకటి ప్రకరణమునం జెప్పబడిన విషయములు జరిగిన మఱునాటి ప్రాతఃకాలమగుసరికి పేరిశాస్త్రిగారి వీథిగోడపై "పది రూపాయాల నోటు" అని పెద్దయక్షరములతో వ్రాయబడి యుండెను. వీథిలోనుండి పోవు వారందరును ఆయక్షరములం జదువుకొని దాని యర్థమును గ్రహింపజాలక నివ్వెరపడుచుండిరి.

సాయంకాలమగుసరికాయక్షరముల యర్థము పురమందెల్లెడలం బ్రాకిపోయెను. వెంకటేశము సామాన్యుడుకాడు. ఆతడొనర్చిన కృషివలననే పురమందెల్లెడలను "పదిరూపాయిలనోటు వార్త ప్రాకిపోయెను. ఈవార్త పేరిశాస్త్రి కుమారుడగు వెంకటరావునకు సహితము తెలిసిపోయినది. పేరిశాస్త్రి యీసంగతి నెఱింగియుండెనా? లేదు. పాపమాత డేసంగతియు నెఱుంగడు

వెంకటరావువిచారాంబుధినోలలాడుచుండెను. ఆతడు తన సవతితల్లి యిట్టియపకీర్తిని తెచ్చి నదిగదాయని చింతాకులస్వాంతుడై పోయెను. ఆతడు నట్టింటి లోనికేగెను. వంటబ్రాహ్మణుడు వెంకన్న వంటచేయుచుండెను. సుందరమ్మ సోపానములపై నాసీనయై పువ్వులను దండగా గ్రుచ్చుచుండెను. వెంకటరావామెను. తనవెంటరమ్మని చెప్పి తన గదిలోనికిబోయెను. సుందరి వాని ననుసరించెను. ఆమె కూర్చొనుటకాసనముంజూపి ఆమె ఆసీనయైనపిదప నాతడామెకు బుద్ధిచెప్పుచు సుమారొక గంటకాల ముపన్యాసమిచ్చెను.

సుందరి తానొనర్చిన పాపకృత్యమునకు పశ్చాత్తాపపడియెను. ఇకమీద నెన్నడునట్లొర్పనని యాతనిమ్రోల వాగ్దాన మొనర్చెను. తన్నుతాను నిందించుకొనుచు నికమీద పతిభక్తిగలిగి పతివ్రతా ధర్మములం బాటించుచుండెదనని దృఢసంకల్ప మొనర్చుకొనియెను.

## 5

మూఁడు వత్సరములు గడచిపోయెను. పేరిశాస్త్రి పరలోకగతుఁడై పోయెను. వెంకటరావు సంఘసంస్కారనిరతుఁడై శ్రీకాకుళమున న్యాయవాదివృత్తి నవలంబించియుండెను. సుందరమ్మ తన పుట్టినింటికిఁ బోయియుండెను. సుందరమ్మ తన పూర్వపు సౌందర్యమును గోల్పోయినను మనోహరమైన రూపమును గల్గియుండెను. ఆమె పూర్వపు సుందరికాదు. మనోహరరావు ఆమెయొద్దకు బెక్కుసార్లు పోయియుండెను; కాని, యామె యాతనితో మాటలాడ నిచ్ఛగించియుండలేదు.

ఒకనాఁడామె దేవాలయమునకుఁ బోవుచుండగా నొక కుఱ్ఱవాఁడింకొకనితో "అదిగో! ఆపోవుచున్నదాన్నే నా! వదిరూపాయల నోటంటారు" అని చెప్పెను.

ఆమాటవిని సుందరి నిర్విణ్ణయైపోయెను. వెనుదిరిగి చూడక నామె దేవాలయమును జేరి సుమారొక గంటకాలమువరకు దేవపూజ సల్పి యీవలకు వచ్చునరికి వెంకటేశము ప్రత్యక్షమయ్యెను.

ఆమెచూచియు జూడనిదానివలె అతిరయమునబోయి నిల్లుచేరుకొనియెను. వెంకటేశం కొయ్యబారిపోయినాడు.

## శ్రీ పోతనార్యస్తుతి.

కొటికలపూడి కామేశ్వరరావుగారు.

తేటమాటలతోనె ♦ తేనెలొల్కెడునట్లు
దివ్యార్థములనెల్లఁ ♦ దెల్పినావు,
నరసంపుఁబల్కులఁ ♦ జక్కగ గుమిగూర్చి
సహజపాండిత్యంబుఁ ♦ జాటినావు,
మాధురీగరిమను ♦ మానసముప్పొంగ
గవితాప్రశస్తినిఁ ♦ గాంచినావు,
కరముఁబ్రీతినిఁగొల్పు ♦ ఘనయలంకారముల్
గుప్పించి ఘనకీర్తి ♦ నొప్పినావు,
సాటి నీకేరి యీలేడు ♦ జగములందు
గవిత చెందునఁ బాండితీ ♦ గరిమచెందు
భక్తిచెందును ధర్మాను ♦ రక్తియందు
పూతమాగాదె నీ జన్మ ♦ పోతనార్య!

సర్వపాపంబుల ♦ నమసిపోవఁగఁజేయు
భాగవతగ్రంథ ♦ పఠనజాలు,
తనువును మరపించి ♦ తన్మయత్వ మొసంగ
భాగవతగ్రంథ ♦ పఠనజాలు,
దుఃఖంబులడపి సం ♦ తోషంబుఁగూర్పంగ
భాగవతగ్రంథ ♦ పఠనజాలు,
వేదవేదాంతముల్ ♦ విశదీకరింపంగ
భాగవతగ్రంథ ♦ పఠనజాలు,
సకలశాస్త్ర సారంబును ♦ సంగ్రహించి
పొలుపుమీఱగ నీపొత్త ♦ మున నిమిడ్చి
కంటి వమరత్వ మిలఁగీర్తి ♦ కాయుఁడవయి
పూతమాగాదె నీజన్మ ♦ పోతనార్య!!

'ఆంధ్రకవిసింహ' మనునామ ♦ మను నయముగ
నీయెడల సార్థకంబగు ♦ నిక్కముగను,
పుడమి నీ యశశ్చంద్రికల్ ♦ పొడమియుండ,
పూతమాగాదె నీజన్మ ♦ పోతనార్య!!!

# అమరసింహుని ద్వారము.

సింగంపల్లి వెంకటాద్రిగారు

అత్యాడి 1634 వ సంవత్సరము. యోధపురప్రాంతమంతయు నెండలు మెండుగా నుండుటచే నట్టుడికి నట్లుడుకుచుండెను. మిట్టమధ్యాహ్నము యోధపురకోటగుమ్మముకడ కొందరు భటులు పహరా నిచ్చుచునేయుండిరి. నల్లని దుస్తులను ధరించి యొకడొక నల్లని యశ్వము నధిరోహించి ఎవ్వరితోడను మాటలాడకయే పోవుచుండెను. చేతిడాలును, కత్తియును మాత్రము నాయెడు రెండలో తళతళమని మెఱయుచుండెను వానిముఖమించుక ముడతలుపడి యుండెను. నేత్రములగ్నికణమువలె మెఱయుచుండెను వానిహృదయమున సంతాపక్రోధములు తరంగములవలె పొంగిపొరలుచుండెను ఒకయరగంటసేపటికి మఱొక యాశ్వికుడు విలువగల వస్త్రములధరించి యొకచేతడాలును మఱొకచేత కత్తియుబూని మందస్మిత వదనముతో గుఱ్ఱము నదలించుచు వేవేగ నాపురద్వారమును దాటి పోవుచుండెను. అతనికా యెండతీవ్రమున కనులు మిఱుమిట్లు గొలుపుచుండెను. చేతనున్న డాలును కనులకడ్డముగబెట్టుకొని గుఱ్ఱముపై నిలుచుండి నలుప్రక్కల తేఱపాఱజూచెను క్రోసెడు దూరమున నొకనల్లని వస్తువు పోవుచున్నట్లు కనుగొనెను. తోడనే గుఱ్ఱము నదలించి శరవేగమునబోయి మొదటివానిని కలిసికొని అయ్యా! "కుమార్జీ, నమస్కారములు" అనిచెప్పెను. అతడెవఁడాయని గిఱ్ఱున దిరిగి జూచి "నీవెందులకువచ్చితివి. నాతోడ నీకేమి పని" అని యుఱుముఱుమునట్లు పలికెను.

"అయ్యా! ఒంటరిగా మీరిట్లు ప్రయాణము చేయదగదు మీసేవనభిలషించి వచ్చితి, ననెను "ఓయీ! తండ్రిమొదలగు వారిచే తృణీకరింపబడిన నేను ఒంటరిగనే పోవలసి యున్నదనని మాఱుపలికెను "అయ్యా అట్లెన్నటికిని కానేరదు రసపుత్రుడు తనయజమానుని కష్టకాలములందు విడువనోపడు. నాశరీరమున ప్రాణము లున్నంతవరకు మీసేవనొనర్పనిశ్చయించితి"నని రెండవవాడనెను. అట్లగుచో రా రమ్ము పోదమని పలికి వారిరువురు సంభాషించుచు నాత్రోవ సత్వరముగ బోయిరి.

వీరిలో ప్రథముడు కుమార అమరసింహుడు. యోధపురాధీశ్వరుడగు మహారాణా గజసింహుని తనూభవుడు. అతులితపరాక్రమశీలుడు. రాజపుత్రులలో పరాక్రమమనునది విశేషగుణము కాజాలదు. రాజపుత్రస్త్రీలకు పాతివ్రత్యమెట్లు నైసర్గికమో, రసపుత్రులకు పరాక్రమమట్లే స్వాభావికగుణము. అమరసింహుడు కలహప్రియుడు. క్రూరస్వభావము కలవాడు. అతని కెవ్వరు నెదురాడరాదు. తోబుట్టువులతోడను, జ్ఞాతులతోడను, సామంతనృపాలురతోడను నిరంతరము కలహించుచు వచ్చెను. ఆకారణమున వారిప్రాణములు విసిగి వేసారి గజసింహునికడకేగి సకలము నివేదించి కుమారుని దేశభ్రష్టునిగజేసి రాజ్యమున శాంతిబీజముల నాటవలయునని విన్నవించుకొనిరి, తండ్రి కుమారుని యవివేకమునకు దుర్దశకెంతయు పరితపించెను. కడుపున పుట్టిన బిడ్డడెట్టివాడయినను

తనకుఁ బ్రాణసమానుఁడే యగును. కాని ప్రజల కోర్కె నిరాకరించుట యుత్తమ రాజధర్మము కానేరదు. తుదకు కుమారుని ప్రవాసమంప నిశ్చయించుకొని నిండు కొలువుదీర్చి కుమారుని పిలువనంపి నల్లని వస్త్రముల కట్టనిచ్చి నల్లని గుఱ్ఱమును చేతికిచ్చి నీవు దీని నెక్కి నీయిష్టమువచ్చినచోటుకు పోవలయు. నా రాజ్యమున నీవిక నొకక్షణమాత్రము నుండదగదు. తక్షణమే వెడలిపొమ్మని నిర్దాక్షిణ్యముగ నాజ్ఞనొసంగెను. రాజాజ్ఞ అనుల్లంఘనీయము. కుమారుడు మారుపలుకక తండ్రికి సాష్టాంగపడి తోడనే గుఱ్ఱమునెక్కి పయనమయ్యెను. అతడు బయలుదేరిన వెంటనే కొలువున గూర్చుండిన కొందఱు యోధులొకచో గుమిగూడి చూచితిరా! రాకొమరున కెట్టి యుక్కట్టు సంభవించెనో! మనమాతనితో గూడియనేక సమయములందు విశేషసుఖముల ననుభవించితిమి. ఇప్పుడు కష్టకాలము సంప్రాప్తించెను మనలో నొకరయినను వాని వెంటబోవుటకు సాహసింపమయితిమి, ఎంతట కృతఘ్నులమని వారిలో వారనుకొనసాగిరి. వారిలో భల్లాజీ చంపావత్ అనుతఁడొకడుండెను అతని నీమాటలు సూదిపోటులవలె బాధింపసాగెను. అతనికి అమరసింహునకు విశేష పరిచయము చనువులేకుండినను రాజకుమారుడంతటి వాడు అసహాయుడయి దేశభ్రష్టుడయి పోవుట యతనికి గిట్టకుండెను వెంటనే నాతడశ్వారూఢుడయి రాకొమరుని వెంటాడెను.

ఆ దినములలో పదభ్రష్టులైన రాజపుత్రులు శత్రువులపై పగదీర్చుకొనుటకయి ఢిల్లీపాదుషాల శరణు జొచ్చుచుండిరి కుమార అమరసింహుడును ఢిల్లీశ్వరుని కొలువులో ప్రవేశించెను, భల్లాజీకి తురకల గొలుచుట గిట్టదయ్యెను. కాని చేయునదేమి? అమరసింహుడు తనచాకచక్యమువలన, ప్రజ్ఞావిశేషములబట్టి అచిరకాలముననే చక్రవర్తియనుగ్రహమునకు పాత్రుడయ్యెను. పాదుషా అమరసింహునకు 'రావు' అను బిరుదమొసంగి ఆరునూర్ల గ్రామములు గల 'నగర' రాజ్యమును బహూకరించి యెంతయో గౌరవించెను. అమరసింహుడు భల్లాజీ సేవాపరత్వమునకు సంతసమొంది విశేషబహుమతులొసంగి అంగరక్షకునిగ నియమించెను. అమరసింహుడు యువరాజుగ నుండిన కాలమున నాశ్రితకోటిలో జేరినవారిలో పెక్కండ్రు కాలక్రమమున అమరుని ప్రాపునకు రాసాగిరి. అమరసింహుడత్యంత యుత్కృష్ట పదవినందుండినను సదసద్వివేకి గాకుండెను అతనికి వేటయనినను, కోడిపందెములనినను, పొట్టేళ్లపందెములనినను పరమప్రీతి. వందలకొలది పొట్టేళ్లను బెంచి అప్పుడప్పుడు పందెములవైచి యానందించెడివాడు ఆపొట్టేళ్లు మేతకొఱకై సమీపారణ్యమునకు బోవుచుండెడివి. ఆయరణ్యమున తోడేళ్లధికముగా నుండుటచే గొఱ్ఱెల నాశనము జేయు, రాజులు సహింపజాలక, పొట్టేళ్ల సంరక్షించుటకయి యంగరక్షకుడగు భల్లాజీని నియమించెను. అనుజ్ఞాపత్రము జూచుటతోడనె పట్టరాని కోపమువచ్చి భల్లాజీ, ఆహా! సూర్యవంశోద్భవుడను. నృపాలుని అంగరక్షకుడను. యోధాగ్రేసరుడను. త్యాగధనుడను. ఇట్టివాడనగు నేను గొఱ్ఱెలరక్షించుటకయి వెఱ్ఱిగొల్లనివలె దినదినము పోవలయునా! ఎట్టివాని కెట్టిగతి సంభవించెను. నేనిట్టి నీచకార్యము చేయజాలనని నిరాకరించి యీవిధముగ లేఖొకటి వ్రాసి పంపెను. అమరసింహుడు భల్లాజీని

రావించి, ఓయీ! ఢిల్లీశ్వరుని కటాక్షముచే మనకెట్టి యుపద్రవములు లేకుండ నున్నారము. నీవు యూరక యుండుటకంటె పొట్టేళ్ళ మందల కాపాడుట కూడ నవని కాజాలదు. నాయాజ్ఞను పాలింపుమ'ని కొంచెము కటువుగ బల్కెను. భల్లాజి అయ్యా! కష్టకాలములందు మీకు చేదోడు వాదోడుగానుండి నాచేత నయినంత సహాయము చేసి నాప్రతిజ్ఞ నెరవేర్చుకొంటిని. తమరిప్పుడు ప్రభువులై సుఖంబుగ నున్నవారు. కావున నాతోడ మీకెట్టి యగత్యము నుండ నేరదు. నేనిక మీసాన్నిధ్యమున నుండనోప, నాత్రోవ నేబోయెద, సెలవిమ్ము' అని పలికి గుఱ్ఱమెక్కి బికనీరు త్రోవబట్టెను.

బికనీరు సంస్థానాధీశుడగు కర్ణసింహుడు భల్లాజీని పరామరిక జేసి కొన్నిభూముల నిచ్చెను. వీరిరువుర మైత్రింబోరయుట సహింప జాలక అసూయాపరులగు ప్రధానోద్యోగియులు కొందఱు వీనిని తఱిమివేయవలెనని సంకల్పించు కొనిరి. ఒక దినమున ప్రభువగు కర్ణసింహుడు భల్లాజీయందుగల వాత్సల్యముచే సేవకుని కొక మధురో అను ఫలమొసంగి భల్లాజీకి యిచ్చి రమ్మని పంపెను. ఆసేవకుడు భల్లాజీయందత్యంత భక్తి శ్రద్ధలు గలవానివలె నటించుచు మీకీఫల మొసంగుడని రాజాజ్ఞ. దీనిని మాప్రాంతమున 'మత్ రహో' అని యందుము; మత్ రహో అనగా నిచట నుండరాదని యర్థము. కావున ప్రభువు మీతో రాజ్యమునుండి తక్షణమే వెడలిపొమ్మని చెప్పుటకు మాఱుగా తదర్థమును సూచించు నట్టీఫలమొసంగుచున్నారు. కావున త్వరపడుట యుక్తమని నావిన్నపము' అని చెప్పెను. పాపమాతడు నిజమని విశ్వసించి గుఱ్ఱము నెక్కి తక్షణమే పయనమయ్యెను. మహా రాజీ వృత్తాంతము వినియాశ్చర్యపడి మాటమాత్రమైనను చెప్పిపోవలదా! అని చింతించెను.

భల్లాజీ ఉదయపురమున కేగెను. ఉదయపురాధీశ్వరు డితని నెంతయు సన్మానించి తనకడ నుండుమని కోరెను వీరిరువురత్యంత మైత్రితో ప్రవర్తించుచుండిరి. ఉభయులు కలిసి మృగయా వినోదార్థము దుర్గమారణ్యములకేగి సింహశార్దూలాది క్రూరమృగముల వధించుచువచ్చిరి. ఇట్లుండ నొకభటుడొక దినమున మహారాణాతోనిట్లనియె. ప్రభూ! మృగయా వినోదమున తనకెవ్వరు సాటిరారని భల్లాజీ తఱచు చెప్పు చుండును. తానొంటరిగ నరణ్యమునకేగి సింహము నెదుర్కొని పోరాడవలయునని కోరిక గలదట. తమ రేమందురో యని సంశయించు చున్నవాడు. మీయాజ్ఞయగునేని పోప్రయత్నించు ననిని పల్కెను. మహారాణా ,నాకెట్టి యాభ్యంతరము లేదు. పోదలచిన పొమ్మని చెప్పవచ్చునని బల్కెను. ఆభటుడు భల్లాజీ కడకేగి 'శూరాగ్రణీ! మీరొంటరిగ కాననమునకేగి మృగరాజును వధింప గలుగుదురేమో చూడవలయునని ప్రభువుగారి యభిమతము. గొడ్డలి తప్ప మఱేదియు మీకడ నుండరాదు' అని చెప్పెను. భల్లాజీ నిట్టూర్పు విడచి సరే పోయి వచ్చెదనని బలికి పరశురామునివలె గండ్రగొడ్డలిని చేతబట్టుకొని యొంటరిగా యరణ్యమునకు బయలుదేరెను. పోను పోను ఒకానొకచో హర్యక్షమొకటి పొదరింటనుండి బయల్వెడలి దిక్కులు మాఱుమ్రోగునట్లు గర్జించుచు వానిపైబడ యత్నించెను. కాని నిశ్చితచిత్తుడగు భల్లాజీ సమయము కనిపెట్టి వెంటనే యొకప్రక్క కొరిగెను. పాపమామృగము మొదలు నఱికిన ద్రుమానువలె నేలపై ఘూర్ణిల్లెను. వెంటనే

భల్లాజీ దాని తలపై గొడ్డలితో సత్తువకొలది నొక వ్రేటు వేసెను. దానితోడనే నది యుసురుల బాసెను. భల్లాజీ యంతట దాని శిరమును దోడ్కొని ప్రభుకడకేగి 'అయ్యా! నాబల పరాక్రమములు సాహసము పరీక్షించుటవలన మీకేమి ప్రయోజనము కలుగగలదు? ఒకవేళ సింహముచేత నే జిక్కి మరణించిన మీకేమైన లాభము కలుగగలదా? రణరంగమున శత్రువుల దునుమాడి యసువుల గోల్పోవదగిన నావంటి యోధుడు ఘాతుక మృగము వాత బడి మరణింప నిచ్చగింపడు. సద్వంశ సంభూతులగు మీరు నాయట్టివాని నిట్లు తృణీకరించుట యనుచితమని చెప్పి రాజునకు నమస్కరించి మందిరమును దాటి గుఱ్ఱమెక్కి ఢిల్లీ త్రోవ జూచుకొనెను.

ఢిల్లీ మొగల్ ప్రభువుల పరిపాలనమున నుండెను. ఢిల్లీశ్వరుడు భల్లాజీని యాదరించి అశ్వసహస్రికదళమున కధిపతిగ నియమించెను. ఈవిధముగ కొంతకాలము గడచెను. ఇట్లుండ గుఱ్ఱముల బేరగాడొకడు ఉదయపురమునకు వెళ్ళి మహారాణా గారికి కొన్ని గుఱ్ఱముల విక్రయించెను. ఆగుఱ్ఱములలో పొగరెక్కిన దొకటి యుండెను. అది మిగుల బలిష్ఠముగను ఎత్తుగ నుండెను. చెప్పినమాట వినదయ్యెను. అప్పుడు రాణా యోధులనందరను పిలిపించి, "ఈగుఱ్ఱము నెక్కగలవారు మీలో నెవరైనా గలరా" యని ప్రశ్నించెను. ఒకరి మొగము వొకరు చూచుకొనసాగిరి. మహారాణా యంతట నీయుత్తమాశ్వ మధిరోహింప భల్లాజీ చంపావత్ మాత్రమే సమర్థుడు" అని చెప్పి యొక లేఖను వ్రాసి కొందరు భటుల నియోగించి గుఱ్ఱమును భల్లాజీ సముఖమునకు బంపివేసెను.

ఇట్లుండ ఆగ్రానగరమున ఘోరవిపత్తు యొకటి సంభవించెను. నగరదేశాధీశ్వరుడగు అమరసింహునకును, బికనీరు ప్రభువునకును సరిహద్దు ప్రదేశముల విషయమై తగవువచ్చెను. ఉభయులు ఢిల్లీశ్వరునకు తమ తగవును విన్నవించుకొనిరి. చక్రవర్తి సలామత్ ఖానను యుద్యోగిని మధ్యవర్తి తీర్పరిగ నియమించి పంపెను. ఆయుద్యోగి వాదప్రతివాదములు విని బికనీరుపక్షమున తీర్పునిచ్చి, అక్రమముగ ననవసరముగ జోక్యము కలుగజేసికొని లేనిపోని శ్రమయిచ్చినందులకు అమరసింహునకు కొంత అపరాధము విధించెను. చాలకాలమువఱకు అపరాధము చెల్లింపకుండెను. ఒకనాడు ఆగ్రానగరమున చక్రవర్తి కొలువుదీర్చియుండగా సలామత్ ఖాను అమరసింహునితో యపరాధము చెల్లించువిషయము హెచ్చరించెను. అమరసింహుడు క్రోధాయత్తచిత్తుడై గుడ్లెఱ్ఱజేసి ఖడ్గమును డాలును జూపి కొలదిదినములలో వీనిమూలమున నపరాధము చెల్లించుకొనెదను పొమ్ము, జాగ్రత యని గద్దించెను. ఖానుడును వెనుకముందులాడక చక్రవర్తి సముఖముననే అమరుని నిందింపసాగెను. అంతట నమరసింహుడు కోపముబట్టజాలక కత్తిని దూసి ఖాను కంఠముపై నొకవ్రేటు వేసెను. తన కండ్లయెదుటనే జరిగిన నీ ఘోరకృత్యమునకు రోషానలజ్వాలలు గ్రక్కుచు చక్రవర్తియగు షాజహాను వానిని వివిధములదూలనాడి బంధింప నాజ్ఞయిడెను. అమరసింహుడంతట రక్తసిక్తమగు తన ఖడ్గమును చక్రవర్తిపైనను ప్రయోగించెను. కాని షాజహాను అదృష్టశాలి యగుటచే చప్పున ప్రక్కకుదొలగి తప్పించుకొని పాఱిపోయెను. అచటనుండిన సర్దారులు అమరసింహునిపై నురికి వానిని వధింపజూచిరి. కాని

సాహసుడగు నమరసింహుడు తన చేతనున్న ఖడ్గమును సాము జేసినట్లు గిఱగిఱ త్రిప్పి యెవ్వరి దగ్గఱకు రానీయక మీదుమిక్కిలి అయిదుగురు సర్దారులను సలాబత్ ఖానుతో బాటు యమపురికంపెను. తోడనే అనుచరులు వెంటరా మందిరమునువీడి సింహద్వారముకడ కేగి తనకొఱకు కనిపెట్టుకొనియుండిన అంగరక్షక భటులనుకలిసికొని వారితో కోటబయటనున్న పటకుటీరమునకు పోనెంచెను. అమరసింహుని వెంటవచ్చుచున్న వారిలో "అర్జునగోడా" అను నతడొకడుండెను. అతని తోబుట్టువునే అమరసింహుడు వరణయమాడెను. ఇతడు క్రూరకర్ముడు, విశ్వాసఘాతకుడు. స్వార్థపరుడు. స్వామిద్రోహి. యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యుడు. ఇతడు ఢిల్లీశ్వరుని యనుగ్రహముసంపాదింపనెంచి తన బావగారగు అమరసింహుని తుదముట్టింప నిశ్చయించుకొని వెంటవచ్చుచుండెను. స్వార్థపరులకు తనవారైనను పరవారైనను నొకటియే.

అమరసింహుడు తన వెంటవచ్చువారందఱు మిత్రకోటిలో జేరినవారనియే విశ్వసించి నిస్సంశయముగా దుర్గద్వారము సమీపించిజూడ నది బంధింపబడియుండెను. తలదూర్చుటకుమాత్రము వీలగునట్టి సందొకటియుండెను. అమరసింహుడు తన అంగరక్షకుల పిలువనెంచి సందుగుండా తొంగిజూచుచుండెను. అంతలో క్రూరాత్ముడగు అర్జునగోడా ఖడ్గముచే నమరసింహుని శిరమును ద్రుంచివైచెను.

చక్రవర్తి అమరసింహుని మరణవార్త విని సంతసించి ప్రాణసమానులగు అయిదుగురు సర్దారులను వధించెనను క్రోధోద్రేకముచే అమరసింహుని మృతకళేబరము కోటలోనెందైన పారవేసి కాకులు గ్రద్దలు తినునట్లు చేయుడని యాజ్ఞాపించెను. అమరసింహుని యర్ధాంగి తన మనోనాథుని దుర్మరణవార్తనువిని మిగుల చింతించి ముఖ్యమంత్రియగు 'ఖ్వాజీకంపావత్' అనువానిని రావించి ఆగ్రానగరమునకేగి యెట్టి విపత్పరంపరలు సంఘటిల్లినను సరకుజేయక ప్రాణనాథుని మృతకళేబరమును తెసికొనిరండనియు, తానాశరీరముతో సహగమనమొనర్చి స్వర్గసౌఖ్యముల జూరగొన నెంచితిననియు వచించెను. మంత్రియును కొంచెమైనను సంశయింపక అయిదువందల గుఱ్ఱపురౌతులను వెంటబెట్టుకొని ఆగ్రానగరోన్ముఖుడయ్యెను.

ఆగ్రానగరము సర్వసైన్యయుక్తమైయుండుట త్రోవలో పిన్నవాడగుటచే నసీయముతోవ, భల్లూజికడకు భటునికొక లేఖ నిచ్చివంపెను.

ఆలేఖ యిట్లు వ్రాయబడెను. గుణనిధియగు రసపుత్రవీరుడా ? భూతలమున మన మిరుపురము బ్రతికేయుండగా మనకత్యంత ప్రేమాస్పదుడగు అమరసింహుడు మరణించుటయు, వాని మృతకళేబరము శాస్త్రోక్తముగు దహన సంస్కారాది క్రియలు జరగకుండ దిక్కుమాలి నవాని శరీరమువోలె తురుష్కప్రభువు చిత్తానుసారముగ కాకులు గ్రద్దలు తినునట్లు పారవేయబడుట మన మోర్వదగినది కాదు. మహారాణియగు 'హాందీజ' తననాథునితో సహగమనమొనర్చి స్వర్గమునకేగ నభిలషించుచున్నయది. నేనొంటరిగ కొలది సైనికులతో ఆగ్రానగరమునకు ప్రయాణమైతిని. తక్షణమే ససైన్యముగ బయలుదేరి రాదగునని నాప్రార్థన.

ఈ లేఖ జదువుకొనుటతోడనే తోకద్రొక్కిన త్రాచువలె రోషకషాయితచిత్తుడై తుంటెకాలములో సైన్యములు సిద్ధముపడునట్లు యాజ్ఞనొసంగెను భల్లూజీస్వయముగ సైన్యాధిపత్యము

వహించి గుఱ్ఱముకదాని నెక్కి బయలుదేర బోయెను. పురద్వారము సమీపించుటతోడనే వార్తాహరుడొకడేతెంచి సవినయముగ మ్రొక్కి మేవాడ సహారాణా బహుమానపురస్సరముగా బంపిన గుఱ్ఱమునుజూపి "రసపుత్ర శ్రేష్ఠుడా, సూర్యవంశాబ్ధిసోముడగు మహారాణాగారు తమ కీ హయరాజమును బహుమానముగా నొసంగ దలంచిరి. మీరుతప్ప మరెవ్వరీ గుఱ్ఱమునెక్కి స్వాధీనపఱచుకొనజాలరని వారియభిప్రాయము ఇదిగో! వారువ్రాసిపంపిన లేఖ తీసికొనుడని దాని నొసంగెను.

అతడా లేఖ చదివికొని యించుక నాలోచించి, తానదివరకెక్కిన గుఱ్ఱముదిగి నూతనాశ్వమధిరోహించి "ఓయీ! రసపుత్రులకల్పవృక్షమనందగు మహారాణీగారిని సర్వేశ్వరుడు రక్షించుగాత! నాకీతరుణమున నమూల్యమగు నీహయరత్నమొసంగినందుల కెంతయు కృతజ్ఞుడను. యుద్ధమునకు సంసిద్ధమగు తఱి నీగుఱ్ఱము ప్రాప్తించుట శుభసూచకమని తలచెద. ఓయీ వార్తాహరుడా! నేనసన్యసామాన్యమగు నొక యుత్తమకార్యము సాధింప నమకట్టితి ఆలసింపదగదు. సత్వరముగబోవలయు. మీప్రభువులనమునకు కృతజ్ఞతాపూర్వకమగు లేఖనువ్రాయు వ్యవధి లేకయున్నది. ఆయనకు నానమస్కారములందఁజేయుడు. ఇకముందెన్నడైన మునల్మానులవలన మీ రాజ్యోత్తమునకు తొందరలు కలిగెనేని మాటమాత్రము చెప్పిపంపిన నేనాయనకు తోడ్పడనుంసిద్ధుడనని తెలుపగోరెద; అనిచెప్పి ఆగ్రాపురోన్ముఖుడయ్యెను. త్రోవలో నితనిరాకకై నిరీక్షించుచుండిన ఖాంజీకంపావత్ కనబడుటతోడనే కర్తవ్యాంశమునుగూర్చిప్రస్తావించెను. తుదకు భల్లూజీ నిట్లనియె. మిత్రమా! మన మీనమయమున రెండుకార్యముల నొకేపర్యాయము సాధింపవలసియున్నది. మనలో నొకరు ఆగ్రాకోటజొచ్చి అమరసింహుని మృతశరీరమును దొడ్డుకొని రావలయు. రెండవవారు రాణిగారి సహగమనార్థమై చితినిసిద్ధపఱచి తగిన కట్టుదిట్టములు చేయవలయు. ఈరెంటిలో మీరెద్దానిని సాధింపగలరో సత్వరముగ తెలియబలుకుడు.

అంతట ఖాంజీ యిట్లనియె మిత్రమా! మీరు నాకంటె కడునమర్థులరు. శవమును మీరే సాధింపనగును. నేను దహనసంస్కారాది కార్యములకు కావలసిన సాధనములు సమకూర్చెద.

అట్లేయగుగాక యని భల్లూజీ యాశ్వికుల వెంటనిడుకొని ఆగ్రానగరమునం బ్రవేశించి కోటగోడ బ్రద్దలుగ బగులగొట్టజొచ్చెను. శీఘ్రకాలములోనే పయ్యది కూలిపడిపోయెను. వెంటనే యాశ్వికదళముతో కోటమైదానమధ్యమునయున్న కళేబరమును తీసికొని హయగ్రీవమునకు వ్రేలాడగట్టి శత్రువుల నెదుర్కొనుటకై రెండువందల రౌతులుపడిపోయిన కోటగోడకడనుంచి మిగిలినవారితో సిద్ధపఱచిన చితికడకు వేవేగజని సహగమనార్థమై సర్వసిద్ధముగ నుండిన రాణికి మ్రొక్కి శరీరమును స్వాధీనముపఱచి యాశ్వికుల జాగరూకులై యుండుడని హెచ్చరించెను.

రాణి యత్యంత సంతుష్టాంతరంగయై భల్లూజీ ఖాంజీల నాశీర్వదించి శవముతో నగ్నిగుండమునం బ్రవేశించెను. ఇంతలో ఢిల్లీశ్వరుని యాజ్ఞానుసారము అసంఖ్యాకములగు మునల్మానుసైనికులికార్యమును భగ్నపఱచుటకై హాహాకారము లొనర్చుచు చితికడకు వచ్చుచుండిరి.

ఆసంగతి గ్రహించి భల్లూజీభాంజీలు తమ సైన్యముల జోడించి ముసల్మానుల నెదుర్కొని తీవ్రముగ ప్రతిఘటించిరి. ముసల్మానులును పరాభవాగ్ని కోర్వజాలక అత్యంత సాహసముతో పోరాడసాగిరి. రాజపుత్రులెంతటి ధైర్యసాహసోపేతులైనను, ఎంతటిరణశూరులైనను అధికసంఖ్యాకులగు ముసల్మానుల నెదిర్చుట దుస్సాధ్యముగనుండెను. ఐనను వారు నిరుత్సాహపడలేదు. అగ్నిసంస్కారము పూర్తియగువరకు ప్రతిఘటించినగాని ప్రయోజనముండదని నిశ్చయించుకొని ప్రాణముల నరకుజేయక నట్లే తీవ్రముగ పోరాడజూచిరి. కాని గాయము లతితీవ్రముగ దగులుటచే వారి శక్త్యుత్సాహములు సన్నగిల్లెను. భల్లూజీ భాంజీలునయితము నిరాశజెందుచుండిరి. ఇంతలో నొక బ్రాహ్మణుడు భల్లూజీ భాంజీలకడకేగి గొంతెత్తి "ఓయోధాగ్రేసరులారా, మీరాయమగ్రహమున సర్వము పూర్తియైనది. ఇక సహగమనవిషయమై సంశయింపకుడు" అని చెప్పి వెడలిపోయెను. రాజపుత్రులొకరిమొగమొకరు జూచుకొని మందస్మితులై జయజయధ్వానము లొనర్చి శత్రుకోంతనేపు పోరాడి రణరంగముననే ప్రాణముల త్యజించిరి. కృతశరీర సంపాదనార్థమై బయలుదేరిన సహస్రసంఖ్యాక పరిమితిగల రసపుత్రసైనికులలో నొక్కరైనను తిరిగి రాజాలకుండిరి.

వారి భౌతికశరీరములు అదృశ్యములైనను వారొనర్చిన కార్యములు అమోఘములు, శాశ్వతకీర్తిదాయకము లగుటచే వారు మృతజీవులుగనే పరిగణింపబడుదురు. భల్లూజీసైనికులు కోటలో ప్రవేశించుటకై బద్దలుగ గోడ పగులగొట్టిన చోట రాజహానుచక్రవర్తి ఇటుకరాళ్ళతో పూడ్పించి కంపబాతించెను. 1866 సంవత్సరమున జాక్ట్రిల్ అను సేనాని ఆయిటుకరాళ్ళను పెరికివేసి నాచోట నొకద్వారము నేర్పఱచియుండెను. ఆద్వారమునే యిప్పటికిని అమరసింహుని ద్వారమని ప్రజలు చెప్పుచుందురు. చూచితిరా రాజపుత్రుల సాహసధైర్యములు ప్రతిజ్ఞాపాలనము.

## గ్రంథస్వీకారము.

**1. కుసుమకేసరి.**

గ్రంథకర్త బాలకవి విశ్వనాథం నరసింహం గారు విజయనగరము. రు 0-4-0.

ఇదియొక పద్యకావ్యము. కథ రామవర్మకును కుసుమకేసరికిని జరిగినవివాహము. 1926 సం॥ రం ఆంధ్రభారతీ తీర్థద్వితీయవర్థంత్యుత్సవమున సన్మానమును పొందిన గ్రంథము. పద్యములశైలి ధారాళము.

**2. ఆరోగ్యగీతములు.**

గ్రంథకర్త:- కడలి చినభైరవస్వామిగారు పేరూరు, తూర్పుగోదావరిజిల్లా, వెల రు 0-4-0.

ఆరోగ్యవిషయములు గీతములలో వ్రాయబడినవి. కొన్నిగీతములు గరిమెళ్ళ సత్యనారాయణగారు రచించిన గీతముల ఫక్కీని వ్రాయబడినవి.

**3. రుక్మిణి ( నవల )**

గ్రంథకర్త:- ఆకుండి వెంకటశాస్త్రిగారు, రాజమహేంద్రవరం, వెల 0-8-0.

ఔరంగజేబు కాలమునకు సంబంధించిన కథ. ఈ గ్రంథము సులభశైలిలో వ్రాయబడినది.

4. ఆత్మానుభవ సాధకేశ్వరశతకము.

గ్రంథకర్త:- పెద్దిభొట్ల యజ్ఞేశ్వరశర్మగారు, కాకినాడ, వెల 0-4-0

ఇందు ముక్తిసాధనంబులగు భక్తిజ్ఞానవైరాగ్యములు బోధింపబడినవి.

5. చపల (నవల)

గ్రంథకర్త:- పండిత ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు, వేగుజుక్క-గ్రంథమాల బరంపురం గంజాంజిల్లా, వెల చందాదారులకు రు 1-0-0.

ఇది యొక అపరాధపరిశోధకనవల. ఆదినుండి తుదివరకును కథ యాకర్షణీయముగ నుండును భాషయు సరళముగ ప్రవహించినది

6. శ్రీలక్ష్మీనరసింహ గ్రంథనిలయము మచిలీపట్టణము వారిచే ప్రచురింపబడిన యీక్రింది మూడు నవలలను వందనములతో స్వీకరించితిమి.

1. రోహినూరు (చరిత్రాత్మకనవల)

కర్త:- కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు, వెల చందాదారులకు 0-12-0, ఇతరులకు 1-4-0.

2. వైరాగ్యనలము (పరిశోధకనవల)

అనువాదకర్త:- కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు వెల చందాదారులకు 0-12-0, ఇతరులకు రు 1-4-0.

3 కర్మఫలము (సాంఘికపరిశోధకనవల)

గ్రంథకర్త:- లింగమల్లు జగన్నాథంగారు, వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-4-0

ఈపై మూడు గ్రంథముల నామమాత్రము గజదిపితిమి. కోహినూరు నవలలో గోహినూరు ననుగురించి స్వల్పమేయున్నను, విలాసకుమారి అంబాలికా అమరసింహుల ప్రేమను పక్వమునకు తెచ్చుటకు గావించిన స్వార్థత్యాగము ప్రశంసనీయముగ నున్నది. విలాసకుమారి హృదయపూర్వకముగ నమరసింహుని ప్రేమించి వివాహమాడనున్న సమయములో దైవనిర్ణయముచే నిష్ఫలమనోరథయై ప్రచ్ఛన్నవేషమున చరించి మొగలాయీల పోరాటములో రాజపుత్రుల మేల్కొలిపి యుత్సాహవంతులుగ జేసినది. ఈమెవైరాగ్యము వర్ణనాతీతము. అట్టి వైరాగ్యమునే నేటి మానవుడు సాధనజేసినచో భౌతికబాధలనేకములు తొలగిపోగలవు శైలియందును కథాచమత్కృతియందును వైరాగ్యనలమును మించియున్నదని చెప్పవచ్చును. వైరాగ్యనలములో కథాభాగము స్వల్పమేయైనను, ఆకర్షణీయముగ నున్నదని నుడువవలెను.

కర్మఫలము సాంఘికనవల బాల్యవివాహములనిరసించుచు వితంతువివాహములను ప్రోత్సహించుకథ వివరింపబడియున్నది. సమయోచితముగ పరిశోధనాభాగ మిందుచేర్పబడి యున్నది. దోషులను నిరూపించుటకై విచక్షణలావుపడిన కష్టములు, జగదీశుని మూర్ఖతలు,శకుంతలపునర్వివాహములనుచదివినయెడల నేటిసాంఘికప్రపంచమునందుగలలోపములనేకములుబోధపడగలవు.

7. ఈక్రింది గ్రంథములను వందనములతో స్వీకరించితిమి.

బుద్ధ నాటకము (హిందీగ్రంథమున కనువాదము)

కర్త:- కోటంరాజు సత్యనారాయణగారు, గాంధీపేట, గుంటూరు వెల 1-0-0.

8. గానమాధురి.

కర్తలు:- శ్రీముక్తేవి లక్ష్మనరసింహదాసు సూరపనేని రామగోపాలరావుగార్లు.

పత్రికలు.

9. ఈక్రిందిపత్రికలను కృతజ్ఞతతో నందికొంటిమి

శాంతి.

తూర్పుగోదావరిజిల్లా తొటపల్లి హిల్సులోని శాంత్యాశ్రమమునుండి ప్రకటింపబడు పత్రిక.

భక్తిజ్ఞాన విషయములతో గూడిన మాసపత్రిక హిందుశ్రీ
సంవత్సరచందా రు. 2 లు.
సంపాదకులు మునికోటి శ్రీనివాసగారు

సుభాషి.

సంపాదకులు:- వందిరి మల్లిఖార్జునరావుగారు రాజమహేంద్రవరము. సారస్వతము కళ చిత్రలయభివృద్ధికి పాటుపడు మాసపత్రిక. చక్కని వ్యాసరాజములతో నొప్పారుమాసపత్రిక. సాలు చందా రు 3 లు.

సంవాహిని.

సారస్వతసేవ చేయుటకు పశ్చిమాంధ్రమున నిదియొకటే మాసపత్రిక. ధనవంతులగు మదళ్ళపల్లి రామసుబ్బయ్యశ్రేష్ఠిగారీపత్రికకు బోషకులుగ నుండుటచే చిరకాలము వర్ధిల్లగలదని మాయాశయము. సంవత్సరచందా రు 5 లు

---

# అన్వేషణము.

కందుకూరి రామభద్రరావుగారు.

భూరుహాంబులు దెచ్చి ♦ పూద్రవ్యములను
అర్చనంబులఁ జేసి ♦ యలయుచుండెడిని;
చరణసేవలఁ జేసి ♦ సలిలామృతంబు
ఉత్సాహడోలిక ♦ నూగుచుండెడిని;
మురటీని చేపట్టి ♦ సొంపుగా విసరి
పవనుడానందుఁడై ♦ పనుగు లెత్తెడిని;
ఏ ప్రొద్దునుం గీర్తి ♦ యేపార నుడివి
భృంగిపాడుచు లీల ♦ పొంగి పాడెడిని;
పంచమస్వరము నం ♦ బాటలన్ బాడి
కలకంఠి గర్వ నం ♦ కలిత యయ్యెడిని;
వెల్ల గొడుగుబట్టి ♦ వేడ్కనంబుదము
బహు చిత్రభంగులఁ ♦ బ్రభలనొందెడిని;
హృదయ కమలంబున ♦ నుంచి సద్భక్తి
సేవ జేసెడి యిచ్చఁ ♦ జేరినం గాఁడు
నా నాథుఁడేలనో ♦ నాకర్మమేమొ !! 5.

ఆకాశమందిరం ♦ బంత యలికించి
నక్షత్రముల ముగ్గు ♦ నల్గడఁ బరచి;
సాంద్రకుసుమములనీను ♦ చంద్రమండలిని
కర్పూర దీపంబు ♦ గ్రాలంగఁ బెట్టి;
ధవళకాంతులనీను ♦ దమనపత్రముల
ఘర్మాంబువుల నార్పఁ ♦ గా వేసి సురటి;
మధువులన్ మధువైన ♦ మకరందమునను
సుమపాత్రముల నింపి ♦ సొంపుగాఁ బెట్టి;
నిశ్శబ్దగీతిక ♦ న్నింపుచు దిశలఁ
బ్రకృతి కాంత సఖులు ♦ పరిచర్యగొనుచు
ముదముతోఁ బొంగుచు ♦ మురియుచున్నాఁడు
పదిపదే పిలువంగఁ ♦ బయనమై రాఁడు
నా నాథుఁడేలనో ♦ నాకర్మమేమొ !! 6.

[ * 1, 2—జూన్; 3—4 ఫిబ్రవరి 1927; మాస సంచికలలో బ్రచురింపబడినవి. ]

# మహారాష్ట్రస్వాతంత్ర్యము.

హరనాథ వసుప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది.

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు

## — అయిదవ రంగము —

ఔరంగబాదున కేగుమార్గము.

(ఒంటిగ లక్ష్మీబాయి ప్రవేశము)

కళ్యాణి. ఆది.

లక్ష్మీ:- దేవదేవ దీనపోష। దేవమౌనిసంస్తుత్య॥ దే ॥
ఓపరాత్పర॥ పావనచరితా। పాపరహిత
రామాక్రినాధ ॥ దే ॥
కడునిడుమలలోబడిదరి। గానక। తడబడుచుం
టిని। తడయక రమ్మిక ॥ దేవ ॥
పావనమగునీ। పాదయుగమ్మును। భజనజేసె
దనో దేవ ॥ దే॥
పతిపరిత్యక్తనై। వెతలను గుందెడి। గతిహీనను
నా। గతివీవె ॥ దే ॥

ఇంత జనసమూహ మధ్యమున విరామము లేని యీహృదయ సంచలనమున మర్మభేదకమైన యీ కోలాహలమున నేనొక్కరితను. ఈసంసారమందలి కార్యకారణములనే యనంత శృంఖలములలో నేనొక చిన్న గొలుసునై యుంటిని. నాలెక్క యేమి. ఈవిశ్వరంగమున నేను బంధమును లేనట్లు సంచరించెడి నావంటి వనిత నెవ్వరు లక్ష్యము సేయుదురు. అనంతతారాగణము లుత్పన్నములై పడుచున్నవి. ప్రకృతియందనేక కోట్ల జీవరాసులుత్పన్నములై నశించుచున్నవి. అనేక మంది మహాత్ములవతరించి యంతరించుచున్నారు. అట్టి వారి లెక్కయే లేనపుడు నను బోలు యబలను వీక్షించువారెవ్వరు? (నవ్వి తర్కముగ) కానిమ్ము, వీరు నన్ను చూచిననేమి చూడకున్ననేమి. ఎవ్వని యాజ్ఞ లేక పర్ణమైన కదులదో, వాయువు చలింపదో యట్టి పరాత్పరుని లోకరక్షకుని దయ నాకుండున్నది. నాకేమిలోటు. అతని యనుగ్రహమే లేకున్న నేనానాడా నరరూపరాక్షసుని బారిబడి యభిమానరక్షణ మ్మొనర్చుకొనగల్గుదునా? తల్లీ! మహాశక్తీ! భవానీ! రమ్మ నాయందు బ్రకాశింపుము. నాహృదయమున నివసింపుము. ఓపరాత్పరా! భవదీయ నిరంతర కరుణారస ప్రవాహాదకములచే నామానసరంగమును శుద్ధిజేసి పవిత్రముగ నొనర్చినచో నాసంకల్పము లన్నియు నెఱవేఱును. నాప్రాణేశ్వరుని నేను పొందగలను. ఓమహాత్మా! మోహాంధుడై రాజ్యలోభావిష్టుడై నాహృదయేశ్వరుడు నన్ను బరిత్యజించెను. అహంకారయుక్తుడై భవదీయ శ్రీచరణ పంకజములను వదలి రాక్షస పాదధూళి నాశ్రయించి యున్నాడు. దీనరక్షకా! నీదయయున్నచో నానాధు నుద్ధరించి క్రమమార్గమునకు ద్రిప్పుకొనగల్గుదును. నాకట్టి శక్తిని బ్రసాదింపుము.

మ॥ జననంబందిన దాదిసౌఖ్యమన లే
శంబైన నేగాంచనై
తిని నాకేగతి వ్రాసియుంచితివి హా
దేవాదిదేవా

సనాతన నీపావన పాదపంకజములన్
ధ్యానింతు నా జీవితే
శుని రూపంబును గన్నదోయి
కవనిక జూపింపవే కేశవా॥

(ప్రవేశము-గోవర్ధనుఁడు)

గోవ;- రామరామ సోదరా! సోదరుఁడేనా? కాదే మోతమ్మఁడా! నీతో నేనానాఁడు సంభాషింపలేదా?

లక్ష్మి;- నీవు నన్ను పురుషుఁడని తలంచుచుంటివా.

గోవ;- ఎట్లు తలపకుందును. నేనింకను మోసపోవుదునా? సోదరా! నీగడ్డమేమయినది? వపనకర్మవలన నశించినదా లేక దేశాంతరమున కేగినదా?

లక్ష్మి;- (స్వగతము) ఇతడత్యంత విచిత్ర వ్యక్తిగాఁ గన్పించుచున్నాఁడే స్త్రీ పురుష వివక్షత యెఱుఁగని ఋష్యశృంగుని తమ్ముని వలె నున్నాడు. (ప్రకాశము) నేను వనితనో పురుషుఁడనో నీకంటికి కగఁబడుట లేదా?

గోవ;- కంటితోఁ జూచుచున్న దానినెట్లు విశ్వసింపకుందును నేననేకమంది మహారాష్ట్రసోదరులను వీక్షించియుంటిని. ఎక్కడ గాంచిన నిట్టి నిడుదపెన్నెఱిపేణి – చక్కనిరూపమే కనబడినది. కాని నిన్ను జూచినది మొదలు కొంచెము సందియము కలుగుచున్నది. నీనేత్రములు నీచూడ్కులును వెనుకటివారి వలె గంభీరమై భయంకరముగా నుండక లజ్జా స్నేహ విలాసపూరితములై యున్నట్లు కన్పట్టుచున్నవి. ఒకవేళ నీవాడుదానవే యైనచో నిట నొంటిగ నేమిచేయుచుంటివి? ఇచ్చట నీకా తెవ్వరయినఁ గలరా?

లక్ష్మి;- నాకు బంధువులుగాని తదితరులుగాని యెవ్వరును లేరు. నేనేకాకినిని. సన్యాసిని నై యున్నాను.

గోవ;- ఓహోహో! నీవు సన్యాసినివా? నేనిదివరలో సన్యాసిని గావలయునని నిశ్చయించితిని. ఇప్పుడట్లొనర్చుటకుఁ బ్రాణ మొప్పకున్నది ఒక్కమాఱు మహారాష్ట్రులతోఁ గలసి యుద్ధమెట్లు చేయుదురో చూడవలయునని యున్నది. అదట్లుండనిమ్ము. నిన్ను నేను సోదరీయని పిలుతును. తప్పుగా దలంపవుగదా.

లక్ష్మి;- ఏమియును తప్పులేదు అనదనై ఏకాకినై యున్న నాకు నేఁటికి నీవంటి సహోదరుఁడు దొరకుట సంతసమే.

గోవ;- సోదరీ! నీమాటలు కడుమధురములయి యున్నవి. సరియేకాని నాకార్యము నాకే బాగుగా లేదు. ఏమందువా? యుద్ధమును జూడవలెననియున్నది. గాని నేను వరియున్నముందిను బంగాళా దేశీయుఁడను, దానిపై జ్ఞానవత్రిని సేవించు అలవాటుగలదు. వరులెవ్వరయిన వచ్చి యదలించి నన్ను ముందునకుఁద్రోయ బ్రియత్నించు నంతలో కాళ్ళు మెలికలుబడ నేనే క్రిందఁబడుచుందును. అందువలన నేనొక్కటి యోచించితిని. ఈ మహారాష్ట్ర సైనికులతోఁ గలసి శరీరమునకు హృదయమునకు బలము సంపాదించుకొనఁదలంచితిని.

లక్ష్మి;- అట్లుచేయుట మిగులమంచిపని భగవంతుఁడు నీసంకల్పమును నెఱవేర్చుగాక. నీవతిశీఘ్రముగ శరీరదార్ఢ్యమును సంపాదింపుము. అట్లయినచో వెంటనే మాతృసేవకుఁ బయనమయి పోవచ్చును.

గోవ:- తల్లిని సేవింపని పుత్రుఁడు కుపుత్రుఁడు. నాకు తల్లియేది? ఆమె మరణించి చాలకాలమయినది.

లక్ష్మి:- నిన్ను గడుపునఁ గన్నతల్లికాదు మఱియొక తల్లియున్నది. ఆమె నీకును నాకును సమస్తమయిన వారికిని తల్లియే.

గోవ:- ఎవ్వరాతల్లి! దుర్గాదేవియా? ఓహో ఆమె తనకున్న చేతులతోఁ బోరాడి లోకంబులనే మ్రింగఁగల సమర్థురాలు. ఆమెకుగా యుద్ధముఁ జేయ నాకవసరము లేదు.

లక్ష్మి:- దుర్గాదేవి కాదు నీజన్మభూమి. నీవు పుట్టిన దేశము నీకు జనని కాదా?

గోవ:- పుట్టిన దేశమా! నేను పుట్టిన భూమి వంగదేశము.

లక్ష్మి:- ఔను. అట్టి వంగదేశము మహారాష్ట్రదేశము మొదలగువానితో నలంకృతమైన యీ భారతభూమియే మనకందరకును తల్లి

గోవ:- నీవు పిచ్చిమాటలాడుచుంటివి, దేశము తల్లి యెట్లగును?

లక్ష్మి:- ఎట్లా! ఇటువినుము. మన కన్నతల్లి మనలను గర్భమున భరించి కని తన వక్షస్థలమునఁ బరుండఁబెట్టుకొని హృదయరసామృతమైన క్షీరములను మనకు ద్రావనిచ్చి పోషించి పెద్దవారిం జేయుటచే మనమామెను మాతృదేవతయని యెంచి పూజించుచుంటిమి ఇప్పుడు మనకా తల్లి లేదు. నిన్ను వక్షస్థలమునఁ బరుండఁబెట్టుకొనిన తల్లి మరణించినది. ఇప్పుడెవ్వరి వక్షమున బరుండెదవు?

గోవ:- నీవు పిచ్చియా యేమి? నేను ముసలిదాని యొడిలో నేలపరుందును? కంబళియో చాపయో పరుచుకొని పరుండువాఁడను. అదియును లేకున్న నేలమీఁదనే పరుండుదును.

లక్ష్మి:- ఆనేల యెచ్చటిది? దేశమాతృ వక్షస్థలము కాదా? దేశమధ్యగతము కాదా! ఏకాకివైన నీకు చాపయైన దొరకకపోవచ్చును గాని తల్లియైన భారతజన్మభూమి పరుండుటకు నీకు నిరంతరము తన విశాల వక్షస్థలమును జూపించుచుండ లేదా?

గోవ:- తెలిసినది. నీవు చెప్పినది నాకిప్పుడు కొంచెము వగతమైనది

లక్ష్మి:- నీవు నీతల్లియొక్క స్తన్యమును వదలిన పిదప కడుపునెట్లు నింపుకొనుచుంటివి?

గోవ:- పప్పు బియ్యము రొట్టె మొదలగువానిని దినుచుంటిని. ఈ దినమున నాలుగులడ్డూలను దింటిని.

లక్ష్మి:- చూచితివా! తల్లియొక్క వక్షస్థల జనిత దివ్యరస మేవిధముగ స్తన్యరూపమున బయలు వెడలి మనకాహారమగుచున్నదో యట్లనే మన మిప్పుడు భక్షించుచున్న కాయగూరలు ధాన్యము వరి గోధుమ మొదలగు పదార్థములును దేశమాతృ వక్షస్థలసంజనితమైన రసమునైయున్నది. కన్నతల్లివద్ద నాలుగు వత్సరములే పాలుద్రావుచుంటివిగాని దేశమాతయొసంగెడి దివ్యామృతరసము నీకు జీవితకాలమంతయు నాధారమగుచున్నది. నిన్ను గన్నతల్లి నాల్గువత్సరములే యొడిలో నిడుకొనుచున్నది గాని జన్మభూమియైన భారతమాత నిన్ను బ్రాణమున్నంతవరకుఁ దన వక్షస్థలమునఁ బరుండఁబెట్టుకొని జోకొట్టుచున్నది.

సీ॥ భాగీరథీతుంగ ♦ భద్రాది పుణ్యనదీ జలంబుల మన ♦ తృష్ణదీర్చి
అమలధాన్యాది వి ♦ వ్యాహార వస్తువు ల్పకమార్చి మనల గ ♦ ష్టములఁ బెంచి

తులలేని దివ్యౌష ♦ ధులప్రభావమ్మున
వ్యాధి సంఘంబులఁ ♦ బారఁదోలి
వక్షస్థలమ్మునఁ ♦ బవ్వళింపఁగ జేసి
లీలావ్యసనమ్మునఁ ♦ జోలఁబాడి

మనల సుఖమునకై సర్వ ♦ మార్గములను
చక్కఁబరచిన లోకైక ♦ జనని భార
త వసుమతియన్న మనకన్న ♦ తల్లికన్న
నధికగణనీయ కాదె యో ♦ యార్యవర్య॥

సీ॥ గంగా సరస్వతీ ♦ గౌతమీ కృష్ణాది
పుణ్య సరిద్వంతుల ♦ పుట్టినిల్లు
శ్రీప్రోద శారద ♦ పరమ భక్తవరులఁ
గొమరులుగా గన్నఁ ♦ విమలచరిత
వాల్మీకి కుంభజం ♦ భవ వశిష్టాదులౌ
మునిచంద్రులనుగన్న ♦ పుణ్యభూమి
జానకీ ద్రౌపదీ ♦ సావిత్రి మొదలగు
సాధ్వీమణుల గన్న ♦ జన్మభూమి
యమిత శూరరత్నంబుల ♦ కాటపట్టు
సకలశాస్త్ర పరిజ్ఞాన ♦ సాగరంబు
దివ్య మాణిక్య సుప్రభా ♦ దీపితంబు
స్వర్గమును బోలు భారత ♦ జన్మభూమి॥

అట్టి జన్మభూమి నిన్ను గన్నతల్లికంటెను మిక్కిలి పూజనీయయని నిశ్చయింపుము.

గోవ:- సోదరీ! నీబోధవలన నాకంతయుఁ దెలిసినది. రహస్యమునంతయు స్పష్టముగ దెలియఁజెప్పితివి. జన్మదేశము కన్నతల్లికంటెను గొప్పదను సంగతి నాకుఁదెలిసినది. వయస్సున నీకన్న పెద్దవాడనై పోయితిని. లేకున్న నీపాదధూళిని శిరమునఁ దాల్చియుందును. నుదుటఁ దిలకముగ ధరించియుందును.

లక్ష్మీ:- నీవు నాతండ్రివంటివాఁడవు నాకొక్క మంచి దీవన నొసగుము. అదియే చాలు.

గోవ:- నీవు సన్యాసినివి. ఎట్లు దీవింపవలయును

లక్ష్మీ:- నీసత్ప్రవర్తనచేఁ బుట్టినయింటిని మెట్టిన యింటిని ప్రకాశింపజేయుమని దీవింపుము.

గోవ:- నీవాంఛితము నెఱవేఱుగాక యని త్రికరణశుద్ధిగ దీవించుచున్నాను. అక్కా! నాకును దల్లిని జూపించితివి. గాని నన్ను కూడట దేశమాతృ సంరక్షణకై బలము నార్జించి యుద్ధముఁజేయుమని చెప్పితివి. ఆతల్లియొక్క శత్రువులెవ్వరో చెప్పితివిగావు.

లక్ష్మీ:- నీవాశ్రయింపఁ దలఁచిన మహారాష్ట్రవీరులే యాశత్రువులను జూపఁగలరు. పోయి వారిం గలసికొనుము.

గోవ:- అట్లయిన నీవు చెప్పినట్లు చేయుదునని ప్రతిజ్ఞఁ జేయుచున్నాను. కాని నిన్నువదలి నేనిప్పుడు మహారాష్ట్రులఁ జేరినచో రణధర్మములను నేర్చుకొని వారితోఁగూడ యుద్ధభూమి కేగవలసియుండును. అట్టియెడ నసామాన్య మేధాసంపన్నవైన శక్తిస్వరూపిణివైన నీదివ్యదర్శనము నాకెట్లు లభించును?

లక్ష్మీ:- ఈ సహోదరిపై ప్రేమయున్నదున్నచో నెప్పుడో యొకమాఱు మరలఁ బునస్సందర్శనము లభింపఁగలదు.

గోవ:- ప్రేమ కాకర్షణశక్తి యున్నప్పటికిని నేను కేవల మున్మాదుడనై పోయితిని. చూచితివా? నాబుద్ధి నావశమున లేదు. గంగాయిదమ్మ నాగుండియలకు వలపుఁ గల్గించినది. కాని స్మృతిలేక పసత్వమువలె బడియున్న నన్నొక మార్గమునకుఁ దెచ్చి దివ్యోపదేశముం జేసి యొక మనుష్యునిగా నొనర్చితివి. నీయుపకార మాజన్మాంతము మఱవను. ఈ విదేశమున నేను యుద్ధము నర్పుచు మరణించు తరుణము వచ్చినచో సోదరీ! సోదరీ! యనుచు నిన్ను దలంచుకొని మరణింతును.

లక్ష్మి:- తల్లీ! దేశమాతా! యని జన్మభూమిని స్మరించుచుఁ బ్రాణములను వదలుట మంచిది.

గోవ:- దేశమాతను స్మరింతును. అట్టి దేశమాత యను వస్తువును దెలియఁజేసిన నీవంటి సోదరిని దలంచుకొనుటం కన్న ముఖ్యము అక్కా! నీవు మనుష్యమాత్రివు గావు. పాల సముద్రమునఁ బుట్టిన లక్ష్మివి.

లక్ష్మి:- వెఱ్ఱిమాటల నాడకుము. సన్యాసిని నైన నన్ను బంధుత్వసంబంధమైన మహామోహములో ముంచకుము పొమ్ము.

గోవ:- సోదరీ! నేను నీకేమికష్టము గల్గించితిని? నీకుఁ గష్టముగ నున్నచో నేనొక్క నిముస మిచ్చటుండను. పోయెదను. అక్కా! నీవు కుశలముగ నుండుము. భగవంతుఁడు నీకోర్కెను నెఱవేర్చుగాక.

(నిష్క్రమించును.)

లక్ష్మి:- నేనీ వ్రతము నవలంబించుట సార్థకమే యైనది. తల్లీ! జన్మభూమీ! నీ సేవఁజేయుటకై తత్తరపడుచున్న నాకు నేటి కొక సోదరుఁడు దొరికినాఁడు. జననీ! మహాసముద్రమునఁబడి మునిగియున్న నా కాధారము జూపించి ముందునకుఁ గొనిపొమ్ము.

ఫీలు—ఆది.

జయజననీ జయజననీ | సకలభక్తవర సంధాయనీ ||జ||
1 సకలా మవిద సద్బుధ వినుతా | సకలలోకభరిత యశోపేతా ||జయ||
2 గంగా నర్మద సింధు పినాకిని గౌతమీ పవిత్రాంబు సమేతా ||జయ||

—ద్వితీయాంకము—

మొదటి రంగము—జహానారా మందిరము.

జహానారా సోఫాలో గానముఁజేయుచుఁ గూర్చుండును.

తోడి—ఏక.

జహా:- రే జహాకే బాగ్ దునియా చంద్ రోజ్
దేఖలో ఇస్కా తమాశా చంద్ రోజ్
అయ్ ముసాఫిర్ కూచ్ కా సామాన్ కర్
ఇస్ జహాఁమే హైబసేరా చంద్ రోజ్
బాద్ మదఫన కబ్రమేఁ బోలీ కజా
అబ్ యహాఁపే సోతె రహనా చందురోజ్ ||

(ఖోజా—ప్రవేశించును.)

ఖోజా:- రాజకుమారీ!

జహా:- వచ్చిన పనియేమియో దెలుపక రాజకుమారీ! యని యఱచుచు నిల్చుందువేల?

ఖోజా:- ఒక హిందూయువతి.

జహా:- అయిననేమి?

ఖోజా:- కడుబలాత్కార మొనర్చుచున్నది.

జహా:- ఎందులకు? నీ యుద్యోగ మపహరించుటకా యేమి?

ఖోజా:- కాదు.

జహా:- కానిచో నిన్ను నిక్కాకట్టుకొనుటకా! ఆమెయొక్క కోరికయేమి?

ఖోజా:- ఆమె యీ రంగమహాలులోనికి రాఁ గోరుచున్నది.

జహా:- పనియేమి?

ఖోజా:- ఆ వివరము మీకేగాని యొరుల కెఱింగింపదట.

జహా:- వెంట నింకెవ్వరైనఁ గలరా?

ఖోజా:- ఎవ్వరును లేరు. కాని యామె మిక్కిలి చక్కనిది.

జహా:- నీ భర్తయుండెనా ?

లక్ష్మి:- ఉన్నాడు.

జహా:- నీనాథుఁడు నిన్ను రంగమహాలున కెట్లు రానిచ్చెను ?

లక్ష్మి:- నేను వారి యనుజ్ఞను బొందియుండలేదు స్వతంత్రముగ వచ్చితిని.

జహా:- నీభర్త యెచ్చటనున్నాఁడు?

లక్ష్మి:- పాదుషావారి దర్బారులో నున్నారు.

జహా:- పాదుషావారి దర్బారులోనా ! ఆయన పేరేమి ?

లక్ష్మి:- (సిగ్గుతో శిరమును వంచి) రంగనాథ——

జహా:- రంగనాథుఁడా ! రాజారంగనాథ్ ! పాదుషాగారివలన నే నీ పేరును వినియుంటిని. ఇచ్చటికి వచ్చుటకు నీ యుద్దేశ్యమేమి ?

లక్ష్మి:- రాజకుమారీ ! నే నల్పురాలను కాని నాసంకల్పము తలకు మించినది.

జహా:- నీ యభిప్రాయమును స్పష్టముగ వచింపుము.

లక్ష్మి:- నా యజమాని తన దాసినగు నాపై క్రోధమును వహించెను.

జహా:- నీ వంటి జగన్మోహినిపై రంగనాథునకుఁ గ్రోధమా ?

లక్ష్మి:- నన్ను వారు మరచిరి. తన హృదయమున నాకుఁ జోటీయకుండ ద్రోసివైచిరి. వారి సేవకురాలైన నేను మాత్రము వారిని వదలక నాహృదయపీఠమున మన్మనోహరుని ప్రతిమను బ్రతిష్ఠించి పూజించుచుంటిని. వారిని మరచుట యన్న నాశక్తికి మించిన పని. కావున నాయిష్టదైవము నాకు గావలయును. నామనోహరుని ముఖసందర్శనము నాకు లభింపవలయును, అందులకు దగిన యుపాయము నరయఁజాలరా ?

జహా:- రంగనాథునకు పాదుషావారి దర్బారులోనే పనియున్నది, అతఁడీ రంగమహాలు వైపునకు రాఁగూడదు.

లక్ష్మి:- మీరు చక్రవర్తియొక్క సోదరీమణులై యున్నారు.

జహా:- అయిన నేమి లాభము ?

లక్ష్మి:- సామర్థ్యమందుఁ దాము పాదుషావారితో సమానులని వింటిని.

జహా:- నాయధికారము రంగమహాలులోఁ జెల్లునుగాని రాజకీయ విషయములయం దెట్లు చెల్లును ?

లక్ష్మి:- భారతదేశ చక్రవర్తి మీయాజ్ఞ ననుసరింతురని వింటిని. అమ్మా ! ఈనిర్భాగ్యశాలి వాంఛితమును దీర్చుఁడు. రాజపుత్రికవైన నీక సాధ్యమేదియును లేదు.

జహా:- నీవీ రంగమహాలులో నేదియైన పని జేయఁగలవా ?

లక్ష్మి:- ఆశ్రయమొసంగినఁ దెలియఁగలదు.

జహా:- నీ పేరేమి ?

లక్ష్మి:- నర్జాబాయి.

జహా:- నీకు సంగీతము వచ్చునా ?

లక్ష్మి:- సామాన్యముగఁ బాడఁగలను.

జహా:- అట్లయిన నీ గానమును నాకు వినిపింపుము. నీపాట నా మనమునకు సంతుష్టి గలిగించినచో నీ విచ్చట వేరొక పని జేయ నక్కర లేదు.

# ఆంధ్ర భారతి

## మచిలీపట్టణము

సంపుటము ౨ | నవంబరు 1927 | సంచిక ౮




## సంస్కరణముల కమిషను.

అనేక సంవత్సరములనుండి హిందు దేశీయులను చీడపురుగువలె పీడించియున్న సంస్కరణముల కమిషను నేటికి నియమింపబడినది. ఆ కమిషను సభ్యులయొక్క నామములను చూచి నోఛేంబర్లు మినహా యావన్మందియు నావురుమనిరి. ఈ ప్రకటనవలన కాన్సరువేటివు మంత్రివర్గముయొక్క సంకుచిత దృష్టి నిరంకుశాధికార యభిలాష వెల్లడియగుచున్నది. అనుకొనిన వ్యవధికి పూర్వమే కమిషనును నియమించుటలో కాన్సర్వేటివు మంత్రివర్గమువారికి ప్రత్యేక యుద్దేశము లేకపోలేదు. 1924 లో జరుగనున్న పార్లమెంటు యెన్నికలకు పూర్వమే హిందుదేశ సంస్కరణములను యిదమిద్ధమని తేల్చివేయుట అవసరమని తలచిరి. బహుశః మరియొక కారణముకూడ నుండవచ్చును. బర్కెన్‌హెడ్ ప్రభువు లార్డు హైఛాన్సిలరుగా నియమింపబడుదురని వదంతికలదు. ఈ వదంతియే నిజమగుచో తానా పదవి నధిష్ఠించకపూర్వమే కమిషనును నియమించి గౌరవమంతయు తనకే దక్కించుకొనదలచినను తలచవలెను.

కమిషను సభ్యులయొక్క జీవిత సంగ్రహములను "వివిధ విషయములలో" ప్రచురించియుంటిమి. వాటిని పరిశీలించినచో ననేక విషయములు విశదము కాగలవు. ప్రబల విరోధులును, భిన్నభిన్న పక్షములవారును హిందుదేశపు విషయములలో చేయిచేయి కలుపుకొని పనిచేయుదురనుట నిర్వివాదాంశము. రాజకీయ విషయములలోనేమి సాంఘిక విషయములలోనేమి యుత్తరదక్షిణధ్రువములవలె నున్న బర్కెనుహెడ్ ప్రభువు సర్ జాన్ సైమను గార్లేకీభవించుట హిందుదేశముయొక్క దురదృష్టమే. హిందుదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమీయవలెనని బొబ్బలిడిన కార్మికవర్గమువారధికారములోనికి వచ్చిన పిమ్మట హిందుదేశపు విషయముల నెట్లు తృణీకరించినదియు నెల్లరెరిగిన విషయమే. అధికారానంతరము తిరిగి సింహగర్జనము సలిపిన కార్మికవర్గనాయకులు తమపక్షములోని యనామకులను సంస్కరణముల కమిషనులో బాల్గొననిచ్చుట వారియొక్క సంకుచిత దృష్టిని వెల్లడి చేయగలదు, హిందుదేశస్థులందరును తీర్మానించినచో తమ సభ్యులనుపసంహరించుకొందుమని కార్మికవర్గ నాయ

కులు తెలియపరచిరి. హిందుదేశమువంటి పెద్ద దేశములో నేకగ్రీవము కుదురుట యసంభవము. ఏను కోరినది అందని మాగ్రినిపండు. కాంగ్రెస్ పక్షమువారితో కలిసి పనిచేయుచు రాష్ట్రీయ స్వాతంత్ర్యమును గోరిన బ్రాహ్మణేతర పక్షము వారు నేడు సంస్కరణముల కమిషనును సహృదయ దృష్టితో వీక్షించుచున్నారు. రంగయ్యర్ వంటి స్వరాజ్యపక్షమువారు ఇంగ్లాండులో కూర్చుని రాజీరాజీ యని కేకలు వేయుచున్నారు. జిన్నావంటి మహమ్మదీయ నాయకులు కమిషనును ఖండించుచున్నారే కాని తా మనుసరించవలసిన మార్గమును నిర్ణయించుకొనలేదు. ఇట్టి సందర్భములో హిందుదేశమున దేశాభిప్రాయము కుదురుట సంభవమని తోచదు.

అయినప్పటికిని సంస్కరణముల కమిషనును బహిష్కరించవలెనను ప్రచారము సకాలము లోనే బయల్వెడలినది. అవసర కాంగ్రెస్ సమావేశమును కోరుచు పండితమాలవ్య వ్యర్థవాదము చేయుచున్నప్పటికిని, సర్ తెజ్ బహదూర్ సప్రూవంటి మితవాదియు ఆనిబెసెంటువంటి నేషనల్ హోమ్‌రూల్ లీగ్ వారును కమిషనును బహిష్కరించవలెనని ప్రబల ప్రచారము చేయుచున్నారు. శ్రీనివాసఅయ్యంగారు బహిష్కరణకై నిరంతరదీక్షతో పనిచేయుచున్నారు. ఇది యెంతయు శుభసూచకము.

కమిషను విచారణవలన మనకు కలుగు మేలు సున్న. అందు భారతీయసభ్యులెవరును లేరు. కమిషనువారు రాష్ట్రములలో పర్యటనము సలుపునపుడు ఆయా రాష్ట్రముల శాసనసభ్యులనుండి సెలెక్టుకమిటీలను నియమించి నామమాత్ర సహాయమును పొందుదురట. ఇది కేవలము మనకే. మనకన్నీరు తుడుచుటకిట్టి ఏర్పాటు చేయుచున్నారు కాని సెలక్టు కమిటీలయొక్క యభిప్రాయములను విధిగా యనుసరించవలెనను నియామకము లేదు. కాన్సర్వేటివు పక్షమువారేమి చేసినను బ్రిటిషుసామ్రాజ్యము హిందూదేశములో చిరస్థాయి యగుటకు జేసెదరుగాని మరియొక యుద్దేశములో మాత్రము కానేరదు. బర్కెనుహెడ్ ప్రభువు చాల సాహసవంతుడు. వెనుక ఐర్లాండుకు స్వాతంత్ర్య మీయరాదనియు అవసరమైనయెడల తాను కత్తిగట్టి పోరుటకు సంసిద్ధుడుగా నున్నట్లును ఘంటాపథముగ తెల్పియుండెను. అటువంటి బర్కెనుహెడ్ ప్రభువు నేడు మనపట్ల సానుభూతి వహించుననుట వెఱ్ఱి.

కనుక మనము చేయవలసిన కర్తవ్యము కమిషనును బహిష్కరించుటకంటె మరియొకటి లేదు. జస్టిస్ పక్షమువారు కోరిన రాష్ట్రీయ స్వాతంత్ర్యమూ గగనకుసుమము. మితవాదులు కోరిన హైందవ ప్రాతినిధ్యమూ అదియును కాన్పించదు. స్వరాజ్య పక్షమువారు కోరిన రౌండు టేబిలు కాన్ఫరెన్సు అరణ్యరోదనము. ఇప్పుడయినను మనదేశస్థులందరు నేకీభవించి బహిష్కరణము కొనసాగించినచో లాభముండునుగాని మరియొక విధము లేదు. వెనుక ఈజిప్టునకు మిల్నర్ కమిషనును నియమించినపుడు ఈజిప్టు దేశస్థులందరు నా కమిషనును బహిష్కరించిరి. మిల్నర్ ప్రభువు రైలు దిగినప్పుడు కూలివాడు సయితము ఆయన మూటను మోయ నిరాకరించెను. అపుడు మిల్నర్ ప్రభువు స్వదేశమునకుబోయి ఈజిప్టు దేశవాసుల పట్టుదలను స్ఫుటపరచి స్వాతంత్ర్యమొసంగినగాని లాభము లేదని స్పష్టపరచెను. నాటితో ఈజిప్టు స్వాతంత్ర్య సంపాదనమునకు

సంలభమార్గ మేర్పడినది. హిందుదేశము యొక్క క్షేమము హిందు దేశీయుల పైననే యున్నదని వేరుగ చెప్పనక్కరలేదు.

## బహిష్కరణము.

బహిష్కరణ మను పదమన్ని దిక్కులు మారుమ్రోగుచున్నది. కాని ఈ యాయుధము యొక్క యుత్కృష్టతను గమనించుచున్నారో లేదో దురూహ్యముగ నున్నది. ప్రారంభ ప్రగల్భములు ఉత్తర కుమారుని ప్రజ్ఞలవంటివి కార్యాంతమువరకును నిలువవు, కార్యశూరుల యొక్క లక్షణములును కావు. బహిష్కరణములో చూపవలసిన మనోనిబ్బరము, ధైర్య సాహసములు, ఔదార్య త్యాగములు, మన యం దెంతవరకు నిమిడియున్నవని పర్యాలోచించుకొనవలెను. బహిష్కరణమను వాదము కక్షసూత్రముల సంబంధము లేక వ్యాపించుచున్నది. ఒక పక్షములోనివారే కొందరు బహిష్కరణము నామోదించుటయు మరికొందరు త్రోసివేయుటయు జరుగుచున్నది. కుమారస్వామిరెడ్డిగారివంటి బ్రాహ్మణేతరులు, డేవిస్‌గారివంటి క్రైస్తవులు బహిష్కరణము నామోదించుచున్నారు. తక్కిన జస్టిసు పక్ష నాయకులు సుబ్బరాయన్ మంత్రి దీనిని ప్రతిఘటించుచున్నారు. కనుక దక్షిణ హిందుదేశమున జస్టిసు పక్షమువారు బహిష్కరణ సూత్రమునకు ప్రబలవిరోధులుగ నెంచవచ్చును. ఉత్తరమున మహమ్మదీయులు తమ కార్యక్రమము నిదమిద్ధమని తేల్చుకొనలేదు, ఇవన్నియు నిట్లుండగా మితవాదులే స్వల్ప వరమును ప్రసాదించినను తమ రోషవాక్యములను దిగమ్రింగుకొనగలరు. ఈ సంగతి సందర్భముల నన్నిటిని పరిశీలించగా నొక విధమగు సంకోచ ముత్పన్నమగుచున్నది.

## బ్రిటిషు పార్లమెంటు.

ఎన్ని సంశయతరంగములు వ్యాపించుచున్నను సూక్ష్మముగ యోచించినచో బహిష్కరణము కంటె వేరుమార్గము కనుపించుటలేదు. ఎందువలన? హిందుదేశముయొక్క రాజ్యాంగవిధానమును నిర్ణయించు తుదియధికారము బ్రిటిషు పార్లమెంటుదేయని, బ్రిటిషు మంత్రివర్గమువారిచర్యలు స్పష్టపరచుచున్నవి. 1919 లో సంస్కరణముల నొసగుచు మాంటేగ్యు ప్రభువెన్ని యుదారాశయములు ప్రకటించినను నాతనితరువాత నధికారమునకువచ్చిన కాంసర్వేటివు పక్షమువా రాయుదారాశయముల నన్నిటిని నణగద్రొక్కుకొని తామిచ్చిన ప్రసాదమును భారతీయు లెంతవరకు తిని జీర్ణింపజేసికొనినదియు నిర్ణయించుటకు తామే యర్హులమని, సంస్కరణముల కమిషనునుండి భారతీయులను సంపూర్ణముగ బహిష్కరించి వైచిరి. హిందుదేశ ప్రభుత్వమువా రేవిధముగ సివిల్ కార్యనిర్వాహకశాఖలను విడదీయకుండ పరిపాలించుచున్నారో, యావిధముగనే సంస్కరణములను ప్రసాదించుటయు పర్యవసానము పరిశీలించుటయు, తమ హస్తములయందే యుంచుకొనిరి. ఆంగ్లేయ దేశస్థులుగాక, ఏయమెరికావారుమాత్రమో కూడిన సంఘము సంస్కరణముల సంగతి సందర్భములను విచారించినయెడల కొంతవరకు తృప్తికరముగ నుండెడిది. హిందూదేశములోని

బ్రిటిషు న్యాయస్థానములో న్యాయాధికారికి అసెంబ్లీపై నెంతస్వాతంత్ర్యము కలదో, రాబోవు సంస్కరణముల కమిషనుకు తోడ్పడునిమిత్తము నియమింపబడే శాసనసభల సెలక్టు కమిటీల మీద కమిషనువారికి నంతే స్వతంత్రము కలదు. కాలము తలక్రిందులై యొకవేళ కమిషను వారు విశాలహృదయముతో సంస్కరణములను ప్రసాదించినను వాటిని త్రోసివేయుట కధికారము బ్రిటిషు పార్లమెంటుకు గలదు. కాని యెడల నీసరికి స్కీన్‌కమిటీవారి సైనిక సంబంధమైన శిఫారసులమలులోనికే వచ్చియుండెడివి. కాంగ్రెసువారుకాని మితవాదులుకాని, జస్టిస్ పక్షమువారుకాని యోచించవలసిన విషయమేమనగా మన రాజ్యాంగవిధానమును నిర్ణయించు హక్కు మనదా లేక బ్రిటిషుపార్లమెంటుదా యనునదియే. ఈ విషయములో నెవరెవరికి భేదాభిప్రాయములున్నను స్వయం నిర్ణయ సూత్రమును త్రోసివేయువారుండరు. మనము కోరునదిదియే. బ్రిటిషు పార్లమెంటువారు పాటించనిదిదియే.

## మిల్నరుకమిషను.

సంస్కరణముల కమిషనుపై మనకు గల యసంతృప్తిని వెల్లడిపరచుటకు తగిన మార్గము విచారించవలెను. ఈజిప్టుదేశమునకు స్వాతంత్ర్య ప్రదానముచేయుటకై మిల్నర్ ప్రభువు యాధిపత్యమున నొక కమిషను పంపుటయు దానిని ఈజిప్టుదేశీయులు బహిష్కరించుటయు జరిగెనని వయిన ప్రస్తావించియుంటిమి. ఈ మిల్నర్ కమిషనును గురించిన వివరముల నిచట నుదహరించుట యప్రస్తుతము కానేరదు. 1919 లో బ్రిటీషు సామ్రాజ్యమునకు లోబడి ఈజిప్టు యొక్క రాజ్యాంగ విధానమును నిర్ణయించుటకు మిల్నర్ కమిషను నియమింపబడినది. తక్షణమే ఈజిప్టులోని జాతీయ పక్షమువారు దానిని బహిష్కరింప తీర్మానించుకొనిరి. ఈ కమిషను వారు ఈజిప్టునకుపోయి ప్రజల సాహాయ్యమును బడయుటకై యెన్నియో లాలనలు చేసినను నిష్ప్రయోజనము లయ్యెను. బ్రిటీషు పార్లమెంటువారి చర్య నాక్షేపించుచు ఈజిప్టులోని న్యాయవాదులు తమ వృత్తి నొకవారము పాటు మానివేసిరి. ప్రభుత్వశాఖలో నున్న ఉద్యోగులందరు 21 దినములు సమ్మెకట్టిరి. కూలి పనివాండ్రు సమ్మెకట్టుటయేగాక, బాలుర బాలికలు ప్రభుత్వ విద్యాలయముల బహిష్కరించిరి. అంతటితో ఈజిప్టుదేశపు మంత్రివర్గమువారును రాజీనామా నిచ్చిరి. మిల్నర్ కమిషనువారు సెటురామిసు హోటలులో దినముల పర్యంతము కూర్చుని చుట్టును మందుగుండు సామానులతోగూడిన కాపుదలనుంచుకొని ఈజిప్టు దేశనాయకుల కాహ్వానములు పంపిరి. అవియును ఫలించలేదు. మిల్నర్ ప్రభువంతట నొక మెట్టు దిగి యన్ని పక్షముల వారును తమ తమ యభిప్రాయములను నిస్సంకోచముగ వెల్లడించవచ్చుననియు నేవిధమయిన నిరోధము కలుగజేయబడదనియు ప్రకటించెను. జాతీయవాదు లాతని మార్పుదలను ప్రశంసించుచు తమకు సంపూర్ణ స్వాతంత్ర్య మీయనిదే యేవిధమయిన తోడ్పాటు నీయజాలమనిరి. మిల్నర్ కమిషనులో నేమెంబరయినను ప్రజల యొక్క యభిప్రాయములను తెలిసికొను నిమిత్తము మోటారులో వెళ్ళినప్పుడు విద్యార్థులు ముందుగా మోటారులోపోయి తమకు వ్యతిరేకముగా పనిచేయుచుండిరని సర్. ఓవెన్ థామస్ గారు ( కమిషను సభ్యుడు ) నుడివియున్నాడు.

స్త్రీలు పురుషోద్యోగస్తులు అకుంఠిత దీక్షతో పనిచేసిరి. చివరకు శాసనసభలకెన్నుకొనబడిన సభ్యులు లొకచే సమావేశమై స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. 1920 లో నాశాభంగులై మిల్నర్ కమిషనువారు స్వదేశమునకు తిరిగివచ్చిరి. లండనులో ప్రవేశించి, తామిదివరకు ప్యాస్‌పోర్టులు నిరాకరించి డిపోర్టుచేసిన జగ్లూల్‌కు విన్నపము పంపుకొనిరి. ఈజిప్టుదేశములో విభేదములను కల్పించి యూసఫ్‌సాహెబును అధికారమునందుంచి తమ మాటలను కొనసాగించదలచిరి. యూసఫ్‌ను అతని మంత్రులును తమ ప్రాణములను గుప్పిళ్ళలో పట్టుకొని కాలముగడిపిరి. ఇంగ్లాండుదేశములో ప్రధానమంత్రిగ నున్న బాల్‌ఫోరుగారు "ఈజిప్టుదేశములో బ్రిటిషు అధికారము నిలచియేయున్నది. దానిని నిలబెట్టుకొనుట కన్నివిధముల ప్రయత్నించెదము ఆవిషయములో ముమ్మాత్రమెవరును వేరు అభిప్రాయమును కల్గియుండరాదు" అని ప్రగల్భములు పలికెను. మిల్నర్ కమిషనులో నియమింపబడిన సర్ జాను మాక్సువెల్, సర్ రెనల్‌రాడ్, లాయిడ్‌గారును, జే. యస్. స్పెండర్‌గారును మరియొక కార్మికవర్గపు ప్రతినిధియునుండిరి. ఈజిప్టుదేశస్థుడొక్కడును నియమింపబడలేదు. ఇట్టి యోగ్యత మన హిందూదేశమునకు పట్టనున్నదా!

## సంస్కరణములు.

కమిషనువారు మనకేమి ప్రసాదింతురో యూహించుటంత కష్టమయిన పనికాదు. ద్వంద్వపరిపాలననంతరింపజేయుటకు వీరు పూనుకొనరు. పైనవన ప్రభుత్వమువారు సంస్కరణములనిచ్చి యియ్యనట్లుండవలెను. కొందరు విద్యావంతులనైనను తమ వైపునకు త్రిప్పుకొని ప్రజలలో రెండు పక్షములను కలుగజేసి పరిపాలింపజూతురు. సామ్రాజ్య శాసనసభయందుకూడ ద్వంద్వపరిపాలనాపద్ధతిని ప్రతిష్ఠాపించవచ్చును. రాష్ట్రములలో నెన్నికశాలలను ప్రజాయత్తము చేయవచ్చును. నిర్వాచకవర్గమును పెంచి, ప్రజా ప్రతినిధుల సంఖ్యను పెంచి, వీరి తీర్మానములను విఫలీకృతములుగ నొనర్చుటకు స్టేటు కవున్సిలు మాదిరి రెండవ సభను రాష్ట్రములలోకూడ నెలకొల్పవచ్చును. ఇందుకు మదరాసులోకూడిన జమీందారుల సమావేశము తీర్మానముచేసినది. ఇంతేకాని ప్రజా ప్రతినిధుల యభిప్రాయములను శిరసావహించు కార్యనిర్వాహక శాఖ నెలకొల్పబడదు. సివిల్ కార్యనిర్వాహక శాఖలు విడదీయబడవు. పండిత నెహ్రూగారు బాధ్యతాయుత పరిపాలనకై పోరాడుడని యొక కేక సీమనుండి వేసినారు. బాధ్యతాయుత పరిపాలనమో, డొమినియన్ స్టేటస్సో, [illegible] వెట్టి శాసనమువంటి సంస్కరణమో, యేమి కావలసిన దానిని నిర్వచించి ఘంటాపథముగ చాటి తత్సాధనమునకై కృషిసల్పవలసిన బాధ్యత డిశంబరులో మదరాసు నగరమున కూడనున్న కాంగ్రెసు పైగలదు.

# అమ్మాయి.

యు. నరశింహారావుగారు, బి. ఏ., ఎల్. టీ., సాహితీ సమితి.

మాతల్లి, ఒకమారు మాటాడవే

నీ

నోటి ముత్యాలేమి రాలిపోవూలే.

కన్నతల్లీ, కొంచెం కన్నెత్తవే

నీ

కళ్లకనకాలేమి కరిగిపోవూలే.

ఘల్లుఘల్లూమంటు గంతులెయ్యావే

నీ

పువ్వులా పాదాలు పొక్కిపోవూలే.

కెమ్మోవి చిరునవ్వు కుమ్మరింపావే

నీ

చిరులేత లివుడేమి చిందిపోవూలే.

ముద్దుతల్లీ, ఒక్క ముద్దిచ్చిపోవే

నీ

మొగ్గవంటి బుగ్గ మగ్గిపోదూలే.

నాచిట్టి తల్లి, నావక్క నుండావే

ఆ

స్వర్గసోపానాన్ని ఎక్కిపోతానే!



చేస్తారు. ఇంతకంటేకూడా ఘోరాలు వుంటాయి. అవి అవాచ్యాలు. అందుచే చెప్పక వదిలేస్తాను.

"నా వుద్దేశంలో ఈ కాలాన్ని "సిఫారసులయుగం" "రికమెండేషన్ల" యుగం, లేకపోతే "పూజారి" యుగం అని పిలిస్తే బాగుంటుంది. కలికాలంలో క్షణికములైన ఉదరపోషణ, ఇంద్రియ సుఖాలు మొదలయిన వాటి కోసం ప్రజలు పోరాటంగా పరుగులెత్తి అధోగతికివస్తారు అది తప్పించుకోవాలని వుద్దేశం గలవారు ఇది చదివితే తరిస్తారు. ఇది యెవరయితే చదువుతారో, వింటారో, వారికి కోటి యజ్ఞాల పుణ్యం లభిస్తుంది. సంధ్యాసమయం అయింది. ఈ వాళకు లేద్దామా మరి." అంటూ మాతుల వారు లేచారు. వారివెనకే మునిబృందంకూడా లేచింది.

## కవి.

మిన్నికంటి గురునాథశర్మగారు.

గీ॥ ఏపదంబులు మనచే రచింపఁబడునో?
ఎట్టియర్థముల్ మనకు నూహింపఁబడునో?
ఆపదములె యాయర్థములే పటుత్వ
విరచనా విశేషములఁ గవిప్రవరుల
వలనఁ బలుకంబడి జగంబు వలరఁ జేయు॥

గీ॥ ఔర! వక్రోక్తులఁట యలంకారములఁట
అలఁతులంట వాక్యార్థబోధలు, వచింపఁ
దగినయర్థంబులం దభిధ్వానఁగంట
సుకవుల తెఱంగ దేమొకో? చోద్యమయ్యె॥

ఉ॥ రసికుల్ కొందఱు వాక్యసంపదఁ, బదార్థంబందునం గొందఱా
రసిశబ్దంబునఁ గొందఱుల్ రసముఁ గూర్పంజాతు రల్లేగదా!
వసనావాప్తి గువిందుఁడున్, రవణము న్నైవ్యదేహమందున్, సము
న్నసదాకారముఁ గోడెకాఁడు చెలిచెంతంగందు రందంబుగన్॥

మ॥ పదముల్ పూనెడు మెల్లఁగా, పచటిశబ్దంబుల్ బరీక్షించెడిన్
మది వర్ణాహరణాభిలాష మొనఁగు, న్నానావిధాలంకృతుల్
గొదలేకుండఁ గొనున్, సువర్ణతతిలాగున్, దారనవ్యగుప్తిఁ జో
దుది దోషాంతముఁ బొఱఁజూచుఁ గవిచంద్రుండౌర దొంగంబలెన్॥

ఉ॥ కొందఱు లోభిచందమునఁ గొత్పాదరర్థము; నయ్యలంకృతుల్
గొందఱు వేశ్యవోలెఁ గయికొందురు; కొందఱు ఘాతుకాది కీ

తిం దిలకింతురి నద్రినతికిఁ; దగునర్థ మలంకృతిలోఁ దనం
బుం దలయూఁగఁ జేయుదురు పూజ్యులుగొందఱు సత్కవుల్ గృతిన్ ॥

గీ॥ విమలపద్యాల ఫలము పవిత్రబుద్ధి
వాని ఫలము రసగ్రహణానుభావ;
మందుకు ఫలంబు సత్కీర్తిఁ బొందు నేఁటి
బుధుల వాక్కుల కెవ్వాఁడు మునుపుగనడు? ॥

చ॥ వికియుల మోమునం బలె దోసంగుపోసంగని సత్కవీంద్ర వా
క్కుశరముఁ గందు బింబిత మమోఘగుణంబగు నవ్యవస్తు వా
ల్మికము ముదముం బొసఁగ్రెడిని దద్విగళంబునఁ దోషకల్మషం
బొక్కఁడయిన స్ఫురదంబుఁ గననోపరు నూ రసికాగ్రగణ్యులున్ ॥

మ॥ కనులంజూచినదాని నేసి నుడువంగాలేరు శబ్దంబులీ
నున స్వాధీనము గామివారు సుకవిశ్లోకార్థమాయాసముం
గనుచుం, దర్శిన్యులు నిశ్చలాత్ములు సమగ్రగ్రంథకూలంకషుల్
గనులన్వ్యాసి సుధంబలెన్ రసముఁ దాఁగన్నేత్రరుగ్రోకు మ్రుడిన్ ॥

గీ॥ ఏదియో? ఏడనో? ఎప్పుడో? దోసంగు
కలిగెనందుఱ్ఱి తొల్లిటి యలంకారవిదులు
అన్నిపాత్రములందుండు నదియు కాదె
మొదలు కవిజీవనము దోషములకు నెలవు ॥

చ॥ పదములకూర్పు, వాక్యముల వైఖరియున్, రసపుష్టి, యర్థ
రసవద నవభావవిస్ఫూర్తి, వ్యంగ్యవిలాసము, పద్యల
క్షణం బెది విడిపోవునో? యనుచు నెన్ని యొభంగులఁ జూడ
నౌ విశారదులగు సత్కవీంద్రులకు; రాజులకీ వగలెల్ల లేవుగా ॥

చ॥ సిరులు నదృష్టమేఘములఁ జెంపిన చంచల, లెవ్వరాఁగనే
ర్తురు, నిరతప్రియానములతో నసువుల్ నిలువంగఁబోవ హా హా!
స [illegible] లార! కావ్యసుధ [illegible] యీ శోమయూ కాయమునుం బది
స్ఫురణము సేయు సత్కవులఁ బూజ్యుల నొజ్జలఁ గొల్వు డర్థులై ॥

(అడవి పువ్వులు.)

# జ్యోతిర్లయ.

శ్రీ వెంపటి నాగభూషణంగారు.

## 1

అతనొక చిత్రకారుడు. అతని పుట్టుపూర్వోత్తరాలేమీ తెలియవు. అతనా విద్య నెక్కడ నభ్యసించాడోకూడా తెలియదు. అతని పేరేమిటో, యెట్లాంటివాడో, యెంతటివాడో, యెట్టివాడో. అతని రూపురేఖావిలాసాలు, వేషభాషలు, కళారహస్యాలు—యేమీ తెలియవు.

కాని, అతను సామాన్య సాధారణ చిత్రకారుడు కాదనీ, అతనిచిత్రకళావిద్య, చేష్టలు, చిత్తరువులు, విలాసాలు, విధానాలు—సామాన్యమైనవి కాదనీ, అతనిలో ఒక గొప్ప మహత్తరమైన మహిమ, తేజస్సు, ఉన్నదనీ, అతను మానవాతీతుడనీ,—యింకేమేమో చాలా అన్నారు కొందరు.

అతనుమాత్రం యెవ్వరికీ యెప్పుడూ కన్పించలేదు. పెక్కుమంది అతని దివ్యదర్శన భాగ్యానికి యుగ యుగాంతరాలనుండీ కాలకూపంలో కన్నులుమూసి, కరములు మోడ్చి, లేచి ఉన్నారు. అతని ప్రౌఢవిద్యా మర్మములు తెలిసికొనవలెనని వారందరి కుతూహలం. కాని, వీలుపడలేదు. అతని హృదయం పాషాణకృతం కాబోలు?

అతను వసించే స్థలం మాత్రం తెల్లడి అయింది యెట్లో? నిజంగా అయిందో లేదో తెలియదు. ఏమో? అయిందన్నారు పెద్దలు కొందరు. వ్యోమమండలంలో నక్షత్రవీధిగుండా పోయి, జలధరకన్యల క్రీడా సరస్సును లంఘించి వెడ్తే, అక్కడెక్కడో పుణ్యం చేసుకున్న వారికి కళ్ళున్న వారికి ఆ చిత్ర చిత్రకారుని దివ్యసౌధ ప్రాకారప్రాగ్భారాలు గోచరిస్తాయట. మరేమో, అతను కన్నెత్తిచూస్తే వెల్తురు వస్తుందట కన్నుమూస్తే అంధకారం ఆవరిస్తుందట నవ్వితే వెన్నెల కాస్తుందట. దుఃఖిస్తే వర్షం కురుస్తుందట. కోపిస్తే మేఘాలు గర్జిస్తాయట—అని యింకేమేమో అన్నారు. కాని, అతని వాస్తవ చరిత్ర యెవ్వరికీ తెలియదు.

అతనొక చిత్రకారుడు. వింత చిత్రకారుడు. విలాసచిత్రకారుడు. విచిత్రచిత్రకారుడు. బహుశః అతనొక విపరీతపు వ్యక్తి. దేహంనిండా వెలుగు రేఖలూ, ముఖంనిండా దరహాస చంద్రికలూ, తలనిండా మరకతాలూ మాణిక్యాలూ, వుంటాయని అనుకొన్నారు కొందరు. ఎవరెన్ని చెప్పినా, విసినా ఊహాగానమే కాని, యదార్థంగా, అతనెవ్వరో యేమిటో?

అతను చిత్రకారుడేగాని, అతనికి యెక్కువ చిత్తరువులు వ్రాయాలనే జిజ్ఞాసలేదు. ఎందుకనో? తన జీవితకాలమంతలో ఒక్క మంచి చిత్తరువు లిఖిస్తే ధన్యుడౌతాడని నమ్మకం. అతనికి అట్లే, అతను ఒక్క చిత్తరువు మాత్రమే చిత్రించడానికి సంకల్పించుకొన్నాడు. సంకల్పసిద్ధికి యేమీ ఆటంకాలు లేకుండా చూచుకున్నాడు. పరికరాలుకూడా తగినట్లుగా సమకూరిపోయినాయి. అతనివద్ద వున్నది ఒక్కటే కుంచ, ఒక్కటేరంగు, ఒక్కటేరంగు కలిపే పాత్ర. క్రొత్తవి కావాలని అతనెప్పుడూ అనుకోడు. వాటితోనే సంతృప్తిపొందాడు. వాటితోనే జీవనభారం యెత్తాడు, జీవితకార్యం ప్రక్రమించాడు. అట్టి బీదపరికరాలతో పనిసాగుతుందా అని అతనికే సందేహము కల్గేది అప్పుడప్పుడు. కాని ధైర్యం సమకూర్చుకునేవాడు వెంటనే.

జీవితకాలంలో శాశ్వత యశస్సంపన్నత నార్జించే చిత్తరువు వ్రాయాలని దృఢసంకల్పము కాని ఆచిత్తరువు యెట్లావుండాలో అతనికే స్ఫురించిందికాదు. ఎన్నిమార్లో ఊహించాడు. ఎన్నివిధాలుగానో ఊహించాడు. ఎంతగానో ఊహించాడు. విపంచితంత్రులు మ్రోగలేదు. తుదిమారు జగదంబను స్తుతించి ఆమె పాదసాన్నిధ్యాన ప్రణమిల్లాడు. ఆమె తన కరుణాకటాక్షవీక్షణములు, మందహాస శోచిస్సులు అతనిపై ప్రసరింపజేసి, ఆశీర్వదించి పంపినది.

శుభముహూర్తంలో, జగదంబ మంగళాచరణోచ్చారణతో, అతను తన జీవితకార్యానికి ఉపక్రమించాడు. మొదట భీతికల్గింది. అంబను స్మరించి పటముపై కుంచెను వ్రాశాడు. ఉత్తరక్షణంలో వివిధవర్ణాలు ఆవిర్భవించినవి. రంగుకళిక ఇంద్రధనుష్కాంతు లీనినది. కుంచె సూర్యమయూఖమాలికా ప్రకాశితమైనది. చిత్రకారుని హృదయసంతోషము, అతని ముఖంలో అనితమసత్వంగా అవతరించినది.

తదేకనిష్ఠతో, జాగరూకతతో చిత్తరువును సమాప్తంజేశాడు. ఒక్కమారు చిరునవ్వునవ్వాడు. అయ్యది గాలికెరటాలలో మిళితమై విశ్వవ్యాప్తమైనది. పదునాల్గుభువనాలు పులకరించినవి. వెన్నెలలు వికసించినవి. ఆనందభరితయై జగదంబ పుష్పవృష్టి గురిపించినది. వినువీధిలో తటిత్కాంతులుభుకుమన్నదితనవాంఛయీడేరినదనిరూఢి చేసుకున్నాడు.తనచిత్తరువు తన కేవిభ్రమముకల్గించినది. తనసిద్ధహస్తత్వానికి, నిరుపమానకౌశలానికీ, అపరూప పరిణామానికి తానేవిహ్వాలుడైనాడు తన శక్తిసామర్థ్యాలకు తానే వింతపోయినాడు. చిత్తరువు పూర్తియైనది. నామకరణ మత్యావశ్యకము. ఏమిపేరుపెట్టటానికీ అతనికి తోచలేదు. ఆలోచనపోలేదు ఊహాసరిహద్దుకున్నది. అంత్యసమయము లోని నిస్పృహా జనించినది. తన జీవితఫలం వ్యర్థమైపోతుందేమోనని ఖిన్నుడైనాడు. తిరిగి, జగదంబను స్మరించి, ఉచ్చాసనాసీనం జేసి, సహస్రదళ పుష్పాలతో పూజించాడు. దేవి హృదయము మసారము. "సృష్టి చితరువు-" అని అతని హృదయాంతరాళంలో యెక్కడో ధ్వనించింది

అతనొక చిత్రకారుడు ఒక్క చిత్రకారుడే కాదు, కవికూడాను. కవి అంటే సామాన్యకవి గాడు ఎటువంటి చిత్రకారుడో అటువంటికవి. సరస్వతీ సంపన్నుడు. అతను కవీశ్వరుడు, హృదయ నీరేజపుట మాధురిమను వెల్లడించేవాడు. గానం చేసేవాడు. ఆదివ్యగాన ప్లుతంలో జగత్తు ఛిదోత్కారాన్విత మయ్యేది. ఆనంద లహరిలో అల్లల్లాడేది.

ఆకవి, కల్యాణారుణ దీధితులలో, సంజె కెంజాయ ప్రశాంతములలో, నీలమేఘపు నింత చాయలలో, శారద శర్వరీ మధురచంద్రికలలో హేమంతనిశి ప్రకాశిత సౌదామిని కాంతులలో స్వేచ్ఛావిహారం చేస్తూ, యేమేమో పాడుతూ, పద్యాలు రచిస్తాడు. అతని పద్యాలలో వర్ణనలు, అవి యెక్కువుండవు క్లిష్టసమాసాలు, గర్భనిర్భేద వాక్యాలు కన్పడవు.......... అయితే అతను అన్నప్పుడల్లా పద్యాలు వ్రాయడు కొన్ని కొన్ని సమయాలలో స్ఫురణవచ్చి వ్రాస్తాడు. అతనికి ప్రణయమూర్తిగాని, జీవితేశ్వరిగాని యెవ్వరూలేరు. ఆదర్శప్రాయకవేగా! అతనువ్రాసే విషయాలు అందరకు తేలికగా అర్థముకావు. అతీతమై, అపూర్వమై, అజ్ఞానతిమిరమును పారద్రోలులేవి. ఆనందాబ్ధి తేలియాడిస్తవి సృష్టిసూత్రమును, లోకరహస్యమును

వెల్లడి స్తవి అన్నియు అన్నిజ్ఞానకళలములు వెల్లురేకలు. "మనోహరద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయసప్రసారాతిరసప్రసార చిరప్రసరంబుగ" సారెసారెకు చేతముచల్లజేస్తవి.

విభావరీ పుటములపై వ్రాశేవాడు, ప్రస్ఫుటాక్షరాలతో. మయూఖము తూలిక.

అతని రచనలన్నీ కలిపి గ్రంథముగా ప్రచురింప, అంచనా వేశాడు. అతని పుస్తకమునకు అతనే చిత్రములను వ్రాసుకొన్నాడు. చిత్తరువుకువలెనే తగునామము స్ఫురింపలేదు...... ..."సృష్టికావ్యము" అని హృదయాంతరాళాలలో యెక్కడో ధ్వనించినది......... చిత్రకారుడు, కవి, అతని రచనలను చూచి యుప్పొంగి యుబికిపోయేవారు. ఆనందించేవారు అనుభవించేవారు ఆవేదనపడేవారు కాని, అతనెవ్వరో తెలిసికో లేకపోయినారు. ఎక్కడవుంటాడో స్పష్టంగా కనుక్కోలేకపోయినారు. ఎన్నిప్రయత్నాలు చేసినా వృథాయైనవి.

చిత్తరువు, మేఘచిత్రశాలలో ప్రదర్శింపబడ్డది. కావ్యము దిశాంతరాళములో ప్రదర్శింపబడ్డది. అందరూ నిర్విణ్ణులైనారు. అట్టి అమోఘచిత్తరువును లిఖించిన చిత్రకారుని అట్టి అతీతకావ్యమును రచించిన కవి తల్లజుని ఒక్కసారి దర్శనమిమ్మన్నారు... అంశుమాలీసుడు అభీష్టువు నిస్తానన్నాడు. తుషారకరుడు సుధాంశురేఖ ఆశపెట్టాడు. వనదసుందరి సమాశ్లేష సుఖం వాగ్దానంచేసింది. సమీరకుమారుడు తన రహఃగీతిని తెలుపుతానన్నాడు. సాగరకన్య ఫేనమాలిక లంచమిస్తానన్నది. మానవుడు తన సర్వస్వమును అతని దివ్యపాదాంకితమున అర్పిస్తానన్నాడు....కాని అతను ప్రత్యుత్తర మీయలేదు ఎక్కడ నున్నాడో అసలు. ఒక్కమారు కిలకిలని నవ్వుమాత్రం వినబడ్డది. ఒక్కమారు తళుక్కున కాంతి కన్పించినది. ఎక్కడ నున్నాడో, అసలు? మబ్బుల గుట్టలమధ్య నెక్కడనంభోళి లో దోబూచి ఆడుతున్నాడన్నారు, ఎవ్వరో, ఏమో?

## నాకు దిక్కెవరు?

బి. టి. కె. ఆచార్య గారు.

తల్లి! సిరియొడి వీడిన దాది నెచ్చె
లేని నిల్వ నీడైన నే నెఱుంగనైతి
నిమ్మహానంత సృష్టిలో నెచట నేని
నన్నుఁబోలు నిర్భాగ్యుఁడున్నాడె?—అంబ!
మండు వేసవి యెండకు మ్రగ్గిపోయి,
తలను వాల్చి, సొమ్మసిలు పూఁదీగల నీడ
వత్సనై బ్రదుకఁగ నీ ప్రపంచమందు
నంతకుఁగూడ తావులేదయ్యె—సకట!
ప్రబల తీక్ష్ణతపోహతిఁ గ్రాఁగి-క్రాఁగి—
వదన గహ్వరంబు దెఱచివైచి—ప్రావృ
డభ్రమా! యెపుడు వర్షింతువకట?—
అమితదాహమయ్యెను, తీర్పుమంచు బహుళ
విధుల వేఁడికొంటిన్, కాచి, వేచియుండు-
తల్లిరో! దిక్కెవరు నాకు?—
ఈయనంత గర్భంబునం దెచట నేని
సుంత తలఁ దాచుకొనఁ దావుఁజూపు, మమ్మ!
లేనిచోఁ గెరటము లెట్టె లేచి-లేచి-
భీకరంబుగఁ బొంగి, గంభీరగతిని
నురుగులు జుట్టుచు నాపైనఁబడి, తనంతఁ
గట్టె, కొంపోవు కష్టాల తెట్టెలందు
నెక్కడో చిక్కి, చేపనై, యీది-యీది-
తరఁగల నెదిరి-యెదిరి-చివర కెటుల న
గుదునో?— ఏనెట్లు చెప్పఁగలుగుదును, తల్లీ

# ఆంధ్రభోజుడు

వేంకట కాళిదాసకవులు.

ఏ రాజు సుకవితా ధారతో దిశలందు విరజిమ్మె భావకేశరగణంబు,
ఏ మూర్తి సంగ్రామ భూమిలోఁ గొనకత్తివేటుచే దొల్కించె వీరరసము,
ఏ శక్తి తనబాహుపాశంబుచేఁ గట్టి పడవైచె దౌర్జన్య ఫణికులంబు,
ఏ కీర్తి నాటించె నించుకించుక లోకమంతెల్ల దాన సస్యాంకురములు,
ఎవఁడు హైందవ రసపుత్రి హృదయ కుహర
మందుఁ బ్రసరింపఁజేసె శౌర్యాగ్ని రుచులు;
అతఁడు వొగడొందుఁ గృష్ణరాయాభిధానుఁ
డాంధ్రభోజాది బహు బిరుదాంకితుండు.

చతుర రణప్రసిద్ధుడగు సాళువ కృష్ణుఁడు దేహమందు, భా
రతఘన వీరరాజరుధిరంబు ప్రవాహము గట్టుచుండ, అ
ద్భుతతర ధైర్యసాహసయుతుండయి శత్రుశిరోనగంబులన్
శితకరవాల వజ్రమున నేలకు నెట్టిన శేష శక్తిమై ॥

నైజభుజా పరాక్రమ ఘనప్రతిభావిషవాగ్ని కీలికా
తేజము లుజ్జ్వలత్వమున దిక్ప్రకరంబుల నాక్రమింపఁగా
బీజపురీ తురుష్కుల వీరవనంబు దహించి, కీర్తి యొం
తేజగమందు నిండ నతఁ డేదులఖాను జయించె నుద్ధతిన్ ॥

పటుధైర్యార్తిఁ గళింగదేశము జయింపన్ బూని దండెత్తి, యం
తట శ్రీకాకుళ విష్ణుదేవుఁ గలలోనన్ గాంచి తత్ప్రేరణన్
ఘటియించెన్ దనప్రౌఢిమంబు తెలియంగా నాంధ్రభోజుండు, వేం
కట శైలస్థిత దేవతాంకితముగాఁగన్ విష్ణు చిత్తీయమున్

తలఁపుల తీవులన్ గొలిపి తావులఁ జిమ్మెడి భావసంపదల్
జిలికి మనోజ్ఞరాగములఁ జేవలుతీరిన పోటుమాటలన్
గలిపి సుధాస్రవంతికలఁ గల్పనలన్ గయిసేసి భారతీ
గళమున వైచె నాతఁడు వికస్వర నూత్న కవిత్వమాలికల్ ॥

చివ్రకనిగట్టి మాటలను జేరిచి పేరిచి భావసౌధముల్
కవనమనోజ్ఞ వీధుల వికాస విలాస విభాసురంబుగా
నవనవ దివ్యరీతుల నొనర్చి తదీయ శిఖాంతరస్థుఁడై
దివిని సుధాకరుండనఁగఁ దేజరిలెన్ సుకవీంద్రచంద్రుఁడై ॥

# విరాటరాజుగద్దె.

శ్రీ శేషాద్రిరమణకవులు.

వరంగల్లుమండలములోని కంభముమెట్టునకు పండ్రెండు మైళ్ళ దూరములో నేలకొండపల్లెయను గ్రామముగలదు. ఇది చాలప్రసిద్ధకరము. ఇందలి విశేషములను విరాటరాజునకు ముడిబెట్ట గ్రామవాసులు భారతములో చెప్పఁబడిన విరాటమహారాజు రాజధానియనియు గ్రామమునకు బైట నున్న దిబ్బ విరాటరాజు సింహాసనముండుచోటనియుఁ దఱచుగా వ్యవహరింతురు. అది విరాటరాజు నగరమని కనకబండి గట్టయ్య యను కవి హరిశ్చంద్ర ద్విపదలోఁ బేర్కొనినాఁడు. సుప్రసిద్ధ రామభక్తుఁడగు రామదాసు ఈగ్రామవాసియని ప్రతీతిమాత్రమేగాక రామదాసు చరిత్రమునందుఁగూడఁ జెప్పబడియున్నది ఇటగల గ్రంథాలయమునకు విరాటరాయ గ్రంథనిలయమని పేరుబెట్టబడియున్నది.

విరాటరాజు గద్దెయనునది గ్రామమునకు అరమైలు దూరముననున్న విశాలము ఉన్నతము నగు ఇటుకరాళ్ళదిబ్బ. దిబ్బకొకప్రక్క పాలరాళ్లతోనున్న ద్వారమును మేము చిరకాలము క్రిందఁ జూచినటుల జ్ఞాపకముగలదు. దిబ్బనిండ మిగుల వెడల్పు మందముగల ఇటుకరాళ్ళు మాత్రము గోచరించును. చుట్టుపట్టుల పాలరాతి శకలములు స్ఫటిక శిలాశకలములు కనఁబడుచున్నవి. చెంతనున్న యొక చెఱువులో వివిధములగు గాజుముక్కలు గనఁబడును. అవి పూర్వకాలమునాఁటి పరిశ్రమకు తార్కాణముగానున్నవి. ఈప్రదేశముననే కొన్ని బౌద్ధవిగ్రహములు దొరుకఁగా దొరతనమువారు గొనిపోయిరని స్థానికులు చెప్పిరి. సమీపమునందలి గుట్టలు భిక్షుక నివాసమునకుఁ దగినటుల నేర్పాటు చేయఁబడియున్నవి. వీనిని సమన్వయించి చూడగ విరాటరాజు గద్దె బౌద్ధ స్థూపమని విశ్వసించుటకుఁజాలినన్ని ఆధారములు గోచరించుచున్నవి. ఘంటసాల గుడివాడ గుంటుపల్లి సుప్రసిద్ధములగు బౌద్ధక్షేత్రములు. విజయవాడ (బెజవాడ) గూడ బౌద్ధక్షేత్రమె. బౌద్ధకాలము నాటి గుహలు కొన్ని యచటఁగలవు. సమీపమునఁగల ఉండవల్లి బౌద్ధమతసంబంధముగలదే. అమరావతి ప్రశస్తి బౌద్ధయుగమున నాప్రదేశమునందలి దీపాలదిన్నె విశ్వవిద్యాలయముగా నుండి యెంతప్రసిద్ధి పడసినది మనమెఱుంగని యంశముగాదు. బెజవాడనుండి హైదరాబాదునకు బోవురోడ్డుప్రక్కన కొంచెము త్రొలగించినచో అల్లూరను గ్రామముగలదు. ఇటను బౌద్ధస్తూపము కొన్ని బౌద్ధవిగ్రహములు ఒక పాళిశాసనము కనుగొనబడినది. నందిగామ చెంత రామిరెడ్డిపల్లెలో ఈ సంవత్సరమొక బౌద్ధస్తూపము సర్వాంగ సుందరమయినది త్రవ్వితీయఁబడినది. ఆకృతిలోఁ జిన్నదయినను సర్వవిధముల అమరావతి స్తూపశిలలతో శిల్పవిన్యాసమున నిది తులతూగుచున్నది. జగ్గయ్యపేటలోఁ జిరకాలముక్రిందనే గ్రామసమీపమునఁగల కొండపైనొక స్తూపము కనిపెట్టబడినది. జగ్గయ్యపేట సమీపముననున్న పొలసానిపల్లెయు లింగగిరియు బౌద్ధ సంప్రదాయములకుఁ జెందినవనియు పొలసానిపల్లె చెంతగల జైనపాడను భాగము జైనులకుఁ జెందినదనియుఁ బాశ్చాత్య పరిశోధకులు వ్రాసియున్నారు. ఈ దృక్పథమింతతో వెనుకకు మఱలినది. ఇఁకఁగొంచెము ముందునకుఁబోయినచో నైజాము వారి పాలనలో

నున్న బుద్ధాముపల్లి 29 గ్రామములు బౌద్ధ యుగమునకు సంబంధించినవి. బుద్ధాము పూర్తిగ బౌద్ధనివాసస్థానమె. ఇటనెంతయో పరిశోధనము జరుగవలసియున్నది. నేలకొండపల్లి యీచేరువలోని గ్రామము. పూర్వమిది మహానగరము. ఇపుడొకపల్లెగా మారినది. గ్రామము మైటగల దిబ్బ ఆకృతి బౌద్ధస్తూపమును సర్వవిధములఁబోలియున్నది. సమీపమునఁగల యిటుకబునాదుల వరుసలు బౌద్ధమందిరనిర్మాణక్రమమును సూచించుచున్నవి. ఇందలి ఇటుకలు చాలవఱకు గృహనిర్మాణమున కిటీవల వారుపయోగించుకొనిరని వినఁగల్గినందులకుఁ జింతించెదము. స్తూపములోని యిటుకలవలె నిర్మాణమునందును విశాలమునందును వర్ణమునందును నేలకొండపల్లె విరాటరాజు గద్దెలోని యిటుకలు గనుపించుచున్నవి. కొన్ని యిటుకలు మహబూబు నగరములోని గంగాపురములోని స్తూపమునందలి యిటుకలవలె శిల్పవిన్యాసములతో నలరుటఁజూడ విరాటరాజు గద్దె బౌద్ధ స్తూపమని చెప్పదగియున్నది. సమీపతటాకమునందు గానఁబడునట్టి గాజుముక్కలు కుటుంబినులు బౌద్ధ బిక్షుకురాండ్రగునపుడు గావించిన త్యాగమునకుఁ దార్కాణములని మాతలంపు. తరువాత నీతటాకప్రదేశము నూతనవైధవ్యమున కంకణచ్ఛేదనము గావించు స్థలముగా మారియుండును. కావుననే యిచట వివిధములగు గాజులు కాలక్రమము దెలుపునవి లభించుచున్నవి. ఈ ప్రాంతములలో మాకుఁగొన్ని నాణెములు లభించినవి. అవి ధరణికోట స్తూప ప్రాంతమునందు లభించిన సత్తునాణెములఁబోలియున్నవి. పండ్రెండు సంవత్సరములక్రిందట మేమొక ప్రాకృశాసనమును బావికి తాగాణిగాఁజూచినాము, ఈశాసనశిల యిపుడు కనిపించుటలేదు. ఇన్నింటిని సమన్వయించెదమేని విరాటరాజు గద్దె గొప్ప బౌద్ధస్తూపమనుట కెట్టి సంశయము కలుగదు. పూర్వము కల్యాణనగరము మొదలు రామేశ్వరమువఱకు రాజమార్గమొకటి యుండియుండుననియు మార్గమునకుఁ జేరువలో బౌద్ధ విహారములు స్తూపములు కట్టబడియుండుననియు పూర్వోక్తసందర్భములను బట్టి యూహింపవచ్చును. నిజామురాష్ట్రమునఁ బలుతావుల బౌద్ధ స్తూపములుగలవు గాని వానివిలువ తెలియక ప్రజలు దుర్వినియోగము చేయుచున్నారనుటకు విచారము కలుగుచున్నది. ముందు వ్రాయనున్న "గంగాపురస్తూపములు" అను వ్యాసమువలన నీయంశము విస్పష్టము కాగలదు.

దేశీయ చరిత్రములకు సాధనములనఁదగు స్తూపముల విషయములో నిజాము దొరతనమువారు శ్రద్ధ తీసికొని త్వరలోఁ బరిశోధకులచేఁ బనిచేయించుట అవసరము. లేకున్నచో బౌద్ధయుగమునకు సంబంధించిన చరిత్రమెంతయో మాటు మణఁగి సంపూర్ణమగును. విద్యార్థులగు యువకులు పూర్వచరిత్ర చిహ్నముల విలువ ప్రజలకు బోధించి వానికెట్టి యపాయములు కలుగకుండునటులఁగా పాటుట ధర్మము. కాలమహిమచే మాటువడియున్న నేలకొండపల్లి స్తూపమునుండి చరిత్రమునకు సంబంధించిన యపూర్వ రహస్యములెన్ని బహిర్గతమగునో చూడ వేడుకపడుచున్నారము.

## నామనోగతము.

మల్లాది వేంకటకృష్ణశర్మగారు

శా॥ ఈసంసార తరంగరంగముననేదేనొక్క మార్గంబు వి
ద్యా సంపాదనచేగ్రహించి తుదినత్యంతంబుఁబోగల్గు న
న్యాసుల్ కాననసీమ జిక్క నగరిన్నాకేమి కర్తవ్యమం
చానగ్ పాదపమై జనింతు మును లశ్రాంతంబుఁ గొల్వుండగన్ ॥

చ॥ ప్రకృతివిలాససంపద నెవండు కరాంచలసీమఁదాల్చి మా
మక హృదయంగమంబుగ సమంజసరీతి విచిత్రచిత్రముల్
ప్రకటితబుద్ధి మన్నయనపర్వముగాగ రచించు, చిత్రకా
రకు కరమందు కుంచెనయి రాజితకీర్తిఁ వహింతు ధారుణిన్ ॥

మ॥ అవధిందాటిచరించు తన్వి, ధర విద్యాగ్రంథముల్లేని మా
నవునిన్, పౌరుషహీనుఁడౌ నృపుని, నాన్యత్వంబు వాటింపకె
ట్టి విశుద్ధుండగు విప్రునేనియును, పాటింపంగబో నంతక
న్నవని న్నేమృగరాజుఁ గొల్చెదను చెన్నారంగ మత్తేభమై॥

మ॥ అనయం బాత్మసుఖంబుఁ గోరుచు వదాన్యత్వంబు లేకున్న నే
ధనముల్ వైభవముల్లతాంగులు మహోద్యత్ప్రభావాటోప సం
జనితానందములొప్ప రాజునయి నేజన్మించు కన్నన్ వనిన్
ఘనహర్యక్షమునై జనింతు మృగసంఘం బాత్మఁ గొండాడగన్॥

చ॥ మునుకొని కావ్యకర్తనని మోసముఁజేయుటకన్న నెందునే
ధనమునపేక్షసేయక, సదాభవపాద సరోజచింత నా
ద్యనుపమ సత్యకార్యఘటితాత్ముఁడనౌ కవిహస్తమందు, లే
ఖినినయి సత్కథావళి లిఖించెద వాఙ్మయవృద్ధిఁ గోరుచున్ ॥

( నామనోగతమునుండి )



# భరతుడు—హరిణకము.

మల్యాల వెంకటశేషగిరిరావుగారు

తారా పరివృతుండైన తారాధిపుఁడు తన బంటుల నొక్కొక్కరిని గగనవీధి వీడి వేరొక లోకమునకు బొమ్మని యాజ్ఞాపించెను. అట్లొనర్చిన మరునటి నిముసముననే తానుఁగూడ దినకరుని సెలవంది జీకటులలో నదృశ్యమాయెను. గొప్ప విద్యుద్దీపమేమోయన సూర్యభగవానుఁడుం దన కిరణజాలముల నల్దిక్కులకు బంపుచుండెను.

తత్సమయముననఁ గండకీనదియొడ్డున, ఘోర మృగ భయంకరమై, యజగరముల కునికిపట్టై యొప్పు విపినంబున నొకవ్యక్తి కాలినడకను సాగిపోవుచుండెను. వ్యక్తి యొడలంతయు గాషాయాంబరములచేఁ గప్పఁబడియుండెను. ముఖ వర్చస్సు మేలిమిబసిడిఛాయాసన్నిభంబై కన్నులపండు వొనర్చుచుండెను నడకలు గమనింపఁగ నావ్యక్తి యొక పురాణపురుషునిగఁ దలఁపవచ్చును.

ఒక యామము ట్లతిత్వరితముగ నడక సాగించెను అందొకచోట నత్యంత రామణీయకమై యలరారు నొక పర్ణశాలఁగాంచెను.

అది నిర్జనప్రదేశంబై, కందమూలాది కుసుమఫలతరులతాశోభితంబయి నిర్మలంబై సృష్టి వైచిత్ర్యమును దెల్పు నాహర్మ్యంబు ఛక్తాగ్రిగణ్యులగు తపోనిధులకు మోక్షసాధనమై యుండెను. తత్ప్రదేశమున నెంతేమంది మహా తపశ్శాలులు భాసిల్లియుండును, సర్వహృదయాంతరంగుడు ననంతగుణగణుండును, దయామయుండును, సర్వాంతర్యామియు, తేజోమూర్తియునగు శ్రీమన్నారాయణుని సందర్శించి తమతమ జన్మములు సాఫల్యముగఁ జేసికొని యుండిరి!

ఆహా! మన సన్యాసి యదృష్టమేమన వచ్చును. ఏలయన? ఎట్టి పాపాత్ములైనను, మన స్తాపములుగలవారైనను, దుర్మార్గకృత్యావలంబులైనను, నది జూచినమాత్రన, వారి పాపములును, డెందమున గలతలును, నశించి శాంత చిత్తము బొందకతప్పరని యొక విధమగు ధైర్యముదయింపకమానదు. అటులనె, మన సన్యాసి యాశ్రమము జూచి తానట్టి సద్గతికి నందగలుగుదునని, మిగుల సంతసించి, దానికంతకు ఆభగవంతుఁడె కారణమని పలువిధముల వానినామోచ్చారణముజేసి తన గృతజ్ఞతను దెల్పుచుండెను.

ఈమహాత్ముఁడే ఋషభావతారమెత్తిన విష్ణుమూర్తి సుతుఁడగు భరతుఁడు— తాఁగనినదే మహాఋషుల కాటపట్టగు పులహాశ్రమము— ఈతనినాటినుంచియే మనదేశము భారతవర్షమని పిలువఁబడుచున్నది. అంతకుమునుపు 'అజనాభ'మని పేరుండెనట. భరతుఁడు 'పెక్కేండ్లు నవ్యాహతంబుగ రాజ్యపాలనంబొనరించి, యనేక విధంబులఁ బ్రజలచే మెప్పువడసి, పిదప తన రాజ్యమును, సంపదలను త్యజియించి యది తన యేవుర బుత్రులకుఁ బంచియిచ్చి తరువాత సన్యాసియై యిట్లరుదెంచెను.

అంతట భరతుఁడు హరిధ్యానావలోలుఁడై యప్పుడప్పుడు దేహముఁ బులకరింప యానంద భాష్పములు విడచుచుండెను. క్రమక్రమముగ యోగశక్తి నభ్యసించి, తన చిత్తమన్యాయత్తము గాకుండఁజేసెను.

జేతులంబడితివా? అయ్యో! నీమృదుశరీరమింకెవరు దువ్వెదరు. ఎవరు నీచిన్నయల్లరులకోర్చి దరిజేర్తురు? ఓ! హరిణమా!" యని నేలకొరిగి మూర్ఛజెందెను.

మోహావనబడక లెమ్మనినటుల మారుతము వీచినంతనెల్ల యాశాలయందు బర్ణములనుండి మంచుకణములు భరతుని ముఖముననుం, విశాలఫాలముననుం బడుచుండెను. లోడనే యాతఁడు కప్పిరిలెను– లేచి కూర్చుండెను హరిణము వచ్చుచున్నదేమోయని యిటునటు తొంగిజూడసాగెను — యింకెక్కడి హరిణము అప్పుడే బోయెనని యేదో గొణుకుగొనుచు నాలోచనామగ్నుఁడై యనేకములగు సంగతులు స్మృతికి దెచ్చికొనుచు నశ్రువుల గూడఁగార్చెను.

కాలచక్రము వేగముగ తిరుగ నారంభించెను. భరతుఁడు గడు శుష్కించి బర్ణములపై శయనించి మృగవియోగతాప మనుభవించుచుండ నొక హరిణము గన్నులయెదుట గన్పట్టెను. నిజంబగు హరిణమాయని విస్మయంబందెను. అంతలో దగ్గరకరుదెంచెను. "అబద్ధముకాదు నిజమే" యని రూఢిగగాంచెను. హరిణము వాని గాలు సేతులు నాకమొదలిడెను. భరతుని కన్నులనుండి యానందభాష్పములు గారెను. ప్రేముడి యధికమయి, నయనములు తెరచిజూచెను. తెరచినవి తెరచినట్లేయుండెను. నల్లగుడ్డు లోపలికిబోయెను. భరతునికంత్యకాలము సమీపించెను. చిత్తముమాత్రము హరిణమందే లగ్నమై యుండెను. శరీరకాంతి మాత్రము తగ్గలేదు. కాని ప్రాణాధారమగు, బ్రహ్మతేజస్సు యాశరీరము వదలెను.

మఱునటి జన్మమున భరతుఁడు హరిణమై బుట్టెను. ఆకిత జన్మమున యాతఁడొక తపోనిధి యగుటచే తత్తపోవిఘ్నమునకంతయు హరిణప్రేమయే యప్పటి మృగత్వ కారణమని నెఱిగి గడుంగడు విచారించెను. వెంటనే యాతడు పులహాశ్రమంబు జేరికొని, కొంతకాలమునకు గండకీనది ప్రవాహ మిశ్రితంబై హరిణ శరీరమును విడచి విప్రుఁడై జన్మించెను.

క॥ కర్మమునఁబుట్టి జంతువు
కర్మమున వృద్ధినొందు ♦ కర్మమునజెడునే
కర్మమె నరులకు దైవము
కర్మమెసుఖదుఃఖములకు ♦ కారణమధిపా॥

అని భాగవతమందు శ్రీకృష్ణ పరమాత్మచే బలుకఁబడినట్లెన్నటికిని కర్మయే కారణమై యున్నది. మఱియు, కర్మము బాయఁగ మహా మునులకయినా నలవికాదు.



# కావ్యప్రపంచము.

## ౧ భాష

శిట్టల వెంకటేశ్వర్లుగారు.

కావ్యమన నేమి ? అదెన్ని విధములవర్తిల్లును ? అను నీ విషయములలో ముఖ్యముగ కావ్యమన నేమి ? యను దానినిగూర్చి ముచ్చటింతము.

కావ్యమన—"అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమితి కావ్యసామాన్య లక్షణ"మ్మని ప్రతాపరుద్రీయ కారుడగు విద్యానాథుడు చెప్పెను.

లోచనకారుడు—"కమనీయంకావ్య"మ్మని నుడివెను.

విద్యాధరుడు—"కవయతి వర్ణయతీతికవిః, తస్య కర్మకావ్య"మ్మని నుడివెను.

భట్టగోపాలుడు—"కౌతి శబ్దాయతే విమృశతి రసభావానితికవిః, తస్య కర్మ కావ్య"మ్మని నుడివెను.

కావ్య ప్రకాశకారుడు—"లోకోత్తర వర్ణనా నిపుణకవి కర్మ కావ్య"మ్మని వచించెను.

భామహుడు—"ప్రజ్ఞానవనవోన్మేశాలినీప్రతిభామతా। తదను ప్రాణనాజ్జీవేద్వర్ణనానిపుణః కవిః। తస్యకర్మస్మృతంకావ్యమ్మ"నిచెప్పెను.

పైవారందరు కావ్యమను శబ్దమునకు దమ యుక్తికి దోచినటుల వ్యుత్పత్తుల వచించిరిగాని యర్థమునంతకు జూడ మొత్తముమీద వీరందరి యాశయ మొక్కటియే యని స్ఫురించెడిని.

ఇట్టికావ్యము శ్రవ్యమని దృశ్యమనియు నిరుదెఱంగుల వర్తిల్లుచున్నది.

శ్రవ్యకావ్యమన — వినుటకు మాత్రముపయోగించి యానందమునుగాని లేక దుఃఖమునుగాని లేక దేనినైనను గాని కలిగించునది శ్రవ్యకావ్య మనఁబడును.

దృశ్యకావ్యమన—వినుటకును జూచుటకు నుపయోగించి యానందాదుల నిచ్చునది దృశ్యకావ్య మనఁబడును— ఇట్టి దృశ్యకావ్యమునకే రూపకమని నామాంతరము గలదు.

శ్రవ్యకావ్యము— గద్యమనియుఁ బద్యమనియు, గద్యపద్యమయమనియు మూఁడుదెఱంగుల వర్తిల్లుచున్నది.

పాదరహితమైన పదముల సముదాయము గద్య మనఁబడును. కాదంబర్యాది గ్రంథములే గద్యకావ్యములనఁబడును. నాలుగు పాదములు గల పద్యసముదాయముతో నొప్పునది పద్యకావ్య మనఁబడును.

రఘువంశము కుమార సంభవము మొదలగు గ్రంథములు పద్యకావ్యములనఁబడును.

గద్యములతోను బద్యములతోను మిశ్రితములైయుండు కావ్యములు గద్యపద్యోభయ కావ్యము లనఁబడును. వీనికే చంపువులని నామాంతరము గలదు.

చంపూ రామాయణము చంపూ భారతము మొదలగు మిశ్రకావ్యములు చంపువులనఁబడును—ఇవియే శ్రవ్యకావ్యములందలి భేదములు—ఇఁక దృశ్యకావ్యములఁ గూర్చి విమర్శింతము.

"నాటకం సప్రకరణంభాణః ప్రహసనండిమః వ్యాయోగ సమవాకారౌ వీథ్యంకేహామృగాదశ,। అని దృశ్యకావ్యము పది భేదములచే వర్తిల్లుచున్నది. విస్తరభీతిచే నిట వాని లక్షణముల వివరింపనైతి. గానఁ బాఠకులు మన్నింతురుగాక !

పైన జెప్పిన దృశ్యకావ్యముల పది విధములలో నాటకములు ప్రకరణములు ప్రహసనములు నను నీ మూఁడు విధముల దృశ్యకావ్యములే మనకిప్పుడు ప్రసిద్ధముగా నుండుచున్నవి. మిగిలిన భేదము లప్రసిద్ధములనియే చెప్పవలయును. వానికిఁదక్కినవానికివలెఁ బ్రపంచమునందెక్కువ ప్రచారము లేకపోవుటయే వాని యప్రసిద్ధతకుఁ గారణము. శ్రవ్యకావ్యముల యందలి మూఁడు

ఆహా! యేమి ఘోరకలి. అట్టితరి శూద్రులు గ్రంథములు వ్రాయఁ బ్రయత్నము చేయు నవసరమే లేదు. కవిగజాంకుశ గ్రంథకర్తల నామ మేదో కించిజ్ఞుఁడనగు నేను గ్రహింపలేక నామము వ్రాయక విడిచితిని. అందులకు పాఠకులు మన్నింతురు గాక. కవిగజాంకుశ గ్రంథకర్తల వంటి గ్రంథకర్తలింకను బయ్యలుండినచో బ్రాహ్మణా బ్రాహ్మణ ద్వేషము ప్రబలుటయే గాక దేశమునకు మే లెన్నడైనఁ జేకూరునా? వాఙ్మయ మభివృద్ధినొందునా? వీరిట్లు వ్రాసినంతమాత్రమున శూద్రకావ్యములకుఁ బ్రఖ్యాతి లేక పోయినదా? వీరే కాదు. ఇతరు లెవ రైనను దమకు బ్రాహ్మణాబ్రాహ్మణ ద్వేషమున్నచో దానిని మనస్సునం దిముడ్చుకొనలేక యిట్లు బాహాటముగా గ్రంథములందు వ్రాయుటయే కాని వారికి దీని వలన గలుగు ఫలమిసుమంతయు నుండఁబోదు. పీఠి మాటనే యుండినను ప్రమాణముగాఁ దీసికొని శూద్ర కావ్యములను వీడుదురను మాట కల్లయని చెప్పుచు నింతటితో నీ ప్రసంగము ముగించి ప్రస్తుతమునకుఁ గడంగెదను.

పై విషయమువలనఁ గావ్యములు సత్పురుషుల గుణ వర్ణనలతో నిబిడీకృతములై యుండవలెనని తేలినది. ఇఁక గావ్యములయందలి భావ నీతిదాయక మెట్లగునో విచారింతము.

మనము రామాయణము చదువునపుడు దానివలన "రావణుఁడు సీతాదేవిని దొంగిలుటవలననే తన పుత్ర పౌత్ర ప్రపౌత్రులతోఁగూడ వినాశము నొందెను. లేనిచో వాఁడిట్టి గతిఁ బొందఁజాలఁడు. కనుక మనముగూడఁ బర దారల దొంగిలినచోఁ బైవిధముననే నాశనము చెందఁ గలము" అను నీతిని దెలిసికొనుచున్నాము.

అట్లే భారతము చదివినపుడును బరులను వంచింప గూడదనియు వంచించినచో దుర్యోధనాదులవలె నాశనము చెందుదుమనెడు నీతిని స్పష్టముగాఁ దెలిసికొనఁగలము. ఇట్లే యేకావ్యము చదివినను దానినుండి యేదే నొక నీతిని మనము గ్రహింపకయానము.

మఱియు కావ్యము "నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనం । ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః । విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనం । మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి । ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే" అనెడు మహాకావ్య లక్షణములతో నొప్పి యుండవలయును. పై లక్షణములన్నియు సమగ్రముగానుండి యొకటి రెండు తగ్గినను మహాకావ్య మనబడును. ఇట్టి వర్ణనలతో నిబిడీకృతములై యుండు మహాకావ్యములే యీ ప్రపంచమునందు మిగులఁ బ్రఖ్యాతి నొందుటకు నర్హములు. అట్టి కావ్య కర్తలు మరణించినను మృతజీవులయి యాచంద్రార్కము తమ యశస్సులు దిక్కూటాహములు నిండగా మనఁగలరు. కాళిదాసాది మహాకవులు సంస్కృతమునందు మహాకావ్య లక్షణ లక్ష్య సమగ్రమై యుండు కావ్యముల రచించి యీ ప్రపంచమును విడిచి వారు దివంగతులైరి. వారెన్నడో దివంగతులయినను వారి కావ్యములఁగాంచిన వారలందఱు నిప్పటికిని వారిని స్మరించుచుఁ బవిత్రవంతులగుచున్నారు. ఇఁకముందును బవిత్రవంతులు కాఁగలరు. అట్లే నన్నయాది మహాకవీశ్వరులాంధ్రమునందుఁ దమ ప్రతిభావిశేషాదులచేఁ బురాణముల రచించి యీ మాయా ప్రపంచమునకు నాంధ్రమనెడి భిక్ష నొసఁగి వారు దివంగతులైరి. వారీప్రపంచమును వీడినను వారి గ్రంథము లీ ప్రపంచమును వీడక వారికి మిక్కుటమగు యశస్సును గూర్చుచున్నవని నాయభిప్రాయము. ఇట్టివారలే ప్రపంచమునందు భాషాభివృద్ధికిఁ గారణభూతులగుచున్నారు.

మఱియు "కావ్యం యశసేऽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే । సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" అని కావ్యప్రకాశకారుఁడు కావ్యములవలని లాభముల నిర్వచించినాఁడు. సత్కావ్యకర్తలే కావ్యములవలన గలిగెడి లాభములను సునాయాసముగాఁ బొందనర్హులగుచున్నారు. మొత్తమువిూఁదఁ గావ్యములయందలి భావ మహాకావ్యలక్షణోపేతమై వక్తలకును శ్రోతలకును నీతిదాయకమై యుండవలయునని తేలినది.

# కావ్యలక్షణము.

## సుంకర వెంకటరత్నంగారు

ఈ విషయాన్ని గురించి చాలామంది భారతి మొదలగు పత్రికల్లో చర్చించియే యున్నారు. తినగా తినగా

గుణదోషము తెలిసి కావ్యరచన చేయువాడు వివేకియు, అనుప్రాసగల పదగుంభన చేయువాడు వాచకుడు, అర్థములను బొందుపరుచువాడు ఆర్థికుడు, యమక కవిత్వంలో సమర్థుడు శిల్పకుడు. అలంకార యుక్తముగ గవనము జేయువాడు భూషణార్థి, రసతత్పరతగలవాడు మార్దవి యనిపై జెప్పబడిన సప్తవిధ కవుల లక్షణములు. ఈ సప్తవిధ కవులను నాంధ్ర లాక్షణికులగు నప్పకవి, చిన్నకోట పెద్దన్న మొదలయినవారు కూడా యంగీకరించారు. గుణాలంకారములు కలిగి, అర్థయుక్తముగా లలిత పదములతో, రసభూయిష్టంగా దోషవర్జితంగాను కవిత నల్లేవాడు. కవితకర్త్యాడు.

అట్టి కవియొక్క కర్మయే కావ్యమనిపించుకొంటుంది. ఇట్టి కావ్యమునకు లక్షణము నీ విధంగా చెప్పారు లాక్షణికులు.

శ్లో॥ నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్।
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవాః।
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్।
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయా అపి।
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే।
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమపీష్యతే"
"ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవిహాతన్ముఖమ్"

నగరాద్యష్టాదశవర్ణనలు చేయాలనీ కావ్యము మొదట ఆశీస్సుగాని, నమస్కార వాక్యముగాని, వస్తు స్థితిని గాని ఉండ జెప్పాలని తాత్పర్యము. ఆంధ్రమునకూడ ఒకటి రెండు మార్చి అష్టాదశవర్ణనలను పెద్దిరాజు ఒప్పుకున్నాడు. అప్పకవి కొన్నిటిని పెంచి యిరువదిరెండు విధముల వర్ణనముల నొప్పుకున్నాడు. ఈవర్ణనలలో కొన్ని లేకపోయినా మిగతా వర్ణనలతో కావ్యము చెప్ప వచ్చునని చెప్పారు.

శ్లో॥ "గుణాలంకారసహితౌ శబ్దార్థాదోషవర్జితౌ।
గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదోవిదుః"
అదోషౌ, సగుణౌ, సాలంకారౌ, శబ్దార్థౌ కావ్య।
మితి కావ్యసామాన్య "లక్షణమ్"

సాహిత్యదర్పణములో, వాక్యం రసాత్మకం కావ్యమ్మని సాహిత్యదర్పణకారుడు చెప్పాడు.

చమత్కారజనక భావనా విషయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్మని, రస గంగాధర కర్త.

తెలుగులో నన్నయభట్టుకూడ, విశ్వశ్రేయఃకావ్యమ్ అదదోషాపరిష్కృతా చ వాగర్థా॥

వాక్యార్థదోష రహితము లైనట్టియు గుణాలంకార సహితములైనట్టియు యేవాక్యార్థములు గలవో అదియే కావ్యము, వాక్యదోషముకాని పదదోషముగాని అర్థదోషముకాని యేమాత్రముండరాదను నుద్దేశంతో, అదోషౌ అను విశేషణము మొదట నుండడానికి సార్థక్యమని, తద్గ్రంథ వ్యాఖ్యాతయైన, అహోబలపండితుడు చెప్పాడు. అయితే "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంక" చంద్రుడిలో కళంకం లాగ, సద్గుణ సమూహములో ఒక్క దోషముంటె మాత్రమేమి, అని మీరు శంకిస్తారేమో. అట్లు లేదోయి నాయనా, అలక్షణము కావ్యవ్యతిరిక్త స్థలంలోగాని కావ్య విషయంలో పట్టదనికూడా మొరపెట్టుకొన్నాడు. ఇదే విధంగా లక్షణకర్తలందరూ కావ్య లక్షణం ప్రతిపాదించారు. మొత్తంమీద దోషరహితంగాను అలంకార సహితంగాను అర్థయుక్తంగాను, రసస్ఫూర్తియయ్యేటట్లు కావ్యము చేయాలని తేలింది.

ఈ కావ్యము, గద్యాత్మకము, పద్యాత్మకము గద్య పద్యాత్మకము (చంపువు) అని మూడు విధాలుగా వుంటుంది. పద్యకావ్యంలో సర్గబంధం ఉండాలి సంస్కృతంలో — తెనుగులో, ఆశ్వాసమనీ, ఉచ్ఛ్వాసమనీ, విభాగము చేయాలి. గద్యకావ్యంలో వుచ్ఛ్వాసము లంబకమనీ, విభాగాలు వుంటాయి

ఇదివరకు మనమన్న కావ్యాలన్నీ సామాన్యంగా యీ లక్షణాలకి కట్టుబడ్డయి. సర్గబంధం లేక, అష్టాదశవర్ణనా నియమము లేక ఉండే కావ్యాలుకూడా కొన్ని వున్నయి వాటినే ఖండకావ్యాలంటారు. ఇవి శ్రవ్యకావ్యాలు. నాటకాలు మొదలైనవి దృశ్యకావ్యాలు. వీటి విభాగ మంకసహితంగా వుంటుంది.

ఈ పద్యకావ్యాల్లో యింకా భేదాలున్నాయి, చాటు ప్రబంధాలనీ, వుదాహరణములనీ, అనేక విధాలుగాకను

అదెప్పుడో వ్యవహారంలో వుండేది. ఆభాషకే వ్యాకరణము వ్రాశారు. తరువాత వ్యవహారమేలేదు. భాష మారనేలేదు.

లక్షణకర్తలు భాషకు మూతికట్టి, తాముచెప్పిన లక్షణములకు లొంగిన భాషలోనే కావ్యం వ్రాయాలని అట్లు వ్రాయనిచో నది గ్రామ్యమవుతుందని, అట్టిగ్రామ్యము కావ్యంలో నుపయోగించడం దోషమనీ, చెప్పారు. అట్టిగ్రామ్య మపభ్రంశ పర్యాయముగాకుండా వాడారు. ఇప్పుడా వ్యాకరణదోషాలని పాటించకుండా కేవల రసస్ఫూర్తినే ప్రధానంగా తీసికొని మనముంతా నిత్యమువ్యవహరించుకు నేభాషలో కావ్యరచనచేస్తున్నారు.

పూర్వప్రబంధకావ్యాలునూ అప్పటి శిష్టజన వ్యవహార భాషలోనే చాలావరకు వ్రాయబడ్డవని చెప్పవచ్చు. నీచులు వ్యవహరించేదానిని గ్రామ్యమనేవాళ్ళు శిష్టులదే వారే కాలమువనైన వుంటారు గనుక యిప్పటి శిష్టజనవ్యవహార భాషలో వ్యాదులంగా కావ్యరచనచేస్తే చాలా బాగుంటుందని నా యభిప్రాయము.

మరీ అంత విచ్చలవిడిగా నీచభాషలో వ్రాసినా ఆకావ్యం మసభ్యంగానే వుంటుంది. కనుక, ఆధునిక భాషాసేవకులు, ఇప్పటి శిష్టజన వ్యవహారభాషలోనే సత్కావ్యరచన చేస్తూ సహృదయుల నాహ్లాదపెట్టుదురు గాక

# రజనీగానము.

శ్రీ. శ్రీనివాసరావుగారు. (కవితాసమితి)

వివిధసూన వితాన శోభిత కుజ వ్రి
శస్త సు బృందావన స్థలము పొంద్రి
చంద్రికా సముజ్వల దివ్య శర్వరీ ప్ర
శాంతవేళ సముంచిత సౌఖ్యమొసగ!
మైమరచి పోతినంత సమస్త భువన
సమ దయామితోంచె నపుడ విస్తార మధుర
గాన నిస్వన కల్లోల కలిత లలిత
భావ కవితా వియద్వాహినీ విధాన!
ఆ వినోత నోత్సాహదాయక మనోజ్ఞ
సమయమ సంజనితాధిక సంతసమున
సృష్టి సౌభాగ్య విభవ వైచిత్రిగాంచి
పరవశంబున గొంతెత్తి పాడుకొంటి!
ప్రవిమలామృత రస పరిప్లావితాభ్ర
భాము సందీప్త పూర్ణ సుధానిధిం గని
ర్తన మొనర్చునాడ గానస్రవంతి
నవీన తరంగావ గాహినగుచు!
ఈడ్చుకొనిపోతి మామక హృదయపుకుహర
జనిత భావ నౌకాధిరోహణ మొనర్చి
సింధురతరంగ నిర్ఝర సంకలిత మహిత
గగన సాగర గంభీర గర్భమందు!



# నాకొయ్యేలిగూడెపు ప్రయాణము.

నౌడూరి బుచ్చిబంగారయ్యగారు.

కార్యార్థుండనై వున్నచోట నుండక తిన్నచోట తినక నేటికి యెనిమిదిదినములనుంచి రైలు ప్రయాణమో, బండి ప్రయాణమో, కొన్నిచోట్లను కాలినడకనో ప్రయాణముసాగించుచు అనకాపల్లి చేరికొంటిని. నా ప్రారబ్ధము చాలక ఒంటిపూట భోజన నియమమొక టేర్పరచుకొంటిని. అనకాపల్లిలో బంధువులున్నను కారణాంతరములచేత రెండు గంటలన్నరకు హోటలుకు భోజనముకు పోతిని. పూటకు అరణాలు వృథాగా పోవునన్న లోభత్వముచేత పూటకూళ్ళ యజమాని భోజనము పెట్టుటకు సిద్ధముగానున్నదని చెప్పినాడు. తినుటకు నేనును సిద్ధముకాగా అన్నముమాత్రము పుష్కలముగా పెట్టి, పప్పు పూజ్యముచేసి చాలీచాలని పెండలపుకూర కాస్తంత వుడుకు తక్కువైనా తిన బోతే లేదని చెప్పినాడు. పులుసు యింతవెయ్యమని గంపెడాసతో నేయి కోరితిని. గిన్నె చూచినాడు. లేదు. తటపటాయించి దాసిని పిల్చి వాడికకొట్టుకు పొమ్మని పురమాయించినాడు. మరి నాకు కనబడితే ఒట్టు. పిలవగా పిలవగా, కొనకు అరవగా వాడి ధర్మమా అని కనబడి నెయ్యి వస్తుంది ఓర్చుమన్నాడు. నేటికి పది సంవత్సరములనుంచి శాంత స్వభావమునకు మనసును తిప్పుతున్నాను. కాని ఆగుతుందా? అప్పుడే వుబుకుతూంది. మళ్ళీ జ్ఞాపకం చేశాను ఎట్లాగో కట్టుబడి పోనీ నూనెఅయినా వెయ్యమన్నాను. క్షుద్బాధ బాబూ, ఏంచెయ్యమన్నారు? నూనె వేసుకు, వాంతిని ఆపుకొని రవ్వంత పులుసూ అన్నమూ, రవ్వంత కంపు మజ్జిగా అన్నమూ తిన్నాను. ఒక్కముక్క— రాత్రి భోజనము చెయ్యను మీకు తెల్సును గదా? కడుపులో కాళ్ళుముణుచుకుని రామా కృష్ణా యని పండుకొని తెల్లతెల్లవారుతోంది లేచాను. కాలకృత్యాలు తీర్చుకున్నాను. స్నానము చేశాను. కాఫీకి పోదామనుకొంటున్నాను. ఏడు కొట్టేరు. ఎవరో ధర్మాత్ములు చెప్పారు. ప్యాసింజరుకు వేళ అయిందని. ఆపట్టున మూట చేత బుచ్చుకొని స్టేషనుకు పరుగెత్తాను. వాళ్ళు చెప్పినమాట నిజమే. టిక్కెట్లు యిచ్చేస్తున్నారు. స్టేషనులో రైలు అయిదు నిమిషాలుమాత్రమే ఆగుతుంది. నాఅబ్బ అమ్మ కడుపు చల్లదనాన్ని నేను కాస్త పిండపుష్టి గలవాడ్నే. కనుక ఎడమచేత్తో యిద్దరినీ, కుడి చేతితో యిద్దరినీ మెల్లిగా తొలగదోసి కిటికీ గుమ్మం అందుకొని బుజ్జదూర్చి బ్రహ్మాండం బద్దలుకొట్టి రైలు వచ్చింది నేను కొవ్వూరుకు టిక్కెట్టు తీశేను. గంట మోగింది. నాకు కంగారు పుట్టింది. వాడికడుపు చల్లగా గార్డుమాత్రం జండా వూపలేదు. అందులో మొదటి దానిని ఆ కంగారుతోనే చేరేను. బండిగేటులో తేనెపట్టులాగ జనం వేళ్ళాడుతున్నారు. నెత్తి బరువులు దించుకోనేలేదు. చంకకర్రలు చంకనే వున్నాయి. రైలుపెట్టెలు క్రిక్కిరిసిపోయినవి. అందులోనే నేనున్నా— రైలు కదిలింది. గాలి వేసింది. గడిముసురు. బండి అంతా కలయజూసేను. నలభైమంది కూర్చోవలసిన బెంచీల పయిని ఆరుగురు మగవాళ్ళున్నూ, యెనమండుగురు ఆడవాళ్ళున్నూ, ఇద్దరు పిల్లలున్నూ సుఖంగా వున్నారు. ఆడవాళ్ళంతా పడుకొనే వున్నారు. పైన సామానులు వుంచుకొనే బెంచీలుకూడా

నడుములు క్రింగే వాళ్ళ సామానుల బరువు లతో కిరుకిరు పెడుతున్నాయి. మరొక్క తులం బరువు వేశామా వూడి క్రింద పడవలసినదే. ఏ పూర్వ జన్మ సుకృతంచేతనో నాకు రెండు హిందీముక్కలుకూడా వచ్చును. మెల్లగా వక పంజాబీవాడి ప్రక్కకుపోయి నిలబడ్డాను. అప స్మారక రోగంలాగ ఒక్కసారి పైకెగిరి "ఇదర్ మత్ ఆనా—జానా హై—దేఖ్తా నై?" "ఋలాగు రాకు—ఆడవాళ్ళున్నారు—కనబడదా?" అన్నాడు. అయ్యో నాకు బదులు మరివక్కడు అక్కడ వుంటే ఆ కేకలతో వారరోజులవరకు విడవని జ్వరంతో వుండవలసినదే. కాని నేను మాత్రం చెప్పకేం? యిల్లాంటివి చాలా బెదరింపులు చూసేవున్నాను. కాస్త గొంతుక సవరించుకొని "ఘూస్ ఝగడో మత్ సిరఫ్ యేక్ ఆద్మీకో వాస్తే జగహా కర్నా" స్నేహితుడా దెబ్బలాడకు — ఒక మనిషికి మాత్రం జాగా యిప్పించమన్నాను. హిందీకి హిందీ అంకుశం తగిలింది మనిషి బాసీ మారింది. ఏమాలోచించాడో కాస్తంత మూలను చోటిచ్చాడు—కూర్చున్నాను.

ఎల్లాగైతేనేమి కొవ్వూరులో దిగాను. వర్షపు జల్లు ప్రారంభమైనది. వర్షపుజల్లు తుపారంగా మారింది. బళ్ళు గిరాకీఅయినవి. రైలుదగ్గరకు బస్సువస్తుందని అనుకొన్న నేను బండిప్రయత్నం చేయలేదు మరివక పుల్లయ్యగారుకూడా బస్సు ప్రయాణపు ఊహచేతకాబోలు వక బండివానిని "బస్సుదగ్గర కేంపుచ్చుకొంటావు" అంటూ ఉండగా నాచెవులబడ్డది. బస్సుదగ్గరకు బళ్ళతో పోవాలెకాబోలు అనుకొని ఆబండివానిదగ్గరకు చేర్లబోయే నేను

బం॥ వా:- "బస్సురాలేదండి."

పుల్లయ్య:- "ఏడిశావు. మొన్న ఆదివారం వచ్చిందికదూ?"

బం॥ వా:- "అయ్యబాబు అబద్ధమాట్లల్లేదండి" వారంరోజులనుంచి రావటంలేదండి-నామాట నమ్మకపోతే యేంచేస్తాను?"

మొత్తంపైని అతికష్టంపైనిభోగట్టా చేయగా తేలిన పర్యవసానం యేమిటి?—బస్సు ఆర్డరులోలేదు. చిన్నకారు వకటివున్నది. వేగము అందుకుంటే దొరుకుతుందని విన్నాను. కాస్తంత అద్దె ఎక్కువయితే అయింది. కారుదగ్గరకు వప్పగించుటకు బండీమాట్లాడినాను యెక్కేను. నిర్భాగ్యపు బట్టతలవాడు యెండవేడికి తాళలేక, చెట్టునీడకు వెతకగా, తాడిచెట్టు కనబడ క్రిందను నిలబడగా, పండురాలి బుర్రమీదపడినట్టు, నేకూర్చున్న బండితాలూకు ఎద్దు మొండికెత్తుబడ్డది. కదలదు. బండిపూనదు. చెప్పకేం నేనుమాత్రం దిగలేదు. వెనకబళ్ళను అరికట్టివేసింది. ముగ్గురు బండివాళ్ళువచ్చి మెడకట్టు వగలదీసేరు. లేచి నిలబడ్డదండి. మళ్ళీ తాడు బిగించేరు. యీసారి పడుకుంది. మంచి ఆలికొకమాట, మంచిఎద్దుకి ఒకపోటు' చాలునట గాని మాయెద్దుకుమాత్రం ఒకపోటు చాలలేదు, చేతినున్నకర్ర విప్పికావలసివచ్చినది. "మర్దనం గుణవర్ధనం" అను సామెత తార్కాణం అయినది. తాను కలిగించిన ఆలస్యంఅంతా పరుగుతో కూడ దీసింది. అయిదునిమిషాలలో మార్కెట్టుమధ్యనున్న చింతచెట్టు క్రిందికిపోయి ఆగింది. యీలోపున డెక్కడితే డెక్కిందని నేను కొన్నటువంటి టిఫిను కాస్తంత వినియోగంచేస్తూ వున్నాను. డెక్కడలేదుగాని — దాహంవేస్తూ వుంది. చింతచెట్టుక్రింద దింపి బండివాడు అద్దె

తెస్తున్నాడు. "కాదు ఏదిరా" అన్నాను. యిక్కడ కేవస్తుంది ఓర్చుమన్నాడు. నాకు నమ్మకం చాలలేదు. మెద్రాసు కాఫీహోటలు వల్ల కనబడ్డది గనుక, గొంతుక ఎండుతూంది గనక కాఫీత్రాగదలచి గుమ్మం ఎక్కేను మాటవశాత్తు మోటారు ప్రస్తావన వచ్చింది. మోటారు అప్పటికి రాదని, పూరిచివర ఉంటుందనిన్ని, గోష్టాగ్రం చేత కొన్నిన్ని, మరమ్మతువల్ల కొన్నిన్ని సర్గమంగా వుంటవల్ల మార్కెట్టుకు కారురాదనిన్ని ఆక్షణంలో వెళ్లకుంటే దొరకదనిన్నీ తెలిసి బండివాడిని రెండుతిట్లుతిట్టి నావెనక మూటతో రమ్మని కాఫీమాట మరచి ముందడుగు వేసేను. మొత్తానికి మోటారుఆగేచోటు చేరేను. కారు అప్పుడే వెళ్ళిపోయింది నా మనసు కటుక్కుమంది. చాలా ఆత్రతతో వచ్చేనే — కాఫీకూడ త్రాగడం మానేశానే — ముఖం ముడిగిపోయినది. ఎందుకో చెప్పలేనుగాని కుడియెడమలకు వకపర్యాయం చూచేను. యెదురువైపున ఒక అరుగుమీద, ఒక కుటుంబము, ఆర్గురుమనుష్యులు ప్రయాణ సరంజామతో మోటారునిమిత్తం ఎదురుచూస్తున్నట్టు కానవచ్చినది. నేనున్ను ఆ అరుగుమీదికే చేరబారేను. తెచ్చిన టిఫిను కడుపుకెక్కింది. దాహంబాధమాత్రం తీరలేదు. అక్కడ ప్రయాణస్తులతో బాతాఖానీ ప్రారంభించేము. సారం ఏమిటి? చిన్నకారులు రెండు తిరుగుతున్నాయి. ఉదయం ప్రభృతి అరుపర్యాయములు తిరిగేయి. అరుగుమీది ప్రయాణస్తులు వుదయం యెనిమిదిగంటలకు అన్నదేవరపేట వెళ్ళేనిమిత్తం కారుకై కాచివున్నారు. యేటిప్రక్క కాటిప్రక్కే వారికి చోటుదొరకలేదు. ప్రొద్దు నాల్గున్నరవేళయింది. కారు తెగించి తిరిగిందామరొక్కటిప్పే. యీ కారణాలు మనస్సుకు తట్టేకాబోలు. నాగుండెల్లో మరొక్క రాయిపడింది. కారొచ్చేలోపున కాఫీత్రాగుటకు వెళ్ళితినా కొవ్వూర్కి నేనున్ను ఒకరోజు పహారాయివ్వవలసి వచ్చునని భయంవేసింది. దాహంతీర్చుకొనుట ఎట్లా? మూటకు వాళ్ళను కాపుంచి వీధిఅంతా ఒకపర్యాయం గస్తితిరిగేను. యేకొంపలోనూ బ్రాహ్మణులున్నట్టుగాని అడిగితే శుద్ధిదాహంఅయినా ఇచ్చేవారుగాని కానరాలేదు. దైవం చంపేస్తాడా? చక్కని రాతికట్టడపుభావి ఒకటి వీధిచివరను చూపేడు. తీసుకుపోకుండా బాల్చీఒకటి కనబరచేడు. ప్రాణం లేచివచ్చింది. కన్నుమూసి తెరచినంతలో భావిలో బాల్చీవేశాను నీరు కాస్తలోతుగానే వుంది. ఇంతలో బాల్చీయజమానురాలుకాబోలు పద్దెనిమిది సంవత్సరములయువతి యొకతై చేతను గులకబిందె పుచ్చుకుని నూతిగట్టుకు చేరినది. పాఠకులారా! నాకొక అనుసు ఉంది. పిల్లిని చూచినా ఆడవాళ్ళనుచూచినా నాకొక్క చిన్న భయంవుంది ఆమాటచెప్పకేం. చప్పున బుర్రవంచుకొని బాల్చీదింపుతూ వున్నాను. నాభయానికి అనుగుణంగానే — ఆవచ్చిన ఆవిడ కూడా కుశలప్రశ్నలకు దిగింది. వందప్రశ్నలు వేసింది. బుజ్జవంచుకొనే పదిప్రశ్నలకు ఒక ముక్కజవాబు యివ్వకతప్పక గతిలేక, యిస్తూయుంటిని. నాకర్మంగాలి బాల్చీత్రాడు ముడిపడ్డది. నీటిమట్టంకు చేరలేదు. మీదికిచేది ముడివిప్పితే ఆలస్యమగుతుందనిర్ధారించినాను. క్రిందికీ మీదికీ గుంజినాను. అవసరానికి పని రొక్కవశాదూమరి? ముడివిడలేదు. పైపెచ్చు బిగిసింది. తిరిగి మీదికిచేదేను. ముడివిప్పేను. యీలోపుగా వందలు ప్రశ్నలు. నాయనలారా! ఏమిప్రశ్నలని అడుగుతారేమో? నావల్లకాటి ప్ర

శ్నలు. యాదృచ్ఛికంగాక విన్న మాప్రశ్న జవాబులకు అర్ధమేమిటి? ఆక్షణంతు బుఱ్ఱలో వంపూరితే నాలికచివర్ను ఏమివానుతూఉంటేఅవ ల్లాప్రశ్నలే. ఎలాగో మరొక్క నిముషమైనా ప్రస్తావనలో బడాయించడమే ప్రధానమైన ఊహాగాతోచింది. నీళ్ళుచేదుకున్నాను. కాళ్ళు కడుక్కోండి శుభ్రముగా నీరు తాగుటకు మన స్కరించలేదు. చప్పున నోట్లో పోసుకున్నాను. పిపాస కొంత చల్లార్చుకొన్నాను. నీళ్ళువంచేసి బాల్చి వదిలిపెట్టి ఒకతుప్పిగంతుతో రోడ్డుమీద పడ్డాను. బ్రతుకుజీవుడా అని అనుకున్నాను వదిలిందా — లేదు — అపరిచితవ్యక్తి — "అబ్బే యేమండీ కాళ్ళు కడుక్కోకుండా పోతు న్నారు— కాళ్ళు కడుక్కొని చక్కాపొండి" ఏమీచెప్పుటకు తోచక— నేను, "మీరు బాల్చినిమిత్తం నిలబడి పోయినారు".

అ॥ వ్యక్తి:- అవసరం లేదు లెండి. మీ పని కానిండి.

తప్పుకోలేక మళ్ళీ నూతినిచేరినాను. బాల్చి మళ్ళా వేసేను. భగవంతుని పరిశోధన పూర్తి అయిందికాబోలు— నాపాలిటి విముక్తిదేవత వలె మరొక్కయామె బిందె చేత పుచ్చుకొని "ఏమేవ్వు, యింకా తెమలవేం?" అంది.

అ॥వ్యక్తి:- లేదు ఒదినా, యీ పంతులుగారు దాహం పుచ్చుకొంటూ వున్నారని నిల బడ్డాను.

ఒదిన:- "నీబొందకదూ చప్పున లే."

ఇంతలో కాళ్ళు కడుక్కొని మరి బుక్కెడు నీళ్ళు తాగి తిరిగి చూడకుండా పారిపోయేను మోటా చేరుకున్నాను. కారపు ఖిల్లీ బిగించేను. అయిదు నిముషాలు అక్కడే పచారు చేస్తు న్నాను. ఇంతలో ఒక కారు వచ్చింది. ఆగ కుండా నన్ను దాటిపోయింది ఒక వీధి దాటి పోయింది, రెండవ వీధి నడుమ ఒక వకీలుగారి గుమ్మమువద్ద ఆగింది. యింక ఆలస్యం చేస్తే లాభం లేదని చక్కా పరుగెత్తెను. నేను అచ్చ టకు పోయేసరికే గోపాలపురం పోయేటందుకు వక పార్టీవారు కంట్రాక్టు మాట్లాడుకున్నారు. బేరం కుదిరిపోతూందికూడాను. మామూలుగా రూపాయిన్నరకు గోపాలపురంకు తీసికొని వెళ్ళే వారు. వకీలుగారు తమ అసాధారణమయిన వాగాడంబరముతో కంట్రాక్టు గనుక బుఱ్ఱకు మొత్తంపైని రెండురూపాయలు ఇస్తామని సెటలు చేస్తూ ఉన్నారు. కాని డ్రయివరు మహాశయులు ఉభయుల బేరం మంజూరుచేయక బుఱ్ఱకు రెండు రూపాయిలున్నర ఇస్తేగాని కారు నడిపేది లేద న్నారు. పాపము ప్రయాణీకులు సుఖము మరిగి, నాటుబండ్లు మరచిపోవుటచేతను బుఱ్ఱకు పది రూపాయలైనా ఇవ్వ సిద్ధపడుటచే తుదకు రెండు రూపాయిలన్నరకే స్థిరపర్చుకొనిరి కారు గలవారు వకీలుగారని తెలిసికొని ఆయ్యా నన్ను కూడా కొయ్యలగూడెం పంపమని వేడుకొ న్నాను. హెచ్చు చార్జియే కడతానన్నాను. గోపాలపురందాటి కారు మరిమీదికి పోదన్నారు. డ్రైవరుగారిని బతిమాలాను. నిలబడివుండుటకు సొమ్ము యిచ్చుటకున్నా-ఉ-ఊ-వారికి కరుణ రాలేదు. పిమ్మట ప్రయాణీకుల మొనగానిని బతిమాలేను. అదికూడా వృథా అయినది. మనస్సు చివుక్కుమనగా, చేయునదిలేక తిరిగి మొండిధైర్యంతో యథాస్థానంకు వచ్చి చతికిల బడ్డాను. రెండో కారు వచ్చినది. ఆగినది. తెగించి ఏమైతే అయిందని వెళ్ళి కారులో డ్రైవరు సీటు ప్రక్కను కూర్చున్నాను. డ్రైవర్కు భోజనంకు లేక తినుటకు పోయినాడు. అన్న దేవరపేట వెళ్ళి

వారు మాకారుకు ఉదయమే బయానా ఇచ్చారట. వారు ఎనమండుగురు కిరుప్రిచెప్పుల కోర విలాసాలవారు. బొజ్జకడుపులు నిమురుకుంటూ వేంచేసి మా రంజలరథం సధిరోహించేరు. వారు ఇద్దరు మనుష్యుల స్థలము ఒకరే ఆక్రమించు కుంటారు. నాప్రక్కను నాకు రెండింతలు లావు పాటి ఆయన ఒకడు చేరేడు. వారి వేషభాషలు బట్టి యేమో నాటకాల సంసారు లనుకొన్నాను. కాని అట్లుకాదట. వారందరూ లక్షాధికారులట. వారి సంభాషణబట్టి గ్రహించగా సిరిచిహ్నాలు గాని, వాణీవిలాసము గాని వారియందు కన బడలేదు. అంతసేపటికిని ఆమడదూరమున నుండగానే ముక్కు మూయించగల దేహసౌరభము మాత్రము కొల్లలుగా దొప్ప దోగుతోంది. దానికి నేనే సాక్ష్యము—అయ్యలారా మాకు ఒక స్థలమై యితరప్రయాణమే అగునెడల ఒక్కసలాం పెట్టి వెళ్ళిపోయియుందును. ప్రాణ సంకటమగు తొందరలో సువాసనములతో వెళ్ళక తప్పనిసరి వచ్చుటచేత గురుముఖతా నేర్చికొనిన పవనబంధమునకు పునశ్చరణ గావించ వలసి వచ్చి ప్రక్కన నేను చందమున కూర్చుంటిని. ఒక్కరొక్కరే మరినలుగురు ప్రయాణస్థులు చేరేరు. అందరు నాకన్న ఎక్కువ ఆత్రితగల యాత్రస్థులే—డ్రైవరుగారు దయచేసేరు. కైవారంలో వారున్నా మాకన్న పైచెయ్యిగల వారే. మొత్తం పయిని అయిదుగురు కూర్చుండ వలసిన కారులో డ్రైవరు, కండక్టరులు గాక పదకొండుగురు ప్యాసింజరులు యెక్కినాము. పాపము ఆగురు ఋషి పక్షులులాగా బండినంట కట్టుకు వేళ్ళాడుతున్నారు. కాని తలకిందులు మాత్రం కాలేదు. ఆనిలబడినవారిలో పిఠాపురం కాపురస్థుడు ఒక సలక్షణమైన చిన్నవాడు కూడానున్నాడు. స్ఫురద్రూపి. నిడివట్టిన కోమలంగా పెరిగాడు. తనమిత్రహితులు కొవ్వూరులో రిజిస్ట్రారుగా నున్నట్టు విని చూడవచ్చినారట. కాని ఆరిజిస్ట్రారుగారు మొన్న సమాజపీఠకు బదిలీఅయినట్టుగా తెలుసుకొని కొవ్వూరులో ఉండ పరిచయులులేక కాళ్ళపూడి పోయి బంధువులవద్దకు జేరుకొనుటకు మాకారు నెక్కినాడు. నేను కూర్చునే వున్నాను. కారు నడిచింది. చినుకు ప్రారంభమైంది. యెనుగుజల్లు. అంత చేతల కాయలు పండిరాను శరీరములు మూత్రం బయటను—

ఊరుదాటి మొదటిమైలు ప్రయాణం సాగింది. అయిదుంబావు వేళయింది. రోడ్డుబాగు చేయిస్తూ ఓవరుసీయరుగారు డ్రైవరును కంటబడ్డారు. చప్పున కారు ఆపి మనుష్యుల నందరనూ అయిదుగురికి తప్ప దిగిపోమన్నారు. అది నిరంకుశాధికారం అన్నచెప్పుటకు వీలులేదు కదా? అవసరం ఉభయులకీ అయినప్పటికి ఆత్రితమాత్రం హెచ్చు - కనుక మన్నించేము- కారు చకచక పరుగెత్తి సగెత్తి రెండుఫర్లాంగులదూరంలోనున్న ఓవరుసీయరుగారిని దాటుకొని మరొకమైలు దాటి రోడ్డు మలుపుతిరిగి ఉంచే ఆ మలుపులో ఆపారు. మేము యీపది ఫర్లాంగులూ వర్షంలో తుక్కుతడుస్తూ రోడ్డుపైని బురద, బూడ్సు జోడువలె పాదముల కెగబాక, మెల్లిగా కారు చేరేము —— చదువరులారా మాకష్టం గట్టెక్కిందని తలచకండి. మేమెక్కినది ఫోర్డు (ford) కారు. Self-Starter లేదు. అందులోనూ తడక. కొన్నప్పుడు కొత్తదేనట. ఇప్పుడది మూడు డబ్బులకయినా వేలంపాడితే కొనేవారు ఉంటురని నేనుతలచను. మేము నడచి

కారుచేరేసరికి యింజను స్టీముదిగలాగుకున్నది. మహానుభావుడు డ్రైవరుగారు పోతవిగ్రహంలాగ, సీటుదిగకుండా మెడతిప్పకుండా ఆజ్ఞదైచేశారు. ఏమని? కారు వెనకనుంచి తోయ్యమని — కానీ ఇదెప్పుడు నేర్చుకోవడమని పూనితో తోశాము. కొంచెం కష్టంపైని ఒకఫర్లాంగు తోసేటప్పటికి స్టీముఅందింది. కారు నడుస్తూంది. మేము ఎనమండుగురం ఒకరివెనుక ఒకరము ట్రాముబండియెక్కేమాదిరిగా కారునడుస్తూండగానే ఎక్కవలసివచ్చింది. నామాటకేంగాని యేదోకాస్తం తలవాటుపైని లోపలికి చొచ్చుకుపోయాను. పాపము ఒకరైతుతాలూకు చెప్పు జారిపోగా తిరిగితెచ్చుకోనేందుకు క్రిందకు కారువెనుకవైపుకు పురికినాడు. బండిముందుకు నడుస్తున్నప్పుడు దిగితే కలిగేఫలమే ఆయనకు కలిగినది. కొప్పూరు దేవతకు మహాప్రసాద లబ్ధమునకుగాను కృతజ్ఞతాపూర్వకముగా సాష్టాంగపడినాడు. లావుగాఉండుటచేత వెంటనే లేవలేక పడితినన్న సిగ్గునగాబోలు పెద్ద ప్రయత్నముపైని లేచి, ఒళ్లు దులుపుకొని, చెప్పులు తొడుక్కొని, అలసి, ఒగర్చుకొంటూ పరుగెత్తుతూ ఉన్న మాకారు వెనుక పడుగెత్తి ఎలాగో కలసినాడు. నేను ఇదంతా చూచి డ్రైవరుగార్ని బతిమాలి కారు ఆపించినాను. ఋషిపక్షి కొమ్మకు వేలాడింది. టొమ్మెరుదాటి కాపవరం సమీపించినాము. రోడ్డు మొలకోతు పంకము. కారు పెడతోవను నడుపుచున్నాడు. అక్కడకూ వశముగాక మనుష్యులను అందరనూ దించివేసినారు. కారు ముందూ మేము వెనకా, ఫర్లాంగు నడవడం, అరఫర్లాంగు తోయడం, ఫర్లాంగు కూర్చోవడం— యీప్రయాణంలోన కారుకు సంబంధించిన పోలీసు కర్మచారులు, ఇంజనీయర్లు మాకు తారసిల్లడం— వారి దర్శనంకాగానే మాకు అధఃపతనమే. తక్కినవారేమిగా యెంచిరోగాని నాకుమాత్రం, "ఆహా! భగవంతుడా యేమి దుర్ముహూర్తమున యిల్లుబయలుదేరితినో యేచముకురకాళ్ల ఒంటిబాపనయ్య యెదురాయెనో, లేక యేనంబినాంచారమ్మగారు కొత్తకుండ చేతపుచ్చుకొని యెదురాయెనో, పోల్చలేనైతినే కానున్న ఆజన్మమూ మకపుగాని యీ మోటారుప్రయాణమేల? అందులో యిన్నిహంసపాదులేల?" అనిమాత్రం విసుగుజెందితిని. ఎట్లనో యీసూర్యనమస్కారములతో, యీపొర్లుదండములతో, యీ తెంపిముడివేతపడములతో, ధర్మవరం, మలకపల్లిగడిచి నూర్యాస్తమానంకు పెద్దేహం చేరగలిగేము. చిడిపి, బల్లిపాడు, వేగేశ్వరపురములు సాంధ్యరాగము చల్లబడుతూఉండగా దాటినాము. దీపారాధన వేళకు కారు తాళ్ళపూడిచేరినది — పాపము మాపితాపురపు సహచారి దిగినాడు — నాకష్టమునకు నేను వగచను గాని, ఆచిన్నవాని యిబ్బందిమాత్రం నాకుసహించుటకు వీలులేదు. బ్రతికి సుఖపడవిగిపోయినాడు — కారుకు కొత్త ప్యాసింజరులు లేనుగాని సామగ్రి మాత్రంపూటు పడ్డది. ప్రయాణం సాగించినాము. త్రోవ చితాడు. నడుసుమార్గము కాదు — బ్యాటరీ (Battery) దీపము లేదు. ఇంజనులోకి మరకలిసిన దీపము ఉన్నది. ఇంజను జోరుగాపోతే దీపం కాంతిగా ఉంటుంది — యింజను స్పీడు తగ్గితే (Speed) దీపమున్నూ మందగిస్తుంది. రోడ్డు బాగులేదుకదా — (Speed) యెక్కడనుంచి వస్తుంది. కనుక దీపం చెప్పనేల? సంధ్యావెన్నెలలైనప్పటికి చినుకుపడినది గనుక మేఘావరణములో రోడ్డు ప్రక్కను ఉన్న నిబిడవృక్ష

శాఖ చ్ఛాయలలో చిమ్మెటల రోదనలో మాకారు యీదుకొని వెళ్ళుచున్నది. పక్కిలంక, హైడిపాక, గజ్జరం దాటి అన్న దేవరపేట చేరినాము. పెళ్ళివారు ఎనమండుగురూ దిగినారు. కారుతాలూకు కిర్రు శబ్దము తగ్గినది. స్ప్రింగు మాత్రం మర్నాడు కొత్తది వెయ్యవలసి ఉంటుందని నేను అనుకున్నాను. బంగారు సాహెబు ఒకడు గాజులజతను యెవరో మున్సబుగారికట చేసి పట్టుకొని మా కారు ఎక్కినాడు. బండికదిలింది. కొంచెము చిక్కుపెట్టినది. దానిని చేసినవాడిఅమ్మకడుపు చల్లగా (అనగా చలవలు గ్రమ్మిపోనూ) నడిచింది. చిట్యాలచేరేసరికి ఒకమునసబుగారు — వారికిజాగా జేయవలసి వచ్చింది — చేసేము. యేలచింతలగూడెం దాటి గోపాలపురం చేరుకున్నాము. కారుకు కాళ్ళు పీకెట్టినవి — మాకూ నడుం నొప్పి. రోడ్లు గతుకలచేత క్రింద దిండ్లులేనూ పృష్ఠ వేదన మున్సబుగారు అగసాలి దిగినారు. కొయ్యలగూడెం పోవ్రటకిక అయిదుగురుమాత్రమే మిగిలేము. కొంచెము సుఖము కల్గునని సంభరపడ్డాను. కారుతోపాటు నేనుస్నూ కడుపుకు ఇన్ని మంచినీళ్ళు పట్టినాను - గాడాంధకారం — అంతట వకళే మసిపూత — బండి నడచినది — ముందుప్రయాణం మరిమెసిమిది మైళ్ళే ఇప్పుడు రాత్రి 8 ఘంటలు వేళఅయింది డ్రైవరుగారు పావుగంటలో వెళతామని మొండి ధైర్యము చెపుతున్నారు నాకుమాత్రం ఉత్తర కుమారుడు జ్ఞాపకం వచ్చేడు రాబోయే అరిష్టం సూచిస్తూ ని. అలాగే అరమైలు దాటేసరికి కారుకు ముంది చక్రములలో కుడివైపుది బ్రద్దలయినది. అయ్యా ఆలోచించండి మాఅవస్థ. దీపోయాము చక్రంకు మరమ్మత్తు, దీపం లేదు. కారు నడుస్తేనేకాని దీపం పనివ్వదు. ఇక చక్రం పూడతియ్యడం ఎట్లా? ఊడదీసేదయ్యా ఒక అగ్గిపెట్టె పెట్టెడు పుల్లల సహాయాన — జానెడుమేర కన్పడ్డది. కారుకు Spare wheel లేదు. పోనీ మరొకటైరు స్టాకు లేదు. అందుకు సామగ్రిలేదట. కళ్ళు పోయిన దేవుడు చతిచ్చేడట. కుశాగ్రబుద్ధులైన మా డ్రైవరు గారికి సమయానికి స్ఫురణకువచ్చినది. ఓవరుసీయరుగారి నిమిత్తము కొవ్వూరు నుంచి పట్టుకొని వెళ్ళుచున్న సైకిలుకు పనికి వచ్చే Solution నున్నూ, చిన్న మూసిక వేసుకొనే రబ్బరుముక్కలున్నూ వున్నట్టు. మరొక అగ్గిపెట్టె సహాయాన అవి వెతికి మూత విడగొట్టి ఎలాగో మసిబూసి నేరేడుకాయ చేసినాడు. మరి రెండు అగ్గిపెట్టెలు పూర్తికాగా చక్రము యెక్కించాము. నడిచింది. తిరుగా మైలు వెళ్ళి ఆచక్రమే మొదటిచోటనే బొక్కపడ్డది, ఇప్పటికి తొమ్మిదింపావు అయినది. ఈసారి మరి అగ్గిపెట్టెలు లేవు ఈసారి Patch వెయ్యడం ఎట్లా? యెటుచూచినను ఊరు లేదు. అచ్చట వుండిపోవడమా? ముందుకు సాగడమా. ఈస్థితి సుమారు అరగంట జరిగేసరికి నాకు యాదస్తు వచ్చింది. "తలవడే నాటికొక్క దైవము లేడే?" అని నామూటలో ప్రయాణం నిమిత్తం దాచుకొన్న రెండు అంగుళముల కొవ్వొత్తి వున్నది: అది పూడబీకి వెలిగించి ఆరిగి అరగంట సైకిలు సొల్యూషనుతో ప్యాచి మరమ్మత్తులు చేసికొని, క్రొవ్వొత్తి ఆరిపోయింది, కారు నడిచింది, జగన్నాధపురం, అచ్చుతాపురములు మెల్లగా దాటి కొయ్యలగూడెం టోలుగేటు చేరుకున్నాము. ఊరు మాటు మణిగింది, పడకొండు

# వివిధ విషయములు

## సర్ జాన్ సైమన్.

రైటుఆనరబిల్ సర్ జాన్ సైమను కె. సి. వి. వో., పి. సి., జి. బి ఇ., గారు 28—2—1873 న జన్మించిరి. వీరితండ్రిపేరు రెవరెండ్ ఎడ్విన్ సైమనుగారు తండ్రి గొప్ప మతాధికారి. సర్ జాన్ సైమన్ ఎడింబరో ఆక్స్‌ఫర్డు కళాశాలలలో విద్యనభ్యసించి 1899లో న్యాయవాదవృత్తి నవలంభించెను. న్యాయవాద వృత్తిలో మిగుల పేరెన్నిక గనిరి. వీరిప్రఖ్యాతిని గణించి 1908లో ప్రభుత్వమువారు కె. సి. బిరుదునిచ్చి, 1910 లో సొలిసిటరు జెనరల్‌గ నియమించిరి. 1903 లో అలాస్కా సరిహద్దులవిషయమై తగాదా వచ్చినప్పుడు బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధిగ వెళ్లి ఖ్యాతినిబడసెను. వీధివర్తకము (Street Traduig) ను గురించి విచారించుట కేర్పడిన సంఘమున కధ్యక్షులుగ 1909 లో నియమింపబడిరి. 1910 లో న్యాయాధికారులకు సంబంధించిన రాయల్ కమిషనులో సభ్యులుగనుండిరి. 1906 లో వాల్తుహాంస్టో డివిజను ప్రతినిధిగ లిబరల్ పక్షమున పార్లమెంటుసభ్యుడయ్యెను 1913 లో ప్రీవీకౌన్సిలు సభ్యుడుగ నియమింపబడెను. ఆసంవత్సరమునందే అటార్నీ జనరలుగ నియమింపడి క్యాబినెటులో స్థానమును బడసెను. 1915 మే మాసమున కోయలిషను మంత్రివర్గములో హోంకార్యదర్శిగ ప్రవేశించెను. మరునటి సంవత్సరమే భేదాభిప్రాయము వచ్చి తనపదవికి రాజీనామాయిచ్చెను. 1917 లో సైన్యమునజేరి ఫ్రాంసుదేశములో విమానశాఖయందు మేజరుగ పనిచేసెను. 1918 పార్లమెంటు యెన్నికలో పరాజితుడై 1922 నవంబరులో తిరిగి యెన్నుకొనబడెను. అప్పుడే లిబరలు పక్షమున డిప్యూటీలీడరుగ యెన్నుకొనబడెను. 1926 లో కార్మికులసమ్మెనుగురించి మహోపన్యాసములిచ్చెను. కార్మికుల సమ్మె అక్రమమని వాదించి ట్రేడుయూనియనులపై కావింపబడిన చట్టము ఆమోదింపబడుటకు అధికముగ పనిచేసెను. ఇటీవల తమకును యిండియా ప్రభుత్వమువారికినియు [illegible] సంబంధవిషయమై గొప్ప న్యాయవాదుల సలహాను పొందుటకు డాక్టరు రష్‌బ్రూకు విలియమ్సు కర్నలు హాన్నాన్‌గార్లను ఇంగ్లండుకు పంపి సర్ జాన్ సైమనుగారి అభిప్రాయములను సంస్థానాధీశులు పొందిరనియు, పూర్వపు సంధిపత్రముల ననుసరించి సంస్థానాధీశ్వరులకున్న హక్కులను సంపూర్ణముగ [illegible] మెమోరాండమును సైమనుగారు తయారుచే[illegible] రనియు తెలియుచున్నది. కొలదికాలము క్రిం[illegible] మన హిందూదేశమునకు వచ్చిరి. [illegible] బానిసత్వ మున్నదని సైమనుగారు [illegible] దానిని రూపుమాపుటకు పాటుపడెనట,

బర్కెన్ హెడ్ ప్రభువును సర్ జాన్ సైమన్ గారు సహాధ్యాయులు. అప్పుడు బద్ధవిరోధులుగ నుండెడివారట. ఒకనాడు లాటరీవేయగా బర్కెన్ హెడ్ ప్రభువు కాంసర్వేటివు పక్షములో చేరవలెననియు, సర్ జాన్ సైమనుగారు లిబరల్ పక్షములో చేరవలెననియు తేలెనట. విద్యార్థిదశలో వేయబడిన లాటరి ఫలితము నేటికిని అట్లనే నిలచియున్నది. అంతవైరము[illegible]ప్పటికిని హిందుదేశపు సెక్రటరీ ఆఫ్‌స్టేటుఅగు బర్కెన్ హెడ్ ప్రభువు రాయల్ కమిషనుకు తన విరోధియగు సర్ జాన్ సైమనుగారిని అధ్యక్షులుగ నియమించుట [illegible]వైపరీత్యమే.

## మేజరు ఆట్లీగారు

మేజరు క్లెమెంటు రిచార్డు ఆట్లీ ఎం. పి (కార్మిక పక్షము) 3—1—1883న జన్మించిరి. ఆక్స్‌ఫర్డులో విద్యనభ్యసించి 1905 లో న్యాయవాదవృత్తి నవలంభించెను. 1913—23 లో లండను అర్థికశాస్త్ర కళాశాలలో సాంఘిక పండితుడుగ నుండెను. ఐరోపా సంగ్రామము జరుగుచున్నప్పుడు సైన్యములో ప్రవేశించెను గల్లిపోలి మెసపొటేమియా, ఫ్రాంసులలో సైన్యమున పనిచేసెను. యుద్ధానంతరము మేజరుపదవిలో రిటైరు అయి, 1919 లో స్టెప్నీకి మేయరుగ యెన్నుకొనబడెను 1908 లో ఫేబియను సంఘమునచేరి ఇండిపెండెంటు లేబరు పక్షమున చేరెను. 1922 మొదలు 1924 వరకు, అ[illegible]పక్ష నాయకునకు పార్లమెంటరీ సెక్రటరీగ పనిచేసెను. కార్మికపక్షమువారు అధికారములోనికి వచ్చినపుడు యుద్ధ సహాయ మంత్రియయ్యెను.

## వాల్షుగారు.

రైటు ఆనరబిల్ స్టీఫెను వాల్షు పి. సి. ఎం. పి. (కార్మికపక్షము) 1859 లో లివర్‌పూల్ నగరమున జననమొందెను. లాంకషైరు బొగ్గుగనిలో పనిచేసి బొగ్గుగని పనివాండ్రయొక్క యేజంటుగ నియమింపబడెను. 1906 లో కామనుసభ్యుడయ్యెను. 1921—22 లో కార్మిక పక్షమునకు వైస్‌చెయిర్మనుగ పనిచేసి, మాక్డొనాల్డుగారు ప్రధాన మంత్రియైనప్పుడు, యుద్ధాంగమంత్రిగ నియమింపబడెను.

## స్టార్లిత్ గోనా ప్రభువు.

రైటు ఆనరబిల్ డోనాల్డు స్టర్లింగు పామర్ హోవర్డు స్ట్రాలిత్ గోనాప్రభువు 1—6—1891 న లండన్ నగరమున జననమొందెను. మొదట ఈటనులోను తరువాత కేంబ్రిడ్జి కళాశాలలోను చదివి పట్టభద్రుడయ్యెను. విశ్వవిద్యాలయ విద్యార్థిగనే సైన్యములో ప్రవేశించి, ఐరోపా మహాసంగ్రామములో పనిచేసి అనేక అపాయములను దాటెను. కాప్టెను పదవినికూడ పొందెను. 1922 లో మిస్ డయానా ఎల్లిజ్‌లోవరు అను వామెను వివాహమాడెను. తరువాత పార్లమెంటు సభ్యుడై, కార్మిక మంత్రియగు బెట్టర్టన్‌గారికి పార్లమెంటరీ సెక్రెటరీగ పనిచేసెను. 1924 లో తిరిగి పార్లమెంటునకు ఎన్నుకొనబడినపుడు, విదేశ వాణిజ్యమంత్రియగు ఎ. ఎం. సామ్యూల్ గారికి పార్లమెంటరీ ప్రైవేటుకార్యదర్శిగ పనిచేసెను. తరువాత నావికాదళ మంత్రియగు బ్రిడ్జిమను గారికి కార్యదర్శిగ నుండెను. గత ఆగస్టు మాసములో తల్లి మరణించినపుడు, స్ట్రాలిత్ గోనా ప్రభువు బిరుదమును పొందెను. అంతవరకు మాంట్రియల్ బ్యాంకు లండను కమిటీలో మెంబరుగనుండెను

## కేడొగనుగారు.

ఆనరబుల్ ఎడ్వర్డు సెసిల్ జార్జి కేడొగను (కాంసర్వేటివ్ పక్షము) 15—11—1880 న జన్మించెను. కేడొగన్ ప్రభువుయొక్క ఆరవకుమారుడు, ఈటను ఆక్స్‌ఫర్డు కళాశాలలలో విద్యాభ్యాసమునొంది 1905లో న్యాయవాదవృత్తి నవలంభించెను. యుద్ధసమయములో డార్డినల్సు, ఈజిప్టు పాలెస్టయిను నగరములలో పనిచేసి యున్నాడు. కొంతకాలము స్పీకరుకు కార్యదర్శిగను, చెల్సీ బరో కమిటీ సభ్యుడుగనుండి, క్యాలిడోనియను కెనాలు కమిటీ కార్యదర్శిగ పనిచేసెను. లాయూలియన్ ఇన్సూరెన్సు కంపెనీ డైరక్టరుగా నున్నాడు.

## బరన్‌హాము ప్రభువు.

ఈయన డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక ప్రొప్రయిటరు. లండనునగరమున 18—12—1862 న జననమొందెను. ఈటను ఆక్స్‌ఫర్డు విద్యాలయములలో విద్యనభ్యసించి 1885—1904 లోను, 1908—1909లోను పార్లమెంటు సభ్యుడుగనుండెను, 1921—22లోను 1926జరిగినఅంతర్జాతీయ కార్మిక సమావేశములకు అధ్యక్షుడుగను, 1924 న లండనులో జరిగిన ఆరోగ్యకాంగ్రెసుకు అధ్యక్షుడుగను 1925 లోను జరిగిన సామ్రాజ్య పత్రికాధిపతుల సమావేశమునకు అధ్యక్షుడుగను, 1916 నుంచి సామ్రాజ్య ప్రెస్ యూనియన్‌కు అధ్యక్షుడుగను, పార్లమెంటరీ అసోసియేషను డిప్యూటీ చెయిర్మనుగను పనిచేసెను. 1923 లో ఇండియా యిండీసును, 1925 లో ఆస్ట్రేలియాను సందర్శించెను.

## లేన్ ఫాక్సు.

రైటు ఆనరబిల్ జార్జి రిఛార్డులేన్ ఫాక్సు పి. సి (యూనియనిస్టు) 1906 నుంచి పార్లమెంటు సభ్యుడుగనుండెను. 15—12—1870 న జన్మించెను. ఈటను ఆక్స్‌ఫర్డు కళాశాలలలో విద్యనభ్యసించి బ్యారిష్టరు అయ్యెను 1922—24 బొగ్గుగనుల కార్యదర్శిగ నియమింపబడెను.



# ఐక్యము.

వి. శేషనాద్రిశాస్త్రిగారు.

వేసవి కడుభయంకరముగానుండెను. వార్షిక పరీక్షలు సమీపించెను. ప్రకాశరావు వెచ్చటను గాన్పించుటలేదు. పుస్తకములు, కాలేజీ తప్ప మరేమియు నతని నాకర్షింపలేకపోయెను. పరీక్షలు ముగిసినవి. సెలవులలో నెచటికయిన బోవలయునని యతని కభిలాష జనించినది.

ఇట్లుండ, పార్వతీపురమునందు నివసించుచున్న తన మేనత్త కుమారుడు, నారాయణరావు, వద్దనుండి సెలవులలో వచ్చుటకు రమ్మని కోరుచు నొక జాబు వచ్చినది. ప్రకాశరావు నాడే బయలుదేరవలయునని తలచెను కాని, తండ్రి యనుమతి కాలస్యమగుటచే మరునాడు బయలుదేరెను.

నారాయణరావు తండ్రి పేరు కోటేశ్వరరావు. ఆయన పోలీసు వుద్యోగి. నలుబది వత్సరములుండును. కడుసాధువు. ఉద్యోగమునందు నేర్పరి. కొన్ని కారణములచే వెంకటరావుగారికిని వీరికిని మనస్పర్థలు పెరిగి రాకపోకలే డెనిమిది వత్సరములనుండి లేనే లేవు

నారాయణరావు, ప్రకాశరావు లనుదిన మొకరి నొకరెడబాయక సంచరించుచుండిరి. ఒకనాటి రాత్రి భోజనమయిన పిమ్మట నిరువురును వసారాలో కూర్చొని సరస సల్లాపముల నాడుకొనుచుండ నొకవైపునుండి వీణాని నాదము, దాని ననుసరించి మృదుమధురస్వరము, వినవచ్చెను. గానమన్న ప్రకాశరావునకు కడుయానందము. "ఎవ్వరు" అని నారాయణరావు నడుగ "చెల్లెలు శారద" యని యాతడు బ్రత్యుత్తర మిచ్చెను. వారిరువురును లోనికి జనిరి. శారద పాటమాని [illegible] నారంభించెను.

"ఏమి శారద! పాటమానివేసితి" వని ప్రకాశరావడిగెను. ప్రత్యుత్తరములేదు. "సిగ్గా! భయమామరి" యని ప్రకాశరావనెను. సమాధానము లేదు. ఆమె వెంటనే లేచి లోనికి బారిపోయెను. పాపము తనరాకచే నామె స్వేచ్ఛకు భంగము కలిగినదని తలచి ప్రకాశరావు చావడి లోనికి దిరిగి వచ్చెను. అతడు కొన్ని దినములు కులాసాగా నా పట్టణమునందే గడిపెను.

శారదకు పూలతోటన్న మహానంతోషము. తనపెరటిలో ననేకములగు పూలచెట్లు కలవు. మల్లె, గులాబి, సన్నజాజి, మందార, మొదలగు చెట్లనేకములు కలవు. అనుదినము మొక్కలకు తానే స్వయముగా నీరు పోయుచుండును. ఒకనాటి యుదయమున శారద పూలుకోయుచున్న సమయమున, ప్రకాశరావు నారాయణరావు మెల్లగ నామెకు దెలియకుండ తోటలోనికి వచ్చిరి. ప్రకాశరావు వెనుకనుండిపోయి శారద కండ్లు మూసెను. నారాయణరావు "కబ్జా, కవ" యని అరచెను. తక్షణమే యామె పట్టు విడిపించుకొని తన చేతియందున్న గులాబి పుష్పమును ప్రకాశరావునకిచ్చెను. అతడు పుష్పమును వాసన జూచి, "శారదా! దీని పరిమళమెంత యానంద జనకముగానున్నది. దీని నెల్లప్పుడు నా యొద్దనే యుంచుకొందువా?" "లేక మరల తీసుకొందువా? లేదు, లేదు, ఎల్లప్పుడు మీ యొద్దనే యుంచుకొనుడు." అని శారద సంతోషముతో జవాబిచ్చెను.

## 2

తన ప్రాణస్నేహితుడు రామమోహనుని యొద్దనుంచి ప్రకాశరావునకు తక్షణము రావలసినదని జాబు వచ్చియుండుటచే నాడే బయలుదేరి, విజయనగరము జేరి రామమోహనుని గలిసికొని నన్నింతలో నేల రప్పించితివని యడిగెను.

"సీతో కొన్ని సంగతులు మాట్లాడ దలచితిని"

"ఏమి సంగతులు"

"కొన్ని దినములకు బూర్వము నీ యింటికి బంధువులు వచ్చిన సంగతి నెరుగుదువా"

"లేదు. ఎవరు వారు? ఎందుకు వచ్చినారు? నీకు తెలిసినదంతయు జెప్పుము"

"విశాఖపట్టణము కాపురస్థలమట. రిటైర్డు సబ్ జడ్జి యట. మీ నాయనగారితో నీ వివాహ విషయమై మాటలాడినారు"

"నాయనగారేమి సమాధాన మిచ్చిరి?"

"ఇంతలో మావాని వివాహము చేయదలచుకొనలేదు. అయినను వానితో నాలోచించి జాబు వ్రాసెద"నని చెప్పి పంపినారు.

"పిమ్మట?"

"ఇంటియందు మీ వారందరు, నీ వివాహ విషయమై కొంత చర్చ సల్పిరి. బాబాయిగారు మేనరికము మంచిదనిరి. దానిని మీ అక్కగారామోదించిరి. మేనరికమంతగా మీ నాయనగారికిష్టమున్నట్లు గాన్పించలేదు "పిల్లవాని యభిప్రాయము తెలిసికొనినగాని ఏమియు నిర్ణయించుటకు వీలులే"దనిరి. అనుకుట మఱచితిని. వి[illegible]ము వానిని నీ వెరుగుదువటగా?"

"ఎవరో తెలియదు కాని ఆ గాడు నేనాటలకు పోయినప్పుడు, ఒక వృద్ధుడేవో కొన్ని ప్రశ్నల నన్నడిగినాడు. ఆయనే మో!"

"అవును. వివాహము విషయమై నీ యభిప్రాయమేమి?"

"ఇంతవరకెట్టి యాలోచనగాని, నిర్ణయముకాని లేదు. పెద్దలయుండే నా నమ్మకము. ఒకటిమాత్రము నామనమునకు పొడగట్టుచున్నది. పొరపాటున నైనను క్రొత్త బాంధవ్యము చేయరాదని."

"ఏమిటోయి వింతకబుర్లు చెప్పుచున్నావు. క్రొత్త సంబంధములు బంధుకోటి నభివృద్ధి చేయునని నీ వెరుగవా?"

"అబ్బా, ఇప్పటికి ఉన్నవారు చాలు, క్రొత్తవారితో సంబంధములు మనస్పర్థలకు, క్రోధములకు, మాటపట్టింపులకే కాని, సుఖమునకు, ప్రేమకు కాదు"

"కాదులే. నిన్న మొన్నటివరకు మేనత్తవారి యింటనుండుటచేత నా యీ క్రొత్త యూహలు?"

"అయినను కావచ్చును. వివాహమొక పెద్ద విషయము. దీర్ఘాలోచనము కావించవలెను. అటుగాక త్వరపడిన కార్యభంగమగును. అనవసరముగా కష్టముల పాలయ్యెదరు. మనోవ్యాధికి మందులేదు. దానివల్ల సాహసము మెండు. తెగింపు ఎక్కువ. ముందు వెనుకలాలోచింపరు ప్రాణముల కాసింపరు. ఎట్టి సాహసకార్యమైనను చేయ వెరవరు. తల్లిదండ్రులు తమ పిల్లల యభిప్రాయమెరిగి ప్రతికూలురుగాక యనుకూలురుగా నుండుట శ్రేయము."

"ఈ బోధంతయు నెందులకు? నీ మనోభీష్టము తెల్పుమంటినిగదా. ఏల తెల్పవు?"

"క్రొత్త సంబంధము నాకవసరములేదు. దానివలన యనేక యాటంకములు కలవు."

"విశాఖపట్టణము సంబంధము చాలా మంచిది. భాగ్యవంతులు, మర్యాదవంతులు. వారు పిల్ల చక్కని చుక్క. ఇంగ్లీషు చదువుకొనినది."

"బాగే కాని, చక్కనిదంటివే చూపులకు చక్కనిది కావచ్చును సుగుణవతియే చక్కనిది. నీకు వచ్చినది నాకు నచ్చక పోవచ్చును. నాకు వచ్చినది నీకు నచ్చక పోవచ్చును అందము భావకల్పితము. అందమును వర్ణించలేము. కనుక ఎప్పటికైన సుగుణవతినే వివాహమాడవలెను గాని యనుస్తుల వివాహమాడ రాదు. ఇదియే నాయభిప్రాయము."

"ఈ విషయమై మీ నాయనగార్కి తెల్పుదునా."

"వలదు. సమయము వచ్చినప్పుడు నేనే చెప్పెదను."

## 3

నారాయణరావు తన పడక కుర్చీ యందు సుఖాసీనుడై వార్తా పత్రికను చదువుచున్న సమయమున ప్రకాశరావు వద్దనుండి తాను బి. ఎ. పరీక్షయందు కృతార్థుడైనట్లు తంతి వచ్చెను. ఇంటి యందందరికి పట్టరాని సంతోషము కలిగెను. తమ యానందమును దెల్పుచు నానాడే వారందరు ప్రకాశరావునకు జాబు వ్రాసిరి. అందు శారదకూడ ఇట్లు వ్రాసెను. "మీ జయము కడుశ్లాఘనీయము. మిగుల సంతోషముగనున్నది. త్వరలో మిము జూచు భాగ్యము కలుగజేయ కోరుచున్నాను.

ఇట్లు,

ప్రియ శారద."

ఈ సంతోష వార్త విన్నప్పటినుండియు, కోటీశ్వరరావు, భార్య, తమ కుమార్తె వివాహ విషయమయి భర్తతో ముచ్చటించుచుండెను.

భార్య:- ప్రకాశరావన్ని విధముల మన శారదకు తగిన వరుడు. మన మీ విషయమయి మా అన్నగారికి వ్రాసి వారి సమ్మతిని బడయవలెను.

కోటీ:- ఈ సంబంధము మన కన్ని విధముల ననుకూలమయినదియే కాని, నేను మీ యన్నకు కమ్మ వ్రాసి సుమారు ౩ వత్సరములయినది అయినను కొలది దినముల లోనే వ్రాసి తెలిసికొనెదను.

ప్రకాశరావు నారాయణరావు వ్రాసిన జాబును చూచి యానందించెను. అందు ముఖ్యముగా శారద వ్రాసిన రెండుపంక్తులు మరల మరల జదివెను. దానిని భద్రముగా తన పెట్టెలో జాగ్రత పరచెను.

## 4

పార్వతీపురము.

బావగారికి,

మన కిరువురకు కొన్ని వత్సరములనుండియు నుత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండుటలేదు. అది మిగుల విచారమగు సంగతి.

నాకుమార్తె చి. సౌ. శారద వివాహ మీ సంవత్సరమే జరుపవలెనని దృఢనిశ్చయుడనై యున్నాను. మన అబ్బాయి చి. ప్రకాశరావు మా అమ్మాయికి అన్ని విధముల తగిన వరుడని మీ చెల్లెలు నేనును కడుంగడు సంతోషాభిప్రాయము కలిగియున్నాము. ఈ విషయమయి మీ యభిప్రాయమునకు వేచియున్నాము. మనకు వ్యవధి చాలదు. కనుక, మీరు అక్కగారితో నాలోచించి శీఘ్రమే తెలుపవేడుచున్నాను. వైశాఖ మాసములో కొన్ని సుముహూర్తములు గలవు. అందేదైన నొకటి స్థిరపరుపవలెనని యున్నది. మీ జాబుకై, దినములు లెక్కించు

చుందుము. అందరు కుశలము. మీ క్షేమమును దెల్పవేడెదను.

చిత్తగించవలెను.
కోటీశ్వరరావు.

ఈ యుత్తరమునకు వెంకటరావుగారు తమ పిల్లవానికింతలో వివాహముచేయ తలపెట్టలేదని జవాబు వ్రాసెను.

## 5

ప్రకాశరావు తిరిగి వచ్చుటకు సుమారొక నెల దినములు పట్టినవి. వచ్చునరికి నాయనగారింటలేరు. వారి బల్లపై నొక శుభలేఖ పడియుండెను. అతడు దానిని చదువ నారంభించెను. అకారణముగా లేఖ చేజారి క్రింద పడెను. కడుయాయాసముతో దానిని మరల దీసికొని తన మందిరమునకు జని తలుపు గడియ వైచుకొని శయ్యపై పరుండి పలుమారు లా లేఖను చదివి తుదకు నిదుర జెందెను.

సాయంతనము 5 గంటలకు స్నేహితుడు రామమోహనరావు ప్రకాశరావును జూడ వచ్చెను. తానువచ్చునరికి ప్రకాశరావు నిద్రించుచుండెను. అధిక జ్వరపీడితుడై యుండెను. "లేపుదునా వలదా" యని మోహనుడు శంకించుచుండ ప్రకాశరావు పలవరించెను. చెవియొగ్గి మోహనుడు విననారంభించెను. "హా! శారదా! పరునిసొత్తు కానుంటివా! ఇది నీసమ్మతిని జరుగుచున్నదేనా, తప్పదా?" అని వినవచ్చెను. ఆదేమియు మోహనున కర్థము కాలేదు. నిద్రించుచున్న వానిని లేపి, "ఏమిటి, ప్రకాశం, పలవరించుచుంటివి" అని మోహను డడిగెను. కండ్లు తెరచి ప్రకాశరావు, "ఏమియు లేదు, నాకించుక యస్వస్థతగా నున్నది. మరేమియు లేదు" అని చెప్పి మరల నిద్రపోయెను.

ఆటలలో పలుసియుండ నోపు. అయినను డాక్టరు వచ్చిచూచుట మంచి"దని యెంచి మోహనుడు తగు విధములగు చికిత్సలు జేయించుచుండెను.

ప్రకాశరావు నౌకరును పిలచి యొకయుత్తర మిచ్చి దానిని పోష్టులో వేయుమని పంపెను. దారిలో మోహనుడు, వానిని గాంచి వానియొద్దనుంచి జాబును తీసుకొని చదువ నారంభించెను. అందిట్లుండెను. "నీవు నన్నుతప్ప ఒరుని వివాహమాడవని నమ్మియుంటిని. కాని, దైవసంకల్ప మెట్లున్నదో నేనెరుగ. నాకస్వస్థతగా నున్నది. అన్నపానములు రుచించుటలేదు బలహీనత యధికమగుచున్నది. కారణము, నేను, దైవముతక్క ఇతరులెరుగరు. కడసారి నిన్నొక్కపరి చూడవలయునని యున్నది. నాకు ప్రాణముపై నాశలేదు.

ఇట్లు
ప్రకాశం."

ఆజాబు శారదకు వ్రాయబడియుండెను. మోహనుడీసంగతి వెంకటరావుగారి కెరింగించెను.

ఇట్లు రెండు దినములు గడచినవి. ప్రకాశరావునకు జ్వరము మరల హెచ్చెను. పలవరింపు లధికమైనవి. డాక్టరు అనేక మందు లిచ్చుచుండెను. స్మృహతప్పి ప్రకాశము పరుండెను. ఇంచుక కండ్లుతెరచి "శారద యింకనురాలేదా?" అని మరల కండ్లు మూసెను. చేరువనున్నవారందరికి భయ మధికమాయెను. ప్రకాశరావు జ్వరమునకు కారణము శారదయని యిప్పుడు గ్రహించి వెంకటరావుగారు కోటీశ్వరరావు గారికి "ప్రకాశరావునకు చాల జబ్బుగా నున్నదనియు దయతో వివాహ మాపివైచి శారదతో వెంటనే రావలసిన" దని తంతి నంపెను.

మరునాడుదయమునకు ప్రకాశరావు జ్వర తీవ్రత హెచ్చిపోయెను. డాక్టరు నిరాశనొందెను కాని ప్రయత్నము మానలేదు. దాహ మధికమాయెను. నోట మాటలేదు. ఇంక కొన్ని గడియలలో కోటీశ్వరరావు రాగలడు. అంతవరకు ప్రకాశరావు జీవములు నిల్చునను నాశలేదు. బయట బండి చప్పుడు వినబడెను. కోటీశ్వరరావు, ఆయనభార్య, కుమార్తె శారదయు వచ్చిరి. అందరు ప్రకాశరావు గదిలోనికి వచ్చిరి.

"ప్రకాశం! శారద వచ్చిన" దని మోహనుడు పిలచెను. వెంటనే ప్రకాశం కండ్లు తెరచెను. మాట్లాడుటకు ప్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. శారద ప్రకాశం శయ్యాచేరువకు వచ్చి నిలుచుండెను. ప్రకాశరావు దృష్టి యామెపైపై మరల్చబడెను. ఇంతలో నింటిలోనివారందరు గదిలోని కేడ్వసాగిరి. ప్రకాశరావు చూపులలో జీవము లేదు. నాడి ఆగి పోయెను. మొదలు నరికిన తీవ్రవలె శారద ప్రకాశంపై బడెను. మూర్ఛనొందెను. ముఖముపై నీళ్లుజల్లిరి. కాని డాక్టరు నాడి పరీక్షించి యిప్పుడు లాభములేదు. శారదయు పరలోకమున కేగెననెను. శారద ప్రకాశరావుల శరీరములు విచ్ఛిన్నములయినను వారి యాత్మ లైక్యము చెందినవి.



## గాలిపడగ

కొల్లూరు ధర్మరాయకవిగారు బి. ఎ.
ఆంధ్రగీర్వాణసాహిత్యాధ్యక్షకము.

నీ వెపుడు గాలిలోపల
నే విహరించెదవు, నీవు కృత్రిమఖచరీ
దేవివా, స్వేచ్ఛాజీవన
వై విచ్చలవిడిఁ దిరుగు విహంగమ సతివో॥

బాలురతో నాడుచు నీ
గాలముఁ గడపెదవు సతము, గాలిపగడ! నీ
పోలిక గాలికి నిముఁగయి
ధూళి కెదురుగ వారు నీకుఁ దోడగుదురు॥

దారము విడువుము వత్సా,
కోరికమెయి నెగుర వైచుకొను మబ్బాయీ,
ఏరీతి నెవ్వఁడిట నీ
తీరంబున నాటలాడితినో పరవశ్యన్॥

వదపులానంద మిచ్చు బాల్య సకేయాఁ
గడచిపోయెఁ దాపత్రయము కొంతకోన,
స్వప్నమంచు విస్మృతి స్వచ్ఛంద స్మృతిఁ
గడపి తెల్వియయి శయ్య దిగిన యట్లు॥

ఏడ్చెదేల, బాబు? యేమి, కన్నీరు కారగ
పోయి పగడ పారిపోయెనక్కా?
యిదుగో కొనుము నాదుహృదయము బాబు,నా
బరువువీడ నెగుర వైచుకొనుము!



డ్రైవరు:— యెందుకు ?

ప్రయాణికుడు:— ఒక ప్రయాణికుడు క్రిందపడినాడు.

డ్రైవరు:— ఫరవాలేదులెండి. మొదటే అతను టిక్కెట్టుసొమ్ము యిచ్చివేసినాడు.

## నెపోలియన్.

"నెపోలియన్‌కు ఇంగ్లండుదేశముమీద అంతద్వేషము యెందుకో ?"

"ఇంగ్లండుదేశస్థులు అతనిని చంపినారు కాబట్టి."

## తోటమాలి.

తోటమాలి:— అబ్బా ! యిదెక్కడిబాధ? యెవరిని ఏపనిని చేయనీయదు. నేను చెట్లకు నీళ్ళుపోసుకోవలెనంటె యిదొక అడ్డము.

## ఫోటోగ్రాఫరు.

ఒకడు:— ఏమండీ ! మీరుతీసిన ఫోటోలు బాగానే వున్నవిగాని నాభార్య ఫోటోమాత్రము కోతిముఖము లాగానే వున్నది.

ఫోటోగ్రాఫరు:— నాతప్పేమున్నదండీ ! మీ పెండ్లికి పూర్వము చూసి చేసుకోవలసింది.

## దంతవైద్యుడు.

ఒకడు:— దంతవైద్యుని యిల్లెక్కడున్నదండీ ?

రెండవవాడు:— ఇట్టె ముక్కుకు సూటిగా పోయి కుడిచేతివైపు తిరుగు. అక్కడ ఏయింట్లో ఏడ్పు వినబడుతుందో అదే దంతవైద్యుడి యిల్లు.

## 3

(రా. మా. వెం. భ)

## నడిపించుట.

రోగి:— ఏమండీ, డాక్టరుగారూ. యింకెన్నాళ్ళండీ నేనిలాపడవడం ? ఆరోగ్యం కుదరకపోతే ?

డాక్టరు:— మీకెందుకండి విచారం ? యింకా కొద్దిరోజుల్లో మీరు నడిచేటట్టు చేస్తానుగా.

రోగి:— సరే, అంతా అయిపోయింది. ఒక బండీ, మోటారుకారు మీబిల్లుకోసం అని అమ్ముకోవలసి వచ్చింది. కాలి నడకకాకుండా ఏమిచేస్తానులెండి !

## బిల్ కలెక్టరు.

బిల్ కలెక్టరు:— నీబిల్లు నాకెప్పుడిస్తావు. నాకు రోజూ తిరగడానికి తీరికలేదు.

[illegible]:— నాకు తీరుబాటు యెప్పుడు?

బిల్ కలెక్టరు:— శనివారమునాడు,

[illegible]:— ప్రతిశనివారమునాకువచ్చి వెళ్తుండండి.

## కుక్కగొడుగు.

ఉపాధ్యాయుడు:— వర్షాకాలపు ప్రారంభములో ప్రయోమివస్తు [illegible]

ఒక బాలుడు:— కుక్కగొడుగులు.

## జ్వరపుమాత్రలు.

భార్య:— నాకు జ్వరం నిమ్మళించింది కదా. ఇంకా యెందుకు ఈ చేదుమాత్రలు తినమని చంపుతారు ?

భర్త:— ఆహా జ్వరం నిమ్మళిస్తే నాకేం ? కొనుక్కున్న రూపాయలు పెట్టి ఈ మాత్రలు కొన్నానే యివన్నీ ఏంచేయాలె మట్టిలో బూడిదలో పారేయాల్నా యేంటి ?

## కలవరించుట.

భార్య:— [illegible] నిద్రలో పూర్తిగా కలవరిస్తారండీ, ఆఅలవాటు [illegible]చలేరా ?

భర్త:— పగలు నీవు నన్ను మాట్లాడనిస్తేనా ?

## బిల్ కలెక్టరు.

గోవిందరావు ఒకసారు బిల్ కలెక్టరుతో పోట్లాడి "మీ మొఖం చూస్తె నాకసహ్యం వేస్తుంది." అన్నాడు.

"వట్టి అబద్ధం, అమాట అబద్ధమండి. మరి రోజూ పొద్దున్నే రా, సాయంత్రం రా అని యెందుకండి అంటారు ?"

నాకు మనస్సులో అనుమానం తోచి సంభాషణ సగములో ఆపుదలచేశాను. కాని ఎంతలో ఎంత గాధ. ఊరంతా, మండలమంతా వ్యాపించింది. ఎందరు ఎన్ని చిత్రరీతుల చెప్పుకుంటున్నారు. ఇంతకు కారకులెవ్వరో ఊహ చెయ్యలేకుండావున్నా. అబ్బబ్బ, లోకం —

(ఇంతలో శల్యప్రాణానికి చొక్కాతొడిగినట్లు వుండి కించిత్తు జీవకళయినా లేని అనంతరావు వచ్చాడు అతను రాగానే చెవులలోపడినవి విసుగువాక్యాలు. కంటపడినది కిటికీలోని చెల్లెలు, ప్రక్కచూచేసరికి తండ్రి — ఆలోచనామగ్నుడై కండ్లునిగుడ్చి చూస్తున్నతండ్రి పరిస్థితులు సరిగాలేనట్లు గ్రహించాడు. అగ: తండ్రికి చేరువగాపోయి, మెల్లగా.)

నాన్నగారూ,

భా వ.

(మౌనంగా వుంటాడు.)

అ నం త.

నాన్నగారూ, ఏమిటట్లా విచారంగావున్నారు. ఏదయినా అశుభ వార్త తెలిసిందా?

భా వ.

(మౌనం)

అ నం త.

నాన్నగారూ, మాట్లాడరూ, నాతో చెప్పరు. అనుకున్న ప్లాను లేమైనా చెడిపోయినాయా?

భా వ.

(మెల్లగా) అవును.

అ నం త.

ఏమిటి, అవునంటారు నాన్నగారూ?

భా వ.

అంతా నీమూలాన్నే. అంతా నీమూలాన్నే.

అ నం త.

నాన్నగారూ, ఏమిటి అంతా నామూలాన్నా? ఏమిటి, అంతా?

భా వ.

ఆవిష్ట ఊగలభా అంతా, ఈమాట ఒక్కటీ,

అ నం త.

ఏ గలభా? ఏ మాట?

భా వ.

తెలియనివాడికిమల్లె నటిస్తావు, వెధవా!

అ నం త.

నిజంగా, నాన్నగారూ,

భా వ.

మన ఇందిర వివాహం మాట ఇందాక భోజనం ముందు నీ అమ్మ అనలేదూ. నిన్న క్లబ్బులో అయిదారుగురు స్నేహితులు పలుకరించి యిదే ప్రశ్న అడిగారు. నిన్న వుదయమే గా సుబ్బాయమ్మ పిన్నిని, అచ్చాయమ్మక్కయ్యాను వచ్చి ముక్కున వేలువేసుకొని యిదే ప్రశ్న అడిగారు. ఇంకా ఏమిటి, లోకమంతా అంటుకుంటే!

అ నం త.

నాన్నగారూ, మీరింత పిరికివారేమి? యీ మాత్రానికే భయపడ్తారేం. మరీ, అంతా నేను చేశానంటున్నారు. నేనేమి—

భా వ.

అవును. నీవాదినం కృష్ణమూర్తిగారిని రాయి పుచ్చుకు కొట్టబోవడం, మీ ఇద్దరికీ ఘర్షణ జరగడం, అందరూ చూడ్డం అదీ, యిదీ, దాన్నీ, దీన్నీ "కృష్ణమూర్తి — ఇందిర" అనే రెండు పేర్లు పైకి వచ్చాయి. అట్లా అట్లా పాకి పాకి నేటికి "వారిద్దరికీ వివాహమట" అనే వాక్యం పుట్టింది

అ నం త.

కాదు కాదు. మీరు పొరబడుతున్నారు. దీనంతకు కారణ మెవ్వరో నాకు తెలుసు.

భా వ.

ఎవ్వరూ?

అ నం త.

ఇంకెవరున్నారు. ఆయిద్దరు వెధవలూనూ, భీమరాజు, నరసింహాచారి

భా వ.

వాళ్ళేమిచేశారా?

అ నం త.

చేసిందే చాలు. అంతా వాళ్ళ మూలాన్నే. ఆ భీమరాజు వున్నాడే వాడు దుష్టస్వభావుడు. ఎందుకయినా తయారవుతాడు. వెరపు అనేది వాడి నైజంలో లేదు. ఆ రెండో వాడు ఆచారం మహా పట్టు మనిషి. సన్నగా పనిచేస్తాడు. పైకి కన్పించడు. వీరిద్దరూ ఆ కృష్ణమూర్తిని నెత్తినెట్టుకుంటారు. అదీగాక మన వంశమంటే ఎందుకో కోపం, కసి. అందుకోసం యిటువంటి అపవాదు పుట్టించారు.

భా వ.

నీకు తెలియదు పసివాడవు వారు పుట్టిస్తే యింతగలభా అవుతుందేమిటి? వాళ్ళకిట్లా పుట్టించ గల ధైర్యముందా? నాడు నాడంతా పొగా రెత్తిపోతోంది. ఇల్లు, వాకిళ్ళు మోగిపోతు న్నాయి. మరేమో పేరు ప్రఖ్యాతి వున్నవారం. వల్లభవారు భావనారాయణరావుగారు కూతుర్ని కృష్ణమూర్తిగారికిచ్చి పెండ్లి చేస్తారట. ఎంత సాహసం చేస్తున్నాడని కొందరు, పోనీ పసిపిల్ల దానికేమి తెలుసు పాపం, పోనీ, తిరిగి పసుపు కుంకుమ తాచుకుంటారు తల్లిఅల్లే తిరుగుతుంది అనికొందరు, అవును ఆయనబోటివాడే మార్గ దర్శి కావాలి సంస్కరణ విషయాలలో అని యింకా కొందరు, ఎవరు యిష్టం వచ్చినట్లుగా వారు అంటున్నారు.

అ నం త.

అంతే నాన్నగారూ, నాలుగురోజులు అను కుంటారు, నోరు కాయలుగాసి ఊరుకుంటారు. లోకులు దేముంది.

భా వ.

అదికాదు. నీకు అన్ని సంగతులు తెలియవు. అందులోనూ యిటువంటి ముఖ్యవిషయాలు. అట్లాకాదు. పద్ధతిగ్గా అని పోవడం కష్టం.

అ నం త.

అయితే, మీరేమంటారు.

భా వ

నేనేమనడంలేదు. ఇన్ని చిక్కుల్లో పడ్డామే యని విచారం. మార్గమేదా యని ఆలోచన.

అ నం త.

నాన్నగారూ లోకులు కాకులు అన్నారుగా పెద్దలు వారితో ఏమి పోతుందిరా.

భా వ.

లోకులు కాకులే గావచ్చు. కాని అవి చేసే నష్టం అపరిమితం చూడు. ఇప్పుడు యీచుట్టు పట్లంతా కృష్ణమూర్తి నాఅల్లుడు గాబోతున్నా డని, ఇందిర కృష్ణమూర్తి భార్య అవుతున్నదనీ- తెలిసింది. వీరిలోంచి ఆ అభిప్రాయం వెడల గొట్టడం దుర్లభం.

అ నం త,

లోకంలో యెన్ని పెళ్ళిళ్ళు జరగ్గుండాకా వచ్చి ఆగడం లేదు. అట్లాగే యిదీ అనుకోండి పోనీ.

భా వ.

ఇది అట్లా అనుకోడానికి వీలులేదు ఈ సం దర్భంవేరు. ఈ మాట శాశ్వతంగా ఉంటుంది. అప్పుడు చాలా కష్టమౌతుంది.

అనంత.

మీరు కేసు భరిస్తున్నారండీ!

భావ.

అదికాదు. నీమొహం. చూడూ, యీసంగతి ఇందిరకు కూడా తెలిసింది. అమ్మాయి ఎన్ని విధాలైనా ఆలోచింపవచ్చు. నాకేమో యిదంతా కష్టంగా ఉన్నది. లోకమిట్లా ఇరకాటానపెడ్తోంది. ఈ లోకవాక్యం శాశ్వతంగా ఉండి, క్రియకు వ్యతిరిక్తంగా వుంటే, ఎంత విపత్తు కలుగుతుంది.

అనంత.

మీరేమో యీ విషయం వింతగా ఆలోచిస్తున్నారు. మీ నిబంధనలు, పట్టుదలలు యేమయినాయి.

భావ.

(పరధ్యానంగా, మెల్లగా) అరరే. ఎంత పని జరిగింది. ఇట్లా అవుతుందని కలలోనైనా తలచలేదు. ఎంతలో ఎంత మార్పు. (ఆలోచించి) నామనస్సు తిరుగుతోంది. అయ్యో, ఎన్నిదినాలైంది, చిన్ని ఇందిర, చిన్నారి ఇందిర, పొన్నారి ఇందిర, ముఖాన తిలకం పెట్టుకొని, చిన్నప్పుడు రకరకాల చాదులకోసం అల్లరి చేసేది. అయ్యో, తల్చుకొంటే గుండె చెరువు అవుతోంది. శుభ్రంగా, ఇంత కుంకుమ పెట్టుకుని భర్తతో కాపురం జేస్తూ యౌవనక్రీడ సరస్సులో క్రీడిస్తూ వుండవలసిన కాలం పాపం ఇంటో గదిలో బంధింపబడి, ఏ కార్యానికైనా అశుభంగా యెంచబడి—అయ్యో అప్పుడే దాని జీవితం యెంత దుర్భరమైనది......

అనంత.

నాన్నగారూ, ఏమిటి చిన్నపిల్లల మోస్తరు కంటివెంట నీరు కారుస్తున్నారు.

భావ.

(స్థిమితం కుదుర్చుకొని) ఏమీ లేదు. అయితే కృష్ణమూర్తి ఊళ్ళో వున్నాడా.

అనంత.

దేనికి?

భావ.

దేనికయితేనేమి? ఉన్నాడా?

అనంత.

(లేచి తొందరగాను, కోపంతోను) నాన్నగారూ మీసంగతి గ్రహించాను ఏదో మార్పువచ్చింది మీలో. ఇంత వెర్రిన యెప్పుడూ పడలేదు. ఆ కృష్ణమూర్తికి నా చెల్లెల్ని యిందిరనుయిస్తారా, నేను చూస్తూండగా; నేను వొప్పుకుంటానా. చూస్తాగా, యెట్లా జరుగుతుందో. (బయటకుపోతూ) చూడండి రేపీపాటికి కృష్ణమూర్తి యెక్కడుంటాడో.

భావ.

(కోపంతో) పో. నా దగ్గరనుంచిపో. మాట్లాడడం తెలియదు.

(అనంతరావు గబగబ నడుస్తూ, గొణుగుతూ పోతాడు.)

భావ.

(కొంతసేపు ఊరుకొని) ఎవరే అక్కడ?

(లోపలినుంచి దాసీది)

ఏమయ్యా?

భావ.

అమ్మాయిని యిటు రమ్మను.

దాసీది.

అమ్మాయి గారొన్నండీ?

భావ.

అవును.

దాసీది.

సరే నండి.

(భావనారాయణ ఇంటికప్పువంక చూస్తువుంటాడు త్రిప్పికలువు తెరచుకొని ఇందిరాంబ ప్రవేశం)

ఒక్క-పలచనికి పద్దెనిమిదేళ్ళ ప్రాయంవలె కనిపిస్తుంది. తలదువ్వుకుని వున్నది. చెవులకు యెర్రిరాళ్ళ కమ్మలు లోలాకులు మెరుస్తున్నవి. కోలముఖము. విశాలమైన పొగకన్నులు, కొంచెము పొడుగాటిమెడ. మెడలో బంగారపుగొలుసు, మామిడిపిందెల భాతి తెల్లచీర కట్టుకుంది. వచ్చి తండ్రికుర్చీకి దూరంగా పేముకుర్చీపట్టుకు నిల్చుని—)

ఎందుకు నాన్నగారూ పిల్చారట ?

భా వ .

( ఇందిర వంక ఒక్కమారు చూచి, గిరుక్కున దృష్టితిప్పుకొని పైకి చూస్తూంటాడు.

ఇం ది ర .

నాన్నగారూ, ఎందుకు రమ్మన్నారు. దాసీది చెప్పింది ?

భా వ .

అవునమ్మా, రమ్మన్నా కూర్చో.

ఇం ది ర .

( ఆ పేము కుర్చీలో కూర్చుని ) కూర్చున్నా నండీ, ఏమిటి చెప్పండి ?

భా వ .

అమ్మాయీ, నేనొక ప్రశ్న అడుగ దల్చుకున్నాను, సావధానంగా యోచించి న్యాయంగా జవాబు చెప్పాలి.

ఇం ద ర .

ఏ విషయం నాన్నగారూ ?

భా వ .

నీ విషయమే !

ఇం ద ర .

నా విషయమా? ఏముంది ప్రశ్నించ డానికి, చెప్పండి, ఏమిటో ?

భా వ .

చెప్పనా ?...నీకు...ఇపుడు......వివాహం ఇష్టమేనా ?

ఇం ది ర .

( కంపరపడుతూ ) అదేమిటి నాన్నగారూ.

భా వ .

అవునమ్మా, నీవిపుడు తిరిగి వివాహం చేసుకుంటావమ్మా ?

ఇం ది ర .

నా దేముంది నాన్నగారూ, అంతా మీ యిష్టం.

భా వ .

అది సరేనమ్మా, నీ అభిప్రాయం.

ఇం ద ర .

నాదేముంది మీరెట్లా చెప్తే......

భా వ .

నీ కిష్టమేనా ?

ఇం ది ర .

ఒక విధంగా అయితే.

భా వ .

యెట్లా ?

ఇం ది ర .

( మౌనంగా వుంటుంది.)

భా వ .

ఏమిటమ్మా, చెప్పు......

ఇం ది ర .

( మాట్లాడదు )

భా వ .

( ఆలోచన చేసి ) ... వధూవరుడు...కృష్ణ మూర్తే !

ఇం ది ర .

( అపూర్వానందం ముఖాన్ని ప్రకాశింప జేసింది ) నిజంగా ?

భా వ .

అవును.

ఇందిర.

(తన చీరె మడతలమాటునుండి ఒక చిన్న ఫొటోదీసి)

నాన్నగారూ, ఈ తని కోసమేనండీ నేను బ్రతికి వున్నది. మీరు నాకెంతో మహోపకారం చేయబోతున్నారు. నాకు ఆయనను కూడా తిరిగి ప్రాణంపోశారు.

భావ.

కృష్ణమూర్తిగారి ఫొటోయే. (సంతోషంతో) ఇందిరా, తిరిగి కళ్యాణం బొట్టు పెట్టుకుని నా వద్దకువస్తే, యీముసలికళ్ళు ఆనందిస్తవి.

ఇందిర.

(తండ్రి పాదములకు నమస్కరిస్తూ—) నాన్నగారూ, జీవమిచ్చారు.

(తెర)

—♦ ద్వితీయాంకము. ♦—

(తరువాత ఒకవారం గడిచినది. చిన్న పెంకటిల్లు. అంతా వెల్లగొట్టారు. మామిడితోరణాలతోను, పేరేడు తోరణాలతోను నించారు. ఒకగదిలో చాలా చిత్రపటాలు తయారయినవి. తయారుఅవుతున్నవీ గోడలనిండ వున్నవి......మరియొకగదిలో పట్టెమంచమూ — దగ్గరనే మేజాబల్ల దానిప్రక్కనే రెండుకుర్చీలూ వున్నవి. సాయంకాలం నాలుగుగంటలు. నరసింహాచారి, భీమరాజు, కుర్చీలలో కూర్చునివుంటారు. ఆచారి సన్నని వాడు, పచ్చని దబ్బపండులాంటి దేహం, చిన్న కోల ముఖం. బుల్లినోరు. మీసాలు లేవు. వెంట్రుకలు వుంగరాలుతిరిగివున్నాయి..............................

భీమరాజు కొంచెం లావాటిమనిషి. గుండ్రనిముఖం. కొద్దిగా మిడిగుడ్లు, పెరిగిచిన్నెలి గడ్డము, చిన్న బొజ్జ...

కృష్ణమూర్తి.

(పాతికేండ్లవాడని చెప్పవచ్చును. పచ్చని శరీరము ధోవతికి ముందు కుచ్చెళ్ళు జారవిడిచినాడు వెనక బిళ్ళగోచి, చాలా పొడుగాటి తెల్లనిలాల్చి తొడుగుకొన్నాడు. పట్టుశాలువ పైన వల్లెవాటు— వేసుకున్నాడు. పారాణి రాచుకున్న కాళ్లకు పసుపచెక్క పాంకోళ్లు తొడగినాడు. అతనిముఖంలో ప్రసన్నభావమూ, గాంభీర్యమూ, అరవిందనయనమూ ప్రస్ఫుటిస్తున్నవి. కిరణాల [illegible] అద్దంలో చూసి దువ్వుతున్నాడు.)

ఆచారి.

[illegible], శృంగారించడం చాలెన్నురూ! పిల్ల సిద్ధపరచే సమయం లేదుగా?

కృష్ణ.

సర్వజ్ఞా, ఆభయం మీరు, లోకం కలిసి నిర్ణయం చేశారుగా.

ఆచారి.

మీరు చేసిన దేమున్నదండీ అంతా దైవఘటన. తుదకిట్లా సంతోషంగా చేశాడు బ్రహ్మ. కళ్యాణ చూసి ఆనందిస్తాము.

భీమ.

అన్నగారూ, అన్నీ అయినవి. కల్యాణం బొట్టు మరచినారు.

కృష్ణ.

అవునోయి. అలవాటు చొప్పున మరొక్కనాను. (అని ప్రక్క బల్లమీదవున్న చాదు తీసి కల్యాణంబొట్టు పెట్టుకుంటాడు.)

భీమ.

ఆహా. ఇప్పుడు ఇక్కడు వైఖరి. వధూవరుని వేషం బాగా వచ్చిందండీ?

కృష్ణ.

కాదూ. శిథిలహృదయాన మొండిన చివురు పాదు కొనలు వేసింది. నాకంట సిరియూ వలపు.

ఆచారి.

మీ ముఖమున తాండవమాడు అనిమేషత్వాలు!—

భీమ.

పేరును సార్థకం చేశారనుకుండీ! రాధామాధవ తత్వం పూర్తిగా పరిణామము పొందింది,

రా:- (రాధ.) రావుకాదూ, ఇంతేకదూ, నేను వెళ్ళిపోనా, అయితే; కృష్ణా, నాగొంతు నొప్పి పుడుతోంది. ఏపొదలోదాక్కున్నావు. ఏచెట్టు చాటున దాగావు. కనపడవేం? కృష్ణా నాకు కోపంవస్తోంది నిజంగారా, త్వరగారా, ఇదిగో కళ్ళుమూసుకుంటున్నా. తెరచేలోపల రావాలి. (కళ్ళుమూసుకుని) ఎవరొస్తారో, ఎవరొస్తారో, ఎవరొస్తారో.

(పొదచాటున కృష్ణమూర్తి ఆనందం పట్టలేక పరుగెత్తుకువచ్చి ఆమెకళ్లుమూస్తాడు.)

యిందిర.

ఆ. వచ్చావుకృష్ణా. అదుగో గట్టిగాము య్యకు.

కృష్ణ.

(చేతులుతీసి ఆమెభుజముమీద చెయ్యివేసి) నేనెవర్ని యిందూ.

యిందిర.

కృష్ణ!............నేనో!

కృష్ణ.

ఇం......కాదు, కాదు రాధ.

ఇందిర.

ఇదంతా?

కృష్ణ.

బృందావనం.

ఇందిర.

నిజంగా.

కృష్ణ.

నిస్సందేహంగా.

ఇందిర.

ఏదీ, రాధాకృష్ణులు యెల్లా నిల్చునేవారు ఇటు రా, దగ్గరగా.

(ఇద్దరూ దగ్గరగా నిల్చుంటారు. శాంతం, జానకి, చిన్నీ, లక్ష్మి, మరికొందరు పొరిధకాయికలు కర్పూర నీరాజనం పడ్తారు. పొన్నవృక్షంనుండి పుష్పవృష్టి.)

(తెర.)

---

# సుకవిస్తుతి.

శ్రీకర్లపాలెం హనుమంతరావుగారు

కం॥ ధన్యా, అభినవ కవి మూ
ర్ధన్యా, వర భారతీ శరణ్యా, భావా
రణ్యా, రవీంద్ర నాథా,
మాన్యా, కైకొనుము నా నమస్కారములన్ ॥

గీ॥ రాజ్య సాహిత్య సామ్రాజ్యపతివి నీవు
విశ్వ భారతీమూర్తి నీ విమలవాణి,
ధన్యుడ వసంగ నీవెకాదా ధరిత్రి,
ప్రాచ్య కవిచంద్ర! ప్రణయసాంద్రా! రవీంద్ర!॥

# పత్త్రరహస్యము.

—♦ పదునాలుగవ ప్రకరణము. ♦—

కుంద.

కాళీచరణుడు తనరహస్యమును కొంతకాలము మఱచిపోయినాడు. కాళీచరణుడిపుడు క్రొత్త క్రొత్త యనుభవములను సంపాదించుచున్నాడు. తన కుమారుని చర్యలను సుముఖి వింతగ జూచుచున్నది. కాళీచరణునకు హృదయశాంతిలేదు. ఆడంబరపరుడు. వస్తువులక్రింద నమితముగ ఖర్చుపెట్టి తల్లికి భరింపజాలని చిక్కులను కలుగజేయుచుండెను. ఆ దుస్తులను, యాడంబరమును చూచి తనపుత్రుడేదియో యొక ప్రేమవాహినిలో నీదుచున్నాడని సుముఖి యనుమానించినది. ఒకస్త్రీ, ఆ రాధ్యవస్తువు, లేనిదే పుట్టి షుకిట్టి వెర్రితలలను ద్రొక్కడని యామె యభిప్రాయము.

సుముఖియు కాళీచరణుడు నిపుడు కలకత్తాకు పశ్చిమోత్తర దూరముననున్న భోజ్పూరమున నివసించుచుండిరి. ఆగ్రామమునందు బ్రజమోహనబాబొక వ్యవసాయకుడు అతనికి కుందయను కుమార్తెగలదు. కాళీచరణుడామెను మోహించి వివాహమాడ నుద్దేశించెను.

కాళీచరణుడు యోచనాపరుడు కాడు. అయినచో కుందయొక్క ముఖమును గాంచియే యామెను పరిణయమాడిన నపాయము గలుగునని తలచియే యుండును. కుంద యద్భుతమైన స్త్రీయే. సాహసిగానులును, జిత్తులమారియుని యామె ముఖచిహ్నములే చెప్పుచుండెను. ఆమె కన్నులు చాల పెద్దవి. నిత్యము నిప్పులుగ్రక్కు చున్నట్లుండును. హృదుత్వ మెందును గానరాదు. ఆమెకు కోపము వచ్చినపుడు యామెకన్నులు చింతనిప్పులను వెలిగ్రక్కును. అపుడామెను చూచుట క్షేమకరమును కాదు. యానందజనకమునుకాదు. కుందతల్లి చనిపోయినది. ఆమె దాష్టీకస్వభావము కలది. దుర్మార్గులనే మానవులు ప్రేమించుట యాశ్చర్యకరము. అయినప్పటికిని ప్రపంచమున నదియే జరుగుచున్నది. బ్రిజమోహనబాబుకూడ నంతియే. అతడు వినోదినిని వివాహమాడెను. వినోదిని సత్స్వభావము కలది కాదు. ఆమెయెన్నడును నిజమును పలికెడిది కాదు. సందర్భము చిక్కినపుడు వస్తువుల నపహరించుట కూడ కలదు. వినోదిని జాడిణీయను వదంతికలదు కాని యావిషయ మామెకును భగవంతునికి మాత్రమే తెల్లియును. ఆమెయొక్క రక్తమే కుందనాళములలో ప్రవహించుచున్నది. ఆదాష్టీకస్వభావ మీయామెకుకూడ సంక్రమించినది. ఎవరు నామెను కదలించుటకే భయపడుచుండెడివారు. ఇటువంటి కుందను మన కాళీచరణుడు ప్రేమించియున్నాడు. ఆమెయొక్క కనుగవను గాంచి ముగ్ధుడైనాడు ఆమెకై యువ్విళ్ళూరుచు నామె నెట్లు పొందుదునాయని తలపోయుచు నామెపరిచయమును సంపాదించినాడు.

ఒకనాడు కాళీచరణుడు సరాసరి బ్రిజమోహనబాబును సందర్శించి తన మనోభీష్టమును వెల్లడిపరచెను.

బ్రిజమో:- కుందతో వ్యవహరించుట కష్టసాధ్యమునుమా. ఆమె నొడంబరచిన నాకభ్యంతరము లేదు.

కాళి:- ఆమె ప్రతివ్రతనమునకు వెరపొందెడివా డను కాను.

ప్రమో:- కాళీచరణ్, అట్లయిన మంచిదే. ఆమె కేమాయె నొకవర్తమానము దెలిపితివా? ఆజన్మాంతము మాటప్రకారము నిలవవలసినచే ఆమెతో చెలగాటలాడు టసంభవము. మీ తల్లిని చాల కాలమునుండి యెరిగియుండుటచే అనవసరపు చిక్కులు తెచ్చిపెట్టుకొనకుండు టకు నీకింతగా చెప్పితిని.

కాళీ:- ఆవిషయమై నాకెట్టిసందియమును లేదు. పిల్లతండ్రియే యింతగా చెప్పుచున్నపుడు వివేకియగు పురుషుడు భద్రముగ నుండవలెనను టకు సందియమేమాత్రమును లేదు.

ప్రమో:- నీకొక విషయము చెప్పవలసియున్నది. ఈ గ్రామములో నేను చాల భాగ్యవంతుడ ననుకొనుచున్నారు. అది శుద్ధయబద్ధము. నాభార్యవలన నెంత ధననష్టమును పొందితినో నాకే తెలుసును కనుక నాయాస్తి కుంద కేమాత్రమైనను సంక్రమించునని యాశ పడవలదు.

కాళీ:- నాకు కావలసినది మీకుందకాని మీ యాస్తికాదు.

ప్రమో:- అట్లయిన నీ యిష్టము వచ్చినట్లు చేయుము.

తక్షణమే కాళీచరణుడు కుందవద్దకుపోయి తన మనోభీష్టమును వెల్లడిచేయదలచెను, కాని యామెయొక్క చర్యల నిదమిద్ధమని నిర్ణయించుటకు వీలులేదు. కొన్నిసమయములలో సిగ్గు శాంతము ఒకవిధమైన యున్మాదము కన్పట్టును మరికొన్ని సమయములలో తొందర, దుడుకు తనము గోచరించును. దయ యనునది యామె యందు అరుదు. కాని యొక్కపర్యాయము దయకల్గినచో నామెను పట్టజాలము. అడవిలో నెగురుచుండెడి భయంకరమగు పక్షినైనా పట్టి మచ్చికచేయవచ్చును గాని, కుందవంటి విపరీత స్వభావముగల స్త్రీని స్వాధీనపరచుకొన దలచు టసాధ్యముకాదు. ఆమె ముందెన్ని శ్రంగారచేష్టలు ప్రదర్శించినను, వ్యర్థము. కాళీచరణుడు కుందయొద్దకు పోవుచుండెను కాని యామె యెట్టిస్వభావమును ప్రదర్శించునో తెలిసికొన జాలకపోయెను. ఆమెను గాంచి ధైర్యము తెచ్చుకొని తనను వివాహమాడకోరెను.

"మిమ్ము వివాహమాడవలయునా! నన్ను పెండ్లిచేసుకొని మీరు సుఖపడజాలరు. నాయిష్టమువచ్చినట్లు సంచరించెడి స్వభావమునాది"

"అట్లనే యుండవచ్చును. నిన్ను సంతోష పెట్టుటకంటె కావలసినదేమున్నది."

"నాది క్రూరస్వభావముకూడ నైయున్నది. ఆగ్రహావేశమును కలిగినప్పుడు నన్నెవ్వరెదుర్కొనజాలరు."

"ఆగ్రహావేశమును కల్గుగకుండ నేను జాగ్రత్తపడగలను."

"అది అసాధ్యము. అటువంటి సందర్భములలో నాకెదురుగ నిలుకకుండుట ఉత్తమమైనపని."

"ఆపని నాకు మఱింత సులభము."

"అట్లయిన మీరు నన్ను నిజముగ ప్రేమించెదరా ?"

అంతటితో మన కాళీచరణుడు తన విరహ వేదనను, మోహపీడితులు వెలిగ్రక్కెడి అసంబద్ధ ప్రలాపములు, ప్రమాణములు వర్షధారగ కురిపించెను. కుంద కాళీచరణుని భావమును గ్రహించి వివాహమాడుట కంగీకరించెను.

పై సంభాషణను గమనించిన కుందయొక్క స్వభావము పాఠకులకు వెల్లడికాకమానదు.

## పదునైదవ ప్రకరణము.

## పన్నాగము.

కాళీచరణుని జీవితములో గొప్ప మార్పు కలిగినది. కుందయొక్క యంగీకారమును బడసి కొంత కృతకృత్యుడైనాడు ఇంతవరకును తనకు కావలసిన డబ్బుకై తన తల్లిని పీడించుచు వచ్చెనుకాని యిక నామెశక్తికి మించినదయ్యెను. కుందను సంతసపెట్టుటకు ధనము తప్పదయ్యెను. తన సోదరుడగు శశిభూషణునకు నేబదిరూప్యములు పంపమని జాబు వ్రాసెను. మరినాలుగురోజుల కేబదిరూప్యములను మనియార్డరుద్వారా శశిభూషణుడు పంపెను. ఇట్లొకమాసము గడిచినది. తరువాత కాళీచరణుడు ఏబది రూప్యములకై సోదరునిపేర మరల నొకజాబు వ్రాసెను. ఈ పర్యాయము శశిభూషణుడు డబ్బును పంపుచూ తనకు వసంతవిలాసమున వ్యయ మధికముగ నున్నదనియు, కానికముం దేమాత్రమును డబ్బు పంపజాలననియు జాబు వ్రాసెను.

కాళీచరణుడు సోదరుని జాబునుగాంచి, యేమాయోపాయమునైనావన్నిడబ్బును సంపాదించవలెనని కృతనిశ్చయుడయ్యెను. పనిచేయుటయనిన నాతనికి తలకాయనొప్పి. శశిభూషణుని జీవితమునకు సంబంధించిన రహస్యమొకటి కలదనియు, తెలిసినప్పటికిని తన తల్లి తనకు చెప్పుటలేదనియు, నావిషయమె పరిశోధించి కృషిసల్పిన లాభించుననియు కాళీచరణుడు తలచి కాశీనగరమునకుపోయి తనపుట్టుపూర్వోత్తరముల నరయ నెంచెను. తల్లితో తానొక యుద్యోగమును సంపాదించుకొనుటకై పోవుచున్నానని చెప్పి యామెయొద్దనుండి యేబదిరూప్యములనుగైకొని కాశీనగరమునకు బ్రయాణమయ్యెను. ప్రయాణమునకు బూర్వము, కుందను దర్శించి తానొక రహస్యమును భేదింపనున్నట్లును, తనయత్నము ఫలించినచో దానును కుందయు జమీందారులవలె కాలము గడుపవచ్చుననియు తెలిపెను.

కాశీనగరమును చేరి యొకానొక సత్రమున బసచేసి తనకార్యముపట్ల దీక్షతో మెలంగుచుండెను. ఒకనాడు స్టేషనువద్ద విజయుడను పోర్టరును కలిసికొని "నీవెంతకాలమునుండి యిచట పనిచేయుచున్నావని" యడిగెను.

"ఏడెనిమిది సంవత్సరములనుంచి పనిచేయుచున్నాను."

"ఇచట యెనిమిదిసంవత్సరముల నుండియేనా నీవున్నది? ఇరువది సంవత్సరముల క్రిందటి వృత్తాంతమును తెలుపగలవా రెవరైన నున్నారా?"

"ఎందులకు?"

"నాతండ్రి యిచట రైలు గార్డుగ పనిచేసి రైలుక్రిందపడి ప్రాణములను విడచెను."

"తండ్రిమరణమనిన మీకు లేశమాత్రమైన విచారమున్నట్లు గాన్పించదే. నేనే చనిపోయి యుండినచో, నాకొడుకుల పరితాపమునకు మేరయే లేకుండును."

"నీవు పొరపడితివి. మాతండ్రి చనిపోయినప్పటికినాకు రెండు నెలలుమాత్రమే. మీపేరేమో యడుగవచ్చునా?"

"నాపేరు విజయుడు."

"విజయా, నాతండ్రిని గురించిన సమాచారము తెలుపగలవారు కావలెను. నాతండ్రిని దహనముచేసిన స్థలమున స్మారకచిహ్నము నొకదాని నెలకొల్ప నుద్దేశ్యముతో వచ్చితిని."

"ఇరవై సంవత్సరములక్రిందటనా? చాల కాలమైనది. గుడ్సుస్టేషనులో చంద్రుడను వృద్ధుడు పోర్టరుగనున్నాడు. అతనిని కలిసికొనిన లాభించవచ్చును."

"సరియే. నీమేలు మరువను సాయంకాల మాతనిని కలిసికొని తిరిగి నీయొద్దకు వచ్చెదను" అని కాళీచరణుడు తనబసకు చేరెను.

సాయంకాలము కాళీచరణుడు గుడ్సుస్టేషనుకు బయలుదేరెను. తలచుకొనిన పని పూర్తియగువరకు నిద్రపోవుటయనునది కాళీచరణునకు లేదు. చంద్రుని కలిసికొని పరిచయము చేసికొని "నా తండ్రి యిరువది వత్సరముల క్రితము రైలు క్రిందపడి చనిపోయినాడు. చాలా కాలము రయిలు గార్డుగ పనిచేసినాడు."

"భీమసేనుని కుమారుడవా!"

"అవును."

"అతనికిని నాకును చాల స్నేహము. అతని పేరునైనా యెన్నటికిని వినవనుకొంటిని. మీ తల్లి యెచటనున్నది?"

"గ్రామములోనున్నది. నేనువచ్చునపుడామెతో చెప్పలేదు. నా తండ్రిని గురించి ప్రస్తావించిన నామెకు గలుగు విచారమునకు మేర యుండదు."

"అవును. భీమసేనుడు మరణించినపు డామె యొక్క విచారమును చూచిన వారామె జీవించుట దుర్లభమనియే తలంచిరి."

"ఏదియో కొలదిగ యాస్తి కలిసివచ్చినది. దానితో మేము జీవనము చేసికొనుచున్నాము.'.

"అట్లనా! భద్రముగ కాపాడుకొని జీవనము చేయుము. నాకును ఒకపుడు నాలుగైదు వేలుండెడివి. ఆసొమ్మంతయు దుర్వినియోగము చేయబడినది. ఇపుడు ముసలితనమునందు సైతము కష్టపడవలసి వచ్చినది. నీవు బుద్ధిమంతుడవుగనే కనబడుచున్నావు."

"ఆవిషయములో వేరుగ చెప్పనక్కరలేదు. మే మంతయు జాగరూకత కలవారమే. అయితే నా తండ్రిని గురించి నీకు తెలిసిన విషయములు చెప్పవా?"

"ప్రతి సాయంకాలము మే మిరువురము కలిసికొనుచుండెడి వారము. రంగాపురములో చిన్న పూరింటియందు కాపురము చేయుచుండెడివాడు."

"నా తండ్రికి వివాహమై యెన్నివత్సరము లైనదో చెప్పగలవా?"

"ఇచ్చట పనిలో చేరక పూర్వమే వివాహమైనది."

"ఈసంగతుల నన్నిటిని మాయమ్మ నడుగజాలను. అడిగినచో నామెకు విచారము కలుగును. మాయమ్మకు నేనొక్కడనే కుమారుడను." చంద్రుడాశ్చర్యముతో జూడసాగెను. ఆతని యాశ్చర్యమును కనిపెట్టి "నాతండ్రియు, నాసోదరుడును చనిపోయినట్లు వింటిని" అని కాళీచరణుడు చెప్పెను.

"అట్లయిన కాశీనగరమునకు రాకపూర్వము జరిగియుండవచ్చును అయినప్పటికిని నీవొక్కడవే భీమసేనుని కుమారుడవని మాటలసందర్భములో తెలిసికొంటిని. అప్పటికి నీకు రెండు మాసములే వయస్సు."

చుండెను. దినములు గడచిన కొలదిని విచార మధికమగు చుండెను. చేతనున్న ద్రవ్యము ఖర్చగుచున్నది. కుందసుఖమును తిరిగి చూచు నట్లు, తానేదియో గొప్ప రహస్యమును భేదింప నున్నట్లును, కృతకృత్యుడైనంత నే తెలియుపర్చెదనని యు కుందతో ననెను. ఇప్పు డామె నేమని చూడగలడు? అయినను తన హృదయేశ్వరిని గాంచక తప్పదయ్యెను. ఖిన్న వదనముతో నామె చెంత కేగెను.

కుంద:— కాశీనగరమునుండి నాకేమి తెచ్చితిరి. వచ్చిన పిమ్మట నేదియో సమాచారము తెలిపెదనంటిరే!

ఇచ్చుటకు కాళీచరణుని యొద్ద నేమిగలదు? చెప్పుటకయిన నేమి సమాచార మున్నది? తానత్యంతముగ ప్రేమించు కుంద హృదయములో దాను బ్రధానస్థాన మధిష్ఠింప నెంచెనే! ఇపు డామె యేమని యెంచును. గుంపె డాశతో నున్న కుందకు నిరుత్సాహము జనించినది.

కుంద:— నీవదనము జూచినచో చేసిన ప్రయత్నము లాభింపలేదని తోచుచున్నది.

కాళీ:— అవును. ఇంకను కొంత కాలముపట్టును.

కుంద:— మొదటినుండియు ననుమానించుచునే యుంటిని. ఆశలన్నియు నడియాసలయినవి. అయినను ధనధాన్యముల నేనపేక్షించను. కాని పట్టపగల్భములనినాకు తలనొప్పి. చేత కాని పనిచేయగలమని యెందుకనుకొనవలెను.

కాళీ:— నేను వాగ్దానము చేసినదంతయు నెర వేర్చితీరగలను. కాని తొందరపడిన లాభము లేదు. నాప్రయత్నము సఫలమైతీరును.

కుంద:— ఇప్పుడు కలిగిన లోటేమి?

కాళీ:— ఒకానొక మనుష్యుడు ఒక దారిని పోవు చుండెననుకొనుము. పోవుచుండగా పోవు చుండగా నొక పెద్ద పర్వత మడ్డువచ్చిన యెడల నేమిచేయవలయును?

కుంద:— వెనుదిరిగి మఱియొకమార్గము నను సరించవలయును.

కాళీ:— ఇప్పుడు నేను చేయబోవునదియు నంతే. నేనొక రహస్యము నెఱుగుదును. దాని నరయుటకే ఇంతవరకు ప్రయత్నించితిని. ఆప్రయత్నము వృథయైనది. ఈసారి ప్రయత్నము లాభించితీరును.

కుంద:— అట్లనే కావచ్చును. కాని యేపనియందైనను మీకంత శ్రద్ధయున్నట్లు కన్పించదు.

కాళీ:— కాదు. కాదు. నేను గొప్ప జమీందారునై సుఖపడుటకు పుట్టితినిగాని కష్టపడుటకు పుట్టలేదు.

కుంద:— మీరు జమీందారులైతే నేను జమీందారిణి నన్నమాట.

కాళీ:— అవును. పెద్ద భవనములో బంగారు తూగుటుయ్యెలలో నూగుచున్న నీచుట్టును సేవకులు కొల్వుండగా నెంత యానందముగ నుండును.

కుంద:— అవును. నాకును నట్టికోరిక యేయున్నది. కాని యేమిప్రయోజనము.

కాళీ:— కుందా, తొందరపడనేల, కొంతకాల మోర్చికొనుము. అంతయు నీకే తెలియగలదు.

కుంద:— పట్టిమాటలతో ప్రయోజనమేమున్నది. మీరుపోయి ధనమును సంపాదించుకొని రండు అంతవరకును నేను వేచియుందును.

కాళీ:— మాట తప్పిపోవునెడల?

కుంద:— మాటతప్పుట పురుషుల లక్షణముకాని స్త్రీల లక్షణముకాదు.

కాళీచరణుడు మిశ్రభావములతో కుందను వీడి తదుపరి మార్గాలోచనమునకు గడంగెను.

# ఆంధ్ర భారతి

మచిలీపట్టణము.

సంపుటము | డిశంబరు 1927 | సంచిక





## ఆత్మపరిశోధన.

చరిత్ర యొక యద్దమువంటిది. ఆయద్దములో మానవుని బాహ్యస్వరూపము మాత్రమే ప్రతిబింబింపదు. అందు మానము ప్రయత్నించుచో మన మానసికశక్తి గోచరించును. మన శక్త్యాశక్తతలు పరిశుభ్రముగ వ్యక్తమగును. 40 శతాబ్దములపాటవిచ్ఛిన్నముగ ప్రపంచము నేలిన మన నాగరికత నేడు జీవచ్ఛవమువలె నుండుట గోచరించుచున్నది మనము బ్రతికే యున్నాముకాని సజీవత్వమెచటను కాన్పించదు. మన దౌర్బల్యమును మనము నేడు పారద్రోల గలిగేయెడల మనసౌభాగ్యము మనదేశసౌభాగ్యము పెంపొందింతుము. మూఢసాంప్రదాయములను మూఢాచారములను విడనాడవలెను. కొన్ని సంవత్సరము లభివృద్ధి మరికొంతకాలము మాంద్యత ప్రకృతి లక్షణము. వేదకాలమునాటి చురుకుతనము శరీరదార్ఢ్యత నేడు లేదు. ఆనాటి యాలోచనలు అభిప్రాయములు ఆచంద్రార్కములై యున్నవి. భారతకాలమునాటి సజీవత్వము నాగరికతయొక్కయుత్కృష్టత యనన్యసామాన్యములై యున్నవి. బుద్ధయుగమున నాసియాఖండమునందంతటను స్వేచ్ఛావాయువు లన్ని పథములందును వీచెను. చంద్రగుప్తుడు సైనికసహాయముచే దేశము నేకోన్ముఖమునకు దెచ్చెను. అశోకుని కీర్తి దిగంతములు దాటినది. అతని ప్రాపకమున బౌద్ధమతప్రచారము సిరియా ఈజిప్టు సిరీన్ యీపిరస్ మున్నగు ప్రాంతముల ప్రాకినది. భారతభూమి, చీనా జపాను బర్మా సిలోన్‌వారికి ఆధ్యాత్మిక నివాసముగ బరగినది. గుప్త సామ్రాజ్యమునందలి విజ్ఞానము వర్ణనాతీతము. పర్వతములను పగులగొట్టి తమకు గుహలను తమ దేవతల కాలయములను నిర్మించుకొన్న వారిశక్తిని నేటికి మనమత్యద్భుతముగ జూచుచున్నారము ఈకల్పనాశక్తి, యీసృష్టి సామర్థ్యము నేడు నశించిపోయినది. పరిశుభ్రమైన జీవితము, ఆవేశముతో గూడిన యుత్సాహము, మనోనిశ్చయము నశించిపోయి స్వల్పకోరికల కాస్పదము చిక్కినది. దేశమంతయు బడలిక చెందినది. తేలిక జీవితమున కెల్లరు పెనగులాడుచున్నారు స్వేచ్ఛావిహారము లేక అజ్ఞానతిమిరములో బడి దేశము కొట్టుకొనుచున్నది. ఇపుడిపుడు స్వేచ్ఛాతృష్ణ ప్రబలసాగినది. యువ

కుల సాధనవలననే దేశవిముక్తి కలుగగలదు. ఈసాధనకు నిలయములు విశ్వవిద్యాలయములు.

## విశ్వవిద్యాలయములు.

భావములు ఆదర్శములు ప్రజలిన యీప్రపంచమును నడుపవలసిన భారము విశ్వవిద్యాలయములది. హిందుదేశములో మతభేదములు ఆదర్శభేదములు పెచ్చుపెరిగిపోయినవి. ఆత్మపరిశోధన విశాలహృదయ సమన్వితమగు హేతువాదనలచే నీదురవస్థ తొలగిపోవలెను. ఈకొంటిని పెంపొందించునవి విశ్వవిద్యాలయములే ఉత్తరహిందుస్థానములో మానసికసంచారము వక్రగతిని నడచుచున్నది. అందరును తనకు దోసిలొగ్గవలెనని కోరుచున్నది. తన యుద్దేశ్యమును నెరవేర్చుకొనుటలో నదురుబెదురు లేక తిరుగుచున్నది. ఆవేశము కలిగినపుడు దౌర్జన్యమునకు దిగుచున్నది. అనేకమంది స్వేచ్ఛావిహారుల నొకే సన్నని రంధ్రములో సిమిడ్చ జూచునంతటి యవ్యక్తత మరియొక్కటి లేదు. ఇది నిరంకుశుల లక్షణముకాని వేరు కాదు. మనస్స్వాతంత్ర్యము, ఆలోచనాస్వాతంత్ర్యము కావలసియున్నవి. వీనిని పెంపొందించుటయే విశ్వవిద్యాలయములయొక్క యాదర్శము. విశ్వవిద్యాలయము స్వేచ్ఛానిలయము. అభిప్రాయస్వాతంత్ర్యము నణగద్రొక్కదలచినవారు మతకలహములకు కారకులగుచున్నారు. ఇటువంటి దురవస్థను శాశ్వతముగా తొలగించునవి విశ్వవిద్యాలయములే. విశ్వవిద్యాలయములు. ఏజాతి సౌభాగ్యమున కేవిశ్వవిద్యాలయము మేర్పడుచున్నదో అదితత్జాతియొక్క పూర్వపుచరిత్రమెడ ప్రత్యేక శ్రద్ధ వహించవలెను. భారతభూమి యిసుక పఱ్ఱకాదుగదా! అనేక శతాబ్దములనుండి వేళ్ళు గాఢముగ నాటుకొని ఆచంద్రార్కము గర్వింపగల యౌన్నత్యమును సంపాదించినదే! ప్రతిజాతికి ప్రత్యేక ప్రత్యేకముగ చరిత్రభూగోళశాస్త్రము లుండునే! గాలి దుమారములు ఎండవానలు సూర్య చంద్ర నక్షత్రాదులవల్లకాక, ప్రత్యేకమైన ఆదర్శావేశములతో భారతజాతి పెరుగుచున్నదే! మన నాగరికత, మనభాషలు, మన వేదాంత సారములు పెంపొందవలసియున్నవే! వీటికన్నిటికి మన విశ్వవిద్యాలయము లెంతవరకు బాధ్యత వహించియున్నవి యనునదియే ప్రశ్న. మన సాంప్రదాయములను మనయాచారవ్యవహారములను త్రోక్కిపెట్టి, హేయముగ పరిదర్శించి, నూతనమైనయనుగుణ్యము కాని యాదర్శములను ప్రతిపాదించు నేటి విశ్వవిద్యాలయములు విశ్వవిద్యాలయములేనా? శాశ్వతము పరబ్రహ్మమేనని, మార్పు జీవితలక్షణమని బోధించు మన వేదాంత శాస్త్రమునకు నేటి విశ్వవిద్యాలయములలో తావు కలదా? నూతనభావములు నూతనయాదర్శములు ప్రపంచమునంతను వ్యాపించుచుండగ, మనలను ముక్కులు మూసుకొని కూర్చుండమని మన విశ్వవిద్యాలయములు బోధించుచున్నపుడు మనమేమి చేయవలెను? భారత విజ్ఞాన చరిత్రలో మనము జూచునది భారత భూమెంత సులభముగ నూతనపరికరములు కలవాటుపడగలుగునను విషయమే. పూర్వాచార సాంప్రదాయముల యెడ కొన్నిసందర్భములలో పట్టుదల మెండుగ నున్నను, నూతన యుగ లక్షణములను నిర్లక్ష్యముచేయు జాతి భారతజాతి కాదు. ఇటు

వంటి విజ్ఞానము మనవిశ్వ విద్యాలయము లెంతవరకు నొసంగుచున్నవి? యంత్రసృష్టివలె, కేవలము పట్టభద్రులను తయారుచేసి, తినుటకు తిండి కట్టుటకు గుడ్డలేక మల మల మాడ్చుటయేనా, విశ్వ విద్యాలయముల లక్షణము? ఇందుకు విశ్వవిద్యాలయములను సంపూర్ణముగ మార్చివేయవలదా? ఇదియే ఆంధ్రవిశ్వ విద్యాలయముయొక్క పట్టభద్రులకు రాధాకృష్ణ డొసగిన యుపన్యాస సారాంశము.

## ఆంధ్రుల బాధ్యత.

రాధాకృష్ణుని యుపన్యాసము క్లుప్తముగ వివరించి యుంటిమి. భారత భూమియందే కాక పాశ్చాత్య దేశములందుకూడ ప్రఖ్యాతిని సంపాదించిన రాధాకృష్ణుడు తనయనన్య సామాన్యమైన యనుభవముతో నొసంగిన భావపూరితమైన యుపన్యాసము నెల్ల రాంధ్రులు హృద్గతము చేసికొనవలసియున్నది. ఆంధ్రుల బాధ్యత యీనూతన విజ్ఞానమును పెంపొందించుటలో నెంతవరకు గలదను విషయములోగూడ రాధాకృష్ణుడు స్పష్టముగనే వివరించి యున్నాడు. కేంద్రస్థానముకొరకు కార్యస్థానముకొరకు మొత్తు పైయెత్తు లెత్తుట యాంధ్రుల కర్తవ్యము కాదు. ఏవిధముగానో తూర్పు గోదావరివారి యనహానము ప్రబలి అనంతపురమునకు దావిచ్చి పరుల పరిహాసమునకాంధ్రులను బాల్పడచేసినది. ఇప్పటికైనను ఆంధ్రులు వ్యక్తిద్వేషములను సంకుచితమైన ప్రాంతాభిమానమును చంపుకొని, ఆంధ్రవిశ్వవిద్యాలయమును సంస్కరించి ఆంధ్రులవిజ్ఞానమునకు దోడ్పడవలసియున్నది. మహాత్మునిమందలింపుతదనంతరమువచ్చినరాధాకృష్ణుని మందలింపు ఆంధ్రుల కన్నులను తెరువవలెను. లేదా ఆంధ్రులు కార్యశూరులుకాని అవ్యక్తులై ఆంధ్రదేశము నధోగతికి దెచ్చినవారగుదురు. అభిప్రాయస్వాతంత్ర్యము వ్యక్తిధర్మమైనప్పటికిని, సంఘముకొరకు కొన్ని వ్యక్తిధర్మములను త్యాగము చేయకతప్పదు.

## కాంగ్రెస్ ధర్మము

తుదకు బర్కెన్‌హెడ్ ప్రభువు సంస్కరణముల కమిషనును పార్లమెంటుచే నంగీకరింపచేసి కృతకృత్యుడైనాడు. జిన్నామాలవ్యాలవంటి మితవాద ప్రముఖుల సింహగర్జనములు కార్మికనాయకులనే కదల్చనపుడు కాన్సర్వేటివు మంత్రివర్గములో సంచలనము కలిగించుననుట యతిశయోక్తిగాక మానదు. కమిషనును నియమించుటలోగల యంతరార్థమును బర్కెన్‌హెడ్ ప్రభువు నిష్కపటముగను, గంభీరముగను విశదీకరించినాడు. హిందూ ప్రాతినిధ్యమునకు బాధ్యత వహింపగల హిందు నిర్మాణమేదియును లేదని సగర్వముగ బల్కినాడు. దీనివలన బ్రిటీషురాజకీయ తంత్రజ్ఞులు తమస్వలాభమునిమిత్తమే పరికారముగ మతభేదములు కులకక్షలు పెంపొందించి యానందింతురో తెలియగలదు. కేవలము పార్లమెంటు మెంబర్లచే కమిషను సభ్యులుగ నియమించుటకు కారణమేకగ్రీవముగు నివేదికను తయారు చేయించుటయేయని బర్కెన్‌హెడ్ ప్రభువు బహిరంగముగ చాటినాడు. అనగా బ్రిటిషు రాజకీయవేత్తల హృదయములలో హిందూదేశమునకు ప్రసాదింపబడనున్న నిర్మాణమిదివరకే నిశ్చయింపబడినదని యూహింపవలెను. దీనియెడల

నేకగ్రీవమగు నివేదికయొక్క యావశ్యకత గాన్పించుట లేదు. మన రాజ్యాంగ నిర్మాణమును సృష్టించవలసిన ధర్మము బాధ్యత మనదని వాదించుచున్నాము. మనవాదనను బ్రిటిషు వారు వైవిధ్యముల ఖండించుచు యీబకువంతయును శ్వేతముఖులదేయని చాటుచున్నారు ఇట్లు చాటుచూ హిందు దేశమునందలి ప్రజలలోగల పోరాటములను నూతగా గొనుచున్నారు. కమిషను నియామకమును గురించి ప్రకటించిన పిమ్మట హిందూదేశములో గలిగిన కలవరము ఆందోళన, బయల్వెడలిన సింహగర్జనలు ప్రతిజ్ఞా వాక్యములు తాత్కాలికములేగాని బ్రిటిషువారు భయపడవలసిన శాశ్వత చిహ్నములిందు గాన్పించుటలేదని బర్కెన్‌హెడ్ ప్రభువు ప్రభువుల సభలో ఘంటాపథముగ చాటియున్నాడు. మనదేశములోని మితవాదులు దేనికైనను లొంగిపోవుదురనే భయము మాకు కలదు. కాని బొంబాయిలో సర్. చిమన్‌లాల్ సెటెల్‌వాడ్ జిన్నాగార్లును, అలహాబాదులో సర్. తెజ్ బహదూర్ సప్రూగారును, బహిష్కరణ వాదనను చాటుచున్నపుడు, బహిష్కరణ కార్యక్రమము సాంతముగ కొనసాగితీరునని మా యాశయము. అసహాయోద్యమము పట్ల సవతితల్లి ప్రేమను జూపిన పండిత మాలవ్యా నేడవసరమగుచో పన్నుల నిరాకరణమునకుగూడ గడంగుదమని ప్రకటించినపుడు హిందుదేశమునకు సుదినములు వచ్చినవని తలంచవలెను. లేదా శాశ్వత బానిసత్వమును చాటుచు నవసానదశయందున్నవారి ప్రగల్భ వాక్యములుగనైనను పరిగణింపవలెను. గత సంచికయందు బహిష్కరణమును గురించియు దాని యావశ్యకతను గురించియు చర్చించియుంటిమి. ఈ సంగతి సందర్భముల నన్నిటి నాలోచించి బహిష్కార ప్రణాళికను కొనసాగించవలసిన బాధ్యత మద్రాసు కాంగ్రెసుపై నున్నది.

## స్వరాజ్యవిధానము.

ఇప్పుడు హిందూదేశ రాజ్యాంగ విధానమును నిర్ణయించుటకు సంస్కరణముల కమిషను యేర్పరచబడినది. భారతీయులు తమ స్వరాజ్య విధానమును నిర్ణయించుకొనవలెనని వారు కేవలము ఆడంబరపదములు అను హేళన రీతులో చాల కాలమునుండి వ్యాప్తియందున్నది. వెనుక మితవాదుల యాధ్వర్యములో కాంగ్రెసులీగ్ ప్రణాళికను తయారుచేసిరి. కాని దానివంక కన్నెత్తి చూచిన యాంగ్లేయుడు లేకపోయెను. నేడు స్వాతంత్ర్యాభిప్రాయములు పృథములు విపరీతముగ మారిపోయినవి. ఆరోజులలో బ్రిటిషు సామ్రాజ్యమునందే [illegible] యుండుటకు హిందుదేశము సమ్మతించినది. నేటికి హిందుదేశము బ్రిటిషువారి సంకుచిత దృష్టిని పురస్కరించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యమును నభిలషించుచున్నది. కాని యాదినములలో మనకు కోరియున్న సంస్కరణములు [illegible] బ్రిటిషు అధికారులు [illegible] నేడు మనము తయారుచేయవలసిన స్వరాజ్య విధానమును వారంగీకరింతురా యనునది సందియము పొడమక మానదు. మనము చేయు ప్రయత్నములు మన తృప్తికేగాని యితరుల యొప్పుదలకొరకు కాదని యెల్లరకును తెలిసిన విషయమే. మన మిపుడు స్వరాజ్య విధానము నొకదానిని తయారుచేసి మన దృష్టియందుంచుకొని తత్సంపాదనకై రాత్రింబవళ్ళు కృషిసలుప

వలసియున్నది. ఈ సందర్భములో అనిబిసెంటు గారి ఆధ్వర్యమున తయారుచేయబడిన (కామన్వెల్తు ఆఫ్ ఇండియా బిల్లు)ను గురించి చర్చించుట అసందర్భము కానేరదు. ఈ బిల్లు యొక్క పుస్తకమును గురించిగాని వ్యాప్తినిగురించిగాని ప్రస్తావించక యందలి ముఖ్యాంశములను చర్చించుటకు పూర్వమనేక నాయకులు యీ బిల్లును దీవించియుండిరని మాత్రము నుడువుచున్నాము. 1925 వ సంవత్సరం సెప్టెంబరులో లెజిస్లేటివు అస్సెంబ్లీలో నన్నిపక్షముల వారామోదించిన నేషనల్ డిమాండులోని ముఖ్యాంశము లిందు కన్పట్టుచున్నవి. సామ్రాజ్యమునందలి ఇతరదేశములతో ఇండియా సమానస్థితి యందుంచబడి వాటితోపాటు హక్కు బాధ్యతలను వహించవలెనను విషయము గమనింపదగినదే యగును. ననుదీనితో సంతృప్తిచెందుటయా లేక సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరుటయా యనునది బ్రిటిషు రాజకీయ వేత్తల వైఖరిపై నాధారపడి యుండును. వ్యక్తి స్వాతంత్ర్యము మనస్సాక్షి స్వాతంత్ర్యము మతస్వాతంత్ర్యము ప్రజల క్షేమమునకును నీతికిని భంగము కలుగనంతవరకు సమకూర్చబడవలెను. ముద్రణా స్వాతంత్ర్యము కూడ యవసరము. జాతి మత విభేదములు తొలగిపోవలెను. సివిల్ కార్యనిర్వాహక శాఖలు విడిపోవలెను. సైనిక ఖర్చును తగ్గించివేయవలెను. శాసన సభలలో నామోదింపబడు తీర్మానముల నధికార వర్గమువారు విధిగా శిరసావహించవలెను. శాసన సభలలో భారతీయు లధిక సంఖ్యాకులుగ నుండవలెను. లా అండు ఆర్డరు శాఖలు గవర్నరులకు సంపూర్ణముగ వదలివేసినను తక్కిన విషయములలో గవర్నరులకుగాని వైస్రాయికిగాని రద్దు చేయు నధికార ముండకూడదు. నియోజకవర్గములు పెంచినప్పుడు రాష్ట్రములలోగాని ఢిల్లీలోగాని రెండవ సభ (సెకండు ఛేంబరు) అవసరమై నెలకొల్పవలసి వచ్చినపుడు వాటియందుకూడ ప్రజాప్రతినిధు లధికసంఖ్యాకులుగ నుండవలెను. రాష్ట్రములన్నియు భాషా సాంప్రదాయముల ననుసరించి విడిపోవలెను. హిందూదేశపు రాజ్యాంగము పై నిర్ణయములకు లోబడియుండును. అంతవరకు స్వల్ప సంఖ్యాకులుగ నున్న మతములవారికిని ఆంగ్లో ఇండియనులకును క్రైస్తవులకును వారివారి క్షేమమునకు స్వాతంత్ర్యములపట్ల హిందూదేశము బాధ్యత వహించగలదు.

## అక్షర వ్యాసము.

చిర్రావూరు లక్ష్మీనరసింహమూర్తి గారు పంపిన యీ క్రింది సమస్యను ప్రకటించుచున్నాము. పాఠకులు సమస్యా పరిష్కారమును తెలుపుదురుగాక.

3 + 7 + 9 = ఒక నది.

1 + 2 + 3 = అస్త్రము.

9 + 2 + 3 = చిచ్చుపెట్టు.

8 + 4 = సంతోష పూర్వముగా నిచ్చు ధనము.

9 + 11 = సప్తసముద్రములలో నొకటి.

10 = భూమి

5 + 6 = పెంపుడు పిట్ట

12 + 13 + 14 + 15 = దైవసమానుడు.

3 + 1 = అంజలి.

12 + 3 = సర్పనామము.

ఈమహాపురుషు డెవ్వడు?

# కవితా చితి.

దువ్వూరి రామిరెడ్డిగారు

నాలుక తుప్పుపట్టె; నొకరాఁడయినం జెవి కింపు గొల్పు శా
వ్యాలపనం బొనర్ప తలపంకుర మెత్తదు; వ్రాయఁబూనినం
జేలికి కాలిగజ్జెపుగతిన్ మరపించెడు భావమివ్వడ
చ్చె! లివనచ్చి ముందడుగు పెట్టదు చాకలిమొల్లి బేపి నాన్॥ 1

రమణీయంబగు నాట్యరంగము నటీరాజ్యంబుగా మారె నా
దము నానందముఁ గూర్పఁ, బందిరి హారాద్ధగంబుగాఁ జూచి ని
ష్క్రమణద్వారముఁ గాంచలేక పొగలో గగ్గోలుగాఁ బర్వు పి
చ్చిమనుష్యుల్ గతి భావముల్ దిరుగు నాచిత్తంబునన్ మొత్తమై॥ 2

ఇదివఱకెన్నఁడైన నుదయించిన యంతనె భావపంక్తులన్
బదుఁడసి వంపుచుంటిని బరింపఁ బునాతను; నిప్పుడన్న నా
చిదగోద కాఱుచీకటులఁ జీకగు నాత్రియ లుబ్ధభావముల్
మెదలవు నీరుబెండలఁ; దమిన్ ప్రేమ స్వర్గము భుక్తిసారతన్॥ 3

కలమును కాగితంబు లేని కాపడె! గుడ్డయి రామిరెడ్డి! నీ
పలుకులు వీనులార విని వత్సరముల్ సనె; నంత చెల్లె! చి
త్తులుక విధాన దాగికొని యేమొనరించెదవోయి యంచు నన్
బలుమఱు హెచ్చరించు హితవాక్యుల కేమని విన్నవించెదన్॥ 4

కలకల ముగ్ధమంజుల వికస్వర సుస్వర గీతికాగతిన్
దొలఁకు కవిత్వనిర్ఝరము నూత్నపథంబులఁ దొర్కఁగాని, శీ
తల హిమరాశి పేర్చి జలధారలు నిర్గతిమాని గడ్డలై
యలమట వేచియుండుఁ దరుణార్క కరాంకుర హాసరోచికిన్॥ 5

కమనీయంబగు వింతవస్తువులతోఁ గాంతిల్లు నాగేహరా
జముమధ్యన్ వెలుఁగొందు దివ్యగను వై నర్వంబు పెంజీకటిన్
సమసెన్; నేనిఁకఁ గొన్నినాళ్లతిథిపూజాసేవకుం జాలనం
చు మదిం దోఁచెడి; దీపమెవ్వడచటన్ శోభిల్లునో క్రిమ్మఱన్॥ 6

పలుకగు కెంపుకాల పరిపాటి నగందగు నానవంబు నం
చులు పొరలంగ నిఃపి నరసుల్ చవిచూడగఁ బానశాలలో

నిలువుదుఁ గాచపాత్రికల; నేఁడరయ! యన్నియు బొమ్మవారివిం
దులఁ బరిపూర్ణమై రుచికిదూరము నై వెతగూర్పఁ జేరికన్॥ 7

కనఁగ మనోహరంబులగు కల్యకు సంధ్యకు మధ్య బొల్చు మో
హన భువనంబు నాదుహృదయార్తి మలీమస వర్ణవర్ణికన్
బెనమటు పూసిపూసి కడు వెక్కసపుం బొనరింపఁగోర; నన్
బెనఁగొని పిప్పిసేయు పరివేదనతోఁ బనియే మొకళ్ళకున్॥ 8

శిరము నిశీథితారకల శీతలకాంతి సుఖంబుఁగోరి యం
బర చరవాసనన్ మరలఁ బైకెగనిక్కునుగాని పాదముల్
మరగొని కర్దమప్రదనిమగ్నములౌట వృథాప్రయత్న ము
మ్మరతఁ గలంచుదున్ మకరసంభృతమత్రకలంబకంబునాన్॥ 9

గడచెను మూఁడువర్షములు కాంతవియోగము సంభవించి; యూ
పిడుగు కడింది తాఁకులకు బీటలు ప్రియ్యఁగఁ వాటినట్టి నా
యెడదను బూర్వరూపమున నేరిచి కూరుచు మంత్రికత్తె యె
వ్వాడు పాడకట్టునో యమృతపూర్ణ కళోజ్జ్వల పాత్రహస్తయై॥ 10

రూపములేని సంస్మృతికి రూఢిగ నల్లుకొనంగలేక దా
దాపుగఁ బ్రేమవల్లి కృశతంగని దగ్గఱనున్న కొమ్మనే
ప్రాపుగఁ జేసికొందలఁచి ప్రాకెడినోర! గతానుభూతముల్
తీపులెయయ్యు మానవహృదిన్ సతతంబును బందిసేయునే?॥ 11

భావము వాజినంతనె ప్రపంచము మాఱును; బూర్వమట్లు సం
ధ్యావివిధాభ్రవర్ణముల తట్టుకుఁ బోవదు బుద్ధి; కోకిలా
రావము లింపునింపవు; నిరర్థకదాస్యములయ్యె యామినీ
సేవలు; రమ్యమౌ ప్రకృతి ఛీ యనిపించు విరక్తి పెంపునన్॥ 12

తే॥ గీ॥ ఇట్టి మంటల నింకెట్టు లించుకైన
నపురు వెన్నెల కవితమునంగ నేర్చు?
నదియుఁ గాలావధింగాంచి యుఱిగనేని
దాని చితిపైన నిర్మింతుఁ దాజమహాలు ॥ 13

# వ్యాసమహాఋషి

వి. ఎన్. శర్మగారు బి. ఏ., బి. టి.

## 1

### ఆర్య జాతి.

భారతీయు లందరిచేతను సనాతనముగ పూజింపబడు చున్న వ్యాసమహర్షి చరిత్రము అత్యద్భుతమైనది. ఆయన పలు జన్మములలో లోక కల్యాణార్థమై సుసంపీతముగ అలంకరించి చేసిన సేవారాధనము అపారము. మానవ చరిత్రమున పలుయుగములలో కలుగుచుండిన పరిణామమును పరిశీలనదృష్టితో తిలకించినయెడల వ్యాసమహర్షి ఏయేరీతిని తన సర్వస్వమును లోకులకు ధారపోయుచు సమర్పించి కృతార్థుడైనదియు చక్కగా తెలిసికొనవచ్చును.

ఆర్యజాతి మధ్యాసియా ప్రాంతములలో నివసిల్లుచు ఆర్యసభ్యతను లోకమునంతటను వ్యాపింపజేయుటకు నిరంతరము ప్రయత్నముల సలుపుచుండెను. ప్రథమ శాఖ భారతభూమిని ప్రవేశించి క్రమేణ అచ్చటి స్వదేశీయులను జయించి ఆర్య సంఘములను అన్ని ప్రాంతములలో నెలకొల్పుచుండెను. తరువాత కొంతకాలమునకు ఆర్యుల జన్మస్థానమునుండి రెండవశాఖ బయలుదేరి నేడు మనము పేర్కొనుచున్న మెసపొటోమియా, అరేబియా ప్రాంతములను దాటి, ఈజిప్టు దేశమునందు ప్రవేశించినది. అప్పటికి ప్రపంచమున నాకాలమున ప్రఖ్యాతిగాంచిన అట్లాంటిస్ ఖండము సముద్రముపాలై యుండెను. ప్రళయమునుండి తప్పించుకొని బయటపడిన ప్రజాకోటి నేడు మనము పిలుచుచున్న మిడిటరేనియను సముద్రపు ఉత్తర దక్షిణ తీరములలో నివాసము లేర్పరచుకొని జీవితమును గడపుకొనుచుండిరి. ఆర్యసభ్యతను ఆచారము చేయుటకు వచ్చిన మన సోదరులు ఈజాతులతో కలసిమెలసి నివసించుచు వారిలో తమ నాగరికతా లక్షణములను ప్రచారముచేసి ఈజిప్టుదేశము నంతటను ఆర్యసభ్యతను నెలకొల్పిరి. అంతటితో నూరకొనలేదు. సముద్రతీర ప్రాంతముల కాలినడకను ఆఫ్రికాఖండమునందలి దక్షిణప్రాంతమువరకు వెడలి అచ్చటను తమ జయపతాకమునుపాతి కీర్తిగాంచిరి. ఆర్యుల యీ విజయయాత్రనుగురించియు దానివలన ఆఫ్రికాఖండమున అందు ముఖ్యముగా ఈజిప్టు దేశమునను ఆర్యసభ్యత యేయేరీతి విస్తరిల్లి ఆప్రాంతముల వారికందరికిని ఏయేరీతిని జ్ఞానతేజమును ప్రసాదించినదియు ప్రత్యేక వ్యాసములలో ముందు ముందు చర్చించగలను.

ఆర్యజాతి అంతటితో తృప్తిపడలేదు. మూడవశాఖను పర్షియా ప్రాంతమునకు ఆర్యధర్మనౌకను నడపుటకు పంపెను. ఈసోదరులు సైతము తమ పూర్వులవలె తమ సేవారాధనమునందు నిరంతరముపట్టుపట్టి అచ్చటి అనార్య జాతులను సెమిటిక తెగలను జయించి, చారిత్రప్రసిద్ధమగు పారసీక నాగరికలక్ష్మిని అత్యంత వైభవముతో సంస్థాపించి తమ జాతిపేరును నిలుపుకొని కీర్తిగాంచిరి. నాలుగవశాఖ కాకసీ యను పర్వతములమీదుగా దక్షిణ ప్రాంతమునకు బయలుదేరి వచ్చి నేడు మనము పేర్కొనుచున్న జార్జియా రాష్ట్రమున కొంతకాలము నివసించి అచ్చటి రాష్ట్రీయులలో ఆర్యసభ్యతను పెంపొందించి పిమ్మట పడమటిదిక్కుగా ప్రయాణముచేసి గ్రీసుదేశమునకు వచ్చి అచ్చట ప్రబలతరమగు లాటిను సభ్యతను సంస్థాపించి యూరోపుఖండము నంతటిని ఆ మహాసభ్యతచే పావనముచేసెను.

వ్యాస భగవానుడు ఆర్యజాతి సంకల్పించుకొనిన యీ విజయయాత్రలలో పాల్గొని నూతన జాతీయులకు ఆర్యధర్మములను బోధించుటకు యెన్నియోసార్లు అవతరించెనని మన గ్రంథములన్నియు నుడువుచున్నవి. వేదవ్యాసులను పేర హిందూ సంఘమున జనించి హిందూధర్మ తత్త్వము నిరంతరము విలసిల్లుటకు సూర్యుని చిహ్నముగా గైకొని కావలసిన పునాదులన్నియు వేసియుండిరి. పాశ్చాత్య ఖండములలో తెహుతి అను సుప్రసిద్ధ నామమున జనించి తేజయ్యను చిహ్నముగా గైకొని ఈజిప్టు ధర్మచక్రమును చక్కగా నడపుటకు మూలకర్తలైరి. పారసీక దేశమున జరాతుష్ట్రప్రవక్తగ జనించి అగ్నిని తమ ధర్మ సంకేతచిహ్నముగా నవలంభించెను.

గ్రీసు దేశమున ఆర్ఫియను మహాసీయునిగ జనించి తమ గానామృతముద్వారా పాశ్చాత్యఖండము నంతకును తమ దివ్యసందేశమును చాటిరి.

### వేదములు.

అన్ని ప్రాంతములలోను వీరు చాటిన ధర్మపథమంతయు నొకటే. ఇదియే వారిపూర్వులుసైతము అన్నికల్పములలోను ప్రకటించియుండిరి. ఇదియే మనము అత్యంత భక్తిశ్రద్ధలతో పూజించుచున్న వేదము. వేదము నిత్యము. దానికి ఆద్యంతములు లేవు. కాలచక్రము తిరుగుచు లోక

రంగమున నెట్టి మార్పులు గలుగుచున్నను, ఈ సనాతన ధర్మమునకు నాశములేదు, ప్రపంచవాసులకు గావలసిన జ్ఞానామృతమంతయు నీయార్యధర్మమున గలదు ప్రజలు అజ్ఞానాంధకారమువలన నీదివ్యామృతమును గ్రోలుట కశక్తులై లోకయాత్రను గడపుచుందురు మన మశక్తుల మయినను అజ్ఞానాంధకారమున మునిగి తేలుచున్నను లోక ధర్మము నడచి తీరవలయును. దానికొరకు గాను లోకో ద్ధారకులు ఆయా యుగములలో జనించుచు నీ అమృత పరమునుండి కొంత దివ్యమధువును తీసి ప్రజాకోటికిచ్చుచు లోకమును పావనము చేయుచుందురు. ఒక జగద్గురువు వచ్చి సనాతన ధర్మమును పునరుద్ధారణచేసి బోధించిన తదనంతరము ఇంతకంటె గొప్పకార్యమునకు బోవునపుడు తమ ఆచార్యస్థానమును తమ తరువాతవచ్చు ఆచార్యున కిచ్చి పోవుచుందుమని దివ్యజ్ఞాన గ్రంథము లన్నియు నుడువుచున్నవి. అంతయేకాదు ఈశ్వరసృష్టిలో ఒక్కొక కల్పము తన నిర్ణితకార్యమును నెరవేర్చిన తదనంతరము ఆకల్పాధిపతియగు మహాదేవుడు ఈ వేదధర్మము ప్రపంచ సృష్టికర్తయగు బ్రహ్మావశము చేయుననియు, మరల బ్రహ్మ దానిని నూతనకల్పమును సృష్టించినతదనంతరము ఆకల్పాధి దేవతాయత్తము జేయుననియు మన పురాణములన్నియు ప్రస్తావించుచు వేదధర్మతత్వ మీరీతిని కొద్దికొద్దిగ ఆయా కల్పములలోని మన్వంతరములలో నివసించుచు జీవకోటికి ప్రసాదింపబడుచున్నదనియు చాటుచున్నవి.

## వేదవ్యాసుడు.

ఈధర్మ కైంకర్యమును నెరవేర్చుటకు గాను మనలో నవతరించిన వ్యాసుని వేదవ్యాసులని మనము పేర్కొనుచున్నాము. వ్యాసమనగా విభజించుట. ఆయాకాలముల వారి కనుగుణ్యముగా వేదమును విభజించి లోకులకు ప్రసాదించుచున్నందుననే వీరిని మనము వేదవ్యాసులని పిలుచుచు పూజించుచున్నాము.

మనమున్న యీజాతి యీ కల్పమున అయిదవది. ఈజాతి తన ధర్మతత్వమును ఆయాప్రాంతముల ప్రజలకు గరపి తగినవారిని ఆర్యులుగ చేసి యుద్ధరించుటకు గాను ఏయేరీతిని యింతకుముందు నాలుగుయుపశాఖలను తనలో నుండి వేరి నానాదేశములకు బంపినదియు ప్రారంభమున నుడివియుంటినిగదా! మనజాతి మతము "వేదాంతము." ఇదియే యీకల్పపు ప్రపంచమతము. ఈవేదాంతసాగరము నుండియే వేదవ్యాసుడు జ్ఞానోదయమును దీసి యిచ్చి మానవకోటిని తన్మయత్వము చేయుటకు నాలుగు శాఖల లోను ఆయా కాలములలో నవతరించెననియు నేను మొదటనే ప్రస్తావించియుంటిని.

## 2

## ప్రాచీనార్యసభ్యత.

ఈఆర్యజాతి నాలుగుశాఖలలో జ్యేష్ఠస్థానము వహించి నది భారతజాతి. భారతజాతియే ఈఆర్యధర్మమును నానా దేశములవారికిని చాటి ప్రపంచశాంతికి అన్నిరీతుల దోడ్పడుటకు యెంతయో బాధ్యతను వహించియున్నది, అందు వలననే భారతజాతి పూర్వకాలమువలె నేమను లోకా చార్య స్థానమును వహించి చిరంజీవియై వర్ధిల్లుచున్నది.

వ్యాసులవారే మహాభారత కర్తలని యెన్నియో గాథలు మనదేశమున గలవు. నేడు ప్రచారములోనున్న మహా భారతము ఒక్కనాడు వ్రాయబడక ఆదిగ్రంథము కొద్ది దయినను పలుకర్తలు దానిని పెంచి తమ గురుదేవులపట్ల తమకుగల పూజ్యభావమున తమ నామముల నందుచేర్చక వ్యాసులవారికే కృతికర్తృగౌరవము నిచ్చి యెంతయో పెద్ద సంపుటముగ చేసియున్నారు. దీనిని నేటికాలపు ఇతిహాసకులందరును నొప్పుకొనుటకు యెన్నియో ప్రబల ప్రమాణము లున్నవని అందరికిని తెలియునుగదా! ఈపద్ధతి ననుసరించియే మన పురాణములన్నియు పెంచి పెద్దపెద్ద గ్రంథములుగ జేయబడిన సంగతియు నేడు అందరును నొప్పుకొనుచున్నారుగదా!

ఈమహనీయునిగురించి పురాణములలో నగ్రస్థానమును వహించిన విష్ణుపురాణమున నేరీతిని ప్రస్తాపించబడినదో చూచెదము!

"ఇరువదియెనిమిదవ ద్వాపరయుగమున నాకుమారుడగు వ్యాసుడు వేదమునందలి నాలుగువర్గములను నాలుగు భాగములుగ విభజించెను. వేదవ్యాసు డేరీతిని యేవిధముగ వేదములను విభజించెనో ఆదేరీతిని నేనును అతనికి పూర్వమువచ్చిన వ్యాసులును వేదమును భాగించియుంటిమి. ఆయన విభజించిన భాగముల సారమంతయు నొక్కటే అవి నాలుగు యుగములవారి యుపయోగమునకు నాలుగు భాగములుగ పంచిపెట్టబడినవి."

ఈవాక్యములనుబట్టి చూచినయెడల వ్యాసుడు అను నామము సనాతన ధర్మమును ప్రవచించుటకు అవతరించు జగద్గురువుల కీయబడిన పర్యాయపదమని మనము తెలిసికొనవచ్చును.

## మహాభారతము.

ఇక మహాభారతమున వీరినిగురించి యేరీతినిప్రస్తావించబడియున్నదో కొంతవరకు పరిశీలించెదము. ఆదిపర్వమున వ్యాసులవారేరీతిని భారతరచనకు పూనుకొనెనో, సూచించుచు యీరీతిని వ్రాయబడియున్నది.

“వ్యాసుడు భారతమును ఉపాఖ్యానములను మినహాయించి ప్రప్రథమమున 24 వేల శ్లోకములలో రచించెను. దీనినే పండితులు భారతమని పేర్కొందురు. పిదనంతరము సమస్తపర్వములుగల యీగ్రంథమునకు యుపోద్ఘాతముగ నూటయేబది శ్లోకములతో నొక అధ్యాయమును రచియించెను. వ్యాసుడు దీనిని మొదట తన పుత్రుడగు శుకునికే చదివించెను. పిదప అనురూపులైన శిష్యులకితరులకు నాసమర్థుడు దీనిని జెప్పెను. అతడరువదిలక్షల శ్లోకములుగల మరియొక సంహితగాను దీనిని రచించెను. అందు ముప్పదిలక్షలు దేవలోకమందు నెలకొన్నవి. పదియేనులక్షల గ్రంథము పితృలోకమందును, పదునాలుగులక్షలుగల గ్రంథము గంధర్వలోకమునందును ప్రచారములో నున్నవి. ఒక లక్షశ్లోకములుగల గ్రంథముమాత్రము మానవలోకమునందు వ్యాప్తిలోనున్నది.”

వ్యాసులవారు ఆర్యుల సాంప్రదాయమునకు వేదముల నెప్పుడు విభజించిరి. ఎచ్చట నివసించియుండిరి? ఆకాలమున ఆయన జీవితమును గురించి మనకేమి తెలియును? అను ప్రశ్నలు పాఠకులకు స్ఫురించకమానవు. ఇందులను గురించి కొంతవరకు యిచ్చట తెలిసికొందము,

ఆర్యులు మొట్టమొదట గోబి సముద్రతీరమునందున్న ప్రాంతమున నివసించుచుండిరి తరువాత అనేక వేల సంవత్సరములకు వారు భారతదేశమునకు వచ్చిరి వారు మన దేశమున ప్రవేశించునప్పటికి వారు నాగరికతలో అత్యున్నత స్థానమును వహించి ప్రపంచమంతటను యెంతయు కీర్తిగాంచియుండిరి. నేటి భూగోళ ప్రదేశములకును అప్పటివానికిని యెంతయో తారతమ్యము గలదు. నేడు మనము పేర్కొనుచున్న గోబీ యెడారి ఆకాలమున మహాసముద్రప్రదేశము. సముద్రతీరమంతటను సుప్రసిద్ధములగు నగరరాజము లనేకములు విలసిల్లుచుండెను. నగర పార్శ్వములలో సస్యశ్యామలములగు ఆరామక్షేత్రములు విరాజిల్లుచు కన్నులపండువుగ నుండెను. అచ్చట నివసించు ప్రజా సముదాయముయొక్క అనందమును వర్ణింప తరముగాదు. అంతయు భూతలస్వర్గమనిన అందలి పరిస్థితులు పాఠకులకు చక్కగా సూహ్యములు గాగలవు. ఈ మహాసామ్రాజ్యమున క్రీ॥ పూ॥ 60,000 ల నాటికే ఆర్యజాతి సుప్రసిద్ధ నాగరికతా లక్షణములతో ప్రకాశించుచుండెను. ఈజాతికి వైవస్వతమనువుల వారు. క్రీ॥ పూ॥ సుమారు 78,000 సంవత్సరముల క్రితము అట్లాంటిసు మహాఖండమున గొప్ప జలప్రళయము సంభవించి ఆఖండరాజము నిర్మూలమగుచుండగా అట్లాంటిసు జాతిలో భవిష్యత్ నాగరికతకు సహకారులుగ నుండదగిన తమజాతికి తగిన వారలని వైవస్వత మనువులవారు. ఎంచినవారిని రక్షించి, ఉత్తరసముద్రతీరమునకు తీసికొనివచ్చి కొంతకాలము కాపాడిరి తదనంతరము వారిని గోబీ సముద్రతీర ప్రాంతమున నున్న గొప్ప దేశమునకు దెచ్చిరి. ఇచ్చట తగిన వసతులను నిర్మించి ఆర్యజాతికి అభ్యుదయమునకు మనువులవారెంతయో ప్రయత్నించుచుండిరి. ఇంతలో ప్రపంచక్లిష్ట పరిస్థితులేర్పడి ప్రళయము సంభవించెను. ప్రళయబాధలనుండి మానవకోటి తేరుకొనెను. అప్పుడు మననాయకుడు ఆర్యులకు నివాసమునకు కాలము గడపుచున్న మన సోదరులను గోబీతటాకపు దక్షిణతీరమునకు దెచ్చిరి. ఈతటాకము, అతి పుణ్యప్రదమైనది. దీని కుత్తరతీరమున మన ప్రాచీన గ్రంథములందు పేర్కొనబడిన శ్వేతద్వీపము విరాజిల్లుచుండెను. లోక పాలకుల కీమహాక్షేత్రమే ఆశ్రమస్థానము, ఇచ్చటనే నేటికిని మన ధర్మపరిపాలకులు నివసించుచు, లోకకల్యాణమునకు నిరంతరము సేవజేయుచు, సకలలోకజనులను ధన్యాత్ములుగ జేయుచున్నారు ఇట్టి పవిత్రతరమగు ఆశ్రమ సమీపముననే మనువులవారు తమ నూతన నాగరికతను నిర్మించుటకు పూనుకొనిరి. అది ప్రారంభమున గోబీసరోవరతీర ప్రాంతములలో విలసిల్లుచుండినను క్రమేణ ప్రజల సంఖ్య వృద్ధియగుచు నివాసార్థమై యితర ప్రదేశముల నాక్రమించుకొనుచు తమ నాగరికతా లక్షణములనైత మచ్చట వ్యాపింపజేయుచుండిరి. ఇట్టి ప్రదేశములలో ప్రత్యేకముగా పేర్కొనదగినవి చీనా, బర్మా, మలయ, ఆస్ట్రేలియా ప్రాంతములు. ఈదేశములు నేడు అన్యజాతులచే నిండియున్నను, అచ్చట ఆదిమజాతులయాచారవ్యవహారములను కొంత దూరదృష్టితో పరిశీలించినయెడల వానిలో ఆర్య నాగరికతా లక్షణముల నతి సులభముగా కనుగొనవచ్చును.

## హారధినగరము.

ఇక ఆర్య మహారాజ్యమునకు శిరోభూషణమైన రాజనగరమును గురించి కొంతవరకు కనుగొందము. ఆనగరము

ఆజాతి సభ్యతకు తగినట్టి మహాపురము. మనుపుత్రులు, ప్రప్రథమమున నివాస మేర్పరచుకొనిన భూప్రాంతమున నీపురవరమును నిర్మించిరి. శ్వేతద్వీపమునే పట్టణము నుండి చూడవచ్చును. ఇచ్చటినుండి తటాకముమీదుగా ఆద్వీపమునకు వెళ్ళుటకు గాను గొప్పవంతెన కట్టబడియుండెను. పట్టణముపేరు మనోవర యని మను ప్రభువుయొక్క గౌరవార్థముగా పెట్టబడినను, అవ[illegible]తైన పునీతనమునకు అందరును మెచ్చుకొనుచు వారధినగరమనియే పిలుచుచుండిరి. నగరమునంతను నిర్మించుటకు అనేక వేల సంవత్సరములు పట్టెనని తెలియుచున్నది. ఇందునుబట్టి పాఠకులు నగర వైచిత్ర్యమును చక్కగా నూహించుకొనవచ్చును. నగరమునుండి శ్వేతద్వీపమునకు రాకపోకల సౌకర్యములకుగాను చక్కని బాటలు నిర్మింపబడెను. సముద్రతీరమునందే చిన్నచిన్న కొండల శ్రేణులు గలవు. అచ్చటి నుండి నగరమునకు పోవు రస్తా ఏటవాలున క్రిందకు వచ్చును. అచ్చటనుండి 20 మైళ్ళు నడచినయెడల మరల కొండల పంక్తులు గాంచవచ్చును. రాజబాట లన్నియు విశాలము లగును. శ్వేతద్వీపమునందలి దేవాలయ శిఖరముల నీవీధులనుండి చక్కగా చూడవచ్చును. అంతవరకు పోనేల? అహోరాత్రములు నగరవాసుల జీవితమున నూతనోత్సాహము కలుగజేయునట్టివి యీదేవాలయములేయని చెప్పవచ్చును. ద్వీపముసైతము వున్నతప్రదేశమున గలదు. [illegible]భాగమున యెత్తయిన ప్రాంతము గలదు. దానిపై[illegible] గొప్ప దేవాలయములు. అన్నియు స్ఫటికనిర్మితములు. బంగారుగోపురములు. మధ్యప్రదేశమున వీనికన్నను చాల గొప్పదగు దేవాలయము గలదు. దీని శిల్పచాతుర్యము వర్ణనాతీతము. దేవాలయావరణమున లెక్కలేని గోపురములు, తోరణములు. మధ్యభాగమున పైత వొక గొప్ప గుండ్రనిగోపురముతో కట్టబడిన చక్కని మందిరము గలదు. ఇదియే ఆదేవాలయమునకు గర్భగుడి యని చెప్పవచ్చును. జాతీయ మహోత్సవములలో ముఖ్యమైన వానికి సనత్కుమారాదులు యీ మందిరమున కప్పుడప్పుడు ప్రత్యేకముగా విచ్చేయుట ఆచారముగనుండెడిది. దూరమునుండి యీదేవాలయములను చూచిన ఆగోపి సరోవర మధ్యమున గొప్ప గోపురమేదయిన కట్టబడియున్నదాయని చూపరులు భ్రమపడకమానరు. ఆర్యజాతి సాంప్రదాయములకు సంబంధించిన విషయము లన్నియు నీ దేవాలయముల వెలుపలి భాగమునందును, లోపలను చక్కగా చెక్కబడియుండెను. మధ్యనున్న ముఖ్యమగు దేవాలయమునుండి దాపుగల ఒక చిన్నిమందిరము ప్రత్యేకముగా నిర్మించబడియుండెను. ఇందు బోధనలు చేయబడుచున్నటుల కనబడును. ఆగది నిండుగ సృష్టి రహస్యమును తెలుపు సర్వవిషయములు సాధకులయుపయోగార్థమై నిపుణులగు శిల్పులచే చిత్రింపబడి యెంతయో కన్నుల పండువుగ నుండెను. ఆమర్మవిషయములు సాధకులకు చక్కగ నర్థమగుటకు కావలసిన సాధనోపాయములు సయితము అందు సూచింపబడియుండెను. వానిని చూచిన ప్రపంచమున వీనికన్నను నిశ్చయముగా నిచ్చటబోధింపబడిన రహస్యములు సూర్యబ్రహ్మాండములో లేవని చెప్పవచ్చును.

సహదేవ సూర్యప్రకాశరావుగారు.

# ప్రేమగానము.

జలదపటలంబు గ్రమ్మిన సమయమందె
  మింటఁ [illegible] గురియును మెఱుపుకన్నె
  చిమ్మచీఁకట్ల తెగటాఱ నాదిత్రసీమ
  విరిసినట్లైన నాకగుపించెదీవు
ఈమహాసృష్టిలోన నాకిష్టమేది
  గానిపించని నీజాడగానె తోచు
  కన్నుమూసితినేని నీకమ్రమూర్తి
  మొలకించును చిరునవ్వు మోముతోడ
ఎలమావితలిరాకుల మేసి కోయిల
  గొంతెత్తి ఎలపాట కొసరుచుండె!

తన చెలితోఁగూడి వనదేవ ద్రావుచు
  తేట పాటల మునిగి తేలుచుండె!
అలలతో నిసుక శయ్యల నాట్యమాడుచు
  గౌతమీనది గాన కళలఁ గురిసె!
పూలతో దాగుడుమూతల నాడుచు
  పవనుండు మెల్లగా పాడుచుండె॥
మనముగూడ మృదు ప్రేమ మయములైన
  హృదయములఁ గల్పుకొని గానముదితమైన
  ప్రకృతిముగ్ధులమై సుఖ స్వప్నములను
  గాంచుదము కేవలానంద గాన వశత॥

# శాస్త్రిగారి మాటలు

మునిమాణిక్యం నర్సింహారావుగారు, సాహితీసమితి.

తెల్లవారితే ప్రభవ నామ సంవత్సరం. ప్రకృతి అంతా చైత్ర వసంతుని ప్రణయచుంబనాలలో తేలియాడింది. సుఖ నిద్రనుండి మేలుకొన్నాను. ప్రక్కనున్న చెట్ల గుంపులో నుండి కోకిల కూ కూ యని మధుర కంఠంతో పాడింది.

ఇంతలో నా మిత్రుడు సూర్యారావు అక్కడికి వచ్చినాడు. ఇక్కడ నా మిత్రుని విషయమై ఒక మాట చెప్పవలెను. ఆయన పొట్టివాడు చక్కని శరీర ఛాయ. నేత్రములలో జీవకళ ఉట్టిపడుతూంటుంది. ఆ నేత్రములు అతని హృదయ నైర్మల్యమును, భావ గాంభీర్యమును బయలు పడుస్తవి. ఆయన బ్రహ్మసమాజ మతస్థుడు. ఆయనకు మా యింట్లో చనువు. అయనంటే మా కందరికి మిక్కిలి గౌరవము.

కాంతం వంట చేస్తున్నది. ఆవిడకు సహాయం చేయటానికి వచ్చిన మావాళ్ల బాలవింతంతువు సుబ్బమ్మ అక్కడే కూర్చుని సాహాయం చేస్తున్నది. నేను, సూర్యారావుగారు గడపకైన ఒక మూల కూర్చున్నాము. కృష్ణమూర్తిగారు ఆగడపపైనే మరో ప్రక్కన కూర్చున్నారు. ఈకృష్ణమూర్తిగారు ఎవరో నేను చెప్పనక్కరలేదు. వీరు పండితులు. ఆంగ్ల, ఆంధ్ర గీర్వాణ భాషలలో అసమాన పాండిత్యమును సంపాదించి, "ప్రాణేశ్వరి" యను మహా గ్రంధమును రచియించి, ఇందిరాదేవిని పెండ్లాడి, ఆంధ్రలోకమున ప్రఖ్యాతి గాంచిన వారు. వీరు అనేక మంది యువ[illegible] ప్రోత్సహించి, సారస్వతాభిరుచి కలిగించినారు. మా ప్రక్కనే నా ప్రియ స్నేహితుడు శాస్త్రి కూర్చున్నాడు. అతడు కవి పండితుడు. చక్కని కవిత్వము చెప్పుతాడు. ఆయనను శాస్త్రి అని పిలుస్తాము. ఆయన మా యింటియందు చనువు కొంచెము తక్కువ. మేము ముగ్గురమును కూర్చున్నాము. ఏదో మాట్లాడుతున్నాము.

వంట కావటంతోనే మమ్ములను మడికట్టుకొమ్మని కాంతం కోరింది.

"కాంతమ్మగారూ, నేను ఎల్లప్పుడు మడితోనుంటానండి. నా మనోవృత్తులు కూడ ఎప్పుడు మడికట్టుకొనే ప్రవర్తిస్తవి" అన్నారు కృష్ణమూర్తిగారు.

"మరచిపోయినా, మీరుకూడ బ్రహ్మసమాజం చేస్తున్నారుగా యిప్పుడు, ఇందిరను పెండ్లాడిన దగ్గరనుండి. ఇందిరను పెండ్లాడటం ఇష్టమే కాని అదేమిటంటే శాస్త్రమడి, శుభ్రము ఉండవద్దూ"

"నేనిక్కడ ఉండంగానే మీరు అల్లామాట్లాడటం? మడి అంటే ఏమిటండీ! ఈబట్టలు మలినంగా ఉంటే మీరు నన్ను యేమన్నా అనవచ్చు. మీ మామయ్య కట్టుకొనే మురికికారుతున్న తగలేసినా తగలబడని నార పొత్తువంచె కట్టుకుంటే మడా లేకపోతే మైల" అన్నారు సూర్యారావుగారు

"మీకు నేను జవాబు చెప్పలేనులెండి అన్నగారు. లేవండి భోజనం చేద్దాము" అన్నది కాంతం.

ముగ్గురం విస్తళ్ళముందు కూర్చున్నాము. అన్నము కలుపుకొనబోతున్న సమయంలో "ఉండండి ఉండండి వేపపూత పచ్చడి చేసి సిద్ధంగా ఉంచాను. కొంచంతినండి" అన్నది కాంతం.

"ఏమండీ సూర్యారావుగారూ వేపపూత పచ్చడిలోగల సిద్ధాంతమేమిటండీ". అన్నాను నేను. "సిద్ధాంతం లేదు, రాద్ధాంతం లేదు. కొంచెం

నోట్లో వేసుకోండి. ఇంతలోకే ఏమీతప్పులేదు."

"వేపపూత పచ్చడి తింటేనేగాని మతం నిలబడదనే అభిప్రాయం మీరు ఇంకా మార్చుకోలేదండి." అన్నారు రావుగారు.

"ఆగండి, ఆగండి. ఇందులో ఒక గొప్ప అర్థమున్నది. జీవిత తత్వమంతా ఆచారంలో గుప్తమై ఉంది. మానవుడా! తీపి తినిననోటనె, చేదు తినుము! ఈ రెండును నీజీవితంలో ఉంటవి సుమా అని జ్ఞాపకం ఉంచుకో అని చెపుతుంది యీఆచారం. ఇట్లా పెట్టండి."

అని శాస్త్రి పెట్టించుకొని తిన్నాడు. కృష్ణమూర్తిగారు సూర్యరావుగారు పుచ్చుకోక, కోపంతో భోజనం ఆరంభించారు. నేను ఒక మాటు సూర్యరావుగారివేపు మరొకసారి కాంతంవేపు చూచి, సూర్యారావుగారు చూడకుండా ఎడమచెయ్యి కాంతంవేపు చాపి కుడిచేత్తో అన్నం కలిపాను.

"ఈరోజు ప్రకృతి అంతా ఆనందమయంగా ఉంటుందిగదండి, చేలు ఫలింప ధాన్యమంతయు ఇంటికి తెచ్చుకొని కర్షకుడు మహానందమొందు దినముగదా ఇది. పక్షులన్నియు కావలసినంత తిని హాయిగా పాటలు పాడు సమయము గాబోలు. ప్రతి ఇంటను మధుర పదార్థములను భుజించుచు అనుభూత దుఃఖములను ఒక్కమారు మరచి భావిసౌఖ్యమునే తలంచి, నూతన వస్త్రధారణ మొనర్చి ఆనందించు శుభ దినము గదా ఇది. మాచిన్న తల్లి పుట్టి ఈరోజుకు మూడు నెలలు. లోకమంతా సౌఖ్య సముద్రంలో మునిగియుంటుందనుకొంటూ" ఆహో జున అన్నది కాంతం.

"కాంతమ్మగారూ, మీరు అన్న మాటలు బహు మంచివి. ప్రపంచమంతా ఆనందమయము. పరమాత్ముడు ఆనందమయుడు. ఆనందమే పరమాత్మ ఆతడన దయానిధి. అనంతుడు పరమదయాళువు. ఓ దేవుడా! నాపాపములను క్షమింపు ఈసుదినమున, ఈశుభోదయమున."

"అన్నగారూ, ఇది ప్రార్థనామందిరము కాదు. కొంచెం పరమాన్నం వేయమంటారు?"

"ఇట్లా వేయండి. పరమాన్నంకూడ, పరమాత్మస్వరూపము" అన్నారు కృష్ణమూర్తిగారు.

"మీకు ఎంత ఆనందము. ఎంత తృప్తిని ఇస్తున్నది ఈరోజు. నాజీవితంలో సుఖం ఎరుగను. ప్రపంచమంతా ఆనందంలో ఉయ్యాలలూగు ఈసుదినము నాకు దుఃఖసంజనకము. ఎందుచేతనంటారా, నాకు అనుభూత సుఖము లేదు. సౌఖ్యాగమమునకై ఎదురుచూచుట లేదు. దుఃఖము నాహృదయంలో వేళ్ళు పాతుకొని పోయినవి. గడిచిన జీవనంలోను గడవనున్న జీవనంలోను దుఃఖమేకాని సుఖము కనుపించదు. ఈప్రపంచకములో భౌతికంగా నాకు సంబంధించిన బాంధవ్యాలనుకోండి, పరిచయాలనుకోండి అన్నీ సడలిపోయినవే. కాని నాకేదో పరితాపము. ఎవరికొరకో వీధులవెంట చూస్తుంటాను. ఇదివరకు అట్లా చూచి కళ్ళు కాయలు కాచిపోయినవి. ఈరోజునుండీ తిరిగి అదే మాదిరి విశాల ప్రపంచంవైపు చూస్తాను. నాదృక్కులు పోయి పోయి భౌతిక ప్రపంచమును దాటి తారాప్రపంచమును దాటి పోతుంటయి. దానికి అంతులేదు."

"శాస్త్రిగారూ మీరు భోజనం చెయ్యండి. కాంతం ఏ విధంగా కన్నీళ్ళు కారుస్తున్నదో చూడండి మీ విషాద చరిత్ర విని."

"ఆయ్యో విచారపడుతున్నారా అమ్మా! ఎందుకు విచారపడతారు. ఇది నాకు విచార సమయం కాని మీకు కాదు. నాదరికి నీవు నూతన సంవత్సరమున అడుగు పెట్టబోవు చున్నావు. అమ్మా, నీపుత్రికా రత్నముయొక్క పవిత్ర మందహాసములు నీ హృదయమునకు పై శాంతి నొసగును. ఎంత మంది ఇట్టి సుఖములు లేక విచారించు చున్నారు. నూతన త్వము తో పొంగి పోవు చున్న ఈ వసంతోదయమున హేమంతనిశీథినియందు వలె భయకంపిత హృదయములతో కాలప్రవాహ తటకమున కూర్చుండి శుభానందోత్సవ పులకితములై లోకమునకు నూతన సందేశమొసగు ఈగాదులవంకాదృష్టి మరల్పక భావి కష్ట మార్గమువంక చూచుచు ఊరక నిట్టూర్పులు విడుచు మానవు లెంతమంది లేరు? అట్టి వారికా నంద మిచ్చుటకు నీవేమైన జేసితివా? ఇదియే ఈరోజున నీవు చేయ నిశ్చయించుకొనవలసి నది" అన్నాడు శాస్త్రి.

"నేను చేయగలదేమున్నది. అదుగో మీ వలెనే నాకు 'ఎల్లకాల మహాభాగ్యమే' అని పిలపించిన ఆయన ఇందిరాదేవిని పెండ్లాడి సుఖముగ నున్నాడు. ఆయనే మీకు ఆదర్శము" అన్నది శాంతం.

"జీవితము దుఃఖభూయిష్టము కాదు. శాస్త్రి పరమేశ్వరుని ఉద్దేశము మానవుని సుఖపెట్టుటయే. ఆయన ఆనంద స్వరూపుడు. ఆనందో బ్రహ్మ" అని మొదలు పెట్టాడు సూర్యారావుగారు.

"అదుగో మళ్ళీ మీరు ప్రార్థన మొదలు పెట్టారు. అన్నగారూ, కృష్ణమూర్తిగారు, చూడండి, ఎంత చక్కగా మాట్లాడకుండా భోజనం చేస్తున్నారో" అన్నది శాంతం.

"నేను భోజనం చేస్తున్నా ఆలోచన వేరుగా వుంది. శాస్త్రి నీ మాటలు వింటే హృదయం కరిగిపోతుంది. నీ జీవిత విషయమై ఆలోచిస్తే గుండె పగిలిపోతుంది. మేము ఏమి చేయగలము శాస్త్రీ? నీ నంగతి విని వ్యాకులపడతాముగాని యేమి చేయగలము. అయినను ఒక్క మాట విను. ఈ ప్రపంచంలో ఐడియల్‌గా జీవించుటం కష్టం — తెగిపోయిన ప్రేమపాశాలను ఎక్కడివక్కడే ముడివేసుకొంటూ జీవితాన్ని సాగించాలి. ఆ బాధామాధవునికి హృదయం అంకితం చెయ్యి శాస్త్రీ" అన్నాడు కృష్ణమూర్తిగారు.

"కాంతం, యీరోజు సుదినము. చూచినారా ఎందరు లోకంలో కష్టాలలో మునిగి తేలుతున్నారో అందరు మనవలెనే సుఖించటం లేదు సుమా! భగవంతుడు మనకు ఆనందం యిచ్చినాడు. ఈ ఆనందామృతమును త్రావి మత్తిల్లకూడదు సుమా" అని నేనన్నాను.

మేము యింకా తింటున్నాము వాకిట్లో యెవరో ఒకరు తల్లీ ముద్దపెట్టు అని అరచినాడు. "పోరా. ఇప్పుడేమిటి యింకా భోజనాలు కాలేదు, ఎవరు వాడు" అన్నది. "వాడు మాలోళ్ళమ్మా" అన్నాడు. "ఛా ఛా పో. మడి అన్నా విడవలేదు. నీ కెట్లా పెడతాను" అన్నది.

"అదిగో ఏమండీ. ఇంతేను పంచములు మానవులు కారా? మీరు మడి కట్టుకొన్నారుగా. వాడు ఆకలితో చస్తుంటే మనం చూస్తూ ఊరుకొందాము. కష్టంలో ఉన్నవారికి ఏదైనా సాయం చెయ్యవలెనన్న నీతిపాఠం ఇప్పుడే కదా నేర్చుకొన్నారు. అతని పిలవండి వేళకు కొంచెం

స్థిరముగా నెందు నిల్వక తిరుగు నిన్ను
దేవి! భక్తి శృంఖలల బంధించినాను
బరమ మోద సుప్రతిల నావాహనంబుఁ
గూర్చినా నందు నిల్కడఁగొనుము తల్లి!

పాలమున్నీటిలో వటపత్రశాయి
పరిక్ష సంతత భర్తృ సేవాధురీణ
వైయొనఁగు నీకు నర్ఘ్య పాద్యములు నొసఁగు
దానఁ గైకొమ్ము సన్మాన ధనవిధాన!

రాజవదనా! విమల గౌతమీజలాక్షి
సేక మొనరింపు మిదె యాచమనీయ గొనుము
క్షీరసాగర గర్భసంభూతికమ! నీకు
జలముకన్న నేమిత్తు మజ్జన మొనర్ప?

నిరతధౌత పీతాంబర ధరుఁడనంగఁ
బరగు లోకపాలకునకు భార్యవీవు
నీకుఁ బరిధాన మేమని నిర్ణయింతు
దయను గొనుమమ్మ యిదిగో వస్త్రయుగ
ళమ్ము॥

అవని నాద్యంత రహితుఁడై పట్టి భర్త
నిత్య మంగళాలయవగు నీకు దొరకె
నీమృదుల కంఠసీమ దీనిని ధరి ౘ
శుభముఁ గూర్పఁగ మంగళసూత్రమిదిగో.

అఖిల భోగభాగ్యములకు నాకరమవు
రత్నసహజవు భాగ్యపరంపరలకు
మూలమవు నీవు, కాంచన భూషణములు
నీకు లెక్కయె నీదయ మాకుఁ గాక?

పద్మకేళీ నివాసంబు బయలు వెడలి
నట్టి సురభిళమూర్తివి యంబ! నీకుఁ
జందనములందు టాచార చర్యగాని
కమలనాభుని జాయకు గంధమేల?
పుష్పమందున నివసించు పుణ్యవతివి!
పుష్పబాణుండు నీప్రియ పుత్రుఁడెలమి?
గాన వివిధకోమల సుమ కలిత హస్త
యుగళి నీపాద కమలము లొత్తుమందు॥
జలజాతాలయ తే నమో విభవశశ్వత్సౌఖ్య
దా తేనమో
లలనాశోభన తే నమో నిఖిల కళ్యాణప్ర
దా తేనమః
కులనారీ జన మంగళ ప్రణయ భాగ్యైభాక
రీ తేనమో
విలసత్ క్షీరపయోధి సంజనిత దేవీ!
సంతతం తేనమః॥
భక్తి పరవశత్వమున నెవ్వారికైన
నభిమతార్థము లొనఁగూడునంట దేవి!
భక్తి నే నిడు నగరు సాంబ్రాణిధూప
మును గ్రహింపుము వరసితాంభోజ సద్మ!
సాగరమునకు లవణదర్పనము రీతి
నిఖిల దేదీప్యమాన కాంతిప్రదాంగి
వైన నీకు దీపము బెట్టినాను దేవి!
నీవు జ్యోతిర్గణంబు కన్పించుకొరకు.

పరమపావన క్షీరసాగర కిశోరి
వాది విష్ణువక్షః ప్రదేశామలమణి
వైన నీకు నాచమనంబు లేనొసంగి
శుచినిధానము నెటు పరిశుద్ధిచేతు?

# పద్మరహస్యము.

—♦ పదునేడవ ప్రకరణము ♦—

## నూతనయనుభవము.

కాళీచరణుని యత్నములలో జాగరూకత మెండుగాగలదు. రహస్యమును పెదవులపై నుంచుకొని ఉత్తరక్షణముననే శశిభూషణుని యొద్దకు పోవుట మంచిదికాదని కొంతకాలము భావనగరమందే వేచియుండెను. తనతల్లి రహస్యమును చెప్పకుండ కఠినత్వము వహించినది కుందతలంపునకు వచ్చినప్పుడెల్ల వేదన మరింత హెచ్చినది. చేయునదేమి? అదృష్టమువలన శశిభూషణుడు కలకత్తానగరమునకు రమ్మని జాబు వ్రాసినందున కాళీచరణుడు ప్రయాణమై వెడలెను. శశిభూషణుడు రైలుస్టేషనువద్ద కాళీచరణుని కలిసికొని కుశలప్రశ్నల నడిగి తన బసవద్దకు తీసికొనివెళ్లెను. శశిభూషణుడు నిజముగ వసంతవిలాసమునందే కాలము గడుపుచున్నను, సోదరుని రాకనెరిగినవాడై ప్రత్యేకబస నేర్పరచుకొనియుండెను. కాళీచరణుని మోటుతనమును గాంచి సుధీంద్రరాయలు, పద్మ, ఉమ మున్నగువారి పరిహాసములకు లోనుగాకుండు నిమిత్తము కొలదికాలమునకు ప్రత్యేక బస నేర్పరచుకొనెను. వసంతవిలాసమునకు దన సోదరుని గొనిపోవ సాహసింపలేదు.........

రెండు మూడు దినములు గడిచినవి. మాటలవరుసను శశిభూషణుడు తన సోదరుని రాకను గురించి ఉమాపద్మములతో ముచ్చటించుటయు, వారును శశిభూషణునిపైగల ప్రేమచే కాళీచరణుని విందుకు రప్పించుటయు సంభవించెను. కాళీచరణుని పల్లెటూరు వేషమునుగాంచి ఉమ "అత్తయ్యా, ఒకరెమ్మనే మామిడిపండును కోడిపండునంటుట కలదా?" యని పద్మతో ననెను. ఇందలి పరిహాసమును శశిభూషణుడు కనిపెట్టి తనలోతాను నవ్వుకొనెను.

కాళీచరణుడు స్వగుణాతిశయముచే గాకపోయినను, శశిభూషణు ననుసరించి, వసంతవిలాసములో సమస్త మర్యాదలను బడసెను. తాను పొందిన యాతిథ్యము నీవిధముగ వర్ణించుచు కుందకు జాబువ్రాసెను

"ప్రియమైన కుందకు,

వసంతవిలాసమును జూచినసిమ్మట నాకు మనగ్రామముపై రోత జనించినది. నేను వ్రాయుదానియందేమాత్ర మతిశయోక్తి లేదు. నిజముగ జమీందారుడై ఒకదినమును గడపినను చాలును. ఏమి భోగభాగ్యములు! ఏమిమర్యాదలు!! విందుచూచినచో నెన్నితపస్సులు చేసినను పొందనిది. నిజముగ నేనపేక్షించునదిదే. స్త్రీలలో నొకరత్నము గాంచితిని, ఆమెనిచట వర్ణించను. ఏలనన, నీకసూయజనించవచ్చును.

నీ ప్రియతముడు,
కాళీచరణుడు."

కాళీచరణుడు తన హృదయములోని భావముల నణచుకొనలేకపోయెను.

కాళీ:- సోదరా, వసంతవిలాస మత్యద్భుతముగనున్నది. ఇచట వారు నాకు చూపుచున్న గౌరవము సంస్తవనీయమే.

శశి:- వారు చాల మర్యాదస్థులు. మనము భయపడవలసినపనిలేదు. అతిథులను సత్కరించుటలో వారికి పెట్టినదిపేరు.

అని తనవనియందు తాను మగ్నుడై శశిభూషణుడు వెడలిపోయెను. పద్మావతి కాళీచరణునకు సకల సపర్యలను చేయించినది. ఆమెను చూచినతోడనే, కాళీచరణుని హృదయము చలించినది. అనన్యసామాన్యమైన సౌందర్యాతిశయము, దివ్యసుందర విగ్రహము, కోమల సుకుమార శరీరము, సంతయు దేవతవలె కాళీచరణునకు బొడగాంచినది. ఆమె సంగీతమును పాడుచున్నపుడు విని పొందిన తన్మయత్వమును వర్ణింపలేము. భావనగరము, సుముఖి, కుంద, సర్వ మొక్కత్రుటిలో మరపునకువచ్చినవి. ఇంతలో శాంత యామార్గమున నేగుచుండుటను గాంచి కాళీచరణుడు దిగ్భ్రమ చెందెను. ముఖము వివర్ణమయ్యెను.

"ఏమిటి తెల్లబోయిచూచుచున్నావు?" అని శశిభూషణుడు ప్రశ్నించెను."

"ఏమియును లేదు." అని కాళీచరణుడు ప్రత్యుత్తరమిచ్చెను.

శాంతను కాళీచరణుడు గుర్తించినాడు. చాల సంవత్సరములక్రింద తన తల్లితోమాట్లాడినస్త్రీ యామెయే యని తెలిసికొన్నాడు. తనను గాంచి తెల్లబోయిన శాంతయొక్క చూడ్కులను కాళీచరణుడు గమనించకపోలేదు. ఇక తన ప్రయత్నమును కొనసాగించుటకు సావకాశము చిక్కినది. తాను పరిశోధించుచున్న రహస్య మీయామెకు చెందినదే యని కాళీచరణునకు తెలియును. కాని అనన్య సామాన్యమైన స్త్రీ జమీందారులలో పెరుగుచున్న యాపె తనతల్లి వద్ద కేలరావలయును? ఆమెకును ఈమెకును గల పరస్పరసంబంధమేమి? అని యోచింప దొడంగెను. అది వెన్నెలరాత్రి. ఆకాశమున నక్షత్రములు మినుకుమినుకు మనుచున్నవి. ఎన్నడునులేని శాంతమీనాను [illegible] హించినది. "[illegible] యొక యాలోచనలేదు. [illegible] కొంతసేపటికి కాళీచరణుడు [illegible] కలకొరిగినాడు. [illegible] ధనధాన్యములతో [illegible] నిష్కళంకముగను [illegible] సంచరింపవచ్చును. [illegible] కుమారుడనుటకు [illegible] ! [illegible] చిననాలజని నిశ్చయ [illegible] స్వముగ [illegible] యామెకు [illegible] దానితో నాతనికి [illegible] డా మెకుమారుడే [illegible] మును కాపాడుకొనుటకు [illegible] వప్పగించి ధనసహాయము [illegible] చరణుని హృదయములో [illegible] ములై యున్నవి. "నాకిదే [illegible] ఈమార్గమునుండా పోయి [illegible] రించెదను. ఎట్లకేలకు [illegible] చిక్కినది!!" అని [illegible] నోలలాడుచుండెను. [illegible] నిద్రరాలేదు. శాంతకు [illegible] ద్రవ్యము సంపాదించుటయే [illegible]

శాంత భయవిహ్వలయైనది. "నేడేల నన్నావరించినది? నేను భయపడుటకు కాళీచరణునియందేమి గలదు. లేమ్ముల చూచుట కన్ను వచ్చుట సహజమేకదా! అయినను నాతనిముఖమునందట్టి మార్పులేల కలుగవలయును. అతని కన్నులు నా కన్నులపై ప్రసరించుటలో నేమిభావ మిమిడియున్నది." ఇదియే శాంతయొక్క యాలోచనము.

ఇంతలో రాము యచ్చోటికివచ్చి శాంతయొక్క ముఖమును జూచి యేమట్లుంటివని ప్రశ్నించెను. ఇంతలో పద్మకూడ నచటికి కేతెంచినది. “అక్కా యేమట్లుంటి” వని యడిగెను.

“ఏముంది యెప్పుడుండెడి బాధే. అయితే యక్కా యీ మహాపురుషు డెవ్వరు ?”

రాము నవ్వెను. ఆమెనవ్వుకు కారణము కాళీచరణుని మోటుతనమే. నవ్వు నాపుకొనలేక యొక్కడుండనో చివాట్లు తప్పవని రాము వెళ్ళిపోయినది.

“ఎవరివా శశిభూషణుని యన్నగారు” శాంతకు కొంత యూరడింపు కలిగినది.

“యెవరో క్రొత్తవానివలె నున్నందున నడిగితిని.”

“అన్నదమ్ముల కిరువురకు నేమాత్రము పోలికలేదు.”

“అన్నదమ్ము లొక్కరీతిగ నుండవలెనని నీమమున్నదా యేమి.”

“అందమునకు తెలివితేటలకు శశిభూషణుడును, కాళీచరణుడు సర్వము పూజ్యము” అని పద్మ నవ్వెను.

“ఔను. ఏకోదరమునను నొక్క తల్లిబిడ్డలమే అందమునకు తెలివితేటలకు నువ్వు, నేనో యున్న.”

“అక్కయ్యా, నీవు లేని నేనుకూడ నున్నే కదా. నీసహాయము లేనియెడల నాగతి యేమై యుండెడిది.”



## ——◆ పదునేనిమిదవ ప్రకరణము. ◆——

### సాలుకు వెయ్యిరూపాయలు.

కాళీచరణునియొక్క దౌష్ట్యమాతని ముఖమునందు మూర్తీభవించి యున్నది. నేత్రములు చింతనిప్పులను గ్రక్కుచు భీభత్సమును గొల్పుచున్నవి. నిలకడలేని యాతనిపెదవు లాతనియొక్క దౌర్బల్యమును సూచించుచున్నవి. మానవుని కుండవలసిన దుర్మార్గమంతయు నాతనియందు మూర్తీభవించి యున్నది. పేరాశ, జిత్తులమారితనము, అహంభావము, మోసము నమ్మకద్రోహము యివన్నియు నాతనియందు తాండవమాడుచున్నవి. తనరహస్య మెవరికిచెప్పిన లాభించును. “పొరపడితినా అంతయు వ్యర్థమగును, యిందుమూలమున నేనొకజమీందారు కావలెను. కొంచెము తెలివితేటలతో ప్రవర్తించినయెడల ఫలించగలదు” అని యనుకొనెను.

ఇటువంటి కార్యభారమును శిరసావహించుట యనిన తేలికగాదు. నేర్పరితనము, మాయోపాయము యీరెండు లేనియెడల కార్యము సాధించుట కష్టతరము. ఈరహస్యమునుభేదించి గొప్ప జమీందారుడై రామను వివాహమాడి తీరవలయును. హైసురాయి కౌన్సిలులో మెంబరై పేరుప్రతిష్టలు సంపాదించవలయును. అప్పుడుకాని తనకు తృప్తికలుగజాలదని కాళీచరణుడు భావించినాడు. ఇప్పుడు కుందను మరిచిపోయినాడు. తానీరహస్యమును కనుగొంటినని శాంతకు దెల్పినచో నామె యడుగులకు మడుగులొత్తునని యనుకొని కాళీచరణుడొక పరి చిరునవ్వు నవ్వుకొనినాడు.

తనకు గల స్వతంత్రమును దుర్వినియోగము చేసుకొనుచు కాళీచరణుడు శాంత గదిలోనికేగి యొంటరిగ నుండినందున సంభాషించుట కదియేతగిన సమయమని భావించి యీవిధముగ నుపక్రమించెను.

కాళీ :— మీతో నేనొక రహస్యము మాట్లా డదలచి వచ్చినాను.

శాం:- ఏమిటది ?

ఆమె నిర్లక్ష్యమునకు గాళీచరణుడు చిరు నవ్వు నవ్వెను.

కాళీ:- ఒకపుడు కాశీనగరములో సత్రమున మీరుంటిరి జ్ఞాపకమున్నదా !

శాంత మాట్లాడలేదు.

కాళీ:- శశిభూషణుడెవరో నాకు తెలుసును !

శాం:- ఎవరు ?

కాళీ:. మీకుమారుడే ! మీరహస్యములతో నాకు నిమిత్తము లేదు. మీకు వివాహమై నను కాకున్నను నాకు సంబంధములేదు. కాని శశిభూషణుని మాఅమ్మ పెంపకము నందుంచుటలో నేదియో రహస్యమున్నది. ఈరహస్యమును కాపాడు దలచుకొనిన యెడల —

శాంత నిశ్చేష్టితయయ్యెను. చేతులతో కనులను మూసుకొని యశ్రుధారను మున్గుపర చుచుండెను. ఆమెకొక సంతృప్తిమాత్రము కల్గినది. ఎవరి క్షేమముకొఱకై తానింతవర కవి వాహితయైయుండెనో, యెవరిని సుధీంద్రరా యలు తనప్రాణముకన్న నెక్కుడుగ ప్రేమించు చుండెనో, అట్టి పద్మయొక్క రహస్యము తన తలపై బడినదని సంతసించెను.

"పద్మకిది తెలిసిన భరించునా ? నాకేమి సంభవించినను లెక్కపని లేదు. నాయవమానము వలన నెవరికిని కళంకము గలుగదు. ఇన్ని దిన ములు నేను కాపాడినది నాపద్మ రహస్యమును బయల్పడనీను !" అని శాంత లోలోన విల పించుచుండెను. స్త్రీయొక్క నిష్కళంక జీవిత మునకు భద్రపరచుటస్త్రీలు సర్వవిధముల యత్నింతురు, వెగిరపడరు. అటులనే శాంత మనోనిబ్బరమును కలుగచేసికొని యిట్లు సంభా షించెను.

శాంత;- నీకీరహస్యమెట్లు తెలిసినది ?

కాళీ:- లోకమును మూఢుతో దాచగలరా! అనేక సంవత్సరములనుండి పరిశోధించు చున్నాను. మాఅమ్మనుమాత్రము నిందింప కుడు. ఆమె యీరహస్యమును గురించి యొక్కమాటైన చెప్పలేదని ప్రమాణము చేయగలను.

శాం:- నీకెట్లు తెలిసినది ?

కాళీ;- భావనగరమున కొకరాత్రి మీరు వచ్చి యుంటిరి. జ్ఞాపకమున్నదా? మీరును మాఅమ్మయు నేను నిద్రపోవుచున్నానని తలంచితిరి. నేనును శశిభూషణుడును పరు న్న గదిలోనికివచ్చి శశిభూషణుని మీరు ముద్దుపెట్టుకొంటిరి.

శాం:- నీవు నన్ను చూచితివా?

కాళీ:- చూచితిని, చాల సంవత్సరములైనప్ప టికిని మీపోలిక నాకు బాగుగ గుర్తున్నది.

శాం:- ఇదంతా కల్పితము.

కాళీ:- అట్లయిన నేనిపుడే సుధీంద్రరాయలు వద్దకుపోయి యీరహస్యమును తెలియపర చెదను.

శాం:- ఇటువంటి యపనింద వ్యాపింపకుండ నాతమునిన్నే శిక్షింపజేయుదు.

కాళీ:- నాకు చాల బుజువులు చిక్కినవి!

శాంత చకితయైనది. కాళీచరణునకు రహ స్యము నిజముగ తెలిసియేయుండవచ్చును. కనుక కాదనిన ప్రయోజనము లేదు. ఆమె కమిత యాగ్రహము కలిగినది. ఆమె జీవితము నందెన్న డానాడు పొందిన గర్వమును పొంది

యుండ లేదు. తన చెల్లెలికొరకు తన పేరును త్యాగము చేసినది.

శాం:- నీవు చెప్పినది నిజమేయని యెవ్వరికొనెడ వనుకొనుము, తరువాత నేమి జరుగవలసి యున్నది?

కాళీ:- మనమీపురమును రాజీపడవలసి యున్నది.

శాం:- ఇన్ని దినములు గూఢచారిగ పనిచేసి కనుగొనిన రహస్యమును నేడు వేలముపెట్టి విక్రయింప దలచితివా?

కాళీ:. అవును. వేలములో నెవడధిక ధర యిచ్చిన వానికి విక్రయింపదలచితిని.

శాం:- నీవు నిజముగ నీచుడవై, నిర్దయుడవై, అంతరాత్మ యనునది లేనివాడవైవచో నేనెంతచెప్పినను ప్రయోజనముండదు.

కాళీ:- కావచ్చును.

శాంత కొంతవడి నేమియో యాలోచించెను.

శాం:- అయితే, యింకెవ్వరైన నీరహస్య మెఱిగిరా?

కాళీ:- లేదు. ఎవరును కలలోనైనా వినియుండరు. మాఅమ్మనెంత యడిగినను చెప్పలేదు. రంగాపురములో నామె యుండుటయు, నామెకు రహస్యముగ నెవరోడబ్బిచ్చుటయు విచారించి తెలిసికొంటిని.

శాం:- ఇన్ని కపటవేషములు వేసి సాధించితివి.

కాళీ:- అవును. నేనేమియు లజ్జింపవలసిన యవసరము లేదు. పనిపాటులన్న నాకు తల కాయ నొప్పి. ఈరహస్యముమీద మా అమ్మ డబ్బు సంపాదించినది. నేనెందులకు సంపాదించుకొనగూడదు?

శాం:- నీవింత నిర్భీతిగ పలుకుచుంటివే.

కాళీ:- అవును, శశిభూషణుకు మీకుమామగుడే. ముఖ్యముగ నతనికి మీరుమామగుడే ఈరహస్యము భద్రపరచుటకు, ... కేమిచ్చెదరు?

శాం:. నీవేమి ... రెదవు?

కాళీ:- మీరు భాగ్యవంతులు. సంవత్సరమునకు నాలుగువేల రూపాయిల ఆదాయము వచ్చునని వినియున్నాను. మాకు డబ్బుకంటె నాత్మగౌరవ మధికముకదా!

శాం:- కావచ్చును

కాళీ:- నేను న్యాయముగనే కోరుచున్నాననుకొనెదను. కొందరాదాయములో సగ భాగము కోరెదరు. నేనంత దురాశగల వాడనుకాను. నాకు సాలుకు వెయ్యి రూపాయలిచ్చిన చాలును.

శాం:- నీకేమైన పిచ్చి యెత్తినదా?

కాళీ:- పిచ్చియో, ఛాందసమో నాకు తెలియదు. నాకు కావలసిన మొత్తమది. మీరియ్యక తప్పదు. నేను పుచ్చుకొనక తప్పదు. అంతకు దమ్మిడీతక్కువ పుచ్చుకొనను.

శాంతకు సహజముగనుండెడి మనోనిబ్బరము శాంతమునాడామెను విడచినవి. కాని స్త్రీలకు సహజమగునట్లామె యేడువలేదు. ఆమెకు లోలోన దుఃఖము లేకపోలేదు. ఇపుడు కాళీచరణుని సమాధానపరచుటకు సాలుకు వెయ్యి రూపాయిలిచ్చుటకు సమ్మతించినను, నాటితో కష్టములు గట్టెక్కవని శాంతకు దృఢముగ దెలియకపోలేదు. అనేకవిధముల తనను పీడించునని యామెకు సంపూర్ణవిశ్వాసము కలదు. కలుగనున్న యుపాయములలో తేలికగ భరింపగల్గునది ధనమేకదా. కాళీచరణుని పట్టుదల హెచ్చుగ నుండుటను కనిపెట్టినది. ఇంతవరకును త్యాగము చేసినసిమ్మట నికముందుకూడ తానేల

సర్వము త్యజించి పద్మను కాపాడరాదో యామె యూహింపజాలకున్నది.

కాళీ:- ఇంతవఱకు వేచియుండుటకు నాకు వ్యవధి లేదు. ఏదియో యొకటి వెంటనే తేల్చివేయవలెను.

శాం:- సరే. అందుకు సమ్మతించెదను. కాని యీ సత్యమును రెండవవానికి తెలియనియ్యకుండ నుండునట్లు నీవు ప్రమాణము చేయవలసినది.

కాళీ:- సమ్మతి! ద్రోహము నాయింటావంటా లేదు. మీరెవ్వరైనా భిన్నముగా నడిచేయెడల, చాల విపత్తు రాగలదని తెలిసికొనుడు.

బేరము ఫైసలయినది. న్యాయశాస్త్ర ప్రకార మెరుగలకు తెలియకుండ నొడంబడిక వ్రాసిపుచ్చుకొనుట జరిగినది. కాళీచరణు డెట్టకేల కాదాయమును సృష్టించుకొనినాడు. ఇక రెండవయత్నము ఉమను వివాహమాడుటయే. ఒకవైపున శశిభూషణుడును, మఱియొక వైపు తన యనాగరికతయు నాటంకములు. దుర్మార్గుని యాలోచనలకు మేరయుండదు. "పెరుగుట విరుగుటకొరకే" యని తెలిసికొనలేడు. రాత్రింబవళ్ళు నిద్రాహారములు లేక తన నీచకార్యములను కొనసాగించుచునే యుండెను. భగవంతుడును సృష్టిపరిపాలనను సరిగ జరుపుచుండుటచేతనే ప్రపంచము నిలచియున్నది. ప్రతిదుర్మార్గునకును శత్రువును సృష్టించి మర్మముగనో బహిరంగముగనో తన లీలను ప్రకటింపుచుండును.



—♦ పందొమ్మిదవ ప్రకరణము - మలుపు. ♦—

కాళీచరణుడు కలకత్తాలో దనపని పూర్తియైనదని గ్రహించెను. కొంతకాలము స్వగ్రామమునకుబోయి ఉమాపరిణయసాధనకై బూనుకొన నిశ్చయించెను. మున్ముందు కుందయు నెడి పెనుభూతము తప్పించుకొనవలెను. ఏలైనచో తాను వివాహమాడెదనని కుందతో ఖచితముగ నుడువవలచెను. అందువలన భావనగరమునకు కాళీచరణుడు పయనమయ్యెను.

దుర్మార్గు లెందరకును లోలోన పిరికితనముండును. భావనగరమును చేరుకొనకపూర్వమే తనకు గలిగిన నూతనైశ్వర్యము నూతనముగాని విలువగల వస్తువులను కొని గొప్ప ధనవంతునివలె వర్తింప నారంభించెను. భావనగరమునకు వచ్చి నాలుగు దినములైనను, కుందను చూడనే లేదు. అందువలన నామె క్రోధోద్దీపితయై పగ సాధించుటకొనలగిన సమయముకొరకు వేచియుండెను. ప్రథమమున కాళీచరణు సవ్యక్తుడై సంచరించినను, నిలకడమీద మాయోపాయము వేకాని కుందను తప్పించుకొన వీలులేదని గ్రహించి కుందను చూచుటకై పోయెను. ఆమె కాళీచరణుని పలుకరించక మొగము బిగించి కూర్చొనియుండెను

కాళీ:- కుందా, నన్ను మరచితివా? పలుకరింపనైనా లేదే.

కుంద:- అవును. నాకేల మీవలె నైశ్వర్యము పట్టలేదు. (అని చిఱ్ఱున లేచిపోనుద్యుక్తురాలయ్యెను. కాని కాళీచరణుడామె హస్తమును పుచ్చుకొని వారించెను.)

కాళీ:- కొన్ని వ్యవహారములవలన సావకాశము చిక్కినది కాదు.

కుంద:- అవును, మీకు సావకాశమెక్కడ? కాలమంతయు నందము సవరించుకొని త్రిప్పుకొనుచు నడచుటతోనే సరిపోవుచున్నది. మీకేదియో యైశ్వర్యము చిక్కినదట!

మీ కొక రహస్యము తెలుపవలసి యున్నది. మాట్లాడిన విషయము మన యిరువురికి సంబంధించినదే కాని యితరులకు సంబంధించదు. మీరు ఏకాంతముగ రాత్రి యెనిమిది తొమ్మిది గంటలకు గేటుకు కుడిప్రక్కనున్న మామిడిచెట్టువద్దకు రావలెను. శాంతాదేవికిమాత్రము మీరీవిషయము తెలుపవలదు. ఆమెను గురించియే మీతో మాట్లాడవలసి యున్నది. మీసోదరిపై మీకు ప్రేమయున్నయెడల, ఆమె గౌరవమును మీరు కాపాడదలచినయెడల నీసంగతి యెవరికిని దెలుపక మీరొక్కరే యొంటరిగ రావలెను. మీయింటికి రాకపోక లెక్కువ గనుక నక్కడ ఏకాంతమున సంభాషించుటకు వీలులేదు. మీరు రానియెడల బ్రతికి యున్నంతకాలమును విచారించెదరు

ఇట్లు విధేయుడు,
కాళీచరణరాయలు.

వసంతవిలాసపు టావరణమునందలి వృక్షములా వెన్నెల రాత్రియందు నిశ్చలములై యున్నవి. ఆకు లల్లల్లాడుటలేదు, పక్షులు తమతమ గూళ్ళలో నిద్రపోవుచుండుటవలన నంతయు నిశ్శబ్దముగ నుండెను. ఎటుచూచినను ప్రపంచము సజీవముగ గాన్పించుట లేదు. ఆరాత్రి జరుగనున్న ఘోర భయంకర వృత్తాంతమునకు సూచకములాయెనన్నట్లు పొడగట్టెను. వెళ్ళక తప్పినదికాదు. తన సోదరియొక్క మానసంరక్షణార్థము తాను మాతోము సాహసింపక తప్పదని యామెయుద్దేశించెను, కాళీచరణునితో సంభాషించు సమయమేతెంచినందున నామె బయల్వెడలినది. భయసంభ్రమములామె నావహించినవి. ఈభయసంభ్రమములలో నామె తన యాభరణములను గాని విలువగలదుస్తులనుగాని మార్చుకొనజాలక పోయెను. ఒక నల్లని వచ్చడమును మీద వైచుకొని మేలిముసుంగుతో నియమితస్థలమునకు బోయెను, అనుభవింపదగిన సర్వస్వమును త్యజించి ఘోరవిపత్తును చేతులార దెచ్చుకొనుటకై వెడలెను. నిర్ణీతస్థలమున కాళీచరణుడు పద్మరాకకై నెదురుచూచుచున్నందున యామెను వీక్షించి "మీరువచ్చినందులకు నాకు మిక్కిలి సంతోషము కలిగినది" యనెను.

"నాతో మాట్లాడదలచిన యవసర విషయమేమియో తెలుపుము"

"నేను మాట్లాడదలచిన హంశము మీకు చెందనప్పటికిని యందు మీకును భాగము కలదు. మీసోదరికి సంబంధించిన రహస్యము నాకొకటి తెలిసినది".

"మాసోదరి కేరహస్యమును లేదే! ఆమె జీవితము నిష్కళంకమైనది. నాసోదరి వ్యవహారములనుగురించి ప్రస్తావించుటకు నీవేల సాహసించితివి?"

"మీసోదరితో నిదివరకే బేరము చేసియున్నాను. ఇపుడు మీతో బేరము చేయవలసియున్నది."

పద్మకొక విధమగు విసువు జనించినది. కాళీచరణుని రాకవలన తాను పీల్చుచున్న వాయువు దుర్గంధమిళితమై యుండెనా యన్నట్లామెకు తోచినది. కాళీచరణుడామె కంపితదేహమును బురస్కరించుకొని యిట్లు పలికెను

"మీరు తెలివిగలవారై మీకుగల సర్వస్వమును కాపాడుకొనదలచిన యెడల నేను చెప్పినట్లు నిర్వర్తించక తప్పదు."

"ఏమిటి? యీభాష నాకర్థమగుటలేదు."

వాయువు దుర్గంధమిళితమై యుండెనా యన్న ట్లామెకు తోచినది. కాళీచరణుడామె కంపిత దేహమును బురస్కరించుకొని యిట్లు పలికెను.

"మీరు తెలివిగలవారై మీకుగల సర్వస్వమును కాపాడుకొనదలచిన యెడల నేను చెప్పినట్లు నిర్వర్తించక తప్పదు."

"ఏమిటి? యీభాష నాకర్థమగుటలేదు."

"అవును. ఇటువంటి సమాచారమును మీరెన్నడు బహుశా వినియుండరు. నేను నిజముగ దెల్పినచో మీరు మూర్ఛపోవుదురు, అట్టి దురవస్థను మీరు తప్పించుకొనదలచిరా?"

"ఇపుడేకదా, యీహాంశము నాకు సంబంధించినది కాదని నుడివియుంటివి."

"మీరేమాత్రమును భయపడకుడు. మీవంటివారికి మాత్రము తెలియనప్పటికి నిటువంటి విషయములు సామాన్యముగా జరుగుచునేయుండవి."

"నేను చెప్పునది మీరు సాంతముగ వినినచో నేనను మీహితము కోరెడివాడనేయని మీకు తెలియగలదు."

"ఏమిటీ పిచ్చిధోరణి? అసలు సంగతిలేదే!"

"కొంచెము దగ్గరకు రండు. నేను చెప్పబోవు సంగతి చివరకు పక్షులుకూడ వినకూడదు. మీసోదరియొక్క రహస్యములన్నియు మీకు తెలియునా?"

"ఆమెకేమియు రహస్యములులేవు"

"ఆయభిప్రాయమును మీరిప్పుడు మార్చుకొనవలసియున్నది. మీకీవిషయమును విశదీకరించుట సులభమని యెంచితిని, కాని మిమ్ములను చూడ నాకు భయము కలుగుచున్నది."

"ఏమిదో త్వరగా తెల్పుము"

"అనేక సంవత్సరముల క్రిందట — మీకిపుడు జ్ఞాపకముండి యుండకపోవచ్చును, — మీసోదరి కాశీనగరమున రంగాపురమునకు పోయి యుండవచ్చును. మీకెవ్వడు చెప్పియుండకపోవచ్చును ఆమెకు వివాహమైనదని తలచెను."

"ఏమిటి మరల చెప్పుము" అని కోపోద్దీపితయై యరచెను.

"అక్కడ మీసోదరి కొక కుమారుడు కలిగెను. ఆమె యీరహస్యమును ప్రపంచమునకు దెలియకుండ నుంచినది."

పద్మ తల వంచినది. రాజకీవితో గూడిన యామె వదనము వెలవెల బోయినది. వంచిన తలను ప్రక్కనున్న వృక్షమునానిచి వేడినిట్టూర్పుల విడువ దొడగెను. ఆమె హృదయము బ్రద్దలగునట్లుగా నుండెను. "నీకీరహస్యమెట్లు తెలిసిన" దని యామె విగతస్వరమున పలికెను తన ముసుగును లాగుకొని తన కన్నుల నుండి ప్రవహించుచున్న యశ్రుధార నాతనికి గోచరము కాకుండునట్లు కప్పివైచెను.

"నన్ను విశ్వసించుడు. భయపడవలసిన పనిలేదు. ఈరహస్య మితరులకెవ్వరికిని తెలియదు. నేను కోరునది మీరు నెరవేర్చినయెడల నేయపాయము నుండదు. తన కుమారునిగురించి యెవరితోను మీసోదరి వచ్చరించియుండలేదు. ఆమె కుమారుడిపుడు బ్రతికియే యున్నాడు."

"ఏమి, బ్రతికియున్నాడా" అని యామె యాశ్చర్యముతో బలికినను నది యవసాన దశయందలి విగతస్వరముగ గాన్పించెను.

"బ్రతికియేయున్నాడు. ఆతడు మన కపరిచితుడు కాడు, మన శశిభూషణుడే"

"నీ వెవరు? నీకిట్టి రహస్యము తెలిసినదెట్లు?"

"శశిభూషణుడు మా పెంపుడు తమ్ముడు. సుముఖి యను దాతని పెంచినది."

"సుముఖి యెవరో నేనెఱుగనే యెఱుగను" పద్మ మరి మాట్లాడజాలకపోయెను. "శాంతా, శాంతా, ఇంతవరకు వచ్చునని కలనైనా తలచలేదు." అని యుచ్చరించెను. తన మిత్త్రి ఘోరరహస్యమును తన తలపై వైచుకొని శాంతి యెంతత్యాగము కావించెనని యనుకొనుచు పద్మ మిగుల వగచినది. కాళీచరణుడు కథను కొనసాగించెను.

"మీ ఘోరరహస్యము నామె తెలిపియుండదు. ఆమెకు వివాహము కాలేదనను. వివాహమాడిన యెడల, తాను లజ్జింపదగినవానిని వివాహమాడి యా రహస్యమును భద్రపరచుటకు యత్నించి యుండవచ్చును. మీ వారపుడు చాల చిన్నవారై యుందురు."

"ఆ రహస్యమును మా సోదరికి తెల్పితివా?"

"తెల్పితిని. ఆమె యేమియు కలవరము చెందలేదు. నేను చెప్పిన దసత్యమని యామె యనను లేదు. ఆమె యొప్పుకొనినది."

"తన కొడుకే యని యొప్పుకొనినదా?"

"నిశ్చయముగ నొప్పుకొనినది."

"శాంతా! శాంతా! ఎంతపని చేసితివి."

"అనేకసంవత్సరముల క్రింద నాకీ యనుమానము స్ఫురించినది. ఎంత ప్రశ్నించినను తెలుపక నా తల్లి రహస్యముగ డబ్బు సంపాదించుకొనుచు కాలము గడుపుచున్నది. నాకును శశిభూషణునకును రూపురేఖా విలాసములందేమాత్రము పోలిక లేనందున నెల్లరాశ్చర్యపడసాగిరి. అందువలన నేను ప్రయత్నమునకు గడంగి రహస్యమును భేదించితిని. అన్ని సాక్ష్యములు చిక్కినవి."

"శాంతనే నేమని బేరమాడితివి?"

"సాలుకు వేయి రూపాయలిచ్చుటకామె యంగీకరించినది. ఆ రహస్యమును దాచుట యావశ్యకమని యామె తలంచినది."

"మరియొక వేయి రూపాయలకు నా వద్దకు వచ్చితివా?"

"అటువంటి కోరిక నాకు లేదు. అంతకంటె నధిక విలువనే కోరెదను."

"ఆభరణము లేమైన కావలయునా?"

"ఆభరణములకంటె విలువైనది. మీ మేనకోడలును శాంతను చూచితిని. ఆమె చాల సౌందర్యవతి. ఆమెను చూచిన నాటినుండి నా మనస్సామె యందు లగ్నమైనది. ఆమెను నాకిచ్చి వివాహము చేయగోరెదను."

పద్మ కోపము నాపుకొనజాలకపోయెను.

"నేనే పురుషుడనైనచో నీవాకిటనే నిన్ను నరికివేసి యుందును."

"నన్నవమానపఱచవలదు. నాకిచ్చి వివాహము చేయక తప్పదు."

"అది యసంభవము. ఏమి చేసెదవో చేసికొనుము."

"ఇపుడే పోయి సుధీంద్రునకా రహస్యము తెలిపెదను."

"ఇప్పుడు, నేనేమి చేయగలను? శశిభూషణునకిచ్చి వివాహము చేయుట నిశ్చయమైనది."

"అయిననేమి? ఆ వివాహమును విడగొట్టుకొనుట కింకను తరుణము కలదు."

"అది నావలన కాదు.— అయ్యో, ఎంత పాపిష్ఠిని!"

"మిమ్ములను తొందరపెట్టుట లేదు. సావధానముగ యోచించుకొనుడు."

ముగా ప్రోడుపుగా కాలం వెళ్ళబుచ్చుకుంటు న్నది ఈ సంసారము.

## 2

కృష్ణవేణి తల్లిదగ్గరకు పరుగెత్తుకొనిపోయి "అమ్మా, అమ్మా నాన్న—నాన్నే—— మా-ట్లా-డ-లే" దని బిక్క మొగముతో ఆయాసపడుతో పలికింది. నాడు కృష్ణవేణి పుట్టినదినమగుటచే శోభాయమానంగా అలంక రింపబడ్డది. ఇదంతా చూపిద్దామని తండ్రివద్దకు వెళ్ళేటప్పటికి, ఆలోచనామగ్నుడై యున్న కామేశ్వర్రావు తన ముద్దులపట్టిని చేరదీయ లేదు. కమల వెంటనే భర్తను సమీపించి యాతని ముఖలక్షణములను జూడకయే "చిలక తల్లి — బంగారుతల్లి — వరహాలతల్లి — చిట్టి తల్లి పుట్టినరోజుగదా అని అలంకరించుకుని వస్తే, యిలాగేనా చూడటం" అంది. కామేశ్వర్రావు వినిపించుకోలేదు. అతను దీర్ఘంగా నాలోచి స్తున్నాడు. దుఃఖము పొంగి పొరలి వస్తూ న్నది కన్నులవెంబడి అశ్రుధార ప్రవహిస్తూ న్నది. కమల యీస్థితి నెన్నడుచూచియుండలేదు తనభర్తయొక్క యీ నూతన పరివర్తనానికి కారణం కనిపెట్టలేకపోయింది. నిర్ఘాంతపోయింది. చిట్టచివరకు ధైర్యం తెచ్చుకుని 'యెన్నడులేని యీ విపరీతం యేమిటి' అంది.

ప్రత్యుత్తరము లేదు

"ఒంట్లో బాగుండలేదా? బాధఏమిటి"

ప్రత్యుత్తరములేదు.—

"ఉద్యోగపుచిక్కు సంభవించిందా ?"

జవాబులేదు —

"నావలన ఏమైనా కష్టంకలిగిందా ?"

మాటలేదు — —

కమల యింక తాళలేకపోయింది. ఆదృశ్యం దుర్భరం అయిపోయింది. కాపురానికి వచ్చిన తరువాత యిటువంటిది తటస్థించడానికిదే మొద టిమాటు. ఆమె వేదన హెచ్చింది. భర్తను సమీపించి చెయ్యిపుచ్చుకొని యిటునటు ఆడిం చింది. కాని భర్త తనవైపే చూడటంలేదు. కమల కన్నీరు కార్చడం ప్రారంభించింది. ఈ వేడి కన్నీరు కామేశ్వర్రావు దేహముపై బడ్డది. ఇక మంచిది కాదనుకున్నాడు ధైర్యము తెచ్చు కున్నాడు. "కమలా, పిచ్చిదానా, నా అధై ర్యంతో బాటు నీవుకూడా అధైర్యమైతే ఏలాగు! ప్రతివానికి అపుడపుడు పూర్వపుతలం పులవలన విచారంకలుగుతూంటుంది" అన్నాడు.

"ఇపుడుకలిగిన పూర్వపుతలంపులేమి" అంది కమల.

"ఏమైతే యేమిటి. చేసికున్నవాడిని నేను, అనుభవించవలసిది నేను. మీకుకూడ బాధ యెందుకు" అన్నాడు.

"అదేదో చెప్పకతప్పదు. మీ సుఖదుఃఖా లలో సగంనాది."

ఇంతలో కృష్ణవేణి పరుగెత్తుకొని వచ్చింది "ఛస్ ఇక పూరుకో. మనమిద్దరంకూడ యిలాగేవుంటే అమ్మాయి బెంగపెట్టుకుంటుంది" అని కామేశ్వర్రావు కథావైఖరిని మార్చి వేశాడు. అంతేకాని నూతన పరివర్తనం పోయి యథాస్థితికి రాలేకపోయినాడు అతనికి ప్రపం చమంతా విచారంగా కనిపించింది. అంతా అంధ కారమే

## 3

ఆఫీసునుంచి యింటికివచ్చిన కామేశ్వర్రావు తనగదిలోనికిపోయి దుస్తులను తీసివైచికొనుచు యెదురనున్న తనపటమునకు పూలదండ వేసియుండుటచూచెను. ఈవిధముగ ననేకదినములనుండి చూచుచువచ్చెను. నిత్యమెవరు పూలదండవేస్తారా యని వితర్కించుకొనేవాడు. తనను మనసార ప్రేమించు కమలే వేస్తుందేమో యనియనుకొనుచు వచ్చెను కాని సాహసించి కమల నడుగలేకపోయెను. కమలకూడ నిత్యము పూలదండ చూచుచుండెడిది. తన ముద్దుల తనయ కృష్ణవేణియే యిట్లు చేయుచున్నదని యూహించుకొని యూరకొనుచు వచ్చెను కాని పూలదండమాత్రము చటికి విచిత్రముగనే చేరుచున్నది. యెవరును లక్ష్యముతో పరికించలేదు. కాలము గడుచుచున్నది. వత్సరములు కూడ దొర్లిపోవుచున్నవి. కృష్ణవేణి దినదినప్రవర్ధమానయగుచున్నది. పది యేండ్లు నిండినవి. అధిజూన్‌మాసము. కృష్ణవేణికి రెండు వాంతులు రెండు విరేచనములయినవి. పురమందంతటను కలరా వ్యాపించియున్నందున కమలా కామేశ్వర్రావులు దిగులుపడి నిద్రాహారములులేక సంరక్షించుచుండిరి. వీరిద్దరికంటెనుకూడ పద్మాక్షి అతి శ్రద్ధతో కృష్ణవేణి ప్రక్కను కూర్చుని యేమాత్రము అసహ్యములేకనే చాకిరి చేయుచున్నది. పద్మాక్షి ఆయింట ప్రవేశించిన నాటనుండి కృష్ణవేణికి సంరక్షకురాలై యున్నదన వచ్చును. ఒక్కనిమిషమైనను వారెడబాసి యుండలేదు. కృష్ణవేణికి చదువు చెప్పుచు కథలు వినిపించుచు, బుద్ధులు గరపుచు వచ్చినది. తన కూతురు పెంపకమంతయు పద్మాక్షిమీదు గానే జరిగిపోవుచుండుటచే కమల భారమంతయు తగ్గినది. ఇందువలననే జబ్బుగానున్న కృష్ణవేణి మంచముదగ్గర, వంటనైనా మానివేసి పద్మాక్షి కూర్చోవలసివచ్చినది. రుచించకపోయినను యేవో రెండు మెతుకులు తినకతప్పదు. కనుక కమలే యింత వండిపడవేయుచు, తనకూతురును రక్షింప భగవంతుని ప్రార్థించుచుండెను. రెండవనాటికాకస్మికముగ వాంతులు హెచ్చినవి. కాళ్లు చేతులు చల్లబడినవి. అందరును ఆసవదలుకొని రోదనముచేయ నారంభించిరి. కుర్చీలో కూర్చున్న కామేశ్వర్రావు స్తంభీభూతుడైనాడు. కమల రోదనమునకు మేరలేదు. ఇంట్లో ధైర్యము చెప్పేవారు లేకుండిరి. పద్మాక్షి యింత ధైర్యము తెచ్చుకొని కమలా కామేశ్వర్రావులకు ధైర్యము చెప్పెను. ఇంతలో వైద్యుడు వచ్చి నాడిని పరీక్షించి యేదియో మందునిచ్చి ఒక్క గంట గడిచినచో ప్రమాదముండదని నుడివెను. ఈవ్యాధి కుదుటపడితే కృష్ణవేణిని తిరుపతి కొండ యెక్కిస్తానన్నది కమల. బీదలకన్నదానము చేస్తానన్నాడు కామేశ్వర్రావు. బెజవాడ కనకదుర్గకి నూరు కొబ్బరికాయలు కొట్టాలంది పద్మాక్షి. ఇన్ని మొక్కులతో గంట గడిచింది. కృష్ణవేణి శరీరంలో జ్వరం దిగజారింది. వైద్యుడు పరవాలేదన్నాడు. అందరు అదృష్టవంతుల మనుకున్నారు. ఇదంతా పద్మాక్షి చలవే అన్నారు. నాచలవేముంది, కమలమ్మ చేసికున్న పుణ్యం అంది పద్మాక్షి. అన్ని మొక్కులు చెల్లుబడిఅయినాయి. యథాప్రకారం కామేశ్వర్రావు సంసారం కుదటపడి సుఖంగా నడుస్తోంది, కాని పద్మాక్షి శరీరంమాత్రం శుష్కించిపోతోంది. ఆమె ముఖం విచారంచేత వాడిపోతోంది. నిజ

ను గ రోగమో, మనస్సులో బాధో యెవరు గ్రహించలేకపోయారు.

## 4

దినములు గడిచినవి. శ్రావణమాసం వచ్చింది. శుక్రవారంనాడు కమల పేరంటమునకు వెళ్ళివచ్చింది. అన్నగా పడకగదివద్దకు వెళ్ళినది. తలుపు తెరచియుండుటచే, నెమ్మదిగా కారకులా యని యోచింపనారంభించింది. లోపలికి వెళ్ళింది. కామేశ్వరరావు పట్టుకుని పూజలు చేస్తున్న పద్మాక్షిని చూచింది. నిర్ఘాంతపోయింది. ఏమిటి విపరీతం అని ఆలోచించింది. హృదయం దడదడ కొట్టుకోనడం ప్రారంభమైనది. తన భర్త పాటాన్ని సత్కరించటానికి వంటలక్క పద్మాక్షి కేమి హక్కని తర్కించుకొన్నది. అసూయ, కోపం, చురచురలు ప్రారంభమైనాయి. ఒక్క పర్యాయం రాద్ధాంతసిద్ధాంతాలు చేసి పద్మాక్షిని వెళ్ళగొట్టద్దామని అనుకున్నది. కృష్ణవేణి బ్రతుకుకు కారకురాలని చూపిన కృతజ్ఞత అంతా క్షణములో మాయమైంది. ఆ గృహాన్ని చీకట్లు ఆవరింపమొదలిడాయి. నిలకడమీద ఆలోచించుకొని పద్మాక్షి లేకపోతే కృష్ణవేణి బెంగపెట్టుకుంటుంది. కృష్ణవేణి బెంగపెట్టుకుంటే బ్రతుకే దుర్భరము అనిపించింది. నెమ్మదిగా పరిశోధిద్దామనుకున్నది.

## 5

పద్మాక్షి ఆరోగ్యము చెడినది. నానాటికి కృశించి పోతూంది. వైద్యుడిచే పరీక్షింప జేసికొనుటకు నిరాకరించినందున, ఆమె జబ్బు యెట్టిదో యెవరును తెలిసికొనలేకపోయిరి. కృష్ణవేణికి చాకిరీ చేసినందువల్ల యీమెలో జబ్బు ప్రవేశించినదని యనుకొనిరి. యజమానురాలికిని పద్మాక్షికిని పూర్వపు సఖ్యత లేకపోయింది. ఇక తానచట నుండుట మంచిది కాదని యెంచి సెలవిప్పించమని కమలను ప్రార్థించింది. లోకులు పలుగాకులు గనుక అవసరమైనపుడు చాకిరీ చేయించుకొని జబ్బుగానున్నపుడు వెళ్ళగొట్టిరని అనుకుంటారని కమల అంగీకరింపలేదు. "వ్యాధి నయమగువరకు యిచటినుండి కదలుటకు వీలులేదు. లోకులు పలుగాకులు. ఇపుడు పంపివేస్తే యేమనుకుంటారు?" అంది. పద్మాక్షికి తప్పనిసరియైనది. అసలు నీవిటకెందుకు వచ్చావో అని విచారించింది. కొద్దిరోజులకు వ్యాధి హెచ్చిపోయింది మందులు పనిచేయుటలేదు గంటలలో పరలోకము చేరనున్నది. ఆయాసమధికమై కన్నులు మూసినది "నేను తప్పు చేసినమాట నిజమే. నేను పడినపాట్లు జీవునికెరుక. చివరకు నా యిహలోక దైవమునకే సేవచేయుచు మరణిస్తున్నానని తృప్తి" అని పద్మాక్షి యుచ్చరించింది. సంధిమాటలనుకొని తలచింది కమల. వింటున్న కామేశ్వరరావు మాత్రము కన్నులనుండి అశ్రువులు ప్రవహిస్తోంది. ధైర్యము తెచ్చుకుని నిలుచున్నాడు. పద్మాక్షి కన్నులు తెరచినది. ఎదుటనున్న కామేశ్వరరావును చూచింది. "ఏమిస్తే తీరు ఋణం. నేను చచ్చినవాళ్ళలో లెక్క! నాకు ఒక కోరిక ఉండేది, అడుగుదామని. దానికోసమే వచ్చావు కొంచెము దూరమైంది." అన్నది పద్మాక్షి. కామేశ్వరరావును చూస్తూ. కామేశ్వరరావు నిలవలేకపోయినాడు. "నీ ఋణము తీర్చుకోటానికి వచ్చావా" అన్నాడు. కామేశ్వరరావు పద్మాక్షి మంచముమీద కూర్చున్నాడు కమలకిది యంతా అగమ్యగోచరంగా వుంది.

"నన్నింకను పోల్చుకొనలేదా?"

"లేకేమి?"

"అయితే, నన్ను క్షమించవా?"

"క్షమించుటకుగాని క్షమింపకపోవుటకుగాని యోగ్యురాల్నికాదే."

"నా క్షమిస్తేనేకాని నాఆత్మ తృప్తి నొందదు. క్షమించితి ననండి. నాహృదయమునకు శాంతి కలుగుతుంది."

"కోమలి నన్నొకప్పుడు రంజింపచేసిన పద్మవేనా" అని విగతస్వరమున కామేశ్వరావు పలికెను.

"ఆ దౌర్భాగ్యురాలను నేనే. మీ ఋణము నేనెన్ని జన్మలకైనా తీర్చుకోలేను. నన్ను క్షమించాలి. ఆయుశూలిలో నేనుచనిపోవలసిందే కాని బ్రతికి ఉన్నాను. రూపంతా మారిపోయినందువల్ల యెవరును నన్నానవాలు పట్టలేరు. ఇచట చేరితిని. వదలివెళ్ళలేకపోతిని."

కామేశ్వరావుకు కలవరము కలిగింది. తన కిరువురు భార్యలున్నారని స్ఫురించిది. కామేశ్వరావు నిశ్శబ్దంగ మౌనంగ నుండుట చూచింది పద్మ.

"మిమ్మల్లను చూడాలని చాల కోర్కె ఉన్నది. ఉన్మాదురాలనై సిగ్గు బిడియములను వదలి లేచిపోయినపిమ్మట, మీమీద కలిగిన అనురాగమునకు మేరలేదు. నాకు కలిగిన పరితాపమున కంతులేదు వెంటనే తిరిగిరావలసినది. కాని ఎట్లు రావలెనో తెలియకపోయినది. నావిపరీత చర్యను మీరు క్షమిస్తారని అనుకోలేదు. నన్ను క్షమించుడు. క్షమించుడు నాపావము చాల పెద్దది. కాని అనుభవించిన శిక్షయు పెద్దదే. నాయునరివరితాపముకంటె వేరు శిక్షేమున్నది?"

కామేశ్వరావు నిట్టూర్పు విడిచెను.

"కాలము తగ్గిపోవుచున్నది. మీ ప్రేమ నిష్కళంకమైనది. నేనే పాపాత్మురాలిని. అనంగతని మరచిపొండి. నన్ను క్షమించండి."

"క్షమించవచ్చును కాని మరచుటమాత్ర మసంభవము."

"ప్రయత్నించి మరచిపొండు. పూర్వము మనము ప్రేమించుకొన్న దినములు జ్ఞప్తికి తెచ్చుకోవండి. ఇదివరకు నేచేసిన స్వల్ప తప్పిదములనొన్ని యెట్లు క్షమించితిరో జ్ఞప్తికి దెచ్చుకొనండి."

"కాదోషమేమైన గలదా" అన్నాడు కామేశ్వరావు.

"దోషమంతా నాదే. మీప్రేమ నిష్కళంకమైనదే. మీ ఉదారస్వభావం అసమానమైందే. నేనే గుర్తింపలేకపోతిని. మీకు కలిగించిన అపనిందకు తగిన ప్రాయశ్చిత్తము నా కింకను కలుగలేదు. నేను చేసికొనిన పాపంమాత్రము అనుభవించాను. తగిన యనుభవమైనది. నాకు కలిగిన ఆందోళన యింతింతకాదు. తిరిగి మీయింటికి చేరితిని. మీరు మీభార్యతో కాపురం చేయుటం, ఆమెపై మీకుగల ప్రేమ, యీమరణకాలంలో మీక్షమాపణ వేడుకొనగల అదృష్టం, ఆలోచించుకొనుడు. నాకెట్టి పరితాపము కలిగించో మీకే బోధపడగలదు."

"తిరిగి యిచట కెందుకువచ్చితివి?"

"విధి వ్రాతవలన."

"గొప్పపొరబాటు కావించితివి."

"ఎన్ని తప్పులు చేసినను, మీరు భర్త కాకపోరు, నేను భార్యను కాకపోను. నన్ను క్షమించండి. దీవించండి నేను చనిపోయే లోపున మీప్రేమవాక్కు నొక పర్యాయము తెలిబు

చ్చండి. నాకాయాసం కలుగుచున్నది ఇంత కంటె అధికం కోరను."

"వద్దమ్మా, క్షమించితిని – భగవంతుడు రక్షించుగాక," అని కామేశ్వరరావు తల వంచుకొనెను.

"నేను పోవుచున్నాను. నన్ను క్షమించండి, మరచిపోకండి" అని లేని బలము తెచ్చుకొని కామేశ్వరరావు పాదములపై బడి ప్రాణములు విడిచింది. కామేశ్వరరావు దుఃఖము భరించలేక పోయినాడు. కన్నీరు మున్నీరుగా కారుచుండగా కామేశ్వరరావు నేల వ్రాలి మూర్ఛిల్లినాడు. ఈదృశ్యమంతా చూస్తూ వివర్ణయై పోయింది కమల.

## నా మనవి.

కొటికలపూడి రామేశ్వరరావుగారు.

చిగురాకు బొత్తిళ్ళ ♦ స్వేచ్ఛగాఁ గోకిల
శ్రావిక ప్రియము గీ ♦ తములఁ బాడ
వింత రంగుల సౌరు ♦ వెలయుంచి పుష్పముల్
భవదీయ సౌందర్య ♦ ప్రతిభఁ దెలుప,
షోడశ కళలతో ♦ శోభిల్లి, జాబిల్లి
నెమ్మి నీ కీర్తి వె ♦ న్నెలలఁ గాయ,
రాత్రింబవళ్ళేక ♦ రవములో సంద్రంబు
ఘన వాద్యముల నీదు ♦ ఘనతఁ జాటు,

గాని, యీశ్వర నా పాప ♦ కర్మ మేమొ—
నీదు పాదారవిందము ♦ లింపుమీఱఁ
జేరి సేవింత మన్నచోఁ ♦ జిక్కు వేల ?—
కుసుమ కోమల పాదము ♦ లొసఁగ రాదు
కఠిన హస్తంబులను జిక్కి ♦ కందునొక్కొ ?—
భగ్నచిత్తుఁడ, భవదీయ ♦ పాదసేవ
యబ్బుటది యెల్ల నాదు భా ♦ గ్యంబె గాన,
పాపతిమిరంబులోఁబడి ♦ పరితపించు
మామక హృదయ వీధిఁ ♦ బ్రేమమీఱ
జ్ఞాన తేజంబుఁజూపి, యా ♦ దీను నీదు
దివ్యసాన్నిధ్యమునఁ జేర్చు ♦ దేవ దేవ!

# కవినిర్వేదము.

శ్రీ శేషాద్రిరమణకవులు.

ఉ॥ రాజులకంటె కవిరాజులఁ బ్రేమ మిడిమీఱఁ గాంచు ని
ర్వ్యాజ మనస్కులైన ప్రజలా! కఱవైరి ప్రసన్న భావనా
యోజిత నవ్యకావ్య మృదులోక్తి రసంబుల నాదరించు వా
రీజగమందుఁ గానఁబడ రెట్లు తఱింతగొ సత్కవీశ్వరుల్ ॥

సీ॥ సామ్రాజ్యభారంబు సచివునికై వడి
    నెఱపిన సత్కవీశ్వరులు గలరు.
కత్తికి మొనదొడ్డి కదనంబునం గూలి
    గురుత గాంచిన కవీశ్వరులు గలరు.
అంకితంబీయవయ్యా! యటంచు వేడ భూ
    వగు త్యజించిన కవీశ్వరులు గలరు.
జనపాల సభలలోఁ గనకాభిషేకంబుఁ
    బడసిన సత్కవీశ్వరులు గలరు.

తే॥ గీ॥ పూర్వ విఖ్యాతగతి కోలుపోయి పాఠ
శాలలకు గ్రంథ ముద్రణశాలలకును
వైశ్యులకు జీవితము నమ్మువారలైరి
కవులు; కటకట యేమందుఁ గాలమహిమ॥ 2.

మ॥ విలసత్కావ్య మనోజ్ఞభావపదవీ విజ్ఞానసౌధంబులోఁ
జెలులం బోలిన సత్కవీశ్వరులతోఁ జెన్నార వర్తించు భూ
తలనాథుల్ మరణించి రాంధ్రకవితా తత్త్వంబు నేధారుణీ
తిలకుండుం దిలకింపఁ డెట్లు కవియుద్దేశంబు నింపారునో ॥ 3.

ఉ॥ సోదరభావమందుఁ గల సొంపులఁ దెల్పుచుఁ దీర్చు దిట్టలౌ
గాదిలి బాలకుల్ కడుపు కక్కుఱితిం బరసేవతోడ సు
న్నాదులఁ బోలియుండిరి, ననాతన కావ్యమనోజ్ఞభావనా
స్వాదను లెందు నేని కనుపట్టరికెట్లో కళావిలాసముల్ ॥ 4.

ఉ॥ అన్నివిధాల సొంపు సెడి యాంధ్రవికాసము మాటువడ్డ యీ
యున్నెడఁ గాలమం దేటులఁ బుట్టగ నేర్తురు దెల్గుబాసకై
నన్నయభట్టువంటి కవినాథులు తిక్కనవంటి వీర భా
వోన్నత కావ్యకర్తలయరో? యెటు పెంపగు భారతీగతుల్ ॥ 5.

ఉ॥ తిండికి లేక సత్కవులు దీనతతోఁ దపియించుచుంటచేఁ
గండలడంగి భారతికిఁ గాయము గాయమయ్యె; కాంచో
పండితఖండలీంద్ర రసవత్కవితా జనితాభిరామ వా
క్పండిత మండనంబులకు మాతృవసుంధర సంతసించునే. ౬.

సీ॥ శిల్పంబులందున్న చిత్రవికాసంబు
వర్ణనాంశములందు వలనుపఱచి
తలఁపుల కందని తత్త్వసారంబులఁ
బరమార్థరచనలఁ బొందుపఱచి
చిఱుతచిట్టలసవ్వ తేజిపి వెన్నెలనిగ్గు
పలుకు పొందికలలోఁ బదిలపఱచి
భావరంజకమైన ప్రకృతి విలాసంబు
తిరముగాఁ బ్రాణ ప్రతిష్ఠ జేసి
తే॥ గీ॥ వాఙ్మయమ్మున కొక పరివర్తనంబు
కలుగఁజేసిడి సత్కవి కాంతులకట?
కూటికై దేహముల నమ్ముకొనుట గాంచి
దీనతను గుందదే? భారతీయతల్లి॥ 7.

మ॥ పలుకుం బొందికలందుఁ బెద్దనవలెన్ బ్రఖ్యాతులౌ సత్కవీ
శుల కిక్కాలమునందు నైనఁ గఱవచ్చోలేదు. తత్తత్కవీం
ద్రుల సత్కారము జేయఁ బల్లకిపయిన్ గూర్చుండఁగాఁ జేసి ని
శ్చలభక్తిన్ భరియించు భూవిభులకే సంధిల్లె దుర్భిక్షముల్॥ ౮.

మ॥ తన సామ్రాజ్యము నాంధ్రవాఙ్మయ కవిత్వవ్యాప్తి కర్పించి పా
వనుఁడౌ భూవిభుఁ డెందు లేఁడిపుడు కావ్యశ్రీవిలాసంబులన్
గనులారం దిలకించు భూపతులకై కాఁబోలు భాషాంగనా
మణి సంచారము సేయుచుండెఁ బరసీమాభూమి భాగంబులన్॥ 9.

# ప్రాచీనం.

వేలూరి శివరామశాస్త్రిగారు.

సుమారు ౧౫, ౧౬ యేండ్లకిందట గిడుగు రామమూర్తి గారున్నూ, గురజాడ అప్పారావుగారున్నూ, డాక్టరు బుర్రా శేషగిరిరావుగారున్నూ యీ వ్యావహారిక భాషను గురించి వారు వీరు భాషా తత్వవేత్తలు. దూరదర్శులు వీరిలో గురజాడ అప్పారావుగారు లక్షణమునే కాక లక్ష్యమును కూడా చూపారు

శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు తమ దబ్బావాళ్ళతో ఉపన్యాసయాత్ర బందరులో సాగించినపుడు అందరికంటె యెక్కువగా నేనాయనను కలవబోయాను. ఆయన తార్కికముగా చూపిన ప్రతియుక్తి ఖండించటానికి వీలు లేకపోయినప్పటికీ వాసనాబలంవల్ల మనస్సు ఒప్పుకొనేదికాదు. ఎందుకంటే నాకు మటుకు నాకు భాష అంటె కవిత్వమే అన్ని శాస్త్రాలు అనేకాని మరొకటి కాదని, కృష్ణాపత్రిక ఆంధ్రపత్రిక చూస్తే కడుపుమండేది. లోకవార్తలు సహితం పద్యాలలో నడవాలని వుండేది. ఇప్పటికికూడా “అటువంటివాళ్లని” చూసి నేను సిగ్గుపడడం మానుకున్నా.

రామమూర్తిగారితో ఇట్లు తర్జనభర్జనపడ్డాక నాలో ఒక తీవ్రవిమర్శ రేగింది. రెండో క్లాసు మూడో క్లాసు చదివే పిల్లవాళ్లకు గ్రాంథిక భాష తెలుస్తుందనే నా ఊహ. కాని ఒక్కసారి తలచి చూసుకుంటే అదీ ఒట్టిదొల్ల. ఆపుస్తకాలు పిల్లలకని ప్రత్యేకంగా కృషిచేసి గొప్పగొప్ప పండితులు వ్రాసినవి. ఎంత ప్రయత్నం చేసినా అవి వాళ్ళ బుర్రలోకి యెక్కక చేదు మందులాగ బయటికి వచ్చేసేవి. ఇప్పటికి ఆ బళ్లల్లో జరుగుతున్న పని అంతే. ఇంకా పెద్దలకు చూపు మారలేదు. ఆ పెద్దలంటారుకదా— చిన్నప్పటినుంచీ గ్రాంథిక భాష మేము చదువుకోలేదా? ఇప్పుడది మానేస్తే పెద్ద అయాక అసలే రాదు, అని. అయ్యయ్యో! వాళ్ళకు రావలసింది. “వాడు వచ్చుచున్నవాడు. వానిని గనుము, కృష్ణుడు సాందీపునితో చదివెను” మొదలగునవా లేక విషయమా? చాలా సుకుమారమయిన యీ బాలుర మనస్సు గ్రాంథిక భాషతో బలాత్కరింపబడిపోతూంది. సంవత్సరం చెప్పేది రెండు సంవత్సరములు పడుతుంది. గ్రాంథిక పాఠాలవల్లనే విజ్ఞానం కలుగుతుందని కొందరంటూన్నారు. ఇది అసత్యం

ఈవిషయంలో లోగడ అనేక వాదప్రతివాదాలు జరిగాయి. ఇప్పటికీ జరుగుతూనే వున్నాయి. ప్రాచీన పెద్దలెవ్వరూ దీని వుపయోగం కించిత్తయినా తెలుసుకోక పోవడం ఒకవిధంగా యేమంటాముదాన్ని—వారికి కోపమూ రానిమాట— మన దురదృష్టం, మన పిల్లల దురదృష్టం, స్త్రీల దురదృష్టం, సామాన్యజనుల దురదృష్టం, గ్రంథాలయముల దురదృష్టం.

వారు దీన్ని ఒప్పుకున్నా ఒప్పుకోకున్నా జనుల్లో రచనాశక్తి యేమన్నా వుంటే వారిని ఒప్పించి తీరుతుంది. కన్యాశుల్కం ఒకవిధంగా కొందరిని ఆకర్షింపలేదా?

ఈమధ్య ఒక ప్రాచీనపండితులు ఒకసాహసం చేశారు వారిపేరు చెప్పకముందు వారిసాహసం చెప్పడం భావ్యం కాదు. వారు మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. వారు తమపేర ఒక వ్యాకరణం వ్రాశారు. అది లోగడ వైయాకరణులు అంగీకరించని ప్రాబంధిక భాషను కొంతవరకు సమ్మతించింది. ఇంకా వ్యావహారిక భాషను స్వీకరించింది.

నీవెల్లా మాట్లాడతావో అట్లా రాయి అనేమాట అక్షరాలపాళంగా యేకవీ యెన్నడూ అంగీకరించలేదు. కాని కొంతదానికి దగ్గరగా స్కాట్ ‘I wright as I speak’ అని అన్నాడు. ఈవ్యాకరణం అటువంటి మోతాదులోనే వుంది.

దీనిమీద ప్రాచీన పండితులు సవాల్ వేస్తున్నారు. నవీనులు ఇది యింకా సంకుచితంగానే వుందని గునుస్తున్నారు.

ఇది చిన్నయసూరిగారి వ్యాకరణంకంటె చాలా తేలిక. చిన్నయసూరిగారి వ్యాకరణం తెలుసుకోడానికి ప్రాణాయామానికి చేసినంత ప్రయత్నం చెయ్యాలి. జీవద్భాషలో వుండే వ్యాకరణం యింకోడిదగ్గిర పుస్తకం పట్టుకుండా వుండేటంత తేలికగా వుండాలి. ఆవిషయంలోనూ ఇది చాలా సఫలప్రయత్నం కలది అయింది. పుస్తక రచనాశక్తి అస్తమించిపోయిన యీకాలంలో దీనివల్ల ప్రస్తుతం అట్టే వుపయోగం కనిపించకపోయినా ముందుముందు యిది పఠనపాఠకాల్లోకి వచ్చి యింకా వ్యావహారిక భాషా వ్యాకరణాలకు తోవతీస్తుంది.

మనుష్యులలో కొత్తఆచారం కొత్తదేదయినాసరే వస్తే దాన్ని అనుష్ఠించకపోవడం అట్లావుండగా దాని బాగోగులయినా తెలుసుకోలేని ఒకరోగంవుంది. ఇది బహుశా మనుష్యులందరిలో లేదు. ముఖ్యంగా మన

---

శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయ వార్షికోత్సవ సందర్భమున నొసంగిన అధ్యక్షోపన్యాసమునుండి.

హిందూదేశస్థులది జబ్బు. దానికి కారణం లేకపోలేదు. దేశరాజులు నశించి విజ్ఞానం పతనోన్ముఖం అయాక పరరాజులు ఆక్రమించిన ఆఅవ్యక్తకాలములో యేదేశంలో యేప్రజలయినా యీతీరుగనే వుంటారు. మిగతా దేశాల వారి మంచి ఆచారాలు, మంచిమరలు కొత్తకొత్త విషయాలు మనం అనుభవం చేసుకోలేకపోవడం అట్లుండగా వాళ్ళనుచూసి మన దురాచారాలయినా విడిచిపెట్టలేము. మొన్నటిదాకా మనపెద్దలు కాశీవెళ్ళడానికి రయిలెక్కారు కాని భోజనాలుచేసేటప్పుడు యింగ్లీషుమాట రానిచ్చారు కారు "నోచ్ఛరేద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి" అని. నేటికినీ సముద్రయానం నిషిద్ధముకదా! ఇది చాలభాగం వాసనలో వుంటుంది.

ప్రాచీనాచారాలను మనము అనర్థకం అయినవానిని ప్రాచీనాచారాలుకదా అని అనుకోక వాటిని అతిక్రమించడం ఐతే మజా. నాకు బాల్యంలో వడుగుచేశారు దాని అర్థం నాకు తెలియలేదు. అనర్థకమైన ఒకజంధెం నా బుజంమీదికెక్కింది. అదికొత్తలో చక్కలిగింతపెట్టేది ఏదో ఒకబాధ తెచ్చిపెట్టుకున్నట్లు వుండేది. ఆభారం యింతవరకూ పోలేదు. "ఈజంధెం తీస్తే యేమవుతుం దేమి"టని నేను వశిష్టునడిగాను అమ్మో అని ఆయన ముక్కుమీద వేలు వేసుకొన్నాడు. అతి ముక్కుమీద వేలేకాని పరలోకంలోనుంచి ఒకానొక భీకరాకారము పొంచిచూస్తూ అమంగళాలనొంతరలు నామీదకితోసెయ్యడానికి వెనకాలచేతులానించినట్లు అర్థంఅయింది ఇట్లాగే అన్నం తిన్నాక కాళ్ళు కడుక్కోకపోతే యేమవుతుం దేమిటి? అని ఆవశిష్టునడిగితే పూర్వం నలమహారాజు అన్నంతిని కాళ్లుకడుక్కుండేటప్పుడు స్వాదిమొనమేర తడవకపోతే అందులోంచి కలి ప్రవేశించాడని ఆయన చెప్పాడు. నా అల్పబుద్ధికి నీకాళ్ళమీద పెంతుకులు మట్టిపోదని చెప్పితే సరిపోయేదానికి యింతకథ చెప్పంగానే ఆకలి యెట్లా ప్రవేశిస్తుందో చూతామని మనస్సుకు కుతూహలం కలిగింది. మొదట జంధ్యంతీసి చిలకకొయ్యకు తగిలించాను ఒళ్ళు జలదరించిపోయింది. నాకప్పుడు పరలోకభీతికంటె వసిష్టుచేతికీ నా చెవికీ యెక్కడ సంయోగం కలుగుతుందోఅని భయంవేసినమాట నిజం. అంచేత జంధెముమాత్రం యింతవరకూ తీసెయ్యలేదు. ఇహ రెండోది కలి ప్ర[illegible]లిగితే కావలసినంత అవకాశం యిచ్చాను దేశ[illegible] రెంటిలోనూకూడా. కాని ఆ కలి ప్రవేశించినట్లు [illegible] గోచరం కాలేదు. కాళ్ళమీద నీరుపడనే ముందే ఆ కలి అంటే యేమిటో తెగాదా వుండేది కాదు కాళ్ళు మరికొంత తోముకునేవాణ్ణి. అర్థం తెలియని యెనిమిదేళ్ళవాడికి వడుగు! కర్తృత్వం పురోహివాడి మీద వేసి యింకోడు కర్మ చేసినట్లు యీ పురోహిడిమీద కర్తృత్వం ఆరోపించి యింకోడు వడుగుచేసుకుంటే బాగుంటుంది. వాసనాజాలంలో వున్నవారికి కోపం తెప్పించకుండా గృహస్థధర్మంతో వేడుకుంటాను— ఒకసారి యీ క్షుద్రజీవులను చూడండి అని.

పండితులకు యీ వ్యావహారిక భాషతో అట్టే పనిలేదు. దీనివల్ల ముఖ్యంగా లాభము పొందవలసినవారు బాలురు స్త్రీలు సామాన్యులు. భాషంటే కేవలం కవిత్వం కాదని మన ప్రాచీన పెద్దలు ఒకసారి దృష్టిసారించాలి. కావాలిసింది కేవలం చదువుకాదు; విజ్ఞానం అని మనము గమనించాలి.

చదువువేరు. విజ్ఞానం వేరు. అక్బరుకు చదువు రాదు. కాని విజ్ఞానంకద్దు. వేమన్న చదువుకోలేదట కాని కవి రామకృష్ణపరమహంస చదువుకోలేదంటారు కాని ఆయన విజ్ఞానమూర్తి కాదని యెవ్వరయినా అనగలరా?

తెలివి కలగడానికి గ్రాంధిక భాషా వ్యవహారిక భాషా నియమమంటూ వుండదు. బుద్ధదేవుడు అనేకగ్రంథములను వ్యావహారిక భాషలో వ్రాసాడు. వ్యావహారిక భాషలో విషయ ప్రవేశం సులభంగా కలుగుతుంది ఇటువంటి సులభోపాయమును విడిచిపెట్టి గింగిసుకొని కూచోడము యేమిన్యాయము!

ప్రతిదీ వ్యవహారిక భాషలోనే వుండాలనికాని గ్రాంథిక భాషలోనే వుండాలనికాని నియమము వుండబోదు. వ్యావహారికపదాలు యెట్లా వుపయోగించాలో కవులకు తెలుసు. నీవెట్లా మాట్లాడతావో అట్లా రాయి అనే మాట అక్షరాలపాళంగా యెన్నడూ యేకవీ అంగీకరించి పద్యం వ్రాయలేదు. I wright as I speak అనిస్కాట్ అన్నమాట వచనానికి చెల్లుతుంది.

ఇక కవితేతర విషయాలున్నాయి. వాట్లల్లో రచయితలఅభిప్రాయాన్ని విషయాన్ని పాఠకులనుబట్టి వ్యావహారిక భాషయొక్కగాని గ్రాంధిక భాషయొక్కగాని ఆవశ్యకత వుంటుంది. ఇంతా వివాదేకాని యెక్కడా స్వతంత్రరచన కనబడదు. "ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగం" యేస్వల్పమో లేకపోలేదు కాని దానితో కడుపునిండదు. ఇంకా కొన్నాళ్లు మనముకనిపెట్టుకొని వుండాలి ఉందాం. ఇక్కడ యీస్వల్పాన్ని కొంచం వ్యాఖ్యానం చెయ్యాలి. సాహితి, ప్రబుద్ధాంధ్రలలో ముఖ్యముగాను భారతి, శారద మొదలయినవాట్లల్లో ఆను

ఖ్యంగాను ప్రకటింపబడుతూ వున్న (వ్యావహారిక భాషలో వ్రాయబడ్డ) కథలు చాలా స్వతంత్రరచనకు నిదర్శనాలు వ్యావహారిక భాష అంటూ వీనిని పెద్దలుకూడా విసర్జింపరు వీట్లల్లో భాషకు అపరాధంగాని భావాన్ని విధానంచెయ్యటంగాని ప్రబంధంలో వర్ణనలులాటి వర్ణనలుకాని చెయ్యటం లేకపోవడమువల్ల సర్వసాధారణముగా చదువబడుతూ వున్నవి.

భావకవిత్వము.

సందట్లో సడామియ్యా అని భావకవిత్వం వొకటి వచ్చింది భావకవిత్వం లిరిక్ అనేదానికి తర్జుమా ఇది సరియగు తర్జుమా కాదని అందరూఅంటున్నారు పోనీండి ఆదో రూఢపదం అని అనుకుందాం. ఈ భావకవిత్వాన్ని పెద్దలందరూ ఐకకంఠ్యంగా తిటుతూ వున్నారు. ఎంచేత భావకవిత్వమనే ముద్రతో బయలుదేరే యీకవిత్వము ఇంటిల్లిపాతి యెవరికీ తెలియడమూలేదు. కొన్ని తెలిసేవి వున్నవికాని అవి తెలియడములేదు. ఇది గ్రాంథికభాషే అయినప్పటికీ ప్రాచీనులకు నవీనులకూ సమంగానే తెలుస్తు వున్నది. ఈ గ్రాంథికభాషలో విచిత్రమైన అప్రయోగాలు వుంటవి, మచ్చుకు ప్రిభ్వణి. వక్షోపీఠము నాయికి (నాయకార్థంలో) యింకా అర్థానుస్వారకల్పనలు, శకటరేఫకల్పనలు యివి తీసిపారేస్తే యిబ్బంది లేదు, కాని సృష్టిస్తేమాత్రం విశ్వామిత్రసృష్టే, వైయాకరణంగా తప్పయినా వ్యవహారంలో వుండేమాటవేస్తే అట్టే తొందర లేదు, కొత్తప్రత్యయాలు కొత్తఅర్థాలు సృజిస్తే ఆసృష్టికి వెంటనే సృష్టి వస్తుంది, వ్యావహారికభాష కోరే పండితులయినా ఆవాసనను తప్పుకోలేరు.

అయితే ఒకట్రెటి. వాసనను కూడా అతిక్రమింపజేసేటంత కవిత్వం అందులో వుంటే అది ఆదరణీయమవుతుంది వ్యావహారికభాషలోని వ్యత్యయాలను (నేటికి వ్యత్యయాలు) అంగీకరించి మనం చదువుకోవడం లేదా ? వేమన్నను తోలించామా! షేక్స్పియరును యెవరయినా అంటరా?

ఇంకా యీభావకవులను తమ భావాలకు సరిపోయిన భాషలేదు, మనకు బోధపడని ఆభావములో గుణాగుణములను మనము యెట్లా నిరూపించగలము, వారు రచించే భాష అంతా సాంకేతికంగా కనిపిస్తుంది, చిన్నప్పుడు పిల్లవాళ్ళు పెద్దలకు తెలియకుండా వుండేటందుకు కొత్త కొత్తసాంకేతిక అక్షరాలు సాంకేతికభాషా కల్పించుకొని వుత్తరాలు రాసుకొనేటందుకు తమలో తాము మాట్లాడేటందుకు వుపయోగిస్తారు. అట్లాగే యీవీనిన్ని వారివారి భాషలో వారిమాత్రమే వుపయోగిస్తుంది కావలయు, అందరికి ఇది తెలిసేదే అని ఎవళ్లంటున్నా ఒకవేళ వారి ద్వారా నిజం గ్రహించడానికి లోకం వేచివుంటుంది.

ఇందులో ఖండింపదగిన విషయం మరొకటివుంది, ఈభావకవులో ఎప్పుడూ తమ గొప్పదనాన్నే రాసుకోవడం, ఎప్పుడూ కలలలో లేనియేడుపు ఏడవడం,ఎప్పుడూ దుఃఖాన్ని నిశ్వసించడం. ఈ యేడుపూ ఈ దుఃఖమూ Perennial melancholia ఇటువంటి Hypo-chondria ఎంతవరకూ కుదుర్చుకుంటే అంతమంచిది. మనస్సైనా బాగుపడుతుంది. ఎప్పుడూ తమ గొప్పదనాన్నే రాసుకుంటే లోకానికేమీ మెప్పులేదు కాని లోకం చెప్పకొనవలసిన గొప్పదనాన్ని తామే చెప్పుకుంటున్నారు.

## అందము.

మల్లాది చంద్రశేఖరరావుగారు.

సొగసుగానుండు బంగరు సొమ్ములెల్ల
దానికిందోడు మేలివస్త్రంబులెల్ల
హాయిగొల్పు సుగంధద్రవ్యంబులెల్ల
పరిమళంబీను మంచి పుష్పంబులెల్ల
ఇందు నీకందమేది రాకేందువదన?

♦ ♦ ♦

తపసి మోహింపజేయు గాంధర్వవిద్య
స్వర్గ సౌఖ్యంబెయూ సరసంపుతలుకు
భక్తిమార్గంబు చూపించు భర్తసేవ
జగతిసత్కీర్తి గడియించు సత్యదీక్ష
ఇందునీకందమేది రాకేందువదన?

♦ ♦ ♦

ధీరులజేయు నిర్మల దేశసేవ
శతసొబాలంబు సమయించు క్షాత్రవిద్య
దైన్యభాజనులను బ్రోచు ధర్మగరిమ
శాశ్వతానంద మొనగూర్చు జ్ఞానబోధ
ఇందు నీకందమేది రాకేందువదన?

# నే నా ?
(నిరూపకకథ)

కానూరు వేంకటసుబ్బారావుగారు
సారస్వతసమాజము.

## 1

"డాక్టర్! డాక్టర్!" అంటోన్న కేక నిద్రలో వినబడి చటాలున మెలుకువ వచ్చింది. పత్తేదారు సుందర్రావు కంఠస్వరం నిశ్చల ప్రపంచంలో గుర్తించగలిగెను. నిద్ర అదృశ్యమైంది. "తొందరగా దుస్తులేసుకుని ప్రయాణం కావాలి డాక్టర్" అని తొందరపెట్టేడు సుందర్రావు. డాక్టరు వేషంతోటే వెంబడించేను మరొకవాసిలాగ. గమ్యస్థానం ఏదో నేను అడగనూలేదు పత్తేదారు చెప్పనూలేదు. ఆకాశం నిర్మలంగా వుంది. చీకటిలో నక్షత్రకాంతులు మిలమిల లాడుతున్నాయి. ఇంకా ఝామురాత్రి పైన వుంటుంది. ప్రపంచం నిర్మలంగానే వుంది. వీధు లన్నీ నిశ్శబ్దంగానే ఉన్నాయి. పోలీసుస్టేషను చేరేసరికి సుమారు అరగంట అవుతుంది. సబిన్స్పెక్టరు రంగనాథం లోపల యేదో పరిశీలిస్తున్నాడు. మేమూ ఆసీనుల మయేము. ఒక టైపు చేయబడిన కాగితం సుందర్రావు కందించేడు రంగనాథం. అందీవిధమాటలున్నాయి

Dear Ranganadham,

I could present you this much at present and you will be rewarded in future in a manner befitting your merits.

A welwisher

(రంగనాథం! ప్రస్తుతం ఈ బహుమతి మాత్రమే పంపగలిగేను. ముందు ఉచితరీతిని సత్కరిస్తున్నాను హితుడు)" "ఆ బహుమతి యిదుగో" నని రంగనాథం ఒక పెట్టె ముందు పెట్టేడు. ఆవింత బహుమానము చూచి సుందర్రావు ఆశ్చర్యపోయేడు. నిశ్చేష్టుడై అట్లే నిలిచిపోయేడు. రౌద్రమూర్తని ముఖమున విజృంభించింది "సర్వనాశనము! ఘోరము!" అని యాతడు గర్జించేడు "ఔను! ముక్కుపచ్చలారని బాలుని చిత్రహత్య! అందుమూలాన ఖండ ఖండములు గాంచ నెవ్వని మానసము శోక నొందదు?

## 2

"రంగనాథంగారూ! ఇది ఎప్పుడు ఎట్లు ఇక్కడికి వచ్చిందో చెప్పగలరా?"

"ఒక్క అరగంటకిపూర్వమే ఇక్కడ చేర్చి వుండాలి. నేను ఒంటిగంటవరకు ఇక్కడేవున్నాను. ఒంటిగంటకు బీటు చెక్కు చేయడానికి వెళ్లేను రెండుగంటలకి తిరిగివచ్చేను. ఈగుమ్మం పక్కని ఈలేఖతో పెట్టబడిఉంది. రక్షకభటులు స్టేషను లోపల పని చేసుకుంటూనే ఉన్నారు. ఈచుట్టు ప్రక్కలంతా వెతికించేము. మనుష్యులజాడే కన్పించలేదు."

"సరే! ఈనేరం ఈప్రాంతాలలోనే జరిగి ఉండాలి. అంటే మీ సరిహద్దులలోనే! గ్రామాలకు రక్షకభటులని పంపి పిల్లలెవరయినా కన్పించడం లేదేమో తెలుసుకురావడంలోను ఈ విషయం యిల్లా జరిగిందని యితరుల కెవరికీ తెలియకుండా వుంచడంలోను జాగ్రత్తగావుండాలి. "డాక్టరు యిచ్చే ద్రావకంలో యీ ముండీలు జాగ్రత్త చేయ్యండి" అనిచెప్పి బయలుదేరేము. ఇల్లుచేరేటప్పటికి తెల్లవారుతోంది. గుమ్మం దగ్గిర ఒక ఆడపిల్ల — ఎనిమిదేండ్లుంటాయి పేద తట్టకూడావుంది చేతులో — గుమ్మంలో కూర్చుని మమ్మల్ని చూచి "సుందర్రావుగారెవ రండీ" అంటూ ఒక కాగితం యిచ్చింది. ఎడం చేత్తో వ్రాసినట్టుంది "సుందర్రావుగారూ!

అనవసరంగా యీ విషయంలో కలుగజేసుకొని చిక్కుల్లో పడకూడదు. మీ హితుడు" అని వుంది. సుందరరావు ఆశ్చర్యపోయేడు. "డాక్టర్! ఆ పనులలో ఆరితేరిన మనిషి హంతకుడు. మన నిసికత్తేడు మన వెంబడి తిరుగుతూనే ఉన్నాడు" ఆపిల్లనడిగితే ఎవరో తనకి బేడ డబ్బులిచ్చి యీ కాగితం మీకు ఇమ్మని ఇచ్చి వెళ్ళిపోయేడని చెప్పింది. కసి ఆపిల్లని పంపేశాడు సుందరరావు. ఏడుస్తూ వెళ్ళిపోయింది. "గిరీ! గిరీ! అని పిలిచేడు. లోపలినుంచి పదేళ్ళ కుర్రాడు చలాకీ గలవాడే! పొట్టి స్ఫురద్రూపి లోపలినుంచి పరుగెత్తుకొచ్చేడు "అదుగో! ఆ పిల్ల! జాగ్రత్త" అని వేలితో చూపించేడు. ఆగిరి కేమర్థమైందో కాని పిట్టలా ఎగిరి ఆపిల్ల వెంటబడ్డాడు. వకరలో ఇద్దరూ అదృశ్యమయేరు.

"డాక్టర్! ఇది చాలా గడ్డు కేసు సుమా!"

## 3

సాయంత్రం ఏడు గంటలైంది. నా కేమీ తోచక సుందరరావు యింటికి వెళ్ళేను. చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు "డాక్టర్! మొన్ననే నాకు బహదూరుగా టెలిగ్రాము వచ్చింది. చూశేవా ఆ లక్ష్మీ నృసింహ నాయుడుగారి మేనల్లుడు అదృశ్యమయేడని పాకలపాలెం మునసబుగారి ద్వారా ఒకటి (ప్రథమ సమాచార రిపోర్టు) పంపించేరు. మనం పరిశోధనకి తెల్లవారకుండా పాకలపాలెం వెళ్ళాలి" అన్నాడు. సుందరరావు పరిశోధనావధానము చూడడానికై తేనేమి, ప్రఖ్యాతపురుషుడు జిల్లాకలెక్టరు జిల్లాపోలీసు సూపరెంటు మొదలగు ఆఫీసర్లతో మంచి పరిచయంగలిగిన శ్రీనాయుడుగారి దర్శన భాగ్యం కలుగుతుందన్న సంతోషంచేతనేమి సుందరరావుతో బయలు దేరేను. తెల్లవారేటప్పటికి పాకలపాలెం నాయుడుగారింటికి చేరుకున్నాము. అప్పుడే నాయుడుగారు సబ్ఇన్స్పెక్టరుని సాగనంపడానికి వెళ్ళేరని తెలిసింది. ఇంట్లో నాయుడుగారి చెల్లెలు ఉంది. ఏకపుత్రుని కోసం ఏకవరసని విచారిస్తోంది. సుందరరావు ధైర్యం చెప్పేడు. "అమ్మా! సంగతి వివరంగా చెప్పితే కుమారుని వాడిని పదిహేనురోజులలో మీకు వప్పగిస్తాను" అని గట్టిగా ధైర్యం చెప్పేడు. అయితేం తల్లిప్రాణానికనక భయం తీరలేదు. కాని ఆశ యేమైనా వుంటుంది కాదూ! చెప్పడం మొదలుపెట్టింది "బాబూ! చెప్పడానికేముంది? నాథుడుగారుండగా ఒకకుర్రాడు యిలాగే అదృశ్యమయ్యేడు. నాథుడు చచ్చిపోయి అయిదేండ్లయింది. ఇక్కడినుంచి వెళ్ళిపోతే నా ఆస్తి పాడైపోతుందని నేనీ ప్రదేశం విడువలేక నాయీ చిన్నబాలుని దగ్గిరవుంచుకొని కాలక్షేపం చేస్తున్నాను. కాని నా పెద్ద కుర్రాడు అదృశ్యమవడంచేత నాభయం రాను రాను వృద్ధి అయి ఒక్కతెను వుండలేక మాఅన్నను రమ్మని వుత్తరం వ్రాసేను. మా అన్న భార్య చనిపోవడంచేతను కుర్రాడు మేనమామ యింటిదగ్గర వుండడంచేతను మా అన్న అప్పటినుంచీ యిక్కడే వున్నాడు. వారం రోజుల క్రితం పరమేశ్వరం వెళ్ళేడు. అక్కడ బ్యాంకిలో మాకు ఖాతా వుండడంచేతను మా వర్తకం అక్కడ జరుగుతూ వుండడంచేతను గుమాస్తాలను నమ్మలేక తనిఖీకి అప్పుడప్పుడు వెడుతూండడం అలవాటు. అల్లాగే వెళ్ళి నిన్న మధ్యాహ్నం వచ్చేడు. మొన్న పొద్దున్న పదిగంటలకి కుర్రాడికి అన్నం పెట్టేను. మంచంమీద కెక్కి పడుకుని ఆడుకుంటున్నాడు. నేనూ అన్నం తిని లేచేసరికి నిద్రపోయేడు.

యీ పరీక్ష యింటికి వెంకమ్మ నాకు లేఖ యివ్వాలి కుర్రాడు లేచేలోపుగా ఆ లేఖ తెచ్చుకుందామని తలుపులన్నీ వెలుపల గొళ్లెముంచి వెళ్లి వక గంటలో వచ్చాను. నేను వేసిన తలుపులు వేసినట్లే వున్నాయి. లోపల ప్రవేశించేను కాని నా మనస్సులో అదేమిటో ఆదటు బయలుదేరింది. అవును (?) తలుపు వేసినట్లేవుంది. ఈ తలుపు మూసేసనికి తెరచి మరచిపోయేనేమో అనుకున్నాను. లోపలికి వెళ్లి చూసేసరికి కుర్రాడు లేడు. దానితో అన్ని ప్రదేశాలు వెతికించేను కనబడలేదు. అని ఏడవడం మొదలు పెట్టింది. సుందరరావు ఆ మంచం పరిశీలనచేసేడు. అక్కడ అంతపరిశీలన చేయవలసిన దేమీ కనబడలేదు. అగదిలోకి వెళ్లి ఒక్క అరగంట సేపు పరిశీలించేడు నవ్వు మొగంతో యివతలకు వచ్చేడు. "అమ్మా! నీ కుర్రాడికి ఎట్టి భయమూ లేదు. నేను చెప్పినట్లు పదిహేను రోజుల్లో నీ కుర్రాణ్ణి తీసుకొస్తాను నా మాట నమ్ము" అని బయలుదేరేడు. నాయుడుగారుకూడా వచ్చేరు. వారి ముఖంలో దీనత విచారం దృశ్యమవుతున్నాయి. ఆయన ఆ సైగాధే చెప్పేరు. "సుందరరావుగారూ! ఎంత డబ్బు ఖర్చైనా సరే మా కుర్రవాడిని మాకు వప్పగించడం మీదే భారం" అని సుందరరావును వేడుకున్నాడు. సెలవు తీసుకొని బయలుదేరేను.

## 4

సుందరరావు నవ్వుకుంటూ కూర్చున్నాడు. టైపుచేసిన కాగితాలు యిరవై వున్నాయి కాగితాలుంటాయి బల్లమీద పరుచుకున్నాడు. ఈ వాక్యమే అన్నిటిలోను వుంది.

"Abstract of memorandum of Agricultural Department."

హంతకుడు రంగనాథానికి బహుమతితో పంపిన లేఖకూడావుంది. "డాక్టరు! ఇందులో నువ్వు ఏమికనిపెడతావో చూడు." అని నా ముందు పడేశాడు. నా కేమీ అర్థం కాలేదు. అందులో బాగా అందంగా టైపుచేసిన కాగితం కావాలంటున్నాడేమో అని "ఇది అందంగా" వుందని చేతికొక కాగితం యిచ్చేను. సుందరరావు వెకిలినవ్వు నవ్వి "డాక్టర్; మహావింత విషయం కనిపెట్టేవు! ఇదిగోచూడు" అని రంగనాథానికి హంతకుడు రాసిన లేఖ చూపిస్తూ యిందులో "ఎ" "ఆర్" "ఎం" అనే అక్షరాలలో "ఎ"అనే అక్షరాలు కొద్దిగా పంక్తికి క్రిందిగాను "ఆర్" కొద్దిగా పైగాను "ఎం" అక్షరంలో చివరకొమ్ము అరిగిపోయి వున్నాయి చూడు, ఆ వాక్యంలో అన్ని "ఎ, ఆర్, ఎం" అక్షరాలు అల్లాగేవున్నాయిచూడు, జాగ్రత్తగా పరీక్షిస్తే తెలుస్తుంది" అని నాకు చూపించేడు అతని శక్తి అతీతమని గ్రహించేను. తిరిగి చెప్పడం మొదలు పెట్టేడు. దానికై యీవాక్యాలు టైపు చేయించుకు రావలసిందని కమలాకరాన్ని పంపేను. పాతిక మిషనుల మీద టైపు చేయించుకొచ్చేడు. రాధామాధవ టైపు యిన్స్టిట్యూటులో చేయించిన కాగితానికి దీనికి సరిపోయింది అని ఆకాగితం నా చేతికిచ్చేడు. ఆ రెంటికి భేదం లేదు. అతిజాగ్రత్తతో పరిశీలిస్తేనే కాని తెలియదు. మళ్ళీ మొదలు పెట్టేడు. "ప్రభాకరరావుగారు దీనికి మేనేజరట వెంటనే రానియెడల చిక్కులలో పడుతున్నార"ని తంతి నీవు యిచ్చినట్లు యిప్పించినాను. వారు వూళ్ళోకి వచ్చేరు. ఈసరికి వస్తూంటారు"అని చెప్పేడు. కమలాకరం వచ్చి ప్రభాకరరావుగారు వచ్చేరని చెప్పేడు.

లోపలికి రమ్మన్నాము. సుందర్రావు లేచి వారిని మర్యాదచేసి "ప్రభాకరరావుగారూ! తమరిని నేనెరుగను. ఇదే తమ ప్రథమ సందర్శనం ఇల్లు పావనం చేయండి" అని కుర్చీ చూపించేడు. "ప్రభాకరరావుగారూ! మీతో కొన్ని రహస్యవిషయాలు మాట్లాడవలసి రప్పించేము అవి అతి నిగూఢమైనవి" ప్రభాకరరావు కీగాథ యేమిటో అగాధంగావుంది. సుందర్రావు సంగతి చెప్పేడు "అయ్యా నన్ను పిలిపించిన డాక్టరుగారెవరో సెలవిస్తారా" అని అడిగేడు ప్రభాకరరావు.

"పిలిపించినవాడను నేను, ఆయన డాక్టరు. ఎవరైతే ఏమి?"

"తమరెవరో శెలవిస్తారా?"

"నేనా? నాపేరు సుందర్రావంటారు. కొందరు పత్తేదారు సుందర్రావు అనికూడా అంటారు" అని చిరునవ్వు నవ్వేడు.

ప్రభాకరరావు వెర్రిచూపులు చూస్తూ "అయ్యా నన్నెందుకు రమ్మన్నారో శెలవిస్తారా" పత్తేదారన్నమాట వినబడడంతోటే ప్రభాకరరావు కళవళపడడం మొదలుపెట్టేడు.

"పాకలపాలెం హత్యాకేసులో మిమ్ములనొక ముద్దాయిగా చేర్చుతున్నారు పోలీసువారు" ప్రభాకరరావు నిశ్చేష్టుడైపోయేడు. భయము దుఃఖము ముఖమున విజృంభించేయి. "నేనా? ముద్దాయినా? పాకలపాలెం హత్యాకేసులోనా? విచిత్రంగావుంది బాబూ! ఆ ఊరే ఎక్కడో తెలియదు బాబూ!" అంత గంభీరవదనము ముకుళించుకొని పోయింది. సుందర్రావు నెమ్మదిగా లేచి బల్లమీదవున్న కాగితంతిప్పి "ప్రభాకరరావుగారూ! ఈ కాగితమేమిటో చూస్తారా?"

తడబడుతోన్న చేతులతో ఆ పుత్తరం తీసుకుని చూసేడు. మూడుసార్లు చదివేడు అతనికేమీ అర్థంకాలేదు. "ఇది టైపుచేసింది మీరేనా?" అని తీవ్రదృష్టితో అడిగేడు సుందర్రావు.

"చిత్తము, కాని నా కీవిషయమేమీ బోధపడటంలేదు."

"ప్రభాకరరావుగారూ! చాటున చేసినవి వెల్లడికావని తలచకండి. అందులోగవర్నమెంటూ పోలీసు సబిన్స్పెక్టరుకి బహుమతి' అని ఏగోల ఎరగని బాలునిశరీరం మూడుఖండములుగాచేసి పంపడమా? ఎందుకైనా తగుదురండి?"

ప్రభాకరరావు కేమీ తెలియడంలేదు. తల తిరిగిపోతూన్నట్లుంది. వెర్రిచూపులు చూస్తూ "సుందరావుగారూ! మీరుచెప్పింది నాకేమీ బోధ అవడంలేదు."

"అవుతుంది. కోర్టులో ముద్దాయిగా నిలబడినప్పుడే బోధఅవుతుంది. మీ మిషనులు రికార్డు ఈసరికి కోర్టులో దాఖలైయే వుంటాయి. మీరిల్లా బయలుదేరడంతోటే పోలీసువారు మీరికార్డు వగైరాలు పట్టుకొచ్చేరు."

"అయ్యా! దీనిని దైవమే నిర్ణయించాలి. ఎవరో పల్లెటూరిమనిషి వారంరోజుల క్రితం కోరితే డబ్బు తీసుకొని టైపుచేసేను. అతనిచేత సంతకంకూడా తీసుకున్నట్లు జ్ఞాపకం. నారికార్డు నానుదుటివ్రాత సరిగా ఉన్నట్లయితే ఆసంతకము వుంటుంది. మనిషి కనబడితే గుర్తించనూ గలను."

## 5

నాకేమీ తోచక పత్తేదారింటికి వెళ్ళేను. పత్తేదారు యెక్కడికో వెళ్ళేడనిన్ని రాత్రి దాకా యింటికి రాడని తెలిసింది. ఈ కేసు

చిట్టచివరకు ఎవరిమీద విరిగిపడుతూందో తెలియడంలేదు. పత్తేదారింట్లో తిరగడానికి నాకేం అభ్యంతరంలేదు. సుందర్రావు లైబ్రరీలో ఏమన్నా చదువుదామని కూర్చున్నాను. అక్కడ కూర్చున్నా యీనేరమే మనస్సులో బాధిస్తోంది. ఆకారణంచేత ఏపుస్తకంమీదకీ వెళ్ళలేదు దృష్టి, అక్కడనుంచి లేచి టేబిలుదగ్గరకు వచ్చి కూర్చున్నాను. అక్కడవకపక్క సైన్సు పుస్తకాలున్నాయి. ఇంకొకవంక సుందర్రావు వ్రాసిన "డిటెక్టివ్ థీరీస్" (Detective theories) అనే వ్రాతపుస్తకంవుంది. దానిలో ఏవో వ్రేలిగుర్తులు చిన్న బొమ్మలు ఉన్నాయి. దృష్టి మరలింది. దానిపక్క కేసు డైరీలున్నాయి. అవన్నీ తిరిగేసేను. "పాకలపాలెం" అనే పేరుతోవున్న డైరీతీసేను. అందులో అయిదు పేజీలున్నాయి. అందు వ్రాయబడిన అంశాలివి.

1వ పేజీ

హంతకుడు ఈకార్యముల నేర్పరి. అతనికి పై ఆటగాండ్రు వొక సహాయకారులవుతో వుంటారు. హంతకుడు విషముచేతనే బాలకుని చంపివుండాలి. తరవాత యిమడడానికి ఖండించి వుండాలి. ప్రాణముపోయినవెనుక అవడముచేతనే మొదటిదెబ్బకు మధ్యమొండెము తెగలేదు. ఆకారణంచేత మధ్యమొండెముకు రెండువైపులు శరీరాన్ని వున్నాయి. యిసిక మధ్యనున్న రాతిమీద కొట్టేడు."

2వ పేజీ.

వాళ్ళాఫ్సీలు కాగితంమీద వున్న వ్రేలిముద్ర F. P. బ్యూరోకి పంపేను. ప్రభాకరరావుపేర తక్షణం రావలసిందని వైరిచ్చేను. పరమేశ్వరం S I కికూడా తెలియచేసేను. రెంటికీ జవాబులు వచ్చేయి. ప్రభాకరరావు వస్తున్నానని జవాబిచ్చేడు రెండవదానిలో ఆరవతారీఖునే నాయుడు గుమాస్తాతో బయలుదేరేడనిన్ని ఓంకారపురందాకా గుమాస్తాకూడ వున్నాడనిన్ని వుంది.

3వ పేజీ.

నీరుపల్లెవం తెనక్రింద ఆనవాలు కనిపించింది. యిద్దరు మనుష్యులు కూర్చున్నారు. కాలి ఆనవాళ్ళు "థీరీ" (Theory) బుక్కులో వ్రాసేను. హరికేనులైటుకూడా పట్టుకొచ్చేరు. ఆషంతెన క్రిందే వెలిగించేరు. నాలుగు అగ్గిపుల్లలు ముందు ఆరిపోయాయి. అయిదవ అగ్గిపుల్ల వెలిగింది. అప్పుడే రాతికి తగిలిందో కాని ఆగ్లాసు చివర పావుఅంగుళం ముక్క త్రిభుజాకారంగా ఊడి ఊవలబడింది. అందులో ఒకమనిషికి జుట్టు విరివిగా వుంది ఇద్దరూ మామూలువేషాలతోనే బయలుదేరేరు. అడుగులజాడచూస్తే ఒకమనిషి కొద్దిగా లావుగాను పొట్టిగాను వుంటాడనిన్ని రెండవవాడు సన్నంగాను పొడుగుగాను వుండి వుండాలి, సన్నని మనిషి ఆడమనిషైనా అయివుండాలి, సన్నని మనిషి భయస్థు, యీకార్యానికదే ప్రథమం అని తోస్తుంది. లావుమనిషి ఆరితేరినవాడే.

4వ పేజీ.

ప్రభాకరరావు అమాయకుడే! ఇతనివలన రెండోమనిషి దొరకవచ్చు. అతనిపైపు రికార్డులో "వి. చంద్రారెడ్డి సంతకం ఉంది. చంద్రారెడ్డి పొడుగుగాను చామనచాయగాను పొడుగుకు తగిన బలంగాను ఉంటాడనిన్ని చాలా తెలివిగలవాడననే గర్వం ఉందని ప్రభాకరరావు చెప్పేడు. మేమిద్దరం రేపు వెడతాము.

5వ పేజీ.

సూపరెంటుదొరగారికి వ్రాయగా గెజటు పంపించేరు. మూడేళ్ళనుంచి పడుతోంది ఇప్పటికి.

మనస్సుకి సంతృప్తి అయింది. కేసుచాలవరకు పూర్తిఅయినట్లే ! ఇంక నేరం స్థిరపరచాలి. వీరవిల్లి వ్రాసిన ఉత్తరానికి బయలుదేరి వస్తున్నానని జవాబు వచ్చింది.

*  *  *

డైరీ చదివేసిన్న మాటేకాని నాకేమీ తెలియనూలేదు తెలియకపోనూలేదు. ఎంత ఆలోచించినా సంగతి వివరంగా గ్రాహ్యం కానూలేదు. విసుగెత్తి లేచేను.

## 6

సెషన్సుకోర్టులో జనం అంతా కిక్కిరిసి ఉన్నారు. జిల్లా పోలీసు సూపరెంటు దొరవారు స్వయంగా వచ్చేరు. సుందరావు, దొరగారు చాలాసేపు మాట్లాడుకున్నారు. దొరగారి ముఖం తీవ్రకోపంతో నిండి ఉంది. యిరవైమంది రిజర్వుకూడా వచ్చింది దొరవారిప్రక్కను నలుగురు నిలబడ్డారు. ఇద్దరు క్రింద కాగితాలు సర్దుతున్నారు. తక్కినవారు బారుచుట్టూ తుపాకులతో నిలబడి వున్నారు. సూపరెంటు దొరవారి ప్రక్కనే నాయుడుగారికి ఆసనమిచ్చి గౌరవించేరు. సుందరావు వారిపక్క కూర్చున్నాడు. రంగనాథం దొరవారి దగ్గిర నిలబడ్డాడు. ఖైదీనితీసుకొని రావలసిందని ఆర్డరైంది. ఇంతలో కోర్టు కావల "ధాం" మ్మని తుపాకి పేలింది. అందరు ఆవయిపు దృష్టి సారించేరు. చిత్రం !! ఇంతలో విచిత్రంగా కనుమూసి కను తెరచునంతలో నాయుడుగారి కాళ్ళకు చేతులకు స్ప్రింగు సంకెళ్ళు తగిలింప బట్టాయి. రంగనాథము ముందుకు వచ్చి "దయచేయండి నాయుడుగారూ ! మీరే శాంతికులుగా పరిగణింప బడుతున్నారు" "నేనా" "నేనా" అన్నమాట నాయుడు నోట్లోనే అంతరించిపోయింది. చివరకి నాయుడుగారే మేనల్లుడిహత్యకు కారణమైన ముద్దాయిగా మారిపోయేరు ఎంతవింత?

## 7

పత్తేదారు సుందరావు బోనులో నిలబడ్డాడు. అతని ముఖంలో భీభత్సం కురుస్తోంది. అతని సాక్ష్యము మొదలు పెట్టేడు.

నేను ఈవృత్తిలో ప్రవేశించి యిరవై సంవత్సరాలయింది. మొదటి ఎనిమిది సంవత్సరాలు విద్యార్థిగానే ఉన్నాను.— ఈనేరం నవంబరు ఎనిమిదో తారీఖున పాకలపాలెం గ్రామంలో జరిగింది. పరిశోధనకు ముఖ్యాధారం సబిన్స్పెక్టరు రంగనాథంగారికి పంపిన టైపు చేయబడిన లేఖమాత్రమే. తరువరి ఆపెట్టెలో ఉన్న మొండెములు. నాడు ఎనిమిదో తారీఖు రాత్రి రెండు గంటలకి సబిన్స్పెక్టరు రంగనాథం దగ్గరనుంచి కబురొచ్చింది. డాక్టర్ రాఘవన్ నేను బయలుదేరి వెళ్ళేము. రంగనాథం ఈ లేఖ చూపించాడు ఆపెట్టె ముందు పెట్టేడు. లేఖలోనున్న వాంశాలివి "Dear Ranganadham, I could present you this much as present and you wil be rewarded in future in a manner bufitting your merits, A welwisher" ఇందులో "ఎ" అనే అక్షరాలు పదకొండు ఉన్నాయి ఆపదకొండుకూడా పంక్తికి కొద్దిగా క్రిందుగా పడ్డాయి "ఆర్" అనే అక్షరాలు పదకొండూ కొద్దిగా పైగావడ్డాయి ఈఅక్షరాలు జాగత్రగాచూస్తేనేకాని తెలియదు. "ఎం" అనే అక్షరాలు నాలుగింటికికూడా చివరకొమ్ములు అరిగిపోయాయి ఈకారణాలచేత పరిశోధనకవకాశం కలిగింది. ఇదికాక రెండోపక్కకూడా పరిశోధనకు దొరికింది. అవి నేరస్తునిగా నిరూపించడానికి తగిన ఆధారభూతం ! కష్టమోయినప్పటికి శాంతకుడాతడే అని మనోసమర్థన చేసుకోవ

డానికి త్రోవ దొరుకునని ఈత్రోవనుకూడా పరిశోధన మొదలు పెట్టేను; శవము మూడు మొండెములలోను మధ్య మొండెముల్లోపై రెండు నాటులున్నాయి. కత్తి వాడిదని కంఠం మొండెం చెబుతోంది. అట్టితరి మధ్య మొండెము మీద నాటులుండవలసిన అగత్యమేమిటా అని ఆలోచించవలసివచ్చింది. కత్తి వాడిది అవయవాలు గట్టిపారలేదు. ఖండించడం సులభం దీనినిబట్టి చనిపోయినతర్వాత పెట్టెలో యిరకడానికి నరికివుండాలనుకున్నాను. కంఠము నలుగుడు లేకపోవుటచేత విషమిచ్చి ఉండాలి. చనిపోయినతరువాత ఖండించడంచేతనో, తొందర, ఖంగారులో ఖండించుటచేతనో నాటులు పడి ఉండాలి. శరీరాన్ని కొద్దిగా యిసికి వుండడము ఒకభాగాన్ని రాతిబావతు ముక్క ఉండుటచేత యిసుకలో ఉన్న రాతిమీద కొట్టి ఉండాలనుకున్నాను. అది రహస్య ప్రదేశమై ఉండాలి. దీనిని కనుగొనడానికి ముందు ఈ బాలుడేగ్రామానికి చెంది ఉంటాడో తెలుసుకోవాలి. ఇల్లా అనుకుంటూండగానే నాయుడుగారు మున్సబుద్వారా ప్రథమసమాచార రిపోర్టు తమ మేనల్లుడు కనుబడడం లేదని స్టేషనుకుపంపి మాప్రయత్నంలో కొంత భారం తగ్గించేరు. పాకలపాలెం పోలీసుస్టేషనుకు ఎనిమిది మైళ్ళు. ఇక్కడికి రెండేమార్గాలున్నాయి. ఆ రెండు మార్గాలా వెతకాలనుకొన్నాను. ఇవి ఆలేఖ, ఆమొండెములు నాకు తెలియజేసిన ప్రథమ సమాచారము. ఈరెండు మార్గముల ప్రయత్నము మొదలుపెట్టేను. ఆవెంటనే స్టేషనునుండి యింటికి వెళ్ళేసరికి ఒక పిల్లచేత హంతకుడొక లేఖ నిచ్చి పంపేను. దానిని చూచుకున్న వెంటనే హంతకుడాతేలిన మనిషి. అనిన్ని హంతకుడే తానని మాకు తెలుసునని గ్రహించిన ముందు ముందు చాల చిక్కులు పెడతాడన్న ఆలోచనతో మారువల్క అవలంభించవలసి వచ్చింది. పైపు కాగితంలో వున్న వ్యక్తాక్షరాలు చూచి కమలాకరాన్ని కనపడిన పిసన మీదల్లా యీ వాక్యం టైపు చేసుకొమ్మని పంపేను. "Abstract of memorandum of Agicultural Deparment" దీనిలో అర్థం లేకపోయినా ఏ, ఆర్, ఎ, అను అక్షరాలు ఎక్కువ ఉండడమే నా ఉద్దేశం. చేయించుకున్న వాటిలో ప్రభాకరరావుగారు టైపుచేసిన దానిలో మాకు కావలసిన అంశాలు దొరికేయి. వారి దర్శాలో వి. చెంద్రారెడ్డి అని ఉంది. మేమిద్దరమూ కలసి చెంద్రారెడ్డికోసం వెతకడం మొదలు పెట్టాము. చివరకి దొరికేడు. లక్షాధికారి, గొప్ప కుటుంబీకుడు అవడమే కాకుండా ఎట్టి కల్మషము లేనివాడవడంచేత తననామధేయమే యిచ్చేడని తెలుసుకున్నాము. పరమేశ్వరమే వెడుతున్నాడని తెలుసుకున్నాము. దారిలో ప్రభాకరరావు చెంద్రారెడ్డి మాట్లాడుకున్నారు. పరమేశ్వరంలో చెంద్రారెడ్డి ప్లీడరుగారింటికెళ్లాడు. మేము స్టేషనుకివెళ్ళి రక్షకభటులను తీసుకొని వచ్చేసరికి చెంద్రారెడ్డి కూడా వచ్చాడు. "అయ్యా! చెంద్రారెడ్డిగారూ! పాకలపాలెం బాలహత్య కేసులో మిమ్మల దస్తగిరి చేసేమని వారంటు నేను చూపించేను. ఆశ్చర్యపోయేడు చెంద్రారెడ్డి. " నాకేమీ తెలియదన్నాడు పోలీసుస్టేషనుకి వచ్చి సంగతులన్ని చెప్పుకొన్నాము. ఏమీ అల్లరిలేకుండా వచ్చాడు. వారి ద్దరినీ సబిన స్పెక్టరుకు వప్పచెప్పి నేను యింటికి వచ్చాను. నాయుడుగారు పంపిన రిపోర్టు చూచి నేను డాక్టరుగారు కలసి పాకలపాలెం వెళ్ళేము.

నాయుడుగారు యింట్లో లేరు. ఆ బాలకుని తల్లితో సంభాషించి యిల్లు పరిశోధించాను. నాయుడు గారి జేబులో రెండు కార్డులు దొరికేయి. ఒకటి వీరవిల్లినుంచి వ్రాసినట్లుంది. దానితో నామనస్సులో మెరవు మెరసినట్లయింది. తరువాత కాలవలు మొదలగు యితర ప్రదేశాలు వెతకడం మొదలు పెట్టాను. తుదకు రాచబాట ప్రక్కనే సీకుపిల్లి వంతెనక్రింద — చుట్టూ పొదలున్నాయి పగలే భయంకరంగా వుంటుంది అక్కడ — ఆనవాళ్ళు దొరికేయి. కాలిగుర్తులున్నాయి. రెండవ వాడెవడో యీమధ్యనే చేరేడని తెలుసుకున్నాను. మొదటివాడు ఆరితేరిన మనిషైనా రెండవవాని ఖంగారువల్ల యీలోపాలకి కారణమైందని గ్రహించేను. ఆవంతెన క్రింద రాయియు యాశవమున కంటుకొన్న రాతిముక్కయు వక్కటే అని గ్రహించేను. ఆక్కడ దొరికిన హరికేను లైటు గ్లాసుముక్క సరిగా నాయుడుగారి యింటిలో ఉన్న లైటు అద్దముకు సరిపోయింది. లైటుచేయించుకు రావలసిందని నాయుడుగారు తనచేతికిచ్చేరని చెందాడ్రెడ్డి చెప్పుటయు నాయుడుగారు చేవ్రాతతో ఉన్న కాగితమును (చెందాడ్రెడ్డి) దీనికి ముఖ్య కారణమైనది. ఆవంతెనక్రింద పాదచ్ఛాయ లచ్చులున్నాయి. అవి నాడయిరీ బుక్కులో వ్రాసేను. నాయుడుగారి పాదరేఖలకు నానోటు బుక్కులోని వాటికిని ఏమాత్రము భేదము లేదు. అది అట్లుండగా నాయుడుగారు పరమేశ్వరంలో 8 వ తారీఖుదాకా ఉన్నారనిన్ని తొమ్మిదవ తేదీకి వచ్చేరనిన్ని చెప్పేరు. దానితో సబిన్స్పెక్టరుకి తంతి యిచ్చేను దానికి "నాయుడుగారితో 8వ తేదీని గుమాస్తా ఓంకార పురందాకా వెళ్ళినాను" అని వెళ్ళిన గుమాస్తా చెప్పుచున్నాడని వైరు వచ్చింది. ఏ కారణం లేకపోతే ఓంకారపురంవరకు వచ్చి ఒక మైలు దూరంలోవున్న పాకలపాలెం వెళ్ళకుండా వుండడానికి కారణమేమై వుంటుంది? తుదకు హంతకుడెవరని తేలినది? ప్రఖ్యాతపురుషులు ధనాఢ్యులు గొప్ప ఆఫీసర్లతో కలిసి పరిచయము గలవారు నగు లక్ష్మీనృసింహా నాయుడుగారు అని తేలింది కాని అన్నగారు చెల్లెలికొడుకుని చంపుకొనా అను అంశము చర్చనీయాంశము. ఇదివరలో వారియిల్లు పరిశోధన చేసినపుడు వారి జేబులో రెండు ఉత్తరాలు దొరికేయని చెప్పియే వున్నాను. అందొక ఉత్తరం వీరవిల్లి నుంచి లక్ష్మీనృసింహా నాయుడుగారు వ్రాసినట్లుంది. దీనికి జవాబు రెండవ కార్డు. అది ఆమె వ్రాసినట్లు మన నాయుడుగారి దస్తూరితో వున్నది దానితో నాసందేహం తీరింది. ఈమె అన్నగారు యీ నాయుడుగారు కారనిన్నీ అన్ననని మోసపుచ్చి కుతంత్రములు పన్ను మాయావి అని గ్రహించేను. దానిపై వీరవిల్లి ఉత్తరం వ్రాసేను వారు వెంటనే జవాబిచ్చేరు. అదుగో కుర్చీమీద కూర్చున్న వారే బాలకుని నిజమగు మేనమామ.

అయితే ఈకృత్రిమ నాయుడెవరు ?

## 8

ఈ ప్రశ్న ఒకరోజు తీవ్రంగా నామనస్సులో బాధించింది. నాయుడుగారి వ్రేలిముద్రలున్న నాంగ్మాలపు కాగితాలు ఫింగరు ప్రింటు బ్యూరోకి పంపేను. తర్వాత సూపరెంటుగారికి వ్రాసి "క్రిమినల్ యిన్వెస్టిగేషను గెజటు" తెప్పించి చూచాను దానిలో ఈనాయుడుగారి బొమ్మవుంది. ఈ యానవర్ణనకూడా ఉంది. ఈతని నిజమైనపేరు పరాంతకుడు. ఇతనికిదివరలో నాలుగు శిక్షలు

న్నాయి. పదిహేను ఏళ్ళు శిక్షపడ్డాడు. కూరేళ్ళ గ్రామంలో హత్యగావించి పారిపోయ్యేము ఆరేళ్ళనుంచి పరారి అయిపోయేడు అని వ్రాయబడిఉంది. ఫింగరుప్రింటు బీరో (వేలిగుర్తునుపట్టి దొంగను గుర్తించు సఘము) నుంచి నాలుగు శిక్షలనుభవించి ఉడనిన్ని వచ్చినది. ఇతడు నిజముగ పరాంతకుడుగాని నాయుడుగాడు. ఈరెండు నేరములు ఇతనిమీద ఉన్నాయి. అని జోను చదివేడు. నాయుడు (పరాంతకుడు) యేమీ చలింపలేదు. రెండవ సాక్షిని కేక వేశారు.

## 9

నాయుడు లేచి నిలబడ్డాడు. ముఖంలో చిరునవ్వు చెంగలిస్తోంది. ఏదో సమములుతో చెప్పడం మొదలుపెటేడు "ఇంకా సాక్షులెందుకూ? నే నే స్వయంగా నిజస్థితి వప్పుకుంటో నే వున్నాను. నా చరిత్ర చెప్పవలసివస్తే చాలా వుంది. అది యిప్పుడు తరగదు గనుక యీ నేరానికి సంబంధించిన విషయాలే చెప్తాను. దీనికంతకీ వయస్సు మళ్ళినకొలది పశ్చాత్తాపం మనస్సులో తీవ్రంగా బాధిస్తోండడమే కారణం. చెబుతున్నాను వ్రాసుకోండి "లక్ష్మీన్రృసింహ నాయుడుగారికి నాకు దక్షిణాదిని స్నేహం కలిసింది. వారిచరిత్ర వారి నోటినుండే విన్నాను. వారు పండ్రెండవయేట యిల్లువదిలి నాటక కంపెనీలో ప్రవేశించేరనిన్ని వారి తల్లిదండ్రులకు తానున్ను తన చెల్లెలు తప్ప యింకెవ్వరూ లేరనిన్ని తనచెల్లెలి ఆస్తిమంతులగువారిన్ని యింటి వద్దనుంచి వెళ్ళిపోయినతర్వాత చెల్లెలిని ఒకసారి కలుసుకున్నాడనిన్ని అమె తన యింటికి వచ్చి ఉండవలసిందని చెప్పిందనిన్ని వారెవ్వరికి పెద్దతగువై తానామెముఖం చూడనని శపథం తీసుకున్నాడనిన్ని తనది వీరవిల్లిగ్రామ మనిన్ని మొదలగు విషయాలన్ని వివరంగా చెప్పేడు. తనచెల్లెలుమొగ మిక యీజన్మలో చూడలేనని కూడా చెప్పేడు. ఇదే నాకు చాలా లాభించింది. దానిపై అతను వ్రాసినటుల అతని చెల్లెలికి "స్ఫోటకము పడినాననిన్ని సహాయకారు లెవ్వరులేక చాలా శ్రమలు పడిపోయినాననిన్ని తెలియని దేశమువచ్చినందుకు పశ్చాత్తాపము పడుతున్నానను విషయాలతో లేఖ వ్రాశాను. దానిపై ఆమె తన భర్త పోయేడనిన్ని తనకు దిక్కులేదనిన్ని అక్కడికివచ్చి వుండవలసినదనిన్ని వుత్తరం వచ్చింది. తగిన అదును దొరికింది గ్రహించి అక్కడచేరేను. స్ఫోటకంచేత ముఖం మారిపోయిందేమో అనుకుంది ఆమె. అయిదేళ్ళనుంచి స్వేచ్ఛగా కాలక్షేపం అవుతోంది. మంచి పరువు ప్రతిష్టలతో కాలక్షేపం జరగడమే కాకుండా పెద్ద వుద్యోగస్థుల పరిచయం కలిగింది. అట్టి స్థితిలో యీమె ఆస్తి అంతా హరించాలనే వుద్దేశం కలిగింది. దానితో యెట్లైనా ఆబాలుని చంపివెయ్యాలనుకున్నాను. ఎనిమిదవ తారీకు పొద్దున్నే యింట్లో ఆమె యెరక్కుండా ప్రవేశించేను విషం పెట్టేను. ఆకుర్రాడు తియ్యగా వున్న మూలాన్ని తినేశాడు మత్తుతో పడిపోయేడు మంచం మీద పడిపోయేడు. నిద్రపోయేడనుకుని తల్లి పొరుగింటికి వెళ్ళింది. ఈ లోపుగానే కుర్రాడిని తీసుకొని యీవలపడ్డాను. రెండవమనిషి వీధిలో వేచియున్నాడని నేను వేరే చెప్పనక్కరలేదు. తక్కినవిషయాలన్నీ పత్రేదారు సుందరరావుగారు చెప్పేవున్నారు. ఆయన యీవిషయంలో ప్రపంచాతీతమైన వ్యక్తి. నా జీవితంలో చాలమంది పత్తేదారులను చూచితినిగాని అట్టి విచిత్ర పరి

శోధకుని గాంచలేదు. ఆయన విషయము లన్నిటిని చెప్పినారుగాని ఒక్క విషయం మరచిపోయేరు నేను శవమును రంగనాధముకు పంపించుటయందున్న హేతువేమిటో చెప్పలేదు. రంగనాధం గారూ నేనూ చిరపరిచితులమే. ఆయన తంజావూరుజిల్లాలో సి. ఐ. డిగా పనిచేసేటప్పుడు వారి నొకరాత్రి వంటరిగా కలుసుకున్నాను. ఒకనేరంలో ప్రయత్నం చేస్తోంటే "ఎందుకు శ్రమపడుతారు నన్ను మీరు పట్టుకోలేరు. చిక్కులలో కూడ పడతారని వారికి చెప్పివెళ్ళేను. అప్పుడే నా మహిమ వారికి తెలిసింది. వారి శక్తి పరిశోధిద్దామని పంపించేను. ఇంక నాకో పిక లేదు ప్రాణంపోతోంది. నా కాగితాలు యిక్కడ వున్నాయి. సాధనం ఎక్కడవుందో వ్రాయబడింది. అది దానధర్మం చేయించండి" అని వాగిపోయేడు. ఒక్క నిమిషంలో శవమై పోయేడు వాంగ్మూలమిస్తూ నమిలినది విషమేమో.

---

## మిళింద రాయబారము.

రాఘవరావుగారు, (సారస్వతమిత్రమండలి.)

### బాలకవి.

ప్రేమగీతికాలాప వి ♦ వేకగరిమ
మామకీయమే యని యెంచు ♦ ఓమిళింద!
నింగినొఱసెడు ప్రేమత ♦ రంగమందు
పరమొసఁగునాదుప్రణయతుం ♦ పరలుకఱుగ
ప్రకృతియుఁటయెంతో అందాల ♦ వనితయంట,
బెళుకుకనులాఁడు వేడి క్రొం ♦ దళుకులంట,
తటవిహీనమౌ ప్రణయాబ్ధిఁ ♦ దపగభీర
గర్భకుహరంబులో దాఁచుఁ ♦ గలిగెనంట,
కవిభుజంగ రాడ్వరులలో ♦ కన్యయంట,
గాటమౌప్రేమ గాలుల ♦ కవికుమార
హృదయ సుమభావరజముల ♦ నెగురఁగొట్టె
నంట, నాతూలికామణి ♦ జంట యంట,

అస్మదీయాంధకారదుః ♦ ఖాంకముఁను
ప్రేమ గీతికా కౌముదల్ ♦ వెల్చునంట
విపుల నిబిడాంధకార ప్ర ♦ వేష్టములను
విప్రకృష్టభారము మది ♦ విడకిలోనక
ప్రణయచూర్ణికల్ బాడుచు ♦ బైలుదేరి
ఆమెకడ నాలపింపు నా ♦ యార్తరవము.

### మిళిందము

బాలకవిరా! ప్రకృతికాం ♦ తాలలామ
ప్రణయసూత్రాన బంధింపఁ ♦ బడునో, లేక
ప్రేమగీతాంజలులకు సం ♦ ప్రీతిఁగనునో
కాక, ప్రణయ ప్రేమలను వ్య ♦ క్తీకరింప
శక్తిలేని నీభావాల ♦ శరణుఁగనునో,
తెలుపుమిదె బోయియామెను ♦ గలిసికొందు.

# గ్రంథవిమర్శనము.

## 1. త్యాగరాజస్వామి చరిత్రము.

గ్రంథకర్త:— పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు. క్రౌను 188 పేజీలు, వెల రు 0-10-0 లు.

ఇది మద్రాస్ ఆంధ్ర గ్రంథమాలవారి 6 వ కుసుమము. త్యాగరాజస్వామి నెఱుంగని యాంధ్రుడుండడు. సుగుణసంపన్నుడు. శ్రీరామభక్తుడు నగు త్యాగరాజస్వామియొక్క జీవితము హృద్యముగ పద్యములలో వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజస్వామి కీర్తనలు చేర్చబడినవి. శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వ్రాసిన రమ్యమగు నుపోద్ఘాతముచే విలసిల్లుచున్నది. ఇంతకంటె నీగ్రంథమును గురించి వ్రాయుట కేవలము సాహసము. ప్రతియాంధ్రుడును చదవదగినది. చదివినయెడల శైలియొక్క ధారాశుద్ధి స్పష్టపడగలదు. చక్కని గ్లేజు కాగితముపై ముద్రింపబడినది

## 2. ధమ్మపదము.

గ్రంథకర్త:— కిళాంబి రంగాచార్యులుగారు, క్రౌను 112 పేజీలు. వెల రు 0-10.0 లు.

ఆంధ్రగ్రంథమాల, మద్రాసువారి యేనిమిదవ గ్రంథము. ఇందును దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యుపోద్ఘాతము కలదు. బుద్ధభగవానుని జీవితము ప్రతి భారతీయునికిని విదితమే. ఆమహనీయుని మతము ప్రపంచమునం దనేకమూలల వ్యాపించియున్నది. నేడామతము మన హిందూదేశమునందు శిథిలావస్థయందున్నను, బర్మా, చైనా, జపాను మున్నగు దేశములలో నేటికిని బౌద్ధమతస్థు లుండియున్నారు. బుద్ధభగవానుని మతసూత్రములయొక్క యుత్కృష్టతయే తన్మతవ్యాప్తికి మూలము. ఈ మహనీయుని సూత్రములు పాళీభాషయందు క్రోడీకరించి వ్రాయబడియున్నవి. ఆగ్రంథము 2200 యేళ్ళనుంచి వ్యాపించియున్నది. నేటికి మన ఆంధ్రభాషయందు బౌద్ధమత సూత్రములు పుస్తక రూపమున ప్రచురించు భాగ్యము కలిగినది, జయంతిపురం రాజాగారిదివరకే ధమ్మపదమును ప్రచురించియున్నారు. ఇది రెండవ గ్రంథము. అంగలూరులో బలరామకృష్ణయ్యగారీ గ్రంథము నిమిడ్చి బుద్ధపురాణమును వ్రాయుచున్నారట. తత్త్వోపదేశము నైతికసూత్ర ప్రచారముల కెన్ని గ్రంథములు రచించినను తనివితీరదు. ఇందలి నైతికసూత్రములు ప్రతి భారతీయునికిని తెలిసినవే. పుస్తకరూపమున బయల్వెడలుటకు నిదియే ప్రథమ యత్నము. ఆంధ్రులు నేడు మరచియున్నను బౌద్ధమతము వారికి క్రొత్తది కాదు. ఆంధ్రదేశములో నచటచట బౌద్ధస్తూపములు విలసిల్లియున్నవి. అమరావతి, గుంటుపల్లి, జగ్గయ్యపేట, భట్టిప్రోలుస్తూపము లిందుకు నిదర్శనములు. ధమ్మపదమనగా ధర్మపథము. ఆంధ్రగ్రంథమాలవారు ప్రచురించిన నీతినిధితోబాటు నిదియు నత్యుత్తమమైన గ్రంథమనుటకు సందియము లేదు

## 3. పైడిలేడి — అపవాదము.

గ్రంథకర్త:— నాళము కృష్ణరావుగారు, రాజమహేంద్రవరము, వెల రు 0-4-0.

బంగరు (మాయా) లేడికై బుత్తెంచిన రాముని జాడ వరయ లక్ష్మణుని సీత బంప నుద్యమించుటయు, లక్ష్మణు డొకవంక సోదరయాజ్ఞ నుల్లంఘింపవలసి వచ్చుటయు, మరియొకవంక సీతయాజ్ఞను తిరస్కరింపవలసి వచ్చుటయు నిట్టిస్థితిలో నేమియు తోచకయున్న లక్ష్మణుని సీత వివిధమార్గముల దూరుటయు, సీత పశ్చాత్తాపము నొందుట భాగమునందలి కథ. ఇది యొక ఖండకావ్యము. శైలి యున్నతము. భావపూరితమనుటకు సందియములేదు. అంతయును బాగుగ నేయున్నది కాని "అనుజసేవాధురీణుడైన" లక్ష్మణుని పట్టుకొని,

"వాడు (రాముడు) చచ్చినతోడ నాపీడ వదలు
వాని భార్యను జేపట్టి వైభవంబు
మించ నేలెదగా" యంచు నెంచితేమొ?
నిలువు నీరయి కూలవే తులువ యపుడె?
తమ్ము డొక్కడు రాజ్యంబు తస్కరించె
బలిమి నొక్కడు భార్యం జేపట్ట నెంచె,
యేమి కావింప నుండెనో యింక నొకడు
మంచితమ్ములం గూర్చెరా నాలువమ్మ.

యనినపుడు సీత దేవతాంశసంభూతయా, లేక సామాన్యస్త్రీయా యను సందియము కలుగుటయు శాంతమగు హృదయకోశమునుండి యిట్టి నిష్ఠుర వచనంబు లెట్లు వెడలె, మంచునుద్దను కుండుచిచ్చు పుట్టునా యను భావములు స్ఫురించుటయు, జరుగకమానదు. సామాన్యస్త్రీలు స్వార్థమునకై యెట్టిమాటలనైన ననెదరు. అట్టివారి సందర్భములో,

"తనహితము తా మెరుంగరు, తనహితంబు
గోరి యొరులాడుపల్కుల చీరిగొనరు,
తాము చెప్పిన మాటలే తథ్యమనుచు
పెనగెదరు చానలెంతటి వెడగులార!"

యని యనిపించక మానదు. సీత పశ్చాత్తాపమును పఠించినపుడు తొల్లిటి భావములన్నియు నశించును, పై పద్యములవలన సీత కేవలము మానవస్త్రీయని తోచక మానదు. ఈ స్వల్పపాటు లోపమును సవరించినచో, పుస్తకము చిన్నదయినను యత్యద్భుతముగ రచియింపబడినదనుట నిర్వివాదాంశము. అపవాదమునకు జెందిన భాగమును చదివినపుడు హృదయము కరిగి నీరుగాక మానదు.

పుస్తకము వెల కొంచె మధికమేమో యని మా యభిప్రాయము.

## 4 శ్రీ రాజపుత్రాభివర్ధని.

క్షత్రియ సంఘాభివృద్ధికి పాటుపడు మాస పత్రిక. విశాఖపట్టణములో శ్రీ భూపతిరాజు సీతారామరాజు గారి యాధిపత్యమున ప్రచురించబడుచున్నది సంవత్సర చందా రు 3 లు.

## 5. ఆంధ్రహృదయము (నవల)

గ్రంథకర్త:- నరహరిశెట్టి వెంకటరత్నంగారు ఆనంద నికేతనము, యేలూరు, పశ్చిమగోదావరి క్రౌను 67 పేజీలు వెల రు 0-8-0 లు.

ఆంధ్రులు తమ సహజవ్యక్తిత్వం మరచిపోతున్నారు యువకులు పాశ్చాత్యసంపర్కంలో మునిగి తేలుతున్నారు. ఆంధ్ర రమణులు తమ సహజలక్షణాలు విడనాడినారు "వారి చీరకట్టులోని సౌందర్యం, వారి శాంతమయన యనయములలోని మాధుర్యం వారి కట్టుబాటులలోని గాంభీర్యం" "అమరాళగమనం" పోయి యిపుడు గుబ్బపుకదను నడకలు బయలుదేరినాయి ఈ అరణ్యంలో, యీ అజ్ఞానతిమిరకూపంలో ఆంధ్రదేశం కొట్టుకొంటూన్నపుడు పైకి లేవనెత్తేభారం నేటి యాంధ్రకవులది. కవులదే కాదు. యువకులదికూడను.

భాషా ప్రపంచంలోని మాధుర్యం అడుగంటేందుకు మనిషిలోతోవ. షికార్లు స్వేచ్ఛా విహారాలు బయలుదేరాయి. దీని నుద్ధరించే బాధ్యత ఆంధ్రులది.

విశాలభావాలు వెదజల్లే ధర్మం, స్వాతంత్ర్యవాయువులు వీచేటట్లు చేయవలసిన విధి ఆంధ్రులది. ఇప్పటి బళ్ళు విద్యాలయాలు యిందుకు తోడ్పడవు.

"ఆదినుండి సృష్టి అందము దినదినము పెరిగిపోతూవుంది. ప్రకృతి తన ఒడిలోనికి రమ్మని మానవుల్ని ఆహ్వానించుతుంది ఆంధ్రులు వినడములేదు వినలేక పోతున్నారు."

గ్రామాల సౌందర్యం యెవరిని ఆకర్షించటం లేదు అంతా పట్టణాలకి పయనం. వ్యవసాయం కృశిస్తూంది దారిద్ర్యం వృద్ధి అవుతుంది "మనుష్యులు కట్టుకున్న పట్టణాలలో మనోహరత్వం రమ్మంటే యెలావస్తూందో" గ్రహించలేకున్నారు.

ఆంధ్రులకు తమశక్తి తెలియదు. ఆంధ్ర వాతావరణములోని అనంతమైన సౌందర్యం మాధుర్యం నేటి ఆంధ్రులకు గోచరించదు.

సంఘంలో చాల దురాచారాలు, మూఢ సాంప్రదాయాలు విస్తరించేయున్నవి. భేదాలు పెరిగిపోతున్నాయి. భేదాలన్ని మానవులు మానసిక దౌర్బల్యంవలన తెచ్చిపెట్టుకొన్నవే కాని పరమేశ్వర సృష్టిలోను, ప్రేమసామ్రాజ్యంలోను వీటికి నెలవులేదు.

సంఘంలోపాల్ని భాషాలోపాల్ని సంస్కరించే నాయకులు, కవులు, శిల్పులు కావాలి. "ఆంధ్రుల జీవితంలోనిఅందం అద్దంలో చూపించినట్లు అనుపమానవకలలు" వ్రాయాలి "ఆంధ్రుల సాంసారిక జీవితంలోని మాధుర్య గ్రామ జీవనంలోని లోతు తెలిపే గ్రంథాలు కావాలి." ఈకొరతలు తీర్చే యత్నం ఎంత స్వల్పంఅయినా అభినందించదగినదే. వందలు వందలు తర్జుమాలు ఒక స్వతంత్ర రచనా సమర్థునియొక్క భావస్ఫూర్తి గ్రంథంముందు దిగదుడుపులు మామిత్రులు నరహరిశెట్టి వెంకటరత్నంగారు యీదారి చూపించారు. చూపించటమే కాదు. కష్టాల రూపకంగా ప్రచారం సులభమని చాటించారు.

సంఘ సంస్కరణాన్ని, అన్యమతలోపాల్ని, బ్రాహ్మమత ప్రయోజనాన్ని బాగా చాటించారు మా వెంకటరత్నంగారు. అటువంటివి కొందరికి రుచించవచ్చు మరికొందరికి రుచించకపోవచ్చు. అయినప్పటికి గ్రంథస్వారస్యం చెడలేదు. ఇటువంటి రత్నాలు ఆంధ్రదేశానికి వేనవేలు కావాలి.

## 8. శృంగార సంధ్య. *

ఇదియొక చక్కని పద్యకావ్యము. రసము శృంగారమగుటవలనను కథానాయిక సంధ్య యగుటవలనను శృంగార సంధ్య యనఁబరఁగినది. ఆద్యంతముల సంధ్యాజనన పునర్జనన చరితమును మధ్యభాగమున సతీశివోద్వాహమును వర్ణించుచు నీకథ శృంగారరస ప్రధానముగనున్నది. ఈ రసము ఆధునిక భావవీధులయందు బ్రవహింపలేదని చెప్పుకొనవచ్చును; గాని కొన్ని యర్వాచీన ప్రబంధములందువలె వెల్లడిగ నున్నదేమో! అందును పురాణపూరుషుఁడగు శివుని విప్రయోగ పాశబద్ధుని జేయునప్పుడును, విలాసమున దేలించునపుడును, కవి చాల జాగరూకతతో నుండియుండవలసినదని మాత్రము చెప్పకతప్పదు.

బ్రహ్మ సంధ్యను సృష్టించి యామె సౌందర్యమునకు మనోవికారముఁ జెందెను. అపుడే మదనుఁడావిర్భవించి "తన్ను సృష్టించు ధాతపై ద్వజమునెత్తి గుణము సారించి చూపించె గుణము." కాని బ్రహ్మచారి యగు శివుని యుద్బోధనములచే బ్రహ్మాదుల రిమ్మతగ్గెను. బ్రహ్మతన యవజ్ఞతకు మన్మథుఁడే కారణ మని యెంచి, హరుని ఫాలాగ్నియందు భస్మము కాగలవని శపించెను. కాని బ్రహ్మ మరుని దీనాలాపములచే మరలఁ బ్రసన్నుఁడై దక్షుఁడు సృష్టించిన రతిని భార్యగా నిచ్చి, వసంతునిఁ జేదోడుగానిచ్చి మన్మథుని కచ్చుపోసి ప్రపంచముపై వదలినాఁడు. కాని తన్ను హేళనమొనర్చిన హరునకు శృంగభంగ మొనరించి యతనిఁగూడ నొక గృహస్థుం జేయవలెనని బ్రహ్మ సంకల్పించుకొని విష్ణుమాయనుగూర్చి స్తోత్రమొనర్చి, శివుని వరించుటకు నొప్పించెను అంత బ్రహ్మచే ననుజ్ఞాతుఁడై దక్షుఁడు విష్ణుమాయంగూర్చి తపంబొనర్పఁ బ్రత్యక్షమై యాతని సుతయై జనించి త్రిణయను వరించెదననియు, ననాదరమునఁజూచిన మేను బాసెదననియు వచించెను. దక్షునకు వీరిణియందు సతీదేవి జనించెను. బ్రహ్మవిష్ణువుల యుపదేశమునఁ శివుఁడు సతిం బెండ్లాడి విలాసముగఁ గొంతకాలము గడపెను. దక్షుఁడొక మహాధ్వరమును సంకల్పించి కపాలియగు శివుని నాతని సతినిదప్ప నొరుల నెల్లర నాహ్వానించెను. సతి యా యగౌరవమునకుం గుంది "అగౌరవంబునన్ దనుజను జంపె కాపలుకు దక్షుని జంపక జంపు నెప్పుడున్" అని తలపోసి "యోగ మార్గానుపద్ధతి నసురు విడిచె." శివుఁడీ యుదంత మెఱింగి యుగ్రుఁడై వీరభద్రుని సృజించి యాతనివలన దక్షాధ్వరము విధ్వంసము చేయించెను. శివుని బాష్పములం భూతలము పడిన సృష్టికరిష్టంబు సంభవించునని భీతిల్లిన బ్రహ్మాద్యమరులచే ననుజ్ఞాతుఁడై శనైశ్చరుఁడాకన్నీరు దాల్చి వాని దుస్సహతాపమున కోపలేక వెడల గ్రక్కిన వైతరణీనదియై ప్రవహించెను.

అటుపిమ్మట మరల సంధ్యావృత్తాంతము వివరింపబడినది. బ్రహ్మ మనము చలింపజేసి తానుగూడ జిత్తవిభ్రమము నొందిన సంధ్య విశ్వేశ్వరోపదేశమున సర్వముం దెలిసికొని నారదునివలన విష్ణుమంత్రోపదేశమును బొంది తపమొనర్చి,

"పతుల తలమానికంబని జగము నన్ను
బొగడ దొడ్డ ఇల్లాలనై నెగడవలయు
బతియ కనులకుఁ గనుపట్టవలయు నన్నుఁ
గాంచినఁ బరుండు క్లీబుఁడౌఁగాక జగతి"

యని వరముల బడసెను. పిమ్మట నగ్నిఁబడి యరుంధతియై పునర్జన్మమొంది బ్రహ్మమానస పుత్రుఁడగు వశిష్టుం బెండ్లాడెను.

కాళికా పురాణాంతర్గతమగు నీ చదలికథ యిదియె. సమయోచితముగ జొప్పింపబడిన ఋతు పర్వత, పరోవర వర్ణనాదికములు ధారాశుద్ధియు భావగాంభీర్యమును గలిగి చాల ముద్దుగ నున్నవి. ఇట్టి గ్రంథము రచింపగలిగిన నృసింహశర్మగారెంతయు నభివందనీయులు.

(ని. క. సుం.)

* వేగుచుక్క గ్రంథమాల — 25 వ ప్రచురణము. గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మగారు, పూడిపెద్దివారివీధి, బరంపురము, గంజాంజిల్లా. వెల రు. 1-0-0.

# అమరసూ...ములు

బూఱెల వేంకటరమణయ్యగారు

## 1

బాల్యమునుండియు వైధవ్యము ననుభవించుచుంటినా!

పదునొకండవయేట మధుపర్కముల విడచితినో, లేదో, గత భర్తృకలకర్హములగు తెలివలువలు ధరింపవలసి వచ్చెనుగదా!

నాఁటినుండియుఁ బుట్టినింట మహారాజ్ఞి పదవి ననుభవించుచుంటిని. అచటనే నాడిన దాఁటయుఁ, బాడినది పాటయు నగుచుండెను. మన్మనోగత వాంఛితములు వాగ్రూపమున నుద్భవించుటకుఁ బూర్వమే ఫలోన్ముఖములై వచ్చుచుండెడివి. వేయి విధముల తమ ప్రేమామృతమును మజ్జననీ జనకులు నాపై గురిపించుచుండెడి వారలు; ఆభరణ రహితంబులగు నా యంగకముల నవలోకించి సహింపఁజాలకుండెడివారు. శ్వేతాంబరముల నెన్నఁడును గట్టుకొన నిచ్చెడి వారలు గారు. వయసువచ్చిన వెనుక హృదయ విదారకమగు నా దీనావస్థను గుర్తెఱింగితిని. అది మొదలు నాబోటి యువతులకు నియమింపఁబడిన యాచారముల ననుసరించి దినములఁ బుచ్చుచుంటిని. నావారల ముదమందించుటకైనను బంగరు గాజులాదిగాఁ గల చిన్ని చిన్ని యాభరణములఁగాని, నల్లవలువలు దప్ప, నా తెలివలువలకుమాఱితర వర్ణములుగల వస్త్రములనుగాని, తాఁకకుంటిని. పాశ్చాత్య పూర్వసువాసినులేల నల్లని వస్త్రములను ధరించుచుందురో నే గ్రహింపఁ గలిగితిని. అయ్యవి హృదయ వేదనాచిహ్నములు. రాను రాని యిహప్రపంచ సౌఖ్యములయందలి యాశ నాలో సన్నగిల్లినది.

ఎవని కొఱకయి, యేమహామహునికొఱకయి సర్వదా దారుణముగ విలపించుచుందునో, యే ధన్యాత్ముని యాత్మశాంతికై యనారత మా దేవేశుఁ బలు తెఱఁగుల బ్రార్థించుచుందునో, యాతనివృత్తము నామనోవీధి నతిక్రమింపుచున్నది. ఆతనితో నా వివాహ మొక స్వప్నగత వృత్తాంతము వోలెఁ బొడఁగట్టుచున్నది. అట్లయ్యును నాతని మఱవక సర్వదా యాతనిగూర్చి ధ్యానించుచుండుటయే నా విహిత కృత్యమైయున్నది. ఆతని స్థానమున నొక్క నిమిషమాత్రమైన వేఱొకని నిలిపి తలఁచుట ఘోరపాపము. గతకాలమును మనమునకుఁ దేజాలినయొక్క చిహ్నము, ఒక్క పవిత్ర చిహ్నము, నా యధీనమున నున్నది. అయ్యది నామనోవల్లభుని ఛాయాపటము. అద్దాని నొక చందనపు పేటిక యందతి భద్రముగ దాఁచియుంచితిని; ఆ పేటికను సర్వదా నా పజ్జనుంచుకొనుచుందును. మనోచాంచల్యము గలుగు సమయముల. బరేశుపాలనా విధానమున భక్తి విశ్వాసములు సన్నగిల్లుచుండు తఱుణమున, భావికాలమంతయు రహస్య మేఘావృతముగాఁ దోఁచు యదనున, జీవనమే దుర్భరముగఁ బొడకట్టునప్పుడా పవిత్ర చిహ్నమును గేలఁబూని, దానిని జీవప్రతిమఁగా భావించి తదేకధ్యానముతోఁ జూచుచు మనోవైకల్యమును బాపికొందును. ఆఛాయా చిత్రము నా హృదయమునకు ధైర్యము నాపాదించి, భావికాల శుభోదయమునందలి యాశను గలుగఁజేసి, యంతు గనరాని సంతసాంబోధియందు నీదులాడఁగఁ జేయు నన్నేకరణి.

'కారుచీకటి రాత్రిలు కాంతి నంతమా వగళ్ళుగాఁ జావిచ్చు ననవరతము' అని యారూప మేకాంతముగఁ బలుకునటుల నాకుఁ దోఁచు చుండును. ఇది నిశ్చయము. ఆప్రాణేశ్వరుఁడు తాసృష్టించిన జీవరాసుల మానసములనుండి యెల్లకాలమును శాంతిని, నూతనమును, బారఁ దోలఁగలఁడా? హృదయమా! ఆశ నుద్యోజింప కుము. నీకు శాంతి చేకూరఁగలదు.

ఒకసారి మాత్రమే, నాజీవితము నొక్కసారి మాత్రమే, చందనపు పేటికయందు ఛాయాపటముతోడ నింకొకవస్తువును — నాకానందము గలుగఁజేయు తలంపున సాహసమును బూని, పర్వతాగ్రములపై, పాషాణములమధ్యమున, కంటకపథంబుల నున్నను జంకుఁగొనక యేరితెచ్చిన — అమరసుమముల చెండును జత కలిపి భద్రపఱచితిని. అప్పటి నా ప్రాయము రమారమి పదునెనిమిది వత్సరములు. "నైనితల" యందున్నతోద్యోగము నందున్న నాయన్నతో నుంటిని దేశాంతరములందుండు సమయమున నాతఁడాంగ్లేయ వేషభాషాదులకును, జీవిత విధానమునకును నలవాటు పడియుండుటచే, స్వదేశమునకేతెంచిన వెనుకఁగూడ నాతఁడు వాటినుండి తప్పించుకొనఁజాలక పోయెను. కలవు దినములలో నేనుగూడ హిందూ స్త్రీల ఘోషాపద్ధతి నంతఁగా పాటించెడిదానఁగాను. ఆంగ్లేయులెవరైన మాగృహమునకు విచ్చేసినచో, వారితోడ నేను గూర్చుండెడిదానను గాను; కాని వారికి స్వాగత మొసఁగెడిదానను. స్వజాతివారెవ్వరైన నేతెంచిన, తెఱచాపమఱుఁగున కేఁగెడిదానను.

## 2

ఆయ్యాది యొక యాదివారపు సుప్రభాతము. మే మరుగుపైఁ గూర్చొనియుంటిమి. నాసోదరుఁడు నా ఆకుర్చీపైఁ గూర్చొని ధూమపానమును జేయుచు, వార్తాపత్రికను జదువుకొనుచుండెను. నేనాతని చెంత నొక తివాసిపైఁ గూర్చొని, యాతఁడు సృజించుచున్న పొగ చుబ్బులను దిలకించుచుంటిని. ఆసమయమున నొక పరిచారకుఁడొక దర్శనార్థి చేతి కాగితమును నాసోదరునకుఁ దెచ్చియిచ్చెను

నాసోదరుఁ డద్దాని నవలోకించి, చిఱునగవున, "అతఁడు నాప్రియమిత్రుఁడు, దేవతామూర్తి, తోడ్కొనిరమ్ము" అని పలికెను.

"చటర్జీబాబా!" అని నేవ్రశ్నించితిని.

నాసోదరుఁడు తన మిత్రుని తఱచుగా 'దేవతామూర్తి' యను మారుపేరునఁ బిలుచుచుండుట నేనెఱుఁగుదును. ఆతఁడీక రానున్నాఁడని గ్రహించి లోపలికేఁగ నుద్దేశించి లేచితిని. కాని, నాసహోదరుఁడు నన్నాపివైచెను.

"అదికూడదు. నీవాంగ్లేయులకు తఱచుగ స్వాగత మొసంగుచుందువని చటర్జీకి తెలియును అట్టియెడ నీపరిచయ మాతనికిఁ గలుగఁ జేయనిచో, నాయెడ నాతఁడు కినుకఁ బూనును" అని నాయన్న పలికెను.

ప్రత్యుత్తర మొసంగఁ జాలక నేనాఁగిపోయితిని.

## 3

చటర్జీబాబు వారము దినములవఱకు మాయింటి యతిథియైయుండెను. ఈకొలఁదికాలమునఁ బెక్కుసార్లు మేమొకరి కొకరము దారసిల్లితిమి; కాని, యొకరితో నొకర మంతగా మాటలాడియుండుటలేదు. అట్లయ్యును నేనెల్ల

పుడాతనిఁగూర్చియే చింతింప మొదలిడితిని. ఆతఁడు మధురమోహన శృంగార భవ్యమూర్తి. సాటియే లేని చక్కఁదనాలవాఁడు. అనిర్వచనీయములగునట్టివియు, దురూహ్యములగునట్టివియు నగుతీయని తలఁపులు నామనోవీథిని చరింప మొదలిడెను. నేనొక నూతన ప్రపంచమున నుంటినేమో యనుకొంటిని. ఈ యూహా ప్రపంచమున నాకతీతమగు యానందము చేకూరినది. కాని, చట్టర్జీబాబు దగ్గరనుండు నపుడు నా నేత్రములఁ బైకెత్తి చూడఁజాలకుంటిని. ఒకానొక సమయమునందకారణముగ నొకరిచూపు లొకరి చూపులతో వియ్యమందుట తటస్థించునెడలఁ జెప్పరాని లజ్జను బొందుచుంటిని. అతనితో నేమి పలుకఁదలఁచితినో మఱువఁజొచ్చుచు వచ్చితిని. ఈసారి సంభాషించెదఁగాక యని నన్ను నేననునయించుకొనుచుంటిని. కాని, యాతని పదధ్వని వినినంతనె నాకెక్కడలేని సిగ్గు గలిగెడిది. నన్ను నేను త్రిప్పుకొనఁజాలక పోవుచుంటిని. ఆతఁడు నన్నొక లజ్జావతిగ భావించుచుండెఁగాబోలు. ఇట్లొక వారము దినములు గడచినవి. ఎట్టి సౌఖ్యదాయకములగు దినములు! ఎట్టి నూతన విషయజ్ఞాన సమంచితములగు దినములు! దినములు గంటలుగను, గంటలు నిముసములుగను దోఁచెడివి.

ఆ వారము దినములలో నొక్కమారయిన నన్ను, చందనపుఁ బెట్టెను దెఱచి యాఛాయాపటమును జూడఁజాలనైతిని. పాపిని; మందబుద్ధిని, ఆవిషయమును దలఁచుకొలదిఁ నామానసము సంతాపానలాభీలజ్వాలా కీలకీలికా సంహతులలోఁబడి దహింపఁబడుచున్నది.

## 4

చటర్జీబాబు మాగృహమును వీడు దినమతిత్వరితగతి నేతెంచినది. కాని యాదినమింకను మాయధీనమునందున్నవి. ఆదినమును నా సహోదరుఁడు "నైనితల్" పులికొండ (Tiger Hill) శిఖరమునఁ దోఁట విందున గడుప నిర్ధారించెను.

నాఁటి వాతావరణ మెంతయు హ్లాదదాయకముగ నుండెను. ప్రకృతియంతయు సుగంధవాయు సేవితంబై మానసోల్లాస దాయకంబుగ నుండెను. ఆసమయమును నాజన్మమధ్యమున నిఁక నెన్నటికిని మఱువఁజాలను.

నాసహోదరుఁడు స్నేహితునితోఁ గలసి యశ్వముపైఁ బోవుచుండ, నేనొక యాందలమునందుపవిష్టించి వారి ననుసరించుచుఁబోయితిని. ఆసమయమున గులాబీ పుష్పసౌరభ మెట్టుల ననవరతము నానాసికమునకుఁగోచరమగుచుండెనో, యట్లే ఆదేవతామూర్తి దివ్యసుందర విగ్రహము నాకన్నులకుఁగట్టినటులఁ దోఁచుచుండెను.

కుసుమితలతావితానములతోడను, ఫలోన్ముఖమునకు వచ్చుచుండిన సుమద్రుమములతోడను, మారుతోరువతుముల విహరింపుచున్న సుగంధములతోడను నావనంతసుప్రభాత మత్యంత రామణీయకముగ నుండెను. ప్రకృతి లీలావిలాసంబునకు తన్మయత్వంబునంది నేనానందలోకనివాసినైపోతిని.

మార్గమున కిరుకెలంకుల విచ్చవిగా వికసించిన గులాబీకుసుమముల నేరి యుంచుకొనవలయు ననెడి కుతూహలము వొడమినది. కాని యాందలమును మోయుచున్న వారల నాపుష్పరాజము లాకర్షింపఁజాలినవికావు. గమ్యస్థానమును జేరుకొని బరువును దింపుకొనుటయే

వారికత్యంతానందమును గలుగజేయఁ గలదు. వారు తీవ్రగతి శైలోపరిభాగమునకేగఁ బ్రాక మొదలిడిరి.

ఆహా! ఆశైలపంక్తుల సౌందర్యశోభ! పరిసర ప్రదేశమున నున్న పర్వతములలో పులికొండయే యత్యున్నతముగ నుండెను. తచ్ఛైలోపరిభాగమున నతిక్రమించిన మాపాదములక్రిందనే లక్కంగల శిఖరములు సమున్నతతో నిలచియుండెను. ఈదృశ్యము నామనమును చలింపఁ జేసినది. నిద్రావస్థయందుంటినో, లేక జాగ్రదవస్థయందుంటినో నే తెలిసికొనఁజాలకుంటిని. ఆసుఖస్వప్న మతికాలఁది కాలమున సత్యమగునేమోయను విచారము గలిగినది.

సేవకులచే నిర్మింపఁబడిన పటకుటీరమున నల్ప ఫలహారమును దీసికొని పుష్పాన్వేషణార్థము వెడలితిని. కాని, యంతటి యున్నత ప్రదేశమున సుమద్రుమములకు బదులు నానావర్ణముల కచ్చటచ్చట లేఁతపచ్చిక బయళ్ళు గానవచ్చినవి. నాయాశాలత యొక్కసారిగా త్రుంచఁబడినది. ఆసమయమున బోయీలపై నాకమితమగు కోపము జనించినది. ఆమూర్ఖులాటంకపఱుపనిచో మార్గమధ్యమున బుష్పములఁ గోసికొనియుండెడిదానను.

సాయంకాలము నాలుగుగంటలకు బూర్వమే పర్వతమునుండి దిగనిచో, ప్రమాదము వాటిల్లును. కాని, నేను సుఖసముద్రమున నీదులాడుచుంటిని. యౌవనురాలను. ప్రమాదమనఁగనేమియో నేనెఱుఁగఁజాలకుంటిని. కొండ దిగుటకు వేళయయినదని "బోయీలు" మమ్ముల మందలింప మొదలిడిరి. అంతత్వరగ నద్దానిని బాసిపోవుట నాకిష్టములేదు. అయినను నా సోదరునకు నా యభిప్రాయమును తెలుపఁజాలకుంటిని. తుదకెట్లో ధైర్యము చిక్కబట్టుకొని కొంతదూరమయినను కాలి నడకను బోవుదముగాక యంటిని. నాకోర్కె నెరవేర్పబడినది. అందలమును, గుర్రములును మా వెనుక వచ్చుచుండ మేము ముందుగనడువ సాగితిమి.

కొంతవఱకు నడచినపిదప దవ్వుల గుంపు గుంపులుగానున్న పూలమొక్కలు నాకగపడినవి. ఆపుష్ప గుచ్ఛములు నామనము నాకర్షింప "ఎంత హృదయరంజకముగ నున్నది!" అని యొక బాలికవలెనే బైకుచ్చరించితిని.

"ఎట్లు లభ్యమగును?"

"ఏల లభ్యము కావు?" అని పలుకుచు ధనుర్ముక్త శరవేగమున చటర్జీబాబు వాటిని దెచ్చుటకై బర్విడి, యానందాశ్చర్యముల నను గంపితశరీరనుగాఁ జేసివైచెను.

ఆసుమములు మాకొకింత దూరమున నుండెను. కాని, మార్గము జారుశిలలకును ముండ్లపొదలకును నివాసమగుటవలన సుగమముగా నుండుటలేదు. చటర్జీబాబు సాహసము ప్రమాదజనకమే యైనను, ప్రశంసాపాత్రమై యుండెను ఒకసమయమున మెలకువతో దిగఁజారుచు నొకపరి ధైర్యమునఁ బైకతిక్రమింపుచు, కొన్నియెడల పాషాణపాళిపై దూకుచుఁ బోవుచుండెను. నాసహోదరుఁ డాతని కుత్సాహము కలుగఁజేయుచుండెను. అద్భుతానిర్వచనీయములగు భావములు నాడెందమును గందళింప మొదలిడినవి. ఆతని సాహసము నాకానందదాయకమైనది. నేనాతని ధైర్యమును బ్రశంసించితిని. నాజన్మమున నొక్కసారియే స్త్రీసహజమగు మనోదౌర్బల్యమునకు నేలోనైతిని. ఆదుర్బలత్వము నన్నావ

రించిన సమయమున నామనోనయనముల కొక సుఖప్రదమగు నూత్న ప్రపంచము గోచరించినది. ఆ దేవతామూర్తి పుష్పములకై సాగుచున్న కొలది నేనాతనినే వీక్షింపుచు, నొక యమోఘశక్తికి వశ్యురాలనయి, ముగ్ధురాలనైతిని. ఆతఁడు సఫలీకృత మనోరథుఁడయి మాయొండఁ జేరినతోడనే యొక నిట్టూర్పు గాడ్పు విడచితిని.

దినమణియపరగిరి మఱుఁగున కల్లనల్లన నరుగుచుండెను. నాసహోదరుఁడు నన్నుందలమున గూర్చొనుమని వేగిరించెను. కాని, యాసమయముననే నెక్కుడుగ గోరిన అమర సుమములు నాకు చిక్కినవి కావు.

5

మేము గృహమును జేరుకొనునరికి రేరాజు మింట సంపూర్ణకళలతో శోభాయమానుఁడై వెలుఁగొందుచు నమృత వృష్టిని గురిపించుచుండెను. హృదయముప్పొంగనే నా తేజోమయు నొక్కింత కాలము విలోకించి గృహగర్భమును జేరితిని.

కొంతకాలమయిన పిదప మేము భోజనశాలను బ్రవేశించితిమి. వారిర్వురు భుజించుచుండ, బూర్వసువాసిని నగుటవలన వారితో భుజింప వీలులేక యొకచో గూర్చొనియుంటిని. భోజనానంతరమువఱకు నా సహోదరుఁడు గుక్క త్రిప్పకుండ చటర్జీబాబుతో సంభాషించుచునే యుండినను నాతడు మాత్రము మితముగా మాటలాడుచు భుజించుచుండెను. వారు భుజించుచుండు నంతకాలము, యెంత ప్రయత్నించినను నానయనములు దేవతామూర్తి మూర్తినుండి మఱలకుండినవి. ఆతని సొబగు నంతయును చూపులతోడనే గ్రోలి ముదమందితిని. ఎంత మరలింతమన్నను నా హృదయము మాతనివెనుకకై పర్వెత్తుచువచ్చెను.

భోజనానంతరమున శయనార్థము నేను నా శయనాగారమును జొచ్చితిని. చటర్జీబాబు నా యడుగులం బడుగు లిడుచు వెనువెంట వచ్చెను. మృదుమధుర కంఠస్వరమున "నళినీ! నీకయి యీ సుమములను దెచ్చితిని. వీటిని స్వీకరింపవలయును" అని యాతడు పలికెను.

ఈ తీయని పలుకులకులికి కొంత దనుక నపూర్వానందోదధిని మగ్నమానసురాలనై బలుకలేకపోయితిని. ఆ దేవతామూర్తి సుఖజీవి, ధీరసాగరుఁడు, రూపజితమారుఁడు. నాకాతని ముఖమందు దేవతాకళలు గానవచ్చినవి. ఆతఁడత్యాదరముతో నొసంగిన పుష్పముల నామృదుకరముల నందుకొంటిని. ఒక్కక్షణము మిర్వురము పరస్పర హస్తస్పర్శా సౌఖ్యమనుభవించితిమి. మధురమధుర భావములు నామనమునఁ బ్రవేశించినవి. ఆతీయదనపు తలఁపులకు నాశరీరమున కంపమొదవినది. హృదయమును దడదడ కొట్టుకొనసాగినది. నేనింక మాటలాడఁజాలకపోయితిని. కొంతకాలము కనుచూపు పలుకులతోడనే యొకరి నొకరము సంబోధించుకొని హృదయములను గలుపుకొంటిమి, తీయదనపు వేదనలు మెండయినవి. ... ఒక నిముసమున నేనా దేవతామూర్తి కౌఁగిలియందిమిడిపోయితిని......

6

సుఖదుఃఖములు బుద్బుదములవంటివి; జీవితము స్వప్నతుల్యము. చటర్జీబాబు మాగృహమును బాసి చనియెను.

నా దుఃఖమును, నాపరితాపమును లిఖిత రూపమున వ్యక్తీకరించుటకు సమర్థురాలనుగాను.

నాహృదయవేదనాభర మాదేవునికిఁ దప్ప నన్యులకెట్లు తెలియఁగలదు? ఆనాఁటి నిశీథమున నాకనుగొనలనుండి జాలుగాఁగారిన కన్నీటిబిందువులవలన శయ్యాతలము చెమ్మగిల్లినది. వెక్కి వెక్కి చాల కాలమేడ్చితిని. చందనపుపెట్టె నత్యంతభక్తితోడ నందుకొని, యందలి ఛాయాపటమును దీసి కన్నులకద్దుకొని వక్షోభాగమునఁ జేర్చి యదిమిపట్టుకొంటిని. ఆపవిత్రచిహ్నమును ముందుంచుకొని, సాష్టాంగ దండప్రణామముల నాచరించి, నామనోదౌర్బల్యమును నాయపరాధమును, మన్నింప వేడుకొంటిని.

నామానసమునకు శాంతికలుగుట కొకింత కాలముపట్టినది. సముద్రోదకముల జేసుటకు బాహిని యెట్లు ప్రయాణము సాగింపవలయునో యట్లే శాంతికొఱకయి జీవి దుఃఖసముద్రమున నీదులాడవలయును.

ఆపవిత్రచిహ్నమును జందనపు పెట్టెయందు మఱల భద్రముగ నుంచు సమయమునందు అమరసుమముల దాని నత్యంతభక్తితోఁడ బూజించితిని.

## 7

తదనంతర మాఱుమాసములు గడచినవెనుక నొక్క పర్యాయము మాత్రమే చటర్జీబాబునఁ గలసికొంటిమి. ఒకదినమున నేనును నాసోదరుఁడును వివాహకార్యమునకై స్వగృహమునకు వచ్చుచుండ, 'బాంకిపుర'పు టయోమార్గపు తిన్నెపై (Railway Plat-form) నేదియో యొక భూమశకటమునకై చటర్జీబాబు నిలచియుండెను. ఇంకను బండిపోవుట కొకింతకాల ముండుటవలన వారు మాబండియందు బ్రవేశించి సంభాషింపఁగడఁగిరి. చటర్జీ వివాహసందర్భమున తానాహ్వానింపఁ బడకపోవుటచే, నాసోదరుఁ డాతని నెత్తిపొడిచెను.

చాటర్జీసతిలేచి "నాకథగూడ నిట్టిదియే. మీరు నాకు వివాహసందర్భమున కాన్కయేమియు నొసంగియుండుటలేదు." అనిభర్త నుద్దేశించి పలికెను.

అందరును చటర్జీపై నేరములు మోపుచుండుటఁజూచి, నాచందనపు పేటికను దెఱచి, అమరసుమముల చెండు నామెచేత నిడితిని.

అధరపల్లవమున చిరునగవుచెంగలింప నామె దాని నందుకొనియెను.

"నాకృతజ్ఞతాభివందనములఁ గైకొనుము; ఈపుష్పము లెంత సహజములుగ నున్నవి!" అని యామె పలికెను.

"అవి నిజమగు పుష్పములే" అని నేనంటిని.

ఆశ్చర్యమును బొంది, "నేనయ్యవి కృత్రిమసుమము లనుకొంటిని. ఇట్టి వాని నెన్నడును జూచి యుండ లేదు. వీటినేమందురు?" అని యామె పలికెను.

"ఇయ్యవి యున్నత పర్వతశిఖరములందు లభించును. వీటినే అమర సుమము లనియెదరు" అని అంటిని.

"వీటిని నీ వెపుడు సమకూర్చితివి!"

"ఆరు మాసముల క్రితము"

"అట్లయ్యును నియ్యవి స్వచ్ఛముగానున్నవి ఇటు చూడుము. ఇయ్యవి యెంత మనోహరముగా నున్నవో!"

చటర్జీబాబు పుష్పములఁజూచి "ఔను" అని అవ్యక్తకంఠ స్వరముతోఁ బ్రత్యుత్తర మొసఁగెను.

ఇంతలో బండి కదలు సమయమును దెలుపు యీల వినబడియెను. సతీపతులు మాకభివందనముల నొసగుచు బిరబిరచనిరి.

ఆ రేయి నాకద్భుతమగు స్వప్నమొకటి వచ్చినది. ఒక దేవతామూర్తి నాకడకేతెంచి తనతో నన్నుగూడ భూలోకమునుండి తీసుకొని పోయెను. మేమంబరతలమున నంత కంతకెత్తుపబోయి, తుద కొక దేవతా నివాసమును జేరుకొంటిమి. అదియే కైలాసగిరి యని నే నూహించితిని. అచట వేమ్ముల నొకయపూర్వ తేజస్సావరించి నా సహచరుని ముఖబింబమును శాంతిమంతముగ జేసి వైచెను. నేనాతని వంక దిరిగి చూచితిని. ఆహా! ఏమి చిత్రము!!— మూఁడు మూర్తుల నాతఁడు నా ఛాయా పటము నందలి స్వరూపమును బోలియుండెను. తుదకు నా ప్రాణేశ్వరుని చెంతఁజేరితినని తెలిసికొని యానందపారావారని మగ్నమానసనైతిని— నది—నాకు మెలకువ వచ్చినతోడనే జలజలమని నా కనుగొనలనుండి యశ్రుకణములు ప్రవహింపసాగెను. అయ్యవి దుఃఖాశ్రువులో, సంతోషాశ్రువులో నే నూహింపఁ జాలకుంటిని.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# వ ర ము.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

గీ॥ తినుట కున్నట్టి దానితోఁ దృప్తిఁబొంది
పరుల భాగ్యంబుల కసూయపడుట మాని
ఆస నందని పండ్లకు నఱ్ఱుసాచి
కలిమి కొరుదటికి మొప్పఁబు కలుగకుండ
లేని పోని తంటాల జోలికినిఁబోక
కలియొ? గంజియొ? త్రాగి సౌఖ్యముగ నింటఁ
గడుపులోఁ జల్ల బొత్తుగాఁ గదలకుండ
శక్తి కొలఁదిగ బరులకు సాయపడుచుఁ
దగ నవశ్యంబులగు పదార్థములు మాత్రి
తనకుఁ దానయి గడియించుకొనఁగఁ జాలి
సరస విద్యా లతాంగితో సౌఖ్యపడుచుఁ
బెలుచ హరి కీర్తనంబుఁ గాపించుకొనుచు
బరులచేఁ జూడఁబడకయు నెఱుఁగఁబడక
పంకమున యందుఁ గాజ్ఞాతిపడుట లేక
నిర్విచారంబుగాఁ బొద్దు నెట్టుకొనుచు
బ్రదుకఁగా నాకు నో దేవ! వరము నిమ్ము॥

# హాస్యాలు

[ తు. వెం. సీ. ]

## వ్యాధి.

రోగి:- (డాక్టరు వద్దకు వెళ్ళి చాలా సేపు పేచియున్న తర్వాత) డాక్టరుగారూ! తమవద్దకు యేమిపని వుండి వచ్చానో జ్ఞాపకము లేదండి.

డాక్టరు:- మఱపు వ్యాధికి మందుకోసరము

## కడుపునొప్పి.

ఒక యిల్లాలు డాక్టరుగారికొరకు కబురంపగా అయన వచ్చుటకు వీలులేక తన కంపౌండరును పంపించెను. అతడు వచ్చి యిల్లాలిని నాడీ పరీక్షచేసి "అమ్మా తెలిసింది; తమకు అగ్నిమాంద్యము చేసింది"

యిల్లాలు:- ఏడిసినట్టే వుంది నీవైద్యం. కడుపునొప్పికి మందివ్వమని పిలిపిస్తే, రోగానికి పేర్లు పెటతా వేమిటి.

## అమరము.

ఒక శాస్త్రులుగారు శిష్యులకు అమరము పాఠము చెప్పుచూ, ప్రతి శ్లోకము ముఖస్థముగా నుంచవలెననియు, అడిగిన దానికి జవాబు త్వరగా చెప్పవలెననియు హెచ్చరిక చెప్పియుండెను. ఒకనాడు యిన్‌స్పెక్టరు గారు వచ్చి "ఇంద్రునకు మఱియొక పేరేమని ఒక విద్యార్థి నడిగిరి.

శిష్యుడు:- (తాను అమరము కంఠస్థముగా చదివినట్లు తెలియజేయడానికి) "ఇంద్రో మరుత్వాన్, మఘవాన్ బిడౌజాః పాకశాసనః" అని యేకరువు పెట్టెను.

## సులోచనాలు.

ఒకడు:- నీవు నిద్రలోగూడ సులోచనాలు పెట్టుకుంటా వెందుకు?

రెండవవాడు:- నాకు కండ్లు జబ్బుగదూ, కలలో కనపడేవాళ్ళని సరిగా చూడాలని,

## నాయికానాయకులు.

నాయికా నాయకులు సరససల్లాపాలలో వుంటుండగా,

నాయిక:- ప్రాణేశ్వరా, నన్నొకందుకు క్షమించాలి.

నాయకుడు:- అయ్యో! ఎంతమాట. నేనే అందామనుకున్నా? సేఫ్టీరేజరు కనిపించక పోవడంవల్ల యీ గడ్డం నీకెక్కువగా బాధకరంగా వుంటుందేమోఅని.

నాయిక:- మీ కెప్పుడూ యింతే? చెప్పే మాట వినరు.

నాయకుడు:- నీ కెందుకులే కోపం! చెప్పు.

నాయిక:- చిన్నప్పుడు అమ్మవారుపోసి యెడమకన్ను కాయకాసింది అంచేత మీరు అసహ్యించుకొంటారేమో అని గాజుకన్ను పెట్టించుకొన్నా.

నాయకుడు:- ఇంతేనా! నీకు కన్నెరికానికి పెట్టిన రవ్వల వడ్డాణంలో రాళ్ళన్నీ యిమిటేషను కెంపులే చెక్కించాను. కాయకు కాయ చెల్లుపోయింది.

## ఇంటి అద్దె.

ఒక యింటి యజమాని: (తన యింట్లో కాపురమున్న వారికి) అయ్యా, నా అద్దె చాలా రోజులనుంచి బాకీ పడి వున్నది గనుక దయవుంచి తక్షణం పంపగోరుతాను.

అద్దెదారుడు:- నా అద్దెయే నేను యివ్వలేకున్నాను నేను నీ అద్దెకూడ యెందుకు యివ్వవలెనో నే నెఱుగను.

## బాకీ మొత్తం.

అప్పులవాడు:- మీరివ్వవలసిన బాకీ మొత్తానికి తొందర లేదు లెండి.

బాకీదారు:- మీ కక్కురలేదా ఏమిటి.

అప్పులవాడు:- మొత్తంగా వడ్డీతోకూడా యివ్వాలు లెండి.



# మహారాష్ట్ర స్వాతంత్ర్యము.

హరనాథ వసుప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.

( లక్ష్మీబాయి గానముసేయును. )

జింగ్లా — ఏక.

లక్ష్మీ:- తుం జాగో మోహనప్యారే । తుంజావో మోహన
ప్యారే ॥ తుం ॥
సాంవలి సూరత మోహీ మనహీభావే । సుందర
శ్యామహమారే ॥ తుం ॥
ప్రాతసమయఉఠ భానూదయభయే । గ్వాలబాల
సబ భూపతిఆయే ॥ తుం ॥
తుంహారేదరస్కో కాజగాడే । టఠిటఠి సంక
కిశోరే ॥ తుం ॥

లక్ష్మీ:- ఆహాహా! అద్వితీయము. కడుమాధుర్యము సఖా! నీరూపమెంత జగన్మోహనమో నీగాన మంతకన్న నేయిమడుంగులు మనోహరముగా నున్నది. నీగుణము లంతకన్నను శ్లాఘ్యములు. నిన్ను మొదట మోదుగపూవని యెంచితినిగాని యిప్పుడు గులాబీపుష్పముగా గ్రహించితిని. నీకు నాచేతనైన యుపకారముం జేసెదను. ఎవరక్కడ!

( ఖోజా ప్రవేశించును )

జహా:- ఈమెను రంగమహలులోనికిం గొనిపొమ్ము. భోజనాది కార్యములు హిందూజనానాలో జరుగునట్లు చేయవలయును. తక్కిన కాలములందు మాయంతఃపురమందే యుండును. ఈమె కెవ్వరు నెట్టికష్టమును గల్గింపరాదు. ఇది మాయాజ్ఞ.

ఖోజా:- బేగముసాహెబావారి ఆజ్ఞ.

( లక్ష్మీబాయిని వెంటఁ గొనిపోవును )

—॥ ద్వితీయరంగము. ॥—

ఖాశింఖాన్ గృహము

రంగనాథుఁడు ఖాశింఖానుఁడు కూర్చుండియుందురు.

రంగ:- సేనాధ్యక్షా! మనమీరీతిగా నుదాసీనముగ నున్నచో లాభములేదు. రాజారాం నానాటికిఁ దన రాజ్యమున సాంఘికశక్తిని బలపరచి కసవడిన పురుషుని యుద్ధవీరుని జేయుచున్నాఁడు మొన్నటి రాయగడ యుద్ధమున మీఘాదుషాహా సైన్యమునకెట్టి యవస్థ సంఘటిల్లెనో మరచితివా?

ఖాసిం:- మిత్రుఁడా! నాకేమియుఁ దోఁచుటలేదు. నేనిప్పుడు యుద్ధమేల జేయవలయును? నాకిప్పుడు కామినీ కృపాకటాక్షవీక్షణము కావలయును. ముందు సుందరీ సమావేశము. తరువాత యుద్ధము.

రంగ:- సర్దార్! ఏమిమాటలివి? రణరంగమున మహారాష్ట్రుల జయించుట యెన పుష్పావ

చయ మనుకొంటివా ఇంకమీఁద నీవి ట్లుపేక్ష వహించినచోఁ గార్య మేమియును ఫలింపదు.

ఖాసిం:- రాజాసాహేబ్ ! నీ హిందూమత సంబంధమైన పిరికితనము నిన్నిట్లు పలికించుచున్నది. అంతేకాని నానిశ్చయము నాలించితివి కావు. నాకెప్పుడు బుద్ధిపుట్టిన నప్పుడే మరాటీమూకను నాశనమ్ము జేసెదను.

రంగ:- చాలును. ఇంక నేమియును వినవక్కర లేదు. మీవలన నాకేమానయును లేదు. చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థము లగుచున్నవి. పాదుషావారు నాకొనర్చిన వాగ్దానమును మీయుపేక్షను దలంచిన నాకెంతమో విచారముగా నున్నది. నేనిప్పుడు పాదుషావారి సన్నిధికేగి జరుగుచున్న సంగతి యంతయు విన్నవింతును.

ఖాసిం:- భాయీ! నీ యభిప్రాయ మంతయు బాగాలేదు. ఏమందువా? పాదుషావారికి మేమే నేత్రములము. మేమే చెవులము. నేనే వారి జిహ్వనై యుంటిని. నీమూలముననే మొన్నటి యుద్ధమున మొగలాయీ సైన్యమున కోటమి సంభవించెనని పాదుషావారి నిశ్చయము. ఈసంగతి నీకింకను దెలియదు కాఁబోలు.

రంగ:- ఓడిపోవుటకు నేనా కారకుఁడను. నీయు దాసీనము కాదేమి? నే నేమి చేయఁగలను? మూఁడుదినములు ప్రాణములనొడ్డి మహారాష్ట్రులతో యుద్ధమొనర్చితిని.

ఖాసిం:- నిజమే ఆసంగతి నాకుఁదెలియును గాని పాదుషా వారికిఁ దెలియదు. వారికి నేనెంత చెప్పిననంతే.

రంగ:- అలంఘీను నామాటను విశ్వసింపడనియా మీతలంపు.

ఖాసిం:- విశ్వసింపకు అట్లొనర్చుట వారికిఁ దగని పని నేను హుజూరువారి స్వజాతీయుడను నీవు విజాతీయుఁడవు. నేను చక్రవర్తి యొక్క పవిత్ర మహమ్మదీయ మార్గావలంబకుఁడను నీవు విధర్ముఁడవు నేనుగొప్ప రాజకీయ కర్మచారిని. నీవు రాజద్వారమున నిలువబడి యాచింపవచ్చిన భిక్షుకుఁడవు. కావున వారు నీ మాటనెంత మాత్రమును నమ్మరు.

రంగ.- చాల బాగు గానున్నది నేనిప్పుడు రెండు వైపులకుఁ జెడితిని.

ఖాసిం:- మమ్ము సంతోషపెట్టినచో నీ కార్యము నెఱవేఱును. నిశ్చయము. నా ప్రేమ కుట్మలమును వికసింపఁజేసిన నీ కార్యము ఫలించును.

రంగ:- మీ ప్రేమకుట్మలమును నే నెట్లు వికసింపఁజేయఁగలను? మీ యభిప్రాయ మేమో నాకుఁ దెలియలేదు

ఖాసిం:- అనేకమార్లు మా యభిప్రాయమును సూచించియుంటిని కాని నీవు గ్రహింపఁజాలకపోతివి. నీకోర్కె నెఱవేఱుట కొక్కటే మార్గము. అట్లొనర్చితివేని వేతాలశక్తి ముండదు.

రంగ:- అదేమి మార్గము?

ఖాసిం:- మీకడనున్న వాసంతి—

రంగ:- వాసంతియా?

ఖాసిం:- ఆమె మీకడనుండుటచే యాపనికి మాలినపేరు వచ్చినది. మాకు బీబీయై యున్నయెడల మరియొక్క మధురమైన నామము నంచెదము.

రంగ:-మీయుద్దేశ్యమును స్పష్టముగ నెఱింగింపుఁడు.

ఖాసిం:- అలంఘీరుయొక్క సర్వసేనా నాయకుఁడనైననేను నీవు రొక్కమిచ్చికొనిన యాకన్యను ప్రేమించుచుంటిని నీయింటిదాసీకన్యను నావంటివాఁడు ప్రేమించుట నీయదృష్టము. ఇప్పుడైన తెలిసినదా?

రంగ:- సేనా నాయకా! ఆమె క్రీతదాసియా! కన్నబిడ్డకన్న నెక్కుడు మక్కువతోఁ జూచుచుంటిని. ఆమె స్వభావము మీకుఁదెలియదు. కావున నిట్లనుచుంటిరి. ముట్టినఁ గసుగందెడి సుకుమారశరీర. సంపూర్ణముగ వికసించిన గులాబీ కుసుమము. దివారాత్రములు దీనరక్షకాయని యరచుచు దైవమును దలంచి కన్నీరునించు సుగుణాలకుప్ప.

ఖాసిం:- నిజమే ఆగులాబీపుష్పము మీచేతఁబడి నలిగిపోవుచున్నది వాడుచున్నది. మాచేతఁ బడినచో నాపద్మమును నవనాగరికతా సూర్యకిరణ సన్నిధినుంచి వికసింపఁజేసి యుందుము. రంగమహాలులోనున్న సుందరీమణుల కందరకుఁ దలవంపు కల్గించి యుందుము

రంగ:- ఖాసింఖాన్ బహద్దర్! మీరీవిషయమున నొక్క చెప్పవలదు. నీకోర్కెఁదీర్ప నేనసమర్థుఁడను. నాచేతితో పవిత్రమైన కాసంతీ హృదయమును ఛేదింపఁజాలను. నేను దురాశాపరుఁడనే. మృగతృష్ణా జలములకై బరువిడు మందుఁడనే. కాని దేవపూజార్హమైన యాసుందర కుసుమమును బలాత్కారముగఁ దెరికి ముండ్లకంపపై బారవేయఁజాలను వర్ణింపచిక జ్ఞానములేని మానవ భావములేని స్త్రీ పురుష విభాగము నెఱుఁగని యాబాలికను బాధింపఁజాలను. ఆకతమున నేమో యెఱుంగక కష్టసుఖములను మనస్సున కెక్కనీక విలాసమెట్టిదో వేదనయెట్టిదో తెలిసికొనలేక నిరంతరమును దీనరక్షకాయని మొరలిడుచుఁ దన శరీరమును అంతఃకరణ చతుష్టయమును దీనబాంధవున కర్పించిన యాబాలికామణి కంఠమును గోయఁజాలను.

ఖాసిం:- చివరకిదియా నీవనినమాట! తనకున్న దంతయు దేవునకిచ్చినదా! అట్లయిన దేవకన్యల మరపించు సౌందర్య మెక్కడుండెనే. దానిని మాత్రము నాకొసంగుమనుము.

రంగ:- (కోపముతో) మూర్ఖుఁడా! అనాగరకా.

ఖాసిం:- అరే! గులాం! తాబేదార్! సువ్వర్! ఏమంటివి.

రంగ:- (సంబాళించుకొని) లేదు లేదు. నేను మిమ్మేమియు ననలేదు.

నేపథ్యమున:— యాపీర్ మాలాముష్కిల్ ఆసాన్.

నేప:- బద్మాష్. నోరుమూయుము.

రంగ:- ద్వారమున నాయల్లరియేమి?

(వకీరు వేసములోనున్న గోవర్ధనుని సిపాయిలిర్వురు పట్టి తీసికొనివత్తురు.)

సిపా:- హుజూర్! వీడొక గూఢచారి.

గోవ:- యాపిర్ మాలా........

ఖాసిం:- నీవెవ్వఁడవు?

గోవ:- అల్లా మిమ్ము రక్షించుఁగాక.

ఖాసిం:- ఎక్కువగా మాట్లాడకుము. నీవిచ్చట నేమిచేయుచుంటివి?

గోవ:- బాబా! నేనేమి చేయఁగలను. సమా

ధుంకడనుండు పకీరును ఇంట ఇంటికేగి బిచ్చ మెత్తుకొనుచుండును. నాకిదేపని

ఖాసి :- నీవు మాశిబిరముకడ కేలవచ్చితివి ?

గోవ:- నవాబుల యిండ్లకు తగువంటి లాయిర్ల యిండ్లకు గాక కూటికి గతిలేని బీదలకొంపల కేగిన నాకేమి దొరుకును ?

రంగ;- అసత్యము. నీవొక గూఢచారివి.

గోవ:- బాబా ! ఇదేమి. దీనపరిపంచాధికారియైన యాలంఘీరువారి పరిపాలనలో నొక కాఫరు గులాం మావంటి ఫకీర్ల నవమానించుచున్నాడు. చోటానవ్కార్ ! మీరు దీనిని విచారింపవలయును.

ఖాసిం:- నేను యువరాజునుగాను.

గోవ:- కాకున్న వానియబ్బవు. ఎవ్వరెక్కువో యెట్లు నిర్ణయింపగలము.

ఖాసిం;- మీయిల్లు యెక్కడ ?

గోవ;- బంగాళాదేశమున.

ఖాసిం;- నీకీస్థితి వచ్చుటకుఁ గారణమేమి ?

గోవ;- నేను ప్రారంభమున ఫకీరును గాను. మనోవ్యాకులము హెచ్చగుటచే పట్టఁజాలక పకీరునై దేశములు తిరుగుచుంటిని

ఖాసిం;- నీ మనోవ్యధకుఁ గారణమేమి ?

గోవ;- ఒక యువతిని ప్రేమించుటయే కారణము. ఎవ్వతెయో కాదు నాభార్య నా హృదయమును ఛేదించి పోయెను. సర్కార్ ! చెప్పుటకు సిగ్గగును. నాభార్య యొక్క చక్కదనమును జెప్పఁదలలేదు. వెల్లుల్లిపాయవలె తెల్లగా స్వచ్ఛముగా నుండును. నీరుల్లిపాయ వాసనవంటి వాసన వేయుచుండును. ఆసుగంధమునకు దిశలు ఛేదిల్లుచుండును. దల వెండ్రుకలు గగనముం జూచుచున్నను వింజామరవలె నుండును. కాకిగూటిలోని రామచిలుకవలె శృగాలమధ్యగతమైన సింహాంగనవలె రెక్కలు విప్పుకొని ఎగిరిపోయెను. ఆదిమొదలు నేనీవిధముగఁ బకీరునైతిని దేశద్రిమ్మరినైతిని. ఒకానొకచోట నాభార్య వేశ్యయై దక్షిణదేశమందున్నదని వింటిని విని యిచ్చటికి వచ్చితిని.

ఖాసిం;- నిన్నెవరైన గుర్తించిరా ?

గోవ:- భార్యను వెడలగొట్టిన పకీరు నెవ్వరు గుర్తింతురు ? ( రంగనాధుంజూపి ) ఈ బాబు గుర్తించియుండునని తలంచితిని.

రంగ:- నీవెవ్వడవో నాకేమియుఁ దెలియదు.

గోవ;- నీవేమైన ననుకొనుము. నీవు గూఢచారులకు రాజువు అందుచే గూఢచారుల బాగుగ గుర్తింపగలవు.

రంగ;- వీడుతప్పక శత్రువులచే బంపబడిన గూఢచారుఁడై పొంచుండి మనమాటల నాలింప వచ్చెనని తలంతును.

గోవ;- తలంతునని పక్కొడవేమి ? నేనంతయు వింటిని. నిజమైన ముసల్మను డెన్నఁడు నసత్యమాడడు. ఏనాడు సిపాహసాలారు బహద్దరువారి కాపరుబాబు కుమార్తెతో బాణిగ్రహణ మహోత్సవము జరుపుదురో యానాడు కడుపునిండ పులావును దినెదను సర్కార్ ! ఆమె దేవకన్యకయే

ఖాసిం;- నీవామె నెప్పుడు చూచితివి?

గోవ;- ఒకనాడు బిచ్చమెత్తుకొనుచు నాయింటి కేగినప్పుడు చూచితిని నాకీసంగతియంతయు దెలిసినచో చక్కజోలిలో నామె నిరికించుకొని మీకు సమర్పించియుండును.

ఖాసిం;- నీవంతవాడవా ?

గోవ:- అనుజ్ఞనిచ్చినచో నంతయు దెలియ గలదు. వంగదేశీయుడగు ఫకీరేమిచేయగల డో నంతయుం దెలియగలదు.

ఖాసిం:- నీతో నవసరమగు పనియున్నది. కొంచెము కాలమూవల నిలువంబడుము.

గోవ:- యాపీర్ మాలా ... (నిష్క్రమించును.)

రంగ: వీడొక విరోధి పక్షపు గూఢచారివలె నున్నాడు. వీని మాటలను విశ్వసింప గూడదు.

ఖాసిం:-అతడు నీకు శత్రువుగాని నాకు మిత్రుండే సమయమున కతండు రాకున్న నీ శిరము నా కరవాలమున నెగిరి యుండును.

రంగ:- ఇంకను నాపై తీవ్రదృష్టియే. ఒక్క యాదుచానికి వెరచి వరుగిడిన మీ ఖడ్గ నంచలనవు కౌశలము నడుగ వలయునా? రంగనాధుడు మహారాష్ట్ర క్షత్రియుడు.

ఖాసిం:- నోరు మూయుము. నిన్ను వధింపం గలనుగాని వాసంతి సౌందర్య మట్లు చేయ నీయలేదు. నీవు నా కామె నొసంగనియెడల ప్రాణాశయు రాజ్యాభిలాషయును రెండును వదలు కొనవలసినదే. నీవు అంతవరకును మాకు బంధితుండవు పదదాసుడవు బ్రదుక దలంచిన నా తలంపును సమకూర్పుము. చక్రవర్తితో జెప్పి నీ కోర్కెదీర్చెదను. లేకున్న నీగతి మరణమే. ఆలోచించు కొనుము నే పోయి వచ్చెదను.

(నిష్క్రమించును.)

రంగ:- ఇదెంత విషమ సమస్య? ఏమిచేయుదును! జీవన సర్వస్వముగ దలంచి కాపాడు చున్న వాసంతి నెట్లు వదలుదును—చిర కాల వాంఛితమయిన రాజ్యాశ నెట్లు పరిత్యజింతును నాకంటికి వాసంతి యెట్లున్నదో రాజ్యముకూడ నట్లే కన్పడుచున్నది. నా హృదయమున రాజ్యమున్నది. వెలుపల వాసంతియున్నది నేను రెండింటిని విడువజాలకుంటిని. కాని ఖాసింఖానుడేల యంగీకరించును? వాడొక శత్రుతుల్యుడు ఎంత పరాక్రమవంతుండనైన నేమి లాభము తుదకా పిరికి పందయొక్క పాద ధూళిని శిరమున ధరించి వాని దయను యాచించుచు నిలువబడవలసిన వాడనైతిని. నాదురదృష్ట దేవత నెత్తిపై దన్నుచుండ వానికేల సద్బుద్ధి పొడముసు. మదీయ శిథిల గృహమున కలంకార భూతయై నిరర్ధకమైన నాయొక్క జీవితమును ధన్యము జేయగల దేవీస్వరూపిణియై యున్న యా వాసంతి నపహరింప వేగమే రాగలడు. ఆహా! నా వాంఛలన్నియు నా నాటికి విపరీతముగా బరిణమించుచున్నవా? ఏమైనను గానిమ్ము. దీనింగూర్చి యిప్పుడేమియు విచారణ సేయను. నా హృదయము కలగుండు వడి యున్నది. నావాంఛలు పాతాళమున కంటినవి. నాతల తిరుగుచున్నట్లున్నది. నా కన్నుల యెదుట విద్యుల్లతలు మెఱయుచున్నవి. అస్థి రక్త నాళముల యందు సహింపజాలని వేదన కలుగుచున్నది. నే నిప్పుడు రాజ్యమునైన వదలవలయును. లేక దేవీ స్వరూపిణి యనదగు వాసంతినైన వదలవలయును. నాకేమి కర్తవ్యము? నే నిప్పు డెక్కడికి కేగుదును? ఏమి యుపాయము రాజ్యమా?

తృతీయరంగము:— జహనారా మందిరము.

జహనారా కూర్చుండి యుండును.

జహ:- మహాభారమైన కర్తవ్యమును పైనవేసు కొంటిని. ఉపకారమొనర్చి యాయభాగిని యొక్క కన్నీటిని దుడువవలయును. ఆమె భారత రమణియైనను నాకామెపై కోపము కలుగలేదు. ఏలకలుగవలయును? ఆమె స న్నాశ్రయించినది. నాయనుగ్రహ భిక్షను యాచించినది. ఆగుణవతి నాకు దాసియా! కాదు కాదు. నాప్రాణస్నేహితురా లనుటకు దగియున్నది. కావున నామెకన్నీటిని దుడు వవలయును. మలినమైన యామె వదనకమ లమును మదీయోపకార సూర్యకిరణములచే వికసింపజేసెద. అదే రంగనాధుడు వచ్చు చున్నాడు. అతని హృదయాభిప్రాయమును తెలిసికొనెద.

(రంగనాధుని ప్రవేశము.)

జహ:- మీపేరేమి?

రంగ:- రంగనాధుడు. బేగము సాహెబావారు సేవకుని బిలిపించిన కారణమేమి.

జహ:- పాదుషా వారివలన మీపనులు నెఱ వేఱినవా?

రంగ:- ఒక్కటియును నెఱవేఱి యుండలేదు. ఎంతకాలముండవలనో నాకు దెలియదు.

జహ:- మీరువచ్చి చిరకాలమైనది. స్వదేశ మున కేగవలయునను చింతలేదా?

రంగ:- నాదేశ మెక్కడనున్నది? నాకెచ్చట నాశ్రయముకాని యిల్లుకాని లేదు. ఏది నాయదియని తలంచితినో యదిప్పుడు రాజారామునకు జెందియున్నది అతని కీర్తి మహారాష్ట్రమంతయు నిండినది. నిరాధారు డనైన నేనిప్పుడు రాజారాముని దర్బారు ముందు మహారాయిచ్చు భటునివలె నిలువ బడుట కేగవలయును.

జహ:- మీకు భార్య, పిల్లలు, మొదలగు పరి వారములేదా?

రంగ:- లేదు.

జహ:- మీరు వివాహమును జేసుకొన లేదా?

రంగ:- చేసికొంటిని పిదప నే నామెను బరిత్య జించితిని.

జహ:- ఏల?

రంగ:- ఆమె జనకుడు నావిరోధి పక్షమువలం బించుటవలన నట్లొనర్చితిని.

జహ:- మామగారిపై యీర్ష్యచే భార్యను బరిత్యజించితివి. వివాహిత మైన పత్ని యెవ్వరి సొత్తని తలంచితివి?

రంగ:- నే నెంతయోజన సేయలేదు. నాశత్రు వులలో జేరినవాని తనయనుపృశింప దలంచుకొన లేదు.

జహ:- మీ భార్య యిప్పుడెచ్చట నున్నది?

రంగ:- తెలియదు. నిరాధారయై దేశద్రిమ మై వనములు నున్నదని వింటిని.

# ఆంధ్ర భారతి

మచిలీపట్టణము

సంపుటము ౨ | జనవరి 1928 | సంచిక ౧౦




## 1927.

ఈశ్వరసృష్టిలో నొక సంవత్సరము గడచి పోయినది. ఈసంవత్సరమునందు మానవకోటికి గలిగిన లాభనష్టములను పర్యాలోచింపవలసి యున్నది.

## ప్రపంచము.

ప్రపంచశాంతి యింతవరకుచేకూరినది, నానాజాతి సమ్మేళనము లనుపేర శాంతి సముపార్జన ప్రయత్నము లెంతవరకు సఫలములైనవి యని ప్రశ్నించుకొని సావధానముగ యోచించుకొనినచో, యీనానాజాతి సమ్మేళనములు కేవలము బూటకములనియు, బలవంతులగు శక్తోద్ధి ప్రభుత్వముల నాటకవ్యాజ్యములబడి[illegible]కొరకుమాత్ర మేర్పడిన వనియు తెలియగలదు. ఆయా జాతులవారు తమ తమ స్వతంత్రములకై పెనగులాడుచున్నరు జేదిసో మిష కల్పించుకొని వారి స్వాతంత్ర్యముల నణకట్టుచుండ వేరభిప్రాయము స్ఫురింపనేరదు. చైనా స్వాతంత్ర్య ప్రయత్నములలో బ్రిటిషువారేల జోక్యము కలుగజేసుకొనవలెను? క్రైస్తవజాతుల కీప్రాంతముతో సంబంధమేమి? తమ స్వదేశస్థుల క్షేమముకొరకని వాదించినంతమాత్రమున ప్రయోజనమేమి? తూర్పు సముద్రములలో, జపాను, వర్తకమున నేమి తదితర విషయములందేమి, ప్రతిభ వహించి స్వతంత్రరాజ్యమై యున్నది. దానితోబాటు చైనాదేశముకూడ స్వాతంత్ర్యత వహించిన యెడల నాసియాఖండమునందు రాజ్యపరిపాలనము చేయుచున్న పాశ్చాత్యులడకత్తెరలోని పోకచెక్కలవలె నుందురు. అందులో బ్రిటిషువారి రాజ్యము చాలవిస్తరించియున్నది. ఈ తీరమునను తూర్పునను చీనా జపానుదేశములును పశ్చిమమున ఆఫ్ఘనిస్థానము రష్యాదేశములోని బోల్షివిజమును ననుభూతమును గలవు. ఇక దక్షిణమున నేపాళపసులకైనను క్షేమసదుపాయములు నేర్పరచుకొని తమ వర్తకమునకు పొందించుకొనుటకుసి గపూర్ నౌకానిర్మాణమును నిర్మించుచున్నారు. ఒకవైపున ఆఫ్ఘన్ అమీరుగా అమానుల్లాగారు యూరోపు ప్రయాణమునం గుసుమరియొకవైపు వచ్చి మోత్తరసరిహద్దులలో సైనికబలమును హెచ్చుచేయుటచూడ బ్రిటిషు

రాజ్యతంత్రజ్ఞులు గొప్ప యుద్ధప్రయత్నములు చేయుచున్నట్లు తోచకమానదు. జవహరలాల్ నెహ్రూ పండితుడు కాంగ్రెసు మహాసభలో నిటువంటి యుద్ధములో హిందూదేశమునకు నార్థికముగ గాని నైతికముగగాని సంబంధము లేదని తీర్మానము ప్రతిపాదించినపుడు నవ్వినవార లనేకులు గలరు. కాని వారియొక్క భావగర్భితమగు యుపన్యాసమును పఠించినపుడు పై రహస్యము లన్నియు స్పష్టముగాక మానవు. ఈపరిస్థితులతోబాటు సెసిల్ ప్రభువు నానాజాతి సమితిలో బ్రిటిషు ప్రభుత్వ సభ్యత్వమునకు నిచ్చిన రాజీనామాను వీక్షింపుడు. ప్రపంచమునందు శాంతిప్రబోధము కావించినవారలలో సెసిల్ప్రభు వొకడు. అతనికి నోబెల్ శాంతి బహుమానముకూడ నిచ్చియుండిరి. అటువంటి సెసిల్ప్రభువు రాజీనామా నిచ్చుచు బ్రిటిషువారు, బ్రిటిషు రాజ్యము నేలుచున్న కాన్సర్వేటివు మంత్రివర్గమువారు, ప్రతివిషయమునందును నవసరజోక్యము కల్పించుకొని మాటిపట్టింపుతో సంచరించుట గర్హ్యమనినుడివి యున్నాడు. ఇంగ్లాండులో నచిరకాలమునందు పార్లమెంటు యెన్నికలు జరుగనున్నవి. ఆ యెన్నికలలో కాన్సర్వేటివు పక్షమువా రధికసంఖ్యాకు లగుదురనుటకు సందియములేదు. 1927 వ సంవత్సరములో ప్రపంచశాంతి చేకూరకుండుటయేగాక యశాంతికికూడ దోహదము లొసంగబడినవని యూహింపవలసి వచ్చుచున్నది.

## భారతదేశము.

ప్రపంచ పరిస్థితులను విచారించియుంటిమి గాన భారతదేశములోని యభివృద్ధిని జూతము.

## కాంగ్రెసు.

1926 వ సంవత్సరము డిశంబరు మాసమున గౌహతి నగరములో శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారి అధ్యక్షతక్రింద కూడిన దేశీయ మహాజన సభ స్వరాజ్య పక్షము వారికి ప్రాబల్యము నొసంగి రాష్ట్ర కాంగ్రెసు పక్షముల వారికి స్వాతంత్ర్యమిచ్చి యొకప్పుడు శాసనసభలలోనికి పోవుట మరియొకప్పుడు లేచివచ్చుట కాస్పద మొసంగినది. మంత్రివర్గముల కూలద్రోయుటకు ప్రయత్నింపవలెనను కాంగ్రెసు తీర్మానమును నయితము మద్రాసు స్వరాజ్య పక్షము వారు పెడచెవిని బెట్టుటయు, వారిపై విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రతిపాదింపవలసిన యావసర మేర్పడుటయు, నాకళంకమును బోగొట్టుకొనుటకు శ్రీనివాసయ్యంగారు కావించిన భగీరథ ప్రయత్నములును. అఖిల భారత కాంగ్రెసు సంఘము సమావేశము కాకుండ కాలయాపన చేయుటకు వారు కావించిన పన్నాగములను, ఈలోపున మద్రాసు పక్షము వారు తమ చర్యను దిగమ్రింగుకొని జస్టిస్ పక్షము వారితో చేతులు కలిపి విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రతిపాదించి యోడిపోవుటయు చారిత్రాంశములై యున్నవి.

గౌహతీ కాంగ్రెసు సమావేశము కానున్న తరిని శ్రద్ధానందుని హత్యచే హిందూ ముసల్మాను విభేదములు పెరుగుటయు, లజపతిరాయివంటి ధీశాలుని చంపప్రయత్నించుటయు, డాక్టరు మూంజే పండిత మాలవ్యాగార్లను బెదిరించుటయు, తన తండ్రి శ్రద్ధానందుని జంపిన హంతకుడు అబ్దుల్ రషీదును క్షమించి విడుదల చేయవలెనని ప్రార్థనను ఇంద్రగారు వైస్

రాయిగారికి విన్నపము పంపించి కృతకృత్యులై హిందు ముసల్మాను సఖ్యతకు పునాది వైచుటయు నెల్లరెరింగిన విషయములే. హిందు ముసల్మాను సఖ్యతను కుదుర్చుటకు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు దేశసంచారముచేసి యుభయపక్షముల వారిని సంప్రతించి మద్రాసు కాంగ్రెసుకు మార్గమును సుళువుచేసిరి. మద్రాసు కాంగ్రెసులో ప్రత్యేక ప్రాతినిధ్యమును వదలుకొని జాయింటు నియోజకవర్గములకు హిందు ముసల్మాను నాయకులొడంబడిరి. దేశమునందు సంచారముచేసి యనుచరులకు నచ్చచెప్పవలసిన బాధ్యత యీ నాయకులపై గలదు. హిందు ముసల్మానులచే నైక్యకంఠముతో నారాధింపబడిన హకీం అజ్మల్ ఖాన్ గారు మద్రాసు కాంగ్రెసు సమావేశ దినములలో చనిపోవుట యొకవిధముగ భారతదేశ దురదృష్టముగ నెంచవలసియున్నను, వారి పవిత్రాదర్శముల నిరుపక్షములవారు తమ తమ హృదయములందుంచుకొని దేశ సౌభాగ్యమునకు దోడ్పడుదురు గాక.

మద్రాసు కాంగ్రెసుచేసిన తీర్మానములలో నవ్యక్తమైనది యసందర్భమైనది స్వాతంత్ర్య తీర్మానము. స్వాతంత్ర్యమును కోరని భారతీయుడుండడు. స్వాతంత్ర్యమనుభవించు దశకేగినపుడు, యేపీఠము నధిష్ఠించియు నెలుగెత్తి యరవవలసిన పనిలేదు. మనత్యాగశక్తి నశించిపోయి, కేవలము వాక్శూరులవలె సంచరించుచున్న యీ కాలములో మా యాదర్శము స్వాతంత్ర్యమని ప్రకటించుకొనుట ఛాందసము కాని వేరు కాదు. ఈయభిప్రాయమును యేవి. ఎల్. శాస్త్రిగారో యనినచో సభ నవులుచేయు నల్లరికి మితముండదు. ఏ మహాత్మాగాంధియో నుడివినపుడు కొంచెమాగి యాలోచించుకొని నోరు తెరువక యుందురు. దేశము... మితముగ ప్రబలియున్న బాధ్యతాలేమిని సూచించుటకింతగా వ్రాయవలసియున్నది.

కాంగ్రెసు తీర్మానములలో నెల్లరామోదించినది సైమను కమిషను బహిష్కరణ తీర్మానమే. ఈ బహిష్కరణ యావశ్యకత నిదివరకే చర్చించియుండుటచే నా విషయమును ప్రత్యేకముగ వచించవలసిన యవసరము లేదు.

ప్రభుత్వము మన స్వాతంత్ర్య నిర్ణయాధికారమును తోసిరాజుచేసి, తమయిచ్చవచ్చిన యేడుగురను సైమను కమిషను పేర హిందు దేశమునకు పంపుచున్నారు. బొంబాయి నగరములో నేపాశ్చాత్యుడో భావోద్రేక పూరితమగు కరపత్రమును ప్రచురించి, తాను దౌర్జన్యమును ప్రేరేపింపలేదనినచో నాతడు విడుదల పొందనర్హుడగుచున్నాడు. పండిత యింద్రాగారు తమకట్టి యభిప్రాయములేదని ప్రకటించినను, మతద్వేషములను పెంపొందించుచున్నాడని కఠిన శిక్షను విధించిరి. బాల్షివిజమును ప్రచారము చేయుచున్నారను ఆరోపణచేసి లాహోరీ ఖైదీల నురిదీసిరి. వంగదేశ నిర్బంధితులు జెయిళ్ళలో క్రుంగుచున్నారు. నాగపూరు సత్యాగ్రహ నాయకుడగు అవారీ షుమారు తొంబది దినములనుండి జయిలులో నిరాహారుడై సత్యాగ్రహము సల్పుచున్నాడు. వీని దరి విషయములోను భారతదేశ మొరల నాలకించువారు లేరు గాని, హిందుదేశమునకు సంస్కరణముల నిచ్చుచున్నామను నెపమున తమ సామ్రాజ్యమును బలవత్తరముగ జేసికొనుటకు రాజకీయ వేత్తలు చాలమంది బయలుదేరుచున్నారు.

ప్రభుత్వమువారి ఆర్థిక విధాన మేమాత్ర
మును సంతృప్తికరముగ లేదు. సైనికవ్యయము
యథావిధిగ 60 కోట్లు జరుగుచునే యున్నది.
సివిలియను యుద్యోగులకు యథావిధిగ వేనకు
వేలు జీతముల క్రిందను ప్రయాణపు ఖర్చుల
క్రిందను ముట్టుచునే యున్నవి. గ్రామోద్యో
గుల జీతములు పెంపు కాలేదు. రీసెటిల్ మెం
టులలో పన్నులు వృద్ధి చేయబడుచున్నవి.
త్రాగుడుమీద లభించు యాదాయము తగ్గు
నను భయముతో త్రాగుడు మాన్పించ లేదు.
గత సంవత్సరము మార్చిలోని బడ్జెటు ప్రకా
రము ఆయవ్యయములలో మిగిలినందున
రాష్ట్రీయ కప్పములు తగ్గింపబడినవి. అయినప్ప
టికిని ఆమొత్తము నే విద్యావిధానమునకుగాని
యే సహకారవిధానమునకుగాని ప్రత్యేక
ముగ వెచ్చించుటకు సావకాశము నియ్య
లేదు. ప్రతి సంవత్సరము ఆయవ్యయ పట్టీలలో
అంకెలు తారుమారుచేసి లాభమో నష్టమో
కనబరచుటయే జరుగుచున్నది గాని ప్రభుత్వము
వారి సహృదయము గోచరమగుట లేదు.
హిందుదేశమునకు సెంట్రలు బ్యాంకుగ తయారు
చేయబడిన రిజర్వుబ్యాంకు గగనకుసుమముగ
నున్నది. ఈ బ్యాంకు విధానము విచిత్రపరిణామ
మును పొందినది. జాతీయ వాదులకు స్థానము
లేకుండగను, ఇంపీరియలు బ్యాంకు కథే సదు
పాయముల గావించుచును ఆర్థిక సభ్యుడగు
సర్ బేసిల్ బ్లాకెటుగారొక విధానమును
తయారుచేసిరి కాని, సామ్రాజ్య శాసన సభలో
చర్చకు వచ్చినపుడు సభ్యులు బ్లాకెటుగారి విధా
నమును తారుమారుచేయుటచే హిందూదేశ
కార్యదర్శియగు బర్కెన్ హెడ్ ప్రభువు శాసన
మును సాంతముగ కొనసాగనీయక మరియొక
సెంట్రలు బ్యాంకు విధానమును తయారు
చేయించి సామ్రాజ్యశాసన సభ్యుల యెదుట
పెట్టనున్నారు.

దేశములో రాకపోకల సదుపాయములుగాని
కాని లేక ఆరోగ్యసదుపాయములు గాని హెం
చ్చలేదు. దేశములో మరణసంఖ్యయు నానా
టికి పెరుగుచున్నది.

నాగరికులమని గర్వించెడి బ్రిటిషువారి యధీ
నమున 1927 సంవత్సరమునందు జరిగిన యభి
వృద్ధిని క్లుప్తముగ నిట వివరించితిమి.

## ఆంధ్రదేశము.

రాజకీయ సాంఘిక పరిస్థితులు పైన నుదహ
రింపబడినవియే యాంధ్రదేశమునను గాననగును.
కాన వాటినన్నిటిని మరల వ్రాయబూనము.
వ్యక్తిగతములగు విషయములను సారస్వ
తాభివృద్ధినిగూర్చిన రెండుమూడు సంగతులను
మాత్రము వివరించెదము.

ఆంధ్రులలో వ్యక్తిద్వేషము పెచ్చుపెరు
గుటచే గాంధిమహాత్ముని యొక్కయు ప్రొఫె
సర్ రాధాకృష్ణన్ గారి యొక్కయు మందలిం
పులు ఆంధ్రదేశమునకు చేకూరినవి 1928 వ
సంవత్సరమునందైనను ఆంధ్రదేశమున కీదుర్గతి
తొలగుగాక.

సారస్వత విషయములో నాంధ్రదేశ మనేక
విధముల ముందంజవైచుచున్నది. అందు విజ
యనగర మగ్రస్థానము వహించుచున్నది.
అచట భావుకగల ప్రాపకముచేతను శాస్త్రవేత్త
లనేకులు చేరియుండుటచేతను నిట్టి యాధిక్యము
విజయనగరమునకు జిక్కినదనవచ్చును. గుం
డవస్థానము గుంటూరు జిల్లాలోని అవ్యగిలాను

ప్రాంతమునకు లభించినది. తగువాతస్థానము కృష్ణాజిల్లాలోని చిట్టిగూడూరు సంస్కృతపాఠశాల విద్యార్థులకును విశాఖపట్నంవారికిని చెందనున్నది. ఇట్లు వ్రాయుటలో నాంధ్రదేశమున ప్రఖ్యాతి వహించిన పండితోత్తములు మామనస్సునందు లేరు. కేవలము యువకులు భాషాసేవకులు కానున్నవారు మాత్రమే మామనస్సునందుండి యున్నారు. వీరు పరస్పర వైమనస్యములకు తావీయక, నిదివరకువలెనే యిక ముందును మరింత సాధనచేసి ఆంధ్రదేశము నత్యున్నత స్థానమునకు దెత్తురుగాక.

## గ్రంథ విమర్శన.

ఈ క్రింది గ్రంథములను గురించిన విమర్శనములను రాబోవు సంచికలో ప్రకటించెదము.

(1) బసవపురాణము, (2) పాదుకాస్, (3) ఆంధ్రవీరులు, (4) చంద్రముఖి.

## Puzzles.

రాబోవు మాసమునుండి Puzzles కొరకు రెండుపుటలు ప్రత్యేకించనున్నాము. గతమాసములోని అక్షరన్యాసము ? కీక్రిందివారు సరియైన ప్రత్యుత్తరమిచ్చిరి.

1 కొల్లూరు రంగధామరావు, 2 చెలికాని సత్యనారాయణ, 3 శ్రీరంగం శ్రీనివాసరావు, 4 తనికెళ్ళ సుబ్రహ్మణ్యం, 5 జమ్మి శేషగిరిరావు 6 భమిడిపాటి అయ్యన్నశాస్త్రి, 7 కాశీ రాజు వెంకటరమణరావు, 8 నేమాని వాసుదేవశాస్త్రి గార్లు.

జవాబు:— "మోహనదా (స్) కర్మచంద గాంధీమహాత్ముడు."

## విశ్వాసము

మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రిగారు.

గీ॥ కమ్ముకొని వచ్చు గాఢాంధకారపటలి
నెంతయు జనలేక మనలేక యీవిధానఁ
గుంగి నసివాడి కృశియించి కుమిలి కుమిలి
దేవ; యేడ్చుచు నుంటి నే దీనవృత్తి
దివ్య దీధితి తొలుదొల్త దేజరిల్ల
నాశవడి చేరినాను గృహాంగణాంత
ప్రబల విశ్వాసమున మీద వచ్చుదాని
నింతకేనియు నెడఁద వీక్షింపలేక
కాకు మబ్బులలోనడి యీ కిటికిలోయి
"నవ్వెడవు నీవు పర్వింతిం దేల" యనెను
నవ్య మోహనకంఠ నినాదమొండు
వినఁగవచ్చెను వీనుల విందుగాఁగ

వీణకంఠ నినాదమో యెరుగఁజాలఁ
గాని యదిపూర్వ పరిచితమైన దనుచు
నెడఁద సందేహ మిసుమంతేఁ బొడమి తద్ది
శాభిముఖునిగఁ జేసె నన్నారవంబు
ఆ నినాద మంజు ప్రవాహమ్ము తోడ
లీనమై పోయినట్టి యా ప్రేమపథము
ప్రేమ వాసనలే చిమ్మ ప్రేమఁ బెంచుఁ
బ్రేమ పుష్పంబులను బూచెఁ బ్రేమతోడ
ప్రేమ వాసనఁ బీల్చి నేఁ బ్రేమకొరకు
ప్రేమ పథమున నడచి నేఁ బ్రేమవలన
నొదలు తెలియని యుత్సాహ మొంది కుఁది
పడితి నేమూలనో యెటో ప్రాణదమహిమ.

# తృష్ణాదేవి.

ఇంద్రగంటి నాగేశ్వరశర్మగారు.

నాకు దరియును లేదు
నాకు తెన్నును లేదు
నేనంత జగత్తు
నిండిపోయితిని ౧

కన్నీటి కాల్వలో
కడు శోణ రాశిలో
మునక లెన్నో పెట్టి
ముసిసిపోయెద నేను ౨

ప్రణయ వీధులలోన
ప్రళయంబు గల్పించి
దిశదిశల ముంచెత్తి
తరలిపోయెద నేను! ౩

నేను పుట్టినచోటు
నేను మెట్టినచోటు
మీకు కన్గొనలేరు
మీకు శక్తియు లేదు ౪

కాలాహి విషవహ్ని
కలికాల కల్మషము
అన్నియును నాతోడి
అనుగు చెలికత్తెలు ౫

శిథిల శిశిరమ్ములో
జీమూతమగు రేల
కలకలని నవ్వెదను
పులకరింపంగ మేను ౬

తపియించి కృశియించి
శూన్యమై పడియున్న
మెఱయింతు నద్దాని
మిడిసిపడ జేతు ౭

రతనాల తక్కుపై
రాణించు రాజైన
నాప్రేమ లేకున్న
నరకమ్ములో గూలు ౮

నాకు దారియు లేదు
నాకు తెన్నును లేదు
నేననంత జగంబు
నిండిపోయితిని ౯



# తమాషాలు

### చీట్లపేక.

"ఒకరోజు గెలుపు ఒకరోజు ఓడుగా వుందోయి చీట్లపేకాటలో!"

"అయితే రోజువిడిచిరోజు ఆడు."

### మద్రాసు సభలు.

"మద్రాసులో జరగని సభ యేది?"

"అఖిలభారత గంగాభాగీరథీసమానుల సభ."

### దర్జా.

కొడుకు:— అమ్మా! మనమూద కుడుకునే గడ్డి తింటూం దేమి?

తల్లి:— బద్ధకము చేత.

కొడుకు:— కాదుకాదు. అది దాని దర్జా.

### శకునము.

బాటసారి:- శాస్త్రుల్లుగారూ వూరికి పోవునప్పుడు దోవలో నక్కలు యెదురుగా వస్తే మంచిదంటారు. కాని నా కొక్క సందేహము. నక్కలు కుడిచేతినుండి యెడమచేతివైపుకుపోతే మంచిదా? లేక యెడమ చేతివైపునుండి కుడిచేతివైపుకుపోతే మంచిదా?

శాస్త్రి:— ఏచేతివైపునుండి యేచేతివైపుకు పోయినా కరవకుండా పోతే మంచిది. శుభశకునము.

(శా. వేం. ర)

### మిగతా సగం.

తండ్రి:— అమ్మాయీ, నిన్నుగురించి లోకులు యెన్ని విధాలు చెప్పుకుంటున్నారో విన్నావా?

కూతురు:— నిజమే చాల చెప్పుకొంటున్నారు. అందులో సగం అబద్ధం.

### మేనేజిమెంటు.

ఒకస్త్రీ:— అబ్బాయీ ఆపిల్ల పాడుతూంటే నీకెందుకు ముష్టివేయాలి?

పిల్లవాడు:— ఆపిల్లకు మేనేజరును నేనుగనుక.

### పిసినితనము.

భార్య:— పెళ్ళికాకముందు మీకు చాల పిసినితన మున్నట్లు చెప్పుకొనేవారని మీతో చెప్పాను జ్ఞాపక ముందీ?

భర్త:— అవును చెప్పావు.

భార్య:— మీరిటువంటివారని అప్పటికి నాకింకా తెలియనే తెలియదండీ!

### సిద్ధము.

తండ్రి:— అమ్మాయీ, నీపెళ్ళికోసం తిరిగి తిరిగి చస్తున్నాను. ఏలాగో తెలియదు.

కూతురు:— అయితే యేమి ఫరవాలేదు. అన్నీ సిద్ధముగానే వున్నాయి.

### ఉత్తరాలు.

వార్డరు:— (కొత్తగావచ్చిన ఖైదీని చూచి) అరే మళ్లీ నీవు తిరిగి వచ్చావు?

ఖైదీ:— అవును. ఉత్తరా లేమన్నా వున్నాయాయేమిటి?

### సంగీతము.

"పక్క యింటిలోని శారదను సంగీతం పాడితే జబ్బుచేస్తుందని డాక్టరుగారు చెప్పారు."

"అవును, డాక్టరుగారిల్లు దగ్గరకేనూడాను"

### చన్నీళ్ళ స్నానము.

"ప్రొద్దున్నే చన్నీళ్ళ స్నానమువల్ల ఫలితం యేమిటి?"

"ప్రతివానితోను తాను చన్నీళ్ళ స్నానం చేశానని చెప్పుకోవడమే."

### ముందు.

"అంత ముసలివాణ్ణి పెళ్లి చేసికోవడం కంటె నేను చస్తాను"

"నీకంత భయం అక్కరలేదు. అతనికి అట్టేకాలం బ్రతికే శక్తిలేదులే!"

## ప్రేమ.

బట్లర్ దొర:— చూడు. నన్నెంతో నమ్మించావు, నా చుట్టు తిరిగావు. నన్ను మోటారులో త్రిప్పావు. జాన్ దొరను పెళ్ళి చేసికొనేటప్పుడు నాకంత ఆశ యెందుకు కల్పించాలి ?

జాన్ దొరసాని:— జాన్ దొరమీద నాకెంత ప్రేమ వుందో తెలిసికోవడానికి.

## విశాల హృదయము.

"ఏమోయి, మీఆవిడహృదయం చాలవిశాలమైనదే"

"అవును. ప్రతిదానికి రెండభిప్రాయాలున్నాయి అంటుంది ఒకటి తన తల్లిది, రెండవది తనది."

## విశ్వభారతి.

"ఇందూరు మహారాజుకు యిద్దరు భార్యలుండగా, ఉంచుకున్న ముంతాజ్ బేగం కథ అట్లా వుండగా ఇప్పుడు అమెరికను కన్యను వివాహమాడుటేమిటి ?"

"విశ్వభారతిని వృద్ధిలోనికి తేవటానికి."

## విషము.

"పిల్లికూన తప్పిపోయిందికదూ ! ఆ పిల్లకూనను పట్టియిస్తే 100 రూపాయలిస్తానని చాటించావెందులకు?"

"మా ఆవిడను తృప్తిపరచటానికి"

"అయితే యెవడోవొకడు తెచ్చియిస్తాడు"

"అభయములేదు. కుక్కకు యిదివరకే విషంపెట్టాను"

## డాక్టరు.

"డాక్టరుగారూ, అందరికి మందు యిస్తామంటారు. మీకు వ్యాధివస్తే యితరులవద్దకు పోతారు. మీకు చేతకాదన్నమాట"

"చేతకాకపోవటమేమిటి పిచ్చిమాట. ఒకడాక్టరు తన వ్యాధికి తాను మందుయిచ్చినాడనుకో. పొరబాటున చచ్చిపోతే, అతని వైద్యం యెలాకొనసాగుతుంది, పెళ్లాం బిడ్డలు యెట్లా బ్రతుకుతారు ?"

## డబ్బు సంపాదన.

ఒకతండ్రి తన కుమారుని పిలచి "నాయనా, నీకారు అణాలు యిచ్చుచున్నాను. దీనిని 9 అణాలు చేయగలిగినచో నీకు మరి ఆరు అణాలిచ్చెద" ననెను. కుర్రవాడు ఆరుఅణాలు తీసికొని వెళ్ళి మూడు అణాలుపెట్టి పళ్ళుకొని యింటికివచ్చి సంపాదించితి ననెను.

తండ్రి:— యెట్లు సంపాదించితివి ?

కుమా;— మూడుఅణాలు పళ్ళుకొన్నాను.

తండ్రి;— అంతమాత్రము 9 అణాలు యెట్లు చేయగల్గుదువు ?

కుమా; — పళ్ళుమినహా మూడుఅణాలున్నవి నావద్ద మరి మూడుఅణాలున్నవి. ఇవికాక మూడుఅణాలు ఖరీదుగల పళ్లున్నవి మొత్తం 9 అణాలు కాక యెంత అవుతుంది ?

## సామ్యుయెల్ ఫ్రాంసుకు.

వియన్నానగరములో సామ్యుయెల్ ఫ్రోసుర్ ముప్పది సంవత్సరములనుంచి మాట్లాడకుండా వుండి [illegible] మిరాకిల్ రచ్చి యింట్లో చనిపోయినాడు.

ఫ్రాస్మర్ తాలీగా, పన్నెండు కాలము దైవ ప్రార్థనలోనే గడపుచుండెడివాడు ముప్పది సంవత్సరములక్రింద భార్యతో పోట్లాడి బ్రతికివుండగనే తగలడిపోయెదవు అనినాడట. రెండుగంటల తరువాత నిప్పు రగులుకొని ఆయన భార్యయు యిద్దరు పిల్లలు కాలిపోయిరి. అందుకు ఫ్రాసరు చాలా చింతించి మిరాకిల్ రచ్చిని తగిన ప్రాయశ్చిత్తమును సూచించ గోరెను. అందువలన మిరాకిల్ రచ్చి తిట్టిననోరు చచ్చేవరకు తెరువకూడదని ఫ్రాస్మర్ వల్ల ఒట్టు పెట్టించుకొనెను. ఫ్రాసరందువల్ల ఒట్టును చచ్చేవరకు నిలబెట్టుకొనెను.

# బోడిగుండు రావు.

సుసర్ల రామమూర్తిగారు.

నాయనలారా! నమస్కారండి. ఈపేరు వినడానికి కొంత హాస్యరసపూరితంగానే వుంటుంది. దీనిని గూర్చి "నేను నా పెండ్లి" అనే చరిత్రకాండలో వివరించి వున్నాము. ఇంటిపేరు బోడివారు, అసలుపేరు గుండురావు. రెండూచేరి మన కథానాయకుని పేరయింది. వీరు దేశానికి మహోపకారులు. ఎలాగంటారా! ఎవరు జీవితచరిత్రలను వారు వ్రాసుకోవడమంటూ మనదేశంలో ఆచారం చాలాతక్కువ. అసలు లేదనే చెప్పవచ్చును. అందువలన మన సంతతి వారికి మనలను గూర్చిన విషయం సవిస్తరంగా తెలియకపోవడము - ఉన్నవికొన్ని - లేనివికొన్ని కల్పించి వ్రాయడమవుతుంది. యీదోషానికి కొంతభంగం కలుగుతుంది. ఇంతేగాదు? పూర్వకవుల చరిత్రలు వ్రాయడానికి మనవారు చేసిన పరిశ్రమలేవి? ఏమి చెప్పము. ఈకష్టసుఖాలు గమనించి శ్రీరావుగారు తమ జీవితచరిత్రమును ప్రకటింప సంకల్పించుకొన్నారు.

ఈమధ్య బోడిగుండురావుగారు దర్శనమివ్వడం అరుదయింది. వివాహానంతరం వారిదర్శనం మిత్రమండలికి కూడా అలభ్యమయింది. మాకు వారికన్నీ దర్శనాలందని మధ్యకాలంలో వారి చరిత్రకాండలో కొంత వ్రాయవలసి వచ్చిందని కబురు చేశారు. విషయాలీవిధంగా మొదలుపెట్టమన్నారు.

"మహాశయులారా! నేను యీమధ్య సైకిలు నేర్చుకోవడాన్ని గురించి యిదివరకే మనవిచేసుకొన్నాను. ఎలాగైతేనేం సీటుమీద కూర్చుని ధారాళంగా సైకిలునడిపే శక్తి యేర్పడ్డది. కాని ఒక పెద్దచిక్కు సంభవించినది. సీటు ఎత్తుగుట వలన "పెడల్సు" అందేవికావు. ఇక సైకిలు తొక్కడానికి గడియారంలోని "పెండులం" లాగ అటూయిటూ వూగుతుండవలసి వచ్చింది. నాకష్టం నేను పడతానుగా - లోకానికేమి చేటో? చూచినవారందరూ "ఎంతకష్టపడుతున్నాడో!" అని ఒకడు, "ఏమో! అంతకష్టపడి తొక్కకపోతే యేదేవుడేడ్చాడని" ఒకడు; "అలా నిరుత్సాహపరచకూడదు. సర్కసులో యేనుగంత జంతువే సైకిలెక్కంగాలేంది మనవాడు తంటాలుపడలేడా" అని యింకొకడు - యీప్రకారంగా వినబడీ వినబడకుండా ఆటకాయితనాలు కంటుండేవారు. వినబడినా వినబడకపోయినా చెయ్యగలిగింది ఒకటేసదుపాయం —గౌరవంగా వినిపించుకోనట్లు ఉండడమే— కాని ఆంధ్రుణ్నికదూ. ఏమున్నా ఏమిలేకపోయినా అభిజాత్యం పట్టుకు ప్రాకులాడుతుంది. ఒకదినం ఉదయాన్నే యీవాహనం తీసుకొని షాపుకు బయలుదేరాను. షాపువాడు అప్పుడే వచ్చినట్లున్నాడు. చేతితో గుడ్డతీసికొని సామానులకు దుమ్ము దులుపుతున్నాడు. నను చూచి "ఏం పంతులుగారూ? దయచేశారే ప్రొద్దున్నే.

నేను:- ఏమీ విశేషంలేదు. కాస్త సందేహంగా వుంటున్నదోయ్.

షాపు;- ఎక్కడిలేని ధర్మసందేహాలన్నీ వస్తుంటవండీ మీకు?

నేను:- (ఈమాటలలో మనస్సు చివుక్కుమన్నా మనపనిగనుక కాస్త ఓపికపట్టాను)

ఏమయ్యా! యీ ప్రారబ్ధం సరిగా వారం రోజులుకాలేదు. 150 రూపాయలు నీచేతిలో పోసి, ఈపాటికి మూడోవర్యాయం తమ సేవకురావడం. మరి దీనికేమైనా గత్యంతరం వుందాలేదా.

పాపు:- అయ్యా! ఆసైకిలు ఖరీదే ర్వూ 125 అయితే 150 అంటారేమండీ? వస్తువు కావలసినవారు స్వయంగావచ్చి చూచుకోవలసిందేగాని, గుమాస్తాగారి రాయబారమా?

నేను:- కచేరిలో పనితీరిక లేక నమ్మికమైన గుమాస్తాగారిచేత తెప్పించానండీ. అయితే ఆయన నావద్ద ర్వూ 150 ఖరీదనిచెప్పి వసూలు చేశాడండీ.

పాపు;- గుమాస్తా అయితేనూలోం డబ్బులేదా? గుమాస్తారొఖ్ఖం తీసుకొంటాడు. పై వారు వస్తుపూర్వకంగా తీసుకొంటారు.

నేను;- ఇంతకూ యిది స్వయంకృతాపరాధం లెండి. ఆగుమాస్తాను మళ్ళీ యీవిషయమై కదిలించానా దూర్వాసున్ని మించిపోతాడు. గంభీరంగా వూరుకోవడం మంచిదిగా తోస్తుంది. అయితే సీటువిషయమై యిబ్బంది తొలగించిరా, సైకిలు నిరాఘాటంగా వెళ్ళిపోతుంది. దీనికేదైన సదుపాయం ఆలోచించండి

పాపు;- అయ్యా! కోపపడకండి. మనుష్యపెర్యత్నంలో జరిగే సదుపాయం నాకేమీ తోచడంలేదు సీటు యింతకంటె తగ్గించడానికి వీలులేదు. మీరుబొత్తేగాని కాళ్ళు లేవాయె, దానికి నేనేం చెయ్యను. కాళ్ళు పొడుగు కావడమే సదుపాయం.

వీడి తాడు తెగినట్లే చెప్పాడు సదుపాయం. అనుకుంటూ ఆబండితోగూడా యింటికి చేరుకున్నాను. అప్పటినుంచి సైకిలెక్కడం మానేశాను.

"ఈ సంగతి యెవరితోనైనా చెప్పి సలహా పుచ్చుకొందామా" అనుకుంటే "నీకెందుకురా సైకి" లనేవాడే గాని సరియైన జవాబిచ్చేవాడూ కనబడడు. సైకిలు కొనుక్కోక ముందున్న ఉబలాటమైనా తీర్చుకోలేక పోయాను. వాహనం మూలపడ్డది. దుమ్ము ధూళి పడి తుప్పు పట్టడం ప్రారంభించింది. నా అవస్థ యితరులకు చెప్పడమా - చెప్పక పోవడమూ - అని దీర్ఘాలోచన పడ్డది.

ఇంకో సంగతి చెప్పడం మఱచిపోయినాను నాయనలారా: యీ మధ్య నావివాహ విషయమై నేపడ్డ చిక్కులు మీకు వివరించానుకదా. ఇప్పుడు బ్రహ్మచారిని కాకుండా - గృహస్థునూ కాకుండా - ఉభయ భ్రష్టత్వములో వున్నాను. కట్టుకపోయేటంత ఆస్తి వుండంగా ఊడకొట్టిన మంచపుకోడులాగ "నా" అనవారు లేకుండా యెన్నిరోజు లీజీవితం జరుపడ మనకున్నా. కన్యాన్వేషణం మొదలెట్టాను. "Wanted a young beutiful bride to marry a gentleman ct sound status" For Paticulars apply to B. G Rao, c/o Editor......" అని పత్రికలలోనూ ప్రకటించాను.

ప్రసంగ సందర్భంలో అంగసౌష్టవానికి నూతన మార్గమున్నదన్నాడు మా స్నేహితుడు. కాని కీలక మేమిటో చెప్పాడు కాదు. మన పని గనుక చెప్పేటంతవరకు వాణ్ణి ఆశ్రయించి తిరిగాను. ఆఖరుకు చెప్పడానికి పూనుకొన్నాడు. "అరే; మిస్టర్ గుండ్, నీవు యిలా పుష్టి వ్యాయామం లేదోయ్ You must take exercise బొర్రి తగ్గించుకోవలెనోయ్ బొర్రి సన్నగిలుతుంది. కాళ్ళుపొడుగవుతవి. దర్జాగా బంగారు పిచ్చికలా — సైకిలుమీద సంచారం సాగించవచ్చు" అన్నాడు.

నేను;- నాయిల్లు బంగారంగాను. ఇప్పటిదాకా నాకు ఎక్సర్‌సైజు (exercise) వృద్ధాప్యంలో ఓ, న, మాలు నేర్చుకున్నట్లు—నాకే — వస్తుందా—చస్తుందా.

స్నేహి;- కాదులే Brother. Do 't be discouraged నేనున్నాగా అన్నిటికీ. నీవు పూనుకో—చెపుతా.

సరే; యీ సలహా బాగానే వుందనుకున్నా. కసరత్తు చేయడానికి సాధన సామగ్రి యేర్పాటు చేయవలసివచ్చింది. ప్రప్రథమం—మాయింటి దగ్గర వున్న దర్జీవాణ్ణి పిలచి "ఏమోయ్, నాకో లంగోటీ సాయంకాలంలోపల తయారు కావలె. సమర్పింపు"

దర్జీ;- బాబూ, తమకు లంగోటీ కావాలంటే మూడు గజాల గుడ్డకు తక్కువపట్టను. రెండుకుట్లు వేస్తేకాని మీదగ్గర నిలవవు సాయంకాలానికి తయారు కావడ కష్టం

నేన;- ఇంటిముందర వున్నవాడివి—చెప్పినట్లు చెయ్యకపోతే యేలాగోయ్.

దర్జీ;- కోప్పడకండి బాబూ; లంగోటీ అనవసర మండీ మీకు. ధోవతి పైకి బిగించి కట్టితే సమయాని కనుకూలిస్తుంది.

అన్నీ మనకు కలసివచ్చే రోజులు కాబోలు సదుపాయాలు చప్పచప్పన బయటపడు తున్నాయి అని సంతోషించినాను. అయితే ఒక మనవి. నావంటిమనిషి "సభాతో—సభ విస్మృతి" అందునుంచి స్వీయచరిత్రలోని భాగాలు కొన్ని మరల చెపుతుంటాను. నేను స్థూల కాయుణ్ణి అని మీకు తెలుసుగదూ. దండేలు తీయడానికి నేలకువంగితే నాఅంతట నేను లేవ లేను. లేవతీయడానికి మనుష్య సహాయం కావలసివచ్చింది. సలహాచెప్పిన స్నేహితుణ్ణి పిలిపించాను. కలిసివచ్చే రోజుకు నడిచే బిడ్డ దొరకవలెనని శ్రీమంతుడెవరో కోరినట్లు మా వాడి సహాయం లభించింది. ఇక కసరత్తు ప్రారంభించాను.

ఉదయాననే నిద్రలేవడం—తొందరలు తీర్చుకొని మొదలుపెట్టేవాణ్ని దండెములు తీయడానికి. నేలమీద బారునవంగి పద్ధతిప్రకారం తీయవలెననుకొనేవాణ్ని. నా స్నేహితుడు పొట్టక్రిందకి ఒకచెయ్యి పోనిచ్చి—నడికట్టు ఒక చేతితో పట్టుకొని, పండ్లు బిగించి, ఎడమకాలు ముందుకు ఊనిపెట్టి, కుడికాలు వెనుక మోపి, నేను వంగినపుడల్లా వంగుతుండేవాడు. పైకి లేవడం మాత్రం నా ప్రయత్నము కాదు గదా. ఊరి బావిలోనుంచి చేద బయటికి లాగి నట్లు నన్ను పైకి లేపుతుండేవాడు. ఒక్కొక్క—

వ్వాడు బరువు లాగలేక పట్టువదలివేశేవాడు. సగము దూరమువచ్చిన చేద నూతిలో బడ్డట్టు "దభ్భున" పడేవాణ్ని. నిరుత్సాహపడతానేమో అని "అలాపడితేనేగాని బ్రార ఛాతితో సమానం (Level) గా రాదనేవాడు. కొంత అలుపు తీర్చుకోడానికి కాబోలు దూరంగా నిలుచోని "నీవు సొంతంగా దండేలుతీయి. నేను చూస్తా" ననేవాడు. సరేనని వాణ్ని.

స్నేహి:- ఏమోయ్; మోకాళ్ళు సలకానుతున్నాయి.

నేను:- మోకాళ్ళేమి కర్మం. బొరేక్షిమయిందనుకున్నావ్. చూడు ముక్కుకుగూడా వొన్ను అంటిం ది.

అయిదారు దండేలు తీసేటప్పటికి ఆవస్సోపాలెక్కువయ్యేవి. విశ్వప్రయత్నం జరిగేది. కాళ్ళుచేతులు జాడించేవాణ్ని. రావిచెట్టుకు ప్రదక్షిణంచేసి కడుపుచూసుకొన్నట్లు ఊపిరి బిగించి కండరములు చూసుకొని సంతోషించేవాణ్ని. ఈఅవస్థ ఒక నెలరోజు లనుభవించాను. ఎప్పటికాళ్ళు అట్లానేవున్నాయ్ కొంచెంగూడా పిసరంతైనా తగ్గినట్లు కనపడలేదు. దేవుని సంకల్పం లేకపోతే దేహపరిశ్రమచేసినా లాభం లేదు. దేహత్యాగంచేసినా లాభంలేదు. అనుకొని ఆ ప్రయత్నానికి హస్తోదకాలు యిచ్చాను.

ఈ మధ్య వివాహ విషయంలో నేనుచేసిన పత్రికా ప్రకటనానికి జవాబేదైనా వస్తుందేమో అని యెదురు చూస్తుండేవాణ్ని. ఏదో లోపముంటేనేగాని వివాహనిర్ణయము పత్రికా ప్రకటనల దాకా రాదని తెలియని వారుంటారూ? ఇంతవరకూ ప్రత్యుత్తరాలయితే రాలేదుగాని ఒకటి రెండు సంబంధాలు వచ్చినవి. వయస్సు అడగందే ప్రస్తావన మొదలు పెట్టేవారు కారు. అయినా అడిగినప్పుడు చెప్పక పోవడ మెలాగు? "క్రిందటి విభవనామ సంవత్సరంలోనే జనన" మనేవాణ్ని ఆవచ్చినవారిలో నొకడు "బాబూ షష్ఠిపూర్తిన్నీ వివాహమున్నూ ఒకేసారి చేసుకోవలెనని సంకల్పమా". అన్నాడు. ఈ మాటలు వినడంతోనే మనస్సుకొంత చిన్నపుచ్చుకున్నది. అయినా కొంత నిబ్బరం తెచ్చుకొని "అయ్యా; అలా అన్నారేగాని ప్రాణానికి ప్రాయానికి లంకెయున్నదా? వెనక మా బాబాయిగారు బ్రహ్మచర్యంలో పదారేండ్లు ప్రయాగలో పాండిత్యం సంపాదిస్తూ పదునెమిదేండ్లు వుండి, తిరిగి స్వగ్రామం చేరుకున్నతర్వాత సంబంధం కుదరక కొంతకాలం గడిపి ఆఖరుకు 45 వ యేట మూడిపెట్టుకున్నాడు. అయితేనేం ఆరుగురు పిల్లలుకలిగారు తర్వాత పది సంవత్సరాలలో. ఏదీ యిప్పటి కుర్రకారుని చూడండి ప్రతివాడికి Constipation (అజీర్ణమో — అగ్నిమాంద్యమో) తప్పదు ఇంతింత బడిపిల్లలకు గూడా డాక్టరుగారి పరీక్షయే; వెనక మా చిన్నతనంలో డాక్టరంటే యేమిటో—వైద్యమంటే ఏమిటో మాకు తెలిసేదేకాదు. ప్రతి కుర్ర వెధవకి అస్తమానం తెలిసిపోయింది—ఈ రోజులలో—తెలియదూ మరి తెల్లవాడికి ఆ మొదలూ యేదో ఒకరోగమూ — అనులోమా సామాన్యరోగాలా—అరికాలు మంట, గుండెదడ, పార్శ్వపు నొప్పి మొదలైన విపరీత బాధ్యాలు" అంటూ ఒక పావుగంట సేపు ఘాటుగా జవాబిచ్చేవరికి దంగయిపోయినారు.

తరువాత కొన్నాళ్ళదాకా సంబంధం యేదీ రాలేదు. "ఆఫీసులో ఒక్కఖాళీవుంటే 60 మంది దరఖాస్తులు పెట్టి కచేరీచుట్టూ కాటికి కావలి కాస్తుంటారే ఇంత ఆస్తిని దిద్దుకోడానికి ఒక్కరూ రాలేమి ?" అని విచారిస్తున్నాను. ఒకనాటి వుదయం వుత్తరం వచ్చింది. విప్పి చదువగా యీవిధంగా వ్రాసివున్నది.

"శ్రీ పంతులవారికి, మీరు పత్రికలలో ప్రకటించినరీతిగా మీ వివాహ షరతుల కంగీకరించి మీ సంబంధమును కోరుతున్నాము. రేపు 1 వ తారీఖు వుదయం బండిలోవచ్చి తమ దర్శనం చేసుకుంటాము అని మనవి

ఇట్లు,

రంగరత్నం"

పరమ సంతోషము — అపరిమిత సంతోషం కలిగింది. మరునాడే ఫస్టు తారీఖు. వుత్తర ప్రకారం వారు వస్తారు కదా అని కుర్చీలు, అందుకు తగిన మేజాలు హాలులో అమర్చించాను ఎనిమిదిదాటి తొమ్మిది కావస్తున్నది వాకిట్లో బండినిలచింది. ఆ యిదు నిముషాలు చూచాను. ఒకొక్కరే బండి దిగుతున్నారు. అందరుకలసి లోనికి వచ్చారు. "Hallo ,Good morning, Sir" అన్నారు. వారిలో పెద్దతను నేనున్నా వారికి వురిని సగౌరవంగా యెదుర్కొని కుర్చీలలో ఆసీనుల చేశాను.

నేను;- అయ్యా; తమ పేరేమిటి ?

రంగ;- అయ్యా; నన్ను రంగరత్నం అంటారు. యీమె జీవమణి. నా కొమార్తె - వివాహిత కాకున్నది.

నేను;- సంతోషము. (స్వగతం) వీరినైఖరి చూస్తే, పేర్లు తరహాచూస్తే క్రైస్తవుల లాగా కనబడుతుంది. వేసిన ఆ తెల్లలంగా లేసువేసిన బాడీ—వాయిల్ సిల్కు జాకెట్టు Hazline Snow వేసిన ఆ నల్లమొఖం, రిబ్బను వేసిన జడా చూసేసరికి నవనాగరికతకూడా నేర్చుకొన్న యువతిలాగనే వుంది. ప్రస్తుత పరిస్థితులనుబట్టి గృహస్థుడను కావడమే మనకు ప్రధానం కాబట్టిన్నీ — యింకా యితర సంబంధాలు రాలేదు కాబట్టిన్నీ- యిది అంగీకరించక తప్పిందికాదు.

రంగ;- అయ్యా; తమరు ముహూర్త నిర్ణయం చేసుకొన్నరా.

నేను,- సంబంధాలు స్థిరపడితేగా ముహూర్తానికి.

రంగ;- ఎందువల్ల స్థిరపరచుకో లేదండీ?

నేను;- (స్వగతం) పెద్దచిక్కే వచ్చిందే. సంబంధాలు వస్తేగా యేకారణమైనా చెప్పడానికి. అసలు రాలేదని చెపుదామా పరిస్థితులు సందేహిస్తారేమో. (ప్రకాశం) విద్యావంతురాలగు వధువు లభింపకపోవడం వల్ల చాలా సంబంధాలు తిరిగి పోవలసి వచ్చింది.

రంగ;- అలాగానండి. మా అమ్మాయి యిప్పుడు ట్రెయినింగు చదువుతుంది. రేపు మార్చికి పరీక్షలు అయిపోతవి. యేబోర్డు స్కూలులోనైనా రూ 40 లు తక్కువ లేకుండా వుద్యోగం కావచ్చు. అయినా యీనాటి రోజుల్లో స్త్రీ విద్యను గౌరవించని దెవరులెండి ?

నేను:- మాకు ఉద్యోగాలెందుకండి. బోలెడంత ఆస్తి వుండగా.

రంగ:- ఇక అంతా మీయిష్టానుసారము.

నేను:- మీకు ముహూర్తానికి యేరోజు అనుకూలిస్తుంది.

రంగ:- మీరే ఆలోచించండి. వారం వర్జ్యము వీటితో మాకేమీ పని లేదు.

నేను:- మంచి పని. ముహూర్తాలు చూసి చేసినవన్నీ సరిగా వున్నవి గనుకనా.

రంగ;- మనకా గొడవ యెందుకులెండి. రేపు Sunday గనుక చర్చిలో యేర్పాటు చెయ్యడానికి యేమైనా అభ్యంతరముందా.

నేను;- అభ్యంతర మేమిటి "శుభస్య శీఘ్రమ్మ"న్నారు

రంగ;- మతాంతర వివాహానికి మీరంగీకరిస్తారో లేదో అని అన్నాను లెండి

నేను;- ఈరోజుల్లో అలాంటివి యెవరు గమనిస్తున్నారు. పిల్లను యిచ్చేవాళ్ళాలోచించుకోవలసినదికాని పుచ్చుకొనేవాళ్ళు గమనించవలసినది కాదు

రంగ;- అయ్యో: తమకేమైనా ఉద్యోగమా ప్రస్తుతం.

నేను;- నాకెందుకండీ ఉద్యోగం — ఉన్నది అనుభవిస్తే చాలు.

రంగ;- అలా కాదులెండి. మనిషికి యేదో ఒక యోగ్యత వుంటేనేగాని చురుకుగా వుండడు. అందునుంచి అడిగాను.

నేను;- అయినా! యీరోజుల్లో బ్రాహ్మడికి వుద్యోగ మెవరిస్తారండీ.

రంగ;- మీరీ వివాహపూర్వకంగా సంఘసంస్కర్తలైనారుగా. కాబట్టి సంఘసంస్కర్తలకీ బ్రాహ్మణులకు సంబంధములేదు. అయినా యీవిషయం మరొకమా రాలోచిద్దాము. ప్రస్తుతం జరగవలసిన యేర్పాట్లేవిటి

నేను;- పిల్లనిచ్చేవారు మీరు గనుక మీ ఆచారప్రకారంగా నడుపుకొండి.

రంగ;- అయితే మరీ సంతోషం. నేను వెళ్ళి మాఫాదర్ (Father గారితో యేర్పాటు చేసివస్తాను.

నేను;- అయ్యో! మీతండ్రిగారీవూళ్ళోవున్నారా?

రంగ;- Father అంటే మతావలంబకుల కందరికిని తండ్రిసమానుడు మతగురువని మీరంటారు. మేము ఫాదర్ అంటాము. మాయెడల వారికి సమానాదరణాభిమానము లుంటవి గనుక మేమా పేరుతో పిలుస్తాము. గురువునకు తండ్రికున్నంత ఆదరణ ప్రేమ వుండదుగనుక మీ మతాధికారికంటె మామతాధికారి చాలా అనుకూలుడై ప్రసన్నుడౌతాడు.

నేను;- అబ్బా! ఎంతగ్రంథం వుందండి మీమతాన్నిగురించి. మీరు వెళ్ళండి

రంగ;- మీరు తగిన సన్నాహంలో వుండండి. నేను వెళ్ళివస్తాను (అని నిష్క్రమించెను.)

* * *

అయ్యలారా! ఏర్పాట్లన్నీ సవ్యంగా జరిగిపోయినవి. చెడ్డచేనుకు కంచెలెందుకని యీనా వివాహమహోత్సవము ఊరేగింపు వగైరాల ఆర్భాటం లేకుండ జరిపేశాము. యిప్పుడు నేనూ ఒక యింటివాణ్ణి అయినాను. వివాహం మళ్ళీ అవుతుందో కాదో అనుకున్నాను యీ యేర్పాట్లన్నీ జరగడంవల్ల పురిటిగండం తప్పిపోయింది. ఇహాపర సాధకంగాని యీచరిత్రతో మిమ్ములను చాలా విసికించివుంటాను. క్షమించండి. విశేషాలేమైనా యింకావుంటే వీలుచూచుకొని మనవిచేస్తాను.

# చిలికి చిలికి గాలివాన

అప్పల్ల కామేశ్వరశర్మగారు.

అది వర్షఋతువు. ఒక నాఁడు సాయంకాలము నా ప్రియస్నేహితుఁడగు సుబ్రహ్మణ్యమును నేనునుగలసి కొండలపైపునకు షికారు వెడలితిమి. చేరువనుండు నొక కొండనెక్కి యక్కడనుండు కొండకాలువలను జూచుచు కొంతవఱకు కాలక్షేపము చేసితిమి.

మా సుబ్రహ్మణ్యమునకుఁ దెలుఁగులో వంతజ్ఞానము లేకున్నను సంస్కృతమునమాత్రము మంచి జ్ఞానము మున్నదని చెప్పకతప్పదు. కావున వానితో నిట్లు సంభాషించితిని. "మిత్రమా! మాఘుఁడు, భారవి, భవభూతి, శ్రీహర్షుఁడు మున్నగు మహానుభావులగు కవీశ్వరులుండ నొక్క కాళిదాసునకే యిట్టికీర్తి బయలువెడలుటకేమి కారణమై యుండునో చెప్పఁగలవా?" యని నామిత్రుని ప్రశ్నించితిని. "కాళిదాసు కవిత్వము మృదుమధురమై, దీర్ఘసమాసవిరహితమై, యమకశ్లేషవిహీనమై బాలురకుఁగూడ నర్థమగుచుండును గావున నీతనికీ ప్రసిద్ధి కలిగినది. దీర్ఘసమాసములు యమకములు, శ్లేషలు మున్నగు నాడంబరములు కవుల సామర్థ్యములను బ్రకటించుటకే కాని సహృదయులకు హృదయరంజకములు కాఁజాలవు. ఈ కారణముననేకదా కాళిదాసకృతమగు నభిజ్ఞానశాకుంతల మన్యభాషలలో నికిఁ గూడ భాషాంతరీకరింపఁబడియున్నది." అని నామిత్రుఁడు సమాధానమీయఁగనే "సెబాస్ బాగుగ చెప్పితి" వని వానిని శ్లాఘించుచు "నడిగిన వారికైనను నింత యభిప్రాయములేదు" అని సంతోషించితిని.

కాళిదాసు చేసిన యభిజ్ఞానశాకుంతలమను నాటకములోఁ జతుర్థాంకము శ్రేష్ఠమని సహృదయులు చెప్పుదురే అట్లు చెప్పుటలోఁ గారణమేమైయుండునో నీకుఁ దెలియునా? అని తిరిగి మా సుబ్రహ్మణ్యమును బ్రశ్నించితిని. కాని యాభారము నామీదనే యిడుటచే నిట్లు సమాధానమిచ్చితిని చూచితివికదా! ఈలోకమునఁ దల్లిదండ్రులు తమకుమార్తెల నత్తవారింటికిఁ బంపునపుడు నీతుల నిట్లు బోధచేయుదురో ("అమ్మా! మీ మామగారికిని, మీయత్తగారికిని మిక్కిలి విధేయురాలవై వారు చెప్పినపనులఁ జేయుచుండుము నీమగఁ డెప్పుడైనను కోపపడినయెడలఁ దిరిగి యెదురు చెప్పకుమీ, నీతోటి కోడండ్రను నక్కచెల్లెండ్రనుగా భావించి వారితోఁ గలహములు పెట్టుకొనకుమీ, మీయింటి రహస్యములను పైవారికిఁ దెలియఁజెప్పకుమీ, యిరుగుపొరుగు యువతులు చెప్పిన చాడీలనువిని గృహమునఁ గలఁతలు పెట్టుకొనకుమీ, ఈవిధముగ నున్నచో నీకును మాకును మీయత్త వారికినిఁగూడ శ్రేయము రాఁగలదు." అని లోకమునందు పద్ధతిని (స్వభావమును) తన శకుంతలమునఁ గణ్వుఁడు శకుంతలను భర్తకడకుఁ బంపునవసరమునఁ దెలియఁజెప్పియున్నాఁడు. ఇట్టి స్వభావోక్తులతోఁ గూడియుండుటచేతనే యీ పుస్తకమందుఁగూడ నాల్గవ యంక మున్నతపదవి నలంకరించినది. అభిజ్ఞాన శాకుంతలమును నందును నాల్గవయంకమును బూర్తిగాఁ జదివి యానంద సాగరమున నోలలాడనివాఁడు దుండని నా మతము. అట్టి శ్లోకములలో నొక్క శ్లోకమునుగూడఁ జదివెదను వినుము. "శుశ్రూషస్వగురూన్ కురుప్రియసఖీవృత్తిం సపత్నీజనే। భర్తుర్విప్రకృతాపిరోషణతయా మాస్మ ప్రతీపంగమః। భూయిష్ఠంభవ దక్షిణా పరిజనే, భాగ్యేష్వనుత్సేకినీ యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః॥" అని యాశ్లోకమును జదివితిని. "స్వభావోక్తివలనఁ గూడఁ గాళిదాసు మిక్కిలి పూజ్యుం డాయెను" అను నీవిషయమునమాత్రము మిత్రుఁడు నాతో నేకీభవించినట్లు కనుపట్టలేదు. "ఉన్నదున్నట్లు చెప్పితే గొప్పయేమున్నది?" అని యేమో చెప్పుచు నతిశయోక్తి తనకుఁ బ్రియమని చివఱకు తేల్చెను. అట్లనఁగానే నవ్వి యతిశయోక్తి యంత ప్రశంసనార్హము కాదని చెప్పుచు "రాజోలు తాలూకాలో రెండు గ్రామములు గలవు. ఒక గ్రామమునఁ గుంచెడుబియ్యపు అన్నము తినెడు బ్రాహ్మణుఁడొకఁడును మరియొక గ్రామములో మణుగు చింతపండుచారు త్రాగెడి బ్రాహ్మణుఁడొకఁడును గలరు. వారికిఁ బరస్పరము స్నేహముకూడఁ గలదు ఒకనాఁ డన్నపు బ్రాహ్మణుఁడు చారు త్రాగు బ్రాహ్మణుని యింటికేగి యాతని భార్యను నాతని సమాచారము నడిగి తెలిసికొని యానాఁ డచ్చటనే యుండెను. అంత సూర్యుఁడు పశ్చిమాంబుధిఁ జేరుచుండెను. చారు త్రాగు బ్రాహ్మణుని భార్య వచ్చి "అయ్యా! మీరు లోనికివచ్చి పండుకొనుఁడు. సాయంత్రము కాగానే కాబోలు మదపుటేనుగు వీధుల సంచరించు" నని చెప్పి వెడలిపోయెను. కాని యాబ్రాహ్మణుఁడు ఆమె చెప్పినమాటలను వినిపించుకొనకయే వీధ యరుగుమీదఁ బండుకొనెను. మదపుటేనుగు పూర్వము ప్రకారము వీధుల సంచరించుచు, నీ బ్రాహ్మణునివద్దకు వచ్చి యాతని శరీరమును వాసనచూచు సందర్భమున నాయేనుగు తొండము వాని చంకక్రిందఁ బడియె. అంత

నా బ్రాహ్మణుఁడు నిద్దురనుండి మేల్గాఁకయే ఊ…… అనుచు నీవైపునుండి యావైపునకు దొరలెను. అంత నాయేనుగు తొండము విరిగి చనిపోయెను. తెల్లవారినది అది శుక్రవారము. ఆయింటి బ్రాహ్మణుని భార్య వచ్చి యేనుఁగు చచ్చి పడియుండుటఁ జూచి "శుక్రవారపు ప్రొద్దున గుమ్మముముందఱ నీపీనుఁగేమిట" ని విసుగుకొనుచుఁ జీపురుతో నాయేనుఁగును జేటలోనికెత్తి పెంటమీఁదఁ బారవైచెను. అన్నపు బ్రాహ్మణుఁడు తనగ్రామమునకుఁ బోవుచుండఁగాఁ బర్వతమంత మోపును దలమీఁద బెట్టుకొని చారు త్రాగు బ్రాహ్మణుఁ డెదురయ్యెను. వారు పరస్పరము పలకరించుకొనిరి. అన్నపు బ్రాహ్మణుఁడు "అయ్యా! మీతో దండపట్టులు పట్టవలయునని నాకుఁ జాలరోజులనుండి కోరిక కలద" ని యుత్తేఁగించెను. సరియేయని వారిద్దఱును దండపట్టుఁ బట్ట నారంభించిరి. అంత నామార్గమున నొక గొల్లపడుచు పోవుచుండ నామెను బిలిచి "మాయిద్దరిలో నెవరు గెల్తురో చెప్పు" మని యామెనుగోరిరి. కాని యామె తన కార్యమున కాలస్యమగునని మీరిద్దఱును నా భుజము మీఁదఁ గూర్చుని దండపట్టులు పట్టుఁడని వారిని గోరగా నా బ్రాహ్మణులిద్దఱును నట్లే చేసిరి. గొల్లదాని భుజముల నా బ్రాహ్మణు లిద్దరును, నందు చారు త్రాగు బ్రాహ్మణుని నెత్తిమీఁదఁ బర్వతమువలె మోపును గలదని జ్ఞాపకముంచుకొంటివా?" అని మర్యాదామిత్రుని ప్రశ్నించితిని. వారు పోవు మార్గమున నొక చింతచెట్టును, దానిక్రింద నొక గుడిసెయు నందు నొక వృద్ధురాలు నుండిరి. గొల్లభామ బ్రాహ్మణుల తనభుజములమీఁద నుంచుకొని పోవుచుండ నా చింతచెట్టు కొమ్మ తగిలి చారు త్రాగువాని తలమీఁది మోపా గుడిసెమీఁదఁ బడుచుండ గుడిసె పడిపోకుండు నట్లుగ నందున్న వృద్ధురాలు తన తలవెంట్రుక నొకదానిని దీసి యామోపునకు బొట్టీచ్చెను. నవ్వకుము. నవ్వకుము. ఇది యిట్లుండ నాగొల్లదాని మగఁడు తాను కాయుచున్న యేనుగులను విడిచి యచ్చటకుఁ బరుగెత్తుకొని వచ్చెను. "ఇది మంచి సమయము కదా" యని యాగొల్లవాని దుప్పటి నంటియున్న చీటపేనొకటి యా యేనుఁగుల నన్నిటిని భక్షించెను." అని యీకథను జెప్పుచు నీకథకును స్వారస్యమునకును నెంతదూరమో స్వభావోక్తికిని నీయభిమతమగు నతిశయోక్తికిని నంతదూరమని చివరకుఁ జెప్పితిని. ఇట్లు చెప్పుకొనుచునే యింటికిఁ దిరిగివచ్చితిమి. అంత నా మిత్రుని కపరిమితమగు నాగ్రహము కలిగి నాతో మాట్లాడుట మానివేసెను.

---

## అన్వేషణము

కందుకూరి రామభద్రరావుగారు.

గగనమండలి మేఘశకలముల్ గాంచి  
నీవుంటివను నాస నిగిడి చూచితిని;  
పొడుపు గుబ్బలిపైనఁ బొడము నీరెండ  
నీరాక ప్రభయంచు నిలచి కాంచితిని;  
నవ్య కుసుమంబుల నవ్వులం జూచి  
నిన్నుఁజూచిరి యని యెంచి నిలచి వెదకితిని  
కొమ్మలో వెడలెను కోకిల రుతము  
నిను జూచి పిలిచెనని నిలచి వింటిని  
వరవేణు మను గాడ్పు పాటవం బరసి  
నినురోయు జాడగ నే నెంచి వెడలి  
యెంత గాంచినగాని యెంత వెదకినను  
నా నాథ! కనరావు నాపుణ్యమేమొ! ॥ 7

ఆకుపచ్చని చీర నందముగఁ గట్టి,  
కానంత తమసంబు కజ్జలముగఁ దీర్చి,  
తారకాభరణముల్ తనువునం దాల్చి.  
బాలచంద్రుని రేఖ పాపటను దిద్ది,  
ముఖమండలిని మబ్బు ముంగురుల్ సెలఁగ,  
కుసుమ సౌరభములు ఘుమఘుమల్ గురియ  
వర్ణసురటిఁ జేత పదిలముగఁ బట్టి,  
ప్రినవరాజములలో పానకం బుంచి  
ప్రకృతీ! యెవరికై పయనమైనావు  
నా నాథుకొఱకైన ననుగొని పోవె ॥ 8

# పిచ్చి అక్షరాలు.

రా.

శ్రీని[illegible]సరావు యీజీఛెయిర్‌లో కూర్చుని సిగరెట్ [illegible]చాడు. రాత్రి యెనిమిది గంట లైంది. [illegible] చేసి [illegible]శ్రాంతిగ బాబుతో సం[illegible]షణ [illegible]క్రమించాడు. శ్రీనివాసరావు బెజవాడ[illegible] సుప్రసిద్ధ పత్తేదారుడని పేరు పొం[illegible]డు [illegible] బాబు అతనికి ప్రాణస్నేహితుడు.

"[illegible] అక్షరాలేమిటో చూడు" అ[illegible]సరావు.

"పిచ్చి [illegible]క్షరాలు!" అన్నాడు బాబు.

"[illegible]గం!"

"ఇం[illegible] మీ అభిప్రాయం ఉంటుంది?"

"అ[illegible] వలసింది. గుంటూరులో నా మిత్రుడు [illegible]రావు దాన్ని [illegible]నుక్కోటానికే తంటాలు [illegible]తున్నాడు. ఈ అక్షరాల నెవరో కాగితంమీద వ్రాసి కవరులో పోస్టుచేశారు. ఆకవరు [illegible] వద్దకు వది గంటలకు అందింది. ఇదుగో [illegible]రావుకూడ వచ్చాడు!"

లక్ష్మ[illegible] పొడుగాటి సన్నని మనిషి ఎర్రని శ[illegible], నూనూగు మీసాలు. వారి స్నేహం [illegible]గా నాటుకుండటంచేత ఏకార్యంలోనైనా శ్రీ[illegible]వాసరావు సంప్రతింపు లేనిదే కాలు పెట్టడు. "శ్రీనివాసరావూ, ఆపిచ్చి అక్షరాల సంగతి తేల్చావా? వ్యవధి వుంటుందనే నీ వద్దకు పంపించాను." అన్నాడు లక్ష్మణరావు.

"చూడటానికి పిచ్చి అక్షరాలేకాని చాలా అర్థమున్నట్లుందోయి. అయినా వాటినంత లక్ష్యం చేస్తావేమిటి?"

"నేనైతే లక్ష్యంచేయను కాని మా ఆవిడ నన్ను వేపుకతింటోంది. అక్షరాలు చూచి భయపడి పోతోంది. ఎంత అడిగినా చెప్పదు. అందుకనే దీని లోతు తీయించాలనుకున్నాను."

శ్రీనివాసరావు కాగితాన్ని దీపం ముందు పెట్టి యెగా దిగా చూచాడు. ఎక్కడో నోటు బుక్కులో చింపినట్లుగా కన్పడింది కాగితం. అక్షరాలు పెన్సిలుతో వ్రాయబడ్డాయి.

వు ఆ రా నం రి ద గి ని ష కే శే త ను న శా ము చే (1)

కాగితాన్ని మళ్ళీ మడతపెట్టి చేబులోపెట్టు కున్నాడు. "ఇదంతా చాల ఆశ్చర్యకరంగావుంది. అక్షరాలన్నీ యెడంచేత్తో వ్రాసినట్లు స్పష్టం. అందరి ఎడం చేతుల దస్తూరీలు ఒకమాదిరి వుంటాయి. ఏదీ నీ కథ మరొకసారి చెప్పూ, బాబుకూడ వింటాడు." అన్నాడు శ్రీనివాస రావు లక్ష్మణరావుతో.

లక్ష్మణరావు తన కథ పూస గుచ్చినట్లు చెప్పటకు ప్రారంభించాడు.

"మేమంత భాగ్యవంతులం కాకపోయినా పరువు ప్రతిష్ఠలుకలవారం. మాతాతలనాటినుంచి గుంటూరులో కాపురం. క్రిందటి సంవత్సరం రాజమహేంద్రవరం పనిమీద వెళ్ళి మాబంధువు లింట్లో దిగాను. పనిపూర్తికి రెండు మూడు మాసాలు పట్టింది. పక్క యింట్లో సెట్టివారి పిల్లట. పెనిమిటి పోయి యేడాదయిందట. వయస్సు యిరవైకంటె హెచ్చులేదు. ఆమెను చూడటం, నేను మోహించటం, వీరేశలింగం గారి సమక్షాన్ని పెండ్లి చేసుకోవడం, జరిగింది. పరువు ప్రతిష్ఠలు ఆచార సాంప్రదాయాలుగల కుటుంబంలో వాణ్ని నేనీ పెండ్లిచేసికోవడం యేమా అని మీరు ఆశ్చర్య పడుచున్నారు. లెండి! కాని మీ రామెను ఒకసారి చూస్తే

మీ అభిప్రాయాలన్నీ యిట్టే మారిపోతాయి. మా రమణ మొదటనుంచి స్పష్టంగానే చెప్పింది. నేను కోరుకొన్నట్లయితే వివాహం తప్పించుకొనే సావకాశం లేకపోలే. 'నా జీవితంలో కొన్ని అయిష్టములైన సాంగత్యాలున్నాయి. గతమంతా మరచిపోవాలని నా ఉద్దేశం. దాన్ని గురించి యెత్తనైనా యెత్తను. ఎత్తితే నాకు చాల విచారం కలుగుతుంది. కాని యీ విషయం మాత్రం గట్టిగా ప్రమాణము చేసి చెప్పగలను. లజ్జాకరమగు పని లేమీ నేను చేయలేదు. ఇందుకు నా మాటే ప్రమాణం కాని వేరేమీ లేదు. మిమ్మల్ని పెళ్ళి చేసికోవడానికి పూర్వం జరిగిన విషయాన్ని గూర్చి మీరు నన్ను ప్రశ్నించరాదు. అందు కిష్టమైతేనే పెళ్లి చేసికోండి' అంది మా రమణ. మోహం అటువంటిది, మర్నాడే వివాహం అయింది. వివాహం అయి యేడాది ముగిసింది. ఇంతవరకు సుఖంగానే వున్నాము మొన్న జూన్ ఆఖరికి కష్టాలు ప్రారంభమైనాయి. ఒక రోజున మా రమణకి ఉత్తరం వచ్చింది. దానిమీద విశాఖపట్నం ముద్ర వుంది. ఉత్తరం చదువుకుని తెల్లబోయి ఉత్తరం నిప్పులో వేసింది, మా రమణ. ఆసంగతి తరువాత ప్రస్తావించనేలేదు, నా వాగ్దానాన్ని అనుసరించి నేను యెత్తనూలేదు. కాని అప్పటినుంచి యిప్పటివరకు రమణకు నిద్ర లేదు. ఏదో వచ్చి మీద పడనున్నట్లు యెప్పుడు భయపడుతూ ఉంటుంది. సర్వం నామీద వేసింది. నన్నే నమ్ముకుని వుంది. రమణ అబద్ధం చెప్పే మనిషి కాదని నిశ్చయంగా నమ్మండి. దానికు పూర్వ జీవితంలో యేకష్టాలు వచ్చినా, దోషం ఆమెది కాదు. వంశ గౌరవం పాటించే వాణ్నే నేను. ఈసంగతి రమణకి తెలుసు. తెలిసే వివాహమాడింది. వంశగౌరవాని కిపుడే కళంకం లేదని నాకు దృఢవిశ్వాసం. వారం రోజులకిత్రం మా గేటుమీద యీ క్రింది అక్షరాలు కన్పించాయి.

దిసీసింవులకేవచిరా — (2)

ఎవరో సీమసున్నంతో వ్రాశారు. బండి నాడు వ్రాశాడేమో అని గద్దించి ప్రశ్నించాను. నాకు తెలియదు బాబూ అని ప్రమాణం చేశాడు. ఆఅక్షరాల్ని కడిగించి వేశాను. ఎవరో రాత్రిపూట వ్రాసివుంటారు. ఈసంగతి మా రమణకు తరువాత చెప్పాను. ఆమె మరింత భయపడింది. ఇంకెప్పుడైనా అటువంటి అక్షరాలు వ్రాస్తే తనకు చూపెట్టమని అడిగింది. మళ్ళీ వారంవరకు యేమీ జరగలేదు. ఇవ్వాళ ఇది ప్రాప్తించింది. మా రమణకు భయం మరీ హెచ్చిపోయింది. వంట్లో నెత్తురుచుక్క లేదు. బ్రతికేటట్లులేదు" అని లక్ష్మణరావు కన్నీరు కార్చేసరికి బాబు శ్రీనివాసరావుల హృదయాలు బ్రద్దలయ్యేటట్లు కరిగిపోయినాయి. ఎంతడబ్బైనా సరే ఖర్చుపెట్టి రమణ మానం ప్రాణం కాపాడుకోంటానన్నాడు లక్ష్మణరావు ధైర్యము తెచ్చుకొని.

"లక్ష్మణరావూ, మీ రమణనే ప్రశ్నించి రహస్యం తెలుసుకోరాదూ?" అన్నాడు శ్రీనివాసరావు.

"వాగ్దానం వాగ్దానమే, నేనడుగను. అడిగి తెలిసికోనేటట్లయితే గుంటూరునుంచి మీవద్దకు రావడం ఎందుకు?"

"సరే. నాశక్తి అంతా ధారపోసి పనిచేస్తాను. అయితే మీయిరుగు పొరుగువారిలో క్రొత్తవారెవరైనా చేరారేమో తెలుసుకున్నావా?"

"ఎవరు చేర లేదు."

"అది చాల నిశ్శబ్దమైన ప్రదేశమనుకుంటాను. కొత్త వారెవరినయినా యిట్టే కని పెట్టవచ్చునా ?"

"మా యింటి సమీపంలోనా ? ఇట్టే కని పెట్టవచ్చు. మాది అరండల్ పేట. స్టేషను దగ్గర రైలుపేట సత్రంలో చాలమంది దిగుతూ వుంటారు"

"ఈ పిచ్చి అక్షరాల్లో యేదో భావంవుంది భావం లేకపోతే కనిపెట్టడం కష్టం. భావంవుంటే లోతు తెలుసుకోవచ్చు. దీని లోతు తియ్యాలంటే యీ అక్షరాలు చాలవు. నీవు చెప్పిన కథా చాలదు. నీవు గుంటూరుపోయి జాగ్రత్తతో కనిపెట్టు అక్షరాలు కనబడితే బాగా వ్రాసికో. సమీపంలో కొత్త వారెవరయినా చేరారేమో కనిపెట్టు. ఇంకా కొంత తెలుసు కొని మరొకసారి రా. అవసరమైతే యెప్పుడు రమ్మంటే అప్పుడు నేనే గుంటూరు వస్తాను."

సంభాషణ ముగియగానే రాత్రి పన్నెండు గంటల బండిలో లక్ష్మణరావు గుంటూరు చేరు కున్నాడు.

## 2

"బాబూ, గుంటూరు రమ్మని లక్ష్మణ రావు తంతి యిచ్చాడు. రైలుకు అరగంట టైం వుంది. రా పోదాము" అని బాబును వెంటపెట్టుకుని గుంటూరు 11 గంటల బండిలో బయలుదేరాడు లక్ష్మణరావు. గుంటూరు స్టేషనులో మిత్రుని శివపుర్నీ యెదుర్కొని జట్కాబండిమీద స్వ గృహానికి చేర్చాడు. అంతా సావధానంగా కూర్చుని ఆలోచనకు గడంగారు.

"శ్రీనివాసరావూ, యిదిమాప్రాణాలకే తీసుకొస్తోందోయి !"

"అపరిచితులు ఎన్నడు చూడనివారు యీ విధంగా పీడించటం బాగుండలే. అందులో మీ రమణ రోజుకు రోజు క్షీణించిపోవడం మరీ కష్టంగా వుంది. ఇంకా ఆమె యేమయినా చెప్పిందా ?"

"ఏమి చెప్పనేలేదు. అపుడపుడు యేదో చెప్పాలని ప్రారంభించేది. అంతట్లోనే ఆగిపో యేది. నేను కొంత ప్రయత్నించేవాడిని. కాని రమణ మాట తప్పించేది. మాకుటుంబంయొక్క పూర్వపు పేరు ప్రతిష్ఠలన్నీ చెప్పుకొచ్చేది. క్రమంగా అసలు హంశములోకి దిగుతుం దని పించేది. అది మాత్రం యిప్పటివరకు తటపించలేను."

"అయితే నీ వేమయినా స్వయంగా కని పెట్టేవా ?"

"ఓ, చాలా కనిపెట్టాను. మళ్ళీ అనేక పిచ్చి అక్షరాలు నోటుచేసుకున్నాను. యింకా ముఖ్య మైన విషయం ఏమిటంటే యీ సారి మనిషిని కూడా చూచాను"

"ఏమిటీ ! మనిషి కూడా కనిపించాడా?"

"అవును, ఆదుర్మార్గుడా వని చేస్తోంటే చూచాను. అంతా చెప్తాను విను. బెజవాడ నుంచి నేను రాగానే మర్నాడు గేటులోవల యెడమవైపున రాళ్ళమీద సీమసున్నంతో యీ అక్షరాలు వ్రాసివున్నవి.

వి న్న డి స్తా చి చ వుం ని డ తి లే వ ం ను వి—త

---

తరువాత రెండు రోజులకు యీపిచ్చి అక్ష రాలు కనపడ్డాయి."

"ఆ, యిప్పటికి సమాచారమంతా చేరు కుంటోంది. తరువాత ?"

"మూడు రోజులు తరువాత రాళ్ళకింద మరి ఒక చీటీముక్క కనిపించింది. అందులోనా

పైన చెప్పిన పిచ్చిఅక్షరాలే వున్నయి. వీడెవడో కనిపెట్టాలని నిశ్చయం చేసుకున్నాను. ఒక రోజు రాత్రి రివాల్వరు పుచ్చుకుని మాకిటికీ కెదురుగ గదిలో కూర్చున్నాను. కిటికీకెదురు గుండా కాంపౌండులో ఆరాళ్ళు పరచివున్నయి. అక్కడి కెవరన్నా వస్తే నాకు స్పష్టంగా కని పిస్తూనే వుంటుంది. రాత్రి రెండు గంటలైంది. బయట వెన్నెల తప్ప మరేమీలేదు. 'యెందుకు నిద్ర చెడగొట్టుకుంటూ అలా మేలుకుంటారు. వచ్చి నిద్రపొండి' అన్నది మా రమణ. ఈ దుర్మార్గు డెవరో వీడెత్తులేమిటో తెలిసికోక తప్పదు. అని నేను ప్రత్యుత్తర మిచ్చాను. అర్థంలేని పరిహాస పూర్వకంగాచేసే యీపిచ్చి పనులను లక్ష్యంచేయటం యేమిటన్నది. కావలిస్తే కొంతకాలంపాటు యెవ్వూరైనా వెళ్ళి వుందా మన్నది. ఈపిచ్చివాళ్ళకి బెదరి మరో వూరుపోవటం ఏమిటి? ఎవరైనానవ్వరాఅన్నాను నేను. ఇప్పటికైనానిద్రపోవుదురు రేపుచూచుకుందాం అంది రమణ. రమణయొక్క తెల్లనిముఖం మరింత తెల్లపడ్డది. భయపడి పోయిన దానివలె నాభుజాలమీద చేతులు వైచి గట్టిగాపట్టుకుంది. ఆసమయంలో కిటికీలోంచి చూడగా యేదో నల్లటివస్తువు కదుల్తూన్నట్టు కనిపించింది. పిస్తోలు పుచ్చుకు లేవబోయాను. మారమణనన్ను గట్టిగా పట్టుకుని వదలలేదు, తోసివేద్దాం అనుకున్నాను కాని నన్ను మరింత గట్టిగాపట్టుకుంది. ఏలాగైతేనేం విడిపించుకుని తలుపు తెరచి బయట కొచ్చాను. ఏముంది? ఆ నల్లటివస్తువు కాస్తా మాయమై పోయింది. ఆరాళ్ళదగ్గరకు పోయి చూచేసరికి ఒక కాగితం దానిమీద యీపిచ్చి అక్షరాలు వున్నాయి.

ఆదిదాసింవాలరవలో [illegible] లే (4)

"బాగుంది! బాగుంది! తరు[illegible]

"తరువాతేముంది? అం[illegible] అయింది. ఆరాత్రి ఆపిచ్చి గాడిద ప[illegible] బయటకు వసుగెత్తుతూ. కీ [illegible] మా రమణమీద [illegible] వచ్చింది. నాకేదో ఆ[illegible] రమణ భయపడుతోంది వాడికి [illegible] దేమో అని నిజంగా [illegible] తూన్నట్లు నాకు తోచింది. [illegible] డైంది ఆ అక్షరాల [illegible] తెలుసుననుటకు సందేహం [illegible] కంఠం పరికించినా చూపులు [illegible] నిజంగా నాక్షేమంకొరకే యీ[illegible] అనిపించింది. జరిగిందంతా [illegible] చెప్పాను నీసలహాకోసం [illegible] ఒక డజన్ వుంది వప్పు[illegible] వుంచి ఆగాడిదను పట్టుకు[illegible] వదలిపోతుందనుకుంటాను. ఎక్కి[illegible] ఎక్కి వీలు లేకుండావుంది. ఇట్లా [illegible] వదిలిపెట్టడానికి వీల్లేదు అతి[illegible]"

"సరే సంగతులన్నీ [illegible] బెజవాడ వెళ్ళివస్తాను. [illegible] ఆలోచిస్తాను. అంతగా అవసరము [illegible] యిచ్చావలసింది" అని శ్రీని[illegible] బాబు ప్రయాణమయినారు.

గుంటూరు వెళ్ళి వచ్చి పదిహేను రోజులయింది. శ్రీనివాసరావు ఆ కాగితం ముక్కల మీద అక్షరాలన్నీ వేరే ఒకచోట వ్రాసి క్రోడీకరించటం ప్రారంభించాడు. బాబు చప్పుడు లేకుండా వచ్చి వెనుకనే నిలబడి తమాషా

చూస్తున్నాడు. శ్రీనివాసరావుయొక్క ఆలోచనా ధోరణిని గనిపెట్టి బాబు ఆశ్చర్యపడ్డాడు. శ్రీనివాసరావు టెలిగ్రాం ఫారం తీసుకొని టెలిగ్రాం పూర్తిగాచేసి దీనికిజవాబు వస్తే సంగతంతా తేలిపోతుంది. అది యీటెలిగ్రాం యెవరు తీసుకువెళ్ళి యిస్తారు అని బిగ్గరగా అన్నాడు. నేను తీసుకవెళ్ళి యిస్తాను యిట్యావోయి అన్నాడు బాబు.

"నీవిక్కడే వున్నావా. నేను చూడనేలేద" న్నాడు శ్రీనివాసరావు ఆశ్చర్యంగా. గుంటూరుకు తంతి వెళ్ళిపోయింది. ఇదంతా అగమ్యగోచరంగా వున్నందున బాబుకు కలిగిన ఆశ్చర్యానికి మేరలేకుండా వుంది. ఎప్పుడుపడితే అప్పుడు రహస్యాలను బయటపెట్టే ఆచారం శ్రీనివాసరావుకు లేదు. అతనికి యుక్తమని తోచినప్పుడే తనంతట తాను రహస్యం బయట పెట్టేస్తాడు. కనుక అడిగి ప్రయోజనం లేదనుకున్నాడు బాబు

తంతికి జవాబు యింకారాలేదు. రెండు రోజులుకూడా గడిచిపోయినవి. జవాబుకొరకు శ్రీనివాసరావు ప్రతిక్షణం యెదురుచూస్తూనే వున్నాడు. మూడవరోజు సోమవారం వచ్చింది. ఆవుత్తరంలో క్రొత్తగా బయల్పడిన యీ క్రింది పిచ్చి అక్షరాలు లక్ష్మణరావు పంపాడు.

రాత్యకవా పోకు తేగు రాలు తిరినా (౨)

ఆశ్చర్యం విచారం పొందాడు. ఆతురత హెచ్చింది. "సర్వం మించిపోయింది. ఇపుడే రైలులో గుంటూరు పోవాలి" అనుకొంటూ, బాబుతో బయలుదేరి వెళ్ళబోవుచుండగా "అయ్యా, మీరుపరిశోధకులా ? ఇక్కడ నేటి తెల్లవారు ఝామున జరిగిన ఘోరవృత్తాంతం సందర్భంలో వచ్చారా ?" అని స్టేషను మాస్టరుప్రశ్నించాడు.

"మేము పరిశోధకు లనుకోవటానికి మీ కాధారం యేమిటి ?"

"సర్కిల్ ఇనస్పెక్టరు డాక్టరు యిరువురు పరిశోధకులు వస్తారు వారిని కనుక్కొని వెంటనే యింటికి వచ్చేటట్లు చేయవలసిందని చెప్పారు."

"మేము లక్ష్మణరావు యింటికి వెళ్ళుచున్నాము. అక్కడేంజరిగిందీ మాకు తెలియదు."

"చాల ఘోరం జరిగింది లక్ష్మణరావుగారిని వారి భార్యను ఎవరో దుర్మార్గులు తుపాకీతో కాల్చారు. భర్తనుచంపి తనను చంపుకొందని నవుకర్లు చెప్పుచున్నారు. లక్ష్మణరావుగారు మరణించారు. ఆయన భార్య మరణించ టానికి సిద్ధంగావుంది. ఎటువంటి గౌరవంగల కుటుంబానికి యెంతప్రాప్తించింది!" అన్నాడు స్టేషను మాస్టరు ముక్కుమీద వేలు వేసుకొని.

బాబు శ్రీనివాసరావు ఆగకుండా సరాసరి లక్ష్మణరావు యింటికి వెళ్లారు. బాబు అంత నిరాశా సూచకమగువదనం యెన్నడు చూడనే లేదు ఉత్తరంరాగానే భయంకలిగింది. స్టేషనులో కథవినగానే మరింతకలవరం కలిగింది. విచారసాగరంలో మునిగిపోయాడు. బాబు శ్రీనివాసరావుగారు ప్రవేశించేసరికి నల్లటి దృఢకాయుడు పోలీసు దుస్తులలో కన్పించినాడు. సర్కిల్ ఇనస్పెక్టరు కోటయ్యనాయుడని తెలిసికొన్నారు. కోటయ్యనాయుడును బాబు శ్రీనివాసరావుల తెలిసికొని సాదరముగ సంభాషించడం ప్రారంభించాడు.

నో:- ఈఘోరం నేటి తెల్లవారుఝామున నాల్గు గంటలకు జరిగింది. మీకప్పుడే యెట్లు తెలిసింది.

కిటికి చాల కొద్దిసేపు మాత్రమే తెరువబడివుంటవి." అన్నాడు శ్రీనివాసరావు.

"అదెట్లా ఋజువు చేస్తారు?" అన్నాడు కోటయ్యనాయుడు.

"అక్కడ దీపం ఆరిపోలేదు."

"అద్భుతం! ఆశ్చర్యం!! అత్యద్భుతం!!!"

"ఈ దురంతం జరిగినపుడు కిటికీ తెరవబడివుంటుందని నమ్మి, యీహత్యలో మానవమనిషికి సంబంధం వుంటుందనీ, ఆమనిషి కిటికీకి వెలుపలనువుండి కిటికీగుండా కాల్చివుంటాడనీ ఊహించాను. లక్ష్మణరావుకు తగిలిన గుండు కిటికీకి రాచుకొనిపోవాలి. పరీక్షించగా కిటికీకి తొర్ర కనపించింది."

"అయితే కిటికీ వేసివుండటం యెలా పొసగుతుంది" అన్నాడు కోటయ్యనాయుడు.

"కిటికీ మూసి బిగించాలని రమణి వుద్దేశ్యం అయి వుంటుంది. అయితే యిదేమిటి!—" అని బల్లమీదవున్న క్రోషేట్ దారముతో అల్లబడిన సంచినితీసి శ్రీనివాసరావు లోపలి వస్తువులను బయట పడవేసినాడు. అందులో మూడు వేల రూపాయల కిమ్మతుగల నగలున్నాయి. "ఇవన్ని మన పరిశోధనకు పనికివస్తాయి. వీనిని జాగ్రత్తగా నుంచుడు" అని శ్రీనివాసరావు సంచిని కోటయ్యనాయుడి కందిచ్చాడు. బుచ్చమ్మతో తిరిగి మాట్లాడవలసి వస్తుందని పిలిపించి శ్రీనివాసరావు ప్రశ్నించాడు.

"పెద్ద చప్పుడు విని లేచానన్నావు మొదటి చప్పుడుకంటె రెండవది హెచ్చుగా వినిపించిందా?"

"నిద్రలోనుంచి ఆచప్పుడే నన్ను లేపివుండటంచేత నిర్ధారణ చేసి చెప్పటం కష్టం. కాని పెద్దదిగానే వుంది మోత"

"రెండు ధ్వనులు ఒకదాని వెంటనే ఒకటి వచ్చినట్లు పొడగట్టిందా?"

"నిశ్చయంగా చెప్పలేను."

"అవును పాపం నీవెట్లా చెప్పగలవు? కోటయ్యనాయుడుగారూ, యీగదిలో దొరకగల సమాచారం అంతా సేకరించాం. నీవు నాతో వస్తే తోటంతా కలియదిరిగి యింకా యేమైనా దొరుకుతుందేమో చూద్దాము"

అంతా బయలుదేరారు. తాంపోడు గేటువద్దనుంచి కిటికీవరకు పూలమొక్కలు దట్టంగా అల్లుకొన్నాయి. ఆమొక్కలన్నీ తొక్కివేసినట్లు నలిగివున్నాయి. నేలమీద పెద్దపెద్ద అడుగులు కన్పించినాయి. అడుగులు పురుషునివై వుండక తప్పవు. శ్రీనివాసరావింకా కలియ వెతికాడు. నేలమీద నొకచోట కిటికీ కెదురుగా గుండు కనిపించింది. ఇది మూడవ సెనక తప్పదు. మహాసంతృప్తితో శ్రీనివాసరావు దానిని పుచ్చుకొని "ఇప్పటికి మనకేసు పూర్తిఅయి వుంటుందను కుంటాను" అన్నాడు. శ్రీనివాసరావు చాకచక్యం చూచి కోటయ్యనాయుడాశ్చర్య పడుచున్నాడు. మొదటలో తనకంటె శ్రీనివాసరావు హెచ్చు తెలివిగలవాడా అని బింకపోయినాడు కాని కోటయ్య నాయుడు శ్రీనివాసరావు మేధాశక్తికి దోసిలొగ్గి అడుగులలో అడుగులు వేసుకొనుచు నడచుచున్నాడు. తన ఆతురత నాపుకొనలేక "ఎవరి సను మానపడుతున్నారు" అన్నారు.

"ఆసంగతి తరువాత నిశదపరుస్తాను. ఈసమస్యలో నీకు తెల్పియుండని విషయాలు చాలా వున్నాయి. ఇంతవరకు తెలిసింది కనుక నేను యేర్పరచుకున్న పంథా తొక్కిచూచి అంతా ఒక్కసారి వెల్లడిచేస్తాను.

"సరే. విచిత్రం."

"విచిత్రాలు ప్రదర్శించాలని అభిలాష నాకే మాత్రం లేదు. పెద్దపెద్ద వ్యాఖ్యానాలు చేయటానికి సమయం యింకా రాలేదు. సూత్రాలన్నీ చిక్కాయి. రమణ బ్రతకక పోయినప్పటికీ వేసుకున్న ప్లాను సాంతంగా కొనసాగించగలను. అయితే రైలుపేటలో "ఆనందనికేతనం" అను హోటలుందేమో మీకు తెలుసునా?"

"ఉందేమో నాకు తెలియదు. అయినా విచారిద్దాము"

"అవునండి, రెండునెలలక్రితమే దక్షిణాదాయన ఒకడు హోటలు ఆపేరుతో పెట్టాడు. స్టేషను నుంచి బజారుకు వెళ్ళే రోడ్డు మీద ఫర్లాంగు దూరంలో వుంది" అన్నాడు. అంతవరకు నోట్లో బెల్లంకొట్టిన మనిషిలాగ నిలబడిన కాంస్టబుల్.

"వెంటనే మనమిప్పు డక్కడకు పోదాము." అని సర్కిల్ యినస్పెక్టరును వెంటపెట్టుకుని శ్రీనివాసరావు బయలుదేరాడు. బాబున్ను కాంస్టబులన్ను లక్ష్మణరావింటికి కావలా కాస్తున్నారు. సంగతి తేలినతర్వాత తనకు తెలుపవలసిందని కోరి డాక్టరు చంద్రశేఖరం శెలవు పుచ్చుకున్నాడు. శ్రీనివాసరావు పిచ్చిఅక్షరాలున్న ముక్కలన్నీ పుచ్చుకొని బయలుదేరాడు. వెళ్ళేటప్పుడు ఒక్క చీటివ్రాసి పదేళ్ల కుర్రవాడినిపిలిచి వివరాలు చెప్పి చిరునామాదారునికి యిమ్మని, బాబును కాంస్టబులును లోపలగా బయటవారికి కనపడకుండా ఉండమన్నాడు. అనతికాలంలో శ్రీనివాసరావు జయలక్ష్మి తన్ను వరిస్తుందనే విశ్వాసంతో కార్యమగ్నుడైనాడు. చీటిమీద చిరునామా దస్తూరిమాత్రం శ్రీనివాసరావు దస్తూరివలె కన్పించదు. వణుకుడు చేతితో వ్రాసినట్లుగ కన్పించింది.

"ఇనస్పెక్టరూ, యిరవైమంది పోలీసువారిని వెంటనే పిలిపించి లక్ష్మణరావు యింటివద్ద యెవరికి కనపడకుండావుంచు నేను వేసుకున్న లెక్కలు సరిఅయితే చిక్కబోయే వ్యక్తి చాలా అపాయకరమైనవాడు సుమా! రాత్రి రైలులోనే బెజవాడ వెళ్ళిపోవాలి. యిక్కడ పని పూర్తిచేసుకుని అర్జంటుపనివుంది" అని శ్రీనివాసరావు కోటయ్యనాయుడిని పంపించివేశాడు. వచ్చేటప్పుడు మాత్రం దాసి లక్ష్మిని పిలిచి యెవరైనా వచ్చి అడిగితే రమణసంగతి యేమీ చెప్పకుండ వెంటనే లోపలసావిడిలోనికి తీసికొని వెళ్ళవలసిందని ఆజ్ఞాపించాడు. ఒంటరిగా ఆనందనికేతనం వైపుకు పోయి అచటయేమో పరీక్షించి బజారుకు చేరుకుని గంటసేపు కాలం గడిపివేశాడు వెంటనే శ్రీనివాసరావు లక్ష్మణరావు యింటికిచేరి అందరు నియమిత స్థానాల్లో జాగరూకులుగ నున్నట్లు కనిపెట్టి కోటయ్యనాయుడు బాబును వెంటపెట్టుకొని సావిడికి వెనకవైపు పదిగజాలు దూరంలో వున్న గదిలో కూర్చుని పిచ్చిఅక్షరాలని గురించి ఉపన్యాసం ప్రారంభించాడు.

"బాబూ, నీకింతవరకు తెలుపనందుకు క్షమించాలి. నాయుడూ, యీకథ అంతా పరిశోధనా చాకచక్యం తెలియచేస్తుందని నీవు అనవచ్చు. లక్ష్మణరావు పూర్వంనాకు చెప్పిన విషయాలు చెప్తాను" అని పూసగుచ్చినట్లు వివరించి "ఈపిచ్చి అక్షరాలకే అంతరార్థం లేకపోతే న్యాయమచూచి అంతా యీపాటికి నవ్వేవారే. ఇటువంటి పిచ్చి అక్షరాలను గురించి అపుడపుడు అనుభవం సంపాదించాను

కాని యీవిషయంలోమాత్రం నా కంతా కొత్తగా వున్నాయి. ఆలోచించి ఆలోచించి నాబుర్ర పాడై పోయింది. అయిదుసార్లు వచ్చిన పిచ్చి అక్షరాలికి యీ క్రింద అంతరార్థాలు తీశాను.

ఆనందనికేతనము చేరాను శేషగిరిరావు (1)
నీవులేచి రావలసింది (2)
విడిచివుండలేను విషంతిని చస్తాను (3)
ఆదివారంలోపల లేచిరావలసింది (4)
రాకపోతే రాత్రి నాలుగుకు హత్య (5)

ఇపుడు యోచిస్తే యెంతో సులభంగా కనిపిస్తుందికదూ బాబూ!" అన్నాడు శ్రీనివాసరావు.

"ఆనందనికేతనంలో శేషగిరిరావనే వ్యక్తి వున్నాడనీ అతడే హంతకుడనీ మీఅభిప్రాయం అన్నమాట. ఎంత తేలికగా సాధించారండీ. ఇపు డాహంతకుడు పారిపోతాడేమో!' అన్నాడు సర్కిల్ యిన్స్పెక్టరు నాయుడు

"మరేమీభయంలేదు ఎక్కడికిపారిపోడు"

"ఆసంగతి మీ రెట్లా చెప్పగలరు?"

"పారిపోవడం అంటే నేరం ఒప్పుకున్నట్లే!"

"అయితే మనము పోయి అరెస్టుచేద్దాము రండి"

"అరెస్టు చేయటానికి మన మెక్కడికీ పోనక్కరలేదు. అతనే యిక్కడికి వస్తాడు"

"ఇక్కడికి రావడానికి పిచ్చివాడా యేమిటి?"

"పిచ్చివాడో గిచ్చివాడో యిక్కడికి వస్తాడు. అతనిరాకకే ప్రతీక్షణం చూస్తున్నాను. అతనిని రమ్మని నేను వ్రాశాను."

"ఏమో నేను నమ్మను మీరడిగితే రావాలని శాస్త్రమా! అవిధంగా అడిగినపుడు అనుమానం కట్టదా?"

"ఉత్తరం వ్రాసేవిధం నాకు తెలుసుననుకుంటాను. అదిగో జట్కాబండి ఆగింది. బహుశా దిగుతోవుంటాడు. ఈ తలుపుదగ్గర నిలచివుంటే బాగా కనిపిస్తుంది."

అందరు నిశ్శబ్దంగా వున్నారు. పొట్టి ఎర్రటి క్రాపింగ్ మనిషి బండిదిగి గబగబా లోపలికి వస్తున్నాడు. అంతగా వయస్సు వున్నట్లు కన్పించదు. నూనూగు మీసాలనుబట్టి పాతికేండ్లకంటె హెచ్చుండదని తోస్తుంది. ఇల్లుతో యిదివరకే పరిచయమున్నవానివలె లోపలికి ప్రవేశించాడు. "ఇటువంటి మనిషి విషయంలో జాగ్రత్తగా ప్రవర్తించాలి. ఈతలుపుచాటునే వుంటే మనము కనిపెట్టుచువుండవచ్చు. నాయుడూ, నేను వేలుచూపగానే మనము కూర్చున్న గదిలోనికి పోయి కిటికీలోనుంచి పోలీసువాళ్లకి గుర్తుచూపించి వీధిద్వారాన్ని వచ్చి హంతకుడిని బంధించేటట్లు చెయ్యి." అన్నాడు శ్రీనివాసరావు.

అంతా నిశ్శబ్దంగా గోడచాటున నిలచి చూస్తున్నారు. ముందరిద్వారం తెరచుకొని నూతనవ్యక్తి లోపలికి ప్రవేశించి రమణ శవం వద్ద కుర్చీమీద కూర్చున్నాడు. కుర్చీకి వెనుకభాగాన్ని శ్రీనివాసరావు అతని అనుచరులు ఆడకంచేత, రమణనే తదేకధ్యానంతో చూస్తున్న మన వ్యక్తి వీరిని కనిపెట్టలేకపోయాడు. వెనుకనుంచి శ్రీనివాసరావు నాయుడు బాబుయున్ను ముందునుంచి పోలీసువారును వచ్చి నూతనవ్యక్తిని బంధించివేశారు. ఆవ్యక్తి ఒక్కసారి వణ్కాడు. ఆవణ్కులో విషమున్నది. ఇంతలోనే రమణశవాన్నిచూచి బావురుమని యేడ్చాడు "రమణ నన్ను వట్టియిర్యాటానికి యీపన్నాగం పన్నిందనుకోను. అయ్యో—

అంటిపెట్టుకుని వుంటే నాకోర్కె సఫలమై పోయేది. ఇదంతా అసహ్యంగాతోచి రమణ గుంటూరులో లక్ష్మణరావును వివాహం చేసుకుంది. గుంటూరుకు ఆమెపేర అనేక వుత్తరాలు వ్రాశాను కాని జవాబు లేక పోయింది. అంతట నేనేబయలుదేరి గుంటూరులో ఆనందనికేతనంచేరాను. ఇప్పటికి నెల్లాళ్లయింది. రోజు రాత్రిపూట యీపిచ్చి గుర్తుల మూలంగా నా అభిప్రాయాలు తెలియపరిచాను. ఒకసారామె జవాబు కూడ యిచ్చింది. నన్ను గుంటూరునుంచి వెళ్ళిపొమ్మని, తన భర్తమీద అపనింద వస్తే సహించలేనని, తాను లేచిరాజాలనని, భర్త నిద్రపోయిన తరువాత రాత్రి మూడు గంటల వేళ కిటికీవద్దకు వస్తే మాట్లాడుతానని, తరువాత గుంటూరు వదిలేసి తనకుశాశ్వతంగా మనశ్శాంతి చిక్కనిస్తేనే మాట్లాడుతానని వ్రాసింది. ఆప్రకారంగానే కిటికీవద్దకు వెళ్ళాను ఆమెవచ్చి మాట్లాడింది. రమ్మని అడిగాను, బ్రతిమాలాను, ప్రార్థించానురానంది. అంతట బెదరించాను. మూడువేల రూపాయిల ఖరీదుగల నగలు సంచిలోకట్టి యిచ్చి నన్ను వెళ్ళిపొమ్మని అనేక విధాల వేడుకుంది. నాకక్కర లేదన్నాను. నాకు పిచ్చెత్తినట్లై పోయింది. కిటికీలోనుంచి ఆమె చెయ్యి పట్టుకుని లాగబోయినాను. చువ్వలున్నకిటికీ కాదులెండి! ఆ కారణంచేత ఆమె నెట్టుకు పారిపోవచ్చు ననుకొన్నాను. ఇంతట్లో వెనుకనుంచి రమణ భర్త చేతిలో రివాల్వరు పట్టుకొని రమణ వెనుకకు వచ్చాడు. రమణ చూచి పడిపోయి మూర్ఛ పడినట్లయింది. లక్ష్మణరావు నేను ఒకరికొకరు యెదురుగా వున్నాము. అతను తుపాకి యెత్తాడు పేల్చాలని. నేను నాతుపాకి సిద్ధంచేశాను. పేల్చాడు కాని గురి తప్పిపోయింది. నేను వెంటనే కాల్చివేశాను. అతను క్రింద పడిపోయినాడు. మతిలేక నేను పరుగెత్తుకొని పోయాను. పోవుచుండగా కిటికీ మూసిన చప్పుడు వినపడ్డది. మహాశయులారా, నిజంగా జరిగిందంతా చెప్పాను. ఆపిల్లవాడు వచ్చి చీటి యిచ్చేవరకు తక్కినసంగతి నాకు తెలియదు. చీటిప్రకారం వచ్చి నన్ను మీకు స్వాధీనం చేసుకున్నాను."

దోషికి మరణ శిక్ష విధించారు.

ఖైదీని తీసుకు వెళ్ళటానికి టైం అయింది అన్నాడు సర్కిల్ ఇనస్పెక్టరు "వెళ్ళేలోపల రమణని చూడనియ్యండి" అని శ్రీనివాసరావును ప్రార్థించాడు. ప్రార్థనలన్నీ వ్యర్థం అయి పోయినాయి ... ... ... జగత్తంతా మహా ప్రళయానికి ముందుండే శాంతం పొందింది. నిశ్శబ్దంతో కూడిన ఆ శూన్య ప్రపంచంలో శేషగిరిరావు ఆత్మ రమణ కోసం వెతుకుచూ తుమ్మెద ఝుంకారం వలె శబ్దం కావించుచున్నట్లు గోచరిస్తూ వుంటుంది.

# సౌందర్యలహరి.

పోమంచి వాసుదేవరావుగారు.

మ॥ జననీ! తావక సత్కృపాకలిత వీక్షాపాత్రుఁడై యెవ్వఁ డా
జనుఁ డూహింప జరావికారుఁ డయినన్ సౌందర్యహీనాత్ముఁడై,
నను సర్మక్రీడలన్ జడుండయినఁ గాంతల్ గొప్పులున్ వీడఁగా
స్తనయుగ్మంబులఁ బయ్యెదల్ వడలఁ జంచన్నీవులున్ జాఱఁగా
మనసారంగఁ గవుంగలింపఁ గమకింపన్ జూతు రమ్మానవున్॥ 1.

ఉ॥ హైమవతీ! కవీశ హృదయాంబురుహోత్సవమైన యుక్తి ని
న్నే మహనీయులున్ గని భజింతురొ వారు సరస్వతీసతీ
భామరసప్రవాహచయ పూరితవాక్తతి చేత సజ్జన
స్తోమము మోదవారినిధిఁ ద్రోయుదురో శశిసూర్యలోచనా!॥ 2.

ఉ॥ బాలహరిప్రభానిభ భవత్తనుకాంతులచే దివిన్ భువిన్
శ్రీలను ముంచె దంచెవఁడు చిత్తమునందుఁ దలంచువానికిన్
లోల విశాల నేత్రముల లోలతఁ గొల్చెడు నూర్వశీముఖో
ద్వేల సురాంగనాజనము వేగములోఁ బడదే మహేశ్వరీ!॥ 3.

శా॥ దేవీ! చంద్రశిలామణీ రుచిసుధార్ద్రప్రభూతసర్వాంగ క
శ్రీవిభ్రాజితఁ గాఁగ నిన్నవఁ దెదన్ జింతించు నవ్వాఁడు స
ర్వావళ్యుద్ధుర దర్పభిత్తగు విహంగాధీశురీతిన్ సుధా
భావాలోకనమాత్ర రోగుల సుఖింపన్ జేయు సద్యుఁడగున్॥ 4.

మ॥ వనజాతోద్భవ వంశజాత సుమునిన్ పాలోగ్రకీనాశ నా
శనమున్ గల్గుచు నున్నదో జనని! యీసంసార పాథోధి సం
జనితోదగ్ర తరంగ సంఘముల హంసంబట్లు తానీదుచుం
డును నిత్యంబు సదాశివాఖ్యఁ దోఁకఁ బాటోపంబునన్ శాంకరీ!॥ 5.

ఉ॥ ఏశివ పార్వతీస్ఫురదహీన సుధాంశు మయూఖసంతతిన్
జేసి చకోరముల్ బలె వసించు జగంబు తమోవిహీనమై
యా శివ దివ్యతత్త్వమును నాగగనోద్భవ హేతుభూతమున్
భాసుర మానసాబ్జమున భక్తి భజింతు విశుద్ధ సంస్థమున్॥ 6.

గ్రక్కుతూ చూస్తున్నారు? భయానక రుద్రమూర్తులవలె త్రినేత్రం తెరచి విషజ్వాలల విసరుతున్నారు. అహో! కుబుసమును వీడిన కోడెత్రాచువలె, నిద్రా మాంద్యమును వీడి గుహనుండి బయల్వెడలు మృగరాజువలె— యేమిటా బుస్సలు, యేమిటా ఘీంకృతులు, యేమిటి, చెప్పండి, యెందుకీజ్వాలలు. ఈ జ్వాలలనడుమ యెట్లా జీవనం. యెట్లా నిలవడం, యెట్లా. మీ కోపాగ్ని యెంత దండీ. సహస్రభానుబింబ తీక్ష్ణముతోడ మమ్ములను దహిస్తోందండీ. మేము నిలుచున్న స్థలంగూడా ఆహుతి అయిపోతోంది. మేము అల్పులము. అనాథలము. ఆవిర్భవించినది గాలికి. పెరిగినది గాలికి. జీవించినది గాలికి. అంత మెండుచు నున్నది యిట్లు. ఏమండి జ్వాలలు చెలరేగుతున్నాయి, అగ్నిదేవుడు శతసహస్ర జిహ్వాగ్రాలతో మీది కెగయుచున్నాడు. మంటలు ఆవరిస్తున్నాయి. యేమండీ! యీఘోరము— దయలేదా? దాక్షిణ్యములేదా కరుణలేదా? కటాక్షములేదా? మీహృదయాలు పాషాణకృతమా? పోనీండి, లేకపోతే పోనీండి? మీ రక్తనాళాలలో విశ్వ మానవ సహోదరత్వము ప్రవహింపక పోవుచున్నట్లయితే పోనిండు...... పోతున్నాం... సంతసించండి. మీరు చేసినపనికి మీరే ఆనందించండి. ఫలం మీరే అనుభవించండి... పోతున్నాం. తిరిగి యెన్నడో, యెక్కడో?

## చిత్తవృత్తి.

నరసింహదాసు, రామగోపాలరావుగార్లు.

ఒకమారు దివ్యపు టూహోపగా జల
పూరముల్ తెగి స్వర్గములను ముంచు

ఒకమారు నీచపు టూహాప్రవాహమ్ము
కౌటిల్యమునకు మార్గముల నేర్పు

కడుమంచి మంచు మీగడ నుండి విడదీయ
రాకుండు నమృతంపు రసముగోరు

జలగర్భమున డాగి చెలరేగు నగ్ని హిమా
తురిని బిగ్గ కౌగలింపను దలంచు

కొండలోపల యిమిడి దిక్కుల మనోజ్ఞ
సరళకాంతుల చిలుకు పచ్చల విధాన!
దేవకావ్యముగూడ కృత్రిమపుప్రకృతి
యందు నూహింపరాని ఐక్యమున నుండు
సాధుభావననుండి అసాధువధము
లను నగాధమ్ములందు బొర్లగిలబడును
ఆకసము మ్రోయ నెగయు మహాబ్ధివీచి
వెనుకపాటున తాకు కెరటపు లోంగు ॥

## వ్యాసమహర్షి (గత సంచిక తరువాయి)

వి. ఎస్. శర్మగారు బి. ఎ., బి. టి.,

కాల మొకరీతిగా నుండునా? క్రీ. పూ. 9564 సం॥ర ప్రాంతమున మరల భయంకర మగు జల ప్రళయము సంభవించెను. పోసిడోనీసు మొదలగు ద్వీపములన్నియు జలమయ మయ్యెను. జలప్రదేశము లనేకములలో భూమి బయలుపడెను. ప్రళయము ఆర్యనాగరికతను సయితము చవి చూచినది. ఆసియా మధ్య ప్రాంతమునందలి భూగోళ పరిస్థితు లన్నిటిని చిందరవందరచేసి పారవైచెను. దీనితో మన జాతి నగరరాజము లన్నిటిని తననోట గరచుకొన్నది. అనేకవేల సంవత్సరములనుండి నిర్మించుచు వచ్చిన ఆర్య నాగరికతను ఒక్కనాటితో నామావశిష్టము చేసివైచినది. ఈ విప్లవమే లేకపోయినయెడల ఆ మందిరరాజములు చిరంజీవులై సర్వ కాలములలో తేజో విరాజమానములై వర్ధిల్లుచుండెడివే! గోబీసముద్రము నేడు ఎడారిప్రదేశమైపోయినది. ఆర్య నాగరికతా లక్షణములను సూచించు మహా నగర రాజము లన్నియు నేడు నేలగూలి యున్నవి. నేటికిని యీ మహా నగరరాజములను గూర్చి ఆప్రాంతపు జనాంగము కథలను చెప్పుకొనుచున్నారు, భూతముల కామెడారి నేడు నివాసమైయున్నది. నేటికిని ఎడారి మధ్యభాగములలో అద్భుతదృశ్యములను గాంచుచు, ఆశ్చర్యమగ్ను లగుచుందురని తెలియుచున్నది. ప్రాచీనవస్తు శాస్త్రజ్ఞులు నేడు అచ్చట చేయవలసినపని మెంతయుగలదు. ఆప్రదేశములను చక్కగా పరిశోధించిన ప్రాచీనార్య సభ్యతను సూచించు ప్రాచీనవస్తురాజము లెన్నిటినో కనుగొనవచ్చును. ఈ విషయమున పరిశోధకులు పరిశోధనల నప్పుడే ప్రారంభించి యుండుట శుభసూచకము. ఆప్రాంత శిథిల ప్రదేశముల నెన్నిటినో అమెరికను పురాతన వస్తు శాస్త్రజ్ఞులు త్రవ్వి అద్భుతవస్తువుల నెన్నిటినో దీయుచు తమ పరిశోధనలను ప్రకటించుచున్నారు. పని పూర్తియగుటకు యెన్నియో శతాబ్దములు పట్టగలదని తలంచుచున్నారు. మనము కాకపోయినను మనభావిసంతతివారయినను పరిశోధనల ఫలితములను దెలిసికొని కృతార్థులు కాగలరు

### ప్రాచీనార్య సభ్యత.

క్రీ. పూ. 45,000 సం॥ లలో లోక శిరోభూషణమై వర్ధిల్లుచుండెను. ఆర్యజాతి జగద్విదితమగు సామ్రాజ్యమును మధ్యాశియాప్రాంతమున నిర్మించి కీర్తిగాంచుచుండెను. అంతటితో నూరకొనలేదు. తన బిడ్డల ప్రపంచమునందలి పలుప్రాంతములకు బంపుచు, నూతనజాతులను నిర్మించి ఆర్య నాగరికత చిరస్థాయిగ వర్ధిల్లుటకు పునాదులను వైచుచుండెను. ఈ మహాకార్య నిర్వహణమున మన చక్రవర్తియగు వైవస్వత మను ప్రభువులవారి నాయకత్వమున ఆర్యజనాంగము, భారతదేశము, అరేబియా, పారశీకము, కెల్టు, ట్యూటను ప్రాంతములకు వెడలి, అచ్చట నూతన నాగరికతను నిర్మించి, ఆప్రాంతీయుల నందరిని కృతార్థులుగ జేసిరి. ఆర్యనాగరికత జన్మస్థానమున చేయవలసిన పని పూర్తియైనది. పతాకమును దించవలసిన కాల మాసన్నమైనది. కాలదేవతలు ముందంజవేసి, తమ కార్యమును నెరవేర్చుకొని వెడలిపోయిరి.

మక సుతులే యగుదురు గద;
యకటా కలహంబు నొంద ♦ నగునే మీకుఁ ‖ 8

సీ॥ నన్నుఁ బెంచినయట్టి ♦ నా తల్లి మాటలు
మించిన వేడ్కఁ బ ♦ లించినాను;
నాముద్దు చెల్లెండ్రి ♦ నవ్యమృదూక్తులు
కొంచెమో గొప్పొ ♦ గ్రహించినాను;
నా నెచ్చెలుల క్రొత్త ♦ నాణ్యమౌ యుక్తుల
నెంచి కీర్తించి పో ♦ షించినాను;
నా పూర్వ వాక్యముల్ ♦ మాపక బుద్ధి సా
రించి నియమమున నం ♦ ధించినాను;
తే॥ వినుఁడు మునుపటికంటెను ♦ వేయి విధుల
స్థిరతనుం బొంది మీచేతఁ ♦ జిక్కినాను
వాడుకోఁజేతగాక మీ ♦ వాదములకుఁ
దారికొనుచు నుంటిరే వెఱ్ఱి ♦ తనయులార! 9

సీ॥ భారతమ్ముఁ జెంకి ♦ పాటయు స్వర్ణమౌ
జీరమ్ములగు నాకు ♦ నోరి కుళ్ళు;
భాగవతము గంగి ♦ పాటయునుం గూడ
కంకణమ్ము లటంచు ♦ గనుము వత్స;
రామాయణమును నా ♦ రాయణ పాటయుఁ
గంఠాభరణములు ♦ గాని తనయ;
పద్మ పురాణ మ ♦ ష్పన్నపాటయును గ
ర్ణావతంసమ్ములు ♦ గా! కుమార:
తే॥ మృదుమధురకల్పములనెల్ల ♦ వెదకికొనుచు
నదనుగల యర్థమెల్ల నం ♦ దొదవు పాటులఁ
గూర్చవలెఁ గర్ణముల కింపు ♦ గొలుపు పాటులు
భావమైదైన నదియె కా ♦ వచ్చునోయి ‖ 10

సీ॥ తల గొట్టుకొనిన న ♦ ర్థము కాని పదములు
పనికి రావనుచు ♦ బలికినాఁడు;
ఒక కోటిమీఁదఁ బో ♦ నొల్లని వ్యాకర
ణమ్ముల నవల బోఁ ♦ జిమ్మినాఁడు;
ఆనాఁటి వ్యవహార ♦ మనుసరించియె భార
తమ్ము పుట్టెనటంచు ♦ తలచినాఁడు;

లక్ష్యశోధము లేక ♦ లక్షణంబును నప్ప
కవి చెప్పెనని చాటఁ ♦ గలిగినాఁడు;

తే॥ తగిన కవుల ప్రయోగముల్ ♦ దరిచి తీసి
మీకుఁ జూపించినాఁడు వి ♦ వేకులగుట
కట్టి గురుసముఁడగు నాడు ♦ పట్టిఁ దిట్టి
వృద్ధి నొందెదొ యయ్యయో ♦ వెఱ్ఱితనయ ॥ 11

తే॥ సకల ఖండాంతరముల శా ♦ స్త్రజ్ఞులందుఁ
బ్రముఖులగువారి మతముల ♦ రామమూర్తి
తెలిపె; నది దోషమంటివా ♦ తెలిసె నీదు
తెలివిదేటలు నీపట్టు ♦ దలయుఁ బుత్రి! 12

తే॥ కాలము నెఱింగి దేశముఁ ♦ గాంచి ప్రభువు
నరసి కవనంబు మారుట ♦ యాదినుండి
వచ్చెనను వాని నీ యిచ్చ ♦ వచ్చినట్లు
లాడదొరకొంటి విదియేమి ♦ యాగడంబు! ॥ 13

క॥ ననుఁగాను కృతక భారతి
నని నాలఁదు లంజె యనుచు ♦ నందువుఁ గినియన్
జనునే? యాతని హృదయము
గనుగొన లేవేమి చెప్పఁ ♦ గలను కుమారా! ॥ 14

ఉ॥ ఆదిని గల్గు గ్రంథముల ♦ యందలి చక్కని మాట లెన్నియో
కాదని వీడి వింత కృత ♦ కంబులఁ గైతలఁ గొంది సమ్మగా
వాదము సేసి భావము వి ♦ పద్దశఁ గూర్చిరటంచు బల్కినన్
గాదన నీవశంబె; విధి ♦ గా విధియైనను మారు చెప్పునే? 15

సీ॥ బహువిధంబుల వాళ ♦ పత్రసద్గ్రంథంబు
లెల్లను వెదకినాఁ ♦ డే బుధుండు;
పలు శిలా శాసన ♦ ములను శోధించి భా
షా మర్మములఁ గాంచె ♦ నే మనీషి;
పండితం మన్యులు ♦ పసికిరాదను శబ్ద
కోటిని నిల్పె నే ♦ కోవిదుండు;
కాలానుగుణముగాఁ ♦ గవనంబు మారుట
యెఱిఁగించె సభలలో ♦ నే యశస్వి;

తే॥ గ్రాంథికులమంచు వాదించి ♦ గర్వపడిన
కవుల కృతులందుఁ గృతకమై ♦ కాలుశబ్ద

బరగిన నేటి నా సుతులు ♦ పండిత సత్కృతులైన యట్టి శ్రీ
తిరుపతి వేంకటేశ కవి ♦ ధీరుల వ్రాతల నైన జూడుఁడీ॥ 38

సీ॥ ఆడాడ వేముల ♦ వాడ భీమన భంగిఁ
గురిపించె గైత నే ♦ కోవిదుండ;
సతతమ్ము వాగను ♦ శాసను నట్టులఁ
బోషించె గైత నే ♦ పుణ్య మూర్తి;
చిక్కని త్రోవలఁ ♦ దిక్కయజ్వం బలె
మెలఁగించె గైత నే ♦ మేటి సుకవి
నానావిధంబుల ♦ శ్రీనాథు రీతిగా
సాగించె గైత నే ♦ సారవేది

తే॥ పోతన తెలుంగు, తిమ్మన ♦ పోల్కి వేంక
టాఖ్యు వలెఁ గైత నల్లు నా ♦ యనుఁగు బిడ్డ
నరసుఁడైనట్టి తిరుపతి ♦ శాస్త్రివంటి
వార లెందఱేని జనింపఁ ♦ గోరుచుండు. 39

తే॥ నాస్వరూప మదెట్టిదో ♦ నన్ను నడపు
రీతి యెట్టిదో తెలిసిన ♦ నా తనూజు
లందు సర్వోత్తముండయి ♦ నట్టి చెళ్ళ
పిళ్ళ వేంకట శాస్త్రిని ♦ వేశశాన్య
కలహములఁ దిగ్సఁ జిచి తప్పు ♦ కాదె యనకు? 40

ఆ॥ గిడుగు రామమూర్తి ♦ గొడుగు నాకెన్నఁడు
పిడుగు కృతకభాష ♦ పడఁగఁ ద్రొక్కి
నాస్వరూపమెట్ల ♦ నాఁటికిని మారి
విచ్చినదియు నతఁడు ♦ నిర్వచించు. 41

# గుణదర్శని

## అద్భుత మందిరదర్శనము

కాలజాంఘికు డిట్లుపన్యసించెను.

అమృత నగరవాసులారా! నేను, నిన్న జరిగిన వాదనయందు తీవ్రముగ మాటాడుటవలన గలిగిన తలనొప్పిచేతనేమి, యిది వేసంగియగుట వలన గాలిలేకపోవుటవలన నేమి, నాకు నిన్నటి రాత్రి సరిగ నిద్రపట్టలేదు. తెల్లవారగట్ల కొందిగ మందపవనుడు నామీద కృపబూనికాబోలు వీవ బ్రారంభించెను.

గడియారము నాలుగుమారులు "టంగ్" మని కొట్టెను. "ఈదినమున మన సంఘోపన్యాసము కేమియు నిన్నటిదినమున వాదమున దేలలేదు, ఉపన్యాసమిచ్చుట కేవిషయము బాగుగ నుండున'ని నే నాలోచించుచుండగనే మరల నిదురవచ్చెను కాని తెల్లవారగట్ల పట్టిన నిద్రయాలమున గాబోలు నది కలతనిద్దురయై నన్నిటునటు ప్రక్కమీద కొలదిసేపు దొర్లించి, యొక కలతో సమాప్తిజెందెను

ఆకలయందు హఠాత్తుగ నొక నిర్జనప్రదేశ మధ్యమున నన్ను నేనుగంటిని. "ఇట కెటుల వచ్చితినిరా" యని యాలోచించుచు నిటు నటు చూచుసరికి నాకు మందిరములుగూడ కన్పట్టెను. అది పవిత్రమైనను యేమియు జప్పుడులేదు. ఘోరమైన నిశ్శబ్దము. ఏవిధమగు ప్రాణియు కూడ నామందిర సమీపమున కానబడకుండెను. "ఇదేమిచిత్రమో! - ఇచట - నిట్టి నిర్జనప్రదేశమున - నిట్టి మందిరముండుట యెట్లు సంభవించెను." అని యాశ్చర్యపడుచు, నామందిర ప్రాకారమును చుట్టి యొక ద్వారమునొద్ద కరుదెంచితిని. ఆద్వార మినుపది. దానితలుపులు మూయబడి మందిరము సురక్షిత మొనర్పబడి యుండెను. ఇట్టిస్థలమందిట్లు రక్షితమైయున్న మందిరమున నేమి విశేష ముండునో చూడవలయుననెడి కుతూహలముచే నేను లోనికిజనుటకు మార్గమన్వేషింప బ్రారంభించితిని. ఆద్వారముగుండ వెళ్ళుట సాధ్యము కాదు.—అందుచే మరల ప్రాకారము చుట్టిపో బ్రారంభించితిని. అట్లు చుట్టుచు నేనొక పెద్దవృక్షమునుజూచితిని. దానిశాఖలు ప్రాకారములోనికి వంగియుండెను. సరియె!— ఆ వృక్షారోహణ మొనర్చి, శాఖల గుండ లోనికి దిగినయెడల?—

ఆ వృక్షము నెక్కితిని. శాఖలచివరకుపోయి చూచితిని. ఆశాఖ లొక డాబా చివరవరకును వ్యాపించియుండెను. జాగ్రత్తగ నేనా డాబా మీదికి దిగితిని. చూచితిని! — జనులున్న యలుకుడు వినబడలేదు — డాబానుండి దిగితిని ఆడాబాతో వరుసగడాబాలు బారులుగనుండెను. వీటికి కొలదిదూరమున నీడాబాలమధ్య నొక పెద్ద మందిరముండెను.

"ఈచిన్న మందిరములను తరువాత చూడవచ్చును. — ఆ పెద్దమందిరమే మొదట చూడదగినది!" అను బుద్ధితో నేనా పెద్దమందిరము జేరితిని. పైనుండి చూచినయెడల నాశిల్పచాతుర్యమున కెవ్వడైన ముగ్ధుడు కావలసినదే!- ఆశిల్పచాతురి, రచనానైపుణ్యము, నెచటను గాంచలేదు. — కొలదిసేపా పాషాణప్రతిమా సందర్శనోత్సుకత ననుభవించి మందిరములోని కేగితిని. — ఆహా! ఆమందిరము పరిశీలించ నది దేవేంద్రభవనములోనైన సరిపోల్చ వచ్చుననెడి భావము కలుగుట సహజమే!— నేనుమాత్రము మిక్కిలి యాశ్చర్యపడితిని. దే నైన జూచి యాశ్చర్యపడుటవలననే నా నిజ

స్థితినిగూర్చి తర్కించి తెలిసికొనుట మిక్కిలి యసాధ్యమని. నమ్మకటనుబట్టి కొంతసేపటికా మందిరమును నెమ్మదిగ పరిశీలించితిని. అపుడు నేను "మనుజుడు తన జీవితయాత్రను సాగించు చున్నకొలదిని, తన కాశ్చర్యము గొల్పు విషయముల సంఖ్య తగ్గుచుండును" నెడి సూనృతమున బడితిని.

ఆమందిరము మేడ కాదుగాని మిక్కిలి యెత్తైనది. అది సుమారు పలుబదిఅడుగుల యెత్తుండును. ఇరువదిగజముల వెడల్పును, సుమారొక ఫర్లాంగు పొడవును గలిగిన యామందిరము నూహింపవలసినదే కాని, నేనిచట వర్ణింపలేను. దాని శోభ నెన్నుటకు నాకు శక్తి చాలదు. మానవజాతుకే యట్టిది చూడ తటస్థించినయెడల దానిని వర్ణించి తన కవితాధోరణిచే మిమ్ములనా నొప్పించియుండును!

ఆభవనము లోపల నంతట తివాసులు పరుపబడి యుండెను. పొడవునను గోడలకు దగ్గరగ సోఫా లనేకము లమర్చబడియుండెను. నడుమను రెండేసి చంద్రశిలా నిర్మితములగు గుండ్రని బల్లలుకూడ నమర్చబడి యుండెను. ప్రతిబల్ల మీదను చీనాదేశ చిత్రకళా విలసితములైన యంబరములు పైనున్న దూలములకు విద్యుద్దీప కళికలును, వీవనలును వేలాడ గట్టబడియుండెను. ఆదీపకళిక లనేక రంగురంగులతో చేయబడియుండెను. దీని గాని విశేషము లింతియే!—

ఆమందిరము వెలువడి యీవలకు వచ్చితిని. మందిరమునకు నల్గువైపులను నూరుగజముల దూరమున కొన్ని బంగాళాలుండెను. వాటికే గాభాలుండెను. వానియందేమి విశేషమున్నదో చూడవలయునని వానియొద్ద కేగితిని. అవి ప్రత్యేకి యొకట్టిగనుండిన పెద్దగదులు. వానిముందుమాత్రము వసారాలుండెను. గదులకు నాలుగువైపులను గవాక్షములు. ఒక గవాక్షము తెరచియుండుటవలన, తలుపులు బిగింపబడియుండినను, లోపలి వస్తువులను చూడగలిగితిని. నేను చూచిన గదిలోపల రెండు పందిరిమంచములు నొక సోఫాయు నొక బల్లపై పెద్దయద్దమును, మఱియొకబల్లపై సీసాలును గ్లాసులు నింక నేవేవియో యుండెను. ఆపందిరిమంచములనుపవి. వానికి దోమతెరలు కలవు—ఆయొక్క గదికే గవాక్షము తెరువబడి యుండెను. కాని మిగతవానికిమాత్రము మట్లులేదు అందుచేత నింక చూచుటకు వీలులేకపోయినది.

ఈ మందిరద్వారమునెదురను మధ్య నొక మార్గముకలదు. అది గాజీకట్టడము. ఆమార్గము మాత్రము మిరువ్రక్కలను వివిధ లతావృతమై యుండెను. ఆలతలిరువ్రక్కలనుండి ప్రాకి పైన నల్లిబిల్లిగ నల్లుకొని యుండెను. ఆపచ్చని చాందినియందుకూడ నామార్గము పొడవునను విద్యుద్దీప కళిక లమర్చబడియుండెను. ఇవి యన్నియును చూచిచూచి మరల నామొదటి డాబాపై కెక్కి మెట్లుకొమ్మలనెక్కి బయటికిపోతిని.

బయట నేమైన విశేషమున్నదేమో చూతమని ప్రాకారము చుట్టును తిరుగ సాగితిని. ఆమందిరము వెనుకభాగమున నొక పెద్దతోట యుండెను. అదితోటయని చెప్పుటకంటె జంతుభీతిలేని యరణ్యమనిన బాగుగనుండును. ఆతోటలో నిచ్చవచ్చినట్లు తిరుగుచు నేనచట నచట నికుంజములును, వానియందు రాతిసన్నెటను గనుగొంటిని. తోటమధ్యమున నొక పెద్ద తటాకము నుండెను. ఆసరస్సు రమును జేరుటవ్వరికి సామాన్యము నాలుగైదుగంట లగునేమో!—తోటయందు తిరుగుటవలన బడలినవాడనై

ఫలాహారోదకముల గోరితిని. ఫలముల గొన్నిటి దింటిని — ఫలరసాస్వాదనకై తోటలో తయు పక్షిభక్షించుటవలన గలిగిన ఫలసట పోగొట్టుటకై యింపుగ పెరిగిన తోట కామందిరమున కేగుటయే నే నుచితమని తలంచితిని. అచటకేగితిని — చిత్రము! ఆ ప్రాకార ద్వారమునొద్ద నిదివరకు గానబడని కొందఱు నల్లటివారు — నౌకరులయి యుండబోలు — నిలచియుండిరి. వారలలో వారు మాటాడుకొనుటలేదు కాని వారెవరికొరకో వేచియున్నటుల వారి వైఖరుల జూడ వ్యక్తమగుచుండెను — దీనిలో నేదియో రహస్య మిమిడియున్నదని తలచి నేను పొంచి చూచుచుంటిని.

సాయంత్రము సుమారు రేడు గంటలు కావచ్చును. అట్టి సమయమున దూరముననుండి కొన్ని మోటారు బండ్లను, గుఱ్ఱపు బండ్లును వడి వడిగ వచ్చెను. ఆ బండ్లా ప్రాకార ద్వార సమీపమున నాగగా నొక్కొక దాని నుండి యొక్కొక మానవ మిథునము దిగసాగినది. వీరిలో నాంగ్లేయు లెవరో, హైందవులెవరో, మహమ్మదీయు లెవరో చూచి తెలిసికొనుట మిక్కిలి కష్టముగ నుండెను. ఇట్లు వీ రెల్లరును వాహనముల దిగి లోనికి జనిరి. వారితోకూడ కొంత సేవక బృందము వెడలెను. — నేనును లోనికిపోయి వారేమి చేసెదరో చూతమని ముందుకు పోసాగితిని. ఆ ద్వారపాలకులలో నొకడు నా కడ్డువచ్చి యదలించి "ఇదేమిటయ్యా! నీ వొక మూర్ఖునివలె కన్పట్టుచున్నావు — ఈ వేషముతోడనే నీవు లోనికి వెళ్ళదలచుట! ఛీ! — ఆయంగవస్త్రము, ఆ పంచకట్టు, ఆ ముద్ర, పిలక, ఆ గంధము, ఆ పొడుము ముక్కు! — వహ్వా! చాల బాగున్నది! — పో! ఛీ పో! ఇచ్చుటకు వచ్చుటకు నీకర్హత లేదు. పొమ్మ"ని హేళన చేయుచు పలికి లోనికి జన ప్రయత్నించు నన్ను బయటికి త్రోసివేసిరి. నేనును చేయునది లేక గుర్రున మిటకరించుకొనుచు నిలచియుంటిని — నన్ను చూచి వారు నవ్వి లోనికిజని తలుపు వైచికొనిరి. — ఇంత న్యూనతకు లోనైన మన మిక నిచట నుండకూడదని నిశ్చయించి, నే నచటనుండి మాయమయితిని! — నా యిచ్చ వచ్చిన రీతిని త్రెన్ను తెలియక పోసాగితిని. అట్లు పోవుటలో నేనిదివర కధిరోహించిన వృక్షముమీద హఠాత్తుగా పడితిని.

పెనుగాలి వీచుచుండెను అట్టి స్థితియం దావృక్షము నెక్కి లోనికి పోవుదమన్నను వీలు కనిపింపదు. ఎట్లైనను లోనికి పోవలెనని సంకల్పించుకొంటిని. ఆవృక్షము నారోహించితిని. అడాబాపై కంతరించిన కొమ్మ చివరకును పోయితిని అది యింతకుమున్ను గాలి లేదు. కాన నంగ డాబామీద కుండెను. కాని యిప్పుడట్లు గాదు. గాలివలన నది యిటునటు లూగులాడుచుండుటవలన దిగుటకు బ్రయత్నించి పో భూపతనము కావలసినదే నని భయము గలుగుచుండగనే, నేను క్రిందబడితిని. ఆపాటువలన ప్రాణము లంతరించెనేమో? — పునర్జన్మము నెత్తించెనేమో తెలియదు కాని, నే నొడలు తడవుకొనగా నా యవస్థయంతయు నూతనమై యుండెను. — చిత్రమే! — నా పంచయేది? — నా యంగవస్త్రమేది? — నా పిలక యేది? — ఇంత మార్పునకు కారణమేమి? — నా నెత్తి మీద నాంగ్ల సంబంధమగు జాలునుకుటుము! — ఎన్నడు గని స్థితి! — నోటిలో కిల్లి ఎడమ చేతి వ్రేళ్లమధ్య కత్తెర చిహ్నముగల పొగచుట్ట పికేసము; — ఎడమచేతికిం, కోటు చేతికిని

మధ్యనొక యుత్తరజల్లిన రుమాలు !—కుడిచేత నొక దంతప్రగ్రహి ! — పాశ్చాత్య నాగరికత నా యందుగూడ నుట్టిపడుచున్నటు లుండెను. ఇక నేమి ?—నేనుకూడ నాభవనములోనికి వెళ్లిన వారివలెనే యుంటినే !—ఇక నాకడ్డేమి ?—

త్వరగా నాభవన ద్వారమును జేరితిని. అచట నన్నడ్డపెట్ట నెవ్వరు సాహసింతురు ?— అచటి ద్వారపాలకు డొకడు నాకభివాద మొనర్చి లోనికి జనుమని సైగజేసెను. నేనును లోనికి పోయితిని;— ఆ మందిర మంతయును పట్టపగలువలె సుందరముగ నుండెను. లోపలి విద్యుద్దీపములన్నియు వివిధ వర్ణకిరణముల ప్రసరింపజేయుచు, సప్తవిధ రవికిరణముల మాడ్కి యొక్క చూపున వర్ణరాహిత్యమును దోపజేయుచుండెను. ఆజ్యోతిః ప్రవాహమున మందిర మందలి వస్తుసముదాయమంతయుం దేలిపోవుచుండెను.— కాని యచటి మానవుల నవ్వులు మాత్రము తేలిపోవుటలేదు —నారీ కలకలము, అబలాకంఠధ్వని, నిగూఢ భావాంతర్గతహాసములు, సకల జనానందకర సంభాషణము—యిట్టి వచటి వాయువున లీనముగుట కేవిధమగు నవకాశము గలుగకుండ వృద్ధి చేయబడుచుండెను. మాటకును మాటకును మధ్య కొంచెము కాలమైనను లేకుండ బోవుచుండెను !— ఇట్టి స్థితియందుమననే నేను లోన బ్రవేశించితిని. ప్రతి బల్లమీద ననేక విధములగు భక్ష్యములును, కాచపాత్రలును, నారాయణములు, యింక నేవేవియో యుంచబడి యుండెను.

ఇట్లు నే నన్నియును పరిశీలించుచుండగ నొక పెద్ద మనుష్యుడు వచ్చి, నా చేయిపట్టుకొని యాశీరంది మందిర మధ్యమునకు దీసికొని పోయెను. అట్లు గౌరవించి నన్ను దీసికొని పోవుచు నాతడు నా పేరడిగి తెలిసికొనెను. ఆత డట్లు దీసికొనిపోయి నన్నొక బల్లయొద్ద కూర్చుండబెట్టెను. ఆ బల్లయొద్ద నొక నవ యౌవనవతి యొంటిగ కూరుచుండెను.—ఆమె హిందూవనితయే యై యుండును! —అయియుండునని యెందులకు చెప్పుచుంటిననియా మీ రట్లు చూచుచున్నారు !— ఆమె ముఖమున నేవిధమగు కళంకము లేకుండ నింత బూడిద పామినది. ఎర్రదిగాని, నల్లదిగాని బొట్టేమియును లేదు. వంగపండు చాయ దొకపట్టు చీరయో, మఱేదియో వని యొక మాదిరిగ కట్టుకొనెను. జాకెట్టో యేదియో నొకటి తొడగికొని యుండెను. చేతులకుగాని, చెవులకుగాని తొడవు లేమియును లేవు. ముక్కునకు మొదలే సున్న. ఈ పరిశీలనవలన నేమియు తెలియులేదు — ముఖమును బట్టి హిందు వనుకొన్నను ఆంగ్ల భాషోచ్చారణమును బట్టి మ్లేఛమో మఱియొక లాగున ననుకొనవలసి యుండునేమో !—

ఆమె యేలాగున నుండిన నాకేమి పోయినది! మొదట నన్నామె గొద్ద నెందులకు కూర్చుండ పెట్టబడితినో తెలియలేదు.— నేనీయవస్థలో నుండగా నామె నన్ను గ్రొత్తవానిగ నైన భావింపకుండ నాతో చిరపరిచితునివలె మాట్లాడజొచ్చెను.—నే నది జూచి మొదట నాశ్చర్యపడినప్పటికిని, చివరకు బాగుగ నుండదని యామె ప్రశ్నల కుత్తరవులీయ బ్రారంభించితిని. ఇంతలో మొదట నన్నాహ్వానించిన యాతడు వచ్చి నాతో "అయ్యా! మీరీ సంఘమున సభ్యులయ్యెదరా ?" యని యడిగి, నేను సమాధాన మీయకుండగనే "మీ కిష్ట

మున్నను లేకున్నను దీనిలో జేరి తీరవలయును. ఈ సంఘ సమావేశమున కొకమారు వచ్చిన వారు దీనితో సంబంధము గలుగజేసి కొనకుండ నుండగూడదు." అని నాతో చెప్పెను— నే నాలోచించితిని!—అందుల కియ్యకొనని యెడల పోరు! అందువలని లాభ మేమి?— అందుచేత నేను సభ్యుడ నగుట కొప్పుకొంటిని. అందుచే నాతడొక పుస్తకమును తీసికొనివచ్చి దానిలో నా పేరూరుల వ్రాసికొని, నాతో "నయ్యా! దీనికి చందా సాలుకు వేయి రూప్యములు" అని చెప్పెను. నే నా మొత్తమెచట తెచ్చుటకును తోపక, డాంబికముగ జేబులో చేయిపెట్టునరి కొక సంచి చేతికి తగిలెను. ఆసంచి పైకి తీసితిని. చూచితిని! దానిలో రూపాయిల నోట్లనేకము లుండెను. ఇక నేమి?— నే నాతనికి పది నూరు రూపాయిల నోట్లందించితిని. ఆతడును తా నా సంఘమునకు కార్యదర్శినని చెప్పి నా చేత నా పుస్తకమందు వ్రాలు చేయించెను. పిమ్మట వెడలిపోవుచు నా కాతడొక పుస్తకము నిచ్చెను. ఆ పుస్తకము నం దనేకములగు మహా దాశ్చర్యకరములగు సంగతులున్నవి. వాటిలో కొన్ని మాత్రమే మీకు నేను చెప్పుచున్నాను. గమనింపుడు!

(1) ఈ సంఘమునం దిరువది సంవత్సరములు దాటిన పురుషులను, పదునెనిమిది వత్సరములు వచ్చిన స్త్రీలను జేర్చుకొనబడుదురు.

(2) ఈ సంఘ సభ్యులకొక చిహ్నముండును. దానిని బట్టియే యొకరు మఱియొకని తెలిసికొనుదురు. చిహ్నముయొక్క యర్థము పైవారికి తెలుపగూడదు.

(3) ఏ సభ్యుడైనను, సభ్యురాలైన నెవ్వరేది కోరిన దాని తప్పక తక్షణమే యీయవలయును. సభికురాండ్రు చేయుమనిన పనులను సభ్యులు తప్పక నాక్షణమందే చేయవలయును.

(4) ఇందలి సభ్యులు మతభేదము లేక భుజించుచుండవలెను.

(5) దీనిలో నందరకును సమానహక్కులే గలవు. అందుచేత నీ సంఘమున జేరు నారీ యాస్తియంతయును దీని రక్షణకే వదల వలసినది.

(6) ఈ సంఘ "పరతుల" కొప్పని సభ్యుల గతి యేమిటిపుడు నిరూపింపలేము;—

ఇట్టి విషయములే దీనిలో వేలుగలవు.

"ఇట్టి సంఘమున బడితిమేమిరా కర్మఫలము" ని నేను చాల విచారింప ప్రారంభించితిని. కాని యీ యాలోచన నా వృత్తు మొక ఘంటా నాదమున భూపతితమయ్యెను.

ఆ ఘంటానాదమున నందఱును తమ తమ సంభావణలమాని బల్లమీద నున్న భక్ష్యములం నోటవైచికొనుచుండిరి. నాదగ్గర కూరుచుండిన యువతికూడ భుజింప మొదలిడెను. చేతులతో ముట్టకూడదని కాబోలు వారేదియో గరిటెలతో భుజింప మొదలిడిరి. నేను మాత్రము దిననుండ కూరుచుంటిని. నాప్రక్కనున్న యువతి నన్ను జూచి నవ్వెను. తినుటలేదని కాబోలు నామె నవ్వెనని తలచి నేనును భుజింప మొదలిడితిని. నేను భుజించుచుండగనే యామె తాను తిను చుండిన గరిటతో తన పళ్ళెరమున నున్న పదార్థములన్నిఁ గొంత భాగమెత్తి నాపళ్ళెరమున వైచెను. నాపళ్ళెరమున నెంగిలి పడవేయునేమి యని నేను చుట్టును చూచుచుండ సరికంటబడె నాదృశ్యమే!—

పళ్లెరముల నేమియు లేకుండ జేసి కొందఱు

సీసాలపై బడిరి. అపుడు నాప్రక్కను కూర్చుండిన యువతికూడ తన సీసానుండి కొంతద్రవ పదార్థము నా గాజుపాత్రయందు బోసి నాకందించెను. నే నిష్టములేకున్న బాగుండదని కొలదిగ త్రాగితి. అది యే సారాయపుద్రావము!— అది చాల తీపుగనుండెను. నేను మరల నాపాత్రనామెకందించితిని. ఆమెయు నా యెంగిలి త్రాగెను. ఇట్లు కొలదిసేపైన తరువాత కొందరు నల్లటివారువచ్చి యాబల్లలు తీసివేసిరి. మేము గోడలప్రక్కనున్న సోఫాలపై వ్రాలితిమి!

కొలదిసేపటికి రెండవసారి ఘంటారవము వినవచ్చె. అది వినవచ్చుటతోడనే పొగత్రాగువారది మానిరి. తక్షణము లేచినిలచిరి!

స్త్రీపురుషు లొకరినొకరు కౌగలించుకొని నాట్యమాడజొచ్చిరి! నన్నుగూడ నొక యాంగ్లవనిత కౌగలించుకొనగా నాకు మిక్కిలి కోపమువచ్చినది, కాని యేమి చేయుట?— నేనేను ప్రవరుడనా?— ఒకవేళ నైనప్పటికి నది కలగదా?— అట్లు కౌగలించుకొని యామె నృత్యమాడజొచ్చెను. నే నెప్పుడెరుగని యీ నాట్యమప్పుడు కడు నిపుణతతో నెఱవేర్ప సమర్థుడనైతిని.— కొంతసేపట్లు నాట్యమాడి కొందరు మానిరి. మాటలాడుకొనిరి. కొలదిసేపటికి మరల వారు వేఱువేఱుగ స్త్రీపురుషుల నెన్నుకొని మరల నెప్పటివలె నాట్యము మొదలుపెట్టిరి. నేనుమాత్రము నాయపూర్వానుభవానంతరమున సోఫామీద కూరుచుంటిని. ఘర్మబిందువుల దుడిచికొనుచుండగా నాతోడ భోజనముచేసిన యువతి వచ్చి నన్ను చేయి పట్టుకొనియెను. నే "నెందులక"ని ప్రశ్నించితిని. ఆమె "ఈ సంఘమున నాడువా రేమిచేయుమన్న నదియే చేయవలె"నని నానోరు మూసెను. నేను మాటలాడక లేచి నిలచితిని. ఆమె నన్ను కౌగలించుకొని నాట్యమాడజొచ్చెను.

నేనును మరల కొంతకాలము నాట్యము చేయవలయునేమో యనుకొంటిని. కాని యీలోపలనే యాభవనమున సమ్మర్దము తగ్గెను నాకలసటగానుండుటవలన మరల నొకసారి సోఫాపై వ్రాలి కన్నులు మూసికొంటిని. ఇంతలోననే యొకరు నన్ను లేపినట్లయ్యెను ఆవ్యక్తి నాతో భుజించిన యువతియే!— నేనామె నెందులకని యడిగితిని.— అప్పటికా మందిరమున నెవరును లేరు!— ఆమె సమాధానము చెప్పకుండ నన్ను ముద్దుగొనియెను!— ఎంతసాహసము!— నాకు కోపమువచ్చి లేచి నిలచితిని. ఆమె మరల నన్ను కౌగలించుకొని ముద్దుగొనియెను— నాకసహ్యమై యామెను త్రోసివైచితిని ఆమె మరల తనపైనున్న పచ్చని పటము జారి, నాకౌగిలి నాసించెనుగాని విఫలమనోరథయై యొకబొత్తాము నొక్కెను. ఏది యోచప్పట్టైనది. నేను తిరిగిచూచితిని!— చాలమంది నల్లనివారు యమకింకరులవలె నట ప్రత్యక్షమైరి. నేను వారితో మల్లయుద్ధమునకు డీకొంటిని. వారు చాలమంది యుండుటవలన నన్నుపట్టుకొని యీడ్చుకొనిపోయి ద్వారము నెలుపలకు ద్రోసివైచిరి. వారుకొట్టిన దెబ్బలవలనను, ద్వారబంధమునకు తగులుటవలనను స్మృతి తప్పి పడిపోతిని. ప్రపంచమంతయును గిఱ్ఱున తిరుగుచుండెను. ఎంతసేపట్లుంటినో లెక్కలేదు. కొంతసేపటికెవ్వరో తట్టినట్లయినది— చాల ప్రొద్దెక్కుటవలన మావాడే సంజాతు డాశ్చర్యపడుచు లేపుచుండెను.

"గుణదర్శని విలేఖరి."

సూరి నృసింహశాస్త్రిగారు.

## 1

తూర్పు కనుములు దక్కనుపీఠభూమికి దూర్పున నుత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించియున్నవి. గోదావరి కృష్ణ మొదలగు పవిత్రములైన నదులు పశ్చిమకనుమలందు బుట్టి తూర్పుకనుమలయందు దారి చేసుకొని తమ ప్రభువైన సముద్రునితో నేదియో విన్నవించుటకుం బోయినట్లు తమ నీరమును సముద్రుని యాధీనమందుంచుచున్నవి. ప్రభుకార్యాచరణతత్పరులైన నిటువంటి కింకరు లుండుటచే తానెంతయు సంతసమొందుచుండెనో యనునట్లప్పుడప్పుడు సముద్రుడుప్పొంగి ప్రక్కనున్న పల్లెలను ధ్వంసము చేయుచుండును. అటువంటి సంగమస్థానములం దన్నికాలములయందు (తాగుటకు పనికి ముడుటచే కోయవాండ్రు) మొదలగు జాతులవారు నివాసములను నిర్మించుకొని చుట్టుప్రక్కలనుండు కొండలను వ్యవసాయయోగ్యములుగా చేసుకొని కృషీవలవృత్తిచే జీవనము గడుపుచుండిరి. అట్లు నివసించు కుటుంబముల సంఖ్య చాలా స్వల్పమైనను దమలోదాము విరోధములు పెట్టుకొనక పరమమైత్రితో కాలము గడుపుచుండిరి, తల్లిదండ్రుల నల్లుకొను విరోధలతలు బాలురచుట్టును నల్లుకొనవు. కాన వారెప్పుడు స్నేహమును, మృదుమధుర సంభాషణలచేతను, పరస్పర గృహీత తినుగొండు పదార్థములచేతను పెంపొంద జేయుచుందురు. వారియందు మనకు గావలసినవారు ముగ్గురుగలరు. అందొకతె యాడుదియు మిగిలినవా రిరువురును పురుషులు. వారి తల్లిదండ్రులు, బంధువులు వారిని నాగమ్మ చిట్టెడు రాముడని బిలుచుచుందురు. వారు చిన్నతనమునుండియు పరమమైత్రితో మెలగుచు బువ్వాలాటల నాడుకొనుటను జూచి యూరి పల్లెలోనివారందరు వారు పెద్దవారైనను నిట్లే స్నేహముతో రామలక్ష్మణులవలె మెలగుచుందురని యభిప్రాయపడుచుండెడివారు. బువ్వాలాటలయందు నాగమ్మ గృహిణిగాను రాముడుగాని చిట్టెడుగాని యజమానుడుగాను యుండి దానినంతయు జరుపుచుండెడివారు. ఎప్పుడైనను రాముడు చిట్టెడు నాగమ్మ తమ తమ భార్యయని కలహమునకు డీకొనినప్పుడు నాగమ్మ వారితో మంచిమాటలు జెప్పి (వారిద్దరికి యజమానురాలుగా నుండునని) వారిని శాంతింప జేయుచుండెడిది. ఇట్లు సుఖముగా బాల్యజీవనము జేయుచున్నప్పుడు వారికి యౌవనము వార్ధక్యము మొదలగు దశలు వచ్చునని యూహాలే లేకుండెడివి. కాని యప్పుడప్పుడు నాగమ్మకు రామునికి యొకరి యందొకరికి ప్రేమమాత్రము పుట్టుచుండెడిది.

## 2

ఇట్లు కాలముగడువగా వారు ముగ్గురు పెద్దవాండ్రగుచుండిరి. నాగమ్మకు పదునైదవ వత్సరము వచ్చెను. అపుడామె తలిదండ్రు లామెవివాహము సేయుటకు నిశ్చయించుకొనిరి. వారికి నాగమ్మయే కొమార్తె. కాన యామెను వారు పుత్రునివలె చూచుకొనుచుండిరి. "కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతిం। బాంధవాః కులమిచ్ఛంతి మిష్టాన్న మితరేజనాః" అను నార్యోక్తి ప్రకారం తమ కుమార్తెను మంచి సౌందర్యముగల, ధనికుడైన సుగుణసంపత్తిగల వరునికి యివ్వవలెనని కుతూహలముతో వెదకుచుండిరి. ఆపల్లెయందు యిన్నిగుణములకు నాస్పదమైన బాలుడు కానబడలేదు. అందరిలోను రాముడే బాగుండెనని యెంచి నాగమ్మ తల్లిదండ్రులు వానికి తమకుమార్తెనుయిచ్చుటకు నిశ్చయించిరి. రాముడు మంచిబాలుడు సౌందర్యవంతుడు. అతనితండ్రి సముద్రమునకు సమీపమున నుండుటచే మత్స్యములనుబట్టి వాటిని విక్రయించి చాలాధనము సార్జించి ఆగ్రిమస్థులకు ధనము కావలసినచో వారినాపదలనుండి తప్పించుచుండెడివాడు. కాన నా యూరివారందరకి నాతనియందు గౌరవము మెండు

నాగమ్మ తనను రాముడికిచ్చి వివాహము చేయుదురన్న మాట విన్న ఆమెయొక్క సంతోషమునకు మేరలేదు. పెండ్లిపనులు చేసిరి. ఆ శుభముహూర్తమునకు పెండ్లి ఆయెను. అచిరకాలములో నాగమ్మ రజస్వలకాగా నామె తల్లిదండ్రులామెను అత్తవారింటికి బంపివేసిరి. నాగమ్మ భర్తతోకలసి సుఖముగ కాపురము చేయుచుండెను. ఒక సంవత్సరములో నామెకు కుమారుడుపుట్టెను. పుత్రుడు గల్గెనని సంతోషమునందు భార్యాభర్తలు నిమగ్నులై యుండిరి.

## 3

కాని భగవంతు డీయానందమునకు భగ్నము గల్గించెను. రాముని తండ్రి స్వర్గస్థుడాయెను. తల్లి చిన్నతనమునందే చనిపోయినను తల్లిలేని కొదువ లేకుండ తనను పెంచి పెద్దవానిని జేసి వివాహము జేసిన తండ్రి పోయినప్పుడు

రాముని దుఃఖమునకు మితిలేదని చెప్ప నవసరములేదు. చేయవలసిన ఉత్తరక్రియ లన్నియు చేసిన కొలదికాలము లోనే తండ్రి యార్జించిన ధనమును దానధర్మములను జేసి పాడుచేసెను.

తాను దరిద్రుడాయెనని చింతించుచు చేపలనుబట్టి విక్రయించి తదార్జితమైన యర్థముచే జీవనము చేయుచుండెను. భగవంతుడు మనుజులను సుఖమును చిరకాల మనుభవింపనీయడుగదా!

## 4

నాగమ్మ తల్లిదండ్రులు నొకరితరువాత నొకరు చనిపోయిరి. వారలకొరకు నాగమ్మ యెంతయో విచారించెను. లాభములేదని తలంచి దిక్కులేకపోవుటనే తన భర్తనే దైవమనియెంచి సుఖముగా నుండెను. రాముడు ప్రతిదినము మీనములనుపట్టుట కలవాటుపడినవాడు గాన నీతనీదుటయందు చతురుడాయెను. పడవనుగూడ నడప గల్గెను. కొంతకాలమునకు ఒక వర్తకుని యొద్ద యొక ఖాళీరాగా రాముడు తన్నునియమించుకొని తనపనికి నిశ్చయించుకొనెను. కాని తన భార్యకు నేదియో జీవనోపాయము గల్పించవలెనని తనవద్దనున్న ధనముతో సరకులను గొనితెచ్చి ఆమెను వాటితో కొట్టు పెట్టుకొనమని చెప్పెను. నాగమ్మ ఎన్నివిధముల రామునితో పోవలదని చెప్పినను ఆమెమాటలను రాముడు చెవినిపెట్టలేదు. ఎట్టకేలకు రాముడు నాగమ్మను విడిచి ఓడయందు చేరిపోయెను. ఇట్లు ప్రయాణము చేయుచుండగా నోడ యొక మంచుకొండ తగిలి ముక్కలయిపోయెను. రాముడు [illegible]రయిన యీతగాడు గావున నెన్నియో కష్టములపాలై తుట్టతుదకు తాను మరి యిద్దరు నొక ద్వీపమును చేరిరి. వారివద్ద నేమియు వస్త్రములులేవు. ఆద్వీపము నిర్జనమయి యుండెను. చలి మిక్కుటముగా నుండెను. అందుచే గాబోలు రాముడుతప్ప మిగిలిన యిరువురు మృత్యువు నోటబడి యమమందిరమున కేగిరి. "పాపీ చిరాయుః" అనునట్లు రాముడుమాత్రము జీవించియేయుండెను. ఆమార్గమున నేదియైన ఓడ వచ్చునేమోయని చూచుచు నేదియు రాకపోవుటచే విఫలమనస్కుడాయెను.

## 5

ఒకదినమున యిట్లు రాముడు తలపోయసాగెను "నా భార్య చెప్పిన హితమైన వాక్కులను త్రోసివేయుటచే నే నిన్నికష్టములకు పాలయితిని. చలి మిక్కుటముగా నుండెను. చలినుండి శరీరమును రక్షించుకొనుటకు వస్త్రములా లేకపోయె. ఈద్వీపము నిర్జనమైన ప్రదేశము, ఇంటికిబోవుదమన్న నేయోడయు నీమార్గమున బోవుట లేదు. కాన నాకిచ్చట మరణము తప్పదు. ఇంత హీనముగా చచ్చుట! ఇంతకంటె సముద్రములోబడి యీత నీదెదను. అదృష్టమున్న నెక్కడనో చేరెదను లేనిచో నచ్చెదను" అని సముద్రములోనికి బోవుచుండెను. కాని తక్షణమే అచ్చోట నాగి ఆయుర్దాయమున్నంత వరకు బ్రతుకవలెను. కాని యీ సముద్రములో బడి యీదుకొనిపోయినచో నేదియో ద్వీపమునకు బోయెదను. అచ్చటి ప్రదేశము [illegible] యుండవచ్చును. కాని అన్నివిధముల నిచ్చటనుండుటయే శ్రేయోదాయకము" అని యెంచి తిరిగివచ్చెను. సంవత్సరములు గడవసాగెను. నాగమ్మ తనభర్త యీమాసముననో వచ్చునని యెదురు చూచుచుండెను గాని యెప్పటికి రాకుండుటచూచి తనభర్త నిశ్చయముగా నెచ్చటనో చనిపోయియుండునని తలంచెను.

## 6

రాముడు నేడరో నోడమీద పోయెనని అత డిన్ని సంవత్సరములనుండి రాలేదని విని చిట్టెడు యిష్టపడెను. చిన్నతనమున మిత్రులయిన నాగమ్మను చూచుటకు బోయెను. ఆమె బహు దారిద్ర్యము ననుభవించుచున్నదని యెరింగి తనను పెండ్లాడిన నామెను సుఖపెట్టగలనని తలంచి తనను పెండ్లాడమని నామెతో చెప్పెను. తనభర్త వచ్చునను ఆశచే నాగమ్మ నాకింకొక సంవత్సరము గడువని చెప్పెను. చిట్టెడు ఆమె మాటలకు సరేయని ఆమెను దనయింటను [illegible] రామునిగూర్చిన [illegible] చదువు చెప్పించుచు నామెకు కావలసిన పదార్థములు [illegible] పంపి యెన్నియోవిధముల నామెకు సహాయము చేయుచుండెను. ఇట్లు సంవత్సరము అతిక్రమించెను. ఒకనాడు చిట్టెడు నాగమ్మ దగ్గరకు బోయి మరల తనను పెండ్లాడి ఆమెయొక్క దారిద్ర్యమును బోగొట్టుకొనమని చెప్పెను. కాని ఆమె మరల నొక సంవత్సరము గడువడిగెను. ఓర్మితో చిట్టెడు సంవత్సరము [illegible] ధనముచేత నామెకు సహాయము చేయుచుండెను. ఆ సంవత్సరముగూడ గడియగా తనభర్త యెప్పటికియును రాకుండుట చూచి నాగమ్మ శుభముహూర్తమున చిట్టెడుని వివాహమాడెను. ఆదినమునుండియు రాముని గృహము వదలిపెట్టి చిట్టెడి గృహమును నాగమ్మ ప్రవేశించెను. ఇట్లు కొంతకాలము గడువగా నామెకు నొకపుత్రుడు కలిగెను. చిట్టెడు యొక్క ఆనందమునకు మేరయే లేకుండెను. అతడు

రాముని కొమారునిగూడ తన కుమారునివలె చూచుకొనుచుండెను.

## 7

పాపము రాముని అవస్థ విచారింతము. అతను ఆద్వీపము మీదుగ ఓడ యేదయిన వచ్చునేమో దానిమీద నింటికి పోవచ్చు ననుకొనుచు వుండగా వత్సరములుగడవసాగెను. దినములు యెప్పుడును నేకరీతిగా నుండవుగదా! భగవంతునకు నతనిమీద దయకలిగెను. ఒకరోజున ఆద్వీపమునకు సమీపమున నొకయోడ బోవుచుండెను. ఓడలోనివారు ద్వీపమునందు యెవరో తమకొరకు కేక వైచుచున్నారని తెలిసికొని ఓడను ద్వీపము సమీపమునకు బోనిచ్చిరి. అప్పుడు రాముడు తనసంగతి నంతయు జెప్పి దానిమీదకు వచ్చెను. నాల్గయిదు దినములలో నాఓడ రాముని నివాసమునకుసమీపమునకాగా వారాతనినిదింపివేసిరి. రాముడు పల్లెలోనికిబోయి, దన గృహమువద్దకు బోగా అక్కడ తన యిల్లు కానరాలేదు. ఆచోట నొక ప్రాసాదము నిర్మింపబడెను. అపుడు అతడా యూరియందు నొక గృహమునకుబోయి దానియం దొక ముసలమ్మయుంటగని ఆమెను సమీపించెను. తనవృత్తాంతమంతయు నామెతో చెప్పెను. అముదుసలి తనయింటియందు రాముడు వుండవచ్చునని చెప్పెను. రాముడు భైక్షికవృత్తిచే జీవనము గడుపుచుండెను.

ఒకరోజున నాముసలమ్మ యాతని భార్య చేసినసంగతి నతనితో జెప్పెను. ఆమాటల యాదార్థ్యమును నెరుంగవలెనని కుతూహలముతో నొకనాడు సాయంత్రమున చిట్టెడి యింటివద్దనుండి పోవుచు నింటిముందర చిట్టెడు, నాగమ్మ కూర్చుని తమ కుమారుని లాలించుచుండిరి. రాముడది చూచి ముసలమ్మ మాటలు సత్యమని నమ్మెను. "తాను నాగమ్మదగ్గరకు వెళ్ళినచో తనకును చిట్టెడుకు కలహము సంభవించును, దానిచే నాగమ్మ చిట్టెళ్ళ యొక్క సంసారసుఖమునకు భంగముగలుగునని" యెంచి రాముడు ఆముసలమ్మ యింటికిబోయెను, ఆమెతో తాను చూచినదంతయు సవిస్తరముగా జెప్పెను.

తల్లిదండ్రులు బోయినను జీవించియున్న భార్యగూడ తన్ను విసర్జించెనని బెంగపెట్టుకుని రాముడు దినదినము కృశించుచుండెను. మంచముమీదనుండి లేచుటకయినను బలములేకపోయెను. అపుడు ముసలమ్మ తాను నాగమ్మ దగ్గరకుబోయి నీభర్త వచ్చెనని చెప్పెదననిన దానికి నాతడు సమ్మతించలేదు. శీఘ్రకాలములో నాతనికి మరణము సమీపించుచున్నదని యెరింగి ముసలమ్మతో నిట్లనియె. "నాకు మరణము సమీపించుచున్నది నేను జీవించెదనని నమ్మకములేదు. నేను మృతినొందినతరువాత నాగమ్మతో నేను స్వగ్రామమునచ్చి అచ్చటనే మృతినొందితినని చెప్పుము మరియు నామెకొరకు నేనుపొందిన మనోవ్యథలుకూడా తెలియజేయుము." అని తక్షణమే రాముడు మరణించెను.

# అప్రాప్తమనోహారికి

అబ్బూరి రామకృష్ణరావుగారు.

ఓ నవనీతకోమల వయోరుచిరాంగి యనుగ్రహింపు ప్రేమానుమితాప్తనీయ వచనావళులన్ భవదాగ్రరాగ పక్వానితుండైన యీ కవికుమారుని పల్కులు నీ మనోజ్ఞ నేత్రాను గవాచ్ఛశోభనము లందుకొనందలలెత్తనీయకన్.

చీకటిదారులందు వికసించిన వెన్నెల
వోలె, తీవ్ర శో
ఘాతములైన వారలు సుధాసరసిన్
గొను స్నానమట్లు శ్వా
సాకృతిదాల్చి నాదు హృదయ
మ్మున నిల్చిన దివ్యరాజ్ఞి నా
కై కరుణించి నీ తనువిలాస
ము నింపుము నా మనమ్మునన్.
మోహమున మోము జేర్చి నిను ము
ద్దిడు కోరిక లేదు; నీదు వ

శ్రీమృదుకయ్యపైని శిరసున్ గదవాలిచి,
ప్రేలుమల్లికా
దామ సువాసనా మధురత ల్పరికిం
పఁగఁ గాంక్ష లేదు; నా
ప్రేమకు దారిజూపఁగ వరించితి
నా యలరంచు నెచ్చెలి!
మ్లానమతిన్ దృగంచలములన్ దొలకాడె
డు నీ మనోజ్ఞతల్
లోనవడంగు శ్రీవులలోఁ దడుపన్
దలపెట్టఁబోక వై
జ్ఞానిక సాధుభాషణములం దని
యింపుము నన్ను నీమదిన్
లీనవుకమ్మ; నన్నవుఁగలింపుము
నీ కమనీయ శోభచే.

( ఊహాగానమునుండి )

# పద్మరహస్యము.

—♦ ఇరువదియొకటవ ప్రకరణము. ♦—

## హత్య.

"ఆలోచించుట కేమున్నది. అయినను నీగ్రామమున నెవరినో ప్రేమించినట్లు తెలిసినదే."

"నిజమే. ఉమను చూచేవరకామెనే ప్రేమించితిని."

"ఉమ యనెద వేమి? ఉమాదేవి యనుము. అపుడే నీవస్తువుగ తలంచుచున్నావు కాబోలు."

"ఇపుడా పల్లెటూరిపిల్లపై మోహము నశించినది."

"ఈ దురుద్దేశమును మరల్చుకొని, నీగ్రామముపోయి యామెను వివాహమాడినయెడల నిన్ను భాగ్యవంతునిగ జేసెదను."

"ఈవిధముగా నన్ను వదల్చుకొన దలచితిరి కాబోలు. నేనింతవరకు ప్రేమించిన యువతి ఉమకు సేవకురాలుగ నుండుటకైనను యర్హత లేనిదని నాకిపుడు తోచుచున్నవి." అని చిరునవ్వుతో కాళీచరణు డనియెను. అతనుచ్చరించిన తుదిమాట లివియే. ఆ నిశ్శబ్దప్రదేశమున నామాటలు మారుమ్రోగినవి ఆకాశమున నక్షత్రములు మినుకు మినుకు మనుచున్నవి. చెట్లయాకులు నిశ్శబ్దముగ నిలచిపోయినవి. ఆచల్లని శీతసమీరములో పుష్పసౌరభము వెదజల్లుచున్నది. ఆవరణద్వారము నానుకొని నిలబడిన కాళీచరణుని జూచుచు పద్మ నిశ్చేష్టురాలైనది. ఆతనివాక్యములు మార్మ్రోగినపుడామె ప్రత్యుత్తర మిచ్చుటకు దలయెత్తినది ఆవెన్నెలరాత్రియం దాతని ముఖము వివర్ణమైనట్లు పొడసూపినది. ఆమెనోటనుండి ప్రత్యుత్తరము వెలువడనేలేదు. ఇంతలో "ఢాం" అని తుపాకి కాల్చిన చప్పుడైనది. కాళీచరణుని దేహమునుండి రక్తముచింది పద్మ దుస్తులపై పడినది. ఇంతవరకును ప్రగల్భవాక్యములు పలుకుచుండిన కాళీచరణుడు మొదలునరికిన చెట్టువలె నేలకూలినాడు పద్మ తెల్లపోయినది. భయసంభ్రమములతో నామె తటాలున వెనుకకు జరిగినది. సమీపమున నాకులచప్పుడామె పరికింపనేలేదు. స్తంభీభూతయై "హా దైవమా, ఏమిటిదియంతయును" అని యుచ్చరించినది. తనవ్రేళ్లపైనను తన చీరపైనను రక్తబిందువులు కన్పడినవి. ఆమెకు భయమధికమైనది. అక్కడేమిజరిగినది మొదట యామె కనిపెట్టనేలేదు. కాళీచరణుని గాల్చి చంపిరని యామె గ్రహించనేలేదు. అంతయు నొక విపరీతకల! ఈ యాకస్మికధ్వని యేమి? తనవ్రేళ్ళపై తన దుస్తులపై నా రక్తమేమి? కాళీచరణుడెందుకు నిశ్శబ్దముగ పడియున్నాడు? ఆమె యతనిని ప్రశ్నించినది. ప్రత్యుత్తరము లేదు. అతని తలపైకెత్తి చూచినది. ఏమున్నది? యమబాధపడి ప్రాణము వీడిన వ్యక్తి, శవము భయసంభ్రమములతో నామె లోనికి పరుగెత్తినది. ఆసమయములో భర్తగాని సేవకురాలుగాని కన్పడిన నేమయ్యెడిది? త్వరితముగ తనగదిలోనికేగి తలుపులోపల బిగించినది. ఇంటియందంతయు నిశ్శబ్దము. అంతలో సుధీంద్రరాయలు నవ్వు వినిపించినది.

ఆధ్వనివలన నామెకు భయమును మడించినది వెంటనే నేలపై కొరిగినది. "హాదైవమా, ఎంతపాపి త్రించినది" యని విగతస్వరమున పలికినది. ఆమె మెదడు పనిచేయుటలేదు. ఇంతలో రక్తసిక్తమైన దుస్తులనుమార్చి వేళ్ళను కడుగుకొనవలయునని తట్టినది. తక్షణమే లేచి, చేతులుకడిగి యాభరణములను తీసివైచి దుస్తులను మార్చెను. తొందరగా నాదుస్తులను చుట్టచుట్టి బీరువాలో నొకమూల నుంచెను. ఎటులనో తనపక్కచేరి దానిపైబడెను.

తెల్లవారినది. పద్మకింకను స్పృహరాలేదు. సుధీంద్రరాయలు పద్మ వివర్ణతనుగాంచి "ఇంకేమున్నది" అని యొకకేక వేసినాడు. పద్మశిరమును తన హస్తమునంగుంచుకొని, "పద్మా, ఏమిసంభవించినది" అని ముమ్మారు ప్రశ్నించినాడు. పద్మ కన్నులు తెరచినదిగాని ప్రత్యుత్తరమీయలేదు. "పద్మా, యేమిటిది" అని మరల ప్రశ్నించినాడు ఆమె తన ముఖమును మరియొకప్రక్కకు త్రిప్పివేసినది. రాత్రియుదంతము వెల్లడికాక పూర్వము, తనశిర మాతని హస్తములందుండగనే ప్రాణము విడచిన నెంతం బాగుండునని పద్మ యనుకొనినది. "నీకేమికావలెను ? దాసీని పిలుతునా ?" అని సుధీంద్రడనెను. "వలదు. ఎవరును వలదు. మన మిరువుర మొంటరిగ నుండిన సంతసింతును" అని పద్మ యవమానముతో ననెను. ఆమె నేత్రములందును చర్యలందు నానాడుట్టిపడుచున్న ప్రేమవెల్లువ సుధీంద్రుని కిదివరకెన్నడును గోచరించలేదు. "పద్మా, నీవిట్లు మాట్లాడక యున్న నేనెట్లు భరింపగలను" అన్నాడు సుధీంద్రుడు.

"మీరు నన్ను ప్రేమింతురా ?" అని కన్నీరుకార్చుచు పద్మ యనెను.

"నేడీ విపరీతమేమి? నేను నిన్ను ప్రేమించని దెన్నడు ? నీవులేని నాజీవితము వ్యర్థముగ తలంచుచుంటినే !"

"కాలము గడిచినకొలది ప్రేమ క్షీణించుచుండును."

"పిచ్చిదానా, కాలము గడిచినకొలది సంసారముపై మమకారముపెచ్చు పెరుగునని యెరుగవు కాబోలు. వృద్ధాప్యము వచ్చుసరికి ప్రపంచమంతయు ప్రళయాగ్నిలో మునిగిపోయినను, తాను, తన కుటుంబము బాగుండిన చాలునని మానవుడు తలంచునని యెరుగవు కాబోలు."

పద్మ నేత్రములలో నపరిమితమగు విచారము గన్పట్టినది ఆమె యింకను మాట్లాడ నుద్దేశించినది. విచారము యవమానము తన నావహించిన, తన్నింకను ప్రేమింపగల్గునా యని భర్తను ప్రశ్నింప దలచెను. కాని యావమానమధికమైనది ప్రపంచమంతయు శూన్యముగ కన్పించినది ఆలోచనా పరంపరలలో సర్వమును మరచిపోయినది. ఎవరయినను వచ్చి "కాంతి కాళీచరణుడు నీ సమీపమున గాల్చి చంపివేయబడెనని" తెల్పినచో నదియొక క్రొత్త సమాచారముగ కన్పించెడిది. తన పాపము తన రహస్యము తనను వెంటాడుచున్నవని యామెకింతవరకును జ్ఞాపకములేదు. రాత్రి యొంటరి పాటున చెట్లనడుమ నేల నిలవవలయునో, రాత్రి జరిగిన మరంతము నేల ముందుగనే గ్రహించలేకపోయెనో యామెకు దురూహ్యమైనది. ఆమె కనులను మూసినది. ఈశ్వర ధ్యానము, మరణింపవలెనను కోరిక యీ రెండును తప్ప మరేమియు నామె హృదయమును

సందు కన్పట్టుటలేదు. వెలుపల పక్షులు కలకలారావములు చేయుచున్నవి. మబ్బు విడిపోవుచున్నది. ఆమెకు స్వస్థత కలుగ నారంభించినది. శవ మింకను గడ్డిదుబ్బుపై బడియున్న దేమో యను యాలోచన కలిగెను. దయాదాక్షిణ్యములకు నిలయమైన రాత్రి, యంధకారము, నిశ్శబ్దత, గత విషయములైనవి. నాడేమి దురంతములు చేకూరనున్నవో! కాళీచరణుని విషయము మొదట నెవరు కనిపెట్టుదురు? ఈ సమాచార మెట్లు వ్యాపించును? ఇవియే యామె యాలోచనలు. సూర్యోదయమే కాకున్న యెంత బాగుండెడి దనిపించినది. గంటలు గంటలు దొరలిపోవ నారంభించినవి.

ఇంతలో సుధీంద్రుడు పరుగెత్తుకొని వచ్చి "పద్మా సేవకులు గోరంతలు కొండతలుచేసి చెప్పెదురనే భయముచే, నేనే స్వయముగ వచ్చితిని. మన యావరణములో గొప్ప ప్రమాదము సంభవించినది. నీవు భయపడవలసిన యగత్య మేమియును లేదు" అనెను.

"ఏమి సంభవించినది."

"నాకే యింకను తెలియదు. ఎవరికో గాయము తగిలియుండ వచ్చును."

శాంత యచట కేతెంచినది. తన సోదరి వ్యాధిగ్రస్తయై యున్నదని యూహించి కలవరపడజొచ్చెను. సేవకు డొకడగుదెంచి "మన యావరణద్వారముయొద్ద నెవరో హత్యచేయబడిరి" అని విన్నవించెను.

"ఎవరు చంపబడిరి." యని శాంత ప్రశ్నించెను.

"ఎవరో కాళీచరణ బాబని చెప్పుకొనుచున్నారు. పోలీసువారు వచ్చువరకును శవమచటనే యుండునట." ఇంతకంటె తెలియ పరచవలసిన దేమియు లేనందున సేవకుడు వెడలి పోయెను. సుధీంద్ర బాబు తాను నిర్మించుకొనిన విధానము శిథిలమైనదని తెలిసికొని చేయునదిలేక మూర్ఛిల్లిన పద్మ కుపచారము చేయుచుండెను.

## —♦ ఇరువది రెండవ ప్రకరణము ♦—

## విచారణ.

నాడు ఉదయం పది గంటలకు పోలీసు యినస్పెక్టరు నరేంద్రబాబు సుధీంద్రరాయలు శశిభూషణుడును శవము ప్రక్కను నిలబడి సంభాషించుకొనుచుండిరి. కొలది దూరములో నిరువురు రక్షకభటులు నిలబడియుండిరి. "ఇది గొప్ప హత్య. రొమ్ము కాల్చివేయబడినది." అని పోలీసు యినస్పెక్టరు నొక్కి చెప్పెను. "అవును. ఇది దారుణ హత్యయే. మా యింట నున్న శశిభూషణుని సోదరుడు. ఏ దుర్మార్గులీ యకృత్యమున కొడిగట్టుకొనిరో" యని సుధీంద్రుడనెను.

"అదియే మనము పరిశోధించి కనుగొనవలసియున్నది." యని నరేంద్రబాబనుచు శవమును సమీపమున నున్న పాకలోనికి జేర్పించెను. శవమునుతీసి స్థలమును పరీక్షించగా చుట్టును రెండు మూడు గజములవరకక్కడక్కడ నెత్తురుబొట్లు గడ్డిదుబ్బుపై కన్పించినవి. తన యింటి యావరణమునం దిదివరకెన్నడు నిట్టి ఘోరము జరిగియుండనందున సుధీంద్రుని విచారమునకు మేరలేకుండెను. "ద్రవ్యము నపహరించుటకే హత్య కావింప

బడినదా ? కారణము దురూహ్యముగనున్నదే ” యని సుధీంద్రుడా నరేంద్రబాబుతో ననెను. శవము మీదనున్న కోటు జేబులను పరీక్షించి చూడగా నాలు గైదు వందల రూప్యములవిలువ గల కరెన్సీనోట్లు కన్పించెను “ నిజముగ దర్శివ్యాపారణమునకే యైనచో నీ నోట్లేల యుండును ” అని నరేంద్రబాబు తర్కించెను.

సుధీం:- ఎవరీ హత్య కావించి యుందురు? కారణమేమై యుండును? ఎవరీతనిని కుక్కవలె నిట్లు చంపి పడవేసిరి?

నరేం:- మన మీ విషయము నంతను పరిశోధింతము. (రక్షకభటులుంతో) మీ రీ యావరణమును కలియ వెతకుడు. హత్యకు సంబంధించిన పరికరమేదియైన కన్పింప వచ్చును.

సుధీం:- చాల విచారకరమగు సంగతి జరిగినది. భయంకర కృత్యము సంభవించినది. శశిభూషణుని సోదరుడే కాళీచరణుడు. ఎవ రైనను పిట్టలను కాల్చుచుండగా ప్రమాదమున నీతనికి తగిలినదేమో ?

నరేం:- అంతయును త్వరలోనే తెలియగలదు.

రక్షకభటులు యావరణము నంతను కలియ వెతకిరి. పిస్తోలో, రివాల్వరో కన్పడునని యూహించిరి. కాని యట్టిదేదియును జరుగలేదు. ఒక కాగితపుముక్కగాని, చినిగిపోయిన కవరు గాని, ఆఖరుకు ఒక కత్తిగాని, ఏమి కన్పించ లేదు. రక్షకభటులు నిరాశపడిరి. ఏ వస్తువు నైనను కనుగొనినయెడల, తమ యధికారి తమ యెడ సంతృప్తిచెందునని యూహించిరి. ఏస్వల్ప వస్తువునైనను కనుగొనగల్గినచో మాట దక్కునని మరల వెతుక నారంభించిరి. అతి నెమ్మదిగ వెతకుచుండిరిగాని, అక్కడక్కడ కొన్ని నెత్తురు బొట్లుతక్క మరేమియు కన్పించ లేదు. నిరాశతో వెతుకుట మానివేయదలచు చుండగా, గేటుకావల ప్రక్క ఒక యుంగరము పడియుండుటను గాంచి దానిని గైకొని వెంటనే తమ యధికార వశము చేసిరి. “ ఈ హత్యలో జాల రహస్య మిమిడియున్నది. మరింత శ్రద్ధతో పని చేయవలసియున్నది ” అని నరేంద్రబాబనుకొనెను. సమీపముననున్న సుధీంద్రుడు కాని శశిభూషణుడు కాని యీ యుంగరము యొక్క యుదంతమును చూచి యుండలేదు.

శశిభూషణుడు కాళీచరణుని శవము ప్రక్క నిలబడి కన్నీరు విడచెను. ఇదివరకు కాళీచరణునిపై దనకు ప్రేమ లేకపోవుటయే కాక, యాతని మోటుదనమున కసహ్యించుకొని యుండెనని శశిభూషణునికి దెలియకపోలేదు. ఇపుడాతని లోపములను మరచిపోయి, శవమువంక తదేక దృష్టితో జూచుచు నిలబడెను. ఒకరి పెంపకముక్రింద నొక గృహమునందే వారిరువురును పెరిగిరి.

నరేం:- శశిభూషణ మహాశయా, మీకు వ్రాసిన ఉత్తరములలో కాళీచరణబాబు వసంతవిలాసమునకు రానున్నట్లు దెలుపలేదా ?

శశి:- లేదు అతనిలో కొలది దినములక్రింద నేదియో గొప్పమార్పు కలిగినది ఆమార్పు వలన మాతల్లికిగూడ కష్టము కలిగినది. ఎక్కడనుండియో తనకపరిమిత ధనము

రానున్నదని, తానొక గొప్ప జీవితమును గడుపనున్నానని చెప్పుచుండెడివాడు. దుబారాఖర్చు చేయుటయేగాక, నిత్య మాతని జేబులలో వందలకొలది ధన ముండుచువచ్చుటచే మాతల్లి భయపడుచుండెడిది. యీవిషయమును గుఱించి మాతల్లి వారం రోజులకిందట మాత్రమే నాకొక జాబు వ్రాసియున్నది.

నరేం;- అయితే యిక్కడి కెందుకొరకొచ్చినది తెలియదన్నమాట.

శశి;- మీకెంత తెలుసునో నాకునంతయే తెలుసును.

నరేం;- ఈహత్య ఎంగులకు గావింపబడినదో మీరు సూచించగలరా

శశి;- నేనే సూచనను కావింపలేను. అంతయు నాశ్చర్యకరముగ నున్నది.

నరేం:- మీసోదరుని యొక్క జేబులలో నీవస్తువులను కనుగొంటిని వాటిని జూడుము

(1) గడియారము గొలుసు (2) అయిదు వందల రూపాయలు కరెన్సీనోట్లు (3) ఒక డైరీ (4) కలకత్తాలో పూటకూళ్ళ బిల్లు (5) కాశీనగర ముకు రైలు టిక్కెట్టు (6) విరిగిపోయిన ఉంగరము

శశి;- ఇవన్నియు నాసోదరుని కెట్లు లభించినవో నాకే యాశ్చర్యముగనున్నది. వీటినన్నిటిని కలిగియుండు నంతటి భాగ్యవంతుడు కాడు.

నరేం;- అదే మో కాని ద్రవ్యాపహరణము మాత్ర మీహత్యకు కారణము కాదు.

శశి;- ఇంతవరకే వాడును మాతల్లి యొద్ద నూరు రూపాయలు లేనేలేవు. నాసోదరునికింత ద్రవ్య మెట్లు లభించినదో నేనూహించలేను

నరేం;- కేసు పూర్తికాయగుసరికి నన్నియు తెలియగలవు.

నరేంద్రబాబు కాళీచరణుని వస్తువులను శశిభూషనునకు చూపియుండెనే కాని తాను డైరీ పుస్తకంలో కనుగొనిన కాగితపు ముక్కనుగాని దానిపయి నున్న "పద్మరహస్యము" అను మాటలనుకాని చూపించియుండలేదు. శశిభూషణుడు సుధీంద్రుని వద్దను సెలవు గైకొని తన తల్లిని గొనివచ్చుటకు భావనగరమునకు జనియెను.



# మహారాష్ట్ర స్వాతంత్ర్యము.

హరనాథ వసు ప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది.

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.

జహా:— ఆహా! రాజారంగనాథుని ధర్మపత్ని యనాథయుంబోలె యడవుల పాలయ్యెనా! ఏమి న్యాయము!

రంగ:- నన్ను రాజాయని పిలువవలదు. కారణ మేమన?

సీ॥ పూర్వార్జితంబైన • భూమిని గోల్పోయి
జనకమంటిన పరదే • శమ్ము వదలి
తండ్రి తాతలనాటి • ధనమును రాజ్యమున్
శత్రురాజులకర్ప • ణమ్మొనర్చి
జాతి గౌరవమును • జన్మభూ భక్తియుం
బ్రేమ భావమ్మును • పెరికివైచి
స్వాత్మ ధర్మంబుల • గంగలోపలఁ గల్పి
మొగిలాయి ప్రభువుల • ముంగు నిల్చి

ధనములఁ బడసిన సైనిక • జనులకెల్ల
వంగి వంగి సలాములఁ • బెట్టుచున్న
నేను పశువుఁ డను గాక • మానవుడనై
ఎట్లు చెల్లును నాకు మ • హీశ పదము॥

రాణిగారూ! క్షమింపుము. నాయందిప్పుడు మానవత్వమే లేదు. కేవలము మొగలాయిల దాసానుదాసుఁడను. నేనిప్పుడు లజ్జ, అసహ్యము, అవమానము మొదలగువానిని విసర్జించితిని. ఈ హృదయమునఁ బ్రేమయను నేమో జ్ఞప్తిలేదు. నాకిప్పుడు కావలసినది రాజ్యము. అటుపిమ్మట భార్య నన్వేషింపవచ్చును. ప్రేమ నుపాసింపవచ్చును.

(సర్జూబాయి ప్రవేశము.)

జహా:- సర్జూ! ఏమిటువచ్చితివి?

సర్జూ:- తాము శిరోభారముచే బాధపడుచుండిరని మెల్లఁగ చూడవచ్చితిని.

జహా:- తగ్గిపోయినది. నీవేగుము.

(సర్జూ నిష్క్రమించును.)

రంగ:- (తనలో) ఎంతచక్కదనము? ఈ సౌందర్యవతి హైందవ నారీమణివలె నున్నది. రంగమహాలున కేలవచ్చెనో?

జహా:. అదేమి? ముఖము వైవర్ణ్యముఁ జెందినది. ఆలోచించుచున్నారు. ఏమైన భ్రమకల్గెనా?

రంగ:- ఏమియును లేదు. ఒక్క ప్రశ్నము నడుగుటకు సెలవిత్తురా?

జహా:- నిర్భయముగ నడుగవచ్చును.

రంగ:- ఆమె యెవ్వరు?

జహా:- ఎవ్వరినిగురించి మీరడుగుచుంటిరి?

రంగ:- మీకడ కిప్పుడు వచ్చి వెడలిపోయిన వనిత,

జహా:- ఆమె నాసేవకురాలు. పేరు సర్జూబాయి. మిమ్ముల నిట్టి యపాయకరమైన ప్రదేశమునకుఁ బిలిపించుట కొక కారణమున్నది.

రంగ.- ఆమె హైందవ యువతివలెనున్నది.

జహా:- నిశ్చయమే నిష్కపట స్వభావము కలది.

(తిరిగి నర్జూబాయి ప్రవేశము)

రంగ:- ఏమి యీ జగన్మోహన సౌందర్యము.

నర్జూ:- రాజకుమారీ! ఉదయపురీ బేగము సాహెబావారు తమకు సలామని మనవి చేయుమన్నారు.

జహ:- రాజాసాహెబ్! నేను వెళ్ళుచుంటిని. నర్జూ మిమ్ములను బంపివేయగలదు.

(నిష్క్రమణము)

నర్జూ:- (తనలో) ప్రాణేశ్వరునిరూప మెంతయో మారినది. నావంక నిట్లు నిదానించి చూచుటంజేసి యీదాసిని మరచియుండరని తలంతును. కాని యీచూపులలో నర్థమేమి? మోహమా? క్రోధమా? లేక ప్రేమయా?

రంగ:- రెండు ప్రశ్నముల నడుగవచ్చునా?

నర్జూ:- వచింపుడు

రంగ:- నీవు హిందూవనితవై యుండియు మొగలుల రంగమహాలున కేల యరుదెంచితివి?

నర్జూ:- మీరు హిందువులయ్యు మొగలాయీ చక్రవర్తియొక్క కొల్వున కేల యరుదెంచిరి?

రంగ:- అన్యాయముగ రాజ్యమునుండి తొలగింపఁబడితిని. న్యాయసంగతమైన స్వాధికారమును దిరిగి సంపాదించుకొనుటకై యిట కరుదెంచితిని.

నర్జూ:- నేను నట్లే నారాజ్యమునుండి బలాత్కారముగ బహిష్కృతనైతిని. అందుకే నేనీ--

రంగ:- మీరెవ్వరైన మహారాజుల దేవేరులా?

నర్జూ:- భర్త యాదరణమునకుఁ బ్రేమకును బాత్రమైన ప్రతివనితయు రాజదేవేరితో సమానురాలే. అది లేనప్పుడు చక్రవర్తి భార్యయైనను నిర్భాగ్యురాలే. ప్రస్తుతము నే నట్టివారలలో నొకతెను. దేశదిమ్మరిని దరిద్రురాలను.

రంగ:- ఇట్టి కల్పవృక్ష కుసుమమున నాదరణ మొనర్చి దుమ్ములోఁ గలపిన యా పాపాత్ముఁ డెవఁడు?

నర్జూ:- (తనలో) ప్రాణేశ్వరునకు నాపై దయ పుట్టి యుండ లేదు? (ప్రకాశము) మీరట్టివారుకారని తలంతును. కాని మిమ్మొక్కటడుగ వచ్చునా?

రంగ:- అడుగ వచ్చును.

నర్జూ:- మీరు రాజ్యకాంక్షచే స్వజాతి విరోధులైన మొగలాయీల నాశ్రయించితిరి గదా మీ రీ మాత్రము కృతార్థత నంది యున్నారు?

రంగ:- లేదు. నీచహృదయుఁడైన—విలాసలంపటుఁడైన యొక మహమ్మదీయ సేనానాయకుని యుపేక్షచే ఫలసిద్ధి కాలేదు. ఆ ఖాసింఖానుఁడు ఒక్కమాఱు పోరాఁడినచో—

నర్జూ:- ఏమేమీ! ఖాసింఖానుఁడు పోరాడునా? ఒక్క హిందూరాజును సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టుటఁ మహమ్మదీయుఁడు పోరాడునా? ఇంత పరాపేక్షయా! నీయందున్న క్షత్రియత్వమే మైనది? నీబాహువుల యందలి దార్ఢ్యము ఏ గంగలోఁ గలిసెను. మహారాష్ట్రుల జన్మస్వత్వమైన ధైర్యసాహసాదు లేమూలజేరినవి!

రంగ:- ఒంటి వగు నాబల సాహసాదు లేమక్కరకు వచ్చును? సాహాయ్యశూన్యుఁడనైన నేను-కేవల మీ విశ్వమున-నొక్కఁడను.

# ఆంధ్ర భారతి

## మచిలీపట్టణము

సంపుటము ౩ | ఫిబ్రవరి 1928 | సంచిక ౧౧




## ఆత్మవంచన:—

మానవజీవితము కడు విచిత్రమైనది. ప్రజాహిత జీవితమునందుగాని, స్వవిషయమునందుగాని మానవుడొకే పరిణామమును బొందుచున్నాడు. నాగరికత మానవున కుగ్గుపాలునై యున్నది. అట్టిమానవున కాత్మవంచన దోహదమొనంగుచున్నదనుట నిర్వివాదాంశము. దేశమునందంతటను బహిష్కారపు కేకలు జాతీయవాదుల కర్ణపుటములను సోకుచుండ, సయిమను సంఘమునకు స్వాగత ధ్వనులే గోచరించుచుండును. పవిత్రమైన హిందుగృహము లభ్యమైనదని యొనానొక మానవు డువ్విళ్ళూరుచుండ, సంసారమువంటి నీచవస్తువు లేదని మరియొక డనుకొనును. చేయునదిలేక స్త్రీకి లొంగిపోయెనని ప్రజ లనుకొనుచుండ, మానవుడు గృహమునకు స్త్రీయే యజమానురాలుగనుక స్త్రీకి (రాష్ట్రీయ స్వాతంత్ర్యమిచ్చితి'నని వాదించుకొనుచున్నాడు. ఇటువంటి తత్వమునకు మూలము ఆత్మవంచన. పదగుంభనము, సమర్థనము దీనికి ప్రధాన పరికరములు. ప్రపంచ మంతయు నుమియుచుండ వచ్చును, భార్యాపుత్రాదులు మోసగించుచుండ వచ్చును, తాను తప్పు చేయుచున్నట్లు అంతరాత్మ పీడింపవచ్చును. ఇన్నిటికిని ఆత్మవంచన లేనిదే మానవుడు సంచరింపలేకున్నాడు. సత్యమునే నమ్ముకున్నవాని కటువంటి సందర్భములో నాత్మ హత్యయో, సన్యాసాశ్రమ స్వీకరణమో తప్పదు. ఈ పరిణామమే మరియొక పరిస్థితిలో బిల్లికి చెరలాట మెలుకకు ప్రాణపోకడను కలుగజేయుచున్నది. సత్యాసత్యములకు న్యాయాన్యాయములకు, హింసాహింసలకు నిత్యము జరుగు సంఘర్షణ మిందుమూలమున వ్యక్తమగుచున్నది. ఒకనికి వినోద మొడగూర్చునది మరియొకనికి సంతాపహేతువగును. ఆత్మగౌరవమునకు భంగములేక నీరెంటికిని సమన్వయము కుదుర్చుటలో ధైర్యసాహసములను వీడక పని చేయువాడే కృతకృత్యుడు.

## సైమను కమిషను:—

ఈ సంవత్సరము హిందుదేశ రాజకీయ పరిస్థితులు ప్రోత్సాహకరముగ ప్రారంభమైనవి.

సైమను కమిషన్ వారు హిందు దేశమున గాలిడిరి. దేశమంతయు దుఃఖ సూచకముగ హరతాళమును జరిపి కృతకృత్యత జెందినది. శాసన సభలు స్థానిక సంస్థలు ఆత్మగౌరవము గల ప్రజాహిత సంస్థలు బహిష్కారము నామోదించి హరతాళమును జయప్రదముగ కొనసాగించుటలో నొకదాని నొకటి మించుచున్నవి. సర్ జాన్ సైమను హిందు దేశమున గాలిడి యొక ప్రకటన గావించి ప్రజలను మభ్యపరచుటకు గారడి చేసి యుంచెను. తమ సంఘమునందు ఏడుగురు సభ్యులకు నెట్టి పాక్షిక భావములు లేవట! హిందు దేశ శాసనసభవారు పంపు యేడుగురు ప్రతినిధులకును తమతో సమానస్థానము కలదట! తమ నివేదిక పార్లమెంటునకును, భారతదేశ ప్రతినిధుల నివేదిక ఢిల్లీ శాసనసభలకును,యుద్దేశింపబడినవట! భారతీయులు కోరుచో వారి నివేదికను తమ నివేదికకనుబంధముగ జేర్చుట కభ్యంతరము లేదట. ఎవరైనను కోరుచో వారిసాక్ష్యమును రహస్యముగ దీసికొనుటకు తమ కధికారము కలదట. ఈ ప్రకటనలు గోరుచుట్టుపై రోకటిపోటువలె భారతీయ నాయకులకు దగిలి వారి నందర నైక్యపరచి బహిష్కారోద్యమమునకు దోహద మొసంగినది.

## అసెంబ్లీ తీర్మానము:—

సామ్రాజ్య శాసనసభలో బహిష్కార తీర్మానము చర్చకు వచ్చినపుడు కమిషన్ సభ్యులు హాజరై యుండినచో దేశమునందుగల యసంతుష్టి, ప్రభుత్వపక్షము వహించిన సర్ జుల్ఫికర్ ఆలీఖాన్, కె. సి. రాయిగార్ల దురవస్థ వ్యక్తమయ్యెడిది. బ్రిటిషు అధికారులయొక్క ఆత్మసంతుష్టి తుత్తునియలైనది. ప్రభుత్వమువారు జాతీయవాదుల నెదుర్కొనుటలో వినియోగించని మార్గములేదు. సామదాన భేద దండోపాయంబులన్నియు వ్యర్థములైనవి. సర్ బేసిల్ బ్లాకెట్ గారి పొగడ్తలు బెదరింపులు, హోమ్ మెంబరగు క్రిరార్ గారి గారడీలు నిరుపయోగములైనవి. దేశభక్తికినివ్యక్తి యావేశమునకును, బుద్ధిసూక్ష్మతకును వర్ణవిద్వేషమునకును, ఆదర్శమునకును ఆచరణమునకును, అపార్థములు గల్పింపబడినవి. మహమ్మదాలీ జిన్నాగారు తమ బుద్ధికుశలతచేతను చాకచక్యముచేతను రాజకీయ పరిజ్ఞానముచేతను చీలిపోయిన కొందరి సభ్యులను బహిష్కార వాదమునకు ద్రిప్పివేసిరి. లాలా లజపతిరాయి పండిత మదనమోహన మాలవ్యా, గోస్వామి, మోతీలాల్ నెహ్రూగార్ల యుపన్యాసములు భావగర్భితములై సభికులలో పట్టుదల నినుమడించినవి. అరవైయెనిమిదివోట్లు బహిష్కారపక్షము వారికిని అరవైరెండువోట్లు స్వాగతపక్షము వారికిని వచ్చుటచే బహిష్కార తీర్మాన మామోదింపబడినది.

ఈక్రింది సంఖ్యలను గమనించిన యెడల యెస్సెంబ్లీ ఓటుయొక్క ఉత్కృష్టత తెలియగలదు. యూరపియనులును క్రైస్తవులును వారి తాబేదారులగు ఉద్యోగస్థులును ప్రభుత్వమువారిచే నామినేట్ చేయబడిన సభ్యులును ప్రభుత్వమువారి కనుకూలముగ ఓటు నిచ్చుటలో నాశ్చర్యము లేదు. కార్మికుల తరపున నామినేట్ చేయబడిన శ్రీ యన్. యం. జోషీ

గారు మాత్రము బహిష్కారమున కనుకూల ముగ వోటు నిచ్చి తమ యాత్మ గౌరవమును కాపాడుకొనిరి. మహమ్మదీయ వోట్లుమాత్రము కొంచె మించుమించు నిరువైపుల సమాన ముగ నున్నవి. దేశములోపలుకు బడి లేక కేవలము బిరుదులకొరకును ఉద్యోగముల కొరకును ఆశపడు ముసల్మానులు మాత్రమే ప్రభుత్వ పక్షమునకు తిరిగిపోయిరి.

| | అనుకూలురు. | వ్యతిరేకులు. |
|---|---|---|
| హాజరైనవారిలో:- | | |
| ఐరోపియనులు ఉద్యోగస్థులు | | |
| సహా | | 30 |
| క్రైస్తవులు నామినేటెడ్ | | 1 |
| భిన్నజాతులు ,, | | 1 |
| హిందువులు ఎన్నుకొబడిన | | |
| వారు నామినేటెడ్ మెంబర్లు | 54 | 7 |
| మహమ్మదీయులు నామినేటెడ్ | | |
| ఎన్నుకొబడినవారు | 14 | 14 |
| ఉద్యోగస్థులు | | 9 |
| | 68 | 62 |
| హాజరుకానివారిలో:- | | |
| హిందువులు | 6 | |
| ముసల్మానులు | 5 | |
| తటస్థులు | | 2 |
| | 79 | 64 |

## ప్రగల్భములు:—

దేశమంతయు నేకగ్రీవముగ బహిష్కారమునకు గడంగినపుడు ప్రభుత్వమువారు తమ కనుకూలవ... ...క సంస్థలను సృష్టించి ఆసంస్థలలో ...ధులు లేకున్నను, అసలు సభ్యులే యున్నను, లేకున్నను ఆహ్వానములను సృష్టించక పోలేదు. ఈ యాహ్వానములయొక్క బూటకము వారికి గోచరింపకనుపోలేదు. కాని పరదేశములను, ఇతర స్వాతంత్ర్య జాతులను మోసగించి హిందుదేశమునకు తాముమహోపకారము చేయుచుండుటచేతనే తమ కీయాహ్వానములు వచ్చినవని ఘంటాపదముగ చాటనున్నారు. వీటియొక్క బూటకతనమును బహిరంగపరచుచు, తమగదిలో గోడలమీద నీమూడు వందల యాహ్వానపు తంతుల నంటించుకొని సంతుష్టిచెందుడని సైమన్ గారిని గోస్వామిగారు కోరుటలో నాశ్చర్యము లేదు. ఎటుచూచినను బహిష్కార ప్రతిధ్వనులనే కమిషనువారు గాంచుచున్నారు. పాపము, వీరు మీరట్టునకు రహస్యముగ పోయి యిద్దరు శాసన సభ్యులకు కబురు పంపినపుడు వారు నిరాకరించియుండిరి. అట్టిసందర్భములో వారికి గలిగిన పరితాపమును పాఠకులే యూహించుకొనగలరు. కాశీ నగరములో వీరికి గలిగిన బహిష్కారమును అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరియే నిష్పక్షపాతముగ వివరించియున్నాడు "సైమనుగారు తమస్వదేశమునకు మరలిపోవుడు" అను కాగితములు గోడల కంటింపబడినవి. వీరు స్టేషనులలో దిగునపుడు తెల్లటోపీలు, ఎఱ్ఱటోపీలు, పచ్చటోపీలు బుట్ట తలపాగలు తప్ప మరియొకటి గోచరము కాదు. శాసనసభయొక్క బహిష్కార తీర్మానము ఆరువోట్ల యధికముచే నంగీకరింపబడిన మాత్రమున చాలదట. తమకు చాల యోర్పు, సుహృదయము, ఉపకారబుద్ధి యుండుటచేతనే అసెంబ్లీ తీర్మానమునకు నిరుత్సాహపడుటలేదని సైమనుగారు ప్రకటించియున్నారు. వీరి ప్రకటన బ్రిటిషు అధికారుల కఠినహృదయము

మును చాటుచున్నదిగాని స్వాతంత్ర్య ప్రసాదాభిలాష యేకోశమునఁదును గానుపించదు. ఇందులో నాశ్చర్యమును లేదు. లేసిమొదల 8 వేల మైళ్ళ దూరములోనున్న స్వల్ప సంఖ్యాకులగు బ్రిటిషువారు 32 కోట్ల ప్రజగల భారతదేశము నెట్లు పరిపాలింపగలరు. చిత్తరంజన్‌దాసుయొక్క పవిత్ర జీవితముచే ప్రసిద్ధిచెందిన వంగదేశమునందలి విద్యాలయములతో కమిషనువారు మన యాంధ్రదేశమున గాలిడిరి.

## ఆంధ్రదేశము:—

ఆంధ్రదేశమున "సైమనుగారూ, తిరిగి పొండి" అను కేకలు మారుమ్రోగినవి. అసహాయోద్యమ దినములలో ముందంజవైచిన గుంటూరు మండలమున సయిమను కమిషనువారు సంచారముచేసి యచట నేమియు లేదని నివేదింప దలచుకొని యుండవచ్చును. గుంటూరు జిల్లాబోర్డును సమావేశపరచ గావించిన ప్రయత్నము విఫలమైనది. ఒంగోలు గుంటూరు తాలూకా బోర్డులు బహిష్కారమును జయప్రదముగ జరిపినవి. గుంటూరు హైస్కూలు మూసివేయబడినది. క్రైస్తవుల యాజమాన్యమున నిర్వహింపబడుచున్న కళాశాలయును, జిల్లా విద్యాసంఘమును సయిమను కూటమును సందర్శించినవి. నిమ్నజాతులను, కొన్ని స్థానిక సంస్థలను సయిమను కమిషనువారు సందర్శించి "బ్రిటిష్ పరిపాలన యెట్టిలాభములను గలుగజేసినది" అని ఉబ్బి తబ్బిబ్బులైరి. వీరి సంచారములో నిమ్నజాతులను జేరతీయు ప్రయత్నములు కన్పించుచున్నవి. నిమ్నజాతులను చేరదీసి తమ పరిపాలనను సుఖముగ కొనసాగించుటకు బ్రిటిష్‌వారు ఉద్దేశించి యున్నారని మనకు తెలియకపోలేదు. జిల్లాబోర్డు కోరం కొరకొక్కదినము మెంబరుగనుండిన కలెక్టరు డక్‌గారు గుంటూరునుండి విశాఖపట్టణమునకు మార్చబడిరి. మొత్తముమీద గుంటూరు మండలమున జరిగిన సంపూర్ణ హరతాళము ఆంధ్రదేశమునకు వన్నె దెచ్చిన దనవచ్చును.

## మదరాసు:—

నేడు గుంటూరునుండి సయిమను కమిషను వారు మదరాసునకు పోయెదరు. అచట హరతాళము జరుగు సూచనలు లేవు. నాయకులలో కట్టుదిట్టములు సాధనము లేవు. ప్రభుత్వము వారొనగిన 144 సెక్షను ననుసరించియే తాము సంపూర్ణ హరతాళము గావించినట్లు ప్రభుత్వము వారు గుర్తించిరనియు, నిక హరతాళ మవసరము లేదనియు నాయకులు కాంగ్రెసువర్కింగు కమిటీవారు ప్రకటించిరి. ఇదియంతయు నిటు సత్యమూర్తిగారి యొక్కయు, నటు శ్రీనివాస అయ్యంగారియొక్కయు న్యాయవాది తత్వమును స్పష్టపరచుచున్న దనుటకు సందేహము లేదు.

# రథసప్తమి

శ్రీమతి రాజేశ్వరి.
( ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనము. )

అక్షీణద్రుత సంచరన్నిజ రథైకారూఢిఁ బ్రాచీదిశా
దాక్షిణ్యాంతముఁ జేరినాఁడ విక నౌత్తర్యాంతమున్ జేరుటే
సుత్రాణోచిత ధర్మమౌఁ గనుకఁ దేజోవార్నిధీ! వెన్కకున్
దాక్షిణ్యంబున నీరథంబుపయి మోదంబొందుచున్ బోవుమా॥ 1.

ఆదిత్యుండవు నీవు, నే నబలఁ జుమ్మా! యేమి యర్పింపఁగాఁ
బోనున్ ?– స్వల్పరథంబె నీకిడితి నామోదంబునన్; గాన తీ
వ్రోదంచద్గతి వీడి, మందగమనం బొక్కింత పాటించి, యె
ట్లో దీనన్ వసియించి యింకఁ జనరాదో ? దివ్యతేజోనిధీ॥ 2.

ముత్తెంపుఁ దెలినిగ్గు క్రొత్తముగ్గులయందు పసుపుం బసిఁడిరంగు మిసిమి సీన
నెలఁదేని యలచుక్క లాలికించు క్రొత్తపూవులలోని రాగంబు పొలుపునింప,
మానితోజ్జ్వల తక్షణా సీకములలోన లలిత కుంకుమ రుచుల్ చెలువుఁ గులుక,
నరుణ ప్రవాళమధ్య స్ఫురన్మలయ చందనగంధ రక్తి యందంబుఁ గూర్ప

నరుణ శోభానమించిన తరుణుఁడవగు
నరుణుఁడవు గానఁ దత్కాంతిఁ బరగునట్టి
వస్తువుల నిన్ను పూజింతు భక్తియుక్తి
ధారుణీ లోకకాంతి ప్రదస్వరూప॥ 3.

బంగారు జిగిరంగులన్ జెలఁగు పత్త్రాళింబునన్ జిక్కనై
పొంగారంగల యావుపాల నిపుడే పొంగించి, నాస్వాంతము
ప్పొంగన్, బొంగలి నారగింప నిడెదన్, మోదంబు సంధిల్లఁగా
నంగీకారముతో గ్రహింపఁగదె, ప్రత్యక్ష స్వారూపోదయా॥ 4

పూజాద్రవ్య నియుక్త రక్త విభవంబుల్ భారతీయోజ్జ్వల
త్తేజోరాజిత శౌర్యవహ్నులఁ, బరాశ్శుభ్ర ప్రభల్ వారి వి
భ్రాజత్కీర్తిఁ దలంపఁజేయఁగ, నినున్ బ్రార్థించెదన్, భవ్య హిం
దూ జాతీయ జయంబుఁ గూర్పుము కృపాధుర్యుండవై, ద్యోమణీ॥

# శ్లిష్టాక్షరపదబంధము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | ■ | 5 | 6 | 7 | | 8 |
| | ■ | 9 | | | ■ | 10 | | | ■ | |
| 11 | 12 | ■ | 13 | | 14 | | | ■ | 15 | |
| 16 | | 17 | ■ | 18 | | | ■ | 19 | | |
| 20 | | | 21 | ■ | | ■ | 22 | | | |
| ■ | ■ | 23 | | | ■ | 24 | | | ■ | ■ |
| 25 | 26 | | | ■ | 27 | ■ | 28 | | 29 | 30 |
| 31 | | | ■ | 32 | | 33 | ■ | 34 | | |
| 35 | | ■ | 36 | | | | 37 | ■ | 38 | |
| | ■ | 39 | | | ■ | 40 | | 41 | ■ | |
| 42 | | | | | ■ | 43 | | | | |

అడ్డము (Horizontal.)

1. పర్వతము.
5. వేదము.
9. ఆ ధ్రికవి.
10. ఒక రాజ్యము.
11. అగ్రము.
13. ఔషధవిశేషము.
15. కామము.
16. నాలుక
18. పొల్లు.
19. స్కంధము.
21. చిల్లగింజ.
22. అనారోగ్యము.
23. కత్తి.
24. గోష్ఠ సభ.
25. మాయావి.
28. వస్త్రవిశేషము.
31. సంఖ్యలు.
33. ఒక వృత్తము
34. బల్లి.
35. ముత్యము.
36. వెలితి.
38. వృత్తాంతము.
39. తీక్ష్ణధార.
40. ఆంజనేయుడు.
42. క్రూరము.
43. పొగడచెట్టు.

నిలువు (Vertical.)

1. భీముడు.
2. కొట్టు.
3. ఒక పక్షి.
4. గ్రామోద్యోగి.
5. ముష్కరము.
6. సౌఖ్యము.
7. అక్షిత్ర.
8. దంతిచెట్టు.
12. రోగము.
14. ..............గాపు కర్త్యలకు ధరించు యోంగద తారహారములే.
15. కడుందుకేగ,

17. కార్యము.
19. వ్యాకరణపదము.
21. ఒకానొక కవి.
22. జీతము.
25. కోతి.
26. కానిక.
27. నలుపు.
29. [illegible] చీకటి.
30. కదలునది.
32. వ్యాప్తము.
33. దండన.
36. ప్రాత చెప్పు.
37. కాకము.
39. కాల్వ.
41. కీలు తిరుగుడు చీల

## 2 అక్షరన్యాసము.

నాకు పదునాలుగు అక్షరములు.

14+12= మహారాజు తల్లి.
6+7 = నెపము
1+3+8= నిరాకరింపకూడనిది.
2+4+14= లోహము.
9+12+3= వడ్రంగి పనిముట్టు.
10+3+14= హిమాలయ పర్వతములలో దొరకు వస్తువు.
4+1+3= కుట్టేపురుగు.
3+5+12+14= రాసులలో నొకటి.
2+12+1= కాలప్రమాణము.

నన్ను ముప్పదిమూడు కోట్లు భారతీయులు పూజిస్తారు. నే నెవరు ?

# తమాషాలు

### క్రియా విశేషణము.

ఒక యుపాధ్యాయుడు ఇంగ్లీషు వ్యాకరణమున క్రియా విశేషణమును బోధించుటకు చాల అవస్థలుపడెను. అయినను పిల్లలకు బుర్రకెక్కలేదు. చివరకు ఉపాధ్యాయుడు విసిగి చివర ly ఉన్నట్లయితే అది క్రియా విశేషణమని గుర్తుపెట్టుకోండి.

ఒక విద్యార్థి:– అయితే "తిరుచినాపల్లి" క్రియా విశేషణమేనాండీ.

### వినయం.

బాలిక:– మనం బియ్యం వండుతుంటామే, అన్నం వండటమంటారేమిటండీ. అన్నాన్ని వండుతున్నామా?

మాష్టరు:– పెద్దవాళ్ళ నట్లా అడగొచ్చా? తప్పుకాదూ?

### తమాషా.

ఒకడు: మీ తమాషాలలో తమాషా లేదేమండీ?

మరియొకడు:– అదో తమాషా.

### పేరు.

ఒకరు:– ఏమండీ! మీవూళ్ళో రామారావుగారున్నారు చూడండీ, ఆయన పేరు రామారావుగారేనాండీ?

మరియొకరు:– వారా? రామారావుగారు గాదు భీమారావుగారు.

### తారీఖు.

"ఇవ్వాళ తారీకెంతండీ?"
"తారీఖా? నిన్నెంత?"

# చిత్తకుబ్జ

శ్రీ శివశంకరశాస్త్రిగారు.

ఎన్ని మార్గముల న్నిరంతర
మెంత సాధన చేయు చున్నను
పోవకున్నది వక్రగమనము
బుద్ధి యందుండి॥

కుబ్జ నీ వొకమారు ప్రీతిని
గ్రుచ్చి కౌగిట జేర్చినంతనె
వదలిపోయిన దంట ఆరూప
వక్రిమము కృష్ణా !॥

ఎల్లవేళలయందు నీకై
యెదురు చూచుచు నున్న, దేవుడి
చిత్తకుబ్జను నీదుకౌగిట
జేర్తువో కృష్ణా !॥

సాహితీసమితి. గుంటూరు.



# అదృష్టం

మునిమాణిక్యం వెంకటనర్సింహారావుగారు (సాహితీసమితి)

అంకితము:— స్నేహితుడు కొమరగిరి నరసింహారావుకు.

"శాస్త్రీ అయినా తాగకుండా ఏమిటండీ పాత పుస్తకాలు తిరగవేస్తూ కూర్చున్నారు. పుణ్యమా పురుషార్థమా! నాలుగురాళ్ళు సంపాదించే మార్గమేమయిన చూడండి." అని కాంతం అన్నది "ఆమాట నిజమే" అని నేను అనుకొన్నాను.

అనుకొంటూనే నా డయిరీ పేజీ తరువాత పేజీ తిరగవేశాను. మదరాసులో నేనున్నప్పుడు వ్రాసినవి విజయనగరములో సంగతులూ ఎన్నో కనిపించినవి. నావిచిత్ర అనుభవాలన్నీ చదువుకొని నాలో నేను నవ్వుకొన్నాను. పాతస్నేహితులు స్నేహాలూ జ్ఞాపకమునకు వచ్చినవి. ఇంకా పేజీలు తిరుగవేశాను. ఇంతలో డైరీ చివరకు వచ్చినాను. అక్కడ ఒకచోట,

"104, సంబంధ మొదలియారు వీధి తిరువక్కేళి" అని వ్రాసియున్నది. దానిక్రింద ఎర్ర గీత గీసి వున్నది.

ఆ చిరునామా ఎవరిదో నాకు ఎంతసేపటికి జ్ఞాపకం రాలేదు. జ్ఞాపకశక్తిని ఎంత త్రవ్వినా అవిమయమై ఏమీ స్ఫురణకు రాలేదు. ఇక ఏమై యుంటుందా అని ఊహించడం మొదలుపెట్టాను.

ప్రథమమున నాకు ఎవరో ప్రియస్నేహితుడు తన చిరునామా ఇచ్చి నన్ను అప్పుడప్పుడు చూస్తూ ఉండమని చెప్పి ఉంటాడని, తోచింది. పాపము అతడు నాకోసం ఎంతో కాలము నిరీక్షించి చివరకు విసికిపోయి ఉంటాడు. అతనికి ఎంత మనఃక్లేశము తెచ్చిపెట్టానా అని విచారపడ్డాను. తక్షణం వెళ్ళి అతనిని దర్శనం చేయటం నాకర్తవ్యము అని నిశ్చయించుకొన్నాను.

ఏరయిలు బండిలోనో నాటకశాలవద్దనో పరిచయము కలిగిన సుకుమారియొక్క చిరునామా యేమో అన్న తలంపు ఇంతలో నా తలలో తళుక్కు మన్నది. అప్రయత్నంగా నాశరీరం పులకరించినది. నేత్రములలోకి నూతన కళ ప్రవేశించినది. చిరునవ్వు పెదవులపయిన చిగిర్చినది. చెక్కిళ్ళపయిన చిరుచెమ్మటలు పోసినవి. నిమిషంలోకి మెట్లు అన్ని ఎక్కి విరహావస్థలో పదో మెట్టుపై నుంచున్నాను. నాలిక కొరుక్కొని ఎంత పొరపాటు జరిగిందిరా బాబూ అనుకొన్నాను. "రేపు సాయంత్రం వచ్చి నిన్ను కలుసుకొంటాను" అని బహుశః నేను ఆమెతో వాగ్దానం చేసి వుంటాను. ఆమె నాకోసం నిరీక్షించి నిరీక్షించి నిరాశ చెందినది కాబోలు.

"ఒంటి గూర్చున్న వేళ
ప్రేమపుం దలపు రెక్కల విప్పి మొగసి
తెలిసి తెలియని వింత సీమల యథేచ్ఛ
సంచరించుచు దరహాసచంద్రికలను
జిలుకు చెలికాని యౌవన కళల వెలుగు
మధుర మోహన మూర్తిని మది లిఖించు
కొనుచు నుందువు కాబోలు."

అని నాలో నేను కూనురాగంతీస్తూ పాడుకొన్నాను.

లేకపోతే ఇది కాగూడదూ? ఎవరయినా పబ్లిషరు నాకు ఏదయినా పని ఇస్తాను రమ్మని పిలిచి ఉండకూడదూ? ఇదే అయి యుంటుంది.

ఎట్టి ముఖ్య విషయాన్ని మరచిపోయినాను ఏదో పుస్తకమో కథో వ్రాసి యిస్తే నాకు ఏ వందరూపాయలో యిచ్చేడివాడు కదా! ఆ పయికం పెట్టి శాంతానికి ఒక సరుకో పిల్లకు ఒక నగో చేయించే వాడినిగదా! ఇంతకూ ప్రాప్తం లేదు. ప్రాప్తంలేనపుడు అట్లాముంచుకొని వస్తుంది మరుపురోగం అని ఆత్మదూషణ చేసుకొన్నాను.

ఇంతకు ఏదీ తేలలేదు. ఆవిషయాన్ని గురించి ఆలోచించిన కొద్దీ ఆందోళన యెక్కువైనది. నిజము యేమిటో కనుక్కోవలెనని ఉత్సాహం కలిగింది.

ఆలోచించినకొద్దీ ఆవిషయం మరీ గంభీరమైంది. ఈమహాపట్టణంలో ఒకమూల ఎక్కడో ఒకయిల్లు. ఆయింట్లో యెవరున్నారో నాకు తెలియదు, నేను అక్కడికి పోవలెను. చాలు. ఈ విషయంతో అపరాధపరిశోధనా నవలను నడపవచ్చును.

అపరాధము, పరిశోధన అన్న రెండుమాటలు అనుకునేసరికి హత్యలు భయానకములగు కృత్యములు, భయంకరములగు దృశ్యములు, వికృతరూపములు, శోణితధారలు జ్ఞాపకమునకు వచ్చినవి. ఏడ్పులు, పెడబొబ్బలు, మెరపులు, మేఘగర్జనలు వినిపించినవి. భయంతో శరీరం వణికింది.

కవి అన్నాడు. "ఎడతెగని జలమంట. నడుమనో పడవంట." అల్లాగే విశాల ప్రపంచంలో ఒకయిల్లు, అది నేను కనుక్కోవటం. ఇంత భయంకరమైన విషయాన్ని గూర్చి తలపోస్తుంటే వళ్ళు వణకదూ? వణుకుతుందా హృదయం శి[illegible]మై పోతుందా? అనుభవము వున్నవాళ్ళకు తెలుస్తుంది ఆయింట్లో దయ్యాలు వుండవచ్చు. అవినన్ను పీక్కుతినవచ్చు.

భవిష్యత్తులో యేముందో యెవరు దూరి చూచి చెప్పగలరు. ఆయింట్లో యేమి వింతలు వున్నవో, ధనం దొరకకూడదా, వజ్రాలగని వుండకూడదా అని మళ్ళీ యింకో ఆలోచన. ఆరాత్రి యేపని చేయటానికి నాకు తోచలేదు, ధైర్యం లేదు. భోజనం చేసినతరువాత కాంతం తాంబూలం తెచ్చింది.

ఆవిడతో మాట్లాడటానికి నాకు మనస్కరించ లేదు. ఏదో ఆలోచనలోకి దిగాను. మాంటిక్రిస్టో కథ, అమీనాకథ, అల్లావుద్దీను కథ జ్ఞాపకం వచ్చినవి. వసారాలో మా కాంతం సుబ్బమ్మ మాట్లాడుతున్నారు.

"వజ్రం దొరికిందట ఆయనకు"

"ఎక్కడమ్మా?"

"ఊరివెలుపల పాడుబడ్డ యింట్లోకి ఆయన యెందుకోవెళితే అక్కడ మెరుస్తూకనిపించింది"

"అదృష్టం. ఎంతవెల వుంటుంది."

"నల్భై వేలు అంటున్నారు!"

అని యేమిటో మాట్లాడు కొంటున్నారు. నిద్రవచ్చీరాని స్థితిలో నాకీమాటలు వినిపించినవి. లెక్కలేని వూహలు నా మనోవీధిని నృత్యంచేసినవి.

చొక్కా కోటూ వేసుకొని బయలుదేరాను. వీధిలో టాక్సి సిద్ధంగావుంది, త్వరగా అందులో యెక్కి యింటి నెంబరు వీధి చెప్పినాను. ఆగకుండ వాయువేగంతో వీథులవెంటపోయి గమ్యస్థానము చేరినది.

టాక్సి ఆగింది. నేను దిగి తలుపు తట్టినాను. లోపలనుంచి యేదో మూలుగు మందంగా వినిపించినది. మళ్ళీ తలుపు కొట్టాను. "ఎవరువారు" అని యెవరో అన్నారు. కంఠము

హీనముగాను, కంపిస్తూను వున్నది కాబట్టి ఆమె రోగి అని నే ననుకొన్నాను.

ఇంతలో లోపలినుంచి ఒక వికృతస్వరూపం మూడు కాళ్ళ ముసలిది వచ్చి నన్ను చూచి "నాయినా, వచ్చావు? నిన్ను చూడాలనే యిన్నాళ్ళు ప్రాణాలు బిగబట్టుకొని వున్నాను మా నౌకరూ నీకు అడ్రెసు యిచ్చి యెన్నాళ్ళ యింది. ఇంతకాలము రాలేదేమి నాయినా" అన్నది. నేను మాట్లాడలేదు. మళ్ళీ ఆమె "నాయినా, మాట్లాడవేమి. నేనునీకు మేనత్తను నన్ను నీవు యెరుగవు. మీమామ పరాయి దేశాలలో వుండి ధనము సంపాదించి చనిపోయి నాడు. నాకూ అవసాన కాలము సమీపించి బ్రతుకనని నీకోసం కబురంపినాను. ఇప్పటికి వచ్చినావు."

"నాయినా, మాట్లాడలేను ఇవిగో తాళపు చెవులు" అని ధనపు పెట్టెల తాళాలు నాకిచ్చి ఆమె ప్రాణాలు విడిచింది.

నేను ధనవంతుణ్ని అయినాను. పిల్లజమీం దారును. సంతోషము పట్టలేక పోయాను. వాకిట్లో అప్పుడే వచ్చిన మోటారుబండి చప్పుడుకు మెళుకువ వచ్చింది.

ధనము దొరకటం స్వప్నానుభవము అయినా అది సుస్వప్నంగదా అని సంతోషము గలిగింది. కాలకృత్యాలు తీర్చుకొని బయలు దేరాను. నిజంగా, ఆ ఇంటికి వెళ్ళాను.

ఆ కలలో కనిపించిన ఇల్లె! ఇంతవరకు కల నిజము అయింది. మిగతాది ఎందుకు నిజం కాగూడదు? ఎన్ని కలలు నిజం కావటం లేదూ. దీవకర్ణి తనకు కొడుకు దొరుకుతాడని కల గనలేదూ?

అయినా ఏమో ధన ప్రాప్తి ఉన్నదో, మిత్రదర్శన మయ్యే యోగం ఉందో, లేక ఒక లావణ్యరాసి పాణిపల్లవముల గ్రహించి స్పర్శ సౌఖ్యము ననుభవించు మహా యోగం ఉన్నదో ఎవరు చెప్పగలరు అనుకొన్నాను.

లోపలికి పోయి కుర్చీలో కూర్చున్నాను. యజమాని పది నిమిషాలలో వస్తానన్నాడని కబురు వచ్చింది.

ఆయన వచ్చినాడు. నాకు పరిచయుడే. నా ప్రక్కన కూర్చుని కొన్ని కుశల ప్రశ్నలు వేసిన తరువాత, "ఏమోయి, ఎన్ని రోజులకు వచ్చినావోయి. మూడు రోజులలో యిస్తానని ముప్పది రూపాయలు పుచ్చుకొని చిరునామా కూడ వ్రాసికొని మూడు నెలలైన తరువాత యిప్పుడా రావటం – బాగావున్నది నీమర్యాద, తెల్లపోతావేమి. ఇపుడు నీదగ్గర లేకపోతే నానౌకరిని నీవెంట పంపుతాను. ఇంటికి తీసుకొనిపోయి పైకం ఇయ్యి" అన్నాడు

నౌకరిని పిలిచి, – "ఏమోయి వీరితో వెళ్లి మన కివ్వవలసిన పైకం తీసుకురా" అని చెప్పి "సెలవు" అని నాతో అని లోపలికివెళ్ళాడు

"ఎట్టి నిరాశ! ఆశౌన్నత్యము! అపతనము! చెప్పటం ఎందుకు. ఇంటి దగ్గర పైకం లేదు. ఆమాట చెపితే వాడు వినలేదు. శనిగ్రహం లాగ నన్ను పట్టుకొన్నాడు. సిరి అంటక పోయినా ఈచీడ అంటింది. చివరకు జేబులో నుంచి కలం కాగితం తీసి నోటు వ్రాసి ఇచ్చి, ఇంటికి వెళ్ళిపోయినాను.

ఇంటి దగ్గర చేసి సిద్ధంగా ఉంచిన కాఫీ కొంచెం కొంచెం త్రాగుతూ జరిగిన విషయాన్ని తలచుకొని కాసేపు నవ్వుకొన్నాను.

# విభ్రాంతి

పరిమళాంచితమైన
పట్టు రోజా పూవలె
పచ్చిక బయిళ్ళలో
పదము లిడుచు నడచు
చున్నదో యున్నట్లు
చూపులకు దోచగను
ఒయ్యారముగ నీవు
వాహ్యాళి సేగుచును
సాయంత్న సమయాల
సాలోకితముగాగ
సంఫుల్ల హృదిలోన
సంతోష మందితిని. 1.

వెన్నెలల్ నీముద్దు
కన్నులనుండియే
ప్రవహించు చున్నట్లు
పరితుష్టి దోచంగ
నీల జీమూతములె
నీదు గిరజాలుగా*
ఆకల్పమున దోచ
ఆనంద మందితిని 2.

శూన్య దృష్టితో నీవు
చూడగా నావంక
తేరిన సలిలమున
నా రూపమున్నట్లు
ఆ తరళ నయనముల
కగుపించె నారూపు 3.

నీదు దర్శనమ్మునక్
నిబిడాంధకారమయు
నిర్వీర్య జీవనము
నిర్వృత్తి నందినది 4

వికసించి వానవల్
నెద జల్లు విరులెల్ల
తమ శక్తి నెరుగకే
భ్రమియించునో యేమొ
అటులనే నీవును
ఆత్మ మోహనశక్తి
ఆలోచనే లేక
అలరు చున్నావు 5.

నా హృదంతరమునక్
నవ్యముగ పొడసూపె
రోచిరుచ్యాలమైన
రూప తృష్ణమెకాదు
తెలియ నట్టిది ఎదో
దివ్య సంగీతమ్ము
పులకింప మేనెల్ల
తిలకించితిని నేను 6.

ఎవరి తోడనో యీవు
ఎపు పల్కుచుండగా
మృదు మధుర పదములు
మృదులమ్ముగ బల్కినవి
నవభావ భరమైన
నా హృదివివరమ్ముచే 7.

సంతసమునక్ స్వేచ్ఛ నొసగెడి
నీదు జాతికి జయము కలుగుత
నిర్మలమ్మగు జాతిం బుట్టిన
నిఖిల తేజోరత్నము! 8

* గిరజాలు, ఆంగ్లో యిండియన్ రమణీమణియొక్క Bobbed hair.

నిన్ను
ఎందుచేతనో గాని
ఎచటికేగితో గాని

ఆనాడు గాంచనైతిగ
అంతలోననె అంధకారము
ఆవరించెను చిఱుత హృదయము
అన్ని దిక్కులు శూన్యముగను
అగుపడియె నపుడు 9.

నీ వెవరో నేనెఱుగ
నీ వెఱుగ నేనెవరో
ఏల నీ చీకటుల్
ఈరీతి గ్రమ్మెనో!
ఎచటనో యుదయించి
ఎట్టులో కలిసెను
ఆ నవ్వు అంధకా
రాంతరాళమ్మునగ 10

నిర్మలాకాశమున
నిరవధిక తేజమున
తరళత్వ జూపట్టు
తారవలె నున్నట్టి
నీ రూపు, నీ చూపు
నిర్మలానందమున
భావనా లోకమున
పలుసారు లెంచితిని. 11.

ఆవృతమ్మైన హృద
యాంధకారమ్మునకు
కారణం బదియేమొ
కనిపించదాయెగ. 12.

దూరాన గలయట్టి
తులలేని తారపై
భ్రమయేల అని నేను
భావింప; అప్పుడే
అంధకారములోన
మెఱమెచ్చు మెరపొకటి
మెరసిపోయినది 13.

"సోదరా! క్షేమమా!
సొమ్మసిల్లెదవేమి
సాగయికగ పోవుదము రమ్మా!
మీరూహన్న మర్మముల్
మా జాతిలో లేవు
మనసార స్వేచ్ఛగా
మన కడ్డులేకుండ
ప్రేమించుకోవచ్చు మనము"
అని పల్కె నారూపు
హస్తచాలన జేసి;
అంతలో స్మృతివచ్చె నాకు. 14.



# శుక్రవారము

కలగర సుబ్బారావుచౌదరిగారు.

అది శుక్రవారము. సూర్యోదయమై ఎంతో సేపు కాలేదు. రాజమండ్రిలో ఒక మేడమీది గదిలో ఉత్తరంపట్టుకొని సోఫాపయిని అనసూయ కూర్చుని వున్నది. ఆమె లలాటభాగము ముడుతలుపడి ఏదియో ఆలోచిస్తున్నట్టు సూచిస్తున్నది. ఆమె కన్నుల కాటుక చారలక్రింద విచారరేఖలు లీలగా గోచరిస్తున్నవి. కన్నీరు ఆమె చెక్కుటద్దములను మ్లానమొనర్చుతున్నది. ఆమె విషాదవదనాన్ని సూర్యకిరణాలు కిటికీలోనుంచి ముద్దాడుతున్నవి.

ఆమె హృదయము భావనాసముద్ర తరంగాలపైన తేలియాడుతున్నది. ఆమె కెంతమాత్రము మనస్స్థిమితముగాలేదు. సందిగ్ధావస్థలో నున్నది. ఏమిచెయ్యడానికీ తోచడంలేదు. ఆమె విడుచు వేడి ఊర్పుగాడ్పులకు ఆమెకావి మోవి వాడిపోతున్నది. ఆమె హృదయాన్ని సారెసారెకు తెలుపరానిది ఏదో బాధ బాధిస్తున్నది. ఆమె పడేబాధకు ప్రతిఫలం లేదని ఆమెకు తెలుసు. ఆమె స్వతంత్రకాదు. తండ్రిమాట యెప్పుడూ జవదాటియెరుగదు. లజ్జాభరాన్ని ఆమె హృదయంలో తొలకరించిన కోర్కెను తండ్రికి తెలియజేయలేక లోలోపలే కుళ్ళిపోతున్నది. ఆమె విధిచెయిదాలను దాటడం కష్టసాధ్యమని చివరకు నిశ్చయించుకొన్నది.

సత్యనారాయణకు ఏకపుత్రికావిషయం అవడంవల్ల అనసూయను కడు గారాబముతో పువ్వులలో పెట్టి పెంచుతున్నాడు. అనసూయ బాల్యావస్థలో వుండగానే తల్లి కాలంచేసింది. సత్యనారాయణ కూతురుని చూచుకొని దుఃఖంఅంతా దిగమింగుకొన్నాడు. ఆమెకు తండ్రే సర్వమును. ఆమెకు యెప్పటికేది కావలసినా తల్లిలేని లోపం లేకుండా తత్క్షణం సమకూరుస్తుండేవాడు.

సత్యనారాయణ సాంప్రదాయంగల వంశంలోనే పుట్టాడు. అతని తండ్రి చరస్థిరాస్తులను సంపాదించి అతని జీవితాన్ని సుఖప్రదాయకంగా చేసి చనిపోయాడు. సత్యనారాయణకు ఏకోశమందూ గర్వం అనుమాటలేదు. ఇప్పటి ధనవంతుల్లాగ ధనమదంచేత విర్రవీగే స్వభావం గలవాడు కాడు. రాజమండ్రి ఆప్రాంతాల పల్లెటూళ్ళల్లో ఇతని ధర్మగుణం తీగలపారింది. పేరుమోసిన మోతుబరి.

తండ్రికున్న సుగుణాలన్నీ అనసూయకున్నవి. ఇంటికివచ్చిన ముష్టివాండ్రకు లేదనడం ఎన్నడూలేదు. "మంచిమహాలక్ష్మి" అని పొగడేవారు. ఆమెకిప్పుడే పదహారో సంవత్సరం ప్రవేశించింది ఆమె కాటుక కళ్ళలో యవ్వనం తొడసూపింది. ఆమె హృదయంలో ప్రేమ తొలకుతోంది. తాను ధనవంతురాలను అనే గర్వం ఆమె కెన్నడూలేదు. ఆమె హృదయం గభీరం. ఆమె ప్రకృతి విచిత్ర ప్రకృతి, సాధారణ మానవులకు అర్థంకాదు.

## 2

అది వర్షాకాలము. ఆకాశాన్ని అక్కడక్కడ అల్లుకున్న మబ్బులగుండా సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అనసూయ తెల్లనిజిలుగుపావడాకట్టుకొని మోటారుకారులో ఎక్కి స్కూలుకు వెళ్ళుతున్నది. బడికి వెళ్ళేదారిలో ఆమెకళ్లను ఒక యువకుడు ఆకర్షించాడు. అతనిపేరు ప్రకాశరావు. అతనిది పేదసంసారము, మర్యాదగల వంశము. అతని పూర్వీకులు ధనలక్ష్మిని తమ కనుసన్నల చేత ఆడించినవారే. వారిలో ఒకడు తనకుమాలిన ధర్మం చెయ్యడంవల్ల ధనం చంచలం అవడంచేత ప్రకాశరావు బీదస్థితిలో వుండడానికి కారణంఅయింది. ధనలోభం చేత స్కూలుఫయినలువరకే చదివి మానివేయవలసి వొచ్చింది.

ఇన్నీసుపేట పోస్టుఆఫీసులో ముప్పైఅయిదు రూపాయల గుమాస్తాపని చేస్తున్నాడు. ముసలితల్లి ఇద్దరుచెల్లెళ్లు ఇతని కాయకష్టంమీదే ఆధారపడి వున్నారు. ఇతని కొచ్చేడబ్బు సంసారానికే కాకుండా తండ్రిచేసిన అప్పుకూడ తీరుస్తుండవలసి వొచ్చింది, తల్లి జబ్బుశరీరముగలది చెల్లెళ్లు పెద్దవారై పెళ్లిళ్లులేక ఇంట్లోనే వున్నారు. వరశుల్కం లేందే పిల్లలందంగా వున్నా విద్యావినయాది గుణాలచేత విలసిల్లుతున్నా ఈకాలంలో ముందుకొచ్చి పెళ్ళిచేసుకునే మహానుభావు లెవరున్నారు. అందుచేతే ఆడపిల్లలను కన్న తలిదండ్రులు మనోవ్యాధిచేత అల్లాడిపోయి అధోగతిపాలవుతున్నారు.

ప్రకాశరావుకు ఇరవైయేళ్ళ వయస్సు. నిరాడంబర జీవి. మనస్సు నిబ్బరత, విజ్ఞానంలేక అంధకారకూపంలో ఈదులాడే వాళ్ళవంటివాడు కాడు — మోహపాశబద్ధులై విచక్షణా జ్ఞానంలేక బడికిపోయే ముగ్ధబాలికల

వెంటనంటి నవ్వులపాలయ్యే వాళ్ళలో చేరడు—ఘోరాచారాలచేత అల్లుకొనివున్న సంఘాన్ని ఎంతమాత్రం దరిచేరే లక్షణంగలవాడు కాడు. ప్రకాశరావు హృదయం నిర్మలం. అతనికన్నులు దయాదాక్షిణ్యాలను చాటుతుంటవి. అతనివదనము అమాయకత్వాన్ని సూచిస్తుంది. అనవసర కార్యాలలో ఎంతమాత్రం ప్రవేశించడు. అతనిదారి అతనిది. ఇరుగుపొరుగువాండ్రచేత తనపై అధికారులచేత ఇంతమంచివాడు లేడనిపించుకున్నాడు.

## 3

శుక్రవారమునాడు ప్రకాశరావు ఆఫీసుకు వెళ్ళుతు అనసూయను చూచాడు. అప్పుడు అనసూయ హృదయం అతనిదే అవుతుందని అతని హృదయంలో యెప్పుడూ ప్రొద్దుపొడవలేదు. అంత అదృష్టం పట్టుతుందని కలలో అయినా తలంచలేదు.

అనసూయ మహాదైశ్వర్యవంతుని కూతురు. తల్లిదండ్రులచేత అల్లారుముద్దుగా పెంచబడినది. సాంప్రదాయం గొప్పది. అంతులేని సంపత్తికి ఆమె ఒక్కతే అధికారిణి. ప్రకాశరావో కడు బీదవాడు. ముప్పైఅయిదు రూపాయలతో గుడిగుంచం లాడుతున్నాడు. పూరిగుడిసెలో కాపురము. సౌఖ్యజీవితము — తుచ్ఛజీవితము. మల్లెపువ్వు — ముండ్లకంప.

ప్రకాశరావుకు ఆశుక్రవారం శుభదినమేం అయివుండొచ్చు. అదికాన్నే అనసూయ అందమైనవదనాన్ని చూచి ఆనందించడం తటస్థించింది. అంతటి సౌందర్యరాశిని ముందెన్నడూ చూడలేదు. పరస్త్రీలను చూడడం అతనిస్వభావం కాకపోయినప్పటికి అతనికళ్ళు అనసూయ ముఖపద్మంమీద అతనికి తెలియకుండా వ్రాలాయి. వాటిని మరల్చుకోవడం అతనికి కష్టసాధ్యం అయిపోయింది అంతటి అందమూర్తి లోకంలో నిజంగావుందా అనుకున్నాడు. అతనికళ్ళని అతనే నమ్మలేకపోయాడు. ఒక్కనిమిషం ప్రపంచాన్ని మరచిపోయాడు. లోకంఅంతా సౌఖ్యప్రదంగా కనిపించింది. ఆమె మోహనమూర్తి అతనికళ్ళకు కట్టినట్టుండేది. ప్రకాశరావు దివ్యాకారాన్ని అనసూయ క్రీగంటినవ్వుతో చూచింది. వారిద్దరి చూపులు యేదో రహస్యాన్ని మాటాడుకొన్నాయి. ప్రకాశరావుకు ఆక్షణం ఎంతమధురం! వ్యాకులహృదయంతో ప్రకాశరావు ఆఫీసుకు చేరుకున్నాడు. అతని హృదయం అతనిలోలేదు. అతని హృదయంలో ఆశారహితాలయిన కోర్కెలు బుడగల్లాగు ఎన్నో పుట్టాయి ఆఫీసులో మతిమరపువల్ల చాల తప్పుచేశాడు. అధికార్ల దూషణని ఎంతమాత్రం లెక్కచేయలేదు. మెల్లిగా సాయంకాలానికి ఇంటికి జేరుకున్నాడు. వచ్చేదారిలో హృదయాన్ని గాలించిన మూర్తినే తలచుకుంటూ సకలం మరిచిపోయాడు. ఎందరు పలకరించినా పలకలేదు. వెఱ్ఱివాడిలా ఇల్లుకూడ దాటిపోతుండగా చిట్టిచెల్లెలు పిలవడంచేత స్పృహకువచ్చి తనఅవస్థ తలచుకొని సిగ్గుపడి లోపలకు వచ్చాడు. ఎదురుగుండావచ్చిన చెల్లెలను పలకరించకుండానే గదిలోకిపోయి పరుపుమీదపడుకుని ఆలోచనా సముద్రములో మునిగిపోయాడు అతని హృదయం తీవ్రంగా బాధపడుతున్నది. ప్రకాశరావు ప్రణయమహత్వం చవిచూస్తున్నాడు. అది తన హృదయానికి విపరీతమయిన విప్లవము తెస్తుందని భయపడుతున్నాడు.

ఆరాత్రి ప్రకాశరావు కంటిమీద రెప్పవేయలేదు. రాత్రల్లా యేడ్వడంజేత కన్నులు యెఱ్ఱబడి జేగురుముద్దలయ్యాయి. హృదయం వింతభావాలతో మండిపోతున్నట్టు నిట్టూర్పు సెగలు తెల్పుతున్నాయి.

## 4

ప్రకాశరావు మూడుమెతుకులు నోట్లోవేసుకుని తన గదిలోకిపోయి తన హృదయాన్ని అల్లకల్లోలం పెట్టుతున్నా విషయాన్నిగురించి చింతించడం మొదలుపెట్టాడు ఆ ఆలోచనలో మునిగి ప్రపంచాన్నే మరిచిపోయాడు. గదిలోవున్న గడియారం తొమ్మిదిగంటలు కొట్టి ప్రకాశరావు ఆలోచనలకు ఆటంకం కలిగించింది. అతన్ని కప్పివున్న ఊహాతెర కొంచెం సడలింది. దరిద్రవంశంలో పుట్టినందుకు తన్నుతాను నిందించుకొనుచున్నాడు. ఆఫీసుకు వేళయింది. మళ్ళీ అనసూయ దర్శనలాభం కలుగుతుందని ఉద్దేశంతో శుభ్రవస్త్రాలు ధరించి బయలుదేరాడు.

ఇదివరకు అనేకసార్లు ఆదారినే వెళుతూ ఆమెను చూచాడుకాని ఎప్పుడూ యింతగా యితని హృదయం బాధపడలేదు. అనసూయ దివ్యాకారం — ఆ జిలుగు వలువ — ఆకాంతులు జిమ్మేకళ్ళు ఆశుక్రవారంనాడు ఏముహూర్తాన్ని చూచాడోగాని అవన్నీ అతనిహృదయ ఫలకంమీద చిత్రింపబడి పోయి ఎంతకన్నీళ్లతో తుడిచివేద్దాంఅని ప్రయత్నించినా అతనికి సాధ్యంకావడంలేదు.

అతని ఇంటికిని ఆఫీసుకును అరమైలుదూరమున్నది. సగందూరం నడిచి వెళ్లేటప్పటికి ఎదురుగా మోటారుకారు వస్తున్నట్టు కనబడింది. అతని బాధా హృదయం

కొంచెం శాంతించింది. అతని హృదయం అతనిలోనే నాట్యమాడింది. ఆకారుదగ్గరకు వచ్చినకొద్దీ అతనిగుండె అతివేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. కారు సమీపించింది. ప్రకాశరావు హృదయాన్ని ఆకర్షించిన దివ్యమూర్తి అందులో వున్నది. ఆమెకళ్లు ఎవరికోసమో వెదుకుతున్నట్టు కనబడుతున్నవి. నిన్నటికంటె ప్రకాశరావుకి అనసూయ మోహన మనోజ్ఞమూర్తిగా కనుపించింది.

ప్రకాశరావుని చూడగానే అనసూయ హృదయం పులకరించిపోయింది. ఉదయాన్నుంచీ యెంతో ఆశతో ప్రకాశరావు అందాన్ని తనివితీర చూద్దామని వుద్దేశంతో వున్న అనసూయ అతన్ని చూడగానే సిగ్గుదొంతర్లు కమ్ముకోవడంచేత పెదమొగమయింది. ఆమె కన్నులనుండి ప్రేమదీప్తులు ప్రకాశిస్తున్నట్టు ప్రకాశరావు గ్రహించాడు. ఆమె మనసు అతనికై ఆందోళన పడుతోందని తెలుసుకోలేకపోలేదు. అతను అనసూయను చూచి దీర్ఘనిశ్వాసం విడిచిపుచ్చాడు. అది ప్రేమహృదయ అగు అనసూయ గ్రహించింది. ఇద్దరిహృదయాల్లోంచి నిశ్వాసం వెడలి శ్యామ్యావాయువులలో లీనమయిపోయింది

ప్రకాశరావు ఆఫీసుకు వెళ్లాడు. అతనిమనసుమీద అతనికిలేదు. అతని ఆఫీసు పుస్తకంలో వున్న ప్రతిఅక్షరం అనసూయ ఆకారందాల్చి అతనికండ్లకు కనబడుతుంది ఆఫీసులోని అగుమాస్తాలని చూచి చాల అసహ్యించుకున్నాడు. ఈదాసత్వం చేసి తుచ్ఛజీవనం గడపడంకంటె అనసూయ పాదపద్మాలని ఆశ్రయించుకొని నిద్రాహారాలు మాని జీవించడం శుభప్రదం అనుకున్నాడు.

అది శనివారం అవడంచేత రెండుగంటలకే ఆఫీసు మూసేసారు. ప్రకాశరావు బాధపడుతున్న హృదయంతోనే ఇంటికి చేరుకున్నాడు. తన అవస్థ చెల్లెళ్లకు తెలియకుండ ఉండాలని చాలప్రయత్నించాడు. వీధిగుమ్మంలో బిచ్చగాళ్లు అరుస్తుంటే రెండణాలు దానంచేశాడు. అతనిచెల్లెళ్లు అదిచూచి అన్నయ్యకు యేదో అదృష్టం పట్టిందనుకున్నారు. రెండురోజులనుంచీ పని సరిగా చేయకపోవడంచేత జీతం తగ్గించారనే సంగతి ఆముగ్ధబాలికలకు ఏమి తెలుస్తుంది!

## 5

అలంకారరహితమయిన తనగదిలో కూర్చుని ప్రకాశరావు తన హృదయాన్ని కలతపెట్టుతున్న అనసూయను గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. అతనికేమీ పాలుపోయిందిగాదు ఆ ఆలోచనకు తుద మొదలు లేదు ప్రకాశరావుకు అన్నివిషయాలు కరతలామలకమే, ఒకనిశ్వాసం పుచ్చి తన పేదతనాన్నిగురించి. ఒక కన్నీటిచుక్క రాల్చి అనసూయ గొప్పతనాన్నిగురించి యెంతో ఆలోచించాడు. చివరకి ప్రేమసామ్రాజ్యంలో పేద గొప్పకి భేదంలేదని గ్రహించాడు. ఈ వివాహాన్ని అనసూయ తండ్రి వప్పుకోడనే సంగతి అతనికి తెలుసు. ఆమెను యెందరో భాగ్యవంతులు పెళ్లిచేసుకోడానికి ఆత్రిత పడుతుంటారనీ తెలుసు. "అందరానిపండుకు అఱ్ఱులు చాచడమూ" అనుకున్నాడు. తన హృదయంలో వున్న కోర్కెను తుడిచివేయ తలుచుకున్నాడు. యెంతో సేపేడ్చాడు. ఏడ్చినకొద్దీ ఆకోర్కె నవనవలాడుతూ పయికి వాసనలు జిమ్ముతున్నది.

ప్రకాశరావు యెంతఅవస్థ పడుతున్నాడో అనసూయకూడ దానికి రెట్టింపు అవస్థపడుతున్నది. ప్రకాశరావు బీదస్థితి ఆమెకు తెలుసు. బీదతనానికి ప్రేమకీ యేకోశాన్ని సంబంధం లేదని తెలుసు. ఒకబిచ్చగానికి తననిచ్చి తండ్రి వివాహం చేస్తాడన్నమాట అసంభవం అనీ తెలుసు — అన్నీ తెలుసుకాని ప్రకాశరావుపైన వుండే కోర్కెమాత్రం మరల్చుకోలేకపోయింది.

ఎన్నో గొప్ప సంబంధాలు అనసూయకు వస్తున్నవి. సత్యనారాయణ కూతురికి తెలియజేస్తున్నాడు ఆమె యేదో సాకుచెప్పుచున్నది. సత్యనారాయణకు ఒక్కగాని ఒక్కకూతురుగనుక ఆమె ఇష్టమేఅని ఊరుకుంటున్నాడు

ప్రకాశరావు ఆలోచనకు అంతంలేదు. అతనిహృదయం ఆశానిరాశాల మధ్య వుయ్యాలలూగుతున్నది ఏమి చెయ్యడానికి తోచడంలేదు. కొంతసేపటికి హృదయం యేదో భావం పుట్టింది. అతనికళ్లకి తేజం కలిగించింది. బదలివున్న హృదయాన్ని కదలించింది. ప్రకాశరావు లేచి కాగితం కలం తీసుకుని ఒక అరగంట యేమివ్రాద్దామా అని ఆలోచించాడు. సాయంకాలం ఆరుగంటలయింది. అతని హృదయభావాలన్నీ అనసూయకు వ్యక్తపరుద్దామని వుద్దేశపడ్డాడు.

ప్రేయసీ !

నిన్నేముహూర్తాన్న చూచానోగాని ఆముహూర్తంనుంచి నాహృదయం మారిపోయింది. నాహృదయానికి రెక్కలొచ్చి క్రొత్త ప్రపంచంలోకి యెగిరిపోయింది. నిన్ను మరిచిపోదాం అని నాహృదయంమీద

చిత్రితమయి వున్న నీరూపాన్ని తుడిచివేద్దామని ఎంతో ప్రయత్నించాను. ఏడ్చాను కాని లాభంలేకపోయింది నీవు ధనవంతురాలవు నేనో నీపాదపద్మాలకి సేవచెయడానికికూడా పనికిరాని పేదవాడిని నేను నిన్ను ప్రేమ భిక్ష పెట్టుమని కోరడం "అందరాని పండుకు అర్రులు చాచడం" ప్రేమకు హెచ్చుతక్కువలు గొప్పబీదలు లేవని నీకూ తెలుసు, కాని మీతండ్రి — ధనవంతుడగు మీతండ్రి నావంటిబిచ్చగానికిచ్చి వివాహం చేస్తాడన్నమాట అసంభవంకదూ ? నక్క ఎక్కడ నాగలోకం ఎక్కడ ! అబ్బ ! నా జీవితం వ్యర్థం అయిపోయింది. నీసౌఖ్య జీవితాన్ని వ్యర్థం చేసుకోవద్దు, నన్నుగురించి నీమనసులో ఏమయినా వుంటే మరచిపోవడమే నీకు శ్రేయస్సు. నేను మాత్రం నిన్ను ప్రేమ పీఠంమీద కూర్చోబెట్టి ప్రణయ పుష్పాలతో అలంకరించి ఆరాధిస్తూ చిరునవ్వు నవ్వుతూ ప్రాణాలు విడిచేస్తా. దైవానుగ్రహం వుంటె నిన్ను ఇంకో లోకములో అయినా కలుసుకోటానికి ప్రయత్నిస్తా.

ప్రకాశరావు.

సాయంకాలము అయింది ఉత్తరం పూర్తి అయ్యేటప్పటికి. ఆ ఉత్తరాన్ని ఎన్నోసార్లు చదివి మడతపెట్టుకున్నాడు. కన్నీటితో తడిపాడు గూడాను. ఎప్పుడు ఆ ఉత్తరాన్ని అనసూయకు అందిచ్చేనామా అనే ఉద్దేశంతో రాత్రి సరిగా నిద్రపోలేదు. సూర్యోదయం కాగానే కొంచెంసేపు ఆలోచించాడు ఏమి తోచిందికాదు. ఆ ఉత్తరం పట్టుకొని తిన్నగా అనసూయ మేడదగ్గరకు వెళ్లాడు. రెండుసార్లు అటు ఇటు తిరిగాడు ఆ మేడను అంటిపెట్టుకొని వున్న పూలతోటలో పదేళ్ల పిల్ల పూలుకోస్తుండడం చూశాడు. అతని హృదయంలో ఏదో ఊహ తట్టింది. ఆపిల్లను నెమ్మదిగా తనదగ్గరకు రమ్మని పిల్చాడు ఆచిన్నపిల్ల చేతులాడించుకుంటూ గబ గబ పరుగెత్తుకుంటూ వచ్చింది. రాగానే ఆపిల్ల చేతులో ఒక అణా పెట్టాడు. ఆపిల్ల హృదయం ఆనందముతో ప్రఫుల్లం అయిపోయింది.

"ఎందుకు" అన్నది.

"ఉంచుకో" అన్నాడు.

ఆపిల్ల అణా అటూ ఇటూ త్రిప్పి చూస్తూవున్నది.

"అనసూయ ఏమిచేస్తువున్నది" అని అడిగాడు.

"జడ అల్లుకుంటున్నది. పూలుకోసుకురమ్మంది. కోసుకువెళ్తువున్నాను." అన్నది.

"ఇదిగో. చూడు. ఈ ఉత్తరం మీఅమ్మ స్నేహితురాలిచ్చింది. తీసికొనివెళ్లి ఇయ్యి. యెవ్వరికీ యివ్వక మీ అమ్మకే ఇయ్యి. ఇస్తావా ?" అన్నాడు.

"ఇస్తా" అని తలాడించింది.

"మీ అమ్మకే ఇయ్యి తప్పకుండా" అన్నాడు

ఆపిల్ల ఆఉత్తరము చేత పట్టుకొని ఆ పూలచెట్ల చాటునపడి అదృశ్యము అయిపోయింది,

ఆత్రంతో తన గదిలోకివెళ్లి ఆ ఉత్తరంవిప్పింది అనసూయ. ఆఉత్తరంతో ఒకవిధమైన ఆనందంవచ్చి ఆమె హృదయాన్ని ఆవరించింది. ఉత్తరం చివరంటా చదివింది. సంగతులు అర్థంచేసుకొన్నది. అతని బీద స్థితి— తనమీద వుండే దృఢప్రేమ— అతని దివ్యహృదయం— అన్నీ గ్రహించింది. మళ్లీచదివింది. తన హృదయాన్ని అదుముకొన్నది. కన్నులు మూసుకొన్నది తిరిగి కళ్లు తెరచేటప్పటికి కళ్లనిండా నీళ్లుకమ్మాయి

౬

పాపము. అనసూయ చాల సందిగ్ధ స్థలపాలయిపోయింది. ప్రకాశరావుమీద లగ్నమైన హృదయాన్ని మరల్చుకోవడం చాలకష్టం అనిపించింది. ప్రకాశరావుకి మనస్ఫూర్తిగా అర్పించిన హృదయాన్ని ఇంకొకరికి ఎలా అర్పిస్తుంది ? ప్రకాశరావు లేకుండా తన భావిజీవితం గడవడం దుర్లభం అనుకుంది. తన మేడకంటె ప్రకాశరావు పూరిల్లే సౌఖ్యప్రదంగా కనుపించింది. ప్రకాశరావుని గురించి యెన్నికష్టాలయినా చివరకి ప్రాణాలయిన అర్పించగలనని నిశ్చయించుకొన్నది. పవిత్రప్రేమ ఒక వంక — ప్రణయమహాత్మ్య మెఱుగని తండ్రి నిర్దయిత ఒకవంక ఆమె లేతహృదయాన్ని బాధిస్తున్నాయి,

ప్రకాశరావు ఉత్తరం ఆనందం యివ్వడానికిబదులు అనసూయ హృదయానికి తుఫాను తెచ్చిపెట్టింది. తన్ను మరచిపొమ్మని వ్రాసిన వాక్యంచదివి నిలువెల్ల వడకిపోయింది అట్లుచేయడం అసాధ్యమనుకుంది. ఒకరికి అర్పించినహృదయం ఇంకొకరికి అర్పించుటయెట్లు అనుకుంటూ దీర్ఘాలోచనలో మునిగిపోయింది.

* * * * *

సత్యనారాయణకు అనసూయ దగ్గరలేందే భోజనం చేయడం అలవాటులేదు తొమ్మిది కావచ్చినా భోజనానికి రాలేదని సత్యనారాయణ అనసూయను పిలవడానికి మేడమీదికెళ్లాడు. అనసూయ మంచంమీద బోర్లాపడుకుని వుండడం చూచాడు. అనసూయ సత్యనారాయణ వచ్చినసంగతే తెలుసుకోలేకపోయింది.

సత్యనారాయణకు కూతురి అవస్థ యేమీ అర్థంఅవలేదు చప్పుడుకాకుండా అక్కడే నుంచున్నాడు అనసూయ విడిచే నిశ్వాసాలు అతన్ని బాధిస్తున్నాయి. అనసూయ చేతిలో యేదో కాగితం కనపడింది. ఆకాగితం ఏమిటో చూద్దాం అని ఆత్రంతో నెమ్మదిగా తీసాడు స్పృహ తప్పిపడి ఉన్న అనసూయకు అది తెలియలేదు. ఆవుత్తరం పూర్తిగా చదివాడు ఆవుత్తరం అతని హృదయాన్ని అల్లకల్లోలం పరచింది. ఏదోచెప్పరాని ఆవేశం అతని హృదయంలో ప్రవేశించింది. నెమ్మదిగా తేలు కొని అనసూయ ప్రక్కనున్న తండ్రిని చూచింది. తండ్రి చేతిలో ఉత్తరాన్నిచూచింది. తండ్రి వదనం చూచింది. భయంచేత ఆమె తనూలత కంపించి పోయింది. తండ్రి కన్నులలో క్రోధరేఖలు ఆవరించుతున్నట్టు తెలుసుకొన్నది. సత్యనారాయణ మాటాడకుండా తీవ్రముగా అనసూయవదనంకేసి చూస్తున్నాడు. అలా చూస్తున్న కొద్దీ అతనికిక్రోధం హెచ్చయింది. ఆ క్రోధాన్ని స్వాధీనం చేసుకోలేకపోయాడు.

"అనూ! ఈగోలంతా ఏమిటి?" అన్నాడు.

ఆ ముగ్ధ బాలికకు ఏమిచెప్పడానికి తోచిందికాదు ఆలేత హృదయం లజ్జాభయాలతో వుడికిపోయింది. వెఱ్ఱి చూపులతో తండ్రికేసి చూస్తూ నిలబడ్డది

"అనూ!మాటాడవే దీని అర్థం ఏమిటి" అన్నాడు.

అనసూయకు జీవన్మరణ సమస్యతటస్థించింది. ఒడ్డుకు తగిలి విరిగిపోయే గోదావరీ తరంగాల్లాగ ఆమె హృదయంలోని భావాలు క్షణ క్షణానికి పుట్టి విరిగిపోతున్నాయి. ఆమె కళ్ళకు ప్రకాశరావు ఏడుస్తూ ప్రేమ భిక్ష పెట్టమన్నట్టు కనబడ్డాడు. ఆచిత్రం చూచి అనసూయలో వున్న భావాలు మరింతరేగాయి. ప్రకాశరావుమీద వున్న ప్రేమను జయించడంకష్టం అనుకున్నది దానితో ఆమె హృదయాన్ని దివ్యశక్తి ఒకటి ఆవేశించింది, ఆ ఆవేశంలోనే "దీనిఅర్థం..." అంది.

"ఆ. తెలుసు. వుత్తరంసంగతి. ఈ వ్యవహారం సంగతి యేమిటి?" అన్నాడు.

"నాన్నా! నన్ను క్షమించు. నన్ను స్వేచ్ఛగావుండనియ్యి. నేను ప్రకాశరావుని మనస్ఫూర్తిగా ప్రేమించాను. తిప్పుకుందాం అని ఎంతో ప్రయత్నించానుగాని లాభం లేకపోయింది. నన్నెందుకు అంత కోపంగా చూస్తావు. నేనేమి తప్పుచేసానని. నాహృదయం చాలా బాధపడుతోంది. నన్నొంటరిగా వదలి వెళ్ళు" అని అనసూయ పల్కింది.

"నన్నొంటరిగా వదులూ! ఆ! ఏమితప్పుచేశావా? అతన్ని ప్రేమించడమే గొప్పతప్పు. మన సాంప్రదాయం ఎక్కడ! అతని సాంప్రదాయంయెక్కడ! కాకినుక్కకి దొండపండా! నాకొక్క కూతురువు. నామర్యాదఅంతా నీమీద ఆధారం అయివుంది మనతో సమమైనవారిని పెళ్లాడినా మర్యాదలకు మర్యాద కాపాడాలిగాని యెవరో పేరులేని నిరక్షరకుక్షిని పెండ్లాడతానంటావా? మన దగ్గర పనిచెయ్యడానికి కూడ పనికొస్తాడా? సిగ్గులు చేటుకాదూ" అన్నాడు సత్యనారాయణ.

"నాన్నా! డబ్బులేనంతమాత్రాన సాంప్రదాయం మంచిది కాకపోయిందా? అతనివంటి సుగుణాలు గలవానిని ఇంకా యెక్కడా చూడవు." అని గద్గదస్వరంతో పలికింది.

కూతురు అంతధైర్యంగా చెప్పడంవల్ల కోపం ప్రజ్వరిల్లిపోయింది. ఆకోపంచేత శరీరం వణికిపోయింది నిలబడలేక కుర్చీలో చతికిలబడ్డాడు. అనసూయ హృదయావేగం సత్యనారాయణ గ్రహించాడు. ప్రకాశరావుని బాగా ప్రేమించిందనుకున్నాడు.

"ఇలాచూడు, అనూ! నామాటవిను. అతనికి మాలినవాడిని మరచిపోడానికి ప్రయత్నించు వాడికి నీకు అంతరం ఎక్కడ. నీగొప్పతనాన్నిగూర్చి ఆలోచించుకో. జరిగిందేదో జరిగిపోయింది."

"నాన్నా! మరవడం కష్టసాధ్యం. మరచిపోమని చెప్పి యిదివరకే కుమిలిపోయిన హృదయాన్ని యింకా బాధపెట్టుతున్నావు అది అన్యాయంకదూ,"

"అనూ! నీకు తగినవాడిని మనతో కులతూగేవాడిని, అందమయినవాడిని చూచాను. సంబంధం నిశ్చయం అయింది. అతన్నిచూస్తే యితనికంటె అతన్ని బాగా ప్రేమిస్తావు."

"అల్లాచేస్తానని నాబొందిలో ప్రాణం వున్నంతవరకూ అనుకోకండి" అని ఆవేశంతో పలికింది.

"ఇంతవరకూ నీకు చనువు యివ్వడంవల్ల ఇలాజరిగింది. అదినాతప్పే. నీకోసం, నీతండ్రికోసం ఈ నీచ ప్రేమ వదులుకో. పోనీ అంతగా అతన్ని ప్రేమించాలంటే సోదరుడులాగ ప్రేమించు నామాటవిను."

"సోదరుడు లాగానా! కష్టంకదు నాన్నా! నాప్రణయహృదయం అతని పాదాంకితం చేశాను! అంత ప్రేమా మరచిపోవడమే! అసాధ్యం."

"అసాధ్యమో సాధ్యమో నాకు తెలియదు. అతన్ని మరచిపో. అతనికి నీకు సంబంధం ఏమిటి?" అని

రూక్షస్వరంతో అన్నాడు.

“ నాన్నా ! న్యాయమా. ఇన్నాళ్ళనుంచి నామీద చూపించిన దయంతా నేటితో అంతరించిపోయిందా ? నీహృదయం వజ్రసన్నిభం అయిపోయిందా ? ఇంతకఠినంగా ఆజ్ఞాపించొచ్చా ? నేనేదికోరితే అది సమకూర్చే వాడివే ! ఈకోర్కె తీర్చవు ? నాప్రాణాలు కాపాడవు? నాహృదయాన్ని కంటోకనిపెట్టవు ? ” అని దీనంగా యేడ్చింది.

“ అలా పనికిరాదు. నాకు అన్నీ తెలుసు. నాకంఠంలో ప్రాణం వుండగా ఈసంబంధాన్ని వప్పుకోను. నామాట వింటేనే విన్నావు. లేకపోతే చాలా కష్టాల పాలవుతావు ఏం ! పెద్ద పెద్ద మాటలాడుతున్నావు అసలు నువ్వు ప్రేమించడం యేమిటి ? ” అని ఆవేశంతో పలికాడు.

కొంతసేపు యెవ్వరూ మాటాడలేదు. నిశ్శబ్దం అక్కడ రాజ్యంచేసింది.

## 7

“ అనూ ! నామాట విను. ఈమాట ఎవరికైనావిన్నా పడిందంటే నాపేరు ప్రతిష్టలు నిలుస్తాయా ? నాగౌరవముంటుందా ? నలుగురిలో తలెత్తుకు తిరగగలనా ? ఈసంగతి యెన్నిరూపాలు దాల్చి ప్రపంచాన్ని వ్యాపిస్తుంది నీవు చిన్నదానవు. నీకేమితెలుసు గొప్పవాని బిడ్డవై వుండి ఈ నీచఅభిప్రాయం నీకెలాకలిగింది ? తల్చుకుంటే గుండె బద్దలైపోతోందే ! ఆతుచ్ఛుణ్ణి నువ్వు ప్రేమించడం నేను భరించడమా ! అలా యెప్పటికీ జరగదు. నామాటవిను. మరచిపోడానికి ప్రయత్నించగలిగితే కొన్నిరోజుల్లో మరచిపోతావు. నిజం. మూర్ఖపు పట్టుపట్టకు. ప్రేమ యెక్కువకాలం వుండదు. పాలు పొంగులాగ మొదటకలిగినా చివరకి అంతరించిపోతుంది నామాట వినకపోతే కష్టాలపాలు చేస్తాను. నీబ్రతుకు భగ్నంఅయిపోతుంది ఇంతబ్రతుకు బ్రతికినదానవు ఇంటి వెనకాల చస్తావా ? నామాట వినకపోతే ఇంతఆస్తి నీకు దక్కనివ్వను ఒక్కదమ్మిడీఅయినా ? జాగ్రత్త.”

అనసూయ శాంతహృదయంతో విన్నది. తండ్రి యిలా చెప్తున్నకొద్దీ ప్రకాశరావుమీద ప్రేమ ఎక్కువైపోతోంది గగనంమీద అయిష్టం యిదివరకే కలిగింది ఆమాట వినేటప్పటికి తండ్రిమీద వున్న మునుపటి ప్రేమ బంధంకూడ సడలింది. ప్రకాశరావుమీది ప్రేమే ఆమె హృదయరాజ్యాన్ని పరిపాలిస్తోంది.

“ ఈ సంపత్తంతా చచ్చిపోయే టప్పుడుకూడా తీసుకువెళతామా ? నాకు ధనంతో యేమాత్రం నిమిత్తంలేదు. ధనంవుండి పారతంత్ర జీవనం చేయడంకంటె బీదతనంలో వుండి స్వేచ్ఛగా స్వతంత్రజీవనం చేయడం మంచిది కాదూ ? ” అని వుద్రేకంతో అన్నది అనసూయ.

తన తండ్రియెదుట యింత నిర్భయంగా మాట్లాడినందుకు తానే ఆశ్చర్యపడింది. తండ్రికేసి చూచింది. అతనివదనం క్రోధంచేత యెఱ్ఱబారింది. సత్యనారాయణ కూర్చున్నా కుర్చీమీదనుంచి లేచి గంభీరస్వరంతో

“ ఛీ ! వివేకహీనా ! ఏడురోజులలో నీమనోనిశ్చయాన్ని మరల్చుకోలేకపోతే నాయింట్లోంచి కట్టుబట్టలతో తరిమేస్తా. బజారులో ముష్టెత్తుకుని తిండిలేక చస్తావు జాగ్రత్త. నీ ప్రేమ వచ్చి నీకు అడ్డుపడుతుందేమో చూస్తా. తప్పకుండా చేస్తానని ఒట్టుపెట్టుకుంటున్నా ” అనిచెప్పి గిరుకున తిరిగి వెళ్ళిపోయాడు

తన తండ్రి అలా అంటాడని, అంతకఠినంగా ప్రవర్తిస్తాడని అనుకోలేదు. అనసూయ ఒట్టుపెట్టుకోవడం చూచి చాల భయపడిపోయింది. తండ్రి యిష్టప్రకారంగా ప్రకాశరావుని పెళ్లాడడం కష్టంఅనుకుంది. తండ్రి ఇదివరకు చూపించిన ప్రేమ అంతా యేమయిందా అనుకుంది.

తండ్రి వెళ్లిపోగానే అనసూయ సోఫాలో కూలబడిపోయింది. ఆమె కేమీ పాలుపోయిందికాదు. ప్రపంచంఅంతా గిర్రున తిరుగుతున్నట్టు కనిపించింది ఆమెకళ్లకి. ఆమె హృదయంలో ప్రేమబీజంనాటి రెండురోజులే అయినా గాఢంగా నాటుకుంది దానికి చలనంలేదు. బాధపడుతున్న అనసూయ హృదయాన్ని ఓదార్చేవారెవ్వరూలేరు. ఆరోజల్లా తిండిలేక అపుట్టిన ఊహాలే ఆహారంగా చేసుకుని ఆహృదయబాధతో బాధపడింది.

* * * * *

వారంరోజులలో ఆమె హృదయంమీద చిత్రింపబడివున్న ప్రకాశరావు మూర్తిని తుడిచివేయలేకపోతే — రక్తనాళాల్లో పొంగి పారుతున్న ప్రేమను మరచిపోలేకపోతే — తన జీవితం భగ్నంచేస్తానని తండ్రి చెప్పాడుగదా, తండ్రిచెప్పినట్టు చేయగలడా ? ప్రకాశరావుని మరచిపోగలదా ఆముగ్ధబాలిక ? ఆమెకు అసాధ్యం అనిపించింది. యెన్నికష్టాలయినా అనుభవించగలనుగాని ప్రకాశరావుమీది ప్రేమను మరచిపోలేను అని దృఢనిశ్చయం చేసుకొన్నది.

ఏమీ తప్పుచెయ్యందే తండ్రి అంతకష్టంగా బాధించడం సహించలేకపోయింది ఆ ప్రేమలేని హృదయాన్ని యెంత వేడుకున్నా దయగల్గడం అసంభవం అనుకున్నది. వచ్చే శుక్రవారం గడువుదినం. ఆదినాన్ని తనజీవితం యెలామారిపోతుందోఅని ఆలోచిస్తున్నది. అనసూయతో సత్యనారాయణ మాటాడడం మానేసాడు. భోజనం చేస్తుందా లేదా అని కనుక్కోవడమే మానేసాడు. గడువుపెట్టిన శుక్రవారం ఎప్పుడొస్తుందా తనమర్యాద యెక్కడ భంగమవుతుందా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు సత్యనారాయణ.

## 8

అనసూయ వుత్తరంకోసం ప్రకాశరావు ఆశాపూరితహృదయంతో యెదురుతెన్నెలు చూస్తున్నాడు. గడచిన మూడురోజులు చాల కష్టంతో గడిపాడు. అసలు అనసూయకు వుత్తరం అందిందో లేదో, అందినా తూష్ణీభావంతో తిరస్కరించిందో ప్రేమపురస్సరంగా అందుకుందో అందుకుని తనకు జవాబివ్వడానికి అంత ఆలస్యం అవడానికి కారణం యేమిటో, నిజంగా ఆమె అతన్ని ప్రేమించిందో లేదో, ఇంకా చాలా ఆలోచనలు అతని హృదయంలోంచి కలల్లాగ జరిగిపోయాయి. ఆఫీసుకు వెళ్ళుతూ ఆమెను చూద్దాంఅని చాల ప్రయత్నించాడు గాని ఆయాసలన్నీ అడియాసలయ్యాయి ఆఫీసుకు వెళ్లడం చాలకష్టంగా తోచింది. అనసూయ సుందరమూర్తి— నగుమోము— గులాబీరేకుల్లాంటి చెక్కులు అతన్ని రాత్రిళ్లు నిద్రలేకుండా చేసాయి.

అది మంగళవారము, సాయంకాలమయింది. గడువు దినానికి ఇంకా రెండుదినాలున్నాయి. ప్రకాశరావు తనఇంట్లో వరండాలో కూర్చున్నాడు. అప్పుడొక బాలుడు గబగబ ఆయాసంతో పరుగెత్తుకుంటూ వచ్చి "ప్రకాశరావుగారున్నారా?" అని అడిగాడు. "నేనే ప్రకాశరావుని" అని లేచి ఆత్రంతో వెళ్లాడు. ఆబాలుడు అటూయిటూ యెవ్వరూ లేకుండాచూచి జేబులోంచి వుత్తరం తీసియిచ్చి తక్షణం అదృశ్యం అయిపోయాడు.

ఆవుత్తరం పుచ్చుకునేటప్పుడు ప్రకాశరావు చేయి వణకింది. దానిమీదవున్నా పైవిలాసం చూచాడు. తన పేరే వ్రాయబడి వున్నది. ఆడవాళ్ళ దస్తూరిలాగుంది. "అనసూయ వుత్తరం వ్రాసిందా? అంత అదృష్టమా!" అనుకుని వుత్తరం విప్పాడు.

నిజంగా ఆవుత్తరం అనసూయదగ్గరనుంచే వచ్చింది. అతని సంతోషం ఆకాశపథాన్ని అంటుకుంది. వాడిపోతున్న మొక్కకు నీళ్ళుపోసినట్టయింది. ఆత్రంగా వ్రాసిన ఆవుత్తరాన్ని తొందరతొందరగా చదివేసాడు. అతని కళ్లవెంట నీళ్ళు చిప్పిల్లాయి. తన అవస్థ యెవరయినా చూస్తారని తనగదిలోకి వెళ్ళి మంచంమీద కూలబడ్డాడు "ఏమి! అనసూయ హృదయం యెంతగంభీరం! ఇది నిజంగా ఆమె వ్రాసిందేనా? ఇప్పుడు నేను రాజమండ్రిలో నాశిథిలగృహంలోనే వున్నానా! లేకేదయిన అద్భుతలోకంలో వున్నానా! ఆమె నిజంగా నన్ను ప్రేమించిందా! నామనస్సుని నేనే నమ్మలేకుండా వున్నానే! ఈచిత్రప్రేమ యెలాగు అంతం అవుతుందో! ఎవరికి తెలుసు" అని చింది వుత్తరం మళ్ళీచదివాడు

ప్రాణప్రియా,

నీవుత్తరం అందింది. క్రుంగిపోతున్న హృదయాన్ని లేవనెత్తింది. అడుగంటిపోయివున్న ఆశలకు నవజీవనం పోసింది. చెదిరిపోయిన ధైర్యాన్ని చిక్కబట్టింది. నేను ధన్యనయ్యాను. నాజీవితం ధన్యంఅయింది. నీవుత్తరం నాహృదయ దాహాన్ని తీర్చింది, మనోవేదన్ని పోగొట్టింది. నిన్నునే మరచిపోమని వ్రాశావు. ఎలామరచిపోవడం? అసాధ్యంకాదూ? నాహృదయం నీమీద లగ్నం అయిపోయింది. నాకంఠంలో ప్రాణంవున్నంత సేపు మరవలేను. మరవడానికి యత్నించలేనుకూడ. నీవు నాహృదయ సర్వస్వం, ధనం చంచలం. ధనంవల్ల వచ్చిన గొప్పతనం మర్యాద క్షణికంకాదూ? ప్రేమకి ఇవ్వన్నీ అడ్డంకులా? ప్రేమహృదయాలు కలిసినప్పుడు వారికళ్ళకు ధనం పూరిపుడకకన్న తక్కువగ కనుపడదూ? నీతండ్రి ఈసంబంధం ఇష్టంలేదని వ్రాసావు అదినిజమే. మనసంగతంతా మానాన్నకి తెలిసింది. నిన్ను మరచిపోమని నన్నెంతో నిర్బంధిస్తున్నాడు. నేను వప్పుకోలేను, వచ్చే శుక్రవారంలోగా నిన్ను మరచిపోకపోతే నన్ను ఇంట్లోంచి గెంటేస్తానని పట్టుపెట్టుకున్నాడు. తప్పకుండా అలాచేస్తాడు. ఇంకా రెండురోజులే వ్యవధి. ఇక నేనేమి చెయ్యను? నేను నీ నీడలాగ వుండి నీతో యెన్నికష్టాలయినా అనుభవించడానికి స్థిరపరుచుకొన్నాను. ధనం నాకు లెక్కలేదు. మనము యేమిచేసినా శుక్రవారం తెల్లారకుండా చెయ్యాలి. నువ్వు లక్ష్మివారం రాత్రి పన్నెండుగంటలకి మాతోట గుమ్మందగ్గర కలుసుకో

## 10

ప్రకాశరావుకోసం కంపితహృదయంతో ఎదురుతెన్నులు చూస్తోంది అనసూయ తోటగుమ్మందగ్గిర నుంచుని. ప్రకాశరావు రాకుండా మోసపుచ్చుతాడని ఎ తమాత్రం సందేహపడలేదు. పన్నెండుగంటలు దాటిపోయింది. వర్షం ఘోరమంటూ కురుస్తోంది. ఆచలిగాలిలో ఆనిశ్శబ్దాంధకారంలో తన ప్రేమకుసుమం సమర్పిద్దామని తన హృదయకవాటం తెరచి అనసూయ నిలుచున్నది. ఏమిఅలికిడైనా ప్రకాశరావు వస్తున్నాడుఅనుకుంటోంది. ఒళ్లంతా కళ్లుచేసుకుని ఆవర్షంలోంచి చీకటితెరలు చీల్చుకుపోయేటట్లుగా చూస్తోంది. ఎంతకీ అతడు వచ్చేజాడ కనబడలేదు. కారణం అంతకన్నా తెలియడంలేదు. కాలం గబగబ వెళ్లిపోతోంది ఎన్నటికీ తనవుద్దేశం మార్చుకోలేదు. తెల్లారిపోతే నిర్దయతోటి తన తండ్రి ఇంట్లోంచి వెళ్లగొట్టేస్తాడు. ఆవర్షంలో అలాగే భయంలేకుండా ప్రకాశరావుకోసం ఎదురుచూస్తూ రెండుగంటలు గడిపింది.

ఆకాశాన్ని కమ్మిన మేఘాలు తమ హృదయంలో కలిగిన బాధకి మాటిమాటికి గర్జించి హృదయవేదల్ని తెలుపుతున్నాయి. అనసూయ ఇన్నాళ్లనుంచి పడుతున్న అవస్థచూచి భరించలేక ప్రకృతీదేవి ఎడతెగకుండా విడుస్తున్న బాష్పాల్లాగ వర్షం ఘోరమంటూ కురుస్తూనే వున్నది.

అనసూయ హృదయం నిరాశతో తపించిపోతోంది. అక్కడ నిలువలేకపోయింది. తన హృదయేశ్వరునికోసం బయలుదేరింది. ఆ కటికిచీకటిలో సంతతధారగా కురుస్తున్న వర్షంలో, ఆ మేఘగర్జనలలో, హృదయం పులకరింపజేసే మెఱుపులలో దారి తెలియకపోయినా నిర్భయంగా బయలుదేరింది. ఎక్కడికి బయలుదేరిందో ఆమెకే తెలియదు. దారితెన్నులేక వెళ్లిపోతోంది. ప్రకృతంతా గంభీరంగా వుంది. అవిభీతహృదయానికి ఇంతధైర్యం ఎక్కడనుంచి వొచ్చింది! ఆమెకు భయం అన్నమాటే తెలియడంలేదు. కొంతదూరం వెళ్లేటప్పటికి ఆమెకాలికి ఏదో వస్తువు మెత్తగా తగలడంచేత భయంతో చటాలున ఆగిపోయింది. ఎన్నోభావాలు ఆలేతమనసునుంచి ఎగిరిపోయాయి. కాలికి తగిలినవస్తువు ఏదో నిర్భాగ్యుడగు మనుష్యుని శరీరం అనుకుంది. ఒక్కసారి ప్రపంచంలో వున్న భయంఅంతా అనసూయను ఆవేశించింది. ఆభయంలో వుండగానే ఒక్కమూలుగు వినబడింది. అనసూయ ఆత్రంతో చెవులునిక్కించింది "ఆ, మరచి...పో...ను...ఖం..." అని హీనస్వరంతో అన్నమాటలు అనసూయకు వినబడ్డాయి. ఆకాశాన్ని కప్పివున్న గల్ల మేఘాల్లోంచి ఒకమెరుపు మెరిసింది. ఆక్షణంలో తనకు ఎదురుగా పడివున్న వ్యక్తినిగుర్తించింది. దూరాన పిడుగుపడింది. నిలువునా పడిపోయింది. ఇంకోమెరుపు మెరిసింది.

"వచ్చావా అనూ! నేను ధన్యుణ్ణి. నావంటిధన్యుడు యీలోకంలో లేడు. నీవు సుఖంగావుండు. ఒక్కసారి నామొగంమీద నీమొగం చేర్చు. మూసుకుపోతున్న నాకళ్లలో నీకళ్లుపెట్టిచూడు."

అనసూయ అలాచేసింది

"ఇలాటిచావు ఎవరికబ్బుతుంది? ఈచావు ఎంత మధురం అన...సూ...యా."

ప్రకాశరావు ఇక మాటాడలేకపోయాడు. కన్నులు మూసుకున్నాడు. అనసూయ ప్రకాశరావు ప్రక్కనున్న పిస్తోలు చూచింది. దాన్ని తీసుకుంది. పూర్వులు ప్రకాశరావుకోసం మిగిల్చినధనం ఆపిస్తోలు ఒకటే. "ఢాం" అని నిశ్శబ్దంగావున్న ప్రకృతిని కలవరించింది. ప్రేమహృదయాలు రెండూ రెక్కలుకట్టుకొని ప్రేమప్రపంచంలో కలుసుకోడానికి అధికర నిశ్వాసాలతో ఎగిరిపోయాయి.

# దమనోపాఖ్యానము.

మంగిపూడి రామగోపాలశాస్త్రిగారు, బి. ఏ.

నేటి సుదినమున నాంధ్రపరిశోధక విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారమున దమన పురాణంబను మహాకావ్యంబు నేను జేసిన పరిశోధనము మూలమున బయలుపడినది. ఇమ్మహాగ్రంథంబు నెవ్వరు నీవరకుఁ బ్రచురింపక పోవుటయు నేనక్కార్యంబునకు నడుము కట్టితిని. తత్కావ్యంబున రచనా చమత్కృతులను జూపుటకు నీక్రింది పద్యముల నుదహరించుచున్నాను.

వ॥ అంత నష్టాదశాది విద్యా రహస్య శిక్షాకృత కృత్య శిష్య పరిషత్పరివేష్టితుండై యున్న రామకృష్ణశర్మను దత్పరివార వారమున నొక్కరుండు దమనుని కథ వినిపింపుఁడనిన సత్కానురాగ్రణి యిక్కరణి వక్కాణించె. 1.

క॥ భారత దేశమునం గల ♦ వారలలో నెల్ల వంటవారలె తగురా
నేరుపులన్నియు నేర్చిన ♦ వారలు తొలివేల్పు వనమె వారలఁ బొగడన్॥ 2.

క॥ మును ద్వాపరమును గలియుగ♦మును గలయుచునున్న సమయమున నుదయించెన్
మన కులమున ఘనుఁడును స ♦ జ్జనుఁడును నగు పాకశర్మ ఖ్యాతులమందున్॥ 3.

క॥ పాకరహస్యాంశముల న ♦ నేకములను బ్రకటముగ నేర్చి తన వి
ద్యాకౌశల ప్రదర్శన ♦ శ్రీకృపయును వినుతిఁ గాంచె చెలువారంగన్॥ 4.

వ॥ అమ్మహానుభావుం డద్భుతైక లీలం గారెలఁ గల్పింప సమర్థుండౌటయు దిగంత విశ్రాంతమగు ఖ్యాతియు ననూనంబగు మూల్యంబు నంది, గారెల శర్మయనియు, నభినవ భీముండనియుఁ బలువలు నామధేయంబుల వాసిం గాంచెఁ దదనంతరంబ 5

మ॥ క్రమమై యొక్కటి వెంట నింకొకటి పారావార వీచీర జా
లమునందుం దరఁగల్ తగన్ జనెను లీలం గ్రవ్వడిం బాత్ర నం
తము విశ్రాంత మొకింత లేక దినముల్; ధాత్రీతలంబెల్లఁ గా
లముతో పాటుగ మారుటల్ సహజమే లక్ష్మీస్త్రి నివాసస్థితిన్॥ 6.

ఆ॥ వె॥ పాకశర్మ చనియెఁ బ్రాయంబుకై ప్రాల ♦ నతని వెంట నంటి రతని పుత్ర
పౌత్రులెల్ల నిట్లు పలుతరంబుల వారు ♦ చనగఁ జనగఁ దుది దమనుడు మిగిలె॥ 7.

ఆ॥ వె॥ పాకశర్మయున్న ప్రాకటంబుగఁ గొన్న ♦ మాన్య శతములన్ని మాసి చన్న
నింక గారెలన్న యింటి పేరే మిన్ని ♦ కైన యాస్తి యున్నరాగ్రణికిని॥ 8.

క॥ దారిద్ర్యము దుర్గుణ పరి ♦ వారముతో వచ్చి యాలవాలంబుగ శ్రీ
గారెల దమనుం గైకొనె ♦ నేరికిఁ బూర్వకృత ఫలము లిలలోఁ దప్పున్॥ 9.

తే॥ గీ॥ తలిరు ప్రాయంబునుండి సోదరము పోష ♦ ణార్థమై దమనుండు మర్యాద నడుగు
తీరు తోచించి యాచించి తెచ్చుకొను♦కుడుచుచును దనదినములు గడపుచుండు॥ 10.

వ॥ ఇట్టిజీవితము తనకును నింద్యంబుగఁ దోచి దమనుండు చదువరి నను వేషముఁ దాల్చి విద్యావిషయక వివాదార్థంబు సయ్యా సభలఁ గూర్చుటకు వలయు విత్తంబు శ్రీమంతులయొద్ద యాచింప 11.

క॥ కొందరు దంభముకొఱకై ♦ కొందరు స్నేహంబుచేతఁ గొందరు కృపచేఁ
గొందరు మోమోటముచేఁ ♦ జందాలనొసంగ నందు సగము హరించున్ ॥ 12.

వ॥ అంతలో సంతృప్తినొందక తన విద్యావిశేషము చూపఁజూచు 13.

మ॥ మనమం దించుకయైన నాంధ్రకవితా మాధుర్యముం బ్రౌఢిమం
బును స్వారస్యవచో చమత్కృతులు సమ్మోదంబు చేకూర్ప నో
పని మూఢాత్ముఁడు మున్ను కాకము కలాపవ్రాతముం జేసి లీ
లను చేరంగఁ గవీంద్రులన్ సలుపు హేలాలీల నృత్యంబులన్ ॥ 14.

తే॥ గీ॥ కుడిచి కుడిచి బిచ్చపుకూటిఁ గొవ్వి క్రొవ్వి
కామ దావాగ్ని శిఖలను గ్రాగి క్రాగి
ప్రేమవల్లరి వాడుచుఁ బ్రీతిచెందు
దనదు కలకంఠరవమును దాన వినుచుఁ
గాకమెట్టుల ‘కా’ వని గాంచుముదము ॥ 15.

చ॥ అదియును జేతఁగాని సమయంబునఁ బెద్దలఁ దూలనాడు లే
పదిలము కీర్తిదాయకము భాగ్యమటంచు గణించు; వారిపూం
దోడవెదు తప్పులెవ్వకయె యూరక కూయుట యొప్పు; చెప్పుమీ
చదువరులన్నుగించి మును సంస్కృతమున్ భవభూతి వాక్యముల్ ॥ 16.

వ॥ అనుటయు నా శిష్యులలో నొక్కరుండు "ఏ నామ కేచిదిహ నః ప్రథయన్త్య
వజ్ఞాం........" అను శ్లోకము చదివె ననంతరంబు రామకృష్ణశర్మయు నిట్లనియె. 17.

చ॥ ఘనతర భావవైభవ వికాసము మూఢుఁడు గానలేమి నె
వ్వనిదగు లోటు? భర్తృహరివాక్యములం జదువంగలేదొ నీ
వనుటయు శిష్యుఁడొక్కఁడహహా యని నవ్వుచు పల్కె నిట్టులన్
గనుగవ మూసికొన్నఁ ద్రిజగంబులు చీకటులయ్యె పిల్లికిన్ ॥ 18.

శ్లో॥ "వ్యాళం బాలమృణాళతంతుభిరసౌ రోద్ధుం సముజ్జృంభతే
భేత్తుం వజ్రమణిం శిరీషకుసుమ ప్రాంతేన సన్నహ్యతి
మాధుర్యం మధుబిందునా రచయితుం క్షారాంబుధేరీహతే
మూర్ఖాస్యఁ ప్రతినేతుమిచ్ఛతి బలాత్సూక్తైస్సుధాస్యందిభిః" 19.

వ॥ నావుడు రామకృష్ణశర్మ మనంబున ఘనంబగు మోదంబునొంది దమనుని పై వృత్తాం
తంబు నిత్తెరంగునఁ జెప్పం దొడంగె. 19.

# చాకిరేవు

కొల్లూరు ధర్మరాయ కవిగారు, బి. ఏ.

( ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనము )

"చదువుకొనని వానికంటెఁ జాకలిమేలా"

—అనాథ చాటువు.

ఆంధ్ర వ్యవహారమునందున్న లోకోక్తికి వ్యతిరేకముగఁ బైకవి వ్రాసెనో, లేక కాలానుసరణముగఁ బై వాక్యమే నేఁటి రూపముఁ జెందెనో, కాని మొత్తముపైఁ జదువునకును జాకలివానికిని నేదో సంబంధముండి తీరుననుట నిర్వివాదాంశము. "వస్త్రేణవపుషా వాచా" యను త్రికము ప్రతిమానవునకుఁ బ్రతిష్ఠ నిలుపుట కాధారభూతమని పెద్దలు చెప్పుదురు; అనఁగాఁ బరిశుభ్ర వస్త్రధారియై సహజగాత్ర సంపద్యుక్తుఁడై శ్రావ్యమగు వాక్పటిమ గలవాఁడు కీర్తనీయుఁడగు ననుట. ఈత్రికమున వాక్ప్రదాయినియగు విద్యకును వసనదాతయగు రజకునకును లోకోక్తసంబంధము కలుగుటకుఁ గల కారణ మూహింపఁ దగినది.

"కోదాతా" యను ప్రశ్నకు "రజకోదదాతి—" యను ప్రత్యుత్తరము డాంబికదాతృహేళనార్థమై చెప్పఁబడినట్లు వాడుక యున్నది. కాని దానియందలి పరమార్థము వేరు. మోక్షదాయియగు భగవంతుఁడు సయితము, మన పాపకర్మలఁ దావలో తత్ఫలానుభవానంతరమే మనకు ముక్తి నొసఁగును. ఇంతమాత్రమునకే "జగద్రక్షకుఁ" డని భగవంతుఁడు పొగడొందుచున్నాఁడు. శిక్షాకాలపుఁ బరిమితిదాటిన వెంటనే దోషిని విడుదల చేసినందులకుఁ గారాగారాధిపతి యెట్లు స్తోత్రార్హుఁడగును? రజకుఁడన్ననో, కలుషమును బాపి నైర్మల్యమును బ్రసాదించువాఁడగుటచే సర్వోత్తమదాతయని చెప్పవచ్చును.

ఇఁకఁ జదువుకొనని వానికన్న జాకలి మేలగుట యెట్లో యూహింపవలెను. "చదువుకొనుటకుఁ బ్రకృతమున ననేకార్థములున్నవి." "సంతకము చేతువా?" యని గ్రామకర్ణము నడిగినచో "సిత్రం సదూకున్నాను బాబూ!" అనును. లోకోక్తియందలి "చదువుకొనుట"కు యుక్తాయుక్త కలుషాకలుషజ్ఞాన, విచక్షణజ్ఞానము సంపాదించుటయని యర్థము. అట్టి విమర్శన దృష్టి, విద్యావిధులకుండఁ దగును. రజకుని ప్రధానకార్యమే యట్టిది కనుక, వానికి విద్యావిహీనునికన్నఁ బ్రయోజన మారోపింపఁబడెను.

ఈ వ్రాయఁబోవు విమర్శక వ్యాస పరంపరకుఁ "జాకిరే" వను శీర్షిక నిడుటయందలి ప్రయోజనము పాఠకులెఱుంగుటకై యింత దవ్వు చెప్పవలసి వచ్చినది. విమర్శన కార్యమునకు నీచోపమాన మొనర్చితినను దోషము నాపైఁ బడవచ్చుఁగాని, సామ్య మన్ని విధముల యుక్తమని నాతలంపు. నిష్పాక్షికముగా మాలిన్యముఁ బోఁద్రోలి నైర్మల్యమునే చిరస్థాయి నొనర్చుట విమర్శకునకును రజకునకును సమానమగు ముఖ్యకార్యము. అటులొనర్పఁడేని విమర్శకుఁడు నిజమగు విమర్శకుఁడు కాఁడు, రజకుఁడు కాఁడు, రజకుఁడు నిజమగు రజకుఁడును గాఁడు.

నేఁటివఱకు మన యాంధ్రభాషలో విమర్శక కావ్యములు కొలఁదిగ నున్నవి. గత శతాబ్ది వఱకును బ్రబంధ కవులే యుండుటఁ జేసి విమర్శక దృష్టితో నొక ప్రబంధముఁ జదివిన పిదప మఱొండు విమర్శింపఁ బని లేకపోయెడిది. శ్రీతిరుపతి వేంకటకవులు మనభాషకొక నూత్నయుగము నారంభించిరని చెప్పవచ్చును ప్రబంధశైలి విడక దానిలోనే క్రొత్త భావములు

పరిదర్శించి వారు వన్నె కెక్కిరి. నేటి పాఠక జనసముదాయము మాత్రము వారిని ప్రబంధ యుగము వారి క్రిందనే చేర్చుచున్నారు. వారి ప్రహసనములను నాటకములను జదివినచో రా॥ బ॥ కం॥ వీరేశలింగము పంతులుగారితో సమానముగ వారు నవీనరచనారంభకు లైరని చెప్పవచ్చును. వారి యుగమునందే విమర్శనకుఁ బ్రాధాన్యము కలిగినది. శ్రీపేరి కాశినాథ శాస్త్రిగారి పూర్వశాకుంతలముపై వ్రాసిన విమర్శనమే ప్రథమము. తరువాత బయలుదేరిన సశ్రీవసానందశృంఖలాదివిమర్శకగ్రంథము వీర్ష్యాసూయా ప్రేరితములై నిజమునకు బాహ్యములైనవి

తరువాత నాంగ్ల విమర్శక సూత్రముల ననుసరించి వ్రాయఁబడిన విమర్శక వ్యాసము లెడనెడ బయలుదేరినవి నేటి పత్రికా యుగమే యిట్టి వ్యాసములకుఁ దావు నిడినది. Modern Review, Indian Review మొదలగు నాంగ్లేయ పత్రికల ననుసరించి మన భాషలోఁ దొలుత బయలుదేరిన పత్రికారాజము "శారద". పత్రికలలోఁ "గల్పలత" తరువాత సర్వజనోద్బోధక మగునది "శారద" యేయని చెప్పవచ్చును. "కల్పలత" కాలమునాఁటి పత్రికలలోఁ గాల గర్భోద్ధరితములగు పూర్వకావ్యములపై విమర్శనములు పడుచుండెడివి "శారద" కాలము నాఁటినుండి యాధునికులపై విమర్శనములు వెలువడుట యారంభమైనది. "శారద" వంటి పత్రికారాజ మచిరకాలమున నశించుట యాంధ్ర పాఠకలోక సహాయాభావమే కారణము. భాషా యోషకు "శారద" లేని లోపముఁ దీర్చినవారు శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు. ఆంధ్రలోకమునకు వారు సర్వదా ధ్యేయులు. "భారతి" పుట్టినతరువాత దేశమునందు బయల్వెడలిన పత్రికలు మెండు. పత్రికా బాహుళ్యము ప్రశంసనీయమే కాని యది మొదలుగా విలేఖకోత్కృష్టత తగ్గినది. జంధ్యాల శాస్త్రి చెప్పినట్లు పిల్లకవులు, చంటిపిల్లకవులు హెచ్చిరి. పాడనేర్చినఁజాలుఁ బద్యములు వ్రాయుటకు; వ్రాయనేర్చినఁజాలు వ్యాసములు వ్రాయుటకు. ఇందులకుఁ దోడు మా విశాఖపట్టణపు జిల్లా పెట్టిన గ్రామ్యభిక్ష యనేక నవీనకవుల రక్షించుచున్నది. మన భావకవులకుఁ జిన్నయసూరి యెరుక లేకపోయినను Shelly, Keats గురించి తెలిసినఁ జాలును. "Classic ground" అని చెప్పి యిటలీదేశమునకేగి భాషా పితామహుల పాదములపైఁ బ్రాణము విడిచిన భావకవులు వారు. మనుచరిత్రము నైన మననమొనర్పక కలముచేఁ బూనిన భాషాభిమానులు మన భావకవులు. పచ్చి శృంగారమని ప్రబంధముల దిట్టినఁగాని భావకవికే తన్నామము సరిపడదన్నది. ఈ భావకవి బాహుళ్యముచే నేటి పత్రికలు శాశ్వత సారస్వతమునకు సాధ్యమైన సహాయమగుటలేదు. ప్రబంధకవులఁ బాయకుండ వ్యాకరణమునకు వెలిఁబడక భావకవిత యను పేరు సార్థక మొనర్చుచున్న దువ్వూరి రామిరెడ్డి, రాయప్రోలు సుబ్బారాయ ప్రభృతులొకరిద్దఱు తప్పఁ దక్కువారు భావశూన్యములగు పలుకుల గారడిచే భాషాసతికంట దుమ్ముగొట్టుచున్నవారే.

ఇవియిట్లుండఁ జిన్నకథలను వ్రాయుట కనేకులు మొదలిడిరి. రవీంద్రుని Short Stories ఆంధ్రీకరించిన కీ॥ శే॥ తిరుపతి శాస్త్రిగా రివిషయమునఁ జిరస్మరణీయులు. ఇప్పుడు చిన్న కథలను వ్రాయుచున్న వారిలో శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారే యగ్రగణ్యులని చెప్పవచ్చును. గ్రామ్యభాషలో వ్రాయబడినను వారి

పూలదండ సాంఘిక దురాచారముల నధిక్షేపించి సంస్కరించుటకు సహాయభూత మగుచున్నది. అట్టి కథలు మనభాషకు వాంఛనీయములే యగును. ఇప్పట్టున శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి నామ మెన్నఁదగినది. చిన్న కథలు వ్రాయుటచే గల ప్రయోజనము నెఱింగి వ్రాయుచున్న వారు వీరిరువురే యని చెప్ప వచ్చును. పత్రికలలో నేటికిని నపరాధ పరిశోధకాఖ్యాయికలు వెలువడుచున్నవి. ఆంగ్లేయమున Edgar Allen Poe ప్రదర్శించిన కథాచమత్కార సమృద్ధి మన డిటెక్టివు కథకుల కింకను గలుగలేదు. మన యపరాధ పరిశోధక నవల యొక్కటి చదివినఁజాలు, ప్రతి పాఠకుఁడును మిగిలినయట్టి నవలలయందలి సామాన్యాపరాధమును బరిశోధింపవచ్చును. గ్రంథమాలలవారు (శ్రీ వేంకటపార్వతీశ్వర కవి ప్రముఖులు) ప్రసాదించుచున్న డిటెక్టివు నవలలతోఁ జిరకాలము నుండి విసిగిపోయిన యాంధ్ర పాఠక లోకమున కిపు డట్టివానితోఁ బనిలేదు.

పత్రికా లేఖకుల లోపములింకను వివరించుట కనేకములున్నవి. అవి ప్రత్యేకముగ మున్ముందు చర్చించబడును. పత్రికా సంపాదకులందుఁగూడ గొన్ని లోపములు లేకపోలేదు. వారికిఁ జేరు లేఖనములలో నెట్టివి భాషా పోషకములో, యెట్టివి నీతిదాయకములో, యెట్టివి సంఘక్షేమ ప్రదములో యెఱింగి తద్వ్యతిరేకములగునవి ప్రకటింపకుండుట వారివిధి. ఆంగ్లేయుల పత్రికలు సంపుటీకరింపబడి పుస్తక భాండాగారములలో నుంపఁబడుటకు వారిలేఖక ప్రాశస్త్యమే కారణము. నేఁటి మన పత్రికలయొక్క పూర్వ సంపుటములు కోరువారే యుండరు. ఇట్టిలోపము సవరించుట సంపాదకుల చేతులలో నున్నది.

## అన్యాపదేశము.

(శ్రీ వేంకట కాళిదాసకవులు.)
(ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము)

అమల హృదంతరాళమున హాయిదలిర్పఁ బ్రియంబెసంగఁగా
భ్రమర కుమారరత్నము నివాస మొనర్చుచు నిద్రఁజెందెడున్;
గమలిన నీదుముద్దుల నిగారపు నెమ్మొగ మేల వాంచెదో
కమలిని? యింక నీ వ్యథకుఁ గారణమేమి, వచింపరాదొకో? ॥
రేఁబన రేఖనన్ వెలువరించిన నూతనరాగ సత్కళా
నీకము, నవ్వు నవ్వున వినిర్మల భావతరంగ మాలికా
శీకరపంక్తి, చాపలముఁ జెందిన చూపునఁ జూపునందు లీ
లా కమనీయశోభ, కమలంబ! యిటుల్ విడనాడ నేటికిన్? ॥
ప్రేమతరంగిణీ జనిత వీచులలోపలఁ దేలి యాడుచున్
నీ మధురాభిరామమగు నిర్మలరూపము నెన్ని కాంచుచున్
దామరసంబ! షట్పదవతంసము కౌఁగిటఁ జేర్చి సమ్మద
శ్రీ మధుయుక్తి నీదెదవు, చింతవహింపఁగ నింక నేటికిన్ ॥

# ఊరడింపు

కొత్త సత్యనారాయణమూర్తిగారు.

"చాలిఁక చాలు బేలవయి సర్వమహీతల పూజ్యరాజ్య, మా
యాలములో జయించి, యిపుడట్టి త్రుటిన్ ద్యజయింతునంచు నీ
వేల విషణ్ణచిత్తుఁడవ దేల ప్రతీపమనస్కుఁడైతి, బా
వా! లసమానహృద్గతి నవారిత పద్ధతి నాశ్రయింపుమా ! 1.

శ్రమము దలంప కొక్కరుఁడు శ్రద్ధగఁ గూపము ద్రవ్వ యంతలో
నమల పవిత్ర తజ్జలము నాననిరీతిసి ధర్మసంభవా!
కుమతులు కొరవాధములు కయ్యెడ ఖండనసీమ, శక్తి శౌ
ర్యములను జూపి యోర్చి తుదికాఫలముల్ దిగ ద్రోచిఁ యేగుదే! 2.

కిల్బిషశంకయేల పరికించి విచారణ సేయు మగ్రజా!
యుల్బణ వంశనాశనమహాయని యూరక చింతఁదక్కి, యా
కుల్బలితంపు భక్షణగఁ గోరి వనంబున కేగుటంచు ఫ
ల్కుల్బలె! చాలు-కిల్బిష మకుంఠితపద్ధతిఁ బోదె! యారయన్. 3

కానల కేఁగునాడు నిజకష్టములోర్చి మెలంగునాఁడు, దు
ర్మానవుఁ డాసురోధను నమానుష కృత్యములంది సర్వదా
మానము ప్రాణమానము గ మాటినవాఁడును నీదుప్రాపునన్
బూనికఁ దాల్చిమాటిమిగపో! యిదియేమి తలంప నేఁటికిన్! 4.

శోకదవాగ్నిఁ జిక్కి కడు సోలిన తమ్ముఁ, నాఁడు కానలన్
ప్రాకట బుద్ధితోడ, పరిపంథి సమూహము నుగ్గు నూఁచగా
నీఁకిన దల్పుము - ఆ వెనుకఁ బెల్లుగ భోగము లాశ్రయించుసం
చో!" కమనీయమూర్తి! యటులూరకె నీవట నూఅడించితే! 5.

అట్టి సభాస్థలిన్ బడిన యూఅడి, కౌసల, నాఁడు బడ్డ పా
ట్టిపో వాని, సైంధవుని యేహ్యపు చెందము లా, విధాన నా
పట్టనమందు మత్స్యపభు పాల వసించిన నాఁటి దుఃఖమున్
నెట్టన సర్వము న్నరిసి నిల్వవు ధైర్య విచార సంగతిన్! 6.

వలసిన కృత్య సంచయమవారిత పద్ధతి, మేము సేయఁగా
నిలఁగల దుష్టమానవుల హింసయు, శిష్టుల రక్షణంబు, సం
కలిత మనంబుతోడి చెలగన్ వెనఁ జేయుచు రాజచంద్ర! యీ
లిపి మహాశ్వమేధముల సానుచరిత్రుఁడుగమ్ము భూస్థలిన్॥ 7.

# మహారాష్ట్ర స్వాతంత్ర్యము.

హరనాథవసు ప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది.

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.

సజ్జా:- మీరొక్కరా! కాదు. మిమ్ము లేని వారితోఁ దుల్యులుగ నెంచవచ్చును మీరు ప్రపంచమున లేనివారు అనఁగా మృత ప్రాయులని యెంచవచ్చును. కారణ మేమందురా? విశ్వమందు వనితయే శక్తి స్వరూపిణి. ఆశక్తి నాధారము జేసికొనియే పురుషుఁడు సకల కార్య వాహకుఁడై సమర్థుఁడగుచున్నాఁడు. ఇంక మీరో శక్తివిహీనులరు. ప్రకృతి స్వరూపిణి యనఁదగు శక్తియైన కేవల సత్తామాత్రయైన భార్యను బరిత్యజించిన - ప్రకృతికి భిన్నుఁడైనవాఁడు జీవచ్ఛవముగాక వేరేమి? పరమేశ్వరుఁ డంతవాడు ప్రకృతిని గూడుటవల్లనే సృష్టి స్థితిలయాది సకల కార్యనిర్వాహకుఁడై శక్తివంతుఁ డగుచున్నాఁడు. ఇంక నీవంటి భార్యాపరిత్యాగుల మాట చెప్పవలయునా! ప్రకృతి స్వరూపిణియైన భార్యను విడనాడిన నీవు జీవచ్ఛవంబవు. మృతప్రాయుండవైన నీవు రాజ్యము, పరివారము, ధనము మొదలగువాని నెవ్వరికై సమకూర్ప నెంచితివి? ఎవ్వరి యభిమానమును మర్యాదను సంరక్షించుటకై మీరు ప్రాణములనైన లెక్కింపక సమరవహ్నిలో దుముకుచున్నారో - ప్రణయమయమై - స్నేహపూరితమై విద్యుల్లతా తుల్యమైన నే దేవీ కటాక్ష వీక్షణావసారమున మీ శరీరమునఁ గలిగిన శస్త్రక్షత సంజనిత బాధ యంతయు మరపునకు వచ్చుచున్నదో అట్టి ప్రకృతి - ఆధార శక్తిస్వరూపిణియైన భార్యను బరిత్యజించి మృతప్రాయులరై బడియున్న మీరీ రాజ్యమును అయిశ్వర్యము నెవ్వరికై సమకూర్ప నెంచితిరి? ప్రకృతి శూన్యుఁడవై భిన్నుఁడవై శక్తి లేని నీవొక వనమునఁ గూర్చుండి దైవమును ధ్యానించుకొనవలయును గాని రాజకీయరంగమునఁ గాలిడుట కెట్లర్హుఁడ వగుదువు? అశోకవాటిక యందలి శింశుపా వృక్షచ్ఛాయను గూర్చుండి నిరాహార వ్రత తత్పరయై బంధితయై పతిరూపధ్యాన పరాయణయై శోకించుచున్న జానకీదేవియొక్క యశ్రుధారాపూరమైన వదన మండలము రామునకు జ్ఞప్తియే లేకున్నచో నామె రూపమా మహాత్మ్యమని హృదయమునఁ జిత్రింపఁబడక యున్నచో లక్ష్మణ మూర్ఛ వలన కలిగిన శోకమును సహించి రావణుని వంశసహితముగ నాశనము చేయగలడా? కౌరవరాభవ సంతప్త హృదయయై - దుశ్శాసన కరకలుషిత వేణీభరయై - కురుక్షేత్ర సంగ్రామ రంగమందున్న పాండు తనయుల ప్రచండ పరాక్రమమునకు హేతుభూతయై ప్రకాశించుచున్న పాంచాలి

యొక్క- ఘోర పరాభవసంజనిత దుఃఖరస పూరితమైన - నిరంతరాశ్రుధారా సమేతమైన వదన కుండలమే పాండు నందనులకు జ్ఞప్తికి రాకున్న పార్థుని గాండీవము భీముని గదయు శ్రీకృష్ణుని సారథ్యముగూడ వ్యర్థమే కదా! అట్లే ధర్మపత్నిని మరచి, యామె ముఖమునుగూడఁ జూడ నొల్లక నామె నామమును గూడ మరచి కాలమును గడుపుచున్న మీరు మీకుఁగాని శూరులేకదా! ప్రకృతి భిన్నునకు శక్తి విహీనునకు విశ్వమంతయు వ్యర్థముకదా! అట్టి మీరీ రాజ్యభోగము లెవ్వరికొఱకై సముకూర్పఁ దలంచితిరి?

రంగ:- సుందరీమణీ, నీయుపన్యాసమును వినుట చేత నామనమున నొక నూతన భావము దయించినది. నీయట్టి భార్యను బడయు వాఁడెంత హీనుడైనను మహోన్నతికి రాఁగలడు. నేనెట్టి సాధనముం జేసిన నీవంటి భార్యను బడయఁగలనో వచింతువా?

సర్జు:- గుణహీనయై సాహసికయైన చంచలయైన యీ దాసిని స్తుతింపకుడు. మీకు సాధనము కావలయునా? వినుడు. సాధనము ప్రేమయే. ప్రేమించుటవలన భగవంతుఁడు స్వాధీనుఁ డగుచున్నాఁడు.

రంగ:- అట్లనా? అపూర్వ లావణ్యవతివైన నీవంటి దివ్యాంగనను నేనెంత ప్రేమించుచుంటినో నేనెట్లెరిగింపఁగలను?

సర్జు:- నిలువుఁడు. నన్ను ప్రేమించుట కాదు. మీరు ప్రేమింపవలసినది నన్ను కాదు. నేను దాని నపేక్షించుట లేదు. మీజాతిని పవిత్రమైన మీ మహారాష్ట్ర జాతిని - పరాక్రమమునకు నాత్మ గౌరవమునకుఁ బుట్టినిల్లగు మీ వంశమును - భారతదేశ ప్రథమ స్వతంత్ర రాజ్యమని పేరెన్నికం గన్న జన్మభూమియైన మహారాష్ట్ర దేశమును ప్రేమింపవలయును. మీరట్టి ప్రేమను ఖండించితిరి. ఎవ్వఁడు స్వదేశ స్వజాతి ధర్మములను మరచి వానియం దనురాగమును బరిత్యజించుచున్నాఁడో యట్టి వానికిఁ బ్రేమ యనున దుండదు. తెలిసినదా! రాజాగ్రణీ! మీరిట్టివారిలో నొకరు. ఇంకనైన బుద్ధిని మరల్చుకొని రాజ్యాశను బరిత్యజించి యాత్మగతమైన ప్రేమ రాజ్యమునఁ బ్రవేశించి సాధనమొనర్చినచో మీకు లాభమున్నది. అట్టి ప్రేమ రాజ్యమం దగ్రస్థానము మీకు దొరకినచో మీ మానసిక ప్రతిమ మీకు మరల లభింపఁ గలదు.

రంగ:- సర్జూ, నీ మాటలవలన నామనమున కల్లోలము కలిగినది. వాసంతియు నిట్లే వచించుచుండును. దీనింగూర్చి యాలోచింపవలయును.

సర్జు:- ఇంక మీరు వెడలుఁడు. నిల్చుట మంచిది కాదు.

రంగ:- పోవుచుంటిని. (వెళ్లుచు) నీవే నాసరస్వతివి. నీవే నా లక్ష్మివి. ఎంతకాలము నామనమున నివసింతువో యంతదనుక సురక్షితుఁడను. తొలగిపోతివేని మార్గమును మరతును. (నిష్క్రమించును)

— చతుర్థ రంగము —

వాసంతిక:—

గీ॥ మనుజులందరు నిద్రను ♦ మానసమునఁ
దలఁచి వ్యథఁ బెట్టుచుందురు ♦ పలువిధముల
దైవమా వారి కోర్కెల ♦ ధరణిలో
నీవు నెఱవేర్చుకున్నచో ♦ భావమందున

పాపి దైవంబటంచు ని ♦ న్బలువిధముల
దూరుచుందువు హీనులై ♦ ఘోరములగు
తా రొనర్చుకొనిన యట్టి ♦ క్రూర కార్య
ములకు సుంతైన సంతాప ♦ మును వహింప
రాల రక్కటా యిదియెట్టి ♦ సాహసంబొ ॥

( ప్రవేశము – సర్జూబాయి )

వాసం;– ( తుళ్ళిపడి ) ఎవరు వారు? నీవా! ఎంత చక్కని రూపము! నీవు మిగుల చక్కనిదానవు. నీవు బృందావన మందలి రాధికవా! లేక మరి యెవతెవా?

సర్జూ:– తరువాత చెప్పెదను. ఇది రంగనాథుని గృహమేనా! వా రింటిలో నున్నారా?

వాసం;– లేరు. నీ వెంత సుందరివి!

సర్జూ;– ఇంకను వా రింటికిరాలేదా! అట్లయిన మంచిదే!

వాసం:– నీవారును నెరుంగుదువా?

సర్జూ;– వారిచే పాలింపఁబడు కన్యవు నీవా?

వాసం;– ఔను.

సర్జూ:– నీతోఁ జాల సంగతులు చెప్పవలసి యున్నది.

వాసం:– నేనే యాకన్యను. తండ్రిగారు మార్గమందున్న నన్నెత్తి పెంచుచుండిరి కాదు నా దీనబాంధవుఁడే నన్నుగొనివచ్చి తండ్రిగారికిఁ గాపాడ నొసంగెను. నాకు వేరు దిక్కులేదు. ప్రేమతోఁ బోషించు జనకుని జూచితిని. తల్లిని జూడలేకపోయితిని. ప్రేమ జూచు తల్లికొరకు కలువరించితిని. తండ్రి నడిగితిని. ఆయన ప్రత్యుత్తరము నీయలేదు. ఆహా! నీవెంత సుందరాంగివి నీవు నాతల్లివి గాని, తోడబుట్టిన దానవైగాని యుండిన నా యదృష్టము నేమని చెప్పుదును.

సర్జూ:– నేను నీకంటె చక్కనిదానను గాను. నీవంటి బంగరుబొమ్మను కడుపున నిడుకొని ముద్దాడ బుద్ధికలుగుచున్నది. కాని యిప్పుడు కాదు. నన్ను గొంతకాలము నీయింట రహస్యముగఁ దాచఁగల్గినచో నీకు వృత్తాంతమంతయుఁ దెల్పెదను.

వాసం:– నీ విచ్చట నుందువా? నిశ్చయమా! అట్లయిన నిక నాకేమి కావలయును? ఆనందముతో నుండెదను. ఎంతయో ప్రేమించెదను.

సర్జూ:– ఇచ్చటనే యుందును నేను నీకును నీ జనకునకును మేలు చేయఁగోరి యిటు వచ్చితిని. నన్ను సత్వరముగ నొకగదిలో దాచుము. ఎవ్వరికిని దెలుపకుము. తర్వాత నీకు నేనెట్టి శుభమును గల్గింతునో నీకే తెలియఁగలదు. ఆలోచించుచుంటి వేమి? నామాటలయందు నీకు విశ్వాసము లేదా?

వాసం:– లేకపోవుటేమి! చూడగనే నిన్ను ప్రేమించిన దానను, నీ మాటలను నమ్మకుందునా! దీనబాంధవుఁడు సాక్షి. నీకు నాదీనబాంధవునియందు నమ్మకమున్నదా! ఆమహాత్ముని బ్రేమింపఁగలవా?

సర్జూ;– నేనాదీనబంధు దాసిని. నా కీనమయమం దాయనయే తోడు. నా సర్వస్వము దీన రక్షకుఁడే.

వాసం:– అట్లయిన నాయూహ సత్యమే. నీవు క్షీరసాగరమున జన్మించినలక్ష్మివి. బృందావనమందలి రాధికవు. రమ్ము లోనికేగుదము.

( ఇద్దరు లోనికేగుదురు )

( ప్రవేశము – రంగనాథుఁడు )

రంగ;– అర్ధరాత్రి గడచెను. వాసంతి నిద్రించుచున్నది కాబోలు, నిష్కల్మషయైన యా

బాలిక మాతృ స్నేహమునకై తల్లడిల్లు చున్నది. నేను వాసంతిని నర్జూయొడిలో నుంపఁగల్గితి నేని యామె కెట్టి లోటు నుండదు. (యోచించి) ఏమి నా భ్రమ! ఆ నీచుఁడు విలాసలంపటుఁడు- భోగ పరాయణుఁడు- వాసంతిని గైకొనక నాకుఁ దోడ్పడఁడు. కాని యొక్క విషయ మున్నది వాఁడు వాసంతిని వివాహ మాడెదనని చెప్పియుం డెను. చెడులో నిదియొక మంచి. వాసంతి మదీయ హృదయోల్లాస విహారారామమున నిర్భయముగ విహరించు హరిణి. ఈహరిణము విజాతీయ వ్యాఘ్ర గుహాంతరముఁ జేరినచో భయకంపితయై క్షీణించిపోవును. ఏమిచేయుదును. వాసంతీ! నిద్రించుచున్నది కాఁబోలు.

(నేపథ్యమున)

తండ్రీ! వచ్చుచున్నాను

రంగ:- రావలదు. పరుండుము.

వాసం;- (ప్రవేశించి) నేనేల నిద్రింతును. నీవింత యాలస్యముగ వచ్చుచుండ నాకు నిద్ర యెట్లు వచ్చును. ఇంతవరకు వెలుపలనే యుంటిని.

రంగ:- వెలుపల నెందుల కుంటివి.

వాసం:- నీకొఱ కెదురు చూచుచుంటిని

రంగ;- కుమారీ! యిటువినుము, నీవింకమీద వెలుపలకు తరచు రాఁగూడదు నీవు వెను కటికన్న వయస్సున బెద్దదానవగుచుంటివి. నీవంటి వ్యక్తిత గల్గిన బాలికలు వీధికిఁ రాఁగూడదు పకీర్లు భిచ్చగాండ్లు వచ్చినచో బిచ్చమును దాసిచే బంపుము. అంతేకాని నీవు వెలుపలకు రావలదు

వాసం:- ఏమి! నేనట్లొనర్చుటవలన నేమైనది?

రంగ:- ఈనగరము దుష్టమైనది. కొలఁదిదిన ములక్రింద నీవొక పకీరునకు బిచ్చముపెట్టి తివి వాడు గొప్ప గొప్ప యమీరుల యిండ్లకేగి నిన్ను—

వాసం;- దూషించెనా?

రంగ;- లేదు, ప్రశంసించెను. కాని యీపురిలో సుందరులైన స్త్రీలసంగతి వజీర్ల చెవినిబడిన కడు విపజ్జనకము.

వాసం; (నవ్వి) మీఘాదుషావారు సుందరులైన వనితల నురిదీతురా?

రంగ;- వారికిఁ—దు. వారి సౌందర్యమునకురి.

వాసం;- ఛీ! ఛీ! మీఘాదుషా అంతనీచుఁడా!

రంగ;- ఔరంగజేబుమాటకాదు వారి ప్రధాన కర్మచారులలో ననేక—

వాసం:- తెలిసినది గ్రహించితిని. సేవకుల ప్రవర్తనము నరికీలించిన యజమానుని సంగతి తెలియఁ గలదు.

రంగ:- నేను నిన్నెందులకు వెలుపలకు రావల దంటినో తెలిసినదా? నీకు బాల్యము దాటెఁ నది. శీఘ్రముగ వివాహమొనర్చ వల యును. నీరూప గుణము లెంత సుందర ములో అట్టి వరుని నిర్ణయింపవలయును. ప్రభు మందిరముల నలంకరింపఁ దగిన నీవు సామాన్యుని పెండ్లాడఁగూడదని నాతలంపు తెలిసినదా?

వాసం:- అదేమి! తండ్రీ ఏమంటివి? నన్ను నీవద్దనుండి గెంటివేసెదవా? నీలోనుండి నన్ను వేరుపర్చెదవా?

రంగ:- బిడ్డా! కుమార్తెలపై తండ్రి కెల్లకాల మధికార ముండదు కన్యక యొక్క పుట్టుక పరగృహపావన యోగమునకే గాని తండ్రి యొక్క లాభమునకు గాదు. కన్యకకు

బాల్యమున జనకు డధికారి. యౌవ్వనమున భర్త యజమానుఁడు.

వాసం;- అట్లయిన భవదీయ వియోగమునకు మూలమయిన వివాహమే నాకు వలదు. నేను వరుని యింట కరుగను. నీతో నుందును. నాకితర నరు లక్కర లేదు. నేనొక్కనిని మాత్రము వరించితిని.

రంగ:- ఓహో! నన్నుగూడ నీవెంట జామాతృగృహమున కరుదెంచి నివసింపు మనెదవా? ఛీ! ఛీ! నీచము. కుమార్తె ద్రవ్యము నపహరించుట - అల్లుని యింట తిండికి జేరుటకన్న మానవునకు మరణమే మేలు.

వాసం:- తండ్రీ! పొఱబడు చుంటివి. నేను వరించిన నీయల్లుఁడు సామాన్యుఁడని యెంచితివా? నీవేమి, నేనేమి విశ్వమంతయు నాయన యింటనే నివసించి యామహాత్ముని కృపవలన లభించిన యన్నమును దినుచుఁ గాలక్షేప మొనర్చుట నీ వెఱుంగవా?

రంగ:- కుమారీ! నీవు మరల నా వెఱ్ఱి మాటల నారంభించితివి.

వాసం;- తండ్రీ! లోకమునందు మిథ్యావాదనమునకు దంభప్రలాపములకును గౌరవస్థాన మొసంగి నేననెడి సత్య వాక్యములను వెఱ్ఱి మాటలని తిరస్కరించుచున్నారా?

రంగ;- భగవంతుని వివాహమాడెద ననుట వెఱ్ఱి గాక మరేమి?

వాసం:- దైవము తండ్రియై తల్లియై రక్షకుఁడై మార్గదర్శకుఁడై యుండ భర్తగా నేల నుండరాదు? సర్వశక్తిమంతుఁడైన భగవంతుని వరింపక వ్యర్థుఁడై యసమర్థుఁడైన మానవ మాత్రుని వరించుట తెలివిగల పనియా?

రంగ;- నిజమేకాని నీవికఁ బోయి పరుండుము. నాకిప్పు డవసరమైన పనియున్నది. ఖాసింఖాఁ జాగు సేయుచున్నాఁడు. నేనిప్పుడు వెంటనే రాజారామునిపై యుద్ధమున కేగకున్న నా యాశయమంతయు నడుగంటును.

వాసం;- మరల నిప్పు డేమి——

రంగ;- నీవు పోయి నిద్రపొమ్ము.

(నిష్క్రమించును)

ఇందు ఖాసింఖానుని యపరాధ మేమున్నది? ఈ కన్యారత్నము రాజాధిరాజుల హృదయముల నాకర్షింపదగియున్నది. ఒకానొక తుచ్ఛస్త్రీ వ్యక్తి కొఱకు పురుషులేల యింత యాతురతఁ జెందుచున్నారాయని పూర్వము నేను తలంచుచుండెడివాడను. ఇప్పుడా భ్రమ వదలిపోయినది. సర్జూబాయి నా హృదయమునకు మహా కల్లోలమును గల్గించినది. భావశూన్యమైన మహాంధకార మయమైన నా మనమును జ్యోతిర్మయముగఁ జేయనెంచి లలిత లీలామయమయిన లలనా రత్నము సర్జూబాయి యెచ్చటినుండియో యూడిపడినది. ఆమె నయనముల యందు విద్యుత్ప్రకాశము ప్రేమామృతము తొలుకాడుచున్నది. కంఠమునఁ గోకిలారవము కర్ణపర్వమొనర్చుచున్నది. ఆమె తిరస్కృతియందు సహానుభూతి యొప్పారుచున్నది. కాని యేమి చేయుదును? రాజ్యాశ నన్ను వదలదు. ఆవాంఛా పరిపూర్తి యగువరకు నాహృదయమున కూరట కలుగదు.

(ఒక సిపాయి ప్రవేశించును)

సిపా;- రాజాసాహెబ్! ఆదాబ్. (సలాము చేయును.)

రంగ;- ఏమి వృత్తాంతము.

సిపా;- చాల సంతోషకరమైన వార్త. ఛత్రపతి రాజారాం గారు యీగడ దుర్గమం దున్నాఁడు. ఇప్పుడు మీసంస్థాన మరక్షితమై యున్నది మీరిప్పుడు వెంటనే ఫాదుషావారి యాను మతి పత్రికల గొని మీరాజ్యమునఁ బ్రవేశించుట కనుకూల సమయము.

రంగ; అట్లయిన నేనిప్పుడే దర్బారున కేగెదను మీసేనాపతి సిద్ధముగ నున్నాఁడా ?

సిపా;- ఆయనకు మనస్సు క్రమముగ లేదు.

రంగ;- అట్లయిన నిన్నిచ్చటి కెవ్వరుపంపిరి ?

సిపా;- సేనాపతియే పంపెను. ఆయన యిప్పుడు మంచముపై పరుండి దొర్లుచున్నాడు.

రంగ;- సరే సేనాయన సంగతిని విచారింతును. నీవేగి సైన్యమును సిద్ధముఁ జేయుము.

సిప;-ఖాసింఖానుని సైన్యము ఇతరుల యాజ్ఞను మన్నింపదు. ఆయనయే రావలయును.

రంగ;- యిదేమి! సేనాపకుఁడనే బోయి కార్యమును నెఱవేర్పఁ గలిగినచో నేనింత కాలము మహమ్మదీయ సేవకుడనై యాయనగుమ్మము కడ నేలఁ బడియుందును ?

సిపా;- యిట్టి సమయము మనకు సురల దొరకదనియును నామనోవ్యాధికి మందు మీవద్దనే యున్నదనియును సేనాపతి మీతో వచింపుమని నా కాజ్ఞాపించెను.

రంగ;- అట్లనా ?

సిపా;. ఆయన హృదయము సంతస పడినచో మీరు నిరభ్యంతరముగ నతి సులభముగ నెల్లుండి సాయంతనమునకు ముందే మీపితృపితామహార్జితమైన సింహాసనమున గూర్చుండ గలరు.

రంగ;- (స్వగతము) ఎంత విషమావస్థ. వానం తిని నశ్యాని పెట్టుటయా! (సవిలాస్యముగ) అజ్ఞాత కులశీలయైన యొక యున్మాద బాలికకొఱకు పూర్వార్జిత రాజ్యమును బరిత్యజింతునా ? జరుగదు. అట్లు జరుగదు.

సిపా;- యేమి యాలోచించు చుంటిరి ? నేను శీఘ్రముగఁ బోవలయును. సేనాపతి యెట్టి దురవస్థలో పడియుండెనో మీ కెరింగినదే.

రంగ;- ఇచ్చటనే యుండుము. ఖాసింఖానుని మనోవ్యాధికి మందును గొనివచ్చెదను.

(నిష్క్రమించును.)

సిపా;. అహాహా ! యేమి ప్రపంచక విలాసము ? తల్లిదండ్రులు, అన్నదమ్ములు, బిడ్డలు, భార్య అను భావమే నశించినది. ఎవ్వరి కెవ్వరును గాకుండ నున్నవారు. లోభావిష్టు డుచితానుచితముల వదలి యెందులకైన సిద్ధపడును గదా ? ఎంత స్వార్థపరత్వము. స్వార్థాభిలాషి పుత్రికా మోహమును ఖండించుచున్నాఁడు.

( నేపథ్యమున )

వాసం;- నా మంచి కేమి. తండ్రీ ! నీ సుఖము కొఱకు బ్రాణత్యాగమునకైన సిద్ధపడుదును.

రంగ;- బిడ్డా ! నీసుఖమే నాసుఖము.

సిపా;- (ఆలకించి) ఇదిగో ఇదే నీవామె కొసంగు సుఖము. ఎంత వంచనము. సిద్ధమైనది సర్దార్ ఖాసింఖాన్ సేనాపతియొక్క రోగ నివారణమునకై మందు సిద్ధమైనది. ఈ గంధమాదన పర్వతమును పెల్లగించి నెత్తినిబెట్టుకొని నేనే పోవలసి యున్నది కాబోలు

రంగ;- (నేపథ్యమున) కుమారీ ! నిశ్చింతతో నుండుము.

సిపా;- సేనాపతి చేత బడినపిమ్మట సంతతము నిశ్చింతయే.

(రంగనాథుని ప్రవేశము)

రంగ:- హవల్దారు సాహెబ్! సేనాపతితో పాలకిని పంపుమని చెప్పుము. నాహృదయ సర్వస్వమైన మదీయ మంగళ కాంక్షిని యయిన వాసంతి వెడలుటకు సిద్ధముగనున్నది.

సిపా;- మీరుకూడఁ వెంటనున్న బాగుగనుండును.

రంగ;- వలదు హైందవ సుందరీమణులు పుట్టిన యింటినుండి వెడలునప్పుడు మిగుల దుఃఖింతురు. నేను చూడజాలను. ఆజ్ఞాపత్రమునకై దర్బారున కేగెదను.

సిపా;- నాకనుజ్ఞ (వెడలుచుండును)

రంగ;- ఓయీ! ఇంకొక మాట. నీవు సేనాపతికి విశ్వాసపాత్రుఁడవైన సేవకుఁడవుగదా! ఒక్కటడుగుదునా?

సిపా;- అడుగుడు.

రంగ;- మీఖానుఁడు స్త్రీల విషయమై యెట్లు ప్రవర్తించును.

సిపా;- సుబహానల్లా! ఖాసింఖాన్ బహద్దరుగారు శత్రు వనితలయందే మిగుల కరుణారసపూరితులు. ఇంక సపత్ని విషయమై అడుగవలయునా? మీకా సందియము వలదు

రంగ;- చాలును. నాబిడ్డయైన వాసంతి మిగుల నదృష్టవంతురాలు.

సిపా;- ఇంక నందులకు సందేహమా? (వెళ్ళును)

రంగ;- ఏమి చేసితిని. వాసంతిని సేనాపతి కిచ్చితిని ఆలావణ్యమయి అధర్మరూపిణి ఆదేవమూర్తియయిన బాలిక యొక్కతియే ఇంతదనుక నా జీవనమునకు నాశాంతి కాధారభూతయయి యున్నది. ఇప్పుడు నా కాయువ కాశము కూడ యంతరించినది. ఈ ప్రపంచకమున నా కెవ్వరున్నారు? ఆరత్నమును చేతులార దూరముగ విసిరివేసితిని. ఏమి చేయుదును? వేరుపాయము లేదు. రాజ్యాభిలాష యను లాలసత్వమునకు స్వార్థపరత్వమను మహాపిశాచమునకు నాశరీరమును నాయంతఃకరణ చతుష్టయము నాహుతిగఁ జేసి నన్ను నేమరచియుంటిని తిరిగ్గి ప్పికొనుటకు శక్తి లేదు. అగ్ని కెదురుగఁ బోవు శలభమువలె దురంత రాజ్య లాలసభీకర నారక వహ్నిలో బడి భస్మమగుచుంటిని. ఏమైనను వేరొక మార్గమును బోవుట కశక్తుఁడనైతిని. ఈదుష్ట వాంఛాపరిపూర్తికై యెన్నియో దుష్కార్యములఁ జేసితిని. అది చాలక ఈహుతాశన కుండమున వాసంతిని గూడఁ బడవైచి తుదకుఁ బెద్ద సాహసమును జేసెదను. ఆమెయే నారాజ్య సిద్ధికి విఘ్నముగనున్నది ఇప్పుడు నాకు వేఱుమార్గము లేదు. రాజ్యమును రమణిని సరిబోల్చి చూచినచో నాకన్నులకు రాజ్యమే ప్రకాశమానమై కన్పట్టుచున్నది. నాకు రాజ్యమే కావలయును. తుచ్ఛ స్త్రీ సంపర్గము నాకక్కరలేదు. స్నేహము, మోహము. మమత అనురాగము నా మనమునుండి తొలఁగవలయును. రాజ్యము రావలయును.

(నిష్క్రమించును.)

# గోవర్ధనసప్తశతి*

(వేటూరి ప్రభాకరశాస్త్రి గారు.)

౧

ఉరము శ్రీవత్స చిహ్నంబు నొట్టియున్న
శౌరి రోమాళి మాకిచ్చు శాంతిసుఖము
పోల్పఁగా నొప్పె నెయ్యది పొడుగుపాటి
కాడగల బొద్దుఁదామర నీడవోలె.

౨

ఒప్పె శివునిదేహ ముద్వాహ మగువేళ
బూది పూఁతతోడఁ బులకరించి
భస్మమాత్రశేషుఁడో స్మరుఁ డిపు డీశ
రీరమందు సంచరించె ననఁగ:

౩

తప్పిదమునకంటె నొప్పించుచున్నది
నీదు మోసపల్కు నిర్దయాత్మ
కత్తి కోతకంటెఁ గడు దుస్సహంబయి
నాఁటు కట్టుసూఁది పోటువోలె.

౪

జంటగా నీటి యురవడి వెంటఁగాఁగ
నిద్దరికి నద్దరికి నెదురెదురు గాఁగ
అరుగుచిర్వురు సూర్యోదయం బయినను
పడుచులౌర మాఘస్నాన ముడుగరయిః.

౫

తలుపు బొరియలోఁ జే వేగ మలచి బొసివి
సుదతి నెమ్మేని సంస్పర్శ సుఖముఁగాంచి
పొంగెఁగాబోలు దత్స్పర్శమునను మరల
నిఱికికొని రాద నాచెయ్యి బొరియనుండి.

౬

సరసమగు వాక్కు రతివేళ సాధ్వివోలె
రక్తిఁగూర్చు సలంకార రహితమయ్యు
అరసమగు వాక్కు ప్రత్తెలియట్లు ముద మొ
సంగఁబాల దలంకార సహితమయ్యు.

౭

కుఱ్ఱని నిండారి సీరాక గోరియుచట
సత్తపోదని దాఁచె నీ యయి గ్రీయ
మేకవస్త్రీడ నైతేమి ? సిగ్గఁ గ్గ
నౌర యువనీసమున గొప్ప గౌరవంబు.

౮

అన్యముఖమున దుర్వాద మైనమాట
అదియె ప్రియముఖమునఁ బొగడనగును
అన్య శాఖంబునను ధూమ మనఁబడునది
యగురు కట్టైను ధూపమై యొద్దృతమగు

౯

ప్రసిక లెందుఁగాని కసిగందు రోసనది
యల్పమగు నదంగు నింటిలోన
వగున చూడరాదె పడగల్లు చున్నది
యగునదంగు మతియు నంటలోన.

౧౦

వినయము విధేయతయు సేవయును గుణములు
గణుతిగాంచును సత్కులాంగనలయందు
కినకయును బ్రాంతివయు వామ్యమును
గుణములు!
గణుతి గాంచు విలాసినీ మణులయందు॥

---

* గోవర్ధన సప్తశతిలోని గొన్ని శ్లోకములకు తెలుఁగు.

# కుక్క కాటుకు చెప్పు దెబ్బ

యస్. సుబ్రహ్మణ్యముగారు.

సోమశేఖరరావుగారు — శివాభిమాని.

శ్రీపతిగారు — కేశవాభిమాని.

అనంతం — వైదికి.

ఉమామహేశ్వరరావుగారు — సోమశేఖరరావుగారి మిత్రుడు.

శంకరయ్య — సోమశేఖరరావుగారి కుమారుడు. మోడరన్ ఫేషన్

కేశవరావు<br>చక్రపాణి | అనంతం మిత్రులు.

## 1వ రంగము.

స్థలము ;— విరోధపుర నడివీధి.

కాలము ;— మధ్యాహ్నము ఒంటిగంట.

(సోమశేఖరరావుగారు, ఉమామహేశ్వరరావుగారు కూర్చుందురు. శ్రీపతిగారు వచ్చుచుందురు శ్రీపతిగారిని చూచి)

సోమ ;— ఉమామహేశ్వరరావు! ఆ కొంగకాళ్ళ నామం అయినా ఆ శ్రీపతిగారిని చూచినావా?

ఉమా ;— కొంగకాళ్ళంటా వేమిటి? ఎవరియిష్టం వారిది. ఆయన విన్నాత్తేసించలేడా.

(ఇంతలో శ్రీపతిగారు ప్రవేశింతురు)

సోమ ;— ఏమండీ, శ్రీపతిగారూ! మీకు మాట భారముగా వచ్చుచున్నట్లున్నదే. నామము దిట్టముగా పెట్టుటచే జలుబుచేసి పడిసెము పట్టినదా యేమి?

శ్రీప :— లేదండీ! ఈమధ్య నూరికివెళ్ళి వచ్చాను లెండి. నీళ్ళు క్రొత్తచేసినవి. కాని మీరిప్పు డేదో సెలవిచ్చారే, దానిని మరోమాటు సెలవివ్వండి ?

సోమ :— ఏమీ లేదండీ. నామము దిట్టముగా పెట్టుటచే జలుబు చేసినదా యేమి యని యడిగితిని.

శ్రీప ;— నామము దిట్టముగా పెడితే జలుబు చేస్తుందా యేమిటండీ ?

సోమ :— సుద్దరగదీసి పెడతారు గనుక ఒకవేళ నెక్కువగా పెట్టుటచే జలుబు చేసిందేమో అనుకున్నాను.

శ్రీప ;— సుద్ద యెంత మంచి గుణము చేసునో తెలియునాండీ? దేహములోని దుష్టవేడిమిని హరించి శరీరమును సమతత్వములోనికి మార్చును. అయితే సోమశేఖరుడుగారూ! బూడిద పూసుకొనుటచేతను రోమకూపములు పూడిపోయినాయా యేమిటండీ లేకుంటే శరీరము పగుళ్ళు బయలుదేరింది? గేదెకు మెడలో గుదిబండ కట్టినట్లు మెడలో పట్టెడేసి రుద్రాక్షలు ధరించుటచేతనా యేమిటండీ మీ మెడ మీద కాయలు కాచినవి?

సోమ :— (కోపముతో) మా విభూతి రుద్రాక్షల మహిమ నీకేమి తెలుసునయ్యా? స్కాంద మహాపురాణమును తీసి చూడండి.

శ్రీప :— "గేదె కేమి తెలియును అటుకుల రుచి" యన్నట్లు మా యూర్ధ్వపుండ్రముల మహిమ మీ కేమి తెలియును.

## 2 వ రంగము.

(ఇంతలో అనంతం నరదాగా నిలువుబొట్టు పెట్టుకొని ప్రవేశించును.) (అనంతమును చూచి)

సోమ;- ఏమోయి ! నిలువుబొట్టు పెట్టినావేమి? మీలో నెవరయినా వైష్ణవం పుచ్చుకున్నారాయేమిటి?

అనం:- (నవ్వుచు) (శంకరయ్యనుద్దేశించి) ఏబొట్టులేకుండ కళాయిచేసిన చిప్పవలె, చిత్రిక పట్టిన బల్లవలె, పేత్రకర్మ చేసేవాని మొగం వలె వెల వెల బోతూ నుండేకంటె, ముఖమున కందము నిచ్చెడు తిలకము నేవిధముగా ధరించిన నేమి? నిలువు బొట్టయితే నేమి, అడ్డ బొట్టయితే నేమి ? ఇందు గొలేని గొప్ప తన మందులో నేమున్నది ? రెండును ముఖ వికాసముకొరకే పెట్టుకొనుట. "శివాయ విష్ణురూపాయ శివ రూపాయ విష్ణవే" యని యార్యులు శివకేశవులకీ భేదము గల్పించి యున్నారు. పరమేశ్వరు డొక్కడే. కాని మేమే తెలిసినవారమని దురభిమానము పెట్టుకొని శివుడు గొప్పని మీరు, విష్ణువు గొప్పని వారు వాదించడం, కేకలు వేసుకోడం, ఆఖరికి శిఖపట్ల గోత్రంలోకి దిగడం. మీకిష్టమైన బొట్టు మీరు పెట్టుకున్నారు. నాకిష్టమైన బొట్టు నేను పెట్టుకున్నాను. వారికిష్టమైన బొట్టు వారు పెట్టుకొన్నారు. దీని విషయమై యింతరాద్ధాంత మెందుకండి. అయితే, ఇందాకా మీరు సెలవిచ్చినట్లు బొట్టు పెట్టుకుంటేనే , వైష్ణవం పుచ్చుకున్నట్టినా యేమిటండి. మా వైష్ణవం మాటకేమి లేండి, మీఅబ్బాయి కళాయి చేసిన చిప్పలా ముఖమున బొట్టు లేకుండా, కోటు, బూటు, హేట్ వేసుకొని రిఫ్రెష్మెంటు రూమ్సులోనికి వెడుతూంటాడు. మీయింట్లో క్రిష్టియానిటీ స్వీకరించారా యేమిటండీ!

సోమ;- (మాట్లాడుటకు తోచక కోపముతో) ఇప్పటివాళ్ల లక్షణములే యివి. పెద్దవాళ్ల నెదిరించడం.

అ:- పెద్దవాడేమిటి, పిన్నవాడేమిటి గౌరవముగా మాటలాడక పోయిన తరువాత. ఎవరినంటే ఎవరు పడతారండి. పిచ్చిమాట.

సోమ:- (ఏమియు తోచక వెళ్ళిపోవును.)

అందరు నిష్క్రమింతురు.

## 3 వ రంగము.

స్థలము;— కేశవరావు యింటి సావడి.

కాలము:— సాయంకాలము 7 గంటలు.

కేశ;- చక్రపాణి! మొన్న శైవులకు వైష్ణవులకు జరిగిన దావా యేమైందోయి.

చక్రి;- ఏమీ అవలేదు. ఇంకా జరుగుతూనే ఉందోయి, వీళ్ళిద్దరు మన ఊరుని ధ్వంసం చేసి పారేస్తూన్నారు పార్టీల మూలాన్ని,

(ఇంతలో ననంతం ప్రవేశించును.)

కేశ;- Dear Anantam, Good night, take this chair. బైది బై విశేషాలేమిటోయి.

అనం;- ఏమున్నాయి, ఈమధ్య బొట్టు సమస్య యొక్క క్రొత్తసమస్య బయలుదేరి ప్రపంచమునందా దోళన చేయుచున్నది.

చక్ర:- బొట్టు సమస్య యేమిటోయి ఎక్కడా వినలేదు. ఎక్కడ బయలుదేరింది మొదట?

అనం:- మన వూళ్ళోనే.

కేశ:- ఈ దావాలేకాక యిదోటికూడ బయలుదేరిందా యేమిటి. అసలు దానిసంగతేమిటి.

అనం:- నేనీవాళ నర్దాగా నిలువుబొట్టు పెట్టుకొని వడివీధిలోనికి వెళ్ళేసరికక్కడ సోము

శేఖరశాస్త్రిగారు శ్రీపతిగారు తిలకధారణను గూర్చి కేకలేసుకుంటున్నారు. నేను వెళ్ళే సరికి నన్ను చూచి సోమశేఖరరావుగారు వైష్ణవం పుచ్చుకున్నావా యేమిటోయి నిలువుబొట్టు పెట్టేవని అడిగేటప్పటికి నే నేబొట్టు పెట్టుకుంటేనేమండీముఖ వికాసము కావలెను? భగవంతుడు ప్రాకడే యని చెప్పి మీఅబ్బాయి సూటు, బూటు, హేట్ వేసు కొని బొట్టు పెట్టుకోకుండా రిఫ్రెషుమెంటు రూమ్సులోనికి వెళ్ళుచున్నాడు మీయింట్లో క్రిష్టియానిటీని స్వీకరించారా యేమిటి అని అడిగేటప్పటికి మాట్లాడ కేమేమో గొణుకు కొనుచు నింటికి పోయినాడు.

కేశ, చక్రి:- "కుక్క కాటునకు చెప్పుదెబ్బ" న్నట్లు మంచి బాగాచెప్పేవోయి ఆపెద్దమనిషికి జవాబు. ఈకాలంలో వీరిబోటిప్రముఖు లందరూ బయలుదేరి బ్రాహ్మణులు, శూద్రులు, శైవులు, వైష్ణవులు, నియోగులు, వైదీకులు నని కక్షలు పెంచుటచేతనే మన దేశమున కీగతి పట్టినది. లేనియెడల మన కీపాటికి స్వరాజ్యము తప్పక వచ్చియే యుండేది.

(అందరు నిష్క్రమింతురు)

---

# అర్పణ.

కొమరవోలు నాగభూషణరావుగారు.

౧

బికిరపాత్రముం జేబూని బిక్షకొఱకు
 నీదు మందిరమును జేర నిష్ఠురముగ
 నన్ను వెడలించితివి కాని – నగవుతోడ
 స్వాగత మొసంగె నీదు వీక్షణము స్వామి!॥

౨

దేవ! భవదీయ దీక్షాదిదృక్కు జనిత
 హర్ష పులకాంకురంబుల కనుమతించి
 యిహ సుఖంబుల వీడి గ్రహించినాను
 మించు భక్తిని నిన్నుఁ బ్రేమించు విధము.

౩

అమిత కరుణాంతరంగుఁడవైన నీవు
 పూర్ణముగ నిర్దయుఁడవునై పోతి వహహా!
 ఎట్లయిన నేమి? హృదయ మర్పించియెపుడు
 దలఁచుచుందును నీవు వద్దలఁచు వఱకు.

౪

ప్రకృతి గర్భానఁ బ్రేమగీతికల నెన్నొ
 కుసుమ మాలగ నీకు నే గూర్చుదానఁ
 మధుగ సంగీతమున మేను మఱచుదాన!
 ధన్యతం జెందుదానః వదాన్యచరిత!

(పిచ్చి గీతాలనుండి.)

# గ్రంథ విమర్శన.

68. షాజహాను:-

గ్రంథకర్త:- దినవహి సత్యనారాయణగారు, రాజమహేంద్రవరము.

ఈ నాటకము వంగదేశపు నాటకకళావేత్తయైన ద్విజేంద్రలాలు రాయిగారిచే వంగభాషలో రచింపబడినది. దినవహి సత్యనారాయణగారిచే నాంధ్రీకరింపబడినది. ఇయ్యది షాజహానుయొక్క పుత్రవాత్సల్యముతో ప్రారంభమై "శేషం కోపేన పూరయేత్" అను సామ్యముగ జోహారతున్నీసాయొక్క శుష్కక్రోధముచే పూర్తిచేయఁబడినది. సోదరుల గడతేర్చి రాజ్యమున నితరవారసులు లేకుండ చేసి యౌరంగజేబు తానొక్కడే సింహాసనము నాక్రమించుటకై చేసిన ప్రయత్నములు పన్నిన కుయుక్తులు అసత్యప్రమాణములును బాగుగ వ్యక్తీకరింపబడిన వనుటయే యిందలి సారాంశము. సామ్రాజ్యము నెడమకాలదన్ని సార్వభౌముడైన తాతగారిని చెరబట్టినప్పుడు మహమ్మదు చూపిన పితృభక్తి జహానారాను గెంటుమని యాజ్ఞాపించినప్పు డేమూలకేగినదో తెలియదు. ఔరంగజేబువద్ద నుత్తరకుమారప్రజ్ఞల నరకి తిరస్కరించిన యశవంతసింహుఁడు ద్రోహియై మోసమునకొడిగట్టి యలంఘీరునకు దాసుఁడయ్యెను. శూజాయొక్క యుద్ధపు కలవరములో పియారాయొక్క పరివర్తన మాశ్చర్యకరము. ఈసహోదర ప్రాణాపహరణ మహోత్పాతావరణములో భర్తకు సలహా చెప్పుట లేకపోగా వ్యాకరణ దోషముం కుంటి బాస యని తప్పు లెన్నుచు వెక్కిరించినది. ఈ రెండును అజాగళస్తనమువలె నున్నవి, మొత్తముమీద నిది నాటకమగునా కాదా యని యోచించవలసి యున్నను నౌరంగజేబుయొక్క రాష్ట్రసంగ్రహణాతురతను జూపుటకే యీ రూపకమును వ్రాయనెంచినట్లు గ్రంథకర్తయొక్క యభిప్రాయమని తోచుచున్నది. అందుచే మిగిలిన నాటక లక్షణ సంపత్తి మృగ్యమై పోయినది. ఇంక సంగీత భాగమున కీర్తనలకు స్వరము నుపయోగించినారు కాని యదియును జోహారతున్నీసాయొక్క కోపమువలెనే యుపయోగశూన్యమయ్యెను. కారణమేమన స్థాయి భేదములు మాత్రా కాలము ఆవృత్త విభజన లేకపోవుటచే కీర్తన స్వరపరచి అచ్చొత్తించుట యెట్టిదో తెలియదని నిశ్చయింపవలసియున్నది. అనువాదకులైన సత్యనారాయణగారు కేవలము వంగనాటకము నాధారము చేసుకొనిరో లేక హిందీభాషలో బరివర్తనమైన దానిని గూడ చదివియుండిరో మాకుఁ దెలియదు. అయినను సాధ్యమయినంతవరకు గ్రంథకర్తయొక్క అభిప్రాయము పోకుండ జాగ్రత్తతో వ్రాసియున్నారు. శైలి మృదుమధురమైనదే గాని కొన్ని కొన్నిచోట్ల వ్యాకరణ సంబంధమైన శబ్దలోపములు కానవగును. కాని "లోకోహి దోషా గుణసన్నిపాతే" అను కాళిదాసోక్తి ననుసరించి రూపకానువాదమున నా లోపములంతగా కనుపట్టవు. మొత్తముమీఁద నాటకము చాల బాగుగా నున్నదని చెప్పవలయును. కథాకల్పనమందలి పరస్పర వ్యాఘాతమున్నచో నయ్యది గ్రంథకర్తృస్వాతంత్ర్యము గాన దానిం గూర్చి వక్కాణింపఁ బనిలేదు. కాని భాషాకోవిదులైన సత్యనారాయణగారిని మేము కోరునదేమనగా, ఇంతకన్న వంగ, హిందీ భాషలయందలి యుత్కృష్ట గ్రంథరత్నము లనేకము లున్నవి. వానిని చక్కగా మృదువైన శైలిలో తెలుగున భాషానువాద మొనర్చి భాషకును దేశమునకును ధర్మమునకు నాదర్శప్రాయములైన గ్రంథముల రచించి యాంధ్రుల ప్రోత్సాహములకు పాత్రులగుదురు గాక యని నమ్ముచున్నాము (కే. రా.)

69. బసవపురాణము:-

ఆంధ్ర గ్రంథమాలనుండి "బసవపురాణము" వందనములతో నందికొంటిమి. ఇది రాయల్ సైజున 246 పుటలతోఁ జక్కఁగా నచ్చొత్తింపఁబడినది. దీనికిఁ బ్రకాశకులగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు 24 పుటల ప్రస్తావనయు బరిష్కర్తలయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 129 పుటలు గల పీఠికయు వ్రాసి చేర్చియున్నారు.

ఇది పాల్కురికి సోమనాథకవి కర్తృకమగు ప్రాచీన ద్విపదకావ్యము. ఇందలికథ వీరశైవమతబోధకము, దేశిరచన భావములందును భాషయందును గూడ స్వాతంత్ర్యము నొందు.

వీరశైవ మతవ్యాపకుఁడగు కథానాయకుఁడు శ్రీశైల ప్రాంతమున నొక సాధారణ విప్రకుటుంబమున జన్మించినవాఁడు. బాల్యముననే యుపనయన సంస్కారము నొల్లక తలిదండ్రుల నెదిరించి కూనసమునకడ చేరి వివాహితుడయ్యె. అంతఁ గొంత కాలమునకుఁ గళ్యాణ

కటకాధీశ్వరుఁడగు బిజ్జలునికడ దండనాయకుఁడై యల్లమ ప్రభువను శైవాచార్యుని కృపచే వరములందఁ గలిగెను. అంతటినుండి యనేకాద్భుతకృత్యము లొనర్చుచు శివభక్తులకై బొక్కసమునఁగల ధనమెల్ల వెచ్చఁబుచ్చుచు వచ్చెను. తుదకు నిజమతావలంబుల శిక్షించెనని రాజుని బోడిపించి తాను గూడలి సంగమేశ్వరమున లింగైక్యమునందెను. ఇతఁడు వర్ణాశ్రమాచార ధర్మముల నతిక్రమించి జాతి మతభేదములం బాటింపక వీరశైవదీక్షనూని దృఢసంకల్పమునఁ జరింపజాలిన సాహసికుఁడు.

రచయితయగు సోమనాథుఁడును శివకవులందు మేటియై జంగమ భక్తిస్వామ్యమున శివతత్త్వానుభవమున సాటిలేదనుచు నచ్చమైన జానుఁదెనుఁగున నిచ్చవచ్చినట్లెల్లఁ బ్రాస యత్యాదులం బెట్టి లాక్షణికులుగాని యపూర్వ ప్రయోగము లనేకములు వైరిపదాదులు చేర్చి కూర్చిన స్వేచ్ఛాకవి.

సర్వవిధముల స్వాతంత్ర్య మపేక్షించు నీకాలమున కనువయిన పద్ధతిని యుద్బోధించు కబ్బముగాఁ బ్రకాశకు లిద్దాని సేకరించినారు. కవియు నిజయశోవ్యాప్తికి దేశోద్ధారకులం తోడ్పడనైయుండురనియే కాఁబోలు వీరి వంశోద్ధారకుఁడైన "శ్రీపతి పండితయ్య"ను మున్నే కొనియాడియున్నాఁడు. వీరి ప్రస్తావనలో వీరశైవతత్త్వోద్బోధనమున సర్వమతసమ్మతతత్త్వనిర్ధారణమునకై పాటుపడిన దెంతయుఁ బ్రశంసార్హము.

ఇట్టి పరిష్కర్తలును నవీన విమర్శన విధానముల ననుసరించి వివిధశీర్షికలందు విపులముగా ననేకాంశముల జర్చించుటచే విద్యుద్దీపికాశోభితమగు పెద్ద సౌధముల చెడఁగులేక పాదరింధ్రసొబగు నానగు నిసర్గశృంగార మొప్పు నీకావ్యరత్నమునకుఁ బ్రభాకరులేయై దీనికి వన్నె తెచ్చి తాము వన్నె కెక్కఁగలిగినారు.

ఇక్కాలమున నిట్టి భాషాసేవయే యన్నిట వన్నె తేఁదగియున్నది కదా. అందును మహాశయులగు శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారీనవుడిట్టిది నిరాటంకముగా గొనసాగుట కేయభ్యంతరము నుండదు. ఇట్టి రమణీయ కుసుమములనేకము లీగ్రంథమాలనుండి వెలువడుచుండెడుంగావుత.

( నా. సో. ధ. )

**70. సుమతీతారావళి;- ( వెల 0-1-3 )**

గ్రంథకర్త అంగలూరు వాస్తవ్యులు, కొగంటి దుర్గా మల్లికార్జునరావుగారు.

**71. మల్లికార్జునరాయతారావళి;- ( వెల 0-1-3 )**

గ్రంథకర్త అంగలూరు వాస్తవ్యులు కొగంటి దుర్గా మల్లికార్జునరావుగారు.

**72. దేశబంధుస్మృతి;- ( వెల 0-0-9 )**

గ్రంథకర్త అంగలూరు వాస్తవ్యులు కొగంటి దుర్గా మల్లికార్జునరావుగారు.

పై మూడు చిన్ని పుస్తకములును సరసమై సులభగ్రాహ్యములగు పద్యములతో నిండియున్నవి.

**73. ప్రభాతము;- ( వెల 0-4-0 )**

గ్రంథకర్త తుర్లపాటి గోవర్ధనరావుగారు, గవర్నరుపేట, బెజవాడ

తుర్లపాటి గోవర్ధనరావుగారు ఆధునిక భావకవులలో నొకరు. వీరికవితధారాశుద్ధిగలది, భావగర్భితమైనది. వీరి "ప్రభాతము" లోని కొన్ని పద్యము లిదివరకు మా ఆంధ్రభారతిలో ప్రచురింపబడియున్నవి. కనుక వీరి "ప్రభాతము"ను గురించి అంతగా వ్రాయవలసిన పనిలేదు. పుస్తకము వెల నాలుగు అణాలనుండి రెండు అణాలకు తగ్గించవచ్చును. ఈ చిన్ని గ్రంథము నాగేశ్వరావు పంతులుగారి కంకిత మియ్యబడినది.

**74. చంద్రముఖి;- ( సాంఘికనవల. )**

బందరు శ్రీలక్ష్మీనరసింహా గ్రంథనిలయపు ఎనిమిదవ ప్రచురణము. గ్రంథకర్తః- మరంగంటి పార్థసారథిగారు బి. యె. క్రౌను అష్టపో 317 పేజీలు. వెల చందాదారులకు 0-12-0 లు, యితరులకు 1—4—0.

**75. కాళికాంబాస్తవము;-**

గ్రంథకర్తః- అయితం కాళీవరప్రసాదరావుగారు, శ్రీకాకుళం, గంజాం జిల్లా. మొదటి ప్రచురణము మాత్రమే. అరణా తపాలా బిళ్ల పంపినవారికి ఉచితము.

**76. గాంధి శతకము;-**

గ్రంథకర్త భాగవతుల నరసింహశర్మగారు, ప్రొప్రయిటరు వేగుచుక్క గ్రంథమాల, బరంపురం, గంజాం జిల్లా. వెల రు 0—4—0

మానవస్వభావములోని లోపములను నిరసించుచు గాంధి జీవిత తత్త్వముయొక్క ఔత్కృష్ట్యతను స్పష్టీకరించుచు గ్రంథకర్తరమ్యమగు శైలిలో భావోద్రేకమైన సీస పద్యములను రచియింపగలిగెను. పద్యముల ధారా

శుష్కిని మానవలోప నిరసన చాతుర్యమునుగాంచి నపుడు రుగ్మతిని రచించిన సింహాద్రినారసింహశతకము స్ఫురణకు వచ్చుచుండును.

77. శృంగారకాళిదాస కథలు .—

(ప్రథమభాగము)

గ్రంథకర్త: జె. కృష్ణస్వామిశర్మగారు వెల 1-0-0 మద్రాసు శృంగార గ్రంథ మాల వారికుసుమము. సంస్కృత కవితాపితామహుడు కాళిదాసు. అక్షర జ్ఞానశూన్యశాలుడు తపోసాస్కారముచే అఖండ తేజోవంతమగు ప్రావీణ్యమును సంపాదించిన కాళిదాసుని జీవితములోని చమత్కార పూర్వకమగు హాంశములను నెరుగని యాంధ్రుండుండడు కాళిదాను శృంగారపుర రాజాస్థానమును చేరి యచటి రాజ కుమారుని పక్షమున భోజరాజు కుమార్తె నోడించుటవరకు నీ భాగమున వివరింపబడినది ఏ బెంజమిన్ ఫ్రాంక్లిన్ జీవితమో, ఏ కలరా పుస్తకమో పరశాగంథముగ బ్రస్తుత విద్యావిధానము నిర్ణయించుచున్నదిగాని, యిటువంటి యత్యుత్తమ గ్రంథ రాజములను పాటించుట లేదు.

78 విషమరహస్యము; (నిరూపకనవల)

బరంపురం వేగుజుక్క గ్రంథమాలవారి 26 వ ప్రచురణము 225 పేజీలు డెమ్మి ఆక్టేవో వెల రు 1—0—0 గ్రంథకర్త: వారణాసిభానుమూర్తిగారు.

ఇదియొక అపరాధ పరిశోధకనవల. వేగుజుక్క గ్రంథమాలలోని తదితర నవలలవలెనే నిదికూడ సులభశైలిని వ్రాయబడినది.

79. ఆంధ్రవీరులు;—(రెండవ భాగము.)

గ్రంథకర్తలు: శ్రీశేషాద్రి రమణకవులు నందిగామ కృష్ణాజిల్లా. ప్రకాశకులు బెజవాడ శ్రీవెంకట్రాం అండుకో వారు వెల రు 0—10—0 లు క్రవున్ ఆక్టేవో 194 పేజీలు

కొంతకాలముక్రిందట మొదటి భాగమును విమర్శించు భాగ్యము కలిగినది. ఈ రెండవ భాగమునగూడ ననేక వీరుల జీవితములు చేర్పబడినవి. శేషాద్రిరమణకవుల చారిత్రిక పరిశోధనలు సుప్రసిద్ధములు. వీటిని యాదరించు భారము ఆంధ్రులది. ఆంధ్రభాషలో ననేక రకముల గ్రంథములు ప్రచురణమగుచున్నవి. పాఠకులకు కొన్నిటియెడ యేహ్యాభావముండుటలో నాశ్చర్యము లేదు. వ్యర్థగ్రంథము లనేకములు తయారగుచున్నవని విచారింప నక్కరలేదు. అమూల్యములగు స్వల్పగ్రంథములనే యాదరించి భాషను చరిత్రను పోషించవలసిన బాధ్యత మనపైనున్నది.

---

ఊహాతరంగములు. శివప్రభాకరులు.

మ॥ అదిసాయం సమయంబు; తద్విమలసీ ♦ లాకాశ మార్గంబునన్
బది బారల్ మిగిలెన్ దినేశునకు శుం ♦ భన్మూర్తియా సూర్య నీరద
మొక్కొక్కటిగా దిశన్ వలుచనై ♦ వ్యాపించి కప్పెన్ భళీ!
యావియ్యా మోదమైన యట్టి నవద్ప ♦ శ్యంబొచుం జూపట్టెడిన్॥ 1.

సీ॥ కాలజీమూతంబుఁ ♦ గాంచి మయూరాళి ♦ తైతక్క యాడు న ♦ త్యంబునల్పె।
నాట్యావలోకనా ♦ నంద తన్మయముచే ♦ దలలూపె వృక్షనం ♦ తతుల వల్ల।
గంధ ... హులుఁడు పుష్ప ♦ గంధమ్ముచేకొని ♦ ప్రీతి కాళికిఁ బంచి ♦ పెట్టుచుండె।
న ... యను న్య ♦ త్యంబు నాలోకింప ♦ గూండ్ల పుల్గులు జేయు ♦ కొనుచునుండె।
గీ॥ రామణీయకమైన త ♦ త్ప్రాంత మప్పు!
డమిత శోభాయమానమై ♦ యమరియుండె; ।

హ్మోతలంబున నుండు దృ ♦ శ్యంబులందు ।
బ్రకృతి దృశ్యంబు మించు । చిత్రింబుగలదె ॥ 2.

గీ॥ అట్టి యాహ్లాదకరమగు ♦ నవసరమున ।
మారుతాహతి రాలెడి ♦ పారిజాత ।
పుష్పముల వగిది జలదం ♦ బులను వీడి !
వడిగ వర్షాంబు కణములు ♦ వడియె పుడమి ॥ 3.

కం॥ భూరమణి నూతనాలం
కారంబుల దాల్చియుంట ♦ కాబోలును త
న్నీరదముల వెన్క నిలిచి
సూర్యుండటు తొంగి తొంగి ♦ చూడంగసాగెన్ ॥ 4.

చం॥ ధరపయి వర్షబిందువులు ♦ తళ్కుతళ్కు జిల్కెడు మేఘపాత్రి మం ।
బరతల నాట్య రంగమును ♦ బాయుచు మెల్లన నిష్క్రమింప భా
స్కరుండు స్వపాత్రపోషణకు ♦ కాంచనవర్ణ సమంచిత ప్రభా
కరమృదు మందహాసములం ♦ గల్పన చేయుగ సాగనయ్యెడన్ ॥ 5.

సీ॥ ప్రాగ్దిశనిండ్రి చా ♦ పంబునుంగని బాలు ♦ లానందమునం దేలి ♦ యాడుచుండ
వరుమూలాలముల పక్షి ♦ తతి రెక్కలు విదిల్చి యెచటికో "రివ్వున" ♦ నేగుచుండం
గాపుచేడలు చేల ♦ గట్టుల ప్రియులను ♦ వింతమాటలను న ♦ వ్వించుచుండం
బ్రకృతి సౌందర్యంబు ♦ బరికించి కవివరు ♦ లంతకంతకు ముగ్ధు ♦ లగుచునుండ

గీ॥ రవిని సర్వలోకైక బాం ♦ ధవునిగాంచి
వలుది యులరులు, శ్యామల ♦ పత్రములును
భక్తి నంతోషములు రెండు ♦ పైకొనంగం
గడిది ముత్తైపు కన్నీరు ♦ కార్చుచుండె ॥ 6

ఉ॥ ఇట్టి విచిత్ర దృశ్యముల ♦ నెట్టుల సృష్టి యొనర్చినావొ పా
శ్చెట్టుల రంగులం గలిపి ♦ హృద్యముగా రచియింపనేర్చి
దిట్టరి చిత్రకారుండ! త్వదీయ విధంబది యొల్లచిత్ర వీ
వెట్టులో యిట్టి విద్య గ్రహిం ♦ యించితి వింకెట చెప్పనేటికిన్ ॥ 7.

ఈశ! నీవిద్యలో నొక ♦ లేశమేని
బోధచేయగ రాదె నై ♦ పుణ్య మొదవ
క్రమము తప్పక నేర్చుకొం ♦ దుముగదయ్య
భక్తి భవదీయ శిష్యుగా ♦ వసరమిందు ॥ 8

# చంద్రసేనుడు.

శింగంపల్లి వెంకటాద్రిగారు

పదవ శతాబ్దమున రాజపుత్రస్థానమును కమలవిజయుడనునాతడు పాలించుచుండెను. అతని ముఖ్య పట్టణము వల్లభాపురము. అయ్యది ఇప్పటి ఉదయపురమున కతి సమీపమున నుండియుండెను. మధుసూదని కమలవిజయుని అర్ధాంగలక్ష్మి. అత్యంత సౌందర్యవతి వారిరువురును సీతారాములవలె, రాధాకృష్ణులవలె పరస్పరానురాగము గలిగి సమకాలికులకు ఆదర్శప్రాయులుగ నుండిరి.

ఆ కాలమున పారశీకమును 'నౌషర్వాంజీ' యను నతడు పాలించుచుండెను. అతని కొమారుడు గౌహార్జంద్. ఇతడు పరమ నీచుడు, దుర్విషయలంపటుడు. పరదారాభిలాషి. మధుసూదని సౌందర్యాతిశయములను వినిన వాడగుటచే ఆమెను వశపరచుకొనదలచి పెక్కండ్రు సామంతులతో గొప్ప సైన్యమును వెంట నిడుకొని రాజపుత్రస్థానముపై దాడి వెడలెను. రాజపుత్రస్థానము ప్రవేశించినతోడనే, నీ భార్యను నాకొసగి సుఖముగ నుండుము! అని లేఖపై వ్రాసి కమలవిజయున కంద జేసెను. శూరాగ్రేసరుడగు కమలవిజయుడిట్టి నీచ కార్యమున కొడిగట్టునా? తక్షణమే సర్వసైన్య పరివృతుడై గౌహార్జంద్ పై యుద్ధమునకు తారసిల్లెను. ఇరువాగులవారును తీవ్రముగ పోరాడ జొచ్చిరి ఎందరో పారశీకులు హైందవ శూరుల నిశిత ఖడ్గములకు బలియైరి. కమలవిజయుడతి సాహసముతో శత్రురాజుల దునుమాడుచుండెను. కమలవిజయుడు దస్సియున్న తరి భార్య సమీపించి కొంతవడి విశ్రాంతిగైకొన బ్రార్థించి స్వయముగ తాధనుర్బాణముల జేబూని మహిషాసురమర్దనివలె విజృంభించి యుద్ధరంగమున బ్రత్యక్షమై అతిసాహసముతో బోరాడజొచ్చెను. స్త్రీ యిట్టి సాహసమునకు బూనుకొనుట పారశీకులదివఱకు కనివిని యెఱుగనందున వారికెంతయో వింతగానుండెను. కొందఱామెను పొగడజొచ్చిరి మఱికొందఱు పరిహసించిరి ఇక కొందఱు నిందింపసాగిరి. ఆమె యెందఱనో తన శర పరంపరలచే విగతజీవులుగ నొనర్చియు పలాయితులుగ జేసియు యుద్ధకళానైపుణ్యమును వేవిధముల ప్రదర్శించెను. కమలవిజయుడు తన సహచారిణియగు మధుసూదని సాహస విక్రమముల కచ్చెరువొంది ఆమెను మఱింత ప్రోత్సహించెను. ఇట్లుండ కొంత సేపటి కొక పారశీకుడు రహస్యముగ కమలవిజయుని సమీపించి కత్తితో పొడిచి వైచెను. పాపమాతడు నేలపై బడి యటు నిటు కొట్టుకొనుచుండెను. మధుసూదని యీజాడ పొడగట్టి తోడనే భర్త సాన్నిధ్యము నుండి వఱుగెత్తిపోవుచున్న నా హంతకుని ఎదుర్కొని తూలనాడుచు బాణమొకటి సంధించి వాని వక్షస్థలమున నాటవేసెను. మొదలు నఱకిన మ్రానువలె నాతడు నేలపైబడి ప్రాణముల వీడెను. మధుసూదని మనోనాథుని పాదములపై బడి రోదన మొనర్ప కమలవిజయుడు యూరడించి కొన్ని హిత వాక్యముల బలికి జీవములు వదలెను. భర్తృ సందేశానుసారముగ ఆమె యించుకయైన చలింపక ధైర్యమవలంబించి మహాగ్రజ్వాల గ్రక్కుచు శత్రుసైన్యములపై నుఱుకి ఎందఱనో హతమొనర్చి, ఎట్టకేలకు భగవదనుగ్రహమున పరమ కిరాతుడగు గౌహార్జందుని దునుమాడి కృతకృత్యురాలయ్యెను గౌహార్జందు మడసిన తోడనే పారశీక సైనికులు పిక్కబలము జూపి

మృత్యు ముఖము నుండి తప్పించుకొనిపోయిరి. మధుసూదని భర్త మరణానంతర కృత్యములు సక్రమముగ సశాస్త్రీయముగ నిర్వర్తింపజేసి తదనంతరము కోశాగారమునకు జని తనకై - తన నాధునికై రణరంగమున దేహత్యాగ మొనర్చిన వీరుల భార్యా బిడ్డల రావించి భూరి విరాళము లొసంగి సంతృప్తుల గావించి పంపివైచెను. మఱికొన్ని దినములకు ముఖ్యమంత్రిం బిలిపించి రాజకార్యముల గుఱించి ముచ్చటించి, తాను ఉదయపురమునం గల మాతృగృహమునకు పోదలచెననియు, తన గర్భస్థమగు శిశువు భగవదనుగ్రహమున పురుషుడగునట్టి భాగ్యమబ్బెనేని ఆతడు ద్వాదశవర్ష ప్రాయమున రాజ్యస్వీకారమునకు చంద్రసేనుడను నామముతో రాగలడనియు, అంతవఱకు రాజ్యముయొక్క బాగోగులు తమవిగ జూచును తమకు ప్రతినిధిగ సమర్థుడగు సోమకుని నియమించి రాజ్యపాలన మొనర్పదగుననియు బలికి సర్వస్వము ముఖ్యమంత్రివర నొనర్చెను.

మధుసూదని యా వేకువజాముననే గోపికా వేషమును దాల్చి అంతఃపురమును వీడి కొన్ని దినములకు నాగేంద్రపురమను నొక పట్టణమునకు జేరెను. అచట 'యశోద' యను పేరుతో నొక సంపన్న గృహస్థుని యాశ్రయించి వానికి జెందిన వేరొక గృహమున కాపురముండ జొచ్చెను. సుగుణయగు నామె కొలది దినములకే యా సంపన్నుని యాలుబిడ్డలతో తలలోని నాలుకవలె కలిసి మెలసి చేదోడుగా నుండి వారి మన్ననలకు పాత్రురాలయ్యెను. అష్టైశ్వర్యములతో తులదూగుచుండిన నాపరమసాధ్వి మహారాజ్ఞి తన ప్రస్తుత స్థితికి అప్పుడప్పుడు వగచుచుండెడిది. కాని గర్భస్థమగు శిశువున కేమి ముప్పు వాటిల్లునో యను భయముచే మఱల ధైర్యము చిక్కబట్టి దైవముపై భారము వైచి కాలము వెళ్ళబుచ్చుచుండెను. ఐనను చిత్తము చంచల స్వభావము కలదగుటచే ఒకనాడీవిధముగ ఆమె తలపోయసాగెను! "హా; దైవమా; నాకెందుల కీసంతానము. గర్భిణిగ నుండనిచో నాహృదయేశ్వరునితో సుఖంబుగా వీరస్వర్గమున కేగియుందును గదా! మేమిరువురము పుత్రోదయమైనతోడనే మహావైభవముతో దేవోత్సవముల జరుపవలయుననియు, మహీపాలుర నెల్లర నాహ్వానించి విందులు వేడుకలు జరుపవలయుననియు, ద్వాదశవర్ష ప్రాయుడగుటతోడనే పట్టాభిషిక్తుని గావించి తనయుడు ప్రజానురంజకముగ పాలించుచుండ చూచి యానందింపగలుగుదుమని యువ్విళ్ళూరుచుంటిమే! అట్టి మా కోర్కెలన్నియు స్వప్నగత వృత్తాంతములాయెగా? ఈ దుష్ప్రపంచమున నిట్టి సౌందర్యవతిగ నేనేల జననమొందవలయు? సామాన్య రూపవతిగ నుండినచో దుర్నీతిపరుడగు నాపారశీక ప్రభువువలన నిట్టి విపత్పరంపరలు కలుగకుండును గదా! అంతయు నా గర్భస్థమగు శిశువుయొక్క దురదృష్టమని చెప్పవగును. కావున "భ్రూణహత్య గావించెద." మఱియు తోడనే పశ్చాత్తాపహృదయయై "ఎట్టి కష్టములు ప్రాప్తించినను శిశురక్షణము గావించుట పరమధర్మము. ప్రయోజనకరము." అని యెంచి యూరకుండెడిది. ఇట్లుండ కొంతకాలమునకు భగవదనుగ్రహము వలన నాగోపిక యొక మగశిశువును కనెను. ఆ శిశువునకు "బాపడు" అను పేరిడిరి. ఆ బాపడు శుక్లపక్ష శీతభానునిపగిది దినదిన ప్రవర్థమాన మొందుచు

చూచువారెల్లరకు యూరువారెల్లరకు సంభ్రమము కలుగజేయుచుండెను. ఆయూరివారిలో కొందరు తల్లిని బిడ్డను చూచి వీరు సామాన్య వంశజులు కాజాలరనియు, ఉత్తమాధికారులై యుందురనియు సంశయించుచు వచ్చిరి. కాని యెవరును యెట్టితొందరలు కలుగజేయక చేతనైన సాయమును జేయుచు వచ్చిరి. ఆబిడ్డడు కొంచెము పెద్దవాడై తోడి బాలురలోనెల్ల చదువు సాములయందును, ఆటపాట లందును వేయిమడంగు లధికముగనుండి వారికి నాయకుడై సాహసకార్యము లనేకము లొనర్చుచుండెను. కొందరీతనిని మిగుల ప్రేమించి పరివరి విధముల బ్రోత్సహించుచుండిరి. బాపనికి తొమ్మిదియేండ్లు నిండెను. ఒకనాడు తల్లి వానిని తొడపై నిడుకొని భోజన మిడుచుండెను అప్పుడతడు తల్లితోడ నిట్లనియె. "అమ్మా! దేశములో నేమేమివింతలుకలవో చూడబోవలయు"

తల్లి:- "నాయనా! పసివాడవు. పదునాలుగు
పదునైదేండ్లు వచ్చినపిమ్మట పోవచ్చునులే!"

బాపడు;- అమ్మా! ఏ మట్లనెదవు? పదునైదు
పదునారేండ్ల బాలురు నాకంటె మొన
గాండ్రా? బలాఢ్యులా?

తల్లి:- అట్లనకుము దేశాటనమువలన కష్టము
లనేకములు కలుగగలవు.

బాప;- ఐనను మిగుల జాగ్రతగా నుండెద.

తల్లి;- లేదు తండ్రీ! కొన్నివేళల పర్వతారణ్య
ములలో పోవలసినపుడు సింహ, శార్దూల,
మత్తేభాది క్రూర మృగములవలనను, విష
సర్పములవలనను ప్రాణహాని కలుగగలదు.

బాప;- ఏమమ్మా! నేనెన్ని విషసర్పముల చంపి
యుండలేదు? క్రూరమృగములొక లెక్క
యా! నాచేత బాణమున్నంతవరకు మృగము
వలన నాకెట్టి భయమును లేదు. వేటాడ
వలయుననియున్నది. పోనిచ్చెదవా తల్లీ?

ఆమె యాతనిధైర్య సాహసముల కచ్చెరువొంది, కొడుకెల్ల విధముల యీడు జోడు వారికంటె ప్రజ్ఞావంతుడని ముదమొందెను. ఆమె వాని తెలివితేటలు గుర్తెరిగినదయ్యును ఒంటరిగ విడచిపెట్టుట కిష్టపడకుండెను. పదునాలుగు పదునైదేండ్లు నిండిన పిమ్మట ఎచ్చటికి పోయినను భయములేదని తల్లి తలంపు. కావున నాతనిని వేవిధముల తొందరపడి పోవలదని బ్రతిమాలుకొనెను. కాని బాపడు తల్లి పాదములపయి బడి "అమ్మా: నాకెట్టిభయమును లేదు. ఒక సంవత్సరము లోపుననే తిరిగి వచ్చెదను. ఇరుగు పొరుగువారితో నిన్ను కనిపెట్టి యుండుడని చెప్పి పోయెదనులే. పోవుట కనుజ్ఞనిమ్ము" అని వేడుకొనెను. తల్లి ఏమియు పనజాలక యూరకుండెను.

దేశాటనము.

మఱునాడుదయముననే బాపడు ధనుర్బాణముల చేబూని నాగేంద్రపురము వదలి పశ్చిమముఖముగా పయనమయ్యెను. కొంత దవ్వేగిన పిదప నొక మహారణ్యమున బ్రవేశించి నిర్భయముగ నిస్సంశయముగ బోసాగెను. ఉత్తమ క్షత్రియకుల సంజాతుడగు బాపడు నిరపాయకరములగు హరిణాదులపయి బోనొల్లక సింహశార్దూల భల్లూకాదులను మాడ ప్రతిజ్ఞగైకొనెను. ఇట్లు పోవుచుండ కొంతసేపటికొక బెబ్బులి తనకెదురుగ వచ్చుట తటస్థించెను. వెంటనే బాణము సంధింప జూచెను గాని గురితప్పిన ముప్పుకలుగునని యెంచి తోడనే చెట్టుపైకెక్కి భద్రముగా గూర్చుండి కర్తవ్యమాలోచించుచుండెను. బెబ్బులియు దిక్కులు

పిక్కటిల్లునట్లు బొబ్బలు పెట్టుచు నాతని పై దుముక సంకల్పించి చెట్టుపై కెగురజొచ్చెను. కాని దానికది సాధ్యము గాకుండెను. అలసించిన హానికలుగగలదేమోయని చింతించి ధైర్యమవలంభించి రెండుమూడు బాణము లొక్కపెట్టున సంధించి దానిపై విడువ నది ఘోషిల్లుచు నేలపై బడి ప్రాణములవిడిచెను. వెంటనే చెట్టుదిగి వచ్చుటకు ధైర్యముజాలక అటునిటు జూచుచుండ కొంత దూరమున నొకవృద్ధసన్యాసి యాచెట్టువైపునకు వచ్చుచుండుట కనుగొనెను.

ఆయన సమీపమునకు రాగా చేతులుజోడించి "మహాత్మా! నేనీపులిని కొట్టివేసితిని. కాని పూర్తిగ చచ్చినదో లేదో యని సంశయించుచున్నాను నేనేమి చేయవలయు? చెప్పుమా" యని ప్రార్థించెను. ఆసన్యాసి వానివంక తేర పారజూచి 'వత్సా! భయపడ నక్కరలేదు. నిస్సంశయముగా చెట్టు దిగిరమ్ము' అని చెప్పెను. బాపడు తోడనే చెట్టుదిగి ఆవృద్ధసన్యాసికి ప్రణమిల్లి దీవన లొందెను. పిమ్మట వారిరువురకీ క్రింది విధముగా సంభాషణ జరిగెను.

బాపడు;- మహాత్మా! ఎచ్చటనుండి యెచ్చటికి బోవుచున్నారు?

సన్యాసి;- బాలకా! సమీప గ్రామమునుండి స్వగృహమున కేగుచున్నాడ.

బాప;- మీరెవరు?

సన్యా;- సన్యాసినని తెలియుటలేదా?

బాప;- మీరేల సన్యసించితిరి? వృద్ధగాత్రులే! మ్చ్చరిద్రూపులే!

సన్యా;- కుమారా! నా విషయము నీకేల? నీకేమి ప్రయోజనముండును?

బాప;- మహాత్మా! ఆగ్రహింపకుము. క్షమింప బ్రార్థించెద. మీచరిత్రి మెరుంగ కుతూహలము జనించెడిని.

సన్యా;- (మందహాసముతో) వినోదార్థముగ సన్యసించితిని.

బాప;- మీరు నవ్వుచున్నారు. సన్యాసులు కారని నా యభిప్రాయము.

సన్యా;- నిశ్చయముగ నే సన్యాసినే!

బాప;- మీకు మంత్రములు వచ్చునా?

సన్యా;- (నవ్వుచు) లెక్కకు మిక్కిలిగా!

బాప;- నవ్వుచున్నారే? ధనుర్విద్య నభ్యసించితిరా?

సన్యా;- ఆ.

బాప;- మంత్రోచ్చాటనమువలన నిద్ర వచ్చునట్లు చేయగలరా?

సన్యా;- ఆ.

బాప;- ప్రాణాయామము తెలియునా?

సన్యా;- అదియొక లెక్కయా!

బాప;- దినముల పర్యంతము?

సన్యా;- నిరభ్యంతరముగ.

బాప;- మహాత్మా! సంభవమేనా? నిజము పలుకుము.

సన్యా;- సంభవమే. అది అభ్యాసము వలన తెలియగలదు.

బాప;- ఆకాశమున నెగురగలరా?

సన్యా;- పక్షినైతే!

బాప;- పక్షి యగుటెట్లు?

సన్యా;- కాకుండిన నెగురుటెట్లు?

బాప;- పరిహసించెద రేల స్వామీ? నిజము చెప్పుము మహాత్మా!

సన్యా;- పరిహాసమనుట నిజము. కాని నీవలె నమ్ముకవా రుండిన ఎన్ని బూటకములైనను చెప్పవచ్చును.

బావ;- మహాత్మా! భూతభవిష్యద్వర్తమానము లెరుంగుదురా ?

సన్యా;- ఆ. ఎరుగుదును.

బావ:- అట్లగుచో తండ్రీ! నేనెవరి పిల్లవాడను. మాతల్లి గొల్లపిల్లవాడనని చెప్పును. ఇతరు లందరు క్షత్రియ బాలుడనని యందురు.

సన్యా;- ఆమాట నిశ్చయమే !

బావ;- క్షత్రియుడనా ?

సన్యాసి అంతట నాబాపని నిజ చరిత్రమంతయు పూసగుచ్చినట్లు చెప్పి యాతని వంశీయు లొనర్చిన సాహస కార్యముల తెలియబలికెను. బాపడదియంతయు శ్రద్ధతో నాలకించుచు నొక వ్వాడు ఆనంద బాష్పములను, మఱొకవ్వాడు శోకాశ్రువులు రాల్చుచు నిర్ఘాంత పోయెను. నిట్టూర్పు విడచి మహాత్మా! నాతల్లి నిజము దాపనేల ? ఇదివరకే మా యీదుస్థితికి కారణ భూతులగు పారశీకుల నందరను హతమొనర్చి యుండునే !

సన్యాసి:- పసితనమగుటచే తొందర పడుచున్నావు. మీతల్లిని నిందింపవలదు. ఆమె మంచి పనియే చేసినది. నీకు శుభము కలుగుగాక. నేపోయెదను.

బాపడు;- స్వామీ ! దయామయా ! మీయింటివఱకు వచ్చెదను.

స;- అదిగో నాయిల్లు. నేను వెళ్ళెదనులే.

బా;- అదేనా ? ఆపర్వతముపయిదా ! నేజాడ వలయునని యున్నది.

స;- చూడదగిన దేమియులేదు. త్రోవ యంతయు కంటక శిలామయము.

బా:- అత్రోవ మీరు నడచుట లేదా ! నేను నడచెదను. మహాత్మా మాపూర్వవృత్తాంతమంతయు జెప్పితిరి. భవిష్యద్వృత్తాంతము చెప్పరా !

సన్యా;- ఊఁ.

బా:- స్వామీ! మీరు సన్యాసులు కారు. మహా మునులు.

బాపనికి చిననాటనుండియు సన్యాసులకు భూతభవిష్యద్వర్తమానములు తెలియవనియు మహామునులకుమాత్రమే తెలియుననియు నమ్మకము. ఆకారణమున నావృద్ధుడు సన్యాసి కాదనియు మహామునియనియు నిశ్చయించుకొని సాష్టాంగపడెను.

మహాముని:- వత్సా ! లే లెమ్ము. నేనొక మహాముని.

బాప;- స్వామీ ! మీపేరెయ్యది?

మహాముని;- "విమలానందుడు"

బాప;- అయ్యా ! నన్ను మీరు తోడ్కొని వెళ్లి సకల శాస్త్ర పారంగతునిగ జేయ బ్రార్థించెద,

మహాముని;- సరే. రమ్ము.

అంతట నుభయులు బయలు దేరిరి. అక్షణమునుండియు మహాముని బాపని చంద్రసేనుడని పిలువసాగెను, అతడు మహాముని ఆశ్రమమున నొక యేడుండి సకల విద్యలను సాంగోపాంగముగా నభ్యసించెను. యోగాభ్యాసము చక్కగా నలవడ జేసికొనెను.

ఒకనాడతడు మాతృసాన్నిధ్యమునకు పోవలయునని కుతూహలము జనింప మహామునికి తన కోరిక విన్నవించెను, మహాముని ప్రయాణము కాదగిన దినము నిర్ణయించెను. ఆనిర్ణీత దినమున ప్రొద్దుననె స్నానపానాదులు ముగించి పో ననుజ్ఞనిడ మహామునికి సాగిలంబడెను. ఆయన వానిని లేవదీసి ఆశీర్వదించి వెంట నిడుకొని

మున్ను తాచంద్రసేనుని కలిసికొనిన ప్రదేశ మునకు సాగనంపుచుండెను. ఇంతలో త్రోవ నొక వింత మానిసి వారికి కంటబడెను. చంద్ర సేనుడది యెద్దియో మృగమని భయపడి సంహ రింప బాణము సంధించెను. కాని మహాముని వానిని నివారించెను. ఆవింతమానిసి చంద్ర సేనుని కౌగలించుకొన సమీపింప నాతడు వెర గొంది గడగడ వణకసాగెను. అప్పుడా మహా ముని 'వత్సా! ఇది యొక క్షత్రియాంగన. దీని సౌందర్యమును జూచి మ్లేచ్ఛులలో నొకడు వివాహము చేసికొనదలచి బలాత్కారముగా నిచ్చటికి అర్ధరాత్రిమున దీసికొని వచ్చెను. ఆరాత్రి వేళనే వానిని కపటోపాయముచే నీ మానిసి హతమొనర్చెను. నాటనుండియు నిద్రాహారములు నరకుగొనక శుష్కించి శుష్కించి పెద్దలు దాల్చుచు వివస్త్రయై యీ విధముగా పడియున్నది. ఈమె చిరకాలము నసీ ప్రాణముల త్యజింప గలదు' అని చెప్పెను. చంద్రసేను డాశ్చర్యపడి "స్వామీ! ముని కులమునందును దుర్మార్గు లుందురా" అని ప్ర శ్నించెను. మహాముని "లేకేమి? మునులును మనుష్య మాత్రులే. వారును ప్రమాదము లొనర్తురు. కాని అట్టివారు మిక్కిలి స్వల్పము. ఈయమ నీచరిత్ర మెఱుంగును. నేనంతయు తేట పఱచితి! నీ తండ్రి దీని కొక కాలమున ప్రాణ సంరక్షణ మొనర్చెనట అది నీకడకు వచ్చుట కొక కారణము గలదు నీహస్తముల జాచుము" అని చెప్పెను.

చంద్రసేను డట్లుచేయ నావింతమానిసి యొక రత్నమును కేశబంధమునుండి తీసి హస్తములం దుంచెను. విమలానందుడు చంద్రసేను లారత్న మునొక్క ప్రకాశమెంతయో నుగ్గడించుచు ప్రయాణము కొనసాగించిరి కొంతదూరము సాగినతర్వాత విమలానందునకు చంద్రసేనుడు ప్రణమిల్లి ఆశీర్వాదమొంది తన త్రోవ తా బయలుదేరెను.

మాతృ మరణము.

చంద్రసేనునితల్లి కుమారుని రాకకై నిరీక్షిం చుచుండెను. ఆమె దినదినము కుమారునిగురించి పరిపరివిధముల తలపోయసాగెను. ఎట్టకేలకు చంద్రసేనుడు మాతృమందిరమునకేగి ఆమె పాద పద్మములపై వ్రాలెను. పుత్రుని ప్రేమార కౌగలించుకొని శిరంబు మూర్కొని పలువిధ ముల కొమారుని పరామర్శించుచు వానికి దివ్యాన్నపానము లొసంగి యాదరించెను. రాత్రి భోజనానంతరము తల్లికొడుకు లొకచో గూర్చుండి యిట్లు సంభాషింపుకొనిరి.

కొడుకు:- అమ్మా! ఎంతకాలము మనమిట్లు నివురుగప్పిన నిప్పుచందమున నుండవలయు?

తల్లి:- కష్టకాలము గడచుపరకు.

కొడుకు:- ఇక రాజ్యస్వీకారమునకు తగినప్రయ త్నము లొనర్చుట యుక్తము.

తల్లి:- నాయనా! నీవింకను కష్టసుఖము లెఱుంగవు. పండ్రెండేండ్లయినను రాలేదు. రాజ్యపాలనము సామాన్యముకాదు. నీవింక ననేక విషయములు గ్రహింపవలసి యున్నది.

కొడుకు:- అమ్మా! నావిషయమున సంశయిం పకుము. మహామునియనుగ్రహమున సర్వము నెఱింగితిని.

తల్లి:- నాయనా! మహాముని యెవరు? ఏమి యెఱింగించెను?

అంతట చంద్రసేనుడు జరిగిన వృత్తాంతమం తయు పూసగ్రుచ్చినట్లు నివేదించి అరణ్యమున

వచ్చుచుండగా నావింతమానిసి యొసంగిన దేదీప్యమానమగు రత్నము చూపించెను. ఆమ అనాటిరాత్రి చంద్రసేనుడు తల్లితో మఱల రాజ్యసంపాదనమును గూర్చి యీవిధముగా ప్రస్తావించెను.

చంద్రసేనుడు:- అమ్మా, తెల్లవారుజామున బయలుదేరుదము.

మధుసూదని:- నీవొక్కడవే పొమ్ము. మఱి కొంతకాలమునుక నేనిచ్చట నుండెద

చంద్రి:- అల్లెలతల్లీ! యెవరైన నీనిజవృత్తాంత మెఱింగిన ప్రమాదము వాటిల్లగలదు

మధు:- నాయనా నేనిచ్చోటువాసిన ప్రమాదము కలుగగలదు. దుర్మార్గుడగు నాపారసిక వృద్ధరాజు పుత్రశోకభారముచే నాపై పగదీర్చుకొన యత్నించుచుండెననియు, వేగులవాండ్రిందఱు యీపట్టణప్రాంతమున గలరనియు తెలియుచున్నది. కావున నీతో నేనెంతమాత్రము రాజాలను.

చంద్రి:- కావున నీవిచ్చోట నుండతగదు. నాతో నుండిన నీకేవిపత్తును రాజాలదు. అచిరకాలముననే నావృద్ధపిశాచమును యమపురి కంపెద.

మధు:- నాయనా! చంద్రసేనా! నామనోగత యభిప్రాయమును నీవు యూహింపజాలవైతివి. ఇక దాపనేల? మీతండ్రితో నే సహగమన మొనర్పవలసి యుండెను కాని శిశువగు నీ సంరక్షణార్థమై యింతకాలము బ్రతికితిని. నేనిక జీవింపనొల్ల.

పాపనాశినీ వాక్కుల వినుటతోడనే శోకాకులచిత్తుడై తల్లితొడపై దలవాల్చి ఏమియు మాటలాడకుండెను. తల్లి వానిని లేవనెత్తి పలువిధముల బుజ్జగించుచు క్షత్రియాంగన సద్ధర్మముల నిరూపింప మొదలిడెను. చంద్రసేనుడు తల్లితో "అమ్మా! నన్ను వదలి యొకసంవత్సముండుటకే తహతహలాడితివి. నన్ను దిక్కుమాలినవానినిగ జేసి పోజూచుచున్నావా?" అని వెక్కివెక్కి యేడ్వసాగెను. తల్లియు వానిని కౌగలించుకొని యూరక విలపింపసాగెను. విధిని తప్పింప నెవరితరము? సర్వంసహా చక్రవర్తినియగు మధుసూదని ఆయర్ధరాత్రమున తన ముద్దులపట్టిని చేతులతో నిమురుకొని శోకాంబుధి మునుగులాడుచుండెనుగదా!

తల్లి చంద్రసేనునితో "నాయనా! ఊరడిల్లుము ఊరడిల్లుము నీ తండ్రితో బోవలసిన దాననుు. ఇక నావలన నీకెట్టి ప్రయోజనముండజాలదు" అనెను. చంద్రసేనుడిట్లనియె "అమ్మా! బిడ్డకు దల్లితో ప్రయోజన ముండకుండునా? తల్లి బిడ్డ కెక్కుసమగునా! బిడ్డకు తల్లితోడిదే లోకము. నీకేటికిపోదువ? నేను మహీమండలము నేలుచుండ జూచి యానందింపవలదా?"

తల్లి:- నాయినా చంద్రసేనా! నా జీవితము వ్యర్థము. నే బ్రతికియుండిన పారశీకప్రభువు వలన నీకు మాటిమాటికి తొందరలు కలుగగలవు. నేపోయిన సుఖముగ నుండగలవు.

చంద్రసేనుడు:- తల్లీ! నీవు లేనిది త్రిలోకాధిపత్యమైనను వహింపనొల్ల.

తల్లి:- నాయనా! అట్లనకుము నీకొక సంగతి చెప్పెద. నీ తండ్రి ప్రాణముల గోల్పోవునపుడు శత్రువుల డీకొని ప్రాణముల రణరంగమున వీడెదనని చెప్పియుంటిని. అప్పుడాయన నాతో "అట్లు చేయదగదు. శత్రువులకు జిక్కక నెచ్చటికైనను పాఱిపోయి తలదాచుకొనుచు బిడ్డతో సుఖముగా నుండుమని" చెప్పెను. అంతట నేను వైధవ్య

మును విశేషకాలము సహింపజాలననియు దైవమనుగ్రహించిన శిశువు జననమొంది స్వశక్తి కలుగునందాక జీవించి యుండుమని చెప్ప నానాథుడిచ్ఛయింగొనెను. కావున చంద్రా, నేనిక శాశ్వతపదవి నొందగోరెద.

చంద్ర;- అమ్మా! తండ్రిని జూడ నోచుకొననైతిని. నీవును పోజూచుచుంటివి. దిక్కుమాలి ఒంటరిగ నుండనొల్ల నేను నయితము ప్రాణముల బాసెద.

తల్లి;- నాతండ్రీ. కొందర పడకుము, వివేకవంతుడవు. ప్రజ్ఞానిధివి కర్తవ్యాకర్తవ్యము తెలియంగుటోప్పు. ఇట్టిఅకే జీవించియుంటి. నీవో వంశాంకురమవు. నీవలన వంశము వర్ధిల్లవలయు. సార్వభౌముడవై శాశ్వతకీర్తినొందుము. వెంటనే నిజనగరమున కేగి అమాత్యశేఖరునితో "నన్ను చంద్రసేనుడందురు. నాతల్లిమధుసూదని" అని చెప్పుము. ఇక కర్తవ్యాంశము నాతడే తెలుపగలడు. అనిచెప్పి ప్రధానునితో తానేర్పఱచిన కట్టుదిట్టముల నన్నిటిని విశదపరచెను. చంద్రసేనుడంతయు నత్యంత సంభ్రమముతో విని కొంతవడి యూరకుండి యుజల తల్లిని కౌగలించుకొని కన్నీరు మున్నీరగునట్లు శోకించెను.

మధుసూదని కొమారుని యూరడించుచు "నాయనా! నాకొఱకై చింతింపవలదు. నేనీ లోకము వీడుట నిశ్చయము. నీ పవిత్రనము నేనెఱుగుదు. ఐన నొక సంగతిచెప్పెద. శత్రువులపై కంటగింపకుము. కులమునకు వంశమునకు యశము సంపాదింపుము" అనిచెప్పి కన్నీరుపెట్టుకొనెను.

ఇట్లిరువురు సంభాషించునప్పటికి మిక్కిలి ప్రొద్దుపోయెను. మధుసూదని నిద్రింపసాగెను. చంద్రసేనుడు నిద్రింపడయ్యె. తల్లి ప్రాణత్యాగమొనర్చునని భయము వానిమనమును చీకాకుపఱచుచుండెను. ఐనను పసిపాపడగుటచే వేడ్చియేడ్చి యున్నందున కొంతసేపటికి కనులు మూతపడెను. ఒకరాత్రివేళ కలవరపడిలేచి చూచునప్పటికి తల్లి, తనుగన్నతల్లి, రక్తప్రవాహమున నీదులాడుచుండె. తోడనే తల్లికడ మొదలునఱికిన మ్రానువలె నేలపైబడి "అమ్మా! ఎంతపనిచేసితివి. ఆత్మహత్యాపాప పంకిలమునుండి నిన్ను తప్పింపజాలకపోతిని. నానమక్షమునసే పేర్మిలతను ఎంతశీఘ్రముగ తుంచివైచితివి." అని యేడ్చెను. మధుసూదని హీనస్వరముతో 'నాయనా ఏమిచేయుదును!' అనిపలికెను. 'తల్లీ! నీపవిత్రహస్తములతో నన్ను మకుటధారునిగ జేయుదువని ఎంతయో మురియుచుంటిని. నాకోరికలన్నియు విఫలమయ్యె' అని చంద్రసేనుడనెను. 'నాయనా! ఆదుష్టపారశీకుడింత జేసెను!' అని హీనస్వరముతో మధుసూదని పల్కెను. 'ఇదిగో తక్షణమే వానిని ఖండించి వైచెదను' అని ఖడ్గముతీసికొని చంద్రసేనుడు లేవబోయెను

తల్లి వానిని కూర్చుండుమని సంజ్ఞచేసి "నీవు వానిని జంపుటనిశ్చయము. మాఋణమును తీర్చికొనెదవు. నాయనా చంద్రసేనా ఏదీ నిన్నొకపర్యాయము ముద్దాడనిమ్ము. ఎంతమాత్రము దుఃఖింపకుము. ఈఖడ్గమును పెరకివైచుము. నన్ను మిగుల బాధించుచున్నది." అనిపలికి తనవక్షస్థలమునన్ను ఖడ్గమునుచూపెను. చంద్రసేనుడంతట కత్తిగ్గి పెరికివేయ నామెప్రాణములు సొమ్మసిల్లెను. మఱికొంతసేపటికి దైవ

మును ధ్యానించుచు ప్రాణములవదలెను. చంద్రసేనుడు రాత్రియంతయు విలపించుచునే యుండెను. తెల్లవారెను. గ్రామమంతయు నీమరణ వార్త వ్యాపించెను. ఆత్మహత్యయగుటంజేసి రక్షకభటులు చంద్రసేనుని పీడింపసాగిరి. కాని యూరివారెల్లరు నాతనిపక్షమువహించి రక్షకభటులను పంపివేసిరి. కొలదిదినములకాతడు వల్లభాపురమునకేగ పయనమయ్యెను.

రాజ్యస్వీకారము

వల్లభాపురమునకు మధుసూదనునుండి ఎట్టి సమాచారములు వచ్చుచుండుటలేదు. ఆమెగర్భస్థమగు శిశువు పురుషుడగునేని యిప్పటికి ద్వాదశవర్ష ప్రాయుడై యుండనోపు. అతనిజాడ సయితము తెలియకున్నది. కావునవారిని వెదకబోయెదనని యమాత్యశేఖరుడెంచి కొడుకును వెంటబెట్టుకొని కొందరభటులతో మధుసూదనుని పుట్టినిల్లగు ఉదయపురమునకు బ్రయాణమయ్యెను. రాజనగరున బ్రవేశించి విచారింప నెచ్చటగాని ఏమియు దెలియకుండెను. పాపము మధుసూదని తల్లి మిగుల దుఃఖింపసాగెను. ఆమె మంత్రితో 'సచివాగ్రణీ! నాకూతురు మధుసూదని యిటీవల నెన్నడు వచ్చియుండలేదు. కొలది దినములలో నామెచెల్లెలు ప్రియంవద వివాహము జరుగనున్నది. అందుల కాహ్వానింపరాదలచియుంటిమి. భర్త మరణవార్త వినిననాడే మేమామెను చూడవచ్చియుంటిమి గదా! అప్పటికి ఆరవమాసము గర్భిణితోనుండెను ఆమె సుఖంబుగనే యున్నదని యీమధ్యవార్తలు వచ్చుచుండుటచే మేము యుపేక్షించియుంటిమి. మావంశాచారము ననుసరించి వితంతునకు పండ్రెండేండ్లు నిండగడచినగాని మరల చూచుటకు వీలుండజాలదు. అయ్యో నాకూతురు ఎచ్చటికిపోయి యుండునోకదా:' యని ఏడ్వసాగెను. మఱునాడు మధుసూదనిజాడ తెలిసికొన మంత్రి మఱికొందఱ వెంటతీసికొని బయలుదేరెను.

చంద్రసేనుడు వల్లభాపురము ప్రవేశించునప్పటికి అచ్చటి పరిస్థితులు వేఱుగనుండెను. కమలవిజయుని తమ్ముని కొమారుడగు ఇంద్రసేనుడు, మంత్రి మంత్రికొమారుడు పట్టణమున లేనిసమయము పురస్కరించుకొని, సింహాసనమధిష్ఠించి రాజైనట్లు ప్రకటించుకొనెను

పౌరులకు కొందఱకిది నచ్చకుండెను. కొందఱకు రాజకుటుంబీకునకు చెందవలసిన రాజ్యాధిపత్యము సామాన్యవంశీకుడగు మంత్రి మంత్రికుమారుడు వహించుట గిట్టకుండెను. ఈకారణమున పౌరులు రెండుకక్షల నవలంభించిరి. కొలది దినములకే మంత్రి పుత్రసయితముగ పురమునం బ్రవేశించెను.

ఈవార్త తెలియుటతోడనే చంద్రసేనుడు వాని సమ్ముఖమున కేగెను. పురమంతట వాదప్రతివాదములు తర్జనభర్జనలు మెండయ్యెను. అట్టుడికినట్లుడుకుచుండెను. తీవ్రమైన స్పర్థలు బయలుదేరనుండెను. పురప్రముఖులీజాడ కనుగొని గొప్ప బహిరంగసభ యొకటి సమావేశపరచి కర్తవ్యాంశము విచారించి తుదకు చంద్రసేన ఇంద్రసేను లిరువురు మల్లయుద్ధమొనర్పదగుననియు ఆయుద్ధమున నెవరు జయింతురో వారు రాజ్యాధిపత్యమొందునట్లును నిశ్చయించిరి. నిర్ణతదినము వచ్చెను. ఉదయముననే ప్రజలు గుమిగూడదొడగిరి. రెండుగడియలప్రొద్దెక్కెను. చంద్రసేన ఇంద్రసేను లిరువురు దట్టీలు బిగించి వ్యాయామ రంగమున బ్రవేశించిరి. పురప్రముఖులు సాయుధులై నిరాయు

ధులా యని పరీక్షించిరి. గంట మ్రోగెను. ఉభయులు కొదమసింగములవలె నొకరిపై నొకరు తలపడిరి. జయాపజయములు నిర్ణయించుటకు ముగ్గురు మధ్యవర్తులుగ నుండిరి. అన్నదమ్ముల బిడ్డలిద్దరు ప్రబలశత్రువులవలె రెండు మూడు ఘడియలు పోరాడిరి. పిన్నవయస్కుడగు చంద్రసేనుడు ఇంద్రసేనునితో కలహమునకు దిగుట సరికాదనిరి. కొందరు చంద్రసేనుడే యోడిపోవుననిరి. మఱికొందఱు ఇంద్రసేనుడే గెలుపొందుటలో నాశ్చర్యము లేదనిరి. ఉభయులు తీవ్రముగ పెనగులాడుటచే నలసిసొలసి పడిపోయిరి. అంతట నొక ఘడియ విశ్రాంతి గొనసగిరి. మఱల మల్లయుద్ధమునకు గడంగిరి. ఉభయు లతిరోషముతో పోరాడసాగిరి కాని ఒక గడియసేపటికి చంద్రసేనుడు ఇంద్రసేనుని అమాంతముగ నెత్తి పీవు తాటయాడునట్లు వెన్నెముక విరుగునట్లు నేలపై గుమ్మడికాయను పగులగొట్టునట్లు పడవేసి ప్రేక్షకులవంక గ్రుడ్లెత్తిజేసి జూచెను. అతడు బాలమార్తాండునివలె ఎల్లఱకు గోచరించెను. మధ్యవర్తులు చంద్రసేనుడే గెలుపొందెనని ఎలుగెత్తి చాటిరి. కాని వారిమాటలు జయజయధ్వానములలో అంతర్లీనమయ్యెను.

మఱునాడే చంద్రసేనుడు పట్టాభిషిక్తుడై పురమంతయు నూరేగెను.

---

# పగటికల.

గరిగిపాటి రామమూర్తిగారు, బి. యె.

మ॥ కలగంటిన్ పగలేను; డీ వినుడి సా ♦ కల్యంబుగాఁ దెల్పెదన్
"కలయేగావున కల్ల" యంచు దలపం ♦ గారాదుసుండీ! మహా
త్ఫలవంతంబిది; స్వప్నమైన గడు వి ♦ శ్వాసంబునన్ జూచుచో
విలసద్భాగ్యము చేకుఱున్ వినుడి! త ♦ ద్వృత్తాంత మేర్పాటుగన్ ॥ 1.

క॥ కానన సీమయొ మఱి యు
ద్యానవనమ్మొ? యెదియో ని ♦ దానము దెల్పం
గా నేర; వింతదేశం
బౌనని చెప్పంగలుగుదు ♦ నాస్థలమందున్ ॥ 2.

ఆ॥ వె॥ ఆంధ్రవనితవోలె ♦ నాభరణాంచిత
అనుపమాన సుంద ♦ రాంగి యొకతె
ఆంగ్లయువతి పోల్కి ♦ నతి నవీన విధాన
భూష రహితమైన ♦ పొలతి యొకతె ॥ 3.

ఉ॥ ఎవ్వరో వీరలంచు మది ♦ నెంచి గనుంగొన బోవుచుండ వా
రవ్వలి వైపునుండి నను ♦ నారసి,— యెంతయు నాదరమ్మునన్
దవ్వగనున్న సన్నుతి యను ♦ భారత నొక్కసుఖాసనంబు నం
దవ్వనితా శిరోమణులు ♦ నానతి సేసిరి గూర్చొనంగ నే॥ 4.

ఆ॥ వె॥ అవ్వలార మీర ♦ లివ్విధమ్మున నిట
నుంట కేమి హేతు ♦ వొక్కొ తెల్పి,
నన్ను ధన్యజేయ ♦ నెన్నుడు మీకిచ్చ
యైన కృత్యమిట్టి ♦ దే నొనర్తు. 5.

సకల దేహములందు సు ♦ జ్వాలములైన
భూషాభరణములతో నొప్పు ♦ నట్టి వనిత
గాంధిక సరస్వతీదేవి; ♦ గణుతి కెక్కి-
నట్టి కవులకు బ్రతి యీ ♦ యందరకును॥ 6.

" వేషభాషలందు ♦ వివిధగీతులనుండి
యొక్క వృత్తి, కులము ♦ నొకటగనక
సర్వ విధములందు ♦ సంకరంబై యొప్పు
గరితమిన్న యీమె ♦ గ్రామ్యవాణి ॥ 7.

" పాఠశాలలందు ♦ బాలురకెల్లను
పనులు లేనియట్టి ♦ జన వితతికి
కీర్తిఁగోఱు వాన ♦ గెలలువారికి తనూ
జాత యీమె యతి వి ♦ శాల హృదయ." 8.

అనెడి పల్కుల విని ♦ యాశ్చర్యమున గొంత
వింతతోడ నెవరు ♦ వీనిబల్కి-
యుందురొక్కొ యనుచు ♦ నూగులాడుచును మే
ల్కాంచి, మఱల సలల ♦ గాంచలేదు ॥ 9.

# హిందు చిత్రలేఖనము.

ఆవంత్స వెంకట రంగారావుగారు, బి. ఎ.

ఈ వ్యాసమందు ప్రాచ్య పాశ్చాత్య చిత్రరచనా సాంప్రదాయములను, వాని నిరౌచిత్యములను, మన చిత్రకారులను గూర్చి కొంత ముచ్చటింప బోవుచున్నాను.

1

రవివర్మగారి చిత్రలేఖనమునకును, యిప్పటి కాలపు చిత్రరచనకును జాలభేదమున్నది "థియడోర్ జాన్సన్" అను పాశ్చాత్య రంజకుని చిత్రలేఖనా విధానము ననుసరించి కీ. శే. రవివర్మగారు వేనవేలు పటములను రచించియుండుటవల్ల నా సాంప్రదాయము పాశ్చాత్య మనక తప్పదు. ప్రస్తుతము హిందూ చిత్రకారులు దేవాలయములందును గుహాలయందును పురాణరంజకులచే చిత్రింపబడిన పటముల ననుసరించి చిత్రించుచుండుటచే నీనూతన విధానము హైందవ మనబడును. పాశ్చాత్య సాంప్రదాయము వెలుతురు, చీకటి, ("Light and Shade") ననుసరించియుండును. మన చిత్రములలో నవి యుండవు. అవి యనవసరము.

కలకత్తా నగరమున బాబూ అవనీంద్రనాథ టాగూరు గారు ప్రప్రథమమున నీ నవీన హిందూ సాంప్రదాయమును గనిపెట్టిరి. క్రమముగా వారి శిష్యులైన ప్రమోద కుమారఛటర్జీ గారు బందరు జాతీయకళాశాలకు శిల్పాచార్యులుగా విచ్చేసి పెక్కు చిత్రములు లిఖించిరి. కీ. శే. దామెర్ల రామారావుగారు రాజమహేంద్రవరములో నజంతా శిలా చిత్రముల ననుకరించి పటములు వేసిరి. అప్పటినుండియు చిత్రలేఖనము పునీతమైనది.

కవితకు భావమెట్లు ప్రధానమో యట్లే చిత్రమునకు గూడ భావము ముఖ్యమనియును వెలుతురు చీకటులు లేక భావములు విశదీకరింపవచ్చునని వారట్లు చిత్రించియున్నారని నేను తలంచుచున్నాను. కాని మన చిత్రకారుల పటములందు గర్భితమైనది యాడుబిడ్డయో మగబిడ్డయో గ్రహించుట సామాన్యులకు బహుకష్టము. కాని చిత్రగర్భమందొక దేదీప్యమానమయిన శిశువు నిగూఢమయియుండుట ముమ్మాటికి నిక్కము. అది గ్రహించగలిగినవారే హైందవ చిత్రలేఖనము సర్వోత్కృష్టమయిన దనుచున్నారు. గ్రహించనివారా చిత్రముల వంక జూడనైన జూడక పాశ్చాత్య చిత్రములను మెచ్చుకొనుచున్నారు.

హైందవ చిత్రలేఖనము ఆత్మానంద మొసగూర్చును. పాశ్చాత్యము నేత్రానంద కరము మాత్రమే. హైందవ చిత్రలేఖనము పతివ్రతవంటిది. పాశ్చాత్య చిత్రలేఖనము సర్వాంగ సౌందర్యముగల యుపస్త్రీవంటిది.

కాని మన చిత్రలేఖనము దేవతా విగ్రహములు వ్రాయుట కుపయోగించునటుల మానవ చిత్రములు వ్రాయుట కుపచరించదేమో యని నాతలంపు. ఏలనన, వెలుగు చీకటులు లేక మానవచిత్ర మొకటి రచించినచో నది యా మానవుని చిత్రముగాఁ గనుపించదు. అప్పుడు మనకు పాశ్చాత్య సాంప్రదాయమే పనికివచ్చును.

ప్రకృత మనేకులు చిత్రలేఖన మభ్యసించు నపుడు, ప్రతిమలందుండు వెలుగు చీకటుల నభ్యసింపకుండనే అజంతా శిలాచిత్రముల ప్రకారము పటములు వేయుచున్నారు. వెలుగు చీకట్లతో నొక మనుష్యుని చిత్రము వ్రాయవలసి వచ్చినపుడు వారి కష్టమునకు మేరయుండదు. అందుచే చిత్రరచనకు గడగిన ప్రతివారును చాల కాలము వెలుగు చీకట్లను ప్రతిమా ప్రమాణములను బాగుగా నభ్యసించిన పిదప హిందూపద్ధతి ప్రకారము చిత్రించుట మంచిదని నామనవి. మహారంజకులని పేర్వడసిన ఛటర్జీగారు వెలుగు-చీకట్లతో చిత్రించుటయందు బాగుగ నారితేరినవారే. దామెర్ల రామారావుగారు మూడు సంవత్సరములు బొంబాయి నగరమున నభ్యసించిన దీ చిత్రరచనా విధానమే.

ఈ సందర్భమున వంగదేశపు చిత్రకారులకును మన రామారావుగారికి గల భేదము గమనింతము. వంగదేశ రంజకులు మనుష్యులయొక్కగాని జంతువులయొక్కగాని పరిమాణములు గమనించి చిత్రములు వేయరు. అందుచేత వారి చిత్రములు మనకు కొంత వికృతములుగా కనిపించును. రామారావుగారు ప్రమాణములను బహు జాగరూకతతో చిత్రించియుండుటచే వీరి చిత్రములు సర్వాంగ సౌష్టవముకలిగి శోభిల్లుచుండును

రామారావుగారి చిత్రములం దింకొక విశేషముకలదు. రవివర్మగారు, దురంధరుగారు మొదలగు మహాశిల్పుల చిత్రములందు సాధారణముగా మనకు మహారాష్ట్ర యువతులు కాన్పించుచున్నారు. రవివర్మగారు "కృష్ణలీలలు" చిత్రించునపుడు సౌందర్యవతులైన మహారాష్ట్రయువతులను మాత్రము లిఖించిరి. రామారావుగారు ఉత్తర హిందూస్థానమందలి జనులయొక్క సాంప్రదాయములను గమనించి "కృష్ణలీలలు" చిత్రించియున్నారు. అందుచేత మన

మా పటమును జూచినపుడు బృందావనము మొదలగు శ్రీకృష్ణపదపాంసుపటలిచే పావనములైన స్థలములందు సంచరించుచున్నామా! యనెడు భ్రాంతి పుట్టును.

## 2

పైని వ్రాయబడిన విషయములనుబట్టి రవివర్మగారి చిత్రములు భావరహితములని మనము తలంపగూడదు. ఆయన రచించిన చిత్రములన్నియు మహాభావగర్భితములై యాతని మేధాశక్తి వెల్లడించుచున్నవి. హిందూ దేశమందు చిత్రకళ యూరుపేరులేక యున్న సమయమందు నిశాముఖమున రాకాచంద్రునివలె మహాప్రతిభతో బయలుదేరినది. జగద్విఖ్యాతచిత్రకారులైన రాజా రవివర్మగారు ఆతనికి బూర్వము మనదేశమున పాశ్చాత్య సాంప్రదాయములతో పటములువేసి వానికెక్కిన వారెవ్వరును లేరు. ప్రథమమున తన కీర్తివల్లరులను ఖండాంతరములకు వ్యాపింపించినది రవివర్మగారే. రామాయణ భారత భాగవతాదులు పఠించి మనవారు శ్రీకృష్ణుడిట్టి వాడు రాముడిట్టివాడని యూహించుటయే కాని నేత్రానందకరముగ గాంచగలిగిన చిత్రములు లేవు. ప్రథమమున నాలోటు తీర్చినది శ్రీరవివర్మగారే కదా? ఇప్పటికిని ఆతనిచే చిత్రింపబడిన శ్రీరాముడు లక్ష్మి సరస్వతి మొదలగు పటములు హిందూగృహముల నలంకరించుచునే యున్నవి. ఆమహానుభావుడు చిత్రించినవి చాలవరకు పౌరాణిక పటములే. ఆయన చిత్రకళ నభ్యసించునపుడు పాశ్చాత్య రంజకుని సహవాసముచే నా సాంప్రదాయమా లలవరచుకొనెను గాని, యాతడీనాటి వాడైయున్నచో నవీన సాంప్రదాయములతోడనే పటములు వేసియుండునని నేను చెప్పగలను. ఆయనను జూచి మనదేశమున బెనర్జీ మొదలగువారు చిత్రములు వేసి జర్మనీ దేశమున నచ్చొత్తించి బజారులలో విక్రయించుచున్నారు. కాని వారి చిత్రములకు రవివర్మగారి పటములందు దోచు కౌశల్యముగాని విగ్రహసౌందర్యముగాని లేదు. జర్మనీదేశముద్రితములై విశేష మెఱుగుకలపాటచేతను స్త్రీప్రతిమల కపోలములందు నాగ్గయువతుల కపోలములందువలె నరుణవర్ణము వేయబడి యుండుటచేతను బెనర్జీగారి పటములు కొందరిని మెప్పింపగలిగినవి. కాని రవివర్మగారి పటముల కవి తీసికట్టు. రవివర్మగారి విగ్రహములందు దేవతాకళ మెరయుచుండును. ఆయన తర్వాత పాశ్చాత్య సాంప్రదాయములతో నాయనవలె చిత్రించగల హిందువుడెవ్వడును లేడు. ఇక ముందు జన్మింపబోడనియే నాదృఢమయిన నమ్మకము.

## 3

ప్రస్తుతము మన దేశమందు విశేషముగా చిత్రకారు లుండుటకు రవివర్మగారి పటములే కారణములు. నవీన యుగములో చిత్రకళా సాంప్రదాయములు మార్పు చెందినప్పటికిని ఆదినుండియు ననేక యువకులను రంజకులుగా మార్చగలిగిన రవివర్మగారి చిత్రములే. ఆపటములే మన కాదర్శములయి మన మనముల నాకర్షించినవి. వానిని జూచి వేనవేలు యువకులు చిత్రకళాభ్యాసమునకు ప్రారంభించి కళోపాసకులుగ మారిపోయినారు. కాబట్టి మనకు చిత్రకళా పితామహులు శ్రీరాజా రవివర్మగారు ఆయన మన చిత్రకారుల లందరికి పూజ్యనీయుడుగా నుండవలయును. అట్టి మహారంజకుడు హిందూదేశమున చిత్రలేఖనములేదని నిరసించెడు పాశ్చాత్యులకు హిందూదేశముయొక్క పేరు నిలిపిన దేశాభిమాని. ప్రస్తుత మనేక చిత్రకళోపాసకులచే నిందింపబడు చున్నాడని వినుటకు నేనెంతయు దుఃఖించుచున్నాను. భారత భాగవతాదులు పఠించి పద్యములల్లనేర్చి తిక్కన్న పోతన్నలను దూషించుట యెట్టిదో రవివర్మగారిని దూషించుట యట్టిది. ఆయన పటములందు పెక్కు లోపము లుండవచ్చును. వానిని విడిచి మన సాంప్రదాయముల ననుసరించి మనము చిత్రకళ నభ్యసింప వలెను.

అదియే మన కర్తవ్యముగాని గురువరేణ్యుని దూషించుట కాదు.



# వివిధ విషయములు.

## సీమలో త్రాగుడు.

ఇంగ్లాండు వేల్సులలో గత సంవత్సరము తల్లి దండ్రులు త్రాగి పడియుండుటవలన, వారి ప్రక్కనున్న పిల్లలు ఏడాదిలోపువారు ఊపిరిరాడక చాలమంది చనిపోయిరి. చనిపోయిన శిశువుల సంఖ్య 429. 1925 లో కంటె 1926 లో నీ రెండు దేశములలోను త్రాగుడుమూలమున చేసిన నేరములకు శిక్ష పొందుట కొంచెము తగ్గినది. ప్రతిశనివారము నిటువంటి నేరము లధికముగా జరుగును. త్రాగుడునేరములలో నూటికి 31·52 శనివారము నాడు జరుగునవే. ఆదివారము త్రాగుడు దుకాణములు మూయబడును. గనుక ఆనాడు నేరముల సంఖ్య నూటికి 4 కి తగ్గినది.

## హిందూదేశములో త్రాగుడు ఖర్చు.

హిందూదేశములో నానా రాష్ట్రములందు మనిషి 1 కి త్రాగుడు కయ్యేఖర్చు యీక్రింద తెలుపబడినది.

| | | | | |
|---|---|---|---|---|
| సంయుక్తరాష్ట్రములు | రు | 0 | 4 | 7 |
| వంగరాష్ట్రము | | 0 | 7 | 0 |
| బీహార్ ఒరిస్సా | | 0 | 8 | 7 |
| మధ్యరాష్ట్రములు బీరార్ | | 0 | 15 | 0 |
| బొంబాయి | | 2 | 2 | 7 |
| అస్సాము | | 0 | 15 | 0 |
| మద్రాసు | | 1 | 3 | 7 |
| బర్మా | | 1 | 4 | 0 |
| పంజాబు | | 1 | 7 | 8 |

## రోనాల్డు మాక్నీలుగారు.

సెసిల్ ప్రభువు స్థానమున నానాజాతీయ సమితిలో బ్రిటిషు ప్రతినిధిగ రోనాల్డుమాక్నీలుగారు నియమింపబడిరి. వీరిని గురించిన విచిత్ర కథ యొకటి కలదు. ఐర్లాండు దేశ స్వాతంత్ర్యమును గురించి చర్చ జరుగుచుండగా మాక్నీలుగారి కమిత యాగ్రహము జనించినందున యొక పుస్తకమును, యిప్పుడు తనతోటి మంత్రిగనున్న విన్‌స్టన్ చర్చిల్ గారిపై విసరినట. అర్థికసైనిక సంబంధమైన విషయములలో నీయనకు చాల గట్టి అభిప్రాయములు కలవట. అటువంటి వానిని మంత్రిగ నియమించుట పొరపాటని కొందరభిప్రాయపడుచున్నారు.

## హాన్సు ఆండర్సన్ గారు.

ఆంగ్లభాషలో కథలు వ్రాయుటయందు పేరుప్రఖ్యాతి బడసిన వారిలో హాన్సుఆండర్సనుగా రొకరు. కాని యీయన తాను ప్రేమించిన యువతియొక్క అనుగ్రహమును పొందలేకపోయెను. సంసారి కావలెనని యెంత యభిలాషపడినప్పటికిని, బ్రహ్మచారిగనే మరణించవలసి వచ్చినది. భార్యాపిల్లలతో సంతోషముగ కాలము గడుపుచున్న స్నేహితులను చూచినపుడు తనకును సంసారము కావలెననిపించెడిది.

ఈయనను ప్రేమించినవార లనేకులుగలరు. కాని యీయన ప్రేమించిన దొక్కరితే. స్వీడన్ దేశస్థురాలగు జెన్నీలిండ్ అను నామెను ప్రేమించి తన హృదయము నర్పించెను. ఇతను చిత్రకారుడుకూడను.

జెన్నీలిండ్ చిత్రవిద్యయందు దారితెలిసినది. సామాన్య కుటుంబమున జన్మించిన స్త్రీ. కేవలము అమాయకురాలు. అండర్సనుకూడ నమాయకుడే. అతని జీవిత రహస్యముల నీమె కనిపెట్టినప్పటికి నాతని ప్రేమించలేదు. ఆమె ప్రేమను బడయవలెనని చాల ప్రయత్నించెను. కాని, భార్యయగుటకంటె స్నేహితురాలుగను సోదరిగను నామె గడుపదలచెను. ఈమె గొప్ప సంగీతపాఠకురాలు. ఆమె శ్రావ్యకంఠముతో పాడునపుడు అండర్సన్ మైమరచియుండెడివాడు. తగుచుగ నిరువురును కలుసుకొనుచున్నను, ఒకరిసాన్నిధ్యమున నొకరు యానందించుచున్నను, లిండ్ హృదయములో ప్రేమ యంకురింపలేదు. ఆమె మరియొకనిని వివాహమాడనున్నదని విని ఆండర్సను ఆమెకీక్రింది విధముగ జాబువ్రాసెను.

"భగవంతుడేమి నిర్ణయించిన దానికి నేను దోసిలొగ్గెదను. నాకు ఆత్మశాంతి బాగుగనున్నది. నాకు సంభవించిన దంతయు నామంచికొరకే సంభవించినదని దలతును. ఇతరత్రా వివాహమాడి యెంత సుఖపడగలనో ఈశ్వరునికే తెలియును."

లిండ్ ప్రేమించకపోవుటకు కారణమేమి? అండర్సను చాల పొడగరియనియు వికృతాకారుడనియు కొందరనెదరు. ఈలోపము ఆండర్సనుకు తెలియకపోలేదు. ఒకానొక పద్యములో తనను కొల్లేటికొంగకు పోల్చుకొనెను. ఆండర్సను లిండ్ యిరువురు కలిసిన శిలావిగ్రహమును చెక్కిన యొకశిల్పి "వీరిరువురు సుందరులు, తగినజోడు" అని వచించెను. నిజముగా నాతడవివాహితుడగుటకు కారణమాతని వికృతాకారము కాదు. అంతకంటె అందవికారులు చాలమంది వివాహితులయి యున్నారు.

# పద్మరహస్యము.

—♦ ఇరువదిమూడవ ప్రకరణము ♦—

తల్లి కొడుకులు.

శశిభూషణుడు భావనగరమున దన స్వగృహమున బ్రవేశించెను. అదివరకు గాళీచరణుని యందు గలిగిన నూతన పరివర్తనమునుగురించి సుముఖి యోచించుచుండెను. కాళీచరణుని ప్రవర్తన మామెకు దృప్తికరముగలేదు. కొలది దినముల క్రిందట తానచటికి బోదలచినదియు తానిక ముందేమిచేయు నుద్దేశించినదియు తన తల్లితో చెప్పియుండలేదు. దుస్తులు, ఆభరణములు మున్నగు తనకు గావలసిన వస్తువుల నన్నిటిని సేకరించుట కంతటిద్రవ్య మెట్లు లభించినదియు నామె కాశ్చర్యము కలుగుచుండెను. కాళీచరణునకు పనిపాటులనిన నగమొరిక. అతనికి డబ్బు నంపాదించు సావకాశమే లేదయ్యెను. పూర్వమువలె తనతల్లిని డబ్బునకై పీడించుట లేదు. ఇట్టి యాలోచనలలో మునిగి తేలుచున్న సుముఖి యెదుట శశిభూషణుడు ప్రత్యక్షమయ్యెను. ఆమె శశిభూషణుని యథాప్రకారము సత్కరించి "నాయనా, చాలకాలమునకు వచ్చితివి. సెలవుమీద వచ్చితి వనుకొందును. దేహమునందు అస్వస్థత లేదుకదా" అనెను.

శశి:- నాకేమియు నస్వస్థతలేదు. కాని కాళీచరణుని విషయమై మాట్లాడవచ్చితిని. అతనికి వసంతవిలాసమునకు గావలెనని కోరిక యున్నట్లు నీవేమయిన కనిపెట్టగలిగితివా?

సుముఖి:- అది యెచ్చట నున్నదియుగూడ నాకు తెలియదు.

శశి:- నిన్నరాత్రి కాళీచరణుడు వసంతవిలాసమునకు వచ్చియుండెను అచట నాతనికొక గొప్ప ప్రమాదము సంభవించియుండెను.

సుముఖి:- ఏమి ప్రమాదము! నేను వెంటనే బయలుదేరవలసి యున్నదా?

శశి:- నిన్ను తీసుకుని వెళ్ళుటకే నేను వచ్చితిని.

సుము:- కాళీచరణుడు వ్యాధివలన బాధపడుచున్నాడా యేమి? నా యాందోళన తొలగిపోవుటకు అసలు సంగతేమో చెప్పుము. అయ్యో, భగవంతుడా నాకొడుకు, నా ఒక్కడే కొడుకు, కాళీచరణున కేమి తెచ్చిపెట్టితివి.

శశి:- అమ్మా, యింతలో నన్నేల మరచితివి. కాళీచరణుడు నీ కొక్కడే కొడుకు కాదు. అతనివలెనే నిన్ను ప్రేమించి పోషించుటకు నేనుగూడ నున్నాను. తల్లీ, కాళీచరణుడు వసంతవిలాసమునకు వచ్చుటలో నభిప్రాయమేమో మన మిత్వరము యోచింపవలసి యున్నది. సర్వము దీని పయిననే యాధారపడి యున్నది.

సుము:- అది యేమాత్రము నాకు తెలియదు.

శశి:- కలకత్తాకు నన్ను జూడ వచ్చినప్పుడు నా యజమానుని వారి బంధుమిత్రులను కూడ జూచుచుండెడివాడు. వారును కాళీచరణు నతి వాత్సల్యముతో జూచుచుండెడివారు. అయినప్పటికిని నిన్నటి రాత్రి యాతడచటికేల రావలసియున్నదో యెల్లరకు దురూహ్యముగ నున్నది.

సుము:- అవును. కలకత్తాలో నెవరో గొప్ప వారు గలరనియు, వారు తన్నతి వాత్సల్యములో జూచుచుండిరనియు కాళీచరణుడు చెప్పుచుండెడివాడు. వారి పేర్లనుమాత్ర మెన్నడు చెప్పియుండలేదు.

శశి:- వారిపేర్లు సుధీంద్రరాయలు, పద్మ, శాంత.

సుముఖి:- ఏమి శాంతకూడ నచటనేయున్నదా?

శశి:- అవును. తనసోదరి పద్మతోనే యుండును. వసంతవిలాసమే యామెకు నివాసస్థానము.

సుముఖి:- ఏమి. ఆమెచెల్లెలు పద్మయా? అసమాన సౌందర్యవతియగు పద్మయేనా?

శశి:- అవును.

సుముఖి:- వీరందరునుగలసి నాకుమారుని చంపియుండలేదుగద! భగవంతుడా! ఎంత తెచ్చిపెట్టితివి. (భయ భ్రాంతులతో గూడిన యామె తన రెండు చేతులను శశిభూషణుని పై నిడి) నాయనా, శశిభూషణా ఆపద్మను నీవెన్నడైన చూచియుంటివా?

శశి:- ఎన్నడో యేమి ప్రతిదినము చూచుచునే యున్నాను.

సుముఖి:-ఓ ఈశ్వరుడా! నీలీల లత్యద్భుతములు

శశి:- తల్లీ! నీసంగతి నాకర్థమగుటలేదు. నా యెడను, కాళీచరణుని యెడను వారెప్పు డాదరణ చూపుచుండెడివారు.

సుముఖి:- అనుదినమామెనుజూచుచు నామెతో సంభాషించుచు కలసిమెలసి తిరుగుచు నీకు తెలియనే తెలియదా?

శశి:- తెలియవలసినదేమి? నీమాటలు నాకేమి బోధపడుటలేదు.

సుముఖి:-(తన్నుద్దేశించుకొనుచు) అవును. వాని కెట్లు తెలియును. అదియొక పరమ రహస్యము. దానిని గప్పిపుచ్చుటకు వాగ్దత్త మొనర్పబడినది.

ఏ దోషమును గురించిగాని, ఏ రహస్యమును గురించిగాని, ఏ వింతను గురించిగాని వినియుండనందున శశిభూషణున కిది యంతయు నగమ్యగోచరమై యున్నది. కాలమును వృథాపుచ్చుచున్నట్లు మాత్రమే యాతనికి పొడగట్టెను.

సుముఖి:- శశిభూషణా యిప్పుడైనను ఏమి జరిగినదో దాచక చెప్పుము.

శశి:- నిన్న రాత్రి వసంతవిలాసమునకు కాళీచరణుడు వచ్చియున్నట్లును, దుర్మార్గు లెవరో యాతనిని తుపాకితో కాల్చినట్లును అనుకొనుచున్నారు.

సుముఖి:- ఏమి కాల్చివేయబడెనా? ప్రాణ మింకను పోలేదుగదయని యామె మూర్ఛిల్లెను. శశిభూషణు డామె కుపచారములు చేయ కొంతసేపటి కామెకు తెలివి వచ్చినది.

శశి:. తల్లీ, విచారింపకుము. కాళీచరణుని ప్రాణమీ ప్రపంచమును విడిచిపెట్టివేసినది.

సుముఖి:- నా యొక్కడే కుమారుడు కాల్చి చంపబడినాడు. నేనికబ్రతుకజాలను. నాయనా, నన్నొకపర్యాయము ఆ శాంత వద్దకు తీసుకుని పొమ్ము. కాళీచరణుని కా రహస్యము తెలియుటవలననే ఆ శాంత వానిని సంహరించినది.

దుఃఖములో మునిగిన తన తల్లికి యుక్తాయుక్తములు గోచరించుటలేదని శశిభూషణుడు భావించెను.

శశి:- శాంతాదేవియే హత్యయొనర్చినదా? ఆమె చాల దయార్ద్ర హృదయము గలది.

సుముఖి:- నాయనా, నీవును వారి పక్షమే మాట్లాడుము. నీవును వారిలోని వాడవే. అది సహజము. నాకిప్పుడంతయు తెలిసినది.

కాళీచరణుని వసంతవిలాసమున కేలకో యెవరో వానిని చంపిన దెవరో నాకిపుడు బోధపడినది. ఆశాంత వస్త్రము నన్నిపుడే తీసుకొని పొమ్ము. మా ఘాముఖి నామెను పరీక్షించెదను.

శశిభూషణున కిది యంతయు నత్యద్భుతముగ గన్పట్టినది. ఏదియో గొప్ప రహస్యమిం దిమిడి యున్నట్లు గోచరించినది. శాంతాదేవికిని కాళీచరణునకును గల రహస్య మేమియో గ్రహింపలేకపోయెను. ఇక జాగు సేయుట యుక్తము కాదని తల్లిని వెంటనిడుకొని కలకత్తాకు పోయెను. మరునా డుదయమున వసంతవిలాసపు టావరణము జేరగల్గిరి.

ఆవరణ ద్వారమునకు కుడివైపున సుధీంద్ర రాయుల సేవకు డుండు పర్ణకుటీరము గలదు. కాళీచరణుని శవము నాస్థలమునకు జేర్చియుండుటచే సుముఖియును శశిభూషణుడును నచ్చటి కేగిరి. కాళీచరణుని మృతకళేబరమును గాంచి విలపించి విలపించి మూర్ఛనొందెను. సేద దేరగానే శశిభూషణుని బిలిచి శాంత నెట్లయినను తనయొద్దకు రప్పింప కోరెను.



—ఇరువదినాలుగవ ప్రకరణము—

నేరారోపణ.

ఆనాడు శాంత యొంటరిగ కూర్చుండియుండ నొక సేవకు డరుదెంచి యొక క్రింది జాబును నామె కొసంగెను.

శాంతాదేవికి,

మాతల్లి సుముఖి సేవకుని పర్ణకుటీరమునం దుండి యున్నది. కుమారుని మరణముచే నామె కృశించియున్నది. మిమ్ముల నొక్క పర్యాయము రప్పింప గోరి యున్నది. ఏకాంతముగ సంభాషింప నుద్దేశించియుండుటచే నొక పర్యాయము తప్పక రాగోరెదను.

ఇట్లు,
శశిభూషణుడు.

నాటిరాత్రి యేడు గంటలకు వచ్చెదనని చీటి వ్రాసి శాంత తత్ప్రయత్నమున నుండెను.

శాంత సుముఖిని జూడబోవుచుండెను. రాత్రికూడ సుముఖి విలపించుచునే యున్నది. ఆవరణమునం దొక వ్యక్తి తప్ప మరెవ్వరును కాన్పించలేదు. ఆవ్యక్తి సామాన్య పొడగరియై నొక గడ్డమును గల్గియుండెను. శాంత యాతనిని తమ సేవకుని మిత్రునిగ బాటించి లోనకు బోయెను. శాంతను గాంచి సుముఖి "శాంతా వచ్చితివా? నేనేమి చేసితినని నాకుమారుని నీపొట్టను పెట్టుకొంటివి? అయ్యో, అయ్యో, నాకడుపున చిచ్చుపెట్టితివి నీకు చేసిన ఉపకారమున కిది ప్రతిఫలమా?" అనెను.

శాంత:- ఈహత్యా విషయములో నాకు సంబంధమున్నదని నీవు నిజముగ ననుకొనుచున్నట్లు భావించను.

సు:- నీకు తప్పకుండ సంబంధమున్నది. నీవు స్వయముగ చంపియుండకపోయినను, నీవే కారకురాలవు.

శాం:- కాదు కాదు. నేను కాదు, ముమ్మాటికిని గాదు. అతనిని చంపవలసిన యావసరము నాకేమి?

సు:- నీరహస్యము వానికి తెలుసును గనుక, వానిని చంపదలచి యిచటకు రప్పించితివి.

మానవ ప్రాణమును హీనముగ జూచు ధన మదాంధులలో నీవొకరవు.

శాం:- సుముఖీ, నీకుమారుని హత్యను గురించి యైనా నేను నగవని ప్రమాణము చేయుచున్నాను. నీ వెంత నిర్దోషివో, నేను నంతియే నిర్దోషిని.

సు:- నేను నమ్మను. వానిని హత్య చేయుట కితగుల కేసంబంధమును లేదు

శాం;- నా కేకారణమును లేదు. నరహస్యము నాతడు కనుగొనినమాట వాస్తవమే. అందు వలన నాతని కపకారము చేయలేను. పైగా సంవత్సరమునకు వేయి రూప్యము లిచ్చుటకు నిశ్చయించుకొంటిని.

సుముఖి;- విచారముతో నవమానముతో మునిగి నీవు తెచ్చియిచ్చిన శిశువును యిరవైయేండ్లు నేను పెంచి పోషించితిని నీకుమారుని నేను రక్షించితిని. నాకుమారుని నీవు చంపితివి.

శాం;- నీవింత యాగ్రహముతో మాట్లాడు చున్నపుడు నేను నీకు నచ్చచెప్పలేను. కాలము గడచిన నిజము నీకే తెలియగలదు. నీవు నాకు చేసిన యుపకారమును గమనించియే నీవిపుడెన్ని మాట లనినను లెక్కచేయక క్షమించుచున్నాను. ఈహత్యకు గారకు లెవరో విచారించుటలో నా సహాయ మవసరమైన యెడల సంతోషపూర్వకముగ నట్టి సహాయ మును చేయుదును. నీకు చిత్తశాంతి గలిగిన పిమ్మట వచ్చి మాట్లాడెదను

సుముఖి;- నాచిత్తము శాంతమునొందిన పిమ్మట బహుశా నీవు వచ్చి నాకు లంచము యిచ్చెదవు కాబోలు. ఇంకను యెక్కువ డబ్బు యిచ్చెదవు కాబోలు. నీడబ్బు నీదయు నా కక్కరలేదు. ఏకారణముచే నా కుమారుని చంపితివో ఆకారణమును నేను వెల్లడిపరచెదను.

శాంత మెల్లగ నాస్థలమును వీడినది. మార్గమధ్యమున గడ్డపుమనిషిని చూచి సంభ్రమములోనికి బోయినది.

---

—♦ ఇరువది యైదవ ప్రకరణము ♦—

నరేంద్రబాబు — సుధీంద్రుడు.

సుధీం;- ఏమి, నిజ సంగతి తేలినదా ?

నరేం;- మహాశయా ! మాకొక మార్గము చిక్కినది. దానిననుసరించి దోషులెవరో నిర్ణయించవచ్చును. ఇదియొక దారుణహత్య.

సుధీం;- దోషి యాగుపడియెనా ?

నరేం;- అవును. ఆదుర్మార్గ మొనర్చినవారెవరో కనిపెట్టితిమి. ఎందుకు హత్య చేసినదికూడ సులభముగ గ్రహింపగలిగితిమి.

సుధీం;- ఆ విషయము నంతయు సవిస్తరముగ దెలుప గోరెదను.

నరేం;- దోషి తమకుటుంబములోనివారని చెప్ప వలసి వచ్చినందులకు విచారముగ నున్నది.

సుధీం;- మా కుటుంబములోని వారా ? నేను నమ్మజాలను. నా నవుకర్లను నేను బాగుగ నెరుగుదును. వారి చిన్నతనమునుండి మా సేవయందున్నవారే. వారి ననుమానించుటకు సావకాశము లేశమైనను లేదు.

నరేం;- ఆర్యా, మీరునన్ను క్షమించవలయును. మీ నవుకర్లెవరీకార్యము చేసి యుండలేదు. దోషి మీ ఆప్తవర్గములోనివారే.

సుధీం;- ఆర్యా, మీరు బాగుగ యోచించి నిశ్చయించుకొనుడు. మీకు స్వేచ్ఛకలదు

గదా యని మీ యిష్టమువచ్చిన విషయము
లను పలుకుట భావ్యము కాదు.

నరేం:- భావ్యమో అభావ్యమో నాకు తెలియదు మీ కెవరికి కష్టముగనున్నను, నిజము తెలుపవలసి వచ్చినపుడు సందియము లేకుండ సంచరించవలసి యుండును. మీ యింట్లో విషయములు మీకు తెలియవనినచో నాశ్చర్యము లేదు.

సుధీం:- మా వసంతవిలాసములో రహస్యములేమియు లేవు.

నరేం:- మీరు నన్ను క్షమించవలెను. ఇచట చాల రహస్యములున్నవి.

సుధీం:- ఒక్క రహస్యమును చెప్పుడు చూతము.

నరేం:- శాంతాదేవి జీవితములో నొక రహస్యమున్నది. ఆరహస్యమే యీహత్యకు కారణము.

సుధీం:- మాగృహమునందలి స్త్రీల పేర్ల నుచ్చరించుటకు మీ కెట్టి హక్కును లేదు.

నరేం:- అయ్యా, తొందరపడి ప్రయోజనము లేదు. ఇచట కాకపోయినను రేపు న్యాయస్థానమందయినను వినక తప్పదు. సావధానులై వినుడు. అనేక సంవత్సరముల క్రిందట నేకారణముచే మరుగుపుచ్చినను, శాంతాదేవికి వివాహమై ఒక కుమారుడు కలిగినాడు.

సుధీం:- అది కేవల మసత్యము

నరేం:- నేను నుడువునదంతయు నిజాక్షరములుగ భావించుడు. శాంతాదేవిమీద నేనేమి [illegible]తీసికొనివచ్చుటలేదు. సంసారసుఖము శాంతాదేవికి లేకపోవచ్చును. అందుచే నామె యీ రహస్యమును దాచియున్నది. తన కుమారుని శాంతాదేవి యెన్నడు నంగీకరించియుండలేదు. పుట్టగనే యామె నాశిశువును సుముఖి సంరక్షణ క్రింద నుంచినది. ఆసుముఖి కొక కుమారుడు గలడు. అతడే కాళీచరణరాయలు — ప్రస్తుతము హత్య చేయబడిన వ్యక్తి. నేనిప్పుడు వివరములు చెప్పలేను. శశిభూషణుడను వ్యక్తియే శాంతాదేవి కుమారుడు. కాళీచరణుడీ రహస్యమును కనిపెట్టినందుననే హత్య చేయబడినాడు. రహస్యమును బయలు పెట్టెదనని బెదరించి శాంతాదేవి వద్దనుండి నాలుగు వేయి రూప్యములు గైకొనుటకు ప్రారంభించినాడు. ఇంకను డబ్బు సంపాదింపదలచి యీపర్యాయము పద్మావతమ్మగారిని దర్శించినాడు. క్షమించుడు తమ ఆగ్రహ దృష్టులను నాపై బ్రసరింపజేసిన ప్రయోజనము లేదు. హత్య జరిగిన రాత్రి కాళీచరణరాయలు ఆవరణపు ద్వారము వద్ద పద్మావతమ్మగారని కలిసికొనెను. వారిద్దరికి జరిగిన సంభాషణ యెంత కాలము జరిగినదో నేను నుడువజాలను. ఆమె నాతను తూలనాడియుండవచ్చును. ఆమె కాగ్రహమును కలుగజేసియుండవచ్చును. సోదరిపై కళంకము నాపాదించినందుల కామెకు రోషము కలిగియుండవచ్చును. ప్రేరేపణ యెట్టిదైనను, ఆమె యీతనిని వధించిన దన్నమాట వాస్తవము.

సుధీంద్రుడు భరింపలేక పోయెను. ఆగ్రహావేశములతో నరేంద్రుని కంఠము పట్టుకొనెను.

నరేం:- ఆర్యా, మీభార్య కాళీచరణరాయలును వధించినది. మీరు నన్ను వధించెదరా?

నామెడను విడువుడు. మీకు దృష్టాంత పూర్వకముగ విశదీకరించెదను. (సుధీం ద్రుది కంఠమును వదిలెను) ఆర్యా యీ గాజుముక్కను వీక్షింపుడు. దానిమీదనున్న రక్తపు మరకలను గాంచుడు.

సుధీం;- నిజమే. ఈ గాజుముక్క మా పద్మ హస్తమునకు సంబంధించినదే. అంతమాత్రమున నాతునక నామె యుచట పారవైచిన తనజాలము. హంతకుడే దొంగిలించి యట్లు చేసి యుండవచ్చును. ఇంతకంటె దృష్టాంతము లేదా ?

నరేం;- ఆరాత్రి తమభార్య ధరించిన దుస్తులివి. వీటిపైనున్న రక్తపు మరకలను జూడుడు.

సుధీం;- పద్మను మీ రెరుగరుగనుక దీనిని పెద్ద నిదర్శనముగ గైకొనుచున్నారు. నాకిది యంతయు వినోదకరముగనున్నది.

నరేం;- ఈ కాగితమును చూడుడు దీనిపై "పద్మ రహస్యము" అను మాటలను పరికింపుడు.

సుధీం;- పద్మకు రహస్యము లుండ కూడదా? అంతమాత్రమున హత్యకును పద్మకును ఎట్టి సంబంధము? పద్మయొక్క నిష్కళంక జీవితమును నాయెడ నామెకుగల బద్ధానురాగములనెవరును సంశయింపజాలరు. ఈగాజుముక్క పద్మకే చెందియుండవచ్చును. అపరాధి యెవరో దాని నపహరించి యనుమానము కలుగజేయుటకై నా విధముగ జేసియుందురు. హత్యనాటి రాత్రి పద్మ యీదుస్తులనే ధరించియుండు ననుటకు నిదర్శనమేమి గలదు? ఇక పద్మకొకరహస్యము గలదని నేనూహింప జాలకున్నాను. గత వత్సరములలోని జీవిత హంశములను జ్ఞప్తికి దెచ్చుకొన్నను నాకే రహస్యమును గోచరించుటలేదు. నన్ను వివాహమాడుటకు బూర్వ మామెకు నేదైన రహస్యమున్నదని యనుకొనుటకు నామెయొక్క యనంతర జీవిత నడవడి సావకాశ మొసంగకున్నది. ఎవరికైన రహస్య మున్నదని నిశ్చయింపవలసి వచ్చు నెడల నారహస్యము కొంతదని యనుకొనక తప్పదు. నరేంద్ర మహాశయా, మీరనివ పరికారము దోషము పద్మ దేయనుకొనుము. అయినచో నిపుడేమి చేయుదలంచితిరి.

నరేం;- న్యాయాధికారులకు వప్పగించుటకన్న చేయునదేమి.

సుధీం;- ఏవైన నూతన పరిస్థితులు సంభవించి దోషిని కనుపెట్ట గలిగినయెడల నపుడు మీరేమి చేయుదలచితిరి.

నరేం;- హృదయపూర్వకముగ సంతసించెదను.

సుధీం;- పద్మ కీవిషయము తెలియునా ?

నరేం;- తెలియదు.

సుధీం;- అట్లయినచో నాకొక కోర్కెగలదు. దానిని మన్నింప వేడుచున్నాను. న్యాయస్థానమునకు బోయి న్యాయము పొందుటకు వెనుదీయువారము కాము. మూడు దినములు నాకు గడువొసంగుడు. ఈలోపున పద్మనుగాని, మరి యెవరినిగాని కారాగారమున బధింపకుండ చేయ వేడెదను.

నరేం;- అట్లనే కావింపవచ్చును. ఇంతలో మునుగునదేమి! మూడు దివసముల యనంతరము మరల తమ దర్శనము చేసుకొనెదను.

# ఆంధ్రభారతి

## మచిలీపట్టణము

సంపుటము ౨ | మార్చి 19[illegible] | సంచిక ౧౨


# స్వవిషయము.

ఈ సంచికతో నాంధ్రభారతికి రెండేండ్లు పూర్తియైనవి. ఇకనుంచి ప్రతి మాసము 80 పేజీలను ప్రకటించెదము. చందా 3 రూపాయలు మాత్రమే. మాపత్రికయం దిసుమంతేసియు నభిమానము గలిగించి తోడ్పడినవా రెల్లరకును కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాము. ఇక ముందుకూడ తమ యభిమానాదరణముల నాంధ్రులెల్లరు చూపి మాకు దోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాము.

మాపత్రిక ప్రతినెల 25 వ తేదిని ప్రకటించబడును. కొన్ని అనివార్యములగు కారణములచే నీ నెల పత్రిక యాలస్యమైనందులకు క్షమింప బ్రార్థితులు.

ఇట్లు విధేయుడు,

సంపాదకుడు.

## సమయోచితము.

పాలకులకు సమయోచితమే ప్రధానము. మద్రాసు రాజధానియందు రాజకీయ పరిస్థితులను గమనించినచో నీవిషయము ప్రస్ఫుటము కాగలదు. కార్య నిర్వాహక శాఖయందు లా మెంబరు పదవి సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారి యనంతరము భర్తీ చేయవలసి వచ్చినపుడు, టి. ఆర్. రామస్వామి శాస్త్రి గారి కా పదవి నొసగిరి. రామస్వామి శాస్త్రి గారు నిగర్వియును, నిరాడంబరుడును, వాక్ఛూరుడు గాక కార్యశూరుడు నగుటచే నాయన యందలి మనోబలము నెరుగక, కేవల మొక దుర్బల మనస్కుడుగ నెంచి, నియామకమునకు బూర్వము దెలుపకనే లా మెంబరుకు సంబంధించిన రెండు మూడు ప్రధాన్యాంశములను తక్కిన ఎగ్జిక్యూటివ్ కవున్సిలర్ల కిచ్చిరి. రామస్వామి శాస్త్రిగారు ఉద్యోగము లభించిన నలుబది యెనిమిది గంటలలోగా నీకారణముచేతను పదవికి రాజీనామా నొసగి తమ యాత్మగౌరవమును గాపాడుకొనిరి. ఇందలి రహస్యమును విచారింతము.

మద్రాసు రాజధానిలో బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు ఉద్యోగ కాంక్షచే బ్రబలుటయు, నట్టి వర్ణ విద్వేషములతో గూడిన యుద్యమమును తుదముట్టించుటకు సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు గావించిన ప్రయత్నములు మనకందరకిని దెలిసిన విషయములే. గత యెన్నికలలో జస్టిస్ పార్టీవారు పొందిన యపజయమే అందుకు ఫలితమని యెంచవచ్చును. జస్టిస్ పార్టీ అపజయము పొందిన పిమ్మట, విల్లింగ్డన్ ప్రభువు హయాములో మంత్రులు ఎగ్జిక్యూటివు కవున్సిల్లర్లకు గల యన్యోన్యత నాటితో భగ్నమగుటయు, మద్రాసు రాజకీయ పరిస్థితులు ముందంజవైచుటయు, సైమను కమిషను వచ్చునరికి యద్వితీయమైన బహిష్కరణ వాతావరణ మేర్పడుటయు సంభవించినది. వర్ణ విద్వేషములను చంపుకొని సిద్ధాంతముల నిర్మించుకొనవలసినదని హెచ్చరించిన గోషెన్ ప్రభువు నిస్సహాయుడై తన యవ్యక్తమును తెలిసికొని, జస్టిసు పార్టీని తిరిగి చేరదీయుటకు నమకట్టెను. కనుక లా మెంబరును కేవలము కీలు బొమ్మగ జేయవలసివచ్చెను. అందుకొరకు కొన్ని శాఖల నితరుల కిచ్చుటయు, టి. ఆర్. వెంకట్రామశాస్త్రి గారు రాజీనామా నిచ్చుటయు జరిగినది. ఈలా మెంబరు పదవిని జస్టిసు పార్టీవారి కెరచూపి సైమను కమిషన్ సహకారము నెలకొల్పుటకు దోడ్పడవలెను.

ఈ లా మెంబరు పదవినే యెందుల కెరచూపవలెను? మరియొక పద్ధతినేల యవలంబింపరాదను సంశయము కలుగవచ్చును. లా మెంబరుపదవి భర్తీచేయవలసిననాటికి రాజకీయ పరిస్థితులను గమనింతము. మద్రాస్ శాసనసభ వారు 61 వోట్లచే సయిమను కమిషను బహిష్కరణము నామోదించిరి. శాసనసభకు తాబేదారులగు ముగ్గురు మంత్రులలో నిరువురు బహిష్కరణమునకు సమ్మతించిరి. డాక్టరు సుబ్బరాయనుగారు మాత్రమంత పుణ్యమును గట్టుకొనలేదు. న్యాయముగ గవర్నరుగారపుడు సుబ్బారాయన్ గారిని రాజీనామా నొసగవలసినదిగ కోరియుండవలసినది. అట్లు జరిగినయెడల మద్రాసు ప్రభుత్వమునకు సంభవించు యిక్కట్లు వేరుగ జెప్ప నక్కరలేదు. శాస్త్ర పద్ధతులలో రాజ్యాంగమును నడుపు

చున్నావని ప్రగల్భములు పలికిన గోశ్చన్‌ప్రభు వాక్ప్రవంచనము చేసికొని సమయోచితమునకు గడంగి, తగిన సమయముకొరకెదురుచూచుచుండెను. ఇంతలో సుబ్బారాయన్ గారిమీద విశ్వాసరాహిత్య తీర్మానమును స్వరాజ్యపార్టీ వారు ప్రతిపాదింపదలచిరి. శాసనసభలో ప్రతిపాదించుటకు ముందుగనే సభవారి యనుజ్ఞ కావలసి యుండెను. ఈయనుజ్ఞకు 42 వోట్లు యవసరము. కాని 38 వోట్లులభించినవి నాటి సభలో 38 మెజారిటీగ నున్నప్పటికిని 42 లేని కారణముచే విశ్వాస రాహిత్య తీర్మానమును ప్రతిపాదించుటకు వీలులేకపోయెను. అంతమాత్రమునకే గోశ్చన్‌ప్రభువు శాసనసభవారిపూర్వపు బహిష్కరణ తీర్మానము రద్దయ్యెనని వాదించి బహిష్కరణమున కొడంబడిన యిరువురు మంత్రులను రాజీనామా నిమ్మనెను. నిజముగ నామంత్రులు రాజీనామా నియ్యక యూరకున్నచో గవర్నరు వారిని వారి పదవులనుండి డిస్మిస్ చేయవలసి యుండెడిది కాని మంత్రులిరువురంత ధైర్యమునకు బూనక రాజీనామా నొసగిరి. మంత్రివర్గమునందు బహిష్కరణము వారు వదిలిపోవుటతోడనే గోశ్చన్ ప్రభువు పెద్ద రాజకీయ యెత్తును ప్రయోగించినాడు. ఒకవంక లా మెంబరు పదవి, మరియొకవంక మంత్రుల పదవులు ఆశచూపి పానుగల్లు రాజాగారిని పిలిపించి “శాసనసభను రద్దుచేసి క్రొత్తయెన్నికలు జరుపమనెదరా? లేక సయిమన్ కమిషను సహకారమునకు గడంగి సుబ్బారాయన్ గారికి తోడ్పడెదరా?” యను స్థితిలోనికి వచ్చినది. పానుగల్ ప్రభువు గొప్ప రాజకీయ చతురుడు. ఏ ఇంగ్లాండులోనో జన్మించినట్లయిన ప్రధాన మంత్రి అయ్యెడివాడు. ఏ అమెరికాలోనో జన్మించిన ప్రెసిడెంటుపదవి నలంకరించెడివాడు. అట్టి పానుగల్లు రాజకీయ పరిస్థితులను దూరదృష్టితో సింహావలోకనము గావించినాడు. క్రొత్తయెన్నికలు జరిపినచో, జస్టిసుపార్టీ వారికి గత యెన్నికలలో లభించిన జయముకూడ చేకూరదు. ఎంతయో ధనము వ్యయమగును. కనుక పానుగల్లు తన పార్టీ విధ్వంసము చేయుటకు బూనుకొనలేదు ఇక మంత్రిపదవుల నాసించుటకును వీలులేదు. కోయంబత్తూరులో జరిగిన బ్రాహ్మణేతర సమావేశమునందు రాష్ట్రీయ స్వాతంత్ర్యము లభించువరకు మంత్రిపదవుల నలంకరించమని జస్టిసుపార్టీవారు తీర్మానించిరి. ఇపుడు మంత్రిపదవుల నలంకరించినచో పరిహాసమునకు పాత్రులగుదురు. లా మెంబరు స్థానమునకు యే రామస్వామి అయ్యరుగారి వంటి వారో వచ్చినయెడల, తమ పక్షమునకు బలము చేకూరదని యెంచి లా మెంబరుపదవిని తమ పార్టీవారికిచ్చి తమ సమ్మతిని పొందినవారిని మంత్రులుగ జేసినచో సహకారమునకు బూనుకొనుటకు పానగల్లు పక్షమువారు నిశ్చయించుకొనిరి. గోశ్చన్‌ప్రభువు యెత్తు పూర్తియైనది. రామారాయణింగారు రాజకీయ పరిస్థితులను గల్పించుకొని తన పక్షమును పునరుద్ధరించుకొనినారు. స్వరాజ్య పక్షమువారు సేయునది గాక యుంగల నేర్పరచుకొని నెత్తిన చెంగళాయములయినారు. ఏ రత్నస్వామి గారో, ఏ మునిస్వామినాయుడుగారో కృష్ణంనాయుడుగారో లా మెంబరయ్యెదరు. సేతురత్నంఅయ్యరు, ముత్తయ్య మొదలియారు గార్లు జస్టిసుపార్టీ సహాయమునుపొంది మంత్రులైరి. ఈమహానాటకము సయిమన్ కమిషన్‌వచ్చి వెళ్ళు వరకు నిలచిన చాలును. తరువాత చదరంగపు ఎత్తులను గురించి తరువాత యోచింపవచ్చును,

గించికొనిన అధికారినిపై చర్య జరుప వలెను.

7. జిల్లాబోర్డు ప్రెసిడెంటు అర్జంటుగ బోర్డు శాంక్షను లేక యేదయినా పని జరిపే యెడల, జరిపిన నెలలోగా బోర్డు శాంక్షను పొంది తీరవలెను

8. జమీందారీ గ్రామములలో కూడ గ్రామ లెక్కలు ప్రభుత్వోద్యోగులచే ప్రభుత్వ గ్రామములవలెనే తనిఖీ చేయబడవలెను.

9. తాలూకాబోర్డు ఎలక్షనులయొక్క ఓటర్లజాబి తాలు తాలూకాబోర్డులచే గాక రివిన్యూ అధికారులచేతనే తయారు చేయించబడవలెను.

## లా కాలేజి.

ఈమధ్య మదరాసు హైకోర్టునందును రాష్ట్రములోని తదితర న్యాయస్థానములందును న్యాయవాదులపై ననేక ప్రాసిక్యూషనులు తేబడినవి. వీటిలోని యంతరార్థమును గ్రహించవలసియుందుము. ప్రస్తుత విద్యావిధానములో విద్యార్థులకు సరియైన దారి తెన్నులేక యేదియో డిగ్రీకొరకు పెనగులాడుటయు, నే మార్గమును చిక్కనియెడల లా కాలేజికి పోవుటయు జూచుచున్నాము. వేనవేలు లాయర్లు తీర్ణులై బల్లలుకట్టుకొని క్లయింట్లులేక కాలము బుచ్చుటతో మాంద్యత యేర్పడుటయు నెప్పుడైన నొక కేసు లభించిన తగిన శ్రద్ధలేక పోవుటయు విదితము. న్యాయవాదులలో కేవలము సరియైన వారు లేరని వాదించము. చాల మంది యుండియున్నారు. అట్టివారి వృత్తికిగూడ నీ సోమరులవలన కళంక మేర్పడుచున్నది. కనుక కొంతకాలమువరకు లా కాలేజిని మూసివేసిన యెడల, విద్యార్థుల కితర వృత్తులపై దృష్టి మరలుటయేగాక యున్న న్యాయ వాదులలో గూడ తమ క్లయింట్లయెడ భక్తిశ్రద్ధలు పెంపొందునని మాయాశయము.

## గృహలక్ష్మి.

ఇది హిందుగృహవిషయములను విపులముగ జర్చించుచు తద్విషయములలో దేశాభివృద్ధికి దోడ్పడు మాసపత్రిక. డాక్టర్ కె. ఎన్. కేసరి గారు తమ విశేషానుభవముచే సంపాదించిన విజ్ఞానము నీ పత్రికమూలమున నాంధ్రదేశమున కందజేయుచున్నారు ఇటువంటి పత్రిక మరి యొకటి లేదనవచ్చును. ఆకృతి రమణీయముగ నున్నది. సందర్భానుసారముగ చిత్రపటములను వేయుటయేకాక, త్రివర్ణచిత్రపట మొకటి కూడ చేర్పబడినది సాంవత్సరిక చందా రు 4—0—0 లు

వలయువారు,
డాక్టరు కె. ఎన్. కేసరిగారు, సంపాదకులు.
"గృహలక్ష్మి"
లోధ్రముద్రణాలయము,
ఎగ్మోరు, మదరాసు
అని వ్రాయవలెను.

# వివిధ విషయములు.

## స్త్రీ ముఖము.

1. అర్ధచంద్రాకారముగనుండు మోముగల స్త్రీ పుట్టినింట సంపదయు, విద్యయు, ధనము సమృద్ధిగనుండును. ఆమెకు సంతానము గలుగును. అన్నదమ్ములుండెదరు. ఈమె పుట్టినది మొదలు గిట్టువరకును, గృహములోని వారెల్లరు సకల సౌభాగ్యముల ననుభవింపుచుందురు.

2 విశాలముగనుండు మోమున నలరారు స్త్రీ దీర్ఘాయువు—బుద్ధికుశలత—వాచాలత్వము - పరోపకారము మొదలగు సుగుణముల నొప్పుచుండును.

3. మోమున నువ్వుగింజల బోలిన నల్లనిమచ్చలుండిన (పుట్టుమచ్చలు కావు) స్త్రీ సంతానమును సంపదయు గలిగియుండును.

4 ముఖమున కత్తిరింపులేని యయిదు చక్కని యడ్డ రేఖలుండిన స్త్రీ నూరు సంవత్సరములు జీవించును. ఇట్టి రేఖలు నాలుగుండినయెడల 80 వత్సరములు జీవించును. ముఖమున పొడవగు రేఖలు లేనటువంటి స్త్రీ నూటయెనిమిది వత్సరములు జీవింపగలదు.

5 స్త్రీముఖమున నేవిధమగు రేఖలును లేక మిట్టగనుండి కొన్నినరములు మాత్రము ఉబ్బినట్లు గనుపడుచుండిన స్త్రీ రాజపత్ని సమతుల్యమైన ఐశ్వర్యము ననుభవించుటయే కాక దయ—దాక్షిణ్యము—ఓర్పు మొదలగు సుగుణముల నలరారుచు సత్యముతే పలుకుచుండును. ఇట్టి స్త్రీని వివాహమాడిన పురుషుడు అష్టైశ్వర్యముల ననుభవించును.

6. ముఖమునందలి మధ్యభాగము పల్లముగ నుండిన యెడల నా స్త్రీ దాంపత్యసుఖము దైవభక్తినుండి వంచింపబడును. ఈమె యనుభవింపదగిన సౌఖ్యములన్నియు నలుబది వత్సరములు నిండు లోపుననే పూర్తియగును.

7. ఖండ ఖండములుగ కత్తిరింపు రేఖలుండిన మోముగల స్త్రీ దుఃఖము దారిద్ర్యము ననుభవించును

8. తప్పుసుడి (ఎడమసుడి) ముఖమునందుండిన స్త్రీ విధవయగును. ముఖమధ్యమున సరియైన సుడి యనగా కుడివైపు సుడియుండినయెడల నా స్త్రీ వివాహమైన కొలది దినములలోనే భర్తను విడిచి పెట్టవలసివచ్చును.

9. మాంసపూరితమయి తలవెంట్రుకలకు (పాపట నుండి) కనుబొమ్మలకు మధ్యభాగము మూడు వ్రేళ్ళ వెడల్పుగలిగియుండు మోముగల స్త్రీ ధన కనక వస్తు వాహన సమృద్ధియు నుద్యోగలాభమును బొందును. మరియు నీమె గృహము సమష్టి కుటుంబముగనే యుండును. ఈ కుటుంబీకులు సత్యసంధులుగను, ఆచారపరులుగనుండెదరు

10. కురచయైన ముఖముగలిగిన (పాపటకును బొమలకును మధ్యస్థలము) స్త్రీ భర్త యెల్లప్పుడును అపాయకరమగు ఉపద్రవములయందు చిక్కుకొని యుండును. విశ్వాసములేనివారుగ నుండెదరు; దైవభక్తి సున్న.

11. పూర్ణచంద్రునిబోలిన ముఖముండు స్త్రీ సమస్త జనులచేత సన్మానింపబడుచుండును. రాజమహిషిని బోలి సుఖముల ననుభవింపుచుండును

12. తామరపువ్వు తుల్యమగు వర్ణమున నలరారు మోముగల స్త్రీ సమస్త సంపదల ననుభవింపుచుండుటయే కాక యితర విధమగు సంపాదనకూడ కలిగి యుండును.

13. వటువిగనుండు మోముగల స్త్రీ ధనము—విద్య—కీర్తిని బొందుటయే కాక యుద్యోగమును గూడ బొందును.

14. ముఖము మిక్కిలి వెడల్పుగనుండు స్త్రీకి సుఖ దుఃఖములు రెండును సమముగనుండును

15. అత్యధిక సౌందర్యమున నలరారు మోముగల స్త్రీ సమస్త సంపదల దులదూగుచు పుట్టినది మొదలు గిట్టువరకును మహత్తర సుఖముల ననుభవింపుచుండును. పరోపకారము ధర్మబుద్ధి మొదలగు సద్గుణముల విరాజిల్లుచుండును.

16 ముఖము గుండ్రముగనుండి మాంసపూరితమయి యుండినచో సకలైశ్వర్యముల ననుభవించును. ఆ స్త్రీ మంచి పరిచారికలను, పశువులు అశ్వములు మొదలగు వానిని గలిగియుండును.

17. ముఖము నల్లని రంగు గలిగి పురుషచిహ్నములుండు స్త్రీ క్రూర స్వభావినియై యితరులమీద అధికారము చెలాయించు స్వభావముగలదిగ నుండును

18 ముఖమున రక్తము లేక పాలిపోయి తేజోవిహీనముగనుండు స్త్రీ దుఃఖము ననుభవింపుచుండును. సమస్త విషయములయందు సంతృప్తిని బొందుచుండును.

19. సన్నపుగనుండు ముఖముగల స్త్రీకి దాంపత్య సుఖము తక్కువగ నుండును అదియును 40 వత్సరముల లోపల బూర్తి యగును.

20 కోపము, మిట్టపల్లములు లేక చక్కగనుండు మోము గల స్త్రీ విశేష సుఖముల ననుభవించును. ముఖమెంత సుందరముగనుండిన అంత సుఖమును నా స్త్రీ యనుభవించును.

21. ముఖమున సుడి యుండు స్త్రీ వితంతువగును —(గృహలక్ష్మి.)

## రైల్వే బడ్జెటు వివరములు.

| | 1928—29 అంచనాలు | 1927—28 రివైజుడు అంచనాలు |
|---|---|---|
| ఆదాయము | రూ 10325 లక్షలు | రూ 10350 లక్షలు |
| ఖర్చు | 9250 ,, | 9075 ,, |
| నిలవ | 1075 ,, | 1275 ,, |
| కేంద్రప్రభుత్వము వారికి చెల్లింపవలసిన మొత్తము | 550 ,, | 663 ,, |
| మూలవ్యయమునకై ప్రత్యేకింపబడిన మొత్తము | 2800 ,, | 3000 ,, |

## ఆఫ్గనిస్థానము.

ఆఫ్గనిస్థానము పెద్దది. జనసంఖ్య తక్కువ. 2 లక్షల 70 వేల చతురపు మైళ్ళ విస్తీర్ణము. జనసంఖ్య 6 లక్షలు మాత్రమే. ఇంగ్లాండు విస్తీర్ణము 50,874 చ|| మైళ్ళయినను జనసంఖ్య 35,68 19 మంది కలిగియున్నది బెంగాల్ విస్తీర్ణము 76,843 చదరపు మైళ్లు జనసంఖ్య 46,95,536. దీనినిబట్టిచూడగా సరియయిన వృద్ధియున్న రోజుల ఆఫ్గను దేశములో కొన్ని లక్షల జనము నివసించుటకు సావకాశముగలదని తెలియుచున్నది

## 7,27,000 క్రొత్త ఫోర్డు కారులు.

అమెరికాలోని మాడిసన్ స్క్వేయర్ తోటలో హెన్రీఫోర్డు దొరగారు ప్రదర్శనము చేయుచున్నప్పుడు ఈ సంవత్సరము 7 27000 క్రొత్త మోటారు కార్లు తయారు చేయుటకు ఆర్డర్లు వచ్చినవనియు పరదేశముల కమ్ము మోటారు కారుల లెక్కలింకను జాబితాలో చేరలేదనియు వెల్లడిచేయబడినది.

## ఆక్స్ఫర్డు ఇంగ్లీషు డిక్షనరీ.

ఆక్స్ఫర్డు ఇంగ్లీషు డిక్షనరీయొక్క పనిని 1884 సం|| మున ప్రారంభించిరి. అది యిప్పటికి ముగిసినది. ఇది సంపూర్ణమగుటకిప్పటికి 30000 పౌండ్లు ఖర్చయినది. దీనియందు 14000 పదములు గలవు.

## సర్ లెస్లీస్కాటు.

సర్ లెస్లీస్కాటు యను విఖ్యాత ఇంగ్లాండు బ్యారిష్టరు హిందూదేశ సంస్థానాధిపతులకు రాయలు కమీషను సందర్భమున ప్రిణాళికయందు సంస్థానాధీశుల స్థాన మెట్లుండవలెనో వారికి సలహానిచ్చుటకై నియోగింపబడెననియు 53000 పౌనులు ఫీజునిచ్చు, ఇంగ్లాండులో నుండకుండ ఇండియాలోనుండు మూడుమాసములకు బిల్మక్తగా దినమునకు 200 పౌనులచొప్పున మూడు మాసములకున్నూ నిర్ణయించుకొనెనని తెలియుచున్నది. బ్యారిష్టరుగారికి అంతాకలిసి 70,000 పౌనులు అనగా రు 1050000 లు ఫీజు లభించును.

## మొయ్యలేనన్ని బిరుదులు.

జార్జి సార్వభౌముడు తనకుమార్డు యువరాజునకు "మాష్టరు ఆఫ్ మర్చెంటుకేపీ అండ్ ఫిషింగుఫీట్సు" యను పదవిని యొసంగిరి. యువరాజుగారికి పెక్కుపదవులు గలవు. వారి సంపూర్ణనామము "హిజ్ రాయల్ హైనెస్ ఎడ్వర్డు అల్బర్టు క్రిష్టియను జార్జి అండ్రూ ప్యాట్రిక్ డేవిడ్, కె, జి, పి. సి., కె టి., జి. సి. యస్, ఐ., జి. యమ్. యస్. జి., జి, సి ఐ. ఇ, యస్ సి, జి. సి., వి. వో. జి., ఎం. బి. ఇ. ప్రిన్సు ఆఫ్ వేల్సు, ఎర్లు ఆఫ్ చెస్టరు, ప్రిన్సు ఆఫ్ గ్రేటుబ్రిటను అండ్ ఐర్లాండు, డ్యూక్ ఆఫ్ క్లారిక్కు బ్యారను ఆఫ్ రెన్ఫ్రూ, లార్డు ఆఫ్ ది ఐల్సు, ప్రిన్సు అండ్ గ్రేటుస్టీవర్టు ఆఫ్ స్కాట్లాండు"

## పూర్వకాలపు ధరలు.

అల్లావుద్దీన్ చక్రవర్తి కాలములో రూపాయకి క్రిందివిధముగా వరుసలు లభించుచుండెడివి.

| | | | |
|---|---|---|---|
| గోధుమలు | రూపాయకు | 119 | సేర్లు |
| బియ్యము | ,, | 179 | ,, |
| సెనగలు | ,, | 179 | ,, |
| నెయ్యి | ,, | 88 | ,, |

### అడవులు.

ఈ రాజధానిలో (Reserved) అడవులు 19 వేల చతురపుమైళ్ళు. ఇందులో 3,3[illegible]0 చతురపుమైళ్లు అటవీ పంచాయితీలకు స్వాధీనము కానున్నది.

### నిమ్నజాతులు.

బ్రిటిష్ ఇండియాలోని నిమ్నజాతులసంఖ్య 1,80,000 వీరిలో విద్యను వ్యాపింపచేయుటకు ప్రతిసంవత్సరము 30 లక్షల రూపాయలు ఖర్చుపెట్టబడుచున్నది. 1917లో భారతదేశమున 1,95,[illegible]00 నిమ్నజాతి విద్యార్థులుండిరి. 1927 సంవత్సరాంతమున వీరి సంఖ్య 6,67,[illegible]0[illegible] రాష్ట్రములవారీగ నీక్రింది విధమున నున్నారు.

| | |
|---|---|
| మద్రాసు | 2,09,00[illegible] |
| బొంబాయి | 55,[illegible]0[illegible] |
| వంగదేశము | 2,5[illegible],000 |
| సంయుక్తరాష్ట్రములు | 75,[illegible]0 |
| పంజాబు | 19,000 |
| మధ్యరాష్ట్రములు | 34,000 |



## నా మనఃప్రవృత్తి.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

౧

గీ॥ ఓయి మానస! నీకు వైద్యుండు సెప్పి
నట్టిదేమి? నీ చేయుచున్నట్టి దేమి?
కదలఁబోకుమ! అది యిది కావలెనని
పట్టు బట్టకు మేమియుఁ బలుకవలదు
జాగరూకతఁ బథ్యంబు సలుపుమందు
శాంతముగనుండు; కాని పక్షమున నీకు
వ్యాధి కుదుర దటంచును బలుక లేదె?
అదియ నీకౌషధంబని యనగ లేదె?
మఱచితివా? కాక నిర్లక్ష్య పఱచినావా?

౨

కదలుదువు, మాటలాడుదు వదేఁ బదిగను
లేచి కూర్చుందు వవ్వాదు; చూచుచుండు;
మంచి దుస్తులు మవ్వంపు మించుబోండ్లు
పూల మేడలు వరహంస తూలికలును
స్వర్ణపాత్రిలు రత్నాల పాదుకలును
నందలంబులు నాకాశయానములును
గంటికింపైన యవి యెల్లఁ గావలయును
రసన గాంక్షించు నదియెల్ల మెసఁగవలయు
వీనులకురుచించున దెల్ల వినవలయును
దెమ్ము తెమ్మని నన్ను బాధింతువకట!

౩

తెచ్చి యిచ్చున్న దీనతం దేఱుకొనవు
కాని పోనీకదా! యని కావలసిన
దొకటి యొసఁగిన శిశువున కోజఁగోర్కి
యొకటి తగవాత వేఱొక్కఁ జూచుచుండు
దనిని యను మాట నెన్నఁడుఁ గనిన యెఱుగవు
ఈయపథ్యంబుచే రోగ మెట్లు కుదురు?
కుదురవలె రోగమని నీవు కోరుకొనవా?

౪

కోపపడ నూరకుందువు కొంతసేపు
క్రిమ్మఱ యథాపురంబుగాఁ గావలెనని
యూపిరినిఁ దీయుచుందువు; యొప్పిదముగ
వైద్యుఁడే తెంచి చెప్పిన పలుకులెల్ల
నపవుదు నటంచుఁ బ్రతినలు నుడివి నుడివి
యాలేదు మొగంబుఁ ద్రిప్పంగా నకట మరల
నవ్వటాటల నాడుదు వేల? చెపుమా!
ఈయపథ్యంబుచే రోగ మెట్లు కుదురు?
నాకు నానంద మెట్లు మానసము! కలుగు?

# విమర్శనము

కోట భాస్కరరావుగారు.

నేనొక విమర్శకుడను. మా పూర్వులలోఁ గూడ కవులు కొందఱు లేకపోలేదు. పైతృక ప్రతిష్ఠాభిమానము నన్నేక వంశ్యాచారములు కవినో, విమర్శకుడనో కమ్మని ప్రోద్బలపఱచినది. కవిగాని, విమర్శకుడుగాని కావలెనన్న గ్రంథములు పెక్కు లుండవలయును. కావున గ్రంథములకై పెక్కుర నాశ్రయించితిని. కొందఱు "మీయింటఁ గాకితములున్నవా" యని బయలుదేరుచుండ నేను కోమటిండ్లకుఁ బోయి ప్రాతపుస్తకము లున్నవా యని యడుగ నారంభించితిని. కొన్ని గ్రంథములను ఛిద్రపత్రములను కొలఁది వైకమునకుఁ గొంటిని. ఎట్లో కొంతకాలమునకుఁ బెద్ద పుస్తకభాండాగారమును సమకూర్చితిని. అప్పటికి స్వంత పుస్తకభాండాగార మున్నవారిలో నేనొక్కఁడనే యని గర్వ ముండెడిది. అడిగినవారికి గ్రంథముల నీయక దాచియుంచెడువాడను. ఇంకను వీలగుచో "పుస్తకం వనితావిత్త మన్నట్లు" దొఱకిన మట్టునకు పుస్తకముల జాగ్రతపెట్ట నారంభించితిని.

భాండాగార సంగ్రహణానంతరము తీయగా తీయగా రాగమన్నట్లు చదువగా చదువగా కొన్నాళ్ళకు కవిత్వము పూర్వపుణ్య లాభము వలన కలిగినది. ఒకటి రెండు కావ్యములను కొన్ని చాటువులనుగూడ రచించితి. నాతోడనే బయలుదేఱినదా యన్నట్లు విమర్శనకూడా బయలుదేఱినది. విమర్శనతోఁబాటు విమర్శకులుకూడ బయలుదేఱిరి. అందులో నేనొకడను. చెట్లు లేనిచోట యాముదపుచెట్టు కల్పవృక్ష మన్నట్లు విమర్శకులలో మొదటివాడ నగుటచే నాకు పేరు ప్రతిష్ఠలు వచ్చుటకు ప్రారంభమాయెను. నా గర్వమునకు రెక్కలొదవినవి. ఎవ్వరైనను "ఈయన గ్రంథములు చాలగా సంగ్రహించినార"ని యన్నను నాకు భయము లేకపోయెడిది. ఏలనన, మేము చదువుకొను సమయమునం దెవ్వరైనను మా వేద పుస్తకముల నెత్తుకొనిపోవుచో మా గురువుగారు "వేదములుగదా యెత్తుకొని పోఁబడినవని" చెప్పుచు మమ్మూరకొనఁ బెట్టెడువారు. అదే మాదిరిగా కవిత్వపు పుస్తకాలు గనుకను, కావ్యాలు వేదాలకు తరువాతవిగనుకను, కవిత్వములోఁగూడ దేవుఁ డున్నాడు గనుకను ఫరవా లేదని నాలో నేను సమాధానము చెప్పుకొనుచుండెడివాడను. లేకున్నచో నాతో విమర్శింపఁ బ్రారంభించిన విమర్శకులవలె నాపని కూడ దారిలోనే ముగిసియుండెడిది. నాకు భయము లేదుగనుకనే విమర్శింపఁ గలిగితినని యెంచి యింకనప్పుడప్పుడు విమర్శనలు వ్రాయుచుంటిని.

నన్నిమధ్య మా సమ్మేళనమువారు నీ వేదేని విమర్శన మంపుకొనుమని కోరఁగా "నుబుసుపోని మంగలి పిల్లి తల గొఱిగినట్లు" నేనీ విమర్శనకు గడఁగితినని మనవి చేసుకొనుచున్నాను.

దేనినిగూర్చి విమర్శింతునాయని యొకనాటి రాత్రి యాలోచనానిమగ్నుఁడ నయి యుండఁ బ్రాతకాగితాల కట్ట యటకపైనుండి కనుపించినది. దానినితీసి తిరుగవేయఁగా కోమటిదగ్గర కొనిన యొక బాలరామాయణపు టచ్చుప్రతి నాకుఁ గనిపించినది. దానిలో నొక విడిపత్రముపై నీ క్రింది పద్యమును మరికొన్ని యంశములును కనుపించినవి.

అందులోని పద్యమిది:-

సీ॥ "శ్రీకంఠ వైకుంఠ సేవావికుంఠ వం
దారమందిరము బందారుపురము
నిరతోత్సవైశ్వర్య నిరాభిభూత బృం
దారకాపురము బందారుపురము
సంతతాయాత యాచకజన వ్రాతి మం
దారభాసురము బందారుపురము
సకల వర్ణాశ్రి మాచార సంపత్యుతం
దారశిఖరము బందారుపురము
గీ॥ శిల్పి నర్తక వర్తక చిత్రకార
సూత్రకారాది వివిధ విచిత్రకృత్య
దానధర్మ పరప్రోత్కరచకోర
కార విందారికరము బందారుపురము.

ఈ పద్యమును, మరికొన్ని యంశములను నాధారము జేసుకొని నా యుపన్యాస పూర్వక మగు నీ విమర్శనముఁ గడంగితిని. నా విమర్శనమును చదువరు లాలకింతురుగాక!

—♦ విమర్శనారంభము ♦—

ఈపద్యము ముద్రితమగు బాల రామాయణములోనిదిగఁ దెలియుచున్నది. ఈ బాల రామాయణము 1791 వ సంవత్సరము అనఁగా నిప్పటి కింఁనుమించు నూటముప్పదిరెండు (132) సంవత్సరముల క్రిందటనే యచ్చు వేయఁబడిన ట్లీగ్రంథమువలననే తెలియవచ్చుచున్నది. ఆకాలమునాటి కూర్పులలో నీ బాలరామాయణపుఁ బ్రతియొక్కటియే కలదని తోఁచెను. ఆప్రతిలో నొక ఛిద్రపత్రముపై నీపై పద్యరాజ మగపడెను. మరికొన్ని సంగతులుగూడ గనిపించినవి."

ఈ గ్రంథమును చూచుటతోడనే విమర్శకునకు గ్రంథము ... వేయఁబడినదా? లేక వ్రాయఁబడినదా? యను సందియము మొదఁ తీరును. సందేహ నివారణకై పత్రముల దిరుగవేయ నారంభించితిని. గ్రంథ మధ్యము నందొక విడి కాగితముపైఁ

'చాతచశ్మి తెనుగు ఛప్పావయ్యాడం ఆరంభించిన తాకీకూ' అని యున్నది.

ఈ గ్రామపద స్వొష్టవమునందున్న లిఖితమును గ్రాంథిక వ్యావహారికములోనికి మార్చి చూచితిని. అప్పుడు "చేతజేసిన తెనుఁగు చెప్పి వేయుడము'గా మారినది. 'చేతజేసిన' యనుటతోడనే యెవరిచేత? యని ప్రశ్నించుకొంటిని. జవాబు తేలికగా 'ఫలానావారిచేత' యని వచ్చినది.

తరువాత 'చేసిన' యన్నది తీసుకొంటిని. ఫలానావారిచేత చేసిన యని యుండదు గనుకను 'ఫలానావారిచేత చేయఁబడిన' యని యుండవలయుననుకొని - ఇది గ్రంథవరముగా నర్థమిచ్చుటలేదని యోచించి - 'చేత' యనఁగా 'చేష్ట' యనఁగా 'పని' యని యర్థము గ్రహించి 'చేతజేసిన' 'పోతపోసిన'గా నర్థము చెప్పుకొనక తప్పినదికాదు. ఏలనన 'చేత' 'పోత' విశేష్యము లగుటఁజేసి, మరియు 'చేసిన' 'పోసిన' క్రియాజన్యము లగునవి.

పైవానితో 'తెనుగు' అను పదము నన్వయింప 'పోతపోసిన తెనుగు'అని యింతవరకు తేలినది. ఇక్కడ తెనుఁగుశబ్దము విశేషణమగుటచే ముందుపదము 'ఛప్పా'వుతో నన్వయించితిని. అప్పుడు 'తెనుఁగు ఛప్పావు' అనఁగా తెనుఁగచ్చు (Telugu Print) అని తేలినది. గ్రామ్యపద వ్యాకరణానుసారము ఎయ్యాడం "వెయ్యడము' 'వేయుట'గా మారినది. ఇప్పుడొక్కసారిగా "తెనుఁగచ్చువేయుడం' అని యర్థము సుభువుగా తెలిసినది.

ఇప్పుడంతయు నొక్కసారిగా వ్రాసి చూతముగాక !

"పోతపోసిన 'తెనుగచ్చువేయుడం' ఆరంభించిన తాకీకూ" యని యర్థము విస్పష్టమయినదిగదా!

'ఛప్పా' యను హిందీపదము తెనుఁగు వ్యాకరణములోనికెట్లుఁ రాజెల్లునని యందురేమో? అట్లుకాదు. ముందు 'తాఁకును' వెనుక 'బంకరు'ను జూచుకొనినచో సందేహ విముక్తులగుదురని నమ్ముచున్నాను.

నామిత్రులు కొందఱిది చెల్లకూడదనవచ్చును. 'ఫలానా వ్యాఖ్యాతచేత చెప్పబడిన తెనుఁగు" అనఁగా 'ఫలానా వ్యాఖ్యాతచేత చెప్పబడిన తెనుగని' యర్థముచేతురు.

అనఁగా నన్వయపరముగా నర్థమును వ్యాఖ్యాతలు ముందువెనుక లాలోచించి 'తెనుఁగులోనికి భాషాంతరీకరణము" యని యర్థముఁ జెప్పుదురు. తరువాత 'ఛప్పావయ్యడం' 'చెప్పి వేయుడము' అని యర్థముచెప్పి, 'చెప్పుటకు ప్రారంభించిన తాఁకు' అని యన్వయము సరిపుత్తురు.

వెలయున నియ్యది సంస్కృత బాలరామాయణము గనుకను దానిని తెనుఁగుచేయుట కారంభించిన తాఁఖూ-అనుయనుటలో దప్పులేదు గనుకను ఇట్లర్థముజేసి చెప్పవచ్చును కాని యిదెంతయు నసంభవము. పూర్వకవు లెక్కడను కావ్యములు చెప్పుచో నారంభదినమును చెప్పుకొనియుండలేదు. వారెప్పుడును గ్రంథాంతమందు 'శాకాబ్దము, రవి, యిందు, శర, మున, వత్సరములని యేదేదో నుడువుట తప్ప నితరంబు గాన్పింపదు.

కావునసే మొదటియర్థంబు గ్రహింపవలసి వచ్చినది.

తెనుఁగచ్చు జంత్రములువచ్చుట కిదియే ప్రారంభమని యూహించితిని. తరువాత నీగ్రంథమచ్చొత్తింపఁ బడినదిగా నిశ్చయించితిని. నిశ్చయించి తెనుఁగచ్చు ఆంధ్రదేశమునకు వచ్చి యిప్పటి కించుమించు 132 సంవత్సరములాయెనని ఘంటాపథముగా చాటఁబంపితిని.

తరువాత నచ్చటి తెనుగచ్చునుగూర్చి కొంతగా నుపన్యసింప మొదలిడితిని. "ఇప్పుడీగ్రంథమునుబట్టి యందలి యక్షరవిన్యాసమును బట్టి చూడ నూఱువత్సరములకుఁ బూర్వ మెట్టి యచ్చుయంత్రము లుండెడివో, యచ్చెంత సొగసుగ నుండెడిదో తెలియఁగలదు. ఆపోత్తము యొక్క ముఖపత్రమునందు 1794 వ సంవత్సరమని వ్రాసియున్నదని మీకిదివరకే తెలిపితిని. కావున నేటికి తెనుగచ్చు వచ్చి 132 సంవత్సరములాయెను"

ఈగ్రంథమునందే భూమికలో నీపై 'బందరుపట్టన'వర్ణనపద్యముకలదు. ఈపద్యమునుబట్టి యీ తెలుగచ్చు యంత్రము మొదట బందరులో బుట్టినట్లుగా నెంచితిని. అట్లనుటకు నాకు కారణములు లేకపోలేదు.

(1) "శిల్పిన ర్తక వర్తక చిత్రకార ।
సూత్రకారాది వివిధ విచిత్రకృత్య-॥

అను నీపద్యభాగమును బట్టి బందరుపట్టణ మొకానొకప్పుడు గొప్ప నగరమని యెంచి 'శిల్పి...చిత్రకృత్య' అనుటతోడనే తెనుఁగచ్చు చెక్కఁబడి పోఁతఁబోయఁబడి నట్లును నిర్ధారించితిని. నాసంతోషమునకు మేరలేకపోయినది.

(2) బందరునుగూర్చి యితిహాసమునందు చాలగాఁ జెప్పఁబడినది. బందరొకానొకప్పుడు మదరాసుకంటె కూడ నుత్కృష్టదశయందుం డెనిదను సంగతి పైపద్య వర్ణనునుబట్టియే గాక

యితిహాసముల వలనను దెలియనగుచున్నది బందరనగా హిందీభాషలో రేవుపట్టణమని యర్థము. ఈ బందరు సార్థకనామము వహించినదేల యన నప్పటి రేవులలోనికెల్ల నత్యాధి యుత్కృష్టదశయందుండుటఁ జేసి యట్లన్యోనని చెప్పుటలో నతిశయోక్తిలేదు. దీనినే పూర్వము ‘బృందారకాపురమని’ దాని వైభవాతిశయమునఁ జేసి యట్లు పిలుచుచున్నట్లు పై పద్యమువలనఁ దెలియనగుచున్నది.

(౩) చరిత్రిన బట్టిచూడఁ బాశ్చాత్యులు కొందఱు బందరులో రేవు నేర్పఱచుకొని కొన్ని వర్తకశాలలను గట్టుకొని యున్నట్లు తెలియుచున్నది అప్పుడు తమ క్రైస్తవమత గ్రంథముల నచ్చువేయుటకుఁ దెలుగచ్చు యంత్రములు గావలసి వచ్చియుండును. అప్పుడు వారు తమ మతబోధకులకు గ్రంథములు గావలసియుండి, గ్రంథములకు తెలుగచ్చు యంత్రమును తయారు చేయించి యుండి యుందురనుటలో సంశయములేదు.

కావున ‘తెనుఁగచ్చు’ ముందు బందరునందే బయలుదేరి యుండవచ్చునని నొక్కి వక్కాణింపఁగలిగితిని.

(4) మఱియు నచ్చునుగూర్చి రెండుముక్కలు చెప్పఁదలచితిని. అప్పటి యక్షరములు తప్పులుచ్చారణ కారణములు వంకరటింకరగులుగను తలకట్లు మొదలైనవి కలయకుండగను నుండెడి వనుటలో నాశ్చర్యములేదు. ఏలయన నిట్టిదియే మొదటి తెనుఁగచ్చుయంత్రమని చెప్పఁబడినసంగతి తెలిసియున్నదేను.

ఆగ్రంథము నవలోకించినవారికి గాని యందలి సత్యాసత్యములు తెలియనేరవు. తరువాతి రసాంత్రిము లోకదాని కొకటి స్ఫుటతరములై నిర్దోషములై గాను గాను అలవాటు వాడకములచేత బాగుగ నొప్పుచుండెడివి.

గ్రంథములోని వ్యాఖ్యాన సౌష్ఠవము గ్రామ్యపద భూయిష్ఠము. మఱిచితి. ప్రాకృత భూయిష్ఠ మనవలెఁ గాఁబోలు! పూర్వ వ్యాఖ్యాన గ్రంథములఁ జూచుచు నెంతటి పూర్వ గ్రంథములం దింతటి గ్రామ్యములేక, వ్యవహార భాష యని తెలుపుచున్నారో? గాని నేఁజూచిన యీబాల రామాయణము 182 సంవత్సరముల క్రిందటిది పోనిండు! సంస్కృతమునకు తెనుఁగు కిదా యందఱకును దగియ తెనుఁగు వ్రాసి యుందురనకొందము సంస్కృతము మాట యేమందును. సంస్కృతమని చెప్పఁబడు సంస్కృతముఁగూడఁ బూర్వకవి విరచితమైన బాల రామాయణమును కూడఁ గ్రామ్యములోనంగాఁ బ్రాకృతమునం దచ్చొత్తించిరి కాఁబోలు! చూడుఁడు! ఇందు మొదటి శ్లోకము!

‘యాదృశీ పుస్తకం దృష్ట్వా!
తాదృశీ లిఖితం మయా!
అబద్ధంవ్వా సుబద్ధంవ్వా!
మమ దోషో నవిద్యతే’!!

ఇందలి దోషంబులు విజ్ఞులకే యెఱుక! నేను వేఱ చెప్పనక్కరలేదు.

ఈ పై శ్లోకమునకు నర్థము కాఁబోలు! ఒక పద్యము:—

‘వ్రాత తప్పువలన । వాచకు లలుగక
తప్పు గలిగెనేని । — ౧ వయులు —
అక్షరములు నిల్పి । అ — — ంగబడువుడు
ను — వులైనవారు । సుమ చిరముగ’!!

చిరముగ "— అని పాదమును దానితోఁ బాటు పద్యమునుగూడఁ బూర్తియయినవి.

ఆపద్యము;—

ఆ. వె॥ వ్రాత తప్పువలన ♦ వాచకులలుగక
తప్పుగలిగెనేని ♦ తగినయట్టుల
అక్షరములు నిల్పి ♦ అమరంగజదువుడు
సుకవులైనవారు ♦ సుగుచిరముగ॥—"

ఘూణాక్షరయుతమగు పద్యమును పూర్తి చేసితిని. అచ్చు బాగులేకపోవుటచేఁ గలిగిన లోపము..గాని వేరుకాదు కాన యీ యచ్చే మొదటిది. అందులోను బందరే మొదటి యచ్చు' పోతఁబోసిన పట్టణమని నిర్ధారణ చేసితిని. 1794 నకు పూర్వ మచ్చుయంత్రము లున్నట్లు తోఁపదు.

ఈమాదిరిగా నాయుపన్యాసమును, సంక్షిప్తముగా నున్న నావిమర్శనమును నాపడిన శ్రమను గూర్చి ముచ్చటించుకొంటిని.

ముచ్చటించు కొనుటతోడనే మా సమ్మేళనమువారు విమర్శనకారయిన్నట్లు నామీద శిలా శాసనములు, తామ్రశాసనములు, రాతిబండలు పడవైచి నన్ను చాలా గౌరవముఁ జేసి బ్రహ్మరథము పట్టుటకు తిరువాయిగా నన్ను సంసిద్ధనొనర్చిరి.

ఈవిమర్శనలోఁ బూర్తిగా విమర్శనా విధానమును అందలి శ్రమయును తెలియఁజేసికొంటిని. ఇదంతయుఁ జాలవరకు యాదార్థ్యమును ఐతిహాసికము నైయున్నది. ఇది నేను కన్నులతో బాలరామాయణ గ్రంథమును చూచి చెప్పినదిగాని వేరుకాదు. సాక్ష్యము గావలసినచో నామిత్రులే నాకు సాక్షి. ఇందలి సత్యాసత్యంబులు విజ్ఞులకే యెఱుక! కష్టమున కోర్చి చదివిన వారికి నామనఃపూర్వకాభివందనములు – సెలవు గైకొనెదను.



## సంగీతము. *

కవికుమారుఁడు (కవితానమితి)

భీకరారణ్య సీమ నేవేళఁ దిరుగు
క్రూర మృగరాజి కూడ సక్రూరఫణితి
మధుర సంగీత మాలించు మాత్రమున న
సాధు తేజమ్ము వెడలు వీక్షణముతోడ
కడుప్రశాంతమునంగుటఁ గాంచనగును
సుధలు చిలుకు సంగీతమ్ము సోకినంత
కఠిన పాషాణములుకూడ కఱగిపోవు
వర మనోహర స గీత గరిమయందు
నెవని కొక్కింత యైనను మెచ్చుపోదొ
విమల మధుర సంగీతమ్ము వినియు కూడ
తన్మయత్వమ్ము నెవఁడు నంతయును కనఁడొ
అత డతిఘోర నీచ కార్యమ్ములకును
కఠిన దుర్దాంత కుటిల సంకల్పములకు
యెన్నడేనియు వెనుకంజ నిడఁడు; వాని
కలుష హృదయాంత రాళమ్ము కాళరాత్రి.
పోలె గాఢాంధకారప్రపూర్ణమయ్యు
వాని ప్రణయమ్ము కృష్ణ శర్వరులయందు
భయదగలవాఱు యమునాస్రవంతి పోల్కి
గానవగు, నట్టి కాఠిన్య మానవులను
నమ్మదెన్నఁడు నకూడ నమ్మరాదు.

( * షేక్స్పియరు గీతమునకు భావానువాదము.)

# శిరియాళుని సత్పథము

వి. విశ్వనాథంగారు.

బసవపురాణము మొదట ద్విపదరూపమున పాలుకురికి సోమనాథ కవిచే రచింపఁబడెను. పిమ్మట దీనినే పద్యరూపముగా పిడుపర్తి సోమనార్యుఁడు రచియించెను. పాలుకురికి సోమనాథుఁడు వీరశైవుఁడు. ఈతఁడు శైవమత గ్రంథము లనేకములను రచించెను. ఈతడు ప్రతాపరుద్రుని కాలములోనివాడు. ఒకనాడు ప్రతాపరుద్రుఁ డోరుగల్లున శివాలయమునకు బోవుచుండ శైవులు కొందరు ఆలయమండపముమీద గూర్చొని సోమనాథకవి రచితంబైన బసవపురాణమును వినుచుండిరి. వారిని జూచి రాజు దేమని ప్రశ్నింప చెంతనున్న ధూర్త బ్రాహ్మణుఁడొకడు "మొన్న నీనడుమను పాలుకురికి సోమపతితుఁడు మధ్య బర్చు పెట్టి యల్లిన యపరిమాణ బసవ ద్విపద పురాణపఠన"మని పల్కెను. ఇయ్యది సోమనాథునకుఁ దెలిసి వాని ప్రతివాదుల నెల్లరను జయించుటకు శిష్యులతో నోరుగల్లుపై బయలుదేరెను. సోమనాథుని రాక యెఱింగి ఆయూరి బ్రాహ్మణ ధూర్తులాతని నవమానించుటకై యా యూరనుండు మత్తులైన మొండివాఁడ్రు మొదలయిన వారిని శివభక్తుల వలె వేషములు వేయించి వాని శిష్యబృందములోని వారి వలె నెదురంపెను. తరువాత సోమనాథుఁడు వాని ప్రతిపక్షులతో వాదించి గెలిచి రాజానుగ్రహమును బొందెను.

సోమనాథుని శైలి మిక్కిలి రసవంతమై వర్ణనా చమత్కృతియుఁ గొక్క వైలక్షణ్యమును గలిగి ముద్దులుగులుకుచు పద్యయు గద్యంబైయుండును.

సీ|| పూర్వజన్మార్జిత భూరిదుష్కర్మాళి
గర్వభంగించు నా గొడుకు రార
దక్షాధిపుని దర్పంబుఁ దెగటార్చు
దక్షుండవైన నాతనయ రార
భయద తాపత్రయ భారదుఃఖంబులఁ
బరిమార్చ గల్గు నాపట్టి రార
ఉత్తర దిగధీశ్వరోపాత్త పణ్య
పశుపతియైన నాశిశువ రార
గీ|| స్వర్గభోగ్యాధిక పదస్థ సరగ రార
దండ ధరదర ఖండనోద్దండ రార
ప్రకట సంసార పాపమోచకుడ రార
చిత్త పద్మ మనోరక్తి విముఖ రార||

సీ|| దివిజలోకేశ్వరాధిక దేవదేవ్యుండు
వరగుఁడైనాఁడు నా వడుగ రార
అంతరాంతర మూర్తియగు దశస్వివరుండు
సంతసంబంద నాస్వామి రార
ఘోర నిస్సార సంసార పయోరాశి
పారమందించు నాపట్టి రార
అర్ధేశ సఖవిభుండగు యోగిశేఖరుంబు
గోరి భజింతు నాకుఱ్ఱ రార.
గీ|| దివిజకాంతాయుతామృత యువతి నిన్ను
గవయనున్నది సన్ముక్తికాంత రార
సారె సారెకు మీతండ్రి సవ్యశాఖ
వదురుచున్నది వేగ మాయన్న రార ||
క|| శేహాళియు బడమట వ్రాలెశి,
కాలారాగదరయుత్తరం బేలజను
జ్ఞాలోన్మీలన కాలి వి
కాలయకుండైన తపసి సంతసపెంచెన్ ||
గీ|| కాంచికాపుర బాలాగ్రగణ్య రార
యనుచు నలందిక్కులను నిల్చి యాలకించి
గల మృదూక్తుల వాగ్లేపకవి విధమున
సుతుని బిల్చెను నిజమతి సూచకముగ ||

( శిరియాళుని సత్పథము. )

భాగవతమునందు ప్రహ్లాదుఁడెట్టి విష్ణుభక్తుఁడో బసవపురాణమునందు శిరియాళుఁడట్టి శివభక్తుఁడు. హిరణ్యకశ్యపుఁడు ప్రహ్లాదునెట్టి యిడుమలఁ గుడిపినను శ్రీమన్నారాయణునివలన గాపాడబడి నట్లు ఎట్టి భక్తి ప్రహ్లాదునియందు పరిగణింపబడినదో నట్టి తదైకధ్యాననిరతుడైన శిరియాళుని భక్తి శివునియొక్క మాయా పరీక్షలవలనఁ బరిగణింపబడినది. కాబట్టి పారమార్థికమునకు మూలమైన వివేకము, నిష్కామత్వము, సదాచారము, ప్రేమ వీటిననుసరించి ప్రవర్తించు మానవశ్రేష్ఠుడు ఎట్టి యిడుములయందైనను నిదానమును, మార్దవమును, దయయును గలిగి యితరుల కనుకూలముగను యుక్తముగను ప్రవర్తించును. తన కెంత స్వాతంత్ర్యము కావలయునో, నితరులకుకూడ నంత స్వాతంత్ర్యము నిచ్చును. శిరియాళుఁడిట్టి మార్గము నవలంబించుటచేతను మనోవాక్కాయకర్మలందు సత్యవ్రత నిరతుండగుటచేతను, వివేకముగునది బాగుగ గమనించినవాడగుటచేతను యతి

ధీర్ఘమైన యీశరీరముకు మాయావరీక్షల కణుమాత్రమైన జంకక తుదకు వానిని సంతృప్తిపరచెను. ఈతఁడు వివేకు డగుటఁబట్టి తన్నెన్ని విధముల నాయతి గోపించినను దన్ను ద్వేషించెననిగాని నొప్పించ నిశ్చయించెననిగాని దలంపక సదా శాంతమనస్కుఁడై యాతని యాప్సితంబు నెరవేర్చుటయే దనకు ముఖ్యమని యెంచి పదు తెరంగుల నాతని కతిథిసత్కారములను గావించెను. తన భార్యకూడ నట్టి యిల్లాలగుటఁబట్టి భర్తమతమునకు మారుబల్కక నవమాసములు గాని గన్నకుమారుని యతిథి కుపహారముగ నొసంగుటకు వెనుదీయలేదు. తదేక ధ్యాననిరతులై మోక్షమార్గాదర్శకమును గోరువారల బరీక్షించుట కెన్నియేని యుపాయంబుల నా జగదీశ్వరుండు గల్పించును. పరమభక్తులు యిట్టి వాని నెల్ల బాగుగ బరిశీలించి వాటి నిజానిజములను గ్రహించి యెన్ని యిక్కట్టులపాలైనఁబడి సదా పరమాత్మ పాదపద్మముల యందే మనముంచి కష్టపరంపర నెల్ల దాటగల్గుదురు.

సామాన్య మానవమాత్రుఁడట్టి యసంభవ కోర్కెలను గోరడని శిరియాళుడు దెలుసుకొనక పోలేదు. తాను యోగ్యమార్గావలంబికుడైన గోలుపోయిన ధనము దనకు చేకూరునని యాతఁడు దలంపక పోలేదు. పరమేశ్వరుడో సామాన్యుఁడో యన్న నిజము నిలకడమీద దెలియునని నిశ్చయించుకొనక పోలేదు. గాన ప్రతియుగమందును భగవదంశమును గలిగి ధర్మస్థాపనచేయుటకును సాధు శీలుర కాపాడుటకును, నిత్యానందము గోరు వారి యభిలాషను దీర్చుటకును గర్మకారాగారబద్ధులను విడుదలచేయుటకును, దుర్జనముల నెల్ల తుద ముట్టించుటకును, మతోద్ధారణ నెలకొల్పుటకును యీలోకమున నవతరించుచుండు పరమగురువుని రాకకై యెదురు చూచుచుండవలెను. అట్టి మహాత్ముని బాహ్యరూపమును బట్టి మన మాతని మహాత్త్యము నేమియు గ్రహింప నసమర్థులము. మనము కేవలము యోచించవలసిన దెద్దియన యాతని యుపదేశములు సంభవములా గావా? అనుష్ఠింప సర్థములా గావా? అనుష్ఠించుచు బ్రజలెల్లరకు మార్గాదర్శకుఁడుగనున్న యట్టివాడు నిజముగ నవతార పురుషుడా గాదా? యని గమనించి ప్రవర్తించవలెను.



# కృష్ణవేణీ కెరటాలు

తుర్లపాటి గోవర్ధనరావుగారు

జాదమాడెడి సొగసు కన్నె
వలపులెత్తెడి పూల వన్నె
పొంగి యారెడి ప్రేమచిహ్న
తలపు లూరించుఁగా. 1.

నీలిచెరగుల నర్దుకొంచును
గాలి పైటల నెగురవేయుచు
సందె ప్రొద్దుల కావ్యసుందరి
తలపు వరించెఁగా. 2.

కృష్ణవేణీ గాన లోలత
గంధవాహుని సౌకుమార్యత
సొదలజెప్పెడి పొదల నుంచీ
తలపు గొంపోవుఁగా. 3.

చీరకుచ్చెల కాగితాలను
సంజకెంపుల భావ వదనమే
కూర్చి పాడెడి కవుల గీతుల
తలపె తలపూవుఁగా. 4.

ఈనదీ తరంగాలలో
ఈ నిశీథాంతమ్ములో
నిద్రించెడే పూహాలన్ని
ఏను కౌఁగిలింతుఁగా. 5.



# మహారాష్ట్ర స్వాతంత్ర్యము.

హరినారాయణ ప్రణీతమైన వీరపూజ యను నాటకము ననుసరించి వ్రాయబడినది.

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు

## — పంచమ రంగము —

(ఫకీరు వేషమున గోవర్ధనుఁడు ప్రవేశించును)

గోవ:— ఇది బాగుగ నున్నది. నాల్గు డబ్బులు చేతఁ బెట్టినతోడనే యీ గస్తీ బంటోతు దాసుఁడైనాఁడు. తానే నాకు దొంగతనమునకు దారిఁ జూపి తాను పుర రక్షణమునకు వెడలినాఁడు. ఆహా! సాహెబాదరి చెప్పిన మాట నిశ్చయము. సత్సాంగత్యము వలన శాశ్వతానంద ఫలము లభించును.

(తల మొదలు పాదము వరకు ముసుఁగు వేసికొని సర్జూబాయి ప్రవేశించును)

గోవ:— గాం. కీర మాలా ముష్కిల్ ఆసాన్.

సర్జూ:— ఫకీరు సాహెబ్! ఇదుగో ఈ మొహరీ తీసుకొనుము. (మొహరీ ఇచ్చును)

గోవ:— అల్లా మిమ్ము రక్షించును.

సర్జూ:— ఈ రాత్రి నీకు బిచ్చమెత్తుకొన నవసరము లేదు. ఒక్కమారీ దీపమును గొని నా వెంట వచ్చెదవా?

గోవ:— ఆదేమి. నీ వెవ్వరవు నాయనా! నాయనవా, అమ్మవా! నీయభిప్రాయమేమి?

సర్జూ:— నే నాడుదానను. గుర్తించలేదా! ఈలాంటిరుతో నన్ను రంగమహాలు కడకుఁ బంపుము. నీకింకను బహుమతి నొసంగుదును.

గోవ:— ఏమేమీ! రంగమహాలున కేగెదవా? శ్రీమతి బేగం సాహెబా వారి యభిసారికవా యేమి! అట్లయిన వేరొక మార్గము జూచుకొనుము. నాకట్టి సమర్థత లేదు.

సర్జూ:— ఒక దిక్కులేని యాడుదానికి త్రోవ జూపు సామర్థ్యము నీకడ లేదా?

గోవ:— లేదు. అమ్మా నేనట్టివాఁడను గాను. జారదంపతులకుఁ జీకటి రాత్రులయందు దివిటీ జూపు సామర్థ్యము నాకు లేదు. నిన్నింటికిఁ బంపుమన్నఁ బంపెదను.

సర్జూ:— నీమాటల వలన నీవు గొప్ప బుద్ధి కలవాఁడవని తోఁచుచున్నది. నాకు వేరొక మార్గాంతరము లేదు. నన్ను నమ్ముము.

గోవ:— భగవంతునిపై యాన పెట్టి వచింపుము.

సర్జూ:— పరమేశ్వరుని సాక్షిగ వచించెదను. నేను హైందవ యువతిని.

గోవ:— నీవు భారతరమణివా! మొగలాయీల జనానా ప్రదేశమైన రంగమహాలున కీయర్ధరాత్రిమున మారువేసమున రహస్యముగఁ బోయెదవా? నడువుము నీవు కోరిన దీపము తోనే సమీపమున గల భీమానదీ తటంబునకుఁ గొంపోయెదను. తల్లీ, గ్రహింపుము. అని పల్కుచు నందుఁ బడఁ ద్రోసెదను.

నర్జూ:- నాకు నాస్వామియే ప్రపంచకము. అతనిని మేల్కొల్పుటకే వచ్చితిని. కలసికొంటిని. కాని నన్నాతఁడు గుర్తింపలేదు.

గోవ:- నిన్ను గుర్తింపఁగలవాఁ డెవ్వఁడు. నీవు ప్రకృతివి. నీశక్తి వాచామగోచరమైనది

నర్జూ:- ఊరకుండుము నేనిప్పు డతని యింటి నుండి వచ్చితిని. రాజ్య లోభముచే నతఁ డిప్పుడొక భయంకర కార్యమును జేసెను.

గోవ:- నే నెఱుంగుదును. అదే కాసింఖానని కపటప్రయత్నము.

నర్జూ:- ఔను. అదియే. పవిత్రరూపిణి దేవి మూర్తి యనఁదగిన వాసంతి మ్లేచ్ఛులవాతఁ బడినది. ఆమె నిప్పు డుద్ధరింపవలయును.

గోవ:- మంచిసంగతి. అందులకై చింతయేల ?

నర్జూ:- చాల కఠిన కార్యము. చేయఁగలనను నమ్మకము నీకున్నదా ?

గోవ:- ఉన్నది. మంత్రమును వఠించెదను. ప్రేమ పూర్ణమైన నీ వదనమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని "సోదరీ" అను మూడక్షరముల మంత్రమును బఠించిన నేఁ గార్యమంతయుఁ జక్కఁ జేయఁగలను. నే నిప్పుడు కాసింఖానుని ప్రియ స్నేహితుఁడను. నీ సోదరుఁడనైన నన్నా దురాత్ముఁడు వాసంతినిబట్టి తనకు స్వాధీనముఁ జేయు కార్యమున నియోగించెను. ఇదియును మన కనుకూలమే గాదా !

(నిష్క్రమింతురు.)

## —♦ ఆఱవరంగము — భీమానదీతీరము ♦—

(కాసింఖానుని డేరా లోపల భాగము.)

(కాసిం సోఫాలో పరుండి త్రాగుచుండ నాట్యాంగనలు నృత్యము చేయుచుందురు.)

(గోవర్ధనుఁడు ఫకీరు వేసమున ప్రక్కను నిలువబడి యుండును)

కాసిం:- వాసంతి నా ప్రియురాలు కాఁగలదు. ఎంత యానందము ఫకీర్జీ! ఏదీ ఇంకొక్క మాఱు మధుర పదార్థము నిటు తెమ్మా. మనస్సును సంతోషపెట్టుము.

గోవ:- (స్వగతం) నీమనస్సును సంతసపెట్టు విధాన మెట్టి దని యాలోచించుచుంటిని. జన్మమున్నంతవరకు మఱువకుండునట్లు చేయవలయును. ఆహాహా! పీల్చిన గంజాయి దమ్ము వలన మనస్సు మధ్య మధ్య వివశమగుచున్నది.

కాసిం:- మియా! ఏమి యాలోచించుచున్నారు. ఒక్క గ్లాసు సారాయము కావలయును.

గోవ:- జహాపనా! దాని కేమి తక్కువ. ఇదిగో తీసుకొనుము. (మద్య పాత్రము చేతి కిచ్చును)

కాసిం:- (త్రాగుచు) ఎంత మధురము. ఎంత మధురము. సుందరులారా ! పాడఁడి, నృత్యము చేసి మా మనస్సును సంతోష పెట్టుఁడీ.

(నాట్యాంగనలు నృత్యము జేయుచుందురు)

గోవ:- ఆహా ! ఏమి పరిమళము ! ఎంత వికటాట్టహాసము. నృత్యము రమణీయముగా నున్నది.

కాసిం:- ఎవరక్కడ.

ప్రతీహారి:- ఏమి యాజ్ఞ.

కాసిం:- మా ప్యారీ బేగం వాసంతిని గొని రమ్ము.

(ప్రతీహారి వెడలి వాసంతిని గొనివచ్చును)

కాసిం:- ఓ సుందరులారా ! నేఁటికి మీ యాట చాలించి యావల కేఁగుడు. మా ప్రాణ ప్రియురాలు వచ్చియున్నది.

(అందరు నిష్క్రమింతురు)

కాసిం;- ప్యారీ! రమ్ము.

వాసం;- నేనొక దాసిని. నన్నట్లు పిలువకుము.

కాసిం;- నీవాదుర్మార్గుని నీచ రంగనాథుని యింటికి దాసివిగాని నాయింటికి రాణివి.

వాసం;- మీకు నమస్కరింతును. వారి నిందను నాచెవులఁ బడవేయ వలదు నా తండ్రి నిందను నేను వినినచో నా దీన బాంధవుఁడు మెచ్చఁడు.

కాసిం;- పోనిమ్ము. నీవు నా రాణివి రమ్ము. అట్లయినచో మనదాంపత్య సుఖమును జూచి లోకమెల్ల జోవును సుఖ పడుము.

వాసం;- నాకట్టి సుఖము వలదు.

కాసిం;- నీవట్లన రాదు. నీవింతవరకు దాసివి. ఇప్పుడు రాణివి రమ్ము. నా యొడిలోఁ గూర్చుండుము. సంతోష పెట్టుము.

వాసం;- నేను నా దీనబంధుని దాసిని. అంతియే గాని నా తండ్రి యింట మహారాణివలెఁ సుఖించితిని నా కిప్పుడు దీన బాంధవుఁడే సర్వస్వమునై యున్నాఁడు.

కాసిం;- ఆ పనికిమాలిన మాటలను వదలుము. వాసంతీబాయీ! నీవు నా బేగమువై సుఖ పెట్టుము. నీకు వలసినంత ధనము గౌరవము సుఖము మొదలగునవి లభించును.

వాసం;- నాకవి యక్కర లేదు. నాకు కావల సినది దీన రక్షకుఁడు. దీనరక్షకుని దాసి నగు నాకీ సుఖము లక్కర లేదు.

కాసిం;- నీ వెఱ్ఱిగుదును ఆనీచుడైన రంగ నాథుని యింటనుండుటచే నిట్లు పిచ్చిదానవై యుంటివి. నేటికి నీ యదృష్టము పండినది ప్యారీ! రమ్ము. నాతొడపైకూర్చుండి ఒక్క మాఱు నీ నోనంగు మధుర సుధారసమును గ్రోలుము. నీకెంతయో యానందము కలు గును. (మద్యపాత్రను వాసంతికి జూపించుచు) వాసంతీబాయీ! రమ్ము. ఇదే మన యానందము. మన ప్రపంచకము సౌఖ్యముల రాసి. భోగములయందును.

వాసం;- హా! దీనరక్షకా! నే నేమి నేరమొనర్చి తిని? (దుఃఖించును)

కాసిం;- బీబీజాన్! అదేమి? ఏడ్చుచుంటివేమి? నీకెట్టి కష్టము కలిగెను?

వాసం; అవమానము సంభవించెను. దీనబం ధుని కాత్మ సమర్పణము జేసిన నన్నిట్లు బలవంతపెట్టుట తగదు.

కాసిం;- సంతోషముతో నా కోర్కె తీర్పుము. అటు పిమ్మట నీ యదృష్టముం దలంచు కొనుము.

వాసం;- నిన్ను గైకొని నే నధోగతి కేల బోవల యును! నాథ సర్వజగములను పరిపాలించు చుండు సృష్టిస్థితిలయ కారకుఁడు అనంత నామ రూపధారి సకలైశ్వర్య సంపదాయ కుఁడైన దీనరక్షకుఁడు. అయన ధనము నాయది. నేనా మహాత్మునకు ప్రేమించితిని. నేనా దేవదేవుని పాదసరోజములకు నాశరీర మును నతని కర్పించితిని. ఒకరి సంకేత గూట జూడను. నా మాటను విని నీకీ నశ్వరైశ్వర్య మొసంగిన నా భర్తయగు దీన బాంధవుని శరణు వేడుకొనుము. సౌందర్యవిహీననైన నావంటి సామాన్య వనితకై వ్యర్థభలహాలై పాపమున కొడిగట్టవలదు.

కాసిం;- మరల నీవా పిచ్చి మాటల నాడు చుంటివి. సర్దారు కాసింఖానుఁడవన నెవ్వరను కొంటివి?

వాసం:- నీవు నా కెట్టి వాడవును కావు నావలెనే నీవును దీనబాంధవు నెల్లప్పుడు స్మరింపుచున్నచో నిన్ను నా సోదరునివలె జూచెదను

కాసిం:- నాకిదంతయు తెలియదు. నన్ను వరింపవలయును.

వాసం:- ఛీ! ఛీ! ఇట్టి ప్రసంగముల నాడకుము.

కాసిం:- నిన్ను శిక్షించెదను.

వాసం:- అందులకు భయపడను.

కాసిం:- నిన్ను బట్టి చెరసాలలో బంధించెదను.

వాసం:- అట్లు చేయుట నాకు బరము సమ్మతము. హాయిగ నందు గూర్చుండి నా దీనరక్షకుని నామమును జపించెదను. అప్పుడు నీ చెరసాల నాకు దేవాలయము వలె కన్పట్టును. లోకమును కష్టమే కావలయును. కష్టకాలమునగాని దైవ భక్తి కుదురదు. అప్పుడుగాని ముక్తి చేకూరదు.

కాసిం:- (గోవర్ధనునితో) ఫకీర్జీ! నాకిక కోపము వచ్చుచున్నది నీవు సమాధానపరుపుము.

గోవ:- హుజూర్! మూండగీగుండ్లు నంతయు నావల కంపుము. ఇచ్చట మనము మువ్వురము గాక నితరు లుండరాదు.

కాసిం:- పంపివేయుము. (భటులు సైనికులు వెళ్ళిపోవుదురు)

గోవ:- (తనలో) గంజాయి మత్తింకను వదలలేదు. నిద్ర వచ్చుచున్నది. ఇప్పుడు వీని నొక్క దన్ను తన్ని యీ బాలికను విడిపింపవలయునని యున్నది. బుద్ధి స్వాధీనము లేదు. కానిమ్ము ఇంకను జూడవలయును.

కాసిం:- బీబీజాన్! ఇప్పు డెక్కడికి కేగెదవు. ఫకీర్జీ నీవు దూరముగ నుండుము వాసంతీ! నిన్నిప్పుడు బలాత్కారముగా గైకొను చుంటిని. (వాసంతిని బలవంతముగా చేయి పట్టుకొనగ గోవ ఫకీరు వేసమునను్న గోవర్ధను డడ్డు పడును)

గోవ:- ఛీ! ఛీ! భయపడకుము.

వాసం:- హా! దీనరక్షకా! నీ విచ్చట నుంటివి? రమ్ము. నన్ను గాపాడుము. (పరువెత్తి భీమానదీ యొడ్డున నిలువబడి) తల్లీ! నన్ను నీలో గల్పుగొనుము (నదిలో నురుకును)

గోవ:- (తొందరగా) ఓసీ! పరమ దురాత్ముడా!

(కాసింఖానుని తన్ని పడగొట్టి నదియొడ్డున కేగును)

(నేపథ్యమున) హా! దీన బాంధవా!

గోవ:- ఛీ! ఛీ! పాడు గంజాయి నాకీ మత్తత దెచ్చినది. దీని మూలముననే నా బిడ్డను చేయి జార్చితిని. (గంజాయి కుండను బద్దలు కొట్టును) ఛీ! దీని నింక ముట్టుకొనను. అయ్యో! బిడ్డ చచ్చిపోవును సోదరికి మాట నిచ్చితిని. గోవర్ధనా! దుఃఖింపకుము. వాసంతి యీ రాక్షసుని చేతినుండి తప్పించుకొని దీనబాంధవుని జేరబోవుచున్నది. గోవర్ధనా! చూచెద వేమి? తొందరపడుము. ప్రపంచకమంతయు వాసంతి జీవితము కొఱకెదురు చూచుచున్నది. చంద్రోదయ మైనది. మందమారుతము విసరుచున్నది. లెమ్ము సోదరా! లెమ్ము (నడుము బిగించి నదిలో నురుకును)

## —— తృతీయాంకము ——

### ప్రథమ రంగము - జహానారా మందిరము యొక్క ముందు భాగము.

(రంగనాథుడు - సర్జాభాయి నిలువబడి యుందురు.)

రంగ:- రాజకుమారి యెచ్చట?

సర్జా:- షాదుషావారి మందిరమున నున్నది.

రంగ:- నన్నిచ్చ టెవ్వరు పిలిపించినారు?

సర్జా:- నేనే పిలిపించితిని. ఈ రంగమహాలు నకు జహానారా తరువాత నేనే యజమానురాలను.

రంగ:- పిలిపించిన పనియేమి?

సర్జా:- మీ రిక జీవిత కాలమంతయు మొగలాయీ సేవకుల పాదధూళి శిరమునం దాల్చుచు గడుప దలంచితిరి కాబోలును.

రంగ:- నే నొసంగుదును. నీచాతినీచమైన పని జేసితిని. పరమ పాపులలో నొకడ నైతిని. ఏమి చేయుదును. ఇంతకన్న గతిలేదు. హృదయమందు రక్తనాళములయందు రాజ్యాశ నిండియున్నది. ఆలాలసత్వముకొరకై స్వర్గ సుఖమునుగూడ బలిగానొసంగి పరిత్యజింపం దలంచితిని. నాకు రాజ్యమే స్వర్గము. నా కన్నుల యెదుట రాజ్యమే ప్రకాశించు చున్నది.

సర్జా:- ఇంకను మీ కా యాశ నశించిపోలేదా?

రంగ:- రాజారాముని వధించినచో దక్షిణ దేశమునంతయు నాకిత్తునని షాదుషా వచించెను.

సర్జా:- మహారాష్ట్ర సైన్యముయొక్కయు వారి నాయకుండైన రాజారాముని ప్రతాపము నౌరంగజేబెఱుంగడా? ప్రస్తుతము జరుగుచున్న యుద్ధములో యవన సైన్యమును దుత్తునియలు సేయుచున్న సంగతిని మరచితివి కాబోలు. నామాటను విని యాదురాశను వదలుము. మొగలాయీలవలన నీకు రాజ్యప్రాప్తి కలుగు టసంభవము. మరల నీ జన్మదేశమున కేగి సన్మార్గమున సంచరింపుము.

రంగ:- అపారమైన షాదుషావారి సైన్యములో కొంచెము భాగము నష్టమైనంత మాత్రమున మొగలాయీ ప్రతాప మంతరింపదు. నాల్గు బిందెల నీరుం దీసికొనినంతనే చెరువులోని నీరింకునా? కావున ఏదియెట్లున్నను నా నిశ్చయమును వినుము. నా జన్మభూమి కేగెదను. ఎట్లు పోయెదనో చెప్పుదునా? రాజాధిరాజునై పోయెదను. లేదా సన్యాసినై వెళ్ళెదను. అదట్లుంచుము. రాజకుమారిని సందర్శింప వలయునని యున్నది. సంభవమగునా?

సర్జా:- మాట్లాడవలయునా?

రంగ:- ఏమియును లేదు. పూరక చూచిపోవుటకే.

సర్జా:- నన్ను జూచితివి గదా. వచ్చిన పని కాలేదా? ఇంకను రాజకుమారి యెందులకు?

రంగ:- రాజకుమారిని కన్నులతోం జూచెదను. సర్జాబాయిని హృదయములోం జూచెదను.

సర్జా:- చాలు యూరకుండుము. ఇచ్చటనే నిల్చియుండినచో రాజకుమారితో జెప్పివచ్చెదను. పలువిధములైన యాపత్తులు శిరమున దాండవించుచున్నవి. జాగ్రత్తతో నుండుము. ఇది యవరోధ జనములకు రంగమహాలు.

(సర్జా నిష్క్రమించును.)

# రాయబారము.

లక్కరాజు సాంబసదాశివరావుగారు.

[ కాకతీయ సామ్రాజ్య భగ్నానంతరము తత్సామ్రాజ్యము భిన్నములై వేర్వేర రెడ్డి వెలమనాయకుల స్వతంత్ర పరిపాలనకు లోబడియుండెను. అందు రాచకొండ రాజధానిగ కృష్ణాస్రవంతి కుత్తరభాగమున కొంత భూఖండము నేలు వెలమ నాయకులును నగు అనపోత నాయకుడును, మాధవనాయకుడును నను వీర సోదరు లిరువురును, నెల్లూరు మొదలు కృష్ణానదివరకును గల యాంధ్ర భూఖండమును నేలు అనవేమా రెడ్డియును మన కథా కాలమున ప్రబలురు. ]

ఖాన్ సాహెబా! ఇక నీ రాయబార క్రియాకలాపమును సాగింపవచ్చును. చక్రవర్తి మా కోర్కెలను మన్నించినది లేనిది విన కుతూహలముగ నున్నది. అని అనపోతమనాయుడు తన కట్టెదుట నాసీనుడైయున్న నొక మహమ్మదీయుని జూచి పలికెను.

ఖా:- భూవరా! ఆదర్శప్రాయులగు మీ ఆంధ్ర నాయకుల మనవి చక్రవర్తి మన్నింపకయుండునా? కాని మీ కోరి కెంతటి రాజధర్మహితమైనను నీ రూపమున దీనిని సాధింప నెంచుట మాత్రము భావి కాలమున కంతగ శుభకరముగాదని హెచ్చరించుచున్నాను.

మాధవనాయుడు:- సాహెబా! నీ దూతకృత్యము నీ వొనర్పవలయును గాని మాకు లాభాలాభ విచక్షణ నేర్పుట యనవసరము అని యించుక సక్రోధముగ బలికెను.

ఖా:- స్వామి యాజ్ఞ ననుసరించి యాతని యభిప్రాయమును మనసునందిడుకొని తన చతురత్వ ముపయోగించి సాధ్యమైన నాతని యాశయము నెరవేర్చి రాయబారియొక్క సామర్థ్యమును తెలియజేయవలయును గాని యజమాని నుడివిన ముక్కలను వల్లించి వీఁకరువు బెట్టుట యేపాటి ధర్మము? అట్లొనర్చుటకు కార్య వివేచనా పరత్వము దూరదృష్టియేల?

అనపోతనాయు డాశ్చర్యమును సూచించుచు తన యెదుటనున్న రాయబారి సామాన్యవ్యక్తి గాదని యూహించి తొందరపాటువలన కార్యముచెడునని భయమంది తన సోదరు నించుక మందలింపనెంచి కనుసన్నలచే నుత్తర మొసగనున్న యాతని వారించెను.

అన:- తురక చక్రవర్తి మాకడకు బంపించిన వృత్తాంతమేమి? ఖాన్ సాహెబు గండుతుమ్మెదలవలె కదులీలములైయున్న తన బవిరిగడ్డమును మునువేళ్ళ సవరించుకొనుచు పరమనుజ హృదయభేదనోద్భూత పాటవములగు తన నిశితదృష్టుల నా వీర సోదరులపైఁ బఱపుచు నించుక మందహాస మొనర్చుచు నిట్టులనియెను. "రాజా! మీ తెలుగు నాయకుల ప్రతాపము చక్రవర్తి సేనలకు గ్రొత్తకాదు. మీ ఆంధ్రనాయకులెల్లరును వీరభద్ర గజపతి నాయకత్వమున గలిసి నోరుగంటిపై దాడివెడలి చక్రవర్తి ప్రతినిధి యగు ఇమ్మదుల్ ముల్కును పెట్టిన యిక్కట్టులు చక్రవర్తికిఁ గ్రొత్తలైనను యాతని సేనలకు గ్రొత్తలు గావు. పిమ్మట శీఘ్రకాలమునకే మహమ్మదీయుల యదృష్టము బండి మీ యాంధ్రనాయకులు పరస్పర ద్వేషపూరితులై కాకతీయ సామ్రాజ్యమును భగ్నమొనర్చి యల్పములగు స్వతంత్రరాజ్యములు స్థాపించి మహమ్మదీయుల యాశాభూతమునకు కడుపునిండగ భోజనమిడితిరిగాని మీరు నలుగురును గలిసి కాకతీయ సామ్రాజ్యాధిసాధనకు బాసటలై నిలచినచో ఆంధ్రసామ్రాజ్య లక్ష్మికి మ్లేచ్ఛసంపర్క మేమాత్రము దగులకయే యుండెడిది.

అన:- రాయబారీ! ఇట్టి మహమ్మదీయ నిరసనోద్రేక వాక్యములు మహమ్మదీయుడవగు నీ నోటినుండి యెట్లు వెలువడినవో కారణము దురూహ్యముగ నున్నది.

ఖా:- రాజా! అల్లా నన్ను క్షమించునుగాక! స్వమతావలంబులగు మహమ్మదీయుల నిరసించినందులకు పాప పరిహారార్థముగ మక్కాకు యాత్రకు బోయెదను" అని నిమీలితలోచనుడై తత్పశ్చాత్తాపము మోముపై దోప అల్లాను బ్రార్థించునటుల నొక యరనిముసమునుండి మరల కనులఁదెరచి యిట్లనియెను. "క్షితీంద్రా! నేను జన్మకారణమున హిందువుడను. అందు నాంధ్రుడను. శరణాగతత్రాణ బిరుదాంకితులగు జంబుకేశ్వరరాయలపై గినిసి చక్రవర్తి తన సోదర పుత్రుడగు బహద్దీనును జంబుకేశ్వరరాయల తోగూడ సాధింప దండు బంపుట మీకంతగ మరవ రాదగినదిగాదు. తురుష్కులకును నాంధ్రులకును జరిగిన నాయుద్ధమున ఆంధ్రవీరు లొనర్చిన సాహసము వర్ణింప నెవరితరము. కనులార జూచియుండుటచే దానిని నిప్పుడు స్మరణకుదెచ్చుకొనిన నొడలు పులకరించుచున్నది. విజయోన్మాదుడగు చక్రవర్తి

బలవంతమున పట్టుబడిన యాంధ్రులు పెక్కురు మహమ్మదీయ మతావలంబకులైరి. అట్టి వారిలో నప్పటికి చిరుతప్రాయమున నున్న నేనొకఁడను. కాని నాటినుండియును మహమ్మదీయ మతమునందే కృషిసల్పుచు చక్రవర్తి మన్ననలకుఁ బాత్రుడనై యాతని యాంతరంగిక మిత్రుడనైతిని రాచకార్యభారము అందు ముఖ్యముగ పరరాజులకు రాయబారములు నడుపుటకై నన్నే బంపుచుండెడివాడు. తదుపరి ఫిరోజ్ తుఘ్లక్ మన్ననలకుగూడ బాత్రుడనై యున్నాను. మహమ్మదీయ మతావలంబినయ్యును ఆంధ్ర రక్తపూరితుడనగుటచే ఆంధ్రులయందభిమానము వదలినది గాదు. అదియును గాక వ్యవసాయ వాణిజ్యాభివృద్ధులందసమాన కౌశల్యము గలిగి జలాధారముల వేలకొలది రూప్యముల వెచ్చించి నిర్మించి అవిషయమున ఢిల్లీ చక్రవర్తియంత వానికి వాదర్శప్రాయులుగ నున్న మీ యాంధ్రనాయకులను విశాలభావములుగల యేమనుజుడే నుతమునకు జెందినవాని గౌరవింపకుండునా ?

వీర సోదరులిరువురును తమ తెలుగు నాయకుల చక్రవర్తి సైతము పొగడినందుల కానందించిరి. కాని నిపుణుఁడగు అనపోతనాయుడు వెంటనే యానందసాగరమునుండి తెప్పిరిల్లి అనుమానసూచకములగు దృక్కుల నాతనిపై బరపుచు మేఘగంభీర నిస్వనమున నిట్లు ఖానుతో నుడివెను.

“రాయబారీ! నీ ముఖస్తుతుల పరదాలచాటున మమ్ముల మైమఱచునట్లు జేసి ప్రస్తుత కార్యవిముఖుల జేయఁ దలపెట్టినట్లున్నది. చక్రవర్తి మాయందు జూపు గౌరవమునకు మేమెంతయు కృతజ్ఞులము. మేము నిష్కర్షగ మాటలాడవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాము. కాని వ్యవహారమును బరిష్కరించుకొను సమయములందిట్లుండక తప్పదు. ముందుగ నీవు చక్రవర్తియొద్దనుండి వచ్చినట్లు నిదర్శనము జూపి మాకు చక్రవర్తి బంపిన సందేశమును నిష్కపటముగ జెప్పుము.”

ఖాన్‌సాహెబు మందహాస మొనర్చుచు నిట్లు ప్రత్యుత్తర మొసంగెను. “రాజా! మీరు నామాటయందుంచవలసిన నమ్మకము దక్క నేను చక్రవర్తి దూతనైనటుల వేరేమియును నిదర్శనము లేదనుటకు చింతిల్లుచున్నాను, మీరు నన్ను విశ్వసింపనిచో నంతగ చక్రవర్తికేమియును నష్టముగాదు. బహమనీ రాజ్యాధీశునకును మీకుఁగల వైరములబట్టి దూరాలోచనాపరుడగు చక్రవర్తి నాకేమియును సాంకేతిక చిహ్నముల నీయక యేకాంతయానముననైన బుత్తెంచినాడు. మీ రాజ్యమునకు బహమనీ రాజ్యమునుండనే గదా రాకపోకలు జరుపవలసియున్నది. విధివశమున శత్రువులకు జిక్కినచో ననవసరముగ శాంతి భంగమగును గదా ?

అనపోతనాయునికీ ప్రత్యుత్తర మంతగ రుచింపక పోయినను ఖానుసాహెబు మాటలను త్రోసివేయుటకు గూడ మనసొప్పలేదు. ఆతనియందు నమ్మక ముంచుటకును, నమ్మక ముంచకపోవుటకునుగూడ తోచుటలేదు. నమ్మక ముంచినంతమాత్రమున తమ కంతగ కష్టముండబోదని యాలోచించెను. అందు మూలమున నేదియెటులున్నను రాయబార ఫలితమును దుదముట్ట బరిశీలింపవలయునని తలచి మరల నిటుల సంభాషణ కుపక్రమించెను.

అన:- ఖాన్‌సాహెబా! నీవు తెలుప దలచినంతయును నిస్సంశయముగ దెలుపుము.

ఖాన్:- రాజా! నాయుద్దేశమును మీరు సంపూర్ణముగ గ్రహించినటుల దోచదు. అయినను మీగలవారు కార్యాకార్య విచక్షణ నాకక్కరలేదు. చక్రవర్తి బుత్తెంచిన సందేశమును దెలిపెదను. మీరు మా కొసగవలసిన ప్రత్యుత్తరమున్ వెంటనే యొసగవలసిన యగత్యము లేదు. కాని మీరేమైన నిష్పాదయమున చక్రవర్తి కేమైన వాగ్దానంబిడిన దానిని తగసాహసించి యాతని కందజేయుదును.

ఈ సంభాషణ మంతయును వినుచున్న మాధవనాయుడు మాత్రము క్రోధఘూర్ణితమానసుడై రాయబారికి తగిన ప్రాయశ్చిత్తము నొసగ నూహించుచున్నట్లు తన భావముల స్ఫుటము జేయుచుండెను. కాని భ్రాతృప్రీతి శృంఖలాబద్ధుండగు మదగజేంద్రము తన సాహసమును దయను నదచుకొని యేమియును సంభాషణయందు పాల్గొనక వారలపురికును నాకలహాకలాపమును మాత్రము బరికించుచుండెను. ఇట్టి మాధవనాయని భావములు అనపోతనాయునకును ముఖ్యముగ ఖానుసాహెబునకును గోచరము గాకపోలేదు. కాని రాయబారి యిట్టివారల కోపమునకు జంకువాడుగ గన్పట్టలేదు. ఆకారణమునకే నాతని వాక్ప్రవాహము మద్దుతో నరింపుచుండెను.

# సేతూరు బాబు.

అనుభవమువంటి వస్తువు మరొకటి లేదు. నడివయస్సులో నున్నపుడే కష్టపడి పని చేసి అనుభవము సంపాదించుకొనవలెను. రత్నం బ్రదర్సు మద్రాసులో గొప్ప నగలవ్యాపారము చేయు కంపెనీ. ఈ కంపెనీలో నేను ప్రవేశించి ముప్పైయేళ్లు అయినది. పనిలో చేరునపుడు యజమాని నన్ను పిలచి "ఖాతాదారులను పీడించవలదు. వారికి కావలసిన వస్తువులను మాత్రమే వారికి విక్రయించుటకు బాగా ప్రయత్నము చేయుము. వారి యభిలాషముందుకని పెట్టుము. వారికి తృప్తికరముగ నున్నచో మన కంపెనీకి మరలమరల వచ్చుచుందురు" అని చెప్పెను. నేను చెప్పబోవున దిరువదియేండ్లక్రింద జరిగిన కథ. మా కంపెనీలో నగలు వ్యాపారముతో బాటు విలువగల రాళ్ళు, వజ్రములు, రవ్వలు వగయిరా అమ్ముచుండెడివారు. మొదటలో వారి దగ్గర వీరిదగ్గర పని నేర్చుకొనుచుండే వాడిని. అంగడి గట్టికట్టడములో నున్నది. రాత్రిళ్ళు కావలా కాయుట కిద్దరు గలరు. పోలీసువారు గస్తీ తిరుగుచునే యుందురు. ఎప్పుడును దొంగల భయము లేదు. సాయంకాలమున నింటికి బోవునపుడు మా తాళముచెవులను హెడ్ గుమాస్తా కిచ్చుచుండెడివారము. భాగస్వాములకు డుప్లికేటు తాళముచెవులుండెడివి. సంవత్సరమునకు రెండు పర్యాయములు స్టాకు విలువ చూచుచుండెడివారు. కాని మేము మాత్రము ప్రతి సాయంకాలము నిలవ సరుకు చూచుకొనుచుండవలసి యుండును. అనుభవము గలవారు సరుకు సరిగ నున్నది లేనిది ఒక్క పర్యాయము చూచి కనిపెట్ట వచ్చునని చెప్పుచుండెడివారు. పదేండ్లకు గాని నాకట్టి యనుభవము చేకూరినది కాదు. ఎవరైనను కొనుటకు వచ్చినపు డతి జాగరూకతతో నుండెడివాడను.

జూన్ మాసములో నొక శనివారము సాయంకాల మిద్దరు వ్యక్తులు మాయంగడికి వచ్చిరి. ఇద్దరును భార్యాభర్తలు. సౌందర్యమున సమానులు. వారి చర్యలవలన వారొక జమిందారీ కుటుంబమునకు చెందినవారనక తప్పదు. వారి కొక్కొక్క నగనే చూపుచు ధర తెలియచేయుటలో నొక యరగంట జరిగినది. వారేనగను చూచి తృప్తి పడలేదు. ఇంతలో యజమాని 'శ్రీనివాస్, శ్రీనివాస్' అని పిలచెను. నేను పరుగెత్తుకొని పోయి పిలచిన కారణమడిగితిని. 'బాబుగారికి పంపుతామన్న రవ్వల ముద్దుల జతను తీసుకొనిరా' అని యజమాని యాజ్ఞయైనది. వెంటనే యజమానికి రవ్వల ముద్దుల జతను తీసికొని వెళ్ళి యిచ్చి 'సేతూరు జమిందారులట వారికి నగలు చూపుచున్నాను. మీరు పిలచినందున వచ్చితిని. వారచట నిలచియున్నారు. నేను వెళ్ళెదను' అని చెప్పి వచ్చి నా కొరకై కనిపెట్టుచున్న సేతూరు జమిందారిని చూచి 'అయ్యా, క్షమించుడు. ఆలస్యమైనది.' అంటిని. నేను యజమాని వద్దకు వెళ్లినపుడు బీరువాలను తెరచి తాళము చెవులచటనే వదలి వెళ్ళితిని. నా క్షమాపణ విని జమిందారుగారు 'రవ్వలతో చెక్కిన ఉంగరములు లేవా' యని యడిగెను. అడిగినంతనే యొక పళ్ళెములో పది యుంగరములను తెచ్చి వారి ముందుట నుంచితిని. వాటిలో నొక దాని నెన్నుకొని ధర యడిగెను. 'అయిదు వందల రూపాయిలు' అని చెప్పితిని. వెంటనే

రాజాగారు నౌకరుద్వారా రహస్యముగ రవ్వలను పంపివేసిరి" అని డాబుసరిగ పలికితిని.

"అయితే మీరు దొంగల మనెదవా?"

"అంతమాట నే నెట్లనగలను?"

"నీవు పిచ్చియా యేమి?

"ఇటువంటి సందర్భములలో నే నేప్రకారముగ చేయవలసి యుండునో ఆప్రకారముగ మాత్రమే చేసితిని."

"ఇటువంటి నేరము నునీనే నీపై మోపినచో నన్ను బ్రతుకనిచ్చియుందువా!"

"అన్నిటికిని సిద్ధపడియే వచ్చితిని."

సేతూరుబాబాకు యుగుకు యుగికినాడు. నా మీద పడి కొట్టునని తలచితిని. కాని యిటు నటు తిరిగి నేను చెప్పిన యంశములను మననము చేసికొని, అంతలో నావంక తన మిడిగుడ్లను త్రిప్పి యిట్లనెను.

"నీవే యా యుంగరమును తీసితివేమో!"

"నేను తీయలేదు."

"ఎవరు తీసిరి?"

ప్రత్యుత్తరమియ్యక నూరకొంటిని. ఇంతలో సేతూరుబాబు "ఈయుంగరము సంగతి నాకు తెలియదు" అని దీనస్వరముతో పలికెను. ఈవిషయమున నాతడు నిర్దోషియని నాకంతలో తట్టినది. "ఒకవేళ నా భర్య—ముమ్మాటికిని తీసియుండదు.— తీసియుండినచో గద్దించి నిమిషములో తెలిసికొనగలను" అని బాబు పలికెను.

"ఆమెయే తీసియుండినచో నా యుంగరమును తీసికొని వెళ్ళి ఈ స్థానమునందుంచి యన్యులకు తెలియకుండ జేయుదును" అని చెప్పితిని.

## 4

నాకు మార్గ మగమ్యగోచరమైనది. పిచ్చియుపాయము నొకదానిని నిశ్చయించుకొని బయలుదేరితిని. త్రాడు బొంగరము లేదు. గడ్డిపోచ పట్టుకొని వ్రేలాడుచుంటిని. అపరాధపరిశోధకు లిట్టిమార్గమే త్రొక్కుచుందురని చదివియుండుటచే కొంత సంతృప్తి కలిగినది. నాకంటె బాబు ముందుగ నామెవద్ద కేగెను. తరువాత నేను వెంబడించితిని. ఆయన సతీమణినిగాంచి "అమ్మా నాగారి మీకాశ్చర్యము కలుగచేయవచ్చును" అంటిని.

"అవును. మీయుంగరము చాల బాగున్నది. ఈదినము తిరిగి రావాలనుకొనుచున్నాము"

"నిన్నకొనిన యుంగరము మీ వ్రేలున బాగుగ మెరయుచున్నది. మీరు తెచ్చిన రెండురవ్వల నేమిచేసితిరి?"

"ఏమి రవ్వలు!"

"నేను మా యజమాని పిలువగా వెళ్ళినపుడు మీరు తీసుకొన్నవి."

"ఇది తమకు తెలియకపోలేదన్నది. మీరేమైన నాలోచించుకొని వచ్చారా యేమిటి?"

బాబు నవ్వెను. నాకు బదులామె ప్రత్యుత్తరమిచ్చెను.

"ఇటే తప్పించుకొనవద్దు. రహస్యముగ నడిగి నన్నాశ్చర్యము నటించి తప్పించుకొన జూచెదవు."

"అవును. నిజమే. నన్ను పట్టుకొనుటకుగాను తలచి రెండింటిని మ్రింగివేసితిని. ఏమిచేసెదరో చేయుడు"

మాయుపాయము కొనసాగలేదు. ఏమిచేయుటకును తోచలేదు. బెదరింపులతో నిట్లలో నా స్థలమును వదలి "పిరికి వదలగూడదను"

కొనుచు కర్తవ్యాంశమునకు గడంగితిని. ఇంతలోనే గడియారము పదకొండుగంటలు కొట్టినందున మా అంగడి కేగితిని. అనేకాలోచనలు స్ఫురించినవి. ఆగ్రహావేశములతో నుండిన యజమానిని దర్శించవలెను. నాటితో నా యుద్యోగమునకు స్వస్తి. భార్య పిల్లలు తిండిలేక యల్లల్లాడుదురు. ఈసంగతి యితరులకు తెలిసినచో నాకు పనియే దొరకదు. ఇట్లు పరితపించుచు నాఫీసులో ప్రవేశించితిని. అంతకుముందే యజమాని తనగదిలో నాసీనుడై యుండెను. నమ్రతగ నేను యజమాని సమక్షమున కేగితిని.

"ఏమిట్లు లేటి" యని ప్రశ్నించెను.

"ఏమియును లేదు, నా భార్యతో రెండు రవ్వలు కనుపడుటలేదు." అని దీనుడనై చెప్పితిని

"ఏమిటి! రెండు రవ్వలా! కనుపడుటలేదూ!"

నా ప్రాణములు పైన కెగసినవి. నిరుత్తరుడనై గడగడ వణకుచుంటిని. యజమాని. ఇట్లనెను,

"ఏమిటి? సవిస్తరముగ తెలుపుము. ఎప్పుడు పోయినవి, నిన్న నాయింటలోనా" అనెను.

"అవును."

"తక్కిన మీ నౌకరులకు తెలుపలేదు?"

"వారిప్పుడిక్కడలేరు"

"నిజమే, హెడ్ గుమాస్తాకు చెప్పితివా?"

"లేదు, చాల తప్పని తలచితిని. కనుగొని వాటిని యాదినము యధాస్థానమునందుంచగలనని యనుకొంటిని."

"ఎంత యమాయకుడవు! రత్నం, నీవుపనిలో చేరినదిమొదలు నీచర్య కనిపెట్టుచునేయున్నాను నీవు దొంగవు కావని నాకు విశ్వాసము కలదు. లేనిచో నిదివరకే యుద్యోగమున తప్పించెడివారము. నీవు క్రొత్తవాడవని తెలిసికొని యెవరో వాటిని తస్కరించినారు. ఇపుడిది జరిగినది. ఇంక ముందింకెన్ని జరుగునో! యధాస్థానమునందు వాటి నెట్లుంచగలవని నమ్మితివో స్పష్టముగ చెప్పుము."

"నేనవ్యక్తుడనని యిదివరకే మనవి చేసుకొనియున్నాను."

"అవ్యక్తుడవు కావు. అయినచో కొన్నిదినములు మాఆఫీసునందుండనే యుండవు. కొనుటకు వచ్చినవారి నెవరినో యనుమానించితివి. అవునా, కాదా!"

"చిత్తము."

"వారిచేత నొప్పించగలననుకొంటివి. నీ తెలివితేటలన్నియు నేడేమైనవి?"

"రాత్రియంతయు నీవిషయమై నిద్రలేదు"

"ఈరాత్రి నిద్రపోదలచినచో నిజమంతయు దాచక తెలుపుము."

జరిగిన కథనంతను పూసగ్రుచ్చినట్లు తెలిపితిని. యజమాని నవ్వు నాపుకొనజాలక పోయెను. తరువాత పదిహేను నిమిషముల వరకు సంభాషణ లేదు. దిక్కుమాలినట్లు నచట నిలబడియే యుంటిని. కొంతసేపటికి యజమాని తనపెట్టెను తీసి రెండు రవ్వలు నాముందుంచి "సీతారామరావుగారు పంపినారు. ఆయన భార్య దొంగిలించినదట" యని విరగబడి నవ్వెను నాకు నవ్వును యేడుపుకూడ వచ్చుచుండెను.

"వాటిని నేను తీసితిని. నిన్ను పరీక్ష చేయదలచితిని. నిన్ను మధ్యాహ్నము నిన్నొకపని మీద పంపినట్లుపంపి యీపని చేసితిని. నాకుమారునకీసంగతి చెప్పితిని. నన్నెంతయో వలదని వారించినాడు. వాడు చెప్పినదే న్యాయమని నాకిపుడు తోచినది. నీకనుభవము లేదని వాడిం

చినాడు. ఇక్కడ పనిచేయువారు వెయ్యి కండ్లతో సంచరించవలెను” అని యజమాని పలుక నాముఖము గంపెడంతయయినది.

“పగల నిలవ నెపుడెపుడు చూచుకొనుచుందువ”ని యడిగెను

“ప్రతిదినము సాయంకాలము సరిచూచుకొందును. అన్నియు సరిగనే యుంటవని నిన్న మాత్రము బద్ధకించితిని.”

యజమాని చిరునవ్వు నవ్వెను.

“ఇక ముందెన్నడట్లు చేయకుము.”

“చిత్తము.”

“సరే. వాటిని యథాస్థానముందుంచుము. రాత్రియంతయు నిద్రలేదు. నీకది యేల కిట్టు. నిన్న సాయంకాలమే నీవు చెప్పియుండిన, మావాడు నూరురూపాయల పందెము నోడిపోయెడివాడు. ఇపుడు నేను మావాడికి నూరు రూపాయలియ్యవలెను. ఇదే మా పందెము. నీవు కనిపెట్టనేలేవని వాడి వాదన, కనిపెట్టి నాతో చెప్పెదవని నా వాదన. పందెము పోతే పోయినది కాని నీవు మాత్రము మనుష్యులను బాగా నమ్ముచున్నావు” అనెను.

నేను నవ్వుకొనుచు నా స్థానమునకు పోయితిని. అనవసరముగ నింద మోపినందులకా సాయంకాలమే నేను యజమానుని ఆ రూపసతీమణిని దర్శించి క్షమాపణ వేడికొంటిని. నాటితో వారికిని నాకును స్నేహము.

---

# సముద్ర ఘోషము

శ్రీ. శ్రీనివాసరావుగారు.

( [illegible] )

ఈ నిరాఘాట దేదీప్యమాన కాంతి
సంతతుల మధ్యమున నిరభ్యంతరముగ
నే వెలిగిపోదు — నా మహా నినదములకు
గాలగర్భ ప్రతిధ్వాన గతులువచ్చు.
నేనొక విశాల రాజ్యలక్ష్మీ నృపాల
పద మధిష్ఠింతు! నా రాజ్య పాలనమున
నిరత ముదయించు నిర్ఘోష నిచయమందు
మామకాజ్ఞా ప్రశాలిక ల్మెలయుచుండు.
నేననాగ్రహా నిగ్రహా జ్ఞానమతిని!
నా కనారత మానంద శోకగతులు
కలుగుచుండును నాకింత తెలియరాక!
నా చరిత్రము నాకె యాశ్చర్యము గాదు.
నేను హర్షింతు మానవ జ్ఞానమునకు;
నేను దుఃఖింతు మానవాజ్ఞానమునకు!
అఖిల మనుజ ప్రమోద సాంద్రాశ్రుసలిల
ధారలనతిమ్ము భరియింతు దుఃఖముల.

అస్మదీయ ప్రమోద ఘోషారవమున
నవ్యగాన వినాదముల్ శ్రావ్యములగు;
మామకీన ప్రచండ తరంగ సన్న
ధరమునందున గద్గదస్వరము దోచు.

నా నిజప్రజ్ఞ నేమన్నను! నే నపూర్వ
మానసాతీత తేజక క్రమ ప్రతీత
శక్తిఁగల్గిన చదలాసనుఁడ నిజము!
కాని నన్ను స్పృశించి నా గతులు చదువ
ఘనుఁ డతఁడు దివ్యుఁ డొక్కఁడుగలఁడు.
(ప్రభవ.)

# శ్రీ రామానుజాచార్యులుగారు

బులుసు వేంకటరమణయ్యగారు.

శ్రీ రామానుజాచార్యుల వారి నెఱుఁగని యాంధ్రుఁ డుండఁడు. వారి పాండిత్య ప్రకర్షమును బొగడి యానందింపని హైందవుఁ డుండఁడు. వారి యమూల్యహృదయాశయముల నెఱిఁగి గౌరవింపని సంఘసంస్కర్త లుండరు. ఉత్తర సర్కారులలో డిస్ట్రిక్టు మునసబు, సబు కలెక్టరు, తహసీలుదారు, సబు రిజిస్ట్రారు, ఎడ్యుకేషనలు ఆఫీసరు, మొదలగు పెద్ద పెద్ద యుద్యోగములు చేయుచున్న వారిలో సామాన్యముగ వారి శిష్యులు కానివా రుండరు. వారు చేయని ధర్మము లేదు. పోషింపని సంస్థ లేదు. మెచ్చుకొనని విద్య లేదు. ఆ మహానుభావు లస్తమించినను వారి కీర్తి సూర్యచంద్ర తారార్కము దిగంతముల వెలుగుచున్న దనుట క్రొత్త విషయము కాదు.

మహాత్ముల చరిత్రము లాదర్శప్రాయములు. లోకము మంచిస్థితికిఁ దెచ్చుటకు మహాత్ముల జీవితములే యాధారములు. మహాత్ముల జీవిత చరిత్రము నొకసారి స్మరణకుఁ దెచ్చుకొనుటయే వారికొసంగు పూజ. అశరీరులకంతకంటె వేఱె పూజచేయ వలనుపడదు. మఱియుఁ బరిపక్వముకాని మనస్సుతోఁ జేయు పూజ లాముష్మిక సాధనములు కాఁజాలవు. పుష్ప పూజలకంటె హృదయ కుసుమములతోఁ జేయు పూజలే యనర్ఘములు. మంత్రములకంటెఁ బ్రణయమంత్రములే యమూల్యములు. స్నానసంధ్యాచమనాదుల కర్పించు నుదకములకంటె మహాపురుష చరిత్ర శ్రవణస్మరణలవలనఁ గలుగు బాష్పోదకములే పవిత్రములు. కాన శ్రీరామానుజాచార్యులవారి సచ్చరిత్ర స్మరణమే మన కనర్ఘమగు ముక్తిసాధనము.

విశిష్టాద్వైత మతోద్ధారకులైన శ్రీరామానుజులవలెనే మన రామానుజాచార్యులవారు ఖండకీర్తి సంపాదించి తమ ధర్మములను మతములను లోకమున వ్యాపింపఁజేసిరి. వీరు శ్రీరామానుజాచార్యులవారి యాంతరంగిక శిష్యులలో నొకరును, విశిష్టాద్వైత సిద్ధాంతమును బ్రవర్తింపఁ జేయుటకు నియమింపఁబడిన [illegible] పీఠములలో నొకరునగు "కిడాంబి అచ్చాన్" అను మహాత్ముల వంశమువారని శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు వ్రాసియున్నారు.

వీరు 1853 సం॥న ?టపాడు గ్రామమున జననమొందిరి. చిననాటినుండియు నసామాన్య ప్రతిభగలవారగుటచే సర్వశాస్త్రములందును బ్రవేశము కలుగఁజేసికొనిరి. ఆకాలమున నాంగ్ల విద్య యిప్పటిరీతి వ్యాప్తినొందకలేకుండుటచే వీరు పింటపాడువందే గీర్వాణాంధ్ర సాహిత్యములం దసాధారణ ప్రతిభను సంపాదించి యుభయభాషలయందును గవిశేఖరులై యష్టావధాన శతావధానములఁ జేయుచు ననేకుల శిష్యులను బడసి యును రాజాధిరాజుల సంస్థానములందుఁగూడ నవధానముల నాచరించి సన్మానముల నందుచుండెడివారు. అప్పటి వీరి వయస్సు పదునాలుగు పదునేడు వత్సరములు మాత్రమే యుండెను.

వీరి పదునాలవయేటనే జనకులు పరమపదము నలంకరించిరి. కౌమార్యవయసున ?టి స్థితినీయుండి కూడ శాస్త్ర విద్యాభ్యాసము చేయ సంకల్పించి 1873 వ సం॥న వీరు తల్లిగారితోఁ గూడ విజయనగరమునకు విచ్చేసిరి. పిన పినప్పటి యమాత్యులగు పెనుమర్తి జగన్నాథరాజుగారి యాదరణమునను, విజయనగర ప్రభువులగు మహారాజశ్రీ మహానంద గజపతి

మహారాజా వారి యాదరణమును సంపాదించిరి. వీరికోరికఁ దెలిసికొని మహారాజా వారు తమ హైస్కూలునందు వీరిని బ్రవేశపెట్టిరి. ప్రవేశించిన కొలఁది కాలములోనే వీరు 1884 సం॥ నఁ బ్రవేశపరీక్షయందు ద్వితీయముగఁ గృతకృత్యులైరి. ప్రవేశించిన గొలఁది వత్సరములోనే వీరు ప్రవేశపరీక్షనుత్తీర్ణులగుట మిక్కిలి యాశ్చర్యకరము. శ్రీమహారాజావారు వీరి బుద్ధికౌశలమునకు మెచ్చి విద్యార్థివేతనమొసంగి కళాశాలా కోర్సులఁ జదివింపఁ జెన్నపురికిఁ బంపిరి. వీరు నాలుగు సంవత్సరములలో నెమ్మె పరీక్షయగు వఱకన్నింటిలో నుత్తీర్ణులైరి. న్యాయవాదియగు నూహచే బి. ఎల్. పరీక్షలోఁగూడ నుత్తీర్ణులైరి.

మద్రాసునుండి తిరు వచ్చిన వెంటనే మహారాజావారు వీరిని తమ కళాశాలకు ద్వితీయోపాధ్యాయునిగా (Vice Principal) నియమించిరి ఆ కాలమునందుఁ బ్రధమోపాధ్యాయులుగా (Principal) గా నుండి యనల్ప కీర్తి గడించిన చంద్రశేఖర శాస్త్రిగారు 1887 సం॥ నఁ గీర్తిశేషులు కాఁగా వీరే కాలేజి ప్రిన్సిపలు పదవి నలంకరించిరి.

అప్పటినుండి 1920 సంవత్సరాంతమువఱకు వీరు కళాశాలా ప్రధానోపాధ్యాయులై యవిచ్ఛిన్నముగఁ దమపనులను సాగించుచు ననేక విద్యార్థులను బండితవరేణ్యులుగఁ దయారుచేసిరి. శ్రీ ఆనందగజపతి మహారాజావారు కీర్తిశేషులగునపుడును, దదితర సమయములందును గడు నేర్పు నుపయోగించి కళాశాలారిష్టములను వారించి గొప్ప యశస్సును సంపాదించిరి.

ఆంగ్ల కళాశాలకు వలయు పరికరముల నభివృద్ధిపరచి, లేబరేటరీల నిర్మించి, గ్రంథభాండాగారముల ననేక భాషాసాహిత్య, శాస్త్రగ్రంథములఁ బూరించి, యనేకులను, దమ కళాశాలలో జదివి ప్యాసుచేసినవారిని సహోపాధ్యాయులనుగా స్వీకరించి యనేకుల కాధారముఁ గల్పించినారు.

నామమాత్రావశిష్టప్రాయముగనుండిన సంస్కృత పాఠశాలను వీరిపాలనలోనికిఁదీసికొనివచ్చి, మహామహులగు పండితులను జేర్చి కళాశాలగ మార్చి 1900 సం॥ నుండియు కాశీనగరమున జరుగు సంస్కృత పరీక్షలకై విద్యార్థులఁ జదివించి యనేకులను గావ్యతీర్థులను, వ్యాకరణ తీర్థులను దయారుచేయించిరి. సంస్కృతము జదువువారికిఁ బారితోషరూపముగ ననేకగ్రంథముల నిప్పించెడివారు. 1914 సం॥న సంస్కృత కళాశాలకు గొప్పభవనమును గట్టించి, యమూల్య గ్రంథములతో లైబ్రరీనిగూడ వృద్ధికిఁ దెచ్చిరి. విద్యార్థులుండుటకుఁ గళాశాలావరణముననే గృహములు నెలకొల్పిరి.

1920 సం॥ న దాము ఆంగ్లకళాశాలాధ్యక్ష పదవిని విడిచి విశ్రాంతిని స్వీకరించు సమయమున నీకళాశాలవిషయమై పూర్తిగ శ్రద్ధవహించి తద్దిన జనవరి నెల చివరివఱకు నవిచ్ఛిన్నముగ తమ పనిని సాగించిరి. 1923 నుండి పండితసభను నెలకొల్పి నెలకొక్కక యుపన్యాసమిప్పించి విద్యార్థులకు జ్ఞానమును వృద్ధిచేయు నేర్పాటు చేసిరి. ఇంతియగాక 1923 సం॥ పట్టదేతఱగు విద్యార్థిసంఘమును నెలకొల్పి నెలకొక్కక్క విద్యార్థి (కళాశాలాకక్ష్యలోనివారు) (college Department) వ్యాసమును వ్రాసి చదువు కట్టుదిట్టములు చేసిరి. 1926 సం॥ న విద్యార్థులకుఁ బ్రత్యేక పఠనమందిరము నేర్పాటుగావించిరి.

# రామదాసు.

సింగంపల్లి వెంకటాద్రిగారు.

మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపనాచార్యుడగు శ్రీ శివాజీ ఛత్రపతి గురువరేణ్యుడును, తాపసోత్తముడును, త్యాగధనుడును, దేశ సేవాభిలాషియు, ధర్మ సంస్థాపనాచార్యుడు నగు శ్రీ సమర్థ రామదాసుల చరిత్రము సూత్రప్రాయముగ పాఠక మహాశయుల కెఱింగించెద.

జననము — బాల్యము.

మహారాష్ట్రమున గోదావరీ తీరమున 'జాంబవ' అను గ్రామమున పదునాఱవ శతాబ్ద మధ్యమున 'సూర్యాజీపంతు' అను సద్బ్రాహ్మణు డుండెను. ఆయన సహధర్మచారిణి 'రాణూబాయి'. రాణూబాయి పతివ్రతా శిరోమణి. భార్యాభర్త లిరువు రొకానొక సుముహూర్తమున క్రతు వొకటి నొనర్చిరి. తదుపరి కొంత కాలమున కా యిల్లాలు పుత్రు లిరువురం గనెను. వారిలో ద్వితీయుడు నారాయణుడు. నారాయణునకైదవ యేటనే విద్యాభ్యాసము, ఉపనయనాదిసత్కార్యములు జరిగియుండెను. నారాయణుడు కుశాగ్రబుద్ధి గలవాడగుటచే నచిర కాలముననే వేద వేదాంగముల సాంగోపాంగముగ నభ్యసింప గల్గెను.

అతని యైదవ యేటనే తండ్రిగారు పరమపదించిరి. పాపము! కారణమున సంసార నిర్వాహణమున దల్లికిని సోదరునకును నారాయణుడు తోడ్పడవలసి వచ్చెను. నారాయణునకు తీరిక వేళల యూరికి దూరముగా గోదావరీ తీరమున కేగి, ఏకాంతమున గూర్చుండి భగవద్ధ్యానమొనర్చు చుండెడివాడు. కొన్ని వేళల భగవద్ధ్యానానంతర మదేవిధముగ గూర్చుండి ఒక పరి స్వచ్ఛమగు గోదావరీ తోయము వంకను, మఱొకపరి నిర్మలమగు నాకసము వంకను, తేరపాఱ జూచుచు, మహదానంద భరితుడై ప్రొద్దుపోవువఱకు నట్లే యుండెడివాడు. ఒక్కొక్కపరి విద్యార్థి బాలకులకు గ్రంథముల వర్ణించి శిష్యుల మనస్సులకై మహానందములకు గయితేము వాఙ్మగోచరము కాని వేదాంత రహస్యముల నన్వేషించు చుండెడివాడు.

తల్లియగు రాణూబాయి అన్నగారు నారాయణుడు ప్రొద్దుపోవువరకు రాకుండుటం జేసి భయవిహ్వల చిత్తులై వానికొఱకు సమీప ప్రాంతముల వెదకి వెదకి విసికి వేసారి పోవు చుండిరి. ప్రొద్దుపోయి యింటికి వచ్చుట తోడనే తల్లియు నన్నయు కొట్టియు దిట్టియు బహువిధంబుల బాధించుచుండిరి. నారాయణునకీ తిట్లు కొట్టులు పరిపాటియై పోయెను.

ఒకానొక దినమున నారాయణుడు గ్రామ సామీప్యమునగల పంచవటీ కాననమున కేగి తీవ్రాలోచనా నిమగ్నుడై దినమంతయు నచ్చటనే గడపెను. పాపము! తల్లియు నన్నయు భోజన పానముల వర్జించి వానికై వెదకసాగిరి. దినమంతయు వెదకగా గుడపు కాననమున గన్పట్టెను.

నారాయణుడు భగవద్ధ్యాన తత్పరు డగుటయే గాక మాతృదేశ విమోచనోపాయముల నారయుచుండెడివాడు. ఆ కాలమున దేశమంతయు మహమ్మదీయులగు యవనులచే పీడింపబడుచుండెను. ప్రజానీక మంతయు సంక్షోభమునకు గుఱి యయ్యెను. రాజ్యతృష్ణచే వ[illegible]లన్య దేశములపై బడి పల్లెల పట్టణముల కొల్లగొట్టుచు, గుడులను గోపురములను ధ్వంసమొనర్చుచు, పాపపుణ్యము లెఱుగని శిశువు

లను స్త్రీలను చిత్రవధ గావించుచు మహాత్ములను గారణభూతులగుచుండిరి. ఇట్టి విపరీతస్థితి గాంచినవాడగుటచే నారాయణుడు మాతృదేశ విమోచనము కలుగు టెట్లాయని తలపోయుచు నుండెను. సనాతన ధర్మసంస్థాపన బుద్ధిగాని ప్రాచీనసమాజమునకు కలుగుచున్న సంతాప క్లేశములు నశించిపోవలెనని నిర్ణయించుకొని లోకోపకార్య నిర్వాహణమునకు సర్వసంగ పరిత్యాగ మొనర్చుట సముచితమని భావించుకొనెను.

వైవాహికము — వైరాగ్యము.

నారాయణుని హృదయక్షేత్రమున వైరాగ్య బీజము మొలకెత్తి క్రమాభివృద్ధి గాంచుట జూచి తల్లియు నన్నయు బహువిధముల బోధించియు, బాధించియు వానిని త్రిప్పజూచిరి. కాని ప్రయోజనము లేకపోయెను. నారాయణుడు సన్న్యాసించుటకు ప్రయత్నించుచుండెనని విని తల్లియు నన్నయు వానిని సంసారపాశమున గూలద్రోయుటకై గొనుక చక్కని చుక్కను వివాహము జేయ నిశ్చయించుకొని తగు సన్నాహము లొనర్చుచుండిరి. నారాయణుడీసు గతి గ్రహించెను. పాపము! వానికి కలిగిన సంతాపక్షోభమునకు మేర లేకుండెను. వివాహము వలదని వాదింపసాగెను. ఎంతచెప్పినను వినరయ్యె. వారిచే వీరిచే జెప్పించిరి. వివాహమునకు సుముఖునిగ జేయదలంచి వాని గురువునయొద్దకు త్రిప్పితీసికొని ధర్మములు ఉపదేశింపసాగెను. వీనిబాధలు పడలేక యొకనాడు యిల్లు విడచి పారిపోయెను. ఎంత వెదకినను కనపడకుండెను. రాత్రివేళ అన్నగారు యింటి దగ్గఱనున్న చెఱువు కట్టపై నిలుచుండి ఓ! నారాయణా! నారాయణా! యని గొంతెత్తి యఱచుచుండెను. కొంత సేపటికి దగ్గఱనున్న యశ్వత్థ వృక్షాగ్రమునుండి 'ఆ! ఇదిగో వచ్చుచున్నాను. వచ్చుచున్నా'నని పలికెను. అన్న తల యెత్తి యిటు నిటు పాఱ జూచెను. ఇంతలో చెట్టుపైనుండి యొక వ్యక్తి చెఱువులో గభాలున దుమికినట్లు కనబడెను. పాపము నారాయణుడు నీటిలో మునుగుచు తేలుచు గుటకలు మ్రింగుచు నటు నిటు కొట్టుకొనసాగెను. ఆ వ్యక్తి తన తమ్ముడే యని గ్రహించి వెంటనే నీటిలో దుమికి యొడ్డునకీడ్చుకొని వచ్చెను. ఆ గండ మట్లో గడచెను. నాటనుండి నారాయణునితో నెవరును వివాహ విషయము తలపెట్టక యూరకుండిరి. వివాహ ప్రయత్నములును విరమింపబడెను. సంసారమున నెట్టి కలతలు లేకుండ కొంత కాలము సుఖంబుగ గడచెను. ఒకనాడు తల్లి నారాయణుని యొంటరిగ గూర్చుండబెట్టుకొని నాయనా నీవు వేదములు వల్లెవేయునపు డెల్లను 'మాతృదేవో భవ:' అని పలుకుచుందువు. దాని యర్థమేమియో వివరించి నెరిగింపుమని కోరెను. తోడనే సమాధాన మిట్లు చెప్పెను:-

" తల్లి దేవతా సమానము. తల్లిని దేవతవలె నారాధింపవలయును. త్రికరణశుద్ధితో తల్లిని సేవించి యామె కష్టనిష్ఠూరముల నివారించుచు సంతుష్టి కలుగజేయవలయును. మాతృ సమానముగా మాతృభూమిని సయితము ప్రేమించి సేవింపవలయునని యభిప్రాయము. తల్లిని మాత్రమే సేవించుచు దేశమాతను నిర్లక్ష్యముగ జూచుచు నుపేక్షించువానికి యిహపరములు దూరమగును. కష్టనిష్ఠూరములకు చలింపక ధైర్యము గొని త్యాగబుద్ధితో మాతృ దేశసేవ యొనర్చుట మానవధర్మమని వేదార్థము. అదియే సర్వశాస్త్ర సిద్ధాంతము సకలోపనిషత్సారము"

అని యుక్తియుక్తముగ జెప్పెను. రాణాబాయి యంతట "నాయనా! నేను దేవతావమానమని కదా చెప్పితివి. అట్టి నామాట వినవలదా?" యని ప్రశ్నించెను. "అమ్మా! వినెదను ముమ్మాటికిని వినెదనని వినయముగ" బలికెను. అట్లగుచో "తండ్రీ! నీవు వివాహమాడి వంశము నుద్ధరింపుమని" యాజ్ఞాపించెను. నారాయణుడు తెల్లబోయి పలుకక యూరకుండెను. మౌనము అర్ధాంగీకార సూచక మగుటచే తల్లి మరల వివాహ సన్నాహముల నతి చురుకుగా జేయసాగెను. నారాయణున కేమి చేయుటకును తోచకుండెను. ఒకవంక దేశ సేవాభిరామ మొకవంక మాతృవాక్య పరిపాలనా ధర్మపాశము బాధించుచుండెను. లగ్నము సమీపించెను. బంధు మిత్రులెల్లరు గుమిగూడిరి. మేళ తాళములు మ్రోగుచుండెను. వివాహ వేదికపై నూతన వధూవరుల నాసనుల జేసిరి. పురోహితుడు మంత్రోచ్చాటన మారంభించెను. నారాయణునకు గుండెలు గబగబ కొట్టుకొనుచుండెను. మేనంతయు చిరుచెమటలు గ్రమ్మెను. ఊరక వెఱ్ఱివానివలె నాకసమువంక పందిరివంక తేరిపారజూచుచుండెను. లోలోన "తండ్రీ! ఆపద్బాంధవా! ఆర్తశరణ్యా! బంధవిమోచనా! నన్ను బంధమును డీసి ముక్తుని గ జేయుమూయని" ప్రార్థింపసాగెను. తంతు నడచుచునే యుండెను. 'సావధాన' అను శబ్దము పురోహితుని నోటనుండి వెలువడుటతోడనే భయపడిన జింకవలె యులికిపడి దిగ్గున లేచి లేడివలె దుంగుచు గునదుముకుచు పరుగెత్తి పారిపోసాగెను. వారును వీరును వెంబడించిరి. ఎవరికిని చిక్కకుండెను. చూచుచుండగనే మాయమయ్యెను. వనము పర్వతములలోడనే పోయి తుదకు నాసికాక్షేత్రమునకుంజని యచట సన్యాసాశ్రమము స్వీకరించెను. సన్యాసమనిన మన మనుదినము జూచు వెఱ్ఱి వెంగళాయుల బూటకపు సన్యాసము గాదు. ఆమహనీయుడు దేశసేవనిమిత్తమై, ధర్మసంస్థాపనార్థమై, ప్రజారక్షణమునకై పెండ్లి పీటలపైనుండి పారిపోయి మధుపర్కముల పారవైచి కాషాయాంబరము ధరించి కమండలము చేబట్టెను. త్యాగమనిన, సన్యాసమనిన నిట్టిదే! నారాయణుడు సన్యసించి "రామదాసు" అయ్యెను.

రామదాసు – శివాజీల సంయోగము.

రామదాసు పండ్రెండు సంవత్సరములు తదేకదృష్టితో దేశదేశముల గ్రుమ్మరి, ఆయా ప్రాంతములందలి ప్రజల స్థితిగతులను, పరిపాలనావిధానములను సమగ్రముగ గ్రహించియుండెను. నానా దేశాధీశుల దర్శించి పరిపాలనా ధర్మముల నుపదేశించుచు మధ్య మధ్య హిమపర్వతముల కేగి తపంబొనర్చుచు సృష్టి సౌందర్యమును పఠించుచు మహదానంద మొందుచు ద్వాదశవత్సరంబులం గడపెను. ఆ కాలమునందే మహనీయుడును, సర్వసమర్థుడునగు రామదాసు 'దాసబోధ' యను మహాగ్రంథము రచియించ [illegible] అనిమ్మట మహారాష్ట్రదిగి ప్రజలకు పాలకులకు స్వధర్మముల నుపదేశింపసాగెను. ఆమహనీయుని రాజభక్తి, నిష్కల్మష నిరాడంబర జీవితపద్ధతి, స్వార్థత్యాగము, పరోపకారబుద్ధి, దైవభక్తి, దేశసేవానురక్తి మొదలగు సద్గుణము లెల్లను ప్రజల నధికముగ రంజింపజేసి వారిచే తము లోకస్తుతించి వశవర్తులుగ జేయగల్గెను. అయస్కాంతము ఇనుమును సన్నిధికి లాగుకొనునట్లు తేజోవంతులగు మహనీయులు ప్రజానీకమును తమలో [illegible]. లక్షల

# మాళవికాగ్నిమిత్రము.

పి. వి. నరసింహాచార్యులుగారు.

ఇయ్యది నాటకమని కొందరును నాటికయని మరి కొందరును పలువురు పలువిధములుగా నభిప్రాయపడు చున్నారు. ఈనడుమ గత సంవత్సర జ్యేష్ఠమాస భారతి యందు "మాళవికాగ్నిమిత్రము నాటకము కాద" ను శీర్షికపై శ్రీ॥ న॥ చ॥ వరదాచార్యులు అయ్యవార్లుగారు వ్రాసిన వ్యాసమును, దానిపైన "మాళవికాగ్నిమిత్రము నాటకమే యనదగు" నను శీర్షికపై శ్రీ॥ బు॥ వెంకటరమణయ్యగారి వ్యాసమును జూచితిని. తెలిసియున్న సందర్భమును లోకమునకు దెలియజేయుటయే మానవుని యుత్తమపద్ధతియని నాకు దోచుటచేనా తెలిసిన యంశమును పత్రికా మూలమున లోకమునకు దెలియజేసికొనుచుంటిని.

ప్రథమమున నియ్యది నాటకమనందగదను శ్రీ॥ బు॥ వెంకటరమణయ్యగారి వాదమించుక బరిశీలింతము.

శ్లో॥ "నాటికా క్లృప్తవృత్తా స్యాత్ స్త్రీప్రాయా చతురంకికా
ప్రఖ్యాతో ధీరలలితః, తత్ర స్యాన్నాయకో నృపః
స్యాదన్తఃపుర సంబద్ధా సంగీతవ్యాపృతాఽథవా
నవానురాగా కన్యాత్ర నాయికా నృపవంశజా
సంప్రవర్తేత నేతాఽస్యాం దేవ్యాస్త్రాసేన శంకితః
దేవీ భవేత్పునర్జ్యేష్ఠా ప్రగల్భా నృపవంశజా
పదే పదే మానవతీ తద్వశః సంగమో ద్వయోః
వృత్తిః స్యాత్కైశికీ స్వల్పవిమర్శాః సంధయః పునః ॥"

అని సాహిత్యదర్పణములోని నాటికాలక్షణము. ఇందలి "క్లృప్తవృత్తా" యను దానికి శ్రీ వెంకటరమణయ్యగారు ముందు "చతురంకికా యని" నాటికయందు నాల్గంకములు దవలయునని నియమించుటచే నీనాల్గంకములలో నిముడునట్లితివృత్తము క్లృప్తపరుపవలెనని భావము. దర్పణ వ్యాఖ్యాత "క్లృప్తవృత్తా" యను దానికి అప్రసిద్ధ చరిత్ర పూర్ణాయని వ్యాఖ్యానము చేసెను. గాని యియ్యది దర్పణకర్తయొక్క యాశయముగదని వ్రాసినారు కాని దర్పణకారుని యాశయమెట్లున్నదియు నూహించుట సాధ్యము కాదు. అతని యాశయమెట్లున్నను వ్యాఖ్యానమును నిరాకరించుటకు వీలు లేదు. ఏలయన మూలమున నర్థము సందిగ్ధముగానున్నచో వ్యాఖ్యానమేకదా యాధారముగ నిర్ణాయకమునగు సాధనము, ఈ యర్థమునే కదా వ్యాసకర్తలు "వ్యాఖ్యానములో విశేష ప్రతిపత్తిర్నహి సందేహా లక్షణమ్ను" పరిభాషామూలమున బోధించుచున్నారు. అదియునుగాక దశరూపకర్తయును నాటికాలక్షణమును వ్రాయుచు "తత్రివస్తు ప్రకరణాత్త"ని చెప్పియుండెను (అనగా ప్రకరణమునుండి యితివృత్తమును స్వీకరింపవలెనని యర్థము) ప్రకరణమునందలి యితివృత్తము కల్పితమగుటచే నాటికయందును కల్పితేతివృత్త మావశ్యకమని తేలుచున్నది. ఒకవేళ నాటికేతివృత్త మప్రసిద్ధమనినచో రత్నావళి భాసకృతస్వప్నవాసవదత్తము ననుసరించి వ్రాయబడుటచే నందలి యితివృత్తము ప్రసిద్ధమగుటచే నద్దానికి నాటికాత్వహానియగునని శంకింతురేమో కాని ప్రసిద్ధమనగా పురాణేతిహాసాదులయందు ప్రసిద్ధమని యర్థము కాని కావ్యాంతర కృతరూపకాంతరమున ప్రసిద్ధమైనంత మాత్రమున నయ్యది ప్రసిద్ధమనుటకు వీలు లేదు, అట్లు కానిచో మృచ్ఛకటికమను ప్రకరణ దృశ్య గ్రంథము భాసకృతమగు దరిద్రచారుదత్తము ననుసరించి రచింపబడుటచే నందలి యితివృత్తము ప్రసిద్ధము కాకపోవలసివచ్చును. ప్రకరణమునకల్పితేతివృత్తమావశ్యమనికదా యాలంకారికుల యాశయము. పైకారణముల ననుసరించి రత్నావళీతివృత్తము ప్రసిద్ధముకాదని తేలుచుండుటచే దదనురోధముగా నాటికేతివృత్తము ప్రసిద్ధమనుట యసామంజసము.

"స్త్రీప్రాయా" యను దానికి బ్రత్యంకమునను స్త్రీపాత్రము లుండవలయునని వ్రాసినారు కాని నాటిక మొత్తముమీద స్త్రీపాత్రము లధికముగా నుండవలయునని యర్థము చెప్పుట యుక్తము. అట్లుగానిచో నాటకములయందును సామాన్యముగా బ్రత్యంకమునందును స్త్రీపాత్రప్రవేశ ముండుటచే నీలక్షణము స్త్రీప్రాయా అనుది విశేషవిధాయకము కాకపోవలసి వచ్చును.

"చతురంకికా" యియ్యదియు నాటికా నాటకములకు భేదమగు లక్షణమని శ్రీ వెంకటరమణయ్యగారు వ్రాసిరి. కాని దశరూపకర్త నాటికాలక్షణమును వ్రాయుచు

"స్త్రీప్రాయ చతురంకాది భేదకం యది చేష్యతే
ఏకద్విత్ర్యంకపాత్రాదిభేదేనానంతరూపతా"

అని చతురంకాది సత్త్వము భేదకము కాదని నిరాకరించియున్నాడు. స్త్రీప్రాయత చతురంకాది సత్త్వము మున్నగునవి భేదకములని యంగీకరించిచో నాటక కందు మూడంకముల చేతను పాత్రముల చేతను ననంతరూపత్వము వచ్చును. అందుచే స్త్రీప్రాయాదులు భేదకములు కా

దర్పణవ్యాఖ్యాత "స్వల్పవిమర్శాః" అను దానికి ప్రాయేణవిమర్శ సంధిరహితాః సత్యావశ్యకేష్వపి చిర్వమర్శేనాపిసహితాః" అని విమర్శసంధియును నాటికయందు బ్రతిపాదింపవచ్చునని యంగీకరించి యుండుటచే పై యుక్తినిర్యుక్తికమని స్పష్టమగుచున్నది. మఱియును యిందు నామము (పేరు) స్త్రీ ప్రత్యయాంతముగ లేక పోవుటచే నాటికా నామము స్త్రీప్రత్యయాంతముగా నుండవలయునను నాలంకారిక వచన విరోధము వచ్చును. అందుచే నిది నాటకమే కాని నాటిక కాదని శ్రీ వెంకట రమణయ్యగారు వ్రాసినారు.

"నాటికా సట్టకాదీనాం నాయికాభిధ్యా శేషణమ్ ............ అను దర్పణవాక్యమునను సరించి "మాళవిక" యని యుండుటయే యుక్తము. కాని అట్లే యుండవలయును మఱియొక విధముగా నుండకూడదని నియమించుటకు వీలులేదు. ఏలయన, దర్పణకర్త రూపక నామకరణసందర్భమున "నాయికానాయకాఖ్యానాత్సంజ్ఞా ప్రకరణాదిషు" (అనగా ప్రకరణాదులపేరు నాయికానాయకోభయ చిహ్నమయి యుండవలయునని యర్థము) అని శాసించి యుండగా శూద్రకరచితమగు మృచ్ఛకటిక మను ప్రకరణాదృశ్య గ్రంథమునకు దద్విపరీతముగా "మృచ్ఛకటిక"మ్మని నామము కాన్పించుటచేతను కాళిదాసకృతమై, [illegible] త్రోటకమని పండిత వ్యవహృతమగుచున్న విక్రమోర్వశీయమున నాలక్షణము సమన్వయించుటచేతను నాలక్షణ మవ్యాప్త్యతివ్యాప్తిగ్రస్తమైనది. అందుచేత నైలక్షణము సార్వత్రికము గాదని యంగీకరించి తీరవలయును. అదియునుగాక ప్రకృత మాళవికాగ్నిమిత్రమున నాలక్షణము గన్పించు చుండుటచే నియ్యది ప్రకరణమనికూడ మఱియొక వాదము బయలుదేరవచ్చును. అందుచే నియ్యది నాయికానామకఘటితము కానంతమాత్రమున నాటిక కాదని నిరాకరించుట సరిగాదని మనవి చేయుచున్నాను.

ఇట్లే సూత్రధారుని వాక్యమున "నాటకమ్మ"ని కాన్పించుటనుబట్టి దీనికి నాటికాత్వభంజకముగ శ్రీ వెంకటరమణయ్యగారు నిరూపించియున్నారు. కాని యయ్యది ముద్రణప్రమాదమైనను గావలయును లేక గ్రంథకర్త రూపక సామాన్యపరముగానైనను నుపయోగించియుండ వచ్చును లేనిచో గ్రంథవిరుద్ధముగా నట్లు కవి నామకరణమును చేయునా? అదియునుగాక సూత్రధారుని వాక్యములా నాటకాది నిర్ణాయకములు? ముద్రణప్రమాదమున నాటకమని యితర ప్రమాణములచే నంగీకరింపవలసిన రూపకమున ప్రకరణమ్మనిపడినచో నది ప్రకరణమే యని వాదించిన సహృదయు లంగీకరింతురా? దానికే యాధారముగా దీసికొని నిర్ణయ మొనర్చుట యుక్తమా? కనుకనే ప్రథమమున నాటకాది నిర్ణాయకములగు శాస్త్రములం వస్త్వాదులని విన్నవించుకొని యుంటిని. వస్తువు మొదలగువానిచే నిర్ణయము తేలినపిమ్మట నిజకూడ [illegible] తోడ్పచ్చునతిథివలె నుపయోగించునుగాని స్వతంత్రముగా నెట్టి ప్రయోజనమును సంపాదింపనేరదు. మఱియును భవభూతికృతములగు మహావీరచరితము, ఉత్తరరామచరితములందును సూత్రధారుని వాక్యమున నాటకమ్మని కాని ప్రకరణమ్మనికాని మఱియొక నామము కాని కాన్పించకుండుటచే నవి నాటకములా? తద్భిన్నములా? యని శంకింపవలసివచ్చును. అందుచే సూత్రధారుని వాక్యము నాటకాది నిర్ణాయకమగుట తృప్తికరముగా దోచుటలేదు.

మఱియును శ్రీ వెంకటరమణయ్యగారు తమ వ్యాసము తుదను "ఇందు నాటకలక్షణములలో గొన్ని లోపములున్నను కాళిదాస మహాకవి కృతియగుటచే సహ్యములు" అని వ్రాసియున్నారు. అయ్యది కేవలము హాస్యాస్పదమగుటయే గాక మహాకవియగు కాళిదాసునకును లోపమును గల్పించుచున్నది. అంతియ కాక శాకున్తలము మాళవికాగ్నిమిత్రమును నేకకర్తృకములని యంగీకరించినప్పుడు సర్వలక్షణసమన్వితమును, నాటక సామాన్యభూషణమును, నగు శాకుంతలమును రచించిన యాకవి మాళవికాగ్నిమిత్రమును సలక్షణముగ రచింపజాలక పోయెనని యనుట కేవలము సాహసమాత్రముగా బరిణమించును. అదియునుగాక ప్రథమకృతి యనంతర కృతియను భేదమితరకవులకుగాని కాళిదాసునకట్టి భేదమా? రసజ్ఞత యుండవలయునుగాని యాతని కవిత్వమున దశముతకే గొదవ యుండునా? అందునను లక్షణ విరోధమును సాధించుటయా? ఆలోచింపంగా ద్రాక్షఫలసంఘమందు కానబడక పుల్లనివని యను గొనిన జంబుక వృత్తాంతము స్ఫురింపకవచ్చుచున్నది. ఈ యుక్తి నాటకత్వస్థాపకము కాకపోవుటయేగాక నాటికావాదమునకును జేయూత నొసంగినట్లున్నది. ఎట్లనిన ఇందు నాటకలక్షణములలో గొన్ని లోపములున్నను ప్రాచీనుండును, ప్రామాణికుండును మహాకవియు నగు కాళిదాసు నీయర్వాచీనములగు లక్షణములంతమాత్రము నిరోధింపజాలవు కాన నియ్యది నాటికయే యనవచ్చునని చెప్పినను జెప్పవచ్చునుకదా? కావున నిట్టి నిర్యుక్తి

ఔర! దామోదరాత్మజ! యెట్టినీదు
వ్రాతశుద్ధికి భంగంబు ప్రాప్తమయ్యె
నీదు సర్వతోముఖవ్యాప్త నియమమేది!
భవద సామాన్యకార్య పాటవమదేది!
తావకోత్కృష్ట పరతత్త్వ భావమేది!
యుష్మదధిగత విభుతానియుక్తియేది!
నియమ, పాటవ, భావ, నిర్నిద్రవిభుత
యేది! యేదంచు పృచ్ఛింప నెవ్వడ, న్మ
దీయ ప్రశ్నకు నుత్తరం బీయువాడ
వీవునుం గాదుగాని నిరీహమతిని,
కొనియు స్వాతన్త్ర్యమెంతయు వినయబుద్ధి
నడిగెద నయోధ్య విప్రార్యవరుల.

౪

సర్వ భూత దయాసుధాస్వాదబద్ధ
దీక్షితానంత సజ్జనాధ్యక్షులార!
శమదమాది విహీన శాంత్యమల సుగుణ
రత్నభూషిత వంశ సంజా(తు)లార!
ప్రత్న భవదీయ విద్యాభిరత్న మహిమ
ధిక్కృతాన్య జనాధిక ధీరులార!
మీ మొగాలను మీతోలిస్వామి వ్రాసి
యున్న నాయకక్రూరాలకు అన్న! హంస
పాది సేకూరుచేలనో ఆ దినా, వి
ధాత కప్రతిహతము జగ(త్తు)టంచు
నిర్వచించిరిగాదె యన్నియును మీర
లేక యది హంసపాదియుగాక, నాటి
వఱకె మీ బొందిలోని జీవంబటంచు
నిటిల తట పంక్తి కర్థంబు, గజమటన్న
శూద్రతాపసి యుగమటు నుక్కిపోవ
కృంగిపోయిన యుగమటు నింగికెక్క
లేదె, స్వవచన వ్యాఘాతమేదో! యిపుడు
బోధపడియెనుగా! మైన మోధ గా సు
రాగ్రిగణ్యాత్ములార! పరాసహిష్ణు
శీలపరులార! అసహిష్ణుశీలు రౌట
మిమ్ము పృచ్ఛింప నమిత భయమ్ముకలుగు
మీతో మా కేటికీ యనమీహితంబు
నాచరించిరి కలుషాత్ములైన యట్టి
గోముఖవ్యాఘ్రప్రాయు శ్రీరామచంద్రు
నడిగి విరమించెదను శక్తి యుడుగుపిదప.

౫

ఓ రఘూత్తమ! యో క్షితీశోత్తముండ!
ఇవియెగాబోలు నీదు రాజ్యేందిరా వి
ధాన వేదాంతసూత్ర సంధానమునకు
నవసరంబయి తోడ్పడునట్టి పనులు.

౬

అక్కటా! మూలదేవుడే యిక్కుతలము
నుద్ధరింపంగ జన్మంబు నొందెననుచు
జనము సర్వంబు సంతుష్ట స్వాంతమయ్యె
ప్రజల నీ కన్నప్రజలని పరమదయను
బ్రోతువంచును నీయిట్టి పుత్రిభూత
జనులలో నెవ్వరేని విచారమొంద
లేక వికలాంగులై దుఃఖ దీనులైన
అన్య సంతతితో బాటు ననుదినంబు
మాతృ పితృబుద్ధి సాకుచు మనుచుటెల్ల
నీదు భారంబునుమ్మని నెమ్మనమున
తలచి సంతోసమందితి మలఘుచరిత.

౭

కాని యామాయాశ పాశమింతైనఁ గాని
మిగులక యశేషమును నాఁడె తెగుటకాక
ఇంకఁనై పెద్ద భీతి నీవంకనుండి
వచ్చుటయు సంభవించె నాపైని మూడు
సోదర జనాళికిని నాయసూయ హెచ్చె.

౮

నవసి జడదారినై నీర నవసవన్న
భక్తుఁడై భ్రాత్రివర్గముపాటు, జనుల

యాశ్రమోపాంతభూముల, నల్పవర్ణ
నిర్మిత కుటీరముల, రామ! నిన్ను సతము
సత్యవర్తన తోడుత స్మరణ సేయు
చుండ భాగ్యుఁడు శంబూకుఁ డందఱకును
దోషియై, దండ్యుఁ డయ్యెనా! దొడ్డరాజ!
దుర్భర కఠోరగర్భయై దూలు దయితఁ
గడవి కంపితివా! రామ! హా యటంచు
నీవు పురవాసులే కాక, నిఖిల జగము
నుస్సురనుచున్న దినములు నొండొ రెండొ
మూఁడు మాత్రము గడవఁగ, నేఁడు పగుట
వలనఁ గాఁబోలు శూద్రతాపసుని వెదకు
నున్న తోద్యోగము లభించెనన్న యటుల
యోజనా లెన్నియో యట్టి యోజ సెడక
గడచి, కడకట్లు నిర్దోషి కడకుఁ జేరి,
దక్షిణ ప్రశస్త హస్తమా! తత్క్షణంబ
నిశిత ఖడ్గంబు గైకొని నీయనంత
ప్రభుతఁ జూపుము శూద్రతాపసునియెడల
నంచు ఘనకార్య మదియెంతొ యొప్పెట్టితివని
అన్యతాపస వర్యులు నఖిల పూత
చరితు లానందమున హెచ్చు మురిసి గాంచ,
నిరవశేషంబుగా నల్పి నెగ్గినాఁడ

౯

వహ్ని దేవునకును వాయువట్లు భూమి
దేవులకు నీవు తోడునై యీ విశాల
ధరణి నంతను బాలింప దక్షుఁడైతి
వార! శ్రీరామ! నీనామ మఘువారంబ
టంచు వలఁగొను గ్రంథాలు నదియటుండ,
అఘహారముగాక, నిర్దోషి తాత్మ జీవ
హత మటంచును, నాతో నయోచితముగ,
సీత గురియైన వాలి యా నిర్మలాత్మ
ప్రాణకమ్మయు, నీశూద్రతాపసుండు,

చెప్పి, భయపెట్టి రెంతయు, నొప్పొ! తప్పొ
నన్ను మాత్రము గినియకుమన్న! రామ!
మాతృ పితృ బుద్ధి నీయందు మాదృశాలి
కున్నదియును గాన, మా కేదొ యొకటిలోటు
చూతువే మది! తండ్రియం చాతురముగ
బాల్య చాపల్య మాటచేఁ బ్రశ్న చేసి
ఆర్చెదవు తీర్చెదో యంచు నడిగినాఁడ

౧౦

ఎంత యుపచార మియ్యది, యెంత యఘము,
ఎంత యవినయప్రౌఢి యంచెంచి, మాదు
నగ్రసోదరు లుస్సు బుస్సనుచు మీఁది
కుఱుకుచుందురు, అదియేమి! యుఱుకు టెపుడు
గురు వసిష్ఠాది మునులకు గొప్ప భ్రాతృఁ
డైన నీకెల్ల యవగతంబయ్యె యుండు.

౧౧

మఱియు నింకొక్క మాట, నీ గు(రు)వు నీవు
వింటయే చాలునది పదివేలుమాకు.
శూద్ర తాపసవధ సేయుచుండి, నేఁడు
"నీతేఁడిటు మోక్షఫలము సహీనగతిని
సనుభవించెను, ధన్యుఁడం" చనుచు నీవు
చెప్పినాఁడవు, చెప్పిన చొప్పు నతఁడు
ఫలము నోటనుగైకొని పరమగతిని
నొందెనా! యట్టిచో నీదు చందమేమి
యయ్యె! శూద్రునకును మోక్షమియ్యలేదె!
అట్టి నీగురువర్యులు నెట్టుకొనుచు
ధర్మ(చ్యు)తియంచు గగ్గోలు పడుపలేద

౧౨

లేక యొకవేళ తపసుల సాకువాఁడ
వౌట గాఁబోలు జంకుచు, నట్టె మంద
భాగ్య మోప్రల ముఖస్తుతుల్ బలికినావో!

సిద్ధరామకులంట, ప్రసిద్ధ దివిజ
పతియు శ్రీరామచంద్ర భూపతియునంట,
అందు దద్వాసులకును ద దధిపతికిని
గిరవరాధిని పద్మాత్ము నిర్గతాఘు
బలి మహాసార్వభౌముని బలిగనొసగి,
యుందు నీ భూమి దేవుల కీయనత
సుగుణ గణసాంద్రు శ్రీరామసుభగునకును,
పేదబడదారి, ప్రేమైక సాధుచేతు
బాహ్య సర్వప్రపంచంబు బావురనగ
ఉటజ పర్యంతభూములు నుస్సురనగ
త తపోవన మృగములు దద్దరిల్ల
పరమ దౌర్భాగ్య దుర్భర పాపులెవరో !
హీన నీచాతినీచా సహిష్ణులెవరో !
కేవల స్వార్థపరులైన కితవులెవరో !
దేశద్రోహైక పరిణత ధీరులెవరో !
సంతసంబున గడ్డాలు పఱచుచుండి
అట్టె పఠించి దయమాలి "యహా" యనంగ
జంకుగొంకును లేక యీజగతి, బుణ్య
పాపముల భీతిలేకయె పరువులిడుచు
బలిగ నర్పించి భక్తి గన్పరచినావు
కాలమా! క్రూరమా! యొక క్షణములోన,

౨౦

ఖళి ! ఖళి ! సెబాసు ! శ్రీరామ ప్రభువ ! నీకు
కాలము ననంతకూ్రరమా గడ్డము లును
తోడునీడగ సాకుచు దోడురాగ
అడ్డు గడ్డింతయును నుంతునయ్యా ! జగతి
నెట్టి ఘనకార్యమందైన దిట్టవౌను.

౨౧

కాని, వ్యక్తిత్రయంబొకటి కలచుచుండు
"సర్వమునువీడి వనసి నిగర్వవృత్తి
దిరుగు శూద్ర తపోధనవరుడుగాని,
ఆశ్రితావలంబనయగు నబల కాని,
యేమియెరుగని వానరస్వామి గాని
నీకు నీశక్తికిని, నీదు మూర్ఖకైన
నడ్డుతగిలియు నంతలో, దొడ్డవారి
ప్రాపు గలవాడవగుటచే పారిపోవు.

౨౨

వారి ప్రాపున నీ కాంతి వఱలెదిశల
నీదు ప్రాపు నయోధ్యయున్ నిరుపమాన
ఖ్యాతినందుటగల్గె నీ భూతలాన,
నీని యున్నిటి ప్రాపున విగత దురిత
పంకిలంబై తనర్చె నీ భరతభూమి
జై ! మహాత్మ ! మహాత్మజై ! రామచంద్ర !
ఇదిగో ! జోహారు సేయుదు ముదముతోడ
సమతబుద్ధిని, మమ్మేలు సంతతంబు
"సామ్రాజ్య సామ్రాజ్య శ్రీరామ రాజ్యలక్ష్మి !
నైజచాంచల్యమెల్ల బోనాడి, నీ యా
నంత సంతతి నంచరారు మరయుమమ్ము!"



# గ్రంథ విమర్శన

80. శ్రీముక్తికాంతామణీ శతకము.

గ్రంథకర్త:- శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు, మచిలీపట్టణము. వెల 0-2-0.

81. ఆంధ్రకవి ప్రశంస.

గ్రంథకర్త:- శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు, మచిలీపట్టణము. వెల రు 0-4-0.

ఈపైరెండు చిన్ని పుస్తకములను వందనములతో నందికొంటిమి.

82 మంగళగిరి పానకాలరాయుడు,

83. శ్రీదుర్గా దండకము.

గ్రంథకర్త: శ్రీతుర్లపాటి గోవర్ధనరావుగారు, కవర్నరుపేట, బెజవాడ. ఒక్కొక్కటి వెల రు 0-0-6.

ఈ రెండు చిన్ని పుస్తకములను వందనములతో గైకొంటిమి.

84. మునిమాపు.

గ్రంథకర్త:- సహదేవ సూర్యప్రకాశరావుగారు, రాజమహేంద్రవరము.

ఇది ప్రణయగీత ఖండముల కలగూరగంప. నాయికా వియోగమునకు దుఃఖపిల్లు నాయకుని విరహాలాపములు స్వేచ్ఛానియమబద్ధములై గీతరూపములు దొప్పుచున్నవి. ఆధునిక కవితాగ్రంథమున భావకవిత్వాధ్యాయమున నిదియొక విభాగము. ఇందలి భావోత్కృష్టతను జాటు నొకపద్యమిది.

జలదపటలమ్ము క్రమ్మిన సమయమందె
మింటి తేజస్సుగురియును మెరపుకన్నె;
చిమ్మచీకట్లతెరలు దాచి తనసీమ
విసిరినపుడె నా కగుపించెదీవు.

(ప్రేమగానము)

సరళరచనమున కుదాహరణములివి:

"సకలము త్యజించి నీకోసమే కృశించి
యిటుల సగమయిపోయి నే నేడ్చుచుండ
కిలకిలమటంచు నవ్వుచు కెరలుకొనుచు
ఆమహానంత నీల సౌభాగ్యమందు
ఆత్మసఖులగలసి ఆటలాడు నీవు
ఎట్టులైరంగజాలుదువు నాహృదయమెంత
దగ్ధమగుచున్నదో నిన్నె తలచుకొనుచు."

* * * * *

"ఓ తృష్ణా దందహ్యహృదయ, ఓకఠోర
రాగశాలినీ ఏమి నాబ్రతుకొ గాని
ఒక్క వెచ్చని కన్నీటి చుక్కకేని
ఒక్క గాటంపు వేడినిట్టూర్పుగాని
విడువవే స్వార్థమేలేని ప్రేమగాం-

(ప్రతిఫలము)

ఈ గ్రంథము ఫేదరు లైటు కాగితములపై నతివిశాలముగ నచ్చొత్తింపబడి చక్కగ బైండు చేయబడినది. అమూల్యము.

(ని. శ. నం)

# మీర్జా దివ్యదర్శనము.

భోగరాజు నారాయణమూర్తిగారు.

(From the Spectator No 159 of Josph Addison.)

మాపూర్వుల యాచారము ననుసరించి నేను మిగుల బవిత్రముగ నెన్నుకొను శుక్లపంచమి నాటి యుదయమున గృతస్నానుడనై ప్రాతఃకాల సంధ్యావందనాది విధుల నిర్వర్తించుకొని నాటి దిన శేషంబంతయు నీశ్వరధ్యాన ప్రార్థనములతో గడపుటకై బాగ్దాదు పటణమందలి యున్నత పర్వతోపరి భాగములకు బోయితిని.

ఆ పర్వతాగ్రముపై మందానిలము ననుభవించుచు సారహీనమైన మానవజీవితమును గూర్చి నేను దీర్ఘముగ విచారి వగడంగితిని. ఆలోచనలపై నాలోచనలు సేయుచు నిశ్చయముగా మానవుడు నీడవంటివాడనియు మానవజీవితము స్వప్నసంకాశమనియు నేననుకొంటిని. ఇట్లనుకొనుచుండ నా దృష్టి సమీపమునగల యొక కొండకొన పైకి బ్రాకినది. అప్పుడు చేత బిల్లనగ్రోవిపట్టి గొల్లవేషముతోనున్న యొకండు నాకంటబడెను. నేను జూచుచుండగనే యతడా పిల్లనగ్రోవి పెదవులకడ జేర్చి వేణునాదమును వింపగా నారంభించెను. వివిధ విధస్వరంబగు తద్గానస్వరం బతిమధురంబై యిదివరకు వినుచున్న దానికన్న నెంతో వింతదై యత్యంత వర్ణనాతీతంబుగ నాకు వినవచ్చినది. మహాత్ముల జీవాత్మలు స్వర్గమున బ్రవేశించినంతనే, తత్పూర్వమొందిన మరణవేదనయును దొలంగించి, యా సుఖప్రదేశమందలి యానందముల ననుభవింపదగినట్లు చేయుటకు, వానికడ గావింపబడు గంధర్వగానముల నాగానము నాకు జ్ఞప్తికి దెచ్చినది. అంతరంగికానంద పారవశ్యముచే నాహృదయము కరగిపోయినది.

నాకెదుటనున్న యాగుట్ట యొక దివ్యపురుషునకు విహారస్థానమనియు, దత్ప్రాంత సంచారులగు బాటసారు లనేకులు వాని గానముచే వినోదింపబడుచుందురనియు నేను దఱచుగా వినుచుంటిని గాని, యాగాయకు డెవ్వరికిని బ్రత్యక్షమైనట్లుమాత్ర మెన్నండును విని యుండలేదు. తను గావించిన మనోహర గానస్వరముచే దన సంభాషణానందమును జవిచూచు కోర్కెలనుబుట్టించి, నిశ్చేష్టితునివలె గనంబడుచుండిన నన్నాతండు తను కూర్చుండిన స్థలమును సమీపింపుమని చేతితో సంజ్ఞజేసెను. మహాపురుషులయెడ జూపవలసిన వినయవిధేయతలతో నేనాతనిని సమీపించితిని. సమీపించి యిదివరకు విన్న మనోహర గానమువలన నా హృదయము సంపూర్ణముగ నాకర్షింపబడుటచే నేను వాని పదములకడ వ్రాలి యేడ్చితిని. ఆమహామహుడు తనయెడ నాకు జనువు కలుగునట్లు గౌరవాదర దృష్టితో మందహాసముచేసి, యొక్కమాఱుగ నాభయముల నన్నింటిని బోగొట్టెను. మఱియు నేలవ్రాలియున్న నన్ను గ్రన్నన లేవనెత్తి నాకేలుపట్టి "మీర్జా, నీలో నీవనుకొనుచున్న మాటలను వింటిని. నా వెంటరమ్మ"ని పలికెను.

అంత నతడు నన్నా శైలాత్యగ్ర శిఖరభాగమునకు గొనిపోయి, యచ్చట గూర్చుండజేసి, "తూర్పుదెసకు నీదృష్టి బ్రసరింపుము. అందు నీకేయది గోచరంబగునో నాకు దెలుపు" మని చెప్పెను. నేనట్లుచూచి, రెండుకొండలనడుమ నొకలోయయు దానిగుండ బుష్కలముగా బ్రవహించుచుండిన యొక ప్రవాహ

మును గానవచ్చుచున్నవని చెప్పితిని. అంత నీవు చూచుచున్న లోయ దుఃఖముల లోయ యనియు, నీవు చూచుచున్న ప్రవాహము కాలమను మహాప్రవాహములోని యొక భాగమనియు నతఁడు నాకు వ్రాకుచ్చెను. నేను జూచుచుండిన ప్రవాహ మొకతట్టున దట్టమగు మబ్బులో లయమగుచుండుటకుఁ గారణమేమని వారి నడిగితిని. అంతట నమ్మహానీయుండు "మీర్జా! నీవు చూచుచున్న ప్రవాహము సూర్యునిచేఁ బరిమితమై 'కాల'మను పేరుగల యనంతత్వములోని యొక భాగమై సృష్టి యారంభము నుండియు నిటు తుదవరకుఁ బ్రవహించుచున్నది." అని పలుకులు చెప్పి "రెండు కొనల నంధకారముతోఁ జుట్టఁబడిన యీ ప్రవాహమును బరీక్షించి యందు నీవేమి కనిపెట్టెదవో నాకెఱిఁగింపు" మని యాజ్ఞాపించెను. ఆప్రవాహము నడుమ నడ్డముగ నొక వంతెన నాకుఁ బొడకట్టుచున్నదని యంటిని. తోడనే యతఁడు, "నీవు చూచుచున్న యావంతెనయే మానవ జీవితము, కావున దానిని శ్రద్ధగాఁ బరిశీలింపు" మన నేను మతింత సావధానముగఁ బరీక్షించితిని. అప్పుడు సంపూర్ణమైనవి డెబ్బదియు మఱికొన్ని శిథిలమైనవియుఁ గలసి రమారమి ధనురాకారముగల నూఱు కానాలతో నావంతెన నిండియుండుట నేను గనిపెట్టితిని. అట్లు కనిపెట్టి యానూటిం గని నేను లెక్కించుచుండ, నా ప్రతిభావంతుఁడు ప్రారంభములో వంతెన యొక వేయి కానాలతో నిండియుండెననియు నొక పెద్దవరద తక్కినవాని నన్నింటిని గొట్టుకొనిపోయి యావంతెన నిట్టి శిథిలావస్థలో విడచెననియుఁ జెప్పి యావంతెన నివిఁకను నేమి కనిపెట్టితివో చెప్పుమని యడిగెను. అవ్వంతెన పై గుంపుగుంపులుగ మానవులు నడచిపోవుచున్నారనియు దాని రెండుకొనల యందును నీలజీమూత జాలములు గ్రమ్ముకొనియున్న వనియు నేనంటిని. ఇంకను బరిశీలింప నవ్వంతెనపైనుండి బాటసారు లనేకులు క్రిందఁ బ్రవహించుచుండిన ప్రవాహములో జారి పడుచుండుట నాకుఁ గానవచ్చెను. అంతకంటెను బరీక్షింప నావంతెనయందు గుప్తములైయున్న యనేక మాయ కవాటములు నాకుఁ గన్పడినవి. దానిపయిని బాటసారులు కాలిడినంతనే యమ్మాయ కవాటములనుండి జారి ప్రవాహములోఁ బడి మాయమగుచుందురు. ఈ రహస్యకూపము లావంతెనకు ముఖద్వారమునందే దట్టముగఁ గానవచ్చుచుండెను. అందుచేతనే గుంపు గుంపులగు జనులు మబ్బునుండి దాటినంతనే వారిలో ననేకులు క్రిందఁ బడిపోవుచుండిరి. ఈమాయ కూపములు వంతెన నడుమ నంతగా లేవుగాని శిథిలము కాని కానాల చివరవైపున దట్టముగను దగ్గర దగ్గరగను నుండెను.

కొందరు మనుష్యు లాశిథిలము కాని కానాలపైఁ గుంటి నడకలతో నడచి, దూరపునడకచే మిక్కిలి యలసి యాడిగిలబడుచు నొకరివెనుక నొకరు ప్రవాహములోఁ బడిపోయిరి. కాని వారిసంఖ్య లెక్కకు మిక్కిలి తక్కువ.

ఆ యద్భుత దృశ్యమునుగూర్చియు నందలి గొప్ప విచిత్ర వస్తువులనుగూర్చియు యోచించుచు నేను గొంతసేపు గడపితిని. ఆనందోత్సాహచిత్తులైన యనేకు లాకస్మికముగఁ గ్రిందకు జారిపోయి తమంతట దాము రక్షించుకొనుటకుఁ జెంతనున్న దానినెల్లఁ బట్టుకొనుచుండుట చూడఁగా నాహృదయము దీర్ఘవిచారాయత్తమైనది. కొంద ఱాలోచించుచున్నట్లు లాక

నముపంక జూచుచు నయ్యాలోచనము నందే పాదములు జారి క్రిందబడి దృష్టిపథమునుండి తప్పిపోవుచుండిరి. అనేకులు తమముందరఁ దళ తళలాడుచు నాట్యమాడుచున్న నీటిబుగ్గల నూ తగాఁగొనుటకు మిక్కిలి ప్రయత్నించి వానినందు కొంటిమని యనుకొనునరికిఁ దటుకుగా వడు గులు తడబడఁ గ్రింద మునిగిపోవుచుండిరి ఇట్టి యల్లకల్లోలమైన స్థితిలో నవ్వంతెనపై నిటు నటుఁ బరుగిడుచుండిన కొందరు ఖడ్గపాణులు నాకంటఁబడిరి. వారు బాటసారుల ననేకులఁ దారిలోఁ గానరాని మాయకవాటములమీఁదకు ద్రోసి వేయుచుండిరి. ఆ బాటసారులట్లు బల వంతముగఁ ద్రోసివేయబడని యెడలఁ బాపము వారు ప్రాణములను దక్కించుకొనియే యుం దురు.

ఇట్టి విచారకరములగు విషయములయందు నేను లీనమైయుండ నన్నా ధీమంతుడు వీక్షించి "దీనివిషయమై చెప్పవలసినదంతయుఁ జెప్పితిని. ఇంక నీదృష్టి వంతెనపైనుండి మరలింపుము. నీకింకను బోధపడనివిషయ మేమైన నున్న యెడల నన్నడుగు" మని చెప్పెను. అంతట నేనూర్ధ్వ దృష్టి నిగుడించి యెడతెగకుండ నీపక్షులు పెద్ద పెద్ద గుంపులుగఁగూడి వంతెనపైఁ జుట్టుదిరుగుచు మాటిమాటికి దానిపై వ్రాలుచున్నవి. గ్రద్దలు, గండభేరుండములు, మాల కాకులుకూడ కొం గలు మున్నగు ననేక పక్షిజాతులతోఁ గలసి నడుమనడుమ॥ గానాలపై రెక్కలుగల చిన్న బాలురనేకులు కూర్చుండియున్నారు. దీనికంతకు నర్థమేమని నేనడుగ నాసుధీమణి యివి మానవ జీవితమును బీడించునట్టి యసూయ, దురాశ, మూఢవిశ్వాసము, కామము మొదలగు వ్యస నములని నాకెఱింగించెను.

నేనంతటఁ బెద్ద నిట్టూర్పువిడిచి, ‹అయ్యో! మానవజీవితము వ్యర్థమైనది. మానవుడు కష్ట ములకుబాలై జీవితకాలమంతయు బాధపడుచు మృత్యువుచే నెట్లు మ్రింగబడుచున్నాడు!' అని యనుకొనుచుండ నా ప్రజ్ఞావంతుడు కనికర ముతో నావంకఁ దిరిగి కష్టదాయకమైన యా ప్రదేశమును మఱి చూడవలదని నాకాజ్ఞాపిం చెను. "అంతములేని జీవయాత్రను ప్రారం భించుటయందు నిది మానవుని ప్రారంభావస్థయై యున్నది. ఈ ప్రవాహ మనేక తరములనుండి తనలో బడుచున్న మానవుల నెందులోనికి గొని పోవుచున్నదో యా దట్టని పొగ మంచువంక నీదృష్టి మరలింపుము." అని పలుక నేనాజ్ఞా పింపబడినట్లే నాచూపు నావైపు మార్చితిని. అమ్మహానీయు డేదేనమానుషశక్తిచే నాకన్నుల బలపరచెనో లేక యింతవరకుఁ బ్రవేశింపసాధ్య ముగాక దృష్టికి మిక్కిలి దట్టముగ గనబడు చుండిన యా పొగమంచును జదరగొట్టెనో కాని నేను జూచునరికి గొండలవడుమనున్న యాలోయ యావలివైపుకొన మహాసముద్రముగా వ్యాపించి నది. ఆ సముద్రమును రెండు సమ భాగము లుగా భాగించుచు దాని మధ్యనుండి బ్రహ్మాండ మైన వజ్రపుగొండ యొకటి యావరించుకొని యుండెను. ఆ సముద్రములోని యొకసగము మంచుతో గప్పబడి యుండుటచే నందలి విశే షము లేమియుఁ గనిపెట్టుట కవకాశము లేద య్యెను. రెండవ సగము భాగము మహోన్నత ద్రివ వలె నాకుఁ గనబడుచుఁ బుష్పఫలాలం కృతములయిన యసంఖ్యాక ద్వీపములతో నిండియుండెను. భాసమానములగు చిన్నచిన్న సాగరము లొక వేయి ద్వీపములచుట్టు నావ రించి యుండెను. పిమ్మట దివ్యాంబరధరులును

గుసుమమాలికాలంకృత శిరస్కులునగు పురుషులను నేనందు జూడగలిగితిని. కొందరు వృక్షముల మధ్య విహరించుచుండిరి. కొంద ఱాటగడ్డల ప్రక్కలఁ బరుండియుండిరి. కొందరు పూలపానుపులపై విశ్రమించుచుండిరి. పాడుచుండిన పక్షులయుఁ, బ్రవహించుచుండిన ప్రవాహములయు, మానవ కంఠములయు, వాద్య విశేషములయు వివిధవిధ నాదములచే సమ్మిళితమైన మనోహర మధుర గాన స్వరమును నేను వినగలిగితిని

ఆ రమణీయ పరిదర్శన సందర్శనమున నా హృదయ మూరక యుప్పొంగసాగెను. ఆదివ్య సుఖ ప్రదేశముల కొక్కమారెగిరి పోవుటకై గరుడ పక్షి రెక్కలు నాకున్న బాగుండునని ముచ్చటపడితిని. కాని నేనుజూచిన యావంతెనపైఁ బ్రతిక్షణము తెరువబడుచుండిన మృత్యుకవాటములుతప్ప నా దివ్యప్రదేశమునకు మఱియొక మార్గము లేదని యామేధావి నాకెఱింగించెను. మఱియు, నీయెదుట గ్రొత్తవిగను, నాకు పచ్చనివిగను నుండి సముద్రమునం దంతట గనుచూపుమేరఁ జుక్కలుపెట్టినట్టు కన్పట్టు ద్వీపములు సముద్రపుటొడ్డున నిసుక రేణువులకన్న నధికసంఖ్యాకములు. ఇవియేగాక, వీనివెనుక నీ దృష్టిచేగాని, నీ మానసముచేగాని కనిపెట్ట జాలనంత దూరమువరకు నింకను ననేకములగు ననంఖ్యాకములయిన ద్వీపములున్నవి సజ్జనులు మరణానంతమున నివసించు సుఖ ప్రదేశములివియే. వారు తమ జీవితకాలములోఁ జేసిన సుకృతముల తారతమ్యములను బట్టి యాయా ద్వీపములయం దుంచబడుచుందురు. వారివారి సుకృత విశేషములకుఁ దగినయట్లు వివిధ సౌఖ్య భేదములుగల వసతులచే నా ద్వీపము లలంకరింపబడి యుండును. ప్రతి ద్వీపము నొక్కొక్క సత్పురుషుని సుఖావాసము కొరకు నిర్మింపబడిన యొకొక్కకస్వర్గమని తెలిసికొనుము. ఓయీ! మీర్జా! మానవులకియ్యవి ప్రయత్నింపదగినవి కావా? ఇట్టి మహనీయ శాశ్వత బహుమానమును సంపాదించుట కవకాశమునిచ్చు మానవజీవితము నీకు సంతాపకరమైనదా? ఇట్టి సుఖప్రదేశములకు నిన్నుఁ గొనిపోవు మృత్యువు భయపడదగినదా? తనకొరకిట్టి శాశ్వత మహోన్నత పదవి సదాసిద్ధమైయున్న నరజన్మము వ్యర్థమైనదా?" అనిపలుక నే నపరిమితానందముతో నా సుఖ ద్వీపముల వంక దేఁచూచిచూచి "ఆర్యా! ఆ వజ్రపుగొండ కావలి సముద్ర మగపడకుండఁ గప్పివేసిన దట్టమగు మేఘములయందలి రహస్యములను నాకెఱింగింపు" మని వేడితిని. కాని యా ప్రతిభావంతుడు నాకుఁ బ్రత్యుత్తరమీయలేదు. మరియొకమారడుగనెంచి వానివంకఁ దిరిగితిని. కాన యమ్మహాత్ము డదృశ్యుఁడయ్యె. ఆదివ్య ద్వీపములనైన మఱియొకమారు చూడ నావంకకు దిరుగ, ప్రవహించుచుండిన యా ప్రవాహమునకును, ఆ కానాల వంతెనకును, ఆసుఖద్వీపములకును మాఱుగ బ్రాంతములయందు మేయుచుండిన యెద్దు, గొఱ్ఱెలు, ఒంటెలుగల బాగ్దాదు పట్టణపుఁ బెద్ద లోయ తప్ప నింకేమియు నాకుఁ గానరాలేదు.

# పద్మరహస్యము.

—— ఇరువదియారవ ప్రకరణము ——

శాంత దోషము.

సుధీంద్రుడు నరేంద్రబాబుయొక్క శెలవుగైకొని తనగదిలోని కేగెను. ఆగదియందు శాంతప్రక్కను క్రిందపడియున్న పద్మనుగాంచి కంపితుడయ్యెను. "శాంతా, శాంతా, నాకల నేడు నిజమైనది." అని పద్మ విలపించుచుండెను. ధైర్యము తెచ్చుకొని సుధీంద్రుడు తన యర్ధాంగిని లేవనెత్తి "ఏమిరానున్నను రానిమ్ము. మనమిర్వుర మేకమై యెదుర్కొనెదము" యని యూరడించెను.

పద్మ తన భర్తయొక్క వదనము నొకపరి వీక్షించినది. "నాయందంత దయచూపకుడు. నేను నిర్భాగ్యురాలను. మిమ్ములను వివాహమాడుటకుపూర్వము నేను మరణించియుండిన యెడల నెంతయో యదృష్టవంతురాలనై యుందును" అనెను. పద్మయొక్క అహంతుత్తునియలయినది. ఆశ్చర్యముతో నామెవంక చూచి "ఈ యల్లికకథను నమ్మితినని యేమాత్రము తలపకుము న్యాయస్థానములే లేనియెడల నీకు దోషము నాపాదించిన నరేంద్రుని నాలుకను ఖండఖండములుగ జీల్చివేసి యుందును." అని సుధీంద్రుడనెను. ఈవాక్యములయొక్క యంతరార్థమును గ్రహింపలేక పద్మ విచారమునసైత మొకింత యాశ్చర్యముతో దన భర్తవంక తేరపారచూచెను.

శాం:- ఆర్యా, తమ భావమును పద్మకు మరింత ప్రస్ఫుటము జేయుడు.

సుధీం:- పద్మకే తెలియును. మా జీవితమున నిదియొక్కటియే కష్టము. మరేదియును లేదు. దీనిని గడుపగల్గినచో సర్వము గట్టెక్కును.

శాంత సుధీంద్రునివంక జూచినది. ఆమె గుండె దడదడ కొట్టుకొనుచుండెను. కాళ్ళును చేతులును చల్లబడినట్లయినది. తన భర్తకు శశిభూషణుని వృత్తాంతము తెలిసినదని పద్మ యూహించినది.

సుధీం:- పద్మా, యీ కథను నేను నమ్మను. నీయందు నాకుగల విశ్వాసము ప్రేమ యింత మాత్రమున నశించలేదు. ఆకస్మిక పరిస్థితులవలన నీపై దోష మారోపింపబడినది గాని వేరుకాదు. నాయందు నమ్మకముంచి నిర్భయముగ నీ హృదయమునం దుండు వృత్తాంతమును వెల్లడిపరుచుము.

పద్మతల మరింత వంగిపోయినది. దుఃఖము వెల్లువయై పొంగినది.

సుధీం:- శాంతా, ఇందలి నిజవృత్తాంతము నెరుకపరచుము.

శాం:- (కాగితమును సుధీంద్రున కిచ్చి) ఈ కాగితమువలననే పద్మ భయము హెచ్చినది.

సుధీంద్రుడా కాగితమును విప్పి చదివెను. వసంత విలాసమునువదలి తన ప్రాణమును గాపాడుకొనుమని యెవరో పద్మకు వ్రాసిరి. వ్రాసిన వానినిగురించి సుధీంద్రున కొంత యనుమానము గలిగెనుగాని తన భావమును వెల్లడి చేయక నిట్లనెను. "ఈ కాగితమునకేనా భయము. ఆ ఛండాలుడు నరేంద్రుడీపన్నాగమును పన్నినాడు. నిరపరాధియగు నీపై నేరము మోపినాడు. ఈ విషయమై నేను ఫిర్యాదింపతలచియే యిక్కడకు

వచ్చితిని. శాంతా, ఇందులో నేసంశయమును లేదు."

పద్మ:- నేనెందుకు వసంతవిలాసమును వదల వలయునో నాకర్థమగుట లేదు.

సుధీం:- పద్మా, అంతయు నీలోనే యున్నది నిజవృత్తాంతము తెలిపినచో, సర్వము పరిష్కారము కాగలదు. నీమంచి కోరు వా రెవరో యీచిన్న జాబును వ్రాసియున్నారు.

పద్మ:- ఇదంతయు నాకర్థమగుటలేదు.

సుధీం:- కాళీచరణుని మరణమునుగురించి నీకు తెలుసునుగదా!

పద్మ:- అవును. దానికిని నాకును సంబంధమేమి?

సుధీం:- అపరాధపరిశోధకుడుగనున్న నరేంద్రబాబు అనేక మారువేషములు వేసి యిచ్చట ననేక విషయములను గనిపెట్టియున్నాడు.

పద్మ:- ఆసంగతి ముందుగ నాకేల తెలిపియుండలేదు.

సుధీం; ఎందుకు తెలుపవలెను? నీకు విచారమెందులకు? ఆవిషయము నెవరికి తెలుపవలదని కోరియుండుటచే, నేను తెలుపలేదు. ఇటువంటి వార్తలు తెలిపి నిన్ను కలవరపరచుటయును నాయుద్దేశ్యము కాదు.

పద్మ:- మాకు తెలిపియుండిన బాగుగనుండెడిది.

సుధీం:- ఈనరేంద్రుడు పట్టి తెలివితక్కువవాడు. అతని యనుమానము నీపయి నున్నది.

పద్మ:- నన్నను మానించుటయా?

సుధీం:- నీవు కొంచెము ధైర్యముతో సంచరించవలసియున్నది. నీచేతి గాజుముక్క చెట్టుక్రింద దొరికినది.

పద్మ:- ఇంకను యితర ఋజువులేమి దొరికినవి?

సుధీం:- నీ బీరువాలో నెత్తురు మరకలతో కూడిన చీర యొకటి దొరికినది.

పద్మ:- మఱి!

సుధీం:- కాళీచరణుని జేబులో "పద్మరహస్యము" అని చీటీకనపడినది. పద్మ భరింపలేకపోయినది. దుఃఖములో మునిగి "నారహస్యము బయల్పడినది" అని మూర్ఛిల్లెను.

శాం:- పద్మా, నిరుత్సాహపడకుము. నీవు నిరపరాధివి, సర్వము చెప్పివేయుము.

సుధీం:- శాంతా, దీని యర్థము విశదపరుపుము.

పద్మ:- నేను నిరపరాధిని. నేను హత్య చేయలేదు. హత్య జరిగిన రాత్రి యాస్థలమున నేనున్నమాట వాస్తవము.

సుధీం:- అచటనుంటివా! నేను నమ్మను. నీకు పిచ్చియో, కలయో!

పద్మ:- నాకేదియును లేదు. శాంతా, నీవు చెప్పుము.

శాం:- పద్మ చెప్పినదంతయు నిజము.

పద్మ:- నిజము. నన్ను రమ్మని వ్రాసినారు. నేను వెళ్లితిని. అపాయము జరుగునని యూహించలేదు. అపుడా గాజుముక్క యచటపడియుండవచ్చును. అచట నేనెంతకాలముంటినో చెప్పలేను. ఎవరో నన్ను పట్టి గాల్చిరి. కాళీచరణుని దేహమునుండి రక్తము నా చీరపైకి చిందినది.

సుధీ:- తరువాత?

పద్మ:- అతను క్రిందపడినాడు. నేను వంగి చూచుటకు ప్రాణము పోయినది.

సుధీ:- అచట నితరులెవరును కనపడలేదా?

పద్మ:- లేదు. అతని ప్రాణము పోవుటకు నాకు మనసొప్పినది, యింటికి చేరుకొంటిని. గాజు

ముక్కునుగురించిగాని, నాభర్తనుగురించి కాని నేటివరకు నేయాలోచనయు లేదు.

సుధీం;- పద్మా, అపుడే నాకీసంగతి యేల తెలుపలేదు? ఇట్టి యనుమానము కలుగకుండ చేసియుందును. నాయందు నీకు నమ్మక మేల యుండకపోవలెను?

పద్మ;- నిజమే. ఆసంగతి చెప్పిన యెడల యెందుకు నేను వెళ్ళవలసివచ్చినది చెప్పవలసి యుండును. అందొక రహస్యమున్నది.

సుధీం;- పద్మా, ఆరహస్యము నాకు తెలిసినది. నీవు కడు ధైర్యవంతురాలవు. కాళీచరణుని కలుసుకొని నీసోదరి శాంతను కాపాడదలచితివి. దుఃఖింపకుము. నీసోదరికొరకు త్యాగము చేసితివి. శాంతా, నీ భారమంతయు పద్మపై వేయుట న్యాయమని తలచితివా? నీరహస్యము నెరింగితిని. అనేకసంవత్సరముల క్రితము శశిభూషణుడు నీకు జన్మించినాడని నాకు తెలియును. పద్మా, భయపడకుము

పద్మ యేమియో యనవచ్చెను. కాని శాంత యామెను వారించెను.

శాం;- పద్మా, నన్ను నిందించుటకు హేతువున్నది.

సుధీం;- ఇపుడది రహస్యము కాదు. నరేంద్రుడీ రహస్యమును కనిపెట్టి గోరంతలు కొండంతలు చేయుచున్నాడు.

శాంత;- అవును. ఇందే మాత్రము సత్యము లేదు.

సుధీం:- శాంతా, నీవు నన్ను నమ్మవలసినది. చూడుము పద్మకెంతదురవస్థ తెచ్చిపెట్టితివో! శాంతా, నిన్ను నేను నిందించను. పద్మకు నీయందుగల యనురాగ మట్టిది

శాంత సుధీంద్రునివంక తిరిగి నమస్కారము చేసినది. సుధీంద్రునకు పద్మపై ననుమానము లేదుగదా యని సంతసించినది. తన సోదరి యొక్క పాపమును తాను భరించుటకు సంసిద్ధురాలయినది. నరేంద్రుడవ్యక్తముగ తన్నను మానించినందులకు నవ్వుకొనినది "పద్మయొక్క యాత్మగౌరవముకొరకు నేను దానిని భరించెదను. నాకు భర్త లేడు. పిల్లలు లేరు. ఏకాకిని. నావలన యెవరికిని నష్టము లేదు. పద్మకు భర్తయు పిల్లలు నున్నారు. పద్మకగౌరవము కలిగిన చిక్కులు కలవు" అనుకొనినది.

సుధీం;- శాంతా, నేను నీసోదరి భర్తను గనుకను నాయింట్లో నీవుకూడ కలిసిమెలిసియుండు చున్నందునను, నాకుటుంబగౌరవము కొంతవరకు నీయధీనము చేయబడినందునను, నీవిపుడు నిజమునుదాపక వెల్లడిచేయవలసియున్నది. శశిభూషణుడు నీకుమారుడేనా?

శాం;- నేను ప్రత్యుత్తరమియ్యజాలను.

సుధీం;- పద్మ నిష్కళంకురాలు కుటుంబము గౌరవప్రదమైనది. అటువంటి కుటుంబముతో నీకు సంబంధముండదగునా?

శాంత:- మీకు నన్ను ప్రశ్నించుట కధికారమున్నది. కాని నేనుమాత్రము జవాబియ్యజాలను

సుధీం:- శాంతా, నీవు మాగృహమును వదలి వెళ్ళిపొమ్ము

శాంత:- అట్లనే వెళ్ళెదను.

సుధీం:- నీరహస్యములతో నాకు పనిలేదు. నీవు వెళ్ళక తప్పదు.

శాంత:- మీరు నన్నింతవరకాదరించితిరి. అందులకు కృతజ్ఞురాలను. మీరు చెప్పినప్రకారము వెళ్ళిపోయెదను. పద్మతో నైదునిమిషము లేకాంతముగ మాట్లాడ ననుజ్ఞనిండు

కళంకమైన జీవితము గలవారు గౌరవకుటుంబముతో నేకాంతమున మాటలాడరాదని సుధీంద్రుడు తలచెను. కాని కడసారి కోరిక గనుక మన్నించక తప్పదు. సుధీంద్రుడు డాగడినివదలి వెళ్ళెను.

శాం:- పద్మా, పద్మా, నేను చెప్పునది వినుము. భయపడకుము. నీబిడ్డ చనిపోయెనని కాశీ నగరములో చెప్పితిని. ఆబిడ్డ చనిపోలేదు. నీకొరకే యిట్లు చెప్పితిని. శశిభూషణుడే నీకుమారుడు. నన్ను క్షమింపుము

పద్మ:- నీవెల్లపుడు దయతో సంచరించితివి. కాని శశిభూషణుడు నాబిడ్డయని నాకు తెలియదు.

శాం:- మొదట నీవెవరిని ప్రేమించితివో తెలువవైతివి. ప్రపంచమున నొక సంసారమున నీవు ప్రవేశించి యథేచ్ఛగ కాలముగడుపుటకు నేనీభారము వహించితిని. దూరమున నుండియే శశిభూషణుని కనిపెట్టి సహాయము చేయుచు వచ్చితిని.

పద్మ:- నీవీభారమును భరించుట కష్టము. నా కొరకు నీవు కష్టపడుట, నేను చూచి యూరకుండుట, తుచ్ఛము.

శాం:- నీరహస్యమును బయలుపెట్టకుము. నే నేకాకిని. నాకేమి సంభవించినను భయము లేదు.

## —♦ ఇరువదియేడవ ప్రకరణము ♦—

### "పద్మరహస్యము."

ఇంతలో సుధీంద్రరాయలు సుముఖిని వెంటనిడికొని యచటికి కేతెంచెను. పద్మ కాశ్చర్యము జనించినది. సుముఖి నిదివరకామె చూచియుండలేదు. శశిభూషణుడును కాళీచరణుడును తమ తల్లియగు సుముఖిని గురించి ముచ్చటించుచుండెడివారు కాని, సుముఖినామె జూచుట సంభవించలేదు. సుముఖియొక్క రక్తవిహీనమగు తెల్లదనము, పట్టుదల సూచించు నేత్రములు, లోని దుఃఖమును నొక్కిపెట్టుచున్న పెదవులు, వీటినిగాంచి యామె సుముఖియైయుండునని పద్మ గ్రహించినది. శాంత చూచినది. భయసంభ్రమములనోని వ్యోరపాటు చెందినది సుముఖిని పలుకరించ యత్నించినది కాని, సుముఖి మాత్రము అటు చూడక నాసరి పద్మను సమీపించి "మీకేమి యపకృతి చేసితినని నాకిట్టి దురవస్థ తెచ్చిపెట్టితిరి. నీబిడ్డను పెంచి పెద్దవానిని జేసితిని. నాయేకపుత్రుని చంపివేసితిరి. మీ గౌరవము మీ క్షేమము కొరకు నేను పాటుపడితిని. నాకుమారుని మీ పొట్టను పెట్టుకొంటిరి" అనెను.

సుధీంద్రరాయలు భయసంభ్రమములతో వీక్షించుచుండెను పద్మ తలయెత్తి సుముఖి వంక నొకసరి చూచినది.

పద్మ:- నీవు పొరబడితివి. మనోవాక్కాయకర్మలయందు నీకుమారుని కెహాని యు నేను కలుగజేయలేదు. అందుకు భగవంతుడే సాక్షి.

సుము:- అది యసత్యము. మీరిద్దరేకమై యీ ఘోరకృత్యము చేసియున్నారు. మీకుతప్ప మా వాడి జీవితముతో నితరులకేమి సంబంధము గలదు?

పద్మ:- నీవు చాల పొరబడుచున్నావు. కొంతకాలమైనపిమ్మట చింతించెదవు. దుఃఖములో మునిగి యిష్టమువచ్చినట్లు నిందించుట యన్యాయము. నీకు నే నెందుల కపకారము గావింపవలెను,

సుమ:- నీరహస్యమును దాచుకొనకుము.

సుధీం: నీవు చాల పొరబడుచున్నావు. రహస్యము శాంతదిగాని పద్మది కాదు శాంతయే శశిభూషణుని తల్లి

సుమ:. (వికటముగ నవ్వుచు) వీరిరువురు మిమ్ముల మోసగించుచున్నారు. మీరు గొప్పవారు భాగ్యవంతులు. పద్మావతియే శశిభూషణుని తల్లి ఇది నా మాటకు నిజము.

సుధీం:- ఇది యబద్ధము. నోటికి వచ్చినట్లెల్ల పేలుచున్నావు.

సుమ:- నేను చెప్పునది మా మాటకు నిజము

శాం:- ఆర్యా, యీ మోసమాటల నమ్మకుడు దోషిని నేనే. శశిభూషణుడు నా కుమారుడు.

సుధీం:- ఇదంతయు నాకు బోధపడుటలేదు. నాచుట్టును మోసముతప్ప వేరు గాన్పించుటలేదు.

సుమ:- ఆర్యా, నేనసత్యము పలుకుటకు కారణము లేదు. కాశీనగరమున గుప్త సత్రము నందు నేను గాంచినది పద్మయొక్క వ్యాధియే. ఆమెయే ప్రసవించినది. కావలసిన యెడల నచటనున్న డాక్టరు బోసుగారి నడుగవచ్చును. అచటనే శశిభూషణుని నాకు నప్పచెప్పినది.

సుధీం:- తరువాత?

సుమ:- ఆబిడ్డను చుట్టియున్న వస్త్రములలో నింటివద్ద నొక పురుషుని చిత్రపటమును గాంచితిని. ఆచిత్రముపై "రామానంద బాబు" అను నక్షరములున్నవి. ఇదిగో ఆచిత్రపటము (అని యొక పటమును సుధీంద్రుని కందిచ్చెను.)

ఈ వాక్యములను వినగానే శాంత ప్రాణములు పైకిలేచిపోయినవి. పద్మ తన కంత్యదశ సమీపించినట్లు తలంచి యిక దాచిన లాభము లేదని తనకథ నిట్లు విశదీకరించెను.

"శాంతా, గత వృత్తాంతమును జ్ఞప్తికిదెచ్చుకొనుము. మన యింటికి పూర్వము రామానంద బాబు వచ్చుచుండుట నీ వెరింగియే యున్నావు. మీ యిరువురికి గల యన్యోన్య ప్రేమ నే నెరుగుదును. ఆయన కలకత్తా విశ్వవిద్యాలయములో ఎం. ఏ. పరీక్షయందు తీర్ణుడగుటయు సింగ్లాండునకుబోయి ఐ సి యస్. చదువ సంకల్పించుకొనుటయు నీ నెరింగిన యంశములే. నీకొరకై మన యింటికి వచ్చునపుడు నేను చూచుటయు మీ యిరువురికి గల ప్రేమ చేతనే నేనును సహృదయముతో నాయనను జూచుటయు సంభవించినది ఆయన నాకంటె పదునైదు వత్సరములు పెద్ద. ఆయనను నేనొకపరి కలిసికొనినట్లుగ నీతో చెప్పెదనంటిని. ఆయన నన్నంగీకరించెను. ప్రథమములో మేమిరువురము నిన్నుగురించియే మాటాడుకొనుచుండెడివారము. ఒక నాడు సంభాషణలో నాయన నన్ను ప్రేమించినట్లు దెలిపెను ఆయన ముఖవర్చస్సు చూచినను, నేత్రముల తీవ్రత బట్టి చూచినను, నన్నాయన ప్రేమించినట్లు మరి యొక పురుషుడే స్త్రీని ప్రేమించి యుండడని నాయుద్దేశ్యము. నేను బాల్యదశయందే యుండుటచే, నవ్యక్తతచే పొరబాటు గావించితిని. ఇదంతయు నొక కలవలె గాన్పించినది. ఆయన నన్ను ప్రేమించెను, పూజించెను, అహోరాత్రములు నన్నారాధించెను ఆయన గొప్ప మేధావి. నేనో ప్రపంచము నెరుగని యౌవనవతిని. మొదటలో గొప్పవారియెడగల యాను

నున్నది. యథావిధిగ జరిగిన వివాహమును టకు శంకించవలసిన పనిలేదు. త్వరలోనే శశిభూషణుని లలితమోహనుని వారసుదారునిగ వెల్లడిచేసి యాస్తినివశపరచుకొనవచ్చును." అని సుధీంద్రరాయలనెను. ఈ తాత్కాలికోపశమనముతో వసంతవిషయమును మరచిరి. పద్మయొక్క నిర్దోషిత్వమును మరునాడు న్యాయస్థానమున వెల్లడిచేయుటెట్లు?

---

## ఇరువది యెనిమిదవ ప్రకరణము

### నేను దోషిని.

న్యాయస్థానమునందు జనులు క్రిక్కిరిసియుండిరి. సుధీంద్రరాయలువంటి ధీమంతునియొక్క సంసారమునకు వాటిల్లిన ముప్పులను గురించి యోచించుకొనుచు నచటివారెల్లరును చింతింప సాగిరి. న్యాయాధిపతి పద్మపై నేరారోపణ గావించెను. సాక్ష్యము బ్రబలమై యున్నది. తన భార్యపై బడిన కళంకమును దుడిచివేయుటకు సుధీంద్రరాయలకు సాక్ష్యము దొరకదయ్యె. అయిదు నిముషములలో పద్మకు మరణదండన విధించెదరు. పద్మయు దన జీవితముపై నిరాశచేసికొని మరణదండన ననుభవించుటకు సంసిద్ధయై యున్నది. ఈ తరుణములో శశిభూషణుడు కానరాలేదు. నాటికి రెండు మూడు దినములకు పూర్వము శశిభూషణుడు గ్రామాంతరమునకు నెచటికో పోయి యుండెను. కడసారి తన ముద్దుల పట్టియగు శశిభూషణుని కనులార వీక్షింపగ సంతృప్తిజెంద పద్మ యభిలషించెను. ఈ శోకములో, ఆత్మవిచారములో మునిగి యోచనా పరంపరలలో నోలలాడుచున్న పద్మకు అయిదు నిముషములును అయిదు సెకనులుగ గడచిపోయెను. అవతి కాలములో న్యాయాధిపతియొక్క తీర్పు వెల్లడి కాగలదు. ఘోరప్రళయమునకు పూర్వమావరించియుండు శాంతము నిశ్శబ్దత లచట గోచరమగుచున్నవి. ఇంతకును కారణ మొకటియే. తాను నిర్దోషి యైనప్పటికిని, తనజీవితము నిష్కళంకమైనప్పటికిని, తనయొక్క ప్రథమ జీవితమును రహస్యముగ నుంచుటవలన గలిగిన ఫలిత మిదియేనని పద్మకు బోధగట్టినది. అబలలకు సహజముగ నుండు "స్వల్పవిషయములను గప్పిపుచ్చుట" యనెడి లక్షణము పురుషుల హృదయములతో ననుమానాంకురము గావించి వారి సంశయమునకు బలువలు పలువలు నొసంగి ప్రాణహానియు, మానహానియు దెచ్చిపెట్టుకొని యనవసరపు గష్టములకు లోనై యవ్యక్తు లగుచుందురని పద్మకు గోచరింపకపోలేదు. ఇంతలో న్యాయాధిపుని గంట గణగణ మ్రోగినది. తన యవసాన దశను స్మరణకు దెచ్చుకొనిన పద్మ భయకంపితయై మూర్ఛిల్లినది.

ఇంతలో శశిభూషణుడొక స్త్రీవ్యక్తిని వెంటనిడుకొని న్యాయాధిపుని యెదుట బ్రత్యక్షమయ్యెను. లేచి తన తీర్పును చదువనున్న న్యాయాధిపునుద్దేశించి, "న్యాయాధిపా, తాము తీర్పు నొసంగుటకు పూర్వ మీ మెయొక్క వాక్యముల నాలకింప బ్రార్థించుచున్నాను" అని శశిభూషణుడనెను. ఈ స్త్రీవ్యక్తి మన కపరిచితురాలు కాదు. కాళీచరణు డెవరిని ప్రేమించి ప్రణయ వృక్షమునకు దోహద మొసంగెనో, కాళీచరణు డెవరిని మోసగించి తన మనోభీష్టమును నెరవేర్చుకొన చూచెనో అట్టి యానంద న్యాయాధిపుని సమక్షమున నిపుడు నిజ వృత్తాంతము క్రిందివిధముగ విశదీకరించెను.

"అపరాధ పరిశోధకులును, రక్షకభటులును

దోషము నెవరిపైననో యొకరిపైన మోపుటతో సంతృప్తి చెందుచున్నారేకాని తగిన శ్రద్ధాభక్తులతో సంచరించి నిజ వృత్తాంతములను గనిపెట్ట గల సామర్థ్యత లేకయున్నారనుట నిక్కువము.

పగిలిన గాజు ముక్క, రక్తసిక్తమైన దుస్తులు, పుత్రి మరణముచే శోకించుచున్న సుముఖి వాక్యములు వీటిని గైకొని దోషము నంతయు పద్మపై బడవైచిరి. కాళీచరణ రాయలొక యువతిని ప్రేమించుటయు, నామె కొరకు కుత్రిమ యత్నముల ధనమును సంపాదించుటయు, ధనము లభించిన తోడనే తానిదివరకు ప్రేమించి యున్న యామెను వదలి మరియొకరిని ప్రేమించుటయు, నీనూతన ప్రణయములో నామెను మరచుటయు, నామె కాళీచరణ రాయలపై పగ దీర్చుకొనుటలో నాశ్చర్యము లేకపోవుటయు నీ జాబులవలన విశదము కాగలదు

న్యాయాధిపుడా జాబులను గైకొని నామూలాగ్రముగ జదువుకొని యాశ్చర్యపడెను.

న్యాయాధిపా కాళీచరణరాయుల మరణమునకు గారకురాలను నేను, కర్తనుకూడ నేనే. నిరపరాధియు నమాయకురాలు నగు మరియొక స్త్రీని యనుమానించుటకంటె పాపము మరియొకటి లేదు. నాకుందు ప్రేమ బీజముల నాటి యాశలను బురికొల్పి నా నిష్కళంకమైన ప్రేమను భగ్నపరచినందులకు కాళీచరణ రాయలపై పగ సాధించుకొన నెంచితిని, సాధించితిని. హత్యకు బూర్వము మాత్రామమునకు వచ్చి నాయెడ నిర్లక్ష్యముగ బ్రవర్తించినపుడు కాళీచరణరాయల ననుమానించి యాతనికి దెలియకుండనే నాతని వెంబడించి నాటి రాత్రి వసంతవిలాసపు టావరణమున నాతనికిని పద్మకును జరిగిన సంభాషణను చెట్టు మరుగున నుండి వినియుంటిని. వారి సంభాషణ వినినపుడు నాకుగలిగినయాగ్రహావేశములకు నింతి లేదు. నాజనకుని రివాల్వరు తీసికొని వచ్చియుండుట వలన గాళీచరణరాయలపై పగను సాధించుకొంటిని. ఇదిగో రివాల్వరు. ఇంతకంటె సాక్ష్య మేమికావలసియున్నది?" అనిగంభీరముగ కుందనుడివియుండెను. ఆ మరియొక్క గంభీరమునకు జనులాశ్చర్యమును, పద్మయొక్క నిర్దోషిత్వము వెల్లడియైనందులకు సంతసమును వెలిబుచ్చుచు హాహా రావములు సల్పిరి. అపుడే మూర్ఛనుండి లేచియున్న పద్మ "న్యాయాధిపా నేను పాపిష్ఠిని. నాపయి మరణదండన విధించుటకు సంశయింపవలదు" అనెను.

"దోషమంతయు నీ మెంది. నీయొక్క నిర్దోషిత్వము స్థాపింపబడినది. నిన్ను శాశ్వత పరిశారము విడుదల చేయడమయినది. మరణదండన కుందకు విధించితిని' అని న్యాయాధిపతి పలికెను.

సుధీంద్ర రాయలు పద్మాశశిభూషణులతో నింటికి చేరుకొనెను ఈ మహాగాధలో కుంగి నీరసించిపోయిన పద్మ తరువాత రెండు మూడు దినములకంటె బ్రతుకలేదు. అవసాన దశయందు తనయొక్క దుష్కృత్యముచే గలిగిన యిడుమలను సైచి తన నిరపరాధిత్వమును వెల్లడించిన శశిభూషణుని క్షమింపగోరి, ఉమను శశిభూషణునకిచ్చి వివాహమొనర్చుట తన యభీష్టమని తన భర్తకు విన్నవించి పద్మ యిహపరించముగు వీడెను.

తరువాత ఉమాశశిభూషణులకు వివాహమగుటయే గాక రామానందబాబు యొక్క యాస్తియంతయు శశిభూషణునకు సంక్రమించె నని వేరుగ వ్రాయ నక్కరలేదు. (సంపూర్ణము)